Printed by

V. VENKATESWARA SASTRULU

of V. RAMASWAMY SASTRULU & SONS

AT THE 'VAVILLA' PRESS

Madras.—1954.

1st Edition.—1869.
2nd Edition.—1886.
3rd Edition.—1909.
4th Edition.—1914.
5th Edition.—1930.
6th Edition.—1954.

# ఆముక్తమాల్యదాకర్తృత్వము

(శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి)

నియతికృత నియమరహితాం, హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి. (కావ్యప్రకాశిక.)

ఆముక్తమాల్యద యాంధ్రప్రబంధరత్నములలో నొకటి. ఈ పేరుగాని యీ కథగాని భారతాది ప్రసిద్ధగ్రంథములలోనిది కాదు. ద్రావిడ ప్రబంధములనుండి గ్రహింపఁబడినది. ద్రావిడదేశమున వైష్ణవమత ప్రసిద్ధులగు పన్నిద్దరాళువార్లలో నొకఁడగు విష్ణుచిత్తుని (పెరియాళ్వా రని వీరి లోకనామము గలదు.) పెంపుడు కూఁతురు గోదాదేవియను పేరుగలది. ఆమె పైపన్నిద్దరాళ్వారులలో నొకతె. ఆళ్వారులలో స్త్రీ యీమెయే. శ్రీహరి సమర్పణార్థము విష్ణుచిత్తుఁడు సిద్ధముగావించి యుంచిన పుష్పమాలికల నీమె ముందు ధరించి యుత్తరీయముగ నుంచుచుండునది. కావున ఆముక్తమాల్యద యను నామాంతరము గలిగెను. ఆముక్త = ధరించిన, మాల్య = పూలదండలను, ద = ఇచ్చునది అని సమాసార్థము.

శ్లో. ఆముక్తమాల్యదా యేన విష్ణవే గోదయార్పితా
ఆముక్తమాల్యదా నామ తస్యా స్తే నాభవద్భువి.

అని ప్రపన్నామృతమున గోదాకల్యాణమందు గలదు. ఈమె శ్రీరంగనాయకుని పెండ్లాడినది. అందుచే యీ ప్రబంధమున ౧-౫ర పేమును దాల్చిన మాల్యమిచ్చిన దిన్నది రంగనాయకుని 'పెండిలి' కథ యీ ప్రబంధమందలి ప్రధానకథ. దీనికి విష్ణుచిత్తీయ మని నామాంతరము కలదు. విష్ణుచిత్తుఁడు పాండ్యరాజు సభలో వైష్ణవమత స్థాపనము చేయుటయును, తనకూఁతు నాముక్తమాల్యదను శ్రీరంగనాయకున కిచ్చి పెండ్లి చేయుటయును కలదు. కావున విష్ణుచిత్తీయ మని సుప్రసిద్ధమయ్యెను.

ఇది సప్తాశ్వాసభరితము. సర్వ భవ్య కల్పనా పరిపూర్ణము. ఇందలి గాథలును సిద్ధాంతములును ఐహిక పారమార్థిక సుఖసాధన బోధకములు. మహాకావ్యలక్షణ లక్షితమగు నీప్రబంధమందలి కథయును రీతియును, నీతియును మున్నగునవి తెలుపుటకు ముందు కవి నామము తెలుపుట యావశ్యకము. మంత్రపఠనమునకు ముందు మంత్రకర్త నామ ముచ్చరించుట మన సంప్రదాయము కదా. అదిగాక కవిస్వరూప స్వభావములు స్థితిగతులు కావ్యమునఁ గొంతవఱకుఁ బ్రతిఫలించును. ఆ స్థితిగతులు తెలిసినవారికి

A

నాకావ్యములోని యంశము సరిగా బోధపడినట్లుగా నితరులకు బోధపడుట కష్టసా
అవి తెలిసినవానికిఁ గలిగిన యానందము తెలియనివానికిఁ గలుగదు. కావుననే కద
కవిస్వరూప స్వభావాదులు స్పష్టముగాఁ దెలియనపుడు కావ్యమునుబట్టి యూహ
చేయుదురు భావనాప్రపంచసృష్టి చేయు ప్రతిభాశాలి తనకుఁ బ్రత్యక్షానుభవము లేని
విషయములఁ గూడ సూక్ష్మబుద్ధి విశేషమున గ్రహించి కల్పింపఁగలఁడు. కాని స్వస్వభా
వానుసరణము పరిసరవస్తు దర్శనలబ్ధ సంస్కారగ్రహణమును మానలేఁడు. కావున
గవి యెవరో తెలిసికొనుట ముఖ్యము.

ఈ ప్రబంధము రచించిన కవి సకలవిద్యాపారంగతుఁడయి స్వీయ మేధా సంపా
దితాప్రతిహత సామర్థ్యముతో, సర్వతంత్ర స్వాతంత్ర్యముతో విద్యానగర సామ్రా
జ్యము విద్వత్కవితా సామ్రాజ్యము నేలిన శ్రీకృష్ణదేవరాయలు. కథాకల్పనయందును
కవితారీతియందును రాయలరీతి యెట్లు మెఱయునో ముందు గ్రహింపఁదగును.

కవి యగుటయే గాక ఈకవి తాను మహారాజయి కవులచేఁ గృతులందినవాఁడు.
సంస్కృతభాషలో భోజునివలెనే యాంధ్రమున నితఁడు కవియుఁ గవిపోషకుఁడును.
ఈతని విద్యావిషయక కవితా విషయకములను గుఱించి చెప్పిన వాక్యములును, ఈగ్రంథ
మందున్న వాక్యములును పరిశీలింతము.

పెద్దన మనుచరిత్రలో:—

5—105 "భోజక్షమాపతి విద్యాపరిపాక"
1— 81 "నిరంకుశప్రతికలప్రౌఢిప్రియంభావుకా"
2— 79 "నిస్తంద్రప్రతిభాసుధీనుత"
2— 1 "విద్యాఖేలనభోజ, సుధీలేఖద్రుమ"
4—120 "ద్రాఘీయః ప్రతిభా విచక్షణత్రయీ ధర్మైకసంరక్షణా"
1— 45 "కవితాస్త్రీలోలునకుఁ"

పారిజాతాపహరణమున ముక్కుతిమ్మకవి.

1— 26 "మేధావదసాధారణబోధాకరహృదయమునకు"
1— 29 "వేదార్థ స్థాపన ప్రవీణునకు"
1— 33 "సరసకళా ధోరణికి"
2—103 "ధీనిబంధన విధా సంక్రందనాచార్య"
4— 1 "కవితా ప్రావీణ్య ఫణీశ"

శ్రీకృష్ణదేవరాయలవార్లు పట్టాభిషేకసమయమున విరూపాక్షస్వామికి సమర్పిం
చిన భూదానము తెలుపు శాసనమున:—

"గజపతిగజకూటపాకవేన విదిత నానావిధవేన వదన విజితాంభోజేన భోజే నాపరేణ కావ్యనాటకాలంకార మర్మజ్ఞేన ధర్మజ్ఞేన."

ఇంక జాంబవతీ పరిణయ మను సంస్కృతనాటకము అముద్రిత మొకటి తంజావూరి పుస్తక భాండాగారమున నున్నది.

అందు "సకలకళా భోజరాజ విభవమూరురాయరగండ శ్రీ కృష్ణదేవ మహారాయ విరచితం జాంబవతీ కల్యాణ నాటకమ్ పంచమాంకమ్ సమాప్తమ్" అని యున్నది.

ఆము.—"సాహితీ సమరాంగణ సార్వభౌమ."

పైవానివలన మేధావి, ప్రతిభాశాలి, సర్వవిద్యలయందును నిరూఢపాండిత్యము గలవాఁడు, కావ్యాలంకారమర్మజ్ఞుఁడు, కవి, లోకప్రసిద్ధిగల భోజునంతవాఁడు అని ధ్రువపడుచున్నది.

ఇంకను ఈ గ్రంథారంభమందు—౧-౧౨. "కలఁ దదంధ్ర జలజాక్షుఁ డిట్లని యానతిచ్చె."

సీ. పలికె తుత్పేక్షోపమలు జాతి పెంపెక్క, రసికు లౌ నన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగఁ జె, ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి, సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి, నైపుణి జ్ఞానచింతామణి కృతి
తే. మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించికొంటివి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మింక మాకుఁ బ్రియము గాఁగ.

కలలో ఆంధ్రవిష్ణుని యానతిచ్చిన విషయము తనయాస్థానపండితులతో వచింపఁగా వారు స్వప్నఫలమును, రాయలవంశవర్ణనమును, రాయలప్రాధిపమును ప్రశంసించి,

1.-44. "సాహితీ సమరాంగణ సార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు" మనిరి.

అనినట్లు రచింపఁబడెను. కావున విద్వదనుమతిని కృష్ణరాయలు కృతి రచించి రని స్పష్టమగుచున్నది.

ఇదిగాక ప్రత్యాశ్వాసమందును సంస్కృతభాషలో శ్రీహర్షుఁడు నైషధమందు ప్రతిసర్గాంతమందును రచించినట్లు పద్యరూపమునఁ దనపేరును, ఆశ్వాససంఖ్యయుఁ జెప్పి కొనియున్నాఁడు—

1. "కృష్ణరాయవసుధాధ్యక్షోదితాముక్తమాల్యద".

2. "కృష్ణరాయమహీభృన్నామాస్మదాముక్తమాల్యద".
3. "కృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమాల్యద".
4. " " "
5. "కృష్ణరాయమహీభృత్సంజ్ఞాస్మదాముక్తమాల్యద".
6. " " "

ఇదివఱ కాఱుమారులె యనుకొన్నాము. ప్రకృతము వీన మాఁటలు లని వేంకటరాయశాస్త్రిగారు వ్రాయ సాహసించిరి.

7. "కృష్ణరాయమహీజాన్యత్వాదితాముక్తమాల్యద".

మా ప్రతిలో ఆఱు ఆశ్వాసములుగ ప్రకటించినను, అనుబంధముగా యాశ్వాసాంతపద్యములు, ఏడవ యాశ్వాసాంతపద్యము నున్నవి. ప్రాకృష్ణరాయరచిత మని కంఠోక్తిగాఁ జెప్పినవి యుండఁగా సందేహింపఁ ఒకచో వాక్యబద్ధమో, ఛందోబద్ధమో కనబడినపుడు ఇతరమయిన బాధకప్ర దొరకువఱకు నది విశ్వసింపకపోవుటకుఁ గారణము గనఁబడదు. గ్రంథము చందమున నుండఁగా కొందఱందురు గదా.

"కృష్ణదేవరాయలు విద్యాపండితుఁడును, కావ్యాలంకారమర్మజ్ఞుఁడని యొప్పుకొందుము. కాని "కవి" యని యెక్కడను చెప్పలేదు గాన 'కవి యంగీకరింప" మందురు.

'కవితాస్త్రీలోలునకున్' అని పెద్దనగారన లేదా యనఁగా దాని కీ ప్ర వారు సమాధానము చెప్పెదరు.

కవితాస్త్రీకి కవి తండ్రి గాని వల్లభుఁడు గాఁడు. రాయఁడు కవితాస్త్రీ కవి గాఁడని యిదియే సూచించుచున్నది అని వారి సమాధానము.

బాగుబాగు—క. "కవితాకన్యకు నలుగురు, కవి జనకుఁడు బట్టు దాది గణుతింప
నపరరసికుఁడు పెనిమిటి, యవివేకియు తోఁడఁబుట్టు వనఁ జెల్లున్"

అను నొకచాటు వున్నది. దాని ననుసరించి యట్లని రేమో? అది కృతిపరము. రచితగ్రంథపరము. కవి కర్తగాన జనకుఁడు. అది కన్యగా నిరూపింపఁబడినది బరుల కిచ్చుట అతఁడు కృతికన్యాపతి యగుటయుం రూపింపఁబడినది. ఆ తోనే "కావ్యకన్యకన్ గూళల కిచ్చి" అను భావము కలిగినది.

ఇట కవిత యన కవనశక్తి, సరస్వతీరూపిణి. దానిని స్త్రీగా నిరూపిం అది వరించుట యనఁగా వశ్య యగుట. ఆ శక్తి యెవనిని వరించు ననఁగా లంకరణజ్ఞుని వరించును. వానికి వశ మయి యుండును. ఇతరులను కాని

ఒకరికి మహామహోపాధ్యాయుఁడు, అభినవపాణిని, అధునాతనమల్లినాథుఁడు అను బిరుదము లున్నవి యనుకొందము. వారు పాండిత్యబలమున పద్యములు రచించి గ్రంథకర్తలు నయియుందురు. కొంతకాలము తర్వాత వారి గ్రంథకర్తృత్వము గురించి ఎవరికైన సందేహము గలుగవచ్చును. వారు కృత్యాదిని వారి పేరు మార్చినను బంగారపుటచ్చుతో నక్షరములు ముద్రించినను వారు పండితులు కావచ్చును; ఉపాధ్యాయులు కావచ్చును; వ్యాఖ్యాతలు గావచ్చును; గ్రంథకర్తలుమాత్రము గారు. ఎవరో రచించి వారి పేరుపెట్టి రనిన సహింపవలసినదే యగునా? వ్యతిరేకముగాఁ బ్రబల దృష్టాంతములు దొరకువఱకుఁ గంఠోక్తిని నమ్మవలసినదే. ఇట్టి వింతసిద్ధాంతములు చేయుట తగదు. ఇది యంతవింత గాదు. ఇంతకంటె వింతవాద మొకటి యున్నది. చిత్తగింపుఁడు— న్యాయము విచారింపుఁడు. వేదము వేంకటరాయ శాస్త్రులుగారు—శ్రీకృష్ణరాయలవారికిఁ దెనుఁగు ఇంటిలో మాటలాడుకొను భాష గాదఁట. గురువులయొద్ద నేర్చికొన్నదియుఁ గాదఁట. దీని కాధారము "ఎల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అనునదియఁట. పైదానిలో 'ఆడి' యనుటచే మాటలాడుటలో నేర్చినదే కాని గురువులయొద్ద నేర్చినది కాదు. 'నృపులు గొలువ' యనుటచే రాజులతో మాటలాడినపుడు నేర్చినదేగాని యింటిభాష కాదు అని పండితార్థమఁట.

అట్టి యర్థము లాగుట కవకాశ మున్నదో లేదో మీరు పరిశీలింప సందర్భము వివరించెదను.

తెలుఁగురాయఁడు కన్నడరాయనికిఁ గలలోఁ గనఁబడి—

తే. ............మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.

రచింపఁదగిన కథ చెప్పి—

"తెలుఁగదేల యన్న! దేశంబు దెలుఁ గేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగులెస్స" అన్నాఁడు.

ఈ పద్యమున 'తెలుఁగొకండ' అనుచో అర్థమం దభిప్రాయభేద మున్నది. దానిమాట ప్రకృతమేల? 3, 4 పాదములలోఁ దాత్పర్యమేమి?

భిన్నభిన్నభాషలు మాటాడు రాజులు నిన్నుఁ గొలుచునపుడు నీవు వారితో వారివారి భాషలు మాటాడుదువు. దేశభాషలన్నిటిలో తెలుఁగులెస్సయని యెఱుఁగవా?

యెఱుఁగుదువు. దీనిచే రాయలవారికి నానాభాషాపరిజ్ఞాన మున్న దని తాత్పర్యముగాని తెలుఁగు రాజులతో మాటాడినపుడు మాత్రము నేర్చికొన్నది. ఇంటిభాష కాదు. గురు నొద్ద నేర్చినది కాదు అని తాత్పర్యమా? అట్లైయైనచో వైపద్యములో ఆంధ్రభాష నీ కసాధ్యమా? అందు గ్రంథము రచింపు మన్నాఁడు. దీనిలో తెలుఁగు గ్రంథస్థభాష గాని, గృహసంభాషణీయభాషగాని రాదని పలికినాఁడు.

ఇది సంగతమగునా. 'జిహ్వా మే స్తి వా న వా' అన్నట్లు 'అనఁగా నాకు నాలుక యున్నదా, లేదా అని యొకఁ డడిగినాఁడఁట.' అట్లున్నది. పైని గ్రంథము రచింపు మన్నాఁడు. క్రిందఁ దెలుఁగుభాష రాదన్నాఁడు. ఇది యెవరికైన నచ్చునా? పోనిండు.

భగవంతుఁడు మతవాదమున పండితులను జయించుటకు విష్ణుచిత్తునిఁ బంపునపుడు, నాకు విద్య రాదుగదా ఎట్లు జయింతు నన్నపుడు, నే నున్నాను. నీ కేమి భయ మన్నాఁడు. ఆరీతినైన నిక్కడఁ గూర్పలేదాయెను.

ఈ సిద్ధాంతమునకే ప్రమాణము చాలదు. దీనినిబట్టి భాషయే రానివాఁడు నిర్దోషమగు ప్రబంధ మెట్లు చేయఁగలఁడు? గ్రంథరచన విశ్వసనీయము గా దనుట యుచితము గాదు.

ఈ వాదప్రతివాదము లిట్లుండ, ఆముక్తమాల్యద పెద్దన రచిత మని తెలుపు పద్యములు కొన్ని యున్న వందురు. వాని ప్రామాణ్యము పరిశీలింపుదము. ఈ క్రింది పద్యముల విషయమయి చర్చ పూర్వమే జరిగినది. శ్రీ రామమూర్తి పంతులుగారి 'కవి జీవితములు' అను గ్రంథములో నున్నవి. అది భాషాదృష్టిలో చర్వితచర్వణమేయైనను నేఁటివారుగూడ వానిలో నొక పద్యము ప్రమాణముగా గ్రహించుచున్నారు గాన కొంచెము పరిశీలింపవలసినదే.

I సీ. కృష్ణరాయలపేరు నిడి నీవు రచియించి, తివి తొల్త విష్ణుచిత్తీయ మనఁగఁ
గాఠిన్యమర్థంబు గ్రాహ్యంబు గాదు సాధారణుల కని భూధవుఁడు పలుకఁ
దరువాత మనుచరిత్రము నొనరించి తుత్తమ కావ్యము మహాద్భుతముగఁ బిదపఁ
బెక్కుకావ్యములు పెంపెక్కఁగా విరచించి, మంటివి రాజసన్మానమునకు
తే. భంగ మొందిన యలరామలింగముఖులు, సాటిరాఁగలవారె నీతోటి నార
యాంధ్రకవితాపితామహా యల్లసాని, పెద్దనార్య విశేష వివేకధుర్య.

II సీ. ప్రౌఢ దీర్ఘసమాసపదములు కూర్చి శ్రీ, నాథుండు గూలార్చె నైషధంబు
దాని తల్లిగ నల్లసాని పెద్దన తెల్పె, మదిమది తప్పి యాముక్తమాల్య
దూహించి తెలియరాకుండ సూరపరాజు, భ్రమఁ గళాపూర్ణోదయము రచించె
నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్పఁ, బట ఘటించెను మూర్తి వసుచరిత్ర

తే. నిట్టి కవులకు నేను వాకట్టుకొలుపు, జెప్పినాఁడ మదీయవైచిత్రి మెఱయఁ
బాండురంగవిజయమును బటిమదనర, విష్ణువర్ధిష్ణుఁడను రామకృష్ణకవిని.

ఈ పద్యమున, ఆముక్తమాల్యదూహించి యనుచోట, ఆముక్తమాల్యమూహించి అని పఠించిరి. ఆముక్తమాల్యమన్నచోట, నామైకదేశే నామగ్రహణ మను న్యాయము పట్టించి, ఆముక్తమాల్యమన్న ఆముక్తమాల్యద యని అర్థము చెప్పిరి. లేకున్నచో, తత్సమాకార సంధిదోషము తగిలిపోవు నని భయము కాఁబోలు. అది శ్లేష యనుచో ఛందోభంగ భయమున అది భిన్నపద మన్నారు. ఇదియే పూర్వులకును, నవీనులకును పాఠమందుఁ గల భేదము—

కొంద ఱిది పాండురంగవిజయములోనిపద్య మన్నారు. కొందఱు పాండురంగ విజయము—శశవిషాణమువంటిది, పాండురంగ మాహాత్మ్యమునకే నామాంతర మని కొంద ఱనుచున్నారు. ఆ పాండురంగ మాహాత్మ్యములో నీ పద్యము లేనే లేదు. పాండురంగవిజయములోని దనిన యుక్తము కా దని కాఁబోలు పాండురంగకవి సీసము అందురు కొందఱు. ఏమైనను ఇదియును చాటు వనక తప్పదు. పై చాటువులో ఆముక్త మాల్యద ముందు రచింపఁబడినట్లున్నది— ఏది ప్రమాణము. పై పద్య మెవరు రచించి నారో తెలియదుగానఁ బ్రమాణము కాదని కొంద ఱందురు. రెండవది పాండురంగకవి కర్తృక మని ప్రమాణార్హమనియుఁ బరిభావ మగును.

ఇది గ్రంథమందు లేదు. ప్రమాణార్హ మెట్లగును? వాదార్థము కొంత యవకాశ మిచ్చి పద్యప్రామాణ్యము విచారింతము.

ఈ పద్యమందు శ్రీనాథుని, పెద్దనను, పింగళి సూరన్నను, మూర్తికవిని పేర్కొని వారి వాకట్టుటకై రామలింగకవి పాండురంగవిజయము చేసె నని యున్నది.

మూర్తికవి పింగళి సూరన్న తర్వాత రచించిన పద్య మనవలయును. సవిమర్శముగా కవుల చరిత్రము రచించిన వీరేశలింగము పంతులుగారు పింగళి సూరన మూర్తి కవులు పెద్దననాటివారు కానేకా రన్నారు. ఆ విషయమంతయు నిట వ్రాయుట గ్రంథవిస్తర భీతిచే మానినాను. అది చిత్తగించినఁ జాలునుగదా? వారితర్వాత రచించిన పద్యమునకుఁ గర్త యనుకొను రామకృష్ణకవి పెద్దనకాలమువాఁడు కాఁడని వీరేశలింగము పంతులుగారు ప్రమాణములు చూపిరి. నేటి విమర్శకులు ఒకవేళ రామకృష్ణకవిని పెద్దన కాలమువాఁ డన వీలులేదు. అప్పు డీ పద్యము రామకృష్ణ విరచితము గాదనవలయును. ఇది నమ్మినచో పెద్దన, పింగళి సూరన, వసుచరిత్రకర్త మూర్తికవి ముగ్గురును, వారి గ్రంథములు రచించినతరువాత వారి వాకట్టుటకు పాండురంగకృతి చేసినాఁ డనవల యును. కవి కాలనిర్ణయకర్తల మతమునకు అది విరుద్ధము. వారందఱు నొకనాఁడే

యుండ్నారందు కేని రాజాదరణములేని రామలింగకవి యసూయతోఁ జెప్పిన పద్య మిది యనవచ్చును. రాజు చేసిన మహాకార్యము పరులయం దారోపించుటకే పద్యాగము పన్నినాఁ డందురు కొందఱు. మహారాజులు చేసిన కార్యములు మహాకార్యములు లేవనుటయు, ఉన్నవని చెప్పవలసినచోఁ బరులవనియు చెప్పుట యింక సిద్ధము. ఏమైన నసూయాగ్రస్తుని పద్యము గ్రాహ్యము కాదందురు. పాండురంగకృతి సంతవారి వాకట్టుట గర్హమైనది కాదని తలచెదను.

మఱియొక చాటు వున్నది—

క. "కవి యల్లసాని పెద్దన, కవి తిక్కనసోమయాజి గణుతింపంగా
కవి నేను రామకృష్ణుఁడ, కవి యను శబ్దంబు నీటికాకికి లేదే"

ఈ పద్యములో రామకృష్ణుని పేరున్నదే. ఈరీతిని పెద్దనయందు గౌరవము చూపినాఁడు పెద్దన ముక్కు మఱిదప్పి చేసినాఁడనియు వానిని వాకట్టుటకు పాండురంగవిజయము చేసినాఁడనియు ననునా? ఈ చాటువులు నమ్మెదమనుట చాటూక్తి కాదు.

శ్రీ కృష్ణరాయల కర్వాచీనుఁడగు అప్పకవి విష్ణుచిత్తీయ మాంధ్రకవితా పితామహుఁడు రచించె నన్నాఁడు. అది చాలదా యందురు. అది పరిశీలింత...

అప్పకవీయమున—౧-౬౩౦.

గ్రామ్యమైన నాంధ్రకవులు సంకేతిత, సుప్రసిద్ధ మగుచు సూత్రమునను
గలిమిఁ బూర్వసుకవి కావ్యోక్తములు ప్రసిద్ధంబులైనఁ గూర్పఁ దలఁతు రెపుడు.

వ. అది యెట్లనినఁ గనియె ననవలసిన భూతార్థక్రియాపదైకవచనమునందు వర్ణలోపము చేసి "కనెనఁట" యని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించిరి గాన నది సాధకము చేసికొని యాంధ్రకవితాపితామహుఁడు కొనియె ననుటకుఁ గొనె నని చెప్పె నవి యెవ్వి యనిన.

ఆదిపర్వమునందు—

క. వనకన్యక యఁట కనెనఁట, వనమున గాంధర్వమున వివాహంబఁట నం
దనుఁ గనెనట మఱచితినఁట, వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్.

విష్ణుచిత్తీయమునందు—

ఉ. పూని ముకుందుఁ డాజ్ఞఁ గనుబొమ్మనె గాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బోవ నడుపంగొనె.....................

పై యప్పకవి గ్రంథభాగమునందు కనియె ననుటకు కనె అను గ్రామ్యరూపము వాగనుశాసనులు ప్రయోగించి రనుట ప్రమాదము. ఆదిపర్వములోని దని యప్పకవి యుదాహరించిన పద్యము పినవీరభద్రుని శకుంతలాపరిణయములోనిది. ౪ ఆ. ౧౧౪-వ పద్యము.

అప్పటి భారతము వ్రాఁత ప్రతిలో నున్నదేమో. వీరభద్రుఁడు చౌర్యము చేసెనేమో యని కొందఱకుఁ దోఁచుట తప్పుగాదు. కాని భారతములో నీరీతి పద్య ముండుట కవ కాశము లేదు.

భార—ఆది. 4—99—

క. ఏనెట నీవెట సుతుఁడెట, యేనెన్నఁడు తొల్లి చూచి యెఱుఁగను నిన్నుక్
మానిను లసత్యవచనలు, నా నిట్టు లసత్యభాషణం బుచితంబే—
అను పద్యము శకుంతలతోఁ జెప్పినట్లున్నది.
శకుంతలాపరిణయములో మునులతోఁ జెప్పినట్లున్నది.

ఇది భారతమున నిముడదు. అంతే కాదు. అఁట యను పదము వాగనుశాసనుని ప్రయోగమున నుండనే యుండదు. ఆ భాషాతత్త్వ మెఱుఁగక యట్లు భ్రాంతిపడుట సంభవించినది. అహోబలపతి అప్పకవి ననుసరించి ప్రమాదమే పలికినాఁడు.

లాక్షణికుఁడైన తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున పినవీరభద్రుని పద్యము నాహరించి యది యాదిపర్వములోని దని చెప్పి యప్పకవి ననుసరించుటయే గాక పైపెచ్చు ఈ గ్రామ్యప్రయోగము సూత్నదండి కూడ దన్నాఁ డని వాని నాక్షేపించినాఁడు.

సూత్నదండికి భారతమున నీపద్యము గనఁబడుట యెట్లు సంభవించును? పిల్లలమఱ్ఱి వాని తర్వాతివాఁడాయె.

అహోబలపతియు తిమ్మకవియుఁగూడ నప్పకవియందలి యతిమాత్రవిశ్వాసమున నది నమ్మి భారతములోని దగునా కాదా యని యాలోచింపరైరి. అప్పకవి ననుసరించిన వారివలె నప్పకవియుం నే లాక్షికునైన నవిమర్శముగా ననుసరించెనో కథాసంగ్రహ మేక మగుటచే నట్లు భ్రాంతిపడెనో, ఏమైననేమి పెక్కండ్రా గోతిలోఁ బడిరి. ఈ మహా వాక్యములోని మొదటిభాగమందుఁ బోలె రెండవభాగమందుఁగూడ ఆంధ్రకవితా పితామహుఁడు విష్ణుచిత్తీయమందు అనుటయుఁ బొరపాటే. అతఁడే లాక్షణికుఁడైన వ్రాసియుంచినది చూచి గ్రహించినాఁడో ఆముక్తమాల్యదాదిని పెద్దన పద్యము లుండుటచే నటు భ్రాంతిపడినాఁడో నిర్ణయింప వీలులేదు. మొత్తముమీద నప్పకవి వీరభద్రుని పద్యమును భారతపద్య మని తెలిసి కనె, కొనె మొదలగు గ్రామ్యరూపము గ్రహింపఁ జేసినట్లు, విష్ణుచిత్తీయము ఆంధ్రకవితాపితామహకృత మను ప్రథ కలిగించినాఁ డనక తప్పదు. తగినంత విమర్శనము లేకుండగ నప్పకవి నాచనసోమనాథుని యుత్తరహరివంశములోని పద్యము (1-75)

క. అంజెదవుగాక నను చెం, తం జేరఁగనీక యెంత దఱిగిన మిరియా
లుం జొన్నలు సరిపోవే, లంజతనములందు కొమిరలం గెలువవటే.

నాచనసోమనాథుని వసంతవిలాసములోని దన్నాఁడు. అది నమ్మి వీరేశలింగము పంతులుగారు వసంతవిలాస మని పై పద్య మిచ్చినారు.

కళాపూర్ణోదయములోని పద్యము కవుక్త్నవిజయములోని దన్నాఁడు. ఇట్టి వింకను గలవు. అట్టి పొరపాట్లు పడుట గొంత కలదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి భాండాగారములో ఉదాహరణముల పుస్తక మని యొకటి కలదు. అందు చిమ్మపూడి అమరేశ్వరుని "కొలఁదికి మీఱఁ బెద్దయగు కోట తనర్చున" అను పద్య మొకటి కలదు. అది నన్నెచోడుని కుమారసంభవమున ఆ. 7. 108 పద్యముగా నున్నది. అది చూచి యా పద్య మమరేశ్వరుని దనవచ్చును. అప్పకవి రాయలతర్వాత రెండువందల సంవత్సరములకుఁ బుట్టినవాఁడు. అతఁడు యథార్థ మెఱిఁగి రచించినాఁ డని కేవలము నమ్మిన ప్రమాదము లగుండును.

అప్పకవి రాజకవిని గౌరవింప నిష్టములేక యసూయచే నట్లు కర్తృత్వము మార్చినాఁ డనఁగూడదా యని నా మిత్రులు కొందఱూహింతురు గాని అప్పకవి తిమ్మ భూపాలుని, రామరాయభూషణుని, కంసాలిరుద్రయ్యను కవులను గ్రహించినపుడు శ్రీ కృష్ణదేవరాయల విషయ మట్టిభావ ముండ దనుటకు కారణము కనఁబడదు.

అప్పకవి పొరపాటు పడియుండును. అప్పటినుండియుం నప్పకవీయములోని మాటలను విశ్వసించి యందఱు నట్లే యని యుందురు. దీని తత్త్వము గ్రహించి పెద్ద లిప్పటికైన నాయప్రథ విడిచెదరు గాక యని విన్నవించుచున్నాను.

వ్యాఖ్యాతలు ఆముక్తమాల్యద పెద్దన కృత మనుట కొక ప్రబల కారణము అప్పకవి వాక్యమే నిదానము. బ్రౌనుదొరగారు, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు పెద్దన రచించినట్లు ప్రథ గల దనుట యొకటి. పై సమాధానమే దీనికిఁ జాలును.

పెద్దన రాయలవారి మరణానంతరము చెప్పిన పద్యములో ఆముక్తమాల్యదా కర్తృత్వము తెలుపలేకుండుట యొక కారణమఁట.

ఆ పద్య మిట్లున్నది—

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ బల్లకి తన కేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవి గండపెండేరమున కీవె తగు దని తానె పాదమునఁ దొడిగె
కోకట గ్రామాద్యనేకాగ్రహారంబు లడిగినసీమలయందు నిచ్చె

గీ. ఆంధ్రకవితాపితామహా! అల్లసాని, పెద్దన కవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతోఁ దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

ఈ పద్యములోఁ రాయలు తనకుఁ జేయుం గౌరవమును తనకు ముందు దిక్కేమి యను విచారమును తెలుపవలసియున్నదిగాని రాజుగారి కవితాశక్తిని చూపు సమయము గాదు.

రాయలవారు రచించినట్టు అనుకొనెడి రసమంజరి యొకటి కలదు. భానుసూరి రచించిన రసమంజరి యొకటి యున్నది. ఒకరు తమ గ్రంథమునకుఁ బెట్టుకొన్న పేరు మఱొకరు తమ గ్రంథమునకుఁ బెట్టుకొనెదరా? భానుసూరి రసమంజరిలోనుండి శ్లోకములు వ్యాఖ్యలలోఁ బరామృష్టములు. కృష్ణరాయని రసమంజరిలోని శ్లోకములు ఎవరును బరామర్శింపలేదు అని యొక వాదము.

ఒకపేరు భిన్నకర్తలు తమ గ్రంథములకుఁ బెట్టుకొనుట వింతకాదే? "శకుంతలా పరిణయము" పెద్దాడ నాగరాజు, కృష్ణకవి వీరభద్రుఁడు శృంగారశాకుంతలమును శకుంతలా పరిణయము మన్నాఁడు. దానిలోఁ దప్పేమున్నది. అల్లసాని పెద్దన రసమంజరి రచించినట్లు ఒప్పుకొన్నను ఆముక్తమాల్యద రచించినమాత్రంబున నాదోషము పోవునా? పెద్దనార్య రచితమగు రసమంజరి కలదని కొందఱనుచున్నారే! దానికేమి సమాధానము? పెద్దనార్యుఁడు సత్యావధూపరిణయము రచించినట్లు ప్రపంచదర్పణమను గ్రంథములో నుదాహృత శ్లోక మున్నదఁట.

పెద్దన్నగాని తిమ్మన్నగాని రాయని కావ్యకర్త యనకపోవుట యొక లోపమఁట. పెద్దన కవితాస్త్రీలోలుఁ డన్నాఁడు. తిమ్మన కవితాప్రావీణ్యఫణీశుఁ డన్నాఁడు. అనేక గ్రంథములు రచించినపుడు ఏ గ్రంథమును చెప్పును? సముదాయముమీఁద వాని శక్తి ప్రకటించినారు.

ప్రథలనుబట్టి చాటువులనుబట్టి యింతదూరము వచ్చినారము. కవి కంఠోక్తిని పరిహరించు ప్రమాణములు గనఁబడలేదుగాన శ్రీకృష్ణరాయలే యాముక్తమాల్యదా కర్త యని నమ్మెదము. గ్రంథస్థవిషయముల ననుసరించి కృష్ణరాయ కర్తృత్వమునకు భంగము గలిగింప యత్నించిన వాదము లున్నవి యవి పరిశీలింతము.

ఇందు శ్రుతివాక్యములు బ్రహ్మసూత్రములు నుదాహరింపఁబడినవి. శ్రీకృష్ణదేవరాయలు క్షత్రియేతరస్త్రీపుత్రుఁ డని ప్రతీతి కలదుగదా? కృష్ణరాయ లీ గ్రంథ మెట్లు రచించినాఁ డన వీలుగలదు అని యొక పూర్వపక్షము. రాయలవంశము అను సందర్భమున క్షత్రియాపుత్రత్వాక్షత్రియాపుత్రత్వములును ముందు వివరింపఁబడును. ఎవరైనను క్షత్రియకన్యకలఁ బెండ్లాడిన ట్లున్నదికదా! దాని విషయమునఁగూడ రాయల వంశ మన్న వివరము గలదు. అది ప్రాథమమున సందురా! ప్రాథమమున క్షత్రియ

కన్యకలనే పరిణయ మాడినవానికి బ్రహ్మసూత్రార్థమా దుర్లభ మయినది. అప్పటి రాజులు క్షత్రియేతరులైనను, క్షత్రియులైనను, వేదవేదాంతాదివిషయములు నేర్చినవారే. పాదజులు మని చెప్పికొనిన తంజావూరి ప్రభువులలోనివాఁ డగు రఘునాథభూపాలుని రామాయణమునందు దశరథుని యాగసందర్భము చదివినచో శ్రౌతమం దతని కెంత నిరూఢప్రజ్ఞ యున్నదో తెలియును. ఈ రఘునాథభూపాలునియొద్ద యజ్ఞనారాయణదీక్షితులను బ్రాహ్మణుఁడు సంగీతకవిత్వములు నేర్చుకొని వానిని గురువుగా భావించినాఁడు.

అప్పటివార లంత పాండిత్యము, వేదపరిజ్ఞానము సంపాదించినవారు. బ్రహ్మసూత్రములు చెప్పువారు వారికి దుర్లభులా? వారి కాలముమాట యటుండ నిచ్చి, మతస్వాతంత్ర్యముగల నేటికాలమున క్రైస్తవకళాశాలలకుఁ గోరి పండితులుగాఁ బోయి యచ్చట చండాలవిద్యార్థులకుఁగూడ ఛందోబద్ధమగు సూత్రములు తుదకు వేదభాగములు పాఠము చెప్పుచున్నారమే! విష్ణ్వంశసంభూతులగు రాజుల కానాఁటి బ్రాహ్మణులా వేదాంతము చెప్పకుండుట. వైష్ణవశైవమత వ్యాపనమున శూద్రుల కందఱకు పరిజ్ఞానము వృద్ధి చేసిన కాల మది. అంతమాత్రమున రాయలకర్తృత్వమునకు భంగము లేదు. ఆము—4-27.

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కాల్య, వేళఁ గార్తాంతికద్విజుల గోష్ఠి
జాముపోవ నమాత్యసామంతపూర్వకం, బర్థార్జనస్థ కాయస్థగోష్ఠి
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం, బగు సూపసూపకృన్మృగయు గోష్ఠి
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం, బౌర,ధర్మాధికృత్యుల గోష్ఠి
తే. భుక్తిమీఁద విదూషకపూర్వకము పురాణ కవిగోష్ఠి, చారపూర్వకము సంజ,
జాము గాయకగోష్ఠి, నిశ సుషుప్తి, పూర్వకము ప్రేయసీగోష్ఠి బోసఁగుఁ బతికి.

ఈ పద్యమునుబట్టి రాజునకు గ్రంథరచనకు నవకాశము లేదని యొక వాదము.

ఈ పద్యము రాజనీతిలోనిది. సామాన్యలక్షణముగాఁ జెప్పినాఁడు. నే నట్లు చేసినా నని చెప్పలేదు. కవిత్వము చెప్పుట సామాన్యలక్షణముగాఁ జెప్ప వీలులేదు. దానికిఁ బూర్వజన్మసంస్కార మనుఁడు లేదా (gift) దైవదత్తశక్తి యనుఁడు అదృష్ట మొకటి యుండవలయును. అది కాక పురాణకవిగోష్ఠి యుండవలయు నన్నాఁడు. ఆ కవిగోష్ఠి ప్రభువులు తమ విద్యానుసారముగా నుపయోగించుకొందురు.

ఎంతమంది మహారాజులు కవిత్వము చెప్పలేదు. వారి కవకాశము కలిగినదా లేదా? అభిరుచి ఆసక్తి కలుగుట ప్రధానము.

సం. భోజమహారాజు—భర్తృహరి.

చాళుక్య సోమేశ్వరుఁడు
కేలాది బసవరాజు
ఆంధ్రమున—నన్నెచోడుఁడు— (కవిరాజశిఖామణి)
తిమ్మభూపాలుఁడు—పరమయోగివిలాసము.
రఘునాథభూపాలుఁడు—
చంద్రికాపరిణయము.
వ్యాఖ్యాతలు—కాటయ వేమారెడ్డి—

ఇందు రెడ్డపరిహాస మున్నదఁట. కృష్ణరాయలవారు తనపాలనమున నుఁ గాని ఓడిపోయిన రెడ్డరాజులనుగాని యట్లు పరిహాసింపఁడు. వానికి సంతోషవ నని యితరులే యీ పరిహాసము చేసియుందురు. ఆ పద్యముతోపాటు గ్రం నితరులు రచించియుందు రని యొక యూహ.

౪—౧౩౪.

మ. గురుగుం జెంచలి తుమ్మి లేఁ దగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూర్చి పొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరము ల్మెక్కి తమిం బసు ల్పొలము వోఁ గ్రేపుల్ మెయిన్నాక మేఁ
కెరువుం గుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్డజడిన్.

అది ప్రకృతివర్ణనము. వర్షాకాలము వర్ణించుచు పాలికులస్థితి చెప్పి వారిలో లగు రెడ్డస్థితి చెప్పినాఁడు. అది స్వభావవిరుద్ధము కాదు. కాఁగూడదు. యందురా? ధీరోద్ధతనాయకుఁడగు రాయని కది యుక్తమే! అది రాయ ధ్రువపఱుపఁగలదు. రాయని కిష్టములేని రెడ్డనింద పెద్దనమాత్రము చేయునా రాయలు సహింపఁచునా?

ఆ కారణమున రాయకర్తృత్వమే స్థిరపడును—

రాయనికి గోచరముకాని వర్ణనము లున్నవని కొందఱు, పెద్దనకు గోచ వున్నవని కొందఱు వాదింతురు. కొన్ని యిరువురకు గోచరముకాని పని మఱి దోఁచును. ఎంద ఱిది సాయముపట్టి రనవలెనో? ప్రతిభాశాలికి గోచ యుండదు. ఆ విషయ మెటు లాగిన నటు సాగును. ఈ యూహాములు క నిరసింపఁజాలవు.

పరిహాసమందు లేని రాయని కిష్టములేని విషయము రాయలకు క యెవరైన ననుకొందురా? భ్రాంతిపడి యెవరైన రాజానిష్టకార్యము చే హర్షించునా? పరిహాసమే యని ధ్రువము చేసినచో ధీరోద్ధతుఁడగు రాయ హాసము చేసె ననుట యనుచితము. అదియే రాయకర్తృత్వమును ధ్రువపఱు

పద్యము లయి యుండుటచే నా పద్యములే గ్రహించినాఁడు. అది యుచితమే కదా
ఒక పెద్దనవే కావు. ఇతర కవికృతములును గలవు.

ఇఁక మనుచరిత్ర గ్రంథమున 6-99. విష్ణురూపవర్ణనము.

"నీలమేఘముఁడాలు డీలుసేయఁగఁజాలు" అను పద్యమందలి నాల్గు చరణములు ఎత్తుగీతి వేఱుగనే యున్నది. తన స్వప్నమునఁ గనఁబడిన యాంధ్రవిష్ణురూపవర్ణనకై గ్రహించినాఁడు.

ఆ పద్యములోని భగవత్స్వరూపవర్ణనము తనకు నచ్చియుండుటచే ఆ భావము తెలుపుట కా పద్యమే గ్రహించియుండును.

దశావతారవర్ణనములలో—

శ్రీరామబాణవర్ణనము—పవిధారా—అను పద్యము.

ఆముక్తమాల్యదలో—రామబాణవర్ణనము 'స్యందన' అను పద్యమందు ఝాంకారముతో నుండుటచే పవిధారాది పద్యము ప్రక్షిప్తమగునని తోఁచెడిని.

ఇంకొకటి—

జయ......జయ......

ఇది మనుచరిత్రలోనే ప్రక్షిప్తమయి యుండును.

ఆము—విష్ణుచిత్తుఁడు గజారూఢుఁడై గజఘంటలు వాయించుచు స్తుతించినపుడు తాళానుగుణముగాఁ బద్యము రచించెను.

మూలకథలోఁగూడ నాయన తాళముల వాయించుచున్నట్లే యున్నది. ఆ కారణమున భగవంతునికి నమస్కారముగూడఁ జేయలేదని యున్నది. మనుచరిత్రలో స్వారోచికి పరమేశ్వరుఁడు ప్రత్యక్షమయినపుడు, సాష్టాంగనమస్కారము చేసి వర్ణించిన వర్ణనములో మొదటిదిగా నున్నది. తర్వాత 'అవ్యయానంత విశ్వేశ' అను పద్య మున్నది. ఈ పద్యమున కాముక్తలో నౌచిత్య మెక్కుడు కలదు. పెద్దన రచించినదని ఏ కారణముననైన ధ్రువపడినచో తాళమునకు సరిపడియుండుటచే ఆముక్తమాల్యదలో గ్రహింపఁబడియున్నది. ఇంతకు నవి వేఱు పద్యములు.

ఇంతమాత్రమున సంశయింప వీలులేదు. కథారచనలోని మార్పులనుబట్టి రాయల కర్తృత్వమే ధ్రువపడుచున్నది. గోదాకళ్యాణమందు గోదాదేవికి యౌవనాగమనానంతరము వివాహము చేయించుట.

యామునాచార్యునకు క్షత్రియకన్యకావివాహము చేయించుట, యామునమునిచే యుద్ధము చేయించుట. రాజనీతి కవకాశము కల్పించి రాజనీతి ననుభవపూర్వకముగాఁ దెలుపుట. తన కభీష్టమగు కథల గ్రంథమధ్యమునఁ జొనుపుట. గ్రంథస్థమగు వర్ణనలతో

వర్ణించి యూరకొనక సామాన్యజనతిర్యగ్జంతు స్థావరవస్తుసమ్యుచ్చయములలోని ప్రకృతిని బహుముఖముల వర్ణించుట.

వ్యాకరణ సంస్కారము కొన్నిచోట్ల నుండుట. అది నేటివారు తప్పందురు గాని పూర్వలాక్షణికులు పక్షాంతరములు గ్రహించినారు. ఈ గ్రంథము రచించినవాఁడు వీరవైష్ణవుఁడు గావలయును.

రాయలు శ్రీశైలాదిక్షేత్రములు సేవించినట్లున్నది. అట్టివాఁ డీది రచించి యుండఁ డని యొక వాదము—(చూ. ఆముక్తమాల్యద 3–15)

పెద్దన మనుచరిత్రలో శివస్తుతి చేసినాఁడే. అతఁ డెట్లు పనికివచ్చునన్నచో అతనికి మొదట శివభక్తికూడ నున్నను "ముదిమది తప్పి" అన్నాఁడుగాన వార్ధకమున వీరవైష్ణవమునకు దిగియుండునని యొక రందురు. పోనిండు. ఆరీతినే రాయలవారికిఁగూడ జైనులకు బ్రాహ్మణమతస్థులకువలె వైష్ణవము......కూడదా. దాని కేమి? రాజు తన కేమతమున నాసక్తియున్నను, మును పూర్వుల గౌరవరక్షణార్థము, ప్రజారంజనార్థము క్షేత్రములను సమముగా ఆదరింపవలయును. అట్లే రాయ లాదరించియుండును. లేదా మొదట కొంత శివభక్తియుఁ నుండి యుండును. అతని పరమసిద్ధాంతము మాత్రము వైష్ణవ మయి యుండును. కేవల విష్ణుపారమ్య మొప్పినవారుకూడ శివస్తుతి చేయవచ్చును.

కేవల శైవుఁడైన నన్నెచోడుఁడు విష్ణ్వాదిస్తుతి గావించినాఁడు. శివపారమ్యము చూపినాఁడు. అది యసంభవము కా దని నా భావము.

ఇంక కృష్ణరాయవిజయ రాయవాచకముల లో చెప్పమి యొక దోషము గాదు. అవి కేవల రాజ్యవిజయసంబంధి గ్రంథములు. అవి తర్వాతి కాలపు గ్రంథములు—

ఇంక వ్యాకరణాది విషయములనుబట్టియుఁ ప్రయోగసరణినిబట్టియు విచారింతము—

కొంద ఱిందు ప్రాచీనలక్షణ విరుద్ధప్రయోగము లున్నవిగాన పెద్దన రచితము గానేరదు. పెద్దనమనువున నిట్టి దోషములు లేవు. కావున రాయలవారిచే రచింపఁబడె నందురు.

మఱికొంద ఱవి ప్రాచీనసమ్మతములే. పూర్వకవులు ప్రయోగించియే యున్నా రని సాధింప యత్నించిరి. అది మంచిదే. వాని ప్రామాణ్యాప్రామాణ్యములలోనికి దిగినచో నది యగాధగాధ. సాధువు లని సాధింపయత్నించినవారుగూడ ఏ లక్షణము లకును లొంగని ప్రయోగములు దిద్దిరి. అవి యితరులచే కల్పింపఁబడిన పాఠము లందురు. ఇవిపరకు దొరికిన పాఠముల ననుసరించి చూచి, అందులో నేది సాధు వనఁదగునో యది మనకు గ్రాహ్యముగాని మనము దిద్దివేసినచో నవి ప్రమాణము లగునా?

అట్లైనచో కవిస్వభావము, కవిధోరణియుం తెలిసికొన శక్యమా? ఉన్నదాని ననుసరించి యూహింపవలసినవారము మనము. వ్యాఖ్యాత యున్నదాని స్వరూపము చేతనైన సమర్థింపవలసినవాఁడు. తప్పని స్ఫుటముగా తెలిసినపుడు మొదటి స్వరూపము చూపి తర్వాత తన యభిప్రాయము చూపవలసినవాఁడు.

సం. నైషధమున—'ఇంగాలమివాయశః పరే' అనుచోట మల్లినాథుఁడు ఇంగాల పదము దేశ్య మన్నాఁడు. అంగారమని దిద్దలేనివాఁడా? అది ధర్మవిరుద్ధముగాన దిద్దలేదు. మరియొక పూర్వపు వ్రాతప్రతిలో భిన్నపాఠము దొరకువరకు అది కవి విరచిత మనుకొనవలసినదేగదా! ఆ మల్లినాథుఁడు దిద్దలేదుగాని అభినవమల్లినాథులు దిద్దివేయుచున్నారు.

ఛందస్సునుబట్టి రాయకర్తృకతయే నిలఁబడును. చూడుఁడు. ఆముక్త. 1-58, 4-238, 6-75 (7-11) స్రగ్ధరావృత్తము లున్నవి.

1-58. రెండును. "దీనుల్ గాంచు నమ్మాడుపులన

యడుగం దోఁచు నుద్యద్వ్రతోత్కే..."

ఇట 'అడుగక్ డోఁగు' అని మొదటనున్న సంయుక్తాక్షరములలో రెండవ యతిస్థానమున నేది గ్రహించఁబడినదో మూడవస్థానమునఁగూడ నదియే గ్రహించుట సంప్రదాయము.

చూ. సులక్షణసారము—58-వ పేజి.

వ్రాఁతప్రతులలోను, వావిళ్లవారి ప్రతులలోనుగూడ 'అడుగందోఁచు' అని యున్నది. దానినిబట్టి చూచినచో మొదట నున్న బిందుపూర్వకదకారమునుండి, రెండవ యతిస్థానమున 'మాడుపు' అనుచోట, 'డకార'ము మాత్రము గ్రహించినాఁడు. మూఁడవయతిలో బిందుపూర్వక దకారమునకు యతి సరిపెట్టినాఁడు. ఇట్టిది పెద్దన దానిలో లేదు. ఇతరులలోను కనఁబడలేదు. కాని అప్పకవి క్రౌంచపదలక్షణపద్యములో......కనఁబడుచున్నది. ఈరీతి నున్నచోఁ బెద్దన పాదమునకు భంగము వచ్చునని కాఁబోలు దిద్దివేసినారు.

ఇట్టిదే మఱొకటి. 6.75. (7-11)

2 పాదము. ప్లవమానోత్పాత భూతప్రకరపటిమహాలాహలస్పర్ధి

4 ,, ప్లవబృందంబుల్ వనిక్ నల్లడఁ బొడుపొడుమన్పల్కుల్.

రెండు పాదములలోను దిద్దినారు, వ్యాఖ్యమాత్రము 'భూతప్రకర' అనుదానికి మాత్రము వ్రాసినారు. దీనిలో 2 వ పాదమున అప్పకవి ప్రయోగానుసారము

సమర్థింపఁ జొచ్చినచో ర, ల యతి యగును. లేనిచో పూర్వలక్షణ విరుద్ధముగా సంయుక్తాక్షరములో దేనికైనా యతి గ్రహించినాఁ డనవలెను.

తర్వాత—4-238 లో

'చరదృష్టిక్ వైరిపక్షేక్షణ మసచివము ఖ్యస్వపక్షేక్షణం మొదటిది 'చ, రెండవది 'క్ష' మూఁడవది 'ఖ్య' ఇట్టిది. బున్. ఎక్కడను కనఁబడలేదు. ఇట వష్ఠ అని దిద్దఁబడినది. వ్రాతప్రతి 'శస్త' అను పాఠము గనఁబడినది. కొంతనయము. వ్రాత ప్రతినిబట్టి, 'శస్త' దిద్దిన దిద్దవచ్చునుగాని వష్ఠకల్పన మేమి?

మొత్తముమీఁద నీకవి మూఁడుచోట్ల నట్లు ప్రయోగించుటచేత ఈతఁడు ముఖ్యముగా పెద్దనగాఁడు. రాయఁడే కావచ్చు ననుటకు చక్కని సాధన మగును. 7-30 కెంపు, రాళ్లనే కలియ వాకిళ్లఁజల్లి సవరణలో—రాలక్-ద్వారాల.

1-82. ఊరుగాయ వ్యవహారానుసారమున ఊరగాయ యనవచ్చువా?

1-19. కలువఁదావు అని సవరణ.

ఈ ప్రాసయతి పెద్దన యుపయోగింపఁడు. రాయఁ డుపయోగించెనేమో.

## తత్సమ అకారసంధి

ఈసంధి ప్రాచీనులు ప్రయోగింపలే దనుట సత్యమే కాని యేతద్గ్రంథభాగోదాహరణములతోనే అహోబలపండితుఁడు ఈ సంధి గ్రహించినాఁడు. తర్వాతిలాక్షణికులు నామోదించిరి.

ఆభాగములు:—

శ్రీరంగ భర్తంచు. భర్త+అంచు.

7-44. భృత్తంచు అని దిద్దెదరఁట.

2—9 గంగనుకానె. గంగ+అను ..వ్యస్తరూపక మనవలెనఁట. ఇతర గ్రంథముల నిట్లు కలదా?

2—27—'లఘిమందు—లఘిమక్ లిగీతి' అని దిద్దఁబడినది. లఘువంద కీర్తి యొకరిలో—

3—19 పతాకన...పతాకక్ అని వ్యాఖ్య. పతాకగ అని పీఠిక. రెండును సరసములు గావు.

4—16 చేష్టుడిగి—ఇట్టి పాఠమున్ను మంచిదే.

వీని నిట్లు దిద్దియో క్లిష్టముగా నన్వయించియో ముడిపెట్టుటకంటె అహోబిలపండితాదులు చేసినట్లు ఆసంధి నంగీకరింపవచ్చు. ఇతరులు దాని ననుసరింపకపోయినను, ఆకవి కాయభ్యాస మున్న దనవచ్చును.

ఇట్టి వింకనుగలవు కాని స్వరూపావగాహనకివి చాలు నని విరమించుచున్నాను.

పైభావమునఁ బెద్దనకాఁ డని చెప్పవచ్చును. ఆంధ్రభాష యసాధ్యంబె యను పద్యమునుబట్టి యిది రాయల యాంధ్రకృతులలో మొదటి దని యూహసేయవచ్చును. అనభ్యాసమునను, గీర్వాణకవితా సాహాయ్యమునను సాధించిన యాంధ్రకవితగావున నట్టి శ్రోత్రరూపము లుండవచ్చును.

అవి అర్వాచీన లాక్షణికులు తప్పులనక సాధించి మతాంతరముగా గ్రహించినారు. అవిదిద్ది పెద్దనదనుటకంటె పెద్దనకవితకంటె భిన్నమనుటయే యుచితము.

4—170 లో పాండిమమరె వ్యాఖ్యలో ఇదే పాఠము. ఇట పాండవమరె వ్యాఖ్యాంతమున పీఠికలో పాండిమంబు అన్నారు. పఱచు వ్యర్థ మన్నారు.

7—44 శ్రీరంగధర్తంచు. భృత్తంచు అని యుండును. పీఠిక 27-వ పుటలో శోధింతునేని అనఁగా సవరించుకొని అన్నారు.

2—29 లఘువందు ... ...
లఘిమందు ... ...
అఘిమన్ విక్తి అని పీఠిక

3—19 పతాకన, పతాకన్+అ. అని వ్యా. వ్యస్తరూపకమిట పతాకగ అని పీఠికాపాఠము.

4—229 పరులవాడి తప్పింతురు.

2—38 కలాపులను గఱులు నివిరి.

3—80 స్థావరశ్రేణిఁ దజ్జాతికంటె. (తజ్జాతియందుకంటె) విశక్తి.

ఈరీతికవిత పెద్దనమనుచరిత్రములో లే దనఁగాఁ గొందఱు మను. 4—38 'చకితైణాహుతి' అను పద్యమున్న దందురు. ఇది అర్థావాగ్విబుధమువంటిదగునో కాదో సహృదయుల హృదయమేయెఱుంగును. కొందరు పెద్దనపద్యములు కొన్ని యిందుఁ గలసినవి. అవియే సుబోధకములుగా నున్నవి. నారికేళపాకములో రచించిన కవి యింత ద్రాక్షాదిపాకములో రచింపఁకలఁడా యందురు. శిరీషకుసుమ పేశలము నా గ్రంథము రచింపఁబూనిన పెద్దన కొన్నిచోట్ల ముదురు నారికేళపాలువంటి పద్యములు రచించెనే దాని కేమి చెప్పుదురు?

జాంబవతీ పరిణయమునందు రెండుశైలులమాట కేమందురో అందెందఱు కవిత్వము లున్నవి. నరసింహమూర్తి నఖములు హిరణ్యకశిపువక్షము చీల్చునపుడు వాఁడి యగుట, లక్ష్మీగండపాళియందు మృదువులగునట్లు, కవివాక్కులు కొన్నిచోట్లఁ గర్కశముగాను, కొన్నిచోట్ల సుకుమారముగాను నుండు నని యెను. అది సత్యము.

## కథ

ఆశ్వాసము—1 పాండ్య దేశమున విల్లిబుత్తూరు నగరము గలదు. అందు విష్ణుచిత్తుఁడు మాలికాకరణకైంకర్యము చేయుచుండెను. అతఁడు న్యాయార్జితవిత్తముతో నతిథిపూజ సలుపుచుండెను.

ఆ. 2. మధురాపురమును పాండ్యమత్స్యధ్వజుఁడు పాలించుచుండెను. గ్రీష్మకాలమున నతఁ డొకనాటిరాత్రి వెన్నెలలో భోగిసీగృహమునకు బోవుచుండఁగా నొకవీథియగ్రగుపై నొక పరదేశిబ్రాహ్మణుఁడు సుభాషితములు తోడిబ్రాహ్మణౌఘముతోఁ గలసి చదువుచు,

'నెలల్ చతుర్ద్వయిని వృష్టిదినాళికి రాత్రికై దివం
బున జరకై వయస్సునను బూని పరంబున కిప్డు దుద్యమం
బనువుగఁ జేయఁగావలయుం'

నను పద్యము పఠింప, రాజు దానిభావము గ్రహించి ప్రాస్పడి, కడకుం దన మోసమునకు భయపడి,

ఎక్కడి రాజ్యవైభవ మ దెక్కడిభోగము లేటిసంభ్రమం
బక్కట! బుద్బుదప్రతిమమైన శరీరమునమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి''

ననుకొని ''ఇంతనుండి పరలోకానందమునను యత్నమాపాదింతును'' అని నిశ్చయించుకొని తన భటునిచే నాబ్రాహ్మణునికిఁ దాంబూల మిప్పించి వెనుకకుఁబోయి మరునాఁడు పండితులఁ బిలిపించి వాదములో నెగ్గినవారికీయ ఆస్థానసభలో వ్రేలాడఁగట్టిన బంగారు నాణెములమూటచూపి వాదముసేయఁ బ్రేరేపించెను.

వారు వాదముచేయుచుండిరి. ఆసమయమున విల్లిబుత్తూరులోనున్న విష్ణుచిత్తుఁడు (మన్నారుస్వామిప్రేరణమున) భగవత్ప్రోత్సాహమున 2-88. విష్ణుమతస్థాపనకై మధుర కరిగెను.

ఆ. 3. వాదము జరుగుసమయమున వచ్చిన విష్ణుచిత్తునిఁ జూచి, వాదమాడఁగా మేము పరాయివారమా వాదము కానిం డని వారు వాదముచేయుచుండఁగా కొన్ని మాటలలోనే వారి శక్తి గనుఁగొని రాజు మాధ్యస్థ్యము నవలంబించినచోఁ దానును గొన్ని మాటలు చెప్పఁదలచినట్లు చెప్పి రాజానుమతిని సర్వమతములు జయించి విశిష్టాద్వైతమతంబు స్థాపించి పరమేశ్వరు నిర్దేశించి, అట్టి పరమేశ్వరుఁ గనుటకుఁ దగిన యోగంబుఁ జెప్పెద, ఖాండిక్య కేశిధ్వజసంవాదంబు వినుమని చెప్పెను.

౩-౮౯. అందునుగల కొఱఁత దెల్పి 'ఇంతకంటె సులభోపాయంబారాధనంబున-నయ్యర్థోత్కర్షంబుఁ గాండీవి కుపదేశించిన శరణాగత ధర్మంబు నిరపాయధర్మం బని అతనికి మూలమంత్రపూర్వకముగా ద్వయంబు ప్రసాదించి భాగవతప్రధానుం గావించెను.

ఆ. ౪. (ఖాండిక్యోపాఖ్యానము వేఱుగాఁ గూర్పఁబడును.)

విష్ణుచిత్తుఁడు వాదమున విజయ మొంద బంగారునాణెములజాలె తెగి వానిముందటఁ బడెను. అప్పుడు దేవతాదులుగూడ నుతించిరి. కాని కొంద ఱసూయాగ్రస్తు లనేకవిధముల నాడఁజొచ్చిరి. దానిని గజముపై నెక్కించి యూరేగించి వారిపురంబునకుఁ బంపుఁ డని కొందఱు రాజపుత్రులను బండితులను రా జాజ్ఞాపింప వా రటు యూరేగించుసమయంబున విష్ణుచిత్తునకు శ్రీహరి ప్రత్యక్షమయ్యెను. అతఁడు శ్రీహరిని దశావతార వర్ణనలతో నుతించెను. శ్రీహరి దేవశిల్పి యగు విశ్వకర్మను జూచి యీ విష్ణుచిత్తుఁడు తనధనమంతయుం భగవద్భాగవతార్పణము చేసి దారిద్ర్య మొందును. నీవు వెంటనే వీని భవనమును మణిమయంబును సకలసామగ్రీసంపూర్ణమును జేయుమని యాజ్ఞ యొసఁగెను. అతఁ డట్లు కావించెను. విష్ణుచిత్తుఁడు తన పురంబున కేఁగి తనగృహ వైభవముఁ జూచి యిదియంతయుం భగవదనుగ్రహాలబ్ధ మని యెంచి దొంటికంటె శతగుణంబుగా భాగవతపూజాప్రవణుండై యుండెను.

ఒకనాఁడు మాలికలు సమర్పించి యింటికిఁ బోవువానిని శ్రీహరి లక్ష్మీదేవికిఁ జూపి 'యామునాచార్యుఁ డొక్కఁడును, నీమహాత్ముఁ డొక్కఁడునుగాఁ దర్శనం బుద్ధరించి రక్షత్కృపాలికయమున', అన నతఁ డేమి యొనర్చె నని శ్రీదేవి యడుగ యామునాచార్య చరిత్రయుం శ్రీహరి చెప్పెను.

ఆ. ౫. విష్ణుచిత్తుఁడు తులసీవనమునఁ ద్రవ్వుచుండఁగా నొక బాలిక గనఁబడెను. అనపత్యుఁడగు నాకు భగవంతుఁ డనుగ్రహించినాఁడు కాఁబోలు నని యా కన్యకను దీసికొనివచ్చి తనపత్ని కీయ నామె యా బాలికను బెంచుచుండెను. ఆపిల్లను బాల్యము జాఱినది. యౌవనము అంకురించినది. అంకురించుటయేగాక ముదిరినది. విష్ణుచిత్తుఁ డైశ్వర్యవంతుఁడయ్యుఁ బుష్పమాలికారచన కైంకర్యము మానక చేయుచుండ నామె యా మాలికలు దాను ధరించి నూతిసీటిలోఁ దనయందము చూచి మరల యథాప్రకారము పూవులగూడలో నుంచును. అట్లుంచి చెలికత్తెలతో 'వీఁ పాడిన హరిచందము లే పాడఁగఁ దలఁపవచ్చు, నితఁడే సతులం గాపాడినవాఁడు?' అని శ్రీహరి కృత్యంబు నుపాలంభించు రీతినిఁ బునః పునః స్మరణంబు గావించుచుండె. ఆమె చెలులు, ఆమె శ్రీహరిబద్ధానురాగ యగుటయుం, విరహవేదన నొందుటయుం గ్రహించి, కొంతసేపు మేలములాడి తుదకు నీవు సత్యభామవు అని యథార్థము తెలుపఁగా బాల

విజ్ఞానవైయై వారలు నాగకన్యక లగుట వారివలన విని, శ్రీహరిని ఈ దేహమునఁ బొంద లే నేమో యోగశక్తితో నీ దేహము విడిచి శ్రీహరినిఁ బొందెద ననఁగా 'ఆ యదువతంస మెందుఁ జన్నాఁడు, విను రంగమంద నిల్చె వేగపా టేల? యతఁడ నీ విభుఁడగుటకు నర్చనాదుల నివ్విటి హరిభజింపు' మనిరి క్రమక్రమముగా నామెకు శ్రీరంగశాయి మీఁద వలపు హెచ్చెను. విరహవేదన ననుభవించి యున్మాదావస్థ నొందిన కూఁతురి చేష్టలకు దుఃఖితుఁడైన విష్ణుచిత్తుఁడు కారణంబు గ్రహింపనేరక, వటపత్రశాయి స్వామితోఁ దన కూఁతు నవస్థ దెలిపి దానికిఁ బరిహారమేమి స్వామీ యని దైన్యముతో నడుగ శ్రీహరి యను కంపాతిశయమునఁ దచ్ఛాందసమునకు మందస్మితంబుచేసి గోదాదేవి పూర్వవృత్తాంతముఁ జెప్పెను.

ఆ. వే. దానికి పీఠికగా మాలదాసరి వృత్తాంతము చెప్పఁదొడఁగె.

ఆ. గో. మాలదాసరియొక్క గాన ప్రభావ కథామూలమున వరాహావతారమున భూదేవి మదీయ పూజోచితోపచారంబుల విశేషఫలంబు గానంబ యని వైష్ణవియుం దాఁ గావునఁ దదాకలన కుతూహలంబునం గూఁతురై నీకోదవివిప్రలంభదంభేరితా గాధ గాథార్థ సమేత గీతరసంబునం బ్రొద్దుపుచ్చుటగాని వేఱొండు గాదని చెప్పి శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడికొనిపోయి రమ్మని యానతియ్య శ్రీరంగంబునకుఁ గూఁతుఁ దీసికొనిపోయి యచటఁ గొలువులోనుండి స్తుతించిన మునిం గనుంగొని కుశలప్రశ్నంబు గావించి, కుసుమాంజలులు సమర్పించు నాముక్తమాల్యదరూపు నెలప్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి ఉవ్విళ్లూరి తమకము నాపలేక యామెను తన యంతఃపురంబునకుం దిరస్కరిణీ విద్యచే నొరులెఱుఁగకుండఁగఁ జేర్చి, మాయాకన్య నచట నుంచె. విష్ణుచిత్తునకుఁ దీర్థప్రసాదంబు లిప్పించి పంపఁగా నతఁడు మాయాకన్యం బాలకిలో నెక్కించుకొని యింటికి వచ్చి తెర దీయఁగా నామె యదృశ్య యగుటచే దుఃఖితుఁడై 'మొఱ్ఱో ఒక్క బ్రాహ్మణుఁడనైన నన్నా మోసముచేయుట! రంగభర్త యెంత చేసినాఁడో చూచితిరా సఖులార? యని మొఱవెట్ట భాగవతక్షోభంబునకు భువనభర్త భయపడి వాని ఛాందసంబునకు గేలిసేయుం చున్నవాఁ డని యతనికిఁ దోఁచునట్లు 'ముది మది దప్పి మాటలాడెద వేల? మీపిల్ల మీ యింటనే యున్నది. సరిగాఁ జూచి లేవప్పు డనుము. మే మొప్పుకొనెదము. వృథాగా మమ్ము దూఱెద వేల యన నతఁ డింటి కేగి తనకూఁతుం జూచి సంతసించియుండ రంగశాయి స్వామి బ్రహ్మరుద్రాదులం బంపి కన్యను తన కిమ్మని యడిగించెను. విష్ణుచిత్తుఁ డానందమున నంగీకరించెను గాని 'ఈఁదగు సంబంధపు టెనయికఁగని మోచి తెచ్చియిచ్చె ననక చుల్కని నరులు; గాన మాపురమునకు విజయంబుసేయుఁ బుత్త్రిక నిత్తుగా' ఆని వారినిఁ బంప వారు శ్రీహరితో నిట్లు మనవిసేయ శ్రీహరి సమ్మతించి సపరివారముగా విల్లిపుత్తూ

రికిఁబోయి మహారాజకుమారుఁడు పెండ్లికి దరలి వెడలి యొక రాజకన్యను బెండ్లాడిన రీతి నామెను బెండ్లియాడి శ్రీరంగమునకుఁ దీసికొనివచ్చి,

తే. సహ్యకన్యా తటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతలఁ గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించుచున్నవాఁడు.

## కథావిమర్శనము

కవి ద్రావిడప్రబంధమునుండి యీకథ గ్రహించినాఁడు. గ్రహించుటలో స్వప్న వృత్తాంతములు ఆముక్తమాల్యదా దివ్యశక్తి పరిజ్ఞానము పరిహరించి రసానుగుణముగా శృంగారప్రబంధరీతికి మార్చినాఁడు. భగవంతునికి ప్రత్యక్షముగా నుండు నొకరాజ వేషము కల్పించినాఁడు. ఆముక్తమాల్యదా శ్రీరంగశాయులను నాయికా నాయకులుగా నేర్పఱచి నాయికను మొదట విరహము కల్పించి తర్వాత నాయకునను విష్ణుచిత్తుని ఛాందసపు మొఱమిమమున కొంచెము ఎడఁబాటు చూపి చివరకుఁ బెండ్లి కావించినాఁడు. విష్ణుచిత్తుని ప్రపంచజ్ఞానము లేనివానిఁగా చిత్రించుట చిత్రముగానే యున్నది. తన పెంపుడుకూఁతురు పడు విరహవ్యథ తనకు ఆమె చెలులుగాని లేదా యాతని భార్యగాని తెలిపియుండవచ్చును. లేదా తానే గ్రహింపవచ్చు. అట్లు కాక యది యున్మాద మనుకొని మన్నారుతో మనవిసేయుట యాయన పరిహసించి శ్రీరంగస్వామియొద్దకుఁ బొమ్మనుటయుఁ బ్రకృతికిఁ గొంచెము విరుద్ధమే.

ఈమె లక్ష్మీదేవ్యంశసంభూత యని పూర్వకథ. ఈప్రబంధమునఁ గూడ చెలికత్తెలు నీవు సత్యభామవు గావా (5 ఆ. 74) యని యన గ్రక్కున ప్రత్యుత్పన్న విజ్ఞానయైన దని చెప్పినాఁడు. విష్ణుచిత్తుఁడు మన్నారుస్వామితో మనవిచేసికొన్నపుడు చండాలబ్రహ్మరక్షస్సంవాదమును అందలి గానప్రభావమును, వరహావతారమునఁ దనవలన విన్న భూదేవియే గానోపచారముతోఁ దన్నుసేవింప ఆముక్తమాల్యదయై వచ్చిన దని కథ మార్చి, ఆమె భూదేవ్యవతార మని చెప్పుట కేవలము చండాల బ్రహ్మరక్షస్సంవాదమున కిందు నవకాశము కల్పించుట కని తోఁచెడిది. దానిప్రయోజన మిది. విమర్శలం చదివినవిప్రునికంటె విష్ణుభక్తి గల మాలదాసరి శ్రేష్ఠుఁ డనుటయే కాక మాలదాసరివలన బ్రాహ్మణునికి ముక్తి యిప్పించుట యనునదియుఁ బ్రయోజనము.

తనకు మాలికాకరణకైంకర్యము చేయు విష్ణుచిత్తునిచేఁ బండితులను గెలిపించుటలో భగవంతుఁడు నే నున్నాఁడ నని నిలఁబడినట్లుండుటచే నాదోషము పరిహృతమగు నది. అఘటితఘటనాసమర్థుఁడుగదా పరమేశ్వరుఁడు!

పెండ్లిచేయుటలో విష్ణుచిత్తుఁడు ఆముక్తమాల్యదను శ్రీరంగమునకుఁ గొనిపోవ నతఁ డామెను దనలో నంతర్ధానము చేసికొన్నట్లు మూలకథ యుండఁగా మాయా కన్యా కల్పనము, విష్ణుచిత్తుని మొఱ, మరల సత్యాముక్తమాల్యద యింటనుండ బ్రహ్మాదుల ముఖమున నక్కన్య నడుగుట, మాపిల్లను మోచితెచ్చి, యీయఁజాలను, వచ్చిన పెండ్లాడవచ్చు నని కల్పించుట లౌకికరీతిని జూపుటకు. దాని సాధనమునకు మాయా కన్యాకల్పనము. వాని యాశక్తి తెలుపుటకై వెడలుటయు రంగేశు నంతఃపురముఁ జేర్చు టయుఁ గూర్పఁబడినవి. ఆముక్తమాలికలు శ్రీహరికిఁ బ్రియము లని తెలుపుటకై కథా కల్పనమునఁ గొంతకొఱ్ఱ్య మున్నది.

మనుచరిత్రకర్త యిట్లు వర్ణింప లేదు.

## యామునార్యచరిత్ర విమర్శనము

ఈ చరిత్ర కీ గ్రంథమునందుఁ బ్రసక్తియే లేదు. 'విష్ణుచిత్తుఁ డొకఁడు, యా మునుఁ డొకఁడు వైష్ణవసిద్ధాంతము నిలఁబెట్టిన వా' రని చెప్పి యామునచరిత్ర మంతయుఁ జెప్పెను. అందును గొన్ని మార్పులు గావించెను. ఈ చరిత్రప్రవేశము సంఘసంస్కార నీతిబోధనములకై ప్రవేశపెట్టఁబడినది. యామునార్యుఁడు పాండ్యరాజు సభలోఁ బ్రవేశించుటలో పూర్వకథలో నిట్లున్నది.

పాండ్యరాజునొద్ద నున్న పండితుఁడు వాదమున నితరుల జయించి వారివలనఁ బన్ను పుచ్చుకొనుచుండువాఁడు. అతఁడు పన్ను నిమిత్తము భటులను బంపఁగా యామునునిగురువు ధనము లేక దైన్యమొందెను. అది యామునుఁడు తెలిసికొని, వారి యుత్తరువు లున్న పత్త్రము చింపి పాఱవైచి మఱియొక పత్త్రికపై 'న వయం కవయస్తు కేవలం, న వయం కేవలమంత్రపారగాః, అపితు ప్రతివాదమస్తక ప్రకటాటోప విపాట నక్షమాః.' అని వ్రాసి పంప రాజపురోహితుఁడు రాజున కది తెలిపి వానికిఁ గోపము తెప్పించి పంపించెను. వానినిరాదరాహ్వానమును నిరాకరించి యామునుఁడు రాజదర్శన మునకుఁ బోలేదు. అతఁడు చాల సమర్థుఁ డని రాజు విని సగౌరవముగాఁ బిలిపించెను. అతఁడు రాజసభకు వచ్చెను.

## ప్రబంధమందలి మార్పు

రాజు శైవమతాభిమాని. రాణి వైష్ణవమతాభిమాని. రాజునకు వ్యతిరేకముగాఁ బ్రవర్తింప నిష్టములేనిది. కాని వైష్ణవులకు రహస్యముగా దానధర్మము లాచరించునది. యామునుఁ డాపురమునకు వచ్చి, వైష్ణవుఁ డగుటచే రాజసభాప్రవేశము గనఁజాలక [illegible]ల్లముఖంబునఁ దనరాక రాణి కెఱిఁగించి,'వాది గలిగినచో వైష్ణవమతము స్థాపింపఁ

గలను. రాజు వైష్ణవవిముఖుఁడు గాన నాకు సభాప్రవేశము దొరక లేదు. నీ విభుఁడు నీకు విధేయుఁడు. నీభర్తతోఁ జెప్పి నాకు సభాప్రవేశము గలిగించితివేని వైష్ణవమతము స్థాపించి నీ భర్తను విష్ణుభక్తిపరాయణునిఁ గావించెద నని వార్త నంపెను. ఆమె భర్తతో నేకతమం దున్న సమయమున నెఱింగింప 'ఎట్టెట్టూ తావాదముచేసి శివమతము జయింపంగా వచ్చెనే చూతముగా రావింపుము!' అన్న మఱునాఁ డామె వానిని రప్పించెను. ప్రబంధమండలిదానికంటెఁ బూర్వకథారీతియే పౌరుషసూచకముగా నున్నది. కాని విష్ణుమత విముఖున కిదియేమార్గ మని కవి యట్లు మార్చెనేమో?

## యామునార్యునిరాజ్యప్రాప్తి

యామునార్యుఁడు సభలో వాదము చేయఁ బోవునపుడు రాజపురోహితుఁడును రాణియుఁ గూడ సభలో నున్నారు. యామునుఁడు పురోహితుని జయించు నని రాణి యనఁ యామునుఁడు జయించెనేని యర్ధరాజ్య మామె కిచ్చెద ననియెను. అతఁ డోడిపోయినచో రాణి రాజునకు ఆఱుమాసములు దాస్యము చేయ నిర్ణయ మనియె. యామునుఁడు వాదమున జయించిన తరువాత రాజు తన ప్రతిజ్ఞాప్రకారము రాణి కర్ధరాజ్యమీయఁబోవ నామె యాయర్ధరాజ్యము యామునున కిప్పించెను. అతఁడు వివాహము చేసికొని సుఖస్థితి నొందెను.

## ప్రబంధమండలిమార్పు

యామునుఁ డోడినచో వానికి లింగము కట్టి శైవ మిప్పించుట, పురోహితుఁ డోడినచో రాజు పరివారాప్తసహితముగ శైవము విడిచి వైష్ణవము గ్రహించుట, రాణి కిని శైవమిప్పించుటయే ప్రతిజ్ఞావిషయము. యామునార్యుఁడు జయించిన తరువాత రాజు విష్ణుభక్తిపరాయణుఁ డయి తనచెలియలిని యామునార్యున కిచ్చి పెండ్లిచేసెను. పాండ్యదేశంబున భాగినేయుఁడే పట్టార్హుఁడుగావున చెలియలిమగఁ డగు యామునమునికి నర్ధరాజ్య మిచ్చి, యువరాజుం జేసి, సాంగవేదాధ్యయనము చేసిన యాతనికి నధర్వవేదంబు అభ్యస్త మని యెఱింగి దివ్యాస్త్రపరిజ్ఞాత యగు నాతని నెచ్చరించి దుష్పాధయోధయూథంబుపై దండయాత్ర కనిపెను. అతఁ డట్లు దండయాత్ర కేఁగి శత్రువుల జయించి రాజ్యము చేయుచుండెను. పూర్వకథావిరుద్ధమును కలియుఁగనిషిద్ధము నగు నసవర్ణస్త్రీవివాహము. ఆపద్ధర్మముగా నంగీకరింపఁబడిన శస్త్రజీవికయు, యామునాచార్యున కారోపించుటయు ఇవి యశాస్త్రీయ మని కాని కేవలము విష్ణుమతస్థాపనకై వచ్చిన స్వామి కిది అర్హమా యని కాని యేవిధమగు సందేహమును గలిగింపక స్వాభావిక కార్యానుసరణము చేసినట్లు రచించినాఁడు.

కృష్ణదేవరాయలకాలమున నట్టి ఆచారమున్నట్లు చెప్ప వీలు లేదు కాని బ్రాహ్మణులు శస్త్రజీవిక యవలంబించియున్న ట్లూహింప నవకాశము కలదు. వివాహసాంకర్య వృత్తిసాంకర్యములను చూపించి తనసంస్కారణాభిమానము వెలిబుచ్చుటకే కవి యిట్లు రచించె ననవచ్చును. రా జీ ప్రబంధము రచించె ననుటకుఁ గూడ నిది కొంత తోడ్పడుచున్న యది యనవచ్చును. మతవాదమున జయించిన బ్రాహ్మణునికి రాజ్యమును చెల్లెలను ఇచ్చె నని రచించుటకు బ్రాహ్మణుఁడు సందేహింపకపోఁడు. రాజ్యమును పయివానికిఁ బోనీయక యర్హున కిచ్చుటయుఁ, బ్రాహ్మణ క్షత్రియుల సమ్మేళనము, బ్రాహ్మణుల శస్త్ర పరిజ్ఞానము, దానివలన శత్రుజయము బోధింప నిట్లు రచించియుండును. అట్టి సంస్కారము దేశహితము, కర్త పెద్దనయే యైనచో ఇట్టి యసవర్ణ వివాహము, వృత్తిసాంకర్యము కల్పింపవలసినచో ధర్మవిరోధ మున్న దని, బ్రాహ్మణ్యము పోవుచున్న దనియో, రాజ్య భోగము పరమార్థభంగకర మనియో మొట్టో యనిపించును గాని సామాన్యముగా విడిచి పెట్టునా?

## ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము

### (విష్ణుపురాణములోనిది)

పాండ్యరాజుసభలో విష్ణుచిత్తుఁ డుపన్యసించునపుడు ఇది గ్రహింపఁబడినది. మూలకథలో లేదు. ఈ సంవాదమందలి సిద్ధాంతమును ప్రమాణముగా గ్రహింపక యందుఁగల కొఱఁతలు చూచి భగవద్గీతాప్రోక్తమగు శరణాగతిధర్మమే శ్రేష్ఠమును సులభమును నని యుపపాదించినట్లు రచించినాఁడు.

ఈ కథలో ఖాండిక్యుఁడు కర్మనిష్ఠగలవాఁడు. కేశి బ్రహ్మనిష్ఠగలవాఁడు. ఏ ఋత్విక్కులును, ఏ ఋషులును, చెప్పఁజాలని ప్రాయశ్చిత్తము క్షత్రియునకుఁ దెలియుటయుఁ, నా విషయము శౌనకాదిఋషు లంగీకరించుటయుఁ చూపఁబడినవి. బ్రహ్మజ్ఞానమందు కేశిధ్వజుఁడే గట్టివాఁడు. వానిగురుత్వముననే ఖాండిక్యుఁడు జ్ఞాని యయ్యె, బ్రాహ్మణనిరాదరము లేదుగాన బ్రాహ్మణులకంటె శ్రేష్ఠులు. 1. శత్రువునొద్ద నైనను గ్రాహ్యమున్నపుడు అది యెట్టయినను గ్రాహ్యమేయనియు, 2. శరణాగతుఁడగు శత్రువును బాధింపక వానికార్యము నెరవేర్పఁదగు ననియుఁ, 3. శత్రువునకు మరల రాజ్యమిచ్చి వానిని వానిస్థానమున నిలుపుట యుక్త మనియు నను మూఁడు విషయము లిందువలన గ్రహింపఁదగును.

పైనీతులు కృష్ణదేవరాయనియాచరణములో నున్నవే యని యతని యవనరాజ్య [illegible]పనాచార్యబిరుదము, గజపతివిజయము వానికూఁతుఁ బరిగ్రహించుట వానికి మరల

రాజ్యమునిచ్చుట, తెలుపుచున్నవి. పరమార్థవిషయమున భగవద్గీతావాక్యమే ప్రమాణమని స్థిరపఱచినాఁడు.

రాజనీతి:—ఇందు విశేషముగా పూర్వ నీతివాక్యములతో కొన్ని నూతనవిషయములు చేర్పఁబడినవి. దీనిచేఁ గృష్ణరాయనిరాజనీతిపద్ధతి గ్రహింపవచ్చును.

చండాలబ్రహ్మరక్షస్సంవాదము:—ఇది వరాహపురాణములోనిది. ఈ కథాప్రవేశమునకై లక్ష్మీ దేవ్యంశసంభూత యని ప్రసిద్ధిగల యాముక్తమాల్యదను భూదేవ్యంశసంభూతగా మార్చెను. ఈ కథయందు బ్రాహ్మణుఁడు యాగమధ్యమందు శూలాదిబాధచే మృతినొందుటవలన బ్రహ్మరాక్షస జన్మ మొందె నని మూలగ్రంథము. బ్రాహ్మణుఁడు వేదవేదాంగము లభ్యసించి ధనాదాయపరుఁ డయి పరదేశముల కేఁగి దుర్దానముల మూలమున ధనము సంపాదించి, తనగృహమునకుఁ బట్టుకొనిపోవుచుండఁగా దొంగలు కొట్టినట్లు, దానివలననే యాతఁడు చచ్చుచుఁ గ్రూరుఁడగు దొంగలనాయకుని జలంచుటచే వికృత మగు బ్రహ్మరాక్షసజన్మము వచ్చినట్లు మార్చినాఁడు.

తుదికి:—వానికి విష్ణుభక్తుఁ డగు చండాలునిచే ముక్తిసాధన మగు వైష్ణవభక్తియం దిష్టత్వము నిప్పించెను. ఇది వేదజ్ఞానముకంటె విష్ణుభక్తి శ్రేష్ఠ మనుటకే. ఇందు రామానుజాదివృత్తాంతములు కాలవ్యత్యాసమయినను సహించిరయేనఁ జూపుట తన యిష్టభావము వెలిబుచ్చుటకేకదా! ఈ కవి తనకిష్ట మగు విషయముల నేదో సందర్భము కలిగించి యిందుఁ జొనుపువాఁ డనుట స్పష్టము.

పాండ్యరాజు:—నగరశోధనార్థము రాత్రి వెడలినవాఁ డని మూలకథలో నుండ భోగినీసంయోగార్థ మనుట, భోగలంపటునకైన విరక్తి కలుగుననుటకును, ముందు దైవభక్తి హెచ్చుగాఁ జెప్పఁబోవుచున్నాఁడు గాన నిట స్త్రైణ్యమును కామచారమును చూపుటకు నయియుండును. అవి సామాన్యరాజునకు సహజలక్షణము. రాజు వేశ్యయింటికిఁ బోవుట యప్పటియాచారము. రఘునాథాభ్యుదయమున రాజు తన్ను వరించిన ప్రియను జూచుట కేఁగెను. కాని యాకాంతను పిలిపించినట్లు లేదు.

## ఋతువర్ణనము

యామునార్యుఁడు యుద్ధయాత్రకు బయలుదేరఁబోవ వర్షాకాలము వచ్చెను. ఆ వర్షాకాలము యుద్ధాద్యనర్హ మనియుం సామాన్యప్రజలకుఁ గష్ట మనియుం జూప నెంతయో వివరముగాఁ బ్రకృతిని వర్ణించినాఁడు.

తర్వాత యుద్ధానుకూలముగ శరత్కాలంబు వర్ణించెను. ఆముక్తమాల్యదా విరహమునకు వివాహమునకు నర్హ మగు వసంతము వర్ణింపఁబడియెను.

కవి వర్ణ్యమును తలఁచినపుడు తనకుఁ దోఁచిన భావములన్నియుం విడువక వర్ణించు స్వభావముకలవాఁడు గావున నవి యంత విపులము చేయుట యుక్తమే.

ఇంక మనుచరిత్ర గ్రంథమున మూలకథలో రసాభాస మున్నను నట్టి యంశంబి నాఁడు మార్పు చేయనేలే దనవచ్చును. మనోరమ పెండ్లి యగునప్పుడే తనసఖియు రోగబాధచే పీడనొందుచుండ నేను పెండ్లాడి సుఖము నొందఁగలనా యన స్వరోచి యా వృత్తాంతము తెలిసికొని, తనయాయుర్విద్యా ప్రభావమున వారికి బాధ బాపిన ట్లున్నదానిని - వివాహానంతరము వారి ప్రథమసంగమ సమయమునఁ జెప్పినట్లు మార్చినాఁడు. ఇట్టివే మఱియొకటి రెండుమార్పు లున్నవి. ఆముక్తమాల్యదలో నట్లుగాక మార్పులు పెక్కులు కలవు.

ఇందు 1. విష్ణుచిత్తవిజయము. 2. యామునచరిత్ర. 3. చండాల బ్రహ్మరక్ష స్సంవాదము, గానమహిమ. 4. గోదాకల్యాణము అను నాలుగుగ్రంథములు కలవన వచ్చును.

ఈ యుత్తమప్రబంధమునకు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తానొక వ్యాఖ్యానము రచించుచున్నాననియు దీనిముద్రణమునకు ద్రవ్యసహాయము కావలెననియు శ్రీ పిఠాపురముమహారాజా వారిని ప్రార్థించుపడగా వీరు రు. 1000 నిచ్చిరి. శ్రీ శాస్త్రి గారు తన సంజీవనీవ్యాఖ్యను రచించి పీఠికతో సహా రాజా వారికర్పించిరి కాని యందలి కర్తృత్వ విషయచర్చలో శ్రీ కృష్ణరాయలకర్తృత్వము రూఢిపఱుపలేదనియు ఈ ముద్రణమున ప్రాచీన పాఠములు తారుమారు కావించి రచించుటయే కాని యింకొకటి తనకు కన బడలేదనియు శ్రీ పిఠాపురప్రభువువారి అభిప్రాయము. ఈ మాముద్రణమున ప్రాచీన పాఠములకు లోపము రానీయక ప్రమాదవేశములను మాత్రము తొలఁగించి నిర్దుష్టపఱచి యున్నాము.

# ఉపోద్ఘాతము

[శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులవారిది.]

ఈ ప్రబంధరాజము జగత్ప్రసిద్ధుఁ డైన కృష్ణదేవరాయలచే రచింప
ఆముక్త = (తనచే) ధరించఁబడిన, మాల్య = పూలదండను, ద = ఇచ్చున
శబ్దార్థము. దీనికి సరియయిన ద్రావిడభాషాపదము "శూడి క్కొడుత్తాళ్" =
యిచ్చినది) అని. ఇది విష్ణుచిత్తునిపుత్త్రిక యగు గోదా దేవిపేరు. ఇందుఁ శ
ముఖ్యకథాంశ మీగ్రంథనామమువలననే స్పష్ట మగుచున్నది. దీనిలోఁ
ప్రతిపాద్యము గోదావిష్ణుచిత్తులకథ లగుటచే గోదాదేవినిఁబట్టి "ఆముక్తమ
యనియు, విష్ణుచిత్తునిఁబట్టి "విష్ణుచిత్తీయ" మనియు నీప్రబంధము నామద్వ
వ్యవహరింపఁ బడుచున్నది. ప్రధానకథాశరీరముతో విశేషసంబంధము లేనివయి
రీతి సంబంధమును గల్పించి కవి యామునాచార్యవృత్తాంతమును, ఖాండిక్య
సంవాదమును, చండాల బ్రహ్మరక్షస్సంవాదమును దన యిచ్చకు వచ్చినట్లు
మార్పులను జేసి వర్ణించియున్నాఁడు. ఆ మార్పుల నిఁక ముందు గనఁబఱుప
చున్నాఁడను. గోదావిష్ణుచిత్తులకథయు, యామునాచార్యచరిత్రమును, వైష్ణవ
గురుచరిత్రమగు గురుపరంపరాప్రభావ మను శ్రీవైష్ణవమతాచార్యచరిత్రమును
వీనిలోఁగూడఁ గొంత కథాంశమును మార్చి కవి ప్రబంధరూపముగా వ్రాసెను.
నీగ్రంథము శ్రీవైష్ణవమతావలంబుల కత్యంతోపాదేయము ఇది అలంకా
...తమకావ్యలక్షణోపేతం బయి రాజిల్లుటయే కాక, విశిష్టాద్వైతసంప్ర
కుపకరిం... లను ప్రవిష్టములయి ...గుటచేఁ బరమార్థజ్ఞానసంధాయకమయికూడఁ ద త్త్వజి
...గా నాయాయిప్రకరణములయందు శృంగారా
దీనిలోఁ బ్రధానరసము భక్తిగా నొప్పునైన
ఋతువర్ణ... మతగురువులగు పన్నిద్దరాళ్వారులలో

యామునార్యుఁడు యుద్ధయాత్రకు బయలుదేరఁబోవ వర్షాకాలము వచ్చెను.
ఆ వర్షాకాలము యుద్ధాద్యనర్హ మనియు సామాన్యప్రజలకుఁ గష్ట మనియుఁ జూప
నెంతయో వివరముగాఁ బ్రకృతిని వర్ణించినాఁడు.

తర్వాత యుద్ధానుకూలముగ శరత్కాలంబు వర్ణించెను. ఆముక్తమాల్యదా
విరహమునకు వివాహమునకు నర్హ మగు. వసంతము వర్ణింపఁబడియెను.

సర్వశాస్త్రజ్ఞానమును యుక్తి పాటవమును, వక్తృత్వశక్తిని గలిగించెను. ఆమూట తే[illegible]ముందఱఁ బడును. ఆరాజు నీకు దాసుఁడ' నని పల్కెను. అపుడు విష్ణుచిత్తుఁడు ''ధన్యోస్మి'' అని నిర్మాల్యమును భగవద్వస్త్రమును శిరమున నిడుకొని మధురకుఁ బోయి వల్లభదేవుని యాస్థానమును సమీపింపఁగా నారాజు ఇతని నెదుర్కొని సముచిత సత్కారంబులు సలిపి సింహాసనాసీనుం గావించె. విష్ణుచిత్తుఁడు భగవద్దత్త ప్రజ్ఞావిశేషంబుఁ గలవాఁ డగుటచే నుత్తరోత్తరోక్తి సంతానంబునఁ బ్రతివాదుల నెదిరించి క్రమక్రమముగా వారివారి మతంబుల నుండెడు విప్రతిపత్తుల వారిచే నొప్పించి వాని నన్నింటిని ఖండించి శ్రీమన్నారాయణుండే పరుఁ డనియుం, అతఁడే ఉపాస్యుఁ డనియుం, మోక్షప్రదాత యనియుం సిద్ధాంతీకరించెను. అంతట విద్యాశుల్కగ్రంథి స్వయముగాఁ దెగి నేలఁగూలెను. ప్రతివాదు లందఱు విస్మయావిష్టచిత్తు లయిరి. రాజు విష్ణుచిత్తుని సామర్థ్యమునకు భగవన్మహిమంబునకు సంతసిల్లి యాతని నేనుంగుపై నెక్కించి ఊరేగించి పెద్దయుత్సవమును గావించెను. ఆసమయమందుఁ దనభక్తుఁ డగు విష్ణుచిత్తుని పరమాభ్యుదయము నీక్షింపఁగోరి లక్ష్మీకాంతుండు కమలాలయా ద్వితీయుఁడై యంతరిక్షమున గరుడవాహనముననుండి యాతనికి తనదర్శనమును బ్రసాదించెను. విష్ణుచిత్తుఁడు భగవంతుని సేవించి యనేక సూక్త వాక్యములతో స్తుతించి ధన్యుఁడై రాజు సానతి మరలఁ దన గ్రామమునకుఁ బోయెను.

బ్రాహ్మణుఁ డొకఁడు వృషగిరిలోనున్న స్వామిని సేవించి వచ్చి మధురలో రాజు పురోహితునియింట బసచేసి వేసవిబాధచేఁ బైనిపండుకొని తోడివిప్రులతో సుఖముపోకకుఁ జదువుచున్న శ్లోకములలో నొకటియైన ''మాసార్థమష్టౌ'' అను శ్లోకమును రాజు వేశ్యాసంగతికిఁ బోవుచుండఁగా విని ననియుం, మొదటఁ దనకు లభించిన ద్రవ్యమును విష్ణుచిత్తుఁడు భాగవతార్చనముక్రిందను దేవాలయముక్రిందను వ్యయపఱచుటచే రిక్తుఁడయ్యె ననియుం, భగవంతుఁడు కరుణించి యతనిగృహమును మణిమయముగాను సర్వసంపత్సమృద్ధ మయినదిగాను నిర్మింపు మని దేవశిల్పి యగు విశ్వకర్మ నాజ్ఞాపించె ననియుం, నీప్రబంధములో నున్నది. ఈ కథ యాకరగ్రంథ మగు గురుపరంపరాప్రభావములో నీయంశములు గానరావు. రాజసభలో విష్ణుచిత్తుఁడు పరతత్త్వవిషయకోపన్యాసమును జేయుచున్నప్పుడు శ్రీవిష్ణుపురాణనష్టాంశప్రతిపాదిత మగు ఖాండిక్య కేశిధ్వజసంవాదము నుపన్యసించినట్లు ప్రబంధములో నున్నది. ఇదియునుంగూడ మూలగ్రంథమం దనుక్తము.

## యామునాచార్యచరిత్రము

ఈతఁడు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకాచార్యులలో ముఖ్యతముఁడగు నాథ

9. నేమ్మ[illegible]కూడ నధికతరమయిన వైదుష్యము

గలవాఁడు. ఇతని నివాసస్థలము చోళదేశమందలి వీరనారాయణపురము. తండ్రి పేరు ఈశ్వరముని. ఇతనిబాల్యమునఁ జోళదేశమునేలు రాజుయొక్క పురోహితుఁడు అక్కియాళ్వా నయునతఁడు లోకాతిశాయి పాండిత్యముగలవాఁడై అకాలమం దాదేశమున నుండు పండితుల నందఱను వాదమం దోడించి వారివలనఁ గప్పము గొనుచు "విద్వజ్జనకోలాహలుఁడ"ను బిరుదము నొందెను. ఒకనాఁడు యామునముని తనగురువునొద్దఁ బాఠమును జదువుచుండ నారాజపురోహితుఁడు తన కీయవలసిన కరము నిమ్మని యామునార్యుని గురువున కొకజాబు నంపెను. ఆగురువు దరిద్రుఁ డగుటచే ధనమీయఁ జాలక దైన్యము నొందఁ జూచి యామునార్యుఁ డాపత్రికను నూఱుతునుకలుగాఁ జింపి మఱియొక పత్రమును దీసికొని "న వయం కవయస్తు కేవలం న వయం కేవలతంత్రపారగాః, అపితు ప్రతివాది మస్తకప్రకటాటోపవిపాటనక్షమాః" అను శ్లోకము న దానిపై వ్రాసి ఆదూతచేతి కిచ్చి పంపెను. రాజపురోహితుఁ డగు అక్కియాళ్వానది చూచి కుపితుఁడై రాజున కెఱింగింప నారాజు తనపురోహితునితో శాస్త్రవాద మొనరించుటకు విచ్చేయం మని యామునార్యునిఁ బ్రార్థించెను.

అతఁడు రాజుప్రార్థన మంగీకరించి రాజుసభకుం బోయెను. వీరిరువురకు శాస్త్రవాదము జరుగునపుడు మాధ్యస్థ్యము వహించుటకు నానాదేశములనుండి పండితులు రావింపఁబడిరి. అత్తఱి శ్రీవైష్ణవమతమం దాసక్తి గలరాజభార్య తనవల్లభునిఁజూచి మనపురోహితుని యీ యామునాచార్యులు జయింపఁగలఁడని ప్రతిజ్ఞ చేసెను. అందులకు రాజు, యామునాచార్యులు విజయము నొందినయెడల నీ కర్ధరాజ్యమొసంగెద. పురోహితుఁడు గెల్చినచో నాఱుమాసములవఱకు నీవు నా యాజ్ఞకు లోఁబడవలసినదాన" వని చెప్పెను. అందులకు రాణి సమ్మతించెను. అపుడు రాజపురోహితుఁడు యామునార్యు నాలోకించి "నీవు విద్వాంసుఁడవైనను బాలుఁడవు. నాతో వాదించుటకుఁ దగిన శక్తి లేనివాఁడవు కావున మూఁడు లౌకికవాక్యములను జెప్పుము. నేను వానిని ఖండించెదను. లేదా నేను మూఁడు లౌకికవాక్యముల నుచ్చరించెద. నీవు వానిని కాదనుము. జేత, తన పాదములతోఁ బరాజితునిశిరముఁ దన్నువలయు"నని ప్రతిజ్ఞఁ జేసెను. అట్లే కా నిమ్మని యామునేయుఁడు "సీతల్లి వంధ్య కాదు, ఈరాజు సార్వభౌముఁడు, రాజమహిషి పతివ్రత" అను మూఁడువాక్యముల నుడివి వీనిని నిషేధించుమనెను. అందుల కాపురోహితుఁడు ప్రత్యుత్తర మీయఁజాలక మూకీభూతుఁడై తలవంచుకొనెను. రాజు మిక్కిలి సంతసిల్లి వివాదసమయమందు యామునార్యుఁడు గెలిచినచో భార్యకిచ్చెద నని వాగ్దానము జేసిన అర్ధరాజ్యమును [illegible] భార్య ప్రార్థింపఁగా యాము[illegible] [illegible]ల్వదా కిచ్చెను.

వా [illegible] తము [illegible]

యామునార్యుఁ డిట్లు సమధిగత రాజ్యవైభవుఁ డయి ద్వితీయాశ్రమమును స్వీకరించి సకలభోగముల ననుభవించుచు సుఖముగాఁ గాలము పుచ్చుచుండ నీతని పితామహుని ప్రశిష్యుఁడగు శ్రీరామమిశ్రుఁ డను వైష్ణవోత్తముం డొకఁడు యామునార్యుఁడు పాండిత్యపుఁ గలిమిచే విష్ణుదర్శన స్థాపకుఁడుగ నుండుటకు బదులుగ నిట్లు రాజ్యభోగకాంక్షఁ దగిలి తృతీయ పురుషార్థపరుఁడై యుండె నని చింతిల్లి యతనికి వైరాగ్యముఁ బుట్టింప నెంచి యాతనిఁ జూడఁబోయెను. దౌవారికులచే ద్వారమందు నివారిత ప్రవేశుఁడై రాజదర్శనోపాయము నాలోచించుచు నెట్టకేల కాతని పాచకునితోఁ జెలిమిచేసి యాతనికిఁ బ్రీతికరమగు ముండ్లముస్తెకూర ననుదినముఁ దెచ్చి యిచ్చుచుండెను. పాచకుఁడు నాశాకమును వండి యామునార్యుని భోజనసమయమందు భోజనపాత్రమం దుంచుచుండెను. ఇట్లాఱుమాసములు గడచినపిమ్మట శ్రీరామమిశ్రుఁడు విసికి వేసారి యేనాటికిని యామునార్యుఁడు తనవృత్తాంతమును దెలియఁ జాలఁ డాయె నని మనస్తాపమునొంది నాలుగుదినములు శాకము నిచ్చుట మానెను. తరువాత నొకనాఁడు యామునార్యుఁడు భోజనసమయమున నాశాకము లేకపోవుటకుఁ గారణ మడిగెను. అందుపై నాపాచకుఁ డెవ్వఁడో యొకవృద్ధవైష్ణవుఁ డాకూర నిన్నిదినములు దెచ్చి యిచ్చుచున్నాఁడు. ఏమికారణముననో నాలుగయిదు దినముల నుండి తే లేదని చెప్పెను. అమరుసటిదివసమందు శ్రీరామమిశ్రుఁ డెప్పటియట్ల శాకపాణియై యామునార్యుని పాకశాల కరుగ నాపారోగవుఁడు వానిం జూచి మాప్రభువు నిన్ను నేఁడు తనమ్రోలకుఁ దీసికొని రమ్మని నా కుత్తరు వొసంగె నతనిం జూడఁ బొమ్మని చెప్పెను. శ్రీరామమిశ్రుఁడు యామునార్యుకడ కేగ నాతఁడు సాష్టాంగ దండప్రణామంబులాచరించి యథార్హ సత్కారకలాపంబున రంజిల్లఁజేసి సముచితాసనాసీనుం గావించి యాతఁ డేతెంచిన ప్రయోజనం బడిగెను. అంత శ్రీరామమిశ్రుఁడు "నేను నిస్స్పృహుఁడను. ప్రయోజనాపేక్షినై మీయొద్దకు వచ్చినవాఁడనుగాను. మీతాత యగు నాథముని మీకొఱకు నొకనిక్షేపము నాయొద్దనుంచి మీ కిమ్మని చెప్పెను. దానిని మీకొసంగుటకు మిమ్మిటఁ జూడవచ్చితి నన, యామునార్యుఁడు సంతోషభరితుఁడై యాతనివెంబడి శ్రీరంగమునకుం జనియె. అచట శ్రీరామమిశ్రుఁడు యామునార్యుని శ్రీరంగనాయకునిసన్నిధికిఁ గొనిపోయి "ఇదియే మీతాత మీ కిమ్మనిచెప్పిననిక్షేప" మని శ్రీరంగనాథుని పాదారవింద ద్వంద్వముం జూపె. యామునార్యుఁ డపు డానందపారవశ్యముచే మైమఱచి కొంతవడికిఁ దెలిసి 'ఆహా! ఇట్టి పరమ ప్రాప్యవిషయమును విడ[illegible]డి యింతకాలము క్షుద్రభోగంబులఁ దగిలియుంటి. బుద్ధి కెంతమోసము వాటిల్లె' [illegible]ంచి పద్యస్సంజాత వై[illegible]ఁడై కుమారునికి రాజ్య మొప్పగించి తాను

9. నేమ్ముంప[illegible]

ఈ యామునార్యచరిత్రమునకు కవి యీప్రబంధమునందు విష్ణుచిత్తునికథతో నొకరీతి సంబంధము గల్పించి యీదిగువ వ్రాసినవిధముగ గౌతమాత్మ శ్రీవిల్లిపుత్తూరు వటపత్త్రశాయిస్వామి లక్ష్మితోఁ జెప్పినట్లు చెప్పియున్నాఁడు.

విష్ణుచిత్తుఁ డొకనాఁడు యథాపూర్వముగా స్వామికి మాల్యముల నర్పించి యింటికిఁ జనుచుండ నతనిఁ జూచి స్వామి లక్ష్మితో ని ట్లనియె.

తే. "యామునాచార్యుఁ డొక్కఁడు నీమహాత్ముఁ
డొక్కఁడును గాదె మన్మతం బుద్ధరించి
రస్మదీయకృపాతిశయమున ననిన
నిందిరాదేవి తనభర్త కిట్టు లనియె." 4. ఆ. 39 ప.

క. "ఇతనికథ యెఱిఁగినదికా, యతఁడేమి యొనర్చె ననిన నబ్జాక్షుండా
శతపత్త్రనిలయకిట్లను, నతివ కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డాదిన్." 4 ఆ. 40 ప.

పాండ్యదేశపు రాజొకఁడు శైవమతమం దతిగాఢభక్తిఁ గల వాఁడై విష్ణుభక్తుల నవమానించుచు నతిశ్రద్ధతో జంగమార్చనఁ జేయుచుండెను. అతనిభార్య విష్ణుమతం దభినివేశము గలది యయి లోకులకు నానావిధోపకారముల నొనర్చుచుఁ బరమ ధార్మికురా లయి తన భర్త విష్ణుభక్తిముఖుఁడైనందులకు మిగులఁ జింతిల్లుచుండెను. ఇట్లుండ నొకనాఁ డారాజమహిషి యేకాంతమునందుఁ బ్రాణవల్లభునితో నా యామునార్య వృత్తాంతం బెఱిఁగింప నారాజు విని అపహసించి 'ఎట్టెట్టూ? ఆ బ్రహ్మచారి మా శైవ మతము వాదమందు జయింపఁగలవాఁడా? ఏమి చిత్ర! పిలువ నంపుము. చూత మాతని శక్తి" యన నారాజపత్ని ప్రతీహారిచే నాతని రావించె. వచ్చినయామునార్యునిఁ జూచి రాజు భార్యతో నిట్లనియె. "ఈవాదమున మాశివమతస్థుఁ డోడెనేని విభూతి రుద్రాక్షములఁ బరిత్యజించి నే నీతనిచేఁ జక్రాంకితుఁడ నయ్యెద. లేక నీతఁ డపజయమును నొందెనేని నీవు నీతఁడు శైవదీక్ష వహింపవలసియుండును" అని. అందులకు రాణి సమ్మతించెను. అపుడు యామునార్యుఁ డా శైవమతస్థులతో వాదించి సప్రమాణమగు యుక్తులచే వారి నందఱను జయించి విష్ణుదేవుండే పరతత్త్వం బనియుఁ విశిష్టాద్వైతంబె మతం బనియుఁ స్థాపించెను. ఇట్లు యామునాచార్యుఁడు సిద్ధాంత మొనర్చినసమయమున నా రాజ్యస్థాపనమున కెదుట నున్న రావిచెట్టునుండి "ఓయి రాజా! ఈ బ్రహ్మచారి చెప్పినదే సత్యము. శ్రీమన్నారాయణుండే పరబ్రహ్మ యగుటం జేసి యద్దేవు నుపాసింపు" మని యొకయశరీరవాణి యందఱు వినునట్లు బయలు వెడలెను.

అంత నాపాండ్య దేశాధీశ్వరుండు ప్రార్థించి యామునార్యుని మహా[illegible] సంతోషించి సాష్టాంగ మెఱఁగి [illegible] ర్యదా [illegible] గా, వసంతము వర్ణింపఁబడియెను.

పాండ్యదేశంబునకు భాగినేయుండ రాజ్యార్హుండు గావునఁ బాత్రుండని బ్రహ్మచారి యగు నాతనికిఁ దనకడఁగొట్టు చెలియలిం బెండ్లిచేసి యరణంబుగా నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బొసంగి యువరాజుం జేసి దుర్జయం బగు నిజ విరోధివర్గంబుఁ బరిమార్పు మని దండయాత్రకుం బనిచిన నయ్యామునేయుండును బ్రస్థానోన్ముఖుండు గాఁగ నట మంత్రులు వర్షకాలము సమీపించినది గావున దీనినిఁ గడపి శరత్సమయంబునఁ బోవచ్చు ననఁ బయన మాపెను.

పిదప నీతఁడు దిగ్విజయయాత్రలో నుండు సమయంబున నాథమునిప్రశిష్యుం డగు శ్రీరామమిశ్రుండు శ్లో. "అయత్నతో యామున మాత్మదాస మలర్క పత్రార్పణ నిష్క్రయేణ, యఃక్రీతవా నాస్థిత యౌవరాజ్యం నమామి తం రామ మమేయసత్త్వమ్" అను శ్లోకోక్త ప్రకారముగాఁ దనపరమగురుపౌత్రుం డగు యామునార్యుఁ డిట్లు భగవత్ప్రపత్తి సామ్రాజ్యంబు మరచి రాజ్యభోగాసక్తుం డయ్యె నని వగచి యాతనికి నిత్యము ముండ్లముస్తెకూర నిచ్చి జ్ఞానవైరాగ్యంబుల గలిగించి శ్రీరంగంబునకుఁ దోడితెచ్చి శ్రీరంగనాథుని సేవింపఁజేసె. తరువాత నీతఁడు తనకుమారునకి నీతి నుపదేశించి రాజ్య మొప్పగించి తురీయాశ్రమమును స్వీకరించె.

యామునార్యుఁడు [illegible] పాండ్యరాజును వైష్ణవునిగాఁ జేయుట; తాను బ్రాహ్మణుఁడై యు[illegible] [illegible] సోదరిని వివాహమాడుట ; కు[illegible]నికి రాజనీతి నుపదేశించుట ; [illegible] బియ్యు యుద్ధముఁజేసి పగఱ గెల్చుట ; అను నీయంశములు గురుపరంపరాప్రభావములో నున్న యామునాచార్యచరిత్రయందుఁ జెప్పఁబడ లేదు. ఈయంశములు కవికల్పితము లని నిస్సంశయముఁగా జెప్పవచ్చును.

## ఆముక్తమాల్యద (గోదాదేవి) చరిత్రం.

పూర్వోక్తచరిత్రగల విష్ణుచిత్తుఁడు పాండ్యరాజుసభలో జయముఁ గొనివచ్చిన మఱికొంతకాలమునకు యథాపూర్వముగా ఖనిత్రముతోఁ దులసీకాననభూమిఁ ద్రవ్వుచుండ నొకనాఁడు "తదా ఖనిత్ర వక్త్రేణ విష్ణుచిత్తే మహాత్మని. తులసీవృక్షమూలస్య ఖననం చ ప్రకుర్వతి, లక్ష్మ్యంశాల్లోకరక్షార్థం గోదా భూమ్యాస్తతోఽజని" అన్నట్లొక కన్యక భూమియం[illegible] [illegible] విష్ణుచిత్తుఁ డామెను జూచి ప్రమోదభరితాంతరంగుఁడై యానిసుఁగుబిడ్డ నింటికిఁ గొని[illegible] పెంచు మని భార్యచేతి కిచ్చెను. మెకుగోద యని నామమిడెను. గోదాదేవి చంద్రకళవలె దినదినప్రవర్ధమాన యౌవనలావణ్యముఁ గలిగి లోక నే[illegible]హ్లాద కారిణి యయ్యె. చిన్ననాఁటనుండియు నేమం[illegible] [illegible] శ్రీమన్నారాయణునిఁదప్ప ప్రాకృతమనుష్య

కెట్టివానినైనఁ బెండ్లియాడ నని ప్రతినపట్టెను. తనతండ్రి వటపత్రశాయి స్వామికొఱకు సమర్చిపెట్టిన కుసుమమాలికల మొదటఁ దానొకపరి తన కొప్పుపై ధరించి బావిలో సౌందర్యమును జూచికొని తిరుగ నాపూలదండల నెప్పటియట్ల తండ్రికిఁ దెలియకుండఁ బూలసజ్జలో నుంచునది. ఇట్లనేకదినములు జరుగఁగా నొకనాఁ డామె మాలికను గొప్పునఁ జుట్టికొనుట జనకునికంటఁ బడెను. అతఁ డామెను నొనాడ వెఱచి, "తల్లీ! దేవుని కర్పింపఁదగిన మాలికల నీ విట్లు ధరించుట యుంచితమగునా" యని మందలించి యాదివసమున స్వామికి మాలికాసమర్పణము మానెను. ఆనాఁటిరాత్రి స్వామి విష్ణుచిత్తునికి స్వప్నమందు సాక్షాత్కరించి మాల్యములు సమర్పింపక పోవుటకుఁ గారణ మడిగెను. అందుల కాతఁడు "స్వామీ! ముగ్ధయగు నాపుత్రిక బాల్యసులభచాపల్యముచే నామాలికను ధరింపఁగాఁ జూచి యది నిర్మాల్య మయ్యె నని పరిహరించితిని; మఱియొకటిఁ గట్ట బూవులు లేకపోయెను. క్షమింపుఁ"డ నెను అదివిని స్వామి సస్మితోష్ఠపుటముతో ని ట్లనియె. "ఓయీ! ఆమె యెవ్వరో నీ వెఱుఁగనివాఁడ వగుటచే ని ట్లొనర్చితివి. ఆమె లోకరక్షార్థమయి యీ విభూతియం దిట్టిరూపముతో నవతరించిన లక్ష్మి. నీభాగ్యవశమున నీకు లభించెను. ఇటనుండి నీవు నిర్మించుమాలికల మొదట నామెకొప్పున నలంకరించి పిమ్మట మాకు నిమ్ము. ఆమె దాల్చినమాలికయే మాకు స్పృహణీయము. ఆమె కబరీసంపర్కములేని స్రజము నే నొల్లను." అప్పటినుండి విష్ణుచిత్తుఁ డామెయందు పుత్రిక యను ప్రాకృతాభిమానమును విడిచి పరదేవతాభావమును జూపఁదొడఁగె. ఇట్లు క్రమముగా గోదాదేవి సంప్రాప్తయౌవనయై గోపికలవలె కృష్ణునియం దత్యర్థానురాగముఁ బూని అహర్నిశములు దత్ప్రాప్తికై ధ్యానించుచుండెను. కృష్ణసంశ్లేషముకొఱకు గోపాంగనలు కాత్యాయనీవ్రతము నాచరించి రని విని యామెయు వారి ననుకరించి ధనుర్మాసములో ముప్పది రోజులు వేకువజామున లేచి తోడిబాలికలతో స్నానముచేసి వటపత్రశాయిస్వామిని సేవించుచు దినమునకొక్కొకగాథను (శ్లోకము) ద్రావిడభాషతో రచించి స్వామిసన్నిధిని విన్నవించుచు వ్రతము చేసెను. ఇట్లు భగవంతునియం దీపె అత్యంతానురక్తయై విగళితాన్యభావ యగుటఁ జూచి కింకర్తవ్యతామూఢుండై విష్ణుచిత్తుఁ డొకనాఁ డీమెస్థితిని వటపత్రశాయితో విన్నవింప నాశౌరి యీమెను శ్రీరంగమునకుఁ గొనిపోయి రంగనాథుని కిచ్చి వివాహముఁ జేయుం మని యుపదేశించెను. విష్ణుచిత్తుఁ డట్లు గావింప నీమె రంగనాథుని సాయుజ్యపదవి నొందెను.

ఇది గురుపరంపరాప్రభావములో వర్ణింపఁబడిన గోదాదేవి కథ. దీని కీ ప్రబంధములోఁ జెప్పఁబడిన కథకును గొంచెము భేదముఁ గలదు. ఎట్లనఁ: ఈ దేవి పూర్వభవమున భూదేవి గావున బూరం ప్రార్థించె ... [illegible] ... యగు, వసంతము వర్ణింపఁబడియెను.

ఏకావళీ, హారిణీ, మనోజ్ఞ అను నామధేయములుగల నాగకన్యక లీమెతోఁగూడ నీవిల్లి పుత్తూరుగ్రామములో బ్రాహ్మణగృహములయం దవతరించి గోదాదేవికి నెచ్చెలులు యుండి రని కవి చెప్పుచున్నాఁడు. ఇదిగాక మఱియొక విశేషము. అనపత్యుఁడు ఛాందసుఁడు లోకానుభవవిహీనుఁడు నగువిష్ణుచిత్తుఁడు కృష్ణునియం దనురాగముగల గోదాదేవియొక్క మనోభవవేదన నెఱుంగఁజాలక వటపత్రశాయిస్వామితో నామె కున్మాదావస్థ బొడమిన దని దైన్యముతో విన్నవింప నాస్వామి లోకస్థితి నెఱుఁగని యాతనిమాఢ్యమునకు నవ్వి "తొల్లిభూదేవికి వహానసమయమందు వరాహదేవునిచేఁ జెప్పఁబడిన చండాల బ్రహ్మరక్ష స్సంవాద మను నొక పుణ్యకథ నాతనికిఁ దెల్పి యీ నీపుత్త్రిక పూర్వజన్మంబున ధాత్రీకాంత గావున మదీయ సకల పూజోపచారంబులలో గానంబె నాకెక్కుడు ప్రీతికర మనియు విశేషఫలప్రదం బనియు నక్కథలో వినియుం డుటవలన నిపుడు వైష్ణవియై యవతరించి ప్రత్యహంబును తనకు భగవంతునియం దుండెడు ననురాగమును బట్టఁజాలక యీరీతినిఁ బాటలబాడుచుఁ గీర్తించుచున్నది వేఱొండుగాదు. నీవు మేలయ్యెడు ఈమెను రంగేశు సేవింప శ్రీరంగంబునకుఁ దోడు కొని పొమ్మని సెలవిచ్చెను.

## చండాలబ్రహ్మరక్షస్సంవాదము

ఈకథ వరాహపురాణాంతర్గతము. శ్రీవరాహభూదేవీ సంవాదములో భగవద్గాన మాహాత్మ్యమును బ్రతిపాదించు నలువదినాలుగవ సర్గలో నిట్లు చెప్పఁబడినది.

"శ్రీవరాహ ఉవాచ—శ్లో. జాగరేతు విశాలాక్షి జానతో వా ప్యజానతః, యో మే ప్రగాయతే గీతం మమభక్త్యా వ్యవస్థితః, యావంతి త్వక్షరాణ్యత్ర గీయమానే యశస్విని, తావ ద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే, ఏవం తు వచనం శ్రుత్వా తత్ప్రసాదాద్వసుస్థరా, వరాహరూపిణం దేవం ప్రత్యువాచ శుభాననా, అహో గీత ప్రభావో వై యస్త్వయా పరికీర్తితః, కశ్చిద్గీతప్రభావేన సిద్ధిం ప్రాప్తో మహాతపాః, వదస్వ మమ దేవేశ ప్రసాదసుముఖో యది."

"శ్రీభగవానువాచ—శ్రుణు తత్త్వేన మే భూమే కథ్యమానం యశస్విని, యస్తు గీతప్రభావేన సిద్ధిం ప్రాప్తో మహాతపాః, అస్తి దక్షిణదిగ్భాగే మహేంద్రో నామ పర్వతః, తత్ర క్షీరనదీ పుణ్యా దక్షిణే సాగరంగమా, తత్రసిద్ధాశ్రమే భద్రే చండాలః కృతనిశ్చయః, దూరాజ్జాగరణే గాతి మమ భక్త్యా వ్యవస్థితః" అని యున్నది.

ఈ చండాలుఁడు పరమభక్తుఁడు తననివాసమునకుఁ గొంతదవ్వుగా మఱియొక ఊరిలో నున్న దేవాలయమునకుఁ బోయి యచట భగవత్సన్నిధియందు నిత్యము భగవ గుణప్రతిపాదకము లగు గీతములఁ బాడుచు భగవంతుని స్తోత్రము జేయు నేమంబు [illegible] కైంకర్యముచేఁ గడపెను. ఒక కాలమందు

కార్తీక శుక్ల ద్వాదశినాఁటిరాత్రి యామముకాఁగా వీణనెత్తుకొని మంగళకైశికినిఁ బాడుటకు దేవాలయమునకుఁ జనుచుండెను. "కౌముదస్యతు మాసస్య ద్వాదశ్యాం శుక్లపక్షకే. సుప్తే జనేగతేయామే వీణామాదాయ నిర్యయౌ." అంతట దారిలో బలవంతుఁడు క్రూరుఁడు నైనబ్రహ్మరాక్షసుఁ డొకఁడు వీనిని బట్టుకొని "నేఁటికి పదిదినములనుండి సాకాహారము లభింపలేదు దైవవశమున నీవు నాకంటఁబడితివి; నిన్ను భక్షించెద" నని చెప్పెను. దాని కీమాలదాసరి భయము నొందక "అట్లే నీవు నాశరీరమును భక్షింపవచ్చును. ఈశరీరము నీదియే. కాని నే నీప్రాంతమున నున్న దేవసదనమునకుంబోయి భగవత్సన్నిధిలో మంగళ కైశికీగానముచే భగవంతుని రంజింపఁ జేసి సూర్యుఁడుదయింపకమునుపు నీకడకుఁ దప్పక రాఁగలను నామాట నమ్ము"మని చెప్పి రాక్షసునకు విశ్వాసము బుట్టించుట కనేకవిధముల శపథములఁ జేసెను. ఎంత నమ్మించినను దనుజుఁడు సరకు గొననందున సెట్టకేలకు శ్రీమన్నారాయణు నన్యదేవతలతో సమానముగాఁ జూచినవాని మహాపాతకమును బొందెద నన నా రాక్షసుఁడు వానిని విడిచిపెట్టెను. వాఁడును త్వరితగతి దేవళమునకుఁ జని యా రాత్రి యంతయుం జాగరణ మొనరించి కైశికి గానముచే సర్వేశునిఁ గీర్తించి తరువాత స్వప్రతిజ్ఞానుగుణముగ రక్షోవాసభూత మగు న్యగ్రోధపాదపంబు దరిఁజేరి "ఇదె చూడుము, వచ్చియున్నాఁడను, నీయిచ్చవచ్చినటుల నన్నుఁ భక్షింపు"మని ఎలుగెత్తి చెప్పెను. ఆమాట విని రాక్షసుఁ డీమాలదాసరిసత్యప్రతిజ్ఞకు విస్మయము నొంది "అహా! వీఁ డెట్టి మహానుభావుఁడు? వీనివలన నా కీహీనావస్థ నివృత్తింబగు"నని తలంచి, "ఓయి చండాలుఁడా! 'త్వమద్యరాత్రౌ చండాల విష్ణోర్జాగరణం ప్రతి, ఫలం గీతస్య మే దేహి.' నీ వీరాత్రి విష్ణు సన్నిధిలో జాగరణము చేసి పాడిన పాటయొక్క ఫలమును నా కిచ్చి తరింపఁ జేయుము. లేక తదర్థ మయిన నొసంగుము; అందులను సమ్మతింపవేని యొక యామములోఁ బాడినపాటయొక్క ఫలమునైన నా కిమ్ము; దానికి నంగీకారము లేనియెడఁ గొసపాట యగు కైశికియొక్క సుకృతము నయిన నాకు ధారవోయు" మని రాక్షసుఁడు దాసరి పాదములపైఁబడి పలువిధములఁ బ్రార్థింపఁ దుట్టతుద కాతఁడును కరుణించి కైశికీ గానఫలము నిచ్చెను. తత్క్షణంబ వానిపిశాచత్వము నివర్తించెను. ఇట్లు శ్వపాకుని కృపచే నివృత్తరక్షోజన్ముఁడైనయాతఁడు బ్రాహ్మణుఁడై యెదుట నిలచి తనపూర్వజన్మవృత్తాంతము నిప్పగిదిం జెప్పె. "నేను పూర్వము చరకగోత్రోత్పన్నుఁడనైన సోమశర్మ యను విప్రుఁడ. నేను చేయఁబూనినయజ్ఞకర్మ సమాప్తి నొందకముం శూలదోషముచే దీక్షాదినములలో మృతినొందితిని. దాన నీజన్మము సంభవించె. నీదయచే నిపుడు తీర్ణుఁడనైతిని. పోయి వచ్చెద సెలవిమ్ము" అని పలికి య[illegible] వీడ్కొల్పి తనయిచ్చం జనెను.

[illegible] ప్రార్థిం[illegible] శ్రీ[illegible] [illegible]ల్యదా[illegible] మగు, వసంతము వర్ణింపఁబడియెను.

పై నుపపాదింపఁబడిన మాతంగ బ్రహ్మరక్షస్సంవాదమునకు బ్రధానకథతో సంబంధము లేకపోయినను కవి యేదో యొకవిధమున సంబంధముఁ గల్పించి కొన్ని మార్పులఁ జేసి దీనిలో విశిష్టాద్వైతమంత సంప్రదాయంబున, యుక్తి చాతుర్యంబును, జ్ఞానపూర్తియుం గనఁబఱచి మిక్కిలి సొగసుగా వ్రాసినాఁడు. ఎట్లన:

మాలదాసరి తనపల్లెనుండి తిరుక్కురుంగుడి యను దివ్యదేశమందున్న దేవాలయమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున రాక్షసునిచేఁ బట్టుకొనఁబడియె. అనేకనీతులను ధర్మములను సయుక్తికముగ బోధించినను విడువలేదు. తుద "కన్యదేవతలతో శ్రీమన్నారాయణునిఁ దుల్యముగాఁ జూచినవాని పాపము నొందినవాఁడ నగుదు" నని ఘోర ప్రమాణముఁ జేయఁగా రాక్షసుఁడు వానిని విడిచెను. దాసరి కురుంగుడినంబి కోవెలకుఁ జని కైశికగానముచే భగవంతు నానందింపంజేసి తిరుగ బ్రహ్మరక్షస్సుకడకు వచ్చి "నా ప్రతిజ్ఞాప్రకారము వచ్చినాఁడను, నన్నిఁక భక్షింపు" మని నుడివిన, యారక్కసుఁడు మనకు పరిపాకముఁ జెంది జ్ఞానోదయముఁ గలవాఁడై "ఓయి మహానుభావా! ఇటుపై నా అయోగ్యతను గణింపకుము. ఎవ్వఁడైన నీవంటి భాగవత[illegible] వచ్చి నన్నెన్నఁడైనఁ దరింప జేయునా యని వేచియుంటి. నీవిట్లానతిచ్చుట న్యాయమా? నన్నీపిశాచత్వమునుండి యుద్ధరించుట కుపాయ మాలోచింపుము. ఘు[illegible]కంటె నే నధ[illegible] మొనర్పలేదు [illegible]నికే శ్రియఃపతి పరిశు[illegible] చేసి [illegible] నొసంగెను. అభగవ[illegible] భక్తులైన [illegible] పతులు నట్టి[illegible]. ఎట్టి [illegible]పులనై [illegible]. కావున నీ విపుడు భగవత్సన్నిధిని బాడినపాటయొక్క ఫలము నాకిచ్చి నన్ను రక్షింపు" మని యనేకవిధముల మొఱలిడ విష్ణుభక్తుఁడైన దాసరి యొప్పుకొనలేదు. అందుపై రాక్షసుఁడు గుర్వాజ్ఞ నుల్లంఘించి గోప్యమగు నమంత్రమును సకలజనుల కుద్ఘోషించి చెప్పిన శ్రీవైష్ణవసిద్ధాంత కర్తయగు శ్రీరామానుజుని పరసమృద్ధియుఁ బరోపకారబుద్ధియుంనుఁ గొనియాడి నీవు నాపగిదిని నావిషయమయి యుపకరింప వలయు నని ప్రార్థించి, తిరుగ నా రామానుజమునియే మఱియొకజన్మంబున రమ్యజామాతృయోగియై యవతరించె ననియు, నతఁడె కాలాంతరమున శఠకోపుఁడై జనించి జ్ఞానహీను లయిన మనుజులకు జ్ఞాన ముపదేశించి భగవద్భక్తుల నొనరించె ననియుఁ జెప్పెను. ఇది శ్రీవైష్ణవమత సంప్రదాయగ్రంథ విరుద్ధము. శఠగోపునికంటె రామానుజముని చాలకాలమున కీవల [illegible]నించినవాఁడు. శఠకోపుఁడు విష్వక్సేనాంశసంభూతుఁ డనియు, రామానుజముని [illegible]సంభూతుఁ డనియు, విశిష్టాద్వైతమతగ్రంథములు చెప్పుచున్నవి. ఇదికాక మరి [illegible]ము. శఠకోపునికంటె తరువాతివాఁడైన రామానుజమునిని భూతకాలక్రియ [illegible]ఁడైన శఠకోపుని [illegible]కు సమకాలికుఁడైన వేదాంతదేశికుని భవిష్య

9\. [illegible]

వరాహపురాణాంతర్గత బ్రహ్మరాక్షసుఁ డెక్కడ? వానికంటె బహుకాలము తరువాత జనించిన శఠకోప రామానుజ వేదాంతదేశి కాదు లెక్కడ? అని చదువరు లకుఁ గలుగు సంశయమును, కవి "ఇట్టి యేవ్వంబులు మదీయ దివ్యబోధంబున నెఱింగి యుండుదు నని" తన దివ్యజ్ఞానముతో భవిష్యత్తు నెఱింగి బ్రహ్మరక్షస్సు చెప్పినట్లు వ్రాసి చమత్కారముగాఁ దొలఁగించెను.

పిమ్మట నాపిశాచము దాసరితోఁ దనపూర్వవృత్తాంతమును జెప్పుటలో దా నొక కాలమందు పథికసామర్థ్యముతో గ్రామాంతరమునకుఁ బోవుచుండ దారిలో దొంగ లడ్డగించుకొని బాటసారులను దోఁచుకొని రనియు, ఆపస్యువులలో నొకఁడు తన సంచిని దీసికొనఁగా నెదిరించిన తనకుఁ గత్తితో నఱికె ననియు, కాకశ్మశ్రునామముఁ డగు నా చోరునిఘోరరూపము దనకట్టెదుట వ్రేలాడ దీసినట్లుండ వ్రణవేదనచే మృతి నొందఁ దనకీ బీభత్సరూపము కలిగె ననియుఁ జెప్పెను. ఇదియంతయు గురుపరంపరా ప్రభావములో నను క్తము. అంత దాసరి యారక్కసునికిఁ గైశికీగాన సుకృత సుసంగుట వలన విప్రత్వంబె కాక భాగవతశ్రీయును గలిగి పరమానందభరితుండై యావిష్ణు భక్తునిఁ బూచించె. ముక్తసంసార సంగుండై బదరీవనాది పుణ్యక్షేత్రంబుల దీర్ఘయాత్రఁ జరింపఁబోయె.

## ఖాండిక్య కేశిధ్వజసంవాదము

ఇది శ్రీ పరాశర కృత శ్రీవిష్ణుపురాణషష్ఠాంశములో షష్ఠసప్తమాధ్యాయ ములలోఁ బరాశరునిచే మైత్రేయఋషికిఁ జెప్పఁబడియె.

ఈకథ శ్రీమద్భాగవత నవమస్కంధమందు పదమూఁడవ యధ్యాయములో నించుకంత సూచన జేయఁబడినది.

"కృతధ్వజసుతో రాజ న్నాత్మవిద్యావిశారదః,
ఖాండిక్యః కర్మతంత్రజ్ఞో భీతః కేశిధ్వజాద్గతః" (20 శ్లో.)



ఈ ఖాండిక్యకేశిధ్వజులు పైని వ్రాయఁబడిన వృక్షమువలన నన్నదమ్ముల బిడ్డలని స్పష్టమగుచున్నది. వీరిరువురు రాజ్యాభిమానులై చిరకాల మొకరితో నొకరు పోరాడిరి. తుదకుఁ గేశిధ్వజుఁడు రాజ్యమును గెల్చుకొనఁగా ఖాండిక్యుఁడు మంత్రి పురోహిత భటవర్గముతో నరణ్యమునకుఁ జని పర్ణకుటీరంబుల నివసించుచుండెను. కేశిధ్వజుఁడు రాజ్యము వశపఱచుకొని స్వర్గలోకప్రాప్తికై యజ్ఞములఁ గావించుచుండ నొకకాలంబునఁ గ్రతూద్దిష్టమయి విడువఁబడిన యజ్ఞపశువు వ్యాఘ్రంబుచే భక్షితంబయ్యె. ఈయజ్ఞపశుభంగంబున కనురూపంబగుఁ బ్రాయశ్చిత్తంబు నెవ్వరును జెప్పఁజాలక ఖాండిక్యునికడకుఁ బోయి తెలిసికొని రమ్మని కేశిధ్వజున కుపదేశించిరి.

అపుడు కేశిధ్వజుఁడు ఖాండిక్యునియొద్దకుఁ జని వినయనమ్రుఁడై పశులోపమునకు నిష్కృతిఁ గనుంగొని గురుదక్షిణ గ్రహింపుమని యాతని నిర్బంధించెను. అతఁ డందుల కియ్యకొనక నీ వాత్మవిద్యావిశారదుఁడవు గావున నా కాత్మతత్త్వము నుపదేశించి యీ సంసారబంధమునుండి తొలఁగింపుము. నా కింతకంటె నెద్దియుఁ బ్రార్థ్యతరము గా దని వేఁడుకొనెను. కేశిధ్వజుఁడు ఖాండిక్యునికి యథాప్రార్థితముగా నాత్మవిద్య నుపదేశించి యాతనికుమారునిఁ దోడితెచ్చి తా నపహరించిన రాజ్య మాబాలునికిచ్చి పట్టాభిషేకముఁ జేసెను.

కవి యీకథను లేశమును మార్పలేదు. శ్రీవిష్ణుపురాణమం దెట్టున్నదో అట్లనే వ్రాసియున్నాఁడు.

## పాండ్యరాజుల చరిత్రము

ఈ ప్రబంధములో వర్ణింపఁబడిన మత్స్యధ్వజుఁ డను దక్షిణమధురాపట్టణపురాజు పాండ్యవంశజుఁడు, విష్ణుచిత్తుని సమకాలికుఁడు గావున నీతనికాలమును నిర్ణయించుటయు నీప్రకరణములోఁ బాండ్యులచరిత్రమును గొంత వివరించుటయుఁ బ్రాప్తావసరమని యెంచి యా వృత్తాంతము నిచటఁ బొందుపఱచుచున్నాఁడను.

ఈ పాండ్యవంశపురాజులు మిక్కిలి ప్రాచీనులు. దక్షిణహిందూదేశపు చరిత్రముఁ బట్టిచూడఁగా వీరు క్రీస్తుశకమునకు ముందు నాల్గవశతాబ్ది మొదలుకొని పదునాఱవ శతాబ్ది వఱకు రాజ్యముఁ బాలించినట్లు కానవచ్చుచున్నది. వీరిరాజ్య మొకప్పుడు పూర్వసముద్రతీరము మొదలుకొని పశ్చిమసముద్రతీరమువఱకును, దక్షిణమందు [illegible]కుమార్యగ్రమువఱకును వ్యాపించియుండె ననియు, నిప్పుడు మధుర తిరునెల్వేలి [illegible]టూరు తిరువాన్కూరు లనునవి యారాజ్యములోని వనియు, గ్రీకు [illegible]గు టాలమీ యనువాఁడు చరిత్రములో వ్రాసియున్నాఁడు. ఈ [illegible] యుధిష్ఠిరసోదరుఁడైన అర్జునుఁడు మలయ

ధ్వజుఁడను రాజుయొక్క పుత్త్రికయగు చిత్రకాంత యనెడు కన్యకను బెండ్లియాడె ననియుం, వారుభయులకు జనించిన సంతానమువలన నావంశమునకు పాండ్యవంశ మని పేరొందవె ననియుం నొక ఐతిహ్యముగలదు కాని, యిట్టిపురాణగాథల సత్యాసత్యత్వములను నిశ్చయించుట మనకు శక్యము గాదు. వీనివలన వాస్తవచరిత్రాంశ మేమియుఁ దేలదు. ఏల యన, మనపూర్వులు తాము రచించిన గ్రంథములయందుఁ దమ భాషాపరిశ్రమమును దమకవితాచాతుర్యమును గనఁబఱచుటయందును, వర్ణ్యులగు నాయకులకు లేని మహిమల నారోపించి వ్రాయుటయందు నెక్కువ శ్రద్ధను వహించిరి గాని, వాస్తవచరిత్రమును దెలుపుటయం దుత్సాహముఁ జూపరైరి. అందుచే మన ప్రాచీనగ్రంథములవలన నీపాండ్యుల వాస్తవచరిత్రమును మనము దెలిసికొనఁ జాలము.

Vi cent Smith's "Ancient History of India", Dr. S. Krishnaswamy Aiyangar's "Ancient History of India", Dr. Bhandarkar's "History of the Deccan", Kanakasabai Pillai's "Tamils 1500 Years ago" అనుగ్రంథములవలనను, సింహళద్వీపబౌద్ధుల మహావంశమను గ్రంథమువలనను, ప్రాచీనద్రావిడ వాఙ్మయమువలనను (Ancient Tamil Literature) ప్రథమ [illegible]నుఁడు మొదలుకొని తృతీయ కులోత్తుంగునివరకు రాజ్యమేలిన చోళ దేశపు రాజుల శాసనములవలనను పాండ్యులచరిత్రము సవిస్తరముగాఁ దెలియును.

తాను పాలించుచుండెడి భరతఖండమునందె కాక ఐరోపా మున్నగు విదేశములయందుఁ గూడఁ బరధార్మికుఁడని ప్రసిద్ధిగాంచిన అశోక మహారాజు సుమారు రెండువేల నూటడెబ్బది సంవత్సరముల క్రిందట రాజ్యము చేయుచున్న సమయమం దీతనిరాజ్య మీభరతఖండములోఁ బెద్దభాగ మైయుండుట యేకాక దక్షిణమున మైసూరు రాజ్యమందున్న సిద్ధపురమువఱకు వ్యాపించి యుండెను. అపుడీ హిందూద్వీపకల్పముయొక్క దక్షిణాగ్రభాగము కొన్ని స్వతంత్రరాజ కుటుంబములచేఁ బరిపాలింపఁబడుచుండెను. వానిలోఁ బ్రధానమయినది పాండ్యరాజ్య కుటుంబము. చిరకాలము క్రిందటినుండియుం నీ పాండ్యు లుత్తమ నాగరకు లయియుండి రనుటకు శ్రీరామాయణము మహాభారతము వాయుం మత్స్య మార్కండేయాది పురాణములు ప్రబల ప్రమాణములు. శ్రీరామాయణములోఁ గిష్కింధాకాండము నలువదియవసర్గలో సుగ్రీవుఁడు సీతాన్వేషణార్థమయి దక్షిణదిక్కునకుఁ బంపఁబడిన హనుమదాది వానరపుంగవులతో "తతో హేమమయం దివ్యం ముక్తామణి విభూషితమ్, యుక్తం కవాటం పాండ్యానాం గతా ద్రక్ష్యథవానరాః" అని చెప్పియున్నాఁడు. మహాభారతమునఁ పాండవకనిష్ఠుఁ డగు సహదేవుఁడు సభాపర్వములో ముప్పదియొకటవ [illegible] "తయుయుంథే పాండ్యరాజేన దివసం [illegible] [illegible]ముత్తమాద్యా దా[illegible] [illegible]దు. వసంతము వర్ణింపఁబడియెను.

దక్షిణాం దిశమ్" అను శ్లోకములో పాండ్య రాజుతో యుద్ధముచేసి వానిని జయించినట్లు చెప్పఁబడియున్నది. పూర్వోక్త సపన [illegible] ప్రాచీనత్వముబట్టి యీ పాండ్యులు చిరకాలపు వారనియు బలపరాక్రమైశ్వర్య స [illegible] తెలియవచ్చుచున్నది.

పతంజలి క్రీస్తుశకమునకు ముందు నూటయేఁబది సంవత్సరముల నాఁటివాఁడనియు, కాత్యాయనుఁడు మున్నూట యేఁబది సంవత్సరముల నాఁటివాఁడనియు, పాణిని యేడవశతాబ్దము నాఁటివాఁడనియు పండిత భండారుకారు వ్రాసియున్నాఁడు. ఈపాణినికి సమకాలమునందు భరతఖండముయొక్క దక్షిణాగ్రభాగమునం దార్యులు పైనుండి వచ్చి స్థిరపడినట్లు గ్రంథనిదర్శనములవలనఁ గానవచ్చుచున్నవి. ఏలయన: పాండ్యశబ్ద నిర్వచనము పాణినిసూత్రములలోఁ గానరాకుండుటచేతను కాత్యాయనుని వార్తికములలో గానవచ్చుటచేతను దక్షిణహిందూస్థానముయొక్క వృత్తాంతము పాణినికంటెఁ గాత్యాయనుని కెక్కువగాఁ దెలిసియుండవచ్చునని యూహింపవలసియున్నది. జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్. 4-1-168. దీనిపై వార్తికములు. క్షత్రియసమానశబ్దాజ్జనపదాత్తస్య రాజన్యపత్యవత్; పూరోరణ్వక్తవ్యః, పాండోర్డ్యణ్—తే తద్రాజాః 4-1-174.)

"Katyayana, however, the object of whose aphorisms called Vartikas is to explain and supplement Panini, shows an acquaintance with southern nations. Panini gives rules for the formation of derivatives from the names of tribes of warriors which are at the same time the names of the countries inhabited by them in the sense of "one sprung from an individual belonging to that tribe," and also, it must be understood, in the sense of "King of the country." Thus a man sprung from an individual of the tribe of the Panchalas or the king of the country of Panchala, is to be called Panchala ; a descendant of a Salva or the king of the country of the Salvas, is to be called Salvaya. Katyayana notices here an omission; the name Pandya is not explained by Panini; Katyayana therefore adds, "one sprung from an individual of the tribe of the Pandus or the King of their country should be called a Pandya"

Dr. Bhandarkar's Early History of the Deccan, vi Page.

[illegible] ఆర్యులీ దేశమునకు వచ్చుకాలమునకే వీరిచట స్థిరనివాసులై యుండుటచేఁ [illegible] వీరి ననార్య (Non-Aryans) సంతతివారని వ్యవహరించుచున్నారు. అట్లు [illegible] రు "పండు=పూర్వము అను నర్థమిచ్చు ద్రావిడభాషాపదమునుండి [illegible] శబ్ద [illegible] ఉత్పన్న [illegible] దని వక్కాణించెదరు. ద్రావిడభాషలో [illegible] సమయాన [illegible] టచేఁ గాత్యాయనుని యభి

ప్రాయము సమర్థింపఁబడె నని వేఱుగాఁ జెప్ప నవసరములేదు. ఈ వ్యుత్పత్తివలననే వీ రార్యు లని రుజువుచేయుటకుఁ బుష్కలసాక్ష్య ముండకఁగాఁ బండితు లయినవా రెవ్వరును వీ రార్యేతరు లని చెప్పఁ జాలరు.

సింహళద్వీపమునకు మొదటి రాజైన విజయుఁ డనువాఁడు క్రీస్తుశకమునకు ముందు 478-వ సంవత్సరమందు బుద్ధుఁడు నిర్వాణమునొందినదినమందె సింహళద్వీప మున నోడ దిగి వచ్చెను. ప్రతిసంవత్సరము తా నుపాయనముల నిచ్చుచున్న పాండ్య నృపాలుని పుత్త్రికను బెండ్లియాడె నని మహావంశ మను బౌద్ధగ్రంథమందుఁ జెప్పఁబడి యున్నది. ఈకథలో నిజమేమైన నున్న యెడల పాండ్యరాజ్యము సింహళమునకంటె ప్రాచీనతర మయినదని యిందువలన గ్రహింపనగు. క్రీస్తునకుముందు మూఁడవశతాబ్దిలో గ్రీకురాయబారి యగు మెగాస్తనీసనువాఁడు పాండ్యరాజ్యోత్పత్తినిగుఱించి యొక చిత్రమయిన కథఁజెప్పెను. వాఁడిట్లు వ్రాయుచున్నాఁడు: "తరువాత పాండో వచ్చెను. హిందూదేశములోని దొకటియే స్త్రీచే నేలఁబడుచుండెడిజాలి. హెరకిల్సను వానికిఁ బుత్త్రసంతతి లేదు. ఒక కూఁతు రుండెను. అతఁడు దానియం దధిక ప్రేమగల వాఁడై దాని కొక గొప్పరాజ్య మొసంగెను. ఆమె సంతతివారు మున్నూఱు గ్రామ ములకు నొకలక్ష యేఁబదివేల పదాతి సైన్యమునకు నయిదువందల యేనుఁగులకు నధిపతులయి యుండిరి" పాండ్యరాజ్య స్థాపనమును గురించిన కథకే గ్రీకు దేశపు రాయబారి వికృతమయిన మరియొకపాఠాంతరమును గల్పించె ననుటకు సందియములేదు.

క్రీస్తునకు ముందు రెండవ శతాబ్దియందలి బౌద్ధమతస్థులచిహ్నము లిప్పటికి నీపాండ్యదేశమం దచ్చటచ్చటఁ గానవచ్చుచున్నవి. బౌద్ధభిక్షువు లిష్టదేవతా ధ్యానా సక్తులై సుఖముగ నివసించెడు గుహలు, వానిలో శిలాశయ్యలు నాదేశమం దిప్పటికిని ప్రతిపర్వతమందును గానవచ్చుచున్నవి. సింహళదేశపు బౌద్ధమతబోధకుల బోధనదా ర్ఢ్యముచే నీ పాండ్యదేశస్థు లందఱు నాకాలమందు బౌద్ధమతము నవలంబించిరి. క్రీస్తుశకమునకు ముందు నాల్గవశతాబ్దినుండియు వీరికి సింహళద్వీపవాసులతో సంబంధ ముండుటచే నా నూతనమత సిద్ధాంతముల నెఱిఁగిన వారయి యుండి రని సంభావించు టకుఁ దగిన హేతుసామగ్రి కానవచ్చుచున్నది.

ఈ పాండ్యదేశస్థులు క్రీస్తుశకమునకుముందు మొదటి శతాబ్దినుండి క్రీస్తునకు వెనుక నాలుగవశతాబ్దివఱకును నాగరకతా సంపన్నులైన పడమటి జాతులవారితో ముఖ్యముగా రోమకపురీవాసులతో వాణిజ్యసంబంధము గలిగి యుండిరి. [illegible] ఈజిప్టు, రోము, పారసీకము, అరేబియా, చైనా మొదలగుదేశముల నావ[illegible] [illegible]లకు దక్షిణ హిందూస్థానమం దుండు రేవులకుఁ దఱుచుగ వచ్చు[illegible] [illegible]ష్ణనదీగతము లయిన మౌక్తికములు రో[illegible] [illegible]రములలో [illegible]రుణి [illegible] విక్రయింపఁబడుచుండె నని [illegible] [illegible]మాల్యదా [illegible]మగు, వసంతము వర్ణింపఁబడియెను.

యయుశ్నాఁడు. ముత్యములు సుగంధిద్రవ్యములు, ఆభరణములు మొదలగువస్తువులను రోమకపురీవణిజులు పాండ్యదేశమునుండి కొనిపోయినట్లు ప్రాచీన ద్రావిడ గ్రంథముల యందు వ్రాయ బడి యున్నది.

ఈ పాండ్యులచరిత్ర మింతవఱకును విదేశీయులుచెప్పెడి వృత్తాంతమువలనను, బౌద్ధగ్రంథముల వలనను మనకుఁ దెలియవచ్చినది. ఇటుపైని వీరిచరిత్రము దెలియుటకు ముఖ్యాధారములగు ప్రాచీనద్రావిడగ్రంథంబులఁ గొన్నిటిని పరిశీలింతము. అవి యెవ్వి యన: 1. ఇఱైయనా రగప్పొరుళ్. 2. పత్తుప్పాట్టు 3. పురనానూర్ 4. శిలప్పదికారం. 5. మణిమేకలై మొదలగునవి. వీనిని వ్రాసిన ప్రాచీనకవు లిప్పటివారివలెఁ దమకవితాచాతురిని, కల్పనలను, శబ్దవైచిత్రిని గనఁబఱచుటమాని కేవలము తాము ప్రతిపాదింపఁబూనుకొనిన యంశములయొక్క సత్యతనే వెల్లడిచేయఁగోరి తమకు సమకాలికులు పోషకులు నయిన ప్రాచీనరాజ పుంగవుల వాస్తవచరిత్రమును లోకమందుఁ బ్రకాశింపఁ జేసిరి. ఇట్లు వ్రాసిన ప్రాచీనద్రావిడ గ్రంథకర్తలలోఁ బురుఁబడనరుప్పద మను గ్రంథమును వ్రాసిన కడియలూరు రుద్రంగన్ననారను గ్రంథకర్త సర్వాధికుఁడు. కాని యీగ్రంథము లేకాలమందు వ్రాయఁబడెనో ఆకాలమును నిశ్చయించుటకుఁ దగిన సాధనము లెవ్వియుఁ గానరావు. ఈ యంశమును నిర్ణయించుటకు మనము పై ప్రమాణములను (External Authorities) సాధనముగాఁ జేసికొనవలయును. ఈవిషయమందు మొన్నమొన్నటివఱకు మనకు సహాయ మొనర్పఁదగిన పరికర మేమియు లేకయుండెను. కాని యిటీవల కొలఁదిదినములక్రిందటఁ గ్రొత్తఁగాఁ గనుఁగొనఁబడిన చిన్నమనూరుశాసనములవలనను, వేళ్విక్కుడి శాసనములవలనను పాండ్యదేశాధిపతుల యొక్క వృత్తాంతమును సాకల్యముగాను తృప్తిగాను దెలిసికొనుటకు సమర్థులమయితిమి.

Mr. K. U. Subrahmania Iyer, B.A., M.R.A.S., Christian College Magazine, 1914.

ఇంతియకాక ద్రావిడ మహాభారతమును రచించిన పెరుందేవనా రనునతఁడు పైనిచెప్పఁబడిన ప్రాచీనద్రావిడ గ్రంథములనన్నింటిని సంగ్రహించి యొకచోట జేర్చి వాని కన్నిటికిని వ్యాఖ్యానము నుపోద్ఘాతమును రచించెను. తనపోషకుఁ డగు నందిపోత [illegible] యను పల్లవవంశపురాజు నీతఁడు గ్రంథాదినిఁ జేర్కొనుటచే నీతని కాలము స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఈ పల్లవరాజు నవమశతక ప్రారంభమందు [illegible]జ్య మేలిన ట్లితర ప్రమాణములవలనఁ గానవచ్చుచున్నది. కావున నీయాధారమునుబట్టి [illegible]దాహరింపఁబడిన ప్రాచీన ద్రావిడగ్రంథములకు నాయకు లయిన పాండ్యరాజులలోఁ [illegible]త్తాంతము స్పష్టముగా మనకుఁ దెలియుచున్నది. చిన్నమనూరు వేళ్విక్కుడి [illegible]ందుఁ జెప్పఁబడినవారును ప్రాచీనద్రావిడ గ్రంథములయందు వర్ణింపఁబడిన [illegible] కావున, వీరి వంశానుక్రమణికను వంశవృక్షరూపముగా నిచటఁ

9. నేమ్మంప్ప [illegible]

చిన్నమనూరుశాసనమునందలి రాజులు.

1. అరికేసరిపరాంకుశమారవర్మ
|
2. జటిలవర్మ
|
3. రాజసింహుఁడు
|
4. వరగుణమహారాజు
|
5. శ్రీమారశ్రీవల్లభపరచక్రకోలాహలుఁడు

6. వరగుణవర్మ (A. D. 862.) సింహాసన మెక్కెను.

7. పరాంతకవీరనారాయణశడయను
|
8. ద్వితీయ రాజసింహమారవర్మ.

వేల్వికుడిశాసనము

1. పాల్యగసపై ముదుకుడుమికాలాభ్ర
|
2. కడంగన్
|
3. మారవర్మన్
|
4. సెలియన్ శేందన్
|
5. అరికేసరి అసమసమన్ మారవర్మ
|
6. శదయన్ రణధీర
|
7. తెర్మారన్
|
8. శిడుంజడయన్
|
9. రాజసింహ
|
10. వరగుణమహారాజ
|
11. శ్రీమారశ్రీవల్లభ

12. వరగుణవర్మన్



ఒక పట్టికలోనున్న జటిలుఁడు మొదలుగాఁగల రాజులే రెండవ పట్టికలలోఁ గూడ గానవచ్చుచున్నారు. ఈ చిన్నమనూరు శాసనము రెండవపట్టికలో పదునాల్గవవాఁ డయిన రాజసింహుని కాలములోఁ బుట్టినది. క్రీస్తువెనుక 907-953 సంవత్సరములలో రాజ్యము చేసిన ప్రథమపరాంతకుఁ డొక పాండ్యదేశపురాజును జయించినట్లు చోళదేశపు శాసనములవలనఁ దెలియఁబడుచున్నది. కావున చిన్నమనూరు శాసనములు పదియవ వత్సరశతకమందు వ్రాయఁబడె నని చెప్పవచ్చును. ఈరాజసింహుని పినతండ్రియయిన వరగుణవర్మ యనువాఁడు క్రీస్తుశకమునకు వెనుక 862-వ సంవత్సరమున పట్టాభిషిక్తుఁడయ్యె ననుసంశము వరగుణవర్మయొక్క తమ్మునికుమారుఁడైన రాజసింహుఁడు ప్రథమపరాంతకునిచే జయింపఁబడిన రాజసింహుఁడు నొక్కఁడే యని స్థిరపఱుచుటకు సహకారిగా నున్నది. ఈవరగుణవర్మయొక్క పట్టాభిషేకపు సంవత్సరము మనకుఁ దెలియుటవలనఁ బ్రథమపట్టికలో రెండవవాఁడును, ద్వితీయపట్టికలో నెనిమిదవవాఁడు నైనపట్టియు, జటిలవర్మ యను సంస్కృతనామమును, నెడుంజడయన్ (దీర్ఘమయిన జడలుగలవాఁడు) అనుద్రావిడనామమును గలిగినవాఁడైనట్టిరాజు యెనిమిదవ శతాబ్దము యొక్క మూఁడవ భాగమం దున్నట్లు మన మూహించుకొనవచ్చును. మధుర జిల్లాలోనున్న ఆనైమలై (గజగిరి) అను కొండమీదఁ గట్టఁబడిన నృసింహాలయములో దొరికినదియు, 770 వ సంవత్సరమున వ్రాయఁబడినదియు నైన యొకశాసనమువలన నీ జటిలవర్మ యనువాఁడు నెడుంజడైయ నను వాఁడు నొక్కఁడే యని మనము స్థిరపఱుచుటకు సమర్థులమగుచున్నాము. వైష్ణవమతగురువు లయిన పన్నిద్దరాళ్వార్లలో నొకఁ డయిన మధురకవి యీజటిలవర్మకు మంత్రిగా నుండె ననియు నాతని యధికారమం దీ దేవాలయము కట్టఁబడె ననియు నాశాసనమువలన స్పష్ట మగుచున్నది. వేళ్విక్కుడి దాన శాసనములలోఁ గూడ నీ యంశము లే చెప్పఁబడుచున్నవి.

ప్రథమపట్టికలో శ్రీమారశ్రీవల్లభ పరచక్రకోలాహలుఁ డనియు ద్వితీయ పట్టికలో శ్రీమారశ్రీవల్లభుఁ డనియుఁ జెప్పఁబడిన రాజు క్రీస్తువెనుక 96?-వ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించిన వరగుణవర్మయొక్క తండ్రి. ఇందువలన నితఁడు తొమ్మిదవ శతాబ్దియందున్న వాఁడని మనము నిశ్చయముగాఁ జెప్పఁగలము. గురుపరంపరాప్రభావము, ప్రపన్నామృతము, దివ్యసూరిచరిత్రము మొదలగు శ్రీవైష్ణవ మతగురుచరిత్రములలో నితఁడే శ్రీవల్లభ దేవుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఇతఁడే విష్ణుచిత్తుని [illegible]ళ్వారు) రావించి పరతత్త్వనిర్ణయము జేయించి విద్యాశుల్క గ్రంథి

9. [illegible] ప్రబంధకర్త "తత్పు[illegible]లు పాండ్యకుత్స్యాధ్వజుండు" అని నిర్దేశించి నేమ్ము[illegible] [illegible] [illegible]ము ధ్వజమందు చిహ్నముగాఁ గలవాఁ

డని యర్థము. జనకునికి సీరధ్వజుఁ డనియుం, అర్జునునికి గపిధ్వజుఁ డనియుం ధ్వజచిహ్నము లచే బిరుదములు గలిగిన ట్లీతనికిఁ గూడ ధ్వజమందు మత్స్యచిహ్న ముండుటచే నితఁడు మత్స్యధ్వజుఁ డని వ్యవహరింపఁబడెను. ఇది ప్రకృతమునకు విరోధింపదు. ఈరాజు పేరు వల్లభదేవుఁడు కా దని సమర్థించుట కిది యుపపత్తి కానేరదు. ఈవిష్ణుచిత్తుఁ డాళ్వార్ల కోవలో నాల్గవవాఁడు.

"భూతం, సరస్య, మహదాహ్వాయ, భట్టనాథ, శ్రీభక్తిసార, కులశేఖర, యోగి వాహాన్, భక్తాంఘ్రిరేణు, పరకాల, యతీంద్ర మిశ్రాన్, శ్రీమత్పరాంకుశమునిం, ప్రణతోస్మి నిత్యమ్" ఇది శ్రీవైష్ణవుల గురుపరమ్పరానుసంధాన శ్లోకము. మొదటి ముగ్వు రాళ్వార్లయొక్క కాలమును నిర్ణయించుటకుఁ దగిన చరిత్రాంశములుగాని శాసనములు గాని యెచటను దొరకనందున వారికాలము మనకుఁ దెలియదు. వారు పురాణకథిత పురుషులవంటివారు కాని (Mythical Personages) చరిత్రతో సంబంధించినవారు కారు. కలియుగము నలువదియాఱుసంవత్సరము లయిన తరువాత నీవిష్ణుచిత్తుఁడు జనన మొందినట్లు మతగ్రంథములలో వ్రాయఁబడియున్నది. ఈకాలమును మన మొప్పుకొన్న యెడల నీ విష్ణుచిత్తుఁడు క్రీస్తుశకమునకుముందు మూఁడువేలయేఁబదియాఱుసంవత్సరముల క్రిందట నున్నవాఁడు కావలయును. అట్లయినచోఁ బాండ్య లెక్కడ? వీరి చరిత్ర మెక్కడ? పాణినిసయితము క్రీస్తునకుముందు ఏడవశతాబ్దినాఁటివాఁ డనియుం, ఆసమయ మందే ఆర్యులు దక్షిణ హిందూస్థానమందు స్థిరపడిరనియుం, క్రీస్తువునకుముందు నూటయేఁబది సంవత్సరముల క్రిందటి వాఁడైన కాత్యాయనునిచేఁ బాండ్యశబ్ద నిర్వచ నార్థక మయినవార్తికము వ్రాయఁబడెను గాన నీపాండ్యులప్రారంభము పాణిని కాత్యా యనులకాలమునకు మధ్య నయియుండవలయు ననియుం, డాక్టరు భండారుకారుగారు తన గ్రంథమందు వ్రాసె నని యిదివఱకే చెప్పియున్నాఁడను. మనపూర్వులకుఁ గాలగణన విద్యయందు (Chronology) శ్రద్ధ మంద మని లోఁగడ వ్రాసియుంటిని.

కావున సమకాలికు లగు విష్ణుచిత్త వల్లభదేవు లుభయులు తొమ్మిదవ శతాబ్దమువా రని పై చర్చవలనఁ దేలిన సారాంశమైయున్నది.

ఈ ప్రబంధమును రచించిన కవికిఁ గలిగిన చిత్రమయిన కాల విషయక భ్రాంతిఁ (Anachronism) గనఁబఱచుట కిట్టి కాలనిర్ణయ చర్చాప్రకరణమే సముచిత స్థ[illegible] మని యెంచి యాయంశమునుగూడ నిచట వివరించుచున్నాను.

చతుర్థాశ్వాసములో విష్ణుచిత్తునికథ ముగిసిన తరువాత "ఒక[illegible] మధ్యాహ్న సమయ మాలికారోపణానంతరంబున మందిరంబునకు [illegible]వింప [illegible] ప్రసాదమందస్మిత వళితం బగు కటాక్షంబున [illegible]ంచి పక్షిపుంగవకేత [illegible] కేతన కిట్లనియె."



[illegible]ర్థిం[illegible] [illegible]తమా[illegible]ల్యదా [illegible] మగు, వసంతము వర్ణింపఁబడియెను.

తే. యామునాచార్యుఁ డొక్కఁడు నీమహోత్తముఁ డొక్కఁడును గాదె మన్మతం బుద్ధరించి
రస్మదీయ కృపాతిశయమున ననిన, నిందిరాదేవి తా భర్త కిట్టు లనియె.

క. ఇతనికథ యెఱిఁగినది కా, యతఁ డేమి యొనర్చె ననిన నబ్జాక్షుం డా
శతపత్త్రలనియ కిట్లను, నతివ కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డెలమిన్.

ఆ. అతఁడు చిఱుతవాఁడె యాచార్య కులమున, వేడ్క వేదశాస్త్ర విద్య లభ్య
సించుచుండనపుడు చెలువ యిప్పటిపాండ్య, నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు.

ఈ మొదలగుపద్యములను విచారింపఁగాఁ దేలినయంశ మే మన: విష్ణుచిత్తునివలన నుపదేశమునొంది వైష్ణవమతావలంబి యయిన పాండ్యవల్లభ దేవుని వంశమందుఁ బుట్టిన పూర్వపు రా జొకఁడు శైవమతమందుఁ బట్టుదలగలవాఁడై యుండ నీ యామునాచార్యుఁ డతని కడ కేఁగి తనయుక్తులచే నాశైవమతమును ఖండించి వైష్ణవమతస్థాపన చేసి యారాజును స్వమతమందుఁ గలిపె నని చెప్పుట.

"ఇప్పటి పాండ్యనృపతి" యగువాఁడు వల్లభదేవుఁడు. ఇతఁడును విష్ణుచిత్తుఁడును సమకాలికు లనియు, తొమ్మిదవశతాబ్దియం దున్నవా రనియు పైనిచెప్పఁబడినది. ప్రథమకులోత్తుంగుఁడు (1070–1118), విక్రమచోళుఁడు (1118–1135), ద్వితీయకులోత్తుంగుఁడు (1123-1146) అను ముప్వురు పాండ్యరాజుల రాజ్యపాలన కాలమం దున్నవాఁడును, 1017-వ సంవత్సరములోఁబుట్టి 1137 వ సంవత్సరమువఱకు (120 సంవత్సరములు) జీవించి వైష్ణవమతమును స్థాపించి దానిని వ్యాపింపఁజేసినవాఁడు నైన శ్రీరామానుజమునికి సమకాలికుఁడైన (K. V. Rangaswamy Aiyangar's Ancient History of India) యామునాచార్యుఁడు తొమ్మిదవ శతాబ్దములో జీవించిన వల్లభదేవునికంటెఁ బూర్వుఁడైనయొకరాజుకాలమునం దున్నవాఁ డనుట యెట్లు పొసఁగును? అట్లయినచో యామునార్యుఁడు విష్ణుచిత్తునికంటె మిక్కిలిప్రాచీనుఁడై యుండవలయును. చరిత్రములవలనను, మతగ్రంథములవలన నట్లు కానరాదు. ఇదియుఁనుగాక రామానుజముని ముప్పదిసంవత్సరములప్రాయము గలవాఁడై యుండ యామునార్యుఁడు పరమపదము నలంకరించె నని గురుపరంపరాప్రభావము మొదలుగాఁగల గ్రంథములు చెప్పుచున్నవి కావున, యామునార్యుఁడు విష్ణుచిత్తుని [illegible]ప్రాచీనుఁ డని చెప్పుట కవికృత ప్రమాదము యామునార్యుఁడు చోళదేశమున

8. [illegible]నారాయణపురనివాసి యని లోఁగడఁ జెప్పియుంటిని ఇతనిని వాదమునకుఁ [illegible]గూడ చోళదేశపురాజు ప్రబంధకర్త పాండ్యవంశజుఁ డని చెప్పుట

9. నేమం[illegible]

## విష్ణుచిత్తుఁ డుపన్యసించిన వేదాంతము

విశిష్టాద్వైతమతము రెండుభాగములుగా విభజింపఁబడియున్నది. వానిలో మొదటిది సభలో వాదక్షమ మయి ప్రతివాదులను జయించుటకు సాధనమయి బ్రహ్మసూత్ర భాష్యము, గీతాభాష్యము, ఉపనిషద్భాష్యము, సహస్రనామభాష్యము, సిద్ధిత్రయము మొదలగు ననేక సంస్కృతగ్రంథములచేఁ బ్రతిపాదింపఁబడుచున్నది. రెండవభాగము పూర్వోక్త సంస్కృత గ్రంథంబుల యర్థంబును సాకల్యముగ బ్రతిపాదించు నదియు, స్వగోష్ఠీనిష్ఠములయి కేవల గురుపరంపరా సంప్రదాయ ప్రాప్తంబు లయిన యర్థవిశేషంబులఁ దెల్పు నదియుఁ, భక్తిప్రపత్తిజ్ఞాన వైరాగ్యాదులను వృద్ధిఁ బొందించు నదియు నగు ద్రావిడగ్రంథములచే బోధింపఁబడుచున్నది. ఈవిష్ణుచిత్తుఁ డుపన్యసించిన యుపన్యాసమును బట్టి విమర్శింపఁగా నీ ప్రబంధ కర్తకు సాంఖ్యయోగ మీమాంసాద్వయాది తంత్రంబులయందె కాక, పూర్వోక్తోభయవిధ విశిష్టాద్వైతమత గ్రంథములయందుఁ గూడ నిరుపమాన మయిన పాండిత్య మున్న దని నిస్సంశయముగాఁ జెప్పనగు. ప్రధానకథతో సంబంధము లేకపోయినను ఖాండిక్య కేశిధ్వజ సంవాదముఁ దీసికొని వచ్చి యొక రీతి సంగతిఁ గల్పించి వ్రాసినది కవి తనకు యోగ శాస్త్రమునం దున్న ప్రవేశమును వెల్లడి చేయుటకే యని యూహింపవచ్చును. అట్లే యామునాచార్య చరిత్రమును మాతంగ బ్రహ్మరక్షస్సంవాదమును ప్రధానప్రతిపాద్య మగు గోదాచరిత్రముతో సంబంధము లేకపోయినను సంబంధముఁ గల్పించియె సంస్కృత గ్రంథములయందును గానరాని విశిష్టాద్వైత ద్రావిడమత సంప్రదాయ రహస్యములను బ్రకాశింపఁ జేసియున్నాఁడు. ఇందువలన నీకవి కీమతమందుఁ గల భక్తి విశేషము, నమ్మకము, శ్రద్ధ, పట్టుదల మొదలగునవి స్పష్ట మగుచున్నవి.

ఇఁక, విష్ణుచిత్తుఁ డుపన్యసించిన వేదాంతాంశములను గొంతమట్టునకు విమర్శింతము.

"సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన నీక్షత్యాదివీక్షు నశబ్దవాది
బొరినీశుఁడే నన భోగమాత్రేత్యాదుదాహృతిస్ఫూర్తి మాయావివాది
ఫలియించుఁ గ్రియయనా ఫలమతయిత్యాది సర్వేశుఁ గొనని యపూర్వవాది
శాస్త్రయోనిత్వాదిసరణి నీశ్వరునిఁ దెల్పెడు ననుమాన మన్పీలువాది
తే. నిత్యులం దెల్ల నిత్యుఁడ న్శ్రుత్యురూక్తి, క్షణికసర్వజ్ఞతేశ సౌగతవివాద్వి... యన
ననుపపత్తేర్న యను సూత్రమాదియైన, వా... నృపతీశుఁ బ్రత్యక్ష...

ఈ సీసపద్యములో మొదటిపాద... ర్థింప... రామోత్తూల్యదా... మగు, వసంతము వర్ణింపఁబడియెను.

ప్రకృతి (సకలమునకు కారణము) సత్త్వరజస్తమస్సులయొక్క సామ్యావస్థ (Primordial matter) దీనికే ప్రధానము, అవిద్య, అజ్ఞానము, మాయ అని పేర్లు. దీనినుండి మహత్తత్త్వము (బుద్ధి) దీనివలన నహంకారము (Ego), అహంకారమువలన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలు (Primary Elements), (తన్మాత్ర లనఁగా భూతపంచకముయొక్క సూక్ష్మావస్థ.) పంచతన్మాత్రల వలన పంచభూతములు, కర్మేంద్రియపంచకము, జ్ఞానేంద్రియపంచకము, మనస్సు. ఇవి యిరువదినాలుగు తత్త్వములు కలిగెను. ఆత్మ పురుషాది శబ్దవాచ్యుఁడగు జీవుఁ డిరువదియయిదవవాఁడు. నిత్యబుద్ధశుద్ధస్వభావుఁడు. బంధమోక్షములు లేనివాఁడు. రక్తవస్త్రసంపర్కమువలన శుద్ధస్ఫటికమునకు రక్తిమ కలిగినట్లు, ప్రకృతి సంసర్గమువలన నాత్మ సుఖ దుఃఖాదుల ననుభవించుచున్నట్లు కానవచ్చుచున్నది. ఆత్మకుఁ గర్తృత్వము లేదు. తామరాకు నకు జల మంటనట్లు ఆత్మకుఁ గర్మలేప మంటదు. ప్రకృతి జగత్సర్గముఁ జేయునది; కాని జడము. పంగ్వంధసంయోగమువలన గమనాది వ్యాపారములు సిద్ధించునట్లు, ప్రకృతి పురుష సంయోగముచే సృష్ట్యాది వ్యాపారము లుపపన్న మగుచున్నవి. కావున, అచేతనమయిన ప్రకృతియే జగత్కారణము. దీనికి శబ్దము ప్రమాణము కాకపోవుటచే నాను మానికము కావున నశబ్ద మని సాంఖ్యుల సంకేతము. ఇదియె పురుషునికి భోగ మోక్షముల నిచ్చునది. ఇది సాంఖ్యమతము.

దీని ఖండన మిట్లు చేయఁబడినది.

ఛాందోగ్యములో "సదేవ సోమ్యేదమగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్, తదైక్షత బహుస్యాం ప్రజాయేయ:" ఓయి శ్వేతకేతువా, యీసృష్టికంటె ముందు సచ్ఛబ్ద వాచ్య మయిన వస్తు వొక్కటియే యుండెను. ఆవస్తువు "నేను బహుత్వావస్థ నొందుదును గాక" అని చూచెను (సంకల్పించెను). ఈశ్రుతిలోఁ బ్రయోగింపఁబడిన 'ఈక్షతి' అను ధాతువు అచేతనమయిన ప్రధానమునకుఁ గుదురకపోవుటచేతను, లేక యీయీక్షి అముఖ్య మనుకొన్నయెడల శ్రుతిలోఁ బైన నాత్మశబ్ద ముండుటచేతను, "తన్నిష్ఠస్య ...పదేశాత్" 7. 1. 1. అని, తరువాతి సూత్రములో సదాత్మకత్వానుసంధాన ...నికి మోక్ష ముపదేశించుటచేతను బ్రధానము జగత్కారణము కానేరదు.

## రెండవపాదములో నద్వైతమతఖండనము

5. ...పదార్థం బొక్కటియే సత్యము. జగమంతయు మిథ్య. శుక్తియందు రజ...ను నధిష్ఠానమందు ప్రపంచము మాయచేఁ గల్పింపఁబడినది. జీవ

9. ...

## దీనిఖండనము

బ్ర. సూ. "భోగమాత్రసామ్యలింగాచ్చ 4-4-21. జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ 4-4-19. సోశ్నుతే సర్వాన్కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా" ఇత్యాది శ్రుతిసూత్ర వాక్యములచే ముక్తునకు బ్రహ్మయాథాత్మ్యానుభవ రూప భోగమునందే బ్రహ్మసామ్యము ప్రతిపాదింపఁబడుట వలనను, జగత్సృష్ట్యాది వ్యాపారములలో ముక్తుని కెంతమాత్రము బాధ్యత లే దని శ్రుతి వక్కాణించుట వలనను, బ్రహ్మకంటె జీవునికి భేదము సిద్ధించుచున్నది.

## మూఁడవపాదములోఁ బూర్వమీమాంస మతఖండనము

ఈమతమందుఁ బ్రపంచకము సత్యము. జీవులు నిత్యులు. అనంతములు. వేదము లపౌరుషేయములు. వేదవిహితమయిన యాగాదికర్మల నొనరించుటచేఁ గలిగిన అపూర్వము (సుకృతఫలము) ఆత్మలకు స్వర్గము నిచ్చును. చిరకాలార్జిత పుణ్యవిశేషముగల జీవులే యీజగత్తును సృజించుచున్నారు. ఇంద్రాయస్వాహా, వరుణాయస్వాహా ఇత్యాదులయందుండు చతుర్థ్యంత ప్రతిపాదితమైన దేవతయే బ్రహ్మము. వేఱె ఈశ్వరు నొప్పరు.

## దీనిఖండనము

ఫలమత ఉపపత్తేః, 3. 2. 37. యాగ దాన హోమాదులచేతను, ఉపాసన చేతను ఆరాధితుఁడైన పరమపురుషుఁడే ఐహికాముష్మిక భోగములను స్వస్వరూపావాప్తిరూపమైన మోక్షము నిచ్చువాఁడుకాని యచేతనమయిన అపూర్వమున కట్టి శక్తి లేదు. "అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ", "యాంతి మద్యాజినోపి మామ్" అని భగవద్గీతావాక్యము.

## నాల్గవపాదమందు తార్కిక మతఖండనము

తార్కికుఁ డీజగమునకుఁ బరమాణువు లుపాదానకారణ మనియు అనుమానికమైన ఈశ్వరుఁడు నిమిత్తకారణ మనియు, సంసార మనాది యనియు, ఈశ్వరోపాసన సుఖదుఃఖప్రయత్నజ్ఞానేచ్ఛాదులు పూర్ణముగా నశించుటయే ఆత్మకు మోక్ష మనిఁ వక్కాణించెను. తార్కికులముక్తి పాషాణముక్తి; అనఁగా నాత్మ మోక్షదశయం జ్ఞానాది రహితమయి పాషాణమువలె నుండు ననుట.

## దీని ఖండనము

శాస్త్రయోనిత్వాత్, 1. 1. 3 ... తెలిసికొనుటకు శాస్త్ర ... గలవాఁడై యుండుటవలన) భగవంతు ... [illegible] ... మగు. వసంతము వర్ణింపఁబడియెను.

ప్రమాణములవలనఁ బరబ్రహ్మము తెలియఁ బడఁడు. అనుమానమువలన నొకరీతియైన కర్త తెలుసుగాని, అట్టివాఁడు నిత్యుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వశక్తి, అకర్మవశ్యుఁడునై యుండక పోవచ్చును. కావున సకలేతరప్రమాణాసాధ్య సమస్తవస్తు విజాతీయుఁడు, సార్వజ్ఞ్య సత్యసంకల్పత్వా ద్యనవధికోదార గుణసాగరుఁడు, నిఖిల హేయ ప్రత్యనీకుఁడు నగు పరబ్రహ్మ శాస్త్రమువలననే సిద్ధించును గాని, యితరప్రమాణములవలన సిద్ధింపఁడు.

## బౌద్ధమతఖండనము

బౌద్ధుఁ డీ జగము పరమాణుసంఘాతమయి ప్రత్యక్షసిద్ధ మయిన దనియు, ప్రతి క్షణము జ్ఞానము మాఱుచుండు ననియు, వేఱొక ఆత్మ లే దనియు, స్థిరత్వబుద్ధి సంసార మనియు, క్షణికత్వబుద్ధి మోక్ష మనియుఁ బార్థివతైజసాప్యవాయవీయపరమాణువులు పరస్పరము మిళితములయి పృథివ్యప్తేజోవాయువులను సృజించుచున్న వనియుఁ, అప్పృథివ్యాదులనుండి శరీరేంద్రియ విషయరూపసంఘాతము లుద్భవిల్లు చున్నవనియు, సర్వ సంస్కారములు క్షణికము లను జ్ఞానమువలన మోక్షము సిద్ధించు ననియుఁ జెప్పుచు న్నాఁడు.

## దీని ఖండనము

ఉత్తరకాలిక ఘటము పుట్టినప్పుడు పూర్వకాలిక ఘటము నష్టమయినందున నభావ మన్నిటికి హేతు వగుటచే, సర్వఘట్టములు సర్వకాలములయందు నుత్పన్నములు కావలసివచ్చును. నిన్నటిదినమందు మన మవలోకించిన గోవ్యక్తిని మరల నీదినమందుఁ జూచి నిన్నటిగోవని యానవాలు పట్టుచున్నాము. జగత్తులో నుండు సర్వపదార్థములు క్షణికములే అయిన యెడల నిట్టి ప్రత్యభిజ్ఞానశక్తిలోకులకు లేకపోవలసి వచ్చును. అందువలన లోకప్రవృత్తి జరుగదు. కావున బౌద్ధమతమందు క్షణికత్వము కుదురదు.

సీ. “ఆదినారాయణుం డాయె నొక్కఁడ బ్రహ్మ లేఁడు మహేశుండు లేఁడు లేదు
రోదసిలేఁడు సూర్యుఁడు లేఁడు చంద్రుఁడు లేవు నక్షత్రము ల్లేవు నీళ్లు
లే దగ్ని యట్లుండ లీల నేకాకిత చనదు పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొచ్చి యని ఛాందోగ్యంబు దెలిపెడునంతరాదిత్యవిగ్ర
తే. నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుట, కక్షిణీయని యష్టదృక్క్ర్యక్ష దళశ
తాక్షవిధిరుద్రశక్రాదులందు నొకఁడు, కామి శాస్త్రుతియే విలక్షణతఁ దెలిపె.”

ఈపద్యమందు “ఏకో హవై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః”, “నతత్ర [illegible] భాతి నచన్ద్రతారకం, నేమావిద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః” (సృష్టికంటె [illegible], రుద్రుఁడు, సూర్యచంద్రాదిగ్రహములు, తారకలు మొదలుగునవి లేవ [illegible] యుండె ననియు, “స ఏకాకీ న రమేత” (ఆ పర

బ్రహ్మ యగు నారాయణుఁ డొంటిగా నుండలేఁ డనియు) "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" (నేను పెక్కుర య్యెద నని ఆతఁడు సంకల్పించె ననియు) "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" (దానిని ఆ ప్రపంచకమును సృజించి దానిలోఁ జొచ్చె ననియు) నర్థ మిచ్చు శ్రుతులు మొదటి నాలుగు పాదములయందు వివరింపఁబడినవి.

పద్య శేషముచే 'అంతరాదిత్యవిద్య" తెలుపఁబడియె 1. 121 సూ. "అంత స్తద్ధర్మోపదేశాత్" సూర్యమండలాంతర్వర్తియై యుండెడువాఁడు పుణ్యవిశేషము గల గరుడోరగ యక్షగంధర్వాదులలో నొకఁడా? లేక రుద్రుఁడా? యని వెనుక సూత్రములయందు శంకించి యీసూత్రమునకు విషయ వాక్యమయిన శ్రుతి "ఆదిత్య మణ్డలాన్తర్వర్తిని" అపహతపాప్మత్వాదివిశిష్టుఁ డనియు గంభీరాంభస్సముద్భూతసుమృష్ట నాళరవికర వికసిత పుండరీకదళామలాయతేక్షణుఁ డనియుఁ జెప్పుటచే నధికాత్మీత్వ విరూపాక్షత్వ విశిష్టులయిన బ్రహ్మ రుద్రేంద్రాదులకు చెల్లదని నిషేధించెను.

"మ. తుల లేకుండు స్వరూపరూపగుణభూతుల్ దోఁచె నేత్రచ్ఛవిక్
దలమై లోపలఁ దానె యున్కి దెలిపె న్నారాయణం బారుణం
బుల సామాన్యవిశేషరీతి నిఖిలంబు న్శబ్దజాలంబు ని
ర్మలనారాయణశబ్దమందు నె తుద న్పర్యాప్తమయ్యెన్ శ్రుతిన్."

ఈ పద్యములో "యచ్చకించి జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అను తైత్తిరీయోపనిషచ్ఛ్రుతి వివరింపఁబడెను.

రామానుజ బ్రహ్మసూత్ర భాష్యనిర్వాహము మఱియొకటి పద్యశేషంబునఁ బ్రతిపాదింపఁబడియె. ఎట్లన:

"పశునా యజేత" (పశువుచే యజ్ఞముఁ జేయువలయును) అను దానిలోని పశువు యజ్ఞమందు వినియోగింపవలయు నని సంశయ మొదవఁగా, "ఛాగస్యవపాయా మేదసః", "ఛాగో వా మన్త్రవర్ణాత్" అను పూర్వమీమాంసాన్యాయము ననుసరించి సామాన్యవాచకమయిన పశుశబ్దమునకు విశేషవాచకమైన ఛాగ (మేఁక) మర్థ మయినట్లు ఉపనిషత్తులలోఁ గారణవాక్య ప్రతిపాదితము లయిన "సద్బ్రహ్మాత్మాది" సామాన్య శబ్దములకు దేవతాంతరభ్రాంతి జనకములగు "శివశంభు హిరణ్యగర్భాది" శబ్దములకును "అపహతపాప్మాదివ్యో దేవ ఏకోనారాయణః" అను శ్రుత్యుక్త విశేషవాచకమగు "నారాయణ" పదమందు పర్యవసానము.

"తొల్లి జామదగ్నిభయంబునఁ బరిత్యక్తరాజ్యుండై" ఇత్యాది [illegible] రామానుజసూత్ర భాష్యాంశములు పెక్కులు [illegible] వివరింపఁబడినవి. [illegible] సిద్ధాంతమున కాధారభూతములు.

[illegible] పారిం[illegible] [illegible]మాల్యదా

[illegible]మగు. వసంతము వర్ణింపఁబడియెను.

బృహదారణ్యకోపనిషత్తులో పంచమాధ్యాయ సప్తమ బ్రాహ్మణమందు:—

"యః పృథివ్యాం తిష్ఠన్...యస్య పృథివీ శరీరమ్"

"యోఽప్సుతిష్ఠన్...యస్యాపశ్శరీరమ్"

"యోఽగ్నౌతిష్ఠన్...యస్యాగ్నిశ్శరీరమ్"

"య ఆదిత్యేతిష్ఠన్...యస్యాదిత్యశ్శరీరమ్"

"య ఆత్మని తిష్ఠన్ ..యస్యాత్మాశరీరమ్"

ఇత్యాది వాక్యము లనేకములు గలవు. పరబ్రహ్మ సర్వచిద చిద్వస్తువుల కంత ర్యామిగా నుండుటచే "సర్వం ఖల్విదం బ్రహ్మ, ఐతదాత్మ్యమిదం సర్వం, అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా, జగత్సర్వం శరీరం తే తత్సర్వం వై హరే స్తనుః" ఇత్యాది శ్రుతిస్మృతిప్రామాణ్యములంబట్టి చేతనాత్మక సర్వజగము పరబ్రహ్మకు శరీరము. భగవంతుఁడు శరీరి. శరీర వాచక శబ్దములు లోకములో శరీరిని బోధించుట మన మెఱుఁగుదుము. ఎట్లన: దేవదత్తుడు పరుగెడుచున్నాఁ డనుచో దేవదత్త శబ్దము శరీర మునకుఁ బేరుగాని ఆత్మకుఁగాదు. ఆత్మ రహితముగా దేవదత్త శరీరమునకు ధావన ముప పన్నము గాదు. కావున దేవదత్తుని యాత్మకుఁగూడ చెల్లును. అట్లే కౌషీతకీబ్రాహ్మణోక్త ప్రతర్దనవిద్యయందు దివోదాసాత్మజుఁడైన ప్రతర్దనుఁ డనువాఁ డింద్రుని యొద్దకుఁబోయి "త్వమేవ మే వరం వృణీష్వ, యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" (ఏది నీవు మనుష్యునికి మిక్కిలి హితమయినదని తలంచెదవో దానిని నీవే నాకుఁ గోరి పెట్టుము.) అనిప్రార్థింపఁగా "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా", తం మా మాయు రమృత మిత్యుపాస్స్వ" (నాజీవుని అమృతమాని యుపాసించుము) అని ఇంద్రుఁ డుపదేశించెను. ఇచట నింద్ర జీవశబ్దనిర్దిష్టుఁడు కేవలజీవుఁడా? లేక పరబ్రహ్మమా? యని చర్చ రాఁగా నీశ్రుతియొక్క ఉత్తరవాక్యమునందు "ఆనందోఽమృతోఽజరః" అని జీవుని కసంభావితము లయిన ఆజరత్వామృతత్వాదు లుపన్యసింపఁబడుటచే నింద్రజీవ నిర్దిష్టుఁడు "ఇంద్రజీవశరీరకుఁ డైన పరమాత్మగాని కేవలజీవుఁడు గాదని తాత్పర్యము. ఇది యనుభవ విరుద్ధము గాదా? ఎక్కడనైన నిట్టి యుపదేశ ముండునా యనఁగా:—

"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" సూ. 31.1. 1. ఇట్టి యుప నింద్రుఁడు తొంటి వామదేవునివలె శాస్త్రదృష్టిచేఁ జేసెను. "మా ముపాస్స్వ" శబ్దముచే బరమాత్మోపదేశము విరుద్ధముకాదు. ఎట్లన; తొల్లి పరమాత్మ డైనవామదేవుఁ డను నొకఋషి స్వాత్మశరీరకుండైన పరమాత్మను

 నేమంస్ [illegible] జ్ఞా[illegible] [illegible]కక్షీవంతుఁడను విప్రర్షినయితి" నసెను.

విధి శివ పావక వ్యాస భాను భార్గ వార్జున విత్తేశాది దేవతలు భగవచ్ఛరీర భూతు లయిన సహంకారయుక్తజీవుల నధిష్ఠించి యుండుటచే ముముక్షువుల కను పాస్యులు.

"పితాచ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారోయమాత్మాచ భోక్తాచాద్యమనూదితః" అని జీవునికి ఈశ్వరునకు నవవిధ సంబంధము లున్నవని విశిష్టాద్వైతసంప్రదాయము.

## ఖాండిక్య కేశిధ్వజ సంవాద విమర్శనము

ఆ. ఆత్మగాని మేన నాత్మబుద్ధియును న,స్వంబునందు మిగుల స్వత్వమతియు
నవనిపర యవిద్య యను మహాతరవు ను,త్పత్తికీద్వయంబు విత్తుమొదలు. 3. 65.

విష్ణుపురాణము 6 అంశము. 7 అధ్యాయము.

అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వే స్వ మితియామతిః,
అవిద్యాతరుసంభూతి బీజమేతద్ద్విధాస్థితమ్.

ఆ. ప్రాణికోటికెల్ల బంధంబు మోక్షంబు, చేరుటకును మనసు కారణంబు
విషయసంగియైన విను బంధకారి ని,ర్విషయమైన ముక్తి విభవకారి.

మనఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః,
బన్ధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం మనః. వి. పురా.

దిగువ వ్రాయఁబడిన శ్లోకములకుఁ బైపద్యములు సరియైన యనువాదము.

## యోగము

యోగ మనఁగాఁ జిత్తముయొక్క రజస్తమోవృత్తులను నిరోధించుట. దీనికి యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనియెనిమిది అంగములు. వీనిలో ధారణాదులు సమాధికి సాక్షా దుపకారములు; అహింసా స్తేయ సత్యాదులు ప్రతిపక్ష భూత హింసాద్యుస్థాలన ద్వారముగా సమాధి కుపకారకములు.

యమములు:—అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము.

పరుల నెవ్విధమునను హింసింపకుండుట అహింస ; యథార్థకథనము సత్యము ; ఒరులెఱింగినఁగాని యెఱుఁగకుండినఁగాని పరద్రవ్యమును హరింపకుండుట అస్తేయము ; జితేంద్రియత్వము బ్రహ్మచర్యము; దేహధారణ కపేక్షితమైనదానికంటె [illegible] స్వభోగముకొఱకు స్వీకరింపక పోవుట అపరిగ్రహము.

నియమములు:—శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, [illegible] ప్రణిధానము.

[illegible] అమోక్షమాల్యదా [illegible] మగు. వసంతము వర్ణింపఁబడియెను.

శౌచము బాహ్య మని అభ్యంతర మని రెండువిధములు. మృజ్జ లాదులచే శరీర క్షాళనము బాహ్యశౌచము; మైత్రీ, ముదిత, కరుణ, ఉపేక్ష అను నాల్గు భావనలచే చిత్తమలమును బోనడచుట అంతర శౌచము ; ప్రాణధారణ మాత్రముచేఁ దుష్టినొందుట సంతోషము; శీతోష్ణ సుఖదుఃఖాదుల సహించుట తపస్సు ; ప్రణవాభ్యాసము స్వాధ్యాయము. సర్వకర్మల నీశ్వరునియందు సమర్పించుట ఈశ్వరప్రణిధానము.

స్థిరసుఖముఁ గలుగ జేయునది ఆసనము.

శ్వాసప్రశ్వాసముల గతినిరోధము ప్రాణయామము.

ఇంద్రియములను బాహ్యవిషయములనుండి మరలించుట ప్రత్యాహారము.

హృదయకమలమందు ధ్యానింపఁబడు శుభాశ్రయమును దీర్ఘ కాలము నిలుపుట ధారణము.

తైలధారావదవిచ్ఛిన్నస్మృతి సంతానముతో శుభాశ్రయమును జింతించుట ధ్యానము.

అతిస్వచ్ఛమయిన చిత్తవృత్తియొక్క ప్రవాహరూప మయిన ధ్యానమే అర్థస్వరూపముగా నిర్భాసించుట సమాధి యనంబడును.

ఇట్టి అష్టాంగయోగం బభ్యసించు యోగికి, భావనాత్రయ వియుక్తం బయిన బ్రహ్మస్వరూపంబె ధ్యేయంబు.

భావనాత్రయ మనఁగఁ గర్మభావన, బ్రహ్మభావన, ఉభయభావన, అనునవి. కర్మభావన యనఁగాఁ గర్మల నాచరింపవలయు ననెడియుద్దేశము. బ్రహ్మభావన యనఁగాఁ బ్రహ్మము నుపాసించుట కుద్దేశము. ఉభయభావన యనఁగాఁ బూర్వోక్తోభయమందు నుద్దేశముఁ గలిగియుండుట సనందనాదులు బ్రహ్మభావనాపరులయ్యును బ్రాక్కల్పంబుల సంచరించినవా రగుటచేభావనాబద్ధులే గాన యోగికి ధ్యేయులుఁ గారు. హిరణ్యగర్భాదు లుభయభావనాబద్ధులు గావున వారును ధ్యేయులు గారు.

> "ద్వేరూపే బ్రహ్మణస్తస్య మూర్తం చామూర్తమేవ చ,
> క్షరాక్షరస్వరూపే తే సర్వభూతేషు చ స్థితే.
> విష్ణుశక్తిః పరా ప్రోక్తా క్షేత్రజ్ఞాఖ్యా తథాపరా,
> అవిద్యా కర్మసంజ్ఞాన్యా తృతీయా శక్తి రిష్యతే.
> యయా క్షేత్రజ్ఞ శక్తిస్సా వేష్టితా నృప సర్వగా,
> సంసారతాపానఖిలానవాప్నోత్యతి సంతతాన్."

శ్రీవిష్ణుపురాణము ఖాండిక్యకేశిధ్వజసంవాదము 6 అ.

9. నేమంగ... [illegible] ...యమును జెప్పుటకు పరబ్రహ్మమగు విష్ణువుయొక్క

శక్తి యని చెప్పఁబడెడి రెండు రూపములను మూర్తామూర్త విభాగముతోఁ దెలియఁజేసి, మూఁడవశక్తి కర్మ మనెడి యవిద్యచేత నావరింపఁబడిన యచేతనముతోఁ గూడిన క్షేత్రజ్ఞుఁ డనెడి మూర్తవిభాగము భావనాత్రయముతోఁజేరి యుండుటచే నశుభ మని చెప్పి కర్మ మనెడి యవిద్య లేనిదియయి అచేతనముతోఁ జేరకయుండి జ్ఞానమాత్ర స్వరూప మైన అమూర్త మనెడి రెండవవిభాగము యోగము సిద్ధించినవారలచే ధ్యానింపఁబడఁదగినది కాదని నిషేధించి ప్రధానాది విశేషాంతచేతనాత్మక ప్రపంచభావం బగు స్థూలరూపం బుపక్రాంత యోగునకుఁ జింతింపశక్యం బని చెప్పఁబడినది.

సీ. "శ్రీవిష్ణు నీగతి జింతింప వలయు" నను నీ పద్యమందు యోగాభ్యాసముఁ జేయుపురుషుఁడు భగవంతుని యీ విధమున ధ్యానింపవలయు నని యుపదేశింపఁబడి యున్నది

మొదట నొక అవయవమును ధ్యానింప దొడఁగి అది ధారణలో స్థిరపడిన పిదప మఱియొక అవయవమును ధ్యానింపవలయును. అది వశమయిన వెనుక నింకొకటియుం నిట్లె క్రమక్రమముగా ధ్యేయమూర్తి అంతయుం దా నేయవస్థలో నున్నను చిత్తమందు స్థిరముగా నిలుచునట్లభ్యాస మొనర్పవలయును. ఈ యంశము శ్రీమద్భాగవతమున ద్వితీయస్కంధములో ద్వితీయాధ్యాయమునందుఁ జెప్పఁబడినది.

8 శ్లో. "కేచిత్స్వదేహాన్తర్హృదయావకాశే ప్రాదేశమాత్రం పురుషం వసంతం,
చతుర్భుజం కంజ రథాంగ శంఖ గదాధరం ధారణయా స్మరంతి.

9 శ్లో. ప్రసన్నవక్త్రం నలినాయతేక్షణం కదంబకింజల్కపిశంగవాససమ్,
లసన్మహారత్నహిరణ్మయాంగదం స్ఫురన్మహారత్నకిరీటకుండలమ్,
ఈక్షేత చింతామయమేవ మీశ్వరం యావన్మనోధారణయావతిష్ఠతే.

13.శ్లో. ఏకైకశోఽంగాని ధియానుభావయే త్పాదాది యావద్ధసితంగదాభృతః,
జితం జితం స్థానమపోహ్యధారయే త్పరంపరం శుద్ధ్యతి ధీర్యథాయథా.

శ్లో. విభేదజనకే జ్ఞానే నాశ మాత్యంతికం గతే,
ఆత్మనో బ్రహ్మణోభేద మసంతం కః కరిష్యతి"

విష్ణుపురాణము. 6-7 అ.

(భేదముఁ గలిగించు జ్ఞానము బొత్తిగా నశింపఁగా నాత్మకును బ్రహ్మకును లేని భేదము నెవ్వఁడు గల్పించును) పై నుదాహరింపఁబడిన సీసపద్యముయొక్క [illegible] గీతియం దీ శ్లోకార్థ మీరీతిగ వివరించియున్నాఁడు.

"సురాది భేదసంజనకాజ్ఞానమేదఁ బిదప, నలము కల్యాణగు[illegible] [illegible]ధివింతౌ [illegible] దనకు, లేని భేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు."

[illegible] మాల్యదా[illegible]మగు, వసంతము వర్ణింపఁబడియెను.

## విశిష్టాద్వైతమతసంగ్రహము.

ఈమతమందు చిత్తు (జీవుఁడు), అచిత్తు (ప్రకృతి), ఈశ్వరుఁడు అని తత్త్వములు మూఁడు.

చిత్తు:—అనఁగా జీవస్వరూపము శరీరేంద్రియాదులకంటె విలక్షణము. జ్ఞానానంద మయ మయినది నిత్యము. అణు పరిమాణము. ఈశ్వరునికి నియామ్యము. శేషము నయినది. మోక్షదశయం దీశ్వరసాధర్మ్యము నొందునది.

అచిత్తు:—దీనికిఁ బ్రకృతి యనియు, మాయ యనియుం, అవిద్య యనియుం నామాంతరములు గలవు. ఇది జడము. వికారాస్పదము. భగవదిచ్ఛచే నానావిధముగాఁ బరిణమించును. భగవంతునికిఁ గ్రీడాపరికరభూతము సంసారమున కిదియ మూలము.

ఈశ్వరుఁడు:—ఇతఁడు నిత్యుఁడు, నిఖిలహేయప్రత్యనీకుఁడు, సకలకల్యాణగుణాకరుఁడు. జగత్సర్గస్థితి సంహారకర్త. చేతనాచేతనముల కంతర్యామి. పైని చెప్పఁబడిన చిదచిత్తు లతని కపృథక్సిద్ధ విశేషములు (వేఱుగాని విశేషణములు) కారణావస్థయందు (సృష్టిలేని కాలమందు) పరమాత్మ సూక్ష్మావస్థ నొందిన యీ చిదచిత్తులచే విశిష్టుఁడై యుండును. కార్యావస్థయందు (సృష్టికాలమందు) స్థూలావస్థనొందిన చిదచిత్తులచే విశిష్టుఁడై యుండును. కావున నిట్టి ఉభయవిధ మయిన పరమాత్మునైక్యము బోధించుటచే నీ సిద్ధాంతమునకు విశిష్టాద్వైత మని పేరు.

ఈశ్వరుఁ డఖిల పదార్థములకు నంతర్యామి యై యుండుటచేఁ బైని వ్రాయఁబడిన ప్రకారముగా శరీర శరీరి భావ నిబంధన సామానాధికరణ్యముచే సర్వశబ్దవాచ్యమగుటకు సిద్ధించుచున్నది. పరము, వ్యూహము, విభవము, అంతర్యామి, అర్చ యని ఈశ్వర స్వరూప మైదు విధములు. జ్ఞానము, భక్తి. ప్రపత్తి, ఆచార్యోపసత్తి అను నివి మోక్షసాధనములు ''శ్వపచోపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః,'' ''విప్రాద్ద్విషడ్గుణయుతా దరవిందనాభ పాదారవింద విముఖాచ్ఛ్వపచం వరిష్ఠం, మన్యే తదర్పిత మనోవచనేహితార్థప్రాణః పునాతి సకులం నతు భూరిమానః'' ఇత్యాది ప్రమాణవచనములచే జ్ఞానభక్తివైరాగ్యములు గలవాఁ డెట్టివాఁడైన నాదరణీయుఁడను నంశము గవి చండాల బ్రహ్మరథుస్సంవాదమందుఁ గనఁబడుచెను. ముఖ్యముగా నీయంశము నుదాహరించుటకే యీకథ యీప్రబంధ మందు వర్ణింపఁబడిన దని యూహించెద. [illegible]వ్రాయఁబడిన విశేషాంశము లన్నియు నీప్రబంధమున నచ్చటచ్చటఁ బూర్ణముగాఁ [illegible]న్నవి.

9. [illegible]లన నీగ్రంథకర్తకు విశిష్టాద్వైత మతమందుఁ గల భక్తివిశ్వాసములు, [illegible]నేమయిన జ్ఞా[illegible] మొదలగునవి వెల్లడి యగుచున్నవి.

## ప్రబంధకథాపురుషుల శీలవర్ణనము

## (CHARACTER-DELINEATION)

తాను రచించిన నాటకములయం దాయా ప్రకరణముల కను గుణములయిన రసములతోఁ బాత్రల యొక్క లక్షణములను గుణదోషములను శీలమును లోకస్వభావ మునకు సరిపడునట్లు వర్ణించి సామాజి కాంతఃకరణవృత్తులను శోకభయాది రసవీచి కలలో ముంచుట కాంగ్లేయ కవులు సమర్థులు. వారిలో ముఖ్యముగా షేక్స్పియర్ (Shakespeare) మహాకవియుఁ నుత్సాహమును శ్రమను చాతుర్యమును బూని నట్లు మనవారిలో నాంధ్రకవులె కాక, ప్రసిద్ధులయిన సంస్కృత కవులు గూడ నిట్టిపనికిఁ బ్రయత్నించినవారు కారు. కావ్యనాటకాదులయందు వర్ణింపఁబడు స్త్రీ పురుషపాత్రలు నిజముగా నెట్టివారైనను వారితలయం దలంకార శాస్త్రములో నేర్పరుపఁబడిన లక్షణములు గల ఖండితాది నాయికాత్వమును ధీరోదాత్తాది నాయకత్వము నారోపించి గతాను గతికముగా వారినిఁజూచి వీరు, వీరినిఁజూచి వారువర్ణించుచు తమకుఁ గవిత్వమందు గల శక్తిని జూపుటతప్ప, నాయికలకును నాయకులకును దక్కిన పాత్రలకును వారి చర్యను బట్టి విలక్షణస్థితి నీయఁ జాలరు. కవితా మాధుర్యచాతుర్యములకుఁ బ్రసిద్ధికెక్కినవని వ్యవహరింపఁబడు సంస్కృతనాటకములు నాటికలు నొక తీరుననే వ్రాయబడినవి. రాజశేఖరుఁడు వ్రాసిన విద్ధసాలభంజిక, శ్రీహర్ష కృతములయిన రత్నావళీ ప్రియదర్శికలు, రాజ చూడామణి దీక్షితుని కమలినీకలహంసయుఁ, గాళిదాసుని మాళవికాగ్నిమిత్ర మును బోలి యున్నవి. వీనిలో వీని కే విషయమందును లేశమయిన వైలక్షణ్యము గాన రాదు. ఇరుగుపనండి మల్లికామారుతము భవభూతి విరచితమాలతీమాధవమునకును, మురారి అనర్ఘరాఘవము మహావీరచరిత్రమునకును పాఠాంతరము లని నమ్మఁదగు. ఒకటి చదివినచో నింకొకటి నిస్సారముగా నగపడును. అట్లే మన తెలుఁగు ప్రబంధ ములుగూడఁ జాలమట్టుకు నీతిని ధర్మమును బోధించు కథా సందర్భముగాని, వర్ణ్యనా యకుల శీలవర్ణనగాని లేనివి యయి యున్నవి. వానిఁగూర్చిన కవులందఱు నేకరీతిగాఁ దమకు స్వప్నమందు సాక్షాత్కరించిన పరదేవతయొక్క ఆజ్ఞచేఁ గావ్యరచనకుఁ దొడం గితి మని ప్రతిజ్ఞచేసి తమ కిచ్చి వచ్చిన వర్ణనల కెడమిచ్చునేదో యొకగుణీ భూతము[illegible] కథను దీసికొని దానియందు పురమును, చాతుర్వర్ణ్యమును, పుష్పలావికాజ[illegible] పురాధిపతిని, ఋతువులను, నాయకుని, ఆనాయకుఁడు జూచి మోహించిన స్త్రీ[illegible] వారి పరస్పరానురాగమును, తుదకు వారి వివాహమును వర్ణించి[illegible] ముగింతురు. దీని కుదాహరణముగాఁ గూచిమంచి తిమ్మ కవిరచించిన [illegible]

[illegible]మగు. వసంతము వర్ణింపఁబడియె

రామము. రెంటూరి రంగరాజు భానుమతీ పరిణయము, కాకమాని మూర్తి రాజవాహన విజయము మొదలగువాని పై యాక్షేపణను లోబడిన వనుటకు సందియము లేదు. ఈ కవుల వ్రాతలలో సంవాదము (Harmony) పరస్పరానుగుణ్యము (Proportion) మృగ్యములు. దీని కుదాహరణముగా నొకదానిం జెప్పెద వినుఁడు. కూచిమంచి తిమ్మకవి రచించిన రుక్మిణీపరిణయములోఁ గథానాయికి యగు రుక్మిణి కృష్ణసంప్రాప్తి కొఱకత్యంతార్తి గలది యయి కృష్ణుని శీఘ్రముగాఁ దోడి తెమ్మని పంపిన విప్రకుమారుఁడు ద్వారకకుఁ బోవు మధ్యమార్గంబున నొక శివాలయముం బొడగాంచి యందుండు శివుని దండకాదులతో దీర్ఘముగ స్తుతించినటుల వర్ణింపఁబడి యున్నది. గ్రంథకర్త తానెంత శివభక్తుఁడైనను శివస్తుతిచేసి తనభక్తి ప్రకర్షను గనఁబఱచుట కిదియా సమయము? ఇది ఔచిత్యసంపాదక మగునా? నాయక ప్రాణవల్లభుని సంశ్లేషముకొఱకుఁ బరమోత్కంఠిత యయి యొక త్రుటికాలము నొక యుగముగాఁ గడుపుచు వెతల గుందుచున్నతఱిని బ్రియుని సందేశము నతిత్వరలోఁ దెచ్చి యామె విరహబాధను శమింపఁజేయుట సమయోచితముగాను రసోచితము గాను గన్పట్టును. విచారించిన నిట్టి వెన్నియో ప్రబంధములయందుఁ గలవు. గ్రంథవిస్తర భీతిచే వ్రాయ నుడిగితిని.

ఏది యెట్లున్నను బూర్వోక్త దూషణగంధవర్జితము లయిన గ్రంథములు మనలోఁ గొన్ని లేకపోలేదు. మితముగా నున్నవి. ఆంధ్రకవులకందఱకు ననుకార్యము నుదాహరణభూతము నగు నాంధ్రభారతములో మనుష్యుల నిజమయిన జీవనము, స్వభావము, వారి తలంపులు చక్కఁగా వర్ణింపఁబడినవి. దానిమార్గము ననుసరించిన కొందఱు మహాకవులు నటులే వ్రాసిరి. శ్రీనాథుఁడు, పెద్దనార్యుఁడు నకలంకమయిన చరిత్రము, దృఢవ్రతము, యోగ్యతయుఁగల మహాపురుషులను (Characters) పాత్రములుగా సృజించిరి. శ్రీనాథుఁడు హరవిలాసములో శివుఁడు జంగమవేషము ధరించి చిఱుతొండరాజునొద్దకుఁ బోయి వాని నిశ్చల భక్తిని పరీక్షించుటకు "నీకుమారునిఁ జంపి వానిమాంసమును భక్షించుటకు నాకి"మ్మని యడుగఁగా, నారాజు దృఢవ్రతము నవలంబించి వెనుదీయక పుత్రునిఁ జంపి యాజంగమున కిచ్చెను. ఆహా! యీ రాజెట్టి మహానుభావుఁ డనవచ్చును? ఎంతదైవభక్తియున్నను నిట్టిపనిఁ జేయుట దుష్కరముకదా?

పెద్దనార్యుని స్వారోచిషమనుసంభవమందు వర్ణింపఁబడిన ప్రవరాఖ్యుఁడు నట్టి ... తుఁడే. తపస్స్వాధ్యాయనిరతుఁడు, నిత్యాగ్నిహోత్రి, దేవాతిథిపూజాపరాయణుఁడు, ... తుఁడు. ఇట్టి సద్గుణకదంబమునకు శిరశ్శేఖరం బగు నింద్రియ సంయమమును ... తాస్వాదో విస్మృతజఘనాం కో విహాతుం సమర్థః, అను నట్లు లోకోత్తర



నైష్ఠికు దివ్యాప్సరస మోహించి మీఁదఁ బడఁగా మనస్సునందు కామవికార

మునకు లేశము నెడమియక చిత్తదార్ఢ్యముగలవాఁడై పరాఙ్ముఖత నొంది మీఁదు మిక్కిలి స్వగాత్రము తచ్ఛరీర సంస్పర్శచే దూషితమయ్యె నని దిగులొంది శుద్ధజల స్నానపూతుఁడై యింటికిఁ జనెను. అతఁడు "తా సుతే వ్యవ్యనా సక్తస్సాత్మా ధ్వర్గోన రాకృతిః" అను శ్లోకమున కుదాహరణభూతుఁడు.

ఏతత్ప్రబంధకర్తయుఁ బూర్వోక్తమహాకవుల మార్గమునే యవలంబించి విశిష్టాద్వైతమతగురు చరిత్రమునుండి కొందఱు మహాశయులను దీసికొని వారిగుణగణమును, సచ్చరిత్రమును జక్కఁగాఁ జిత్రించి యున్నారు.

అట్టివారిలో నగ్రగణ్యుఁడు విష్ణుచిత్తుఁడు ఇతని భగవద్భక్తి, కైంకర్యధురంధరత్వము, భాగవతజనసపర్యాశ్రద్ధయు మిక్కిలి శ్లాఘనీయములు. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేశ్చలనకారణం, ఉపదేశాద్ధరిం బుద్ధ్వావిరమేత్సర్వకర్మసు" అనునట్లు శాస్త్రవాదంబులను మాని తొల్లిరహూగణుం డను సౌవీరదేశపు రాజున కాత్మజ్ఞానం బుపదేశించిన జడభరతునిభంగి, పరులచే దుర్విభావ్యం బయిన జ్ఞానసంపత్తి గలవాఁడై పరమ పదంబునందు సయితము ముక్తుఁ డనేక దేహంబులఁ బరిగ్రహించి భగవత్కైంకర్యమే సలుపుచుండుం గావున, భగవత్పరిచర్య సేయుటయ పరమ పురుషార్థం బని నిశ్చయించి, శ్రీవిల్లిపుత్తూరు (నవ్యధన్విపురము) వటపత్రశాయిస్వామికి మాలాకారునివలె మాలికా కైంకర్యంబు సేయఁ దొడంగె.

"క. న్యాయార్జితవిత్తంబున, నాయోగీశ్వరుఁడు వెట్టు నన్నం బాప్రా
లేయపటీరాచలప, ద్యాయాతాయాతవైష్ణవావలికెల్లన్." 1. ఆ. 79.

అవిష్ణుచిత్తుఁ డుత్తరము మొదలుకొని దక్షిణమువరకు వచ్చుచుఁ బోవుచుండెడి శ్రీవైష్ణవులకుఁ దాను న్యాయముతో నార్జించిన ధనమును వ్యయపఱచి ఆతిథ్య మిచ్చువాఁడు.

శా. "అవిష్ణునిధి గేహసీమ నడురే యాలించినన్ప్రోయం నెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్వానము నాస్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్యమన్మాటలున్" 1. ఆ. 84.

ఆవిష్ణుచిత్తునిగృహమం దర్ధరాత్రివేళచని వినినను భగవద్గుణానుసంధానము, దివ్యప్రబంధానుసంధానము, కూరలు లేవు, భక్ష్యములు లేవు, అన్నసౌకర్యము లేదు, భవించి వేడిగా లేదు, భాగవతులారా, మీరు నాయందుఁ గృపచే నారగింపుఁ డని విష్ణుచిత్తుఁడు చెప్పెడు నుపచారవాక్యములును వినవచ్చెడివి.

వటపత్త్రశాయి యాతనిఁ బిలిచి "నీవు పాండ్యరాజు సభకుఁ జని పండితులతో వాదించి మనవిశిష్టాద్వైతసిద్ధాంతమును స్థాపించి రమ్మని యాజ్ఞాపింపఁగా నీతఁ డొసంగిన సవినయప్రత్యుత్తరము వేనోళ్లఁ బొగడఁదగి యున్నది.

శా. "స్వామీ నన్ను నితఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధు నా
రామక్ష్మాఖననక్రియాకరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు న్భవద్భవనదాసు న్వాదిగాఁ బంపుచోఁ
భూమీభృత్సభ నోటమైన నయశంబు న్నీకు రాకుండునే. 2. ఆ. 81.

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరు ల్నీలీలకుం బాత్రముల్." 2. ఆ. 82.

మొదట విష్ణుచిత్తుఁ డింత వినయమును, స్వాజ్ఞతను, స్వనైచ్యమును గనఁబఱచి మాటలాడినప్పటికిని, కొనకు రాజసభలో నీతఁడు గొప్ప వక్తృత్వముతో సకలశాస్త్రముల నుపన్యసించి వాదములోఁ బండితులఁ గెలిచి స్వమతమును స్థాపించె నని చెప్పుటలో సంభవించిన స్వవచనవ్యాఘాతమును (Inconsistency) కవి "దేవుఁ డనుగ్రహించి యితని కింత శాస్త్రజ్ఞానముఁ గలిగించె" నని చెప్పుటచేఁ దొలఁగించుకొనెను.

తన పుత్త్రికయైన ఆముక్తమాల్యద రంగనాథునియం దనురాగము గలది యయి విరహవేదనచే బాధనొందుచున్నపు డీమెయవస్థను వటపత్త్రశాయితో వర్ణించి చెప్పిన మాటలవలన నితఁడు కేవలము భగవత్కైంకర్యనిమగ్నమానసుం డనియు, నవిదిత విషయాంతరుం డనియుఁ స్పష్ట మగుచున్నది.

ఈమె జన్మకథారహస్యము మనకుఁ దెలియదు. కవి యీమె శీలమునంత పరిణమింపఁ జేయలేదు. తక్కిన కవులు తమతమ ప్రబంధములయందు వర్ణ్యలైనస్త్రీల యౌవనము వర్ణించిన ట్లీతఁడు నీమె యౌవనమును వర్ణించెనుగాని యీమె చిన్న నాఁటి యాటపాటలను ముద్దు పల్కులను వర్ణింప లేదు. క్రమముగా నీమె ప్రాప్తయౌవన యయి విష్ణువునం దనురాగము గలది యయి తన యంతఃకాంతాతిశయమును చెలులతోఁ [illegible]ప్పుటను, తనవలె నతనియం దనురక్త లయిన స్త్రీల నందఱ నాశ్రయించి యవతారముల [illegible]ందుఁ బూర్ణమనోరథలం జేయలేదని యాతని దూఱుటను, కవి మిక్కిలి సొగసుగా [illegible]న్నాఁడు. కొన కీమె మనోరథానుగుణముగా శ్రీరంగనాథునిం బెండ్లియాడెను. [illegible]మెను హఠాత్తుగాఁ దనలోనికిఁ దీసికొనినపుడు తండ్రి యేడువసాగెను.



నేమంతునియం దాసక్తచిత్తురా లయిననుఁ జిన్ననాఁటనుండి పెంచి సకల

విధముల సంరక్షించిన తండ్రివిషయ మయి తగినవిశ్వాసమును జూపించినట్లు కానరాదు. ఇది యొక్కటియె యీమెయం దుండు లోపము. ఈమె భూదేవియొక్క యవతార మని చెప్పఁబడుచున్నది. అట్టి దేవతోచితమయినశీలము కవి యీమెయం దున్నట్లు వర్ణింపలేదు.

## ఖాండిక్యుఁడు

ఖాండిక్యుఁడు తనరాజ్య మపహరించి త న్నరణ్యమున కంపిన పరమశత్రు వగు కేశిధ్వజుఁడు పశులోపమునకుఁ బ్రాయశ్చిత్త మడుగ నిల్లు జొచ్చుకొనిరాఁగాఁ దన మంత్రిపురోహితాద్యాప్తజనులు,

"క. పాలుగలవాఁడు మన కొక, జాలియిడక తానె తారసానకు వచ్చెక్
వేళయిదె లెమ్మునృప కృప, చాలు స్గారాతు మేపి చంపకు ప్రజలన్." 3 ఆ. 32.

"క. అతనిపనిఁదీర్చి రాజ్యం, బ్వితయము నినుఁ జేరు సెట్టి వెఱువున సైనన్
క్షితిపులకరిజయముధనో,న్నతియుఁ బ్రజానీతిరక్షణము ధర్మంబుల్." 3 ఆ. 35.

క. "అన్యాయంబున దుస్సహ, మన్యుం డగు ప్రబలరిపుని మడియించిన ధ
ర్మన్యక్కృతి కగునిష్కృతి, సన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్." 3 ఆ. 36.

అని వానిని జంపవలయు నని బోధించినను వినక,

"క. పరలోకసుఖము శాశ్వత, మరయ మహీరాజ్యసౌఖ్య మల్పాసేవాళ
పరిభోగ్యంబిందులకై, దురితము కావించి తొలఁగుదునె పరమునకున్" 3 ఆ. 49.

"క. బద్ధాంజలిపుటుదీరక్, శ్రద్ధఁ దన మఱుఁగు సొరఁగఁ గూల్చుట కడుకీ
దుద్ధతి పరలోకార్జన, బుద్ధికి నను కణ్వవాక్యములు దలఁచరొకో." 3 ఆ. 50.

తనమంత్రుల కీరీతిని బ్రత్యుత్తర మిచ్చి కేశిధ్వజునికి దర్శన మిచ్చి యాతఁ డడిగిన దానికి ననుకూలముగా సదుత్తర మొసంగి పంపెను. ఇట్లు శత్రువు దనచేతఁ జిక్కినపుడు వానిని క్షమతోఁ జూచుటయే గాక మఱింత వాని కుపకార మొనర్చుట సామాన్యుని లక్షణమా? ఇతఁడు మహానుభావుఁడు; వీతరాగుఁడు; ఐహికము దపేక్ష లేనివాఁడు; మహాజ్ఞాని. ఇతని శీలసంపద మిక్కిలి స్తవనీయము.

## కేశిధ్వజుఁడు

కేశిధ్వజుఁడు ఖాండిక్యునిపట్ల నుపకారస్మృతి గలవాఁడై తా నపహరించిన యాతనిరాజ్య మాతని కుమారున కిచ్చి నీబుఱుఁ డయ్యెను. ఇదియును స్తోత్రార్హమే.

## మాలదాసరి

మాలదాసరి, మున్ను వామనుఁడు నివసించిన సిద్ధాశ్రమమున కావ్వ దున్న యొక పల్లెటూరిలో జీవించువాఁడు. ఇతఁడు, జాతిచే జండాలుఁ

నంబనచే నధికుఁడు. పరిశుద్ధాంతఃకరణుఁడు, పరమభాగవతోత్తముఁడు, నిరంతర భగ వద్గుణానుసంధానపరుఁడు. తనను బ్రహ్మరాక్షసుఁడు మ్రింగుట కుద్యమించినపుడు నిర్భ యుండై స్వప్రాణవ్యయముఁగూడ సరకుగొనక,

"అ. హీన జన్మమఋట యెవ్వఁడే ప్రాణి, సంతసిలుంట ముక్తి పొంతగనుట

మేలె కాదె శిబియు మేల్బంతిగాఁడె న,శ్వరపుదేహమున్మి పరముఁగొనుట." 6. అ. 39.

అని జవాబు చెప్పెను. తాను రాక్షసునితోఁ జేసిన ప్రతిజ్ఞాప్రకారము మరలి వచ్చి భక్షింపు మని తనశరీరమును రక్కసుని కొసంగెను. పరులకొఱకుఁ దమదేహ మర్పించిన శిబి, నాగానందనాటక నాయకుఁ డైన జీమూతవాహనుఁడు, కపోతము, మొదలగు మహామనీయులలో నితనిఁగూడఁ జేర్పవలదా? ఇతఁడు తనకుఁ బ్రాణాపాయముఁ దలంచిన వానికే స్వార్జిత పుణ్యఫలముఁ గొంత ధారవోసి యుత్తీర్ణునిఁ జేసె. ఇది మఱింత ప్రశంసనీయము.

## పాండ్యరాజు

వేశ్యాగృహంబునకుఁ జనుచున్న పాండ్యరాజు పరదేశబ్రాహ్మణుఁడు చదివిన "వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్" అను శ్లోకమును విన్నతోడనే జాతవైరాగ్యుఁడై పరమార్థ చింతలేక యూరక కాలముగడపుచున్న తనస్థితిని దలంచుకొని నిర్వేదమునొంది వెంటనే పరతత్త్వనిర్ణయముకొఱకు సభగావింపఁ బ్రయత్నించె నని కవి వ్రాసియున్నాఁడు. ఇంత మహా విభవ సంపత్తిలోఁ దులఁదూఁగుచు నైహికభోగలంపటుఁడై యున్నవానికి శ్లోకశ్రవణ మాత్రమున విరక్తి జనించి భగవదుపాసనయం దాభిముఖ్యము కలిగె నని చెప్పుట యాశ్చర్యకరముగాఁ గానవచ్చును. కాని, భగవత్కటాక్షమూలముగాఁ గల్గి నచోఁ గల్గవచ్చును.

యామునాచార్యుఁడు వైష్ణవునిగా నొనర్చిన శైవపాండ్యరాజు భార్య మఱియొక సుశీల. ఈమె చాతుర్యము మిక్కిలి కొనియాడఁ దగినది లోకములో దంపతు లిరువురు విరుద్ధమతావలంబులు. విరుద్ధ మనోవృత్తులు నయినచోఁ బరస్పరాను రాగ ముండుట దుర్ఘటము. ఈమె యటువలెఁగాక తన భర్త అపమార్గమం దుండె నని చింతిల్లుచు,

"వింగడంబైనట్టి ముంగిట నెలకొన్న బృందావనికి మ్రుగ్గుఁ బెట్టుదాన

5. ...నాఁ డేకభక్తముఁ జేసి యవలినాఁ డోర్చి జాగరముతో నుండునిట్రు

...పోనీదు పైనిద్రఁ బొఱుటక్కలువాడు మత్పుణ్యకథలఁ ద్రోయం

9. నేమంపుమూనాళ్లు కామింప దధినాథు నుఋనాఁడు కన్నను మనసు దనియ

తే. సారజపువస్నెఁ బ్రతిసెజ్జకరుగుఁ గూర్మి,నరుగుచో నాభిఁ దుడిచి కప్పురపునాభి
బెట్టు నిట్టులుమన్భక్తి పుట్టియుండు నిఁ,జేళు నెడభక్తి చెడకుమదిష్టమగుట." 4 ఆ. 50.

అను పద్యమునందుఁ జెప్పఁబడినట్లు తన నియమములను నెఱవేర్చుకొనుచు భర్తృపు ప్రతురా లయి మెలఁగుచు రహస్యమందు యామునాచార్యుని వృత్తాంతం బాతని కెఱిఁగించి యతని రప్పించి మెల్లగ రామానుజమతమునకుఁ ద్రిప్పెను. కవి యీామె పాతివ్రత్యమును బాగుగ వర్ణించెను.

## కథ

ఈ ప్రబంధములోఁ బ్రధాన ప్రతిపాద్యము గోదా విష్ణుచిత్తుల కథ. గోదా దేవికథనుబట్టి "ఆముక్తమాల్యద" అనియు, విష్ణుచిత్తునికథనుబట్టి "విష్ణుచిత్తీయ" మనియు నీగ్రంథమునకు నామద్వయ మబ్బినది. తక్కిన ప్రబంధములయందు వలెఁ బూర్వోత్తర సందర్భములతో ననుస్యూత మయి యవిచ్ఛిన్నమగు నొక కథ కాదు. శ్రీ విష్ణు పురాణాంతర్గత ఖాండిక్య కేశిధ్వజ సంవాదము, వరాహపురాణస్థమాతంగ బ్రహ్మరక్షస్సంవాదము, గురుపరంపరాప్రభావ (శ్రీవైష్ణవుల ద్రావిడమతగ్రంథము) గత మయిన యామునాచార్యచరిత్రము నను నీమూఁడు కథలకుఁ బ్రధాన కథతో నెంత మాత్రము సంబంధము లేకపోయినను గవి యొకరీతి సందర్భమును గల్పించి ప్రబంధ ప్రతిపాద్యమగు ముఖ్యకథతో నతికెను. వీనిలో మొదటికథ యగు ఖాండిక్యకేశిధ్వజ సంవాదమందుఁ గవి మార్పు లొనర్పకపోయినను కొస రెండు కథలలోఁ దనయిచ్ఛ వచ్చినటులు మార్చి యేయే ప్రకరణములయందెట్లు వ్రాయవలయునో అట్లాయాయి ప్రకరణములందు రసౌచిత్యమును భావౌచిత్యమును, గనఁబఱచి తనకు సర్వతంత్రముల యందున్న నిరంకుశ జ్ఞానమును బ్రకాశింపఁజేసినాఁడు. ఆయాయికథలయొక్క మార్పులను నేనీవ్యాసముయొక్క మొదటనే చూపితిని. కవి ప్రబంధీకరించిన యీకథ కేవలము మతవిషయక మయినది. వేదాంతమత సిద్ధాంతమునందుఁ బరిచయము లేని వారి కీకథాసందర్భ మంతగా రుచింప దని నాయభిప్రాయము. చదువురాని విష్ణుచిత్తుని పండితసభలో గెలిపించుట, అమనుష్యసంభూత యయిన కన్యకను బెండ్లియాడుట మొదలగునవి లోకాతిగము లయిన దైవకర్మలు. ఇట్టివానిలో విశ్వాసము లేనివారీ ప్రబంధ ప్రతిపాద్యాంశముయొక్క మర్మములను గ్రహింపఁజాలరు.

## ప్రబంధశైలి, గుణములు, దోషములు

ఆంధ్రవాఙ్మయములో నింతప్రౌఢప్రబంధ మిదియ కాని మఱేదియు[illegible] వ్యంగ్యప్రధానమయిన ఉత్తమకావ్యము. దీనిలో నంగముగా శృంగా[illegible] లనుప్రవిష్టము లయియున్నను ప్రధానరసము శాంతరసాంతర్భూత భక్తిరసము. కవన

పాకము ప్రచురముగా నారికేళపాకము. అచ్చటచ్చట ద్రాక్షాపాకస్ఫురణముగల పద్యములును విరళముగాఁ గన్పట్టుచున్నవి. ఇందలికల్పనలు వర్ణనలు నత్యద్భుతములు, నపూర్వములు. అన్యకవిసజాతీయకల్పనలు వెదకినను గాన రావు. శైలి ఓజోగుణభూయిష్ఠము. ఓజ స్సనఁగా దీర్ఘసమాసము లను గలిగియుండుట. ఓజోగుణలక్షణమును గుఱించి ఆచార్యదండి కావ్యాదర్శమం దిట్లని జెప్పియున్నాఁడు.

"ఓజస్సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్, పద్యే ఽ ప్యదాక్షిణాత్యానా మిద మేకం పరాయణమ్. తద్గురూణాం లఘూనాం చ బాహుళ్యాల్పత్వమిశ్రణైః, ఉచ్చావచప్రకారం తద్దృశ్యమాఖ్యాయి కాదిషు ఇతి పద్యేఽపి పౌరస్త్యా బధ్నంత్యోజస్వినీర్గిరః, అన్యేత్వనాకు లం హృద్య మిచ్ఛంత్యోజోగిరాం యథా." 1 - 80, 81, 83.

(ఓజ స్సనఁగా సమాసప్రాచుర్యము. ఇదిగద్యమునకుఁ బ్రధానము. గౌడరీతి నవలంబించుకవులు పద్యమునందుఁగూడఁ దీని నుపయోగింతురు. హర్షచరిత్రాద్యాఖ్యాయికలయం దిది బాహుళ్యాల్పత్వ విశిష్టములయిన గురు లఘు వర్ణములయొక్క పరస్పర సంమేళనమువలన ననేకప్రకారములుగా వ్రాయఁబడుచున్నది. కాని, మఱికొందఱు దీర్ఘ సమాస మెప్పుడును శీఘ్రార్థప్రతీతికి భంజకము కావున, తాము రచించు సమాసములను నాతిదీర్ఘములుగా, అనుద్ధతవర్ణోపేతములుగా, సహృదయ మనోరంజకముగాను వ్రాయుదురు.)

మొదటఁ జెప్పఁబడిన ఓజోలక్షణ మీ కవిపద్యములయందుఁ బూర్ణముగాఁ బట్టినది.

ఉదాహరణము:—

శా. " కాంచె న్సైన్యము దర్ధయోజనజటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాటచరన్మరుత్త్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛనో
దంచత్కీటకృతవ్రణచ్ఛలన లిప్యాపాదితా ధ్వన్యని
స్సంచారా త్తమహోఘఘోపమఫలస్ఫాయద్వటక్ష్మాజమున్." 6. ఆ. 15.

కవిత్వసరణి వైదర్భమార్గము, గౌడమార్గ మని రెండు విధములు. వానిలోఁ ప్రసాదము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత్వము మొదలగు గుణములతోఁ గూడినది వైదర్భమార్గము. దీనికి విపర్యయ మయినది గౌడమార్గము.

"ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని, శ్లిష్టమస్పృష్ట శైథిల్య మల్పప్రాణాక్షరోత్తరమ్, అనుప్రాసధియా గౌడై స్తదిష్టం బన్ధగౌరవాత్" అనుప్రాసము మొదలగు శబ్దాలంకారములు దీనిలోఁ గాన రాకున్న, బంధగాఢత్వమును బట్టిచూడఁగా

పైని వ్రాసిన లక్షణముగల గౌడరీతి నవలంబించె నని నిస్సంశ యముగాఁ జెప్ప వచ్చును. ప్రసాదమాధుర్యాది గుణములతోఁ గూడిన పద్యములును కాదాచిత్కముగాఁ గానవచ్చుచున్నవి.

ఉ. “ఎక్కడి రాజ్యవైభవము లెక్కడి భోగము లేటిసంభ్రమం
బక్కట బుద్బుదప్రతిమ మైన శరీరము నమ్మి మోక్షముం
జిక్కఁ గణింపకుంటి యుగసంధుల నిల్పియుఁ గాలుచేతి బల్
ద్రొక్కుల నమ్మనుప్రభృతులుం దుద రూపఱకుండ నేర్చిరే.” 2. ఆ. 78.

వసుచరిత్రకారునికివలె శ్లేషయమకానుప్రాసాది శబ్దాలంకారములయం దీకవి కిష్ట మున్నట్లు కానరాదు. అర్థాలంకారము లగునుపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, అపహ్నుతి, అర్థాంతరన్యాసము, పరిసంఖ్య మొదలగువానిని విశేషముగా వ్రాసి యున్నాఁడు.

అనేక నిఘంటువ్యాకరణసహకారముచే నిరూఢ మగుసంస్కృతభాషా పాండిత్యముగలవారికిఁ గాని సామాన్యజ్ఞానము· గలవారికిఁ గాని వర్ణనలతోను గల్పనలతోను గూడుకొన్న పద్యములు దుర్జ్ఞేయములు. కథాభాగమును దెలుపు పద్యములు గొన్ని సామాన్య జ్ఞానముగలవారి కర్థమగును. మహాకావ్యమున కపేక్షితము లయిన పురచాతుర్వర్ణ్యరాజ ఋతు వివాహాదివర్ణన లిందులో నున్నవి. గ్రీష్మవర్షాశరద్వసంతము లిందులో వర్ణింపఁబడినవి. ఇన్ని ఋతువులు మఱి యేప్రబంధమందును వర్ణింపఁబడి యుండలేదు. చంద్రసూర్యోదయాదివర్ణనలు లేవు. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయమందును, పింగళిసూరన రాఘవపాండవీయమందును, పుష్పగిరి తిమ్మన సమీరకుమారవిజయమందును, తక్కు కవులు తక్కు ప్రబంధములందును ఋతువర్ణన జేసిరిగాని, యిట్టి యత్యద్భుతకల్పన లెందును గానరావు. కల్పనలయందును సంస్కృతభాషాప్రాచుర్యమందును దాదాపుగా దీనికి సరివచ్చునది చంద్రికాపరిణయ మొక్కటియే యని యూహించెద.

దీనిలో ద్వివిధ మగు శైలి కానవచ్చుచున్నది. వర్ణనలో నుపయోగింపఁబడిన బంధకార్కశ్యముగల శైలియొకటి; ఉదాహరణము,

శా. “తారుణ్యాతిగచూత నూత్నఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబువృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్.”

2. ఆ. 68. ఇత్యాదికము.

ప్రకరణానుకూల సౌలభ్యముగలది యయి రసవంత మయి కథాభాగమును జెలుప్ప నపుడు కవిచే నుపయోగింపఁబడునది మఱియొకటి.

దీని కీ దిగువవ్రాసిన పద్యములే సాక్షి.

చ. "గగనము నీరుబుగ్గ కెనగా జడిపట్టిననాఁటి భార్యక
న్నొగసొరకుండ నారికెడపుంబొఱియల్లవులించి వండ న
య్యగపల ముంచి పెట్టు గలమాన్నము నొల్చిన ప్రపునాలుగే
న్బొగిపిననూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగున్ ఘృతప్లుతిన్."    1. ఆ. 80.

మ. "గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారవల్యంకికా
వహానంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్."    2. ఆ. 91.

రామరాజభూషణుఁడు, కాకమానిమూర్తి, పువ్వుగిరితిమ్మన, కంకంటిపాపరాజు మొదలగువారి కవనము సంస్కృతశబ్దబహుళముగా నున్నదిగాని యీగ్రంథకర్తవలె నింత గాఢసంస్కృతము నెవ్వరును వాడుక చేయలేదు. ఈయంశమున కీ ప్రబంధమంతయుం నుదాహరణమయి యుండినను నొకటి రెండు పద్యములను నిచట గనఁబఱచుచున్నాఁడను.

"సీ. స్యందనస్థితబిడౌజశ్శత్రుజాడ్యకృజ్ఝంఝామరుద్గరుజ్ఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్రకసదసృగ్గాహనస్ఫుటశల్యహవ్యభుక్చాత్కృతములు
యోధవర్మితహృత్స్ఫుటోత్క్రాంతనిజపాతసాలాశ్మకృతముహుస్థాత్కృతములు
పతితోగ్రరథశకబంధభారభృశార్తిభుగ్నభోగఫణీంద్ర ఫూత్కృతములు

"తే. శ్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు, దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుఁ గాత లంకాపురాంగణాంబరచరత్కలంబకదంబకములు."

"శా. అర్థావాగ్విబుధ మ్మహోవచన కవ్యాహార మాహోవచ
స్సిద్ధమ్మాకృత తాంగతః కలిరితి శ్రీసూక్తి విద్యాధర
మ్మిద్దౌద్ధత్య మగా ల్లయం హి కుధియామిత్థంవదత్కున్నర
మ్మద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునందయ్యె న్నభమ్మంతయున్."    4 ఆ. 6.

సీ. ...చని కాంచె న్విరజాభిధాంతరవపుస్సహోద్యద్భవాతీరనం
...నవాటీవలయద్రుమావళి దళాంతర్వర్త్యహా పాళిభం
9. జనచాంపేయ సుమాయమాన విమమస్వర్ణావృతిప్రాత ర
శ్మి నభస్స్పృక్శిఖరాళి దీపకళికాశృంగంబు శ్రీరంగమున్."    6. ఆ. 91.

ఈ ప్రబంధకర్త న్యాయవైశేషికములందును, పూర్వోత్తర మీమాంసల యందును, సాంఖ్యయోగ తంత్రములయందును, నిరంకుశపాండిత్యము గలవాఁ డని ఋజువుచేయుఁట కీప్రబంధమే నిదర్శన మని యిదివఱకే వ్రాసియున్నాఁడను.

"తే. ......ఎండ్రి రవిఁ జేర మూఁడవయెడకుఁ జేరు
తరణిధరణిం బ్రమోదసంధాయి గాఁడె." 4 ఆ. 77.

"మ. మునుపే చంద్రబలంబుగల్గి మలయంపుంగమ్మలేగాడ్పు దే
రున నేతెంచు లతాంతబాణునకు సూర్యుఁడు స్వహింగ్రోత్తగా
ననుకూలించె ....." 5. ఆ. 101.

ఈపైనివ్రాసిన వాక్యములంబట్టి యాలోచింపఁగా నితనికి జ్యోతిశ్శాస్త్రమందుఁ గూడఁ బ్రావీణ్య మున్నట్టు కనవట్టుచున్నది.

ఈకవి యిట్టిసర్వతంత్రస్వతంత్రుఁ డైనను గ్రంథమం దచ్చ టచ్చటఁ గొన్ని స్ఖలితముల నొనరించుట కెద్దియు నుపపత్తి కానరాదు. "ప్రమాదో ధీమతా మపి" అను న్యాయ మున్నదికదా? ఇందుకిరణ సందోహమందు డిందుకందువలె గుణబాహుళ్యమందు దోషలేశమున్ను నడఁగిపోవును. ఏతాదృశాల్పదోషము లిట్టి యుత్తమ కావ్యశోభకు భంజకములు గానేరవు.

పాండ్యరాజు సభలో విష్ణుచిత్తుఁడు విపక్షులను జయించుటకు జేసిన ఉపన్యాసములో,

" సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన నీశుత్యాదిపీశు నశబ్దవాది,
బోరి నీశుఁ డేనన భోగమాత్రేత్యాద్యుతావ్యాప్తి స్ఫూర్తి మాయావివాది
... ... ... ... ...

ఇచట రెండవపాదములో "భోగమాత్ర సామ్యలింగాచ్చ" (4 అ. 4 పా 21 సూ.) అను సూత్రముచేత, మాయావాది ననఁగా నద్వైతుని ఖండించె నని కవి చెప్పుచున్నాఁడు. ఈసూత్రము రామానుజ బ్రహ్మసూత్రభాష్యములో జగద్వ్యాపార వర్జాధికరణములోనిది. ఆ యధికరణముయొక్క తాత్పర్య మేమనఁగా ముక్తినొందిన జీవుని కీశ్వరునకువలె జగత్సృష్ట్యాది వ్యాపారముల నొనరించుటకు శక్తి కలదా లేదా యని శంకించుకొని "ఈశ్వరుని కొక్కనికే జగత్సృష్ట్యాదులను జేయుటకు శక్తి కలదు గాని, అట్టిపనులలో ముక్తజీవుని కెంతమాత్రము వంతు లేదని సిద్ధాంతీకరించిరి. "భోగమాత్ర సామ్యలింగాచ్చ" అను సూత్రముచే పైనిచెప్పఁబడిన యర్థమే బలపఱుపఁబడెను. ఎట్లనః ముక్తునికి బ్రహ్మయాథాత్మ్యానుభవరూప భోగమందె బ్రహ్మసామ్యము. ఇతరమందు బ్రహ్మసామ్యము లేదు. కావున, జగత్సృష్ట్యాదులతో ముక్తుని కవసరము లేదని

యర్థము. కావున నీయధికరణము జగత్సృష్ట్యాది వ్యాపారములయందు ముక్తుని కెంత మాత్రము సంబంధములేదని తెలియఁజేయుటకు బుట్టినదిగాని "జీవుఁ డీశ్వరునికంటె భిన్నుఁడు" అను సంశయమును సాధించుటకై ప్రవర్తిల్లినది కాదు. జీవబ్రహ్మలకైక్యము సిద్ధింపదు. "జీవుఁడు వేఱు, బ్రహ్మ వేఱు" అనుసంగతిని సమర్థించు సూత్ర కదంబము ప్రథమాధ్యాయ ప్రథమపాద ద్వితీయపాదములలోఁ బ్రతి పాదింపఁబడెను. ఎట్లన ;

ఆనందమయోఽభ్యాసాత్. 1. 11. 3

1. తైత్తిరీయక శ్రుతియందు శతగుణితోత్తరముగా నావృత్తిఁ జేయఁబడిన నిరతిశయానందము జీవునికి సంభవింపదు గావున శ్రుతిలోనానందమయశబ్దముచేఁ జెప్పఁబడిన వాఁడు జీవునికంటె భిన్నుఁడైన ఈశ్వరుఁడు.

2. తద్ధేతువ్యపదేశాచ్చ. 1. 11. 15

ఈశ్వరుఁ డానందహేతు వని శ్రుతి చెప్పుటచే జీవునికంటె భిన్నుఁడు.

నేతరోఽనుపపత్తేః, 1. 1. 17. బహుభవనసంకల్ప సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులు జీవుని కుపన్నములు కావు గనుక జీవునికంటె నీశ్వరుఁడు వేఱు.

4. కర్మకర్తృ వ్యపదేశాచ్చ. 1. 2. 4.

ఈశ్వరుఁ డుపాస్యుఁ డగుటచేఁ గర్మయనియు, జీవుఁ డుపాసించు వాఁడగుటచేఁ గర్త యనియుం శ్రుతి చెప్పుటచే జీవేశ్వరులు భిన్నులు.

ఇత్యాది జీవేశ్వర భేదసాధన సూత్రగణము మాయావాది మతఖండనమందుఁ గవి వ్రాసినచో బాగుగ నుండు నని యూహించెద.

ఈవిష్ణుచిత్తుఁడు శ్రీవిష్ణుపురాణమునకు వ్యాఖ్యానము చేసినట్లు కవి వ్రాసియున్నాఁడు. ఇదియుం భ్రాంతిమూలకమే. విష్ణుపురాణవ్యాఖ్యాత యగు విష్ణుచిత్తుఁడు వేఱు. ఇతఁడు రామానుజుల వారి శిష్యుఁడు. ఆచార్యాజ్ఞచే నీపురాణమునకు వ్యాఖ్యానము వ్రాయుచున్నా నని వ్యాఖ్యానప్రథమశ్లోకమందె ప్రతిజ్ఞ చేసియున్నాఁడు.

" తే. అలసత బరున్నమనుజుండు గలియుగంబు
ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు త్రేత
యుత్థితుఁడు యాయి మరి కృతయుగ మటన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినవె."

[7 పంచికా, 3 అధ్యాయము.]

9. " కలిశ్శయానో భవతి సంజిహానస్తు ద్వాపరః, ఉత్తిష్ఠం స్త్రేతా భవతి కృతం సమ్పద్యతే చరన్", ఐతరేయబ్రాహ్మణము. 7 పంచిక, 3 అధ్యాయము.

ఈ కవిమార్గము తక్కిన కవులమార్గమువలెఁ గాక కొన్ని విషయములయందు కేవల విసజాతీయముగఁ గానవచ్చుచున్నది.

1. కొన్ని చోట్ల సంస్కృతమునందువలె విశేషణములకు లింగ వచనాదుల యందు విశేష్యనిఘ్నత కానంబడుచున్నది.

" ఉ. ఆయత యుంష్మదాకృతి కరాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంతఫలకావళి బింబితయై..." 4. ఆ. 29.

ఇచట "ఆకృతిశబ్దము" (క్తిన్నంత మగుటచే స్త్రీలింగము గావున దాని విశేషణ మగు "బింబిత" యనునది గూడ స్త్రీలింగ రూపములో నుంపఁబడెను.

"...సాత్త్వికపు మనోగతి యెవ్వది గలదు దాని
బ్రహ్మసంబంధినిగఁజేయు ప్రౌఢిపూవె..." 3. ఆ. 74.

"కపచిత కుధాకర్బురలగు కరివర కరేణుకంధరలన్."

ఇట్టివి మఱికొన్ని పైవిషయమునకు నుదాహరణములు.

2. కొన్ని స్థలములయందుసంస్కృతజాతీయమును (Sanskrit idiom) కలదు.

" ఉ...ఉరువిద్యుద్దీపకళికలుమిసిన ధూమస్ఫురణ......" 4. ఆ. 138.

ఇచట "నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్, అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే" అను ఆచార్యదండి వచనానురోధముగాఁ గవి ఉమిసిన" అను శబ్దమును, నిష్ఠ్యూతశబ్దార్థ మందు గౌణవృత్తిలోఁ (Metaphorical sense) బ్రయోగించెను.

3. మఱికొన్ని తావులయందు ద్రావిడజాతీయము. (Tamil idiom).

"క. ...మీరు నాకనురక్తు ల్వరికించి పదింబదిగా నరయుఁడు మది నెద్దిమేలు ప్రార్థించుటకున్." 3. ఆ. 55.

ఇందులో "పదింబదిగా" అనునది ద్రావిడములో "పత్తుం పత్తాగ" అనఁగా, పది-పదిగా పదిలోనొక్కటియుఁ దక్కువ గాకుండ-సరిగా అని తాత్పర్యము.

4. కొన్నిచోట్ల ద్రావిడశబ్దప్రయోగము.

(1) "...ఎండ గాలి పసిదాఁకుం జూడఁగా ప్రాణ్ణమున్." 6. ఆ. 7.

ఇచట "పసి" = ఆఁకలి.

(2) "...వెండి యేజంగ మెత్తిన వెఱుగుపడును" 4. ఆ. 43.

ఎత్తిన=స్తుతించిన. ద్రావిడము " ఎత్తు=స్తుతించు.

(3) భక్తి ద్రోవకు సాధ్వి పరికరంబులువెట్టి కట్టిన పొరివిళంగాయగములు..."

ఇచట విళంగాయ = వెలగకాయ. 2. ఆ. 97.

(4) "...కడుమ్రోఁత పెన్దిరువడిం గని రాఖగరాజుమూపునన్." 4. ఆ. 10.

పెన్దిరువడి = పెరియ తిరువడి, పెద్ద శ్రీపాద మని యర్థము. ఇది గరుడునికి ద్రావిడవైష్ణవమత పరిభాషానామము. గరుడుఁడు భగవంతునికి పాదస్థానీయుఁడు

"... ఉద్దామపితృప్రసూష్టవగిద్రైన్యరుతోత్థ రథాంగపోతచిం
తామయనిద్రలంబొలసి తాపముసేయఁదొడంగె నింటికిన్." 5. ఆ. 57.

ఇచట సంధ్యాసమయము విరహిజనుల కుద్దీపక మను నంశము చెప్పఁబడినది. ఇది ద్రావిడ కవిసమయ సిద్ధముగాని సంస్కృతకవిసమయసిద్ధము కాదు.

ఈకవిపుంగవుండు కూర్చినసంధులును, బ్రయోగించిన ప్రయోగములును, కొంతమట్టుకు లక్షణాపేతములయి గానవచ్చు చున్నవి.

1. తే. " నింగిటు త్రిశంకుకతన మాతంగవాటి యయ్యొనిక నుండఁదగదని...". 2. ఆ. 53.

నింగి+ఇటు- ఇకారమునకు సంధి.

2. చ. " ...నిట్టతాడువంటతివరమించెఁ దా ముసలియయ్యు రహిన్..." 5. ఆ. 53.

తాడువంటి+అతివ.

తత్సమము లం దకారసంధులు

3. "...ప్రోల్చెదని కడంక దంచనపుజేతులు గంగనుకాసె దూరగా..."

గంగ+అనుకాసె. 2. ఆ. 9.

4 "...వడఁకుటె కాక చేష్టుడిగె పక్షము పక్షులఁజానువుల్ నొరన్." 4. ఆ. 118.

చేష్ట+ఉడిగె.

5. "...ఈ బ్రక్కఁం ద్వాఃకుఁ జూడరయ్య సభవా రీరంగభర్తంచు దుఃఖాబ్రాశిం బడి..." 6. ఆ. 108.

శ్రీరంగభర్త+అంచు.

క్త్వార్థకసంధి

6. సీ. "తమసేగిశెప్పులో దయమీరవిని చీర జించిచ్చువారి దీవించువారు"

చించి+ఇచ్చు క్త్వార్థకసంధి.

7. "...నీదుకఱకుట్టందీనదస్తాలకాంతారాంతర్:ప్రకపాలకుంద..." 6. ఆ. 25.

అంది+ఈన్ - క్త్వార్థేత్తునకు సంధి. 6. ఆ. 85.

8. "కొంగవాల్నరుకు లంగుటేల బట్టుక జబ్బలంటగుట్టెద వెజ్జు నరయువారు..." [వారు..." 6. ఆ. 85.

పట్టుకొని యనుటకు పట్టుక.

9. "...తలఁబడ్డ గుదియ దెబ్బలఁ జాతమసియిడి యంబలి గంజింద్ల నడుగు

గంజి+ఇండ్లన్.

10. "...పుట్టునీ గెద దీని సానొదవి యో పుణ్యాత్మ యెట్లంటివే" 6. ఆ. 54.

పుట్టున్ + ఈ గెద = పుట్టునీ గెద అని యుండవలయును.

మఱికొన్ని చిత్రమయిన ప్రయోగములు గలవు.

1. "ఇంక రెణ్ణాళ్లు చూచి..." 3. ఆ. 39.
2. "...కళిందజాతటక్షితి దున నేటికి..." 4. ఆ. 28.
3. "కర్ణాన ఘోర్పవాత ఘట్టనల బారు."

ఈకవికి ఘటాటశబ్దమును (సమూహవాచి) దఱుచుగా వాడుక చేయునలవాటు గలిగియున్నది.

మ. "అట లేతప్వదనేందురాగమిళనాప్రాదుర్భవతోఁరకంబులతేనెల్సుధలంచు..." 5. ఆ. 132.

ఈపద్యము యొక్క ప్రథమపాదమందలి యతి విచారణీయము, వ్యాఖ్యాత "ప్రా" అనుచోట "ఆఙ్" ఉపశ్లేషముచేసి యతి నిర్వహింప వలయు నని వ్రాసి యున్నాడు, ఉపసర్గ లనియుం గతులనియు నుపసర్గలకు రెండు పేర్లు. "ఉపసర్గాః క్రియాయోగే" 1. 4. 59. 'గతిశ్చ' 1. 4. 60. ప్ర, పరా, ఆఙ్, అపి, అధి మొదలగునవి ఉపసర్గలనియుం; ఊరీ, ఉరరీ, అంగీ, ప్రాదుః, ఆవిః, తిరః మొదలగునవి గతు లనియు వాడుక. ఇచట "ప్రాదుః" అనునది వ్యస్తపదముగాని సమస్తపదము కాదు. అందుచే 'ప్ర' అను దానిపై "ఆఙ్" నుపశ్లేషముచేయుట కవకాశము లేదు. ఇందులకు అప్పకవి తే. గీ. ఆంధ్రమునకుఁ జేరని పగాజపులు (పరా+ఆఙ్+అపి) మూఁడు, గాక తక్కిన యుపసర్గకముల తలలస్వరము లతికినవాని కవ్వలన నిలుచు. నచ్చయిన హల్లయినఁ బ్రాదియతి యనంగ." 134 పుట. 132 ప

## యామునాచార్యుఁడు కుమారుని కుపదేశించిన నీతి

ఈ నీతినిఁబట్టి విమర్శింపఁగా రాజ్యపాలనానుభవమందుఁబండిన బుద్ధిగల రాజన్యుఁ డిట్లు వ్రాయఁగలుగునుగాని, కేవలగ్రంథాధ్యయనమువలన నీతిశాస్త్రమందుఁ బాండిత్యము సంపాదించిన బ్రాహ్మణపండితుఁ డిట్లు వ్రాయఁజాలఁ డనియు, దీనిచే నీగ్రంథకర్త రాజ్యపాలనమం దారి తేరిన క్షత్త్రియుం డనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

## అలంకార విమర్శ

ఈ ప్రబంధమందుఁ గవి ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, అతిశయోక్తి సహోక్తి, అర్థాన్తరన్యాసము, స్వభావోక్తి, పరిసంఖ్య మొదలగు నలంకారములను వాడుకచేసియున్నాఁడు.

## ఉపమ

"తే. సామరదిదృక్షుఖస్థరక్షఃపిశాచ, పురజమహిభుక్పతత్త్రప్రభంజనములు
సోక వెఱబాఱెఁగళ్లానశూర్పవాత, ఘట్టనలబాఱుపెనుపొలకట్టుపోలె."

కళ్లములోఁ బోసిన ధాన్యరాశిఁ జేటలచే విసరఁగాఁ గట్టిగింజ నిలిచి ధాన్యపు పొల్లు పైకెగిరి పోయినట్లు స్వామిని సేవించుటచే వచ్చిన దేవతలతోఁ గలసిన రక్షః పిశాచసంఘములు గరుడునిపక్షానిలముచేఁ దూలిపోయి రని తాత్పర్యము. కాళీదాసుని యుపమవలె నీయుపమ యెంత సౌష్ఠవము గలిగియున్నదో ఎంతసమయోచితముగా నున్నదో చిత్తగింపుఁడు. ఇట్టి వనేకములు గలవు. గ్రంథవిస్తరభీతిచే వ్రాయఁజాలను.

చ. మునుపనసీమ చేసికొని ముల్లిడి గ్రుద్దట వెండిచేని మె
త్తనకయి వేరువెల్లకియుఁ ద్రవ్వెడుకర్షకునట్లు శత్రుతో.
నెనసియయైన దుర్గబలమేగొనియైన నిజాత్మచింతలే
క నెగడఁజేసి లోనమరి కంటకశోధనజేయుఁ టొప్పగుక్. 4. ఆ. 219.

ఇదియు నట్టిదియే.

## స్వభావోక్తి

మనపూర్వకవులు గోరంతను కొండంతజేసి యుత్ప్రేక్షాతిశయోక్త్యత్యుక్తులచే వర్ణించుట దప్ప యథావస్థిత వస్తువర్ణనచే వాస్తవమును దెల్పి జనమనోరంజన మొనర్చుట కలవాటుపడినవారు కారని యిప్పటి యిరువదియవ శతాబ్దమునందలి యాంగ్లేయకావ్య రసభావనాపరిపక్వహృదయు లగు మనవారు కొంద ఱాక్షేపించుచున్నారు. ఇట్టి యాక్షేపణకుఁ బాత్రు లయినవా రస్మత్ప్రాచీన కవులలోఁ గొందఱు లేకపోలేదు. ఉన్నారు కాని, తిక్కన, శ్రీనాథుఁడు సూరనార్యుఁడు మొదలగు కతిపయ కవిశిరోమణులు సకలజనమనోల్లాసదకరములయిన స్వభావోక్త్యలంకృత సూక్తులను మెండుగ వ్రాసియున్నారు. ఈకవికూడ నట్టివాఁడె. ఇందుల కుదాహరణముగా "ద్రావిడాంగనలు కోనేరులలో స్నానముచేసి దివ్యప్రబంధముల నను సంధించుచు నభిషేకజలపూర్ణ ఘటములఁ గటిప్రదేశములయందు ఘటించి తోఁటలలో నడిచెను" రని వర్ణించినపద్య మెంత సొగసైన స్వభావోక్తియో చూడుఁడు.

"మ. శయపూజాంబుజము ల్ఘటింప దడబడక్ జక్ దోయి లేఁగొనుపై
దయదప్ప నృపపాడి పొగడపు పాదం బొప్పఁ జెంగల్వడి
గ్గియ నీరచ్యుత మజ్జనార్థము గటిక్ గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగల్ నడుతు రుద్యానంబులో త్రోవలక్."1.ఆ.56.

## ఉత్ప్రేక్ష

“మ. కలయన్ నీలమయంపు నల్లియొఱదాఁకం దేటనీరొప్పువర
ధ్యలకూపంబుల మీలఁ జూచి వలభీవ్యాసంగితుంగద్రుశా
ఖలలో నాడి గవాలునన్ లకుముకు ల్క్రాలింపై పడున్ లేచు మ్రు
చ్చిలి గేహేందిర ద్రావిడీపరిచితిం జెండాడు చందంబునన్.” 1. ఆ. 57.

వీథులయందలి నూతులలోఁ గనఁబడు మత్స్యములఁ జూచి యిండ్లచూరుల యందు వ్యాపించియున్నతరుశాఖలలో ఱెక్క లాడించి యాబావులలో దుముకుచు లేచుచున్న లకుముకిపిట్టలు గృహలక్ష్మి పరులకుఁ గనఁబడకుండనుండి ఆడుచున్న బంతుల వలె నున్న వనియుత్ప్రేక్ష.

## భ్రాంతిమదలంకారము

“మ. తలఁబక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నాత ప్రయాతద్విజా
వలి పిండీకృతశాటుల న్నవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెస బాఱువాని గని నవ్వున్ శాలిగోప్యౌఘముల్.” 1. ఆ. 65.

ఆపట్టణ సమీపమందున్న వరిమళ్ళకుఁ బాఱు కాలువలయందు బాతులు వాని స్వభావగుణముచేత దలలు ఱెక్కలలోఁ బెట్టుకొని నిద్రించుచుండఁగా గ్రామముఁ గాపాడువారు వానిని జూచి ప్రాతః కాలమందు స్నానార్థమై యాకాలువలకు వచ్చిన బ్రాహ్మణోత్తములు తమ ధౌతవస్త్రముల నచట మఱచినా రని తలంచి మరల వారిగృహములలో వాని నొప్పగించుటకై రేవులలో దిగఁగా నాపక్షులు పఱచుటఁ జూచి యచ్చటఁ బైరుగాపాడుచున్నస్త్రీ లాతలవరులను హాసింతురు. ఱెక్కలలోఁ దల పెట్టుకొని నింద్రించుబాతులు తెల్లగా నుతికి పెట్టినవస్త్రము లనుకొనుట భ్రాంతి.

## పరిసంఖ్యాలంకారము

“నున్నమెత్తుటయుఁ బట్టుకారుల బట్టుటయు సౌధసౌవర్ణ భూషాది నిర్మాణంబుల యంద, కాసెచుట్టుటయుం గత్తిగట్టుటయు గృకవాకుకలహంబులయంద, ధాతువాదంబులు కఱచగుట శాబ్దికుల యంద” ఇత్యాదులు.

## గ్రంథకర్తృనిరూపణము

ఈ ప్రబంధ ప్రామాణ్యముం బట్టియుం ప్రబంధశైలిని బట్టియుం విచారింపఁగాఁ గృష్ణదేవరాయలే దీనిని రచించినట్లు నిష్కృష్టముగాఁ జెప్ప వచ్చును. ఈతఁడు చంద్ర వంశోత్పన్నుఁ డగు నరసింహారాయని కుమారుఁడు తుంగభద్రానదీతీరమునసుండు ఆనె

గొండె యను నామాంతరము గల విజయనగర మీతని రాజధాని. పూర్వకాలమునందు మాలవదేశాధీశ్వరుఁడగు భోజరాజు సంస్కృత భాష నెట్లాదరించెనో, అట్లే యీకృష్ణదేవరాయ లాంధ్రభాష నాదరించి కవుల సన్మానించి గ్రంథరచనము చేయించుటచేత నీతఁ డాంధ్రభోజుఁ డని ప్రఖ్యాతిఁ గాంచెను. ఇతఁడు దన యాస్థానమం దనేక విద్వత్కవుల నునిచి వారిచేఁ గావ్యములను జేయించుట మాత్రమే కాక, సంస్కృతాంధ్రభాషలయం దసాధారణ ప్రజ్ఞావిశేషముఁ గలవాఁ డగుటచేఁ దాను స్వయముగా నుభయభాషలయందును గావ్యముల రచించుటకుఁ దగిన దక్షత యుండెను. ఇతఁడు, కవులను బ్రోత్సాహ పఱచి కావ్యములు చేయించియుఁ, దాను స్వరూపముగాఁ జేసియు, నాంధ్ర భాషకు మహోపకారము నొనరించి యున్నాఁడు. దక్షిణ హిందూ దేశమును బాలించిన రాజులలో నింతదేశమును జయించి యేలిన వాఁడును, ఇంత ప్రసిద్ధి నొందినవాఁడును మఱెవ్వఁడును లేఁడు.

ఇతఁడు, తెలుఁగున రచించిన గ్రంథము విష్ణుచిత్తీయ మను నామాంతరముగల ఆముక్తమాల్యద. ఇతఁడు సంస్కృత భాషయందుఁ గూడఁ గొన్ని గ్రంథములను రచించి నట్లు విష్ణుచిత్తీయమునందలి యీ పద్యము వలనఁ దెలియ వచ్చుచున్నది.

సీ. "పలికి తుత్ప్రేక్షోపమలజాతి పెంపెక్క సరసులౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్య సేవధిగాఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగరచించితి సూక్తినైపుణి జ్ఞానచింతామణికృతి
తే. మఱియుఁ రసమంజరీముఖ్యమధురకావ్య, రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యుండు నొక్క, కృతి వినిర్మింపు మీకమాకు బ్రియ
[ముఁగాఁగ." 1. అ. 13.

ఈ పద్యమునం దుదాహరింపఁ బడిన సంస్కృతగ్రంథము లెవ్వియుం నిప్పుడు గానరావు.

ఈతని కాలమున నె క్రొత్తగాఁ బ్రబంధరచన మారబ్ధ మయ్యెను. అవఱ కుండెడు నాంధ్రకవులు, పురాణములు మొదలగు సంస్కృత గ్రంథములను మృదు మధుర శైలిని నాంధ్రీకరించియున్నారు గాని, నూతనముగా స్వాతంత్ర్యము నవలంబించి క్రొత్త ప్రబంధము లను రచియించినవా రెవ్వరును గాన రారు ప్రథమమందుఁ బ్రబంధరచనకు మార్గమును జూపించినవాఁడు కృష్ణరాయల యాస్థానకవులలో సుప్రసిద్ధుఁ డగు నల్లసాని పెద్దనార్యుఁడు.

అల్లసాని పెద్దన, నందితిమ్మన, మాదయ్యగారి మల్లన, అయ్యలరాజు రామభద్రకవి పింగళిసూరనామాత్యుఁడు, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు, ధూర్జటి కవి అని యెనమండ్రు కవులు కృష్ణరాయల యాస్థానమం దుండి రనియు, వారి కష్ట దిగ్గజము లని పేరనియు, లోకములో వాడుక కలదు గాని కడపటఁ బేర్కొనఁ బడిన మువ్వురును కృష్ణరాయని యాస్థానమున నున్నవా రని ధారాళముగాఁ జెప్పుటకుఁ దగిన ప్రమాణములు గానరావు. ఒకవేళ నాతని కాలమం దున్నను మిక్కిలి బాల్యదశలో నున్నవారు గావలయును గాని యాతని యాస్థానకవులు మాత్రము గాఁ జాలరు అందును గుఱించి తెలిపెడు కథలు నమ్మఁదగినవి కావు.

ఈ దిగువ వ్రాయఁబడిన హేత్వాభాసములఁ బట్టి కొందఱు ఆముక్తమాల్యద పెద్ద నార్యకృత మని వాదించెదరు. కాని యది విచారవిధుర మయిన యంశము.

1. కృష్ణరాయవిరచిత మగు నాముక్తమాల్యదలోని పీఠిక యందు మనుచరిత్ర ములో నుదాహరింపఁ బడిన పద్యములు కొన్ని కానవచ్చుచున్నవి. అందుచే నిది పెద్ద నార్యకృతముగాని కృష్ణరాయ విరచితము గాదు.

కృష్ణరాయఁడు భగవదాజ్ఞచే నీయాముక్తమాల్యద యను మహాకావ్యమును రచింప సమకట్టి కృత్యాదియందు గ్రంథకర్తృవంశమును వర్ణించుట పరమావశ్యకము నాచారము గావున నాప్రకారము తన వంశమును వర్ణింపఁ బూనును. రాయలు "అవికత్థనః క్షమా వా నతిగంభీరో మహాసత్త్వః, స్థేయాన్నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః" అను కారికలోఁ జెప్పఁబడిన ధీరోదాత్తలక్షణములు గలవాఁడు గావునఁ, దన్నుఁ దన వంశస్థులను శ్లాఘించుకొనుట కిష్టములేక, తన యాస్థాన కవీశ్వరుఁడు తన కాంతరంగికుఁ డైన పెద్దనార్యుఁ డింతకు మున్ను రచించిన మను చరిత్రములోని స్వవంశవర్ణనాపరము లయిన పద్యములనే యిచట దిరుగ వాడినచో నేమి దోషము? ఇంతమాత్రముచేఁ గృష్ణరాయని పాండిత్యమునకు లోపమా? ఇందు వలనఁ బెద్దనార్యుఁడే యాకృతిని రచించె నని సమర్థించుట కది సాధన మగునా?

2. కృష్ణదేవరాయ లల్లసాని పెద్దనను రామరాజభూషణునిఁ బ్రబంధముల రచించి తెమ్మని యాజ్ఞాపించె ననియుఁ, దదాజ్ఞానుసారముగా నాయిద్దఱు కవులు గ్రంథ ములను రచించి రాయల కడకుఁ దేఁగా రాయలు చూచి వసుచరిత్రముకంటె మను చరిత్రము కొంచెము లేఁతపాకముగా నున్న దని చెప్పఁగా నందుపైఁ బెద్దన కుపితుఁడై అతి కాఠిన్యముతో నాముక్తమాల్యదను రచించె ననియుఁ జెప్పుదురు.

ఇది కేవల మసంగతము. మనుచరిత్రము రచింపఁబడిన తరువాత, మఱికొంత కాలమునకు వసుచరిత్ర ముత్పన్నమయిన దనియుఁ, రామరాజభూషణుఁ డను గ్రంథ

కర్తయే కృష్ణరాయని యాస్థానమందు లేఁడనియుఁ, బుజువుచేయుటకుఁ బ్రబల ప్రమాణములు గలవు. మనుచరిత్రము కృష్ణరాయల దిగ్విజయ యాత్రకుఁ దరువాతను రాచూరి ముట్టడికిఁ బూర్వమందును రచింపఁబడి యుండుట స్పష్టము. అనఁగా క్రీస్తు శకము 1516-వ సంవత్సరమునకును 1520-వ సంవత్సరమునకును మధ్యకాలమున రచింపఁబడినది. వసుచరిత్రము క్రీస్తుశకము 1577-వ సంవత్సరమునకుఁ దరువాతనే రచియింపఁబడిన దని మనము నిర్ధారణ జేయఁ గలము వసుచరిత్రమును గృతినందిన తిరుమలదేవరాయలు 1567-వ సంవత్సరమున దన రాజధానిని బెనుగొండకు మార్చుకొనెను. ఈతడు పెనుగొండను రాజధానిగాఁ జేసికొనిన తరువాత మహమ్మదీయులతో జేసిన యుద్ధమును గుఱించి వసుచరిత్రములోఁ గవి యీవిధముగఁ జెప్పియున్నాఁడు.

"చ. తిరుమలరాయ శేఖరుని ధీరచమూభట రాజియాజి భీ
కర యవనేశ్వర ప్రహిత ఖానబలంబులఁ జక్కుసేయ ని
ద్ధరఁ బెనుగొండ కొండలును దద్విపచర్మకపాలమాలికా
పరికర భూషితంబులయి బల్విడి గాంచె గిరీశభావమున్."

క్రీస్తుశకము 1577-వ సంవత్సరమునందుఁ దురుష్కులు తిరుమలదేవరాయని పెనుగొండనుండి చంద్రగిరికిఁ దరిమినట్లుగా మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియున్నారు. ఇంతియకాక, వసుచరిత్రమును గృతినందిన తిరుమలరాయఁడు శ్రీరంగరాజు కుమారుఁడు. ఈ శ్రీరంగరాజునకు తిరుమలరాజు గాక కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, వెంకటరాజు నని మఱి నలుగురు పుత్త్రులు గలరు. వీరిలో రామరాజు కృష్ణరాయని యల్లుఁడు. ఇతని కళియరామరాజని పేరు.

"క. శ్రీరంగరాజసుతులు ధ,రారంగత్కీర్తులళియరామాధిపుడున్...."

అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయము.

కృష్ణరాయనియనంతర మీతఁడు 1547-వ సంవత్సరమున విజయనగర రాజ్యము నాక్రమించుకొని యేలె నని నరపతివిజయమందును జెప్పఁబడియున్నది.

"గీ. సలకవిభుతిమ్మరాజుసేనలను ద్రుంచి, గుత్తి పెనుగొండ మఱి గండికోట కంద
నోలిపురమాడ లేనవలీల గెలిచి, తొలుదొలుత రామనృపతి దోర్బలము మెరసె.

ఉ. ఆపటుకీర్తిరామ వసుధాధిప చంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమ దుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యల సదాశివరాయనిరంతరాయ వి
ద్యాపుర రాజ్యలక్ష్మికిని దానము దానయి మించె నెంతయున్."

కాఁబట్టి, వసుచరిత్రము 1570-వ సంవత్సరమునకుఁ దరువాతనే ప్రారంభ మయినది. ఇందువలన వసుచరిత్రమును రచించిన రామరాజ భూషణుఁ డనుసామాంత రముగల భట్టుమూర్తి కృష్ణరాయల ఆస్థాన మందుండెడు కవి కాఁ డనియు, మనుచరిత్రము రచింపఁబడిన కొంతకాలమునకుఁ గాని వసుచరిత్ర ముత్పాదితము కాలేదనియుఁ, గృష్ణ రాయల కాలమునకుఁ గృతిపతియగు తిరుమలరాయఁడు బాల్యదశలో నుండె ననియు స్పష్ట మగుచున్నది. కావునఁ బైనిచెప్పఁబడిన ఆముక్తమాల్య దోత్పత్తి అసద్ధేతుకము గాని సద్ధేతుకము కాదు.

"సీ. కృష్ణరాయలపేరు నిడి నీవు రచియించితివి తొల్లి విష్ణుచిత్తీయ మనఁగ
గాఠిన్యమర్థంబు గ్రాహ్యంబు గాదు సాధారణుల కని భూధవుఁడు బలుకఁ
దరువాత మనుచరిత్రము నొసరించి తుత్తమకావ్యము మహాద్భుతముగఁ బిదపఁ
బెక్కుకావ్యములను బెం పెక్కవిరచించి మంటివి రాజసన్మానమునను
భంగమొందిన యలరామలింగముఖులు, సాటి రాఁగల వారె నీతోటినార
యాంధ్రకవితాపితామహ యల్లసాని, పెద్దనార్యవిశేష వివేకధుర్య."

3. ఈపద్యము మెవరు రచించియున్నారో ఏగ్రంథములోనిదో ఎవ్వరికిం దెలియదు ఇట్టి యప్రమాణమయిన పద్యముంబట్టి మన వారు కొందఱు విష్ణుచిత్తీయము పెద్దనార్యకృత మని వాదించెదరు.

దీనిప్రామాణ్యమును గొంచ మరయుందము. ఇందులో నీకవి మొదట నాముక్త మాల్యదయుఁ, బిదప మనుచరిత్రమును వ్రాయఁబడి నట్లు చెప్పియున్నాఁడు. కాని పూర్వమందు మనుచరిత్రము, దరువాత నాముక్తమాల్యదయుం రచింపఁబడె నని యీగ్రంథద్వయ సాక్ష్యమువలననే మనము నిర్ణయింపవచ్చును. కృష్ణరాయలు రాచూరు ముట్టడించి ఎడిల్‌షాను జయించె ననియు, బీజపురసుల్తానుదేశముమీఁదికి దండెత్తిపోయి కలుబర్గ సాగరు మొదలగుపట్టణములను గైకొని తురుష్కులఁ బాఱఁదోలె ననియు, మనుచరిత్రములోఁ జెప్పియుండకపోవుటను పై యుద్ధవృత్తాంతముల నాముక్తమాల్య దలో నుదాహరించి యుండుటను జూడఁగా నాయుద్ధములకుఁ బూర్వమునందు మనుచ రిత్రమును, దరువాత నాముక్తమాల్యదయుం రచింపఁబడినట్లు స్పష్ట మగు చున్నది. పద్య శేషమందు "భంగమొందిన యల రామలింగముఖులు, సాటి రాఁగలవారె నీతోటినార" అని పెద్దనార్యునిసంబోధించుటజూడఁ గా నీపద్యమునువిమర్శ జ్ఞానము లేనివాఁ డెవఁడో రచించినట్లుగానవచ్చుచున్నది. రామలింగకవి కృష్ణరాయల యాస్థానమందలి వాఁ డనుట మృషావద్యమ మని నే నిదివఱకే వ్రాసియున్నాను. విభిన్న కాలికుఁ డైన రామలింగకవి యాతనిచే బరాభవము నొందుట యెట్లు సంభవించును? కావున, నీచాటుధారపద్యము విశ్వసనీయము కాదు.

4. ఆముక్తమాల్యద కవిత్వము మిక్కిలి కఠినముగా నుండుటకును, అచ్చటచ్చట కొన్ని స్ఖాలిత్యంబులు గలిగి యుండుటకును గారణంబుఁజూడ నీగ్రంథంబు పెద్దనకృతంబు గాదనియు, రాయలు రచించె ననియుం లోకులకుఁ దోఁచుటకై పెద్దన బుద్ధిపూర్వకంబుగాఁ గొన్ని తప్పులను వ్రాసి యంతకఠినముగా నాముక్తమాల్యదను రచించె ననియు లేదా, పైని వ్రాసినపద్యప్రకారము విష్ణుచిత్తీయము మనుచరిత్రకంటె మొదటి వ్రాయఁబడినయెడలఁ, బ్రథమరచిత గ్రంథంబు గావున తప్పు లుండుట సహజం బనియుఁ గొందఱయభిప్రాయము.

ఇది విచారసహము కాదు. సామాన్యముగా పండితుఁ డైనవాఁ డెవ్వఁ డైన పరులకొఱకు స్వగౌరవమును బోఁగొట్టుకొని యిట్టి తప్పులు వ్రాయునా? దానిలో విశేషించి పెద్దనవంటి మహాపండితుఁడు లక్షణవేత్త మఱియొకఁడు దీనిని రచించినాఁ డని లోకులను నమ్మించుటకు వ్యాకరణదోష దుష్టముగా నీగ్రంథమును రచించె ననుట పండితుల యినవారు విశ్వసింతురా?

ఈప్రబంధమును రచించినవాఁడు క్షత్త్రియుఁ డై యుండవలయుఁ గాని బ్రాహ్మణుఁడు గాఁ డనుట కీ గ్రంథమందె కొన్నిసాక్ష్యము లున్నవి.

"శా. తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపిత శుష్యదంబు పృథుతమాత్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుం గనరార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నారికేళాంబువుల్." 2. ఆ. 68.

ఈ పద్యముంబట్టి విచారింపఁగా గేవలము మత్స్యములను దిను వాఁడును, అందులోఁ గూడ రాజభోగ్యముగా దానిని పచనము చేయు విధముం దెలిసినవాఁడు గాని యిట్టి వర్ణనము చేయఁజాలఁడు. కావున నీయాముక్తమాల్యద మత్స్యమాంస భోజి యగు క్షత్త్రియునిచేఁగాని లేక, అతనికి సమానుఁడగు మరియొక వర్ణమువానిచేఁగాని రచియింపఁ బడియుండవలెను గాని, మత్స్యభుక్కులు కాని బ్రాహ్మణు లగు పెద్దనాదులవలన రచియింపఁబడలే దని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

5. కృష్ణరాయనితండ్రి యగు నరసింహరాజు ప్రకృతమందు 'కనరా' యని వ్యవహరింపఁబడు తుళువదేశమునుండి బయలు వెడలి కావేరినదిని దాఁటివెళ్ళి శ్రీరంగపట్టణమును ముట్టడించె నని మైసూరు శాసనములలో నున్నది. దీనికిఁ దార్కాణముగా నాముక్తమాల్యదలో "వాని వంశంబు తుళువాన్వవాయమయ్యె" నని చెప్పఁబడి యున్నది. ఇంతియ కాక "కన్నడరాయ యక్కొడువ గప్పుప్రియా పరిభుక్త భాక్కుషన్" అను పద్యములో నీతఁడు కన్నడరాయఁ డని సంబోధింపఁబడెను. ఈ తులుభాష కన్నడ భాషలో నొకశాఖ. అందుచే నీతఁడు కన్నడరు (4-175)=నేత్రరక్తిమ;

హిండితములు. (5. 93) = కలుపఁబడినవి; మొదలగు కన్నడ శబ్దములను ప్రయోగించి యున్నాఁడు.

ఇది కాక మరియొక విశేషము. పాండ్యరాజు తన కనిష్ఠసోదరిని యామునా చార్యున కిచ్చి వివాహముచేసె నని ప్రబంధములో వ్రాయఁబడినది.

ఈ యంశము కేవలము కవి కల్పితము. మూలగ్రంథమందు లేదని మున్నే చెప్పియున్నాఁడను. బ్రాహ్మణునితో యౌనసంబంధము జేయుట క్షత్రియుని కుత్కర్ష హేతువు. బ్రాహ్మణుఁడు తనపిల్లను క్షత్రియుని కిచ్చుట తన కపకర్ష మని తలంచును. ఈ గ్రంథమును రచించినవాఁడు క్షత్రియుఁడు గాని యెడల నిట్లు వ్రాయఁడు. మేనల్లునికి రాజ్యమిచ్చుట (మరుమక్కళ్ దాయమ్),(మరుమగన్).అనఁగా ద్రావిడములో మేనల్లునికిఁ బేరు. ఈయాచారము మలయాళదేశమం దిప్పటికి నున్నది. యామునాచార్యుఁడు కుమారునికిఁ జేసిన నీత్యుపదేశము మొదలగు నంశములు విమర్శింపఁగా నీగ్రథకర్త క్షత్రియుఁడై యుండక తీరదు.

వేయేల; ప్రతిరసికుఁడును స్వానుభూతిచేఁ బరికించిన బోధమగును. మనుచరిత్ర నొకచేతిలోను, ఆముక్తమాల్యద మరియొకచేతిలోను, బట్టుకొని వరుసగాఁ బద్యములఁ జదివిన, మనుచరిత్ర పద్యముల కున్నశ్రావ్యత, (music) మాధుర్యము, ప్రసాదము, సరళత మొదలగు గుణములు ఆముక్తమాల్యదా పద్యముల కున్నవా? ఈ తారతమ్య జ్ఞానమును గలిగియుండుట కెవ్వనికిని విశేష పాండిత్య మక్కఱ లేదు. మనుచరిత్ర పద్యములు చదువువారికి వినువారికిని హృదయమునం దమృతము జిలికిన ట్లుండును. ఈ స్వర్ణపరీక్షకు శ్రవణేంద్రియమే నికషోపలము. ఆముక్తమాల్యద యన్ననో పాషాణ కల్పము. పాకమా నారికేళపాకము. శబ్దగ్రథనమా దీర్ఘసమాస జటిలము. ఇందుఁ బ్రయోగింపఁబడిన "తృణతా" (ధనువు) మొదలగు సంస్కృత పదములుగాని, "తెండి;" (శయనించి) మొదలగు నాంధ్రపదములు గాని మాఱుమూలవి. ఏనిఘంటువులయందును గానరానివి, సామాన్యముగాఁ గవులెవ్వరును వాఙ్మయం దిట్టిపదముల నుపయోగించుట గానరాదు. "కపి రసిచ కాపిశాయన మదమత్తో వృశ్చికేన సందష్టః" అనున ట్లుండువైఁ బ్రతిపాద్యము విశిష్టాద్వైత మతసంప్రదాయైక సమధిగమ్యము ఇందలి వేదాంత ఘట్టములు రామానుజ బ్రహ్మసూత్ర భాష్యమును గూలంకషముగా వ్యాసంగము జేసిన శ్రీవైష్ణవపండితునికిఁదక్క యాసంప్రదాయ మెఱుఁగని యద్వైతపండితులలో విశిష్టాద్వైతపండితులలో గొప్ప వారైనవారికిఁ గూడ దుర్జ్ఞేయము. ప్రబంధమంతయు విశిష్టాద్వైత సంప్రదాయముతో నిండియున్నది.

పెద్దనార్యుని ప్రజ్ఞయం సర్వతోముఖ మయినది. పాండిత్యమందును గవిత్వమందు నీతని కితండె సాటి. ఇది నిర్వివాద మయిన యంశము. మనుచరిత్రములోఁ గృత్యాది యందు,

క. "కొలుతు న్మద్గురువిద్యా, నిలయు న్గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత, చ్ఛలగాఢధ్వాంతసమితి శఠగోప యతిన్."

అని యితఁ డొనర్చిన గురువందనము వలన నితఁడును విశిష్టాద్వైతసంప్రదాయ వేత్తయనియుం, రామానుజ మతావలంబి యనియుం, శ్రీవైష్ణవశిష్యుఁ డనియుం స్పష్ట మగుచున్నది. కావున, పెద్దన యిట్టి శ్రీవైష్ణవమత సంప్రదాయ విశిష్టంబగు గ్రంథం బును వ్రాయుట కసమర్థుఁడని యెవ్వ రనలేదు. కాని, యితఁ డొరులకుఁ దెలియకుండ మిక్కిలి కాఠిన్యముతో గ్రంథమును రచింపవలయు నని సంకల్పించి పూనిక వహించి నను, దా నిదివఱకు రచించియున్న గ్రంథములలోఁ దనకు సహజముగాఁ బట్టువడిన శైలి, అభిప్రాయసాంకర్యము, పదప్రయోగసరణి, కవితయొక్క స్నిగ్ధత్వము మొదల గునవి లేశము గానరాకుండ నొక్కపండితుఁడె తా జన్మాంతరము నొందినవానివగిది, కేవల విజాతీయముగాఁ గవనము జెప్పఁగల్గె ననుట స్వభావవిరుద్ధమును, అనుభవాసం వేద్యముగను గానవచ్చును. సంస్కృతకవులలో శిఖామణు లనఁదగు కాళిదాస భవ భూతులును, తక్క సంస్కృత కవీశ్వరులును గఠినశైలితోను సులభశైలితోను కావ్య ములను నాటకములను చంపూప్రబంధములును రచించియున్నారు. వారివారి కవిత్వ ములలోఁ గన్పట్టు నభిప్రాయములంబట్టియుఁ, బదప్రయోగములంబట్టియుం, నాగ్రంథము నీగ్రంథమును రచించినవాఁ డొక్కఁడే యని సులభముగా నూహింపవచ్చును. అందుల కుదాహరణము బాణకవి, కాదంబరీ హర్షచరిత్రలను వ్రాసెను. వీనిలో హర్షచరిత్ర మొదట వ్రాయఁబడినది. కావున కఠినపాకముగలది. కవిత్వ పాండిత్యములు పరిపాకావస్థ నొందినపిదప విరచితమగుటచేఁ గాదంబరి మిక్కిలి రసవంతముగాను సులభముగా నుండెను. అయిన, నీగ్రంథద్వయమందు నభిప్రాయైక్య మెట్లు కానవచ్చుచున్నదో చూడుఁడు.

## హర్షచరిత్రము

ప్రథమోచ్ఛ్వాసము, నలువదియవపుట. (Bombay Edition), చ్యవనముని దౌహిత్రుఁడైన దధీచి యనువానిని జూచి మోహించిన సరస్వతితో వాని దూతి యగు మాలతి యిట్లు చెప్పుచున్నది.

"దేవి కిం వా విజ్ఞాపయామి, అనురూపో దేవ్యా ఇత్యాత్మసంభావనా, శీలవా నితి ప్రక్రమవిరుద్ధమ్, ధీర ఇత్యవస్థావిపరీతమ్, సుభగ ఇతి త్వదాయత్తమ్, జానాతి సేవితు

మిత్యస్వామిభావోచితమ్, త్వం తస్య మృత్యురిత్యప్రియమ్, స్వప్నేఽస్యబహుశః కృత ప్రసాదాసీత్య సాక్షికమ్,వారితోపి బలా దాగచ్ఛతీతి పరిభవః, తదేవ మనోచరేగి రామసీతి, "శ్రుత్వా దేవీ ప్రమాణమ్."

**కా దం బ రి**

కాదంబరి పూర్వభాగముయొక్క చివరపంక్తులు చూడుఁడు. కాదంబరి చంద్రాపీడునికిఁ బంపిన సందేశములో "బాలాజిహేమి కింవా సందిశామి అతిప్రియోఽసీతి పౌనరుక్త్యమ్, త్వయి గరీయా ననురాగ ఇతి వేశ్యాలాపః, త్వయా వినా నజీవామి త్యనుభవ విరోధః, అవశ్య మాగంతవ్య మితి సౌభాగ్యగర్వః, స్వయ మాగచ్ఛామీతి స్త్రీచాపలమ్, అనన్యరక్తోయం పరిజన ఇతి స్వభక్తినివేదనలాఘవమ్, జ్ఞాస్యసి మరణేన ప్రీతి మిత్యసంభావ్య మేవ."

తెలుఁగు ప్రబంధమునుండి మరియొక యుదాహరణము.

కూచిమంచి తిమ్మకవి, రాజశేఖరవిలాసమును రుక్మిణీ పరిణయమునుగూడ రచించెను.

రాజశేఖరవిలాసము (వావిళ్ల వారిప్రతి) ప్రథమాశ్వాసము, 17-వ పుట 55 పద్యము, పురీవాజి వర్ణనము.

"చ. గుఱుతుగ నప్పురిం గలుగు ఘోటకసంఘముతోడ నెంతయుం
బరువిడనోడి వేగ హరిణంబులు వాయుఁనిశాధినాథశం
కరులను జేరి యైన నధికం బగు వైరము దీర్పలేక యా
కరణిన యుండె దక్షు మిది కాదన వానికి నట్టులేటికిన్."

రుక్మిణీపరిణయము ప్రథమాశ్వాసము 47-వ పద్యము, పురాశ్వవర్ణనములోఁ బై పద్యమందున్న కల్పనయే యిందులో నున్నది. వృత్తముమాత్రము భిన్నము

క. "హరిణము లప్పురమునఁగల, తురగంబులతోడఁ బోరి తుది నోడి మహా
త్వరితమునఁ బవనహిమకర, గిరిజేశుల శరణు నొంచె కేవలభీతిన్."

ఇ ట్లేకకర్తృకము లగు ననేకసంస్కృతాంధ్రకావ్యములయందు గ్రంథకర్త్రైక్య సాధకలింగములు బహుళముగాఁ గానవచ్చుచున్నవి. అయినను, స్థాలీపులాకన్యాయాను సారముగ నొకటి రెండిటినిమాత్రమే కనఁబఱచితి. ఏతాదృశగ్రంథకర్త్రైక్యసాధకలింగములు (పీఠికలోని పద్యములు తప్ప) పైనికనఁబఱచిన ట్లుభయసాధారణముగా మనుచరిత్రాముక్తమాల్యదలలోఁ గానవచ్చునా? లేదు సరియే కదా, మీఁదు మిక్కిలి పెద్ద వార్యుఁడు మఱచి తప్పినను స్వప్నమందైనను పరిహాసమునకైనను జేసి యెఱుఁగని నిను మొల్లంఘనముతోఁ గూడిన ప్రయోగములు మెండుగా నాముక్తమాల్యదలోఁ గాన

వచ్చుటం జేసి, ఆముక్తమాల్యద కృష్ణరాయకృతముగాని, పెద్దనార్యవిరచితము కా దని ఘంటాఘోషముతోఁ జెప్పవచ్చును దీనియందు మనుచరిత్రములోని పదవిన్యాస లాలిత్యముకాని రసపుష్టిగాని యంతగా లేదు. ఏల యన; కృష్ణరాయఁడు మహారా జగుటచే పెద్దన మొదలగు వారివలె గురూపదేశ పూర్వకముగా విద్యల నభ్యసించిన వాఁడు కాకపోవచ్చును. అయినను, నిరంతరము పండితగోష్ఠి నుండువాఁ డగుటచే ముందు శ్రుతి పాండిత్యంబు విశేషంబుగ సంపాదించి యావల శాస్త్రసంప్రదాయంబుల నేర్చి యసాధారణ శేముషీ సంపన్నుండు గావునఁ గవిత్వంబుఁ జెప్పఁ దొడఁగె. విద్యలఁ గ్రమశిక్షితుండుగాఁ డనుట కీతని పదబంధౌజ్జ్వల్యమే మనకు నిదర్శనము. భావము గంభీర మయి దానికి సదృశ మయిన పదములఁ బ్రయోగింపనియెడల నాభావము సులభముగాఁ బ్రకాశింపదు. ఇష్టానుసారంబుగఁ బ్రయోగించిన పదంబు లగుటంజేసి శీఘ్రంబుగా భావనివేదకములు గావు. కావునఁ బైనిచెప్పిన యుపపత్తులచే నీగ్రంథము పెద్దనార్యకృతము గాదనియుఁ గృష్ణరాయకృత మనియు స్పష్టముగాఁ జెప్ప నగు.

ఇదికాక మరియొక విశేషము. రాయల కాలములో గొప్ప కవులలో నొకఁ డగు ముక్కు తిమ్మనార్యుఁడు, తాను రచించి కృతి యిచ్చిన పారిజాతాపహరణములో నీ కృష్ణరాయని గుఱించి,

క. "శ్రీ వేంకటగిరివల్లభ, సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా, ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా."

అని వ్రాసియున్నాఁడు. "కవితాప్రావీణ్యఫణీశ" అను విశేషణమును బట్టి కృష్ణరాయఁడు కవిత్వమం దతి సమర్థుఁ డని యూహింపవచ్చును. ఇతఁడును ప్రత్యాశ్వాసాంతమందును నైషధకారకుఁ డగు శ్రీహర్షునివలెఁ దాను రచించిన శ్లోకార్థక పద్యమును వ్రాసియున్నాఁడు. "స్థితస్య గతి శ్చింతనీయా" అనున్యాయము ననుసరించి శబ్దప్రమాణసిద్ధుఁ డైన కర్తను బరిత్యజించి అనుమానాదులచేఁ గర్త్రంతరమును సాధింప నుద్యమించుట సత్తర్కలక్షణము గాదు. అట్లయినచో భోజకృత మగు చంపూరామాయణము, కులశేఖరవర్మ విరచిత మగు తపతీసంవరణము, హాలాపరనామక శాలివాహన ప్రణీత గాథాసప్తశతి, శూద్రకవి రచిత మృచ్ఛకటికము మొదలగు వాని గతి యేమగును? మహీపాలకు లైన వారిలో నెవ్వనికి గ్రంథకరణ సామర్థ్యము లే దనినచో నీపూర్వోక్త గ్రంథము లన్నియుఁ దమ తమ యాస్థానపండితులు రచించి యాయా రాజులకే కృతి పెట్టినా రనవలయును. ఇట్టివాదుక మనవారిలో లేకపోలేదు. కాని, పైని చెప్పిన తెనుఁగులందఱు గ్రంథరచనా సామర్థ్యము గలవా రని ప్రమాణాంతరములచే సత్యమని స్పష్ట మెఱియవచ్చు చున్నది. అంత ప్రాచీను లైనవారి గ్రంథ కర్తృత్వము తథ్య

మని మన మెుప్పుకొనినచోఁ బ్రబలతరలేఖన ప్రమాణవిదిత సర్వవృత్తాంతుఁడు నవీనుఁడు వాస్తవచరిత్రాంశములచేఁ బూర్ణముగఁ దెలియఁబడినవాఁడైన కృష్ణరాయని గ్రంథకర్తృత్వమును మన మేల యొుప్పుకొనఁ గూడదు? ఇట్టి వాదివిప్రతిపన్నాంశములు కేవలము "విద్యావివాదాయ" అనునట్లు వివాదాధ్యాసితములుగావున తుపావహనన కల్పంబగు నీ ప్రసంగమునుండి విరమించుచున్నాఁడను.

## బుధవరుల కొక విజ్ఞప్తి

పాఠకమహాశయులారా! చెన్నపురీనివాసులును మాప్రియ మిత్త్రులు నగు భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరులుగారు నే నేమో విశేషజ్ఞుఁడ ననుకొని యీ యాముక్తమాల్యద కుపోద్ఘాతము వ్రాయునట్లు నన్నుఁ బురికొల్పిరి. ఇంతవఱకు నముద్రితము లైన సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రించి, వారు లోకమున కొనరించుకొన్న మహోపకారమును దలంచి యిట్టి లోకోపకర్తల కొకపాటితోడ్పాటు గావించుటకు దైవవశమున నిస్సాక్షిక నాకు లభించిన యీమంచియవకాశమును బోఁగొట్టుకొనుట కిష్టములేక సేతురచనోద్యత చిక్రోడన్యాయము నవలంబించి తగిన యధికారము లేనివాఁడ నైన నీపనికిఁ బూనుకొంటి. దినమంతయుఁ గళాశాలాధ్యాపన కర్మవ్యగ్రుఁడనై యుండుటఁ జేసి చాలినంత యవకాశములేకపోవుటచే రాత్రులయందుఁ గొంతమట్టునకు శనైశ్చరాదిత్యవారములయందు మఱికొంతమట్టునకు వ్రాసి యెట్టెట్టో రెండుమాసములకు ముగింపఁగలిగితి. నాచే నైనంతమట్టుకు గొన్ని కొన్ని యంశములను విమర్శించి వ్రాసితిని కాలము చాలదు. స్ఖలితములు మెండుగ నుండు నని నాభయము. నాయందు దయయుంచి నాతప్పులను క్షమించి యొుప్పులను గ్రహించుటకు మిమ్ము వేఁడుకొనుచున్నాఁడను.

ఈవ్యాసలేఖనమందు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసినగ్రంథములు నాకనల్పమయిన సహాయము నాచరించినవి గావున వారికిని, నన్నీ విషయమునఁ బ్రోత్సాహపఱచిన మాప్రియమిత్త్రులగు శ్రీ గుఱజాడ అప్పారావుపంతులు బి. ఏ., యఫ్. యం. యూ., గారికిని నా నతులు.

ఇట్లు,

మేడేపల్లి వేంకటరమణాచార్యులు,
విజయనగర మహారాజ సంస్థాపితాంగ్లేయ పాఠశాలా
సంస్కృతోపాధ్యాయులు.

విజయనగరము.
4 నవంబరు, 1914

# ఆముక్తమాల్యద


రాజచరితవిశారద

రావ్ సాహెబ్ శ్రీ సి. హయవదనరావు,

బి. ఏ., బి. యల్., యం. యల్. సి., బెంగళూరు.


ఆముక్తమాల్యద అను ఉత్తమప్రబంధము స్మరణకురాఁగానే శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అనుసంస్థయు దాని కిప్పు డధిపతియైన భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారును తప్పక స్మరణకు వచ్చితీరుదురు. శ్రీరామస్వామి పండితుల పుత్రరత్నమే శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు. శ్రీరామస్వామిశాస్త్రులవారిదివఱలో వ్రాఁతప్రతులరూపముననే లభ్యమగుచుండెడి ఈ యుత్తమప్రబంధమును పరిష్కరించి వ్యాఖ్యానముతో ముద్రింప సమకట్టిరి. మహోత్తమస్థితిలో విజయనగర సామ్రాజ్య మున్నదినములలో నిది రచింపఁబడుటచే దానిచరిత్ర కిది యెంత యుపకరించునో వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. శ్రీరామస్వామిశాస్త్రులుగారు విశాలము స్వతంత్రము నగు దృక్పథముగలవారు. ఆయన పండితమాత్రులే కాదు. పదిరూకలు సంపాదింతమన్న సామాన్యపుటూహాలతోఁగాక ఆంధ్రప్రజానీకమున కుత్తమగ్రంథముల నచ్చొత్తించి యుత్తమపవిత్రసంకల్పముతో నొకముద్రాశాలను క్రీ. శ|| ౧౮౫౪ వ సంవత్సరమున నెంబరు 490 తిరువత్తియూరు హైరోడ్డు తండియార్పేటలోని గృహమున ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల యనుపేర స్థాపించిరి. అదియే నేఁటి వావిళ్ల ముద్రాక్షరశాల. చెన్నపురిలో ముద్రణవ్యాపారముగనే కాక పరిశ్రమగఁ బెంపొంది తీవ్రమగుపోటీ నెదుర్కొనవలసినదినములలో నింతచక్కఁగ నింత సంతృప్తికరముగా నాధునికపద్ధతులపై ముద్రాయంత్రమును స్థాపించి సర్వతోముఖవృద్ధినిఁ జూడఁ గన్న యాతండ్రీపుత్త్రులగొప్పదనమున కిది యొకమచ్చుతునక. ఈముద్రాశాల త్వరలోనే శతవార్షికోత్సవమును జరపికొని యితోధికముగాభాషాసేవ ప్రజాసేవ చేయఁగలుగుఁ గాక! అత్యాధునికపద్ధతులపై నపూర్వముద్రణమున నాఁటి నేఁటి యిన్నాళ్లనుండి ఆంధ్ర సారస్వతవికాసమునకుఁ దోడ్పడిన ఈముద్రాశాల శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారి ఆధ్వర్యమున నింకను జేగీయమాన మగుఁగాక!

తెనుఁగుగ్రంథములను వ్యాప్తిచేసి తెలుఁగుభాషను వృద్ధిపఱచుటకే శ్రీరామస్వామిశాస్త్రులుగా రీముద్రాశాలను స్థాపించినది. చెన్నపురి ఆంధ్రులకు ఆరవలకు నా

వాసస్థానమైనది. కాని, పదునాలుగవశతాబ్దమునుండి విజయనగరరాజులయున్నతితో చెన్నపురి లక్ష్మి ఆంధ్రులరూపరేఖావిలాసములనే యెక్కువ చూఱఁగొన్నది. ఈ నగర వాసులలో నెక్కువమంది ఆంధ్రులకు ఆరవభాషపైని, అట్లే యెక్కువమంది యరవ వారికి ఆంధ్రభాషపైని, గౌరవప్రతిపత్తులు గలవు. ఆకారణమున ఈముద్రాశాల చెన్నపురిలో స్థాపిత మగుట అచటివా రెల్లరికిని వరప్రసాదమే యైనది. దీనివలన శ్రీ రామస్వామిశాస్త్రులవారి స్వతంత్రత, నిపుణత, కార్యదీక్ష తెలియఁగలవు. ఈ యంత్రకృష్టకార్యమును మఱింతవిజయవంతముగఁ గొనసాగించి తండ్రి వేసినపునాదిపై నుత్తమసౌధమును నిర్మించి విజ్ఞానిగనే కాక విజయవంతుఁడగు వ్యాపారస్థుఁ డన్న కీర్తియు గడించియున్న శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారి ప్రజ్ఞాపాటనము మఱింత స్తుతింపఁదగినది.

పండిత శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు ముద్రించిప్రకటించిన యుత్తమ గ్రంథములలో ఆముక్తమాల్యద యొకటి. ఇది 1868, 1884, 1909, 1914, 1930. సంవత్సరములలో నైదుముద్రణములంది నిపు డాఱవముద్రణ మంద నున్నది. కాని, క్రీ. శ. ౧౮౬౮ లోనే యెంతో కాలము యెంతో శ్రమ యెంతో ధనము వ్యయించి యీయుత్తమగ్రంథమును ముద్రింపఁ దలఁపూని విజయముగన్న శ్రీ రామ స్వామిశాస్త్రులవారిదీక్ష వారి స్వతంత్రపుటూహ చాల ప్రశంసనీయములు. వారి ద్వితీయముద్రణప్రతి పీఠికలో తప్పులు కుప్పలుగా నున్నవ్రాఁతప్రతులను సరిచూచి చక్కని ప్రతినిఁ దయారుచేసి ముద్రించుటయే తమకోరిక యని శ్రీ రామస్వామిశాస్త్రి గారు పేర్కొనిరి. "మూలమును లేఖకప్రమాదాదులచేత నానావిధపాఠములుగ నుండెను ఈహేతువుచేతనే దీని నిదివఱ కెవ్వరును ముద్రింపఁబూనరైరి" అని వారు వ్రాసిరి. వారు దేశము నలుమూలలనుండి యెన్నియో ప్రతులు తెప్పించి సరిచూచి సర్వజనాదరణీయములగు పాఠములనే యేర్చికూర్చి తమప్రతిని ప్రకటించిరి. ఇంతే కాక దానికిఁ దాము వ్రాసిన "రుచి" యను వ్యాఖ్యానమును జేర్చి ముద్రించిరి. ఎందఱో మహాపండితు లంతకుఁ బూర్వమే దీనికి వ్యాఖ్యానములు వ్రాసియున్నను నొక్కపుస్తకముకూడ పూర్తిగ వారికి లభ్యము కాలేదు. వీరిప్రథమముద్రణపుప్రతులు శీఘ్రముగాఁ జెల్లిపోవుటచే మఱికొన్ని వ్రాఁతప్రతులను బరిశోధించి క్రీ. శ॥ ౧౮౮౪లో దీనిని బునర్ముద్రించి తమపాండితీవైభవమును వారు చూపుటే కాక తన కీకార్యమున సాయపడిన మహాపండితులు దొరతనమువారి నార్మల్‌స్కూలులో నుపాధ్యాయులు నైన శ్రీ చదలువాడ సీతారామశాస్త్రిగారిని లోకమున కెఱుకపఱిచి వారు తమకుఁ జేసినసాయమునకుఁ గృతజ్ఞతాపూర్వకముగా వారిపేరుకూడ ముఖపత్రముపై ముద్రిం

చుట శ్రీరామస్వామిశాస్త్రులయౌదార్యమునకుఁ దారకాణ. శ్రీసీతారామశాస్త్రిగారు శ్రమ యని వెనుదీయక భాషాశక్తి విజ్ఞానశక్తి కారణములుగా శ్రీరామస్వామిశాస్త్రులు గారికి సాయపడుటయుఁ బ్రసంశనీయ మగువిషయమే. దీనితోఁ గీర్తి గని రాజధాని కళాశాలయందుఁ జేరిన శ్రీసీతారామశాస్త్రిగారే సహృదయులై శ్రీశాస్త్రులుగారికి సాయ పడుట నిక్కువమేకాని వారిసాయము శ్రీరామస్వామిశాస్త్రులుగారికృషికిఁ బైఁబడిన దని కొంద ఱనుకొనుట సాహసమును, అన్యాయమును.

నెల్లూరు నవాబుపేట వాస్తవ్యులగు శ్రీమాన్ వింజమూరి నరసింహాచార్యులు గారు ఆముక్తమాల్యద ప్రాక్ప్రతులను గొన్నిటిని దాము సంపాదించినసంగతి నెల్లూరు పండితగోష్ఠిలో నొకమాఱు చెప్పఁగా విని శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు వీని సంపాదించి శ్రీ చదలువాడ సీతారామశాస్త్రిపండితులసాయమునఁ బ్రకటించి రని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ౧౯౨౭ వ సం॥ లోఁ దాము ప్రకటించిన ఆముక్తమాల్యద పీఠికలోఁ బేర్కొని యున్నారు. శ్రీసీతారామశాస్త్రులుగారు తమకు సహాయపడి రని వారికిఁ గృతజ్ఞత తమ గ్రంథముఖమున నే శ్రీరామస్వామిశాస్త్రులుగారు చెప్పుకొనియుం న్నారు. కాన పరిశుద్ధ మగు ఆముక్తమాల్యదాప్రతి వెలువడుటకు శ్రీనరసింహాచా ర్యులు, శ్రీసీతారామశాస్త్రిగారలకుఁ గొంతగౌరవభాగ మున్నమాట యథార్థమే కాని యింతశ్రమపడి తమ కున్నదంతయు దానిపై వినియోగించి పరిష్కరించి టీకవ్రాసి ప్రకటించిన శ్రీరామస్వామిశాస్త్రులువారికే చెందిన గౌరవ మత్యంత మనుట నిస్సం శయము. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారే యీవిషయమును "ఆముక్తమాల్యదను రుచివ్యాఖ్యానముతో శ్రీవావిళ్లవారు ప్రకటించినప్పటినుండి యది కాంచినఖ్యాతి నిరుపమానము. విద్యార్థిప్రపంచమున కది కామధేనువుగా విరాజిల్లుచున్నది. అంతే కాదు. ఇది యానాఁడు ప్రకటింపఁబడకయే యున్న యెడల నేఁడో ఆముక్తమాల్యద రూప రేఖలేక నశించియుండెడి దనుటలో నాశ్చర్యము లేదు." అని వ్రాసియుండిరి. కాని, యీరుచివ్యాఖ్య శ్రీరామస్వామిశాస్త్రులుగారిది కాక యితరుల దనుకొనుట మాత్రము క్షంతవ్యము కాదు. అసూయాపరు లేకాలమున నైన నుండుటయు వారు పట్టి అభూతకల్పనములను జేయుటయు నెప్పుడును గలదు. కావున, శ్రీరామస్వామి శాస్త్రులుగారు ఆముక్తమాల్యదాసంపాదన పరిశోధనవ్యాఖ్యావిరచనావిషయములలో ననంతశ్రమతో శాశ్వత మగుగ్రంథము నాంధ్రసారస్వతప్రపంచమునకే కాక భారత సాహిత్యరంగమున నే నిలిపిన కీర్తిశాలు రన్నది నిస్సంశయవార్త, సంతతస్తుతిపాత్రము.

శ్రీనరసింహాచార్యులవారికడ గలప్రతులే కాక యితరములగుప్రతుల నెన్నిటినో శ్రీశాస్త్రులవారు సంప్రతించియుండి రని వారే పీఠికలోఁ జెప్పుటచేత నే కాక మూల

పరిష్కృతగ్రంథములఁబట్టియే మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇందు శ్రీశాస్త్రులవారు గైకొన్న యుచితతరపాఠములు, పాఠాంతరములు, శ్రీశాస్త్రులవారు నిర్మించిన యాశ్వాస సంఖ్యాదికము గమనార్హములు. ప్రాచీనులు తలఁచినట్లు ఈగ్రంథమున ఆఱాశ్వాసములే కలవనివారు నిర్ణయించి గ్రంథాంతమున, "కొన్నిప్రతులలో ఆఱవయాశ్వాసము మాల దాసరి బ్రహ్మరక్షస్సుపూర్వచరిత్రము నడుగుటతో సమాప్తమయి బ్రహ్మరాక్షసుఁడు తనచరిత్రమును బ్రారంభించుటతో నేడవయాశ్వాస మారంభమయి తుదిపద్యములతో సంతమయినది. కాని, ప్రాచీనవ్యాఖ్యాత లెవ్వరును సప్తమాశ్వాసాంతపద్యములకు టీక వ్రాసి యుండని కారణమున నిది యాఱాశ్వాసములగ్రంథముగనే నేను ముద్రించితిని అని వ్రాసియున్నారు. దీని తరువాతి ముద్రణములలోను 1930-వ సంవత్సరములలో వెలువడిన ఐదవముద్రణములోను టీక లేకయే ఆఱవయాశ్వాసాంతమున నీయధికపద్య ములు ప్రక్షిప్తములుగ చూపఁబడినవి.

అందుచే నాఁటికి తెలుఁగుసారస్వతప్రపంచమునకుఁ దెలియవచ్చినప్రతుల నన్నిటిని శ్రీరామస్వామిశాస్త్రులుగారు పరిశోధించి రనుట నిస్పష్టము. లేనిచోఁ బైవా క్యములు వా రెట్లు వ్రాసియుండఁగలరు ? అదికాక నాఁటికే చెన్నపురిలోనున్న ప్రభుత్వ మువారి ఓరియంటల్ మాన్యుస్క్రిప్టులైబ్రరీలో నున్నప్రతులను సైతము శ్రీశాస్త్రు లవారియంతటి దీక్షాశాలి చూచియుండ రనుట సత్యము కానేరదు. ప్రయాణసౌక ర్యములు లేనియాదినములలో నెల్లూరు నవాబుపేట వెళ్లి వ్రాతప్రతులను శోధిం చిన శ్రీశాస్త్రులుగారు ఊరిలో నున్న ఓరియంటల్ లైబ్రరీలోని ప్రతులు చూడకుందురా? అందు నప్పటికి సి. పి. బ్రౌనుదొరయంతటి శ్రద్ధాళువు పండితుఁడు జాగ్రత్తపఱచి యుంచిన వ్రాతప్రతులను వీరు చూచియేయుందురు. బ్రౌనుదొరకుఁ గల ఆంధ్ర భాషాభిమానమును ఆముక్తమాల్యదపైఁ గల ప్రత్యేకాభిమానము ఓరియంటల్ లై బ్రరీలోని 392 నెంబరుగల ఆముక్తమాల్యదప్రతిలో గోదాదేవి చరిత్ర మాయన వ్రాసియుంచుటయు, అదేగ్రంథము మఱియొకప్రతిలో (నెం 405 రు) నది జూలూరి అప్పయ్య పండితశేఖరునిచే 1034 లో పరిష్కరింపఁబడిన దని వ్రాసియుంచుటయు, అంతేకాక "ఆముక్తమాల్యదాశబ్దసూచి" యనుపేర (నెం 423 రు గల గ్రంథము) ఆముక్తమాల్యదలోనిశబ్దముల నేరి 1849 లో బ్రౌనుదొర ప్రభుత్వభాషాంతరీకరణ కర్తగా నున్నపుడే పూర్తిచేయించియుంచుటయు, ఈపదములకు ఆశ్వాససంఖ్యయు పద్యసంఖ్యయు నొసంగుటయు మున్నగువిషయములు సాక్షిభూతములు.

అందుచే శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుగారి రుచివ్యాఖ్యకుఁ బూర్వము ఆముక్తమాల్యదపై కొన్నియో సమగ్రములు కొన్ని యసమగ్రములు కొన్ని

వ్యాఖ్యానములు కలవు. అందు గుడిపాటి వెంకటకవీంద్రుఁడువ్రాసిన "తాత్పర్య బోధిని" యొకటి. ఇది క్రీ.శ. 1848 కిఁ బూర్వమే విరచింపఁబడిన ట్లొకప్రతివలనఁ దెలియుచున్నది. ఇదికాక "బుధమనస్తోషిణి" యను పేర మఱియొక్క రెవ్వరో క్రీ. శ. 1813 ప్రాంతమున రచించినట్లు తోఁచున దింకొకటి మూఁడవది. గట్టుపల్లి శ్రీనివాసకవి వ్రాసిన "మహాటీక" యింకొకటి. ఇదియుం సుమారు క్రీ. శ. 1800-వ సం. ప్రాంతమున రచింపఁబడినదే. శ్రీవావిళ్ల వారి "రుచి" వ్యాఖ్యానము, ఇవికాక యసమగ్రములు ముప్పదియొక్కటివరకుఁ గలవు. ఇం దాయావ్యాఖ్యాతలపేళ్లునైత మెన్నింటిలోనో లేనే లేవు.

ఇన్నిప్రతులు గల మఱియొకగ్రంథము (ఇతిహాసపురాణాదులు తక్క) ఆ లైబ్రరీలో లేనేలేదు. దీనినిబట్టి క్రీ. శ. 19 వ శతాబ్దారంభమునుండి యీగ్రంథమునకు సారస్వత దృష్టిని మతదృష్టిని మిక్కిలి పేరుండె నని స్పష్టము. ఆకాలముననే తాటియాకులపుస్తకములనుండి తెల్లకాగితములపుస్తకములలో గ్రంథములు వ్రాసియుంచుటారంభము. నెం. 392 రు గల గ్రంథము ననుసరించి (1) కృష్ణదేవరాయలే యీ గ్రంథకర్త యనియుం (2) ఆఱాశ్వాసములే యిందుఁ గల వనియుం (3) మొదటి యైదాశ్వాసముల చివర గ్రంథకర్త ఆశ్వాసాంతపద్యములు వ్రాసినాఁ డనియు, ఆఱవ యాశ్వాసాంతమునఁ గల పద్యభాగము నాలవయాశ్వాసాంతపద్యభాగమే మరల లిఖింపఁబడిన దనియు మనకు స్పష్టముగాఁ దెలియును. ఈపైవిషయములలో నభిప్రాయభేదములు గలవా రెందఱో యున్నారు. ఈ నెం. 392 రు గలప్రతి 1847-1850 నాఁటి దని మనము తెలిసికొనవచ్చును. నెం. 393 రు గల ప్రతికూడ ఆకాలమునకుఁ జెందినదే యైయుండవలయును. నెం. 394 రు గలప్రతిలో ఆశ్వాసాంతపద్యములు సరిగా వ్రాయఁబడలేదు. అంతేకాక మనుచరిత్రలోనిపద్యము లాముక్తమాల్యద ఉపోద్ఘాతములో నున్నవానికి దేనికిని టీక లేదు. నెం. 396 రు గలప్రతి రెంటాల దాసన్న వ్రాసినట్లు ఆంగీరసాధికాషాఢశుద్ధ చతుర్దశినాఁడు పూర్తిచేసినట్లు కలదు. అనఁగా క్రీ. శ॥ 1812 జూలై నెల నెం. 397 రు గలప్రతి సమగ్రమైనది. కాని, యిందు మొదటి నాలుగుపుటలలోఁ గొన్నికఠినపదములు వానికర్థములు వివరణములు కలవు. నెం. 398 రు గలప్రతిలో మొదటి రెండాశ్వాసములే కలవు. ఇది నందివాడ వీరరాఘవులు (వికృతి. మాఘ. బ. 10 క్రీ. శ॥ 1821 ఫిబ్రవరిలో) వ్రాసినది. నెం. 399 రు గలప్రతిలో తుదినాలుగుపద్యములుమాత్రము లేవు. నెం. 400 రు గలప్రతిలో మొదటియాశ్వాస మొక్కటి కలదు. నెం. 401 రు గలప్రతిలో ఆఱవయాశ్వాసములోని కొంతభాగము కలదు. ఇందలివిశేషము కఠినపదముల కెక్కడికక్కడ అర్థసూచి

కలో నర్థము లిచ్చుట. ఇది క్రీ.శ॥ 1834 లో వ్రాసినట్లు కలదు. వీనినన్నిటినిబట్టి చూడ ఆముక్తమాల్యదకుఁ గలవిఖ్యాతి విస్పష్టము. నెం. 395 రు గలప్రతి సమగ్రమే కాని నడుమనడుమ నెన్నియో పుటలు లేవు. కొన్ని పుటలు తెల్ల కాకితములుగనే విడువఁబడియున్నవి. ఆఱవయాశ్వాసములోను దుదియాశ్వాసములోను చివరిమూఁడు పద్యములు ఆశ్వాసాంతములు లేవు. తుదియాశ్వాసము ఏడవయాశ్వాస మని యున్నను ఆఱవయాశ్వాసాంతపద్యములు కానరావు. నెం. 402, 403, 404 రు "తాత్పర్య బోధిని" యనువ్యాఖ్య గలవి. నెం. 402 రు ప్రతిలో మొదటియాశ్వాసము రెండవ యాశ్వాసములో 27 పద్యములు గలవు. మూలము వ్యాఖ్య యింతవఱకే యిందుఁ గలదు. నెం. 403 రు లో 1 మొదలు 6 వఱకు మొదటియాశ్వాసపద్యములు, మూఁడవయాశ్వాసము పూర్తిగను, 1 మొదలు 105 వఱకు నాలవయాశ్వాసము, ఐదవ యాశ్వాసము పూర్తిగను ఆఱవయాశ్వాసములో 1 మొదలు 19 వఱకుఁ గల పద్యములు వ్యాఖ్యానముతో సైత మిందుఁ గలవు. నెం 404 రు గలప్రతిలో మూలములేదు. మూఁడవయాశ్వాసవ్యాఖ్యయే కలదు. తరువాత ఈప్రతి పరిశోధితమైతే 2-2-1848 దీని పూర్తిచేయఁబడినది. ఈ వ్యాఖ్యానకర్తపేరు ఆపస్తంబ సూత్రుఁడు, హారితగోత్రుఁడు నగు కిచ్చనామాత్యపుత్త్రు గుడిపాటి వేంకటపీంద్రుఁడని గలదు. ఈతఁడు సంస్కృతాంధ్ర గ్రంథము లెన్నియో వ్రాసినట్లు చెన్నప్పప్రధాని కుమారుఁ డగు నిశ్శంక వేంకటప్రధాని యాశ్రితుఁడ ననియు ఆత్రేయగోత్రుఁడు నందవరీకబ్రాహ్మణుఁడు నగు కృష్ణపతి ఛాయాపతి సోదరుఁడ ననియు నీవ్యాఖ్యాత యిందుఁ దెలుపుకొనియున్నాఁడు. ఈవ్యాఖ్య విపులము సమగ్రమేకాని యిందు వాడినభాష వ్యావహారికము.

నెం. 405 రు మొదలు 411 వఱకుఁ గలప్రతులు "బుధమనస్తోషిణి" యను వ్యాఖ్యతో నసమగ్ర మగుభాగములు కలవి. ఇందులో నెం. 405 రు గల ప్రతిలో ఒక్క మూఁడవయాశ్వాసముతక్క మిగిలిన గ్రంథమంతయుఁ వ్యాఖ్యతోఁ గలదు. నెం. 406 రు గల ప్రతిలో ఆఱవయాశ్వాసములోని కొంతభాగము వ్యాఖ్యానము కలవు. నెం. 407 రు గలప్రతిలో ప్రథమాశ్వాసమంతయుం వ్యాఖ్యతోఁ గలదు. నెం. 408రు గలప్రతిలో నాఱవయాశ్వాసములోఁ గొంతభాగము వ్యాఖ్య గలవు. నెం. 409 రు ప్రతిలో పీఠిక తొలుతటి కొన్నిపద్యములు గలవు. నెం. 410 రు ప్రతిలో మూలము లేదు. మూఁడవయాశ్వాసమునకుఁ దక్క అంతటికి వ్యాఖ్య గలదు. నెం. 411 రు గలప్రతి పైప్రతివంటిదే. ఈబుధమనస్తోషిణీవ్యాఖ్య వెంకటపతిరాజు రాజమాంబల కొడు కగు ఉప్పపాటి జోగిజగన్నాథరాజు వ్రాసినది. అతఁడు సూర్యవంశక్షత్రియుఁడ

ననియు కందాళకృష్ణమాచార్యశిష్యుఁడ ననియుఁ జెప్పుకొనెను. ఈవ్యాఖ్య యాతఁడు శ్రీముఖ మాఘ శు. ౫ నాఁడు (ఫిబ్రవరి 1813) పూర్తిచేసినట్లు గలదు; దీనికి నకలు ప్రతిమాత్రము 1822 వ సం. మే నెలలో వ్రాసినట్లు గలదు. ఈరాజు గురుప్రేరణచే ఈవ్యాఖ్య వ్రాసినట్లును, తనగురువు మహామేధావి యనియు నూతనకావ్యము వ్రాయుట కంటె ఇట్టి యుత్తమకావ్యమునకు వ్యాఖ్య వ్రాయుటే మేలని యాతఁ డాదేశించె ననియు చెప్పుకొనెను. ఈతఁడు తనవంశమును జెప్పుకొనుచు తనపూర్వీకుఁ డగు అప్పలరాజును పేర్కొనెను. అతనికొడుకు వేంకటరామరాజు; ఆతని కొడుకు వెంకటాధిపుఁడు, అతనికి రాజమ్మవలనఁ గలిగినకొడుకే యీవ్యాఖ్యాత. నెం 495 రు గలప్రతిపై బ్రౌనుదొర కాకిత మొకటి యంటించి "ఇది విమర్శశిరోమణి జూలూరి అప్పయ్య 1834 లో పూర్తిగఁ బరిష్కరించిన" దని వ్రాసియుంచెను. ఇందు ఆఱాశ్వాసములే కలవు కాని ఆఱవయాశ్వాసాంతమున "ఇది నీలాచల..." అనుపద్యము క్రొత్తగాఁ జేర్పఁబడినది. దీనినే వేదము వేంకటరాయశాస్త్రిగారు తమప్రతిలో "షష్ఠమం" అనుచోట "సప్తమం" అని దిద్ది ఏడవ ఆశ్వాసాంతపద్యముగాఁ జేర్చి ఆఱవయాశ్వాసాంతపద్యముగ గట్టుపల్లి శ్రీనివాసకవి ప్రతిలోఁగల "ఇది సైరామన..." అనుపద్యమును జేర్చిరి. ఈపద్యము నాఱవయాశ్వాసాంతముననే శ్రీనివాసకవి పేర్కొనెను. దాని నట్లు వేదమువారు మార్చిరి. "ఇది నీలాచల..." అనుపద్యము క్రీ. శ. 1813-వ సంవత్సరమునకుఁ జెందిన జగన్నాథరాజు ప్రతిలోనిది. దీనికిఁ బూర్వపుప్రతులలో "ఇది సింహాచల..." అను పద్యమునే యుంచి ముద్రించుచున్నారు.

నెం. 412 మొదలు 417 రు వఱకుఁ గలప్రతులు గట్టుపల్లి శ్రీనివాసకవి రచించిన వ్యాఖ్యానము గలవి. ఈ శ్రీనివాసకవి ఆముక్తమాల్యద పెద్దనార్యకృత మనియు ఇం దేడాశ్వాసములు కల వనియుఁ దెలిపెను. "ఇది సైరామన..." అను పద్య మీతనిప్రతిలోనే ఆఱవయాశ్వాసాంతపద్యముగాఁ గలదు. దీనినే వేదమువారు గైకొనిరి. శ్రీనివాసకవి సప్తాశ్వాసము లాముక్తమాల్యదకుఁ గలవని తానే యూహించి సృష్టించెనో లేక యాధారము లేవైనఁ గలవో తెలియదు కాని, అన్ని యాశ్వాసాంతపద్యములకు టీక వ్రాసిన యీకవి ఆఱవయాశ్వాసాంతపద్యములకు మాత్రము వ్రాయకుండుట గమనార్హము. దీనినిబట్టి గట్టుపల్లి శ్రీనివాసకవియే యీ పద్యమును సృష్టించియుండవచ్చు ననియు నందుచేతనే దాని కాతఁడు టీక వ్రాయలే దనియు ననుకొనుటలో దోషము లేదు. శ్రీనివాసకవి తిరుపతి వేంకటాచలపతిభక్తుఁడై

నని చెప్పుకొని తనటీకకు తొలుతనే వేంకటేశస్తోత్రము చేసెను. ప్రసిద్ధిగన్న గట్టుపల్లి వంశజుఁడ ననియు గురూపదిష్టమగు శాస్త్రజ్ఞానము కలవాఁడ ననియు లోక సంగ్రహార్థమే ఆముక్తమాల్యదకు మహాటీక వ్రాయుచున్నాననియు నీతఁడు చెప్పుకొనెను. పైఁజేర్కొనఁబడిన యాఱుప్రతులలోను నెం. 412 రు గల ప్రతియే మూలవ్యాఖ్యా సమగ్రము: మిగిలిన వసమగ్రములు. 413 లో మొదటిమూఁడాశ్వాసములు, 414 లో వ్యాఖ్యాతపీఠికగాని, మొదటియాశ్వాసములోని 2-6 పద్యముల వ్యాఖ్య గాని లేవు. ఈ ప్రతిని క్రీ. శ॥ 1808 సం. లో నకలువ్రాయఁబడిన దని కలదు. నెం. 415 రు ప్రతిలో మొదటిరెండాశ్వాసములకు మూఁడవయాశ్వాసములోఁ గొంతభాగమునకు వ్యాఖ్య గలదు. మిగిలినభాగమునకు మూలముమాత్రము గలదు. 416 లో మూఁడవయాశ్వాసము మధ్య నాగిపోయి పంచమాశ్వాసాంతముఁ బ్రారంభ మయి షష్ఠాశ్వాసమధ్యమున నాగిపోయినది. నెం. 417 రు గలప్రతిమాత్రము సమగ్రము. 418, 419 లు నసమగ్రము. 420 లో పీఠిక, ఆశ్వాసాంతపద్యములు లేవు కాని మిగిలినభాగమంతయుఁ గలదు. ఇందులోని విశేషమే మనఁగా వ్యాఖ్యా నము శ్రీనివాసకవిదే కాని, ప్రతిపుటపైని "రామేశ్వరీయ" మనుపేరు గలదు. శ్రీనివాసకవి టీక కిది వేఱొకనామమో యేమో తెలియదు. నెం. 421 రు గల ప్రతిలో నైదాఱాశ్వాసములకు టీక గలదు.

గట్టుపల్లి శ్రీనివాసకవిప్రతి ననుసరించి యీగ్రంథ మెన్ని యాశ్వాసములది యన్న బయలుదేఱినది. ఆఱవయాశ్వాసమునే రెండాశ్వాసములుగా విభజించిన దీతఁ డా యనుసంశయము కలుగుచున్నది. "ఇది నైరామన..." అన్నపద్య మెవరిది? అది ప్రాచీనమైనచో ఇతఁడు దాని కేల టీక వ్రాయలేదు? ఇది ప్రాచీనము కాదనియు గ్రంథమున నాఱాశ్వాసములే కల వనియు వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు విశ్వసించిరి. వ్యాఖ్యాతలు చాలమంది ఏడవయాశ్వాసాంతపద్యములకు టీకయే వ్రాయలేదు. 1930 వ సంవత్సరమున వావిళ్లవారు ప్రకటించినప్రతికి పీఠికవ్రాయుచు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ఈగ్రంథ మాఱాశ్వాసములదే యనియు నేడాశ్వాసముల దని నమ్మకుండుటకుఁ గారణము ఈతుదిపద్యములలోఁ బదదోషములు నుండుట యనివ్రాసిరి. పూర్వలిఖితములగు వ్రాతప్రతులలో నిట్టిదోషము లెన్నియో యున్న వనుకొన్నను, పెక్కురవ్యాఖ్యానములనుబట్టి యాఱాశ్వాసములే యున్న వని యెన్నవచ్చును.

ఏడాశ్వాసము లున్నవనుకొన్నపక్షమున ఈయాశ్వాసాంతపద్యము లెట్లు నిర్ణయింపవలె నన్నది గడ్డు సమస్య. ఉన్నయాశ్వాసాంతపద్యము లిట్లున్నవి.

| ఆశ్వాస సంఖ్య. | తుది పద్యము | వ్రాఁత ప్రతులు | ముద్రితప్రతులు 1. వావిళ్లవారిది. 2. వేదం వారిది. |
|---|---|---|---|
| 1. | "ఇది కర్ణాట ధరాధృతి..." | అన్నిట సమానము | సమానము. |
| 2. | "ఇది భూమండన ... ... ..." | " | " |
| 3. | "ఇది పాత్ర ప్రహారేశ్వర..." | " | " |
| 4. | "ఇది సింహాచల దంభకేసరి..." | " | " |
| 5. | "ఇది యుంధోర్వీక్షి యథార్థనామ..." | " | " |
| 6. | ... | అన్నిట భేదము గలదు | రెండిట భేదము గలదు |
| 7. | ... | " | " |

వావిళ్లవారి ప్రతిలో ఆఱవయాశ్వాసాంతపద్యము "ఇది సింహాచలదంభకేసరి .." వేదము వారిదానిలో 'ఇది సైరామన ..' అనియుం. ఏడవయాశ్వాసాంత పద్యముగా "ఇది నీలాచల నీలచేలక..." అనియుఁ గలదు. "ఇది నీలాచల..." అన్నపద్యమే క్రీ. శ. 1813 సం॥ లో ఉప్పలపాటి జగన్నాథరాజు వ్రాసినదియుం 1834 లో జూలూరి అప్పయ్య పరిష్కరించినదియుం నగు మాతృకలోనిది. ఇందలి "షష్ఠమం" అనుమాటను "సప్తమం" అని మార్చి వేదమువారు ఏడవయాశ్వాసాంత పద్యముగాఁ జేర్చిరి ఈపద్యమే క్రీ. శ. 1809 స. ప్రాంతమువాఁడైన గట్టుపల్లి శ్రీనివాసకవి ప్రతిలో ఆఱవయాశ్వాసాంతపద్యముగా నున్నది.

| వ్రాఁతప్రతి నెంబరు | వ్రాఁతప్రతి యెవరిది? | కాలము | నకలు వ్రాఁతకాలము |
|---|---|---|---|
| 414 | గట్టుపల్లి శ్రీనివాసకవి వ్యాఖ్యానముగల ప్రతి | సరిగా తెలియదు కాని క్రీ. శ. 809కి పూర్వము | 1809 |
| 396 | ఆముక్తమాల్యద మూలపు ప్రతికలు | సరిగా తెలియదు కాని క్రీ. శ. 1812-కి పూర్వము | 1812 |

"సైరామన" అన్నపదము జగన్నాథరాజు ప్రతినిబట్టి వేదమువారు తీసికొని యుండుదురుగదా! కాని! "సైరామన" అన్ననగరము కాని, రాజు పేరుకాని ఉన్న

ట్లాధారము కానరాదు. అది యొక తురుష్కప్రభువు రాజధాని యని వేదము వారవ్వారు గాని దాని కాధారము చూపరైరి. అది వారియూహ కానోపు. లేదా న్యూనిజు పేర్కొనిన "మేదక్ మెల్గో" (Meder Melgo) అను తురుష్కసేనాని—1520 లో సాళువతిమ్మనిచే నోటువడ్డ యతఁడు—ఇతఁడా? లేదా బీజపురవాసి తురుష్కసేనాని కొండపల్లికడఁ బట్టువడ్డ గోల్కొండనవాబు బిజ్లీఖానా? ఏమైనను కృష్ణరాయ లాముక్తలో తనవిజయములను రెండుపర్యాయములు పేర్కొన్నస్థలములు గలవేమో చూతము. మొదటి యైదాశ్వాసముల యంత్యపద్యములలోను ఏ వ్రాతప్రతులకు ముద్రితప్రతులకు అభిప్రాయభేదము లేదు.

1. "ఇది కర్ణాట ధరాధృతి..." — i. ఉదయగిరి విజయమును పేర్కొన్నది.
2. "ఇది ఖ్యాతమండన కొండవీడు..." — ii. కొండవీటి విజయమును ,,
3. "ఇది పాత్రప్రహారేశ్వర..." — iii. కొండపల్లి విజయమును ,,
4. "ఇది సింహాచలదంభకేసరి .." — iv. సింహాచలముకడ పొట్నూరున విజయస్తంభము నాటుటను ,,
5. "ఇది యాంధ్రోక్తియథార్థనామ..." — v. కేంబవి? కోట విజయమును ,,

దీనినిబట్టి యొక్కొక్కయాశ్వాసాంతపద్యములో కవి వేఱువేఱు దిగ్జయమే పేర్కొనెను కాని యొకపరి జేర్కొన్నది మరలఁ జేర్కొనలేదు. అందుచే ఆఱు ఏడు ఆశ్వాసములు కలవనుకొన్నప్పుడు రెండిట మొదటియైదాశ్వాసములలోను జేర్కొనని క్రొత్తవిజయములను జేర్కొనవలయునుగదా! మఱియుఁ బూర్వపద్యము లన్నిటిలో కృష్ణరాయలచే నోడిపోయినరాజుల పేళ్లు గలవు. అట్లే యాఱవయాశ్వాసాంతమున బీజపురసేనాని ఇస్మాయిల్ ఆదిల్‌షాయును, ఏడవయాశ్వాసాంతమున నీలాచలాధిపుఁడగు గజపతియుఁ జేర్కొనఁబడియుండవచ్చును. ఈవిధముగా నింకను పరిశోధించుటకు సమస్యలెన్నో యీగ్రంథమునఁ గలవు. ఉత్తమపాఠములు, ఆశ్వాససంఖ్యానిర్ణయము, వ్యాఖ్యానములు, వ్యాఖ్యాతలనామములు, కాలము మున్నగునవన్నియు జాగ్రత్తగా పరిశీలింపవలయును. లభ్యములైనవ్యాఖ్యలన్నియు 18, 19 శతాబ్దములమధ్య ననిమాత్రము నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. కృష్ణదేవరాయల కాలమునుగూర్చిన చరిత్రమును సమగ్రముగ సేకరించుటకు ఈ గ్రంథ మత్యంతోపయోగకారి యనుట సత్యము.

క్రీ. శ. 1869 సం. లో వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారీ గ్రంథపరిష్కరణమునకుఁ బూనుకొన్నప్పుడు వివిధములగు ప్రతులను దిలకించుటలో సక్రమపాఠముల నేరుకొనుటలో పడ్డశ్రమ యనంతమనుటయు సత్యము. వారికి లభించిన ప్రతులు తప్పులకుప్పలు. 1884 న ప్రకటించిన ప్రతి పీఠికలో వారిట్లు పలికిరి. 'దీనికి పూర్వపండితులు రచించిన టీకలు పెక్కులుండిన నొకటియైనను మొదటనుండి 'దవఱకు నేకరూపముగా నుండునది కాదు. అవియును లభించుట యరుదు. మూలమును లేఖకప్రమాదాదులచేత నానావిధపాఠములుగా నుండెను. ఈహేతువుచేతనే దీని

నిడివలకు కెవ్వరును ముద్రింపఁ బూనరైరి. ఇట్టి యీగ్రంథమును జాగరూకతఁ బ్రయాసపడి భిన్నదేశప్రస్తకములను దెప్పించి సత్యమైనంతవఱకు శోధించి యెట్టివారికిఁ గాని విషయము సుగమ మగునట్లు రుచి యను నొకటీక వ్రాసి దానితోడ ముద్రించినాఁడ."

ఇంత శ్రమించి యీ యుత్కృష్టగ్రంథము నందించిన శ్రీ రామస్వామి శాస్త్రులుగారెంత స్తుతిపాత్రులో వారి యుత్సాహము, దీక్ష, శక్తి ప్రణికిపుచ్చుకొని తండ్రి నిమించిన తనయుఁ డనిపించుకొనుచు తెలుఁగు తెలిసినవారెల్లరిచే దేశము నలుగడల నుండి విస్తారమగుకీర్తిని సంపాదించుకొనుచున్న శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవా రెంత స్తుతిపాత్రులో చెప్ప నలవి కాదు. ఆంధ్రభారతి నారాధించువారు అనశ్వరమగు నాంధ్రభారతి సత్యాంతము గౌరవించువారు అందఱును శ్రీ శాస్త్రులుగారు చిరంజీవులై హితోధికసేవ చేయుచుందురు గాక యని సర్వశక్తిమంతుఁ డగుపరమేశ్వరుని కోరి ప్రార్థింతురు గాక !

[ఇది త్రిలిఙ్గరజతోత్సవ ఆంగ్లసంపుటిలో 89-193 పుటలలో రాయచరిత విశారద రావుసాహేబ్ శ్రీ పి. హయనదనరావు, బి. ఏ., బి. యల్. సి, యం. ఆర్. ఏ. యస్., గారు వ్రాసిన ఆంగ్లవ్యాసమునకు అనువాదము.]

---

# ఆముక్తమాల్యద ప్రచురణములు

## 1950 సం॥ డిసెంబరు తే 12 దీ త్రిలిఙ్గపత్రికనుండి ఉద్ధృతము

రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో నుండిన నా చిరకాలమిత్రులును సుప్రసిద తార్కికులు నైన శ్రీమాన్ సముద్రాల అప్పళాచార్యులుగారు, వేసవిసెలవులు నాతో గడిపేవారు వీరు శ్రీ వేంకటరాయశాస్త్రిగారికికూడ పరిచితులు; అపుడపుడు శ్రీవారిని కలిసికొనుచు వినోదముగా వారతో సంభాషించుచుండెడివారు. వీరు హాస్యమునకు పుట్టినిల్లు. శ్రీ శాస్త్రులవారికిని నాకును మనస్తాప ముండుట వారికి ప్రాణసంకటముగనుండెను. ఒకరోజు నాతో భోజనసమయమున మఱునా డుదయము శ్రీ వేంకటరాయశాస్త్రిగారు ఒక పనిమీఁద నాయొద్దకు వత్తు రనియు, ఆపని చక్కబెట్టి వారిని పంపవలసిన దనియు చెప్పిరి. ఆమాటలు నా కాశ్చర్యము పుట్టించెను. శ్రీ శాస్త్రులవారికిని నాకును ఎన్నఁడును పొత్తు కుదుర దని చెప్పితిని. మఱునా డుదయమున శ్రీ అప్పళాచార్యులవా రదృశ్యులైరి. కాఫీ త్రాగకయే వెళ్ళి రని వంటవాడు చెప్పుచుండినసమయమున శ్రీ శాస్త్రిగారును, శ్రీ ఆచార్యులుగారును వచ్చిరి. గతమును మఱచి గౌరవ పురస్సరముగ సుఖాసీనులకును ఆసనములు వేయించితిని. అంత కూర్చుండి ఆచార్యులవారు రాత్రి నేను తమతో మందలించినకార్యముమీఁద శ్రీ శాస్త్రిగారు వచ్చియున్నారు అనియు చెప్పిరి. మిత్రులమాట త్రోసివేయరాని దయ్యెను.

శ్రీ శాస్త్రిగారామీఁద ఆముక్తమాల్యదలో నిరువదిఫారము లచ్చుగాక మిగిలి యున్నవనియు, నగరమున నే మద్రాసాలవారును, ఆఫారములను ముద్రింప వీలుగా దని

నిరాకరించిరని యుం, చెప్పుచు దానిని ఒకనెలలో పూర్తిచేసియీయవలసినదిగా కోరిరి. అందులకు సమ్మతించి దానిని పూర్తిచేసియిచ్చితిని అపారముల ముద్రణమునకుఁగాని, కాగితములకుఁగాని, శ్రీ శాస్త్రులవారు సాకొక రాగినమ్మిడీయైన నీయలేదు. అమీద కొన్నిరోజులకు శ్రీ అప్పళాచారిగారు, నే నప్పటికి ముద్రించిన గ్రంథములలో నొక్కొక్కదానిలో నొక్కొక్కప్రతి శ్రీశాస్త్రులవారు కోరుచున్నా రనిచెప్పి 150 గ్రంథములుపట్టుకొనివెళ్ళి వారికిచ్చిరి. * వానికై శ్రీశాస్త్రులవారు నా కేసొమ్మును పంప లేదు. అమీద శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు శ్రీశాస్త్రులవారికి గోష్ఠీసభలో మహో పాధ్యాయబిరుదమును, ప్రసాదించినపుడు 1116 రూ. అచ్చట ప్రముఖులు సమర్పిం చిరి. నేను కూడ నందులకు 116 రూ. లు. ఇచ్చితిని

శ్రీ శాస్త్రిగారు రెండవమారు ముద్రాశాలను నిర్మించి అప్పులపాలై కష్టపడు చుండినపుడు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగా రాయప్పులు తీర్ప సంకల్పించి కొందఱు రెడ్లయొక్క చందాలు పుచ్చుకొనివచ్చి నన్నుఁగూడ నొక పెద్దమొత్తమును విరాళముగ నిమ్మనికోరిరి. వారికోరిక విఫలముచేయ వీలుగాక, గొప్పమొత్తమును వారిచేతి కిచ్చి కొన్ని నెలలతర్వాత తమ రొక గొప్పపద్దును, శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిద్వారా వారి కందించితిని. ఈ పైసందర్భములను తెలిసికొనక శ్రీ వేంకట రాయశాస్త్రిగారికి సహాయ పడిన రెడ్లనుమాత్రమే వారిమనుమఁడు తనగ్రంథమున ప్రశంసించియుంన్నాఁడు. ఏ ఫల మునుగోరక ఎందఱికో ద్రవ్యసహాయ మొనర్చినట్లే శ్రీ వేంకటరాయశాస్త్రులవారికిని కొంత సొమ్ము నిచ్చితిని గావున నా కేపాటివిచారము లేదు.

---

* నెల్లూరిటౌనుహాలులో శ్రీశాస్త్రిగారి అముక్తమాల్యదటీకను, శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారికి కృతిగా సమర్పించిన సందర్భమున, ఒక సభ నేర్పాటుగావించిరి. సభకు ముందునాడు నావద్దకు శ్రీవేంకటరాయశాస్త్రిగారు వచ్చియుండి మఱునాటి సభకై తమతో నాటిరాత్రియే నెల్లూరికి రావలసినదని కోరిరి. పనుల తొందరవలన నేను రాలే నని యెంతచెప్పినను వినక నన్ను నిర్బంధించి వెంటబెట్టుకొని నెల్లూరికి ప్రయాణ మైరి. అర్ధరాత్రికి నెల్లూరు చేరితిమి. సభకునేర్పాటుచేసిన పౌరులు వారి నాహ్వానించి పురమున కొన్నివీధులలో గుఱ్ఱపుబండిపై నూరేగింపచేయదలచితిమని దెల్పిరి. నన్నుకూడ వారిప్రక్కన కూర్చుండుమని నిర్బంధింపగా సమ్మతించి కూర్చుంటిని. నాల్గువీధులు తిరిగి టౌనుహాలు చేరితిమి. కృతిసమర్పణసభ జయప్రదముగనే జరిగినది. సభ ముగిసిన యనంతరము శ్రీ శాస్త్రులవారియొద్ద సెలవుపుచ్చుకొని వేకువను నెల్లూరు వదలి చెన్న పట్టణము చేరుకొంటిని. శ్రీశాస్త్రిగారిని తృప్తిపఱచుటకై నా కిష్టముగాకున్నను కొన్ని పనులను గావించినాను అను విషయము పైవారికి తెలియుటకై యీవృత్తాంతము నిట ఉదాహరించితిని.



శ్రీ ర స్తు

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము

---

## పీ ఠి క

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం
దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబు లైన తమయాకృతు లచ్ఛతఁ బైకిఁ *దోఁప న
స్తోకత నందుఁ దోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్. 1

టీక. శ్రీకమనీయ హారమణిన్ - శ్రీ=లక్ష్మియొక్క, కమనీయ = మనోహరంబగు, హార = హారమందలి, మణిన్ = రత్నమునందు (నాయకమణియం దనుట), చెన్నుగన్ = ఒప్పునట్లు, తానును = వేంకటభర్తయును, కౌస్తుభంబునందున్ = కౌస్తుభమణియందు, ఆకమలావధూటియును=ఆలక్ష్మీదేవియును, ఉదారతన్ = అతిశయమగుటచేత, తోఁపన్=ప్రతిబింబింపఁగా, పరస్పరాత్మలందున్=ఒకరొకరిమనంబులందు, ఆకలితంబులైన=(ప్రేమాతిశయముచే) నిలిచిన, తమ=తమయిద్దఱయొక్క, ఆకృతులు=ఆకారములు, అచ్ఛతన్=శరీరస్వచ్ఛతచేతను, పైకిన్ తోఁపన్=ప్రకాశములుకాఁగా, అస్తోకతన్=ఆధిక్యముచేత, అందున్=ఆరత్నములందు, తోఁచెన్=కానవచ్చెను, అనన్= అనునట్లుగ, శోభిలు=(లక్ష్మితోఁ) బ్రకాశించుచున్న, వేంకటభర్తన్=వేంకటేశ్వరస్వామిని, కొల్చెదన్=సేవించెదను.

తాత్పర్యము. లక్ష్మీదేవియొక్క సుందర మగు హారమణియందు వేంకటేశుండును, నతనికౌస్తుభమం దాలక్ష్మియుం బ్రతిబింబింపఁగాఁ బరస్పరమనంబులందుఁ బ్రేమాతిశయముచేత నిలిచియున్న తమయిద్దఱి యాకారములును శరీరము స్వచ్ఛ

---

* దోఁచి య.

మాటచేత బహిః ప్రకాశములై యాంతరతనములందుఁ గానవచ్చె నన్నట్లు విలసిల్లుచున్న వేంకటేశ్వరుని సేవించెద ననుట.

ఇందు శ్రీమహావిష్ణువును లక్ష్మియు నొండొరులవక్షస్స్థలమునందలి నాయకరత్నములందుఁ బ్రతిఫలించినట్లు వర్ణించుటవలన నీప్రబంధమందు వక్ష్యమాణ మైన యాముక్తమాల్యదా రంగనాయకపరిణయసముచిత పరస్పరాభిముఖావస్థితి వ్యంగ్య మర్యాదచేతఁ దోఁచుచున్నది.

ఈపద్యమందు శ్రీపతిలక్ష్మీదేవుల నిద్దఱను వర్ణించి పద్యాంతమందు వేంకటేశ్వరునిమాత్రమే గ్రహించుటకు నభిప్రాయము, 'యతో హరి స్తతో లక్ష్మీ' అనియు, 'విష్ణో రేషానపాయినీ' యనియును, 'వాగర్థా వివ సంపృక్తౌ' అనియు, 'శ్రియం దేవీం నిత్యానపాయినీ' మనియు, 'అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా' యనియు, 'అర్థో వా ఏష ఆత్మనో యత్పత్నీ' యనుశ్రుతియు నివి మొదలగు ప్రమాణముల యర్థమును బర్యాలోచింపఁగా భగవంతునిదేహమును విడిచి లక్ష్మియుండదని తెలియవచ్చుచున్నది.

ప్రబంధము మొదటఁ దఱుచుగా మగణసిద్ధ్యర్థము శార్దూలవిక్రీడితవృత్తము ప్రయోగించుట గలిగియున్నను నీగ్రంథకర్త యుత్పలమాలావృత్తము ప్రయోగించుటవలన నాముక్తమాల్యద యుత్పలమాలా సమర్పణము చేయుటచేత భగవన్ముఖోల్లాసము కలిగినకన రచింపఁ గలవాఁడై తానును నుత్పలమాలికావృత్తరూప మైన వాక్కుసుమదామమును సమర్పించె నని తోఁచుచున్నది. మఱియు,

తే-గీ. 'వేదముల కెల్ల నోంకార మాదియైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకారమాది, గానఁ గవివరు లెల్లను దానిఁ దక్క, నితరవర్ణంబు లిడరు సత్కృతులమొదల' నన్నట్లు మహాకవి యగు నీగ్రంథకర్తచే శ్రీశబ్ద మీసత్కృతిమొదలం బ్రయోగింపఁబడినది. కాన వర్ణగణాదిశుద్ధులును గలవు. 'దేవతావాచకాశ్శబ్దా యే చ భద్రాదివాచకాః, తే సర్వే నైవ నింద్యాస్స్యుర్లిపితో గణతోఽపి వా' యనునది ప్రమాణము. ఇదియునుం గాక దీనియందు విశిష్టేష్టదేవతానమస్కారరూపమంగళమును జేయంబడినది. 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖ' మనునది ప్రమాణము.

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరి దక్ జ్జైర న్బ్రహర్షించును
ర్వరకు * న్వంచనఁ గూడఁ గాఁ గలుగు భోస్వచ్ఛంద్రశాలాపరం
పర లయ్యె న్బఱ పైన యెవ్వని ఫణాపఙ్క్తు ల్భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీతబ్రహ్మకల్పాంతునిన్. 2

టీ. పఱపైనయెవ్వనిఫణాపంక్తుల్ - పఱపైన = విశాలములగు, ఎవ్వని = ఏ శేషునియొక్క, ఫణాపఙ్క్తుల్ = పడగలవరుసలు, హరి=విష్ణుమూర్తి, ఒక్కప్పుడు=

* వేడుకఁ గూడఁ గాఁ.

ఒకసమయమున, సిరిన్ = లక్ష్మిని, కన్మొఱఁగి = కపరించి, తన్ = తన్ను, చేరన్ = కదియఁగా, ప్రహర్షించు=కడుఁబ్రీతినొందుచున్న, ఉర్వరకున్=భూమికి, ని. 'ఉర్వరా సర్వసస్యాఢ్యా' యని యమరము. వంచనన్=వంచనచేత, కూడఁగాన్=పొందఁగా (గుప్తక్రీడఁ జేయునిమిత్త మనుట), కలుగు=సిద్ధించినట్టి, భాస్వత్=ప్రకాశించుచున్న, చంద్రశాలా=ఉప్పరిగలయొక్క, పరంపరలు=గుంపులు, అయ్యెన్=ఆయెనో, దాంతున్=ఇంద్రియనిగ్రహము గలయట్టియు, అతీత=అతిక్రమింపఁబడిన, బ్రహ్మకల్పాంతునిన్=బ్రహ్మప్రళయములుగల, అయ్యనంతునిన్=ఆశేషుని, నిరంతరమున్ = ఎల్లప్పుడును, భజింతున్=కొల్చెదను. ని. 'చన్ద్రశాలా శిరోగృహమ్' అనియు, 'శేషోఽనన్తః' అనియు నమరము.

తా. ఎల్లప్పుడును, దన్నెడఁబాయకుండెడిలక్ష్మిని స్వామి యొకసమయమున మఱుఁగుపఱిచి కదియఁగా నా శ్రీహరితో గుప్తక్రీడ సేయఁదలఁచినభూదేవికి నెవ్వని యొక్క విశాలంబులైనపడగలు మేడలచాళ్లాయెనో, నిత్యుఁడై యింద్రియనిగ్రహము గలవాఁడైనయాశేషుని నిరంతరము సేవించెద ననుట.

సీ. ఖ నట త్పయోబ్ధివీక్ష్య రసాతలాన్యోన్య
పిండీకృ తాంగ భీతాండజములు
ధృత కులాయార్ధ ఖండిత సమిల్లవ రూప
చరణాంతికభ్రమత్తరువరములు
ఘన గుహా ఘటిత ఝంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరుమందరములు
చటుల ఝంపాతరస్స్వ నగరీ విపరీత
పాతితాశాకోణపరిబృఢములు
తే. ప్రబలతర బాడబీకృతారమ్మదములు
భాస్వరేరమ్మదీకృతబాడబములు
పతగ సమ్రాట్పతత్త్ర ప్రభంజనములు
వృజినతూలౌఘములఁ దూలఁ విసరుఁగాత. 3

టీ. ఖనటత్...జములు - ఖ=ఆకసమందు, నటత్=ఆడుచున్న, పయః=ఉదకముగల, అబ్ధి = సముద్రమునందు, వీక్ష్య = చూడఁదగిన, రసాతల = పాతాళమందు, అన్యోన్య=ఒకటితో నొకటి, పిండీకృత=ముద్దలుగాఁ జేయఁబడిన, అంగ=అవయవములు గలవై, భీత=భయపెట్టఁబడిన, అండజములు=సర్పములుగలవియును(అనఁగా గరుడని ఱెక్కల గాలిసోఁకుటచేత సముద్రమునందలి నీళ్లాకాశమున కెగసిపోఁగాఁ బాతాళద్వారము

బట్టబయలై కనుపడఁగా నచట పాములు తమకుఁ బక్షిరాజగు గరుత్మంతుఁడు నిత్యశత్రుఁ డౌటచేత భయపడి యొండొరులఁ గఱచికొని ముద్దలుగా నణఁగియుండె ననుట).

ధృత ..చరములు-ధృత = ధరింపఁబడిన, కులాయార్ధ = గూఁటికొఱకు, ని. 'కులాయో నీడ మస్త్రియామ్' అని యమరము. ఖండిత=విఱువఁబడిన, సమిత్=సమిధలయొక్క, లవ=తుంటలయొక్క, రూప=ఆకారములుగల, చరణ=(గరుడుని) పాదములకు, అంతిక=సమీపమందు, భ్రమత్=తిరుగుచున్న, తరువరములు=పెనుమ్రాఁకులు గలవియును, (అనఁగా ఱెక్కలగాలిచేత గొప్పమ్రాఁకులు పెల్లగిలి యతనిపాదముల వెంబడి నాసుడి కొనిపోఁగా గరుత్మంతుఁడు పక్షి యగుటంజేసి గూఁటినిమిత్తమై కాళ్ల నిఱికికొనిపోవు సన్నకట్టెయలవలెఁ గన్పట్టె ననుట.)

ఘన...రములు - ఘన=గొప్పవైన, గుహా=గుహాలయందు, ఘటిత=చేర్పఁబడిన, ఝాంకరణ=ఝాంకారముచేత, లోక=లోకములకు, ఏక=ముఖ్యముగా, ద్విదుందుభీకృత=రెండు భేరులుగాఁ జేయఁబడిన, మేరుమందరములు=మేరుమందరపర్వతములుగలవియును, (అనఁగా ఱెక్కలవాయువులు పర్వతగుహాలలోఁ బ్రవేశింపఁగా నప్పుడా పర్వతములు, మారు మొరయ లోకముల కెల్ల వినఁబడునట్లు శబ్దించు రెండుదుందుభులో యని తోఁచుచున్న ననుట )

చటుల...ధములు-చటుల=చంచలమగు, ఝంపా=సుడియుటయొక్క, తరః=వేగముచేతను, స్వ=తమయొక్క, నగరీ=పట్టణములనుండి, విపరీత=వ్యత్యస్తమగునట్లు, పాతిత=త్రోయఁబడిన, ఆశాకోణ=దిక్కోణములయొక్క, పరిబృఢములు=ప్రభువులు గలవియు, (గాడ్పులు వేగముగా విసరుటచేతను దిక్కులయొక్కయు మూలల యొక్కయుఁ బాలకులు తమతమపట్టణములయందు నిలుచుటకు వలనుగాక త్రోపువడి మఱియొకదిక్కునకు వేఱువేఱఁ బఱచి రనుట).

ప్రబల...ములు-ప్రబలతర=మిక్కిలి ప్రబలములగు, బాడబీకృత=బడబాగ్నులుగాఁ జేయఁబడిన, ఇరమ్మదములు=మెఱుపులుగలవియు, (మేఘములతోడ మెఱుపులను మింటినుండి సముద్రములలోనఁ గూలఁద్రోయు ననుట.), భాస్వర...బములు-భాస్వర=ప్రజ్వలించుచున్న, ఇరమ్మదీకృత=మెఱుపులుగాఁ జేయఁబడిన, బాడబములు=బడబాగ్నులు గలవియు. (సముద్రములయందలి బడబాగ్నులను మింటి కెగయఁజిమ్ము ననుట.)

ఇట్టివైన. పతగసమ్రాట్-పతగ=పక్షులకు, సమ్రాట్=ప్రభు వగుగరుత్మంతుని యొక్క, పతత్త్ర=ఱెక్కలవలని, ప్రభంజనములు=వాయువులు, వృజిన=పాపము లని యెడి, తూల=దూదిపింజెలయొక్క, ఓఘములన్=గుంపులను, తూలన్=తూలిపోవునట్లు, విసరుఁగాత=వీచుఁగావుత. అట్టిమహాబలముగల గరుత్మంతుని ఱెక్కల వలని గాడ్పులు నాపాపము లనియెడు దూదిపింజెలను చెదరిపోవునట్లు వీచుఁగాక యని గ్రంథకర్త ప్రార్థన సేయుచున్నాఁడు.

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బోవ నడుగోవ న్గొనెఁ దన్నన నగ్రనిశ్చల
[1]త్వానుచలత్వనిష్ఠలె సమస్తజగంబుల జాడ్యచేతనల్
గా నుతి కెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్. 4

టీ. ముకుందునాజ్ఞన్ = నారాయణునియాజ్ఞను, కనుబొమ్మనె = భ్రూసంజ్ఞ చేతనే, కాంచి = గ్రహించి, పూని = ప్రయత్నపడి, అజాండభాండముల్ - అజాండ = బ్రహ్మాండము లనియెడు, భాండముల్ = కుండలను, వానను = రూపుగలవిగాఁ జేయు కొఱకును, మీఁదన్ = ప్రళయమందు, పోవనడుగన్ = పోవున ట్లడుచుకొఱకును, తన్నన్ = తన్ను (అనఁగా వేత్రము ననుట), కొనె ననన్ = గ్రహించె ననఁగా, అగ్రనిశ్చలత్వానుచలత్వనిష్ఠలె - అగ్ర = తనచివరయొక్క, నిశ్చలత్వ = కదలకుండుట యొక్కయు, అనుచలత్వ = కదలుటయొక్కయు, నిష్ఠలె = నియమములే, సమస్తజగంబుల = ఎల్లజగత్తులయొక్క, జాడ్యచేతనల్ - జాడ్య = లయ మొందుటయు, చేతనల్ = తెలివొందుటయును, కాన్ = కాఁగా, నుతికెక్కు = స్తుతి బడుచున్న, సైన్యపతి = సేనానాయకుని (విష్వక్సేనుని) యొక్క, కాంచనవేత్రమున్ = బంగారు బెత్తమును, ఆశ్రయించెదన్ = భజించెదను.

తా. విష్వక్సేనుఁడు భగవత్కార్యధురంధరుఁడు గనుక భగవదభిప్రాయాను గుణముగ లీలావిభూతి యగు ప్రపంచమునకు స్థితిసంహారములఁ గావింపఁ బూనఁగాఁ గులాలదండము ఘటాదులకుఁ గారణ మైనట్లే విష్వక్సేనుని వేత్రము బ్రహ్మాండములకుఁ గారణ మైన దనియు నా వేత్రాగ్రము గదలనియపుడు లోకవ్యాపారము లే దనియుఁ గదలినప్పుడు లోకవ్యాపారము గల దనియును భావము.

చ. అడరుగళాస్రధారలు మహాముఖవాంతసుధాంబుధారలున్
బొడ వగువహ్నికీలములు పొంగునుగాఁ బెఱదైత్యకోటికిన్
బెడిదపుఁగిన్కతో నెసరు పెట్టినపెద్ద [2]పసంటివోలె నె
క్కుడువెస రాహుమస్తకముఁ గొన్నసుదర్శనదేవుఁ గొల్చెదన్. 5

టీక. అడరు = ప్రస్ఫుటమగుచున్న, గళ = కంఠముయొక్క, అస్రధారలు = రక్తధారలు, మహాముఖ = వెడఁదనోరివలన, వాంత = వెడలఁగ్రక్కఁబడిన, సుధాంబుధారలున్ = అమృతోదకధారలును, పొడవగు = దీర్ఘములగు, వహ్నికీలములు = అగ్నిజ్వాలలు, పొంగునుగాన్ = ఎసటిపొంగును గాఁగా, పెఱ=ఇతరమయిన, దైత్యకోటికిన్ = రాక్షససమూహమునకు, బెడిదపుఁగిన్కతోన్ = తీక్ష్ణకోపముతో, ఎసరు పెట్టినపెద్దపసంటివోలెన్ = ఎసరెక్కించినపెద్దగుండువలె, ఎక్కుడువసన్ = అధిక

1. త్వానచలత్వ. 2. పరంజ.

వేగముచేతను, రాహుమస్తకమున్ = రాహు వనురాక్షసునిశిరమును, కొన్న = గ్రహించిన, సుదర్శనదేవున్ = విష్ణుచక్ర మనుదేవుని, కొల్చెదన్ = సేవించెదను.

తా. తొల్లి రాహు వనురాక్షసుఁడు మాయచేత దేవతావేషధారియై యమృతము త్రాగునప్పుడు విష్ణుదేవుం డెఱింగి తనసుదర్శనముచే వానిశిరంబుఁ ద్రుంచినప్పుడు కంఠమునుండి వెడలెడు రక్తధార లడుగున మండెడుమంటలుగాను నమృతమును మ్రింగకమును పే తునిసెను గావున నాయమృతము మఱల నోటఁ గ్రక్కుచుండ నదియె కుండపయిపొంగుగాఁ గానంబడుచుండెను గాన నప్పు డాశిరస్సు పొయ్యిమీఁద సెసరుపెట్టిన పెద్దపంటివలె నుండె నని భావము.

మ. హరిపూరింపఁ దదాస్యమారుతసుగంధాకృష్టమై నాభిపం
కరుహక్రోడమిళిందబృంద మెదు రేక్కం దుష్క్రియాపంకసం
కరదైత్యాసుపరంపరం గముచు రేఖం[1]బొల్చురాకానిశా
కరగౌరద్యుతి పాంచజన్య మొసఁగుం గల్యాణసాకల్యమున్. 6

టీ. హరి = నారాయణుఁడు, పూరింపన్ = ఊఁదఁగా, తదాస్యమారుతసుగంధాకృష్టమై - తత్ = ఆహరియొక్క, అస్య = ముఖమందలి, మారుత = వాయువుయొక్క, సుగంధ = పరిమళముచేతను, ఆకృష్టమై = ఆకర్షింపఁబడినదై, నాభిపంకరుహక్రోడమిళిందబృందము - నాభి = బొడ్డులియందలి, పంకరుహ = పద్మముయొక్క, క్రోడ = మధ్యమందలి, మిళింద = తుమ్మెదలయొక్క, బృందము = సమూహము, ఎదు రేక్కన్ = ముఖమారుతమున కెదురు రాఁగా, దుష్క్రియాపంకసంకరదైత్యాసుపరంపరన్ - దుష్క్రియా = దుష్కార్యములవలని, పంక = పాపములతోడ, సంకర = కూడుకొన్న, దైత్య = రాక్షసులయొక్క, అసు = ప్రాణముల యొక్క, పరంపరన్ = పఙ్క్తిని, కముచు = ఆకర్షించెడు, రేఖన్ = రీతిచేతను, పొల్చు = ఒప్పుచున్న, రాకానిశాకరగౌరద్యుతి - రాకా = పున్నమనాఁటి, నిశాకర = చందురునివలె, గౌర = ధవళ మగు, ద్యుతి = కాంతి గల, పాంచజన్యము = హరి శంఖము, కల్యాణసాకల్యమున్ - కల్యాణ = మంగళములయొక్క, సాకల్యమున్ = సమృద్ధిని, ఒసఁగున్ = ఇచ్చును.

తా. శ్రీపతి పాంచజన్యమును బూరించు నప్పు డాహరిముఖవాయువు దివ్యసుగంధము గలిగి వాసించుటవలన నాభికమలమం దున్న తుమ్మెదల గుం పచ్చోటు వదలి యక్కమలవాసనకంటె మిగుల సొగయఁజేయు మొగముతావి కెగయుచున్నప్పుడు శత్రుజనంబుల హృదయ విదారణం బగు నాదంబునకుం బొ దగు శంఖంబు

1. బోల్చు.

దుష్టు లగు రక్కసుల మలీమసంబు లగునసువులఁ బీల్చుచున్నదో యన్న ట్లాగా నని భావము. అట్టి శ్రీవిష్ణునిచేతిలో నుండెడిపాంచజన్య మనుశంఖము మాకు సంపూర్ణము లగుమంగళముల నిచ్చుచుండును గాక.

ఉ. యాదవసార్వభౌమభయదాయతబాహునియుక్తిఁ జేసి యెం
దే దనుజేంద్రసాళ్వపురహేమమణీవరణంబు సంగతం
బై దివి నాత్మకంకణములం దొకకంకణ మయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలితసముజ్జ్వలకల్పకమాల్యఁ గొల్చెదన్. 7

టీక. యాదవ... జేసి - యాదవ = యదువంశజులకు, సార్వభౌమ = రాజైన కృష్ణునియొక్క, భయద = భయంకరమైన, ఆయత = పొడవైన, బాహు = భుజముయొక్క, నియుక్తిఁ జేసి = పనుచుటచేత (బాహువుచేఁ బ్రయోగింపఁబడుటవలన నని యర్థము), ఎందేనిన్ = ఏయాకాశమందు సంచరించుచున్నగదయందు (ఇచట నపి శబ్దార్థకం బగు నేని శబ్దము నికారమునకు వైకల్పికలోపము బని యెఱుంగునది.), దను... ణంబు - దనుజేంద్ర = రాక్షసవరుండైన, సాళ్వ = సాళ్వుఁ డనువానియొక్క, పుర = పట్టణముయొక్క, హేమ = స్వర్ణమయమును, మణీ = రత్నమయమును నగు, వరణంబు = కోట, ని. 'ప్రాకారో వరణ స్సాల' యని యమరము. సంగతంబైన = కలిసి కొన్నదై, దివిన్ = అంతరిక్షమందు, ఆత్మకంకణములందున్ - ఆత్మ = తనయొక్క (కౌమోదకియొక్క), కంకణములందున్ = వలయములయందు, ఒకకంకణ మయ్యెన్ = కంకణ మాయెనో, మోదకీలితసముజ్జ్వలకల్పకమాల్యన్ - మోద = సంతోషము చేతను, కీలిత = కూర్పఁబడిన, సముజ్జ్వల = ప్రకాశించెడు, కల్పక = కల్పవృక్షములయొక్కలి పూలయొక్క, మాల్యన్ = దండగల, అట్టికౌమోదకిన్ = అట్టివిష్ణుగదను, కొల్చెదన్ = భజించెదను.

తా. తొలుత సాల్వుఁ డను రక్కసుఁడు కామగమనమైనసౌభ పట్టణముతోఁ గూడ మథురానగరమందు వ్రాలి ప్రజాహింస గావించు నని తాఁ గాఁ గృష్ణుఁడు కౌమోదకి యనుతనగద నాపట్టణముపైఁ బ్రయోగింపఁ గాఁ గనకరత్నమయమైన యా నగరికోట యాకౌమోదకియందుఁ దొడిగిన కంకణములలోఁ గాను నొకకంకణమై కనుపట్టినది గాని బాధకము కా దాయెను. అట్టి సర్వశత్రు నిరాసకం బగు నాకౌమోదకి మదీయశత్రునిరాసమును గావింపఁ గల దని యభిప్రాయము.

చ. పిడికెఁడుకొనుఁ గొప్పుఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి తేఁ
బిడికెఁడుకొనుఁ గొప్పుఁ బయిఁ *బెచ్చుగుణంబును గంటి నంచు నే

* జేర్చు; బేర్చు.

[1]ర్పడఁగ నిజత్రివక్రతయుఁ ౹ బాపఁగ మ్రొక్కెడు నా సుమాలిపైఁ
జడిగొన నమ్ము లీనుహరి ౹ శార్ఙ్గ ధనుర్లత గాచుఁ గావుతన్. 8

టీక. పిడికెఁడుకొనుక్ - పిడికెఁడు - పిడికిటిలో నడఁగెడు, కొనుక్ = నడుమును, కొప్పుక్=ధమ్మిల్లమును, కని = చూచి, ప్రేమక్=ప్రేమచేతను, త్రివక్రక్ = (మూఁడువంకరలుగల) కుబ్జను, సమాంగిక్ = చక్కనిదానినిగా, చేసితి = చేసితివి. ఏక్ = నేను, పిడికెఁడుకొను = పిడికిటి కడఁకువ యగు లస్తకమును, కొప్పుక్ = ధనురగ్రమును, పయిఁబెచ్చు = అంతకన్న నధికముగా గుణంబును = అల్లెత్రాటిని (శబ్దచ్ఛలమువలన మంచిగుణ మనియు లభించుచున్నది.), కంటి నంచుక్=పొందితి ననుచు, ఏర్పడఁగక్ = స్ఫుటమగునట్లు, నిజ = తనయొక్క, త్రివక్రతయుక్ = మూఁడు వంకరలు గలుగుటను, పాపఁగక్=పోఁగొట్టుకొఁనుటకు, మ్రొక్కెడు నాక్ = మ్రొక్కుచున్నదియో యనునట్లు, సుమాలిపైక్=సుమాలి యనురాక్షసునిమీఁద, జడిగొనక్ = సంతతధారగా వర్షించునట్లు, అమ్ములీను = బాణముల నీనెడు, హరిశార్ఙ్గధనుర్లత-హరి = నారాయణునియొక్క, శార్ఙ్గ = శార్ఙ్గ మను పేరుగల, ధనుర్లత = తీఁగవంటివిల్లు, కాచుఁగావుతక్ = రక్షించుఁగాత.

తా. శ్రీపతి సుమాలి యనునాదిమరాక్షసునితో యుద్ధము సేయునప్పుడు శార్ఙ్గకోదండముయొక్క రెండుకొనలు నొకచోటికిఁ జేరునట్లు నారి కదియం దివ్వఁగాఁ గృష్ణావతారమందుఁ గుబ్జను జూచి దీనికిఁ బిడికెడుకొను గొప్పు నున్న దని దానిఁ జక్కనిదానిం జేసితివి నాకును బిడికెఁడుకొను గొప్పును విశేషించి గుణము నున్నది కాఁబట్టి నన్నును జక్కనిదానిం జేసి రక్షింపు మని శరప్రయోగసమయమందు నమ్రమై యావిల్లు మ్రొక్కుచున్నదో యన్నట్లుండెను.

మ. ప్రతతోర్ధ్వాధరభాగపీఠయుగళీ ౹ భాస్వత్త్సరు స్తంభ *సం
స్థితిఁ దీండ్రించెడుజాళువామొసలివా ౹ దీప్తార్చిగాఁ గజ్జలా
న్వితధూమాసితరేఖ పైయలుఁగుగా ౹ విజ్ఞానదీపాంకురా
కృతి నందం బగునందకం బఘలతా ౹ శ్రేణిచ్ఛిదం జేయుతన్. ౯

టీ. ప్రతత = విస్తీర్ణములగు, ఊర్ధ్వాధరభాగ = మీఁదిక్రిందిప్రదేశములయందలి, పీఠ = పీఠములయొక్క, యుగళీ = ద్వంద్వమునందు, భాస్వత్ = ప్రకాశించెడి, త్సరు = పిడికిటిపట్టునియెడు, స్తంభ = కంబమందు, సంస్థితిక్ = ఉనికిచేతను, తీండ్రించెడు = వెలుఁగుచున్న, జాళువా = స్వర్ణమయమైన, మొసలివా = మకరవక్త్ర మను ఖడ్గాంగవిశేషము, దీప్తార్చిగాక్ - దీప్త = ప్రజ్వరిల్లుచున్న, అర్చిగాక్ = జ్వాలగాఁగా, 'సి. అర్చిర్హేతి శ్శిఖా స్త్రియామ్' మని యమరము. పైయలుఁగు = మొన

1. ర్పడర. * క, స్థితిఁ.

కజ్జలాన్వితధూమాసితరేఖగాన్ - కజ్జల = కాటుకతో, అన్విత = కూడికొనిన, ధూమ = పొగయొక్క, అసిత = నల్లనైన, రేఖగాన్ = గీటుగాఁగా, (ఇచ్చట నర్థక్రమంబున నన్వయము.), విజ్ఞానదీపాంకురాకృతిన్ - విజ్ఞానదీప = జ్ఞానదీపముయొక్క, అంకుర = మొలకయొక్క, ఆకృతిన్ = ఆకారముచేతను, అందంబగు = సుందరమైన, నందకంబు = విష్ణుఖడ్గము, అఘలతాశ్రేణిచ్ఛిదన్ - అఘ = పాపములనియెడు, లతా = తీఁగలయొక్క, శ్రేణి = పంక్తులయొక్క, ఛిదన్ = ఛేదనమును, చేయుతన్ = చేయుఁగాత.

తా. నందక మను విజ్ఞానదీపమునకుఁ బరుజు దీపస్తంభ మనియును, బంగారు మొసలివాయి దీపకళిక యనియును, నలుఁగు దీపపుఁగోడి యనియును భావము.

మ. అలపన్నిద్దఱుసూరులందును సముద్యల్లీలఁ గాఁపున్న వె
గ్గలపుందాపముఁ [1]బాప నా నిజమనఃకంజాతసంజాతపు
ష్కలమాధ్వీకఝరి న్మురారి సొగియంగాఁ జొక్కి ధన్యాత్ములౌ
నిలపన్నిద్దఱుసూరులం[2]దలఁతు మోక్షేచ్ఛామతిం[3]దివ్యులన్. 10

టీక. అలపన్నిద్దఱుసూరులందును = ఆ ప్రసిద్ధు లగుద్వాదశాదిత్యులయందును, (సూర్యమండలము నారాయణస్థాన మని శ్రుతిప్రసిద్ధము.) సముద్యల్లీలన్ = ఒప్పుచున్న విలాసముచేతను, కాఁపున్న వెగ్గలపుందాపమున్ = నివసించుటచే నైనయధికతాపమును, పాపనాన్ = పోఁగొట్టుటకొఱకనునట్లుగా, నిజ = స్వకీయములగు, మనః = మనస్సులనియెడు, కంజాత = కమలములయందు, సంజాత-పుట్టినట్టియు, పుష్కల = సమృద్ధమగు, మాధ్వీక = మకరందముయొక్క, ఝరిన్ = ప్రవాహముచేతను, మురారి = హరి, సొగియంగాన్ = సుఖింపఁగా, చొక్కి = ఆనందించి, ధన్యాత్ములౌ = కృతార్థులయిన, ఇలపన్నిద్దఱుసూరులన్ = భూమియందలి పన్నిద్దఱైన యాళ్వారులను, దివ్యులన్ = దేవతామూర్తులగువారిని, మోక్షేచ్ఛామతిన్ = మోక్షాభిలాష గల మనస్సుతో, తలఁతున్ = సంస్మరించెదను.

తా. నారాయణుఁడు సూర్యమండలమధ్యవర్తి యగుటం జేసి యాసూర్యసంబంధ మగుతాపమును బోఁగొట్టుకొనుటకై భూమియందుఁ బన్నిద్దఱాళ్వారులై యవతరించినమహాత్ముల మనఃపద్మములయందుఁ జేరి వసించి సుఖించె ననియును, పన్నిద్దఱాళ్వారులు ద్వాదశాదిత్యులకంటెనుఁ బరిశుద్ధు లయి తమయంతరంగములయందు నారాయణుని నిలుపుకొని యాస్వామిశరీరతాపము నడఁచి సుఖపెట్టి తా మానందించువా రనియును భావము. ఫలోత్ప్రేక్ష.

వ. అని యిష్టదేవతా[4]ప్రార్థనంబుఁ జేసి మున్నే కళింగదేశవిజిగీషామనీషన్ దండెత్తిపోయి [5]విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకా

1. మాన్ప. 2. గొలుతు. 3. నిత్యులన్. 4. వందనంబు. 5. విజయవాటికం.

కుళనికేతనుం డగు [1]నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాస
రోపవాసం బచ్చటం గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున. 11

టీ. అని=ఇట్లు (ప్రియదేవతాప్రార్థనముం జేసి), మున్ను = పూర్వము, ఏన్ = ఏను, కళింగదేశ = కళింగ మనుదేశముయొక్క, విజిగీషా = విజయము చేయవలయు ననునిచ్ఛగల, మనీషన్ = బుద్ధిచేతను, దండెత్తి పోయి = దండయాత్ర సాగి, విజయవాటిన్ = బెజవాడయందు, కొన్నివాసరంబు లుండి = కతిపయదినములు నివసించి, శ్రీకాకుళనికేతనుం డగు = శ్రీకాకుళ మనియెడుపుణ్యక్షేత్రము గృహముగాఁ గల, ఆంధ్రమధుమథనుని = తెలుఁగువల్లభరాయఁ డను పేరుఁగల హరిని, సేవింపన్ బోయి = భజింప నేఁగి, హరివాసరోపవాసంబు = ఏకాదశీవ్రతోపవాసము, అచ్చటన్ = ఆ శ్రీకాకుళమందు, కావింపన్ = చేయఁగా, అప్పుణ్యరాత్రచతుర్థయామంబునన్ = ఆపుణ్యమైన రాత్రియొక్క నాలుగవజామునందు.

సీ. నీలమేఘముడాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందముల[2]కచ్చు లడఁగించుజిగి హెచ్చు
నాయతం బగుకన్నుదోయితోడఁ
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరఁబట్టు
హొంబట్టుజిలుగు రెంటెంబుతోడ
నుదయార్కబింబంబునొఱపు విడంబంబు
[3]దొరలంగ నాడుకౌస్తుభముతోడఁ
తే. దమ్మికే లుండఁ బెఱకేల దండ యిచ్చు
లేము లుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలఁకుదయఁ దెల్పుచిఱునవ్వుతోడఁ గలఁ ద
దంధ్రజలజాక్షుఁ డిట్లని యానతిచ్చె. 12

టీ. నీలమేఘముడాలు = నల్లని మేఘములకాంతిని, డీలుసేయఁగన్ = బలహీనముగాఁ జేయుటకు, చాలు = సమర్థమగు, మెఱుఁగుఁజామనచాయన్ = నిద్దమై నిగనిగలాడుచామనచాయగల, మేనితోడన్ = శరీరముతోడను, అరవిందముల = తామర పువ్వులయొక్క, కచ్చులు=గర్వములను, అడఁగించు = తక్కువసేయు, జిగిన్ = కాంతిచేతను, హెచ్చు = అతిశయించుచున్న, ఆయతం బగు = నిడువాలిన యగు, కన్నుదోయితోడన్ = నేత్రయుగళముతోడను, పులుఁగురాయనిచట్టుపలవన్నెన్ = పక్షిం

1. నంధ్ర. 2. గచ్చు. 3. దొలకంగ.

ద్రుఁడగు గరుత్మంతుని ఱెక్కలవర్ణమును, ఒరఁబట్టు = ఒరయఁజేసెడు, పొంబట్టు = బంగారుపట్టు గలిగిన, జిలుఁగు=సన్నపునేఁతగల, రెంటెంబుతోడన్ = వస్త్రముతోడను, ఉదయార్కబింబంబు = బాలసూర్యబింబముయొక్క, ఒఱపు = ఒప్పిదముయొక్క, విడంబంబు = సామ్యమును, తోరలంగ నాడు = తూలవాడెడు, కౌస్తుభముతోడన్ = కౌస్తుభ మనియెడురత్నముతోడను, తమ్మికేలుండన్ =పద్మములఁబట్టినహస్త మటుండఁగా, పెఱకేలన్ = ఇతరహస్తము చేతను, దాఁడయిచ్చు = కైదండ యిచ్చెడు, లేము లుడిపెడు=దారిద్ర్యధ్వంసక మగు, లేఁజూపు = లేఁతచూపు గల, లేమతోడన్ = తరుణియగులక్ష్మీదేవితోడను, తొలఁకు = తరంగితమగు, దయన్ = కృపను, తెలుపు = ఎఱిఁగించెడు, చిఱునవ్వులోడన్ = మందస్మితముతోడను, కలన్ = స్వప్నమందు, తదంధ్రజలజాక్షుఁడు = అల్ల తెలుఁగువల్లభరాయఁడు, ఇట్లని = వక్ష్యమాణప్రకారముగా, ఆనతిచ్చెన్ = సెల వొసంగెను.

తా. గ్రంథకర్త నిద్రించుచుండఁగా స్వప్నమందు నల్లనిశరీరచ్ఛాయ గలిగి, తామరఱేకుల దిరస్కరించెడుకన్నులు గలిగి, యురంబునఁ గౌస్తుభమాణిక్యంబు గలిగి, తనపార్శ్వమందు నిలిచి లక్ష్మీదేవి యొకచేతఁ గమలంబును, రెండవచేతఁ దన హస్తంబును గీలించి యుండఁ జిఱునగవులయందే తనకుం గలదయ దెలియుచుండ నాయాంధ్రవల్లభస్వామి కనుపడి ముందు చెప్పఁబోవురీతిని పలికె నని భావము.

సీ. పలికి తుత్ప్రేక్షోపమల జాతిఁ బెం పెక్క
రసికు లౌ నన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు [1]మెచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి
తే. మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్రభాష[2]యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మింక మాకుఁ బ్రియము గాఁగ. 13

1. మించుగ. 2. నసాధ్యంబె.

టీ. ఉత్ప్రేక్షోపమలన్ = ఉత్ప్రేక్షాలంకారముచేతను నుపమాలంకారము చేతను, జాతిన్=స్వభావోక్తిచేతను, పెంపెక్కన్ = అతిశయించునట్లు, రసికులు = రసజ్ఞులు, ఔననన్ = ఒప్పుకొనునట్లుగా, మదాలసచరిత్రన్ = మదాలసచరిత్ర యను ప్రబంధమును, పలికితివి = రచించితివి. భావ...గాఁగన్ - భావ = అభిప్రాయమునకును, ధ్వని=ధ్వనులకును, వ్యంగ్య = వ్యాజనావృత్తికిని, సేవధి గాఁగన్ = నిక్షేపము అగునట్లుల, సత్యావధూప్రీణనంబున్ = సత్యభామాపరిణయ మను ప్రబంధమును, చెప్పితివి=రచించితివి. శ్రుతి = వేదములు, పురాణ = పురాణములును, ఉపసంహితలు= పాంచరాత్రాగమాదులలో విష్వక్సేనసంహిత మొదలగువానిని, ఏర్చి = శోధించి, సకల కథాసారసంగ్రహంబున్ = సకలకథాసారసంగ్రహ మను గ్రంథమును, కూర్చితివి = అనుకూలపఱిచితివి. శ్రోతృ = వినియెడువారియొక్క, అఘ = పాపములయొక్క, ఘటలు=సమూహము, విచ్చుగన్ = విచ్చిపోవునట్లు, సూక్తినైపుణిన్ = భాషాచాతుర్యముచేత, జ్ఞానచింతామణికృతిన్ = జ్ఞానచింతామణి యనియెడు ప్రబంధమును, రచించితివి = చేసితివి. మఱియున్ = ఇంకను, రసమంజరీ = రసమంజరి యను గ్రంథము, ముఖ్య = మొదలగు, మధుర = మనోహరము లగు, కావ్య = కావ్యములయొక్క, రచనన్ =కూర్పుటచేతను, గీర్వాణభాషన్ = సంస్కృతభాషయందు, మెప్పించుకొంటివి=మెప్పువడసితివి. ఆంధ్రభాష = తెలుఁగుబాస, అసాధ్యంబె = (నీకు) సాధింపరాని యదియా, అందున్- ఆయాంధ్రభాషయందును, మాకున్, ప్రియము గాఁగన్=ఆనందమగునట్లు, ఇఁక నొకకృతి వినిర్మింపుము=ఇంక నొక్క గ్రంథము రచింపుము.

తా. ఎల్లభాషలకును దల్లి యగుసంస్కృతభాషయందు మదాలసచరిత్ర, సత్యభామాపరిణయము, సకల కథాసారసంగ్రహము, జ్ఞానచింతామణికృతియును, రసమంజరి మొద లగుశృంగారకావ్యములును రచించిన నీకు నాంధ్రభాష యసాధ్యంబు కాదు గావున నాయాంధ్రభాషయందును మాకుఁ బ్రియ మగున ట్లొక్క ప్రబంధంబు రచియింపు మని తెలుఁగువల్లభరాయఁడు పలికె నని భావము.

ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న విను నే మేము దాల్చినమాల్య మిచ్చిన
ప్పిన్నది రంగమం దయిన పెండిలి[1] సెప్పుము మున్ను గొంటి నే
వ న్ననదండ యొక్క మగవాఁ డిడ నేను దెలుంగురాయఁడన్
గన్నడరాయ యక్కొడుకఁగప్పు ప్రియాపరిభుక్తభాక్కథన్. 14

టీ. ఎన్నినున్=ఏనిన్ను, కూర్తు నన్నన్ = కూర్తు నంటి వేని, వినుము. ఏన్=నేను, మును=(తాను)ముందుగా, తాల్చిన=ధరించిన, మాల్య మిచ్చు = దండను సమర్పించిన, అప్పిన్నది=ఆచిన్నదియు, తాను (చూడికుడుత్తనాంచా రనుట), రంగమందున్=శ్రీరంగమందు, ఆయిన=చేసికొనిన, పెండిలి=వివాహమును, చెప్పుము=రచింపుము. మున్ను=పూర్వ

1. పెండ్లియ చెప్పుము.

మందు, ననపండ = పుష్పమాలికను, ఒక్కమగవాఁ డిడన్ = ఒక్కపురుషుఁ డీఁగా, ఏవన్ = అసహ్యముచేతను, గొంటివి = గ్రహించితివి. నేను, తెలుంగురాయఁడన్ = తెలుఁగువల్లభరాయఁడను, కన్నడరాయ = ఓకర్ణాటరాజా ! ప్రియాపరిభుక్తభాక్కథన్ - ప్రియా = ప్రియురాలిచేతను, పరిభుక్త = లెస్సగా ననుభవింపఁబడినమాల్యమును, భాక్ = పొందినరంగమన్నారు స్వామియొక్క, కథన్ = కథచేతను, అక్కొదువన్ = అట్టితక్కువను, కప్పుము = ఆచ్ఛాదింపుము.

తా. శ్రీరంగనాయకాద్యర్చావతారములలో నేయర్చావతారము వహించిన నిన్ను నాగ్రంథమునందుఁ గూర్తు నంటివేని వినుము. నేను, పూలదండలను దొలుతఁ దానే ధరించి పిమ్మట నవి నాకు సమర్పించినచిన్నది యగుచూడికుడుత్తనాంచారనియెడుపాలఁతియు శ్రీరంగమందుఁ బెండ్లాడినకథను జెప్పుము. పూర్వము కృష్ణావతారమందు నొకపురుషుఁ డగు మాలాకారుఁ డొసంగిన పుష్పమాలికను మే మిష్టము లేక గ్రహించియున్నాము గావున నట్టికొఱంత దీఱునట్లు ప్రియురాలు మున్న దాననుభవించి పిదప నొసంగఁగాఁ బ్రీతిచేత గ్రహించి యాదండను బూనుకొన్నవాఁ డగు రంగమన్నారులకథఁ జెప్పుము. దానివలనఁ గాని పురుషదత్తమాల్యధారణ మను పొచ్చెము వదల దని భావము.

మతాంతరమందు మగవాఁడన్నయెడ విష్ణుచిత్తుం డని యన్వయించి తత్సమర్పితమాల్య మిష్టములేక గ్రహింపఁబడినట్లును, అక్కొఱంతను ప్రియాపరిభుక్తభాక్కథచేత నాచ్ఛాదింపు మనినట్లును నూహించినవిధంబునఁ గానఁబడుచున్నది.

ఆ. తెలుఁగ దేల యన్న దేశంబు దెలుఁ గేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁ గొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

టీ. తెలుఁగదేలయన్నన్ = తెనుఁగుకావ్య మేలయంటివేని, దేశంబు = నే నివసించియున్నదేశము, తెలుఁగు - తెలుఁగుది, ఏను - నేను, తెలుఁగువల్లభుండన్ = తెలుఁగు రాయఁడను, తెలుఁగొక్కటియే, (అనఁగా నది వింత గా దనుట). ఎల్లనృపులు గొలువన్ = సకలరాజన్యులు సేవింపఁగా, బాసాడి = నీవు సంభాషించి, ఎఱుఁగవే = కాక్వర్థము వలన సకలదేశభాషల నెఱుఁగుదు వనుట. దేశభాషలందుఁ దెలుఁగులెస్స.

తా. ఇన్ని సంస్కృతగ్రంథంబుల వ్రాసిన నన్నుఁ దెలుఁగున నేల ప్రబంధము వ్రాయు మని సెలవిచ్చుచున్నా వనవలదు. ఏ మనఁగా నేను నివసించియున్నదేశము తెలుఁగుదేశము. నేను దెలుఁగువల్లభుఁడను. తెలుఁగు క్రొత్తది గాదు. సకలసామంత

రాజులును గొలుచుచుండఁగా నీవు సకలదేశభాషలను మాటలాడుచుండుట లేదా? సమస్తమైన దేశభాషలలోను దెలుఁగే కదా చక్క ని బాస.

క. అంకితమో యన నీ కల, వేంకటపతి యిష్టమైన ౹ వేల్పగుటఁ దదీ
[1]యాంకితము సేయు మొక్కొ,క, సంకేతమ కాకతఁడ ర ౹ సన్నేఁగానే.

టీ. అంకితమో యనన్ = ఎవ్వరిపేర నంకిత మొనర్తు నంటివేని, నీకున్, అల వేంకటపతి = ఆవేంకటరమణుఁడు, ఇష్టమైనవేల్పగుటన్ = ఇష్టదేవత గావున, తదీయాంకితము = ఆవేంకటరమణసంబంధి యగునంకితమే, చేయుము = ఒనర్పుము. (అట్లు చేసిన నీ కేమిలాభ మని శంకింపఁగా నాశంకను బరిహరించుచున్నాఁడు.) ఒక్క సంకేతమ కాక=ప్రత్యేకనామ భేదమే కాక, రసన్ = భూమియందు, అతఁడ=ఆవేంకటేశ్వరుఁడే, నేఁ గానే = నేను గానా.

తా. నేను వ్రాయు ప్రబంధ మెవరి కంకితము చేయుదు నందువేమో వినుము. నీ కల్లవేంకటేశ్వరస్వామి యిష్టదైవమే కనుక నతనిపేర నంకితముచేయుము. నాకును నతనికిని పేరుమాత్రమే భేదముగాని నేనే యతఁడు, అతఁడే నేను.

తే. పొత్త మిటు సేయ నీ కుత్తరోత్తరాభి
వృద్ధి యని పోవ మేల్కొని ౹ వెఱఁగుతోడి
భక్తిఁ దద్గృహాగోపుర ౹ ప్రణతిఁ జేసి
వేఁగుటయుఁ గల్యకరణీయ ౹ [2]విధులు దీర్చి. 17

టీ. పొత్తము = పుస్తకము (ప్రబంధ మనుట.) ఇటు = ఉక్తక్రమముగా, చేయన్=చేయఁగా, నీకున్, ఉత్తరోత్తరాభివృద్ధి = ఒకనాటికంటె నొకనాటి కభివృద్ధి (అగును), అని, పోవన్ = వేంచేయఁగా, మేల్కొని= (నేను) నిదురలేచి, వెఱఁగుతోడి = ఆశ్చర్యముతోఁగూడిన, భక్తిన్ = భక్తిచేతను, తద్గృహగోపురప్రణతిన్ = ఆయాంధ్రనాయకస్వామియొక్క యాలయగోపురప్రణామ మాచరించి, వేఁగుటయున్ = ప్రభాతము గాఁగానే, కల్య = ప్రత్యూషకాలమందు, కరణీయ = చేయఁదగిన, విధులు = సంధ్యావందనాదివిధులను, తీర్చి = నెఱవేర్చికొని.

తా. నేను జెప్పినచొప్పునఁ బ్రబంధము వ్రాసితివేని నీ కుత్తరోత్తరము నభివృద్ధి యగు నని చెప్పి స్వామి యంతర్ధానము గాఁగా నేను మేలుకొని యాశ్చర్యపడుచు భక్తితో నాస్వామియాలయగోపురమునకు నమస్కారము చేసి తెల్లవాఱఁగానే నిత్యకృత్యములు నెఱవేర్చికొని.

వ. నిండోలగం బుండి దండనాథసామంతసందోహంబులం బిలిపించి వెం
దలకడన మందిరంబుల కనిపి(చి) వివిధవేదాగమవిదు లగువిద్వజ్జనంబులఁ

---

1. యాంకితమె సేయు మొక్కొకసంకేతముగాక యతఁడ నరి నేగానా? 2. వితతి.

గాన్పించికొని నమస్కరించి యాశుభస్వప్నంబు వినిపించిన హర్షించి వారును సవిస్మయస్వాంతు లయి, దేవా! దేవదేవుండు విజయంబుఁ జేసిన యాస్వప్నం బనేకశోభనపరంపరలం దెలుపుచున్నయది, యెట్లనినఁ బ్రథమ మప్పద్మేక్షణ స్వప్నసాక్షాత్కారం బితోధిక భక్తియు, నతండు ప్రబంధనిబంధనంబుఁ గావింపు మనుట యితోధికాగాధ సారస్వతోద్బోధనంబును, నతని దేవీసమాగమం బితోధికాఖండ భాండాగారసమృద్ధియు, నతనియాసతిచేతివిశదశతచ్ఛదం బితోధికాద్వితీయసితచ్ఛత్రతయు, నతం డశేషనృపసేవం దత్తద్భాష లెఱుంగవే యనుట యితోధికసమస్తసామంతసమాజసమాకర్షణంబును, బ్రియోపభోగపరిశిష్టభోగం బిం పనుట యితోధికబహుప్రేయసీప్రాప్తియు, నీకుఁ గృతి సెప్ప నుత్తరోత్తరాభివృద్ధి యగు ననుట యితోధికాపత్యపరమాయురవాప్తియు నగు నఖర్వమహిమాతిధూర్వహుం డగుతుర్వసువంశంబున బుట్టినట్టి నీ కిట్టిశోభనంబు లే మద్భుతంబు లవధరింపుము. 18

టీ. నిండు=పరిపూర్ణ మగు, ఓలగంబుండి=సభయందుండి, దండనాథ = సేనానాయకులయొక్కయు, సామంత = సామంతరాజన్యులయొక్కయు, సందోహంబులన్ = సమూహములను, పెంపలకడన = జేపకడనే, మందిరంబుల కనిపి = ఉనికిపట్లకుం జన సెల వొసంగి, వివిధ=పలు తెఱంగు లగు, వేద=వేదములను, ఆగమ=పాంచరాత్రాద్యాగమములను, విదులగు=ఎఱింగిన, విద్వజ్జనంబులన్=విద్వాంసులను, గాన్పించికొని= దర్శనము చేయించుకొని, నమస్కరించి=(వారికి) మ్రొక్కి, ఆశుభస్వప్నంబు = తాఁగన్న కలను, వినిపించినన్, వారును=ఆవిద్వాంసులును, హర్షించి సంతోషించి, సవిస్మయ ఆశ్చర్యముతోఁగూడిన, స్వాంతులై = చిత్తముకలవారై, దేవా= ఓరాజా, దేవదేవుండు=దేవతలకు దేవుఁ డయిననారాయణుఁడు, విజయంబుఁ జేసిన = విచ్చేసిన, ఆస్వప్నం బనేక శోభనపరంపరలం దెలుపుచున్నయది = ఆకల పెక్కుశుభపరంపరల కాస్పదంబై యున్నది. ఎట్లనిన, ప్రథమము=మొదట, అప్పద్మేక్షణ=ఆకమలాక్షునియొక్క, స్వప్న సాక్షాత్కారము = కలలోఁ బ్రత్యక్షదర్శనము, ఇతోధికభక్తియన్=ఇంతకంటె నధిక భక్తియును, 'దృశ్యతే భగవాన్ యస్య స్వప్నే సర్వ శుభావహః, తస్మిన్నేవ దృఢా భక్తి ర్జాయతే తస్య సంతతమ్' సకలమంగళములను గలిగించు విష్ణు వనఁగా నెవనికలలో భగవానుఁడు కనుపడునో వాని కెప్పుడును నాభగవానునియందె దృఢమైన భక్తిగలుగును. (అనియుండుటచే స్వప్నమందు భగవత్సాక్షాత్కారము భక్తిసాంతత్యకారకము),

అతండు - ఆదేవుఁడు, ప్రబంధనిబంధనంబుల్ = గ్రంథసందర్భమును, తావింపు మనుట= చేయు మనుట, ఇతోధిక=ఇంతకతిశయ మగు, అగాధ = గంభీరమగు, సారస్వత=విద్య యొక్క, ఉద్బోధనంబును=జ్ఞానమును, అతనిదేవీసమాగమంబు=ఆవిష్ణుపత్నిరాక, ఇతో ధిక=ఇంతకు మిక్కిలియగు, అఖండ=ఎడతెగని, భాండాగార=ధనమునిలువ చేయునిండ్ల యొక్క, సమృద్ధియుల్=సంపూర్ణత్వమును, అతని=ఆవిష్ణునియొక్క, ఆసతిచేతి-ఆలక్ష్మి చేతనున్న, విశదశతచ్ఛదంబు-విశద=శుభ్రమగు, శతచ్ఛదంబు= శతపత్త్రము, (తామర పువ్వు)ఇతోధిక=ఇంతకంటెనెక్కుడగు, అద్వితీయ = ఏకమైన, సితచ్ఛత్త్రతయుల్ = శ్వేతచ్ఛత్త్రము గలుగుటయును, అతఁడు=ఆదేవుఁడు, అశేషనృప=సకలరాజులయొక్క, సేవల్ = భజించుటచేతను, తత్తద్భాషలు - ఆయాదేశభాషలను, ఎఱుంగవే యనుట= తెలిసికొనవా యనుట, ఇతోధిక = ఇంతకంటె నధికులగు, సమస్తసామంత=ఎల్లసమాన రాజులయొక్క, సమాజ=సమూహముయొక్క, సమాకర్షణంబును=రాఁబట్టుటగూను, ప్రియా = ప్రియురాలియొక్క, ఉపభోగ = అనుభవమునుండి, పరిశిష్ట = శేషించిన (మాల్య మను) వస్తువుయొక్క, భోగము=అనుభవము, ఇంపనుట=ఇష్ట మనుట. ఇతోధిక= ఇంతకంటె నధికమగు, బహు = పలువు రగు, ప్రేయసీ = ప్రియురాండ్రయొక్క, ప్రాప్తియుల్ = లాభమును, కృతిఁ జెప్పనుత్తరోత్తరాభివృద్ధి యగు ననుట=ప్రబంధనిర్మాణ మును జేసినచో నీకు నొకనాఁటికంటె నొకనాఁటికి శ్రేయస్సగు ననుట, ఇతోధికాపత్య పరమాయురవాప్తియుల్ = ఇంతకంటె నధిక మగుసంతానము, సంపూర్ణ మగునాయువు లభించుటయు, అగుల్ = కలుగును. అని శోభనపరంపరలం దెలుపుచున్న దని పూర్వ ముతో నన్వయము. అఖర్వ = కుఱుచగాని, (అధికమైన) 'ఖర్వో హ్రస్వశ్చ వామనః' అని అమరము. మహిమ=మహత్త్వముచేతను, అతిధూర్వహుండగు = మిక్కిలిధురంధరుఁ డైన, తుర్వసు = తుర్వసుఁడనుపురుషునియొక్క, వంశంబునల్ = కులమునందు, పుట్టి నట్టి = జనించినయట్టి, నీకుల్ = నీకు, ఇట్టిశోభనంబులు = ఇటువంటిశుభంబులు, ఏమద్భుతంబులు=ఏమాశ్చర్యకరములు, (అద్భుతంబులు కా వనుట.) అవధరింపుము = చిత్తగింపుము.

సీ. కలశపాథోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
యనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టుననార్తవంపుఁబువ్వు
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాని
[1]పుట్టు కామని లేనిమెట్టపంట

1. పుట్టఁగా నని.

కటికిచీఁకటితిండికిఁ గరములఁ గిలిగింత
నెవ్వాఁడు దొగకన్నెకు నవ్వఁ[1] జెనకు
తే. నతఁడు వొగడొందు మధుకైటభారి మఱఁది
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమిపరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. 19

టీ. కలశపాథోరాశి = క్షీరసముద్రముయొక్క, (అమృతప్రాప్తికై దేవాసురులు మథించునెడఁ గలశప్రాయ మగుటంజేసి సముద్రము కలశపాథోరాశి యనఁబడినది.) గర్భ=లోపలి, వీచిమతల్లి = తరంగశ్రేష్ఠము, కడుపారన్=గర్భము పరిపూర్ణ మగునట్లు, ఎవ్వానిన్ = ఏచంద్రుని, కన్నతల్లి = ప్రసవించిన జననియో (అనఁగాఁ జంద్రుఁడు క్షీరసముద్రమందుఁ బుట్టినవాఁడు గనుక నిచ్చటితరంగమునకు మాతృత్వము తోఁచుచున్న దనుట), ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు. అనలాక్షు = ఫాలాక్షుఁ డగుశివుని యొక్క, ఘన=నష్టమైన, జటా = జడ యనెడు, వనవాటికిన్ = వనప్రదేశమునకు, వన్నెపెట్టు=శృంగారించెడు, అనార్తవంపు = ఋతుసంబంధికాని. పువ్వు = పుష్పమో (అనఁగా శివుఁడు శిరస్సునధరించినాఁ డనుట.), ఎవ్వానిపుట్టుక = ఏచంద్రునిజన్మము, సకలదైవత=ఎల్లవేల్పులయొక్క, బుభుక్షా=పేరాఁకటియొక్క, పూర్తికిన్ = తీఱుటకు, ఆమనిలేని = నుఱిపిడికాలములేని, మెట్టపంట = దేవమాతృకభూఫలమో, ('ప్రథమాం పిబతే వహ్నిః' అను మొదలయినప్రమాణము ననుసరించి యనుట.) ఎవ్వాఁడు= ఏచంద్రుఁడు, కటికి = కఠినమగు, చీఁకటి = అంధతమసము, తిండి=భక్షణముగాఁగల, కరముల=కిరణములయొక్క, గిలిగింతన్ = చక్కిలిగింతచేతను, తొగకన్నెన్=కలువ తీఁగయనియెడు కన్యకను, నవ్వన్=నవ్వునట్లు, చెనకున్ = స్పృశించునో, మధుకైటభారిమఱఁది = మధుకైటభు లనురాక్షసులకు శత్రు వగు విష్ణునకు మఱఁదియు, కళల = షోడశకళలయొక్క, నెలవగువాఁడు = స్థానమైనవాఁడు, చుక్కలఱేఁడు = నక్షత్రనాథుఁడు, మిసిమిపరసీమ-మిసిమి = కాంతికి, పరసీమ = ఎక్కుడగు పొలిమేఱయైనవాఁడు, వలరాజు మేనమామ = మన్మథునికిఁ దల్లితోఁబుట్టినవాఁడు, వేవెలుంగులదొర= సహస్రకిరణములు గల దొర యగు సూర్యునియొక్క, జోడు = ఉద్దియగువాఁడు, రేవెలుంగు=రాత్రియందుఁ బ్రకాశించెడువాఁ డగు, అతఁడు = ఆచంద్రుఁడు, పొగడొందున్=నుతింపఁబడును.

తా. కృష్ణదేవరాయలవంశంబునకు మూలంబగు చంద్రుఁడు పాలసముద్రంబునం బుట్టినాఁ డనియును, శివునిజటాజూట మలంకరించినాఁ డనియు, సమస్త దేవతలకును, దున్నక, చల్లక, కోయక, నుఱువక, కాలనిర్ణయములేక, ఆఁకటి కొది

1. జేయు.

గెడుసుకరమగునాహారమైనవాఁ డనియుఁ (మహోపకారియనుట) దనకిరణములచేతఁ గలువతీఁగ యనుకన్యకను నవ్వఁజేయు ననుటవలన మహారసికుఁ డనియును, విష్ణునవు మఱఁది యనుటవలన మిక్కిలి యాభిజాత్యము గలవాఁ డనియును, కళానిధి యనుట వలనఁ గాంతిమంతుఁ డనియును, చుక్కలఱేఁ డనుటవలన రాజ్యపరిపాలనశీలుఁ డని యును, మిసిమిపరసీమ, వలరాజు మేనమామ యనుటవలన లావణ్యసౌందర్యాదిగుణ ములు గలవాఁ డనియును, సూర్యసఖుఁ డనుటవలనఁ బ్రతాపగుణముగలవాఁ డని యును, రేవెలుం గనుటవలన స్వయంప్రకాశుఁ డనియును భావము.

తే. ఆసుధాధామవిభవమహాంబురాశి
కుబ్బు మీఱంగ నందనుం డుదయ మయ్యె
వేదవేదాంగశాస్త్రార్థవిశదవాస
నాత్తధిషణాధురంధరుం డైనబుధుఁడు. 20

టీ. ఆసుధాధామ = అల్లచంద్రునియొక్క, విభవ = సంపద యనెడు, మహాంబురాశికిన్ = మహాసముద్రమునకు, ఉబ్బుమీఱంగన్ = సంతోష మతిశయించు నట్లుగా, నందనుండు = కుమారుఁ డగు, వేద = వేదములయొక్కయు, వేదాంగ = వేద ముల కవయవము లగు శిక్షాదులయొక్కయు, శాస్త్ర = మీమాంసాదిశాస్త్రములయొ క్కయు, అర్థ = అర్థములయొక్క, విశద = స్వచ్ఛమగు, వాసనా = సంస్కారము చేతను, ఆత్త = పొందఁబడిన, ధిషణా = బుద్ధియొక్క, ధురంధరుఁడైన = భారవాహి యగు, బుధుఁడు = బుధగ్రహము, ఉదయమయ్యెన్ = జనించెను.

తా. బుధుఁడు చంద్రునకుఁ దనయుఁడై సమస్త వేదశాస్త్రములయర్థంబులు లెస్సగాఁ దెలిసికొనియె ననుట.

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి జనియించె [1]సింహసదృశుఁడు తదుద్భా
జానికి వాయువు తనయుం
[2]డానృపతికిఁ దనయుఁడై యయాతి జనించెన్. 21

టీ. వానికిన్ = ఆబుధునకు, ప్రజ్ఞానిధి = మతిమంతుఁడును, సింహసదృశుఁడు = సింహసమానవిక్రముఁడును అగు, పురూరవుఁడు = పురూరవుఁ డనుచక్రవర్తి, జనియిం చెన్ = పుట్టెను. తదుద్భాజానికిన్ = ఆపురూరవచక్రవర్తికి, ఆయువు = ఆయు వను పేరు గలరాజు, తనయుండు = కుమారుఁడు, ఆనృపతికిన్ = ఆయూయువనురాజునకు, యయా తి = యయాతి యనుమహారాజు, తనయుఁడై = నందనుఁడై, జనించెన్ = జన్మమొందెను.

1. శక్ర. 2. డై నెగడె నతండు గనె యయాతినరేంద్రున్.

తా. బుధునకుఁ బురూరవుండును, బురూరవునకు నాయువును, నాయువునకు యయాతియు సుతులై పొడమి రని భావము.

క. అతనికియదుతుర్వసులను, సుతులుద్భవమందిరహిత సూదనులుకళా
న్వితమతులు వారిలోవి, శ్రుతకీర్తివహించెదుర్వసుఁడు గుణనిధియై.

టీ. అతనికిన్ = ఆయయాతిమహారాజునకు, యదుతుర్వసు లనుసుతులు = యదువు, తుర్వసుఁడు ననుతనయులు, అహితసూదనులు-అహిత = శత్రువులను, సూదనులు=మర్దించువారును, కళాన్వితమతులు - కళా = విద్యలతోడను, అన్విత = కూడుకొన్న, మతులు = బుద్ధిగలవారు, ఉద్భవమందిరి = పుట్టిరి. వారిలోన్ = ఆయదు తుర్వసులలో, తుర్వసుఁడు, గుణనిధియై = సుగుణనిధానమై, విశ్రుతకీర్తి వహించెన్ = ప్రశస్తమైన యశస్సును బొందెను.

తా. ఆయయాతికి యదుతుర్వసులను నిర్వురు తనయులు గలిగి రనియును, వారిలోఁ దుర్వసుఁడు కీర్తిమంతుఁడాయె ననియును భావము.

తే. వాని వంశంబు తుర్వసాన్వయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిలభువనాభిపూర్ణ[1] నిర్ణిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమునఁ బుట్టి. 23

టీ. వాని = ఆతుర్వసునియొక్క, వంశంబు = కులము, తుర్వసాన్వయమయ్యెన్ = తుర్వసకుల మయ్యెను. అందున్ = ఆకులమందు, పెక్కండ్రు = అనేకులగు, నృపులు = రాజులు, ఉదయంబునొంది = జనించి, నిఖిల=సమస్తములగు, భువన=లోకములందు, అభిపూర్ణ = నిండింపఁబడిన, నిర్ణిద్ర = ప్రకాశించెడు, కీర్తిన్ = కీర్తిచేతను, అధికులైరి = ఆధిక్యమును వహించిరి. తదీయాన్వయమునన్-తదీయ = ఆరాజులసంబంధియగు, అన్వయమునన్ = వంశంబునందు, పుట్టి = జననమంది. ఇది ముందఱిపద్యముతో నన్వయము.

తా. ఆతుర్వసుని వంశము తుర్వసవంశ మని పేర్పడినది. ఆవంశమందు పెక్కండిరాజులు పుట్టి సకలలోకములయందును నిండిన కీర్తిచేఁ గొప్పవా రయిరి. అటువంటి రాజుల వంశమునం దుద్భవించి;

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణిశరకమఠగ్రావసంఘాతవాతా
శనరాడాశాంతదంతిస్థవిర కిరుల జంఝాటము ల్మాన్చి యిమ్మే
దిని దోర్దండైక పీఠిన్నిలము పఱిచి కీర్తిమ్మతు ల్రోదసిం బ
ర్వనరాతుల్నమ్రులై పాదస్వ్యములఁగొలువఁదీ ప్రప్రతాపంబుఁజూపెన్.

1. నప్రపూర్ణ.

టీ. తిమ్మక్షితీశాగ్రణి = తిమ్మభూపాలశ్రేష్ఠుఁడు, ఘనుఁడై = అధికుఁడై, శర ...ఝాటముల్ - శర = గూఢవిప్రియకారియగు, కమఠ = కూర్మముయొక్కయు, గ్రావ = పర్వతములయొక్క, సంఘాత = సమూహముయొక్కయు, వాతాశనరాట్ - వాత = వాయువే, అశన = ఆహారముగాఁగలసర్పములయొక్క, రాట్ = రాజైనశేషునియొక్కయు, ఆశాంతదంతి - ఆశాంత = దిగంతములయందలి, దంతి = గజములయొక్కయు, స్థవిర = వృద్ధయిన, కిరి = ఆదివరాహముయొక్కయు, (శరశబ్దము మొదలుగాఁ గిరిశబ్దమువఱకు ద్వంద్వసమాస మగుటవలన నంతమందలికిరిశబ్దము బహువచనాంతమైనది). జంఝాటముల్ = జంజాటములను, మాన్చి = వదలించి, ఇమ్మేదినిన్ = ఈ భూమిని, దోర్దండైక పీఠిన్ - దోర్దండ = తనభుజాదండ మనియెడు, ఏక = ముఖ్యమగు, పీఠిన్ = పీఠమందు, తిరముపఱిచి = స్థిరముగా నిలిపి, కీర్తిద్యుతుల్ = యశఃకాంతులు, రోదసిన్ = భూమ్యాకాశములందు, పర్వన్ = వ్యాపింపఁగా, అరాతులు = శత్రువులు, నమ్రులై = తగ్గినవారై, పార్శ్వములఁగొలువన్ = చెంతలఁ జేరి సేవింపఁగా, తీవ్రప్రతాపంబున్ = తీక్ష్ణ మగుశౌర్యమును, చూపెన్ = కనబఱిచెను.

తా. ఆవంశమునందుఁ బుట్టి ఘనుఁడయిన తిమ్మదేవరాయఁడు మున్ను భూమిని భరించుచున్న యాదికూర్మ, సప్తకులపర్వత, శేష, దిగ్గజాదివరాహములయందు వరుసగాఁ గలిగిన శఠత్వకాఠిన్యవాతాశనత్వదూరనివాసిత్వవృద్ధత్వము లనుదోషములఁ జూచి యట్టి కమఠాదులతోడితోడును భూమికి లేకుండఁ దానే తనభుజంబున భరియించి శత్రువులు నమ్రులై తన్ను సేవించుచుండఁ దన కీర్తి ప్రతాపములు భూమ్యంతరిక్షంబులయందు వ్యాపింపఁజేసి భూమి కధికసౌఖ్యమును గలుగఁజేసె నని భావము.

క. వితరణఖని[1]యాతిమ్మక్షితిపగ్రామణికి దేవకీదేవికి నం
   చితమూర్తియీశ్వరప్రభుఁ, డతిపుణ్యుఁడు పుట్టె సజ్జనావనపరుఁడై.

టీ. వితరణఖని = దాననిధియగు, ఆతిమ్మక్షితిపతిగ్రామణికిన్ = అల్లతిమ్మభూపాలశ్రేష్ఠునకు, దేవకీదేవికిన్ = దేవకీదేవి యనునతనిభార్యకును, అంచితమూర్తి - అంచిత = ఒప్పుచుండెడి, మూర్తి = ఆకారముగల, అతిపుణ్యుఁడు = మిక్కిలిపుణ్యముగల, ఈశ్వరప్రభుఁడు = ఈశ్వరదేవరాయఁడు, సజ్జనావనపరుఁడై = సాధుజనసంరక్షణశ్రద్ధ గలవాఁడై, పుట్టెన్ = జనించెను.

తా. తిమ్మభూపాలునకును దేవకీదేవమ్మకును నీశ్వరదేవరాయలు పుట్టె నని భావము.

చ. బలమద మత్తదుష్టపుర భంజనుఁడై పరిపాలితార్యుఁడై
   యిలపయిఁ దొంటియీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప రూపతన్

---

1. య త్తిమ్మ.

జలరుహానేత్రలం దొఱఁగి శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెడుశత్రుభూవరులు మేనులఁ దాల్చినమన్మథాంకముల్.26

టీ. బల...జనుఁడై-బల = బలముచేతను, మద=గర్వముచేతను, మత్త=మదించిన, దుష్ట = దురాత్ములైనశత్రువులయొక్కయు(రాక్షసులయొక్కయు,) పుర=పట్టణములను (త్రిపురములను), భంజనుఁడై=భంగపఱుచువాఁడై, పరి...ర్యుఁడై, పరిపాలిత=సంరక్షణము చేయఁబడిన, ఆర్యుఁడై = పెద్దలుగలవాఁడై, (పార్వతిగలవాఁడై), తొంటియీశ్వరుఁడె = మొదటి యీశ్వరుఁడే (అనఁగా శివుఁడే), ఇలపయిన్ = భూమిమీఁదను, ఈశ్వరుఁడై=ఈశ్వరరాజై, జనియింపన్=పుట్టఁగా, జలరుహానేత్రలన్ = స్త్రీలను, తొఱఁగి = విడిచి, శైలవనంబులన్=పర్వతారణ్యములయందు, భీతచిత్తులై = భయపడినమనస్సుగలవారై, మెల...రులు-మెలఁగెడు = సంచరించెడు, శత్రుభూవరులు=శత్రురాజులు, మేనులన్=దేహములందు, తాల్చి...కముల్-తాల్చిన=ధరించిన, మన్మథాంకముల్=మదనలాంఛనములు, రూపఱెన్ = రూపుమాసెను.

తా. అనఁగా నాయీశ్వరరాజుశత్రువు లతనిదాడికి నిలువం జాలక ప్రియురాండ్రను విడిచి కొండలయందు నడవులయందును భయము పడుచుఁ దిరుగు నపుడు వారి దేహములందలి మన్మథ చిహ్నములు మాసె ననియు నీశ్వరసందర్శనముచే మన్మథ చిహ్నములు మాయుట యుక్త మనియు భావము.

ఇందలి విశేషణములు, శివపరముగాను, రాజపరముగాను నన్వయించుటవలన శ్లేషాలంకారము.

సీ. నిజభుజాశ్రితధారుణీవజ్రకవచంబు, దుష్టభుజంగాహితుండికుండు
వనజేక్షణామనోధనపశ్యతోహరుం, డరిహంసపంసదభ్రాగమంబు
మార్గణగణపికమధుమాసదివసంబు,గుణరత్నరోహణక్షోణిధరము
బాంధవసందోహపద్మవనీహేళి, కారుణ్యరసనిమ్నగాకళత్రుఁ
తే. డన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె
ధరణిధవదత్తవివిధోపదావిధాన
మార్జితశ్రీవినిర్జితనిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యీశ్వరుండు. 27

టీ. నిజ...చంబు - నిజ = స్వకీయమగు, భుజ = బాహువును, ఆశ్రిత = ఆశ్రయించిన, ధారుణీ=భూమికి, వజ్రకవచంబు=మగతాలమైమఱువయినవాఁడును, దుష్ట...కుండు, దుష్ట=దుర్మార్గు లనియెడు, భుజంగ = సర్పములకు, అహితుండికుండు = పాములం బట్టెడువాఁడును, వన...హరుఁడు - వనజేక్షణా = కమలలోచనలగుస్త్రీలయొక్క, మనః=మనస్సు లనియెడు, ధన=ధనములకు, పశ్యతోహరుండు = ప్రత్యక్షచోరుఁడును,

అరి...మంబు-అరి=శత్రువు లనియెడు, హంస = అంచలయొక్క, సంసత్ = సమూహ
మునకు, అభ్రాగమంబు-అభ్ర=మేఘములయొక్క, ఆగమంబు = కాలమును, (వర్షర్తు
వనుట), మార్గ...సంబు - మార్గణ=యాచకులయొక్క, గణ = గుంపులనియెడు, పిక=
కోయిలలకు, మధుమాస = వసంతమాసముయొక్క, దివసంబు = దినమువంటివాఁడును,
గుణరత్నరోహణక్షోణిధరము-గుణ = గుణములనియెడు, రత్న=మణులకు, రోహణక్షోణి
ధరము=రోహణపర్వతమైనవాఁడును, బాంధ...హేళి - బాంధవసందోహ = బాంధు
సమూహమనెడి, పద్మవనీ = కమలవనమునకు, హేళి = సూర్యుఁడును, కారు...కళ
త్రుఁడు-కారుణ్యరస = కరుణయనుఉదకమునకు, నిమ్నగాకళత్రుఁడు=నదీభర్తయగుసము
ద్రుఁడును, అనన్=అనఁగా, ధర...రుఁడు - ధరణీధవ = రాజులచేత, దత్త=ఈఁబడిన,
వివిధ = పలుతెగలగు, ఉపదా = కానుకలయొక్క, విధా=ప్రకారముచేత, సమార్జిత=
సంపాదింపఁబడిన, శ్రీ=సంపదచేత, వినిర్జిత = జయింపఁబడిన, నిర్జరాలయ = స్వర్గము
నకు, ఈశ్వరుఁడు=ప్రభువగునింద్రుఁడుగల, తిమ్మభూపతియీశ్వరుండు = తిమ్మభూ
పాలపుత్రుఁ డగునీశ్వరదేవరాయఁడు, జగంబులన్ = జగత్తులయందు, మిగులన్=అతి
శయించునట్లు, ప్రఖ్యాతిఁగాంచెన్ = కీర్తిఁబొందెను.

తా. తిరుమలదేవరాయలకుమారుఁడగు నీశ్వరదేవరాయఁడు రాజులపలని కప్పం
బులచే నధికసంపద గలవాఁడయి తనయైశ్వర్యముచే నింద్రుని జయించుచుఁ దనభుజము
నాశ్రయించినభూమికి వజ్రకవచం బన దుష్టజను లను బాములను బాములవానివలెఁ
జెండాడుచును, మిగుల సొగసగువాఁడు గావున మగువలమనంబులఁ దనచక్కఁదనంబుచే
నాకర్షించుచు వానకాలము హంసలను దఱిమినట్లు శత్రువులను దఱుముచుఁ గోయిల
లకు వసంతర్తువట్లు యాచకులకుఁ దాను సంతోషకరుండై రత్నంబులు రోహణపర్వతం
బునందుంబలె గుణంబులు దనయందు వెలుఁగొంద సూర్యునిఁ గాంచినపద్మవనంబుచందం
బునఁ దన్నుం గాంచి చుట్టంబులు ముదంబునం బొదల సముద్రంబున నెడఁ బడనిజలంబట్లు
తనహృదయంబునఁ గారుణ్యరసం బూరుచుండ నేలుచున్నాఁ డని లోకంబులందు
విఖ్యాతి వహించెను.

క. ఆయీశ్వరనృపతికిఁ బుణ్యాయతమతి యైనబుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితులుదయించిరి, ధీయుతు[1]లగునారసింహతిమ్మనరేంద్రుల్.

టీ. ఆయీశ్వరనృపతికిన్ = ఆయీశ్వరదేవరాయలకును, పుణ్యాయతమతి
యైన=పుణ్యములయందు విశాలమగు మనస్సుగల, బుక్కమాంబకున్=బుక్కమ్మకును,
తేజ...తులు-తేజః= తేజముచేతను, తోయజహితులు = సూర్యులును, ధీయుతులు=బుద్ధి
మంతులును, అగు = అయిన, నారసింహతిమ్మనరేంద్రుల్ = నరసింహదేవరాయలును
తిరుమలదేవరాయలును, ఉదయించిరి=జననమందిరి. ఈపద్యమున రెండవచరణమందు

1. లై.

బుక్కమాంబ యనుచోట సంబాళశబ్దభవ మైనయమ్మ యనునది తేలఁబలికిన సమ మైనది గనుక బుక్కమ యని యుండఁ గా దానిపైని మరల సంబాళబ్దము ప్రయోగించి నందునఁ బౌనరుక్త్యముగాఁ గానఁబడుచున్నది. ఇందుకు 'ఆర్యాంబాదికశబ్దా స్స్వ ర్యత శ్చేత్ప్రోక్తార్థగోచరాః, తత స్తదంతశబ్దేభ్యో నైవశ్చేత్ప్రోక్తార్థగోచరాః' అని యధర్వణ వచనము. ఈతీరున నున్నను నీప్రకారముగాఁ బ్రయోగించుటకుఁ బూర్వకవిప్రయోగ ములుగూడఁ గలవు.

తా. అటువంటి యీశ్వరరాజునకును, బుణ్యాత్మురాలైన బుక్కమ్మకును, సూర్యునివంటి తేజశ్శాలురును, బుద్ధిమంతులును నగు నరసింహరాజును, తిమ్మరాజును బుట్టిరి.

క. అందు నరసప్రభుఁడు హరి
చందనమందారకుంద ౹ చంద్రాంశునిభా
స్పందయశ స్తుందిలది
క్కందరుఁ డై ధాత్రి యేలెఁ ౹ గలుషము లడఁగన్. 29

టీ. అందున్ = వారిరువురందును, నరసప్రభుఁడు = నరసింహదేవరాయఁడు, హరి...రుఁడై-హరిచందన = శ్రీగంధముతోడను, మందార = పారిజాతపుష్పములతోడను, కుంద = మల్లెపువ్వులతోడను, చంద్రాంశు = చంద్రకిరణములతోడను, నిభ = సమానమైనట్టి, అస్పంద = చలింపని, యశః = కీర్తిచేతను, తుందిల = పెద్దకడుపుగల, దిక్ = దిక్కులయొక్క, కందరుఁడై = గుహలుగలవాఁడై, కలుషములు = పాప ములు, అడఁగన్ = నశించునట్లు, ధాత్రి = భూమిని, ఏలెన్ = పాలించెను.

తా. వారిద్దఱిలో నరసభూపాలుఁడు హరిచందనాదులతో సమానమైన శుభ్రమైన తన కీర్తి దిగంతములయందు వ్యాపించుచుండఁగాఁ బాపము లడఁగిపోవునట్లు భూమిని బాలించెను.

సీ. అంభోధివసనవి ౹ శ్వంభరావలయంబు
ఘనబాహుపురి మర ౹ కతముఁ జేసెఁ
గకుబంతనిఖిలరా ౹ జ్ఞికరంబుఁ జరణమం
జీరంబు సాలభం ౹ జికలఁ జేసె
మహనీయనిజవిని ౹ ర్మలయశస్సరసికి
గగనంబుఁ గలహంస ౹ కంబుఁ జేసె
స్వశ్రాంతవిశ్రాణ ౹ నాసారలక్ష్మికిఁ
గవికదంబముఁ జాత ౹ కములఁ జేసె

తే. నతిశితకృపాణకృత్తమ త్తారివీర
మండలేశసకుండల మకుటనూత్న
మస్తమాల్యపరంపరా మండనార్చి
తేశ్వరుం డగునారసిం హేశ్వరుండు. 30

టీ. అతి...రుండు - అతిశిత = మిక్కిలివాఁడియగు, కృపాణ = ఖడ్గము చేతను, కృత్త = నఱుకఁబడిన, మత్త = మదించిన, అరివీర = శత్రులందువీరులగు, మండలేశ=రాజులయొక్క, సకుండలమకుట = కుండలకిరీటములతోఁగూడిన, నూత్న = నూతనములయిన, మస్త = శిరస్సులనియెడు, మాల్య = విరిసరములయొక్క, పరంపరా= సమూహముచేతను గలిగిన, మండన = అలంకారముచేతను, అర్చిత = పూజింపఁబడిన, ఈశ్వరుండు = సర్వేశ్వరుఁడు గలిగినవాఁడు, అగు = అయినట్టి, నారసింహేశ్వరుండు = నరసింహదేవరాయఁడు, అంభో...యంబున్ - అంభోధి = సముద్రము, వసన = వస్త్రముగాఁగల, విశ్వంభరా = భూమియొక్క, వలయంబున్ = వలయమును, ఘన...తమున్ - ఘన = గొప్పదైన, బాహుపురి = కేయూరమందలి, మరకతముఁజేసెన్ = మరకతమణినిఁజేసెను. కకు...రంబున్ - కకుప్ = దిక్కులయొక్క, అంత = చెఱఁగులయందలి, నిఖిల = సమస్తమయిన, రాట్ = రాజులయొక్క, నికరంబున్ = సమూహమును, చర...కలన్ - చరణమంజీరంబు - చరణ = పాదము యొక్క, మంజీరంబు = గండపెండేరముయొక్క, సాలభంజికలన్ చేసెన్ = ప్రతిమలఁ జేసెను, మహ...సికిన్ - మహనీయ = అధికమైయున్న, నిజ = స్వకీయమయిన, వినిర్మల = మిక్కిలి శుభ్రమగు, యశః = కీర్తి యనియెడు, సరసికిన్ = సరస్సునకు, గగనంబున్ = ఆకాశమును, కలహంసకంబుఁజేసెన్ = హంసవిశేషమును జేసెను. అశ్రా...లక్ష్మికిన్ = అశ్రాంత = ఎడతెగని, విశ్రాణన = వితరణ మనియెడు, ఆసార = ధారాసంపాతముయొక్క, లక్ష్మికిన్ = సమృద్ధికి, కవికదంబమున్ = కవీశ్వరసమూహమును, చాతకములఁజేసెన్ = చాతకపక్షులను జేసెను.

తా. నరసింహరాయలు యుద్ధరంగమందు బహిరంగముగా నెదిరించినశత్రు వీరులతలలు మకుటకుండలంబులతోడం గూడఁ దనఖడ్గంబున ఖండించి, అట్టి శిరంబులను విరులసరములచేఁ గఱకంఠుఁడు కపాలమాలాధరుఁడు గనుక నతని నలంకరించుచుఁ జతుస్సముద్రముద్రితభూవలయంబు ననాయాసంబుగ వహించి పాలించుచు సమస్త దేశాధీశ్వరులచే మ్రొక్కులు గైకొనుచు భూమ్యంతరిక్షంబులయందుఁ దనయశంబు నించి యెల్లప్పు డెడతెగనిదానంబులచేతఁ గవీశ్వరులకుఁ దృప్తి సేయుచుండె నని భావము.

తే. ఆనృసింహప్రభుండు దిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాయతాంశజు శ్రీకృష్ణరాయ నిన్ను. 31

టీ. శ్రీకృష్ణరాయ = కృష్ణదేవరాయా ! ఆనృసింహప్రభుఁడు = ఆనరసింహదేవరాయఁడు, తిప్పాంబవలనన్ = తిప్పమ్మాదేవివలన, వీరనరసింహరాయ భూవిభునిన్=వీరనరసింహరాయలను, నాగమాంబికవలనన్ = నాగమ్మవలన, అచ్యుతాయతాంశజున్ - అచ్యుత = శ్రీకృష్ణునియొక్క, ఆయత = పూర్ణమగు, అంశ = కళచేతను, జున్ = పుట్టినట్టి, నిన్నున్ = నిన్నును, నందనులన్ = పుత్త్రులనుగా, కాంచెన్ = పడసెను.

తా. ఆ నరసింహరాయలకు భార్యలగు తిప్పమ్మ, నాగమ్మ యనువారిలోఁ దిప్పమ్మకు వీరనరసింహరాయలును, నాగమ్మకు కృష్ణాంశసంభూతుఁడగు కృష్ణదేవరాయలును సుతులైరి.

క. వీరనృసింహుఁడు నిజభుజ,దారుణకరవాలపరుషధారాహత వీ
రారి యగుచు నేకాతప,వారణముగ నేలె ధరనవారణమహిమన్.

టీ. వీరనృసింహుఁడు = వీరనరసింహరాయఁడు, నిజ...యగుచున్ - నిజ = స్వకీయమగు, భుజ = భుజమందలి, దారుణ = భయంకరమైన, కరవాల = ఖడ్గముయొక్క, పరుష = కఠినమగు, ధారా = అంచుచేతను, హత = సంహరింపఁబడిన, వీర = వీరులైన, అరియగుచున్ = శత్త్రువులుగలవాఁడగుచు, అవారణమహిమన్ = అవారణ = అప్రతిహతమైన, మహిమన్ = మహత్త్వముచేతను, ధరన్ = భూమిని, ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రము గలుగునట్లుగా, ఏలెన్ = పాలించెను.

తా. వీరనృసింహరాయఁడు తనఖడ్గముచేత నెదురించినవీరులగు శత్త్రువుల నణఁచి యడ్డములేని విజృంభణముచేత నేకచ్ఛత్రాధిపతియై భూమినిఁ బాలించెను.

క. ఆవిభునకంతరంబ ధ
రావలయముఁ బూని తీవు రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగాన్. 33

టీ. ఆవి...రంబ - ఆవిభు = ఆవీరనృసింహరాయలయొక్క, అనంతరంబ = తరువాతనే, తీవు = నీవు, తిరుమల్దేవియున్ = తిరుమలయమయు, అన్నపూర్ణాదేవియున్ = అన్నపూర్ణయు నను, కమలాబ్జముఖులు = కమలములవంటియు, చంద్రునివంటియు ముఖముగలవారు, దేవేరులుగాన్ = పట్టపుదేవులుగాఁగా, ధరా

వలయమున్ = భూవలయమును, రహిమైన్ = సంతోషముచేతను, పూనితివి = వహించితివి.

తా. జ్యేష్ఠుఁ డగు నారసింహరాయలపిమ్మటఁ గృష్ణదేవరాయలు భూభార మును వహించె ననియును, దిరుమల్దేవి, యన్నపూర్ణాదేవి యతనికిఁ బట్టపుదేవు లనియును భావము.

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు
నతివృష్టిదోషభయంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి
భృత్కటకం బెల్ల నెత్తువడియె
మాసె నఘస్ఫూర్తి మరుభూములందును
నెల మూఁడువానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిలసద్ద్విజమును
నానంద మగుమన్కి నతిశయిల్లెఁ
తే. ప్రజల కెల్లను గడు రామరాజ్య మయ్యెఁ
జారుసత్త్వాఢ్య! యీశ్వరనారసింహ
భూవిభునికృష్ణరాయ! యభ్యుదయ మొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బాలింపఁగాను. 31

టీ. చారుసత్త్వాఢ్య - చారు = ఒప్పిదమగు, సత్త్వ = సాత్త్వికగుణము చేతను, బలముచేతను, ఆఢ్య = ఘనుఁడవైనవాఁడా! ఈశ్వ...రాయ - ఈశ్వరనార సింహభూవిభుని = ఈశ్వరరాయలపుత్త్రుఁడగునారసింహరాయల తనయుఁడ వగు, కృష్ణ రాయ = కృష్ణదేవరాయా! నీవు, అభ్యుదయమొంది = శ్రేయస్సును జెంది, ధాత్రిన్ = భూమిని, పాలింపఁగాను = పాలించుచుండఁగా, జనులన్ = ప్రజలకు, ధూమ... క్షోభ - ధూమకేతు = తోఁకచుక్కవలని, క్షోభ = దుర్భిక్షము, తొలఁగెను = లేదా యెను. అతివృష్టిదోషభయంబు వాసెన్ = అధికవర్షదోషమువలని వెఱపు వదలెను. కంట...భీతి - కంటక = క్షుద్రవైరిరాజులయొక్క, ఆగమ = రాకవలని, భీతి = భయము, కడచెన్ = అతిక్రమించెను. ఉద్ధత...బెల్లన్ - ఉద్ధత = గర్వించిన, భూమిభృత్ = రాజులయొక్క, కటకం బెల్లన్ = రాజ్యమెల్లను, ఎత్తువడియెన్ = బలహీనమయ్యెను. అఘస్ఫూర్తి - అఘ = పాపములయొక్క, స్ఫూర్తి = అతిశయము, మాసెన్ = రూపుసెడియెను. మరుభూములందును = నిర్జలభూములయందును, నెల మూఁడువానలు = నెలకు మూఁడేసివానలు, నిండన్ = పరిపూర్ణమగునట్లు, కురిసెన్ =

వర్షించెను. ('మరుభూములందును' అనుసముచ్చాయక ద్రుతసారస్యమువలన ఫలవద్భూములందు సైతము పదిదినముల కొక్క వర్షము గురియు ననుట). ఆబాలగోపాలము = బాలురు గోపాలురు మొదలుగా, అఖి...మలు - అఖిల = సమస్తములగు, సత్=సజ్జనుల యొక్క, ప్రజమును=సమూహమును, ఆనంద మగు=సంతోషముగల, మనికిన్=బ్రదుకు చేతను, అతిశయిల్లెన్ = అధికమయ్యెను. ప్రజలకెల్లను = సమస్తజనులకును, కడున్ = మిక్కిలి, రామరాజ్యమయ్యెన్ = బాలమరణాదిపీడలులేని శ్రీరామరాజ్యమువలె నయ్యెను.

తా. కృష్ణదేవరాయలు శ్రేయస్సు గలిగి రాజ్యమేలుచుండఁగా, భూమిపై జనులకు దుర్భిక్షభయమును, అతివృష్టిభయంబు ననావృష్టిభయంబు మొదలగునీతిబాధలు లేవనియును, తగినకాలములయందుఁ గావలసినంత వానలు గురియుచుండె ననియును, బరరాజులు బాడి సేయ రనియును, బాలురు వృద్ధులు గోపకులు మొదలుగా నెల్ల వారలును నిరంతరసంతోషంబుఁ గాంతు రనియును, బాలమరణాదిదోషంబులు లేక శ్రీరామరాజ్యమై యుండె ననియును భావము.

క. తునియలు దొమ్మిదియఁట పదు
నెనమండ్రఁట మోచువా రనేకపకిటికూ
ర్మనగాహులు [1]లేటిలావరు
లని తావక బాహు[2]వాకఁడనె యవని భరించెన్. 35

టీ. తునియలు = భూఖండములు, తొమ్మిదియఁట = నవసంఖ్యాకంబులఁట, మోఁచువారు = వహించెడువారు, పదునెనమండ్రఁట = అష్టాదశసంఖ్యాకులఁట. అనే ...హులు - అనేకప=(రెంటఁబానము చేసెడి) దిగ్గజము లెనిమిదియును, కిటి = వరాహ మొక్కండును, కూర్మ = ఆదికూర్మ మొక్కండును, నగ = కదలనిపుల పర్వతంబు లేడును, అహులు = శేషుఁడొక్కండును, (ద్వంద్వాంతమున బహువచనము) వీరు, ఏటి లావరులు=ఏపాటిబలవంతులు అని, తావక = నీసంబంధ మగు, బాహు వాకఁడ = భుజ మొక్కఁడే, అవనిన్ = భూమిని, భరించెన్ = పూనెను.

తా. కృష్ణదేవరాయలభుజము మున్ను భూభారమును వహించియున్నవారగు గజ, వరాహ, కమఠ, కులపర్వత, శేషులను లెక్కించి పదునెనమండ్రని యెంచి భూభాగములు లెక్కించి భరతఖండాదినవఖండంబు లని తెలిసి యొక్కొక్క ఖండం బిద్దఱిద్దఱు వహించుచున్న ట్లూహించి వార లెట్టిబలవంతు లని యెగ్గించి యట్టితొమ్మిది ఖండంబులు గలభూమండలం బంతయుఁ దానే వహించె నని భావము. ఈ పద్యంబు నందలి 'యఁట' శబ్దద్వయం బనంగీకారార్థకంబై యున్నది.

1. లెంతలావరు. 2. వాకటి.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁ దాఁకి [1]తీండ్రించు
  నసిలోహమున వెచ్చనై జనించె
మఱి కొండవీఁ డెక్కి మార్కొని నలిరైన
  యలకసవాపాత్రు నంటి రాఁజె
నట సాఁగి జమ్మిలోయఁ బడి[1]వేఁగి దహించెఁ
  గోనఁ బిట్టేర్చెఁ గొట్టానఁ దవిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె
  నవల నాపొట్నూర - రవులుకొనియె
తే. [3]మాఁడెములు వ్రేల్చె [4]నొడ్డాది మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన నౌర నీ దురవగాహ
ఖేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ. 36

టీ. కృష్ణరాయ = కృష్ణరాయభూపాలా, నీదు...పాగ్ని - నీ = యొక్క, దురవగాహ = ప్రవేశింపశక్యము గానియట్లు, ఖేలత్ = క్రీడించుచున్న, ఉగ్ర = తీక్ష్ణమగు, ప్రతాప = ప్రతాపమనియెడు, అగ్ని = నిప్పు, తోఁకచిచ్చనన్ = దీర్ఘవహ్నిజ్వాలయో యన్నట్లు, తొలుదొల్తన్ = ప్రప్రథమమందు, ఉదయాద్రిశిలన్ = ఉదయగిరిదుర్గ మనియెడు చెకుముకిఱాతిని, తాఁకి = స్పృశించి, తీండ్రి...నన్-తీండ్రించు = జ్వలించెడు, అసి = ఖడ్గ మనియెడు, లోహమునన్ = అగ్నిజననకారణ మగునయఃపత్రికయందు, వెచ్చనై = వేఁడిమిగలదయై, జనించెన్ = అంకురించెను, (శిఖిముఖిశిలయును లోహపత్రికయు నొరసినప్పుడు నిప్పుపుట్టు ననుట), మఱి = పిమ్మట, కొండవీఁడు = కొండవీటిదుర్గమును, ఎక్కి = ఆరోహించి, మార్కొని = ప్రతిఘటించి, నలిరైన = నలఁగియున్న, అల = ఆప్రసిద్ధుండగు, కసవాపాత్రుఁ డనువానిని, (నలిరైన = నలఁగిన, కసవాపాత్రున్ = కసవాపాత్రుఁడనుకసవును), అంటి = తాఁకి, రాఁజెన్ = పొగసెను. (ఆనిప్పు నలఁగిన కసవుపైఁ బడినప్పుడు రాఁజు ననుట). అటన్ = అచ్చట, సాఁగి = వెడలి, జమ్మిలోయఁబడి = జమ్మిలోయ యనుప్రదేశము ప్రవేశించి, (జమ్మిచెట్లు గల బొఱియలోఁ బడియును), వేఁగిన్ = వేఁగినాడును, దహించెన్ = కాల్చెను. వేఁగి = ప్రకాశించి, (కాల్చె ననుట), కోనన్ = కోనసీమను, బిట్టు = కఠినముగా, ఏర్చి = కాల్చి, కొట్టానఁ దగిలెన్ = ఘోట్టాణ మనుదేశమం దంటుకొనియెను. (జమ్మిచెట్లు గాల్చి యాయగ్ని కొట్ట మనఁగా శాల గావున దాని నంటికొనె ననుట), కనకగిరి =

1. కెరలుసీ, యసిలోహ. 2. వేగ. 3. మాడుగులవ్రేల్చె నొడ్డాది మసియొనర్చె. 4. నొడ్డాణి.

కనకదుర్గముయొక్క, స్ఫూర్తిక్ = ఆధిక్యమును, కరఁచెక్ = కరఁగఁజేసెను. (అగ్ని వలన బంగారము కరఁగు ననుట), గౌతమిఁ గ్రాచెక్=గోదావరిని దపింపఁజేసెను, (అగ్నివలన జలంబులు దప్తము లగు ననుట), అవలక్=అనంతరమందు, ఆపొట్నూరక్=పొట్నూరను ప్రదేశమందు, రవులుకొనియెక్ = ప్రజ్వరించెను. (అగ్ని పొట్టుమీఁదఁ బడినప్పుడు రగులుకొను ననుట). మాఁడెములు ప్రేల్చెక్=మాఁడెము లనియెడుమన్నెపుదేశములు, కాల్చెను, ఒడ్డాది = ఓఢ్రదేశమును, మసియొనర్చెక్ =భస్మసాత్కృతముఁగావించెను. (అనఁగా బుగ్గిచేసె ననుట), కటకపురిక్ = కటకమనుపట్టణమును, గజరాజు=గజపతి, కలఁగి=కలఁతపడి, పఱవక్ = పలాయితుఁడు గాఁగా, కాల్చెక్ = దహించెను. కటకపురిక్ = పురివంటిగిరినితంబమును, గజరాజు = పర్వతమందలి గజశ్రేష్ఠము, పఱవక్=మంటఁ జూచి పఱుగులిడునట్లు, కాల్చెక్ = రగులఁబెట్టెను.

తా. కృష్ణదేవరాయలప్రతాపము ప్రథమమం దుదయగిరిదుర్గ మాక్రమించి పిమ్మటఁ గొండవీటిదుర్గముమీఁది కేఁగి కసవాపాత్రుని సంహరించి యచ్చటనుండి వెడలి జమ్మిలోయమీఁద నేఁగి వేఁగిదేశము నాక్రమించి కోనసీమఁ గైకొని కొట్టమును గ్రహించి కనకదుర్గమును బాడుఁజేసి గోదావరిని దపింపఁజేసి పొట్నూర వ్యాపించి మన్నెపుదేశము లాక్రమించి యోఢ్రదేశమును జయించి గజపతి భయంపడి పఱచునట్లు కటకపురి నాక్రమించె ననియును,ఆప్రతాప మగ్నివలె నుండె ననుటవలన నయ్యగ్ని యుదయగిరి యనుచెకిముకిశిలఁ దాఁకి కత్తియనెడుచెకుముకి కత్తియందుఁ దొలుతఁ బుట్టి కొండవీఁ డనుకొండయొక్క నలిదైనకసవాపాత్రుఁ డనుకసవు నంటి రాఁజు కొని జమ్మిచెట్లమీఁద వేఁగిచెట్లమీఁదఁ బడి దహించి కొట్ట మంటుకొని కనకదుర్గమనుకనకమును గరఁగఁజేసి గోదావరిలోనియుదకములఁ గ్రాఁగఁజేసి పొట్నూ రను పొట్టుమీఁదఁ బ్రజ్వరిల్లి యావలఁ గటకపురి యనుకొండదరియందుఁ జేరి యచ్చట నివసించుచున్నయేనుంగు పాఱిపోవునట్లా ప్రదేశమును దహించె నని యచ్చటచ్చట నుండెడు శబ్దములవలన రూపకాలంకారమును, ధ్వన్యలంకారమును దోఁచుచున్నది.

ఉ. చిత్రము కృష్ణరాయనృపశేఖర నీదగుధాటి కోడి స
ర్వత్ర నిలింపకామినులవాడకుఁ గాఁపులు వోదు రుత్కల
క్షత్త్రియపాత్రు లెల్లఁ గసుగందని[1] మేనులఁ దొంటిపెద్ద లే
సూత్రముఁ బన్నినారొ బలసూదనువీఁటికిఁ గొండవీఁటికిన్. 37

టీ. కృష్ణరాయనృపశేఖర = ఓకృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా! నీదగు = నీసంబంధమగు, ధాటికిక్ = ఔద్ధత్యముచేత, (ఇది విభక్తివ్యత్యయము), ఓడి=హతులై,

1. లాగుల.

సర్వత్ర = అన్నిదేశములరాజులు, నిలింపకామినులవాడకున్ = అప్సరస్త్రీలవాడకు, (అనఁగా స్వర్గమున కనుట. యుద్ధములోఁ జచ్చినవారు స్వర్గమందలి యచ్చరల యిండ్లకుఁ బోవుదు రని వర్ణించుట కవిసంప్రదాయము), కాఁపులు వోదురు = కాఁపురముగాఁ బోవుదురు. నీదగు=నీసంబంధియగు, ధాటికిన్ =దాడివెట్టుటకు, ఓడి = భయంపడి, ఉత్క...లెల్లన్ - ఉత్కల = ఓఢ్రదేశమందలి, క్షత్త్రియపాత్రులెల్లన్ = పాత్రనామధేయు లగురాజు లందఱును, కసుగందని = లేఁతవనము నెడనియట్టి, (కసువుచేతఁ గందని యని మఱియొక యర్థము). మేనులన్=శరీరములచేతను, నిలింపకామినుల=దేవతాస్త్రీలయొక్క, వాడకున్ = పట్టణమునకు, కాఁపులువోదురు=కాఁపురము లేఁగుదురు. తొంటిపెద్దలు = పూర్వపుఁబెద్దలు, బలసూదనువీటికిన్ = ఇంద్రపట్టణ మగుస్వర్గమునకును, కొండవీటికిన్ = కొండవీడనుపట్టణమునకు, ఏసూత్రమున్ =ఎట్టిసూత్రమును, పన్నినారో=గల్పించినారో, చిత్రము=ఆశ్చర్యము.

తా. కృష్ణరాయనృపశేఖరా! నీవు దాడి వెడలినప్పు డుత్కలదేశపు రాజులు భయపడి గఱిచిట్లనిశరీరములతోడన దేవతాస్త్రీ లున్నపట్టణమునకుఁ గాఁపురములు వోయెదరు; స్వర్గమునకును, గొండవీటికినిఁ బూర్వపుఁ బెద్ద లేమిసూత్రముఁ బన్నిరో కదా! ఇది చిత్రము - అనఁగా లోకములో రణరంగమం దెదురించి శత్రుశరముల వలనిలోమ్ముగాయములతోడిశరీరము లిచ్చుట విడిచినవారికే వీరస్వర్గము గలుగుఁ గాక! పిఱికితనంబునఁ బఱచినవారికి స్వర్గ సౌఖ్య మె ట్లబ్బును? సశరీరస్వర్గ మెట్లు గల్గు నని శంక రాఁగాఁ గృష్ణదేవరాయలదాడి విన్నమాత్రముననే ఉత్కలదేశస్థు లగు రాజులు పూరి గఱచి గాయ పడని దేహముతోఁ గొండవీఁడు వదలి రాజమహేంద్రవరమునకు సమీపమందలికిరాతస్త్రీలపల్లెకుఁ గాఁపులుగాఁ బోదు రని భావము. కసువు గఱచినవారిని గొట్టఁగూడ దని యుద్ధధర్మము. నిలింపశబ్దము. 'స్యా న్నిలిమ్పః కిరాతశ్చ' యనియు, 'నిలిమ్పా దేవశబరౌ' అనియు నున్న నిఘంటువులవలన దేవతార్థకమును, కిరాతార్థకము నవుటంజేసి యాశబ్దముమీఁదను బలసూదనువీఁ డనుశబ్దము మీఁదను శ్లేషకలిగి యిట్టి యర్థము వచ్చునట్లు చమత్కరింపఁబడియెను. ఇట బలసూదనువీఁ డనఁగా నమరారామ మని కొంద ఱందురు.

ఉ. కూరిమిఁ గృష్ణరాయనృపకుంజర చేరెఁ గళింగరాజ్యల
క్ష్మీరమణీలలామ నిను మిన్నులు ముట్టినమోహనాలతోఁ
గారణ మట్ల లక్ష్మి గసుగందనివేడుకఁ గృష్ణరాయనిం
జేరునకాక వావి [1]నెడఁ జెందునె సోదరుఁ డైనరుద్రునిన్. 38

టీ. కృష్ణరాయనృపకుంజర = కృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా! కళింగరాజ్యలక్ష్మీరమణీలలామ = కళింగదేశరాజ్యలక్ష్మియనెడుపాలఁతిమిన్న, కూరిమిన్ = ప్రేమ

1. చెడి.

చేతను, మిన్నులుముట్టిన=ఆకాశమంటిన, మోహానాలతోఁ = ఏనుఁగులతో, (కళింగపతి గజపతి గనుక నని భావము. మోహానా లనఁగాఁ గోటయందలిశత్రునిరసన సాధనము లని కొందఱందురు. ఆపక్షమున వానిఁ బెఱికి తెచ్చినాఁ డని భావము). మోహానాలతోఁ = మోహములతో, నిను జేరెఁ = నిన్నుఁబొందెను, కారణమట్ల = ఆక్రమముననే హేతువు, లక్ష్మి = శ్రీదేవి, కృష్ణరాయనిఁ = శ్రీకృష్ణదేవుని, కసుగందని=వాడిపోవని, వేడుకఁ = ప్రీతిచేతను, చేరునకాక = పొందునేకాని, సోదరుఁడైన=సహోదరుఁడగు, రుద్రునిఁ = రుద్రదేవుని, వావిసెడఁ = వరుస చెడిపోవునట్లు, చెందునె = చెందునా, చెంద దనుట.

తా. కృష్ణరాయా ! కళింగరాజ్యలక్ష్మి యతిప్రేమచేతను నిన్నే చేరెను గాని ప్రతాపరుద్రునిఁ జేరకపోయె. ఏల యనఁగా నాకళింగరాజ్యలక్ష్మి లక్ష్మి యనునామమును వహించుటంజేసి తనకుఁ బ్రియుఁ డగుకృష్ణనామము వహించిన నిన్నే చేరును గాని తనకు సోదరుఁ డగురుద్రునినామము వహించినప్రతాపరుద్రునిఁ బొంద దని భావము. లక్ష్మీదేవికి రుద్రదేవుఁడు సోదరుఁ డౌట యాగమప్రసిద్ధము.

సీ. కచసక్తఫణికంచుకము మౌళి వీరకే
దారంపుఁబాగచందంబు నొందఁ
గలయ నంగమున మర్కటకీటకృత మైన
మగ్గంబు నేత్రసంపద వహింప
ధ్వాంతగహ్వరశిలాతాడితాళికచిక్క
ణాస్రపంకము చంద్రకమై పొసంగఁ
దనుభృశభ్రాంత వేష్టనలగ్న బర్హా బ
ర్హంబు మువ్వన్నె చుంగై చెలంగ
తే. నిద్ర మేల్కాంచి సెలయేట౯ నీడఁ గాంచి
గోపవేషంబు సెడి తొంటి౯ భూపవేష
మగుట యవ్వనమహిమఁగా౯ నలికి యచటు
విడుచు గజరాజు నీధాటి౯ [1]వింధ్యవాటి. 39

టీ. కచ = జుట్టునందు, సక్త=తగులుకొన్న, ఫణికంచుకము = పాఁపకుబుసము, మౌళిఁ = శిరస్సునందు, వీరకేదారంపు = వీరకేదారమనియెడిపేరుగల, పాగ = ఉష్ణీషముయొక్క, చందంబుఁ = రీతిని, ఒందఁ = పొందఁగా, కలయఁ = కలియనట్లు, (అంతట ననుట), అంగమునఁ = శరీరమునందు, మర్కటకీట = సాలెపురుగు

1. వింధ్యశిఖరి.

చేతను, ని. 'లూతాస్త్రీతన్తువాయోర్ణనాభమర్కటకాస్సమాః', కృత = చేయఁబడిన, మర్గంబు = తంతురచన, నేత్రసంపదక్ - నేత్ర=వలిపెంపువలువయొక్క, సంపదక్ = సంపత్తుచు, వహించక్ = తాల్పఁగాను, ని. 'స్యాజ్జటాంశుకయో ర్నేత్రమ్', ధ్వాంత... కము - ధ్వాంతగహ్వర = చీఁకటిగుహయందలి, శిలా = ఱాతిచేతను, తాడిత = పొడువఁబడిన, అళిక = నొసటియందలి, ని. 'లలాటమళికంగోధిః', చిక్కణ = చట్టమయిన, అస్ర=రక్తముయొక్క, పంకము = బురద, చంద్రమై = చెందిరమై, (సిందూరమై యనుట), పొసంగక్ = ఒప్పుచుండఁగా, తను...ర్హాంబు - తను = శరీరముయొక్క, భృశ = అధికమగు, శ్రాంత = బడలికచేతనైన, వేష్టన = పొర్లాడుటచేతను, లగ్న = కలిచుకొన్న, బర్హిబర్హాంబు = నెమ్మిపురి, మువ్వన్నెచుంగై = మూఁడువర్ణము లనఁగా నీలరక్త పీతవర్ణములు గల యుత్తరీయపుఁజెఱఁగై, చెలంగక్ = ప్రకాశించుచుండఁగా, నిద్రమేల్కాంచి = నిద్దురమేల్కని, సెలయేటక్ = కొండవాఁకయందు, నీడఁగాంచి = నీడఁజూచుకొని, గోపవేషంబు = తాను ధరించిన గొల్లనివేషము, చెడి = పోయి, తొంటి =పూర్వము పనతున్న, భూపవేషము = రాజవేషము, అగుట = సంభవించుట, అవ్వనమహిమఁగాక్ = ఆవనసంబంధియయిన మహిమచేత నని, (శంకించి యనుట), అలికి = భయపడి, గజరాజు = గజపతి, నీధాటిక్ = నీదాడిచేతను, వింధ్యవాటిక్ = వింధ్యపర్వతప్రాంతమందు, అచటు=తా నున్నయాప్రదేశమును, విడుచుక్ = వదలును.

తా. నీవు దాడి వెడలినప్పుడు గజపతి భయపడి కళింగదేశము విడిచి వింధ్యపర్వతమునకు వలస పోయి యచ్చటఁ బసులఁ గాచువానిరూపముతో నొకయరణ్యములోని చీఁకటిగుహలోఁ బ్రవేశించి వడివడిగాఁ బోవుచుండ నాగుహలో నున్నయొక్కఱాయి నొసలు దాఁకెను. దానివలనఁ గ్రొత్తనెత్తు రొలికి పేరుకొనియెను. తత్ప్రదేశంబుననే యాయాసముచేత నిదురించి మేలుకొని యాసమీపమందుఁ బ్రవహించెడుసెలయేటినీటిలో నీడఁ జూచుకొని తాను నిద్రవోవుచుండఁగా నాగుహలో నుండెడుపాఁపకుబుసము జుట్టునకుఁ గలచుకొనెను గావున నది యతఁడు గానక భయభ్రాంతిచేత నుష్ణీష మనియును, దాను నిద్రించునప్పుడు తద్గుహలో నొక్కసాలెపుర్వు తనమీఁద మర్గంపునేఁత నేయఁగా నది రవసెల్లా యనియును, మున్ను చెప్పఁబడిననొసటిగాయము సిందూరపుఁదిలక మనియును, ఆగుహలోఁ దాను మిక్కిలి బడలికచేతఁ బొర్లాడుటంజేసి చెమర్చి యున్నతనశరీర మెల్ల నంటికొన్న నెమలిపింఛము చిత్రవస్త్ర మనియును, భ్రిమాత్మికజ్ఞానమును బొంది తాను గుహలోఁ బ్రవేశించునప్పుడు వహించి యున్నగోపాలవేషము రూపుచెడి తొల్లిటిభూపాలవేషము వచ్చెనే యిది యీవనమాహాత్మ్యముచేతఁ గాఁబోలు ననియు వగచి యావేషముతో నచ్చట నివసించుటకు నీవలనిభయముచే నిచ్చగింపక యావలఁ గదలు నని భావము.

చ. అభి రతిఁ గృష్ణరాయ విజ యాంకము లీవు లిఖించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం డిగుసు రప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము వేములఁ బెట్టి పఠించు నిచ్చలున్. 40

టీ. కృష్ణరాయ = కృష్ణదేవరాయా, విజయాంకములు - విజయ = గెలుపునకు సంబంధించిన, అంకములు = బిరుదములను, ఈవు = నీవు, లిఖించి = వ్రాసి, పొట్టునూరికడన్ = పొట్నూరిసమీపమునందు, తాళసన్నిభముగన్ = తాటిచెట్టుపొడవునకు సమానమగు నట్లు, నిల్పిన = నాటించిన, కంబము = స్తంభము, సింహ...ళ్ళకున్ - సింహభూధర ప్రభు = సింహాచలస్వామియొక్క, తిరునాళ్లకున్ = బ్రహ్మోత్సవమునకు, డిగు = దిగివచ్చెడు, సురప్రకరంబు = దేవసమూహము, కళింగమేదినీవిభు = కళింగదేశాధీశ్వరుం డగుగజపతియొక్క, అపకీర్తి = అపయశస్సనెడు, కజ్జలము = కాటుకనీరు, వేములున్ = పలుమాఱును, పెట్టి = కప్పువేసి, నిచ్చలున్ = నిత్యమును, అభిరతిన్ = ఆసక్తిచేతను, పఠించున్ = చదువును.

తా. నీవు విజయశాసనము వ్రాయించి పొట్నూరియొద్ద నాటించినజయస్తంభమునందలి యక్షరములు లెస్సగా నగపడమిం జేసి గజపతియపకీర్తి యనెడునల్లని కప్పువేసి దేవతలు సింహాచలస్వామితిరునాళ్లకు వచ్చినప్పుడెల్ల మిక్కిలి యాసక్తిచేతఁ జదువుదు రని భావము. (తాటియాకులమీఁద వ్రాయఁబడిన యక్షరములు స్పష్టముగా నగపడనిచో నల్లని రంగుపూసి చదువుచుండుట ప్రసిద్ధము.) అట్లె శాసనములను గూడఁ బఠింతు రని భావము.

సీ. సనకాదిదివిజమ స్కరిఫాలగోపిచం
దనపుండ్రవల్లిక ల్నాకి నాకి
నెలసి హాహాహూహూ వులవండియలతంత్రి
ద్రెవ్వ సింగిణులుగాఁ దివిచి తివిచి
సప్తర్షి కృతవియ జ్ఝరనాలుకాలింగ
సమితి ముచ్చెలకోళ్ళఁ జమరి చమరి
రంభాప్రధానాప్స రగపృథూరోజకుం
భంబు లెచ్చటఁ గన్నఁ బట్టి పట్టి
తే. తిరుగు హరిపురిసురతరు సుకల మరగి
బహుళహాళహాళి[2]భరితక ల్బరిగనగన

1. నుతి. 2. భృతకలబ.

సగరపురవర పరిబృఢ కేజవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ. 41

టీ. కృష్ణరాయ = కృష్ణదేవరాయా! బహు...తన - బహుళ = పట్టమైన, హాళహాళి = హాలాహలిచేతను, భరిత=నిండఁబడిన, కల్బురిగనగర=కల్బురిగపట్టణముయొక్కయు, నగరపురవర - సగర = సగరునియొక్క, పురవర = పట్టణశ్రేష్ఠ మగు నయోధ్యయొక్కయు, పరిబృఢ = దొరలయిన, జవన = వేగముగల, యవన = తురకలయొక్క, పృతన = సైన్యము, అనిన్=యుద్ధమునందు, భవదసిన్-భవత్ = నీయొక్క, అసిన్ = ఖడ్గముచేతను, తెగి = ఖండింపఁబడి మృతినొంది, హరి...రలన్-హరి = దేవేంద్రుని యొక్క, పురిన్ = పట్టణమగు నమరావతియందు, సురతరు = కల్పవృక్షములయందలి, సురలన్=మద్యములను, మరగి = అలవాటు చేసికొని, సన...వల్లికల్ - సనకాది=సనకసనందనాదులగు, దివిజమస్కరి = దేవమునులయొక్క, ని. 'భిక్షుః పరివ్రాట్కర్మన్దీ పారాశర్యపి మస్కరీ', అమ. - ఫాల=లలాటములయందలి, గోపిచందన=మృద్విశేషము యొక్క, పుండ్రవల్లికల్ = తీఁగెలవంటి యూర్ధ్వపుండ్రములను, నాకినాకి = మాటిమాటికిని నాలుకలతో నాకివైచి, హాహా...తంత్రి - హాహాహూహూవుల = హాహాహూహూవు లనెడుదేవగాయకులయొక్క, దండియల = వీణలయొక్క, తంత్రి = తంతువులు, త్రెవ్వన్ = తెగిపోవునట్లు, సెలసి = గుంజుకొని, సింగిణులుగాన్ = ధనుస్సులగునట్లు, తివిచితివిచి = ఆకర్షించి యాకర్షించి, సప్త...సమితిన్ - సప్తర్షి = సప్తమహర్షులచేతను, కృత = చేయఁబడిన, వియత్ఝర = ఆకాశగంగయందలి, వాలుకాలింగ = సైకతలింగములయొక్క, సమితిన్ = సమూహమును, ముచ్చెలకాళ్లన్ = ముచ్చెలుదొడిగియున్న కాళ్లచేతను, చమరిచమరి = తాచి తాచి, రంభా...భంబుల్ - రంభాప్రధాన = రంభమొదలుగాఁగల, అప్సరః = అచ్చరలయొక్క, పృథు = పెద్దవియగు, ఉరోజకుంభంబులు = కుండలవంటిస్తనములను, ఎచ్చటఁ గన్నన్ = ఎక్కడఁ జూచినను, పట్టిపట్టి = పట్టుకొనిపట్టుకొని, తిరుగున్ = సంచరించును.

తా. కృష్ణరాయా! అధిక కోలాహలధ్వని గలకల్బురిగపట్టణముయొక్కయు, నయోధ్యయొక్కయు నాథులగు తురకలసేనాజనులు యుద్ధమునందు నీఖడ్గప్రహారము చేత మృతులై స్వర్గమందుఁ జేరియును దొల్లి వారు భూమిపై నున్నప్పటివలెనే యచ్చటను గల్పవృక్షమద్యములు పానము సేయుచును దేవమునులగోపిచందనపుండ్రముల నాకుచును మొఱకుఁదనముచేత గంధర్వులవీణలు దామ లాఁగికొని విండ్లువంచినట్లు వంచుచును, సప్తమహామును లాకాశగంగాతీరములఁ జేయుచున్నసైకతలింగముల రూపుమాపుచును, రంభ మొదలగునచ్చరలగబ్బిగుబ్బలఁ బట్టుకొనుచుఁ బూర్వప్రకృతి వాసన వదలక తిరుగుచున్నా రని భావము.

మ. అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహల్యన్ ఖురాసానిపు
చ్ఛలు వో దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిన్ గీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటిని భళిరా కట్టించితౌ దృష్టికే
దులఖా నోగ్రకపాల మర్థపహరిద్భూజాంగలశ్రేణికన్. 42

టీ. అలుకన్ = కోపముచేతను, ఘోట...హల్యన్ - ఘోటక = గుఱ్ఱముల యొక్క, ధట్టికా=దండుయొక్క, ఖురపుటీ=డొప్పలవంటి గిట్టలనియెడు, హల్యన్ = నాగళ్లగుంపుచేతను, ఖురా...చ్ఛలు - ఖురాసాని = ఖురాసానిదేశస్థులగు మ్లేచ్ఛులనియెడు, పుచ్ఛలు=పుచ్ఛచెట్లు, (ఖురాసానిపుచ్ఛ లనఁగాఁ దురకల కభీష్టము లైనయా దేశపుఁబుచ్ఛచెట్లనియును జెప్పవచ్చును), వో దున్ని=చెడఁదున్ని, చల...ప్లుతిన్ - చలత్=నడుచుచున్న, చమూ=సేనయందలి, గజ=ఏనుఁగులయొక్క, మదాసార=మదధారాసంపాతమనియెడుధారావర్షముచేత, ప్లుతిన్ = తడుపుటచేత నయినపదనుచేతను, కీర్తి...స్యంబు-కీర్తి=యశస్సనియెడు, పుష్కల=సమృద్ధమగు, సస్యంబున్=పైరును, ఇడి=ఉనిచి, ఏకధాటిన్-ఏక=ముఖ్యమగు, ధాటిన్=దాడిచేతను, దృష్టికిన్=వెఱబొమ్మకొఱకు, ఏదు...లమున్ - ఏదులఖాన = ఏదులఖానుఁ డను మ్లేచ్ఛుని యొక్క, ఉగ్ర=భయంకరమగు, కపాలమున్-పుఱుకను, అర్థ...ణికన్-అర్థప=కుబేరునియొక్క,హరిత్ = దిక్కుయొక్క, భూ=భూమియందలి, జాంగల=మెట్టచేల యొక్క, శ్రేణికన్=పఙ్క్తియందు, కట్టించితౌ=కట్టించితివి, భళిరా=ఆశ్చర్యము.

తా. కృష్ణదేవరాయా! నీ వుత్తరదేశమందు గుఱ్ఱపు దండుతో వెడలి ఖురాసాను లను మ్లేచ్ఛుల నశింపఁజేసి యచ్చట నీకీర్తి నిలిపి యేదులఖానుఁ డనుపేరు గల మ్లేచ్ఛునితల నటికి వ్రేలఁ గట్టించితివి గావున నది యాదేశమందు మొలవవేయఁబడిన నీకీర్తి యనెడుపైరుగల మెట్టచేలకు దృష్టిపరిహారార్థముగా నెత్తించిన తలపుఱ్ఱ యవలె నుండెను; ఏమాశ్చర్యము!

చ. సుమతిఁ బునఃపునారచితషోడశదానపరంపరావసం
తముల ననంతవిత్తము[1]ననంత ననంతమహాగ్రహారబృం
దమును నొసంగుని న్నొ అసిరాకా రెన రాక కదా నిలింపభూ
జములు వహించు దుర్యశము షట్పదకోకిలకైతవంబునన్. 43

టీ. సుమ...ములన్ - సుమతిన్=మంచిమనస్సుచేతను, పునఃపునః=మాటిమాటికిని, రచిత=చేయఁబడిన, షోడశదాన పదియాఱుదానములయొక్క, పరంపరా=సమూహామనియెడు, వసంతములన్ = వసంతకాలములయందు, అనం...మున్-అనంత=కడలేని, విత్తమున్ = ధనమును, అనంతన్ = భూమిని, అనంత ..దమును-అనంత=

1. లనంత.

నశింపని, మహాత్=గొప్పవగు, అగ్రహార=విప్రవృత్తులయొక్క, బృందమును=సమూహమును, ఒసంగు=ఇచ్చునట్టి, నిన్ను, ఒఱసి = కలహించి, తారు=తాము, ఎనరాక కదా=సరిరాకకదా, (అది హేతువుగా ననుట), నిలింపభూజములు = కల్పవృక్షములు, షట్ప...బునన్ - షట్పద = తుమ్మెద లనియెడు, కోకిల = కోయిలలనియెడు, కైతవంబునన్ = నెపముచేతను, దుర్యశమున్ = అపకీర్తిని, వహించున్ = మోయుచుండును.

తా. కృష్ణదేవరాయలు సేయు షోడశదానపఙ్క్తియను వసంతకాలములయందు మిక్కిలి ద్రవ్యమును బడమియు మహాగ్రహారము లొసంగఁగా వసంతకాలములయందు దాతృత్వమును వహించెడు కల్పవృక్షము లంతములేని విత్తాదు లీయలేక తుమ్మెదలు కోయిలలు అనుమిషచేత దుష్కీర్తి వహించెను. వృక్షములయీవి శాఖాంతములు లతాంతములు మొదలయినవి కావున ననంతములుగా నియ్యంజాల వనియును వసంత కాలములయందుఁ దుమ్మెదలు గోయిలలు వృక్షములమీఁదఁ జేరి యుండుట స్వభావ సిద్ధం బగుటం జేసి యవి యపయశస్సూచకంబులై యున్న వనియును భావము.

తే. ప్రబలరాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశ్వరార్థ దుర్గానటేశ
సాహితీసమరాంగణసార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు మనిరి. 44

టీ. ప్రబలరాజాధిరాజవీరప్రతాప, రాజపరమేశ్వరార్థదుర్గానటేశ, (ఇవి బిరుదాంకములు), సాహితీసమరాంగణసార్వభౌమ - సాహితీ=సాహిత్యమందును, సమరాంగణ=యుద్ధరంగమందును, సార్వభౌమ=చక్రవర్తివైన, కృష్ణరాయేంద్ర=కృష్ణరాయ భూపాలా, కృతి=ప్రబంధమును, వినిర్మింపు మనిరి=రచింపుమని చెప్పిరి.

తా. సులభము.

వ. అని విన్నవించినఁ బ్రహృష్టాంతరంగుండ నై. 45

టీ. అని=ఈవిధంబున, విన్నవించినన్ = మనవిచేయఁగా, (మహాప్రభు వగుటంజేసి పండితులును విన్నవించి రనుట),ప్రహృ...డనై - ప్రహృష్ట=సంతసించిన, అంతరంగుండనై=మనస్సు గలవాఁడనై యని ముందఱి కన్వయము.

## షష్ఠ్యంతములు

క. అంభోధికన్యకాకుచ, కుంభోంభితఘుసృణమసృణగురువక్షునకున్
జంభారిముఖాధ్యక్షున, కంభోజాక్షునకు సామిహార్యక్షునకున్. 46

టీ. అంభోధి...నకున్-అంభోధి = సముద్రునికి, కన్యకా = పుత్త్రికయగు లక్ష్మి యొక్క, కుచకుంభ = కలశములవంటి కుచములయందు, ఉంభిత = పూయఁబడిన, ఘుసృణ = కుంకుమముచేత, మసృణ = స్నిగ్ధమగు, గురువిశాలమగు, వక్షునకున్ = వక్షస్థ్సలముగలవానికి, జంభారి...నకున్-జంభారి = దేవేంద్రుఁడు, ముఖ = మొదలగువారికి, అధ్యక్షునకున్ = నాథుఁడగువానికిని, అంభోజాక్షునకున్ - అంభోజ = కమలముల వంటి, అక్షునకున్ = నేత్రములుగలవానికి, సామిహర్యక్షునకున్ - సామి=అర్ధభాగము, హర్యక్షునకున్ = సింహమగువానికి, 'సామిత్వర్ధే' యని యమరము (నరసింహాకృతి కలిగినవాఁ డనుట).

తా. సులభము.

క. మర్దితకాళియఫణికిఁ గ, పర్దభృదజబింబితాచ్ఛపదనఖఘృణికిన్
దోర్దండశార్ఙ్గకిణి కఘ, కర్దమదినమణికి దనుజ ॥ కరివరసృణికిన్. 47

టీ. మర్ది...ణికిన్-మర్దిత = మర్దింపఁబడిన, కాళియ = కాళియుఁడను పేరుగల, ఫణికిన్ = సర్పముగలవానికి, (కాళియుఁడను నాగేంద్రునిశిరస్సుమీఁదఁ గృష్ణుఁడు తాండవము సలిపె ననుట), కపర్ద...ణికిన్ - కపర్ద = జటాజూటమును, భృత్ = భరించిన శివునిచేతను, అజ = బ్రహ్మదేవునిచేతను, బింబిత = ప్రతిఫలింపఁబడిన, అచ్ఛ = పరిశుద్ధములగు, పద = పాదములయొక్క, నఖ = గోళ్లయొక్క, ఘృణికిన్ = కాంతులు గలవానికి, (పంచాస్యచతురాస్యులువిష్ణునిపాదములకు నమస్కరింతు రనుట), దోర్దండ...ణికిన్-దోర్దండ = దండమువంటి భుజమందలి, శార్ఙ్గ = శార్ఙ్గ మను పేరు గల ధనుస్సుయొక్క, కిణికిన్ = కాయలుగలవానికి (శార్ఙ్గకోదండమునొ త్తియుటవలనఁ గాయలు గాచిన బాహువు గలవాఁ డనుట), అఘ...మణికిన్ - అఘ=పాపము లనెడు, కర్దమ = బురదకు, దినమణికిన్ = సూర్యుఁడగువానికి, (అనఁగా సూర్యుఁడు బురద నెండించినట్లు పాపములను శోషింపఁ జేయువాని కనుట), దనుజ...సృణికిన్-దనుజ=రక్కసు లనియెడు, కరివర = గజశ్రేష్ఠములకు, సృణికిన్ = అంకుశమగువానికిని.

తా. సులభము.

క. గుహాపుష్కరిణీతటఘన, గహనగుహాఖేటవంచ ॥ కపుళిందునకున్ [న్.
ద్రుహిణాండతుందునకయా, వహదీర్ఘాపాంగకరుణా ॥ వాస్యందునకు

టీ. గుహ...నకున్ - గుహాపుష్కరిణీ = కుమార పుష్కరిణియొక్క, తట = దరియందు, ఘన=దట్టమగు, గహనగుహా = గుహావంటివనమందు, ఆఖేట = వేఁటయందు, వంచకపుళిందునకున్ = మాయచెంచువాఁడగువానికిని, ద్రుహి......నకున్ - ద్రుహిణాండ = బ్రహ్మాండములు, తుందునకున్ = కడుపునందుఁగలవానికి, అయా...నకున్ - అయ=శుభములను, ఆవహ = ఆవహింపఁజేసెడు, దీర్ఘ = వాలికలగు, అపాంగ = కడ

గన్నులయందు, కరుణవాః = దయారసముయొక్క, స్యందునకున్ = జాఱుటగలవానికిని, (నేత్రాంతములయందుఁ గరుణారసము దొరఁగుచున్న దనుట).

తా. సులభము.

క. బంధురరథాంగధారా, గంధవహాప్తజ్వలచ్ఛిఖాపటలపున
స్సంధుక్షణఘృతరాహుప, లాంధోసృక్స్రుతికి వేంకటాచలపతికిన్.

టీ. బంధుర...తికిన్ - బంధుర = ఘనమైన, రథాంగ = చక్రముయొక్క, ధారా = అంచుయొక్క, గంధవహాప్త = వాయుసఖుఁడగునగ్నిహోత్రముయొక్క, జ్వలత్ = మండుచున్న, శిఖా=జ్వాలలయొక్క, పటల = సమూహముయొక్క, పునస్సంధుక్షణ=పునస్సంధానకర్మయందు, ఘృత=ఆజ్యమైన, రాహు=రాహువనెడు, పలాంధః- పల=మాంసమే, అంధః=అశనముగాఁ గలరాక్షసునియొక్క, అసృక్ = రక్తముయొక్క, స్రుతికిన్ = స్రావముగల, వేంకటాచలపతికిన్ = వేంకటాచలరమణునకు ఈవేంకటాచల పతికి నను విశేష్యమునకుఁ బూర్వోక్తములగు షష్ఠ్యంతశబ్దములు విశేషణములు.

తా. సుదర్శన చక్ర ధారాగ్నియందు రాక్షసులను హోమము చేయుట కా యగ్నియొక్క పునస్సంధాన కర్మమునందు రాహువుయొక్క కంఠరక్తస్రావ మాజ్యమై యుండెను.

## కథాప్రారంభము

వ. నా విన్నవింపం బూను నాముక్తమాల్యదా మహాప్రబంధంబునకుఁ
కథాక్రమం బెట్టి దనిన. 50

టీ. నావిన్న...నకున్ - నావిన్నవింపంబూను= నేను రచించి మీకు విన్నవించుకొనఁదలఁచిన, ఆముక్త...నకున్ - ఆముక్త = అనుభవించి విడువఁబడిన, మాల్య = విరులసరాలను, దా=ఇచ్చినచూడికుడుత్తనాంచారను నామె కథ కలిగిన యీ ప్రబంధమునకు, కథాక్రమంబు, ఎట్టి దనినన్ = ఎటువంటి దనఁగా.

తా. సులభము.

మ. లలితోద్యానపరంపరాపికశుకాలాపప్రతిధ్వానము
[1]ల్వలభీనీలహరిన్మణీపికశుకస్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయుసువర్ణసౌధముల నెందుం జూడఁ జెన్నొందు శ్రీ
విలుబుత్తూరు సెలంగుఁ బాండ్యనగరోర్వీరత్నసీమంత మై. 51

1. బలభిన్నీల.

టీ. శ్రీవిలుబుత్తూరు = శ్రీవిల్లిపుత్తూరనుపట్టణము, పాండ్య...సీమంతమై - పాండ్య = పాండ్యదేశమందలి, నగర = పట్టణమగు మధురయొక్క, ఉర్వీ = భూమికి, రత్నసీమంతమై = మానికపుఁబాపటబొట్టై, లలితో...ముల్ - లలిత = ఒప్పుచున్న, ఉద్యాన = ఎలదోఁటలయొక్క, పరంపరా = గుంపులయందలి, పిక = కోయిలల యొక్కయు, శుక = చిలుకలయొక్కయు, ఆలాప = పలుకులయొక్క, ప్రతిధ్వాన ముల్ = ప్రతిధ్వనులు, వలభీ...భ్రమంబు - వలభీ = ముంజూరులయందలి, నీల = నీలములయొక్కయు, హరిన్మణీ = గరుడపచ్చలయొక్కయు, పిక కోయిలలయొక్కయు, శుక = చిలుకలయొక్కయు, స్వాన = పలుకులయొక్క, భ్రమంబు = భ్రాంతిని, ఊన్పన్ = వహింపఁజేయఁగా, మిన్నులతోన్ = ఆకాశముతో, రాయు = ఒఱయు చుండెడు, సువర్ణసౌధములన్ = బంగరుమేడలచేతను, ఎందుం జూడన్ = ఏదిక్కునఁ జూచినను, చెన్నొందిన = శృంగారమై, చెలంగున్ = ప్రకాశించును. (విల్లిపుత్తూరు అనుటయే సాధువు.)

తా. పాండ్యదేశమందలి భూమి యనెడు నాతికిఁ బాపట బొట్టువోలె నొప్పుచున్న శ్రీవిల్లిపుత్తూరుసమీపమునం దుండు నుద్యానములలోని కోయిలలు చిలుకలు గూయుచుండఁగా వాని కామేడలు ప్రతిధ్వనులు సేయ నప్పట్టణ వీథులలో నేఁగెడు మార్గస్థులు తల లెత్తి చూడఁగా నత్యున్నతము లగు మేడలయొక్క వాచూరులయందు నీలములతోఁ జెక్కఁబడియున్న కోయిలలును మరకతంబులచేఁ జెక్కఁబడిన చిలుకలును గానరాఁగా నీపక్షులే యీధ్వనులు సేయుచున్న వన్న ట్లుండు నని యును నావిల్లిపుత్తూర్లిలోని బంగారు మేడలు మిన్నంటి యున్న వనియును భావము.

చ. మలఁచి పయోజకోశములమాడ్కి నొనర్చినపద్మరాగపుం
గలశపుటెఱ్ఱడాల్బొమిడికంబులతో నపరంజియోడుబి
ల్లల నలవైజయంతముఁ జలంబునఁ గెల్వఁగ దంశితంబులై
నిలిచినయట్లు మాడువు లనేకము లుల్లసిలున్ బురంబునన్. 52

టీ. మలఁచి = తొలిచి, పయోజ...మాడ్కిన్ - పయోజ = కమలముల యొక్క, కోశములమాడ్కిన్ = మొగ్గలవలెను, ఒనర్చిన=చేసినట్టి, పద్మ...లతోన్ - పద్మరాగపు = కెంపులయొక్క, కలశపు = కలశము లనియెడు, ఎఱ్ఱడాల్ = రక్త కాంతిగల, బొమిడికంబులతోన్ = శిరస్త్రాణములతో, (ఇచ్చటఁ బద్మరాగపుంగలశపు టెఱ్ఱడాలనుచోటను, 'సమ్యోచ్ఛలః' అనుసూత్రమువలనం బవర్గపరంబగు మకారంబున కంటెఁ బరంబున నుమాగమరూప మగుపూర్ణబిందువును, 'సామానాధికరణ్యేపూదంతానాం టుగాగమో వాచిస్యాత్' అనుసూత్రమువలనఁ గలశశబ్దసంబంధి యగుపువర్ణమునకుఁ బరమరదు టుగాగమరూపమును వచ్చినది.) అపరంజియోడుబిల్లలన్ = మేలిమిస్నెబంగారు

కప్పుబిళ్లలచేతను, అల = అప్రసిద్ధమగు, వైజయంతమున్ = ఇంద్రసౌధమును, చలంబునన్ = చలముచేతను (ఇచ్చటఁ దృతీయార్థమున సప్తమి.) గెల్వఁగన్ = గెల్చుటకు, దంశితంబులై = మైమఱువులు దొడగినవై 'దంశితో వ్యూఢకంకట' యని యమరుఁడు, నిలిచినయట్లు = నిలిచియున్నవనఁగా, మాడుపులు = గృహములు, అనేకములు = పెక్కులు, పురంబునన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, ఉల్లసిలున్ = ప్రకాశించును.

తా. శ్రీవిల్లిపుత్తూరియందలి గృహములు పచ్చనైనఁ దామరమొగ్గలవలె మలఁచి యున్న కెంపుల కలశము లనెడు సెల్లమంటి శిరస్త్రాణములు గలిగి బంగారుచేతఁ జేయఁబడిన యోడుబిళ్లలనెడు కవచముఁ దొడిగి స్వర్గమందలి ఇంద్రుని మేడయగు వైజయంతముతో యుద్ధము చేయుటకు సిద్ధపడి నిలిచి యున్న ట్లుండు నని భావము. యుద్ధసన్నద్ధు లెల్లమట్టివస్త్రములు తలలకుఁ గట్టుకొని కవచములు దొడిగికొనుట ప్రసిద్ధము.

సీ. పాథోధిజలయుక్తిఁ ♦ బ్రాఁచివట్టిన దిశా
కరులు నాఁ దగు మరకతపుఁ గరులఁ
గరులతొండము సిక్కఁ ♦ గబళించి మ్రింగిన
హరులు నాఁ దొండ మొప్పగుతదశ్మ
హరులఁ దాపినతాప ♦ లమర నేనికదోయి
నీరార్చు నపరంజినీటి వ్రాఁత
శ్రీలుఁ దత్పార్శ్వ చిత్రితశంఖచక్రముల్
రత్నపుఁదిన్నెలఁ ♦ బ్రతిఫలింపఁ
తే. బెఱపురాళి గృహశ్రీలఁ ♦ బెండ్లియాడ
భవనరాజులు గట్టినబాసిక మనఁ
దనరు మణితోరణములతోఁ ♦ ద్వారవితతిఁ
బరఁగు వీథులు పురి సూత్రపట్టినట్లు. 53

టీ. పాథోధిజలయుక్తిన్ - పాథోధి = సముద్రముయొక్క, జల = జలముయొక్క, యుక్తిన్ = సంయోగముచేతను, ప్రాఁచివట్టిన = పాఁచుదువట్టిన, దిశాకరులునాన్ = దిగ్గజములనఁగా, తగు = తగునట్టి, మరకతపుఁగరులన్ = పచ్చలయేనుంగులను, కరులతొండముసిక్కన్ = ఏనుఁగులతుండముమాత్రము మిగులునట్లు, కబళించి = ఆహరించి, మ్రింగిన = మ్రింగినట్టి, హరులునాన్ - సింహము లనునట్లు, తొండ మొప్పగు = తొండముచేఁ బ్రకాశించుచున్న, తదశ్మ = ఆమరకతవికారములగు, హరులన్ = సింహములను, తాపిన = చెక్కిన, తాపలు = సోపానములు, అమరన్ = అమరుచుండఁగా, ఏనికదోయి = గజద్వంద్వము, నీరార్చు...శ్రీలు - నీరార్చు = స్నానము

చేయించెడు, అపరంజినీటి = బంగారునీటియొక్క, వ్రాఁత = చిత్తరువుయొక్క, శ్రీలు = లక్ష్మీప్రతిమలును, తత్పార్శ్వ...ముల్ - తత్పార్శ్వ = ఆప్రతిమలయుభయ పార్శ్వములయందు, చిత్రిత = చిత్రింపఁబడిన, శంఖచక్రముల్ = శంఖచక్రములును, రత్నంపుఁదిన్నెలన్ = రత్నమయములగు వేదులయందు, ప్రతిఫలింపన్ = ప్రతిబింబింపఁగా, పెఱ...శ్రీలన్ - పెఱ = ఇతరములగు, పురాళి = పట్టణసమూహముయొక్క, గృహశ్రీలన్ = గృహసంపద లనియెడుస్త్రీలను, పెండ్లియాడన్ = వివాహమగుటకు, భవనరాజులు = తత్పురగృహము లనురాజులు, కట్టిన = కట్టుకొన్న, బాసిక మనన్ = పట్టబాధ మనునట్లుగా, తనరు = ప్రకాశించుచున్న, మణితోరణములతోన్ = మాణిక్యతోరణములతోఁగూడిన, ద్వారవితతిన్ = ద్వారసమూహముచేతను, వీథులు, పురిన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, సూత్రపట్టినట్లు = సూత్రముపట్టినట్లుగా, పరఁగున్ = ఒప్పును. సూత్రపట్టినట్లన్నచోట, శ్లో. ‘అదంతపాది శబ్దేచ పత్యర్థే బిందులోపకా, వర్ణకస్యాత్రకథితౌ క్వచి త్సుకవి సమ్మతేః’ అని యథర్వణాచార్యసూత్రము ప్రమాణము.

తా. అష్టదిగ్గజము లెల్లప్పుడు సముద్రోదకములయందే యుండుటవలనఁ బ్రాచి పట్టిన వన్నట్లు తోఁచెడు పచ్చకాతియేనుంగులను, ఆయేనుంగులతుండము మాత్రము గనఁబడుచుఁ దక్కినశరీరము గానరాకుండుటం జేసియును, నల్లతుండంబులు పచ్చజాతి సింహముల నోళ్లలోనుండి వెడలినట్లుండుటం జేసియుచు, ఏనుంగుల శరీరమెల్లను మ్రింగి తుండంబుల మిగిలించినట్లు కనఁపడు సింహంబులను జెక్కిన పలుకటాలు వెనుకదిక్కునఁ బ్రకాశించుననియును, ఇట్టి సోపానములకుఁ బైఁగా గోడలయందు లక్ష్మీదేవి కభిషేకముఁ జేయుచున్న ట్లపరంజినీటితోఁ జిత్రింపఁబడిన యాలక్ష్మీప్రతిమలును గజంబులును లక్ష్మీ ప్రతిమల యుభయపార్శ్వములయందలి శంఖచక్రములును దిగువను రత్నమయవేదికల యందు నీడలు దోఁచుచుండఁగాఁ బ్రతిగృహద్వారమున మణితోరణములు ప్రకాశింపఁగా నాగృహరాజంబు లితర పట్టణ గృహశ్రీలను వివాహముఁ జేసికొనుటకుం గట్టి కొన్న బాసికము లనున ట్లొప్పు ననియును వీథులు వంకరలు లేక సూత్రముపట్టి కట్టినట్లు ప్రకాశించుచుండును.

చ. పగడపుఁజాయచెందిరముఁ బ్రామినపాండ్య వధూకుచంబులన్
నగునరుణంపుబొండ్లముల నారికెడంబులు వజ్రకుట్టిమం
బగుపథముం జెలంగు భవ నాహృతశేషితరత్న[1]రక్షక
భృగతరుసంతతిం బ్రథమ భార్యఁ బురిన్ గిఱివుంచె వార్ధినాన్. 54

టీ. పగడ...మున్ - పగడపుఁజాయ = విద్రుమకాంతిగల, చెందిరమున్ = కుంకుమమును, ప్రామిన...బులన్ - ప్రామిన = అలఁదినట్టి, పాండ్యవధూకుచంబులన్ = పాండ్యదేశస్త్రీలగుబ్బలను, నగు...బులు - నగు = పరిహసించుచున్న,

1. రక్షకున.

అరుణింపు = ఎఱ్ఱనగు, బొండ్లముల = పైపీచు ఒలువనికాయలుగల, నారికేడంబులు = నారికేళపు మ్రాఁకులును, వజ్ర = వజ్రములచేతను, కుట్టిమంబగు = కట్టింపఁబడిన, పథముక్ = మార్గమును (ప్రగమాంతముమీఁద ద్రుతము సముచ్చయార్థకము.) భవనా...కుక్ - భవన = గృహములకొఱకు, ఆహృత = వ్యయము జేయఁబడినవానినుండి, శేషిత = మిగిలింపఁబడిన, రత్న = రత్నములయొక్క, రక్షకుక్ = కాపాడుటకు, వార్ధి = సముద్రుండు, అభ్రగ = ఆకాశగతములగు, తరు = వృక్షములగు మందారాదు లనియెడు, సంతతిక్ = సంతానమును, ప్రగమభార్యక్ = మొదలిపెండ్లమగు గంగానదిని, పురిక్ = శ్రీవిల్లిపుత్తూరియందు, గిఱవుంచె నాక్ =కుదువయుంచె ననునట్లు, చెలంగుక్ = ప్రకాశించును.

తా. శ్రీవిల్లిపుత్తూరిలో నుండెడు గృహములు రత్నమయములైనవి గావున నా గృహములకు వినియోగము కాఁగా మిగిలినరత్నములను గాపాడెద నని రత్నాకరుండగు సముద్రుండు పూఁటపడి యారత్నములు తీసికొని యందులకై తనసంతాన మగు కల్పవృక్షములను బెద్దభార్య యగుగంగను దత్పట్టణమునందుఁ గుదువ యుంచెనో యన్నట్లు సంతత మెదతెగని యెఱ్ఱనిబొండ్లములతోడి నారికేళపుమ్రాఁకులును వజ్రములచేతఁ గట్టింపఁబడిన రాజమార్గమును బ్రకాశించును. నారికేళములు కల్పవృక్షములవలెను మార్గము తెల్లనికాంతి గలిగి యుండుటంజేసి గంగానదియుంబోలె వెలుంగుచున్నకతంబున నట్లు త్ప్రేక్షింపంబడియెను.

క. కోరకితనారికేళ
క్ష్మారుహములు రత్నకుట్టిమంబులఁ [1]దోఁచుక్
ద్వారము లయత్నకృత[2]శృం
గారంబుగ నలికి ముగ్గు ఘటియించి రనక్. 59

టీ. ద్వారములు = వాకిళ్లు, కోరకిత = సంజాతకోరకములు గల, నారికేళక్ష్మారుహములు = టెంకాయమ్రాఁకులు, రత్నకుట్టిమంబులక్ = రత్నములచేఁగట్టింపఁబడిన భూములయందు, అయత్నకృత = యత్నముచేతఁ జేయఁబడని, శృంగారంబుగక్ = శృంగారము గలుగునట్లు, అలికి = గోమయలిప్తముఁజేసి, ముగ్గు ఘటియించి రనక్ = రంగవల్లిక యుంచి రనునట్లు, తోఁచుక్ = ప్రతిబింబించును.

తా. శ్రీవిల్లిపుత్తూరిలో వాకిళ్ల ముందఱ రత్నమయము లైనభూములయందు మొగ్గలు పచ్చనియాకులు గల నారికేళములు ప్రతిఫలింపఁగా నాయిండ్లవారు యత్నముచేత సింగారింపకయే శృంగారము గలుగునట్లు ఆకులనీడ యలికినట్లును మొగ్గలనీడ ముగ్గులు పెట్టినట్లు నుండె నని భావము.

---

1. దోఁపక్. 2. శృంగారముగను.

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ ౹ జన్దోయి లేఁగౌనుపై
దయఁ దప్పన్ బస పాడి పాగడపుఁబా ౹ దంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము కటిం ౹ గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులోత్రోవలన్.

టీ. చెంగల్వడిగ్గియన్ = ఎఱ్ఱకలువపూలు గలకొలనియందు, పసపాడి = హరిద్రాలేపపూర్వకముగా స్నానముఁజేసి, అచ్యు . ర్థము-అచ్యుత = శ్రీపతియొక్క, మజ్జనార్థము = అభిషేకముకొఱకు, నీరు = తీర్థము, కటిన్ = రొండియందు, కీలించి = ఉనిచికొని, శయ = హస్తమందలి, పూజాంబుజముల్ = పూజకొఱకైన కమలములు, ఘటిన్ = తీర్థపుబిందెయందు, తడఁబడన్ = తొట్రుపడుచుండఁగా, చన్దోయి = కుచద్వంద్వము, లేఁగౌనుపైన్ = లేఁతనడుముమీఁద, దయతప్పన్ = కృపాహీనమగుచుండఁగా, దివ్య...స్యల్-దివ్యప్రబంధ = ద్రావిడప్రబంధముతోడ, యుక్ = కూడుకొన్న, ఆస్యల్ = వక్త్రములు గల, ద్రవిడాంగనల్ = ద్రావిడస్త్రీలు, ఉద్యా...లన్-ఉద్యానంపు = ఎలదోఁటయొక్క, లోత్రోవలన్ = అంతర్మార్గములయందు, పాగడపుఁబాదంబు = పాదకటకములనియెడు భూషణము ధరించినపాదము, ఒప్పన్ = ఒప్పుచుండఁగా, నడుతురు = పోవుచుందురు.

తా. విల్లిపుత్తూరియందలి ద్రవిడస్త్రీ లుద్యానంబులలోని చెంగలువలుగలకొలఁకులలోఁ బసుపుతో స్నానముఁజేసి స్వామి తిరుమజ్జనము నిమిత్తము తీర్థంపుబిందె యాదేశాచారరీతిగా తొంటియందు ధరించి తమహస్తములయందు నాళములు గలిగి పూజార్థము లైనకమలములు తద్ఘటములయందుఁ దొట్రిల్లు చుండఁ గుచభారముచే లేఁత నడుము లసియాడుచుండ దివ్యప్రబంధానుసంధానముఁ జేయుచుఁ నుద్యానంబుల లోపలిత్రోవలయందుఁ బావడాలు ధరించినపాదములు గదల నడుచుచుందు రని భావము.

మ. కలయన్ నీలమయంపుఁదల్లియొఱదాఁగకం దేటనీరొప్పు ర
థ్యలకూపంబుల మీఁలఁ జూచి వలభీవ్యాసంగితుంగద్రుశా
ఖలలో [1]డాఁగి గుభాలనన్ లకుముకుల్ ౹ క్రందై పడున్ లేచు మ్రు
చ్చిలి గేహేందిర ద్రావిడీపరిచితిన్ ౹ జెండాడుచందంబునన్. 57

టీ. గేహేందిర = గృహలక్ష్మి, ద్రావి...తిన్-ద్రావిడీ = ద్రవిడస్త్రీలయొక్క, పరిచితిన్ = పరిచయముచేతను, మ్రుచ్చిలి = వంచించి (ఎవ్వరికిని గనుపింపక యనుట), చెండా...నన్-చెండాడు = కందుకక్రీడ సలిపెడు, చందంబునన్ = రీతిచేతను, లకు

1. నాడి గబా; నుండి గుబాలునన్.

ముకుల్ = పక్షివిశేషములు (లకుముకిపిట్టలు), కలయన్ = నిండునట్లుగా, నీలమయంపు = నీల మణివికారమగు, తల్లియొఱదాఁకన్ = బొడ్డుబొఱదనుకను (పైఁచుఁచేడు పెద్దయొఱయ నుట), తేటనీరు = నిర్మలోదకము, ఒప్పు = ఒప్పుచున్న, రథ్యాలకూపంబుల = వీథుల బావులయందలి, మీలన్ = మీనములను, చూచి = కాంక్షించి, వలభి... లోన్ — వలభి = చూరులయందు, వ్యాసంగి = కూడియున్న, తుంగ = పొడవులగు, ద్రు = వృక్షముల యొక్క, శాఖలలోన్ = కొమ్మలలో, డాఁగి = పొంచి, గుభాలనన్ = గుభా లను శబ్దము గలుగునట్లు, క్రందై = సందడించి, పడున్ = దుముకును, లేచున్ = మరల నుద్గమించును.

తా. వీథులలోని యొఱలబావులలోఁ దల్లియొఱవఱకుఁ బై సబికి యున్న తేట నీటిలోఁ గనఁబడుచున్న చేఁపలను జూచి యిండ్లచూరులపొంబడి వ్యాపించియున్న పెద్ద పెద్ద తరుశాఖలయందుఁ బొంచియుండి యాబావులలో దుముకుచు లేచుచున్న లకుముకి పిట్టలు ద్రవిడస్త్రీపరిచయము గలిగిన గృహలక్ష్మి తనశరీరము గానఁబడకుండరహస్య ముగాఁ జెండు గొట్టుచుండఁగా నట్టి పుట్టచెండ్లవలె నుండె నని తాత్పర్యము. లకుముకులు చేఁపల బట్టి కొనుటకు నీట దుముకుట ప్రసిద్ధము.

మహాస్రగ్ధర. స్వనిలింపావాసదత్త్వాశనదతలమిథస్స్వాతతమ్యంబు లీరెం
డును దీను ల్గాంచునమ్మాడువులనయడుగంఁడోఁగునుదగ్ర ద్రుతోన్మే
శనసిద్ధద్వంద్వబృందాళిలయ తటబిల కళ్యాణమంథా ద్రులో నా
వనజాక్షస్యందనద్వంద్వము లిఖితనరావాప్త దాంపత్య మొప్పున్.

టీ. లిఖిత.. త్యము-లిఖిత = చిత్రింపఁబడిన, నర = మనుష్యప్రతిమలచేత, అవాప్త = పొందఁబడిన, దాంపత్యము = మిథునములుగల, వనజాక్షస్యందనద్వంద్వము - (వనజాక్షీచ - వనజాక్షశ్చ-వనజాక్షౌ - వనజాక్షయోస్స్యందనే - తయోర్ద్వంద్వం-'పుమాన్ స్త్రియా' యను సూత్రమువలన స్త్రీవాచకమగు వనజాక్షీశబ్దము లుప్తమై పురుష వాచకమగు వనజాక్షశబ్దముమాత్రము శేషించుటంజేసి యట్టిరూపంబు వచ్చెం గావున), వనజాక్ష = శ్రీశ్రీపతులయొక్క, స్యందన = తేరులయొక్క, ద్వంద్వము = జోడు, స్వనిలింపా...బులు — స్వ = తమయొక్క, నిలింప = దేవతలను, ఆవాస = నివాసము యొక్క, దత్త్వ = ఇచ్చుటయొక్కయు, అశన = ఆహారముయొక్క, దతల = ఇచ్చుట యొక్కయు (ద్వంద్వాంతమునబహుత్వము), మిథః = ఒండొంటియొక్క, తారతమ్యం బులు = ఎచ్చుతగ్గులు, ఈరెండును = ఈయశనవాసనములు, దీనుల్గాంచు = రక్తులుపొందు చున్న, అమ్మాడువులన = ఆమాడుగులనే (ఆమాడుగులయందు నివాసభుక్తి దానములు విస్తరించి కల వనుట). (మఱియు 'క్వచి ద్గకారో వ' యనుసూత్రము పరిమింపఁ జేసిమాడు గులు మాడువులనియును గలదు). అడుగన్ = వేఁడుకొనుటకు, డోఁగు . ద్రులో నాన్ - డోఁగు = వినయ పూర్వకముగా మోఁకాళ్లమీఁద నడచివచ్చిన, ఉద్యత్ = ఒప్పుచున్న,

రత=సురత మంటపలి, ఉన్నేళన=కూటములుగల, సిద్ధ సిద్ధులను దేవయోనులయొక్క,ద్వంద్వ= మిథునములయొక్క, బృంద = సమూహములకు, ఆలయ = నివాసస్థానములగు, తట = దరులును, బిల = గుహలునుగల, కల్యాణమంథాద్రులలో = హేమాద్రి మందరాద్రులలో, (మేరుమందరపర్వతములలో యనుట. కల్యాణ మన బంగారము, మంథ మనఁ గవ్వము గాన నాకల్యాణమంథశబ్దము లద్రిశబ్దముతోడ సంబంధించి ద్వంద్వాంతమందు బహువచనమగుచున్నది). నాన్ = అనునట్లు, ఒప్పున్ = ప్రకాశించును.

తా. మానవ దంపతులరూపములుగాఁ జెక్కఁబడిన బొమ్మలు గల శ్రీశ్రీపతుల రెండు తేరులు దేవతలకు నివాస మిచ్చిన మేరుపర్వతమును నాహార మగు నమృతమిచ్చిన మందరపర్వతమును దమతమ పుణ్యతారతమ్యముల నడిగి తెలిసికొనవలయు నని వచ్చి శ్రీవిల్లిపుత్తూరిలో దీనులకు నివాసంబులును నాహారంబు లిచ్చెడు నాగృహములదగ్గఱఁ జేరి తమ దరులయందును గుహలయందును సురతములయందు ననురక్తులగు సిద్ధ మిథునములతోడ నున్నవో యన్నట్లు ప్రకాశించుచున్న వని భావము. తేరులమీఁది బొమ్మలు సిద్ధదంపతులంబోలె నున్నవి. ఈపద్యమునందు 'దీనుల్గాంచు' ననుచోట 'మిన్నుల్గాంచు' ననియుఁ గొందఱు చదువుచు నచ్చట నాకాశమునొఱయుచున్న యమ్మాడువు లని యన్వయింతురు.

సీ. సవలయధ్వని గాఁగ [1]సాలిప్రేయం నదల్పు
 యతి నైన గుండె ఝల్లనఁ గలంపఁ
సుడిసిన మొగమెత్తి చూడకుండు పరాకు
 కుసుమబాణుని నైనఁ గువిటుఁ జేయ
శ్రీకార్యపరులఁ గాంచిన లేచిమ్రొక్క నం
 [2]జలికి నింద్రుండు నక్కొలువుఁ గోర
హరిగృహావసరశంఖాకర్ణనకుఁ ద్రిప్పు
 కడగంటిజిగిప్రజఁ గాఁడిపాఱఁ
తే. గవఱ లుంకించి ప్రేయఁ గొప్పవియ నవలి
కరమున నమర్పఁ బైఁటలో మరుని బటువు
బిల్లక్రియఁ బట్టుకంచెల బిగువుఁ జన్ను
నిక్కఁ దిన్నెలఁ [3]బాత్రముల్ నెత్తమాడు 59

టీ. సవలయధ్వనిగాఁగన్ = కంకణధ్వనికలుగునట్లుగా, సాలి ప్రేయు = పాచికవ్రేసెడు, అదల్పు = అదలించుట, (ఇచ్చట సారెవ్రేయునద ల్పని కొంద ఱందురు. అను ఏకారయుత రేఫాంతశబ్ద మయ్యెనేని దానిబహువచనమందు సారె లని నిల్వవలయు.

---

1. సారెవేయు. 2. బలికింద్రుఁడైన. 3. బాత్రాళి.

నట్లుగాక మహాభారతంబున నడ్డసాళ్లనియు నడ్డసాళులనియుఁ బ్రయోగంబుకలిమింజేసి యిచ్చట నికారయుత లకారాంతశబ్దముగా నుండుటయే సమీచీనంబు.) యతినైనన్ = సన్న్యాసినైనను, గుండెఝల్లనన్ = హృదయము జలదరింపఁగా, కలఁపన్ = కలుషముఁజేయుచుండఁగా, సుడిసినన్ = ఎదురైనప్పుడు, మొగమెత్తి = ముఖముపైకెత్తి, చూడకుండు = కటాక్షింపకుండెడు, పరాకు = గరువచందము, కుసుమబాణునినైనన్ = పూవిలుతునైనను, కువిటున్ చేయన్ = నీచవిటునిఁజేయఁగా, శ్రీకార్యపరులన్ = భగవత్కైంకర్యపరులను, కాంచినన్ = చూడఁగానే, లేచి = ప్రత్యుత్థానముఁజేసి, మ్రొక్కు = మ్రొక్కెడు, అంజలికి = దోసిలికై, ఇంద్రుఁడున్ = దేవేంద్రుఁడును, అక్కొలువున్ = ఆభగవత్కైంకర్యమును, కోరన్ = అపేక్షింపఁగా, హరి . నవన్ - హరి = స్వామియొక్క, గృహ = ఆలయమునందలి, అపసర = ఆయాసమయముల యొక్క, శంఖ = శంఖనాదముయొక్క, ఆకర్ణనను = వినుటను, త్రిప్పు = మరల్చెడు, కడగంటి = నేత్రాంతములయొక్క, జిగి = బెళుకు, ప్రజన్ = చూచెడువారిని, కాఁడిపాఱన్ = ఉచ్చిపోవఁగా, (అంత వాఁడి యనుట.) కపుఱలు = అడ్డసాళ్లు, ఉంకించి = కుప్పించి, వ్రేయన్ = వ్రేయఁగా, కొప్పు+అవియన్ = తుఱుము వదలఁగా, అవలికరమునన్ = రెండవహస్తముచేతను, అమర్పన్ = సవరింపఁగా, పైఁట లోన్ = పయ్యెదలోపలను, మరుని = స్మరునియొక్క, బటువుబిల్లక్రియన్ = తొడ క్రింద నునిచికొను చుట్టుదిండువలెను, పట్టుకంచెలన్ = పట్టురవికయందు, బిగువుఁజన్ను = బటువుగుబ్బ, నిక్కన్ = నిట్టవొడవఁగా, పాత్రనులు = వేశ్యాంగనలు, తిన్నెలన్ = వేదికలయందు, సెత్తము = ద్యూతమును, ఆడున్ = క్రీడింతురు.

తా. ఆశ్రీవిల్లిపుత్తూరియందు నరుఁగులమీఁద వేశ్యకాంతలు యతీశ్వరుని హృదయమైనఁ గలంగునట్లు విలాసము గలిగి యపలించి కంకణములు కపలి ధ్వనిసేయునట్లు పాచిక వ్రేయుచును, మఱియు సెట్టివా రెదుటికి వచ్చినను మొగమెత్తి చూడక పరాకుఁ జేయుచు గరువము గలిగియును, స్వామి యాలయము కైంకర్యముఁ జేసెడువారిఁ జూచినమాత్రమననే లేచి మ్రొక్కుచుండఁగా నట్టి మ్రొక్కు తనకుఁ గలుగ వలయు నని దేవేంద్రుఁడును స్వర్గమండలి యప్సరోగణములు కొలువు గల ప్రభుత్వము నైన మాని యాదేవాలయమందుఁ దా నొక్కసేవనుఁ జైయుండవలయు నని కోరుచుండఁగా నట్టి సౌందర్యము గలిగి యప్పుడప్పుడు స్వామి యాలయమందలి కొలువుల సమయములలోని శంఖనాదములు వినఁగానే బెదరిబెదరి చూచుచును బాచికలూనికఁజేసి దొరలింపఁగాఁ గొప్పు వీడఁగా నాటయందలి త్వరపాటు చేతను రెండవచేత నాకొప్పు సవరించుటకుఁ జేయెత్తినప్పుడు పైటలోని పట్టురవికలో నిక్కవొడిచెడు బటువుగుబ్బ కానరాఁగా నిట్టివిలాసములు గలిగి పగడసాల లాడుదు రని భావము.

సీ. వీడెంపుఁ [1]బలుకెంపు విరిసి వెన్నెల గాయ
వరిగింజ నొకటఁ బలువరుసఁ దోమ
నొఱసి యొత్తినమణుంగొందక మేన ని
గ్గులు దేఱఁ [2]బసపిడి జలక మాడ
ముదుక గాకుండఁ బయ్యెదలోనఁ గేలార్చి
కలయ [3]నొంటను జంటఁ గలప మలఁద
రతిరయచ్ఛిన్న సూత్రమునఁ జిక్కక ముత్తె
ములు రాల గఱగఱికలు వహింప

తే. [4]నొలసినను నెట్టినరునైనఁ గులముఁ దెలియఁ
బ్రభుత సెడి పల్లవుఁడు [5]పేద వడిన నేఁద
నృపతి వెలి యంతిపురముగా నెన్న మెలఁగ
బాసఁ గృతిఁ జెప్పవలఁతు లప్పద్మముఖులు. 60

టీ. వీడెంపుఁబలుకెంపు = తాంబూలసంబంధియగు నరుణకాంతి, విరిసి=విచ్చిపోయి, వెన్నెలగాయన్=శుభ్రవర్ణమేర్పడఁగా, వరిగింజనొకటన్ = ఒక్కశాలిబీజముచేతనే, పల్వరుసన్ = దంతపఙ్క్తిని, తోమన్ = ధావనముఁజేయుటకు, ఒఱసియొత్తినన్ = రాచియద్దినను, మణుంగొందక = తెలివలువనంటక, మేనన్=శరీరమందే, నిగ్గులుదేరన్ = మిసిమిగనుపించునట్లు, బసపిడి = పసుపుఁబూసికొని, జలకమాడన్ = స్నానముఁజేయుటకును, ముదుకగాకుండన్ = ముడుగుఁదనములేకుండ, పయ్యెదలోనన్ = పైఁటలోనే, కేలార్చి=హస్తమాడించి, కలయన్ = వ్యాపించునట్లు, ఒంటన్ = ఒడలియందును, చంటన్=కుచములయందును, కలపమలఁదన్ = పరిమళద్రవ్యమిశ్రితచందనమును బూయుటకును, రతి...మునన్-రతిరయ = పురుషాయితసురతవేగముచే, ఛిన్న = త్రెస్సిన, సూత్రమునన్=త్రాటియందు, చిక్కక=చిక్కుపడక, ముత్తెములురాలఁగన్ = మౌక్తికములు రాలుచుండఁగా, గఱగఱికలు=సొగసులను, వహింపన్ = తాల్చుటకును, ఒలసినను=సమీపించినను, ఎట్టినరునైనన్=ఎంతధనరూపాదులు గలవానినైనను, కులముఁదెలియన్=వర్ణమడిగి తెలిసికొనుటకును, ప్రభుతసెడి=ప్రాభవములేక సంపదగోలుపోయి, పల్లవుఁడు=తనమునుపటివిటకాఁడు, పేదవడినన్=దరిద్రుఁడైనను, ఏఁదన్=పోషించుటకును, నృపతివెలియంతిపురమునాన్ = నరపాలునియొక్క బహిర్గతమైన మఱియొక్క యంతఃపుర మనఁగా, ఎన్నన్=గణింపఁగాను, మెలఁగన్=సంచరించుటకును, బాసన్ ప్రతిభాషయందును, కృతిఁజెప్పన్ = ప్రబంధనిర్మాణముఁ జేయుటకును, అప్పద్మ

1. నునుగెంపు. 2. పసపాడి. 3. కలయజంబును నొట్ట; (జంటను నొంట.)
4. బొలసిననె. 5. పేదవడిన నేల,

ముఖులు = ఆవారవనితలు, వలఁతులు = సామర్థ్యముగలవారు, నలఁతు లనుపదము పల్వురుసఁదోమ ననునది మొదలుగాఁ గృతిఁజెప్ప ననుదానివఱకు సెనిమిదిపనులకు నన్వయించుచున్నది.

తా. విడియము పెక్కుమాఱులు నమలుటం జేసి మిక్కిలి కెంపెక్కిన తమ దంతములయందలి యరుణిమ విరిసి తెల్లనగున ట్లావారవనిత లొక్కవరిగింజచేతనే దంతధావనముఁ జేయుదు రనియును, స్నానముఁ జేయునప్పుడు పూసికొన్న పసుపు పరీక్షకైనను దెల్లనివస్త్రముతో తాఁచినను వస్త్రము నంటక వారి నెమ్మేనులందే నిగనిగ లాడుననియును, వారు చనుఁగవ బయల్పడనీక పైఁటలోనే కాశ్మీర కస్తూరి కర్పూర ములు మొదలగు వాసనలు గల కదంబము మిక్కిలి పలుచనఁగాఁ బూసి కొనుదు రనియును, సురతమందు తమహారముల ముత్తియంబులు తెగిన సూత్రంబున నుండక పరువెత్తు నంత వడిగా నుపరతిఁ జేయుదు రనియును, ఎట్టిసామగుఁడైన సెట్టిధనికుఁ డైనఁ దమ్ము వలచెనేని యతని కులము దెలియక కేవల ద్రవ్యాపేక్షచేతనే యత నితోఁ గూడ రనియును, మున్ను దమతోఁడఁ జెలిమిచేసిన విటుఁడు ధనహీనుఁ డయ్యె నేని యతని నాదరింతు రనియును, రాజాంతఃపుర స్త్రీజనమునకుఁ గలిగినంతపరువు గలిగి సంచరింతు రనియును, మిగుల విద్యావతులు గావున బహుభాషలలోఁ గావ్య రచనఁ జేయుటకైనను నేర్పు గలవా రనియును భావము.

ఉ. అంచితహారవల్లివలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁజి
ల్కించుఁ బసిండి యేణమద ♦ మంగముఁ జేర్చుట తక్కఁ రోయుఁ జి
డ్డించు జవాది ధూపితమ ♦ యందుట తక్క విదుర్చు బూవుఁ జొ
మ్మించు జిలుంగ తక్క నగు ♦ యౌవత మొత్తు నటంచు నన్యమున్.

టీ. యౌవతము = యువతీసమూహము, అంచిత...బుల-అంచిత = సొగసగు, హారవల్లి=వల్లికలవంటి ముక్తాహారములచేతఁ జేసిన, వలయాభరణంబుల=వలయభూషణ ములే, తక్కన్ = తప్పు, పసిండి = బంగారము, చిల్కించున్ = చిలుమువట్టుననుచు, త్రోయున్ = పరిహరించును. ఏణమదము=కస్తూరి, అంగముఁజేర్చుటతక్కన్=శరీర మందు నలఁదుటయే తప్పు, జవాది=సంకుమదము, జిడ్డించున్ = చమురుతోడిమలిన మని, రోయున్ = ఏవగించును, ధూపితమయ్యుంటతక్కన్=శిరోజముల కగరు సాం బ్రాణి మొదలగువస్తువులధూమధూపముఁ బొందుటయేతప్పు, పూవున్ = పుష్పమును, చెమ్మించున్ = తడి యనుచు, విదుర్చున్ = విసర్జించును. జిలుంగతక్క = సన్నఁపుఁజీర యేతప్పు, అన్యమున్ = పెరసరిగచీరనైనను, ఒత్తునటంచున్ = ఒత్తుకొనుననుచును, నగున్ = పరిహసించును.

తా. ఆపురిజ వరాంగ్రడు మిగుల సుకుమార శరీరములు గలవా రగుటం జేసి రంగగుబంగరుకన్న మిన్న యగు వన్నియగల తమ నెమ్మేనుల ముత్తియంబుల సొమ్ములు ధరింతురేకాని పసిఁడి సొమ్ములు చిలుఁము పట్టు నని త్రోసి వేయుదురు. కుంకుమ జిడ్డు గల దని దానిఁ బూసికొనుట వదలి కస్తూరినే పూయుదు రనియును, తుఱుములయందు విరులఁ దురిమిన నని చెమ్మగిల్లు నని వాని విడిచి ధూమధూపములచేతనే వెంగ్రడు కలుగు వాసన లెక్కింతు రనియును, సరిగె మొదలగు వానిచే నెక్కుడు వెలగల వలువల నేని యవి కఱుకగ నొఱయు నని వానిఁ బరిహసించి జిలుంగు వలువలే కట్టుదు రని యును నిట్టి నాగరకంబు గలవా రని భావము.

ఉ. వేవిన మేడపై వలభి వేణికఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోటమీటుతఱిఁ బోయెడు తేఁటులమ్రోఁత కామిశం
కావహ మౌఁ గృతాభ్యసన లౌటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణ మీటుటలుఁ జిక్కుడలించుటలు న్సరింబడన్. 62

టీ. వేవినన్ = ప్రభాతముకాఁగానే, ('క్వచిద్గకారో వః' అనుసూత్రమునుబట్టి వేగిన యనుశబ్దము వేవిన యనియునుం గలదు.) మేడపైన్ = సౌధాగ్రముమీఁదను, వలభిన్ = లోవయందు, వేణికన్ = జడను, చంటన్ = కుచమందును, వహించి = ధరించి, విప్పఁగాన్ = ఉద్గ్రథనముఁజేయుటకొఱకు, పూవులు=పుష్పములను, గోట మీఁటుతఱిన్=నఖముచేత విదుర్చుసమయమునందు, పోయెడు...మ్రోఁత-పోయెడు = విచ్చిచనుచున్న, తేఁటులమ్రోఁత = భ్రమరములధ్వని, కృతాభ్యసనలౌటను - కృత = చేయఁబడిన, అభ్యసనలౌటను = అభ్యాసముగలవారౌటచేతను, దంతపుమెట్లవెంబ డిన్=వీణకు వేసియున్న దంతపుమెట్లవెంబడిఁగా, చేవడిన్ = హస్తలాఘవముచేతను, వీణమీఁటుటలున్=వీణవాయించుటలును, చిక్కుడలించుటలున్ = శిరోజములచిక్కుఁ దీయుటలును, సరింబడన్=సదృశము లగుచుండఁగా, కామి...మౌన్-కామి = కాము కులకు, శంకావహ మౌన్ = సంశయాస్పదమగును. (ఈపద్యమునందు వారస్త్రీలని యధ్యాహారముఁ (ఊహ) జేసికొనవలయును.)

తా. ఆపట్టణమందు వారస్త్రీలు తెల్లవాఱఁగానే మేడమీఁదఁ జూరువెంబడిఁ గూర్చుండి తమ వేణి కుచోపరిభాగము మీఁద ధరించి యాజడ విప్పుచు నందలి పుష్పములు గోట విదిలించునప్పుడు పరిమళార్థ మయి ముసరికొని మరల విచ్చి పోవు తుమ్మెదలు రొదఁజేయుచుండఁగా నా ఝుంకారము విని వీథిఁబడి బోవుచున్న కాము కులు నిలిచి యాస్త్రీలు చేతులు వడివడిగా నాడించుట వీణవాయించినట్లుండఁగాఁ బుష్పములు దంతపుమెట్లవలె నుండఁగా జడ వీణవలె నుండఁగా నాస్త్రీలు వీణాభ్యా

యందలి, మరాళ = హంసలయొక్క, వితతి = సమూహము, భ్రమక్ = భ్రాంతిని, పూన్చుక్ = వహింపఁజేయును.

తా. ద్రావిడస్త్రీలు గృహముల వెనుక నుండెడుకొలనిలో రత్నసోపానములమీఁదఁ బసుపుఁగొమ్ము నరుగఁదీసికొని పసుపాడి స్నానము సేయఁగా నా రత్నసోపానముక్రింద నిద్రఁబోవుచుండిన హంసలఱెక్కల కా పసుపు నీరంటుకొని పచ్చబడియెఁ గావున నా హంసలే పట్టణమందుఁ దిరుగఁగా బంగారుఱెక్కలుగల స్వర్గమందలి హంస లని చూపఱ భ్రమింపఁజేయు ననియు నచ్చటికొలఁకుల సోపానములు మణిమయము లనియును భావము.

మ. తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాతప్రయాతద్విజా
వలిపిండీకృత[1]శాటుల న్నవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱు వానిఁ గని నవ్వు న్శాలిగోప్యోఘముల్. 65

టీ. బాతువులు = బాతులనియెడుజలపక్షులు, తలక్ = తమతలను, (జాత్యేక వచనము), పక్షచ్ఛటక్ = ఱెక్కచాలునందు, గ్రుక్కి = గ్రుచ్చి, (గ్రుచ్చి యను పాఠ మంగలదు) కేదారంపు...స్థలిక్ - కేదారంపు = పరిమళ్లసంబంధులగు, కుల్యా = కాలువలయొక్క, అంతరస్థలిక్ = మధ్యప్రదేశమందు, నిద్రింపఁగక్ = నిద్రపోవు చుండఁగను, చూచి = కాంచి, ఆరెకులు = ఊరికాఁపరులు, ఉషస్స్నాత...లు - ఉష స్స్నాత = ప్రాతస్స్నానముఁజేసినట్టియు, ప్రయాత = చనినట్టి, ద్విజావళి = బ్రాహ్మణ సమూహముచేతను, పిండీకృత = పిడుచలుగాఁజేయఁబడిన, శాటులు = వస్త్రములు, అక్ నవిక్ = అను భ్రమచేతను, తదావాసంబుక్ - తత్ = ఆ బ్రాహ్మణులయొక్క, ఆవాసంబుక్ = గృహములను, చేర్పంగక్ = చేర్చుటకొఱకు, రేవులక్ = రేవుల యందు, డిగ్గక్ = దిగఁగా, వెసక్ = వేగముచేతను, పాఱు = పరుగెత్తెను, వానిక్ = ఆబాతులను, కని = చూచి, శాలిగోప్యోఘముల్ - శాలిగోపీ = పైరుకాఁపరులగుస్త్రీల యొక్క, ఓఘముల్ = సమూహములు, నవ్వుక్ = హసించును.

తా. ఆ పట్టణసమీపమందు పరిమళ్లకు దిద్దినకాలువలయందు బాతులు వాని స్వభావగుణముచేతఁ దలలు ఱెక్కలలోఁ దూర్చికొని నిద్రించుచుండఁగా దలవరులు వానిఁ జూచి యుషఃకాలమందు స్నానార్థమై యాకాలువలకు వచ్చినబ్రాహ్మణులు తమవస్త్రములను బిండి యచ్చట నుంచి మఱచి పోయి రని తలంచి వాని మరల వారి వారి గృహములలో నొప్పగించుటకై రేవులలో దిగఁగానే యాపక్షులు పఱచుటఁ జూచి యచ్చటఁ బైరులను గాపాడుచున్న గరితలు తలవరులను బరిహసింతు రని భావము. భ్రాంతిమదలంకారము.

---

1. శాటికల్సవిఁ; శాటికావళి.

మ. సొరిదిం బేర్చినతీఁగెమల్లియలు ఖర్జూరంబులు న్పుష్పమం
జరులు న్మామిడిగుత్తులు న్కుసుమముల్ సంపెంగలు న్పచ్చగ
న్నేరు*లు న్పాశెలు గల్గి రాజనము కాంతిం దారు ముల్చూపి చే
లరుదార న్నగుఁ బువ్వుఁదోఁటల బలాకానీకదంభంబునన్. 66

టీ. చేలు = కేదారములు, ('బహువచనే క్వచి ల్లిన్నులోపశ్చ' యను నన్నయ భట్టీయసూత్రమువలనఁ జేనుశబ్దబహువచన మారూపమయ్యెను.) సొరిదిన్ = వరుసగాఁగ, పేర్చిన, తీఁగెమల్లియలు=అల్లుమల్లెలును, ఖర్జూరంబులున్ = ఖర్జూరపుఁబూవులునువర్ధిల్లినట్టి, పుష్పమంజరులున్ = పువ్వులగుత్తులును, మామిడిగుత్తులున్ = రసాలగుళుచ్ఛము లును, కుసుమముల్ - పుష్పములును, సంపెంగలున్ = చంపకములును, పచ్చగన్నే రులున్ = పచ్చపూలకరవీరములును, పాశెలు = పాశెలనుపుష్పవిశేషములు, కల్గి పువ్వుఁదోఁటలన్ = పుష్పోద్యానములను, (తీఁగెమల్లియలు, ఖర్జూరంబులున్, పుష్పమం జరులున్, మామిడిగుత్తులున్, కుసుమముల్, సంపెంగలున్, పచ్చగన్నేరులున్, పాశెలు అను పేరుగలధాన్యవిశేషములు), కల్గి=తమకుం గలిగి, రాజనము = రాజనమను పేరుగలశాలివిశేషముయొక్క, కాంతిన్ = ప్రకాశముచేతను, తారు = ఆత్మన్ శబ్ద బహువచనము (చేలనుట), ముల్చూపి = ముల్లుసూపి, (రాజనములకు ముల్లుగలిగియుం డుట సహజము. త్రాసునఁ దూఁచునప్పుడు భారమగువస్తువు దిక్కునఁ ద్రాసుముల్లుప్రాలుచు గాన దమతమసామ్యవిమర్శయందుఁ దామే హెచ్చయ్యె ననుట), బలాకా...నన్ - బలాకా = బెగ్గురుపిట్టలయొక్క, అనీక=సమూహ మనియెడు, దంభంబునన్ = నెపము చేతను, అరుదారన్ = ఆశ్చర్యమగునట్లు, నవ్వున్ = ప్రహసించును. (ముల్చూపి యనుచోట 'ప్రథమైక వచనమాత్రే వికృతానాంతాదయోపికస్యంతే' యను సూత్రమా కరము).

తా. అచ్చటి వరిచేలు పువ్వుఁదోఁటలయందుఁ గలతీఁగెమల్లియలు మొదలుగాఁ బాశె లను పదముపఱకుఁ జెప్పఁబడిన పేరులు గలధాన్యవిశేషములు దమయందుఁగలిగి తోఁటలయందుఁ గలుగనిరాజనము విశేషముగాఁగలిగి యారాజనమునకుఁ గలముల్లని యెడు త్రాసుముల్లుఁ జూపి తాము హెచ్చగుటవలన నాపువ్వుఁదోఁటలను దమమీఁదఁ దిరిగెడు బెగ్గురుపులుఁగుల తెలిచాయ లనియెడి నెపమున నవ్వుచున్న వని భావము. అనఁగాఁ బువ్వుఁదోఁటలకంటె నధికతరశృంగారము లై వరిచేలు ప్రకాశించు నని తాత్పర్యము.

చ. బలిసినహాల్లికచ్ఛటలపైఁ దమ జుంజురుముండ్లు రాయఁగాఁ
గలమము లుండుఁ బండి యొలుపగంబడి నీ రెడలింపఁ దృష్ణలోఁ

* పూబాశెలు.

దలకొన వంగి మున్ జలముఁ ద్రావెడు క్రిందటివేళ్లు మీఁదటన్
నిలిపి మరంద మానుకరణి న్నికటోపవనానిలాహతిన్. 67

టీ. కలమములు = వరిపైరులు, పండి = పక్వములై, నీ రెడలింపన్ = కట్టియున్ననీరు పరిపాకార్థమై వెడలఁజేయఁగా, తృష్ణ = నీరుపట్టు, లోఁదలకొనన్ = అంతర్వ్యాపకముగాఁగా, వంగి = నమ్రములై (బడలికచేత ననుట), మున్ = పూర్వమందు, జలముఁద్రావెడు = ఉదకపానముఁ జేసెడు, క్రిందటివేళ్లు = క్రిందనున్నమూలములను, మీఁదటన్ = ఉపరిభాగమందు, నిలిపి = ఉనిచి, బలిసిన = పుష్టిగల, హల్లకచ్ఛటలపైన్-హల్లక = చెంగలువపువ్వులయొక్క, ఛటలపైన్ = గుంపులమీఁద, మరందము=మకరందమును, అనుకరణిన్ = పానముసేయురీతిగా, నిక...తిన్-నికట= సమీపమందలి, ఉపవన = ఉద్యానవనములవలని, అనిల = గాలియొక్క, ఆహతిన్ = వీఁచుటచేతను, తమజుంజురుముండ్లు = తమయొక్క ధాన్యమంజరీకంటకములు, రాయఁగాన్ = ఒఱసికొనుచుండఁగా, ఒఱుగంబడి = కైవ్రాలి, ఉందున్ = ఉండును.

తా. వరిపైరులు పక్వము గాఁగానే కోఁత నిమిత్తమై మళ్లలో నీ రుండనీక కర్షకు లెడలించిన నెల్లప్పు డుదకపానము సేయుచున్నయవి గావున నప్పుడు నీరు లేమిం జేసి దప్పిచేత నామళ్లలోఁ బుష్పించి యున్న చెంగలువ పువ్వులమీఁద వ్రాలి మున్ను నీరు ద్రావెడు వేళ్లవలెనున్న ముండ్లు రాచు కొనుచుండఁగాఁ బువ్వులఁదేనె యానిన ట్లుండె ననియును, వాయువశముచేతఁ గదలుచుండఁగాఁ దృష్ణాభరమువలని బడలికచేత సోలుచున్న వన్నట్లుండె ననియు భావము. కేదారములయందుఁ బైరులు పండి యొఱిగియుండు నని ముఖ్యతాత్పర్యము.

చ. అడుగునఁ బండి వ్రీలి యసలై మధు*వుట్టఁగఁ ద్రావఁ దేంట్లు మ
ల్లడిఁ గొనిచుట్టి రాఁ బనసల న్వ్రేలుచు న్గలుగుండ్లతోడ నీ
డ్వడు పెనుబండ్లు భిన్నతటపాంసుల భూరిమదాంబుసేచనా
జడవృణశృంఖలాయుతవసంత †మదద్విరదాధిపాకృతిన్. 68

టీ. కలుగుండ్లతోడన్=ఱాతిగుండ్లతోడ, ఈడ్వడు = సమానములగు, పెనుఁబండ్లు=పెద్దఫలములు, అడుగునన్ = భూమిలోనే, పండి = ఫలించి, వ్రీలి=బ్రద్దలై, అసలై = బురదయై, మధువుపనసలన్ = (వేరు) పనసచెట్లయందు రసము, ఉట్టఁగన్ = కాఱఁగా, త్రావన్ = పానముసేయుటకు, తేంట్లు = భృంగములు, (ఇచ్చటఁ దేఁటి శబ్దమునకు బహువచనమందు లువర్ణము పరముగాఁగా దేఁటు లని రూపము వచ్చెంగావున 'రోలోడలటాముదితాంతస్య చవాలుక్సలోలాశ్చ' యనునాంధ్రశబ్దచింతామణిసూత్ర

* పుబ్బఁగద్రావి. † నృప.

మునుబట్టి యల తేఁటి శబ్దాంతమందలి టిష్ణర్యేకారము వికల్పకముగా లుప్తం బగుటం జేసి తేఁట్లనినిలుపవలసియుండినను తేంట్లని పూర్ణబిందుయుతముగా బహుప్రయోగముల కలిమిం జేసియును, 'శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రంబలవదుచ్యతే, అసిష్యన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్' అను వికృతి వివేకసూత్రము కలిమిబలిమిం జేసియును నిట్లే బోంట్లుమొదలగు శబ్దములు గానంబడు చుండుటం జేసియును దేంట్లని యుండుటే సాధువుగాఁ దోఁచుచున్నది). మల్లడిఁగొని = పెనఁగొని, చుట్టిరాన్ =చుట్టికొనిరాఁగా, భిన్న=పగిలినట్టి, కట = చెక్కులయందలి, పాంసుల = పరాగితమైన, భూరిమదాంబు= అధిక మదజలముయొక్క, సేచన = తడుపుగలట్టియు, అజడ = కదలుచున్న, దృఢ=గట్టి యైన, శృంఖలా = సంకెలతోడను, యుత = కూడికొన్న, వసంత ..కృతిన్-వసంత= వసంతునియొక్క, మదద్విరదాధిప = మదపుటేనుఁగు మిన్నలయొక్క, ఆకృతిన్ = ఆకారముచేతను, పొలుచున్ = ప్రకాశించును.

తా. వేరుపనస పండ్లు భూమిలోనే పండి పగులఁగా నారసము పగిలిన భూమి లోనుండి పైకివచ్చి బురుదకాఁగా నవ్వాసనకుఁ దుమ్మెదలు పెనఁగొని చుట్టుకొనఁగా నాపండ్లే వసంతుని మదపుటేనుఁగులవలె నున్న వనియును, మదాతిశయమువలన భిన్న ములైన చెక్కులవలన దొఱఁగెడు మదధారలతోఁ గలసిన దుమ్ముతోడి బురుదవలె నాఫలరసమున్న దనియును గదలుచున్న యినుపసంకెలవలెఁ జుట్టుకొన్న తుమ్మెద లున్న వనియు భావము.

ఉ. చాల దళంబుగాఁ బృథులచంపకకీలనఁ బొల్చు బొం[1]దుఁ దో
 మాలె లనంగఁ బండి మహిమండలిఁ జీఱుచు వ్రాలి గంధమూ
 ర్ఛాలసయైన భృంగతతినాఁ దుద క ప్పమర న్ఫలావళుల్
 [2]వ్రీలి గెల ల్సుగంధి కదళీవనపఙ్క్తుల నొప్పు నప్పురిన్. 69

టీ. అప్పురిన్ = ఆపట్టణమందు, సుగంధ...ఙ్క్తులన్-సుగంధికదళీ=సుగంధు లను పేరుగల యరఁటిచెట్లయొక్క, వన = తోఁటలయొక్క, పఙ్క్తులన్ =గుంపుల యందు, గెలల్ = గుళుచ్ఛములు, చాలన్ = మిక్కిలియుఁ, దళంబుగాన్ =దట్టమగు నట్లు, పృథుల...లనన్-పృథుల-గొప్పలగు, చంపక=సంపంగిపూలయొక్క, కీలనన్= కూర్పుటచేతను, పొల్చు = ఒప్పుచున్న, బొందుఁదోమాలెలనంగన్ = లావుగలతో మాలె లనునట్లు, పండి = ఫలించి, ఫలావళులు=పండ్లవరుసలు, వ్రీలన్ = పగులఁగా, మహి మండలిన్ = భూమండలమందు, చీఱుచున్ = జాచికొనుచు, వ్రాలి = సంపంగిపూల

1. దుతో. 2. వ్రీలిగొల.

మీఁదవ్రాలి, గంధ...లస-గంధ=పరిమళమువలని, మూర్ఛా=శోషచేతను, అలస ఐన=వివశమైన, భృంగతతినాన్ = భృంగసమూహ మనఁగా, తుదకప్పు-తుద = తమకొనలయందలి, కప్పు = నీలిమము, అమరన్ = కనుపడఁగా, ఒప్పున్ = ప్రకాశించును. (కాపద్యము మూఁడవపాదమందుఁ బ్లుతయతి.)

తా. ఆపట్టణమం దరఁటితోఁటలయందు సుగంధు లనియెడు నరఁటిపండ్లు గెలలయందు లెస్స పండి విరిసి కొనలయందలినలుపు గలిగి భూమిపర్యంతము జీరాడుచుండఁగా నాపండ్లగెలలు సంపెంగపూల బొందు తోమాలెలవలె నున్న వనియును, బండ్లు వికసించిన సంపెంగ పువ్వులవలె నున్న వనియును, బండ్లకొనల నున్న నీలకాంతి యాసంపెంగ పువ్వులమీఁద వ్రాలి మూర్ఛ వోయిన తుమ్మెదలవలె నున్న వనియును, నట్టిగెలలు తోమాలెలవలెఁ బొడవు గలిగి యాఁదోఁక పాటుగా నున్న వనియును భావము.

చ. మన కనురక్తి హెచ్చ నిదె యౌషధ మం దని కంఠముఁ గౌఁగిలించి ని
క్కిన ఫణిరాజవల్లి యెఱిఁగింపఁగనో యనఁ బూగముల్భరం
బునఁ బడుమట్టచేఁ జెఱకుముత్తియముల్చిటిలించి తద్రసం
బనిశము వండు నంతికతలాంతికఁ జూర్ణముఁ జేయు నప్పురిన్. 70

టీ. కంఠమున్ = మెడను, కౌఁగిలించి = ఆలింగనముఁజేసి, నిక్కి...ల్లి-నిక్కిన= (ఎగఁబ్రాకి) నిగిడినట్టి, ఫణిరాజవల్లి = తమలపుఁదీఁగె యనులతయైన, మనకున్ = మనయిద్దఱకును, (తమలపాకునకును బోఁకచెట్టున కనుట.) అనురక్తి =(అరుణిమ) హెచ్చన్= అతిశయించుటకు, ఇదె = ఈచూర్ణమే, ఔషధ మని = ఔషధ మని, ఎఱిఁగింపనో = తెలియఁజేయఁగానో, అనన్ = అనునట్లుగా, పూగముల్ = పోఁకచెట్లు, భరంబునన్ = పోఁకలభారముచేత, పడు = పతనమగు, మట్టచేన్ = పోఁకగెలలచేతను, చెఱకుముత్తియముల్ = సమీపమందున్న చెఱకులలోనిముత్తెములను, చిటిలించి = రాల్చి, తద్రసంబు= ఆచెఱకురసమును, అనిశము = నిరంతరమ్ము, వండు...కిన్ - వండు = పాకముఁ జేయుచున్న, అంతికతల = సమీపస్థలమందలి, అంతికన్ = పొయ్యియందు, చూర్ణముఁ జేయున్ = సున్నముఁజేయును, అప్పురిన్ అని మొదటికన్వయము క. 'జలధర ఫణిఫణ కీచక, జలచర కరిమస్తకేక్షు శంఖవరాహో, జ్జ్వలదంష్ట్ర శుక్తిజాతం, బులుముత్తెము లొప్పు వర్ణముల వివిధములై.' అని చెప్పఁబడిన రత్నశాస్త్రపద్ధతి చేతఁ జెఱకులయందును ముత్యము లుండుట ప్రసిద్ధము.

తా. ఆపట్టణమందుఁ జెఱకు తోఁటలలోనే తమలపాకు తీఁగెలును బోఁకమ్రాకులును నాటఁబడి యున్న వనియును, ఆచెఱకుపా లచ్చటనే వండు చున్నా రనియును, పోఁకలమట్ట లప్పటప్పటికిఁ బరిపక్వములై చెఱకులమీఁదఁ బడఁగా నందలి ముత్తెములు

చెదరి ప్రాయ్యిలోఁ బడి సున్న మగుచున్న దనియును, నట్లు సున్న మగుటకుఁ బోక చెట్లనియెడు పురుషుల కంఠములను బమలపుఁగీఁగెయనుపొలంతి యల్లుకొనుట యనియెడు కవుఁగిలింతఁజేసి మన కిద్దఱకు ననురాగము కల్గుటకు నీసున్నము మంచిదని తెలుపఁగా దాని వలన నాపోకచెట్లే సున్నముఁ జేయుచున్న వనియును, ఆపపోకలకు సున్న మెఱుపు తెచ్చునది యనియును భావము.

చ అలరుఁ బురంబునం దొగల నంతరదామరఁ బ్రాఁచిఁ గప్రపుర్
వలపులు [1]మీఱఁ లో వలుద వాలుగమొత్తము పోర నీరుకో
[2]ళ్లొకళకొళ యంచుఁ గ్రుంకు మెడగుంపులవంపులుదోఁప మావితోఁ
పుల విరుల న్బయి న్నడువఁ బోల్చు పురాతనతీర్థకుండముల్. 71

టీ. పురంబునన్ = ఆప్పట్టణమందు, తొగలఁ=కలువలచేతను, అంతరదామరన్ = జలపల్లిచేతను, ప్రాఁచి = శైవాలముచేతను, కప్రపుర్ వలపులు = కర్పూరవాసనలు, మీఱన్ = అతిశయించఁగా, లోన్ = లోపలను, వలుద=పెద్దవగు, వాలుగమొత్తము = వాలుగచేఁపలగుంపు, పోరన్ = కలహింపఁగా, నీరుకోళ్లు = జలకుక్కుటములు, ('సలోశ్చ' యనుసూత్రమునుబట్టినీరుకోడి యనుశబ్దమునకును బహువచనమందు నీరూపమువచ్చును.) కొళకొళయంచున్ = కొళకొళధ్వనిఁజేయుచు, క్రుంకు = మునుఁగునట్టి, మెడగుంపుల = కంఠసమూహములయొక్క, వంపులు = నమ్రీకరణములు, తోఁపన్ = కానరాఁగా, మావితోఁపులన్ = మామిడితోఁపులయందు, విరులన్ = పువ్వులచేతను, పయిన్ = ఉపరిభాగమందు, నడువఁబోల్చు = నడచుటకు వల నగు, పురాతనతీర్థ కుండముల్ = ప్రాఁతనీటిగుండములు, అలరున్ = ఒప్పును.

తా. ఆపట్టణమందు మామిడితోఁపులలోనఁ బ్రాఁతబావు లుండు ననియును, నాబావులయందుఁ గలువలు మొదలయిన వానివాసనలు కర్పూర వాసనలవలె నుండు ననియును, లోపల వాలుగచేఁపలు చెలఁగాడు ననియును, నీరుకోళ్లు మునుఁగుచు లేచు చుండు ననియును, పైని నిండిన పూలచేత నవి బావు లని తెలియరాక నడిచి పోవచ్చు ననిపించు ననియును, భావము.

శా. సాయంకాలములం దదీశమురజిద్ [3]త్సద్మస్వనద్దుందుభి
స్థాయత్కాహళికాప్రతిస్వనతదోఁప స్ఫుంజగర్భంబుల
న్బోయుం గేళివనిం గులాయగమనప్రోత్తిష్ఠ దన్తస్వర
స్థాయిశ్వేత గరుద్గరుత్పటపటాత్కారంబుఁ గ్రేంకారమున్. 72

1. మీఱఁగా. 2. కొలకొల. 3. త్సద్మధ్వనద్దుందుభి.

టీ. (ఆపురమందు) సాయంకాలములన్ = సూర్యాస్తమయకాలములయందు, కేళివనిన్ = లీలోద్యానమందు, కులాయ...బున్-కులాయ = గూండ్లనుగూర్చి, గమన= పోవుటకొఱకు, ప్రోత్తిష్ఠత్ = లేచుచున్న, అంతస్సరః=కొలఁకులలోన, స్థాయి ఉన్నట్టి, శ్వేతగరుత్ = హంసలయొక్క, గరుత్ = ఱెక్కలవలనఁబుట్టిన, పటపటాత్కారం బున్ = పటపటాత్కృతియును, క్రేంకారమున్ = కంఠక్రేంకృతియును, తదీశ ..తత్ = ఆశ్రీవిల్లిపుత్తూరికి, ఈశ=స్వామియగు, మురజిత్ = మన్నారుకృష్ణునియొక్క, పద్మ = కోవెలయందు, స్వనత్ = మ్రోయుచున్న, దుందుభి = భేరులయొక్కయు, స్ఫాయత్ = వృద్ధియగు, కాహళికా = బూరుగలయొక్కయు, ప్రతిస్వనత = ప్రతి ధ్వనులగుట, తోఁపన్ = తోఁచునట్లు, కుంజగర్భంబులన్ = పొదరిండ్లలోపలను, మ్రోయున్ = ధ్వనిఁజేయును.

తా. సాయంకాలములయందు విల్లిపుత్తూరియం దుండు నుద్యానవనములలోని సరస్సులయందు హంసలు విహరించుచు చాలించి గూండ్లకుఁ బోవుటకు లేచునప్పుడు వానిఱెక్కలవలనఁ బుట్టిన ధ్వనులును గంఠధ్వనులును వినఁబడఁగా నప్పుడే యాపట్టణ మందు స్వామి యగు మన్నారుకృష్ణునికోవెల సంధ్యాకాలంవునఁ మ్రోసెడు భేరుల ధ్వనులును గాహళనుల ధ్వనులును వ్యాపించి పొదరిండ్లలోఁ బ్రతిధ్వను లిచ్చుచున్నట్లు దోఁచు ననియు నప్పుడు పటపటాత్కారము భేరీప్రతిధ్వనిగాను క్రేంకారము కాహళ ప్రతిధ్వనిగాను దోఁచు ననియు భావము.

మ. *పొలయుం గాడ్పు లుదఙ్మహాలయవదంభోజాక్షవక్షస్తుల
స్యలఘుస్రఙ్మకరందబిందువులఁ బణ్యారంపుఁబుణ్యంపుఁగం
పులఁ దాపత్రయి మీఁటి పీట నటనప్రోద్యోగసజ్జీభవ
ల్లలనావర్జితకైశికక్షురితకళ్లోరాళి నల్లార్చుచున్. 73

టీ. పీటన్ = అప్పట్టణమందు, ఉద.. లన్ - ఉదక్ = ఉత్తరదిశయందు మహత్ = గొప్పదియగు, ఆలయవత్ = కోవెల గలిగిన, అంభోజాక్ష = మన్నారు కృష్ణునియొక్క, వక్షః = అక్కునందలి, తులసీ = తులసీదళములయొక్క, అలఘు = గొప్పలగు, స్రక్=మాలికలయందలి, మకరందబిందువులన్ = మకరందకణములచేతను, పణ్యారంపు = అపూపసంబంధులగు, పుణ్యంపు = పవిత్రములగు, కంపులన్ = వాస నలచేతను, తాపత్రయిన్ = ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికము లనుతాపత్రయమును,

* (ఇది పడమ్పెరుం గోవి లుడయాన్ అను నఱవ వ్యవహారమునకు సంస్కృతము.)

మీఁటి=పొడిచి, నటన...శిన్ - నటన = నాగవాసమనెడు, ప్రోద్యోగ = ఉద్యోగమునకు, సజ్జీభవత్ = అయిత్తమగుచున్న, లలనా = వారకాంతలచేతను, ఆవర్జిత = చెరువఁబడిన, కైశిక = కొప్పులవలన, క్షరిత = జారిన, కిఙ్కిరాళిన్ = చెంగలువ పూలచాలును, అల్లార్చుచున్ = మెల్లనఁ గదలించుచు, గాడ్పులు = వాయువులు, పొలయున్ = వీచును. ఈపద్యమం దుదస్తపూలయిపటంభోజాతశబ్దము ద్రవిడభాష యందు—వడపెరుంగోయి లుడయ రని యా మన్నారు కృష్ణుని పేర్పడి యున్నదాని వలనఁ గలిగినది.

తా. ఆపట్టణమందు వాయువులు మన్నారుకృష్ణునినటస్థలమందలి తులసీవన మాలికల మకరంద బిందువుల మీఁద వీచుటంజేసి యాశైత్యంబును, బరిమళంబును స్వామి కోవెలయందలి యధూపముల పైఁగా వీచుటంజేసి పుణ్యసౌరభంబును, నందలి యాటకత్తెల కొప్పుల చెంగలువల నల్లనల్లనఁ గదల్చుచు మాంద్యంబును నందలి సౌరభం బును గలిగి సంచరించు నని భావము.

చ. మలయపుగాలి రేలు వనమాలి విమానపతాక ఘల్లుమం
చులియఁ బసిండిమువ్వగమి నొక్కొకమాటు గదల్ప నుల్కి మి
న్నలము తదీయహేమవరణాంచలచంపకశాఖలందుఁ బ
క్షులు రొద సేయ వేగె నని కూడుదు రల్కలు [1]దేరి దంపతుల్.

టీ. (ఆపురమందు) మలయపుగాలి=మలయమారుతము, రేలు = రాత్రులయందు, వన...తాకన్ - వనమాలి = స్వామియొక్క, విమాన = కోవెలమీఁదలి, పతాకన్ = ధ్వజమందు, పసిండిమువ్వగమిన్ = బంగారుచిఱుగంటలగుంపును, ఘల్లుమంచులియన్ = ఘల్లుమని ధ్వనిసేయునట్లు, ఒక్కొకమాటు - ఒక్కొకసారి, గదల్పన్ = కదలింపఁగా, మిన్న...దున్ - మిన్ను అలము = ఆకసమునంటెడు, తదీయ = ఆకోవెలసంబంధియగు, హేమవరణ = బంగారు ప్రాకారముయొక్క, అంచల = అంచులనున్న, చంపక శాఖలందున్ = సంపెంగకొమ్మలయందు, పక్షులు = పులుఁగులు, ఉల్కి = బెదరు పాటుఁజెంది, రొదసేయన్ = కలకలఁబలుకఁగా, దంపతులు = ఆపట్టణమందలి స్త్రీ పురుషులు, వేగె ననిన్ = తెల్లవారె ననుకొని, అల్కలుదేరి = ప్రణయకోపములను మాని, కూడుదురు = సంభోగింతురు.

తా. ఆపట్టణమందు స్వామి కోవెలధ్వజస్తంభమం దున్న బంగారుచిఱుమువ్వలు రాత్రులయందు మలయమారుతము సోఁకి కదలి ఘల్లు మని యొక్కొక్క సారి

1. దీఱి; మాని.

చప్పుడు కాఁగా నాకోనెల బంగారు ప్రాకారము వెంబడి నున్న సంపెంగ కొమ్మల యందు నిద్రించుచున్న పక్షు లదరి ధ్వనిఁ జేయఁగా విని పక్షులు గూయుచున్నవి తెల్లవాఱవచ్చె నని భ్రమించి ప్రణయ కలహములు వహించియున్న దంపతులు కోప ములు మాని యప్పుడ రమింతు రని భావము.

చ. కలమపు టెండుగు ల్ద్రవిడకన్యలు ముంగిటఁ గాచి యుండి త
జ్జలరుహనాభగేహరురుశాబము సారెకు బొక్కులాడఁ గొం
డెలపయి క్రమ్మ గ్రామ్యతరుణీతతి డించిన పేఁపగంపలం
[1]దల మగుచున్న చెంగలువదండలఁ దోలుదు రప్పురంబునన్. 75

టీ. ఆప్పురంబునన్ = అవిల్లిపుత్తూరను, ద్రవిడకన్యలు = ద్రావిడకన్యకలు, కలమపుటెండుగల్ = రాజనపువడ్లుపోసినయెండుగులను, ముంగిటన్ = గృహపురో భాగమందు, కాచియుండి = కనిపెట్టియుండి, తజ్జ...ము-తత్=ఆపట్టణమందలి, జలరుహనాభ=స్వామియొక్క, గేహ = కోవెలయొక్క, రురుశాబము = ఇఱ్ఱిపిల్ల, సారెకున్= మాటిమాటికిని, బొక్కులాడన్ = ఆయెండఁబోసినవడ్లు దినుచుండఁగా, కొండెల పైకిన్=తమకొండె సిగలమీఁదికిఁగా, అమ్మన్ = విక్రయించుటకై, గ్రామ్యతరుణీతతి= పల్లెలస్త్రీలసమూహము, డించిన = అక్కడ దించుకొనియున్న, పేఁపగంపలన్ = పేములచే నల్లినగంపలయందు, తలమగుచున్న = నిండియున్న, చెంగలువదండలన్ = ఎఱ్ఱకలువదండలచేత, తోలుదురు = పోఁజోపుదురు.

తా. అవిల్లిపుత్తూరియందు ద్రవిడకన్యకలు ముంగిళ్ల నెండ బోసియున్న వడ్లకుఁ గావలియుండఁగా నచ్చటి స్వామికోనెలలోని పెంపుడు జింకపిల్ల యావడ్లు మాటిమా టికి బొక్కుచుండఁగా నా పిల్లను వేఱు మఱియొకదానిచేఁ గొట్టిన నొచ్చు నని యెడు నానృశంస్యముచేతను, దమకొండెసిగలపైకెఁగాఁదెచ్చి విక్రయార్థ మచ్చట దించుకొని యున్న గ్రామ్యస్త్రీల పేఁపగంపలలోని కలువదండల చేతనే తోలుదు రని భావము.

సీ. ఎదు రేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి
నారికేళకటాస నముల నునిచి
నునుబోఁకపాత్రిఁ గు ట్టిన దొప్ప గమితోడ
రంభావిశాలప ర్ణములు వఱచి
శాల్యన్నసూపాజ్య కుల్యాబహువ్యంజ
నక్షీరదధు[2]లర్ప ణంబుఁ జేసి

1. తలముగ నున్న. 2. ప్రీణనము.

వార్చినపిదప సంవాహన మంఘ్రులఁ
 గొనరిచి తాంబూల మొసఁగి కుశల
తే. మడిగి పోయెద మన్న ద వ్వనిచి సిరికిఁ
దగినసత్కృతిఁ జేసి ఖేదమున[1]మగిడి
యర్చఁ గావింతు రెపుడు ని ట్లతిథు లైన
భాగవతులకు [2]నప్పురి భాగవతులు. 76

టీ. అప్పురిన్ = ఆపట్టణమందలి, భాగవతులు = భగవద్భక్తులగువారు, అతిథు లైన=అభ్యాగతులైన, భాగవతులకున్ = భగవద్భక్తులకు, ఎదురేఁగి = ఎదురుగాఁబోయి, సాష్టాంగము = కరపాదఫాలవక్షోభుజములనియెడి యష్టావయవములతోఁ గూడునట్లు, ఎరఁగి=ప్రణమిల్లి (శ్లో. 'వైష్ణవంవైష్ణవోదృష్ట్వా దణ్డవత్ప్రణమేద్భువి' యున్నట్లు దండ ప్రణామముఁ జేసి యనుట), పాద్యం బిచ్చి = పాదప్రక్షాళనముఁ జేసి, నారికేళకటాస నములన్ = నారికేడపుటాకులచే నల్లినచాఁపలయందు, ఉనిచి = కూర్చుండఁ బెట్టి, (స్నానాద్యనుష్ఠానములు మున్నే తీర్చికొనివచ్చినారుగాన,) మృదుపాకపాత్రిన్ - మృదు= మృదువగు, పాకపాత్రిన్ = పాకమట్టిచేత, పట్టిన = కూర్చిన, దొప్పగమితోడన్ = దొన్నెలగుంపుతోఁగూడ, రంభాదిశాలపర్ణములు = అరఁటిమొదలగు పత్రములు, పఱచి = ఆస్తీర్ణముఁజేసి, శాల్యన్న...లు-శాల్యన్న = వరియన్నమును, సూప = పప్పును, ఆజ్య కుల్యా = నేతికాలువలును, బహువ్యంజన = పెక్కుపరికరములును, క్షీరదధులు = పాలు పెరుఁగులును, అర్పణంబుఁజేసి = వారికి సమర్పించి, భోజనానంతరము, వార్చిన పిదప = హస్తప్రక్షాళన పాదప్రక్షాళనములవెనుక నాచమనముఁజేసిన యనంతరమందు, అంఘ్రులన్ = వారిపాదములకు, సంవాహనము = మర్దనము, ఒనరించి = చేసి (పాద ములఁ బిసికి యనుట), తాంబూలమొసఁగి = విడెమిచ్చి, కుశలమడిగి = వారెప్పటికి సేమ దేరి యుండఁగాఁ గుశలప్రశ్నఁజేసి, పోయెద మన్నన్ = వారే పోయెద మని చెప్పి రేని, (వీరు బలాత్కారముగా నిల్పుటకు స్వాతంత్ర్యములేనివారు గాపున వెంబడించి), దవ్వనిచి = దూరముగ నంపి, సిరికిఁదగిన = తమ కలిమికిఁ దగిన, సత్కృతిఁజేసి=సత్కా రముఁజేసి (సంభావన యిచ్చి యనుట), ఖేదమునన్ = ఎడఁబాసిన దుఃఖముచేతను, మగిడి = తిరిగి, ఎపుడును = ఎప్పుడు, ఇట్లు = ఈచెప్పినట్లు, అర్చగావింతురు = పూజ సేయుదురు.

తా. సులభము. ఇచట భాగవతు లతిథులం బూజించి రనుట విష్ణుచిత్తుఁ డీరీతిని భాగవతులం బూజించు నని సూచించుచున్నది.

1. మగుడి. 2. నవ్వీటి.

శా. అందుండుం ద్వయసద్మపద్మవదనుం డద్వంద్వుఁ డశ్రాంతయో
గాందూబద్ధమధుద్విషద్ద్విరదుఁ డన్వర్థాభిధానుం డురు
చ్ఛందోబృందతదంతవాగపరనాసంజాతతజ్జన్యని
ష్పందద్వైతసుసంవిదాలయుఁడు నిష్ఠన్ విష్ణుచిత్తుం డనన్. 77

టీ. ద్వయ...నుండు - ద్వయ = ద్వయమను శ్రీవైష్ణవమంత్రమునకు, సద్మ = గృహమైనట్టియు, పద్మ = కమలమువంటి, వదనుండు = ముఖముగలయట్టియు, అద్వంద్వుఁడు = శీతోష్ణ సుఖదుఃఖాదులు లేనియట్టియు, అశ్రాం...డు - అశ్రాంత = ఎడతెగని, యోగ = న్యాసయోగమనెడు, అందూ = సంకిళ్లచేత, బద్ధ = కట్టఁబడిన, మధుద్విషత్ = మధుసూదనుఁడనియెడు, ద్విరదుఁడు = ఏనుఁగు గలయట్టియు, ఉరు...డు - ఉరు = బహువిధములైన, ఛందః = వేదములయొక్క, బృంద = సమూహము యొక్కయు, తదంత-తత్ = ఆ వేదములయొక్క, అంత = అంతములగు నుపనిషత్తుల యొక్క, వాక్ = వాక్యములయొక్క, అపరనా = చదువనిచేతనే, సంజాత = పుట్టినట్టియు, తజ్జన్య = ఆ వేదవేదాంతజన్య మగునట్టియు, నిష్పంద = చలింపనియట్టి, ద్వైత = చిదచిదీశ్వర భేదకమైన, సుసంవిత్ = మంచిజ్ఞానమునకు, ఆలయుఁడు = గృహమగునట్టి, విష్ణుచిత్తుం డనన్ = విష్ణునందుఁ జిత్తము గలవాఁ డనఁగా, అన్వర్థాభిధానుండు = సార్థకనామధేయుఁ డగు పరమయోగి, నిష్ఠన్ = సదాచార సంపత్తిచేతను, అందున్ = ఆ శ్రీవిల్లిపుత్తూరియందు, ఉండున్ = నివసించును.

తా. ఆ శ్రీవిల్లిపుత్తూరియందు నిరంతరము ద్వయానుసంధానముఁ జేయుచు సుఖదుఃఖములు శీతోష్ణములు సరిగాఁ దలంచుచుఁ దన నిరంతర యోగముచేత శ్రీపతిని వశపఱుచుకొని వేదవేదాంతములు చదువకయే వాటివలనఁ గలుగవలసిన నిశ్చల ద్వైతజ్ఞానమునకుఁ దాను నివాసభూమియై విష్ణుచిత్తుండను సార్థకనామధేయముగల యొకమహాయోగి నిష్ఠఁ గలిగియుండు నని భావము. (ద్వయ తిరుమంత్ర చరమ శ్లోకములు వైష్ణవ సాంప్రదాయకములు).

వ. అమ్మహీసురవరుండు ప్రకృతికంటెఁ బరుండగు దన్నును, దనకంటెఁ బరుండగు పరమేశ్వరుం, బరమేశ్వర ప్రసాద బహుజననకృత సుకృత ఫలరూప యగు నాచార్యకృపగు ప్తదానంబు నిధానంబుఁ దెలిపిన గతిం దెలుపఁగా, నాత్మీయతదీయ శేష శేషిత్వసంబంధం బనాద్యంబుగాఁ దెలిసి యీతెలివి గలిగి యఖండనిర్వృతిం గాంచి సుఖించు పరమ యోగికి బహుక్లేశదంబులగు చదువులం బనియేమి యీవివేకంబు

లేనివాని హేతువాదంబు ధాతువాదంబు, కాణాదంబు ప్రాణాదంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస హింస, వ్యాకరణం బకరణం బటు గాక చదువ దొరకొనిన నరునకుఁ గాలంబు నాలంబు విఘ్నంబు లక్ష లోద్యమఘ్నంబు లందులకు సామగ్రి గిటకిటన, గొంతెఱుంగ నగు మదంబు పుటపుటన, దుదముట్టం జదివెనేనియు సముత్పన్న విజ్ఞానుం డై త్రైగుణ్యవిషయంబులగు వాని నానీతధాన్యుండు నిష్ఫలం బైన పలాలంబును నాఁబుధుండు సిక్థకంబును విడుచువడువున విడువ వలయుఁ గావున శాంతిదాంతిపరతం[1]బరమైకాంతినైన నాకు మొదల నివి యధిగమింపం దుద విసర్జింప నేమిప్రయోజనంబు ; వాదిభంజ నంబు రాజరంజనంబును జేయుచుఁ బునర్జననంబులకు విసువనిజనం బులకుఁ గానిమ్ము మాదృశులకుఁ దదీయఖ్యాతి యీతి, లాభంబు, క్షోభంబు, పూజనం బుద్వేజనం బని వితర్కించి యుర్వరఁ బూర్వం బున సౌవీరభూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కని చిన భరతభూమి సురవతంసంబునుబోలె దుర్విభావ్యబోధుండై పరమ పదంబునను భాగవతుల కప్రాకృతంబులగు బహుభద్రమూర్తులు భరియించి భగవత్పరిచర్య సేయుట[2]యుఁ బరమపురుషార్థం బగుట యెఱింగి యచటి రథచరణపాణిమాలికాకరణకైంకర్యంబున కంతు రితకౌతూహలుం డై చేయుచుండె, మఱియును. 78

టీ. అమ్మహీసురవరుండు = ఆబ్రాహ్మణోత్తముఁడు (విష్ణుచిత్తుఁడు) ప్రకృతి కంటెన్ = ఇరువదినాల్గు తత్త్వములుగల యచిత్తుకంటె, పరుండగు = వేఱైన, తన్ను = జీవు ననుట, తనకంటెఁ బరుండగు పరమేశ్వరున్ = బ్రహ్మమును, అనఁగా శ్లో. 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.' అను తెఱఁగునఁ దనకంతర్యామి యగు పరమేశ్వరు ననుట. పరమే...రూప- పరమేశ్వరప్రసాద = భగవదనుగ్రహమువలన నైన, బహుజనన = పెక్కుజన్మముల యందు కృత = చేయఁబడిన, సుకృత = పుణ్యములకు, ఫలరూప యగు = ఫలస్వరూప మగు, ఆచార్యకృప = గురుకారుణ్యము (ఇది కర్తృపదము), గుప్తదానంబు = పూర్వ జన్మమందుఁ జేసిన యేకాంతదానము, నిధానంబుఁ దెలిపినగతిన్ = సద్యోజన్మమందు నిక్షేపమును దెలిపిన తెఱఁగున, తెలుపఁగాన్ = తెలుపఁగా, అనఁగా సకలవేదశాస్త్రపురా

1. పరమైకాంతికునకు; పరమైకాంగి నైననాకు. 2. (య) పరమ.

కేతిహాసములకు సారభూతమైన చిదచిదీశ్వర తత్త్వత్రయజ్ఞానమును బహుజన్మకృత సుకృతలబ్ధమైన యాచార్యకృప తేటపఱచిన దనుట. శ్రు. 'ఆచార్యదేవోభవ' యని తైత్తిరీయశ్రుతియందును, 'ఆచార్యవాన్ పురుషోవేద' యని ఛాందోగ్యమందును, 'యస్యదేవే పరాభక్తి ర్యథాదేవే తథాగురౌ, తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః.' అని కఠవల్లియందును, 'దేవతాయాగురోశ్చైవ మంత్రస్యాపి ప్రకీర్తనాత్, ఐహికాముష్మికాసిద్ధి ర్ద్విజస్యాస్తి నసంశయః' అని పురాణసముచ్చయమందును, 'యస్మా ద్దేవోజగన్నాథః కృత్వా మర్త్య మయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా, తస్మా ద్భక్తి ర్గురౌ కార్యా సంసారభయభీరుభిః.' అని పాంచరాత్రమందలి జయాఖ్య సంహితయందు, 'చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యస్స్మరేత్, హస్తస్థ ముదకం త్యక్త్వా ఘనస్థం సోఽభివాంఛతి. సులభంతు గురుం త్యక్త్వా దుర్లభం యఉపాసతే, బద్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్త మన్వేషతి క్షితౌ' అనునీమొదలగు ప్రమాణములచేతి నాచార్యకృపయే ప్రధాన మని యెఱుఁగఁదగినది. ఆత్మీయ...బు = ఆత్మీయ = తనసంబంధమగు, తదీయ = ఆపరమేశ్వరసంబంధ మగు. శేష = భృత్యత్వసంబంధము, శేషిత్వసంబంధము = స్వామిత్వసంబంధము, అనాద్యంబుగాఁ దెలిసి=అనాదిసిద్ధ మని యెఱిఁగి, ఈతెలివిగలిగి = ఈజ్ఞానము గలిగి, అఖర్వ=అఖండమగు, నిర్వృతిం గాంచి = సుఖమునుజెంది, సుఖించు=సొగసెడు, పరమయోగికిన్=మహాయోగీశ్వరునకు, శ్లో. 'శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలనకారణ'మ్మన్నట్లు, బహుక్లేశదంబులగు = బహుప్రయాస కరములగు, చదువులం బనియేమి=చదువులచేనేమిపని, ఈవివేకంబులేనివాని= ఈజ్ఞానములేనివానియొక్క, హేతువాదంబు = కారణవాదము, ధాతువాదంబు = లోహాదిమారణక్రియ, కాణాదంబు = తర్కశాస్త్రము, ప్రాణాదంబు = ప్రాణహరము, కాపిలంబు = సాంఖ్యమతము, చాపలంబు = సేశ్వర నిరీశ్వరభావభేదములచేత బుద్ధి చాంచల్యకరము, మీమాంస = అగ్నిష్టోమాది కర్మకాండవిషయము, హింస = పరప్రాణాపహారిణి, వ్యాకరణంబు = శబ్దశాస్త్రము, అశరణంబు = రక్షించునదిగాదు, చదువ దొరకొనినన్ = పఠించుట కుపక్రమించెనేని, కాలంబు నాలంబు = కాలము చాలదనియు, అనుకూల మనియును, విఘ్నంబులు = అంతరాయములు, సకలోద్యమఘ్నంబులు = సర్వకార్యనాశకంబులు, అందులకు = శాస్త్రాభ్యాసమునకు, సామగ్రి = సాధనసంపత్తి, కిటకిటన = మిక్కిలి కొంచెము, కొంతెఱుంగనగుమదంబు పుటపుటన= కొంతదెలియఁగానే గర్వంబు పుటపుటన పొడమును; పలాలంబు = ఊముకపొట్టు, సిక్థకంబు = మైనము, ఈతి=ఈతిబాధ, ఉద్వేజనంబు = భయంకరము, గౌరవంబు= గురుత్వమును, రథచరణపాణి = చక్రపాణియగు మన్నారుకృష్ణుని. కడమది సులభము.

తా. సులభము.

క. న్యాయార్జితవిత్తంబున
నాయోగీశ్వరుఁడు వెట్టు నన్నం బాప్రా
లేయ పటీరాచల ప
ద్యాయాతాయాత వైష్ణవావలి కెల్లన్. 79

టీ. ఆయోగీశ్వరుఁడు=ఆవిష్ణుచిత్తుఁడు, న్యాయార్జితవిత్తంబునన్ = న్యాయార్జిత ధనముచేతను, ఆప్రాలేయ పటీరాచల పద్యాయాతాయాతవైష్ణవావలి కెల్లన్ = హిమాచల మలయాచలముల మధ్యమార్గస్థులై వచ్చుచుం బోవుచుండెడు వైష్ణవ సముదాయమున కెల్లను, అన్నంబు పెట్టున్. 'సరణిః పద్ధతిః పద్యా' యని యమరుఁడు.

తా. సులభము.

చ. గగనము నీరుబుగ్గ కెనఁగా జడివట్టిననాళ్లఁ భార్య క
న్పొగ సొరకుండ నారికెడపుంబోటియ [1]ల్దవులించి [2]వండ న
య్యగపల ముంచిపెట్టుఁ గలమాన్నము నొల్చినప్రప్పు నాలుగే
న్బొగిపినకూరలు న్వడియము ల్వరుగు ల్పెరుఁగు న్ఘృతప్లుతిన్. 80

టీ. కర్తృపద మధ్యాహార్యము. ఆయోగీశ్వరుండు, గగనము = ఆకాశము, నీరుబుగ్గకున్ = పర్వతాంచులయందుండి సంతతధారగా నీరు పైకుబికి వచ్చెడియూటకు ఎనగాన్ = సదృశముకాఁగా, జడిపట్టిననాళ్లు=వర్షముపట్టిన దినములయందు, భార్య= తనయిల్లాలు, కన్ = నేత్రములోనికి, పొగసొరకుండన్ - ధూమము ప్రవేశింపకుండ, నారికెడపుంబోటియలు = నీరు వెడలించి యెండించిన యెడనీటిటెంకాయబోండ్లములు, తవులించి ప్రొయ్యిలో నంటించి, వండన్=పాకముఁ జేయఁగా, అయ్యగపలన్ = ఆటెంకాయ చిప్ప యబకలచేతనే, కలమాన్నమున్ = వరియన్నమును, ఒల్చినప్రప్పు= ఒల్చుప్రప్పును, నాలుగేన్బొగిపినకూరలున్ = నాలుగైదుపొరటిన కూరలును, వడియములు=వడియాలును, వరుగులు = శుష్కశాకములును, పెరుఁగున్ = దధియును, ఘృతప్లుతిన్ = ఆజ్యసిక్తమగునట్లుగా, ముంచిపెట్టును = ఘృతప్లుతిదధికిఁ బూర్వమన్వయించునది.

చ. తెలినులివెచ్చ యోగివరుఁ డియ్యని చారులుఁ దిమ్మనంబులున్
బలుచనియంబళు ల్చెఱకుపా లెడనీళ్లు రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వడపిందెలు నీరుఁ జల్లయు
న్వెలయఁగ బెట్టు భోజనము వేఁడిఁ జందనచర్చ మున్నుగన్. 81

1. ల్దగిలించి. 2. వడియ.

టీ. వేసవిన్ = గ్రీష్మర్తువందు, చందనచర్చ = చందనాలంకారము, మున్నుగన్ = మొదలుగాఁగా, (ముందఱ చందన మిచ్చి యనుట), తెలినులివెచ్చ రోగిరము = తెల్లనై మందోష్ణమగు నన్నంబును, తియ్యనిచారులు = తియ్యఁజారులును, తిమ్మనంబులున్ = మజ్జిగపులుసులును, పలుచని యంబళులు (అంబలిశబ్దబహువచన మంబళులనియునుంగలదు), చెఱకుపాలు = ఇక్షురసములు, ఎడనీళ్లు = లేఁతటెంకాయనీళ్లును, రసావళులు = భక్ష్యవిశేషములును, ఫలంబులును = కదళీరసాలాదిఫలములును, సుగంధిశీతజలములు = వట్టివేళ్లు మొదలగువానివలనఁ బరిమళించు చల్లనగు నుదకములును, వడపిందెలు = వడదుబోఁగొట్టునట్టి ఊరవేసిన లేఁతమామిడి పిందియలు, నీరుఁజల్లయున్ = నీరుమజ్జిగయును, వెలయంగన్ = ప్రసిద్ధమగునట్లు, భోజనముఁ బెట్టున్ = ఆహార మొసంగును. రసావళులు భక్ష్యవిశేషము లనుటకు బాలసుదొరగా రిచ్చినయుదాహరణము:—

క. తనయింట కప్పు రాయిత, మొనరించిన కమ్మఁదావు లొలుకురసావళ్లును మినపవడలును జాఁప, ట్లును గోదుమపిండివంటలున్ గలవనినన్" (విష్ణు. 3. ఆ. 377ప.)

అతిరసములు గాపలయు. తా. సుగమము.

మ. పునుఁగుందావి నవోదనంబు మిరియంపుంబొళ్లతోఁ జట్టి చు
య్యను నాదాఱనికూరగుంపు ముకుమం దై యేర్చునావం జిగు
రొ్కను పచ్చళ్లును బాయసాన్నములు నూరుంగాయలున్ జేసుఱు
క్కను నేయుం జిఱుపాలు వెల్లువుగ నాహారం బిడు న్సీతునన్. 82

టీ. సీతునన్ = శీతకాలమందు, పునుఁ...బు-పునుఁగుందావి = పునుఁగుదావులను పేరుగల కలమ విశేష సంబంధియగు, నవ=నూతన మగు, ఓదనంబు = ఓగిరమును, (వేఁడివేఁడి యన్న మనుట - పునుఁగు రాజనము లుష్ణప్రధానము లని వైద్య శాస్త్రమందుఁ బ్రసిద్ధము గనుక నాశీతకాలమున నుచితములు), మిరియంపుంబొళ్లతోఁన్ = మిరియముల పొడులతోడ, చట్టి=భాండ విశేషము, చుయ్యనునాదు = చుయ్యనుచు మ్రోసెడు నాదము, ఆఱని = నశింపని, కూరగుంపు = శాకసమూహము, (మిరియాల పొడితోఁగూడఁ దిరుగఁ బోసిన నాదము వదలకమున్నే యనుట), ముకుమందై = ముక్కులోని జుబ్బును మాన్చు నౌషధమై, ఏర్చు = చుఱచుఱ మనియెడు, ఆవన్ = ఆవాలపిండి చేతను, చిగురొ్కను = క్రచ్చియెత్తిన, పచ్చళ్లును, ఊరుంగాయలును = ఊరుగాయలును, చేసుఱుక్కను నేయున్ = చేతిమీఁదఁబడఁగానే యుష్ణత గనుపించెడు ఘృతమును, చిఱుపాలున్ = నగ మివురఁ గాచినపాలును, వెల్లువగన్ = సమృద్ధియగునట్లుగా, ఆహారం బిడున్ = భోజనము పెట్టును, ఈపద్యంబునందు, 'నుమ్మోచ్చతి'

అను సూత్రబలమువలనఁ బురుఁగుదావి యను నెడఁ బూర్ణబిందువును 'సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి' యను సూత్రమువలనను, 'ఆంధ్రం షడ్వర్ణ పర్యంతం సంస్కృతేన సమస్యతే' యను నథర్వణోక్తివలనను, పునుఁగుందావినవోదనంబని కర్మధారయసమాసంబును బ్రయుక్తంబు లయ్యెను. తా. సుగమము.

చ. కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండిపైఁ
గుదురుగ నిల్పి యోపుగతి కూనల నూనియ నించి త్రాట ము
న్నుదికినశాటి వ్రేల నదిఁ నొక్కటఁ గ్రుంకిడి వత్తు రెందతే
వదలక యాతనింట శనివారమునఁ బరదేశివైష్ణవుల్. 83

టీ. ఆతనింటన్ = అవిష్ణుచిత్తునింటను, (ఇచ్చట షష్ఠ్యర్థమున నిత్యసంధి), పరదేశివైష్ణవుల్ = అభ్యాగతు లగువైష్ణవులు, శనివారమునన్ = మందవాసరము నాఁడు, కదళి...టన్ -కదళి = అరఁటియొక్క, గభీర = లోఁతగు, పుష్పపుటికా = పూదొన్నెల యొక్క, ఛటన్ = సమూహమును, చేతులన్ = హస్తములయందు, ఇప్పపిండిపైన్ = తలఁ బులిముకొనుటకు నూఱిన మధుకపిష్టముమీఁదను, కుదురుగన్ = తొలఁగకుండునట్లు, నిల్పి = పాదుకొల్పి, ఓపుగతిన్ = చాలినరీతిగ, కూనలనూనియ - కూనల = మహాభాండముల లోని, నూనియ = తిలతైలమును, నించి = నిండించి, త్రాటన్ = దారమందు, మున్నుదికిన = పూర్వధౌత మగు, శాటి = వస్త్రము, వ్రేలన్ - వ్రేలుచుండఁగా, నదిన్ = ఏటియందు, ఒక్కటన్ = ఒక్కసారిగా, క్రుంకిడి = స్నానముఁ జేసి, ఎందఱేన్ = అనేకు లనుట, వదలక వత్తురు = విడువక తిరిగి వత్తురు.

తా. అవిష్ణుచిత్తునియింట శనివారమునాఁడ నేకు లగు పరదేశివైష్ణవులు తమ తమ యభ్యంగన స్నానముకొఱకు నిప్పపిండి నూఱి యాముద్ద చేతిలోఁ బెట్టుకొని దానిమీఁద నరఁటిపూవు దొన్నెలు పెట్టుకొని వానిలోఁ దమకుఁ గావలసినంతవఱ కావిష్ణుచిత్తుని యింటిలో కూనలకుఁ బోసి యున్ననూనె తామే పోసికొని స్నానానంత రము ధరించుకొనుటకై ధౌతవస్త్రములు త్రాడునకుఁ గట్టి తాఁకక యొకచేతఁ బట్టుకొని నదికిం బోయి యచ్చట నభ్యంగన స్నానముఁ జేసి వత్తు రని భావము.

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించి నన్నోయి నెం
తే నాగేంద్రశయాన(ను) పుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్యానము నాస్తి శాకబహుళతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్య మన్మాటలున్. 84

టీ. అని...మన్ - అనిష్ఠానిధి = సదాచారమునకు నిక్షేపమయిన యావిష్ణుచిత్తునియొక్క, గేహసీమన్ = గృహసీమయందు, నడురేయి = అర్ధరాత్రమందు,

ఆలించినన్ = విన్నను, ఎంతేన్ = మిక్కిలి, నాగేం...లున్ - నాగేంద్రశయాన = శేషశాయియగు స్వామియొక్క, పుణ్యకథలున్=పవిత్రకథలును, దివ్య...ము - దివ్య ప్రబంధ = ద్రావిడ ప్రబంధముయొక్క, అనుసంధాన = పారాయణముయొక్క, ధ్వానము=ధ్వనియును, శాకబహుతా = కూరలబాహుళ్యము, నాస్తి=లేదు, ఉష్ణతా= పదార్థములందు వేఁడిమి, నాస్తి = లేదు, అపూపః=పణ్యారము, నాస్తి = లేదు, ఓదనసౌష్ఠవం చ - ఓదన = ఓగిరముయొక్క, సౌష్ఠవంచ=చక్కఁదనము, నాస్తి=లేదు, కృపయా=దయచేతను, భోక్తవ్యం = ఆరగింపఁదగినది, అన్నాటలున్=అనియెడు వాక్యములును, మ్రోయున్ = ధ్వనిసేయును. ఈపద్యమందుఁ గేవలసంస్కృతవాక్యములుండి నను ననియెడు ననుకరణము గలిగినది గావున, 'అనుకృతేఽస్తివాక్యంతు' అనుసూత్ర బలమువలనఁ జెల్లును. భోక్తవ్య మనుచోట 'అహమాదీనాం ద్విత్వ' మను సూత్రముం బట్టి ద్విత్వంబు రావలయును, ఐనను, శ్లో. 'శబ్దానా మన్త్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే, తస్యాచివరతోమస్స్యా త్సర్వత్ర కవిసమ్మతేః' 'పదేశు తద్య దాద్యంతే వాద్విత్వం హారిసమ్మతేః' అను నథర్వణోక్తులవలన ద్విత్వాభావమై యనుస్వారమునకు మకారము వచ్చెను. మూఁడవపాదమందు నిత్యసమాసపదములఁ జేరిన నాస్తిపదమున కనునాసికయతి.

తా. ఆవిష్ణుచిత్తుని గృహమందుఁ బగటిపూటలయందే కాక అర్ధరాత్రమందు వినఁబోయినను శేషశాయిపుణ్యకథలఁ జెప్పుకొనువారి కంఠనాదములును, దివ్యప్రబంధముల రవములును, భోక్తలతో నావిష్ణుచిత్తుఁడు కూరలు లేవు సాదము వేఁడిగాలేదు భక్ష్యములే దన్నముకూడ నొప్పిదముగా లేదు, కృపచేతనే యారగింపవలయు నని చెప్పెడి యుపచారవాక్యములును వినంబడు నని భావము.

తే. ఇత్తెఱంగున నవ్వైష్ణవోత్తముండు
జాగరూకతఁ దైర్థికభాగవతుల
కితర మెఱుఁగక యెవ్వరేమేమి వేఁడి
రలయ కవి పెట్టి సంతుష్టిఁ సలుపు చుండె. 85

టీ. అవ్వైష్ణవోత్తముండు = వైష్ణవశ్రేష్ఠుఁ డగునా విష్ణుచిత్తుఁడు, జాగరూకతన్ = హెచ్చరికచేత, తైర్థికభాగవతులకున్ = తీర్థయాత్రాపరులగు భగవద్భక్తులకు, అలయక = ఆయాసము నొందక, ఎవ్వ రేమి వేఁడిరి=ఎవ్వ రేమేమి యడిగిరో, వారికి. కడమ సులభము.

తా. సుగమము.

శా. బాలార్కాంశువిజృంభితామల శరత్పద్మాక్ష పద్మాక్షమా
నీళాజాంబవతీశ యీశబలభిన్నీరేరుహోద్భూతది
క్పాలామూల్యశిరోమణిద్యుతికనత్పాదాబ్జ పాదాబ్జఫా
లాలంకారకచావలీమకరదీవ్యత్కుండలాంచన్ముఖా. 86

టీ. బాలా...క్ష - బాలార్క = లేఁతసూర్యునియొక్క, అంశు = కిరణముల చేత, విజృంభిత=వికసింపఁజేయఁబడిన, అమల = నిర్మలములైన, శరత్ = శరత్కాల మందలి, పద్మ = కమలములవంటి, అక్ష = నేత్రములు గల్గినట్టివాఁడా, (ఇది మొదలుగా శ్రీవేంకటేశ్వరునకు విశేషణములు), పద్మా...శ-పద్మా = లక్ష్మీదేవికి, క్షమా = భూదేవికి, నీళా=నీళాదేవికి, జాంబవతీ = జాంబవతీదేవికి, ఈశ = నాథుఁడా, ఈశ ...బ్జ-ఈశ = శివునియొక్కయు, బలభిత్=ఇంద్రునియొక్కయుఁ, నీరేరుహోద్భూత - నీరేరుహ=కమలమందు, ఉద్భూత=పుట్టిన బ్రహ్మయొక్కయు, అమూల్య = వెలఁబెట్టరాని, శిరోమణి = శిరోరత్నములచేత, కనత్=ప్రకాశించుచున్న, పాదాబ్జ = పాదపద్మములుగలవాఁడా, (శివుఁడు మొదలగు దేవతలచే నమస్కరింపఁ బడియెడువాఁడనుట), పాదా...ఖా - పాదాబ్జ=చవితినాఁటి చంద్రునివంటి, 'పాదాశ్మ్యబ్ధి తుర్యాంశాః' అని యమరుఁడు, ఫాల = లలాటమునకు, అలంకార = అలంకారమగు, కచావలీ = ముంగురులచేతను, మకర = మకరాకారములచేత, దీవ్యత్ = ప్రకాశించుచున్న, కుండల = కర్ణభూషణములచేతను, అంచత్ = ఒప్పుచున్న, ముఖా=నెమ్మొగము గలస్వామీ. తా. సుగమము.

క. జలచరకిటిహరివటుభృగు, కులరఘుకులసీరిబుద్ధఘోటిప్రముఖో
జ్జ్వలజనికృతజనరక్షా, యలమేల్మంగాభిధేందిరాలయవక్షా. 87

టీ. జల...క్షా - జలచర = మీనకూర్మములును, కిటి = వరాహమును, హరి= సింహమును, వటు = బ్రహ్మచారి యగువామనుండును, భృగుకుల = పరశురాముండును, రఘుకుల=శ్రీరాముఁడును, సీరి = బలరాముఁడును, బుద్ధ=బుద్ధుఁడును, ఘోటి = అవతారములచేత, కృత = చేయఁబడిన, జనరక్షా = ప్రజాసంరక్షణము గలవాఁడా, అలమే...క్షా - అలమేల్మంగా=అలమేలుమంగ యనెడు, అభిధా=పేరుగల, ఇందిరా= లక్ష్మీదేవికి, ఆలయ-నివాసమగు, వక్షా=వక్షస్స్థలముగలవాఁడా. తా. సుగమము.

భుజంగప్రయాతము—

బలద్విడ్ద్వినిర్దిష్టపాథోధరోరూ
పలాసారధారాతపత్రీకృతాద్రీ

ఫలన్మూర్ధచాణూరశభంగోగ్ర [1]బాహా
కళాకృత్తకంసా శిఖండావతంసా. 88

టీ. బల...ద్రీ - బలద్విట్ = దేవేంద్రునిచేత, వినిర్దిష్ట = నియోగింపఁబడిన, పాథోధర = మేఘములయొక్క, ఉరు = గొప్పలగు, ఉపల = పాషాణములయొక్క, ఆసారధారా = ధారావర్షమునకు, ఆతపత్రీకృత = గొడుగుగాఁ జేయఁబడిన, అద్రీ = గోవర్ధన గిరిగలవాఁడా, ఫలత్ = పగులుచున్న, మూర్ధ = శిరస్సుగల, చాణూర = చాణూరమల్లునియొక్క, భంగ = సంహారమందు, ఉగ్ర = వాఁడిమి గల, బాహా = బాహువులుగలవాఁడా, కళా = కళాసంజ్ఞగల యల్పతమకాలమందు, కృత్త = నఱుకఁబడిన, కంసా = కంసుండు గలవాఁడా, శిఖం...సా - శిఖండ = నెమిలిపింఛము, అవతంసా = శిరోభూషణముగాఁ గలవాఁడా, బాహార్గళా యను పాఠమున గడియమ్రానుల వంటి భుజములచేత నని అర్థము. 'తద్విష్కంభేఽర్గళం నసా' యని యమరుఁడు; ఆపక్షమునఁ గృత్తకంసా యనియే పైపదము. తా. సుగమము.

మ. ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజాహేవాకలబ్ధే భరా
డుదయోర్వీధర తత్పితృవ్యకృతనవ్యోపాయనోష్ణీష ర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యదనాశ్వాసము హృద్యపద్యములనాద్యంబై మహిం బొల్పగున్.

టీ. ఇది = ఈసందర్భము, కర్ణాట...దన్ - కర్ణాటధరా = కర్ణాటభూమి యొక్క, ధృతి = ధరించుటయందు, స్థిర = నిశ్చలమైన, భుజ = బాహులయొక్క, హేవాక = విలాసముగలయట్టియు, లబ్ధ = పొందఁబడిన, ఇభరాట్ = గజపతియగు రుద్రునియొక్క, ఉదయోర్వీధర = ఉదయగిరియందలి, తత్పితృవ్య - తత్ = ఆరుద్రుని యొక్క, పితృవ్య = పినతండ్రియగు ప్రహరేశ్వరునిచేత, కృత = చేయఁబడిన, నవ్య = నూతనమగు, ఉపాయన = కానుకయగు, ఉష్ణీష = కిరీటముయొక్క, రత్న = రత్నముల యందలి, దృక్ = దృష్టిచేతను, అంచత్ = ఒప్పుచున్న, పద = పాదములుగల, కృష్ణరాయవసుధాధ్యక్ష = భూమీశ్వరుఁడగు కృష్ణరాయలచేత, ఉదిత = చెప్పఁబడిన, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యనుగ్రంథమునందు, హృద్య = మనోజ్ఞములగు, పద్యములన్ = పద్యములచేత, ఆశ్వాసము, ఆద్యంబై = ప్రథమమై, మహిన్ = భూమి యందు, పొల్పగున్ = ఒప్పును.

---

1. బాహార్గళా.

తా. కృష్ణరాయలు గజపతి పినతండ్రి యగు ప్రహరేశ్వరుఁ డుదయగిరిదుర్గము మీఁద నుండఁగా నచ్చటి కేఁగి యతనితలఁ ద్రొక్కక స్నానము సేయ నని ప్రతిజ్ఞ చేసెఁ గావున, సేనలు లగ్గలు పట్టఁగా నా ప్రహరేశ్వరుఁడు భయపడి తనతలకు బదులుగాఁ గిరీటము రాయలకుఁ గానికఁ జేయుటవలన నది చూచి త్రొక్కె నని భావము.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనాసమాసాదితాఖండ సాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదావ్యాఖ్యానంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము

---

## ద్వి తీ యా శ్వా స ము

క. శ్రీనయన కువలయుగళా
నూనజ్యోత్స్నాయితస్మితోజ్జ్వలముఖ ! దై
త్యానీతసురశ్రీపున
రానయనక్రమణ ! వేంకటాచలరమణా ! 1

టీ. శ్రీ...ఖ - శ్రీ = లక్ష్మీదేవియొక్క, నయనకువల = కలువలవంటికన్నుల యొక్క, 'కువలంచాసితాంబుజే' అని వైజయంతి, యుగళ = రెంటికి, అనూన = అధికమైన, జ్యోత్స్నాయిత = వెన్నెలయైన, స్మిత = చిఱునవ్వుచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, ముఖ=వదనముగలయట్టివాఁడా! (అనఁగా స్వామియొక్క చిఱునగవు మహాలక్ష్మి కన్నులకు సంతత వికాసహేతువై యున్న దనుట), దైత్య = రాక్షసులచేత, ఆనీత = అపహరింపఁబడిన, సుర = దేవతలయొక్క, శ్రీ = సంపదయొక్క, పునరానయన=మరలఁ దెచ్చునట్టి (ఆనయనశబ్ద మిచట ధర్మిపరము), క్రమణ = పాదవిక్షేపముగలయట్టి వాఁడా!, వేంకటాచలరమణా = వేంకటేశ్వరుఁడా యని సంబోధనము.

తా. గ్రంథకర్త యాశ్వాసాది యగుటంజేసి, 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతా' నీత్యాదిప్రమాణవచనమును బట్టి యిష్టదేవతా స్మరణాత్మక మంగళాచరణ పూర్వకముగా శ్రీవేంకటాచలపతి నవధరింపు మని వచించుచున్నాఁ డనుట.

వ. అవధరింపు మాసమయంబునఁ బాండ్యమండలంబున. 2

సీ. ఏవీట (టి) సతులపాలిండ్లపై గంబూర
నవహారములచిప్పకవుఁచు మాన్పు
మలయజం బేవీటఁ గి దోలుచెక్క డులిచి మే
డలకిడ్డ మిగుల భూములకు డిగ్గుఁ

గలఁచు నేవీట (టి)సింహళగజంబులగాలి
చైత్రవేళ నుదగ్దిశాగజంబుఁ
దాల్తు రేవీటిప్రాక్తనభూపనిర్మాల్య
మరకతంబులు పెఱధరణిపతులు

తే. కపివరనియుక్తగిరిసదృగ్గహననిలయ
గాత్రగాహితకనకముక్తాకవాట
గోపురావేదితోచ్ఛ్రితాక్షోభ్యవప్ర
దనరు దక్షిణమధుర సాంద్రద్రుమధుర. 3

టీ. ఏవీటన్ = ఏపట్టణమందు, సతుల = స్త్రీలయొక్క, పాలిండ్లపై = స్తనములమీఁది, గంబూర = (అలఁదిన) కర్పూరము, నవ...చు - నవ = నూతనములైన, హారముల = ముక్తాహారములయొక్క, చిప్పకవుఁచు = శుక్తిదుర్గంధమును, మాన్చున్ = పోఁగొట్టుచున్నదో (అనఁగా ముత్యపుఁజిప్ప లుత్పత్తి యయ్యెడి తామ్రపర్ణినటకి సమీపమున నుండువారుగాన నప్పటికప్పుడు తెచ్చినకవుఁచు వదలని ముత్యాలహారములు ధరించుచున్నా రని భావము), ఏవీటన్, మలయజంబు = శ్రీగంధవృక్షములు, తొలుచెక్కడులిచి = మొదటిచెక్కఁదీసి, మేడలకిడన్ = మేడలకుఁబెట్టఁగా, మిగులు = మిగిలినవి, భూములకు డిగ్గున్ = ఇతరదేశములకు దిగుమతి యగునో (అనఁగా నాపట్టణమందలి మేడలన్నియు నుత్తమ శ్రీగంధములచేఁ గట్టఁబడియున్నవనుట), ఏవీటన్, సింహళగజంబులగాలి = సింహళద్వీపమునందుఁ బుట్టినయేనుఁగులయొక్క వాయువు, చైత్రవేళన్ = వసంతకాలములయందు, ఉద...బున్ = ఉత్తరపుదిక్కునందున్న యేనుఁగును, కలఁచున్ = చెదరఁజేయునో, (అనఁగా నాపట్టణమందలి గజంబులు సింహళద్వీపంబునఁ బుట్టినవౌటంజేసి సింహశరీరవాసనవంటి వాసన గలవి యనుట), ఏవీటి...లు - ఏవీటి, ప్రాక్తన = పూర్వికులగు, భూప = రాజులయొక్క, నిర్మాల్య = ధరించికడవేసిన, మరకతంబులు = పచ్చలను, పెఱధరణీపతులు = ఇతరరాజులు, తాల్తురు = ధరియించుచుందురో (అనఁగా నుత్తమరత్నంబులకాపట్టణ మునికిపట్టుగా నుండెననుట), కపి...వప్ర - కపివర = సుగ్రీవునిచే, నియుక్త = నియోగింపఁబడినట్టి, గిరి = పర్వతములతో, సదృక్ = సరిపోలునట్టి, గహననిలయ = కపులయొక్క, గాత్ర = శరీరములచేత, గాహిత = ప్రవేశింపఁబడిన, కనకముక్తాకవాట = స్వర్ణయుక్తమైన ముత్యాల తలుపులుగల, గోపుర = పురద్వారములచేత, ఆవేదిత = తెలియఁజేయఁబడిన, ఉచ్ఛ్రిత = పొడవుచేత, అక్షోభ్య = కొలుపుచ్చనశక్యంబైన, వప్ర = కోటగలట్టియు (అనఁగా సుగ్రీవుఁడు సీతాన్వేషణార్థ

ముగ హనుమదాదులను దక్షిణపుదిక్కునకు నంపుచుఁ దొలుతఁ దాను దెలిసినవాఁడు గనుక నాయాదిక్కులఁ గల తావులఁ దెల్పుచును, శ్లో. 'ముక్తాకవాటం పాణ్డ్యానాం తత్ర ద్రక్ష్యథ వానరాః' అని పల్కరించిన తెఱంగున నావానరులు కొండలంతలేసి తమ శరీరములతో నాపట్టణము వాకిళ్లలోఁ జొచ్చి రనుటవలన నావాకిళ్ల కత్యున్నతత్వమును గోటకు నక్షోభ్యత్వమును దెలిపినట్లాయెను). సాంద్ర = దట్టములైన, ద్రు = వృక్షముల చేతను, మధుర = మనోహరమైనట్టి, దక్షిణమధుర = మధురాపట్టణము, లసరుక్ = ఒప్పును. దక్షిణమధుర యనుటవలన నుత్తరమునఁగూడ నొకమధుర యున్న దని తెలియు నది.

క. శమనరిపుత్రిపురభిదో, ద్యమవద్దోర్వర్జ్యవలయిత స్వర్ణగిరి
భ్రమదంబై కాంచనవ, ప్రము దీప్రం బగుచు నప్పురంబున నొప్పున్.

టీ. శమన...బై - శమనరిపు = శివునియొక్క, త్రిపురభిదా = త్రిపురములను భేదించుట యనియెడు, ఉద్యమవత్ = ఉద్యోగముగల, దోః = భుజమువలన, వర్జ్య = విడువఁదగినట్టియు, వలయిత = వలయముగాఁ జేయఁబడిన, స్వర్ణగిరి = మేరుపర్వతమని యెడు, భ్రమదంబై = భ్రాంతినిచ్చునదియై, కాంచనవప్రము = బంగారుకోట, దీప్రం బగుచున్ = ప్రకాశమగుచు, అప్పురంబునన్ = ఆమధురాపట్టణమందు, ఒప్పున్ = తగియుండును.

తా. త్రిపురములు గెలిచి యీశ్వరుఁడు కడవేసిన మేరుగిరి ధను స్సనునటుల నామధురాపట్టణపుబంగారుకోట వలయాకార మై యుండె ననుట.

తే. సొరిదిఁ గనుపట్టి (ట్టు) హేమరశ్ములు సెలంగఁ
బొడవుకతమున సూక్ష్మమై పొల్చుఁ జూడఁ
బట్టణపు కోటకొమ్మల పంక్తి గగన
మండలశ్రీ (స్త్రీ) కి సంపంగి దండవోలె. 5

టీ. పట్టణము కోటకొమ్మలపంక్తి, సొరిదిన్ = బాగుగాను, హేమరశ్ములు=సువర్ణప్రభలు, కనుపట్టి = కానుపించి, చెలంగన్ = విజృంభింపఁగా, పొడవుకతమునన్ = కోటపొడవైనందున, సూక్ష్మమై = కొమ్మలచాలు కొంచెముగా నున్నదియై, చూడన్ = చూడఁగా, గగనమండలశ్రీకిన్ = ఆకాశలక్ష్మికి, సంపంగిదండవోలెన్ = సంపంగి దండవలెనే, పొల్చున్ = ప్రకాశించును.

తా. మధురాపట్టణపుఁ గోట మిగులఁ బొడవైనందున నతి సూక్ష్మముగఁ గను పడుచున్నదై సువర్ణకాంతులు విజృంభించువేళఁ జూడఁగా గోటకొమ్మలపంక్తి యాకాశ లక్ష్మి ధరించిన సంపంగిదండవలెఁ బ్రకాశించె ననుట.

మ. పరిఖం దత్పురకామినీజనము లంభఃకేళి సల్పంగఁ ద
ద్గురువక్షోరుహాలిప్తసంకుమదకస్తూరీమిళచ్చందనా
గురుపంకంబుల సౌరభంబులఁ జుమీ కుంభీనసావాసని
ర్జరకల్లోలిని కందు భోగవతి నాఁ జన్సంజ్ఞ గల్గెన్ దగన్. 6

టీ. పరిఖన్ = అగడ్తలో, తత్పురకామినీజనములు = ఆమధురాపురస్త్రీలు, అంభఃకేళి = జలక్రీడల, సల్పంగన్ = చేయఁగా, తద్గురు...లన్-చుమీ-తత్ = ఆస్త్రీలయొక్క, గురు = గొప్పవైన, వక్షోరుహ = స్తనములయందు, లిప్త = పూయఁబడిన, సంకుమద = జవ్వాజితోడను, కస్తూరీ = కస్తూరితోడను, మిళత్ = కూడుకొనియున్న, చందన = శ్రీగంధముయొక్కయు, అగురు = అగరుగంధముయొక్కయు, పంకంబుల = బురదలయొక్క, సౌరభంబులఁజుమీ = వాసనలచేతనే, కుంభీనసా...కిన్ - కుంభీనస = సర్పములకు, ఆవాస = ఉనికిపట్టగు నాగలోకమందున్న, నిర్జరకల్లోలినికిన్ = దేవగంగకు, అందున్ = ఆపాతాళలోకమందు, భోగవతినాన్ = భోగవతి యనఁగా, చన్ = ఒప్పునట్టి, సంజ్ఞ = అన్వర్థనామము, తగన్ = తగునటుల, కల్గెన్ = కలిగెను. శ్లో. 'నదీ నగర్యో ర్నాగానాం భోగవతీ' యని యమరుఁడు.

తా. ఆమధురాపురస్త్రీలు కుచకుంభములకు నలఁదిన పరిమళములు పాతాళమువఱకు వ్యాపించి యున్న యగడ్తనీళ్ల జలక్రీడ లాడుతఱియందు సిండింపఁబడినదిగాన నాగంధానుభవముగల నాగలోకమందలి గంగకు సకారణంబునంజేసి భోగవతి యను నామము గల్గె ననుట. ఇచట నిరుక్త్యలంకారము. 'శ్లో. నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్' అని లక్షణము.

తే. కాద్రవేయులు భూమియుఁ గ్రాకొనంగ
నురగలోకంబు వెడలి తత్పరిఖనీట
నెగసి తోడనె క్రుంకుదు ర్నిలువ లేక
తత్తటాబద్ధగారుత్మతముల కులికి. 7

టీ. కాద్రవేయులు = సర్పములు, భూమియున్ = ధరిత్రియును, క్రాకొనంగన్ = ఆక్రమించుటకు, ఉరగలోకంబు = పాతాళలోకంబు, వెడలి = తరలి, తత్పరిఖనీటన్-తత్ = ఆపురముయొక్క, పరిఖనీటన్ = అగడ్తనీటను, ఎగసి = లంఘించి, తత్తటా...లకు - తత్తట = ఆపరిఖదరులయందు, ఆబద్ధ = అంతటం జెక్కఁబడిన, గారుత్మతములకు = గరుడపచ్చలకు, ఉలికి = భయపడి, తోడనె = వెంటనే, నిలువలేక = ఉండఁజాలక, క్రుంకుదురు=మునుఁగుదురు (ఎగసి యనుచోట నీటిలో నుండి భూమిందు కెగయుచుంచె నని భారతప్రయోగమును పాలాదిగాఁ గలది).

తా. సర్పములు భూమినిఁగూడ నాక్రమించుటకై నాగలోకమును వదలి యాయగడ్తనీట నెగసివచ్చి యందుఁ గట్టఁబడియున్న గరుడపచ్చలకు వెఱచి నిలువం జాలక వెంటనే మునుంగు నదఁగాఁ బాతాళమువఱకు నాయగడ్త వ్యాపించియున్న దనియు, సర్పములు గరుడున కాహారము గానఁ దన్మణిదర్శనమాత్రజన్యభయముచే వెఱచిన వనియును, పరిఖములుగూడ రత్నఖచితమై యున్న వనియును దాత్పర్యము.

తే. తరుణశైవాలజలజపత్త్రములు వొదువ
మరకతచ్ఛాయఁ బొల్చుఁ దత్పరిఖజలము
కోట బంగరు సేయుటకొఱకు మున్ను
బ్రహ్మపిడిచిన మందాకుపసరనంగ. 8

టీ. తరుణ...ములు - తరుణశైవాల = లేతనాఁచుతీఁగలును, జలజపత్త్రములు = తామరాకులును, పొదువన్ = క్రమ్మికొనఁగా, మరకతచ్ఛాయన్ = పచ్చరాలవన్నెచేత, తత్పరిఖజలము = ఆయగడ్తనీళ్లు, మున్ను = అపురనిర్మాణకాలమునందు, కోటన్ = ప్రాకారమును, బంగరుసేయుటకొఱకు = కనకమయముగాఁజేయుటకై బ్రహ్మ = చతుర్ముఖుఁడు, పిడిచినమందాకుపసరనంగాన్ = పిండిన మందాకుపసరో యనునటుల, పొల్చున్ = ఒప్పును.

తా. అనఁగా మధురాపట్టణపుకోట బ్రహ్మనిర్మితంబై స్వర్ణమయముగా నున్న దని తాత్పర్యము.

చ. అడుగుననుండియు న్పదిలమై చదలంటెడుకోట నొప్పు ప్రో
ల్చెడనికడంక దంచనపుఁ జేతుల గంగను కానెఁ దూఱఁగా
నడుమన యున్కిఁ జేసి యలనాకపురిన్ [1]సరికై పెనంగి లా
వెడలఁగఁ బట్టిప్రేయుటకు నెత్తె ననన్ఁను [2]మల్లుపోరునన్. 9

టీ. అడుగుననుండియున్ = దిగువనుండియును, పదిలమై = దృఢమైనదై, చదలు = ఆకసమును, అంటెడు = తాఁకుచున్నట్టి, కోటన్ = ప్రాకారముచేత, ఒప్పు = ప్రకాశించుచున్న, ప్రోలు = పట్టణము, చెడనికడంకన్ = పోలిపోనిబలిమిచేతను, దంచనపుఁజేతులన్ = ఫిరంగు లనియెడి చేతులచేతను, గంగను = గంగ యనియెడు, కానెన్ = దట్టికోకను, తూఱఁగా = ప్రవేశింపఁగా, నడుమన = మధ్యముననే, ఉన్కిఁజేసి = ఉండుటచేతను, అలనాకపురిన్ = ఆస్వర్గమును, సరికై = దీటైయుండుటకై, పెనంగి = పెనఁగులాడి, లావు = బలిమి, ఎడలఁగన్ = పోవునట్లుగా, మల్లుపోరు

1. సరిపై పెనంగ. 2. మల్లుపోరిలోన్.

నన్ = మల్లయుద్ధమునందు, పట్టివ్రేయుటకున్ = చేతఁబట్టి క్రిందవైచుటకు, ఎత్తెన్ = ఎత్తెను, అనన్ = అనఁగా, చనున్ = ఒప్పును. (గంగను కాసె ననుచోట సంస్కృత శబ్దాంతమగు నచ్చునకు వైకృతాచ్చు పరము కాఁగా-శ్లో. 'యత్ర చిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవే' త్తను నథర్వణోక్తి ప్రమాణము.)

తా. ఆకాశగంగ స్వర్గమును వలయాకారమై చుట్టుకొని యుండుటఁగాన స్వర్గమను జెట్టికి గంగ కాసెవలె నుండె ననియు, శత్రుభంజనార్థముగ వప్రాగ్రమం దుంచిన దంచనము లనఁగా నినుప గొలుసులతోఁగూడిన పాషాణవిశేషములు చేతులవలె నిడుపుగానఁ బురమను జెట్టికి దంచనములు హస్తములవలె నుండె ననియు, నామధురాపురమను జెట్టి తనతో సాదృశ్యమునకు బెనఁగుచును నాయాకాశగంగ మధ్యప్రదేశమందే యుండుటవలన మల్లయుద్ధమునందుఁ గోటకొమ్మ లనియెడి హస్తములచేత గంగయను కాసెకొక దూఱునటులఁ బట్టి బలిమిచెదునట్లుగాఁ గ్రిందవైచుటకు నెత్తెనో యనునటుల నొప్పుచుండె ననఁగా నాకాశగంగవఱకు గోటకొమ్మ లున్న వనియు, నప్పట్టణము స్వర్గముకంటె విశేషవస్తుసమృద్ధంబై నిఖిలసుఖప్రదమై యుండె ననియు నభిప్రాయము.

తే. ఉదుటుగుబ్బలు గలతల్పుటురము సూచి
గందపట్టెలు సూచి బంగారు సూచి
వీటివాకిటిచోటనే విడువ కెపుడు
సుట్లు వెట్టుచు నుండురు సోమరవులు. 10

టీ. సోమరవులు = చంద్రసూర్యులు, ఉదుటుగుబ్బలు - ఉదుటు = నిక్కఁబొడిచియున్న, గుబ్బలు = గుబ్బలను పేరంబరగిన ములుకులనియెడు స్తనములు, కల=కలిగినట్టి, తల్పుటురము = కవాటమనియెడు నురస్స్థలము, చూచి=కనియుచు, గందపట్టెలు సూచి = కవాటతిర్యగ్దారువిశేషములనియెడు గంధపుగీఱలనుజూచి, బంగారుసూచి = కవాటఖచితస్వర్ణమనుస్వర్ణభూషణముఁజూచి, వీటివాకిటిచోటనే = ఊరివాకిటిదగ్గఱనే, విడువక=వదలక, ఎపుడు=ఎల్లప్పుడు, చుట్లుపెట్టుచు నుందురు = చుట్టుకొనియుందురు.

తా. సోమరవులను విటులు గొప్పలైనగుబ్బగోళ్లను స్తనములచేతను గందపట్టెలనియెడు మైపూఁతలచేతను కవాటమందలి బంగారపుఁదగుళ్లను స్వర్ణభూషణములచేతను నామధురాపట్టణ మొకస్త్రీవలె నుండఁగా వానిఁ జూచి దానివాకిళ్లు విడువక చుట్టిచుట్టి తిరుగుచుందు రని భావము. దీనియందు శ్లేష.

మ. స్థిరసౌధాగ్రవిహా[1]రయావతరతిశ్ఛిన్నాచ్ఛహారస్ఫుర
ద్గురుముక్తావలిఁ జేటిక ల్విరులతోఁ గూడంగఁ ద్రోయ న్నిజో

1. రిదంపతి.

దరలగ్నం బగుదాని నెమ్మొగు లధస్థస్సంబై తఱిఁ రాల్ప నా
కర మట్రం బని యండ్రుగా కుదధిఁ దక్క న్పుట్టునే ముత్తెముల్.

టీ. నెమ్మొగులు=మేఘము, అధస్థస్సంబై = క్రిందనున్నదై, స్థిర...లిన్ - స్థిర= నిశ్చలమైన, సౌధాగ్ర = మేడకొప్పురులయందు, విహార=సంచరించుచున్న, యావత = యువతిసమూహముయొక్క, రతి = సురతమునందు, ఛిన్న = తెగినట్టియు, అచ్ఛ = స్వచ్ఛమైనట్టియు, హార=పండలయందు, స్ఫురత్=ప్రకాశించునట్టి, గురు=స్థూలములగు, ముక్తా=ముత్తెములయొక్క, ఆవళిన్ = పంక్తిని, చేటికల్ = పరిచారికలు, విరులతోఁ గూడంగన్ = పుష్పములతోఁగూడ, త్రోయన్ = పాఱజల్లఁగా, నిజోదర...గు - నిజ= మొగులుయొక్క, ఉదర=గర్భమునందు, లగ్నంబగు=తగిలికొనినట్టి, దానిన్=ఆమౌక్తిక పంక్తిని, తఱిన్=వానఁగురియువేళ, వాల్పన్ = వర్షింపఁగా, అభ్రంబు = మేఘము, ఆకర మని = ముత్యములకు జన్మస్థాన మని, అండ్రుగాక = వచింపుదురేకాని, ఉదధిన్= సముద్రమున, తక్కన్=కాక, ముత్తెములు=మౌక్తికంబులు, పుట్టునే = జనియించునే, జనియింపవనుట.

తా. మేఘమండలాతీతంబులగు నప్పట్టణపుమేడలయందు యౌవనస్త్రీలు సురత క్రీడ సలుపుచుఁడి త్రెస్సి రాలినముత్తియములఁ బరిచారికలు కసవుఁ ద్రోయువేళఁ బుష్పములతోఁగూడఁ జిమ్మి త్రోయఁగా మేఘములయందుఁ బడుచుగాన వర్షాకాల మును భూమియందు సాముత్యము లుండుటంజేసి మేఘములనుగూడ మణ్యాకరంబు లని చెప్పుదురే కాని సముద్రభిన్నం బొకటియును మణిజన్మస్థానముగాదు. దీనియం దత్యుక్తి.

మ. ఘనసౌధాళి వియద్ధునీజలధి వీఁకన్ నావ లై నీడ దోఁ
ప నెలంతల్ వణిగాకృతి న్సరకు మార్పన్ గోలల న్గట్టి యి
చ్చునిజద్వీపవిచిత్రపట్టవసనస్తోమంబు నాఁ బొల్చుఁ బె
ల్లనిలాన్దోళ్యవి[1]మర్శితన్న గరనానాకేతుచ్ఛటల్. 12

టీ. ఘనసౌధాళి - ఘన=గొప్పలైన, సౌధాళి = మేడలసముదాయము, వియద్ధు నీజలధిన్ - వియద్ధునీ=ఆకాశగంగయనెడు, జలధిన్ = సముద్రమునందు, వీఁకన్ = స్పష్టముగాను, నావలై=ఓడలై, నీడ = మేడలనీడ, తోఁపన్ = కనుపింపఁగా, నెలం తల్ = ఆమేడలమీఁదనుండునవితలు, వణిగాకృతిన్ = వర్తకులవలె, సరకుమార్పన్ = భాండప్రతిభాండముఁజేయుటకై, కోలలన్ = గడలచేత, కట్టి=బంధించి, ఇచ్చు...బు

1. మర్ది.

- ఇచ్చు = ఇచ్చునట్టి, నిజ = తమయొక్క, ద్వీప=దీవియందలి, విచిత్ర=వన్నెవన్నెలైన, పట్టవసన=పట్టువస్త్రములయొక్క, స్తోమంబు = సమూహము, నాఁ=అనునటుల, అనిలా...టల్ - అనిల=వాయువుచేత, అన్యోన్య = ఒకటితోనొకటి, విమర్శి=ఒరయుచున్నట్టి, తన్నగర = ఆపురమునందలియు, నాక = స్వర్గమందలియు, అనేక = అసంఖ్యాకములైన, కేతు = టెక్కెములయొక్క, ఛటల్ = గుంపులు, పెల్లు = తఱుచుగా, పొల్చుఁ = ప్రకాశించును.

తా. ఆకాశగంగ యను సముద్రములో మేడలనీడ గనుపింపఁగా నోడలవలెనుండె ననియును, అప్పుడా మేడలమీఁద నుండు స్త్రీలు బేరగాండ్రుంబలె నుండి రనియు, గడలయందున్న టెక్కెములకుఁ గట్టిన వసనంబులు గాలిచేఁ గదలుటంజేసి యాస్త్రీలచేతఁ దమదీవియందలి పట్టుపటావళులు ద్వీపాంతరవాసులకు భాండప్రతిభాండరీతిచే విక్రయింపఁబడుచున్నవో యనునటులఁ బ్రకాశించె ననియుఁ దాత్పర్యము.

ఉ. సోరణగండ్ల రాఁ గొదమ చుక్కలు పట్ట సతులు కవాటముల్
చేరుప మౌక్తికంబు లని చిల్లులు వుత్తురు దమ్మ టంచుఁ బొ
ల్పారువితానహారముల యందొగిహారత ప్రేలి ప్రొద్దు పోఁ
గా రతి డస్సి గాడ్పులకుఁ గాఁ దెఱవ న్జను విచ్చి మేడలన్. 13

టీ. కొదమచుక్కలు = పిన్ననక్షత్రములు, సోరణగండ్లన్ = గవాక్షములవలన, రాన్ = రాఁగా, పట్టన్ = ఆనక్షత్రములఁ బట్టుటకొఱకు, సతులు = యువతులు, కవాటములు = తలుపులను, చేరుపన్ = మూయఁగాను, తమ్ము=ఆనక్షత్రములను, మౌక్తికంబులని=ముత్తెములని, చిల్లులువుత్తురు = రంధ్రములు వేయుదురు, అటందుచున్ = అట్లనుచు, పొల్పారు...దున్ - పొల్పారు = సుందరమైన, వితాన = మేలుకట్లయొక్క, హారముల యందున్ = సరములయందు, ఒగిన్ = క్రమముగా, హారతన్ = హారరూపమున, ప్రేలి = ప్రేలాడి, ప్రొద్దు = విశేషకాలము, పోఁగాన్ = గతింపఁగా, రతిన్ = క్రీడచేత, డస్సి = అలసి, గాడ్పులకుఁ గాన్ = వాయుసంచారముకొఱకు, తెఱవన్ = తలుపుఁదెఱవఁగా, మేడలన్ = సౌధములనుండి, విచ్చి = విడచి, చనున్ = వెడలిపోవును.

తా. అనఁగా మేడలు నక్షత్రమండలమును ముట్టిపోయిన వని భావము.

ఉ. ఆపుర (రి) సౌధవీథి నధరాధరభూముల గజ్జ మున్ను గా
నాపయికి న్వినంబడని యట్లుగఁ గ్రా(వ్రా)లుఘునాలిఁ దాల్చి లీ
లాపరతన్ ఘటింపుదురు లాస్యము సేయఁగ మేఘరంజనా
లాపముఁ జేసి పోషితక లాపిఁ గలాపికలాపకుంతలల్. 14

టీ. కలాపి...లు-కలాపి = నెమలియొక్క, కలాప = బర్హమువంటి, కుంతలల్ = కురులుగలస్త్రీలు, ఆపురసౌధవీథిఁ - ఆపుర = ఆపట్టణముయొక్క, సౌధ = మేడల యొక్క, వీథిఁ = పంక్తియందు, అధరా...లఁ - అధరాధర = క్రిందటిక్రిందటి, భూములఁ = ప్రదేశములయందు, గర్జమున్నుగాఁ = ఉఱుములు మొదలుగా, ఆపు యిరిఁ = ఆమేడలమీఁదికి, వినంబడనియట్లుగఁ = వినరానియటుల, వ్రాలుఘనా లిఁ - వ్రాలు = ఒప్పుచున్నట్టి, ఘన = మొగులుయొక్క, ఆలిఁ = సమూహమును, మేఘరంజనాలాపముఁజేసి = మేఘరంజన మనురాగము నాలాపముఁ జేసి, తార్చి = క్రిందనున్న మేఘములను మేడలపైకి రప్పించి, పోషితకలాపిఁ - పోషిత = పెంపఁబడి నట్టి, కలాపిఁ = నెమలిని, లీలాపరతఁ = విలాసాసక్తిచేతను, లాస్యముసేయఁగఁ = నృత్య మొనర్చునటుల, ఘటింపుదురు = సంఘటనచేయుదురు. అనఁగా నాపురమందలి యువతులు గాననృత్యాదులయందు నిపుణలగుటంజేసి యామేడలు మేఘమండలాతీతం బులై యున్నను దనుగుణరాగాలాపములచే మొగిళులఁ బైకిరప్పించుచున్నా రని యభి ప్రాయము.

చ. అనిమిషపట్టణంబు పురహర్మ్యపతాకలు మువ్వమ్రోఁతతోఁ
దనగృహపంక్తిపైఁ గలశతామరసంబులఁ గప్పఁ గ్రింద నుం
డును నిజలక్ష్మి చేసరిపణుల్ మొఱయంగఁ దదీయలక్ష్మి శం
కను మొగ మెత్తిచూచుతఱిఁ గన్నులు కేలికి మూయఁగా బలెన్.

టీ. నిజలక్ష్మి = మధురాపురలక్ష్మి, చేసరిపణుల్ = తనచేతనున్న సరిపణిగొలుసులు, మొఱయంగాఁ = మ్రోయఁగా, తదీయలక్ష్మి = అమరావతీపురలక్ష్మి, శంకను = ఈచప్పు డేమనుశంకచేతను, మొగమెత్తి = ముఖముపైకెత్తి, చూచుతఱిఁ = వీక్షించుసమ యమున, కన్నులు = నేత్రములను, కేళికిఁ = వినోదమునకు, మూయఁగాబలెఁ = మూయుచున్నట్లువలె, అనిమిషపట్టణంబు = అమరావతీపట్టణంబు, పురహర్మ్యపతాకలు- పుర = మధురయొక్క, హర్మ్య = మేడలయందలి, పతాకలు = టెక్కెములు, మువ్వ మ్రోఁతతోఁ = చిఱుగజ్జెలధ్వనితోఁగూడ, తనగృహపంక్తిపైఁ = అమరావతి గృహ పంక్తియందలి, కలశతామరసంబులఁ = తామరమొగ్గలవంటి కలశములను, కప్పఁ = మూయఁగా, క్రిందనుండును = మధురాపట్టణపుఁ డెక్కెములకు దిగువ నుండును.

తా. మధురాలక్ష్మి చేసరిపణిగొలుసులయొక్క మ్రోఁతను విని యిదేమనుశంకచే నమరావతీలక్ష్మి తన మొగమును పైకెత్తి చూచుసమయమున మధురాలక్ష్మి యాయమరా వతీపురలక్ష్మియొక్క కన్నులను వేడుకకై మూసెనో యనురీతి మధురాపురపు మేడల

యందలి పతాకలు గజ్జెలమ్రోఁతతోఁ గూడవచ్చి తనగృహపంక్తిపై నున్న తామర మొగ్గలవంటి కలశములఁ గప్పుచుండఁగా సమరావతీపురము మధురానగరముఁ డెక్కాములకుఁ క్రిందనుండు నని తాత్పర్యము.

చ. ఘనగతశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి, పునుం గినోష్మఁ ద
ట్టినది యలంది, కైశికముఁ రేవఁ బ్రభాతశశాంకు మోఁప వి
చ్చిననవహల్లకాలిఁ గయిసేసి సతుల్ పతితోఁ రమింతు, ర
మ్మునిజరఠాంగనల్ కలహముల్ కృపఁ నేడ్పువారుఁ దీర్ప మేడలన్.

టీ. మేడలన్ = అప్పట్టణపు మేడలయందు, సతులు = స్త్రీలు, అమ్మునిజరఠాంగనలు-అమ్ముని = ప్రసిద్ధులగుసప్తర్షులయొక్క, జరఠాంగనలు = వృద్ధభార్యలు, (వృద్ధలు గావుననే దంపతులకలహములం దీర్చుచున్నా రని చెప్పంబడియె.) కృపన్ = దయచేతను, కలహములు = సతీపతులప్రణయకలహంబులను, తీర్పన్ = పోఁగొట్టఁగా, ఘనగతశంపన్ - ఘన=మేఘములను, గత = పొందినట్టి, శంపన్ = మెఱుపనెడిదీపమందు, కంచము=పళ్లెమును, ఇడి=ఉంచి, కాటుకఁదీర్చి = ఆపళ్లెమునందుఁ గలిగినకాటుకను గన్నులఁబెట్టుకొని, ఇనోష్మఁదట్టినది - ఇనోష్మన్ = సూర్యునివేఁడిమిచేతను, తట్టినది = కరిగినట్టి, పునుంగు = తట్టుపునుఁగును, అలంది = పూసికొని, కైశికమున్ = కొప్పును, రేవన్=రీవిచేత, ప్రభాత=ప్రాతఃకాలమునందలి, శశాంకున్ = చంద్రుని, మోఁపన్ = మోఁపఁగా; తగిలింపఁగా, (ఇచట రాత్రియందుఁ బ్రణయకలహంబుననే ప్రొద్దుపుచ్చఁబడినది గావునఁ దెల్లవాఱవచ్చె నని సూచింపఁబడియె.) విచ్చిన=వికసించినట్టి, నవ...లిన్-నవ=క్రొత్తలగు, హల్లకాలిన్=చెంగల్వలను, కైసేసి = శృంగారించుకొని, పతితోన్ = పెనిమిటితోడను, జాత్యేకవచనము. రమింతురు = క్రీడింతురు - అనఁగా సప్తర్షి మండల పర్యంత మా మేడలు గట్టంబడియున్న వని భావము.

చ. రవి యనుదివ్వెఁ గేతువుచోఁటంగున మూసి[1]ధృతోర్ధ్వయంత్రవా
రవిరళఘర్మ నై కలరి వాల్పరవా క్తుల వాంతధూపరా
జివరనిశ న్గనన్మదన[2]చేతులచాతురి నెయ్యపుంగురుం
జువిదలు దార్చ విష్ణుపద మొత్తుఁ[3]బురిన్ గృహలక్ష్మి [4]నూత్నతన్.

టీ. పురిన్ = పట్టణమందు, గృహలక్ష్మి = గృహలక్ష్మియనెడిస్త్రీ, నూత్నతన్ = నవోఢాత్వముచేతను, కనన్ =చూడఁగా, మదనచేతులన్ = మదనచేతులనియెడి చేతుల యొక్క, (మదనచేతు లనఁగా గృహమున కమర్చిన యంగదారువు), చాతురిన్ =

1. ధృత. 2. చేతులఁ జాతురి. 3. పురీగృహలక్ష్మి. 4. నూత్నగాన్.

నైపుణ్యముచేతను, నెయ్యపుం...లు - నెయ్యపుఁక్ = ప్రేమగలిగినట్టి, కురుంజు విదలు=కురుఁజు లనియెడిచెలులు, తార్పక్ = పెనిమిటి యగువిష్ణునికడకు చేర్పఁగాను, రవి యనుదివ్వెక్ = సూర్యుఁ డనుదీపమును, కేతువుచెఱఁగునక్ మూసి = టెక్కెపుగుడ్డ యనెడు పైఁటచెఱఁగునఁగప్పి, ధృతోర్ధ్వ...యై - ధృత=ధరింపఁబడిన, ఊర్ధ్వ = ఉపరి ప్రదేశమందున్న, యంత్ర = జలయంత్రములయొక్క, వాః = ఉదకములనియెడి, అవిరళ = ఎడతెగని, ఘర్మ యై = చెమటగలదై, (సాత్త్వికోదయ మాయె ననుట) కలరవాల్పరవోక్తులక్ - కలరవ = పావురములయొక్క, అల్పరవ = కొంచెపుధ్వనులని యెడు, ఉక్తులక్ = పలుకులచేత, వాంత...నిశక్ - వాంత = గవాక్షములనుండి వెడలెడు, ధూప = అగరుశ్రీగంధాదిధూపములయొక్క, రాజి = సమూహ మనియెడు, వర = శ్రేష్ఠమైన, నిశక్ =రాత్రియందు, విష్ణుపదముఁక్ = ఆకాశ మనియెడు విష్ణుపాద మును, ఒత్తుఁక్ = సంవాహనము చేయును. కనన్మదన - కనత్ = ప్రకాశించుచున్న, మదన = కామము కలదై (ఉదయత్కామయై), చేతులక్ = హస్తములతో (అనిశ్లేష). ఒత్తుక్=పట్టుచున్నది. (ఆకాశమును ద్రోయుచున్న దని శ్లేష.)

తా. ఆపట్టణమందు ధ్వజపటములు సూర్యుని గప్పఁగా, మదనచేతులతో గురుఁజులు మిన్ను ముట్టఁగా జలయంత్రములు స్రవింప ధూపధూమములు మెఱయఁ బురలక్ష్మి యాకాశమును స్పృశించెను. మఱియు, పురలక్ష్మి విష్ణుపద మనియెడి పదద్వయ స్వారస్యముచేత నర్థాంతరముఁ దోఁచుచున్నది. నూతనస్త్రీకిఁ జెలుల ప్రేరణముచేతఁ బెనిమిటెనిఁ బొందుట, దీపము మఱుగుపఱుచుటయు, స్వల్పధ్వనితో సంభాషించుటయు, భోగగృహమందు ధూపవాసనలు నిండఁ బతిచరణములొత్తుటయు, స్వభావముగానఁ బురలక్ష్మి యనుస్త్రీ ధూపధూమము లనియెడి రాత్రియందు రత్యను కూల సంభారముగలదియై విష్ణుపదము నొత్తు ననుట. సమాసోక్త్యలంకారము. శ్లో. 'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతే ప్రస్తుతస్యచేత్' అని దానిలక్షణము.

చ. గిఱికొనుగోపురాగ్రపరిరక్షితకీలితపంకజరాగరశ్మిఁగ
 లైఱి యగుచాయఁ బొల్చు దివసేంద్రుఁడు సక్కనమింటఁ బోవుచో
 మఱచి విధాత పాటలిమ కై మధ్యమసంధ్యకుఁ జేయ లేనియా
 కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు కై కొల్పినకై వడిఁ బట్టణంబునన్. 18

టీ. పట్టణంబునక్ = మధురయందు, దివసేంద్రుఁడు = సూర్యుఁడు, చక్కన మింటఁబోవుచోక్ = చక్కఁగానాయూర నాకాశమధ్యమునఁ బోవునపుడు, విధాత= చతుర్ముఖుఁడు, పాటలిమ = రక్తిమను, మధ్యమసంధ్యకుక్ = మధ్యాహ్నమునకు,

చేయలేని = నిర్మింపఁజాలని, ఆకొఱఁతయుఁ౯ = ఆకొదువను, తీర్చుకో౯ = తీర్చుకొనుటకు, తొగరు = రక్తిమను, కొల్పిన = చేసిన, కైవడి౯ = రీతిగా, గిఱికొను = నిబిడమైన, గోపురాగ్ర = మేడలమీఁద, పరికీలిత = చెక్కఁబడిన, పంకజరాగ = పద్మరాగమణులయొక్క, రశ్మి౯ = కాంతులచేత, కట్టెఱయగు చాయ౯ = మిగుల నెఱ్ఱనైనకాంతిచేత, పొల్చు౯ = ఒప్పును.

తా. మధురాపురగోపురములకు సరిగా నంతరిక్షమునఁ బోవుసూర్యుఁడు సృష్టికాలమున బ్రహ్మ ప్రాతస్సాయంకాలములకే రక్తిమ గలుగఁజేసి మధ్యాహ్నమునకుఁ జేయనేఱకున్న కొఱఁత దీర్చికొనుటకు రక్తిమను గలుగఁజేసిన విధమునఁ బురద్వారములయందుఁ జెక్కఁబడిన పద్మరాగమణుల ప్రభలచే మిగుల నెఱ్ఱనైన చాయచేత నొప్పె నని తాత్పర్యము.

పుష్పలావికలు

సీ. వెలఁది యీనీదండ । వెల యెంత నాదండ
కును వెలఁ బెట్ట నెవ్వనితరంబు
కలువతావులు గాన । మలికదంబకవేణి
కలువతావులు వాడకయ కలుగునె
కడివోదు నాకిమ్ము । పడఁతి యీగేదంగి
ననకడివోమి ముంగొదలికిఁ జూడు
జాతు లేవంబు జేతఃజ పద్మినులు సైత
మును నున్నయెడ జాతు । లునికి యరుదె
తే. యనుచుఁ దొలి నుడి నభిలాష । లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మగర్భంబు గాఁగ
నుత్తరము పల్లవశ్రేణి । కొసఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక । లప్పురమున. 19

టీ. వెలఁది = ఓయింతీ, ఈనీదండ = ఈనీయొక్క పుష్పమాలికకు (బాహువునకు అనియు) వెల = క్రయము, ఎంత = ఏమాత్రము, అని విటుఁ డడుగ నావెలఁది చెప్పు నుత్తరము, నాదండకును = నామాలికకు (నాబాహువునకు - లేక నాసమీపమున నిలుచుటకు), వెలఁబెట్ట నెవ్వనితరంబు = మూల్యమింత యని నిర్ణయింప నెంతవానికైనను వశంబే, (వశము గా దనుట), అలికదంబకవేణి = భ్రమర సమూహామువంటి జడగలయోయింతీ, కలువతావులుగానము (తావు లనఁగా వాసనలకును స్థలములకును పేరగుటంజేసి)

కలువదండవాసనలు గాన మేమి యనియును ప్రశ్న, కలువతావులు = కలువవాసనలు, (కలువస్థాన సాదృశ్యముగల నాభులును), వాడకయె = వాడుఁజూపకయె, (పరిచయము లేకయే), కలుగునె = సిద్ధింప వనుట, పడంతి = ఓస్త్రీ, కడివోదు = వాడుఁబాఱదు, ఈగేదంగినన = ఈమొగలిఱేకు, దానివంటి రహస్యప్రదేశమును, నాకిమ్ము, కడివోమి ముందఱికిఁ జూడు = వాసన చెడకుండుట ముందు ధరించిచూడుము, తనతోఁ గలసి యెడబాసినప్పుడు కబళము నోటికిఁ బోకయుండునది ముందఱఁ జూచెద వనుట), అంబుజేక్షణ=ఓపద్మాక్షీ, జాతులేవి=జాజిపువ్వులేవి, (జాతి యే మని ప్రశ్న), పద్మినులు సైతము= తామరపువ్వులును, (పద్మినీజాతిస్త్రీలును), రతిరహస్యమందుఁ బద్మినీజాతిలక్షణము. శ్లో. 'కమలముకుళమృద్వీఫుల్లరాజీవగంధి స్సురతపయసి యస్యా శ్సౌరభం దివ్యమఙ్గే, చకితమృగదృగాభే భ్రాంతరక్తేచ నేత్రే స్తనయుగళమనర్ఘం శ్రీఫలశ్రీవిడంబి. వ్రజతి మృదులలీసం రాజహంసీవ తన్వీ త్రివళిలలితమధ్యా హంసవాణీసువేషా, మృదుశుచిలఘు భుఙ్క్తే మానినీగాఢలజ్జా ధవళకుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్.' అని. ఉన్నయెడన్ = ఉన్నచోటను, జాతులునికి = జాజిపూవులు (హస్తినీ శంఖినీచిత్రిణీజాతులు) ఉండుట, అరుదే = ఆశ్చర్యమా, (ఆశ్చర్యముకాదనుట), అనుచున్ = ఇట్లనివచించుచు, తొలినుడిన్ = మొదటిమాటచేతను, అభిలాషలు = పుష్పములమీఁది (పుష్పలావికలమీఁది యనియు)కోరికలు, ఎనయన్=స్ఫుటమగునటుల, మూఁగి = క్రమ్ముకొని, పలుకుతోడనే= విటులువచింపఁగానే, నర్మగర్భంబుగాఁగన్ - నర్మ = శృంగారచేష్ట, గర్భంబుగాఁగన్= అంతస్థమై యుండఁగా, ఉత్తరము = ప్రతివాక్యమును, పల్లవశ్రేణికిన్ = విటుల సమూహమునకు, ఒసఁగుచున్ = ఇచ్చుచును, పుష్పలావికలు = పువ్వులఁగోసి విక్రయించెడి స్త్రీలు, అలరులు = పుష్పములను, అప్పురమునన్ = ఆపట్టణమందు, అమ్ముదురు = విక్రయింతురు.

తా. ఆమధురయందు విలాసవంతులగు విటులు విహరించువేళ నీపద్యపాద చతుష్టయమున మొదటఁ జెప్పంబడియున్న తెఱఁగునఁ దమయభిలాషలు స్ఫుట మగునటులఁ బ్రశ్న లడుగుచుఁ జుట్టుకొని పలుకఁగా వెంటనే నర్మగర్భంబుగ నావిటులఁగూర్చి ప్రత్యుత్తరము లిచ్చుచు రసికశిఖామణు లగుపుష్పలావికలు పువ్వు లమ్ముదు రని భావము

చ. సరసులనర్మ మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ
గరఁగుటఁ దెల్పుదృక్తరళ కాంతులు నుత్తర మిచ్చునంతరాం
తరముల నవ్వులు న్గలువ తండము మొల్లలు నంచు మిన్న గ్రు
చ్చి రహిని రిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్.

టీ. సరసుల = రసికు లగువిటులయొక్క, నర్మము = శృంగారము, ఇంపులన్ = ఇష్టములను, ఒసంగన్ = కలుగఁజేయుచుండఁగా, కదంబపుదండఁగట్టుచోన్ = కదంబపు సరముఁగట్టెడు వేళ, కరఁగుటన్ = ఆవిటుల సరసంపుబలుకులకు దమమనములు గరఁగుటను, తెల్పు...లు - తెల్పు = తెలియఁజేయుచున్నట్టి, దృక్ = నేత్రములయొక్క, తరళ = చంచలములగు, కాంతులు = ప్రభలు, ఉత్త...లన్ - ఉత్తరము = ప్రత్యుత్తరమును, ఇచ్చు = ఒసఁగుచున్నట్టి, అంతరాంతరములన్ = నడుమనడుమను, నవ్వులున్ = నవ్వెడునవ్వులును, కలువతండము = ఉత్పలములు, మొల్లలు = మొల్లలును, అంచున్ = నిశ్చయించుకొని, మిన్నగ్రుచ్చి = బయలుగూర్చి, రహిని = విలాసముగన్, రిత్తనూలొసఁగి = పట్టినూలుచేతికిచ్చి, పుష్పలావికలు = పుష్పములమ్మువారలు, సిగ్గు వహింతురు = లజ్జపడుదురు. ఆ మధురాపురమందుఁ బుష్పముల విక్రయించు స్త్రీలు మిగులఁ జమత్కారిణు లై యున్నను రసికశిఖామణులగు విటులు సరసోక్తులచేత నట్టి చాతుర్య యుక్తస్త్రీలనుగూడ మోహింపఁజేయుదు రని ముఖ్యాభిప్రాయము.

సీ. పద్మాస్య పురి నను । *భవితకు నీవ యె
త్తులు వెట్టు దనఁగ । రా వలసె నిటకుఁ
దెలుపుమా జాముండు । నల రింపొ ఘటికాద్వ
యం బుండు నల రింపొ । కంబుకంఠి
యే వేఁడుటకు నీవు । ఋతు వేల చెప్పెద
వువిద మే మందాఁక । నోర్వఁ గలమె
చేరఁగా రా దె బాసికము । గే లోఁకిన
యంతనే చెడునె యోణాయతాక్షి
తే. యనుచుఁ బరిభాషవోలెఁ ద । మ్మాస దొరల
నాడ మోవిఁ జెఱంగిడి । యాఁగు నవ్వు
కంట నిగుడ విరు ల్మాన్పు । కరణిఁ జల్లు
సరసపుజలంబె జాణల । మరులుకొల్పు. 21

టీ. పద్మాస్య = ఓపద్మముఖి, పురిన్ = ఈమధురలో, అనుభవిత(వము)కున్ = అనుభవించువానికి, నీవ = నీవే, ఎత్తులు వెట్టుదు = పుష్పముల యెత్తులువెట్టుదువు (క్రీడకొఱకు నెదురు పెచ్చము పెట్టుదు వనియును) (ఎత్తులనఁగాఁ బ్రయత్నములని కొందఱందురు), అనఁగన్ = వచింపఁగా, ఇటకున్ = ఇచ్చటికి, రావలసెన్ = వచ్చుటకుఁ గారణం

* ననుభవమునకు,

బోయెను, కంబుకంఠీ=శంఖమువంటి మెడగలయోవనితా, జాముండు=యామమువఱకు వాసనచెడకుండు, అలరు = పుష్పము, (సంతోషమనియు) ఇంపో = బాగైనదో, ఘటికాద్వయంబుండు = రెండుగడియలు వాసనచెడకుండు, అలరు = పుష్పము, ఇంపో = బాగైనదో, (అదియానందమునకును నామమగుటవలన) యామపు సురతానందమిష్టమో లేక రెండుగడియల సురతానందమిష్టమో, తెలుపుమా=తేటపఱుపుమా, ఉవిద=ఓయింతీ, ఏవేడుటకున్ =నేను వలయుననికోరినపుష్పమిచ్చుటకు (నేను నిన్నుఁ గోరినందుల కనియు) ఋతువు=ఋతుకాలమురావలయునని, ఏల=ఎందుకు, నీవు=నీవు, చెప్పెదవు=నుడివెదవు, మేమందాఁకన్ = ఏమదివఱకు, ఓర్వఁగలమె = ఓర్వఁగలమా. (ఏమునీతోడిసంసర్గమును గోరిన ఋతుస్నానముఁజేసిన దివసమున నయ్యెడుమని చెప్పెదవు. మేమందాక నోర్వలేమనుట), ఏణాయతాక్షి-ఏణ = ఇఱ్ఱియొక్క, ఆయత = దీర్ఘములైన, అక్షి = కన్నులవంటి కన్నులుగల యోలలనా, చేరఁగారాదె=దగ్గఱఁ జేరఁగూడదా, బాసికమనఁగాఁ బుష్పమాలిక రచనావిశేషమునకును, ఊరుమూలమునకును నామముగావున, బాసికము = పుష్పమాలికయు, నీయూరుమూలమును, కేలుసోఁకినయంతనె = నాచేసోఁకిన మాత్రముననె, చెడునే=చెడి పోవునా, అనుచున్ =ఏలస్పృశింపనియ్య వనుచు, పరిభాషవోలెన్ = సంకేతపుమాటలాడినటుల, తమ్మున్ = తమ్ము, ఆసదొరలన్ = అభిలాషవెడలునటుల, ఆడన్ = పలుకఁగా, మోవిన్ = అధరోష్ఠమున, చెఱంగిడి = పైఁటకొంగు మూసికొని, ఆఁగునవ్వు - ఆఁగు=నిలిపిన, నవ్వు = హాసము, కంటన్ = నేత్రములయందు, నిగుడన్ = వెడలి రాఁగా, విరులు=పుష్పములను, నాన్చు=తడుపునట్టి, కరణిన్ =రీతిచేత, చల్లుసరసపు జలంబె - చల్లు = చల్లెడు, సరసపు జలంబె = రసయుక్తంబగు నుదకమే, జాణలన్ = విటులను, మరులుకొల్పన్ = మోహపడఁజేయును.

సీ. ఇంద మంతరి దంతకుందాభఁ గూడి ని
  శ్చలపుఁజూపులు మున్నె సంభ్రమింప
వెల యొప్ప కవలఁ బోవిఱుచుమోవియుఁ గోప
  మొదవెడుచూపు మోమోటఁ ద్రిప్పఁ
దిరిగిన సస్మితోక్తియుఁ జూపుటొయ్యార
  ములు నగుఁ గా దనుపలుకు లుడుప
నవి గాని కావో నీకనుపరాసాపత్న్య
  సంపాదనంబుల (బుబ్బ) నింపుఁ బెనుపఁ
తే. జతురవచనవిలాసాంగసౌష్ఠవములఁ
  బసిఁడిఁ దా నిచ్చినట్టియుసొంపునంతి మఱువఁ

బతికిఁ గైదువ లందిచ్చు ◦ రతివిధమున
విటుల కిత్తురు మఱి వారు ◦ విరులు పురిని. 22

టీ. ఇందము = ఇదిగో, అంతటన్ = అనువేళ, దంతకుందాభన్ = మొల్లల వంటిదంతములకాంతిని, కూడి = చేరికొని, నిశ్చలపుఁజూపులు - నిశ్చలపు = కదలకుండు నట్టి, చూపులు = చూడ్కులు, మున్ను = తొలుతనే, సంభ్రమింపన్ = తొట్రుపడఁగా, వెల = క్రయము, ఒప్పక = సమ్మతింపక, అవలఁబోన్ = అవల మఱియొకయంగడికిఁ బోఁగా, విఱుచు మోవియు = మడవఁబడినయధరోష్ఠమును, కోపమొదవెడుచూపు = కోపమును గనుపఱుచుచున్నదృష్టియును, మోమోటఁద్రిప్పన్ = మొగమోటమిచే నాతఁడు వెనుకకు వచ్చునట్లు చేయఁగా, తిరిగినన్ = ఆవిటుఁడు మరలరాఁగా, సస్మితోక్తియున్ = చిఱునవ్వుతోఁగూడినమాటయును, చూపుటొయ్యారములును = గర్వపుఁజూపులును, అగుఁగాదనుపలుకులు = ఔనుకాదన్నవాక్యములను, ఊడుపన్ = మాన్పఁగా, అవిగాని = ఆమాలికలేగాని, ఆస్త్రీలేగాని, కావో నీకు = నీకిష్టములుగావా, అను = అనునట్టి, పరాసాపత్న్యసంపాదనంబులు - పరా = ఇతరస్త్రీలకు, సాపత్న్య = తమలో సపత్నీభావమును, సంపాదనంబులు = సంపాదించుచున్న పలుకులు, ఇంపున్ = ఇష్టమును, పెనుపన్ = వృద్ధిఁజేయఁగా, (ఆబిడపువ్వేగాని నాపువ్వు పనికిరాదా యని భావార్థము.), చతురవచన...లన్ - చతురవచన = చాతుర్యపుమాటలచేతను, విలాస = చేష్టలచేతను, అంగసౌష్ఠవములన్ = సౌందర్యముచేతను, పసిఁడి = పైకము, తానిచ్చినట్టి యప్పణఁతిన్ = తానిచ్చిన యాస్త్రీని, మఱవన్ = మఱచిపోఁగా, పతికిన్ = పెనిమిటికి, కైదువలు = ఆయుధములు, అందిచ్చురతివిధమునన్ = చేతి కందిచ్చునట్టి రతీదేవివలె, పురిని = మధురయందు, వారు = పుష్పములమ్ము యువతులు, విరులు = పుష్పములను, ఇత్తురు = ఒసఁగుదురు. మన్మథునికి రతీదేవి యాయుధములఁ జేతికందిచ్చునటుల మధురాపట్టణమందలి పుష్పలావికలు విలాసచాతుర్య సౌందర్యములచే మోహింపఁజేయుచు విటులకుఁ బుష్పము లమ్ముదు రని యభిప్రాయము.

చ. దల మగుచంద్రఖండములు ◦ దారలు సాంకవ మొప్పపాణిపా
టల మగుదంతపుంగరవటంబు శశాంకుఁడు గుంకుమైనచీ
రలజిగి కెంపుగా బయటిరథ్యల నొప్పును గెందుకాంత వే
దులపయి సంధ్యయే బహుళతఁబొడఁచె నన స్ఫురి గట్టివా ల్సతుల్.

టీ. దళ...ఖండములు - దలమగు = సాంద్రమైన, చంద్రఖండములు = కర్పూరంపుఁదునకలు, తారలు = చుక్కలు, సాంకవము = పునుఁగుచేతను, ఇవటఁ

దృతీయార్థమందు ప్రథమ. ఒప్పు = ప్రకాశించుచున్న, పాణి = హస్తముచేతను, పాటల మగు = తెలుపు ఎఱుపువర్ణము గల. దంతపుం గరవటంబు = దంతపుబరణి శశాంకుఁడు = చంద్రుఁడు, కుంకుమైనచీరలజిగి = చెందిరమంటిన కోకలకాంతి, కెంపు గాన్ = ఎఱుపు గాఁగా, ఇందుకాంతవేదులపయిన్ = చంద్రకాంతపుఁ దిన్నెలమీఁదను, సంధ్యయే = సంధ్యాకాలమే, బహుతన్ = బహుత్వముచేతను, తోఁచె ననన్ = కానఁబడియె ననునటుల, పురిన్ = పట్టణమందలి, బయటిరథ్యలన్ = వెలుపటివీథుల యందు, గట్టివాల్‌సతులు = పరిమళద్రవ్యములమ్మెడు స్త్రీలు, ఒప్పుదురు = ప్రకాశించు చుందురు.

తా. ఆపట్టణమందుఁ బరిమళద్రవ్యము లమ్ముచున్న స్త్రీలు, బైటివీథులయందున్న చంద్రకాంతమణిమయమగు వేదికలపైఁ దమచేతనుండు పునుఁగుచే నిండింపఁబడి హస్తకాంతిచే నెఱ్ఱనైన దంతపుబరణి చంద్రుఁడుగాను, ఆకరాటమందున్న కర్పూరపుఁ దునుకలు చుక్కలుగాను, కుంకుమచేఁ దుడువఁబడిన చీరలకాంతి ఎఱ్ఱనగుచుండఁగా సంధ్యాకాలలక్షణ మొప్పుచుండెనుగాన ననేకరూపంబులఁ బొందిన సంధ్యయో యను నటులఁ బ్రకాశించుచు నుందు రని తాత్పర్యము. (గట్టివాల్సతులు అనుపదము భారత ప్రసిద్ధము).

సీ. ఉపరిస్థజనవారణోక్తికిఁ జెవిఁ బార్చి
  యన్యోన్యగంబై బయ ల్చిమ్మి చిమ్మి
గవని వెన్నాఱయ మిన్నవియ దట్టించుతో
  త్రధరు బందపుదాంట్లఁ దఱిమి దఱిమి
చలువచే ద్వారవేదు లెఱింగి నిల్చి త
  జ్జనజిఘృక్షుకుఁ గేలు సాఁచి సాఁచి
డిండిమంబుల కుబ్బి గండాల్పదాన మే
  లులుగఁ దద్వహు తాల యుబ్బి యుబ్బి
తే. వేణుకాహతులకు వీడు వెడలి వెడలి
పరపథగజధ్వనికిఁ బోర తిరిగి తిరిగి
[1]దృక్పుటలు వైరులకుఁ బంపుకృత్య లన వ
రానుగతిఁ జేరు వెలిఁ గరు లగ్గలికల.



1. దృక్పుటలవైరులకుఁ బంపుకృత్యలన వ.

టీ. కరులు = ఏనుఁగులు, ఉప...కిన్ - ఉపరిస్థ = పైనుండెడు, జన = మావటీలయొక్క, వారణోక్తికిన్ - వారణ = వారణార్థమైన, ఉక్తికిన్ = అదలింపునకు, చెవిఁ దార్చి = చెవియొగ్గి, అమ్మొగంబై = ఆదిక్కుముఖమై, బయలు = ఆకాశమును, చిమ్మి చిమ్మి, మిన్నువియన్ = ఆకాశము బ్రద్ద లయ్యెడునట్లు, దట్టించుతోత్త్రధరున్ - దట్టించు=ధ్వనిఁజేయుచున్న, తోత్త్రధరున్ = కోఁటెధరించినవానిని, గవనివెన్నొఱయన్ = ఊరివాకిలివీఁపుఁదాకఁగా, బందపుదాంట్లన్ = కుప్పిగంతులచేతను, తఱిమితఱిమి, చలు పచేన్ = చల్లగానుండుటచేత, ద్వారవేదులు = వాకిటనున్న తిన్నెలను, ఎఱిఁగి = తెలిసి కొని, నిల్చి, తజ్జనజిఘృక్షకున్ - తత్ = ఆవేదికలయందలి, జన = జనములయొక్క, జిఘృక్ష = పట్టవలయు నను నిచ్ఛచేత, కేలు = తొండము, సాఁచిసాఁచి, డిండిమంబులకున్ = ముందఱఁబోవువాఁడు వాయించెడు డిండిమవాద్యధ్వనులకు, ఉబ్బి = ఎక్కువై, గండాల్పదానము - గండ = గండస్థలమందలి, అల్ప = కొంచెమగు, దానము = మదోదకము, ఏఱులుగన్ = ఏఱులై పాఱఁగా, తద్వహున్ = ఆడిండిమవాద్యములఁ జేతఁబట్టియున్నవానిని, ఱాలన్ = శిలలచేతను, ఉవ్వి ఉవ్వి, వేణుకాహతులకున్ = పెద్దవెదురుకోలల పెట్లకు, వీడు = పురమును, వెడలి వెడలి, పరపథగజధ్వనికిన్ - పరపథ = ఇతరమార్గములయందలి, గజధ్వనికిన్ = ఏనుఁగులబృంహితములకు, పోక తిరిగి తిరిగి, దృక్పుటలు = దొప్పలవంటికన్నులు, వైరులకున్ = శత్త్రువులకు, పంపు = పంపుపట్టి, కృత్యలనన్ = శక్తులో యనునట్లు వెలిన్ = వెలుపటను, వశానుగతిన్ - వశా = ఆఁడేనుఁగులయొక్క, అనుగతిన్ = అనుసరించు మార్గమున, ని. 'కరిణీ ధేనుకా వశా' యని యమరుఁడు. అగ్గలికలన్ = ఉద్దండాలచేత, చేరున్ = పట్టణముఁ బ్రవేశించును.

తా. ఆపురమందలి మదపుటేనుఁగులు మావటీలయదలింపులు విని యామ్ముఖముగ బయలు చిమ్ముచు ఊరివాకిటియొద్ద నుండెడి యరుఁగులమీఁద నున్న జనులఁ బట్టుటకుఁ దొండములు సాఁచుచుఁ దమ్ముఁ గట్టిగ దండించుచు నీఁటెఁబట్టి క్రిందనున్నవానిఁ దఱుముచుఁ దమముందఱ డిండిమవాద్యధ్వనిఁజేయుచున్నవానిని మదోదకము హెచ్చుటంజేసి ఱాల నువ్వుచును బెద్దవెదురుపెట్లకుఁ బురంబు వెడలి వచ్చి యీవలావల వినంబడు గజబృంహితముల లక్ష్యపెట్టక శత్త్రురాజులమీఁదికిఁ బ్రయోగించినశక్తులో యనునటుల నుండెడు దొన్నెలవంటి కన్నులుగలవై ఆఁడేనుఁగులు పోవుమార్గముఁ బట్టి యతిప్రయాసచేత మరలఁ బట్టణముఁ జేరు నని తాత్పర్యము.

ఉ. పైననిశంబుఁ జల్లుకొను కపాంసువుపై ఖగతుండఖండితా
లానమహామహీరుహాఘ కలచ్యుతబీజము లుత్థిపత్యఁ...

భోనిబిడాప్లుతి న్మొలువఁ ౹ బొల్చు నగశక్యతఁ దూలుచు న్పురో
ద్యానముల న్మదేభములు ౹ ప్రాణముతో డినగంబులో యనన్.   25

టీ. పైక్ =దేహముమీఁదను, అనిశంబు = నిత్యమును, చల్లుకొను పాంసువృష్టిక్ - చల్లుకొను = చల్లుకొనునట్టి, పాంసువృష్టిక్ = దుమ్మమీఁదను, ఖగ...లు - ఖగ = పక్షులయొక్క, తుండ = చంచూపుటములచేతను, ఖండిత = పగుల్పఁబడిన, ఆలాన = కట్టుకంబములైన, మహత్ = పొడవులైన, మహీరుహ = వృక్షములయొక్క, ఫల = పండ్లనుండి, చ్యుత=జాఱిన, బీజములు = విత్తనములు, ఉత్క్షిపత్ = పైఁజిమ్ముకొనియెడి, కర = తొండములయందలి, అంభః = జలములయొక్క, నిబిడ = దట్టమగు, ఆప్లుతిక్ = తడుపుటచేత, మొలువక్ = చెట్లు పుట్టఁగా, అగశక్యతక్ = పట్టనశక్యంబగునటుల, తూలుచుక్ = ఊఁగుచును, మదేభములు = మదపుటేనుఁగులు, పురోద్యానములక్ - పుర = పట్టణమందలి, ఉద్యానములక్ = శృంగారవనములయందు, ప్రాణముతోడి నగంబులో యనక్ = ప్రాణముఁగలపర్వతములో యనునటుల, పొల్చుక్ = ఒప్పును.

తా. ఏనుఁగులకు దుమ్ము పైఁజల్లుకొనుట సైజముగాన నట్లు నిండింపఁబడియున్న మంటిపై గజములఁగట్టువృక్షముల మీఁద నున్న పక్షులు ఫలములఁ బగిల్చి రాల్పఁగాఁ బడిన బీజములు తొండముచేఁ బైఁజల్లుకొను నుదకమువలన మిగుల నాన్పఁబడి యంకు రింపఁగాఁ బట్టనశక్యంబులై యూఁగుచుఁ బురోద్యానములయందుఁ జైతన్యయుక్తంబు లగు పర్వతములో యనునటుల సంచరించుచుండు నని తాత్పర్యము.

శా. శాలిహోత్రివిధూతపత్త్రముల మా ౹ మాతో సపత్త్ర ల్గదా
*కానిం డంచును గేక రాక్షిరుచి మొ ౹ క్కల్ప్రక్కల న్శార్ఙ్గతూ
ణానల్పాహితకల్పకాండతతులం ౹ దారం బురిం బొల్చు నా
జానేయంబులు ఫేనహాస మిడి కై ౹ జామోర లల్లార్చుచున్.   26

టీ. శాలి ..లము - శాలి = శాలిహోత్రమునియొక్క, క్రోధ = కోపము చేతను, విధూత = పోఁగొట్టఁబడిన, పత్త్రములమా = ఱెక్కలుగలవారమైనట్టియనఁగా (ఱెక్కలు లేనివార మనుట. ని. 'గరుత్పక్షచ్ఛదాఃపత్త్ర'మని యమరుఁడు), మాతోక్ =ఇట్టిమాతోడను, సపత్త్రల్గదా = మీరు ఱెక్కలు గలవారుగదా, కానిండంచును = తలయూఁచినట్లు, కే...లు- కేకరాక్షి = కడకన్నులయొక్క, రుచి = కాంతులయొక్క, మొక్కల్ = అంకురములు, ప్రక్కలక్ = పార్శ్వములయందు శార్ఙ్గ = విండ్లతోఁ

* కానీ రండని.

గూడిన, తూణ = పొదులయందు, అనల్ప = విస్తారమైన, అహిప = సర్పరాజములతో, కల్ప = తుల్యమగు, కాండ = బాణములయొక్క, తతులక్ = సమూహములయందు, తారక్ = ప్రసరింపఁగా, ఫేనహాస మిడి - నురుఁగనునవ్వుగలదై, కైజామోర లల్లార్చుచుక్ = కైజా చేసినముఖములనూఁచికొనుచు, (కైజా అనఁగా గళ్లెము పైకెత్తి బిగియఁగట్టుట), ఆజానేయంబులు = జాతిగుఱ్ఱములు, ('ఆజానేయాః దలీనాస్స్యుః' అని యమరుఁడు), పురిక్ = మధురాపట్టణమందు, పొల్చుక్ = ఒప్పును.

తా. ఆపట్టణమందలి వేగశీలంబులగు జాతిగుఱ్ఱములు కళ్లెములచే బిగింపఁబడిన ముఖము లల్లార్చుచుఁ బ్రక్కలఁ జూచుచుండ మాకు మునిశాపంబున ఱెక్కలుపోయి నవి మీకు ఱెక్క లున్నవి. ఉండిన నుండనిండు త్రొక్కికొనితరలుదము రండని ప్రక్కలఁ గట్టియున్న పొదులలోనుండెడి సర్పతుల్యంబులగు బాణములఁ బిలుచుచున్నవో యను నటుల నొప్పుచుండు నని తాత్పర్యము.

చ. చలమున సింగిణీతఱక సంబులు గట్టక మాన, రంపపె
న్నెలగతి మాగతి న్వెనుకఁ జిక్కక మానదు, తప్పి దారి వె
న్నొలసినఁ దారు వెన్నెఱుఁగ కుండుట నొచ్చెము సాదికోటి కం
చలమినచింతఁ ద్రవ్వికొను నంఘ్రి తుద న్పురిలోనివాహముల్. 27

టీ. పురిలోనివాహముల్ = ఆపట్టణమందలి యుత్తమాశ్వములు, చలమునక్ = ఈసుచేత, సింగిణీతఱకసంబులు = శార్ఙ్గతూణీరకంబులను, కట్టకమానరు = బంధింపక విడువరు, అంపపెన్నెలగతిక్ - అంప = బాణములయొక్క, పెను = పెద్దదైన, నెల = అలుగుయొక్క, గతి = గమనము, మాగతిక్ = మావేగమునందు, వెనుకఁజిక్కక మానదు = వెనుకఁజిక్కకయుండదు (ఆబాణంబు లెదిగి రాలేవనుట), తప్పుదారి = ఒక వేళను, వెన్నొలసినక్ = వీఁపుదాఁకినను, తారు వెన్నెఱుఁగకయుండుటక్ = తాము వెన్నెఱుఁగకయుండుటచేత, మా ఱువీపనియొకపాతము. సాదికోటికిక్ = రౌతులను, వి. 'అశ్వారోహాస్తు సాదిన' యని నిఘంటువు. ఒచ్చెము = తక్కువ, అంచుక్ = అను చును, అలమినచింతక్ = కప్పుకొన్నచింతచేతను, అంఘ్రితుదక్ = కాలిగొరిసెచేత, త్రవ్వికొనుక్ = భూమినిఁ ద్రవ్వుచుండును.

తా. గుఱ్ఱములకుఁ గాలిగొరిసెలచేత నేలఁ ద్రవ్వుట స్వభావముగావున నాపట్టణమందలి యశ్వము లాక్రియ లొనర్చుచుండ రోషంబులు గలరౌతులు శార్ఙ్గతూణీరంబులఁగట్టి శత్రువుల్లపై శరములఁ బ్రయోగింప నాశరములగమనము దమవేగమునకు వెనుకఁ జిక్కును గాన వీపెఱుఁగని సాదులకు వెన్నునఁ దగులుననియెడి యొచ్చెము వచ్చె

గదా యనుచింతతో నేలఁ ద్రవ్వుచున్న వనునటుల నుండు నని తాత్పర్యము. లోకమునం దొకానొకచింత గలిగినయెడ మనుజులలో నేలఁ ద్రవ్వుట ప్రసిద్ధము.

ఉ. అంజ సమానవాయుగణ మంతయుఁ ఖంజతఁ జిక్క, నజ్జవో
ష్మం [1]జనియించుచిక్కని సమానపువాయువులో నొకండు గ
ల్మిం జనియించు దుర్యశమ మేల్కని లేహనవేళ వాజు లూ
ర్పం జెడుమాణిబంధ ముకు రంబులఁగాళిమ పేరఁ గార్కొనున్. 28

టీ. అంజన్ = ఒక యంగలోపలనే, సమాన = సరియైన, వాయుగణమంత యున్ = వాయుసమూహంబెల్లను, ఖంజతన్ = వేగములేమిచేత, చిక్కన్ = పట్టుపడఁగా, అజ్జవోష్మన్ = ఆవేగపువేఁడిమివలన, జని...లోన్ - జనియించు = పుట్టుచున్నట్టి, చిక్కని = స్వాధీనముగానియట్టియు, సమానపు = సమానంబనియెడి, వాయువు = గాడ్పు, (తమకు సాటి యైనగాలి) లోన్ = దేహములోపల, ఒకండు = ఒక్కఁడు, కల్మిన్ = ఉండుటవలన, జనియించు = సరియైనదియొకటియుండెననిపుట్టిన, దుర్యశము = అపకీర్తి, మేల్కని = తెలిసి, లేహనవేళన్ = గుఱ్ఱములు కవణముదినుసమయమున, వాజులు = గుఱ్ఱములు, 'వాజివాహార్వ గంధర్వహయసైంధవసప్తయ' యనియమరుఁడు. ఊర్పన్ = ఆఘ్రాణింపఁగా, చెడు = చెడిపోవుచున్నట్టి, మాణిబంధముకురంబులన్ = అద్దములవంటి సైంధవలవణపుఁబెళ్లలయందు, కాళిమ = నైల్యమనియెడి, పేరన్ = వ్యాజముచేత, కార్కొనున్ = నల్లనగును.

తా. అచట నుండు నశ్వముల లేహనవేళలయం దుంపఁబడిన సైంధవ లవణపుఁ జెక్కల నాగుఱ్ఱము లాఘ్రాణింపఁగా దానియం దేర్పడిన నైల్యము సమానవాయువుల నెల్లగెలిచి సమాన మను పేరు గలిగి తమనాభిస్థానమం దున్నవాయువును గెలువమైతి మను నపకీర్తి జనియించెనో యనునటుల నుండె ననఁగా వాయువేగముల నతిక్రమించెడి వేగముగల యశ్వము లని తాత్పర్యము.

మ. ఇలఁ బాదద్వయి దాయ నల్కొనఁగు నెం దేఁ బాఱుచో నంకవ
న్నెలు రెండై [2]లఘిమం దకీర్తి యిడు మున్నే యెక్కుచో నిందుచెం
దుల కే మా దు మటంచు సాదు లల[3]యన్ రూపోచ్ఛము ల్వాజు లం
దలరున్ బాహ్లికపారసీకశక[4]ఘా రారట్టఘోట్టాణముల్. 29

టీ. ఎందేన్ = ఎక్కడనైనను, పాఱుచోన్ = పరుగిడునపుడు, పాదద్వయి = తమమీఁద నారోహణముఁజేసి యున్నవారియొక్క, రెండుపాదములును, ఇలన్ = భూమి

1. జని యుబ్బి. 2. లఘువం. 3. యన్ ద్రూర్ణో; యన్ వేగో. 4. ఘట్టా.

యందు, జాయన్ = ఒఱయఁగా, అళ్కు = భయమును, ఒసఁగున్ = ఆ యారోహకులకు నిచ్చును, మున్నే = తొలుతనే, ఎక్కుచోన్ = ఎక్కునపుడు, అంకవన్నెలు రెండై = రెండంకవన్నెలచేతఁగాని యెక్కుట కసాధ్యంబై, లఘిమందు = లఘుత్వమందు, అకీర్తి యిడున్ = అపకీర్తి నిచ్చును, ఇందున్ = ఈరెంటియందు, ఎందుల కేమాదుము = దేనికి నెటులఁ జేయుదుము, అటంచున్ = అట్లని, సాదులు = గుఱ్ఱపు రౌతులు, అలయన్ = వేసటపడఁగా, రూపోచ్చముల్ = రూపములచేఁ గొప్పనువహించియున్నట్టి, బాహ్లిక పారసీక శకధారా ఆరట్ట ఘోటాణములు = ఈదేశములయందు జనించిన వాజులు = జాత్యశ్వములు, అందున్ = ఆపట్టణమందు, ఉలరున్ = ఒప్పును.

తా. పట్టణమందున్న యశ్వములు బాహ్లికాదిదేశ సంభవము లగుటం జేసి మిగులఁ బొడవైనవిగాన రెండంకవన్నెలతోఁగాని యెక్కఁగూడకపోవుటయు, పరుగిడెడి సమయమున సాఁగి నేలకు వంగునపుడు కుఱుచలౌటవలన రౌతులపాదము నేల దాఁచుకొనుచుండఁగా నీయపకీర్తుల కేమి సేయువార మని గుఱ్ఱపురౌతులు నిత్యము చింతాపరులై యుండ నశ్వములచే నాపట్టణము ప్రకాశించు నని తాత్పర్యము. వేగవంతంబులగు నుత్తమాశ్వంబులు పరుగిడునపుడెల్లను నేలకు వంగుటయు, మరల హెచ్చుటయు గొప్పగుఱ్ఱములకు రెండేసి యంకవన్నెలు వేయుటయును లోకప్రసిద్ధము.

పణ్యయువతులు

సీ. ముడివిప్ప నడుగుఁ [1]దమ్ములనె వ్రాలుటఁ దేంట్ల
నెఱికురు లగుటసం।దియము గలదె
కన నెంతవాని లోఁ।గొనుట నాదర్శంబు
నెమ్మొగం బగుట సం।దియము గలదె
ఇఱిగొను మింటిపై ।మెఱయుటఁ [2]జక్రద్వి
తయి చన్ను లగుట సం।దియము గలదె
పొలసు దోర్లఁగఁ జూచు ।కలికిచూపులమీలు
దెలిగన్ను లగుట సం।దియము గలదె
తే. పొలసిననె తావి బుగులుకొ।నలరుఁదీఁగ
తిన్నని శరీర మగుట సం।దియము గలదె
యనఁగఁ జెలువొంది సురత వై।యాత్యనిధులు
పణ్యయువతులు పొలుతు రప్పట్టణమున. 30

1. దమ్ములపై నెవ్రాలుటచె నెట్టులు దేంట్లగుట. 2. చక్రకద్వయి.

టీ. ముడివిప్పఁగ = కొప్పువిప్పఁగా, అడుగుఁదమ్ములనె = పాదములనుకమలములపైననే, వ్రాలుటఁ = పడుటచేత, తేంట్లు = తుమ్మెదలు, నెఱికురులు = (ఈయంగనల) యందమైన వెండ్రుకలు, అగుటఁ = అగుటయందు, సందియము గలదె = సందేహము గలదా (నిస్సందేహ మనుట, తెలుపుగాఁ గమలముల మీఁద వ్రాలునవి తుమ్మెదలుగాన నిట్లు వర్ణింపఁబడియె), కనఁ = చూడఁగానే, ఎంత వానిఁ = ఎట్టిగొప్పమనుష్యునిని, లోఁగొనుటఁ = వశపఱుచుకొనుటచేత, తనలో నిమిడిచికొనుటవలన, నెమ్మొగంబు = ముఖము, ఆదర్శంబు = అద్దము, అగుటఁ = అగుటయందు, సందియము కలదె, ఎంతటిధీరుఁడైనను పురుషుం డా స్త్రీలముఖసౌందర్యముఁ జూచిన వారికివశ్యుఁ డగు ననుట), ఇఱుకౌను = సూక్ష్మమైన నడుమనియెడి, మింటిపైఁ = ఆకాశముపై, మెఱయుటఁ = ప్రకాశించుటచేత, చన్నులు = స్తనములు, చక్రద్వితయి = జక్కవదోయి, కౌటఁ = కౌటయందు, సందియముగలదె, (మధ్యప్రదేశమాకాశమువలె శూన్యముగనుండుటవలన నందుపైనుండునది చక్రద్వితయి యని యూహింపఁబడియె), పొలసుదొర్లఁగ = మత్స్యగంధముకౌటిల్యమును పొర్లునటుల, (పొలసన మత్స్యగంధమునకు, కౌటిల్యమునకును పేరు), చూచుకలికిచూపులఁ = చూచునటువంటిసొగసైన దృష్టులచేతను - సొగసుగాఁ గనఁబడుటచేతను, మీలు = మీనములు, కన్నులౌటఁ = నేత్రములౌటయందు, సందియముగలదె, (తమయందుఁ బొలసుండుటవలన మీనములు గన్నులౌటకు సందేహము లేదనుట). పొలసిననే = సుడిసినప్పుడే, తావి = సుగంధము, బుగులుకొనఁ = గమ్మనఁగా, తిన్ననిశరీరము, అలరుఁదీఁగ = పూఁదీఁగ అగుటయందు సందియము గలదె, (పరిమళించునది పూఁదీఁగగాన సుగంధ ముండుటవలన నదియని యుత్ప్రేక్షింపఁబడియె), అనఁగ = అనునట్లు, చెలువొంది = ఒప్పి, సురత = రతియందు, వైయాత్య = ప్రౌఢత్వమునకు, నిధులు = స్థానములగు, పణ్యయువతులు = వెలజవరాండ్రు, అప్పట్టణమునఁ = ఆమధురయందు, పొలుతురు = ఒప్పుచుందురు.

తా. సుగమము.

మ. ప్రతతప్రాంతపిశంగకుంకుమజటాపాళీకురంగీమదా
సితవీణాళికలస్వనంబు లెసఁగం జెన్నారుకర్పూరపుం
జతతు ల్కాంటికి నారదత్వమున మించ న్గామినీకామిసం
తతి కేలా రెయెడ త్రెచ్చుఁ గంతుకలహోన్మాదంబు లాప్రోలునన్. 31

టీ. ప్రతత...లు-ప్రతత = విస్తారమైనట్టియు, ప్రాంత = సమీపమున (కాంతి ప్రసరించుటచేత ననుట), పిశంగ = పచ్చనైన, కుంకుమజటాపాళీ = కుంకుమపూవు

రాసులను జడల సమూహములును, కురంగీమదాసితవీణా = కస్తూరియనునల్లనైన వీణె యందలి అళికల స్వనంబులు = తుమ్మెదలఝుంకారములవలె నవ్యక్తమధురములైనవీణా వాదములు, ఎసఁగన్ = ఒప్పుచుండఁగా, చెన్నారు = మనోహరములయిన, కర్పూర పుంజతతులు = కప్పురపురాసులు, కంటికిన్ = కన్నులకు, నారదత్వమునన్ = నారద భావముచేతను, మించన్ = అతిశయింపఁగా, కామినీ కామిసంతతికిన్ = కాముకులగు స్త్రీపురుషులసమూహమునకు, కంతుకలహోన్మాదంబుల్ = మన్మథయుద్ధ మనియెడి యున్మాదములు (సురతము లనుట), అప్రోలునన్ = అపురమున, ఏలా = ఏమిటికి, ఎడత్రెచ్చున్ = ఎడఁబడును.

తా. ఆమధురయందుఁ దమసమీపమునఁ గర్పూరకాంతులు ప్రసరించుట వలనఁ గొంచెము పచ్చనై జడల కాంతివలెనున్న కుంకుమరాసులును, వీణెవలె నల్లనై యున్న కస్తూరియు, అవ్యక్తమధురమైనతుమ్మెదల ఝుంకారములును గూడియుండఁ బ్రకాశించుచున్నట్టి కప్పురపురాసులు నారదభావముచేతఁ గంటి కగపడఁగా నార దుఁడు కలహప్రియుఁడుగానఁ దద్ధర్మముగల కర్పూరపురాసు లడఁగ నాకాముకులగు స్త్రీపురుషులకు మన్మథయుద్ధమేల మాను ననఁగాఁ దాదృశకర్పూరపురాసులఁజూడఁగాఁ గామోద్రేకమున మోహితులై నిత్యము సురతక్రీడలయం దాసక్తులై యుందు రని తాత్పర్యము.

తే. నింగి యిటు త్రిశంకుకతన మాతంగవాటి
యయ్యె నిఁక నుండఁదగని కీ యవని [1]కెఱఁగి
నట్టినక్షత్రతారాగ్రహాళి యనఁగఁ
గాంతనవరత్నరాసు లంగళ్లఁ బొలుచు. 32

టీ. ఇటు = ఈప్రకారము, నింగి = ఆకసము, త్రిశంకుకతనన్ = త్రిశంకుఁడు ప్రవేశించుటచేతను, మాతంగవాటియయ్యెన్ = వెలివాడయాయెను. ని. 'మాతఙ్గో గజనీచయోః' అని వైజయంతి. ఇఁకనుండఁదగదని = ఇఁకమీఁద నుండఁగూడ దనుచు, అవనికిన్ = భూమికి. ఎఱఁగినట్టి = వ్రాలినట్టి, నక్షత్ర = నక్షత్రములు, తారా = అశ్వి న్యాదీతరతారలు, గ్రహ = సూర్యాదిగ్రహములు, వీనియొక్క, అళియనన్ = సమూహ మనునటుల, కాంత = రమ్యములైన, నవరత్నరాసులు, అంగళ్లన్ = పణ్యగృహముల యందు, పొలుచున్ = ఒప్పును.

తా. ఆమధురాపట్టణమందలి యంగళ్లయందున్ననవరత్నరాసులు ఆకాశము త్రిశంకుచే నాక్రమింపఁ బడినదిగానఁ జండాలవాటి యయ్యె. ఇంక నుండఁ

1. కరిఁగి.

గూడ దని యభిప్రాయముగలవై భూమికి వచ్చియున్న సూర్యాదిగ్రహాశ్విన్యాది నక్షత్రములును విజ్ఞాతనామములగు జ్యోతులునో యనునటుల వెలుంగుచుండు నని తాత్పర్యము. నక్షత్రతారలను భేదము రఘువంశమందు, 'శ్లో. నక్షత్రతారాగ్రహసంకులాపి' అని యున్నది.

చ. చిరసముపాశ్రితాగ్ని తడిఁ జెంది నశించునటంచునో, కృతా
ధ్వరతఁ దదగ్ని మైనునికి దాన నొకంగము దాఁచుచేతనో
పురధరణీసురుల్ నిగమభూధరముల్ జపయజ్ఞశీలు రా
హరిధనదేశులైన వలహస్తము సాఁపరు [1]వారిధారకున్. 33

టీ. చిరసముపాశ్రితాగ్ని-చిర = బహుకాలమునుండి, సముపాశ్రిత=ఆశ్రయించి యున్న, అగ్ని = వైశ్వానరుఁడు, తడిఁజెంది = లేమదాఁకి, నశించును = చల్లారును, అటంచునో = అనియో, కృతాధ్వరతన్ - కృత = చేయఁబడిన, అధ్వరతన్ = జన్నము గలవారౌటచేత, తదగ్ని = ఆయజ్ఞాగ్ని, మైన్ = దేహమందు, ఉనికిన్ = ఉండుట చేతను, దానన్ = దానియందు, ఒకంగము = ఒక్కావయవమును, దాఁచుచేతనో = ఇముడ్చుకొనియున్నందుచేతనో, పురధరణీసురులు - పుర = పట్టణమందలి, ధరణీసురులు = బ్రాహ్మణులు, నిగమభూధరములు = వేదపర్వతములు, జపయజ్ఞశీలురు = జపయజ్ఞపరులై, ఆ హరిధనదేశులైనన్ = ఆయింద్రకుబేరాదులు, వా రిచ్చెద నన్నప్పటికిని, వారిధారకున్ = దానార్థమగునుదకధారకు, వలహస్తము = దక్షిణహస్తము, చాఁపరు = చాఁచెడువారు గారు.

తా. బ్రాహ్మణులదక్షిణహస్తంబున నగ్ని యుండుట నిగమసిద్ధంబు గావున నాయగ్ని దానోదకముచేతఁ జల్లారు ననియో, లేక, యెల్లరు సోమయాజులగుటచేఁ దమ యం దగ్నియుండును గాన దానియొకయంగమును దాఁచవలయు ననియో యాపట్టణమున వసించుచున్నబ్రాహ్మణులు దేవేంద్రాదులవంటి వారిదానోదకమునైనను గ్రహింపకయుందు రనఁగాఁ బ్రతిగ్రహపరాఙ్ముఖులై వేదాధ్యయన జపయజ్ఞపరు లగుచు నొప్పుచుందు రని తాత్పర్యము.

చ. ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు [2]మంత్రములందుఁ దక్క సు
స్థిరనిజశక్తినై దుపదిఁ జేయరు దత్తినతక్క, మంటికై
పోరల రధిపుఁ డీ కమలబుద్ధి ఖళూరికఁ దక్క, వజ్రదో
పరిఘువశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్. 34

1. దానధారకున్. 2. మంత్రములందె తక్క.

టీ. అప్పురిన్ = ఆమధురాపురమునందు, వజ్రదోఃపరిఘవశీకృతాన్యనరపాలకులు - వజ్ర = వజ్రాయుధతుల్యమైన, దోః = భుజమందలి, పరిఘ = పరిఘయను నాయుధవిశేషముచేత, వశీకృత = స్వాధీనులుగాఁ జేయఁబడిన, అన్య = ఇతరులైన, నరపాలకులు = మనుజపతులు గల, రాకుమారకులు=రాచకొమరులు, మంత్రములందున్= జపకాలంబున నుచ్చరించెడు మహామంత్రములయందు, తక్కన్ = తప్ప, ఉరవడిన్ = బలముగా, పోరికై = యుద్ధముఁ జేయుటకై, కవచమొల్లరు = కవచముఁ దొడుగరు, సుస్థిరభుజశక్తిన్ - సుస్థిర = దృఢమగు, భుజశక్తిన్ = బాహుబలముచేతను, దత్తిన తక్కన్=దానకాలమందుఁదక్క, ఐదుపది సేయరు=వెనుకంజవేయరు (అయిదు పది సేసె వెనుక ముం దయ్యె, జుణిగెనని ఆంధ్రనామశేషము.) ఖళూరికఁదక్కన్=గరడీలయందు వినాగా, ని. 'ఖళూరీఖురళీసమే' యని గరడీపర్యాయము. అమలబుద్ధిన్ = సద్బుద్ధిగలవారుగాన, అధీశుఁడు = ఏలుచున్న ప్రభువు, ఈక = ఇయ్యకయే, మంటికై = ఎఱ్ఱమంటికై - భూమికొఱకు, పోరలరు = పోర్లాడరు.

తా. మిగుల బలశాలురగు నప్పట్టణమందలి రాచకొమరులు కవచము దొడుగకయే యుద్ధముఁజేయుదు రనియు, మంత్రజపానుష్ఠానపరులుగాన నుపాసనాకాలమందే కవచాదులు పఠింతు రనియు, దృఢమైననిజశక్తిగలవారుగాన దానకాలమున నైదిచ్చుచోఁ బదిగా నిచ్చునట్టి దానశీలు రనియు, యుద్ధమునందు వెనుకంజవేయ రనియు, సాముఁజేయుటయం దతిసమర్థు లనియు, విమలమతులు గాన రాజు పిలిపించియిచ్చువఱకు భూముల నపేక్షింపక యుందు రనియును దాత్పర్యము.

శా. దంభాపేతవితీర్ణితోయములు రథ్యం దొట్టి హట్టస్థిత
స్తంభంబుల్ చిగురించుచున్నవి యనన్ ధర్మైకనిత్యార్జనన్
సంభూతం బగుపైఁడి కోటి కొకటై నానాఁటికి న్హెచ్చు చ
య్యంభోదావళిఁ గప్పు కేతువుల వైశ్యశ్రేణి పొల్పు న్స్ఫురిన్. 35

టీ. దంభా...ములు - దంభ = దంభమువలన, అపేత = తొలఁగినట్టి (అనఁగా దంభము లేనట్టి), వితీర్ణి = దానసంబంధులగు, తోయములు = ఉదకములు, రథ్యన్ = నగరమధ్యమార్గమందు, తొట్టి = ప్రవహించి, హట్ట...బుల్ - హట్ట = అంగళ్లయందు, స్థిత = ఉన్నట్టి, స్తంభంబులు = కంబములు,, చిగురించుచున్నవి = సంజాతపల్లవములగుచున్నవి, అనన్ = అనునటుల, ధర్మైకనిత్యార్జనన్ - ధర్మ = ధర్మముచేతనే, ఏక = ముఖ్యముగాను, నిత్య = ఎల్లప్పుడును, ఆర్జనన్ = సంపాదించుటచేత, సంభూతంబగుపైఁడి = లభ్యపడినట్టి ద్రవ్యముయొక్క, కోటి కొకటై = కోటి కొక్క

పడగయై యనుట, నానాఁటికిన్ = దినదినమునకు, హెచ్చుచున్ = వృద్ధిఁబొందుచు, అయ్యంభోదావళిన్ = ఆమేఘపంక్తిని, కప్పు = కప్పుచున్నట్టి, కేతువులన్ = టెక్కెములచేత, వైశ్యశ్రేణి = కోమటులగుంపు, పురిన్=పట్టణమందు, పొల్చున్ = ఒప్పును.

తా. ఆపట్టణమందుఁ దాము పారమార్థికముగ నిచ్చుదానజలంబులు వీథుల యందుఁ దొట్టియుండ దానిచేఁ సంగళ్లకంబములు చిగురించుచున్నవి యనునటుల ధర్మము వదలక యార్జించిన ద్రవ్యము కోటికిఁ బడగెత్తి నానాఁటికి హెచ్చుచుండ మేఘబృందములఁ గప్పునట్టి టెక్కెములచేతఁ గోమట్లగుంపు నొప్పుచుండు నని తాత్పర్యము.

తే. నృపులపదహాలరేఖలకెల్ల మాభు
జాగ్రహాలరేఖలే మూల యనుచుఁ గోటి
కొండలుగ ధాన్యరాసులు పండ(డు) వీట
సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి 36

టీ. నృపుల...కెల్లన్ - నృపుల = భూపతులయొక్క, పద = పాదముల యందలి, హాలరేఖలకెల్లన్ = హాలాకారరేఖలకెల్లను, మాభుజాగ్రహాలరేఖలే = మాభుజములమీఁద నున్న నాఁగేళ్ల రేఖలే, మూల మనుచున్ = మొదలనుచు, కోటికొండలుగన్=కొండలుగాను కోట్లుగాను, ధాన్యరాసులు, పండన్ = ఫలింపఁగా (పండించుకొనుచు ననుట), వీటన్ = పట్టణమునందు, సుజన = సత్పురుషులయొక్క, భజన = సేవ, ఏక = ముఖ్యమైన, విఖ్యాతి = కీర్తిగాఁగల, శూద్రజాతి = శూద్రకులము, పొలుచున్ = ఒప్పును. కఃపొలుచు నన్నుపదము పూర్వపద్యమునుండి యధ్యాహార్యము.

తా. ఆపురమున నున్న కాఁపులు తాము నాఁగేలుపట్టి దున్నుటచేత నేగదా రాచవారిరాచఱికపుసొగ సని యెంచుకొనుచు దున్ని కొండలుగ కోట్లుగ నానావిధ ధాన్యములఁ బండించికొని సత్పురుషులకు సేవఁజేయుచు సుఖంబున నుండుదురు.

చ. ఉమియఁగఁ దన్ను నవ్వ ననఁ నొచ్చెము గాంచినకొన్ని మ్రాఁకు లా
ప్రమదల నప్పగింపఁ డని రంజిలుసేఁతలు గన్న చెట్లకున్
దమ కళిశృంఖల న్బెనఁచి నమ్మక [1]చుట్టెఁ బుటంబుఁ గంతునై
న్యముఁ గొని నా వెలిన్ [2]శుకపికాదుల కేళివనాళి పొల్పగున్. 37

టీ. పుష్పింపఁజేసెడి పద్క్రియలు దోహద మనంబడును. అందు-ఉమియఁగన్ = ఉమియఁగాను, తన్నన్ = తన్నఁగాను, నవ్వన్ = నవ్వఁగాను, అనన్ = పల్కరింపఁ

---

1. ముట్టెఁ. 2. శుకపికాదుకుల.

గాను, ఓచ్చెముఁగాంచిన = అవమానముఁబొందిన, కొన్నిప్రాఁకులు = కొన్నివృక్షములు, ఆప్రమదలక = ఆయవమానపఱిచిన స్త్రీలను, అప్పగింపుఁ డని = తమకు నొప్పింపుఁడని, రంజిలుచేఁతలుగన్నచెట్లుకు = తగినచేష్టలుగల వృక్షములకు, (తక్కిన యాలింగనాది కమనీయ దోహదములు గల ప్రాఁకులకు ననుట), ప్రమదకు = తమకును, ఆళిశృంఖలకు = తుమ్మెదలను సంకిలిని, పెనఁచి = తగిలించి, నమ్మక = అప్పటికిని నమ్మకము చాలక, కంతుసైన్యము = మన్మథబలము, కొని = తీసికొనివచ్చి, పట్టణంబు = పురమును, చుట్టెక = ముట్టడిసేసెను. నాక = అనఁగా, వెలిక = వెలుపటను, శుకపిక = చిలుకలు కోయిలలు మొదలగుపక్షిజాతులచేత, ఆపల = సందడించుచున్నట్టి, కేళివనాళి = శృంగారవనములపంక్తి, పొల్పగుక = సుందరమౌను, శ్లో. 'తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతమ్, పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తు తత్క్రియా. ఆలిఙ్గనాత్కురవక స్తిలకో వీక్షణేనచ, కరస్పర్శేన మాసన్దో ముఖరాగేణ చమ్పకః. సల్లాపతః కర్ణికార స్సిన్ధువారో ముఖానిలాత్, గీత్యా ప్రియాళ ర్నితరాం నమేరుర్హాసితేనచ.' అని దోహదశాస్త్రమం దున్నది.

తా. దళదోహదములు గలవృక్షములను తుమ్మెదలు చుట్టుకొని తిరుగుటవలన సంకిళ్లు గాఁగాఁ దొలఁగనీయక మన్మథబలముఁ గూర్చికొనివచ్చి యుమియుట మొదలగు నవమానంబుల చేసినస్త్రీలను దమకుఁ బట్టియిమ్మని యవమానపడినచెట్లు తక్కిన చెట్లను ముట్టడివేసెనో యనునటులఁ జిలకలు కోయిలలు తొట్రుకొన శృంగారపుఁ దోఁటలు పుర మానుకొని సుందరముగా నుండును.

సీ. మదగంధతారతమ్యము యామ్యశరికిఁ ద
త్కరులకుం గనబలెఁ ॰ గటము లొఱసి
సురతశ్రమజ మౌటఁ ॰ జూపోపకయుబలెఁ
గామినీమృదుగండఘుసృణ ముడిపి
పరిమళ వాహోచ్చఁ ॰ బ్రాణమిూబలెఁ జించు
మృగనాభిచర్మభస్త్రికలు దూఱి
అహితపన్నగభేదు ॰ లనిబలె గృహావిటం
కపుఁగలాపుల నొయ్యఁ ॰ గఱులు నిమిరి
తే. వీటిసామగ్రిఁ గనుఁగొన ॰ వేగపడక
నడవఁ దనదిక్కుపుష్పదంతద్విపంబు
నెక్కెనో యన జడగతి ॰ నెపుడుఁ బొలయు
నందుఁ జందనశిఖరిమందానిలుండు.

టీ. మద...ము - మద = మదముయొక్క, గంధ = వాసనయొక్క, తారత మ్యము = హెచ్చుతగ్గులను, యామ్యకరికిన్ - యామ్య = యమదిక్సంబంధియైన, కరికిన్ = వామన మనుగజమునకును, తత్పురులకున్ = ఆపట్టణపుటేనుఁగులకును, కన బలేన్ = చూచుటకొఱకుంబలె, కటములు = గండస్థలములను, ఒఱసి = ఱాచికొని, సురతశ్రమజము - సురత = రతియందలి, శ్రమజము = బడలికచేతను పుట్టినది, ఔటన్ = ఐనందువలన, చూపోపకయుంబలెన్ = చూడలేకవలె, కామినీ...ము- కామినీ = స్త్రీలయొక్క, మృదు = లేఁతలైన, గండ = చెక్కిళ్ళయందలి, ఘర్మము = చెమటను, ఉడిపి = పోఁగొట్టి, పరి...చ్ఛన్ - పరిమళ = సుగంధమును, వాహ = వహించెడి, ఇచ్ఛన్ = కాంక్షచేత, ప్రాణమీఁబలెన్ = ప్రాణమిచ్చుటకొఱకుబలె, చించు...లు-చించు = చినిఁగినట్టి, మృగ = కురంగములయొక్క, నాభి = బొడ్డు యొక్క, చర్మభస్త్రికలు = చర్మపుఁదిత్తులను, దూఱి = ప్రవేశించి, అహిత...లె- అహిత = తనకు శత్రువులైన, పన్నగ = పాములను, భేదులనిబలెన్ = భేదించెడునవి (భక్షించునవి) యన్నట్టువలె, గృహ...లన్ - గృహ = గృహములందలి, విటంక = కొణిగలమీఁద నున్న, కలాపులన్ = నెమిళ్ళను, ఒయ్యన్ = తిన్నఁగా, గఱులు = ఱెక్కలను, నిమిరి = తొడసి, వీటిసామగ్రిన్-వీటి = ఆపురముయొక్క, సామగ్రిన్ = పరిపూర్ణతను, కనుఁగొనన్ = చూచుటకొఱకు, వేగపడక = త్వరపడక, నడవన్ = సంచరింపఁగా, తనదిక్కు = వాయవ్యపుదిక్కున నున్న, పుష్పదంతద్విపంబు = పుష్పదంత మను నేనుంగును, ఎక్కెనో యనన్ = ఆరోహణముఁ జేసెనో యనునటుల, జడగతిన్ = మందగమనముచేతను, ఎప్పుడున్ = నిత్యమును, చంద...డు - చందనశిఖరి = చందన పర్వతమందలి, మందానిలుండు = తిన్నని గాలి, అందున్ = ఆపురమునందు, పొలయున్ = విసరును.

తా. యమునిదిక్కునందలి యేనుఁగునకును బురగజంబులకును మదగంధ తారత మ్యముఁ జూత మనునటు లయ్యేనుఁగుల గండస్థలముల నొఱసి యందున్న పరిమళం బులం గ్రహించి రతిశ్రమవలనఁ బుట్టిన చెమట నార్చునట్లు స్త్రీలచెక్కిళ్ళఁ బ్రసరించి తద్గంధముల సంగ్రహించికొని చించినబొడ్లు గలిగి పడియున్న కస్తూరీమృగములకుఁ బ్రాణ ములఁ గల్పించుదానివలె వానిబొడ్డు చర్మపుఁదిత్తులలోఁ జొచ్చి యాసుగంధమును దీసి కొని గృహములయందున్న నెమిళ్లు దమకు శత్రువులగు పాముల భక్షించునవి యని యా ప్తతచేత దువ్వెనో యనునటుల వానిఱెక్కల నిమిరి పట్టణపు సకలసమృద్ధిఁ జూడ నిచ్ఛ గలదై వేగిరపడక మెల్లఁగాఁ దనదిక్కున నున్న పుష్పదంత మను గజము నెక్కి సంచరిం చుచున్నదో యనునటుల నాపట్టణమందు మందమారుతము గమ్మున వాసించుచు విసరు చుండును.

మత్స్యధ్వజుఁడు

సీ. ద్వితయోపాయధీవిద్వద్వతంసంబు
షాడ్గుణ్య చాతురీచక్రవర్తి
క్రీడాచలీకృత శ్రీఖండగిరి రాజు
కనకాద్రిముద్రణ గ్రంథకర్త
యందూనిబద్ధాబ్దబృంద వేదండాళి
వనవిధిస్తంభనాధునికరఘువు
తామ్రపర్ణ్యమల పాథఃకేళిహంసంబు
లంకేశ మైత్రీప్రియంకరుండు

తే. స్వస్తికృద్వ్యాస్తవస్తుత్యగస్తి మఘవ
మకుటమోటనశేఖరకోటిమంత్ర భృత్య
భూతభూతాత్తశాంభవభూమికుండు
దత్పురం బేలుఁ బాండ్యమత్స్యధ్వజుండు. 39

టీ. ద్విద్వ...బు - ద్విద్వయ=నాలుగైన, ఉపాయ = సామ-దాన-భేద-దండము లనియెడి యుపాయములయొక్క, (ని. 'సామ దానే భేద దణ్డా విత్యుపాయా చతుష్టయ' మ్మని యమరుఁడు.) ధీ = బుద్ధియందు, విద్వద్వతంసంబు = పండితశ్రేష్ఠుఁడు, షాడ్గు...ర్తి-షాడ్గుణ్య = సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయము లని యెడి షడ్గుణములయొక్క, చాతుర్య = నిపుణతయందు, చక్రవర్తి = సార్వభౌముఁడు, (ని. 'సన్ధిర్నా విగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయః, షడ్గుణాః' అని యమరుఁడు.) వ్యా. 'షడ్గుణా ఏక షాడ్గుణ్య' యని చాతుర్వర్ణ్యం - త్రైలోక్య మన్నట్లు స్వార్థమందు ష్యఙ్ప్రత్యయము. క్రీడా...జు - క్రీడాచలీకృత = విలాసార్థమైన పర్వతముగాఁ జేయఁబడిన, శ్రీఖండగిరిరాజు = మలయపర్వతముగలవాఁడు, కనకా...ర్త- కనకాద్రి = మేరుపర్వతమును, ముద్రణ = ముద్రించుటయందు, గ్రంథకర్త = తన గెలుపు లిఖించినవాఁడు, (శ్లో. 'ఉదీచీం దిశ మాక్రమ్య పాణ్డ్యః పరమధార్మికః, ప్రాప్య మేరుగిరిం తస్మిన్ లిలేఖ బిరుదాన్ స్వకాన్' అని హాలాస్యమందు నతని గెలుపులు మేరుపర్వతమున వ్రాసినకథ వర్ణింపఁబడియున్నది.) అందూ...ళి-అందూ= శృంఖలలచేతను, నిబద్ధ = బంధింపఁబడిన, అబ్దబృంద = మేఘసమూహమువంటి, వేదండాళి = గజసమాజముగలవాఁడును, వన...వు-వననిధి = సముద్రముయొక్క, స్తంభన = కట్టుటయందు, ఆధునికరఘువు = నూతనరాఘవుఁడు, ('అధునా భవః ఆధునికః' అని

కాలవాచకముమీఁద తక్ ప్రత్యయము.) ('ఏతర్హి సంప్రతీదానీ మధునా' యని యమరుఁడు.) తా మ్ర...బు-తామ్రపర్ణీ = తామ్రపర్ణి యనునదియొక్క, అమల = నిర్మలమగు, పాథః = ఉదకమందు, కేళి = క్రీడించుట గల, హంసంబు = హంసప్రాయుఁడు, లంకే...డు-లంకేశ = విభీషణునితో, మైత్రీ = చెలిమియందు, ప్రియంకరుండు = ఇష్టముఁ జేయువాఁడు, స్వస్తి...స్తి-స్వస్తికృత్ = ఆశీర్వదించెడి, వాస్తవ = సత్యమైన, స్తుతి = స్తోత్రముగల, అగస్తి = అగస్త్యుఁడుగలవాఁడును, ('వస్తునఇయంవాస్తవీ,' 'వాస్తవీస్తుతిర్యస్యవాస్తవస్తుతిః' అని వ్యుత్పత్తి, అగస్త్యశబ్దమున కగస్తిశబ్దమునుం గలదు). మఘవ...డు-మఘవ = దేవేంద్రునియొక్క, మకుట = కిరీటమును, మోటన = నుగ్గు సేయునట్టి, శరకోటి = బాణముల సమూహము గలవాఁడు, మంత్రశక్తిచేతను, భృత్యభూత = కింకరులయిన, భూత = భూతములు గలిగి, ఆత్త = పొందఁబడిన, శాంభవ = రుద్రసంబంధియగు, భూమికుండు = వేషముగలవాఁడును నైన, పాండ్య మత్స్యధ్వజుండు = మత్స్యధ్వజుఁ డను పాండ్యదేశపురాజు, తత్పురంబు = ఆమధురా పట్టణమును, ఏలున్ = పరిపాలించును.

తా. పాండ్యదేశము నేలెడు మత్స్యధ్వజుఁ డనురాజు మేరుపర్వతమందుఁ దన గెలుపుకథలను వ్రాసినవాఁడై వాసవునికిరీటమును నుగ్గునుగ్గు గావించునట్టి శరసమూహము గలవాఁడే భూతములను తంత్రశక్తిచే వశపఱుచుకొనుటవలన నవి తన్ను సేవించుచుండ రెండవరుద్రునివలె నుండువాఁడై సామాద్యుపాయములయందును, సంధి విగ్రహాదిషాడ్గుణ్య విచారణయందును నతికుశలుఁడై, విలాసకాలంబులయందు మలయపర్వతముననే విహరించుచు నసంఖ్యాతంబులగు నేనుంగులుగలవాఁడై, సముద్రబంధనముఁ జేసినవాఁడై, శుద్ధోదకములు గల తామ్రపర్ణియందుఁ గ్రీడించువాఁడై, విభీషణునితోఁ జెలిమిచేసి యతని కిష్టములఁ దీర్చువాఁడై, నిత్య మగస్త్యాశీర్వాదముఁ బొందుచు నాపట్టణమును బాలించుచుండును.

ఉ. ఇందుకులావతంస మతఁ డేతఱి నేతరిగాఁ, డరిం బ్రజ
లక్కొందఁ గొనం, డొరుం డొరుత [1]లన్ననిపించినమాట డెందముం
జెంద ముదంబు దక్కి చెడఁ జేయఁ డొరు, న్వినతాస్యుఁడౌనుతిం
పం దనుఁ, బందనుం గొఱఁతఁవల్కఁడు శూరతఁ దానుమించియున్.

టీ. ఇందుకులావతంసము = చంద్రవంశభూషణుండగు, అతఁడు = ఆమత్స్యధ్వజుఁడనురాజు, ఏతఱిన్ = ఎప్పటికిని, నేతరి గాఁడు = నీతితప్పువాఁడుగాఁడు, అరిన్ =

1. శూరత దాన మిచ్చియున్.

పన్నును, ప్రజలు = మనుష్యులు, కందన్ = నొచ్చునట్లుగ, కొనండు = గ్రహింపఁడు, పరుండు = పరుఁడు, పరుతలన్ = మఱియొకనిమీఁద, వినిపించిన = విన్నవించిన, మాట = కొండెపుమాట, డెందమున్ = హృదయమును, చెందన్ = పొందఁగా, ముదంబు దక్కి = సంతసము విడిచి, పరున్ = పరుని, చెడఁజేయఁడు = చెఱుపఁడు, తనున్ = తన్ను, నుతింపన్ = ప్రజలు స్తోత్రముఁ జేయఁగా, వినతాస్యుఁ డౌన్ = ముఖము వంచువాఁ డౌను. అనఁగా నీరాజు ధీరోదాత్తనాయకుఁడు గనుక, (శ్లో. 'శౌర్యశ్రీప్రవణప్రశంసిషు నమద్భ్రూర్లజ్జతే వందిషు' అని) ప్రతాపరుద్రీయమందలి ధీరోదాత్తోదాహరణమును, (శ్లో. 'మహతాం కుఞ్జరాణాఞ్చ పురస్స్తోత్రం నహి ప్రియ' మ్మని) మత్స్యభావకథనమున నుండు రీతిగా నాత్మప్రశంసయందు నిష్టము లేనివాఁ డనుట. శూరత...యున్ = శూరతన్ = శౌర్యముచేత, తాను మించియున్ = అతిశయించియును, పందన్ = సోమరియగువానిని, కొఱఁతపల్కఁడు = తక్కువమాట సెప్పఁడు.

తా. ఆపురము నేలెడిమత్స్యధ్వజుఁ డనురాజు ప్రజల నొప్పించి పన్నుదియక, కొండెపుమాటలు విని జనుల బాధపెట్టక, తన్ను ప్రజలు స్తోత్రముఁ జేసిన నుబ్బక, పరాక్రమముచేత గర్వపడి పందలఁ దక్కువమాట లాడక, చంద్రవంశమునకు భూషణప్రాయుఁడై సుగుణములచే నొప్పుచు నెప్పటికిని నీతి తప్పక యుండెను.

సీ. పాటీరగిరివనీ వాటిఁ గ్రీడించియు
నహిభయం బెఱుఁగఁ డా వంతయైన
నత్యంతమితభాష నవికత్థనుం డయ్యుఁ
బరులఁ గేరడమున భంగపఱుచుఁ
బ్రీతిఁ దాఁ దామ్రప ర్ణికి నాథుఁ డయ్యును
సద్గోష్ఠిచే నసం జనత మెలఁగు
మహనీయమహిమఁ దా మధు రాస్పదుం డయ్యు
లావణ్యకలన నుల్లాస మొందు
తే. విషధిలహరిభిదోత్పత త్పృషతజటిల
వలదురుక్రమతిమిపర వాలపతన
తులితపరబలకరిశిర స్థ్సలసముత్థ
బహుళముక్తావిముక్తాసి పాతుఁ డతఁడు. 41

1. వనవాటి. 2. ప్రేమఁ దా.

టీ. పాటీ...టిన్ - పాటీరగిరి = మలయపర్వతమందలి, వనీవాటిన్ = వనవీథిని, క్రీడించియున్ = క్రీడసల్పుచును, ఆవంతరమైనన్ = ఆవగింజంతయైన, అహిభయంబు = సర్పభయంబును, ఎఱుఁగఁడు (శ్రీచందనాదులయందు సర్పములున్నను తద్భయం బెట్లెఱుంగఁ డని విరోధముగలుగఁగ నిత్యము క్రీడాపరుఁడైయున్నను స్వపక్షభయం బెఱుంగఁ డని పరిహారము. సి. 'మహీభుజామహిభయంస్వపక్షప్రభవంభయ' మ్మని యమరుఁడు. అత్యం...షన్ - అత్యంత = మిక్కిలియు, మితభాషన్ = అల్పభాషచేత, అవికత్థనుండయ్యున్ = ప్రల్లదములాడనివాఁడయ్యును, కేరడమునకున్ = పరిహాసముచేత, పరులన్ = అన్యులను, భంగపఱుచున్ = అవమానపఱుచును. (అల్పభాషికిఁ గేరడమే మని విరోధము గల్గఁగ గేరడదేశమునందలి శత్రువుల భంగపఱుచు నని పరిహారము. కేరడమనుచోట డడల కభేదము - 'విషయానంతరోరాజా' శత్రు పనురీతినిఁ గేరళ దేశపు రాజునకు శత్రువు). ప్రీతిన్ = ప్రేమచేతను, తాన్ = తాను, తామ్రపర్ణికిన్ = తామ్రపర్ణియను నాఁడయొసంగునకు, నాథుఁడయ్యును = ప్రభువయ్యును, సద్గోష్ఠిచేన్ = సత్సహవాసముచేత, అనంజనతన్ = (అంజనో నభవతీ త్యనంజనః - తస్యభావః - అనంజనతా) అనువ్యుత్పత్తిచేతను అంజన మనుదిగ్గజము గాక, మెలఁగున్ (తామ్రపర్ణి యను పేరు గల దిక్కరిణికిఁ బెనిమిటియై యుండియు అంజన మనుదిగ్గజ మెట్లుగాకపోయె నని విరోధము జనింపఁగా - తామ్రపర్ణి యను పేరఁ బాండ్యదేశమందుఁ బ్రసిద్ధినొందిన నదికిఁ బ్రభువై సద్గోష్ఠిచేత, అపగతం అంజనం పాపం యస్యసః తస్యభావః, అనంజనత యనువ్యుత్పత్తిచేత పాపరహితుఁడుగా నుండె నని పరిహారము. మహా...మన్ - మహనీయ = ఒప్పుచున్నట్టి, మహిమన్ = సామర్థ్యముచేతను, తాన్ = తాను, మధురాస్పదుండయ్యును = తియ్యఁదనమునకు స్థానముగా నుండియును, లావణ్యకలనన్ = లవణభావసంగతిచేతను, ఉల్లాస మొందును. మధురాస్పదుఁడైనవాఁడు లవణభావసంగతిచేత నెట్లుల్లాసమొందు నని విరోధముపుట్టఁగా మధురాపట్టణమందుండి అవయవకాంతి విశేష ప్రాప్తిచేత నుల్లాస మొందు నని పరిహారము. శ్లో. 'ముక్తాఫలేషు చ్ఛాయాయాస్తారళ్యం మనోజ్ఞం దృశ్యతే యథా, తద్వదంగేషు లోకానాం లావణ్యం దృశ్యతే బుధైః' అని లావణ్య లక్షణము. సీస పాదములు నాలుగింటను విరోధాభాసాలంకారము. శ్లో. 'ఆభాసత్వేవిరోధస్య విరోధాభాస ఇష్యతే' యని లక్షణము. అతఁడు = ఆమత్స్యధ్వజుఁ డనురాజు విషధి...డు - విషధి = సముద్రముయొక్క, లహరి = ప్రవాహముయొక్క, భిదా = భేదించుటచేత, ఉత్పతత్ = ఎగురుచున్న, పృషత = బిందువులయందు, జటిల = ముప్పిరిగా, వలత్ = చుట్టుకొనియున్నట్టియు, ఊరు = విస్తారమగు, క్రమ = సంచారముగల, తిమి = పెద్దచేఁపయొక్క, వర = శ్రేష్ఠమైన, వాల = తోఁకయొక్క, పతన =

పతనముతోడను, తులిత = తుల్యమైన, పరబల = శత్రుబలములయందలి, కరి = ఏనుఁగుల యొక్క, శిరస్స్థల = కుంభస్థలములవలన, సముత్థ = ఎగిరినట్టి, ముక్తా = ముత్యముల యందు, అవిముక్త = విడువఁబడని, అసి = ఖడ్గముయొక్క, పాతుఁడు = పతనముగల వాఁడు.

తా. పరబలము సముద్రమువలెను నేనుంగుల కుంభస్థలములు కరుళ్లవలెను ముత్యములు జలబిందువులవలెను ఖడ్గము తిమిజాలమువలెను నుండె నని యంతటను ఉపమాలంకారము.

శా. దానత్యాగపత్త్రమై తొలుపతత్త్రం బంబుధారన్సదా
నానం,దత్సితకీర్తిహంసి చను మింటం, గ్రొత్త నా నేల, నా
నానీరార్ద్రపత్త్రయయ్యు వడి మింటం బాఱుతజ్జాతి కే
లా నిల్చు న్గతి యన్యపత్త్రిగతిఁ బత్త్రైకప్రదేశాప్లుతిన్. 42

టీ. దానత్యాగపత్త్రమై = దాన మన నుదకధారాపూర్వకముగ నిచ్చునది, త్యాగమన నడుగఁబడకయే యుదకస్పర్శలేక యిచ్చునది, పత్త్రమై = దానత్యాగములు రెండును రెండు ఱెక్కలుగాఁగలదై, తత్సిత...సి - తత్ = ఆరాజుయొక్క, సిత = తెల్లనైన, కీర్తి = యశ మనియెడి, హంసి = పెంటిహంస, తొలుపత్త్రంబు = మొదటి ఱెక్క, 'పత్త్రం చతనూరుహ'మ్మనియమరుఁడు. అంబుధారన్ = ఉదకధారచేత, సదా= ఎల్లప్పుడు, నానన్ = నానఁగా, మింటన్ = ఆకసమందు, చనున్ = పోవును, క్రొత్త నా నేల = ఇది క్రొత్తయన నేటికి, నానా...యయ్యున్=నానా = సకలమయిన, నీర= ఉదకములచేతను, ఆర్ద్ర = తడుపఁబడిన, పత్త్రయయ్యున్ = ఱెక్కలు గలదైనను, వడిన్ = వేగముచేతను, మింటన్ = ఆకాశమందు, పాఱు = తిరుగుస్వభావముగల, తజ్జాతికిన్ = ఆహంసజాతికి, అన్యపత్త్రిగతిన్ = ఇతరపక్షివలె, పత్త్రైకప్రదేశాప్లుతిన్ - పత్త్ర = ఱెక్కలయొక్క, ఏకప్రదేశ = ఒకప్రక్క, అప్లుతిన్ = తడియుటచేతను, గతి = గమనము, ఏలా = ఏమిటికి, నిల్చున్ = విరమించును.

తా. అనఁగా రెండుఱెక్కలు దడిసినను హంసగమనమున కవిరోధమనియుఁ దదితరజాతిపక్షు లయినయెడ నార్ద్రమగు ఱెక్కలతో నెగసిపోవంజాల వనియు నారాజుయొక్క కీర్తి దానత్యాగము లనుఱెక్కలుగల హంసీస్వరూపమై తడిసిన మొదటిఱెక్కతోనే యాకాశమునందును వ్యాపించి సంచరించుచున్న దనియు భావము.

సీ. శుకకదంబము గొలుసులచే నిబద్ధమై
వారాంగనాగారశాఖల బడఁగ

గిరికానికాయంబు లరిశూన్యబహుపుర
హర్మ్యవాటికలఁ [1]జెండాడు చుండఁ
గ్రందుగా నితరేతరంబు రాయిడి సేయు
రాజలు దననూపురమున నొదుఁగ
నెగడు ననావృష్టి నిజబలేభస్పర్ధి
సమదాన్యకరటి గండములఁ జేర
తే. దానవేళల నతివృష్టి తనదు హస్త
గతము గాఁగఁ బ్రతాపాగ్నిఁ గ్రాఁగిపోవు
కంటకులయందు (ద) శలభత గలయ నడఁగ
నేలు నాపాండ్యుఁడు మహి నిరీతిగాఁగ. 43

టీ. శుకకదంబము=చిలుకలగుంపు, గొలుసులచేన్ = శృంఖలలచేతను, నిబద్ధమై = కట్టఁబడినదై, వారా...రన్ - వారాంగనా = వేశ్యాస్త్రీలయొక్క, అగార = గృహము లనియెడు, కారన్ = చెఱసాలయందు, పడఁగన్ = ప్రవేశింపఁగా, గిరికానికాయం బులు = చిట్టెలుకలగుంపులు, అరి...లన్ - అరి = శత్రురాజు పరుగిడినందున, శూన్య = పాడుపడియున్న, బహుపుర = అనేకపట్టణములయందలి, హర్మ్యవాటికలన్ = మేడల వరుసలయందు, చెండాడుచుండన్ = గంతులువేయుచుండఁగా, క్రందుగాన్ = సంద డిగా, ఇతరేతరంబు = తమలోఁ దాము, రాయిడి = జగడము, చేయు = ఒనరించునట్టి, రాజులు = పుడమిఱేండ్లు, తన=తనయొక్క, నూపురమునన్=పాదకటకమందే, ఒదుఁ గన్ = అణఁగియుండఁగా-పాదాక్రాంతులై తనుఁ గొలుచు చుండఁగా ననుట, నెగడు = మిక్కుటమైన, అనావృష్టి = వర్షము లేకపోవుట, నిజ = స్వకీయమైన, బల = సేనల యందలి, ఇభ = ఏనుంగులతోడను, స్పర్ధి = కలహించిన, సమద = మదముతోఁగూడిన, అన్యకరటి = ఇతరగజములయొక్క, గండములన్ = చెక్కిళ్లయందు, చేరన్ = ప్రవేశింపఁగా, అతివృష్టి = అతివర్షము, దానవేళలన్ = దానముఁ జేయుసమయము లను, తనదు = తనయొక్క, హస్తగతము గాఁగన్ = హస్తమునఁ బ్రవేశింప, శలభత = శలభదోషము, ప్రతాపాగ్నిన్ - ప్రతాప = తనప్రతాప మనియెడి, అగ్నిన్ = అగ్నియందు, క్రాఁగిపోవు = మాడిపోవుచున్న, కంటకులయందున్ = క్షుద్రశత్రువుల యందు, కలయన్ = కలియునటుల, అడఁగన్ = అణఁగిపోఁగా, ఆ పాండ్యుఁడు =

1. చెండాడుచుండ.

ఆపాండ్యరాజు, మహిన్ = భూమిని, నిరీతి గాఁగన్ = ఈతిషట్కరహితముగాఁ ఏలున్ = పాలించును.

తా. శ్లో. 'అతివృష్టి రనావృష్టి ర్మూషికా శ్శలభా శ్శుకాః, అత్యాసన్నాశ్చ రాజాన షడేతా ఈతయ స్మృతాః' అనునట్టి షడ్బాధలను స్వరాష్ట్రమున లేకుండు నటు, నితరస్థలముల నిల్పి యాపాండ్యభూపతి రాజ్యపరిపాలనముఁ జేసెను.

వ. అమ్మహీవల్లభుం డివ్విధంబున సామ్రాజ్యవైభవంబు లనుభవించు [1]చుండఁ గొంతకాలంబున. 44

టీ. అమ్మహీవల్లభుండు = ఆభూపాలుఁడు, ఇవ్విధంబునన్ = ఈరీతిని, సామ్రాజ్య వైభవంబులు = సామ్రాజ్యసుఖంబులను, అనుభవించుచుండఁగా, కొంతకాలంబున = కొన్ని దినంబులకు.

తా. సుగమము.

తే. పాటలవసుంధరారుహాభాగధేయ
మాతతమరీచికాంబువర్షాగమంబు
ధరణిఁ బొడసూపె నంత నిదాఘసమయ
[2]ముదుటుతోఁ శాల్మలీఫలవిదళనంబు. 45

టీ. అంతన్ = అంతలో, పాటల... ధేయము - పాటలవసుంధరారుహ = పాదిరిచెట్లకు, భాగధేయము = భాగ్యరూపమైనట్టియు, ఆతత...వర్షాగమంబు - ఆతత = విస్తారమగు, మరీచికా = ఎండమావు లనియెడి. ని. 'మృగతృష్ణా మరీచికా' యని యమరుఁడు. అంబు = ఉదకమునకు, వర్షాగమంబు = వర్షాకాలమైనట్టియు, శాల్మలీ ఫలవిదళనంబు - శాల్మలీ = బూరుగుచెట్లయొక్క, ఫల = ఫలములను, విదళనంబు పగులఁగొట్టునట్టిది.యును నగు, నిదాఘసమయము = గ్రీష్మర్తువు, ఉదుటుతోన్ = ఉద్ధతితోడ, ధరణిన్ = భూమియందు, పొడసూపెన్ = కనఁబడెను.

తా. పాదిరిచెట్లను బుష్పింపఁ జేయుచు నెండమావులఁ గలుగఁజేయుచును బూరుగుకాయలఁ బగులఁగొట్టునట్టి గ్రీష్మర్తువు ఉద్ధతిచేత భూమియందుఁ గనుపించెను.

సీ. నిర్ఝరప్రబలవేణిక లింకఁ జట్రాల
బేరినప్రాఁచి పెసిస్ఫీఁట లెగసె
నెఱుకులు పడియనీరరివుర గువ్వలఁ బట్టఁ
బోయునీ రాడాడఁ బొలము నెఱసె

1. సంటఁ. 2. ఆదటుతోఁ.

సురగాలి దవదగ్ధతరుపర్ణతతి రేఁపఁ
  బావురా లని డేఁగపదుపు దూఱె
నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరుగ వెం
  బడినయధ్వగపంక్తి పొరలువెట్టె
తే. క్షేత్రపాలున కుదికినచీరె లాఱు
  చాకిరేవులగము లయ్యె సకలదిశలు
  దెలుపులుగఁ దోఁచె నెండమావుల బయళ్లు
  గందె నివి యెండ నన దిఙ్ముఖములు గాఁజె. 46

టీ. నిర్ఝరప్రబలవేణికలు - నిర్ఝర = సెలయేళ్ల యొక్క, ప్రబల = విస్తారమైన, వేణికలు = ప్రవాహములు, ఇంకన్ = ఇనికిపోఁగా, చట్రాలన్ = చట్టుతాలయందు, పేరిన = పేరుకొన్నట్టి, ప్రాఁచి, పెన్బిఁటులు = పెద్దపగుళ్లు, ఎగసెన్ = లేచెను. ఎఱుకులు = ఎఱుకువాండ్రు, పడియ = పడియలయందలి, నీరు = ఉదకము, ఇవురన్ = ఇగిరిపోఁగా, గువ్వలఁబట్టన్ = పిట్టలఁబట్టుటకు, పోయెడు = పోయుచున్న, నీరు = ఉదకము, అడాడన్ = అక్కడక్కడ, పొలమునన్ = భూమియందు, సెలసెన్ = వ్యాపించెను, సురగాలి = సుడిగాడ్పు, దవదగ్ధతరుపర్ణతతిన్ - దవ = కారుచిచ్చుచేత, దగ్ధ = కాలినట్టి, తరు = మ్రాఁకులయొక్క, పర్ణతతిన్ = ఆకులగుంపులను, రేఁపన్ = ఎగురఁగొట్టఁగా, పావురా లని = కపోతములనుకొని, డేఁగపదుపు = శ్యేనసమూహము, దూఱెన్ = అడ్డముగ దూరెను, నిద్రి...యన్ - నిద్రిత = తాము నిదురఁబోయిన, ద్రు = వృక్షములయొక్క, ఛాయ = నీడ, నిలువక = నిలిచియుండక, జరుగన్ = అవలఁబోఁగా, వెంబడిన్ = ఆవెంటనే, అధ్వగపంక్తి - అధ్వగ = పాంథులయొక్క, పంక్తి = సమూహము, పొరలువెట్టెన్ = పొర్లుదండములు పెట్టెను, సకలదిశలు = అన్నిదిక్కులును, క్షేత్రపాలునకున్ = భైరవునకు 'త్వం భైరవ సమాగమ్య పుణ్యక్షేత్రాణి పాలయ, క్షేత్రపాల ఇతి శ్రీమన్ త్రిషు లోకేషు విశ్రుతః' యని స్కాందమున నున్నది గనుక క్షేత్రపాలుఁ డనఁగా భైరవుఁడు, ఉదికిన = ధౌతముఁ జేసిన, చీరలు = వస్త్రములు, ఆఱు = ఆఱఁగట్టినట్టి, చాకిరేవులగము లయ్యె = చాకిరేవు లాయెను. ఎండమావులన్ = ఎండమావులచేతను, బయళ్లు = బహిః ప్రదేశములు, తెలుపుగఁదోఁచెన్ = తెలుపులై తోఁచెను. ఎండన్ = ఎండచేతను, ఇవి = ఈదిఙ్ముఖములు, కందెన్ = వాడెను. అనన్ = అనఁగా, దిఙ్ముఖములు = దిక్కులమొగములు, గాఁజెన్ = ధూమితము లయ్యెను.

తా. గ్రీష్మర్తువు ప్రవేశింపఁగానే సెలయేఱుల ప్రవాహము లింకెనుగాను జట్రాతియందుఁ జేరియున్న ప్రాఁచి పెన్బిఁటలెగసెను. పడియలయందు నీ రింకియున్నం

దునఁ బిట్టలఁ బట్టుటకై యెఱుకవాండ్రచేతఁ బోయఁబడిన యుదకము పొలములయందుఁ గనుపించును. సుడిగాడ్పు లెండుటాకు లెగురునటుల వీచుచుండ డేగలు చూచి పావురము లని యెదురుదూఱుచుండును. త్రోవనడుచువారు వేఁడిమిచేత వృక్షముల క్రిందఁ బరుండి నిద్రించుచుండ నావృక్షములనీడ ప్రొద్దుతోఁ గూడ జరుగునపుడు వెంటనే వారును పొర్లాడుదురు. నలుదిక్కుల నెండమావులు వ్యాపించియుండ నవి భైరవుఁడు దిగంబరుఁడు గనుక నతని కుదికి యారవేయించినచీరలో యనునటులఁ దెల్లనై యుండును.

చ. సరియగు నిట్టివెట్టలను ♦ సర్వము నం చటమీఁదిసృష్టికై
శరధిప దిఙ్మరుజ్జ్వలిత ♦ చండత (ర) రాతపవహ్ని నాఱఁగాఁ
గరువు లజుండు వీనిపయిఁ ♦ గట్టె ననఁ గనుపట్టె వెచ్చల
న్గరికిరి కాసరాంగములు ♦ గప్పిన రొంపులు నంటి (దె) యాఱఁగన్.

టీ. వెచ్చలన్ = ఉడుకులచేతను, కరికిరి...ములన్ - కరి = ఏనుఁగుల యొక్కయు, కిరి = వరాహములయొక్కయు, కాసర = ఎనుబోఁతులయొక్కయుఁ, ని. 'వాహద్విషత్కాసరసైరిభా' యని యమరము. అంగములన్ = దేహములను, కప్పిన రొంపులున్ = ఆచ్ఛాదించినపంకంబులుకూడ అంటి = పేరుకొని, ఆఱఁగన్ = ఎండఁగా, ఇట్టివెట్టలను = ఇట్టివేసవియందు, సర్వమున్ = సకలమును, సరియగున్ = నష్టమగును, అంచున్ = అనుకొని, అటమీఁదిసృష్టికై = భావిసృష్టికై, అజుండు = బ్రహ్మ, శరధిప - సముద్రముల కధిపతి యగువరుణునియొక్క, దిక్ = దిశయైన పడమటి దిక్కుయొక్క, మరుత్ = వాయువుచేతను, జ్వలిత = ప్రజ్వలింపఁజేయఁబడిన, చండతర = మిక్కిలి ప్రచండమైన, ఆతపవహ్నిన్ = ఆతప మనునగ్నిచేతను, ఆఱఁగన్ = ఎండునటుల, వీనిపైన్ = ఈకాసరాదులపై, కరువులు = మూసలు, కట్టె ననన్ = కట్టెనో యనునటుల, కనుపట్టెన్ = కానవచ్చెను.

తా. వేఁడిమిచేత నేనుంగులు వరాహములు ఎనుబోతులు వీనిదేహములయందు పేరుకొనియున్న బురుద లెండఁగా నిట్టివేసవియందుఁ గాసరాదులు నష్టమగు నని పైసృష్టికై చిచ్చువంటి పడమటిగాడ్పున నాఱుచుండఁ జతుర్ముఖుండు వీనిపైఁగరువులు గట్టెనో యనునటులఁ గనుపడుచుండును.

మ. దవధూమంపుఁదమంబులోఁ దమరస ♦ ద్రవ్యంబు బంకేజబాం
ధవభాను ప్రతతు ల్హరింపఁ గుయివోంటన్వ్రేళ్లు శూన్యోరుకూ
పవితానం బనఁ జూడఁజూడఁ బుడమి ♦ న్బాటిల్లి పైవిష్వళై
యవసం బంచుల నాఱఁగా నెగసె వా ♦ త్యాళి స్రజశ్చక్రముల్.48

టీ. దవ...బులోన్ - దవ = గ్రీష్మసంబంధి యగుకార్చిచ్చుయొక్క, ని. 'దవో వనహుతాశనః' అని యమరుఁడు. ధూమంపు = పొగలనియెడి, తమంబులోన్ = చీఁకటియందు, పంకేజబాంధవభానుప్రతతుల్ = సూర్యకిరణసమూహములు, తమ... బు - తమ = తమయొక్క (అనఁగా బావులయొక్క యనుట), రస = ఉదకములని యెడు, ద్రవ్యంబు = ధనమును, హరింపన్ = గ్రహింపఁగా, కుయివెంటన్ = మొఱ యనెడుకార్యమునకై యనఁగా మొఱవెట్టుటకు, వెళ్లు...వితానంబు - వెళ్లు = వెళ్లిపోవు చున్నట్టి, శూన్య = పాడైన ఉరు = బహుళంబులగు, కూపవితానంబులు = నూతుల గుంపులు, 'క్రతువిస్తారయోరస్త్రీ వితాన'మ్మని యమరుఁడు. అనన్ = అనఁగా, వాత్యా ళిన్ = వాయుసమూహము చేత, ('వాతానాం సమూహో వాత్యా' యని పాశాది కము గనుక సమూహార్థమందు యప్రత్యయము) పైవిప్పులై = విరివిగలవై, యవసంబు= కసువు, అంచులన్ = కొసలను, ఆడఁగాన్ = చుట్టితిరుగఁగా, చూడఁజూడన్ = వీక్షించు చుండఁగా, పుడమిన్ = భూమియందు, పాటిల్లి = విస్తరిల్లి, రజశ్చక్రముల్= చక్రాకారపుఁబరాగములు, ఎగసెన్ = ఎగిరెను. ఇందు రెండవపాదమున ననుస్వారసం బంధయతి అప్పకవీయమున నీయతిలక్షణ మిట్లు కలదు. "ఇది పూర్ణయుతములై టత వర్గాక్ష, రములు తుదను గల్గు వ్రాలు దక్కఁ, బొసఁగు నొకటి భువిననుస్వారసం, బంధ యతులు నాఁ బ్రబంధములను'.

తా. సూర్యకిరణంబులు తమయొక్కరసము లనియెడి ద్రవ్యంబులను హరింపఁగా మొఱవెట్టుటకు వెళ్లుచున్న పాడుబావులగుంపులో యనునటుల సుడిగాలి దుమ్ము కసవు లతో నెగసి చక్రాకారముగఁ దిరుగుచుండును.

చ. పడమరవెట్ట నయ్యుడుకుఁ ◊ బ్రాశన మొల్లక కూటి వేదలై
బడలిక నూడు నచ్చిలువ ◊ ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికి
న్ముడియిడఁ బిచ్చుగుంటు రథ ◊ ము న్నిలుప న్పయనంబు సాఁగమిన్
జడను వహించె నాఁగ దివ ◊ సంబులు దీర్ఘము లయ్యె[1]న త్తఱిన్ 49

టీ. పడమరవెట్టన్ = పశ్చిమదిక్కుయొక్క వేఁడిమిచేత, అయ్యుడుకుఁబ్రాశ నము=ఆయుడుకుటన్నమును (అనఁగా వేఁడిగాలి ననుట), ఒల్లక=తిననొల్లక, కూటివేదలై = కూటికినొచ్చినవై, బడలికన్ = ఆయాసముచేతను, ఊడు = వీడిపోవుచున్న అచ్చి లువప్రగ్గములన్=ఆపాము లనియెడు ప్రగ్గములను, రవియాజ్ఞన్=సూర్యునియాజ్ఞచేతను, మాటికిన్ = ప్రతిపదమున, ముడియిడన్ = ముళ్లువేయుటకు, పిచ్చుగుంటు = అనూ

1. నయ్యెడన్.

రుఁడు, రథముల్ = అరదమును, నిలుపన్ = నిలుపఁగా, పయనంబు = ప్రయాణము, సాఁగమిన్ = సాఁగకుండుటచేత, జడను వహించెన్ = జాడ్యమును బొందెను, నాఁగన్ = అనఁగా, అత్తఱిన్ = ఆగ్రీష్మకాలమందు, దివసంబులు = వాసరములు, దీర్ఘము లయ్యెన్ = పొడవునాయెను.

తా. గ్రీష్మకాలంబున నహస్సు వృద్ధిఁ బొందుటకుఁ గారణమును దెల్పుచున్నాఁడు. పటమటిగాలి వేఁడియగుటవలన నాయశన మొల్లక యన్నము లేనివియై యున్నందువలన బడలికచేత ముళ్ళు వీడిపోవుచున్నట్టి రథములకుఁ గట్టియున్న సర్పములను దివసేశ్వరునియాజ్ఞచేత మాటిమాటికి ముడియిడుట కనూరుఁ డరదము నిలుపఁ బ్రయాణము సాఁగనిహేతువుచేత జడత్వము వహించెనో యనునటుల నాగ్రీష్మసంబంధి యగు దివసంబులయం దహస్సు పొడుగయ్యెను.

క. తరణిఖరకిరణశిఖి జగ, మెరియింపఁగఁ బొడమి గాలి నెగసినభసితో
త్కర మనఁగ శాల్మలీతరు,పరిణతఫలతూల మర్కపథమున కెగసెన్.

టీ. తర...శిఖి - తరణి = సూర్యునియొక్క, ఖర = తీక్ష్ణమైన, కిరణ = కిరణములను, శిఖి = అగ్ని, జగము = జగత్తును, ఎరియింపఁగన్ = దహింపఁగా, ని. 'ద్యుమణిస్తరణిర్మిత్రః, తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వ' త్తనియు నమరుఁడు. పొడమి = జనియించి, గాలిన్ = వాయువుచేతను, ఎగసినభసితోత్కరము = ఎగసినట్టిభస్మసమూహము, అనఁగన్ = అనునట్లు, శాల్మ...ము - శాల్మలీతరు = బూరుగుచెట్లయొక్క, పరిణత = పరిపక్వములైన, ఫల = ఫలములయందలి, తూలము = దూది, అర్కపథమునకున్ = సూర్యమార్గమునకు, ఎగసెన్ = ఎగిరెను.

తా. బూరుగుకాయలు పగిలి యందున్నదూది యాకసమున కెగయఁగా సూర్యకిరణంబు లనునగ్ని జగంబుల దహింప నాసమయంబున జనియించి గాలిచేత నెగసినభస్మసమూహమో యనునటుల నుండును.

చ. భరితనిజాంబుబింబితవిభాకరబింబవిజృంభితప్రభాం
కురముల నధ్వనీనకృతకూపకపంక్తులు వొల్చె నబ్ధిరా
డ్వరవహభరంబున న్బొడము వెచ్చకు శాంతి యొనర్ప వాహినీ
తరుణులు మేన దట్టముగఁ దాల్చినముత్తెపుఁ జేరులో యనన్. 51

టీ. భరిత...లన్ - భరిత = సంపూర్ణమైన, నిజ = తమయొక్క - చెలమలయొక్క యనుట, అంబు = నీళ్లయందు, బింబిత = ప్రతిఫలించిన, విభాకరబింబ =

1. వొల్చు.

సూర్యబింబముయొక్క, విజృంభిత = ప్రకాశితములగు, ప్రభా = కాంతులయొక్క, అంకురములన్ = మొలకలచేతను, అధ్వ...పజ్క్తులు - అధ్వనీన = పథికులచేతను, కృత = ఉదకపానని మిత్తముగాఁ జేయఁబడిన, కూపకపంక్తులు = చెలమలచాళ్లు' ని. 'కూపకాస్తు విదారికా' యని యమరుఁడు. అబ్ధి...నన్ - అబ్ధిరాట్ = సముద్రుని యొక్క, విరహాభరంబునన్ = విరహాతిశయముచేత, పొడమువెచ్చనన్ = జనియించిన వేఁడిమికి, శాంతియొనర్పన్ = ఉపశమనముఁజేయుటకు, వాహినీతరుణులు - వాహినీ = నదులనియెడి, తరుణులు = స్త్రీలు, మేనన్ = శరీరమందు, దట్టముగన్ = నిండారఁగా, తాల్చిన = ధరియించిన, ముత్తెపుఁజేరులో యనన్ = ముత్యపుదండలో యనునటుల, దొల్చున్ = ఒప్పును.

తా. ఉదకపానముఁ జేయుటకై పథికులచేత నదులయందుఁ జేయఁబడిన సంపూర్ణములగు చెలమలచాళ్లు తమయందు సూర్యప్రభాంకురములు ప్రతిఫలింపఁగా నిజనాథుఁ డగుసముద్రునితో గ్రీష్మకాలమందుఁ గలియకుండుట యను విరహముచే జనియించిన వేఁడిమికి శమనముఁ జేయుకొఱకు నదు లనియెడు స్త్రీలు స్వశరీరములందు నిండారఁగా ధరియించిన ముత్యపుదండలో యనునటులఁ బ్రకాశించుచుండును.

మ. అతివృష్టి న్మును వార్ధిఁ గూర్చునెడ కాఁడౌటం [1]దముం గూర్చున
న్మతి లంచంబుగ హేమటంకములు మింటం బొల్చుపర్జన్యదే
వత కీ నెత్తినకేలనాఁ బొలిచె నిర్వారిస్రవంతి న్పయ
శ్చ్యుతి నమ్రచ్ఛదదృశ్యకర్ణికములై యున్నాళనాళీకముల్. 52

టీ. అతివృష్టిన్ = అనుశయం బగువానలచేతను, మును = మునుపు, వార్ధిన్ = సముద్రుని, కూర్చు = పొందించునట్టి, ఎడకాఁడౌటన్ = కుంటెనకాఁడవుటచేతను తమున్ = తమ్మును, కూర్చున్ = పొందించును, అన్ = అనునట్టి, మతిన్ = బుద్ధిచేతను, లంచంబుగన్ = ఉత్కోచముగ, హేమటంకములు = స్వర్ణటంకములు, మింటన్ = అంతరిక్షమున, పర్జన్యదేవతకున్ = పర్జన్యుఁ డనుదేవతకు, ఈన్ = ఇచ్చుకొఱకు, ఎత్తినకేలు అనాన్ = ఎత్తినహస్తమనఁగా, నిర్వారి = ఉదకములేని, స్రవంతిన్ = నదియందు, పయశ్చ్యుతిన్ = నీళ్లుతఱుగుటచేతను. నమ్ర...లై - నమ్ర = వంగిన, ఛద = ఱేకులమీఁద, దృశ్య = కనఁబడుచున్న, కర్ణికములై = దుద్దులుగలవై, ఉన్నాళనాళీకముల్ - ఉత్ = పైకి నిగిరిన, నాళ = తూండ్లు గల, నాళీకముల్ = కమలములు, పొలిచెన్ = ఒప్పెను.

---

1. దమిన్.

తా. పూర్వ మతిశయంబుగ వర్షించి మేఘుఁడు సముద్రమునకును నదులకును సంధానముఁ జేసెఁ గాన మరల నాలాగు జేయు మని వేఁడి పర్జన్యునకు లంచ మిచ్చుటకై బంగారు నాణెములఁ జేత లం బట్టి యెత్తినవో యనునటుల నుండునదులయం దున్ననీ రినుకఁగాఁ గాఁడలు హస్తములవలెను జేకులు వ్రేళ్లవలెను దుద్దులు వరాలవలె నొప్పుచుండును.

సీ. నులివాడునాఁచు[1]పొల్పుల గొంతొగర్చి లేఁ
బొలవల్పుగాలి [2]వేఁ బోక యొదిగి
కడకువెళ్లఁగ నొక్క కడనుండి త్రొక్కుచు
నులుచలఁ జిఱుతగుల్లల నమలుచు
నెండ్రి కాలిఱికిన నెగసి యొక్కించుక
తొలఁగి శితత్రోటిఁ దూఁటి తినుచుఁ
దడి యింకునిలఁ జేమకూమడివోనితమ్మిగుం
పులను జీలుగుల నెండలు గడపుచుఁ
తే. దనరుబకపంక్తులకు జాను దఘ్ను మయ్యెఁ
జెలువుగమి, యుడుములన రేల్దరిగెఁ గుక్క
వసికి బావులఁ బడుటకుఁ బసులరొగవు
లెఱలకు మొసళ్లు; పలుఁగుమీఁ నొబ్బెటియఁ దూఱె. 53

టీ. నులి . . లన్ - నులివాడునాఁచు = కొంతవాడిన నాఁచుతీఁగయొక్క, పల్పులన్ = బొబ్బరలచేత, గొంతొగర్చి = గొంతొగరించి, లేఁబొలవల్పుగాలిన్ = లేఁత మాంసపువాసన గలవాయువుచేత, వేఁ బోక = శీఘ్రముగఁ జనక, ఒదిగి = శరీరము వంచికొని, ఒక్కకడనుండి = ఒకచోటునుండి, కడకువెళ్లఁగన్ = తుదముట్టునట్లుగ, త్రొక్కుచున్, ఊలచలన్ = ఊలచ లను పేరు గల చేఁపలను, చిఱుతగుల్లలన్ - చిఱుత = పిన్నలైన, గుల్లలన్ = నత్తగుల్లలను, నమలుచున్ = భక్షించుచు, ఎండ్రి = ఎండ్రకాయ, కాలిఱికిన = తన కాలుపట్టుకొన్న, ఎగసి = ఒక్కించుక తొలఁగి, శితత్రోటిన్ = వాఁడి ముక్కున, తూఁటి = పొడిచి, తినుచున్ = నమలుచు, ని. 'చంచుస్త్రోటిరుభేస్త్రియా' మ్మని యమరుఁడు. తడి యింకునిలన్ = తేమ యింకునట్టిభూమియందు, చేమమడివోని = చేమకూర మడివంటి, తమ్మిగుంపులను = తామరగుంపులయందును, జీలుగులన్ = జీలుగుచెట్ల యందును, ఎండలు గడపుచు, తనరు = ఒప్పుచున్న, బకపంక్తులకున్ = కొంగగుంపు

1. వల్లుల. 2. వే పోక నెఱిఁగి, పొలవల్పు గాలికిఁ బోక మగిడి.

లకు, చెఱువుగమి = చెఱువులగుంపు, జానుదఘ్నమయ్యెన్ = మోఁకాలిబంటిదాయెను, ఊడుములనన్ = ఊడుములవలెనే, మొసళ్ళు = మకరములు, పసులయెరవు = పశువుల యెరవుపెంటలలోని, ఎఱ్ఱలకున్ = ఎఱ్ఱలకు, కుక్కవసికిన్ = కుక్కల యుత్సాహమునకు బావులఁ బడుటకున్ = కూపములయందుఁ బతనమగుటకు, రేల్ = రాత్రులయందు, తిరిగెన్ = సంచరించెను, మలుఁగుమీన్ = మలుఁగను పేరుగల చేఁప, బొఱియఁ దూఱెన్ = బొఱియలో దూఱెను.

తా. ఆగ్రీష్మవాసరంబులయందు నులివాడిన నాఁచుఁ దిని గొంతుక యొగశెక్కి లేఁతమాంసపువాసన గల గాలిచేత వేగిరముగాఁ బోక యొదిగి కడముట్టఁ ద్రొక్కుకొని పోయి యొకచోట నున్న యులుచలను నత్తగుల్లలను నమలి తిని, యొండ్రకాయ తనకాలు పట్టుకొనఁగా నెగసి కొంతదూరమున నిల్చి ముక్కునఁ బొడిచి దానిం భక్షించి, చేమకూర మళ్లవలెఁ బడియారిన తామరగుంపుల క్రిందను జీలుగుబెండుచెట్లక్రిందను నెండలకు దాఁగియున్న కొంగలకుఁ జెఱువులు జానుదఘ్నము లాయె ననియుఁ గుక్కలకు వెఱచి మొసళ్ళు బావులలోఁ బడుటకుఁ బసపుల యెరవులలోని యెఱ్ఱలకుఁగా సంచరించె ననియు, మలుఁగుమీను బొక్కలోఁ బ్రవేశించె ననియును దాత్పర్యము. అలం. స్వభావోక్తి.

ఉ. మీటగుమీల నెల్ల మును మ్రింగి క్రమంబున నైనయెండ పె
న్నీటికవెంటఁ దోఁచుతొగవేరుబడి న్గొడుపై చెలంగఁగాఁ
ద్రోటికఁ గర్దమద్రవము [1]తోనె నశించిన బొమ్మడాయ డా
[2]త్యూకటకులంబులం దినె బకోటకులంబు జలప్రదంబులన్. 54

టీ. బకోటకులంబు = పెద్ద కొంగలగుంపు, ని. 'బకోటస్తు మహాబకః' యని నిఘంటువు. మీటగు = గొప్పలైన, మీల నెల్లన్ = చేఁపలనన్నిటిని, మును మ్రింగి = ముందు మ్రింగి, క్రమంబునన్ = వరుసగా, ఐన = ఐనట్టి, ఎండ పెన్నీటికవెంటన్ = ఎండచేత నైన పెద్దబీటికలచాలున, తోఁచు = కనుపించెడి, తొగవేరుబడిన్ = కలువవేరు వెంటను, గొడుపై = గొడుపువలెనై, చెలఁగఁగాన్ = ఒప్పఁగా, త్రోటికన్ = ముక్కుచేతను, కర్దమద్రవముతోనె = బురదపడితోనె, నశించిన = చనిపోయిన, బొమ్మడాయ = బొమ్మడాయ లను పేరుగల చిన్నచేఁపలయొక్కయును, డాత్యూకట = చేఁదుచేఁపల యొక్కయు, కులంబులన్ = గుంపులను, ని. 'బొమ్మడాయస్త్వష్టమత్స్యే డాత్యూకటస్తిక్తమత్స్యకే' యని విశ్వము. జలప్రదంబులన్ = మడుఁగులయందు, తినెన్ = భక్షించెను. (క్రమంబున నానె నను పాఠమున ఆనెను ప్రాఁగె నని యర్థము = డాత్యూకటకులంబు తేజెన నను పాఠమున జెన యనఁగా వంకరగుడ్డులలోని రక్తవిశేషము.) అలం. స్వభావోక్తి.

---

1. తోనెనఁబుంచిన. 2. కూటకులంబు తేజెన.

తా. పెద్ద కొంగలగుంపు మడుఁగులయందుఁ దొలుత గొప్పచేఁపల నెల్ల భక్షించి గ్రీష్మకాలము రాఁగా నీళ్లింకిన పిమ్మట నేల పగులుటవలన బొరియలలోఁ గలువవేళ్ల వెంటఁ గొడుపువలె నొప్పుచున్న బొమ్మడాయ లనియెడి పిన్నచేఁపలను, బురుఁదతోఁగూడ నెగిరిన చేఁదుచేపలను భక్షించెను.

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామా(మ)ంబుకుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్రనతికృత్ప్రోద్గీతగేయౌఘముల్. 55

టీ. ప్రాతర్వేళలన్ = ప్రాతఃకాలములయందు, అట్టివెట్టన్ = అటువంటి గ్రీష్మమునందు, మరుద...లన్ - మరుత్ = వాయువుచేతను, అధః = చెట్లక్రిందను, పుంజీభవత్ = రాసులుగాఁబడిన, పాటలవ్రాత = కలిగొట్టుపువ్వులచేత, ఆమ్రేడిత = రెండుమూఁడువరుసలుగా, సిక్త = పడుపఁబడిన, భూ = భూమియందు, సురభిళ = సౌరభ్యముగల, ఆరామ = ఉద్యానవనముయొక్క, అంబుకుల్యా = నీటికాలువలయొక్క, బహు = అనేకములైన, స్రోతః = ప్రవాహములయొక్క, సంధులన్ = మధ్యప్రదేశములయందు, అంధు...ల్ - అంధు = బావులయొక్క, యంత్ర = ఏతములయొక్క, నతి = వంగద్రొక్కుటను, కృత్ = చేయుచున్న జనులచేతను, ప్రోద్గీత = ఎత్తిపాడఁబడినట్టి, గేయ = గానములయొక్క, ఓఘముల్ = సమూహములు, కుంభో...ధ్వని - కుంభ = ఘటములయొక్క, ఉంభన = మునుఁగుటచేతను, ఉద్భూత = పుట్టినట్టి, అంబుధ్వని = నీళ్లచప్పుడు, వాద్యమై = వాద్యధ్వనివలెనై, సొగసై = సొంపుగను, పాటిల్లెన్ = ఒప్పెను. ని. 'ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తం, కుల్యాల్పాకృత్రిమాసరిత్, పుంస్యేవాన్ధుః ప్రహిఃకూప' యనియు నమరుఁడు. అలం. స్వభావోక్తి.

తా. వాయువుచే రాల్పఁబడిన కలిగొట్టుపువ్వులచేత రెండుమూఁడు మాఱులు తడుపఁబడినదై యున్న భూమియందుఁ బరిమళించుచున్న యుద్యానవనములయందలి వృక్షములకు నీళ్లుగట్టుటకై యేతములు ద్రొక్కుచున్నవాండ్రు గానముఁ జేయఁగ బొక్కెనల ముంచునపుడు జనియించిన నీళ్లచప్పుడను తాళధ్వని గలదియై సొగసుగా నుండెను.

తే. మెండుమీఱిన పగటి బీఁటెండ దాఁకి
యెుల్లఁబోయిన లేఁబొండుకమ్మలెపాదల

తుదలఁ జప్పటలై కడుఁ గొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్లు. 56

టీ. మెండు...రెండ- మెండుమీఱిన=దట్టమైన, పగటి=పవటియొక్క, బీఱెండ= మిడియెండ, తాఁకి=కొట్టి, ఒల్లఁబోయిన = మూర్ఛపోయిన, లేబొండు...లన్-లే బొండుమల్లెపొదల = లేఁతబొండుమల్లెపొదలయొక్క, తుదలన్ = కొనలయందు, చప్పటలై = అణఁగినవై, కడుదొడ్డలగుచున్ = మిగులగొప్పవై, అగ్గిబొబ్బలట్లు = కాలినబొబ్బలవలెను, మొగ్గలగములు = మొగ్గలగుంపులు, పొడమెన్ = పుట్టెను. అలం. ఉత్ప్రేక్ష.

తా. ఆవేసవియందు దట్టమైన పేరెండ దాఁకి వాడినబొండుమల్లెలపొదల కొనలయం దణఁగినవై మిగుల గొప్ప లగుచు నగ్గి బొబ్బలవలె నామొగ్గలగుంపులు పుట్టెను.

మ. సుడి నాభిచ్ఛలన న్సరోజములు చక్షుఃప్రక్రియ న్నాఁచు క్రొ
మ్ముడిదంభంబునఁ జక్ర ఫేనపటలంబు ల్చన్నులు న్నవ్వుగా
నడరం జేసి నిదాఘభీతి సలిలంబు ల్బాగామిబీజార్థమై
కడవం బెట్టినవారిదేవతలు నాఁ గాంతాళి యొప్పు(ప్పె) న్ప్రపన్.

టీ. సుడి...లనన్ - సుడి = నీళ్లసుడి, నాభిచ్ఛలనన్ = బొడ్డు లనియెడి వ్యాజముచేతను, సరోజములు = పద్మములు, చక్షుఃప్రక్రియన్ = నేత్రములరీతిచేతను, నాఁచు = ప్రాఁచి, క్రొమ్ముడిదంభంబునన్ = కొప్పునువ్యాజముచేతను, చక్ర...ల్ - చక్ర = చక్రవాకములయొక్కయు, ఫేన = నురుఁగుయొక్కయు, పటలంబుల్=సమూహములు, (క్రమముగా) చన్నులు = చనుదోయి, నవ్వుగాన్ = మందహాసమునుగా, అడరంజేసి = అమరునట్లు చేసి, నిదాఘభీతిన్ = గ్రీష్మమువలని భయముచేత, ఆగామి= ముందటికి, బీజార్థమై = విత్తనముకొఱకై, సలిలంబు = జలమును, కడవన్ = కుండలో, పెట్టిన = ఉనిచినట్టి, వారిదేవతలు నాన్ =ఉదకాధిదేవతలో యనునట్టుల, ప్రపన్ = చలిపందిళ్లయందు, కాంతాళి = స్త్రీసమూహము, ఒప్పున్ = పొల్పగును. అలం. సాపహ్నవోత్ప్రేక్ష.

తా. జలదేవతాలక్షణములు స్త్రీలయవయవములకుఁ జెప్పంబడెను గానఁ జలిపందిళ్లయందు నీళ్లు పోయుచున్నస్త్రీలు గ్రీష్మమునందు సకలము నష్ట మగు నని భయపడి ముందటివిత్తనముకొఱకు నీళ్లు కడవల నించికొనినవారై సుడులు, సరోజములు, నాఁచు, జక్కవలు, నురుఁగు ననువిశేషములను దమశరీరములయందే నాభులు, కన్నులు,

క్రొమ్ముడి, స్తనములు, హాసము ననుమిషచేత నుంచుకొని యుండెడివారిదేవతలో యను నటులఁ బ్రకాశించుచుందురు.

సీ. సెగ కుల్కి మఱుఁగుఁ జొచ్చినజహ్నుగవిజల
  సరణి మల్లెలతోడిజడలు మెఱయ
వలిచన్నుకొమరు ముచ్చిలిన ది మ్మను తెఱం
  గున ముంచుగరిగ కాఁగుల మునుంగ
ధారలోఁ దోఁచు కర్ద్రభుకులు వాసితో
  త్పలపత్త్రపతనసంభ్రాంతి నొసఁగఁ
దెలిమోముపస మెచ్చి తలయూఁచు టెఱిఁగి మా
  నక నవ్వనేర్పు డెందపులఁ గరఁప
తే. దెఱవ లిటు నీరు వోయుపందిరియ చేరి
యవలఁ గొఱగాక పిచ్చుగుంటలై యనంగుఁ
డనుపుగొనఁ జొచ్చెఁ గల్లగుట్టమర వారి
కధ్వగులు లాఁచి యిడువిడియముల పేర. 58

టీ. సెగకుఁ = గ్రీష్మమునకు, ఉల్కి = భయపడి, మఱుఁగు...ణిఁ-మఱుఁగు జొచ్చిన, జహ్నురవిజలసరణిఁ = గంగాయమునలరీతిని, మల్లెలతోడిజడలు = గంగవలె మల్లెలు, యమునవలె జడలు, మెఱయఁ = ఒప్పఁగా, వలిచన్నుకొమరు = వట్రువలైన తమస్తనముల సౌందర్యమును, ముచ్చిలినది = హరించినది, ఇమ్మను తెఱంగునఁ = అది మరల నిమ్మనుకరణిని, ముంచు = మునుంగఁజేయునట్టి, గరిగ = కడవముంత, కాఁగుల మునుఁగఁ = నీళ్లకాఁగులలో మునుఁగఁగా, ధారలోఁ = పథికులకుఁ బోయు నీటి ధారలో, తోఁచు...లు-తోఁచు = ప్రతిఫలించిన, కద్రుకులు = నేత్రప్రభలు, వాసి...తిఁ-వాసిత = వాసించుచున్న, ఉత్పలపత్త్ర = కలువఱేకులయొక్క, పతన = పడుచున్న వనియెడి, సంభ్రాంతిఁ = భ్రమను, ఒసఁగఁ = కలుగఁజేయఁగా, తెలిమోముపస= ఆస్త్రీలముఖసౌందర్యమును, (నీరుఁ ద్రాగుచున్నవారు సూచి), మెచ్చి = ఆనందించి, తలయూఁచు టెఱిఁగి = వారియభిప్రాయముఁ గని, మానక = నీరుపోయుట చాలింపక, నవ్వనేర్పు = నవ్వెడు చమత్కారము, డెందములఁ = పథికులమనంబులను, కరఁపఁ= కరఁగింపఁగా, తెఱవలు = స్త్రీలు, ఇటు = ఇట్లు, నీరుపోయుపందిరియ చేరి = నీళ్లు పోయుచుండెడిపందిటిఁ బ్రవేశించి, అవలఁ = మఱియొకతావునకు, కొఱగాక = పనికి రాక, పిచ్చుగుంటలై = పంగువై, అనంగుఁడు = మన్మథుఁడు, కల్లగుట్టమర = అబద్ధము గనఁబడకుండ, వారికిఁ = ఆస్త్రీలకు, అధ్వగులు = తెరువరులు, లాఁచియిడు=ప్రీతితో

నిచ్చునట్టి, విడియముల పేరన్ = తాంబూలము లనువ్యాజముచేతను, అనుపుగొనన్ = సుంకముం దీసికొనుటకు, చొచ్చెన్ = ప్రవేశించెను. అలం. సాపహ్నవోత్ప్రేక్ష.

తా. మల్లెపూదండలు గలకొప్పులు గంగాయమునలు రెండును నెండకు వెఱచి స్త్రీలమఱుంగుం జొచ్చెనో యనునటుల నొప్పె ననియు, నీళ్లకాగులలో ముంచెడి ముంతలు మాచక్కదనమును మీరు దొంగిలినారుగాన మరల నిమ్మని చన్నులు కడవలలోం జొచ్చి బాధించున ట్లుండె ననియు, నీళ్లుపోయంగ నాధారయందుం గనుపించుచున్న కన్నులకాంతులు పరిమళమునకుంగాం గట్టినికలునిలో యనున ట్లుండె ననియు, పథికు లా స్త్రీలముఖసౌందర్యముం జూచి తలయూంచంగా నుంచారంబట్టి నీళ్లుత్రాగుచుం జాలు నని యూంచిన ట్లూహింపక మానక నీళ్లుపోయుచు నవ్వాడు నేర్పు పథికులమనంబులం గరగింపంగ స్త్రీలకుం బాంధులు మంచితనమునకై యిచ్చువిడియములు పిచ్చుకుంటై మఱి యొకచోటికిం బోక పడియున్న మన్మథుండు లీసికొను సుంకమువలె నుండెను.

చ. తొడిబడ నమ్మ [1]లక్క లని 1 తూలుచు దీనత దోయి లొగ్గుచున్
వడ మఱి తేరందేర నలవాక్యము లెన్నక మోము గుబ్బలున్
[2]గడుకొనుకక్ష దీధితు లెగాడగం గన్గొనుచిట్టకంపుం ద్రాం
గుడుం గని సన్నల న్నగిరి 1 [3]కొందఱు పాంథుం బ్రపాప్రపాలికల్.

టీ. తొడిబడన్ = దాహాత్వరచేత నైనతొట్రుపాటుచేత, తూలుచున్ తూంగాడుచు, అమ్మలు ... లు, ఏని = అను చు, దీనతన్ = దైన్యముతో, దోయిలొగ్గుచున్ = దోసిలిపట్టుచు, నడ మఱి తేరన్ = నీళ్లు త్రాగుటచే నట్టి వెట్ట దీరంగా, అలవాక్యములు = మునుపన్న మాటలను, ఎన్నక = విచారింపక, మోముగుబ్బలన్ = ముఖములను, స్తనములను, కడ...ధితులన్ - కడుకొను = బయలొలసిన, కక్షదీధితులన్ = చంకలమెఱుపులను, ఎగాడగన్ = పైనిం గ్రిందను, కన్గొను = చూచుచున్నట్టి, చిట్టకంపుం ద్రాంగుడు = చేష్టలుగలత్రాంగుటను, చిట్టక మన, కపట మనియు నర్థము గలదు. కని = చూచి, పాంథు... = ... థికుని, సన్నలన్ = సంజ్ఞ చేతను, కొందఱు = కొందఱైన, ప్రపా ప్రపాలికలు = చలిపందిటియందు నీళ్ళుపోయుచున్న స్త్రీలు, నగిరి = నవ్విరి అలం. సూక్ష్మము.

తా. తొలుత నమ్మ యక్క యనుచు దీనభావముతో వచ్చి దాహాత్వరచేం దూలుచు దోసిళ్లయందు నీళ్లు పోయంగం గ్రాంగి బడలిక దీరంగా మునుపటిమాటల విచారింపక నీళ్ళుపోయు స్త్రీలయొక్క కన్నులు, మోములు, స్తనములు, చంకలు వీని

1. నమ్మయక్క. 2. దీప్తులు గ. 3. ప్రపాల్పక.

సెగాదిగఁ జూచి వికారముతోఁ బ్రాఁగుచున్నపథికునిఁ గని యాస్త్రీలు సైగతో నవ్వి రనియుఁ, బాంధుఁడు కాముకుఁ డనియుఁ, దొట్రుపాటుచేతఁ దొలంత నమ్మ యక్క యని వచించె ననియుఁ దాత్పర్యము.

తే. ఎసఁగు కట్టావి క్రియ నావిరెగయఁ బగటి
యెండ యుడుకాఱకుండు భూమండలమునఁ
బొలిచె మాపటఁబండువెన్నెల చకోర
పోతవితతికిఁ జాఁపట్టు వోసినట్లు. 60

టీ. ఎసఁగు = పెనముమీఁదఁ బిండిఁ బోయఁగఁ జుట్టు సెగసినట్టి, కట్టావిక్రియన్ = కట్టవలె లేచెడియావిరిపొగవలెను, ఆవిరెగయన్ = ఆవిరి యెగురుచుండఁగా, పగటి యెండ, ఉడుకాఱకుండు = వేఁడి యాఱకుండు నట్టి, భూమండలమునన్ = కాలిన పెనమువంటి భూమండలముమీఁద, మాపటన్ = రాత్రియందు, పండువెన్నెల = ముదురువెన్నెల, చకోరపోత వితతికిన్ = చకోరపుఁబిల్లలగుంపులకు, చాఁపట్టు = పలుచని దోసెలను, పోసినట్లు = పోసినట్టువలె, పొలిచెన్ = ఒప్పెను. అలం. వస్తూత్ప్రేక్ష.

తా. పెనముమీఁదఁ బిండిఁబోయఁగ సెగసినయావిరిపొగవలె నావిరి యెగయు చుండఁగా, బవటియెండ యుడు కాఱకుండెను గానఁ గాలినపెనమువలె నున్నభూమం డలమునందు రాత్రియందలి ముదురువెన్నెల చకోరపుఁబిల్లలగుంపులకుఁ బలుచని దోసెలను బోసిన ట్లొప్పుచుండెను.

సీ. పవలెల్ల దీర్ఘకాంశుబువు[1]చల్లుపోరాట
నలసి మృణాళికాజడము లైన
బాహువు ల్తమదుకూర్పరముల కెదురుగా
మలఁచి మూఁపులఁ గరతలము లునిచి
ప్రాల్మాలి మిగుల[1]నార్పనికమ్మ క్రొమ్ముడిఁ
దని మొగ్గవిరవాది దండవిరియ
ఘాతగంధామోచ్చి శీతల స్తనములు
వాందఁ గౌఁగిళ్లతో బోరగిల్లి

తే. నారికేళాసవపుఁదీపుఁ టూరు పొలయ
వలిపెయొంటొల్లెతో నుర స్థలులఁ గూర్కు

---

1. చల్లుపోరాడ సొలసి మృణాళికోజ్జ్వలము లైన. 1. నార్పమిఁ గమ్మక్రొమ్ము డి. పాఠాం.

ప్రియల వేకువఁ దొడ లెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపివెన్నెలబయళ్ల. 61

టీ. పవలెల్లన్ = పగటివేళలనెల్లను, 'క్వచిద్గకారో వ'యనుసూత్రమున గవర్ణమునకు పవర్ణము, దీర్ఘి...డన్ - దీర్ఘికా = డిగ్గియలయొక్క, అంబువు = నీటియొక్క, చల్లుపోరాటన్ = ఒండొరులపై నీరుచల్లుటయనెడి పోరాటమునందు, అలసి = బడలి, మృణా...లైన - మృణాళికా = తమ్మితూఁడులవలె, జడములు = చల్లనివి, ఐన = అయినట్టి, బాహువుల్ = భుజములు, తమ...కున్ - తమను = తమయొక్క, కూర్పరములకున్ = మోఁచేతులకు, ఎదురుగాన్, మలఁచి = మరలించి, మూఁపులన్ = భుజములపై, కరతలములు = అఱచేతులను, ఊనిచి = ఇడికొని, ప్రాల్మాలి = బద్ధగించి, మిగులన్ = మిక్కిలి, ఆర్పని = తడియాఱఁజేయనట్టి, కమ్మక్రొమ్ముడిన్ = పరిమళించుచున్నకొప్పునందు, తని...డ - తని = క్రొత్తలగు, మొగ్గ = మొగ్గలచేతఁగట్టిన, విరవాదిదండ = మల్లెపువ్వులదండ, విరియన్ = వికసింపఁగా, ధౌత...లు - ధౌత = కడుగఁబడిన, గంధ = పరిమళద్రవ్యములు గలవియయ్యు, ఆమోది = పరిమళించుచున్న, శీతల = చల్లనైన, స్తనములు = చన్నులు, పొందన్ = తగులునట్లుగా, కౌగిళ్లతోన్ = ఆలింగనములతోడ, బోరగిల్లి, నారికేళాసవపు = నారికేళమద్యమయమగు, తీపుటూరుపు ఒలయన్ = తీపుగలనిట్టూర్పు వెడలఁగను, వలిపె = సన్ననైన, ఒంటోల్లెతోన్ = ఏకవస్త్రముతోను, ఉరస్థ్సలులఁ గూర్కు = ఱొమ్ములపైనిద్రించుచున్న, ప్రియలన్ = ఇష్టులగు స్వస్త్రీలను, వేకువన్ = వేకువజాములయందు, తొడలు = ఊరువులను, ఎచ్చరించి = కదలించి, దఱపివెన్నెల బయళ్లన్ = పండువెన్నెల గలబయళ్లను, ఎలమిన్ = సంతోషముచేత, ధన్యులు = భాగ్యవంతులు, కలసిరి = రమించిరి. దఱపివెన్నెల యను పదమునకు లక్షణచేతఁ బండువెన్నెల యనునర్థము సిద్ధించును.

తా. వేఁడిమిగలిగియుండుటచేతఁ బగళ్లెల్లను నడబావులయందు జలక్రీడలుసేసి తూఁడులవలెఁ జల్లనైయున్నహస్తములఁ దమమోఁచేతుల కెదురుగ మరలించి భుజములపైఁ జేతుల నుంచికొని ప్రాల్మాలి తడిపోవున ట్లార్పఁబడమి వాసించుచున్నకొప్పునందున్న క్రొత్తలగువిరవాదిమొగ్గలు వికసింపఁగా కడుగఁబడిన పరిమళద్రవ్యములు గలవియయ్యు వాసనగలిగియున్న చల్లనైయున్న స్తనములు దాఁకుచుండున ట్లాలింగనముతో బోరగిల్లి పానముసేసిన నారికేళాసవముచేతఁ దీపుగలనిట్టూర్పు వెడలఁగా సన్ననైన యొంటివస్త్రముతోఁ దమఱొమ్ములపై నిద్రించుచున్న ప్రియురాండ్రను వేఁకువజాములయందుఁ దొడలసంజ్ఞచేత లేపి పండువెన్నెల బయళ్లను వారితో భాగ్యవంతు లగుపురుషులు రమించుచుందురు.

వ. అట్టిసమయంబున. 62

చ. హృదయము లెప్పు డున్గదియ కే తఱచౌ వెడకౌఁగిలింతలున్
గదిరెడుమేలు(ను)కార్యములఁ గల్గక మాటలయందె కల్గుపె
న్జదురులు వట్టిశైత్యములుఁ జాలఘనంబయి మండువేసవిన్
బొదలఁగ నిల్చె దంపతుల పొందు లనార్యులపొందుకైవడిన్. 63

టీ. మండువేసవిన్ = గ్రీష్మమందు, దంపతులపొందులు = సతీపతుల సంపర్కములు, అనార్యులపొందుకైవడిన్ = దుర్జనులకూటమివలె, హృదయములు = ఱొమ్ములు, ఎప్పుడున్=ఎప్పటికిని, కదియకే = సోఁకకయే (ఉష్ణదముచేత ననుట), తఱచౌ = మెండైన, వెడకౌఁగిలింపులున్ = వెట్టికౌఁగిలింతలును, మనస్సంగములేక యని యర్థాంతరము. కదిరెడు = ప్రాప్తమైన, మేలుకార్యములన్ = రతిక్రియలయందు, మంచిపనులయందు అని అనార్యపరము. కల్గక = లేక, మాటలయందె = ఒకప్రయోజనములేక మాటలనేర్పునందే, కల్గు = కలుగుచున్నట్టి, పెన్జదురులు = గొప్ప చాతుర్యములు, వాగాడంబరములని యర్థాంతరము. వట్టిశైత్యములు=వట్టిచల్లఁదనములు (క్రియలచేత లే వనుట), చాలఘనంబయి = మిగుల గొప్పవై, పొదలఁగన్ = పొందునట్లుగా, నిల్చెన్ = ఉండెను.

తా. గ్రీష్మమందు సతీపతుల సంపర్కములు దుర్జనులకూటమింబలె నెప్పటికిని మనస్సంగము లేక మెండైన వట్టికౌఁగిలింతలచేత ప్రాప్తమై మేలుకార్యముల లేక మాటలయందు మాత్రమేగల్గు చాతుర్యములచేతను జల్లఁదనముచేతను మిగుల గొప్పవై పొందునట్లుంబలె నుండెను.

ఉ. తీలగు కంతువెంబడిన తెమ్మెరలు న్రవిదీప్తి కల్కి పా
తాళముఁ బట్టుచుండఁ దమ తావులు మ్రుచ్చిలఁ బట్టి యోషధీ
పాలున కప్పగించె ననఁ బై సుడభిశ్వసనంబు సించెఁ గాం
తాలసవక్త్రసీమ విటు లార్చు నుశీరపుఁదాళవృంతముల్. 64

టీ. విటులు=పల్లవులు, కాంతా...మన్-కాంతా = ప్రియలయొక్క, అలస = బడలినట్టి, వక్త్ర=ముఖముయొక్క, సీమన్ = ప్రదేశమునందు, అర్చు...ల్-అర్చు = విసరునట్టి, ఉశీరపుఁ దాళవృంతముల్ = వట్టివేళ్లవిసనకఱ్ఱలు, తీలగు = బలహీనుఁడైనట్టి, కంతువెంబడిన = మన్మథునివెంటనే, తెమ్మెరలున్ = శీతవాయువులును, రవిదీప్తి కల్కి = సూర్యప్రతాపమునకు వెఱచి, పాతాళముఁ బట్టుచుండన్ = పాతాళలోకముఁ జేరఁబోవుచుండఁగా, తమ తావులు = తమవాసనలను, మ్రుచ్చిలన్ = అపహరింపఁగా, పట్టి = పట్టుకొని, ఓషధీపాలునకున్=చంద్రునికి, అప్పగించె ననన్ = అప్పగించె ననఁ

నటుల, పైఁ = ముఖముమీఁద, సురభి = వాసించుచున్న, శ్వసనంబు = గాలిని, నించెఁ = నిండించెను. అలం. ఉత్ప్రేక్ష.

తా. గ్రీష్మమందు బలహీనుఁడై పాతాళమునకు వెళ్లుచున్న మన్మథుని వెన్నంటి సూర్యదీప్తికి వెఱచి వలసపోవుచున్న వాయువులను, దమవాసనల దొంగిలికొని పోవుచున్న పని పట్టి తా మోహఘులు గనుకఁ దమకుఁ బ్రభువైన చంద్రునికి నప్పగించెనో యనునటుల విటులు స్త్రీలముఖములయందలి చెమటాఱవిసరెడు వట్టివేళ్లవిసనకఱ్ఱ లొప్పుచుండె ననిరి, సప్పగించిన సురభిశ్వసనము మలయమారుతము. స్త్రీలముఖములు చంద్రుఁడు. వాయువు దొంగ యనియును భావము.

చ. సమసి కథా(శా)వశిష్ట మగుచందనశైలసమీరణంబుఁ గృ
త్రిమగతి నింద్రజాలమునఁ దేఁదొడఁగె న్భువిఁ దాళవృంతజా
లము లది మాయయాటకుఁ దలంపఁ దదీయమయూరపింఛికా
భ్రమణమె సాక్షి గాదె నగరంబున నట్టికడింది వేసవిన్. 65

టీ. నగరంబునన్ = మధురాపురమున, అట్టి = అటువంటి, కడింది వేసవిన్ = కఠిన మగు గ్రీష్మకాలమునందు, సమసి = నష్టమై, కథా...బున్ - కథావశిష్టమగు = కథామాత్రమందు మిగులునట్టి, చందనశైలసమీరణంబున్ - చందనశైల = మలయ పర్వతమునందలి, సమీరణంబున్ = మందమారుతమును, భువిన్ = భూమియందు, తాళ...లు - తాళవృంత = విసనకఱ్ఱలయొక్క, జాలములు = సమూహములు, ఇంద్రజాలమునన్ = ఇంద్రజాలవిద్యచేత, కృత్రిమగతిన్ = మాయచేతను, ని. 'వ్యజనం తాలవృంతకం, చక్రం జాతం చ జాలకమ్మనియు నమరము. తేఁదొడఁగెన్ = తెచ్చుట కారంభించెను. అది = ఆవాయువులఁ దెచ్చునది, మాయ యాటకున్ = కపటమాటకు, తలంపఁగన్ = విచారింపఁగా, తదీయ...మె - తదీయ = ఆతాళవృంత సంబంధియైన, మయూరపింఛికాభ్రమణమె - మయూర = నెమలియొక్క, పింఛికా= పింఛముయొక్క, భ్రమణమె = తిరుగుటయె, సాక్షిగాదె = గుఱుతుగాదా.

తా. మిగుల కఠినమగు గ్రీష్మమందు మలయమారుతము నష్టమైపోఁగా దానిని మాయతో గారడివిద్యచేత విసనకఱ్ఱలు దెచ్చె ననియు, నది గారడమగుటకుఁ దాళవృంతముల చుట్టునుఁ గొనలయం దున్న నెమలిపింఛికయె సాక్షి యనియు, దాఁ గనుపింపక యుండి యిట్టివిద్యను జేసెననియును భావము. ఐంద్రజాలికునకు నెమలిపింఛము కావలయు ననుటకుఁ బ్రయోగము. 'శ్లో. భ్రామయన్ బర్హిబర్హాణి మోహయన్ జంతుసంతతిం, విస్తారయన్ సభాం కశ్చి ద్దాయయా వైంద్రజాలికః' అని.

తే. అట్టివేసవి బెడిదంపుఁ వెట్టకతన
హస్తము సెమర్పఁ బ్రిసారెకుఁల స్తకంబు
దుసికిలఁగఁగాదె సవరింప నివసము గాక
పుష్పబాణుని చెఱకువిల్లుపుడమిఁ బడియె. 66

టీ. అట్టివేసవిన్ = అట్టిగ్రీష్మమందు, బెడిదంపువెట్టకతనన్ = కఠినమగువెట్ట చేతను, హస్తము = (మన్మథుని)చేయి, చెమర్పన్ = చెమటఁబోయఁగా, సారెకున్ = పలుమాఱును, లస్తకంబు=ధనుర్మధ్యము. ని. 'లస్తకస్తుధనుర్మధ్య'మ్మని నిఘంటువు. దుసికిలఁగఁగాదె = పిడికిటనుండకజాఱిపోవఁగఁదా, సవరింపన్ = చక్కఁజేయుటకు, వసము గాక = వశముగాక, పుష్ప...ల్ - పుష్పబాణుని = మన్మథునియొక్క, చెఱకువిల్ = ఇక్షుధనువు, పుడమిన్=భూమియందు, పడియెన్=పతనమాయెను. అలం. హేతూత్ప్రేక్ష.

తా. అనఁగా నది భూమియందుఁ జెఱకు పండెడుకాల మనుట.

మ. 'తరుణుల్ దల్లియొఱ న్కుచంబు లునుపం దచ్ఛైత్యముల్ దీములై
పెరరేఁపం జనుదెంచెఁ గాక రవిదీప్తిం గ్రుంకి పాతాళగ
హ్వరముం దూఱినవారి నీయదుకుఁద్రాళ్లా తెచ్చు' నా దీర్ఘత
చ్చిరకృష్టిం గనునట్టిశైత్య మలరించె న్నూతులం దత్తఱిన్. 67

టీ. తరుణుల్=యువతులు, తల్లియొఱన్ = నూతులపైఁ గట్టియున్న పెద్దయొర మీఁదను, కుచంబులునుపన్ = నీళ్లుచేదునప్పుడు స్తనములానింపఁగా, తచ్ఛైత్యముల్ - తత్=ఆకుచములయొక్క, శైత్యముల్ = చలువలు, దీములై=ఆకర్షములై-పాటిగువ్వలై, (పాటిగువ్వయనఁగా స్వజాతిపక్షుల నాకర్షించుటకుఁ బెంపఁబడినపక్షి. ఉదకశైత్యమున కాకర్షకంబులై యనుట), పెరరేఁపన్ = ప్రేరేపింపఁగా, చనుదెంచెఁగాక = శైత్యము వచ్చెఁగాక, అట్లు గాకుండెనేని, రవిదీప్తిన్ = సూర్యప్రతాపముచేతను, గ్రుంకి=అణఁగి, పాతాళగహ్వరమున్ = పాతాళబిలమును, ని. 'దేవఖాతబిలేగుహా, గహ్వర' మ్మని యమరము. దూఱినవారిన్=చొచ్చియున్నజలమును, ఈయదుకుఁద్రాళ్లా=ఈముళ్లు వేసిన త్రాడులా, తెచ్చున్ = తేఁగలవు, నాన్ - అనఁగా, దీర్ఘ...ష్టిన్-దీర్ఘ = పొడవైన, తత్=ఆత్రాళ్లయొక్క, చిర = తడవైన, కృష్టిన్=చేఁదుటచేతను, కనునట్టి శైత్యములు= పొందునట్టిచల్లఁదనములు, అత్తఱిన్ = ఆగ్రీష్మమున, నూతులందున్ = చేఁదుడుబావుల యందు, అలరించెన్ = సంతోషపెట్టెను. అలం. హేతూత్ప్రేక్ష.

తా. శ్లో. 'కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీకుచా, శీతకాలేభవే దుష్ణ ముష్ణకాలేతు శీతల'మ్మను న్యాయముఖుంబట్టి బావులయందు నీళ్లుచేఁదెడి తరుణుల

యొక్క కుచములు తల్లియొఱమోఁపఁగ నాకుచశైత్యములు పాటిగువ్వలై సూర్యకిరణములకు వెఱచి పాతాళము దూఱుకొనియున్న జలమును రేపఁగాఁ జనుదెంచెఁగాని యీముల్లువేసిన త్రాళ్లు తెచ్చునా యనునట్లు నూతులయందున్న నీళ్లచల్లఁదన మట్టి గ్రీష్మమునందు మిగుల సంతోషము పెట్టె నని తాత్పర్యము. నూతులలో నీళ్లు పాతాళము నంటె నని భావము.

మ. స్వనిదానోగ్రనిదాఘువై ఖరిన యూష్మన్మల్లిక ల్కామినీ
కనదానీలకచాగ్రపఙ్క్తి నెఱయఁజల్లాఁ బాపఁగాఁ, బాటల
ల్ఘనతం దేనియసోనఁ గూర్చునది యాఁగా నాభియు న్నిర్విషం
బును దోఁబుట్టువులయ్యు వేర్పడ గుణంబు ల్పూనఁగాఁ జూడమే.

టీ. స్వని...న - స్వ=తమకు, నిదాన = కారణమైనట్టి, నిదాఘువై ఖరిన = వేసవివలెనే, మల్లికల్=మల్లెలు, ఊష్మన్ = వేఁడిమిచేత, కామినీ...న్ - కామినీ = స్త్రీలయొక్క, కనత్=ఒప్పుచున్నట్టి, ఆనీల = సర్వము నల్లనైన, కచాగ్రపఙ్క్తుల్ = తలవెండ్రుకలకొసలను, నెఱియల్గాన్ = చీలికలుగా, పాపఁగాన్ = పాయఁజేయఁగా, పాటలల్ = కలిగొట్టుపుష్పములు, 'పుష్పే క్లీబేపి పాటలా' అని యమరము. ఘనతన్= దట్టముగా (అధికతచేత అనఁగా ఔదార్యముచేత ననియు) తేనియసోనన్ = మధుస్రవముచేతను, కూర్చున్=ఆకచాగ్రపుబద్దలను మరలఁ గలియునట్లు చేయును, అది యాఁగా = ఒక ఋతువునందుఁబుట్టినద్వివిధంబులగు పుష్పములను విరుద్ధముగ నుండు రెండుగుణము లెట్లు గల్గు ననఁగా యుక్తంబే, నాభియున్ = విషమును, నిర్విషంబును= అమృతమును, తోఁబుట్టువులయ్యున్, గుణంబులు = నైజగుణంబులను, వేర్పడన్ = వేఱుపడునట్లు, చూపఁగాన్ = ప్రకటించుపఁగను, చూడమె = చూడలేదా (చూచితి మనుట.) అలం. వికస్వరము.

లా. గ్రీష్మమున మల్లెలు పాదిరిపువ్వులును మెండుగ నుండుటవలన మల్లెలు ధరి యింపఁగా నవి విచ్చుటవలన స్త్రీలతలవెండ్రుకలు వదులు ననియు పాదిరిపువ్వుల ధరి యింపఁగా నందున్న దేనెసోనచేత విచ్చియున్నకచాగ్రములు మరలఁ గదిసియుండు ననియు. దోఁబుట్టువులైనను భిన్నగుణంబులు గల్గియున్న విషామృతములంబలె మల్లెలు పాదిరిపువ్వులు నొకఋతువునందుఁ బుట్టినవైనను భిన్నగుణంబులను బ్రకాశింపఁజేయు చుండెను.

శా. తారుణ్యాలిగచూతనూత్నఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుహ్రాతమాంసచ్ఛేదపాకోద్గతో

ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్. 69

టీ. కేళి...ల్ - కేళికాంతార = శృంగారవనములయొక్క, అభ్యంతర = నడుమ నున్న, వాలుకా=ఇసుకయందు, స్థిత=ఉంచఁబడిన, హిమాంతః = అంతశ్శీతముగల, నారికేళాంబువుల్ = టెంకాయనీళ్లు, తారుణ్యా...రు-తారుణ్య = తరుణత్వమును, (పిందె, కాయ, దోఁ, పండు అను నాలుగుదశలలో కాయదశను) అతిగ=అతిక్రమించిన (దోరపండుదశలోనున్న), చూత=మామిడిచెట్లయొక్క, మూత్నఫల = దోరపండ్లతోడను, యుక్ = కూడినట్టి, తైల=నూనెయొక్క, అభిఘార = తిరుగఁబోఁతచేతను, స్వనత్ = ధ్వనించుచున్నట్టి, ధారా=అవిచ్ఛిన్నముగ, ధూపిత=పోగపఁబడినట్టి, శుష్యత్=శోషించుచున్న, అంబు = ఉదకముగలప్రదేశమువలన, హృత = తేఁబడినట్టి, మాత్స్య = మత్స్యసంబంధి యగు, భేద = శకలములయొక్క, పాక=జీర్ణకాలమందు, ఉద్గత = ఊర్ధ్వముగవెళ్లిపచ్చునట్టి, ఉద్గారంబు = త్రేఁపులయొక్క, కనరు = కనరువాసనను, భోగులకున్ = భోగానుభవశాలురకు, సంధ్యా వేళలన్ = సంధ్యాకాలములందు ఆర్చున్ = అణఁచును.

తా. అనఁగా గ్రీష్మకాలమందు భోగపరు లయిన పురుషులు మామిడికాయలతో వండుచున్న నూనెవలన గమ్మమగునట్లు దిరుగఁబోఁతచేసిన చేఁపలతో భోజనముఁ జేసిన త్రేఁపులు విడువఁగ నది కనరుగ నుండును గాన నాకనరు మట్టుపడుటకుఁగా శృంగారవనములయందలి యిసుకలో స్థాపించియుండుటవలన నతిశీతలమగు టెంకాయనీళ్లను సంధ్యాకాలములయందుఁ ద్రాగుచుందురు.

క. గ్రామగ్రామంబున నొక
సామంతున కిడినచలువచప్పరములు [1]త
న్నైప్ర మేదినిఁ గుంపటిలోఁ
దామరలుంబోలె నట్టిఁతటి నొప్పారెన్. 70

టీ. గ్రామగ్రామంబునన్ = ఊరూరనున్న, ఒకసామంతునకున్ = ఒకొక్కదొరకుఁగా, ఇడిన = దట్టముగ వేసిన, చలువచప్పరములు = చలువపందిళ్లు, మేదినిన్ = భూమియందు, తన్నైప్ర=తనియఁజేయునవియై (తర్షైచ్ఛ యను పాఠమునకు మెండైన యని యర్థము.) అట్టిఁతటిన్ = ఆవేసవియందు, కుంపటిలో = కుంపటిలో నున్న, తామరలుంబోలె = కమలములవలెను, ఒప్పారెన్ = ఒప్పెను. అలం. అభూతోపమ యని కొందఱు. ఉత్ప్రేక్షయే యని మఱికొందఱు.

1. తర్షైచ్ఛ

తా. ప్రతిగ్రామమునం దుండెడి దొరలకుఁగా వేసిన యనేకములగు చలువ పందిళ్లా గ్రీష్మకాలమందుఁ గుంపటియందలి దామరపూవులవలెఁ జలువలు వెదజల్లుచు దనియఁ జేయుచుండెను.

తే. తోఁట బగ లుండి మల్లెలు సిగ దుఱిమి కావు
లమర మాపైన నిక్షుయంత్రముల కొయ్యఁ
జేరుప్రజ వొల్చె భావివృష్టికిని గ్రుడ్డు
తో మధురిమేచ్ఛ డిగు నెఱ్ఱచీమ లనఁగ. 71

టీ. తోఁటన్ = తోఁటయందు, పగలుండి = పవల్లెల్ల నుండి, మాపు ఐనన్ = ప్రొద్దుగ్రుంకఁగా, మల్లెలు దుఱిమి = మల్లెపువ్వులు శిరంబున ముడుచుకొని, కావుల మరన్ = చంద్రకావివస్త్రములు ధరియించి, ఇక్షుయంత్రములకున్ = చెఱకుగానుగల సమీపమునకు, ఒయ్యఁజేరు = మెల్లగఁ బ్రవేశించుచున్న, ప్రజ = జనము, భావి వృష్టికిన్ = ముందు గాఁగలవర్షమునకు, గ్రుడ్డుతోన్ = గ్రుడ్డు మోచికొని, మధురి మేచ్ఛన్ = తీపుమీఁది కాంక్షచేతను, డిగు = దిగివచ్చునట్టి, ఎఱ్ఱచీమ లనఁగన్ = రక్తపిపీలిక లనునట్లు, పొల్చెన్ = ఒప్పెను.

తా. పగల్లెల్లను దోఁటలలో నుండ యస్తమింపఁగ మల్లెపువ్వులను శిరంబుల ధరియించుకొని చెఱకుగానుగల సమీపములను మెల్లగఁ జేరుచున్నప్రజలఁ జూడఁగా ముందువర్షమునకు సూచకంబై గ్రుడ్డుతోఁగూడఁ దీపువస్తువులమీఁదియాశచేత దిగి వచ్చుచున్న యెఱ్ఱచీమలో యనునటుల నొప్పుచుండెను.


ప ర దే శి వి ప్రుఁ డు

క. అప్పెను వేసవి విభవము
విప్పుగఁ దన్నగరనికటవృషగిరి హరికిం
దెప్పతిరుణాళ్లు రా ముద
మొప్ప న్పరదేశివిప్రుఁ డొక్కఁడు భక్తిన్. 72

టీ. అప్పెను వేసవిన్ = ఆగ్రీష్మమందు, విభవము = వైభవము, విప్పుగన్ = విస్తరింపఁగాను, తన్న...కిన్ - తన్నగర = ఆ మధురయొక్క, నికట = సమీపమందలి, వృషగిరిహరికిన్ = అళఘునియం దుండు సుందరబాహుస్వామికి, తెప్పతిరుణాళ్లు = ఉడుపోత్సవము, రాన్ = రాఁగా, భక్తిన్ = ప్రియభక్తిచేతను, ముద మొప్పన్ = సంతసము పొల్చునటుల, ఒక్కఁడు = ఏకాకియైనట్టి, పరదేశివిప్రుఁడు = వైదేశికుఁ డయిన బ్రాహ్మణుఁడు.

తా. సుగమము.

క. సేవించి పోవుతఱి మధు
రావిభవముఁ జూడ వచ్చి శ్రాంతి మెయి న్మా
పా వైఘనీటఁ గృతసం
ధ్యావిధి యై నృపపురోహితావాసమునన్. 73

టీ. సేవించి = (సుందరబాహుస్వామిని) భజించి, పోవుతఱిన్ (మరల తనదేశమునకు) పోవునపుడు, మధురావిభవము = మధురాపట్టణపుశృంగారమును, చూడవచ్చి = కన్గొనుటకు వచ్చి, శ్రాంతి మెయిన్ = బడలికచేతను, మాపు = సాయంకాలమందు. ఆ వైఘనీటన్ = ప్రసిద్ధం బగు నావైఘ యను నదీతీర్థంబులందు, కృత... ..విధియై, కృత = చేయఁబడిన, సంధ్యావిధియై = సంధ్యానుష్ఠానముగలవాఁడై, నృపపురోహితావాసమునన్ = రాజపురోహితునిగృహముం జేరి యందు. తరువాతిపద్యముతో నన్వయము.

తా. ఆ విప్రుఁడు సుందరబాహుస్వామిని సేవించి పోవుసమయమున నామధురాపురవైభవంబులఁ జూడ నిచ్చ గలవాఁడై వచ్చి బడలి సాయంకాలమం దాప్రసిద్ధంబులగు వైఘ యను నదీతీర్థంబులయందు సంధ్యావందనాద్యనుష్ఠానములం బరిసమాప్తి నొందించి రాజపురోహితునియొక్క యిల్లు సొచ్చి యని యభిప్రాయము.

సీ. పరిపక్వసురభిరంభాఫలంబులతోడ
దలమెక్కు పనసపెందొలలతోడ
ఘృతపిండనిభకర్కటీఖండములతోడఁ
బలుదెఱంగుల మావిపండ్లతోడ
గోస్తనీమృదుగుళుచ్ఛస్తోమములతోడఁ,
గప్పుదేఱిన వడప్రప్పుతోడ
సుమధురస్థూలదాడిమబీజములతోడఁ
[2]దనుపారు రసదాడిగనెలతోడఁ

తే. బానకం బతిథుల కిడ్డఁ దానుఁ గ్రోలి
యర్చనాదత్తచందనచర్చఁ దేలి
విరులు సిగఁ దాల్చి కర్పూరవీటి[3]జౌరు
గొట్టుచు ద్విజుండు వెన్నెలబిట్టు గాయ. 74

టీ. పరి...తోడన్ - పరిపక్వ = క్రమముగఁ బక్వమై, సురభి = పరిమళించుచున్న, రంభాఫలంబులతోడన్ = అరఁటిపండ్లతోడను, దలమెక్కు = బలిసియున్న, పనస

1. కప్పుదేరిన. 2. తనరారు. 3. జబురు.

పెందొలలతోడన్ = పనసతొలలతోడను, ఘృత...తోడన్-ఘృతపిండనిభ = నేతికరు డులవంటి, కర్కారీఖండములతోడన్ = దోసపండ్ల బ్రద్దలతోడను, ని. 'ఉర్వారు, కర్కారీస్త్రియా' మ్మని యమరము. పలు...తోడన్ - పలు దెఱంగుల = అనేకవిధము లయిన, మావిపండ్లతోడన్ = చూతఫలంబులతోడను, గోస్తనీ...తోడన్-గోస్తనీ = ద్రాక్షయొక్క, ని. 'మృద్వీకాగోస్తనీద్రాక్షా' యని యమరము, మృదు=కోమలంబులగు, గుళుచ్ఛ = గుత్తులయొక్క, స్తోమంబులతోడన్ = సమూహములతోడను, కప్పు లేఱిన వడపప్పుతోడన్ = నల్లనిగింజలు, పొట్టు లోనగునాని నెత్తి తీసివైచినట్టి వడపప్పు తోడను, సుమధుర...తోడన్ - సుమధుర=మిక్కిలియుంద్దీపై, స్థూల = గొప్పలైయున్న దాడిమబీజములతోడన్=దానిమ్మగింజలతోను, తన ..తోడన్-తనుపారు=తృప్తికరములైన రసదాడిగ నెలతోడన్ = రసదాడిచెఱకుగడలతుంటలతోను, పానకంబు = పానకమును, అతిథులకున్=అతిథు లైనబ్రాహ్మణులకు, ఇడ్డన్=ఆయింటిబ్రాహ్మణుఁడీయఁగా, తానును, కోరిలి = పుచ్చుకొని, అర్చ...న్ = అర్చనా = పూజాకాలమందు, దత్త = ఇయ్యఁబడిన, చందన = శ్రీగంధముయొక్క, చర్చన్ = పూఁతచేత, తేలి = తోఁగి, విరులు = పుష్పంబులు, సిగన్ = శిఖయందు, తాల్చి = ధరియించి, కర్పూరవీటిన్ = కర్పూరమతిశయించినవిడియమును, చొరుకొట్టుచున్ = నమలుచు, వెన్నెల, బిట్టు= మిక్కిలిగా, కాయన్ = ప్రకాశించుచుండఁగా, ద్విజుఁడు = అపరదేశిబ్రాహ్మణుఁడు.

తా. పండిన యరఁటిపండ్లు పెద్దవిగా నున్న పనసతొలలు దోసపండ్ల బ్రద్దలు ననేకవిధములైన మామిడిపండ్లు ద్రాక్షగుత్తులు తీపుగలదాడిమవిత్తులు తృప్తికూర్చు చెఱకు తుంటలు వీనితో నాయింటిబ్రాహ్మణుం డతిథులకుఁ బానకం బిచ్చు నెడఁ దానును బానము సేసి తొలుత నిచ్చియున్న చందన మలఁదికొని పుష్పముల సిగయందు ధరియించి కర్పూర యుక్తంబైన తాంబూలము వేయుచు మంచి వెన్నెలయం దాపరదేశిబ్రాహ్మణుం డుం డఁగా; అలం. స్వభావోక్తి.

తే. మాత్రసంచి తలాడగా మార్గవేది
నొక్కఁ డార్యలు గీత లొం డొకఁడు దా సు
భాషితంబులుగాఁ దోడి బ్రాహ్మణౌఘ
ముబుసుపోకకుఁ జదువఁ బ రున్న వేళ. 75

టీ. మాత్రసంచి = అసిమిసంచిని, తలాడగాన్ = తలగడబిల్లగాఁబెట్టుకొని, మార్గవేదిన్ = త్రోవయందున్నయరుఁగుమీఁదను, ఒక్కఁడు = ఒకబ్రాహ్మణుండు, ఆర్యలు = ఆర్యావృత్తములను, ఒండొకఁడు = మఱియొక్కఁడు, గీతలు = భగవద్గీత లను, తాన్ = తాను, సుభాషితంబులు గాన్ = నీతిశ్లోకంబులుగా, తోడిబ్రాహ్మణౌ

ఘము = తనతోఁబరుండియున్న బ్రాహ్మణులు, ఉబుసుపోకకున్ = ప్రొద్దుపుచ్చుకొనుటకు, చదువన్ = పఠింపఁగా, పరున్నవేళన్ = పరుండియున్న సమయమున, ముందటి కన్వయము.

తా. అసిమిసంచిఁ దలగడబిళ్ళం జేసికొని మార్గములో నున్న తిన్నెమీఁదనొకఁడార్యావృత్తములును మఱియొకండు గీతలును, దాను నీతిశ్లోకములు నిట్లు తనతోఁగూడ నున్న బ్రాహ్మణులును బ్రొద్దుఁబుచ్చికొనుటకుఁ బఠింపఁగాఁ బరుండి యుండఁగా.

**రాజు భోగినికడకుఁ బోవుట**

సీ. పన్నీటితోఁ గదం। బముఁ జేసి పూసిన
 మృగనాభిపస రాచ। నగరు దెలుపఁ
బాటలానిలము లా। ర్పఁగఁ దపారపుఁజుంగు
 లలరుఁదావికి మూఁగు। నళులఁ జోఁపఁ
గర్ణడోలామౌక్తి। కచ్ఛాయ లెగఁబ్రాఁకుఁ
 నురుహారరుచులఁ ద్ర। స్తరికిఁ దన్న
శశికాంతి చెంగావి। దసిలి మించినకేల
 స్వర్ణత్సరువువాఁడి। వాలు మెఱయ

తే. మెలఁత యడపముఁ దేఁ జర। స్నేరు వనఁగఁ
దలవరులు గొంద ఱోలసి ముం। దఱఁ (గల)జనంగ
నర్థిరథ్యాంతరాంతగ పు। రాంతరమున
భోగినీసంగతికి రాజు। వోవు చుండి. 76

టీ. పన్నీటితోన్ = పన్నీటితోడను, కదంబముఁ జేసి = పరిమళ ద్రవ్యముల నన్నిటిఁ గలిపి, పూసిన...పస - పూసిన = అలఁదినట్టి, మృగనాభి = కస్తూరియొక్క, పస = మేలిమి, రాచనగరు = రాజగృహమును, తెలుపన్ = కనుపఱుపఁగా, (కస్తూరి రాజులకుఁదక్క సామాన్యులకుఁ జిక్క దనుట), పాటలానిలములు - పాటల=కలిగొట్టుపువ్వులయొక్క, అనిలములు = గాడ్పులు, ఆర్పఁగన్ = ఆడించుచుండఁగా, తపారపుఁ జుంగులు = తలను జుట్టియున్న వస్త్రపుఁ జుంగులు, అలరుఁదావికిన్ = పుష్పవాసనలకు, మూఁగునళులన్ - మూఁగు = చుట్టుకొనునట్టి, అళులన్ = తుమ్మెదలను, చోఁపన్ = తోలఁగా, కర్ణ...లు - కర్ణ = శ్రోత్రములందు, డోలా = కదలుచున్న, మౌక్తిక = ముత్యములయొక్క, ఛాయలు = కాంతులు, ఎగ...లన్ - ఎగఁబ్రాఁకు = పైకెగయునట్టి, ఉరు = అధికమైన, హార = ముత్యాలదండలయొక్క, రుచులన్ = కాంతులను, త్రస్తరికిన్ = వెనుకకు, తన్నన్ = కాలఁద్రోయఁగా, శశి...లు - శశి = చంద్రుని

యొక్క, కాంతి = కాంతిచంటికాంతిగల, చెంగావిపసిలి = చెంగావిరుమాలు, మించిన = మీఱిన, కేలి = చేతఁబట్టిన, స్వర్ణత్సరువు = బంగారుపిడితోడి, వాఁడివాలు = తీక్ష్ణ ఖడ్గము, మెఱయన్ = ప్రకాశింపఁగా, మెలఁత = ఒకస్త్రీ, అడపముఁ దేన్ = అడ పంబుఁదేఁగా, చరన్మేరువు = నడయాడు మేరుపర్వతము, అనఁగన్ = అనునటుల, తల వరులు = తలారులు, కొంగుటు = చాపుగాఁ నుండుకొండటు, ఒలసి = కనిపెట్టి, ముంద అన్ = పురోభాగమునందు, చనఁగన్ = పోఁగా, అర్థిన్ = అసక్తిచేతను, రథ్యాంత రాంతరపురాంతరమునన్ - రథ్యాంతర = మార్గమధ్యమందలి, అంతఃపురాంతరమునన్ = రెండవయంతఃపురమువలె సున్నగృహమునందు, భోగినీసంగతికిన్ = భోగస్త్రీని భోగిం చుట కొఱకు, రాజు = పాండ్యుఁడు, పోవుచుండి = వెళ్లుచుండి. ముందటి కన్వయము.

తా. సులభము.

చ. వినియె, నెల ల్పతుర్ద్వయిని ప్రావృషిదినాలికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను, బూని, పరంబున కిప్పు డుద్యమం
బనువుగఁ జేయఁగా వలయుఁ నంచుఁ బురోహితధర్మ మాత్మ గీ
ల్కొన నలవిప్రుఁ డాద్విజులలోన సుభాషితము ల్పఠింపఁగన్. 77

టీ. ప్రావృషిదినాలికిన్ = వర్షాకాలమైన నాలుగుమాసములకు, నెలల్ చతుర్ద్వ యిని = తక్కినయెనిమిది నెలలయందును, రాత్రికిన్, దివంబునన్ = పవటియందును, జరకై = ముదిమికై, వయస్సునను, పూని = ఆరంభించి, పరంబునకున్ = పరలోక మునకు, ఇప్పుడు = ఈశరీరమందే, ఉద్యమంబు = ప్రయత్నము, అనువుగన్ = లెస్సగా, చేయఁగావలయున్ = చేయవలయును, అంచున్ = అనుచును, పురోహితధర్మము, పురః = ముందటికి, హితః = హితకరమైన, ధర్మము = న్యాయము, ఆత్మన్ = బుద్ధి యందు, కీల్కొనన్ = నాటునట్లుగ, అలవిప్రుఁడు=అబ్రాహ్మణుఁడు, ద్విజులలోన్ = విప్రులలోపల, సుభాషితముల్ = నీతి ప్రతిపాదకశ్లోకములను, పఠింపన్ = చదువఁగా, వినియెన్ = విన్నవాఁడాయెను.

తా. 'వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసా న్నిశార్థ మర్థం దివసే యతేత, వార్ధక్య హేతో ర్వయసానవేన పరత్ర హేతో రిహ జన్మనా చ' అను శ్లోకార్థముచొప్పున వర్షా కాలమైన నాలుగుమాసములకు పలసినవస్తుసామగ్రులను మిగత యగు నెనిమిది మాసముల యందును, రాత్రికిఁ బవటియందును, జరకు వయస్సునందును, పరలోకమునకు వర్తమాన శరీరమందును, చేయందగిన ప్రయత్నములను బాగుగాఁ జేయవలయు నని ముందటికి హితమగు న్యాయము మనంబున నాటునట్లుగా నాబ్రాహ్మణుండు విప్రుల నడుమనుండి నీతిశ్లోకములఁ జదివఁగా నపాండ్యరాజు వినియె నని యభిప్రాయము.

క. విని, తచ్ఛ్లోకార్థము నె
మ్మనమున నూహించి తెలిసి ॥ స్రుక్కపడి కడకుం
దనమోసమునకు భయపడి
జనపతి యటు చనక నిలిచి ॥ సంతాపమునన్. 78

టీ. విని, తచ్ఛ్లోకార్థమున్ = ఆసుభాషితములయొక్క యభిప్రాయమును, నెమ్మనమునన్ = నిండుమనస్సునందు, ఊహించి = ఆలోచించి, తెలిసి = ఎఱిఁగి, స్రుక్కపడి = స్తబ్ధచిత్తుఁడై, కడకున్ = చివరకు, తన = తనయొక్క, మోసమునకున్ = ప్రమాదమునకు, భయపడి = భీతిల్లి, జనపతి = రాజు, యటు చనక = భోగినిగృహమునకుఁ బోక, సంతాపమునన్ = పరితాపముచేత, నిలిచి, వైరాగ్యమునొందెను.

ఉ. ఎక్కడిరాజ్యవైభవము ॥ లెక్కడిభోగము లేటిసంభ్రమం
బక్కట బుద్బుదప్రతిమ ॥ మైనశరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి యుగసంధుల నిల్చియుఁ గాలుచేతిబల్
త్రొక్కుల నమ్మనుప్రభృతులున్ దుద రూపఱ కుండ నేర్చిరే. 79

టీ. ఎక్కడిరాజ్యవైభవములు = రాజ్యమేమిశాశ్వతము, ఎక్కడిభోగములు = తనభోగమేమినిత్యము. ఏటిసంభ్రమంబు = ఎక్కడిసంతోషము, అక్కట = కటకట, బుద్బుదప్రతిమమైన = నీటిబుడగతో సమానమైన, శరీరము నమ్మి = దేహమునిత్యమనినమ్మి, మోక్షపుంజక్కి = మోక్షమార్గమును, గణింపక = లక్ష్యపెట్టక, ఉంటిన్ = ఉన్నవాఁడనైతిని. యుగసంధులన్ = యుగములందుమాత్రమే కాక యుగసంధ్యలందును, నిల్చియున్ = ఉండియును, కాలు...లన్ - కాలుచేతి = యముని చేతనైన, బల్త్రొక్కులన్ = విశేషమగుత్రొక్కిళ్లచేత, అమ్మనుప్రభృతులున్ = ప్రసిద్ధులైనమనుమాంధాత్రాదులును, తుదన్ = శరీరత్యాగకాలమందు, రూపఱక = రూపు నష్టముగాకుండఁగ, ఉండనేర్చిరే = ఉండఁగలిగిరా.

తా. ఆవిప్రుండు సెప్పినసీతిశ్లోకముల యభిప్రాయమును గ్రహించి మనంబున మిగుల విచారించి స్తబ్ధచిత్తుఁడై చివరకుఁ దనకుం గలిగెడు ప్రమాదమునకు భీతిల్లి యప్పాండ్యరాజు భోగినీగృహమునకుఁ బోక మార్గమందే నిలిచి పరితాపముచేత రాజ్యమేమిశాశ్వతము భోగమేమి నిత్య మెక్కడిసంతోషము కటకటా నీటిబుడగతోసమానంబగు నీశరీరమును నమ్మి మోక్షమార్గము విచారింపనైతిని యుగములకొలఁది జీవించియుండ నాభూమినిఁ బాలించినమన్వాదులుఁ దమతమశరీరములను నిల్పఁగలిగిరా లేదు గదా యని విచారయుక్తుఁడై యుండెనని తాత్పర్యము.

క. ఉన్నట్లు యుండ నద్దరి
కి న్నరులను నావ చేర్చుక్రియ వెసఁ బోవఁ బో
కున్నట్లు యుండి కాలం
బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చున్. 80

టీ. ఉన్నట్లుయుండన్ = లోనివారికిఁ దనయొక్క గమనము తెలియరాకుండ - ఉన్నదానింబలెనుండి, నావ = ఓడ, సూ. 'స్త్రోణావౌస్త్రైనావో' యను సూత్రముచేత నౌశబ్దమున కీరూపంబు వచ్చెను. అద్దరికిన్ = ఆవలితీరమునకు, నరులను = మనుష్యులను, చేర్చుక్రియన్ = చేర్చులాగున, తాన్ = తాను, వెసఁ బోకున్నట్లుయుండి = వేగిరము జరిగిపోకున్నట్లుగా నుండి, కాలంబు = కాలము, నరులకున్ = మనుష్యులకు, వయసుఁ బుచ్చి = ఆయువుఁబోఁగొట్టి, సూ. 'సాంతాదపయః ప్రభృతే ర్లోపోఽన్యే షాం చ' యనుసూత్రమున ద్విత్వాభావము, మోసముఁ దెచ్చున్ = భంగపాటు గలిగించును. అలం. ఉపమ.

తా. నావ యెక్కఁగా నచటనే యున్నట్టు గనుపడుచు దరికి మనుష్యులఁ జేర్చురీతినిఁ గాలంబును నరులవయసు దెలియకుండనట్లుగఁ జేసి పోఁగొట్టి కడపటికి మోసముఁ దెచ్చు నని తాత్పర్యము.

చ. సగరు నలుం బురూరవుఁ ద్రిశంకుసుతు న్పురుకుత్సుఁ గార్తవీ
ర్యు గయుఁ బృథుం భగీరథు సుహోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశిబిందు ననంగుని నంబరీషు బూ
రుగురుని రంతి రాఘవు మరుత్తునిఁ గాలము కొలుపుచ్చదే? 81

టీ. షట్చక్రవర్తు లగు సగరుని, నలుని, పురూరవుని, త్రిశంకుని సుతుఁడగు హరిశ్చంద్రుని, పురుకుత్సుని, కార్తవీర్యుని, మఱియు మహారాజులగు గయుని, పృథుని, భగీరథుని, సుహోత్రుని, శిబిని, భరతుని, దిలీపుని, పరశురాముని యువనాశ్వపుత్త్రుఁడగు మాంధాతను శశిబిందుని, అనంగుని, అంబరీషుని, యయాతిని, రంతిదేవుని, రాముని, మరుత్తుని, అగు వీరలను, కాలము కొలుపుచ్చదే = కాలము మోసపుచ్చలేదా. అలం. అప్రస్తుతప్రశంస.

తా. సుగమము. ఇచ్చట పేర్కొనఁబడిన మహారాజులు షోడశమహారాజులు.

క. కానఁ దటిచ్చల మగురా
జ్యానందము మఱగి యింద్రియారాముఁడనై
పో నింతనుండి పరలో
కానందంబునకె యత్నమే సాధింతున్. 82

టీ. కానన్ = కావునను, తటిచ్చల మగు = మెఱుపువలె ననిత్యమైన, రాజ్యానందము = రాజ్యసుఖము, మరగి = తగిలి, ఇంద్రియారాముఁడనై = ఇంద్రియపరవశుఁడనై, పోన్ = పోవను, ఇంతనుండి = ఇదిమొదలు, పరలోకానందంబునకె = పరలోకసుఖమునకే, యత్నము = ప్రయత్నమును, ఆపాదింతున్ = ఒనరింతును.

తా. కాలము చక్రవర్తులు మొదలగువారినింగూడ మోసపుచ్చినది. కావున మెఱుపువలె నతిచంచలం బగురాజ్యానంద మపేక్షించి యింద్రియపరవశుఁడనై యుండక యిదిమొదలు పరలోకసుఖమునకు వలయుప్రయత్న మొనరించెదను.

క. వర్గత్రయపరత ముహు
స్స్వర్గక్ష్మామధ్యమాధ్వజంఘాలకతా
దుర్గతియు నొల్ల; మఱి యప
వర్గదుఁ డే వేల్పెఱింగి వాని భజింతున్. 83

టీ. వర్గత్రయపరతన్ = ధర్మార్థకామాసక్తిచేత, ముహుః = పలుమాఱును, స్వర్గ...యున్-స్వర్గ = త్రివిష్టపముయొక్కయు, క్ష్మా=భూమియొక్కయు, మధ్యమ = మధ్యప్రదేశమందలి, అధ్వ = మార్గమునందు, జంఘాలకతా = సత్వరగమన మనియెడు, దుర్గతిన్ = నరకమును, 'నిరయో దుర్గతిస్స్త్రియా' మని యమరుఁడు. ఒల్లన్ = ఇష్టపడను, మఱి = మఱి యేమనఁగా, అపవర్గదుఁడు = మోక్షము నిచ్చువాఁడు, ఏవేల్పు = ఏదైవమో, ఎఱింగి = తెలిసి, వానిన్ = ఆదైవమును, భజింతున్ = సేవింతును.

తా. ధర్మార్థకామంబులనియెడి పురుషార్థత్రయాసక్తిచేతఁ బలుమాఱు స్వర్గమునుండి భూమికి భూమినుండి స్వర్గమునకునుం బోవుచుండు మార్గమునందు సత్వరగమన మనునరక మొల్లను. మఱి యే మన నపవర్గప్రదుం డగునట్టివాఁ డెవ్వఁడో వాని నెఱింగి సేవించుచున్నాఁడను.

క. అని తలఁచి మెచ్చి యవ్వి
ప్రునకు నీవటీకరండకమున ముద్రిత మై
యునిచినయొకముడుపు పార
తునిచే నిప్పించి నగరుకేఁగొచ్చి నిశి చనన్. 84

టీ. అని తలఁచి = అట్లని యూహించి, మెచ్చి = తన కిట్టి జ్ఞానముఁ గలుగఁజేసినందులకై సంతసిల్లి, అవ్విప్రునకున్ = ఆబ్రాహ్మణునికి, వీటీకరండమునన్ = వక్కలాకుల బరణియందు, 'కడుకకరణ్డోలగుడో పరణ్డశ్చకిణోఘుణః'యని పుంలింగవిశేషమునందమరుఁడు, ముద్రితమై = ముద్రింపఁబడి, ఉనిచిన = ఉంచఁబడియున్న, ఒక ముడుపు= వరాలముల్లెయొకటి, ఆరతునిచేన్ = (తలవరిచేతఁ నగరు వెలువడఁగానే తలవరు

లీరాజును గలిసికొని రని 75 వ పద్యమున్న దానిని గ్రహించి, నగరు = రాజగృహమును, చొచ్చి = ప్రవేశించి, నిశ = రాత్రి, వసు = బంగారు. మునుపటి కన్వయము.

తా. ఆపాండ్యరాజు పూర్వోక్త ప్రకారంబుగ నూహించి తన కట్టి జ్ఞానముఁ గలుగఁజేసిన యవ్విప్రునిమహాత్ముని యోగసమయమునందు యుంచి బంగారులకరండంబున ముద్రింపఁబడి యుంచియున్న సువర్ణముల కోటి సువర్ణలహరి చేత నిప్పించి తాను నగరు ప్రవేశించి తెల్లవారిన పిమ్మట.

క. కొలువై బహుసమయంబుల
మెలఁగెడుకోవిదులఁ జూచి మీమాంసాశాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం
[1]బెలయించునో చూచి నిశ్చయింపుఁ డటంచున్. 85

టీ. కొలువై = ఆస్థానమందుఁగూర్చుండి, బహు...లన్ - బహు = అనేకవిధం బులగు, సమయంబులన్ = సిద్ధాంతములయందు, ని. 'సమయా శ్శపథాచార కాల సిద్ధాంతసంవిద' యని నిఘంటువు. మెలఁగెడుకోవిదులన్-మెలఁగెడు=సంచరించుచున్న, కోవిదులన్ = పండితులను, చూచి = వీక్షించి, మీమాంసా శాస్త్రంబులలోన్, ఎవ్వఁడు, మోక్షంబు = అపవర్గమును, ఎలయించునో = పొందించునో, చూచి నిశ్చయింపుఁడు= పరిశీలనఁజేసి నిర్ణయింపుఁడు, అటంచున్ = ఆలాగని, పైపద్యములో క్రియ.

తే. వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు
వాని కని బీఱపువ్వులఁబోని టంక
సాలవాటులు నించి యాస్థానిఁ గట్టఁ
గాలసర్పముగతి వ్రేలుఁజాలెఁ జూచి. 86

టీ. వాద మొనరించి = ప్రసంగముసేసి, గెలిచి = జయమునొంది, తత్త్వంబుఁ దెలుపువాని కని = ఇదియ సత్యం బని కనుపఱుచువాని కనుచు, బీఱ...లు-బీఱపువ్వులఁ బోని = బీఱపువ్వులవంటి, టంకసాలవాటులు = క్రొత్తముద్రలువేసినమాడలను, నించి = నిండఁబోసి, ఆస్థానిన్ = సభయందు, ని - 'ఆస్థానీ క్లీబమాస్థాన' మ్మని యమరము. కట్టన్ = కట్టఁగా, కాలసర్పముగతిన్ = కృష్ణసర్పమువలె, వ్రేలుజాలెన్ = వ్రేలాడు చున్న జాలెను, చూచి = వీక్షించి.

తా. ఆస్థానమం దాపాండ్యరాజు గూర్చుండి యున్నవాఁడై యనేకశాస్త్ర సిద్ధాంతములు దెలిసికొనియున్న పండితోత్తముల రావించి వారినిం జూచి మీమాంసాశాస్త్రములయందుఁ జక్కఁగా విచారించి మోక్షప్రదుం డైనదేవుఁ డెవ్వఁడో యెఱింగించ

1. బెలయించుం జూచి.

వలయు ననుచుఁ బ్రసంగమొనరించి గెలిచి తత్త్వముం దెలిపినవానికి నిప్పించెద నని మాడలచే నింపఁబడిన జాలెను దెప్పించి సభయందుఁ గట్టింప నావరాలజాలెను జూచి యప్పండితులు.

క. హరు నొకఁ డన నుమ నొకఁ డన
హరి నొకఁ డన శిఖి నొకఁ డన నర్కు నొకఁ డనన్
గరిముఖు నొకఁ డన రజనీ
శ్వరు నొకఁ డన నజు నొకఁ డన వాదైనతఱిన్. 87

టీ. ఒకఁడు = ఒకవిద్వాంసుఁడు, హరునన్ = శివుఁడు మోక్షప్రదుఁ డనఁగా, ఒకఁడు = మఱియొకఁడు, ఉమనన్ = శక్తి మోక్షప్రదాత్రి యనఁగా, ఒకఁడు = ఒక్కఁడు, హరిన్ = ఇంద్రుని, ఒకఁడు = ఒక్కఁడు, శిఖిన్ = అగ్నిని, ఒకఁడు = ఇంకొకఁడు, అర్కున్ = సూర్యుని, ఒకఁడు, కరిముఖున్ = విఘ్నేశ్వరుని, ఒకఁడు, రజనీశ్వరున్ = నిశాపతిని - చంద్రుని, ఒకఁడు అజున్ = బ్రహ్మను, (వీరలు మోక్షప్రదాతలని) వాదు = ప్రసంగము, ఐనతఱిన్ = ఐనసమయమందు.

తా. సుగమము.

తే. విల్లిపుత్తూరిలో నల్లవిష్ణుచిత్తుఁ
డతులతులసీసుగంధిమాల్యమును మూల
మంత్రమున నక్కు [1]సేర్చుచో మన్ననారు
దారమధురోక్తి [2] నిట్లని యానతిచ్చె. 88

టీ. విల్లిపుత్తూరిలోన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, అల్లవిష్ణుచిత్తుఁడు = ఆవిష్ణుచిత్తుండు, అతుల...ను - అతుల = శ్రేష్ఠమైన, తులసీ = తులసిచేతను, సుగంధి=పరిమళించుచున్న, మాల్యమును = పుష్పమాలికను, మూలమంత్రమునన్ = శ్రీమదష్టాక్షరి యను మహామంత్రముచేత, అక్కుసేర్చుచోన్ = వక్షస్థలమందు సమర్పించునపుడు, మన్ననారు = మన్నారుస్వామి, ఉదార = గంభీరమైన, మధురోక్తిన్ = తియ్యని మాటలచేత, ఇట్లని = ఇవ్విధముగ, ఆనతిచ్చెన్ = సెలవిచ్చెను.

తా. శ్రీవిల్లిపుతూరులో నున్న యావిష్ణుచిత్తుం డుత్తమంబగు తులసీదళములచే బరిమళించుచున్న వనమాలిక నష్టాక్షరి యను మహామంత్రంబగు మూలమంత్రమును జపించుచు వక్షస్థలంబున సమర్పింపంగ నాసమయంబున మన్నారుస్వామి గంభీరమైన తియ్యనిమాటలచేత నిట్లని యానతిచ్చెను.

1. సేర్పఁబో. 2. నవ్విధ మానతిచ్చె.

ఉ. 'నేఁడు మహామతీ! మధురకు నీవు జయంబునఁ జొచ్చి యందుఁ బాం
డ్యేఁడు దివాణము న్నెఱయ నించినఁ బ్రేలెడుదుర్మదాంధులన్
బోఁడిమి మాన్చి మన్మహిమమున్ బ్రకటించి హరింపు శుల్కమున్;
వాఁడును రోసినాఁ డిహము వైష్ణవుఁగా నొనరింపు [1]సత్కృపన్.'

టీ. మహామతీ = మహాజ్ఞానము గల విష్ణుచిత్తుఁడా, నేఁడు = ఈప్రొద్దు, ఈవు= నీవు, మధురన్ = మధురాపురమును, చొచ్చి = ప్రవేశించి, అందు = ఆమధురయందు, పాండ్యేఁడు = పాండ్యరాజు (ఇది దేశ్యోక్తి), దివాణమున్ = ఆస్థానమును, నెఱయన్= నిండునట్లుగా, నించినన్ = నింపఁగా, ప్రేలెడు = నానావిధంబులుగఁ బలుకుచున్న, దుర్మదాంధులన్ = దుర్మదముచేత నంధులైనవాండ్రను, పోఁడిమిమాన్చి = గర్వ మణఁచి, మన్మహిమన్ = నాయొక్క మాహాత్మ్యమును, ప్రకటించి = ప్రసిద్ధియొనర్చి, శుల్కమున్ = విద్యాశుల్కమును, హరింపు = గ్రహింపుమా, వాఁడును = ఆపాండ్యుఁడును, ఇహము = ఈలోకమును, రోసినాఁడు = అసహ్యపడినాఁడు, సత్కృపన్ = దయచేత, వైష్ణవుఁగాన్ = విష్ణుభక్తునిఁగా, ఒనరింపుము = చేయుము.

తా. మహాబుద్ధిశాలి వగు విష్ణుచిత్తుఁడా యని స్వామివారు సంబోధించి నేఁటి దినమున నతివేగముతో మధుర కేతెంచి యందున్న పాండ్యరాజు దివాణము నిండఁ గూర్చుండి నానావిధములుగఁ బలుకుచున్న దుర్మదాంధులయొక్క కైపు మాన్పి నా మహిమలను కొంతఁ దెలిపి విద్యాశుల్కమును గ్రహించి యీలోకమును రోసియున్న పాండ్యునిం గృపచేత వైష్ణవుంగావింపు మని మన్నారుస్వామి విష్ణుచిత్తునితో సెల విచ్చెను.

తే. అనిన వడవడవడఁకి సాష్టాంగ మెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు ముమ్మరముగ
వినయవినమితగాత్రుఁడై విప్రవరుఁడు
వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె. 90

టీ. అనినన్=అనఁగా, విష్ణుచిత్తుండు, వడవడవడఁకి=మిక్కిలికంపించి, సాష్టాంగ మెఱఁగి = సాష్టాంగప్రణామముఁ జేసి, సమ్మదాశ్రులు = ఆనందాశ్రులు, పులకలు = పులకాంకురములు, ముమ్మరముగన్ = అతిశయింపఁగా, వినయవినమితగాత్రుఁడై =విన యముచేత వంపఁబడినదేహము గలవాఁడై, విప్రవరుఁడు = బ్రాహ్మణోత్తముండగు విష్ణు చిత్తుఁడు, వెన్నునకున్ = విష్ణునకు, భక్తిన్ = భక్తిచేతను, ఇట్లని = ఈవిధముగా, విన్న వించెన్ = విన్నపము సేసెను.

---

1. సత్కృతిన్.

తా. మన్నారుస్వామి యారీతి నాజ్ఞాపింపఁగా భయమునొంది విష్ణుచిత్తుండు సాష్టాంగనమస్కారముం జేసి యానందబాష్పములుఁ బులకాంకురములును విస్తరిల్లఁగా వినయముచేత నమ్రుఁడై విష్ణునకు వక్ష్యమాణక్రమంబుగా భక్తిచేత విన్నవించెను.

శా. 'స్వామీ! నన్ను నితఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధు, నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాదిఁ గాఁ బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబుల్ మీకు రాకుండునే. 91

టీ. స్వామీ = రక్షకుఁడా, ఇతః... ధుణ్ - ఇతఃపురా=ఇంతకు మున్ను, అపఠిత = చదువంబడని, శాస్త్రగ్రంథ = శాస్త్రగ్రంథములయందు, జాత్యంధుణ్ = పుట్టుగ్రుడ్డివాఁడ వైనట్టియు, ఆరామ...రుణ్ - ఆరామ = ఉద్యానవనముయొక్క, క్ష్మా=భూమియొక్క, ఖననక్రియా = త్రవ్వుట యనుకార్యమునందు, ఖర=తీక్ష్ణమైన, ఖనిత్ర=గుద్దలియొక్క, గ్రాహిత = గ్రహించుటచేత, ఉద్యత్ = ఏర్పడిన, కిణస్తోమ = కాయల సమూహము చేతను, అస్నిగ్ధ = బిరుసైన, కరుణ్ = హస్తములు గలయట్టియు, భవ...సుణ్ - భవత్ = మీయొక్క, భవనదాసుణ్ = గృహసేవకుఁడవైనట్టియు, నన్నుణ్ = నన్ను, వాదిఁగాణ్ = ప్రసంగించువానిఁగాఁ జేసి, పంపుచోణ్ = అనిపినయపుడు, భూమీభృత్సభణ్ = ఆ పాండ్యరాజుయొక్క సభయందు, ఓటమైనణ్ = ఓటమియైనను, అయశంబుల్ = అపకీర్తి, మీకు రాకుండునే = మీకు వచ్చునుగదా.

తా. ఇంతకుమున్ను శాస్త్రమును జదువక జ్ఞానమునందుఁ బుట్టుగ్రుడ్డినైనట్టియుఁ, బూలతోఁట నేలఁ ద్రవ్వుటకుఁగా గుద్దలిం బట్టుటచేతఁ గాయలు కాచి బిరుసైన హస్తములు గలయట్టియు, మీకోవెలకు దాసుఁడనైనట్టియు నన్ను వాదమున కనిపితిరేని యారాజసభయందు గెల్పు లేక యోటమి వచ్చినయెడల దేవరకే యపకీర్తి వచ్చును గదా యని విష్ణుచిత్తుండు విన్నవించెను.

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో ॥ శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో ॥ వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ॥ [1]ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము [2]లేల లేరె యితరు ॥ ల్నీలీలకుం బాత్రముల్? 92

టీ. నృహరీ = నృసింహస్వామీ, గృహసమ్మార్జనమో = మీ కోవెలయందుఁ బరిమార్జనముఁ జేయుటో, జలాహరణమో=తీర్థంబుఁ దెచ్చుటో, శృంగార పల్యంకికా

1. ప్రాగ్దీపికారోపమో. 2. నాకు.

వహనంబో=విలాసార్థము దేవరవారారోహణముఁ జేసినపల్లకి మోచుటయో, వనమాలికాకరణమో = తులసిదండలు గట్టి సమర్పించుటయో, వాల్ల...బో - వాల్లభ్య = ప్రభుత్వమునకు, లభ్య = పొందఁదగిన, ధ్వజగ్రహణంబో = టెక్కెములు మోచుటయో, వ్యజనాతపత్రధృతియో = విసనకఱ్ఱ గొడుగుమున్నగువానిం బట్టుటయో, ప్రాక్=ముందఱను, దీపికారోపమో=దీపముఁబెట్టుటయో, వాదము లేల= వేఱెవాదులేల, ఇతరుల్ = అన్యులు, నీలీలకుక్ = నీవిలాసమునకు, పాత్రముల్ = తగినవారు, లేరే లేరా. ఉన్నా రనుట. 'క్వచిద్ధర్మవిశేషేతు క్లీబేప్యుభయరూపతా' యను నధర్వణోక్తి చేతఁ బాత్రము లని యపుమ్ప్రయోగము.

తా. సుగమము.

మన్ననారు విష్ణుచిత్తు ననుగ్రహించుట

తే. అనిన దద్భక్తి కెద మెచ్చి యచ్యుతుండు
మొలకనగ వొప్ప శ్రీదేవి మోము సూచి
వా దితని [1]చేత గెలిపింతు నాదుమహిమ
ముదిద కను మని ప్రాభవం బొప్పఁ [2]బలికె. 93

టీ. అనినక్=అనఁగా, తద్భక్తికిక్=ఆవిష్ణుచిత్తునిభక్తికి, ఎదమెచ్చి = మనంబున మెచ్చి, అచ్యుతుండు = శ్రీహరి, మొలకనగవొప్ప = చిఱునవ్వంకురింపఁగా, శ్రీదేవి మోముసూచి=లక్ష్మీముఖము వీక్షించి, వాదు = వాదము, ఇతనిచేతగెలిపింతుక్ = అనాఘ్రాతశాస్త్రగంధుఁడైన యీవిష్ణుచిత్తుని చేతనే గెలిపింతును. నాదుమహిమము = నా ప్రభావమును, ఉవిద=ఓయువతీ, కనుమని = చూడుమని, ప్రాభవము = ప్రభుత్వము, ఒప్పక్=పొల్పగునట్లుగా, పల్కెక్=మఱియు నొక్కవాక్య మానతిచ్చెను.

తా. ఇట్లనఁగా నావిష్ణుచిత్తునిభక్తికి మెచ్చి మన్నారుస్వామి చిఱునవ్వు వెడలుచుండ శ్రీదేవిముఖము చూచి యితనిచేతనే వాదము గెలిపించెద నామహిమముం జూడు మని ప్రభుత్వ మొప్పునటుల మఱియొకవాక్య మానతిచ్చెను.

క. నీయిచ్చ యెయి? మిన్నక పో
వోయి; మునిప్రవర! నిన్ను నొప్పింతును(నె) భూ
నాయకసభ నిందులకై
నీయత్నము వలవ దవల నే నున్నాఁడన్. 94

1. చే. 2. బలికె.

టీ. మునిప్రవర=మునిశ్రేష్ఠుఁడా, నీయిచ్ఛయె=నీయిష్టమా, మిన్నక = ఊరక, పోవోయి=చనుము, భూనాయకసభన్=పాండ్యునిసభయందు, నిన్నున్ = నిన్ను, ఒప్పింతున్ = సభ్యులు శ్లాఘించునట్లు చేయుదును. ఇందులకై = ఈకార్యమునకై, నీయత్నము = నీప్రయత్నము, వలవదు = అక్కఱ లేదు, అవలన్ = అవలనడుచుకార్యవిషయమై, నే నున్నాఁడను.

తా. మునిశ్రేష్ఠుఁడ వగు నోయి విష్ణుచిత్తుఁడా నీయిష్టప్రకారమా ? ఊరక వెళ్లి మపాండ్యరాజుయొక్క సభయందు నీకు మెప్పు గలుగఁజేసెద నిందులకై నీ వేమియుం జేయవల దచ్చటి కార్యముల నెఱవేర్చుటకై నే నున్నాఁడ నని స్వామి యానతిచ్చెను.

ఆ. అనిన మాఱు వలుక ♦ నలికి యయ్యాళువా
రియ్యకొనియెఁ బోవ ♦ నంతలోనఁ
బద్మనయనుఁ డతనిపయనంబుఁ దూఁగింపు
మనుచు నంబితోడ ♦ నానతిచ్చె. 95

టీ. అనినన్=అనఁగా, మాఱువలుకన్ = ప్రత్యుత్తరమిచ్చుటకు, అలికి=వెఱచి, అయ్యాళువారు = అప్పెరియాళ్వారు, పోవన్=స్వామిసన్నిధినుండి యాజ్ఞ వహించి వెళ్ళుటకు, ఇయ్యకొనియెన్ = సమ్మతించెను, అంతలోనన్ = ఆసమయమున, పద్మనయనుఁడు = మన్నారుస్వామి, అతనిపయనంబున్ = ఆవిష్ణుచిత్తుని ప్రయాణమును, తూఁగింపుము = సాగింపుము, అనుచున్ = ఇట్లనుచు, నంబితోడన్ = అర్చకునితో, ఆనతిచ్చెన్ = ఆజ్ఞాపించెను.

తా. సుగమము.

విష్ణుచిత్తుఁడు మధుర కేఁగుట

క. ఆనతిఁ బడి శ్రీభండా
రాన న్సంబడమునందు ♦ [1]ప్రాయందలముల్
స్థానికుఁ డొసంగి పనుపం
గా నానతిఁ బడిన నిమితశకాంప్రు వహింపన్. 96

టీ. ఆనతిఁబడి=స్వామి యాజ్ఞనుపొంది, స్థానికుఁడు = పారుపత్తెకాఁడు, శ్రీభండారానన్ = ఉగ్రాణమునుండి, సంబడమున్=బత్తెపుసంబళము, తన...ముల్ - తనదు= తన సంబంధియైన, ప్రాయందలముల్ = పురాతనమైన యందలమును, ఒసంగి = ఇచ్చి,

1. ప్రాఁతందలముల్.

పనుపన్ =అనుపఁగా, అనతిఁబడిన = సెలవువెంటనే, సిమితకాండ్రు = మోఁతకాండ్రు వహింపన్ = మోయఁగా. ముందఱి కన్వయము.

తా. ఆకోవెలపారుపత్తెకాఁడు స్వామి యానతిచ్చినతెఱంగున నుగ్రాణమునుండి బత్తెపుసంబళము దీసియిచ్చి పురాతన మగునందలము నొసఁగి పంపఁగా సెలవొందిన మోఁతకాండ్రు మోయుచుండఁగా.

క. లావు గల[1]యట్టిగుబ్బపుఁ
జావడములమీఁద మాత్రసంచులు దూలన్
గ్రేవల నేకాంగులు రా
[2]వీవధముల నరిసె లవనివిభునకుఁ గొనుచున్. 97

టీ. లావు...మీఁదన్ - లావుగలయట్టి = బలిసియున్నట్టి, గుబ్బపుఁజావడముల మీఁదన్ = గుబ్బపుఁదట్టువులమీఁద, మాత్రసంచులు = అసిమిసంచులు, తూలన్ = వ్రేలాడుచుండఁగా, ఏకాంగులు = కోవెలయధికారు లగునేకాంగులు, (ఏకాంగు లనఁగాఁ బుత్రమిత్రకళత్రాదులం బరిత్యజించి భగవత్కైంకర్యమే పరమప్రయోజనమని కావివస్త్రములు గట్టుకొని భగవత్కైంకర్యార్థము శరీరమును బ్రాణము నర్థమును తృణముగాఁ జూచు విరక్తులు.) గ్రేవలన్ = ఇరుప్రక్కల, రాన్=రాఁగా, వీవధములన్ = కావళ్లలో, అరిసెలు = అనేకవిధములుగాఁ జేయంబడిన యతిరసములు, అవని విభునకున్ = భూపతికి, కొనుచున్ = పట్టించికొని.

తా. మిగుల బలిసియున్న గుబ్బపుఁదట్టువులమీఁద నసిమిసంచులు వ్రేలాడుచుండఁగాఁ గోవెల యధికారు లుభయపార్శ్వంబులఁ జనుదేర భగవత్ప్రసాదంబులయిన యతిరసంబులు రాజున కిచ్చుటకుఁగాఁ గావళ్లలోఁ బట్టించికొని.

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి బరికరంబులు వెట్టి
కట్టిన పారివిళంబిగా[3]యగములు
నెసటిపోఁతలు గాఁగ నేర్చి నించినచిరం
తనపు శాలికేమకతండులములు
పడిఁబెట్టి లో[4]జీర గుడము సాఁబా లూన్పఁ
జెలఁగు సంబారంపుఁజింతపండు
పెల్లలోహాండికావళ్ల కొమ్ములవ్రేలు
గిడ్డిమొత్తము నేతికలడ్డిగలును

1. యద్దా. 2. వేవిధముల. 3. గమిరము. 4. ఁజెఱకొదము.

తే. పెరుఁగువడియంబులును బచ్చివరుగు పేడ
లురుతరాచ్యుతపూజోపకరణపేటి
కలునుసాత్తిన సాత్తనికులము బలసి
విధినిషేధము లెఱిఁగి తేర మధుర కరిగె. 98

టీ. సాధ్వి = ఆవిష్ణుచిత్తునిభార్య, భక్తిన్ = భక్తిచేతను, త్రోవకున్ = మార్గమునకు, పరికరంబులు వెట్టి = పరికరంబు లునిచి, కట్టిన = మూటఁగట్టిన, పొరివిళంగాయగములు = పొరివిళంగాయలపణ్యారములును, ఎసటిపోఁతలుగాఁగన్ = ఆతీరునసే వండుకొనఁదగినవై యిసుక లేకుండునట్లుగా, ఏర్చి = ఏఱి, నించిన = నిండించిన, చిరంతనపు = ప్రాఁతలైన, శాలిక్షేమతండులములు, లోన్ = లోపలన్, వడిఁబెట్టి = శోధించి (నలుసులు లేకుండునట్లొనరుట), జీర = జీలకఱ్ఱను, గుడము = బెల్లమును, సాఁబాలు = సరివాటుగా, ఊన్పన్ = ఊంచఁగా, చెలఁగు = ఒప్పుచున్న, సంబారంపుఁజింతపండు, పెల్లు...లన్ - పెల్లు = మెండైన, లోహండికావళ్ల = లోపలహండీలుగలకావళ్లయొక్క, కొమ్ములన్ = అగ్రములందు, వ్రేలు...మున్వ్రేలు = వ్రేలాడుచున్నట్టి, గిడ్డి...ను - గిడ్డిమొత్తము = ఆవులసంబంధియైన, నేతిలడ్డిగలును = నెయ్యిపోసిన లడ్డిగలును (లడ్డిగ లనఁగా మూఁతిమూచికనుండుపిడతలు), పెరుగువడియంబులును, పచ్చివరుగు = వేయింపనివరుగులు, పేడలు = ఒలుపుఁబప్పు, ఉరు...టి - ఉరుతర = గొప్పలైన, అచ్యుత = శ్రీవిష్ణునియొక్క, పూజోపకరణపేటికలును = అర్చనోపయోగివస్తుపూరితములగు పెట్టెలును, చాత్తిన = శ్రీవైష్ణవులయొక్కయు, చాత్తని = చాత్తాదులయొక్క, కులము = సమూహము (చాత్తినవా రనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁజేసిన బ్రాహ్మణోత్తములైన శ్రీవైష్ణవులు, చాత్తనివా రనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁజేయ నధికారము చాలని యితరవర్ణవైష్ణవులు.) విధినిషేధము లెఱిఁగి తేన్ = ఎవ్వరెవ్వరే మేమియుం దెచ్చుట కర్హులో వార లావస్తువులఁ దెచ్చుచుండఁగా, అవిష్ణుచిత్తుఁడు, మధురకరిగెన్ = మధురాపురంబునకుఁ జనెను.

తా. ఆపెరియాళ్వారుయొక్క భార్య పతివ్రతాశిరోమణి యగుటంజేసి మిగుల భక్తితోఁ గూడినదై యతనిత్రోవకుఁ బరికరంబు లుంచి మూటఁగట్టినపొరివిళంగాయలు మిక్కిలియు పరిశోధింపఁబడిన క్షేమతండులములు, సంబారంపుఁజింతపండు, హండికావళ్లకొనలయందు వ్రేలాడుచుండెడి యావునేతిచే నింపఁబడిన మూఁచిమూఁతిపిడతలును పెరుఁగు వడియంబులు వరుగులు చాయపప్పు శ్రీవిష్ణుపూజోపయోగిపరికరణ

బృందపూరితంబు లగు పేటికలును వీని శ్రీవైష్ణవులు చాత్తాదులు స్వస్వయోగ్యతాను రూపంబుగ వెంటఁ దెచ్చుచుండ నాబిష్ణుచిత్తుండు మధురానగరమునకు వెళ్లెను.

చ. యమనియమాదిలభ్య ద్రుహిణాది*జరన్మరుదిభ్య, సంసృతి
శ్రమహరనామకీర్తన, మురప్రవికర్తన పాతకావలీ
దమన రమాంగనాకమన తామరసాయతనేత్ర భక్తహృ
ద్భ్రమతృణదాత్ర, భూయువతిరంజన, వర్ణజితాభ్రఖంజనా. 99

టీ. యమ నియమాదిలభ్య = యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లనియెడు నష్టాంగయోగములచేఁ బొందఁదగినవాఁడా, ద్రుహి...భ్య - ద్రుహిణ = బ్రహ్మ, ఆది = మొదలగు, జరత్ = వృద్ధులైన, మరుత్ = దేవతలకు, ఇభ్య = ప్రభువైనవాఁడా, ని. 'ధాతాబ్జయోనిర్ద్రుహిణః, ఇభ్యఆఢ్యోధనీ స్వామీ, మరుతౌ పవనామరౌ' యని యమరుఁడు. సంసృతి...న - సంసృతి = జన్మమరణాదిరూప సంసారమందలి, శ్రమ = ఆయాసమును, హర = హరించునట్టి, నామకీర్తన = నామసంకీర్తనముగలవాఁడా, మురప్రవికర్తన = మురాసురునిఖండించినవాఁడా, పాతకావళీదమన = పాపముల హరియించువాఁడా, రమాంగనాకమన = లక్ష్మీకాముక, 'కమనఃకామనోభిక' యని యమరుఁడు. తామరసాయతనేత్ర = తామరఱేకులవలె వెడల్పులైన కన్నులుగలవాఁడా, భక్త...త్ర-భక్త=భక్తులయొక్క, హృత్=మనంబులందలి, భ్రమ = భ్రమలనియెడు, తృణ=గడ్డికి, దాత్ర = లవిత్రమైనవాఁడా, ని. 'దాత్రం లవిత్ర' మ్మనియమరుఁడు. భూయువతిరంజన-భూయువతి = భూమియనుస్త్రీని, రంజన = సంతోషపెట్టువాఁడా, వర్ణ...నా - వర్ణ = దేహకాంతిచేతను, జిత = గెలువఁబడిన, అభ్ర = మేఘమును, ఖంజనా = కాటుకపిట్టయునుగలవాఁడా, ని. 'ఖఞ్జరీటస్తు ఖఞ్జనః, వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ, అభ్రంమేఘో వారివాహ' యనియు నమరుఁడు. ఇందు లభ్య, దిభ్య యిత్యాదు లంత్యానుప్రాసములు కలవు.

తా. యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధు లనియెడియష్టాంగయోగములచేతఁ బొంద సాధ్యమైనట్టియు, చతుర్ముఖుఁడు మొదలగు బృందారకబృందంబులకుఁ బ్రభువైనట్టియు, జననమరణాదిరూపసంసారజన్య శ్రమ నివారకంబైన నామకీర్తనముగలయట్టియు, మురాసురుని వధియించినట్టియు లక్ష్మీదేవికిఁ గాముకుఁడైనట్టియు, తామరఱేకులవలె విశాలంబులైన నేత్రంబులు గలయట్టియు, భక్తజనహృదయస్థితంబు లగుభ్రమ లనియెడిగడ్డికి లవిత్రమైనట్టియు, భూవల్లభుండై

*జగ.

నట్టియు నిజదేహకాంతిచేత గెలువంబడిన మేఘఖండనములయొక్క కాంతిగల యో శ్రీహరీ యని గ్రంథకర్త గ్రంథమధ్యమందుఁ జేయఁబడిన మంగళం బొనరించు చున్నాఁ డనుట.

క. దోర్ధూర్ధృతదుర్ధరగో, వర్ధన! రాధానురాగవర్ధన! లీలా
వార్ధుషికా! యిషికాకృత, వార్ధశ్రవసైకనేత్రవైకృతినిపుణా! 100

టీ. దోర్ధూ...న-దోః = భుజములయొక్క, ధూః = భారముచేతను, ధృత = ధరియింపఁబడినట్టి, దుర్ధర = అన్యులచే ధరియింపశక్యముగాని, గోవర్ధన = గోవర్ధనపర్వతముగలవాఁడా, రాధా...న-రాధా = రాధయొక్క, అనురాగ = ప్రీతిని, వర్ధన = వృద్ధిఁ బొందించువాఁడా, లీలా...కా-లీలా = విలాసముచేతను, వార్ధుషికా = వడ్డిపుచ్చుకొనువాఁడా, ని. 'వృద్ధ్యాజీవో వార్ధుషిక' యని యమరుఁడు. (వేంకటేశ్వరుఁడు వడ్డికాసులవాఁ డనుట.) ఇషికా...ణా-ఇషికాకృత = తృణముచేతఁ జేయఁబడిన, వార్ధశ్రవస = ఇంద్రపుత్త్రుఁ డయిన కాకాసురునియొక్క, ఏక = ఒక్కటైన, నేత్ర = కంటియొక్క, వైకృతి = భంగమునందు, నిపుణా = సమర్థుఁడా. వృత్త్యనుప్రాసము.

తా. ఇతరులచే ధరియింప నశక్యం బైనగోవర్ధనపర్వతమును భుజముచేత ధరియించినట్టియు, రాధకుఁ దనయందుఁ గల ప్రీతి నభివృద్ధిఁ జేయుచున్నట్టియు, విలాసార్థము జనులచే వడ్డిఁ బుచ్చుకొనునట్టియు, తృణముచేత కాకరూపము వహించి సీతాస్తనవిదారణముచేసిన కాకాసురుని యొకకంటియొక్క వికారమును బొందించుటయందు సమర్థుఁడ వైనట్టి యో శ్రియఃపతీ; యని పూర్వమువలె మంగళం బొనరించుచున్నాఁడు.

మాలినీ. ద్రుహిణజముఖమౌనిస్తోమనిస్తంద్రభాస్వ
ద్దహరవిహరమాణాఽఽతామ్రపాదాంబుజాతా
బహిరబహిరపారప్రాణికోటిప్రపూర్ణా
మహిమవినుతవాణీమాధురీవేద్యపర్ణా 101

టీ. ద్రుహిణజ...తా-ద్రుహిణ = బ్రహ్మవలన, జ = పుట్టిననారదుఁడు, ముఖ = మొదలగు, మౌనిస్తోమ = మునిబృందముయొక్క, నిస్తంద్ర = మఱపులేని, భాస్వత్ = ప్రకాశించుచున్న, దహర = హృదయాకాశమందు, విహరమాణ = విహరించుచున్న, ఆతామ్ర = అంతట నెఱ్ఱనై, పాదాంబుజాతా = కమలములవంటి పాదములుగలవాఁడా, బహి...ర్ణా - బహిః = వెలుపలను, అబహిః = లోపలను, అపార = పారములేని, ప్రాణికోటి = జంతుకోట్లయందు, ప్రపూర్ణా = సంపూర్ణుఁడైనవాఁడా, మహిమ...ర్ణా-మహిమ = మహత్త్వముయొక్క, వినుతి = స్తోత్రరూపమైన, వాణీ = వాక్యముల యొక్క, మాధురీ = మాధుర్యమును, వేది = తెలిసిన, అపర్ణా = పార్వతిగలవాఁడా.

తా. బ్రహ్మాదులన జనియించిన నారదుఁడు మొదలగువారి సమాజముయొక్క నిశ్చలమై ప్రకాశించుచున్నదహరాకాశమందు సంచరించుచున్నట్టి మిగుల నెఱ్ఱనైయున్న కమలములవంటి పదయుగళము గలవాఁడా! వెలుపలను లోపలను పారములేక యసంఖ్యేయంబు లగుజంతువులయందుఁ బరిపూర్ణుఁడా, పార్వతీదేవిచేతఁ దెలియఁబడిన నిజమాహాత్మ్యముయొక్క స్తోత్రవాక్యమాధుర్యము గలలక్ష్మీనాయకా, అని.

మ. ఇది భూమండనకొండపీడుధరణీభృద్దుర్గపూర్వాద్రి భా
స్వదిభేశాత్మజవీరభద్రజనజీవగ్రాహరాహూయమా
ణదృఢాంచద్భుజకృష్ణరాయమహిరాణ్నామాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయంబై మహిం బొల్పగున్.

టీ. ఇది, భూమండన...దక్-భూమండన = భూదేవికిభూషణంబైన, ని. 'భూషణంస్యాదలంక్రియా, మణ్డనంచ' యని యమరము. కొండపీడుధరణీభృద్దుర్గ = కొండపీడను కొండదుర్గమునందును, పూర్వాద్రి = ఉదయగిరిదుర్గమునందును, భాస్వత్ = ప్రకాశించుచున్న, ఇభేశాత్మజ = గజపతికుమారుఁడైన, వీరభద్ర = వీరభద్రపాత్రుని యొక్క, జన = ప్రజయొక్క, జీవగ్రాహ = ప్రాణములో గ్రహించుటయందు, రాహూయమాణ = రాహువువలె నాచరించెడి, దృఢ = బలిష్ఠమైన, అంచత్ = ఒప్పుచున్న, భుజ = భుజములు గలయట్టి, కృష్ణరాయమహిరాణ్నామ = కృష్ణరాయభూపతి యను పేరుగల, అస్మత్ = నాయొక్క, ఆముక్తమాల్యదక్ = ఆముక్తమాల్యదయందు, హృద్యపద్యము = మనోహరపద్యములుగల, ఆశ్వాసము, ద్వితీయంబై = రెండవదియై, మహిన్ = భూమియందు, పొల్పగున్ = ఒప్పుగును.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశ పయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిరవ్యాఖ్యానం బగు నాముక్తమాల్యదావ్యాఖ్యానంబునందు ద్వితీయాశ్వాసము.

---

1. మహిభృన్నామా.

శ్రీ ర స్తు

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము

---

## తృ తీ యా శ్వా స ము

క. శ్రీ క్షితి నీళా వర ! దను
జోక్షప్రాణహర ! దంష్ట్రికోత్కృత్తహిర
ణ్యాక్షక్షపాచర ! కృపా
వీక్షాదృతబాహులేయ ! శ్రీ[1]వేంకటరాయా. 1

టీ. శ్రీ...వర - శ్రీ = లక్ష్మికి, క్షితి = భూమికి, నీళా = నీళాదేవికిని, వర = నాథుఁడైనవాఁడా, దను...ర - దనుజోక్ష = వృషభరూపుఁడైన రాక్షసునియొక్క, ప్రాణ = ప్రాణములను, హర = హరియించినట్టివాఁడా, దంష్ట్రి...ర - దంష్ట్రికా = కోఱచేత, ఉత్కృత్త = ఖండింపఁబడిన, హిరణ్యాక్ష = హిరణ్యాక్షుఁడనునట్టి, క్షపా చర = నిశాచరుఁడుగలవాఁడా, కృపా...య - కృపా = దయతోఁగూడిన, వీక్షా = కటాక్షముచేత, ఆదృత = ఆదరింపఁబడిన, బాహులేయ = కుమారస్వామిగలవాఁడవైన, వేంకటరాయా = వేంకటేశుఁడా.

తా. కమలాక్షితినీళాదేవులకు భర్తయైనట్టియు వృషభాసురుని జీవమును హరియించినట్టియు వరాహావతారమందుఁ దన దంష్ట్రికచేత ఖండింపఁబడిన హిరణ్యాక్షుఁడు గలయట్టియుఁ గృపాకటాక్షముచేతఁ గుమారస్వామి నాదరించినట్టి వేంకటరాయా! యని గ్రంథకర్త దన యిష్టదైవం బగు వేంకటేశుని సంబోధించి మంగళ మొనర్చెను.

వ. అవధరింపు మ ట్లరిగి యవ్విష్ణుచిత్తుండు. 2

టీ. అవధరింపుము = చిత్తగింపుము, అట్లరిగి=అత్తెఱఁగున వెడలి, అవ్విష్ణుచిత్తుండు

---

1. వేంకటరమణా.

విష్ణుచిత్తుఁడు రాజసభ కేఁగుట

శా. నిత్యంబు న్ప్రతిహారి వాద మగుటన్ విజ్ఞప్తి లేకంపఁ, దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతము న్శంకమైఁ
బ్రత్యుత్థానముఁ జేసి [1]మ్రొక్కఁగ, సభాభాగంబు సొత్తెంచి యా
స్నత్యప్రోజ్జ్వలరాజదత్తవరరత్నస్వర్ణపీఠస్థుఁడై. 3

టీ. నిత్యంబున్ = ప్రతిదినమందును, వాద మగుటన్ = విద్వాంసులకుఁ బరస్పర సంవాదము గలిగియుండుటచేత, ప్రతిహారి = ద్వారపాలకుఁడు, విజ్ఞప్తిలేక = ప్రభువునకు విన్నవింపకయె, అంపన్ = అనుపఁగా, తాన్ = తాను, (అనఁగా విష్ణుచిత్తుఁ డనుట.) అత్యూర్జస్వలుఁడు = మిగులఁదేజముగలవాఁడు, ఔటన్ = అగుటచేత, భూపతియున్ = ప్రభువును, సభ్యవ్రాతమున్ = పండితసమూహంబును, శంకమైన్ = శంకచేత, ప్రత్యుత్థానముఁ జేసి = లేచి, మ్రొక్కఁగన్ = నమస్కారము సేయఁగా, సభాభాగంబు = సభాప్రదేశమును, సొత్తెంచి = సొచ్చి, ఔన్నత్య = పొడవౌటచేతను, ప్రోజ్జ్వల = ప్రకృష్టముగఁ బ్రకాశించుచున్నట్టియు, రాజ = ఏలికచేతను, దత్త = ఇయ్యఁబడిన, వర = శ్రేష్ఠములగు, రత్న = రత్నములు దాపిన, స్వర్ణపీఠస్థుఁడై = బంగారుపీఁటయందుఁ గూర్చుండియున్నవాఁడై. ముందఱి కన్వయము.

తా. నిత్యమును విద్వాంసు లేతెంచి ప్రసంగించుటఁ దెలిసియున్నవాఁడు గాన ద్వారపాలకుండు రాజాజ్ఞఁ బొందకయే లోపలి కనుపఁగాఁ బ్రవేశించిన విష్ణుచిత్తుండు మిగులఁ దేజోవంతుఁ డగుటం జేసి యాభూపాలుండును బండితులును మహాత్ముం డను శంకచేత లేచి నమస్కరింప సభాప్రదేశము సొచ్చి రాజదత్తంబైన రత్నఖచితసింహాసన మందుఁ గూర్చుండి యున్నవాఁడై.

క. ఆతిథ్యము గొని, హరి తన
చేతోగతి నొలయ రంతుసేయని విద్వ
ద్వ్రాతంబుఁ జూచి 'లాఁతుల
మా తరవా యుడుగ మాటల[2]లాడుం' డనుచున్. 4

టీ. ఆతిథ్యముగొని = అతిథిపూజను గ్రహించి, తనచేతోగతిన్ = తనయొక్కచిత్తవృత్తిని, హరి = శ్రీహరి, ఒలయన్ = విహరింపఁగా, రంతుసేయని = చప్పుడుసేయకున్న, విద్వద్వ్రాతంబున్ = పండితసమూహమును, చూచి = వీక్షించి, తరవాయి = ఉపక్రమమును (మీరు ప్రారంభించినదానిని), ఉడుగన్ = నిలుపుటకు, లాఁతులమా = క్రొత్తవారమా? మాటలాడుండు = ప్రసంగముఁ జేయుండు, అనుచున్.

1. నిల్వఁగ. 2. లాడుఁడటంచున్.

తా. సుగమము.

తే. కతిపయోక్తులకే[1] వారి ప్రతిభఁ దెలిసి
నగవు దళుకొత్త రాజునెమ్మొగముఁ జూచి
'యీవు మాధ్యస్థ్యమున నున్న నేముఁ గొన్ని
నొడివెదము మాట' లని తదనుజ్ఞ వడసి. 5

టీ. కతిపయోక్తులకున్ఏ, కతిపయ = కొన్నియైన, ఉక్తులకే=మాటలకే, వారి = ఆసభ్యులయొక్క, ప్రతిభన్ = బుద్ధిని, తెలిసి=ఎఱిఁగి, నగవు = నవ్వు, దళుకొత్తన్ = అంకురింపఁగా, రాజు = రాజుయొక్క, నెమ్మొగము = ముఖమును, చూచి = కని, ఈవు=నీవు, మాధ్యస్థ్యమునన్ = తటస్థభావమునందు, ఉన్నన్ = ఉన్నయెడ, ఏము = మేము, కొన్ని మాటలు = కొన్నియుక్తులను, నుడివెదము = వచించెదము, అని=చెప్పి, తదనుజ్ఞ వడసి = ఆరాజానుమతి నొంది.

తా. విష్ణుచిత్తుం డా సభ్యులు వచించుచున్న కొన్ని మాటలు వినుటచేతనే వారలబుద్ధిని తెలిసికొని చిఱునవ్వుతోఁ గూడినవాఁడై రాజుయొక్క ముఖమును జూచి నీవు మాధ్యస్థ్యమునం దున్నయెడ మేము కొన్ని యుక్తులు చెప్పెద మని రాజానుమతి నొంది.

సీ. అందులో నొకమేటి కభిముఖుం డై యాతఁ
డనిన వన్నియును ము న్ననువదించి[2]
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభయెడఁ బడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్న కొక్కొక్కమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి యమ్మొదలివా నికిని [3]మగిడి

తే. మఱి శ్రుతి స్మృతి సూత్రస మాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంత ముగ నొనర్చి
విజితుఁ గావించి దయ వాని విడిచి పెట్టె. 6

టీ. అందులోన్ = ఆవాదులలో, ఒకమేటికిన్ = ఒకప్రౌఢవాదికి, అభిముఖుఁడై = ఎదురుగా నున్నవాఁడై, ఆతఁడనినవన్నియును = అతఁడు చెప్పినయుక్తుల నన్ని

1. లోనె ప్రతిభ దెలిసి. 2. యెడంబడఁగఁ జెప్పి. 3. మగుడి.

టిని, మున్ననువదించి = ముం దనువాదముఁ జేసి, తొడఁగి=ఉపక్రమించి, అన్నిటికిన్ = అతఁడు సెప్పినయుక్తుల కన్నిటికిని, అన్నిదూషణంబులు = అన్నిదోషంబులు, వేఁపడక = త్వరపడక, ('ప్రథమావైభక్తికేమోర్బిందుశ్చ మహన్పతిక్రియార్థేషు' అను సూత్రముచేత మువర్ణకలోపము.) తత్సభ = ఆసభ్యులు, ఒడఁబడఁగన్ = సమ్మతించునట్లుగ, పల్కి=సంభాషించి, ప్రక్కమాటలన్ = పార్శ్వములనున్నవారు సెప్పునట్టి యాయుక్తులను, ఎన్నక = గణన చేయక, ఒక్కొకమాటనె = ఒక్కొకయుక్తిచేతనే, నిగ్రహస్థాన మనుగ్రహించి = నిగ్రహస్థానమును బొందించి యనుగ్రహించి, (నిగ్రహస్థాన మనఁగాఁ బ్రసంగదోషములకుఁ బేరు) క్రందుగా రేఁగిన = దొమ్మిగాఁ బ్రసంగింపరాఁగా, కలఁగక = తొట్రుపాటు పడక, అందఱన్ = ఎల్లరను, తీర్చి = సమాధానపఱిచి, నిలిపి = ఉంచి, అమ్మొదలివానికినె = ఆమొదలివిద్వాంసునకె, మగిడి = తిరిగి, మఱి = మఱియు, శ్రుతి = వేదవేదాంతములు, స్మృతి = ధర్మశాస్త్రములు, సూత్ర = వ్యాససూత్రములు మొదలగు పర్వసూత్రములు, వీనియొక్క, సమాజమునకున్=సమూహమునకు, ఐకకంఠ్యము = ఏకగ్రీవత, కల్పించి=చేసి, ఆత్మమతము = స్వమతము, జగమెఱుంగఁగన్ = లోకమెఱుంగునట్లు, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, విజితుఁ గావించి = ఓడించి, దయన్=కరుణచేతను, వానిన్=అతనిని, విడిచిపెట్టి.

తా. ఆవాదులలో నొక ప్రౌఢవాది కభిముఖుం డై యతఁడు సెప్పిన యుక్తులను ముం దనువాదముఁ జేసి యుపక్రమించి పిమ్మట నాయుక్తుల కన్ని దూషణంబులును దాను త్వరపడక సభ్యులు మెచ్చునటులఁ బల్కి యిరుప్రక్కల నున్నవారు సెప్పుచున్నమాటల సెన్నక యొక్కొక్కయుక్తిచేత నిగ్రహస్థానము లొదవిన ననుగ్రహించి సభ్యులు దొమ్మిగా వచ్చి ప్రసంగింపఁ దాఁ దొట్రుపడక యందఱు సమాధానపఱిచి యుంచి యామొదలివిద్వాంసునకే మరల వేద శాస్త్ర బ్రహ్మ సూత్రములకు నేకవాక్యతఁ గల్పించి చెప్పి పిమ్మట స్వమతము సిద్ధాంత మని లోక మెఱుఁగునట్లుగాఁ జేసి యోడించి దయచేత వాని విడిచి.

క. 'నీ వే మంటివి 'రమ్మం
చావలివానికిని మగిడి యట్లనె(న)వానిం
గావించి ; యొకఁ డొకఁడు (డ) రాఁ
నా విప్రుఁడు వాదసవణి నందఱఁ గెలిచెన్. 7

టీ. నీవేమంటివి=తొలుత దొమ్మిగఁ బ్రసంగింప వచ్చినవారలలో నొక్కనిం జూచి యీవు పల్కినదేమి, రమ్మంచున్=రమ్మని యోడించి, ఆవలివానికిని = ఆవలనున్న మఱియొకనికిని, మగిడి = అభిముఖుండై, వానిన్=ఆవాదిని, అట్లనె = మొదలివాది

వలెనే, కావించి = చేసి, మఱియు నీప్రకారముగన్, ఒకఁడొకఁడు = ఒకని వెంట నొకఁడుగా, రాన్ = రాఁగా, అవిప్రుఁడు = అవిష్ణుచిత్తుఁడు, వాదసరణిన్ = వాదముఖమున, అందఱన్ = వాదుల నెల్లను, గెలిచెన్ = జయించెను.

తా. మఱియొకనిట్టు తిరిగి నీ వేమంటివి రమ్మని ప్రసంగించి నోడఁగొట్టి యావలివాని కెదురై వానిని నోడఁ గొట్టి యీరీతి నొక్కొక్కఁడుగా రాఁగా నావిప్రుఁడు ప్రసంగించి యందఱఁ బ్రసంగించుసమయమున నోడఁ గొట్టె.

అన్యమత నిరసనము

సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన నీ
    క్షణాద్ది వీశు నశబ్దవాదిఁ
బొరి నీశుఁ డేనని నా భోగమాత్రేత్యాద్యు
    దాహృతిస్ఫూర్తి మాయావివాది
ఫలియించుఁ గ్రియయ నా ఫలమత యిత్యాది
    సర్వేశుఁ గొనని యపూర్వవాది
శాస్త్రయోనిత్వాదిసరణి నీశ్వరునిఁ దె
    ల్పెడు ననుమాన మస్పిలువాది
తే. నిత్యులం దెల్ల నిత్యుఁ డన్యనిత్యురూక్తి
    క్షణికసర్వజ్ఞ తేషి సౌగత వివాది
    ననుపపత్తేర్న యనుసూత్ర మాది యైన
    *వాని నృపతీశుఁ బ్రత్యక్ష వాదిఁ గెలిచె. 8

టీ. జగదుద్గతికిని-జగత్ = జగంబులయొక్క, ఉద్గతికిని = ఉత్పత్తికి, బీజము = కారణము, ప్రధానము = ప్రకృతి, అనన్ = ఇట్లని వాదింపఁగా, వీశున్ = విగతేశుఁ డనఁగా నీశ్వరుండు జగత్కారణము గా దనునట్టి, అశబ్దవాదిన్ = సాంఖ్యుని, ఈక్ష త్యాదిన్ = ఈక్షత్యాదిసూత్రోక్తులచేతను, పొరిన్=మిక్కిలి, ఏను=నేను, ఈశుఁడు= ఈశ్వరుఁడు, అనన్ = అనఁగా, మాయావివాదిన్ = మాయకుఁ గారణత్వముఁ జెప్పుచున్నట్టి యద్వైతిని, భోగ...ర్తిన్ - భోగమాత్రేత్యాది = భోగమాత్ర అనునది మొదలుగాఁగలసూత్రముయొక్క, ఉదాహృతి = ఉదాహరణముయొక్క, స్ఫూర్తిన్ = స్మరించుటచేతను, క్రియయ = అగ్నిష్టోమాదిసత్క్రియయే, ఫలియించున్ = ఫలముల నిచ్చును, నాన్ = అని వాదింపఁగా, సర్వేశుఁగొనని = సర్వేశ్వరునిఁ గొని

* వానినె నిరీశుఁ, వాణి.

యాడనట్టి, అపూర్వవాదిన్ = మీమాంసకుని, ఫలమతయిత్యాది=ఫలమత యను మొద లగుదానిచేతను, ఈశ్వరునిన్ = జగదీశుని, అనుమానము = 'క్షిత్యంకురాదికంసకర్తృ కంకార్యత్వాద్ఘటవత్' అనునట్టి యనుమానమే, తెల్పెడున్ = ఈశ్వరసద్భావమందు ప్రమాణము, అన్ = అనియెడు, పీలువాదిన్ = పరమాణుకారణవాదిని, శాస్త్ర... ణిన్ - శాస్త్రయోనిత్వాది = శాస్త్రయోనిత్వాత్తనునది మొదలగు, సరణిన్ = రీతి చేతను, నిత్యులందెల్లనిత్యుండు = నిత్యవస్తువులలోనిత్యుఁడీశ్వరుండు, అన్ = అనునట్టి, శ్రుత్యురూక్తిన్-శ్రుతి = వేదముయొక్క, ఉరు = గొప్పయైన, ఉక్తిన్ = వాదముచేత, క్షణికసర్వజ్ఞతేషి = క్షణికత్వసర్వజ్ఞత్వాదు లీశ్వరలక్షణంబులనియెడు, సౌగతవివా దిన్ = బౌద్ధుని, ని. 'సౌగత శ్శూన్యవాదిని' యని యమరము. అనుపపత్తేర్న యను సూత్రము, ఆదియైనవానిన్ = మొదలగువానిచేత, నృపతీశున్ = నిగ్రహానుగ్రహసమ ర్థుఁ డగురాజే యీశ్వరుండనునట్టి, ప్రత్యక్షవాదిన్=ప్రత్యక్షమే సత్య మని వాదించు వానిని, (అనఁగాఁ జార్వాకుఁ డనుట.) గెలిచెన్=సభయందుఁ గ్రమముగ నందఱ నోడించెను.

తా. పరిదృశ్యమానం బగు నీ జగత్తునకుఁ బ్రకృతి కారణం బని వాదించునట్టి యశబ్దవాది యగుసాంఖ్యుని ఈక్షత్యాదిసూత్రములచేతను, నే నీశ్వరుఁడ నని వాదించు చున్న యద్వైతిని భోగమాత్రేత్యాది సూత్రములచేతను, కర్మబ్రహ్మవాది యగు మీ మాంసకుని ఫలమత ఇత్యాది సూత్రములచేతను, పీలుపాకవాదిని శాస్త్రయోనిత్వాది సూత్రములచేతను, క్షణికత్వసర్వజ్ఞత్వాదు లీశ్వరలక్షణంబులనియెడు బౌద్ధుని నిత్యో నిత్యానా మనుశ్రుతిచేతను, నిగ్రహ సామర్థ్యము గలిగి కంటికి విషయుం డైయున్న రా జీశ్వరుం డను నట్టి ప్రత్యక్షవాదిని అనుపపత్తేర్న యను సూత్రముచేతను, నిత్తె ఱఁగున నా విష్ణుచిత్తుఁడు సభయందు వాదించి, వారల నెల్లఁ గ్రమంబుగ నోడఁగొట్టెను.

పైని చెప్పఁబడిన సూత్రముల యర్థములను శ్రీరామానుజాచార్య విరచిత బ్రహ్మ సూత్ర భాష్యమునఁ గనం దగు.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖ సంవిత్తత్త్వబోధైకచుం
చుద్వైపాయన[1]సూత్రసచ్ఛ్రుతుల నీశు న్మన్నిరూపించి, పైఁ
దద్విష్ణుత్వము దాని కన్య దివిషద్వ్యావర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాఱాడె న్బ్రమాణంబులన్. 9

టీ. విద్వ...డు - విద్వత్ = విద్వాంసులచేతను, వందితుఁడు = నమస్క రింపఁబడు, ఆతఁడు = ఆవిష్ణుచిత్తుండు, ఇట్లు = ఈరీతిగా, సుఖ...లన్ - సుఖ = సుఖ

1. సూత్రసంహితల.

స్వరూపమును, సంవిత్ = జ్ఞానస్వరూపమగునైన, తత్త్వ = పరబ్రహ్మముయొక్క, బోధైకచుంచు = జ్ఞానమునకు ముఖ్యసాధనంబైన, 'తేనవిత్తశ్చుంచుప్చణపౌ' అనిసూత్రము, ద్వైపాయనసూత్ర = వ్యాససూత్రములచేతను, సచ్ఛ్రుతులన్ = వేదములచేతను, ఈశున్ = సర్వేశ్వరుని, మున్ = మున్ను, నిరూపించి = తెల్పి, పైన్ = పిమ్మట, తద్విష్ణుత్వము - తత్ = ఆసర్వేశ్వరునికి, విష్ణుత్వమున్ = వ్యాపకత్వమును, "విష్ణువ్యాప్తౌ" దానికిన్ = అవిష్ణుత్వమునకు, అన్య...సంబున్ - అన్యవిబుధౌఘత్ = ఇతర దేవతలకు, వ్యావర్తనంబున్ = లేకుండుటయును, విశిష్టాద్వైతంబును, తేటగాన్ = ప్రత్యక్షముగా, తెలుపన్ = తెలుపుటకు, ప్రమాణంబులన్ = ప్రమాణవాక్యములచేతను, మాటాడెన్ = సంభాషించెను.

తా. విద్వాంసులచే నమస్కరింపఁబడుచున్న గురువు విష్ణుచిత్తుఁడు జ్ఞానస్వరూపమును, సుఖస్వరూపము నైనపరబ్రహ్మముయొక్క బోధను బ్రకటింపఁజేయునట్టి బ్రహ్మసూత్రములచేతను వేదములచేతను నీశ్వరుని మున్నుగా నిరూపించి సిద్ధాంతముఁ జేసి యాపిమ్మట నాయీశ్వరునికి వ్యాపకత్వమును నదితర దేవతలకు వ్యాప్యత్వమును విశిష్టాద్వైతంబును బ్రమాణములచేతఁ బ్రత్యక్ష మగునటులఁ దెలుపుటకు సంభాషించెను.

సీ. ఆదినారాయణుం డాయె నొక్కఁడ; బ్రహ్మ
లేఁడు, మహేశుండు లేఁడు, లేదు
రోదసి, లేఁడు సూర్యుఁడు, లేఁడు చంద్రుఁడు
లేవు నక్షత్రము లేవు నీళ్లు,
లే దగ్ని, యట్లుండ లీల నేకాకిత
చనదు పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు నొచ్చి యని ఛాందోగ్యంబు
దెలిపెడు నంతరాదిత్యవిద్య

తే. నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుట
కక్షిణీ యని యష్టదృక్త్ర్యక్షదళశ
తాక్షవిధిరుద్రశక్రాదులందు నొకఁడు
కామి కాశ్రుతియే విలక్షణతఁ దెలిపె. 10

టీ. ఆదిన్ = సృష్ట్యాదియందు, నారాయణుండు=విష్ణువు, ఒక్కఁడ=ఒక్కఁడె, ఆయెన్ = అయియుండెను. బ్రహ్మ = చతుర్ముఖుఁడు, లేఁడు. మహేశుఁడు = శివుఁడు, లేఁడు. రోదసి = భూవ్యంతరిక్షప్రదేశము, లేదు. సూర్యుఁడు, లేఁడు

చంద్రుఁడు, లేఁడు. నక్షత్రములు = చుక్కలు, లేవు. అగ్ని, లేదు. అట్లుండఁగ = ఆరీతి నుండఁగా, లీలన్ = విలాసముచేత, ఏకాకిత = ఒక్కఁడై యుండుట, చనదు = యుక్తముగాదు. పెక్కయ్యెదన్ = అనేకములయ్యెదను, అనుచున్ = సంకల్పించి, చిద చి...సొచ్చి - చిత్ = చిత్తు, అచిత్ = అచిత్తు, వీనియొక్కద్వయంబు = రెంటిని (అనఁగా జీవులయందును జడములయందు ననుట), చొచ్చి = ప్రవేశించి, అయ్యెన్ = తాను బహురూపంబు లాయెను, అని=ఇట్లని, ఛాందోగ్యంబు = ఛాందోగ్యం బనునుపనిషత్తు, తెలిపెడున్ = బోధించుచున్నది. అంతరాదిత్యవిద్యన్ = అంతరాదిత్యవిద్యయందు, అర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుటనన్ = సూర్యునియం దున్నపుండరీకాక్షుండు శ్రీమన్నారాయణుం డౌటకు 'కప్యాసం పుణ్డరీకాక్షం పుణ్డరీకే ఇవ అక్షిణీ' యని ద్వివచనముచేతను, అష్ట...దున్ - అష్టదృక్ = ఎనిమిదికన్నులుగలయట్టి, త్ర్యక్ష=త్రిలోచనుండైనట్టి, సహస్రాక్ష = సహస్రలోచనుండైనట్టి, విధి రుద్ర శక్రాదులందున్ = బ్రహ్మేశానేంద్రాదులందు, ఒకఁడు = ఒక్కండును, కామికిన్=సూర్యమండలాంతర్వర్తికాకపోవుటకు, ఆశ్రుతియే, విలక్షతన్ = వైలక్షణ్యమును, తెలిపెన్ = కనఁబఱచెను.

తా. సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుం డొక్కఁడె యుండుటంజేసి యేకాకిత విలాసమునకు యుక్తము గామి ననేకరూపంబులం బొందెద నని సంకల్పించి చిదచిద్ద్వయాత్మకం బైన ప్రపంచమందుఁ దాను బ్రవేశించి బహురూపము లాయె నని ఛాందోగ్య మనునుపనిషత్తు బోధించుచున్న దనియును, నిదియునుంగాక యంతరాదిత్య విద్యయందు సూర్యునియందున్న పుండరీకాక్షుండు నారాయణుం డనుటకు నక్షిణి యను ద్వివచనము ముఖ్యసాధకం బనియు, బ్రహ్మరుద్రేంద్రాదులలో నెవ్వఁడు గాదనుటకు నాశ్రుతియే వైలక్షణ్యమును దెలుపుచున్న దనియు భావము.

మ. తుల లేకుండు స్వరూప రూప గుణ భూతుల్ దోఁచు నేతచ్ఛ్రుతి;
దలమై లోవెలిఁ దానె యున్కిఁ దెలిపెన్ నారాయణం; బారణం-
బుల సామాన్యవిశేషరీతి నిఖిలంబు న్శబ్దజాలంబు ని
ర్మలనారాయణశబ్దమందునె తుదన్ వ్యాప్త మయ్యె న్శ్రుతిన్. 11

టీ. తుల...ల్ - తులలేకుండు=సమానములేనట్టి, స్వరూప=నారాయణునియొక్క, దివ్యస్వరూపమును, రూప = దివ్యవిగ్రహమును, గుణ = అనంతకల్యాణగుణములును, భూతుల్ = దివ్యైశ్వర్యంబును, ఏతచ్ఛ్రుతిన్ = ఈవేదముచేత, తోఁచున్ = కానవచ్చుచున్నవి, దలమై=తఱుచుగా, లోవెలిన్=లోపలను బైటను, తానెయున్కిని=శ్రీమన్నారాయణుండే యున్నవాఁ డని (తైత్తిరీయోపనిషత్తునందు), నారాయణంబు =

నారాయణమనునదైనపదము, తెలిపెన్ = తెలుపుచున్నది. శ్రుతిన్ = వేదమునందు, అరుణంబులన్ = అరుణములందు, సామాన్యవిశేషరీతిన్ = సామాన్యవిశేషన్యాయము చేతను, నిఖిలంబున్ = సకలమైన, శబ్దజాలంబు = శబ్దసమూహము, నిర్మలనారాయణశబ్దమందు నె = కేవలనారాయణశబ్దములోపలనే, తుదన్ = కడపట, పర్యాప్తమయ్యెన్ = పర్యవసన్నమాయెను.

తా. సాదృశ్యము లేనట్టి శ్రీ హరియొక్క దివ్యస్వరూప దివ్య విగ్రహానంత కల్యాణ గుణ దివ్యైశ్వర్యములు నీ శ్రుతియందు స్పష్టమౌచున్న దనియు, నారాయణుండె సర్వాంతర్బహిర్వ్యాపకుండై తెలుచుగా నున్నవాడని తైత్తిరీయస్థమైన నారాయణ మను నైదవపన్నము దెలుపుచున్న దనియు, నారుణంబులందు సామాన్య విశేష న్యాయము చేత బ్రహ్మేంద్రాది సకల శబ్దములును దుదను నారాయణ శబ్దమందె పర్యవసన్నము లాయె ననియు భావము.

క. వా'దపహతపాప్మా ది, వ్యోదేవ' యనంగఁ బరఁగుసూక్తులమీఁదం
బౌ దగు నారాయణపద, మే దేవాంతరము లేమి నీశ్రుతిఁదీర్చెన్.

టీ. ఈశ్రుతిన్ = ఈఛాందోగ్యాదిశ్రుతులందు, అపహతపాప్మా దివ్యోదేవ యనంగన్ = శ్రు. 'అపహతపాప్మాదివ్యోదేవ ఏకోనారాయణః' అనునటుల, పరఁగు = ఒప్పుచున్న, సూక్తులమీఁదన్ = వేదవాక్యములమీఁదను, పొదగు = ఎదురైయున్నట్టి నారాయణపదము, ఏదేవాంతరములేమిన్ = అంతకంటె వేఱేదైవము లేకుండుటను, వాదు = వివాదమును, తీర్చెన్ = పోఁగొట్టెను.

తా. 'అపహతపాప్మే' త్యాది శ్రుతివాక్యములమీఁద నెదురై యున్నయా నారాయణ పదమే శ్రీమన్నారాయణునికంటెఁ బరంగ నేదైవమును లే దనినిస్సందేహ మగునటుల భక్తిమాత్మకజ్ఞానజన్యవివాదమును దీర్చెను.

వ. "తొల్లి జామదగ్న్యభయంబునఁ బరిత్యక్తరాజ్యుం డై వైరాగ్యంబున దివోదాసాత్మజుం డగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గకాంక్ష నింద్రు నారాధించిన నతండు సన్నిహితుం డై 'మాముపాస్వ' యనుటయు, ముందు గర్భమునం దుండియు నఖండిత తపస్స్నలిత వామదేవుం డగు వామదేవుండు సూర్యోహం మనురహం కక్షీవానహ మ్మని శరీరవాచకశబ్దంబు శరీరపర్యంతంబు పోవుటం జేసి చిదచిచ్ఛరీరకుం డగు వప్పరమాత్ముం గూర్చి యనుసంధించె ననియుఁ దెలిపి, చేతనుం డైన జగత్కారణంబు గామి విబుధులం

దెల్ల విజ్ఞానవృద్ధుం డగు నావృద్ధశ్రవుండు తదనుసంధానన్యాయం బున నుపదేశించె నని శ్రుతి సూత్రముఖంబుల నిగమాంతశాస్త్ర ఫక్కిкं జాల వక్కాణింపంబడు నాత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రభృత్యఖిల చిదచిత్ప్రపంచంబు లతనిశరీరంబు లనియు నందె వినంబడు, నట్లగుట నశేష దివిషచ్ఛరీరంబు ల న్నారాయణ శరీరంబులే కదా యని ముముక్షువు కప్పుండరీకాక్షుం డక్క దేవ్వక్షినైన నుపాసింపవచ్చునే? విష్ణునకుం దత్తత్కాల విగ్రహంబు లగుటం బ్రహ్మ రుద్రాగ్నిజ వ్యాస భానుభార్గవాదిభజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుల కయుక్తం బని స్మృతి చెప్ప, నదియుంగాక యీశ్వరునకుం జేతనునకు నిత్యసంబంధంబు 'మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ' యని సమస్తంబునకుఁ బరాయణంబుగా నతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల దట్టి పరమేశ్వరుం గనుటకుం దగిన యోగంబుఁ జెప్పెద; ఖాండిక్యకేశిధ్వజ సంవాదంబు విను మని యిట్లనియె. 13

టీ. తొల్లి=పూర్వకాలమందు, జామదగ్న్యభీతియంబునన్ = పరశురామునివలని భయముచేత, పరిత్యక్తరాజ్యుండై = రాజ్యముఁ ద్యజించినవాఁడై, వైరాగ్యంబునన్ = వైరాగ్యముచేత, దివోదాసాత్మజుండగు = దివోదాసునకుఁగుమారుఁడైన, ప్రతర్దనుండు = ప్రతర్దనుండనువాఁడు, జనార్దనున్ = శ్రీహరిని, ఎఱుంగక = తెలిసికొనక, అపవర్గ కాంక్షన్=మోక్షేచ్ఛచేత, ఇంద్రున్ = పాకశాసనుని, ఆరాధించినన్ = ఉపాసనసేయఁగా, అతఁడు=ఆయింద్రుఁడు, సన్నిహితుండై = సమీపించినవాఁడై, మాముపాస్వ = నన్ను నారాధింపుము అనుటయు, (తొలుతఁ దన్ను నారాధించుచున్నవానితో మరలఁ దన్నె యారాధింపుమనుటచేత నాసియంతర్యామి యగు నారాయణుని నుపాసన సేయు మన్న ట్లర్థము సిద్ధించె నది యెట్లనిన), మున్ను = పూర్వమందు, గర్భమునం దుండియు = ఉదరమునందుండియె, అఖండిత = భేదింపఁబడని, తపః = తపంబుచేతను, తులిత = సరిసేయఁబడిన, వామదేవుండగు = వ్రద్రుఁడుగలవాఁడైనట్టి, వామదేవుండు = వామదేవుం డనుజడదారి, సూర్యోహం = సూర్యుఁడు నేను, మనురహం = మనువు నేను, కక్షీవానహం = అగ్ని నేను, అని = అనుచు, శరీరవాచకశబ్దంబు = శరీరవాచకంబైన యస్మచ్ఛబ్దంబు, శరీరపర్యంతంబు = శరీరము గలజీవపర్యంతంబు, పోవుటం జేసి = పోవుట

1. ఖాండిక్యజనకసంవాదం బను నితిహాసంబు విను మని యి ట్లనియె.

చేతను, చిదచిచ్ఛరీరకుఁడగు-చిత్ = జీవుఁడు, అచిత్ = శరీరము, శరీరకుఁడు = శరీరముగాఁగలవాఁడు, చిద్రూపాచిద్రూపదేహముగలవాఁ డనఁగా సర్వశరీరకుం డనుట, అగు = అగునట్టి, అప్పరమాత్ముంగూర్చి = అపరమాత్మునిఁగూర్చి, అనుసంధించెను = చింతించెను, అనియు = అట్లని, తెలిపి=ఎఱిఁగించి, జీవభర్తైన తాన్ = జీవభర్తైనతాను, జగత్కారణంబుగామిన్ = ఆకాశాదిజగత్తునకు హేతువుగాకపోవుటచే, విబుధులం దెల్లన్ = దేవతలయం దెల్లను, విజ్ఞానవృద్ధుండగు = విశేషజ్ఞానము చేతఁ బెద్దయైన, వృద్ధశ్రవుండు = దేవేంద్రుఁడు, తన...న్ - తత్ = ఆయుద్గీథముయొక్క, అనుసంధాన న్యాయంబునన్ = చింతన యను న్యాయము చేతను, ఉపదేశించెను=అర్జునకు నుపదేశముఁ జేసెను, అని=అనుకొని, శ్రుతిసూత్రసమూహంబులన్ = వేదముల చేతను, వ్యాససూత్రముల చేతను, నిగమాంతశాస్త్రఫక్కికన్ = వేదాంతశాస్త్ర వాక్యరీతుల చేతను, మిగులన్ = విశేషముగ, వక్కాణింపఁబడున్ = వ్యాఖ్యానము సేయఁబడుచున్నది, ఆత్మయుం = జీవాత్మయును, అవనియున్=భూమియును, అనల పవన గగన కాలమృత్యుప్రభృతి = అగ్ని వాయ్వాకాశ కాలమృత్యువులు మొదలగు, చిదచిత్ప్రపంచంబులు = చిదచిత్తులయొక్కవిస్తారము, అతని = అప్పరమాత్మునియొక్క, శరీరంబు లనియున్ = దేహములని, అందే వినంబడు = ఆవేదమందె వినఁబడును, అట్లగుటన్ = అలాగగుటచేత, అశే...లు - అశేష = సమస్తమైన, దివిషత్ = బ్రహ్మాది దేవతలయొక్క, శరీరంబులు = దేహములు, ఆనారాయణుని శరీరంబులే కదా యని, ముముక్షువునకున్ = మోక్షేచ్ఛగలవానికి, అప్పుండరీకాక్షుఁడకాన్ = ఆనారాయణుండుగాక, ఏవ్యక్తియైనను = ఏశరీరమునైనను, ఉపాసింపవచ్చునె = ఉపాసన చేయఁదగునా? విష్ణునకున్ = పరమాత్మునకు, తత్తత్కాల విగ్రహంబులగుటన్ = సమయోచిత దేహములౌట చేతను, బ్రహ్మ రుద్రార్జున వ్యాస భాను భార్గవ వీరులు, ఆది = మొదలగువారియొక్క, భజనంబు = ఉపాసన, త్రైవర్గికునకుం గాక = ధర్మార్థకామాపేక్ష గలవారలకేగాని, అపవర్గకాంక్షులకున్ = ముముక్షువులకు, అయుక్తం బని = తగ దని, స్మృతి = ధర్మశాస్త్రము, చెప్పున్ = తెలుపుచున్నది, అదియునుంగాక, ఈశ్వరునకున్, చేతనునకున్=జీవునకును, నిత్యసంబంధంబు, మాతా = తల్లి, పితా = తండ్రి, భ్రాతా = తోఁబుట్టువు, ఆవాసః = అధిష్ఠానము, శరణం = రక్షకుఁడు, ని. 'శరణం గృహరక్షిత్రోః' యని యమరము. సుహృత్ = మిత్రుఁడు, గతిః = ప్రాప్యము, నారాయణః = నారాయణుండె, అని = అట్లని, 'లోపోనమ ఆదికే విసర్గస్య' యను సూత్రముచేత విసర్గలోపము, సమస్తంబునకుం బరాయణంబుగాన్ = నిఖిలమునకును బరమపదంబుగాన్, అతనిన్ = ఆనారాయణుని, ప్రతిపాదించు = తెలుపునట్టి, శ్రుత్యంతరంబుగలదు = మఱియొకశ్రుతి గలదు, అట్టిపరమేశ్వరుం గను

టకుఁ = తాదృశదేవునిఁ దెలిసికొనుటకు, తగినయోగంబుసెప్పెదన్ = అనుకూలమైన యోగమును వచించెదను. ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు, వినుమని = ఆకర్ణింపు మని, ఇట్లనియెన్ = వక్ష్యమాణక్రమంబుగాఁ బలికెను.

అ. పూర్వకాలంబునఁ బరశురామునకు వలెనె వైరాగ్యము నొందినట్టి దివోదాసాత్మజుం డైన ప్రతర్దనుం డనువాఁడు మోక్షేచ్ఛ గలవాఁడై జనార్దనునిం గానక యింద్రు నారాధింప నతఁడు ప్రత్యక్షమై నన్నుపాసన సేయుము మనఁగా మదంతర్యామి నుపాసన సేయుమన్నట్టియర్థము కౌషీతకులచేఁ జెప్పఁబడియె, నెట్లనఁగా మున్ను గర్భమునం దుండియుఁ దపంబున నీశ్వరునితోఁ గూడియుం డైన వామదేవుఁ డనుముని సూర్యుఁడు నేను జంద్రుఁడు నే నగ్నియు నే నను శరీరవాచకశబ్దము శరీరిపర్యంతము వోవుటచేత నుభయశరీరకుం డైన పరమాత్మను గురించి యనుసంధాన మొనర్చె నని తెలిపి జీవుఁడైన తా నుపాస్యుండు గానని జ్ఞానవృద్ధుం డగు నింద్రుఁడు వదనుసంధాన న్యాయంబున నుపదేశించె నని వేదవ్యాసప్రణీతశాస్త్రములయందు వివరింపఁబడియె ననియు, బ్రహ్మ శివుఁడు భూమి మొదలగు పంచభూతములు కాలమృత్యుప్రభృతి నిఖిలం బగు చిదచిద్రూపవిస్తారంబు లనిశరీరంబు లనియు, నైనను శుద్ధం బగు నారాయణ స్వరూపమును దక్క మఱియొకస్వరూపమును భజింపఁగూడ దనియు, బ్రహ్మాదులను ధర్మార్థకామకాంక్షు లుపాసన సేయుదురు గాని మోక్షార్థు లుపాసన సేయ రని స్మృతులు దెలుపుచున్న వనియు, జీవేశ్వరులకు నిత్యసంబంధంబనియు, మాతా పితా భ్రాతా వాసశ్శరణం సుహృద్గతి ర్నారాయణ యని నిఖిలంబు నా నారాయణుం డని తెలుపునట్టి కొన్ని శ్రుతు లున్న వనియు, నట్టి పరమేశ్వరుం గనుటకు సాధకంబైనయోగంబు గలదు, ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు చెప్పెద విను మని యిట్లనియె.

## ఖాండిక్యకేశిధ్వజసంవాదము

మ. జనకాఖ్యాఖిలరాజ మొప్పు నిమివంశం బందు ధర్మధ్వజుం
డనుభూజాని మితధ్వజాఖ్య వసుధాధ్యక్షుం జగద్రక్షణా
వనజాతాక్షుఁ గృతధ్వజాఖ్యుఁ గనియె న్వారిద్దఱు న్గర్మరు
ఘనవిజ్ఞానుఁ గ్రమంబునం గనిరి తత్ఖాండిక్యుఁ గేశిధ్వజున్. 14

టీ. జనకా...జము - జనక = జనకుఁడను, ఆఖ్య = పేరుగల, అఖిలరాజము = సమస్తరాజులుగల, నిమివంశంబు = నిమి యను రాజుయొక్క వంశము, ఒప్పున్ = శనరును (అనఁగా నా నిమివంశంబునఁ బుట్టినరాజుల కెల్ల జనకులను నామము గల దనుట), అందున్ = ఆ నిమివంశమందు, ధర్మధ్వజుం డను=ధర్మధ్వజుండనునట్టి, భూజాని

=భూపతి, మితధ్వజాఖ్య = మితధ్వజుం డను పేరు గల, వసుధాధ్యక్షుక్ = అవనీశుని, జగ...క్-జగత్ = జగత్తుయొక్క, రక్షణా = పాలనముగు, వనజాతాక్షుక్ = విష్ణువైనట్టి, కృతధ్వజాఖ్యుక్ = కృతధ్వజుం డనువానిని, కనియెక్, వారిద్దఱుక్ = వారిరువురును, క్రమంబునక్ = వరుసగా, కర్మగుక్ = యాగాదికర్మశీలుఁడైనట్టి, ఖాండిక్యుక్ = ఖాండిక్యుఁ డనునతనిని, ఘనవిజ్ఞానుక్-ఘన = అధికమగు, విజ్ఞానుక్ = జ్ఞానము గల (అనఁగా బ్రహ్మనిష్ఠుం డనుట), కేశిధ్వజుక్ = కేశిధ్వజుఁ డనువానిని, కనిరి. యథాసంఖ్యాలంకారము.

తా. నిమివంశమందుఁ బుట్టిన రాజుల కెల్లను జనను లను నామము గల దనియు, ఆ నిమివంశోత్పన్నుఁ డైనట్టి ధర్మధ్వజుం డనురాజు మితధ్వజుం డనునట్టియుఁ గృత ధ్వజుం డనునట్టియు నిద్దఱను బుత్త్రులుగాఁ బడసె ననియు, వా రిరువురును క్రమంబుగ ననఁగా మితధ్వజుఁడు ఖాండిక్యుఁ డనువానిని, కృతధ్వజుఁడు బ్రహ్మనిష్ఠుం డగుకేశి ధ్వజుఁ డనువానినిం గనిరి.

క. వా రిరువురుఁ దమలోపల
వేరము గొని రాజ్యకాంక్ష విజిగీషువు లై
హోరాహోరిం బోరిరి
బారాదిదినంబు లవని ప్రజలు దలంకన్. 15

టీ. వారిరువురు = ఆఖాండిక్యకేశిధ్వజులు, తమలోపలక్, వేరము గొని = వైరముఁ బెట్టికొని, రాజ్యకాంక్షక్ = రాజ్యాపేక్ష చేతను, విజిగీషువు లై=జయేచ్ఛగల వారలై, హోరాహోరిక్ = ఎడతెగక, బారాదిదినంబులు = పెక్కు దివసములు, అవనిప్రజలు = భూమియందలిప్రజలు, తలంకక్ = భయపడఁగా, పోరిరి=జగడమాడిరి.

తా. పిమ్మట నాఖాండిక్యకేశిధ్వజు లిరువురును దమలో విరోధపడి రాజ్యా పేక్షచేత నొకని నొకఁడు జయింప నిచ్ఛ గలవా రై భూమియందున్న ప్రజలు భయంపడునటులఁ బెక్కు దినములు ఘోర మగుయుద్ధ మొనర్చిరి.

బారాది—'క. బారాది సొమ్ము లుండఁగ, హారముఁ గైకొనుచుఁ జనియె నండ జము.' పా. 4 అ. 'బారాసి' పాఠాం.

చ. పలపల వేగ నిచ్చలును బొంౘులు దీర్చి యతండు నాతఁడుక్
వెలువడి వచ్చి యిత్తుమతి వేణిక యేపిరిగాఁగ పీఁగుచుక్
దలపమెచుం బెనంగఁగఁ గృతధ్వజనందను సైనికావళీ
హాళహాళికిం జెడ న్విఱిగె నాత్తి మితధ్వజనందనుం డనిన్. 16

టీ. అతండుక్ = అఖాండిక్యుఁడును, ఆతఁడుక్ = ఆకేశిధ్వజుండును, నిచ్చ లును = నిత్యమును, పలపల వేగక్ = తెల్లవాఱఁగా, బొంౘులుదీర్చి = బారులుదీర్చికొని,

వెలువడి = రణమునకు వెళ్లివచ్చి, ఇక్షుమతివేశిఁ = ఇక్షుమతీనది, విపిరిగాఁగన్ = ఎల్లగాఁగను, పేఁగుచున్ = నిక్రమించుచును, తలపడుచున్ = తగులు పడుచును, పెనంగఁగన్ = పోరఁగా, కృత...కిన్-కృతధ్వజనందను = కేశిధ్వజునియొక్క, సైనిక= సేనాపతులయొక్క, ఆవళి = సమూహముయొక్క, హాళిహాళికిన్ = రాయిడికి, ఆర్తిన్= ఆపదచేత, మితధ్వజనందనుండు = ఖాండిక్యుఁడు, అనిన్ = యుద్ధమందు, చెడన్విఁటిగెన్ = పాఱిపోయెను.

తా. ప్రతిదివస మందును దెల్లహాఱఁగానే యిక్షుమతీనది నెల్లఁ జేసికొని పోఁజులు దీర్చుకొని జగడము సేయఁగాఁ గేశిధ్వజుని సేనాపతుల ధాటికి నిలువఁజాలక వెఱచి చెడవిఱిగి ఖాండిక్యుండు యుద్ధమందుఁ బరువిడెను.

క. చెడవిఱిఁగి యడవిఁ బడి యెడ
నెడ గట్టులతుదలఁ గోటి కై యిడి లోఁ గడకున్
దడుకుఁ బొడిపించి యాకుల
గుడిసెల వసియించె మంత్రిగురుభటయుతుఁడై. 17

టీ. చెడవిఱిగి = పాఱిపోయి, యడవిఁబడి = అరణ్యముఁ బ్రవేశించి, ఎడనెడన్ = అక్కడక్కడను, గట్టులతుదలన్ = కొండలమీఁదను, కోటి యిడి = వేగు ఉంచి, లోన్ = లోపలను, కడనున్ = తుదవెల్లను, తడుకుఁబొడిపించి = కంపపాతించి, ఆకుల గుడిసెలన్ = పర్ణశాలలయందు, మంత్రి...డై - మంత్రి = ప్రధానులతోడను, గురు = గురువులతోడను, భట = బంట్లతోడను, యుతుఁడై = కూడినవాఁడై, వసియించెన్ = ఉండెను.

తా. పరువిడి యరణ్యముసొచ్చి యక్కడక్కడ నున్న కొండల కొనలయందు వేగునుంచి లోపలఁ జుట్టును గంప నాటించి పర్ణశాలలయందు నాఖాండిక్యుఁడు మంత్రి పురోహిత భట సహితుండై వాసము సేయుచుండెను.

శా. ఆకేశిధ్వజుఁ డంత నా నృపుని రాజ్యం బెల్ల జేర న్ఫలం
బాకాంక్షింపక గెల్తు మృత్యువు నవిద్య [1]న్బుట్టకుండం దుదన్
జా కుండ న్వలెనంచు యోగనిరతిం గ జ్ఞానార్థియుం డై మఖా
నీకంబు ల్రచియించు చుం దొకటికిం గ దీక్షించి తా నున్నచోన్. 18

టీ. అంతన్ = పిమ్మట, ఆకేశిధ్వజుఁడు, అన్నృపునిరాజ్యంబెల్లన్ = ఖాండిక్యుని రాజ్య మంతయును, చేరన్ = తనదు రాఁగా, ఫలంబాకాంక్షింపక = యాగాది

1. న్బుట్టకుండుం, దుదన్ జాకుండు న్వది.

కర్మ ఫలంబులం గోరక, మృత్యువున్ = సంసారరూపమృత్యువును, గెల్తున్ = జయింతును, అవిద్యన్ = అజ్ఞానముచేత, పుట్టనుండకన్ = మరలజనింపకుండ, తుదన్ = కడపట, చావుండన్వలెన్ = చావకుండవలెననుచును, యోగసంగతిన్ = యోగాసక్తిచేత, జ్ఞానాశ్రయుండనై = జ్ఞానము నాశ్రయించినవాఁడనై, మఖానీకంబు - మఖ = క్రతువులయొక్క, అనీకంబున్ = సమూహమును, రచియించుచున్ = ఒనరించుచు, అందున్ = ఆక్రతువులయందు, ఒకటికిన్ = ఒకదానియందును, దీక్షించి = దీక్షఁగైకొని, తాన్ = తాను, ఉన్నచోన్ = ఉండఁగా.

తా. పిమ్మట నా ఖాండిక్యుని రాజ్యమంతయుఁ దనస్వాధీనమై యుండఁగాఁ గర్మఫలంబుల నపేక్షింపక మృత్యువును గెలువవలెననియుఁ నజ్ఞానముచేత మరలఁ బుట్టక కడపటఁ జావు లేకుండవలెననియు నపేక్షించి యోగస్థితిచేతను జ్ఞానము నాశ్రయించి యసంఖ్యేయంబు లగు క్రతువులం జేయుచు నందొక క్రతువునకు దీక్ష వహించి యున్న సమయంబున.

చ. పులు మఖశాలికానికటభూముల మేయుచు నేటివెంటఁ బె
ల్లలమెడునీఱముం దఱిసి యామ్యపతాకన ఘ(ధ)ర్మధేను వా
కెలవుల నాడు వాలభుజగిం గని గోండ్రని యంగలార్చుచున్
గళగతఘంట మ్రోయ నుఱికెం బిడుగుం బలెఁ దాఁకి యుద్ధతిన్.

టీ. ఘ(ధ)ర్మధేనువు=యాగధేనువు, మఖశాలికానికటభూములన్=యజ్ఞశాలాసమీపభూములయందు, పులు = కసవును, మేయుచున్, ఏటివెంటన్ = నదివెంబడి, పెల్ల...న్-పెల్లలమెడు = మిగులదట్టమైన, నీఱమున్ = పొదరింటిని, సూ. 'నస్స్యాత్తద్ధర్మోక్తౌ' యని తద్ధర్మార్థకవిశేషణమున కచ్చుపరమైనప్పుడు నకారాగమము రాఁగా నలమెడునీఱ మని యాయెను. తఱిసి = సమీపించి, యామ్య..కనన్ - యామ్య = యమసంబంధియైన, పతాకనన్ = ధ్వజపట మనఁగా, ఆకెలవులనాడు = ఆపార్శ్వమునందుఁ గదలుచున్న, వాలభుజంగిన్ = (పులియొక్క) పామువంటితోఁకను, కని = చూచి, గోండ్రనియంగలార్చుచున్ = గోండ్రని మిడుకుచును, గళగతఘంట-గళగత=మెడనున్న, ఘంట, మ్రోయన్ = ధ్వనించుచుండఁగా, ఉఱుకన్ = పరువెత్తఁగా, పిడుగుంబలెన్ = అశనివలె, తాఁకి = స్పృశించి, ఉద్ధతిన్ = పడిచేతను.

తా. యాగధేనువు యజ్ఞశాలాసమీపప్రదేశములందుఁ గసవు మేయుచు నేటివెంట దట్టమగు పొదరింటి నానుకొని యమసంబంధియైన ధ్వజపట మనునటుల నా పార్శ్వమునం గదలుచున్న పామువంటి పులితోఁకను జూచి గోండ్రని యంగ

లార్చుచు మెడ నున్న ఘంట మ్రోయునటులఁ బరువిడినను వదలక పిడుగువలె వెంబడించి వడిచేతఁ దాఁకెను.

ఉ. గబ్బు సమక్షికం బయి మొగంబడువన్, దరుపర్ణము ల్పడన్
ద్రొబ్బుచుఁ, గార్ష్మాగిళ్ల రొదతోఁ [1]బురణించెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞగాఁగఁ జెవులూఁదిన వల్లవుఁ డుర్విఁ [2]గూలఁగా
బెబ్బులి గొంతుక్రోల్గఱచి పెల్లున మార్మెడఁ ద్రెళ్లి దాఁటుచున్. 20

టీ. గబ్బు = దుర్గంధము, సమక్షికంబయి = ఈఁగలతోఁగూడినదై, మొగంబడువన్ = ముఖమునఁ గొట్టుచుండఁగా, తరుపర్ణముల్పడన్ = చెట్లనున్న యాకులురాలునట్లుగా, ద్రొబ్బుచున్ = త్రోయుచును, కార్ష్మా...తోన్ - కార్ష్మాగిళ్ల = వర్షాకాలపు మేఘములయొక్క, రొదతోన్ = ధ్వనితోడను, పుర...గాడ్పు - పురణించెడు = సమానమగునట్టి, బొబ్బరింత = ఆఱొప్పుటయొక్క, గాడ్పు = గాలి, ఉబ్బి=ఉల్బణమై, విసంజ్ఞగాఁగన్ = ఒడలెఱుఁగకయుండునట్లుగాను, చెవులూఁదినన్ = కర్ణములఁ బ్రవేశింపఁగా, వల్లవుఁడు = గొల్ల, ఉర్విన్ = భూమియందు, కూలఁగాన్ = పడఁగా, బెబ్బులి = పెద్దపులి, గొంతుక్రోల్ = గొంతుక్రోవి, కఱచి, పెల్లునన్ = అతిశయముచేత, మార్మెడన్ = మాఱుమెడతో, త్రెళ్లన్ = పడునట్లుగా, దాఁటుచున్ = లంఘించుచును. ముందటి కన్వయము.

తా. ఈఁగలతోఁ గూడిన దుర్గంధము ముఖమునకుఁ గొట్టుచుండఁ జెట్లయందున్న యాకులు రాలునటుల నూఁకుచును మేఘధ్వనివంటి రొదచేత నిండియున్న ఱొప్పు వలని గాలి యుబ్బి స్మృతి దప్పునట్లుగా, జెవులూఁదినఁ బసులకాపరియైన గొల్లవాఁడు నేలఁ బడఁగాఁ బెద్దపులి ధేనువు మెడ గొఱికి మాఱుమెడతోఁ బడునటుల దాఁటెను.

ఆ. తనువుఁ గొమ్ము గొరిజఁ గొనకుండ మలఁపుచుఁ
జప్పు డెసఁగఁ దోఁక నప్పళించి
శోణితంబుఁ గ్రోలుచును నేర్పుమై ఘుర్ఘు
గవిని గవికి నీడ్చుకొనపసనున. 21

టీ. ఆవ్యాఘ్రము, కొమ్మున్ = ఆగోవుయొక్కశృంగమును, గొరిజన్ = గొరిసెను, కొనకుండన్ = తాఁకకుండునట్లు, తనువున్=దేహమును, మలఁపుచున్ = మరలించుచు, చప్పుడెసఁగన్ = ధ్వనించునట్లుగల, తోఁకన్ = వాలమును, అప్పళించి=తాటించి, శోణితంబున్ = రక్తమును, క్రోలుచున్ = పానము సేయుచు, నేర్పుమైన్ = నేర్పుతోను,

1. జెఱలాడెడు. 2. వ్రాలఁగా.

ఘుర్మగవిన్ = యాగధేనువును, గవిఁకిన్ = గొండగుహకు, కడ్చు నవసరమునన్ = కడ్చు సమయమందు. ముందటి కన్వయము.

తా. ఆ పులి యాగోవుయొక్క కొమ్ములు గొరిసెలుఁ దాఁకకుండ దానిశరీరము మరలిచి తన తోఁకను జాడించుచు రక్తపానము సేసి తన సామర్థ్యమునఁ గొండగవికి నీడ్చుచున్న సమయంబున.

చ. పొలమరు[1]లందుఁ గూఁతలిడ భూసురు లన్నది [2]వార్ధివార్ధి ప్రాఁ
కుల తుద లెక్కి, చప్పటలు గొట్టి యగల్పఁగ, సాహిణీలు మా
వులఁ బఱపంగ, వైచి సెలవుల్ వెస నాకుచుఁ బోయె వృక్షసం
దలికయి [3]తూఁగుచు న్ఘుటఘుటధ్వని సారె మలంగి చూచుచున్. 22

టీ. అందున్ = అక్కడ, పొలమరులు = పొలముకాపరులు [పొలమరి యనఁగఁ గాఁపును వీకమరి దోఁచు(ఆం. భా. నానా. 47.)], కూఁతలిడన్ = కూఁతలు పెట్టఁగా, భూసురులు = బ్రాహ్మణులు, అన్నదిన్ = ఆనదియందు, వార్ధివార్ధి = సార్ధ్యవార్ధి, ప్రాఁకులతుద లెక్కి = కొనప్రాఁకుల కెక్కి, చప్పటలుగొట్టి = చప్పట్లుగొట్టి, అగల్పఁగన్ = అదలింపఁగా, సాహిణీలు = రౌతులు, మావులఁబఱపఁగన్ = గుఱ్ఱములనెక్కి పఱపుచుండఁగా, వైచి = ఆ ధేనువును విడిచి, సెలవులు నాకుచున్, వెసన్ = గొబ్బున, వృక్షసందలికయి = చెట్లు మెండుగ నుండుచోటికి, తూఁగుచున్ = తూఁగుచు, ఘుటఘుటధ్వనిన్ = ఘుటఘుట ధ్వనిచేత, సారె = మాటిమాటికిని, మలంగి చూచుచున్ = మరలి చూచును. ముందటికన్వయము.

తా. ఆ ప్రాంతములందుఁ బొలముఁ దిరుగువారలు చూచి కూఁతలిడఁగా విని బ్రాహ్మణు లానదియందు సార్ధ్యవార్ధి చెట్లపై నెక్కి చప్పట్లు గొట్టి యదలించుచుండ నంతలో రౌతులు గుఱ్ఱములనెక్కివచ్చి తఱుముచుండఁగా నా పెద్దపులి సెలవులనాకుచు శీఘ్రముగా మిగులఁ జెట్లు గలిగియున్నచోటికి ఘుటఘుటధ్వనిఁ జేయుచుఁ బలుమాఱు వెనుకఁ దిరిగి చూచుచు వెళ్ళెను.

క. చుఱచుఱుకున నెత్తురు వెలి
గఱుకుచు రొద సేయ, [4]సఱితిఁబొడిసిన యూర్పుల్
పఱవ[5]మిడిగ్రుడ్లు వడఁకఁగఁ
గొఱప్రాణముతోడఁ దన్ని (న్ను) కొను నమ్మొదవున్. 23

టీ. చుఱచుఱుకునన్, నెత్తురు = రక్తము, వెలికిన్ = వెలుపటికి, ఉఱుకుచున్ = బయలువెడలుచు, రొదసేయన్ = చప్పుడుసేయఁగా, అఱితియొడపిన = మెడగండి

1. లంది, లెందుఁగూ. 2. లోనవార్చి. 3. తేలుచు. 4. నఱుత నొదవిన, 5. మిడిగ్రుడ్లవణఁకుచు.

వలనసె, ఊఁతిప్పలు = నిట్టూర్పులు, పఱపక్ = వెడలఁగా, మిడిగ్రుడ్లు = మిట్ట గ్రుడ్లు, పడఁకఁగక్ = వణఁకుచుండఁగా, కొఱప్రాణముతోడక్ = కొనయుసురుతోడ, తన్నికొను = తన్నుకొనుచున్న, అస్మెుదవుక్ = ఆగోవును.

తా. సుగమము.

సీ. విన్నవించుటయు ఋ త్విజులఁ బ్రాయశ్చిత్త
మడిగె రా, జడిగిన నడుగు మనిరి
వారు కసేరువుఁ దా రెఱుంగక పోయి
యతఁడును శునకుని నడుగు మనియె
నతఁడు దాను నెఱుంగ నని పల్కి, [1]నృప విను
మా ఋత్విజులపిండు నాకసేరు
వేను నెఱుంగలే, మిఁక నొక్కయే మెకా,
ఇల మఱి యెవ్వాఁడు నెఱుఁగఁ, డెవ్వఁ

తే. డేని సప్తాంగములు నీకు [2]నిచ్చి చెట్లు
వట్టి పెన్నాలతిప్పలు వట్టి తిరుగు
నట్టిఖాండిక్యుఁ డొక్కఁడ యరయ నెఱిఁగె
నే నెఱుఁగు; వేఁడు మది కర్జ మేని' యనిన. 24

టీ. విన్నవించుటయుఁ = ధేనువుకశేను రాజునకుఁ దెలుపఁగా, రాజు, ఋత్విజులఁ = ఋత్విజులను, ప్రాయశ్చిత్త మడిగె, అడిగినక్ = అడుగఁగా, వారు, తా రెఱుంగకపోయి = తా మెఱుంగక, కసేరువుక్ = కసేరువను ఋషిని, అడుగు మనిరి, అతఁడును = ఆకసేరువును, శునకునిక్ = శునకమహర్షిని, అడుగుమనియెక్, అతఁడు = ఆశునకుండు, తానుక్ = తానును, ఎఱుంగక్ = ఎఱుఁగను, అనిపల్కి = అట్లని చెప్పి, నృపా = ఓరాజా, వినుము = ఆలకింపుము, ఆఋత్విజులపిండును = ఋత్విక్సమూహమును, ఆకసేరువును, ఏనుక్ = నేనును, ఎఱుంగలేము = ఎఱుఁగఁజాలము, ఇఁకనొక్కయే మెకాదు = ఒకమేముమాత్రమె యెఱుంగనివారము కాము, ఇలక్ = భూమియందు, ఎవ్వాఁడును = ఎట్టివాఁడును, ఎఱుఁగఁడు = తెలిసికొనఁడు, ఎవ్వఁడేని = ఎవ్వఁడైన, నీకు, సప్తాంగములు = స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రబల దుర్గము లనియెడి సప్తాంగములను, ఇచ్చి = ఒసంగి, చెట్లువట్టి = వృక్షములంబట్టి,

1. కృప. 2. నిచ్చవిరిగి చెట్టు చెన్నూళ్ల తిప్పలు వట్టితిరుగు.

పెన్రాలతిప్పలుపట్టి = పెద్దఱాతి గుట్టలఁబట్టి, తిరుగున్ = సంచరించుచున్నవాఁడో, అట్టి ఖాండిక్యుఁడు, ఒక్కండ = ఒకఁడుమాత్రమె, అరయన్ = విచారింపఁగా, ఎఱిఁగెనేని = ఎఱింగియుండెనేని, ఎఱుఁగున్ = ఎఱిఁగియుండును, అది = అడుగుట, కర్జమేని = కర్తవ్యమాయెనా, వేఁడుము = అడుగుము, అనినన్ = అనఁగా.

తా. అఘుర్మధేనువుయొక్క వృత్తాంతము రాజునకు విన్నవింప నతఁడు ఋత్విజులను బ్రాయశ్చిత్త మడుగఁగాఁ దమకుఁ దెలియదు గానఁ గసేరు వనుఋషి నడుగు మనిరి. వాని నడుగఁగ నాకసేరువు శునకుని నడుగు మనియె; నాశునకు నడుగఁగా నతఁడు నాకుం దెలియ దని పల్కి, ఋత్విజులకును గసేరువునకును నాకును దెలియదు గదా, భూమియం దెవ్వరికిని దెలియదు, తెలిసియున్నయెడ నెవ్వఁడు సప్తాంగముల నీ కిచ్చి యడవిపాలై చెట్లు గుట్టలుపట్టి తిరుగుచున్నవాఁడో యట్టి ఖాండిక్యునికిఁ దెలిసియుండవచ్చును గాన ప్రాయశ్చిత్త మడుగుట యవశ్యముగాఁ గర్తవ్యమాయెనేని యతని నడుగవలయు నని చెప్పెను.

చ. నరపతి [1]పల్కెఁ, 'మౌనివర నారిపు నిష్కృతి [2]వేఁడఁబోయిన
న్ధర హతుఁ జేసెనేని సవనంపుఫలం బొడఁగూడుఁ; గాక మ
త్సరగతిఁ జెప్పెనేని మఖతంత్ర మతంత్రముఁ గాక పూర్ణమౌ;
నిరుదెఱఁగు న్మదీప్సితమె యేఁగెద నంచు రథాధిరూఢుఁడై. 25

టీ. నరపతి = రాజు, పలికెన్ = శునకునితో ననియెను, మౌనివర = మునిశ్రేష్ఠుఁడా, నారిపున్ = నాశత్రువును, (ఖాండిక్యుని) నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తమును, వేఁడఁబోయినన్=అడుగఁబోతినేని, అతఁడు నన్ను, ధరన్=నేలపై, హతుఁజేసెనేని = చంపెనా, సవనఫలంబు = యజ్ఞఫలంబు, ఒడఁగూడున్ = సిద్ధించును, కాక = అట్లుకాక, అమత్సరగతిన్ = మత్సరపుమార్గము విడిచి, చెప్పెనేని = ప్రాయశ్చిత్తము వచించినయెడ, మఖతంత్రము = యజ్ఞకృత్యము, అతంత్రముగాక = క్రమము తప్పక, పూర్ణమౌన్ = నెఱవేరును, ఇరుదెఱఁగున్ = రెండువిధములును, మదీప్సితమె=నాచేఁ గోరఁబడినవే, ఏఁగెద నంచున్ = పోయెద నని, రథాధిరూఢుఁడై = అరదము నెక్కినవాఁడై.

తా. ఆకేశిధ్వజుం డనురాజు శునకునితో నోయిమునిశ్రేష్ఠుఁడా! నాయొక్క శత్రువగుఖాండిక్యునిఁ బ్రాయశ్చిత్త మడుగఁబోయిన సమయంబున నేలపైఁ జంపెనేని యజ్ఞమధ్యంబున శరీరము విడుచుటచేత యజ్ఞఫలము చేకూరును. లేక మాత్సర్యము నవలి

1. పల్కి. 2. వేఁడఁబోవ.

ప్రాయశ్చిత్తము సెప్పెనేని యజ్ఞానుష్ఠానము పరిసమాప్తి నొందును. కాన నీ రెండు విధంబులు నా మనోరథంబు లగుటచేతఁ బోయెద నని చెప్పి రథము నెక్కెను.

క. హరిణాజినో త్తరీయుఁడు
నిరాయుధుఁడు నగుచు నతనినెల వగునడవిన్
జొరఁ [1]గొట్టికాండ్రు టెక్కెముఁ
బరికించి యెఱింగి కలయఁబడి కూఁత లిడన్. 26

టీ. హరి...డు-హరిణాజిన = జింకచర్మము, ఉత్తరీయుండు = పైవస్త్రముగాఁ గలవాఁడును, నిరాయుధుఁడును = ఆయుధము లేనివాఁడును, అగుచున్ = ఐ, అతని నెలవగు = ఆఖాండిక్యుని స్థానమైన, అడవిన్ = అరణ్యమును, చొరన్ = ప్రవేశింపఁగా, కొట్టికాండ్రు = అచ్చట నున్న వేగువాండ్రు, టెక్కెముఁ బరికించి = టెక్కెమును జూచి, ఎఱింగి = కేశిధ్వజుండని తెలిసి, కలయఁబడి = కూడి, కూఁతలిడన్ = కూఁతలు పెట్టఁగా. ముందఱి కన్వయము.

తా. జింకచర్మము నుత్తరీయంబుగా ధరించి నిరాయుధుండై యా ఖాండిక్యునకు నివాసస్థాన మగునడవిఁ జొచ్చి పోఁగా నచ్చట నుండు వేగువాండ్రు టెక్కెముఁ జూచి కేశిధ్వజరా జని యూహించి కలసి కూఁతలు వెట్ట సాగిరి.

ఆ. వలస బెదర నృపతి కలఁగక [2]ప్రజవగ
లార్పఁ బనిచి కనుమలందు నిలువ
వేలు వేఱ యేర్చి విలుమందిఁ బనిచి తాఁ
దడుకు పెండె మలుక వొడమ వెడలి. 27

టీ. వలస బెదరన్ = వలసవచ్చియున్న జనము భయపడఁగా, నృపతి = ఖాండిక్యుఁడు, కలఁగక = చలింపక, ప్రజవగలు = జనులచింతలు, ఆర్పన్ = మాన్పుటకు, పనిచి = కొందఱఁ బంపి, కనుమలందు నిలువన్ = గండ్లుకాచుటకు, విలుమందిన్ = విలుకాండ్రను, వేలువేఱయేర్చి = ఏర్పఱచి, పనిచి = పంపి, తాన్ = తాను, అలుక = కోపము, పొడమన్ = అంకురింపఁగా, తడుకుపెండెము = తెట్టువాకిటి తలుపు, వెడలి = వెళ్లివచ్చి. ముందఱి కన్వయము.

తా. వలస వచ్చియున్న ప్రజలు బెదరఁగా నాఖాండిక్యుఁడు చలింపక ప్రజల గోడు మాన్పుటకుఁ గొందఱ నియమించి గండ్లు గాచుటకు విలుకాండ్ర నేర్పఱచి పంపి తాను గోపయుక్తుండై తడికపెండెము వెడలి వచ్చెను.

---

1. కోటికాండ్రు. 2. ప్రజపోక.

క. వచ్చు రిపుఁ [1]జూపులనె చుఱుఁ
బుచ్చుచు సిరిఁ గొనుట మగుడఁబోడముట రుష[2]ము
చ్చిచ్చునను వెచ్చమరి వి
ద్యుచ్చలచాపజ్యఁ దూపుఁ దొడుగుచుఁ బలికెన్. 28

టీ. వచ్చురిపున్ - వచ్చు = తనదికకువచ్చెడి, రిపున్ = శత్రుఁడైనకేశిధ్వజుని, చూపులనె = చూపులచేతనే, చుఱుఁబుచ్చుచున్ = దహించుచు, సిరిఁగొనుట=రాజ్యముఁ దీసికొనుట, మగుడఁబోడముట = మరలవచ్చుట, రుష = రోషము గలుగుట (యనునీ), ముచ్చిచ్చునను = మూఁడగ్నులచేతను, వెచ్చమరి= వేఁడిగలిగి, విద్యు...జ్యన్ - విద్యుత్ = మెఱుపువలె, చల = కదలుచున్నట్టి, చాపజ్యన్ = వింటియల్లెయందు, తూఁపుదొడుఁగుచున్ = బాణముఁదొడుఁగుచు, పలికెన్ = వచించెను.

తా. తనదిక్కునకు వచ్చుచున్న కేశిధ్వజుని ఖాండిక్యుండు చూపులచేతనే దహించుచు రాజ్యముఁ దీసికొనుటయు మరల వచ్చుటయును రోషము గలుగుటయు నీ మూఁడు విధంబులైన యగ్నిచేత వేఁడిమిని బొంది మెఱుపువలెఁ జపలమైనట్టి వింటియల్లెయందు బాణముఁ దొడుఁగుచుఁ బలికెను.

మ. 'ధన ధాన్య ద్విరదాశ్వ గో[3]ధనసమేతం బెల్ల [4]సామ్రాజ్యముఁ
గొనియుం జాలక తాటకేయ పలభుక్కూటాకృతిం జింకతో
లున నాచ్ఛన్నుఁడవై ప్రశాంతుగతి మాటలోఁ జొచ్చి ప్రాణంబులన్
గొన [5]నేతెంచితె దుర్మతీ! కెడపెదన్ఘోరంపుభల్లంబున(ల)న్.' 29

టీ. ధన...బు - ధనము, ధాన్యము, ద్విరద = ఏనుంగులు, అశ్వములు, గోధన = గోవు లనెడి ద్రవ్యములతో, సమేతంబు = కూడిన, ఎల్లసామ్రాజ్యముం గొనియున్ = సామ్రాజ్య మంతయుఁ గైకొనియును, చాలక = తృప్తినొందక, తాట...తిన్ - తాటకేయ = తాటకాపుత్త్రుఁడైన, పలభుక్ = మాంసభక్షకుఁడైన మారీచునియొక్క, కూటాకృతిన్ = కపటాకారముతో, ని. 'మాయానిశ్చల యంత్రేషు కైతవానృతరాశిషు, అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గే కూటమస్త్రియాం' అని యమరము. జింకతోలునన్ = కృష్ణాజినముచేత, ఆచ్ఛన్నుఁడవై = కప్పఁబడినవాఁడవై, ప్రశాంతుగతిన్ = శాంతునిఁబలె, మాటన్ = మాటపల, చొచ్చి = ప్రవేశించి, ప్రాణంబులన్ గొనన్ = ప్రాణములనుం దీసికొనుటకు, ఏతెంచితె = వచ్చితివా, దుర్మతీ = ఓరిదుర్బుద్ధీ, ఘోరంపుభల్లంబునన్ = ఘోరమైనయమ్ముచేత, కెడపెదన్ = పడవేసెదను.

---

1. జూచుటయు మఱిఁ. 2. ముచ్చిచ్చున లా వెచ్చఁగ. 3. గణ. 4. సామగ్రి 5. నేతెంచెద.

తా. ధనధాన్యాది సకల సామ్రాజ్య సమృద్ధం బగు రాజ్యముం గైకొనియును తృప్తి లేక మాయావేషము ధరియించిన మారీచునిం బలె జింకతోలుం గప్పుకొని వచ్చి మాలోఁ జొచ్చి మదీయ ప్రాణంబుల హరింప వచ్చితివా దుర్బుద్ధీ! నిన్ను బెడిదపుబాణమునఁ బడ వేసెద నని ఖాండిక్యుండు వచించెను.

మహాస్రగ్ధర

అనినం జేయెత్తి "యోహో! యలుగక వినుఁ; కానాతతాయి న్ప్ర
మాదం,బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ నేఁ భూసురశ్రేణి వేఁడన్
నిను నా వేదించి పంపె 'న్నృపయతఁడెఱుఁగున్నిష్కృతి న్వేఁడుపోపొ'
మ్మని కోప మ్మైనరోపమ్మయిన విడువు, మెట్లైన మే లింక" నన్నన్. 30

టీ. అనినన్=ఇట్లనఁగా, కేశిధ్వజుండు, చేయెత్తి = హస్తముఁ బైకెత్తి, ఓహో, అలుగక = కోపింపక, వినుము = ఆకర్ణింపుము. ఆతతాయిన్ = వధోద్యతుఁడను, (వధార్హుం డనియుఁ జెప్పవచ్చును), కాన్ = కాను, శ్లో. 'అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహర్తారౌ షడేతే హ్యాతతాయినః, ఆతతాయినమాయాంతం హన్యాదేవావిచారయన్' అని మనుస్మృతి ప్రమాదంబునన్ = మాంద్యముచేత, యాగంబునకున్ = యజ్ఞమునకు, వైకల్యంబు = వికలత్వము, పొడమన్ = పుట్టఁగా, నేన్=నేను, భూసురశ్రేణిన్ = విప్రసంఘమును, వేఁడన్ = ప్రాయశ్చిత్త మడుగఁగా, నృప=రాజా, అతఁడు = ఖాండిక్యుఁడు, ఎఱుఁగున్ = తెలిసినవాఁడు, నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తమును, వేఁడుము = అడుగుము, పో పొమ్మని, నినున్ = నిన్ను, ఆవేదించి = నిరూపించి, పంపెన్=పైనము సేసెను. కోపమ్మైనన్ = కోపము నైనను, రోపమ్మయినన్ = బాణము నైనను, ని. 'పత్రీ రోప ఇషుర్ద్వయోః' అని యమరము. విడువుము, ఎట్లైనన్= ఏవిధం బైనను, ఇంకన్ = ఇఁకమీఁదను, మేలు = క్షేమము, అన్నన్ = అనఁగా.

తా. ఖాండిక్యుండు చంపెద ననఁగా విని కేశిధ్వజుండు చేయెత్తి "రాజా! కోపింపకుము. మఱి 'హన్యాదేవావిచారయన్' అను మనువచనప్రకారము విచారింపకయే వధించుటకు నే నాతతాయిని గాను. బుద్ధిమాంద్యమువలన జన్నమునకు వైకల్య మొదవఁగా, విప్రసంఘమును ప్రాయశ్చిత్తము వేఁడ నందులకు, 'నోయి రాజా! యాఖాండిక్యునకుం దక్క నెవ్వరికిం దెలియదు గాన, నతని వేఁడుము పొ'మ్మని నిన్నావేదించి పనిచిరి గాన వచ్చితిని. రోషమును వదలి ప్రాయశ్చిత్తము సెప్పినను లేక బాణమును విడిచి వధించినను, నీకమ్ముం దేవిధం బైనను క్షేమంబే" యని పలికెను.

వ. అనిన నతండు తరుషండంబు సొచ్చి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్ప, మంతనంబునకుం జొచ్చినమంత్రు లిట్లనిరి.

టీ. అనినన్ = ఆకేశిధ్వజుం డిట్లని చెప్పఁగా, నతఁడు = ఆఖాండిక్యుఁడు, తరుషండంబు సొచ్చి = చెట్లగుంపులోపలికిఁబోయి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకున్ = ప్రధానులు పురోహితులు మొదలగు నాప్తజనంబులకును, తద్వృత్తాంతంబు = ఆకేశిధ్వజునియొక్క వృత్తిని, చెప్పన్ = చెప్పఁగా, మంతనంబునకున్ = ఆలోచించుటకు, చొచ్చిన = ప్రవేశించిన, మంత్రులు = ప్రధానులు, ఇట్లనిరి.

తా. సుగమము.

క. 'పాలుగలవాఁడు మన కొక
జాలి యిడక తానె(న) తారసానకు వచ్చెన్ ;
వేళ యిదె, లెమ్ము, నృప! కృప
చాలు న్గారాకు మేపి చంపకు ప్రజలన్. 32

టీ. పాలు గలవాఁడు=దాయాదుఁ డగువాఁడు, మన కొకజాలి యిడక = మన కొక వ్యథపెట్టకయే, తానె, తారసానకు వచ్చెన్ = తలపడుట కేతెంచెను. 'వికృతౌ క్వచిచ్ఛలోపో మో ర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవే' త్తను సూత్రముచేత ములోపమును బూర్వవర్ణ దీర్ఘంబును గలిగె. వేళయిదె = సమయమిదె, నృప! = రాజా, కృప చాలును=దయచేసినది చాలును, ప్రజలను = మీ ప్రజలను, కారాకు మేపి = ముదికూరఁ దినిపించి, చంపకుము = వధింపకుము, లెమ్ము.

తా. మంత్రులు 'దాయాదుఁ డైనవాఁడు మన కొకశ్రమ నియ్యక తానే తారసమునకు వచ్చెఁ గాన నిదె సమయము; రాజా! శత్రుని విషయమందు మీదయ చాలును, మీ సేవకు లగు ప్రజలను ముదికూరఁ దినిపించి చంపకుము, శీఘ్రముగ యుద్ధమునకు లెమ్ము.

ఉ. అంటలు గట్టి [1]చేలకును నాండ్రును బిడ్డలుఁ గూరఁగోయఁబోఁ,
గంటకము [2]ల్పదాగ్రములఁ గాఁడఁగ దూసిననొప్పిఁ గూయిడక్
గంటికి నిద్ర గాన కొదు గంబడి వేఁగెద మిందు; నొక్కమా
కంటయ కాదు, నీవు వడు నట్టియవస్థ వచింప శక్యమే. 33

టీ. ఆండ్రును = భార్యలును, 'నిత్యం దారాదేశ్చ స్యా ల్లో ర్లులయో రుకా చ తత్ర స్త' అను సూత్రముచేత నాండ్రు, బిడ్డలు, అంటలుగట్టి = గుంపులు గట్టుకొని,

1. చెల్కెలకు, చెల్కలకు. 2. పదాబ్జములఁ గాఁడ నొధర్చిన నొప్పిఁ గూయిడక్.

చేలకున్ = క్షేత్రములకు, కూరఁగోయఁబోన్, కంటకముల్ = ముండ్లు, పదాగ్రములన్ = కాళ్లకొనలయందు, కాడఁగన్ = నాటఁగా, దూసిననొప్పిన్ = విడఁదీసిననొప్పిచేత, కూయిడన్ = కూఁతలువెట్టఁగా, కంటికినిద్ర గానక = కంటికినిద్రయెఱుంగక, ఒదుగంబడి = ఒదిగి, వేఁగెదము = వేఁగుచున్నారము, ఒక్కమాకంటయకాదు = మాకుమాత్రమనుటే కాదు, ఇందున్ = ఇక్కడ, నీవు పడునట్టియవస్థ = నీవు పడుకష్టము, వచింపన్ శక్యమే = చెప్పఁదరమా.

తా. ఆంధ్రులును బిడ్డలును పొలములయందుఁ గూరలు గోయం బోవుతఱిఁ గాళ్ల ముండ్లు నాటినం దీయఁగానే నొప్పిచేతఁ గూఁతలిడఁ గంటికి నిద్ర పట్టక యిచ్చట నొదిగికొని వేఁగుచున్నార మిట్టిశ్రమ మాకుమాత్రమె కాదు నీవు పడునట్టియవస్థయుఁ జెప్పఁదరము గాకున్నది గదా.

తే. స్వామ్యమాత్యసుహృత్కోశజనపదబల
దుర్గములు స్వామి గలిగినఁ [1]దొలుతఁ గలవు
అంగి సుఖియైన నంగంబు లటకు మునుపె
చాల సుఖులౌట మనకు దృష్టంబు గాదె? 34

టీ. స్వామ్య...లు-స్వామి = రాజు, అమాత్య = మంత్రులు, సుహృత్ = ఆప్తులు, కోశ = భండారము, జనపద = దేశము, బల = చతురంగబలము, దుర్గములు = కోటలు, ఇవి, స్వామి = ప్రభువు, కలిగినన్ = కలిగినట్లాయెనేని, తొలుతఁగలవు = అమాత్యాదులు ముందే కలరు, అంగి = శరీరి, సుఖియైనన్ = సుఖముగలవాఁడాయెనేని, అంగంబులు = కరచరణాదులు, అటకుమునుపె = అంతకుముందఱనే, చాలసుఖులౌట = మిగుల సుఖముగల వౌట, మనకు దృష్టంబుగాదె = మనకు దృష్టాంతముగావా? అలం. అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసము.

తా. స్వామ్యమాత్యాది సప్తాంగములు రాజుగలిగెనేని యటకు మున్నె యమాత్యాదులుం గలరు. శరీరి సుఖియైన యెడఁ గరచరణాద్యవయవములు మున్నె సుఖంబులం బడసి యుండుట మనకు దృష్టాంతముగా నుండ లేదా యని నుడివిరి.

క. అతనిపనిఁ దీర్ప రాజ్య
ద్వితయము నినుఁ జేరు నెట్టివెరవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజా[2]నీతిరక్షణము ధర్మంబుల్. 35

1. తొలుతె కలుగు. 2. సదయ.

టీ. ఆతనినసనిఁదీర్పక = ఆ కేశిధ్వజునిం జంపితివేని, రాజ్యద్వితయము = మీ యుభయుల రాజ్యములు, నినుక = నన్ను, చేరక = పొందును. ఎట్టినెపపున నైనక = ఏయుపాయముచేతనైనను, అరిజయము=శత్రుసంహారము, ధనోన్నతియుక=ధనమార్జించుటయు, ప్రజానీతిరక్షణము = ప్రజలయొక్క నీతి చెల్లించుటయు, ఇవి, క్షితిపులకు = రాజులకు, ధర్మంబుల్ = ధర్మములు.

తా. ఆ కేశిధ్వజుని వధియించితి వేని మీ యిరువుర రాజ్యములు నిన్నుఁజేరును. ఎట్టి నేర్పుచేతఁ గాని శత్రుసంహారము సేయుటయు ధన మార్జించుటయుఁ బ్రజలను నీతి ప్రకారముగఁ బాలించుటయు నివి క్షత్రియ ధర్మములు.

క. అన్యాయంబున దుస్సహ
మన్యుం డగుప్రబలరిపుని ॥ మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబుగఁ బ్రజాళి ॥ సంరక్షింపన్. 36

టీ. దుస్సహమన్యుం డగు = సహింపరాని యాగ్రహముగలవాఁడైన, ప్రబలరిపునిక = బలవంతుఁడైనశత్రువును, అన్యాయంబునక = అనీతిచేత, మడి...కిక - మడియించిన = మడియించుటవలని, ధర్మన్యక్కృతికిక = ధర్మతిరస్కారమునకు, ప్రజాళిక = ప్రజలసంఘమును, సన్యాయంబుగక = న్యాయయుక్తముగా, సంరక్షింపక = పరిపాలింపఁగా, నిష్కృతి=అదె ప్రాయశ్చిత్తము, అగుక.

తా. మిగుల రోషయుక్తుఁడైన శత్రువు నన్యాయముగ వధియించిన పక్షమున ధర్మ తిరస్కారమగు నందులకు న్యాయముగా దయతోఁ బ్రజాపాలన మొనరించిన యెడ నదియె ప్రాయశ్చిత్త మగుఁ గాక; నిరాయుధుఁడైవచ్చిన పగవానిం జంపినయెడఁ బ్రాయశ్చిత్త మొనరింప వచ్చు నని చెప్పెను.

క. తనరాష్ట్రము చెడ వచ్చిన
ననిమిషపతి విప్రుఁ డనక ॥ యాచార్యుఁ ద్రిశీ
ర్షునిఁ దునుమఁడె విడువుము దయ
నిను నమ్మినప్రజలు నవయ ॥ నీ దయ యేలా? 37

టీ. తనరాష్ట్రము = తనరాజ్యము, చెడవచ్చినక = హానిఁజెందరాఁగా, అనిమిషపతి = దేవేంద్రుఁడు, విప్రుఁ డనక = బ్రాహ్మణుండనక, ఆచార్యుక = గురువైనట్టి, త్రిశీర్షుక = విశ్వరూపుని, తునుమఁడె = వధింపఁడా, దయక = శత్రునిమీఁది కృపను, విడువుము = వదలుము, నిను నమ్మినప్రజలు, నవయక = కష్టపడఁగా, నీదయ = నీకృప, ఏలా = ఏటికి.

తా. దేవేంద్రుఁడు తన రాజ్యమునకుఁ గీడొనరించుచున్న యాచార్యుం డగు విశ్వరూపుని బ్రాహ్మణుం డని విచారింపకయే వధింపలేదా? శత్రునిమీఁద నున్న కృప విడువుము. నిన్ను నమ్మియుండు ప్రజలు కష్టపడుచుండఁగా నీ దయవలన నేమి ప్రయోజనం బని పలికిరి.

క. శిష్టు నిను నింతఁ జేసిన
దుష్టాత్ముని బిలుకుమార్చి ? దురితము పిదపన్
నష్టంబుగ భూవల్లభ!
యిష్టాపూర్తములు సేసి ? యెసఁగఁగ రాదే? 38

టీ. భూవల్లభ = రాజా! శిష్టున్ = శిష్టుఁడవైనట్టి, నినున్ = నిన్ను, ఇంతఁ జేసిన, దుష్టాత్మునిన్ = దురాత్ముని, పిలుకుమార్చి = చంపి, పిదపన్ = పిమ్మట, దురితము = పాపము, నష్టంబుగన్ = నశించునటుల, ఇష్టాపూర్తములు సేసి = క్రతువులు వాపీకూపాది నిర్మాణములు సేసి, ని. 'ఇష్టః క్రతుః శ్రేష్ఠం పూర్తం ఖాతాదికర్మచ' యని యమరము. ఎసఁగఁగ రాదే = ఒప్పరాదే.

తా. పూజ్యుండవైన నిన్ను యిట్టె పెట్టిన దుష్టుం డగుశత్రుని జంపి పిదపఁ బాపములు పోవుటకుఁగాఁ గ్రతువులు వాపీ కూపాది ధర్మములు సేయఁ గూడదా యని వచించి రనుట.

తే. ఇంక రెన్నాళ్లు సూచి, నీవంకఁ దెగువ
గలుగకుండినఁ బ్రజ లూళ్లు ? దలఁచి పోవ
మౌని వగుటయో యుండెడె, వికహీనసంధి
నతనిఁ గనుటొండె గా కొండుకమతము గలదె? 39

టీ. ఇంకన్ = ఇఁకను, రన్నాళ్లు సూచి = రెండుదినములు సూచి, నీవంకన్ = నీయందు, తెగువ = తెంపు, కలుగకుండినన్ = లేకయుండెనేని, ప్రజలు = జనులు, ఊళ్లు దలఁచిపోవన్ = స్వమతమయూళ్లు స్మరించి లేచిపోయినయెడల, మౌనివగుటయో యుండెడె = మునివగుటకాని, హీనసంధిన్ = హీనమగుసంధిచేత, అతనిఁ గనుటొండె = ఆకేశిధ్వజునిఁ జేరుటఁగాని, ఈరెండువిధములు దక్క, ఒండుమతము = గౌరవమైన మతి యొక మార్గము, కలదె = కలదా? లే దనుట.

తా. రాజా! ఇఁకమీఁద రెండు దినములు సూచి జనులు నీయందుఁ దెగువపుట్ట కుండెనేని వారి వారి యూళ్లు తలంచుకొని వెళ్లెదరు. పిదప నీవు మునివృత్తి నాశ్రయింపవలెను; లేక యతనితో హీనసంధియైనను జేయవలయును. ఈరెండువిధములు దక్క గౌరవం బైనమతియొకమార్గము లే దనిరి.

క. జనవర ! తపమునకుం జొ
చ్చినఁ గన్నులు [1]మూసికొంటె ? సెల, వింతియ కా
క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె పరిభవము(పు)శల్య ? మెదలో మెఱమన్. 40

టీ. జనవర = రాజా ! పరిభవము(పు)శల్యము=అవమాన మనెడి ములుఁగు, ఎద లోన్ = హృదయమున, మెఱమన్ = మెఱయుచుండఁగా, తపమునకున్ = తపస్సునకు, చొచ్చినన్ = ప్రవేశించినను, కన్నులు మూసికొంటె = కన్నులు మూసికొనుటయే, సెలవు=ప్రయోజనము, ఇంతియ కాక = ఇంతే కాని, నిదిధ్యాసకున్ = ఏకాగ్రధ్యానమునకు, బ్రహ్మంబు = పరబ్రహ్మము, ఎనయునె = సంప్రాప్తించునా?

తా. ఓ రాజా ! తపముఁ బూనప్పుడు ప్రవేశించినను గన్నులు మూసికొనుటకే ప్రయోజనము గాని తిరస్కార మనియెడియలుగు హృదయమందు మెఱయుచుండఁగా బ్రహ్మానుసంధాన మనుకూలింపదు.

క. అవమతిఁ బితృఘ్ను లగుభూ
ధవుల వెదకి పిల్లపిల్ల ? తరము దునిమి భా
ర్గవుఁడు ముని యయ్యె; మఱి వై
భవము వలదు శాంతి కైనఁ ? బగ దెగ కగునే. 41

టీ. అవమతిన్ = అవమానముచేత, పితృఘ్నులగు = తండ్రినిఁ జంపినట్టి, భూధవులన్ = రాజులను, వెదకి, పిల్లపిల్లతరము = పిల్లలను సహితము వరుసగా, తునిమి = చంపి, భార్గవుఁడు = పరశురాముఁడు, మునియయ్యెన్ = జడదారి యయ్యెను, మఱి = మఱియును, వైభవము = ప్రభుత్వము, వలదు = లెక్కలేదు, శాంతికైనన్ = ఉపశాంతికైనను, పగదెగక = పగఁదీర్చికొనక, అగునే = సిద్ధించునా, సిద్ధింప దనుట. అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసము.

తా. పరశురాముం డవమానముచేతఁ దనతండ్రినిఁ జంపిన రాజులను వెదకిపిల్లపిల్లతరము చంపి పిమ్మట మౌని యయ్యెను. కాన నటువలెఁ బ్రభుత్వము వలదు. పోనీ, శాంతికైనను బగఁ దీర్పకయె సిద్ధింప దని పల్కిరి.

తే. పగయు వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్యసంసారి ? యగుట మేలు
మదిఁ (జీ త) దగిలె నేని శాంతిచే ? మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చినరాజున(ల)కును: 42

1. మూసికొనుట.

టీ. పగయుఁ = ద్వేషమును, పగయును = విచారమును, లేక, ఏపాటికన్నఁ = ఏమాత్రము గలిగినను, అలరు...రి - అలరు = సంతసించునట్టి, సామాన్య సంసారి అగుట మేలు = పరిపాటి సంసారి యగుటయే మేలు, రాజ్యభూమిక - రాజ్య = ప్రభుత్వ మనెడి, భూమికఁ = వేషమును, తాల్చినరాజునకును - తాల్చిన = ధరియించిన, రాజునకును = భూపాలునకును, మదిఁ = బుద్ధిని, తగిలెనేని = శత్రుకృత తిరస్కార మంటినట్లాయెనా, శాంతిఁ = శమము చేసను, మఱవఁదగదు = మఱువరాదు.

తా. [illegible] ద్వేషమును చింతయును లేక యేపాటి కలిగినను సంతసించు నట్టి పరిపాటి [illegible] యగుట [illegible]త్తమము. రాజ్య మను భూమికను ధరియించిన రాజునకు శత్రుకృతతిరస్కారము [illegible] తగిలెనేని శాంతచిత్తుఁడై సమాధిమై నుంట దుష్కరము.

క. పులి మల డిగి యూళ్లకు స
ఢ్గులరుజ రా జనము మాన్పుకోఁ బనిచి గవిఁ
[1]నెలకొన సురియలు గొని చని
పొలియుననొ? యూరఁ గుయిరేఁగి ౯ పొడుచునొ? చెపుమా. 43

టీ. పులి = వ్యాఘ్రము, ([illegible]) అక్షులరుజఁ = కన్నులకలఁకచేత, మల డిగి = పర్వతము డిగి, ఊళ్లకుఁ = గ్రామములకు, రాఁ = రాఁగా, జనము = ప్రజ, మాన్పుకోఁబనిచి = [illegible] మాన్పుకొన నిచ్చి, గవిఁ = గుహాయందు, నెలకొనఁ = స్వస్థమైయుండఁగా, [illegible], సురియలుగొని = చుఱకత్తులను గొని, చని = పోయి, పొలియునో = [illegible], లేక, ఊరఁ = కన్నుల నొప్పితో వచ్చినప్పుడు గ్రామమందు ([illegible]), [illegible] రేఁగి = గుంపు [illegible] కూఁతలు పెట్టుచు, పొడుచునొ, చెపుమా = వచింపుమా. అలం. [illegible] ప్రస్తుత ప్రశంస.

తా. పులి [illegible] కన్నుల కలఁకతోఁ గొండ దిగి గ్రామములకు రాఁగా నందఱు ప్రోగై కూఁతలు [illegible] వచ్చి యపాయము నొందిన పులినిఁ జంపుదురో, లేక దాని నేత్రవ్యాధిని [illegible] మాన్పుకొన నిచ్చి, దానికి నెలవగు గవియందు స్వస్థ ముగా నుండు [illegible] బట్టిపోయి యా పులిచేతఁ జచ్చునో వచింపుము.

క. ఈవేళ బలియు నతనిం
బో విడిచితి పొమ్ము [2]వాఁడు ౯ పోయిన రాజ్యం

1. నెలవుకొని సురియ గొని; నెలవుకొన సురియగొని. 2. పాడిఁ బో.

బేవిధిఁ గ్రమ్మఱు నావెర
వీవెర వని వ్రేలు మడచి [1]యేర్పడఁ జెపుమా. 44

టీ. ఈవేళన్ = ఈసమయమున, బలియునిన్ = బలవంతుఁడగు నా కేశిధ్వజుని, పోవిడిచితి పొమ్ము = పోవునట్లుగ విడిచిపెట్టితివి పో, వాఁడుపోయినన్, రాజ్యంబు = సామ్రాజ్యము, ఏవిధిం గ్రమ్మఱున్ = ఏప్రకారము మరలవచ్చును, ఆవెరవు = సామ్రాజ్యము వచ్చెడి యా యుపాయము, ఈవెర వని = ఈయుపాయ మని, వ్రేలు మడచి = అంగుళముమడచి, ఏర్పడన్ = తెలియునటుల, చెప్పుమా = వచింపుమా.

తా. ఈ సమయమందు మిగుల బలవంతుఁడగు కేశిధ్వజుని విడిచి పెట్టితివిపో వాఁడు పోయిన పిమ్మట సామ్రాజ్య మేవిధంబున మరల వచ్చునో యా యుపాయం బిది యని వ్రేలు మడచి చెప్పుము.

తే. అలసతఁ బరున్నమనుజుండు కలియుగంబు,
ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు, త్రేత
యుత్థితుఁడు, యాయి మఱి కృతయుగ మటన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినవె(మె). 45

టీ. అలసతన్ = ఆయాసపడుటచేతను, పరున్నమనుజుండు = పండిననరుఁడు, కలియుగంబు = కలియుగము వంటివాఁడు, కూర్చున్నవాఁడు, ఎన్నన్ = విచారింపఁగా, ద్వాపరంబు = ద్వాపరమువంటివాఁడు, ఉత్థితుండు = లేచినవాఁడు, త్రేత = త్రేతాయుగమువంటివాఁడు, మఱి = మఱియును, యాయి = సంచరించువాఁడు, కృతయుగము = కృతయుగమువంటివాఁడు, అటన్నన్ = అట్లనునట్టి, నముచిదమనోక్తిన్ = ఇంద్రుని వాక్యమును, ఋగ్బ్రాహ్మణమునన్ = ఋగ్వేదమందలి బ్రాహ్మణమందు, వినవే = విన్నవాఁడవుకావా. (అనఁగా నిరుద్యోగుఁడుగా నున్నవాఁడు పరమ నికృష్టుఁ డనుట.) అలం. అప్రస్తుతప్రశంస.

క. ఛిద్రప్రహారి రాష్ట్రో
పద్రవపరిహారి యాప్తభాషణరుచి వే
ళోద్రిక్తుఁ డన్యవేళా
నుద్రిక్తుఁ డనల్పకాల ముర్వి [2]భరించున్. 46

టీ. ఛిద్రప్రహారి - ఛిద్ర = తన రాజ్యమందుఁ బుట్టిన దోషంబులను, ప్రహారి= పోఁగొట్టువాఁడును (శత్రువున కేదేని యిక్కట్టు వచ్చినప్పుడు సమయించువాఁడును),

1. యెన్నుము చాలున్. 2. భుజించున్.

రాష్ట్రోపద్రవపరిహారి = రాజ్యమునకు శత్రువులవలని యుపద్రవమును బోఁగొట్టు వాఁడును, ఆప్త = ఇష్టులయినవారియొక్క, భాషణ = వాక్యములయందు, రుచి = ప్రీతిఁగలవాఁడును, వేళా=శత్రువును వధింపఁదగిన సమయముదొరకినప్పుడు, ఉద్రిక్తుఁడు = త్వరపడినవాఁడును, అన్యవేళ = సమయము కానియప్పుడు, అనుద్రిక్తుఁడు = త్వరపడక యుండువాఁడును, అనల్పకాలము = బహుకాలము, ఉర్విన్ = భూమిని, భరించున్ = వహించును.

తా. తనరాజ్యమునఁ బుట్టిన దోషములను వెంటనే పోఁగొట్టుచుఁ, దనరాజ్యమునకు శత్రువుల వలని యుపద్రవము లంటకుండఁ జేయుచు, శత్రుభంజనావసరము సిద్ధించినపు డాప్తుల ప్రీతి వాక్యముల విని ప్రయత్నపడుచును నాసమయములయందుఁ ద్వరపడక నిష్కళించుచు, నిత్తెఱంగునఁ బ్రవర్తించురాజు బహుకాలము పుడమిఁ బాలించును.

వ. లేలెమ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. 47

క. మీ నొడివినయది కార్యం
బౌ; నిప్పని సేయ రాజ్యమంతయు మనకున్
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కట, నిండు వాసు లరయఁగ వలయున్. 48

టీ. మీనొడివినయది=మీరన్నవాక్యము, కార్యం బౌన్=కర్తవ్యమవును, ఇప్పని సేయన్ = ఈకార్యము సేయఁగా, ఒక్కటన్ = ఏకకాలములో, రాజ్యమంతయున్= ఎల్లరాజ్యము, మనకున్,వానికిన్ = ఆ వేశిభ్వజునకు, పరలోకము=స్వర్గము, జితమౌన్ = గెలువఁబడిన దగును, (అనఁగాఁ గలుగు ననుట). ఇందున్ = ఈరెంటియందును, వాసులు= ఎక్కువతక్కువలు, అరయఁగవలయున్ = విచారింపవలయును.

తా. మీ రన్నది చేయఁ దగినది యగును. ఈలాగునఁ జేయఁగా నేకకాలములో మనకు నెల్లరాజ్యంబును వానికిఁ బరలోకమును సిద్ధించుచున్నది యయిన నీ రెంటియొక్క తారతమ్యము విచారింప వలయు నని చెప్పెను.

క. పర[1]లోకసుఖము శాశ్వత
మరయ; మహీరాజ్యసౌఖ్య మల్పానేహా
పరిభోగ్యం; బిందుల కై
దురితము కావించి తోలఁగుదునె పరమునకున్. 49

---

1. లోకము శాశ్వతసుఖ.

తేవిధిఁ గ్రమ్మఱు నావెర
వీవెర వని వ్రేలు మడచి ¹యేర్పడఁ జెపుమా. 44

టీ. ఈవేళన్ = ఈసమయమున, బలియునరిన్ = బలవంతుఁడగు నా కేశిధ్వజుని, పోవిడిచితి పొమ్ము = పోవునట్లుగ విడిచిపెట్టితివి పో, వాఁడుపోయిరన్, రాజ్యంబు = సామ్రాజ్యము, ఏవిధిం గ్రమ్మఱున్ = ఏప్రకారము మరలవచ్చును, ఆవెరవు = సామ్రాజ్యము వచ్చెడి యా యుపాయము, ఈవెర వని = ఈయుపాయ మని, వ్రేలు మడచి = అంగుళమువంచి, ఏర్పడన్ = తెలియునటుల, చెపుమా = వచింపుమా.

తా. ఈ సమయమందు మిగుల బలవంతుఁడగు కేశిధ్వజుని విడిచి పెట్టితివిపో వాఁడు పోయిన పిమ్మట సామ్రాజ్య మేవిధంబున మరల వచ్చునో యా యుపాయం బిది యని వ్రేలు మడచి చెప్పుము.

తే. అలసతఁ బరున్నమనుజుండు కలియుగంబు,
ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు, త్రేత
యుత్థితుఁడు, యాయి మఱి కృతయుగ మటన్న
నముచిదమనోక్తి బుగ్బ్రాహ్మణమున వినవె(మె). 45

టీ. అలసతన్ = ఆయాసపడుటచేతను, పరున్నమనుజుండు = పండినవరుఁడు, కలియుగంబు = కలియుగము వంటివాఁడు, కూర్చున్నవాఁడు, ఎన్నన్ = విచారింపఁగా, ద్వాపరంబు = ద్వాపరమువంటివాఁడు, ఉత్థితుండు = లేచినవాఁడు, త్రేత = త్రేతాయుగమువంటివాఁడు, మఱి = మఱియును, యాయి = సంచరించువాఁడు, కృత యుగము = కృతయుగమువంటివాఁడు, అటన్నన్ = అట్లనునట్టి, నముచిదమనోక్తిన్ = ఇంద్రుని వాక్యమును, బుగ్బ్రాహ్మణమునన్ = బుగ్వేదమందలి బ్రాహ్మణమందు, వినవే = విన్నవాఁడవుకావా. (అనఁగా నిరుద్యోగుఁడుగా నున్నవాఁడు పరమ నికృష్టుఁడనుట.) అలం. అప్రస్తుతప్రశంస.

క. ఛిద్రప్రహారి రాష్ట్ర
పద్రవపరిహారి యాప్తభాషణరుచి వే
ళోద్రిక్తుఁ డన్యవేళా
నుద్రిక్తుఁ డనల్పకాల ముర్వి ²భరించున్. 46

టీ. ఛిద్రప్రహారి - ఛిద్ర = తన రాజ్యమందుఁ బుట్టిన దోషంబులను, ప్రహారి= పోఁగొట్టువాఁడును (శత్రువున కేదేని యిక్కట్టు వచ్చినప్పుడు సమయించువాఁడును),

1. యెన్నుము చాలున్. 2. భుజించున్.

రాష్ట్రోపద్రవపరిహారి = రాజ్యమునకు శత్రువులవలని యుపద్రవమును బోఁగొట్టు వాఁడును, ఆప్త = ఇష్టులయినవారియొక్క, భాషణ = వాక్యములయందు, రుచి = ప్రీతిగలవాఁడును, వేళా=శత్రువును వధింపఁదగిన సమయముదొరకినప్పుడు, ఉద్రిక్తుఁడు = త్వరపడినవాఁడును, అన్యవేళ = సమయము కానియప్పుడు, అనుద్రిక్తుఁడు = త్వరపడక యుండువాఁడును, అనల్పకాలము = బహుకాలము, ఉర్వి౯ = భూమిని, భరించు౯ = వహించును.

తా. తనరాజ్యమునఁ బుట్టిన దోషములను వెంటనే పోఁగొట్టుచుఁ, దనరాజ్యమునకు శత్రువుల వలని యుపద్రవము లంటకుండఁ జేయుచు, శత్రుభంజనావసరము సిద్ధించినపు డాప్తుల ప్రీతి వాక్యముల విని ప్రయత్నపడుచును నాసమయములయందుఁ ద్వరపడక నిమ్మళించుచు, నిత్తెఱంగునఁ బ్రవర్తించురాజు బహుకాలము పుడమిఁ బాలించును.

వ. లేలె మ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. 47

క. మీ నొడివినయది కార్యం
బౌ; నిప్పని సేయ రాజ్య మంతయు మనకు౯
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కటి, నిందు వాసి యరయఁగ వలయున్. 48

టీ. మీనొడివినయది=మీరన్నవాక్యము, కార్యం బౌ౯=కర్తవ్యమవును, ఇప్పని సేయ౯ = ఈకార్యము సేయఁగా, ఒక్కట౯ = ఏకకాలములో, రాజ్యమంతయు౯= ఎల్లరాజ్యము, మనకు౯,వానికి౯ = ఆకేశిధ్వజునకు, పరలోకము=స్వర్గము, జితమౌ౯ = గెలువఁబడిన దౌను, (అనఁగాఁ గలుగు ననుట). ఇందు౯=ఈరెంటియందును, వాసులు= ఎక్కువతక్కువలు, అరయఁగవలయు౯ = విచారింపవలయును.

తా. మీ రన్నది చేయఁ దగినది యౌను. ఈలాగునఁ జేయఁగా నేకకాలములో మనకు నెల్లరాజ్యంబును వానికిఁ బరలోకమును సిద్ధించుచున్నది యయిన నీ రెంటియొక్క తారతమ్యము విచారింప వలయు నని చెప్పెను.

క. పర[1]లోకసుఖము శాశ్వత
మరయ; మహీరాజ్యసౌఖ్య మల్పానేహా
పరిభోగ్యం; బిందుల కై
దురితము కావించి తొలఁగుటదునె పరమునకున్. 49

---

1. లోకము శాశ్వతసుఖ.

టీ. అరయన్ = విచారింపఁగా, పరలోకసుఖము = పరలోకానందము, శాశ్వతము = నిత్యము, మహీరాజ్యసౌఖ్యము = భూపాలనమువలనిసుఖము, అల్పానేహఃపరిభోగ్యంబు = స్వల్పకాల మనుభవింపఁదగినది. ని. 'కాలోదిష్టోఽప్యనేహాపి' యని యమరము. ఇందులకై = ఈ యల్పసుఖమునకై, దురితము = పాపము, కావించి = చేసి, పరమునకున్ = పరలోకసుఖమునకు, తొలఁగుదునే = దూరమగుదునా. అలం. కావ్యలింగము.

తా. విచారింపఁగాఁ బరలోకానందము నిత్యమును, రాజ్యానంద మనిత్యమును గాన నల్పకాలానుభవయోగ్యం బైన రాజ్యమునకై పాప మొనర్చి పరలోకమునకు దూరీభూతుఁడను కా నొల్ల ననియె.

క బద్ధాంజలిపుటు దీనున్
[1]గ్రుద్ధతఁ దనమఱుఁగు సొరఁగఁ గూల్చుట కడుఁ గీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి నను [2]కండువాక్యములు దలఁప రొకో. 50

టీ. బద్ధాంజలిపుటున్ = ముకుళితహస్తుఁడయినట్టి, దీనున్ = దైన్యమొందినవానిని, తనమఱుఁగుసొరఁగన్ = తన్నుశరణుఁజొచ్చినపుడు, క్రుద్ధతన్ = కోపయుక్తుఁడై, ఉద్ధతిన్ = గర్వముచేత, కూల్చుట = వధియించుట, పరలోకార్జనబుద్ధికిన్ = పరలోకము సంపాదించెద ననుమనంబు గలవానికి, కడుఁగీడు = మిక్కిలిపాపము అను = అనునట్టి, కండువాక్యములు = కండుమహర్షి వాక్యములు, తలఁపరొకో = విచారింపరా. అలం. అప్రస్తుతప్రశంస.

తా. బద్ధాంజలి యయి దీనత్వము వహించి శరణుఁ జొచ్చినవానిఁ బరలోక బుద్ధి గల పురుషుఁడు కోపయుక్తుఁడై గర్వముచేత వధియించెనేని యతనికి మహాపాతకం బని కండుమహర్షి సెప్పినవాక్యములు విచారింపరు కాఁబోలును.

ఆ. అనుచు వెడలి వచ్చి, యారాజు నడిగి, త
ద్ధర్మనైచికీవధక్రమంబు
దెలిసి, తగిన నిష్కృతి వచింప, నాతండు
[3]మగుడఁ గ్రతువు సాంగముగ నొనర్చె. 51

టీ. అనుచున్ = ఇట్లనుచు, వెడలివచ్చి = వెంటమొబయలువెళ్ళివచ్చి, ఆరాజున్ = ఆకేశిధ్వజుని, అడిగి, ధర్మనైచికీవధక్రమంబు = యజ్ఞధేనువధ ప్రకారమును, ని. 'ఉత్తమా గోషు నైచికీ' యని యమరము. తెలిసి = ఎఱింగి, తగిననిష్కృతిన్ = సరియైన ప్రాయ

1. క్రుద్ధుండై శరణు చొరఁగ; క్రుద్ధుండై మఱుఁగుసొరఁగ. 2. కణ్వ. 3. మగుడి.

శ్చిత్తమును, వచింపన్ = చెప్పఁగా, ఆతండు = ఆకేశిధ్వజుండు, మగుడన్=మరలివచ్చి, క్రతువు = యజ్ఞమును, సాంగముగన్ = సంపూర్ణముగా, ఒనర్చి = చేసి. ముందటి కన్వయము.

తా. ఖాండిక్యుండు మంత్రులతో నాలోచించి యిట్లనుచుఁ బెండెము వెడలి వచ్చి కేశిధ్వజునివలన యజ్ఞధేను వధక్రమం బెఱింగి తగిన ప్రాయశ్చిత్తము విచారించి చెప్పఁగా నా కేశిధ్వజుండు మరల యజ్ఞశాలకు వచ్చి క్రతువును సాంగోపాంగముగ నొనర్చెను.

ఆ. అవభృథాప్లుతోత్తమాంగుఁడై, ఋత్విక్స
దస్యగణముఁ బూజఁ దనిపి, పిదప
సూత మగధ వంది వైతాళిక ప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. 52

టీ. అవ...డై-అవభృథ = అవభృథ మనుయజ్ఞదీక్షాంతస్నానముచేతను, ఆప్లుత = చక్కఁగాఁ దడుపఁబడిన, ఉత్తమాంగుఁడై=శిరముగలవాఁడై, ఋత్వి...ముఁ-ఋత్విక్= ఋత్విజులయొక్కయు, సదస్య = సభ్యులయొక్కయు, గణముఁ = సమూహమును, పూజన్ = దక్షిణాంతపూజచేత, తనిపి = తృప్తినొందించి, పిదపన్ = పిమ్మట, సూత...కిన్ - సూత, మగధ, వంది, వైతాళిక ప్రభృతి = వీరలుమొదలగు, అర్థికోటికిన్ = యాచకసమూహమునకు, అభిమతార్థము = కోరినవస్తువులను, ఒసఁగి = ఇచ్చి. ముందటి కన్వయము.

తా. కేశిధ్వజుండు యాగము ముగియఁగా నవభృథస్నాతుఁడై ఋత్విజులకును బూజనీయులగు సభ్యులకును దక్షిణాంతపూజ లొనర్చి తృప్తి నొందించి సూతమాగధాది యాచక సమాజమునకుఁ గోరిన వస్తువుల నెల్ల నిచ్చెను.

తే. మఱియుఁ గోరినవారి యక్కఱలు తీర్చి
యును మనఃపూర్తి చాల కొయ్యనఁ దలంచి
'యకట గురుదక్షిణ యొసంగ నైనయితి' నంచు
మగుడఁ జని శంక నతఁడు సంభ్రమపడంగ. 53

టీ. మఱియున్ = ఇదియునుంగాక, కోరినవారి యక్కఱలు దీర్చియును = కోరినవారికోర్కులన్నియు నిచ్చియును, మనఃపూర్తి చాలక = మనస్సునకుఁ దనివితీరక, ఒయ్యనన్ = మెల్లఁగా, తలంచి = తలఁచుకొని, అకట, గురుదక్షిణయొసంగనైతిన్ = గురుదక్షిణయియ్యనైతిని, అంచున్, మగుడన్ = మరలను, చని = పోయి, అతఁడు = ఆఖాండిక్యుఁడు, శంకన్ = అనుమానముచేతను, సంభ్రమపడంగన్ = తొట్రుపడఁగా.

టీ. అరయన్ = విచారింపఁగా, పరలోకసుఖము = పరలోకానందము, శాశ్వతము = నిత్యము, మహీరాజ్యసౌఖ్యము = భూపాలనమువలనిసుఖము, అల్పానేహఃపరిభోగ్యంబు = స్వల్పకాల మనుభవింపఁదగినది. ని. 'కాలోదిష్టోఽప్యనేహాపి' యని యమరము. ఇందులకై = ఈ యల్పసుఖమునకై, దురితము = పాపము, కావించి = చేసి, పరమునకున్=పరలోకసుఖమునకు, తొలఁగుదునె=దూరమగుదునా. అలం. కావ్యలింగము.

తా. విచారింపఁగాఁ బరలోకానందము నిత్యమును, రాజ్యానంద మనిత్యమును గాన నల్పకాలానుభవయోగ్యం బైన రాజ్యమునకై పాప మొనర్చి పరలోకమునకు దూరీభూతుఁడను కా నొల్ల ననియె.

క. బద్ధాంజలిపుటు దీనున్
[1]క్రుద్ధతఁ దనమఱుఁగు సొరఁగఁ గూల్చుట కడుఁ గీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి నను [2]కండువాక్యములు దలఁప రొకో. 50

టీ. బద్ధాంజలిపుటున్ = ముకుళితహస్తుఁడయినట్టి, దీనున్=దైన్యమొందినవానిని, తనమఱుఁగుసొరఁగన్ = తన్నుశరణుఁజొచ్చినపుడు, క్రుద్ధతన్ = కోపయుక్తుఁడై, ఉద్ధతిన్ = గర్వముచేత, కూల్చుట = వధియించుట, పరలోకార్జనబుద్ధికిన్=పరలోకము సంపాదించెద ననుమనంబు గలవానికి, కడుఁగీడు = మిక్కిలిపాపము అను = అనునట్టి, కండువాక్యములు = కండుమహర్షి వాక్యములు, తలఁపరొకో = విచారింపరా. అలం. అప్రస్తుతప్రశంస.

తా. బద్ధాంజలి యయి దీనత్వము వహించి శరణుఁ జొచ్చినవానిఁ బరలోక బుద్ధి గల పురుషుఁడు కోపయుక్తుఁడై గర్వముచేత వధియించెనేని యతనికి మహాపాతకం బని కండుమహర్షి సెప్పినవాక్యములు విచారింపరు కాఁబోలును.

ఆ. అనుచు వెడలి వచ్చి, యారాజు నడిగి, త
ద్ధర్మనైచికీవధక్రమంబు
దెలిసి, తగిన నిష్కృతి వచింప, నాతండు
[3]మగుడఁ గ్రతువు సాంగముగ నొనర్చె. 51

టీ. అనుచున్ = ఇట్లనుచు, వెడలివచ్చి=వెంటెముబయలువెళ్ళివచ్చి, ఆరాజున్= ఆకేశిధ్వజుని, అడిగి, ధర్మనైచికీవధక్రమంబు=యజ్ఞధేనువధ ప్రకారమును, ని. 'ఉత్తమా గోషు నైచికీ' యని యమరము. తెలిసి = ఎఱింగి, తగిననిష్కృతిన్ = సరియైన ప్రాయ

1. క్రుద్ధుండై శరణు చొరఁగ; క్రుద్ధుండై మఱుఁగుసొరఁగ. 2. కణ్వ. 3. మగుడి.

శ్చిత్తమును, వచింపన్ = చెప్పఁగా, ఆతఁడు = ఆ కేశిధ్వజుండు, మగుడన్ = మరలివచ్చి, క్రతువు = యజ్ఞమును, సాంగముగన్ = సంపూర్ణముగా, ఒనర్చి = చేసి. ముందఱి కన్వయము.

తా. ఖాండిక్యుండు మంత్రులతో నాలోచించి యిట్లనుచుఁ బెండెము వెడలి వచ్చి కేశిధ్వజునివలన యజ్ఞధేను వధక్రమం బెఱింగి తగిన ప్రాయశ్చిత్తము విచారించి చెప్పఁగా నా కేశిధ్వజుండు మరల యజ్ఞశాలకు వచ్చి క్రతువును సాంగోపాంగముగ నొనర్చెను.

ఆ. అవభృథాప్లుతోత్తమాంగుఁడై, ఋత్విక్స
దస్యగణముఁ బూజఁ దనిపి, పిదప
సూత మగధ వంది వైతాళిక ప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. 52

టీ. అవ...డై-అవభృథ = అవభృథ మనుయజ్ఞదీక్షాంతస్నానముచేతను, ఆప్లుత = చక్కఁగాఁ దడుపఁబడిన, ఉత్తమాంగుఁడై=శిరముగలవాఁడై, ఋత్వి...ముఁ-ఋత్విక్= ఋత్విజులయొక్కయు, సదస్య = సభ్యులయొక్కయు, గణమున్ = సమూహమును, పూజన్ = దక్షిణాంతపూజచేత, తనిపి = తృప్తినొందించి, పిదపన్ = పిమ్మట, సూత... కిన్ - సూత, మగధ, వంది, వైతాళిక ప్రభృతి = వీరలు మొదలగు, అర్థికోటికిన్ = యాచకసమూహమునకు, అభిమతార్థము = కోరినవస్తువులను, ఒసఁగి = ఇచ్చి. ముందఱి కన్వయము.

తా. కేశిధ్వజుండు యాగము ముగియఁగా నవభృథస్నాతుఁడై ఋత్విజులకును బూజనీయులగు సభ్యులకును దక్షిణాంతపూజ లొనర్చి తృప్తి నొందించి సూతమాగధాది యాచక సమాజమునకుఁ గోరిన వస్తువుల నెల్ల నిచ్చెను.

తే. మఱియుఁ గోరినవారి యక్కఱలు తీర్చి
యును మనఃపూర్తి చాల కొయ్యనఁ దలంచి
'యకట గురుదక్షిణ యొసంగ నైతి' నంచు
మగుడఁ జని శంక నతఁడు సంభ్రమపడంగ. 53

టీ. మఱియున్ = ఇదియునుంగాక, కోరినవారి యక్కఱలు దీర్చియును = కోరినవారికోర్కులన్నియు నిచ్చియును, మనఃపూర్తి చాలక = మనస్సునకుఁ దనివితీరక, ఒయ్యనన్ = మెల్లగా, తలంచి = తలఁచుకొని, అకట, గురుదక్షిణయొసంగనైతిన్ = గురుదక్షిణయీయనైతిని, అంచున్, మగుడన్ = మరలను, చని = పోయి, అతఁడు = ఆఖాండిక్యుఁడు, శంకన్ = అనుమానముచేతను, సంభ్రమపడంగన్ = తొట్రుపడఁగా.

తా. మఱియు నా కేశిధ్వజుండు గోరినవారి మనోరథముల నెల్లఁ బూరించి యును మన స్తృప్తిలేక యాలోచించి గురుదక్షిణ యీయవలయునని మెల్లగఁ దలంచికొని యాఖాండిక్యుఁ డున్న నెలవుఁ గూర్చి వెళ్ళి యాఖాండిక్యుఁడు తొట్రుపడఁగా.

క. వారించి 'నీకు నెయ్యది
కోరిక? యేతెంచినాఁడ గురుదక్షిణ యీ
భూరమణ వేఁడు' మనుటయు
నారాజన్యుండు మఱియు నాప్తులతోడన్. 54

టీ. వారించి = నీకు శంక వలవ దని తొట్రుపాటుమాన్పి, గురుదక్షిణ యీన్ = గురుదక్షిణ యిచ్చుటకొఱకు, ఏతెంచినాఁడన్ = వచ్చినాఁడను, భూరమణ = ఓరాజా, నీకున్=నీకు, ఎయ్యది కోరిక = ఏ మేమియపేక్షితంబు, వేఁడుము = అడుగుము, అనుట యున్=అనఁగా, ఆరాజన్యుండు = ఆఖాండిక్యుఁడు, మఱియున్ = మగుడన్, ఆప్తుల తోడన్ = ఇష్టులతోడ.

క. 'గురుదక్షిణ యిచ్చుట కీ
నరవరుఁ డేతెంచె; మీరు నా కనురక్తుల్;
పరికించి పదింబదిగా
నరయుఁడు మది నెద్ది మేలు ప్రార్థించుటకున్.' 55

టీ. గురుదక్షిణ యిచ్చుటకున్, ఈనరవరుఁడు = కేశిధ్వజుండు, ఏతెంచెన్ = వచ్చెను, మీరు = మీరలు, నాకున్, అనురక్తులు = ఆప్తులు, ప్రార్థించుటకున్ = అడుగుటకు, ఎద్ది మేలు = ఏది యుత్తమంబు, మదిన్ = మనస్సున, పరికించి = వెదకి, పదిం బదిగాన్ = విస్తారముగ, అరయుఁడు = విచారింపుఁడు. అలం. కావ్యలింగము.

తా. గురుదక్షిణ యిచ్చుట కై కేశిధ్వజుండు వచ్చియున్నాఁడు, మీరలు నాకాప్తులు కాన నెయ్యది యుత్తమం బపేక్షించుటకు దానిం బరికించి మనంబునఁ బదింబదిగా విచారింపుఁడీ యని పలికెను.

ఉ. నావుఁడు వార లమ్మనుజనాథున కిట్లని రుబ్బి; 'నేఁడుగా
దైవము గల్గె; వేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీవలయం బశేషమును వేఁడుము భూవర; మమ్ము నందఱన్
బ్రోవుము; బాంధవాప్తజనపోషణకంటెను ధర్మ మున్నదే? 56

టీ. నావుఁడున్ = అట్లనఁగా, వారలు, అమ్మనుజనాథునకున్ = ఆఖాండిక్యునకు, ఉబ్బి = పొంగి, ఇట్లనిరి = ఈవిధముగా నొడివిరి, నేఁడుగా = నేఁడుగదా,

దైవముకల్గెఁ = అదృష్టము కలిగెను, వేగఁ = గొబ్బున, చతు...బు - చతురర్ణవీవృత = నాలుగు సముద్రములచేతఁ జుట్టఁబడియున్న, ఉర్వీవలయంబు = భూమండలము, అశేషము = సమస్తము, గురుదక్షిణగాఁ, = వేఁడుము = ప్రార్థింపుము, భూవర = రాజా, మమ్మునందఱఁ, ప్రోవుము = రక్షింపుము, బాంధవాప్త జనపోషణకంటెను = బంధుమిత్రవర్గ రక్షణకంటె, ధర్మము = పుణ్యము, ఉన్నదె = ఉన్నదా, లే దనుట.

తా. అట్లనఁగా వారలు హర్షముచేత నుబ్బి నేఁడుగదా యదృష్టము గలిగెను. నాలుగు సముద్రముల మధ్యంబున నున్న యశేష భూమండలమును దక్షిణగాఁ గోరి మమ్ముం గాపాడుము, బంధు మిత్ర జన రక్షణకంటెను వేఱే ధర్మము లేదని ఖాండిక్యునితో విన్నవించిరి.

ఉ. ఎన్నఁడు లావు గూడు మన కెన్నఁ డగు న్దఱి? యయ్యెనేని పో
రెన్నిక యౌనె? పోరిన[1] జయింప నశక్యము; నీదు భాగ్యసం
పన్నతఁ జేరెఁ గార్య మిటు; బంధు సుహృత్తతి కొక్క కీడు రా
కున్నటులుండఁగానె; సిరు లూరక చావక నోవ కబ్బునే. 57

టీ. ఎన్నఁడు = ఎప్పుడు, లావు కూడుఁ = బలిమిగల్గును, మనకుఁ, ఎన్నఁడు= ఎప్పుడు, తఱి=సమయము, అగుఁ = ఔను, అయ్యెనేని = సమయము సిద్ధించినను, పోరు = యుద్ధము, ఎన్నికయౌనె = శ్రేష్ఠమగునా, శ్రేష్ఠము, కాదనుట, పోరినఁ = యుద్ధమొనరించినను, జయింపఁ = గెలుచుటకు, అశక్యము = శక్యముగాదు, నీదు = నీయొక్క, భాగ్యసంపన్నతఁ = భాగ్యాతిశయముచేతను, కార్యము = ప్రయోజనము, ఇటు = ఈవిధంబుగ, చేరెఁ = ఒనగూడెను, బంధుసుహృత్తతికిఁ = బంధుమిత్రవర్గమునకు, కీడు = చెఱుపు, రాక = కలుగక, ఉన్నటులుండఁగానె, సిరులు = సంపదలు, చావక = మరణము నొందక, నోవక = నొప్పింబడక, ఊరక, అబ్బునె = సిద్ధించునా, సిద్ధింప వనుట.

తా. ఎప్పుడు బలిమి గలుగు నెన్నఁడు సమయ మగును సమయము కల్గినను జగడము శ్రేష్ఠముగాదు కదా? అయినను జగడ మొనర్చితిమిపో జయింప నశక్యంబు, నీయదృష్టమువలన నిట్టి ఘనకార్య మొనగూడెను, బంధుమిత్రవర్గముల కపాయము సంభవింపకయే సంపదలు సిద్ధింప వనిరి.

చ. అనవుఁడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను మీర లర్థసా
ధనపరతంత్రకోవిదులు దక్క మహాసుఖదాయి మోక్షమా

1. జయింపనె చెప్పిరె.

ర్గనయవిచారకోవిదులుగా రతిచంచల రాజ్యలక్ష్మి యే
మని చని వేఁడువాఁడఁ బరమార్థము వేఁడక యమ్మహామతిన్. 58

టీ. అనవుఁడున్ = వా రిట్లనఁగా అల్లనవ్వి = మెల్లగా నవ్వి, మనుజాధిపుఁడు= ఖాండిక్యుండు, ఇట్లనున్ = ఈప్రకార మనియెను, మీరలు = మీరు, అర్థసాధన పరతంత్రకోవిదులు దక్కన్ = అర్థసాధక తంత్రవేత్తలుగాని, మహాసుఖదాయి = అఖండానందము నిచ్చునట్టి, మోక్షమార్గ నయవిచారకోవిదులు = మోక్షమంత్ర విచారపరులు, కారు, అతిచంచల = మిగుల నస్థిరంబైన, రాజ్యలక్ష్మిన్=రాజ్యసంపదను, ఏ మని = ఏమిపదార్థ మని, పరమార్థము వేఁడక = పరమపురుషార్థము గోరక, అమ్మహా మతిన్ = అజ్ఞాన నిస్థుండగు కేశిధ్వజుని, చని = వెళ్ళి, వేఁడువాఁడన్ = ప్రార్థింతును.

తా. వార లిట్లపేక్షింప మనుజాధిపుం డగుఖాండిక్యుండు విని నవ్వి మీర లర్థ సాధక తంత్రవేత్తలుగాని పరమ పురుషార్థసాధక తంత్రవేత్తలుగా రమ్మహాజ్ఞానియైన కేశిధ్వజునియొద్దకుఁ బోయి మోక్షసాధక మార్గముం గోరక యస్థిరం బగు రాజ్య సంపద నెట్లు వేఁడుదు నని పల్కెను.

క. నిమివంశోత్పన్నుల మఁట
మమువంటుల కకట రాజ్యకామా లక్ష్యము వాఁ
డమలినయోగాశ్రయుఁ డు
త్తమయోగము గొనుట యుచితమో ధరఁ గొను టుచితమో. 59

టీ. నిమి = నిమిచక్రవర్తియొక్క, వంశ = కులమందు, ఉత్పన్నులమఁట = పుట్టినవారమఁట, అకట = అయ్యో, మమువంటులకున్ = మావంటివారికి, రాజ్యకామా లక్ష్యము = రాజ్యము విషయమా, వాఁడు = ఆకేశిధ్వజుండు, అమ...డు-అమలిన= శుద్ధమైన, యోగ = యోగమునకు, ఆశ్రయుఁడు = స్థానమైనవాఁడు, అతనివలన ఉత్తమయోగముఁగొనుట, ఉచితమో = ఉచితమో, ధరన్ = భూమిని, కొనుట = గ్రహించుట, ఉచితమో = యుక్తమో.

తా. అయ్యో! నిమిచక్రవర్తివంశంబునఁ బుట్టిన మావంటి వారలకు రాజ్య మొక విషయమా! వాఁ డుత్తమయోగి గాన వానివలన నపవర్గప్రదం బగు నుత్తమ యోగంబుఁ గొనుట యుత్తమంబో, లేక, భూమిని గొనుట యుత్తమంబో యని వచించె ననుట.

సీ. విడుఁ డని [1]పీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ
డా రాజుఁ గనుఁగొని ♦ గారవమున
'గురునిష్క్రియంబు నిక్కువముగా నొసఁగెదే'
యని [2]పల్కి, 'యిత్తుఁ దథ్యముగ' నన్న
'నవనీతలేంద్ర! నీవధ్యాత్మరతుఁడవు
దక్షిణ గురున కీఁ దలఁచితేని
సకలభవక్లేశసంక్షయం బెయ్యది
యవ్విద్య బోధింపు' ♦ మనిన నవ్వి

తే. '[3]యహహా నిష్కంటకాస్మదీయాధిరాజ్య
మడుగ నొల్లక యిది యేటి ♦ కడిగి తిపుడు?
క్షత్రియుల [4]కెల్ల రాజ్యంబుకంటె మఱి ప్రి
యంబు గలదె?' యటన్న నిట్లనియె నతఁడు. 60

టీ. విడుఁడని = ఈమాటలు యుక్తంబులుగావు విడువుండని, పీడువెల్వడివచ్చి = పాళెమువిడిచివచ్చి, ఖాండిక్యుఁడు, ఆరాజున్ = కేశిధ్వజుని, కనుఁగొని = చూచి, గారవమునన్ = ప్రేమచేత, గురునిష్క్రియంబు = గురుదక్షిణ, నిక్కువముగాన్ = నిజముగా, ఒసఁగెదే యని = ఇచ్చెదవాయని, పల్కి = పలికి, ఇత్తున్ = ఇచ్చెదను. తథ్యముగన్ = సత్యముగా, అన్నన్ = అనఁగా, అవనీతలేంద్ర = రాజా, నీవు = నీవు, అధ్యాత్మరతుఁడవు = బ్రహ్మవిద్యానిష్ఠుండవు, దక్షిణగురునకీఁదలఁచితేని = గురు దక్షిణ యీఁదలఁచినయెడల, సకలభవక్లేశసంక్షయం బెయ్యది = సాంసారికసర్వక్లేశ నాశ కంబేదో, అవ్విద్యన్ = అట్టివిద్యను, బోధింపుము = ఉపదేశింపుము, అనినన్ = అనఁగా, నవ్వి = హసించి, అహహా = ఆశ్చర్యము, నిష్కం...ము-నిష్కంటక = శత్రురహిత మైన, అస్మదీయ = నాసంబంధియైనట్టి, అధిరాజ్యము = ప్రభుత్వమును, అడుగ నొల్లక = వేఁడవలవక, ఇదియేటికడిగితిపుడు = ఈయధ్యాత్మవిద్య నిపు డేల యడిగితివి, క్షత్రియులకెల్లన్ = రాజులకెల్లను, రాజ్యంబుకంటెన్ = ప్రభుత్వమునకంటె, మఱి ప్రియంబుగలదె = అతిశయమైనయిష్టముగలదా, అటన్నన్ = అట్లనఁగా, అతఁడు = ఖాండిక్యుఁడు, ఇట్లనియె = ఈప్రకార మనియె.

తా. ఈ మీమాట లుత్తమంబులుగావు విడువుండని యా ఖాండిక్యుండు పాళెము వెడలివచ్చి కేశిధ్వజుం గని ప్రీతితో గురుదక్షిణ నిశ్చయముగ నీయఁదలఁచితివా యని

1. గుడిసె. 2. పల్కి నిత్తు. 3. యకట. 4. కెంచు.

పల్కి- సత్యముగా నిత్తు నన్న 'నోరాజా నీ వధ్యాత్మవిద్యయందు దక్షుండవు గాన సాంసారిక సర్వక్లేశ నాశకం బగునది యేదో యట్టి విద్యను బోధింపు' మనంగా నవ్వి యాశ్చర్యమొంది 'నిష్కంటకం బగునారాజ్యము నడుగ నొల్లక యీ యధ్యాత్మవిద్య నిపు డేల యడిగితివి? రాజుల కెల్లం బ్రభుత్వముకంటె గొప్పకార్యముంగలదే?' యనంగా నాఖాండిక్యుండు వక్ష్యమాణప్రకారంబుగ ని ట్లనియె.

మ. 'విను కేశిధ్వజ! ధాత్రి వేడమికి నావేదించెద న్హేతు వ
జ్ఞానకుం గాక వివేకి కేల జనియించుం గా లౌల్య మెందుం? రణం
బునఁ బాడిన్ రిపు గెల్చువాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
జున కౌ, నైన నశక్తు త్వద్విజితరాజ్యు న్న*న్నఘం బంటునే 61

టీ. కేశిధ్వజ = కేశిధ్వజుఁడా, వినుము = ఆకర్ణింపుము, ధాత్రి వేడమికిన్ = భూమిని బ్రార్థింపకయుండుటకు, హేతువు = కారణమును, ఆవేదించెదన్ = తెలిపెదను, ఎందున్ = ఎందైనను, లౌల్యంబు = చాపల్యము, అజ్ఞానకుం గాక = అవివేకికేదక్క, వివేకికిన్ = జ్ఞానికి, ఏల జనియించున్ = ఎందులకుఁ బుట్టును? రణంబునన్ = జగడ మందు, పాడిన్ = ధర్మముచేత, రిపున్ = శత్రువును, గెల్చువాఁడియున్ = జయించు నట్టి బాటుతనమును, ప్రజాపోషంబున్ = ప్రజల రక్షించుటయును, రాజునకున్ = ప్రభువు నకు, ధర్మంబౌన్ = న్యాయమగును, ఐనన్ = అట్లయినను, త్వద్విజితరాజ్యున్ - త్వత్ = నీచేత, విజిత = జయింపఁబడిన, రాజ్యున్ = రాజ్యముగలయట్టివాఁడు, అశక్తున్ = బలిమిలేనియట్టి, నన్నున్ = నన్ను, అఘంబు = పాపము, అంటునే = స్పృశించునా, అంట దనుట.

తా. ఓయి కేశిధ్వజుఁడా! రాజ్యము వేడకుండుటకుఁ గారణముఁ దెలిపెద వినుము. ఏవస్తు వందయినను చాపల్య మజ్ఞానకుఁ గలుగు గాక జ్ఞానికి నేల జనియించును? యుద్ధమందు ధర్మముచేత శత్రువును గెల్చుటయుఁ బ్రజల రక్షించుటయును రాజులకు ధర్మం బౌ నయినను నీచేత నపహరింపఁబడిన రాజ్యము గల్గి యశక్తుఁడ నైయున్న న న్న ఘంబులు స్పృశింప వని చెప్పెను.

సీ. నరనాథ! యీ రాజ్యపరిపాలనారాతి
హననాదికృతరూప యగునవిద్య
యనధికారికి విసర్జనముఁ గావింపంగఁ
గలుషంబు రా; దధికారియైన

* న్నిహం.

హాఁడు విసర్జింప వచ్చు ♦ వర్ణాచార
లోపంబుచే నగు ♦ పాపలేప;
మైన నేనిత్తుఁ గొమ్మనఁ గొను ధరణి భో
గమునకుఁ గాక ధర్మమున కగునె
తే. కాన సత్క్షత్త్రియులకు భైక్షంబు కీడు
మత్ప్రధానులు వేఁడు సామ్రాజ్య మనెడు
పలుకు ధర్మచ్ఛలంపులోభం బయుక్త
మిది రొుఱఁగి రాజ్య మడుగ నే ♦ నిచ్ఛగింప. 62

టీ. నరనాథ = కేశిధ్వజుఁడా, ఈరాజ్య...న-ఈరాజ్యపరిపాలనము, అరాతి హనన = శత్రుసంహారము, ఆది = మొదలగువానిచేత, కృత = చేయఁబడిన, రూప యగు = స్వరూపము గలదైన, అవిద్య = అజ్ఞానము, అనధికారికిన్ = అధికారము లేనివానికి, విసర్జనముఁ గావింపఁగన్ = విడిచిపెట్టఁగా, కలుషంబురాదు = పాపమొద వదు, అధికారియైనవాఁడు, విసర్జింపన్ = విడువఁగా, వర్ణాచారలోపంబుచేన్ = క్షత్త్రియవంశాచారలోపముచేతను, అగు...ము-అగు = ఐనట్టి, పాప = కిల్బిషముయొక్క, లేపము = పూఁత, వచ్చున్ = కలుగును, (అనఁగాఁ బాపప్రాప్తి యౌ ననుట), ఐనన్ = ఐనను, నేన్ = నేను, ఇత్తున్ = ఒసఁగెదను, గొమ్ము అనన్ = గ్రహింపుమనఁగా, కొను = గ్రహించునట్టి, ధరణి = భూమి, భోగమునకుఁగాక = అనుభవించుటకేగాని, ధర్మమున కగునె = ధర్మమునకగునా, కానన్ = గనుక, సత్ క్షత్త్రియులకున్ = పుడమిఱేండ్లకు, భైక్షంబు = అడిగిపుచ్చుకొనుట, కీడు = పాపము, మత్ప్రధానులు = నామంత్రులు, వేఁడు సామ్రాజ్యము = రాజ్యముకొనుము, అనెడు = అనియెడు, పలుకు = మాట, ధర్మ...బు - ధర్మచ్ఛలంపు = ధర్మమువ్యాజముగల, లోభంబు = లోభగుణము, అయుక్తము = యుక్తముగాదు, అదిరొుఱఁగి = అది తెలిసి, రాజ్యమడుగన్ = ప్రభుత్వము వేఁడుటకు, ఇచ్ఛగింపన్ = అపేక్షింపను.

తా. ఓయి కేశిధ్వజుఁడా! యీరాజ్యపరిపాలనము శత్రుసంహారము మొదలగు వానిచేతఁ జేయఁబడిన రూపము గలయట్టి యవిద్య యనధికారి యగువాఁడు గ్రహింపక విడచెనేని పాతకము రాదు. అధికారి యగువాఁడు విడిచెనేని క్షత్త్రియ వంశాచారలోప మగుటవలని పాపలేపం బౌను. ఐనను నే నిచ్చెదఁ బరిగ్రహింపు మనఁగా గ్రహించినట్టి సామ్రాజ్యము భోగమునకేకాని ధర్మమునకుఁ గాదు. కావున రాజులకు యాచ్ఞావృత్తిచేతఁ బుచ్చుకొనుట మిగులఁ బాతకము. నామంత్రులు రాజ్యమును

గోరు మన్నయాట ఘన్మత్యాజముగల లోభగుణంబు యుక్తమైనది యని తెలిసి నేను రాజ్య మడుగక బ్రహ్మవిద్య నడిగితి నని ఖాండిక్యుఁడు పలికెను.

తే. 'ఆసపడుదురె బుధులు [1]రాజ్యమున మమత
మానని జడాత్ములట్లహంమానపాన
మత్తులకె కాక యది యేల మాదృశులకు?'
ననిన హర్షించి మెచ్చి యజ్ఞనకుఁ డనియె. 63

టీ. బుధులు = పండితులు, మమతమానని = మమకారము విడువనట్టి, జడాత్ములట్లు=మూఢాత్ములంబలె, రాజ్యమునన్ = రాజ్యమందు, ఆసపడుదురె = వాంఛింతురా, అది = ఆవాంఛ, అహం...కాక-అహంమాన = అహంకారమనియెడి, పాన = మధుపానముచేతను, మత్తులకెకాక = మదించినవారికే కాని, మాదృశులకున్ = మావంటివారికి, ఏల=ఎందుకు, అనినన్ = అనఁగా, హర్షించి=సంతసించి, మెచ్చి=శ్లాఘించి, అజ్ఞనకుఁడు = ఆకేశిధ్వజుండు, అనియెన్ = పలికెను.

తా. ప్రాజ్ఞులైనవారు మమకారము విడువని మూఢాత్ములవలె రాజ్య మపేక్షింపరను వాంఛ యహంమానపానమత్తులైయున్నవారలకే కాక మావంటివారల కేల? అనఁగా యజ్ఞనకుండు హర్షించి స్తుతిఁజేసి యొకమాట సెప్పెను.

ఆ. 'ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప
ననఘ రాజ్యమును మఖాదికములు'
జేయుచున్నవాఁడ క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగభుక్తి[2]వలన. 64

టీ. అనఘ = పాపరహితుఁడా! ఏన్ = నేను, అవిద్యవలనన్ = అజ్ఞానమువలన, మృత్యువున్ = సంసారమును, తరియింపన్ = దాఁటుటకై, రాజ్యమును=ప్రభుత్వమును, మఖాదికములు = యజ్ఞాదిసత్కర్మములను, చేయుచున్నవాఁడన్ = చేయుచున్నాఁడను, పుణ్యఫలమున్ = యజ్ఞాదిసత్కర్మలఫలమును, భోగభుక్తివలనన్ = భోగానుభవము చేతను, క్షీణింపఁజేయుదున్ = నష్టపఱుతును.

తా. పాపరహితుఁడవగు నోయి ఖాండిక్యుఁడా! నే నజ్ఞానమువలన సంసారము దాఁటుటకుఁ బ్రభుత్వమును, యాగాది సత్కర్మములుఁ జేయుచున్నాఁడను, భోగానుభవమువలనఁ బుణ్యఫలంబుల క్షీణింపఁ జేయుదు నని వచించెను.

క. మన యీ నిమివంశము పా
వన మగుభాగ్యమున మనుజవర! తత్త్వవివే

---

1. రాజ్యంపు మమత; రాజ్యంబుమమత. 2. చేత.

చనచింత నీకుఁ బొడమెను;
వినుమింక వినుపింతు నీ కవిద్యావిధమున్. 65

టీ. మనుజవర = రాజా! మన...ము - మన = మనయొక్క, ఈనిమిషాంశము= నిమిషప్రవృత్తిపంశము, పావ...క్ - పావనమగు = పవిత్రమగునట్టి, భాగ్యమునక్ =పుణ్యముచేత, తత్త్వవివేచనచింత - తత్త్వ = తత్త్వముయొక్క, వివేచన = తెలిసికొనునట్టి, చింత = విచారము, నీకుక్, పొడమెక్ = పుట్టెను. నీకుక్=నీకు, అవిద్యావిధముక్ = అజ్ఞానముయొక్క ప్రకారమును, వినుపింతుక్ = తెలియఁజెప్పెదను. ఇఁక, వినుము = ఆలకింపుము.

తా. మానవశ్రేష్ఠుఁడా! మన యీ నిమిషప్రవృత్తిపంశము పరిశుద్ధమగునట్టి పుణ్యవిశేషముచేత నీకుఁ దత్త్వవివేచనచింత గలిగెను గాన నిఁక నీకు నే నవిద్యామార్గముం దెలిపెద నాకర్ణింపు మనియెను.

ఆ. ఆత్మ గాని మేన నాత్మబుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు
నవనివర! యవిద్య యను మహాతరువున
కుత్పత్తి కీద్వయంబు విత్తు మొదలు. 66

టీ. అవనివర = భూనాథుఁడగు నోయి ఖాండిక్యుఁడా! ఆత్మగాని = జీవుఁడు గానట్టి, మేనక్ = శరీరమందు, ఆత్మబుద్ధియును = జీవజ్ఞానమును, అస్వంబునందు = తనది గాకుండునట్టి గృహాదులయందు, స్వత్వమతియు = తనది యను బుద్ధియు, ఈద్వయంబు= ఈరెండును, అవి...కిక్ - అవిద్య యను = అజ్ఞాన మనియెడు, మహాతరువు = గొప్పవృక్షముయొక్క, ఉత్పత్తికిక్ = జననమునకు, 'షష్ఠ్యాఉతో ఽచినుమ్స్' అను సూత్రముచేత నుమాగమము. మొదలు = ఆదియైనట్టి, విత్తు = బీజము.

తా. ఓ ఖాండిక్యమహారాజా! తానుగాని దేహమందు తానను జ్ఞానమును, తనది గాక యుండెడి గృహాదులయందుఁ దనది యనెడి బుద్ధియు, నీరెండు నజ్ఞాన మను మహావృక్షమునకు నాదియైన బీజంబు. ఈపద్యమునకు మూలమైన విష్ణుపురాణ శ్లోకము: 'అనాత్మ న్యాత్మబుద్ధి ర్యా అస్వే స్వ మితి యా మతి, అవిద్యా తరుసంభూతి బీజ మేత ద్ద్వధా స్థితమ్.'

క. నరనాథ! పాంచభౌతిక
శరీరమున దేహి మోహసాంద్రతమతమస
పరివృతుఁడై 'యే నిది నా
పరికర' మని యవధిలేని భ్రమఁబడి తిరుగున్. 67

టీ. నరనాథ = రాజా ! దేహీ = జీవుండు, పాంచ...నక్ -పాంచభౌతిక=పంచభూతపరిణామంబైన, శరీరమునక్ = దేహమునందు, సాంద్ర...త్రై-సాంద్రతమ=మిగుల దట్టమైన, తమః = అవిద్యచేతను, వివృతుండై = ఆవరింపఁబడినవాఁడై, ఏక్ = నేను, ఇది, నాపరికరము=నాసొమ్ము, అని = నిశ్చయించికొని, అవధిలేని=మితిలేని, భ్రమర్= అజ్ఞానమునందుపడి, తిరుగక్ = భ్రమణముఁ జేయుచుండును.

తా. ఓరాజా ! పంచభూతపరిణామంబగు దేహమందు మిగుల బలిసియున్న యజ్ఞానముచేత నావరింపఁబడినవాఁడు గాన జీవుఁడు నే ననియు, నాపరికరంబు లనియును దరలేని భ్రాంతిఁ జెంది తిరుగుచుండును.

క. జలవసుధాంబరపవన
జ్వలనంబులకంటెఁ దా నజస్రంబు వెలిఁ
వెలుఁగొందునాత్మ యుండఁగఁ
గళేబరము నెవ్వఁ డాత్మ గాఁ దలపోయున్. 68

టీ. జల...క్=జల-ఉదకము, వసుధా = భూమి, అంబర = ఆకాశము, పవన = వాయువు, జ్వలన = అగ్ని, ఈపంచభూతములకంటె, తాక్ = తాను (అనఁగా నాత్మయనుట), అజస్రంబు = నిరంతరమును, వెలిక్ = కడను, వెలుఁగొందు = ప్రకాశించు నట్టి, ఆత్మ=జీవుఁడు, ఉండఁగక్ = ఉండఁగా, కళేబరముక్ = దేహమును, ఎవ్వఁడు = ఎట్టివాఁడు, ఆత్మగాక్ = తానుగా, తలపోయుఁక్ = నిశ్చయముఁ జేయును.

తా. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతములకంటెను దా నిరంతరము వెలుపటఁ బ్రకాశించు చున్న జీవుండై యుండియు శరీరము నెవ్వఁ డాత్మ యని తలంచును.

సీ. వపు రుపభోగ్యముల్ నృప గృహ క్షేత్రాదు
లవి బొంది వేఁగాక యాత్మ వగునె
య ట్లన పుత్త్రపౌత్త్రాదీకములు నాత్మ
గాని మైఁ బుట్టుటఁ గావు తనవి ;
గాన మృత్యువుఁ గను కాయంబున జనించు
పుత్త్రాదు లెడ స్వత్వబుద్ధి దగదు ;
ఎప్పుడేని యాత్మ వేఱె యనునప్పుడే
యడరు భోగంబు లేయాత్మ కంట ;

తే. వట్లుగా కీయొడలె యాత్మకయన్న నంటు ;
మృద్గృహము నిల్చు నెట్లల్కు కమృజ్జలాది
నట్లు భౌతిక భోగాశనాది భౌతి
కాంగములు నిల్చు ; భోగ మింకదాత్మ కెద్ది ? 69

టీ. నృప = రాజా, వపురుపభోగ్యముల్ = శరీరముచేత ననుభవింపఁబడునట్టి, గృహక్షేత్రాదులు=ఇండ్లు భార్య మొదలైనవి, ని. 'క్షేత్రం పత్నీ శరీరయోః' అని యమరము. అవి = క చెప్పఁబడినవి, బొందివి = దేహసంబంధులైనవి, కాఁగాక, ఆత్మవగునె = ఆత్మసంబంధులైనవి యగునా, అట్లన = అరీతిగానే, పుత్ర...ము - పుత్రపౌత్ర = కొమారులు మనుమలు వీరియొక్క, అనీకములుక్ = సంఘములును, ఆత్మగాని=జీవుఁడు గాని, మైక్ = దేహమునను పుట్టుటక్ = జనియించుటచేత, తనవిగావు = ఆత్మవిగావు, కానక్ = అట్లగుటచేత, మృత్యువుఁగను కాయంబునక్=మృత్యువును బొందునట్టి శరీరమందు, జనించు = పుట్టుచున్న, పుత్రాదులెడక్ = కుమారులు మొదలగువారియందు, స్వత్వబుద్ధి = తన దనుజ్ఞానము, తగదు = కూడదు, ఎప్పుడేని = ఎప్పుడైనను, ఆత్మ = జీవాత్మ, వేఱె = భిన్నమే, అనుక్ = అనుకొనునో, అప్పుడె, ఒడదు = వృద్ధియగుచున్న, భోగంబులు = స్రక్చందనాదులు, ఆత్మకుక్ = తనకు, అంటవు = స్పృశింపవు, అట్లగాక = అటుగాక, ఈయొడలె = ఈశరీరమె, ఆత్మ = నేను, అనక్ = అన్నట్టాయె నేని, అంటుక్ = ముట్టును, మృద్గృహము = మృణ్మయనికేతనము, అల్కు మృజ్జలాదిక్ = అలికి పూసినట్టి మన్ను నీళ్లు మొదలగువానిచేత, ఎట్లు = ఏప్రకారము, నిలుచుక్ = ఉండునో, అట్లు=ఆప్రకారముగ, భౌతిక = భూతసంబంధులైన, భోగ = సుఖము, అశన = అన్నము, ఆదిక్ = మొదలుగాఁ గలవానిచేత, భౌతికాంగములు నిల్చుక్=పంచభూతాత్మక శరీరములు నిలుచును, ఇంకక్ = దీనియందు, భోగము = సుఖము, ఆత్మకుక్ = జీవునకు, ఎద్ది = ఏది.

తా. ఓయిరాజా ! దేహోపభోగ్యంబులైన గృహక్షేత్రాదులు శరీరసంబంధులు గాని యాత్మసంబంధులు గావు. అట్లేయగుననే పుత్రపౌత్రాదిసమూహము దేహమందు జనియించుటచేత నాత్మవి గావు కాన, మరణము నొందునట్టి శరీరమున జనియించిన పుత్రాదులందు స్వత్వబుద్ధి కూడదనియు నెపుడేని యాత్మకు దేహము భిన్నంబని భేదజ్ఞానము గలుగుచున్నదో యపుడు భోగంబు లాత్మ కంటవు. అటుగాక శరీరమె తానని తలంచినయెడ భోగంబు లంటుచున్నవి; మంటితోఁ గట్టంబడియున్న గృహము మృజ్జలాదులచేత నెట్లు నిలుచునో యట్లేయగున పంచభూతసంబంధులైన సుఖము, అశనము మొదలగువానిచేత భౌతికాంగములు నిలుచును. దీనియం దాత్మకు భోగ మెక్కడిది?

మ. జనిసాహస్రబహుప్రయాణ మగు సంసారంపుఁద్రోవ న్సదా
చనుచుండు న్ఘనమోహఖేద మలమ న్సంసారిపాంథుండు వా
సన లంధూళి ముసుంగుఁ గాఁగ; నెపుడేన్ జ్ఞానంపుటుష్ణోదకం
బునఁ దత్క్షాళనసేయు; వాని కపు డమ్మోహశ్రమంబు న్జనున్. 70

టీ. జని...ము - జనిసాహస్ర = జన్మసహస్రము లనియెడి, బహుప్రయాణ మగు = అనేక ప్రయాణములు గల, సంసా...వన్ - సంసారంపు = జననమరణాది రూపమైన సంసార మనియెడు, త్రోవన్ = మార్గమునందు, సంసా...డు - సంసారి = సంసారియను, పాంథుండు = పథికుఁడు, వాసనలన్ = అనాదికర్మవాసన లనియెడు, ధూళి = పరాగము, ముసుంగు గాఁగన్ = కప్పు గాఁగా, ఘన...ము - ఘన = అతిశయ మగు, మోహ = మోహమనియెడు, ఖేదము = క్లేశము, అలమన్ = చుట్టుకొనఁగా, సదాచనుచుండున్ = ఎప్పటికిని తిరుగుచుండును, ఎపుడేన్ = ఏసమయమున, జ్ఞానంపు టుష్ణోదకంబునన్ = శాస్త్రజన్య జ్ఞానమనియెడి యుష్ణజలంబు చేత, తత్క్షాళనసేయున్ - తత్ = ఆకర్మవాసన లనియెడు పరాగమును, క్షాళనసేయున్ = కడుగుకొనునో, వానికిన్ = సంసారి యను పథికునికి, అపుడు = ఆసమయమందు, అమ్మోహశ్రమంబున్ = ఆమోహమను శ్రమమును, చనున్ = నివర్తించును.

తా. జన్మసహస్రము లనియెడి యనేక ప్రయాణములుగల జనన మరణాది రూప మగు సంసార మను త్రోవయందు సంసారి యనుపథికుం డనాదికర్మవాసన లనియెడి పరాగము కప్పుకొనఁగా నతిశయం బగు మోహ మనుక్లేశము చుట్టుకొనఁగా నెడ తెగక తిరుగుచుండును. ఎపుడు శాస్త్రజన్యజ్ఞాన మనునుష్ణోదకముచేత సంసారి యను తెరువరి యా కర్మవాసన లనియెడి పరాగమును గడుగుకొనుచున్నాఁడో యపుడ యమ్మోహ మనుశ్రమము నివర్తించును.

తే. అట్టి మోహశ్రమం బాఱ న్నాశరీరి
స్వస్థుఁడై తా ననన్యాతిశయ మబాధ
మనఁగ విలసిల్లు నిర్వాణ [1]మనుభవించు
ననఘ తొల్లియు నిర్వాణఖనియ కాన. 71

టీ. అనఘ=పాపరహితుఁడా! తొల్లియున్ = ఆదిలో, గూడ, నిర్వాణఖనియ= ముక్తికి గనియే, కానన్ = అగుటంజేసి, ఆశరీరి=ఆజీవుఁడు, అట్టి...బు-అట్టి=అటువంటి, మోహశ్రమంబు = అజ్ఞానమనియెడి యాయాసము, ఆఱన్ = తీఱఁగా, స్వస్థుఁడై =

1. మును భజించు. పాఠాం.

తాను సుఖపడినవాఁడై, అనన్యాతిశయము = తనకంటె నతిశయము లేనట్టిదియు, అబాధము = దుఃఖరహితమైనదియు, అనఁగక్ = అనఁగా, విలసిల్లు = ఒప్పుచున్న, నిర్వాణము = మోక్షానందమును, అనుభవించుక్ = భోగించును.

తా. పాపరహితుండ వగు నోయిరాజా! యతండు తొలుత జీవన్ముక్తుఁడే కానఁ దాదృశం బగు నజ్ఞాన మనియెడి యాయాసము దీఱఁగా జీవుండు సుఖియై సర్వోత్తమంబును దుఃఖరహితము నైనది యనునట్లుగఁ బ్రకాశించుచున్న యానంద మనుభవించును.

వ. విను జనేశ్వర! జలం బస్పృష్టదహానం బయ్యుఁ దదీయ యోగం బునఁ గలశోదరంబున నునికిం దా నతిశీతలం బయ్యు నుడికి, శబ్దో ద్రేకాది ధర్మంబులం బొందునట్లాత్మయుం బ్రకృతి సంబంధంబున నహమ్మానాది దూషితుండై ప్రాకృతంబు లగు ధర్మంబులం బొందు; వీని కత్యంత విలక్షణుండు నక్షయుండు నాత్మ; య ట్లగుట నింత యనర్థమూలం బగు నీయవిద్యాబీజంబు నీ కెఱింగించితి; నేవం విధంబు లగు సకల క్లేశంబులకును సంక్షయ కరంబు యోగంబు దక్క మఱియొం డుపాయము లే"దనుటయుఁ బ్రీతుం డై ఖాండి క్యుండును 'మహాత్మ! యిన్నిమివంశంబున విజ్ఞాత యోగశాస్త్రా ర్థుండ వీవు, నాకు నయ్యోగంబు సమస్తంబు విస్తరింప వలయు ననినఁ గేశిధ్వజుండు కృపాళుం డై "మహీపాలా! విను మెందేని సంస్థితుం డై ముని మఱి పునర్భవంబునకు రాక బ్రహ్మసాధర్మ్యంబుఁ బొందు నట్టియోగంబుఁ జెప్పెద సావధానుండ వై విను మని యిట్లనియె. 72

టీ. విను = వినుము, జనేశ్వర = రాజా, జలము = నీరు, అస్పృష్ట దహానం బయ్యుక్ = అగ్ని నంటక యుండియు, తదీ...క్ - తదీయ = ఆయగ్నిసంబంధియైన, యోగంబునక్ = సంపర్కముచేత, కలశోదరంబునక్ = ఘటోదరమునందు, ఉన్కిక్ = ఉండుటంజేసి, తాక్ = ఉదకము, అతిశీతలంబయ్యుక్ = మిగులఁ జల్లనైయుండియు, ఉడికి = కాఁగి, శబ్దోద్రేకాది ధర్మంబులక్ = సలసలయను శబ్దము పొంగు మొదలైన గుణములను, పొందునట్లు = ఆశ్రయించినట్లు, ఆత్మయుక్ = జీవుఁడును, ప్రకృతి సంబంధంబునక్ = శరీరసంబంధముచేత, అహమ్మానాదిదూషితుండై = అహంకార మమకారాదులచేత మలినుండై, ప్రాకృతంబులగు ధర్మంబులం బొందుక్ = ప్రకృత

తన్యగుణంబుల నాశ్రయించునుగాని, ఏనికిన్ = ఈ ప్రకృతిధర్మములకు, అత్యంతవిలక్ష ణుండును = మిగుల వేఱైనవాఁడును, అక్షయుండును = నాశము లేనివాఁడును, ఆత్మ = జీవుఁడు, అట్లగుటన్ = అట్లగాన, ఇంత యనర్థమూలంబగు, ఈ యవిద్యా= ఈఅజ్ఞానముయొక్క, బీజంబు = కారణమును, ఎఱిఁగించితిన్ = తెలిపితిని. శ్లో. 'అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వే స్వమితి యామతిః, అవిద్యాతరుసంభూత బీజమేతద్ద్విధా స్థితమ్' అని విష్ణుపురాణము. ఏవం విధంబు లగు=ఈ ప్రకారమైన, సకలక్లేశములకున్ = సమస్త దుఃఖములకు, సంక్షయకరంబు = నాశముం జేయునది, యోగంబుదక్క = యోగము గాక, మఱియొం డుపాయము లేదనుటయు = మఱియొక సాధనంబు లేదనఁగా, ప్రీతుండై = సంతసించినవాఁడై, ఖాండిక్యుఁడును, మహామతి = మహామతి యగు నోయి కేశిధ్వజుఁడా, ఈనిమివంశంబునకున్, విజ్ఞాత = తెలియఁబడిన, యోగ శాస్త్రార్థుండవు = యోగశాస్త్రార్థము గలవాఁడవు, నీవు, నాకున్ = నాకును, అయ్యోగంబు సమస్తంబు విస్తరింపవలయు ననినన్ = ఆయోగమంతయు విపులముగాఁ జెప్పవలయు ననఁగా, కేశిధ్వజుండు, కృపాళుండై=దయగలవాఁడై, మహీపాల= భూనాయకుఁడా, వినుము = ఆకర్ణింపుము, ఎందేని సంస్థితుండై = ఏయోగశాస్త్ర మందు నున్నవాఁడై, ముని=సాధకుండు, మఱి=పిమ్మట, పునర్భవంబునకున్ రాక= పునర్జన్మమునకురాక, బ్రహ్మసాధర్మ్యంబు=బ్రహ్మత్వమును, పొందున్ = పొందునో, అట్టి యోగంబుఁ జెప్పెద=ఆయోగము వచించెదను, సావధానచిత్తుఁడవై=నిశ్చలమన స్కుఁడవై, వినుమని=ఆకర్ణింపుమని, ఇట్లనియె.

ఆ. ప్రాణికోటికెల్ల ◦ బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు ◦ కారణంబు
విషయసంగియైన ◦ విను బంధకారి; ని
ర్విషయమైన ముక్తి ◦ విభవకారి. 73

టీ. ప్రాణికోటికెల్లన్ = ఎల్లప్రాణులకు, బంధంబు = సంసార రూపబంధము, మోక్షంబు=తద్విమోచనము, చేరుటకును = కలుగుటను పొందుటకు, మనసు = మనంబు, కారణంబు = హేతువు, (ఆమనస్సు) విషయసంగియైనన్ = స్రక్చందనవనితాదివిషయ ములయందుఁ దగిలెనేని, బంధకారి = బంధము గలుగఁజేయునది, నిర్విషయమైనన్ = విషయములయందుఁ దగులకుండెనేని, ముక్తివిభవకారి = ముక్తివైభవముం జేయునది. ఈపద్య మీక్రిందిశ్లోకమున కనువాదము:—"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః, బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్."

తా. సకల జ్ఞానులయొక్క సంసారరూపబంధమునకును మోక్షమునకును మనంబే కారణ మనియు, నామనంబు స్రక్చందనాదివిషయములయందు బ్రవేశించె నేని బంధంబును, విషయములయెడ దగులకుండెనేని యనన్యాతిశయం బగు మోక్షంబును గలుగఁ జేయును.

సీ. విజ్ఞానమునఁ జేసి విషయాదివలన నె
మ్మన మాహరించి బ్రహ్మముఁ బరేశుఁ
జింతింపవలయు నిశ్శ్రేయసంబున; కట్లు
చింతింప నతఁడు తచ్చింతకునకు
నాత్మభావం బిచ్చు నాకర్షకము వికా
ర్యశ్మసారముఁ దార్చునట్లు; యోగ
మన యమాదికవిషయంబైన యాత్మ ప్ర
యత్నంబున కధీన యైన సాత్త్వి

తే. కపుమనోగతి యెయ్యది గలదు దాని
బ్రహ్మసంబంధినిఁగఁ జేయుప్రాప్తి సూవె;
యిట్టి వైశిష్ట్యధర్మ మెందేని గలుగు
నట్టి యోగంబు గలిగినయతఁడె యోగి. 74

టీ. విజ్ఞానమునఁజేసి=విశేషజ్ఞానముచేతను, విషయాదివలనన్ = స్రక్చందనాది విషయములు మొదలగువానివలన, నెమ్మనము = మనస్సును, ఆహరించి = మరలించి, పరేశున్ = పరమేశ్వరుఁడైన, బ్రహ్మమున్ = పరబ్రహ్మము, నిశ్శ్రేయసంబునకున్ = మోక్షమునకై, చింతింపవలయున్=ధ్యానము సేయవలయును, అట్లు చింతింపన్=ఆలాగు ధ్యానముసేయఁగా, అతఁడు = ఆ బ్రహ్మము, తచ్చింతకునకున్ = ఆధ్యానము సేయు వానికి, ఆకర్షకము = ఆకర్షకమైనట్టి సూదంటుఱాయి, వికారి = రూపాంతరముగల, అశ్మసారము=లోహమును, తార్చునట్లు=ఆకర్షించునట్లు, ఆత్మభావంబు = తనస్వరూపమును, ఇచ్చున్=ఒసఁగును, యోగ మనన్=యోగ మనఁగా, యమాదివిషయంబైన = యమనియమాదివిషయకమయిన, ఆత్మప్రయత్నంబునకున్=జీవునియొక్క వ్యవసాయము నకు, అధీనయైన = తగులైన, సాత్త్వి...గతి - సాత్త్వికపు = సత్త్వగుణప్రధాన మైన, మనోగతి=మనోవ్యాపారము, ఎయ్యది గలదు=ఏది కలదో, దానిన్ = ఆమనో వ్యాపారమును, బ్రహ్మసంబంధినిఁగాన్=బ్రహ్మమును బొందినదానిఁగా, చేయుప్రాప్తి సూవె=చేయుప్రాప్తిమచుమీ, ఇట్టివైశిష్ట్యధర్మము=విశేషభావముగల ధర్మము, ఎందేని

గలదు=ఎక్కడఁ గలదో, అట్టియోగంబు గలిగినయతఁడేయోగి=అట్టియోగము గల వాఁడే యోగి.

తా. విశేషజ్ఞానముచేత విషయాదులను హరించి బ్రహ్మానుసంధానముఁ జేయు వాని కాపరబ్రహ్మము సూదంటుతాయి వికారము గలయినుమును దనయందు గ్రహించినట్లు ఆత్మస్వరూపము నిచ్చు ననియు, యోగ మనఁగా యమనియమాది విషయకం బయిన తనప్రయత్నమున కఠినమైన సత్త్వగుణప్రధాన మగుమనోవ్యాపారమును బ్రహ్మసంబంధిఁగాఁజేయునట్టి ప్రార్థించుచుమీ యనియు, నిట్టివైశిష్ట్యధర్మ మెందుఁ గలదో యదే యోగ మాయోగము గలవాఁడె యోగి యనియు భావము.

వ. మఱియు బ్రహ్మచర్యాదు లగుయమంబు లేనును స్వాధ్యాయాదు లగు నియమంబు లేనును నిష్కాముం డై యోగియగువాఁడు మనోనైర్మల్య సంపాదనకు నాచరింపవలయు నివి కామ్యంబు లైన విశిష్టఫలదంబులు నిష్కాములకు ముక్తిదంబు లగునట్టి యమనియ మంబులు వదలక భద్రాసనాదులందు నొకటి నవలంబించి ప్రాణా భిధానం బగు పవనంబు నభ్యాసంబున వశంబు సేయవలయు నదియె ప్రాణాయామ మనంబడు నట్టి ప్రాణాయామంబు సబీజాబీజ సంజ్ఞ లం బరఁగు నదియె ప్రాణాపానంబుల మిథోనురోధంబుల నుభయ నిరోధనంబున రేచకాదిత్రైవిధ్యంబునుం బొందు మొదల నా చె ప్పిన బీజాబీజ సంజ్ఞలందు నంతస్స్థూలరూపావలంబి యగునదియ సబీజం బితరం బబీజంబు మఱి శబ్దాదివిషయంబులం బ్రవ ణంబు లగు నింద్రియంబులం ద్రిప్పి మానసంబున కఠినంబులు సేయుట ప్రత్యాహారం బట్టి ప్రత్యాహారంబు ముముక్షున కవ శ్యకర్తవ్యంబు దీనివలన నతిచంచలంబు లగు నింద్రియంబులకు నా త్మవశ్యత గలుగు నివి గన వశ్యంబులు గాకుండిన నాయోగి యోగ సాధకుండు గానేరఁడు ప్రాణాయామంబునఁ బవనంబులు ప్రత్యాహా రంబున నింద్రియంబులు వశంబు లైన పిమ్మటఁ జిత్తంబు శుభాశ్ర యంబునం దిడునది యనుటయు శ్రీకాండిక్యుఁ డిట్లనియె. 75

టీ. మఱి=మఱియును, బ్రహ్మచర్యాదు లగుయమంబు లేనును = బ్రహ్మచర్యము మొదలైనయమంబులైదును, స్వాధ్యాయాదులగు నియమంబులేనును = వేదపారాయ ణము మొదలైన నియమంబులైదును, యోగియగువాఁడు, నిష్కాముఁడై = కోరికలేని

వాఁడై, మనోనైర్మల్యసంపాదనకుఁ = మనశ్శుద్ధిని సంపాదించుటకొఱకు, ఆచరింప వలయుఁ=అనుష్ఠింపవలయును, ఇవి=ఈయమనియమములు, కామ్యంబులైనఁ = కోరిక చేతఁ జేయఁబడినయెడ, విశిష్టఫలదంబులు = సకల ఫలప్రదంబులు, నిష్కాములకుఁ = కోరికలేనివారలకు, ముక్తిదంబులగుఁ = మోక్షమిచ్చునవి యగును, అట్టియమనియ మంబులు, వదలక = విడువక, భద్రాసనాదులయందు = భద్రాదులగుసాసనవిశేషముల యందు, ఒకటి నవలంబించి = ఒకటి నాశ్రయించి, ప్రాణాభిధానం బగు = ప్రాణమను పేరుగల, పవనంబుఁ = వాయువును, అభ్యాసంబునఁ వశంబుసేయవలయుఁ = వాడుకచేత వశపఱుచుకొనవలయును, అదియె ప్రాణాయామ మనంబడుఁ, అట్టిప్రాణా యామంబు, సబీజాబీజసంజ్ఞలం బరఁగు = సబీజప్రాణాయామం బబీజప్రాణాయా మం బని నామద్వయముచేత నొప్పును, అదియె = ఆ ప్రాణాయామమే, ప్రాణాపా నంబుల = ప్రాణాపానంబులను రెండు వాయువులయొక్క, మిథః = పరస్పరము, అను రోధంబులఁ = అనుసరించుటచేతను, ఉభయనిరోధనంబునఁ = రెంటిని నిలుపుటచేతను, రేచకాది త్రైవిధ్యంబునుఁ = రేచక పూరక కుంభకము; లనియెడి త్రివిధత్వమును, పొందుఁ = వహించును, మొదల నాచెప్పిన = తొలుత నేఁ జెప్పిన, సబీజాబీజసంజ్ఞ లందు = ఈరెండునామములయందు, అంతః = లోపలను, స్థూలరూపావలంబియగు నదియ = స్థూలస్వరూపము నాశ్రయించునదియ, సబీజంబు = సబీజప్రాణాయామంబు, ఇతరంబు = సూక్ష్మస్వరూపావలంబి యగునదియే, అబీజంబు = అబీజప్రాణాయామంబు, మఱిశబ్దాదివిషయంబులఁ = శబ్ద స్పర్శ రూప రస గంధంబులను విషయములందు, ప్రవణంబులగు = ప్రవర్తలైనట్టి, ఇంద్రియంబులఁ = శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణంబు లనుపంచేంద్రియములను, త్రిప్పి = మరలించి, మానసంబున కధీనంబులు సేయుట = మనంబునకు వశముసేయుట, ప్రత్యాహారంబు, ఇట్టిప్రత్యాహారంబు, ముము క్షునకుఁ = మోక్షేచ్ఛగలవానికి, అవశ్యకర్తవ్యంబు=తప్పకచేయఁదగినది, దీనివలనఁ = ఈప్రత్యాహారయోగమువలన, అతిచంచలంబులగు = మిగులఁజపలంబులైన, ఇంద్రియం బులకుఁ=పంచేంద్రియంబులకు, ఆత్మవశ్యతగలుగుఁ = ఆత్మవశంబౌటకలుగును, ఇవి = ఈప్రాణేంద్రియంబులు, కనఁ = చూడఁగా, వశ్యంబులు కాకుండినఁ = వశవర్తులు కాకుండెనేని, ఆయోగి = ఆయోగపురుషుండు, యోగసాధకుండు కానేరఁడు = యోగము సాధించువాఁడుగాఁడు, ప్రాణాయామంబునఁ = ప్రాణాయామముచేతను, పవనంబులు = వాయువులు, ప్రత్యాహారంబునఁ = ప్రత్యాహారముచేత, ఇంద్రియం బులు = శ్రోత్రాదులు, వశంబులైన = అధీనములైన, పిమ్మటఁ = పిదప, చిత్తంబు = మనమును, శుభాశ్రయంబునందు = శుభాధార మగుపరబ్రహ్మమునందు, ఇడునది =

పొందింపవలయును, అనుటయుక్ = అనఁగా, ఖాండిక్యుండు, ఇట్లనియెక్ = ముందు చెప్పుచున్నాఁడు.

తా. బ్రహ్మచర్యము మొదలగు యమము లైదును, స్వాధ్యాయము మొదలగు నియమము లైదును జిత్తశుద్ధికొఱ కనుష్ఠింపవలయును. ఇవి కోరికచేతఁ జేసిన పక్షమున విశేషఫలముల నిచ్చును. కోరిక లేక చేసినయెడ మోక్ష మబ్బును. భద్ర ముక్తపద్మ సిద్ధ వీర ముక్త పద్మ మను నివి మొదలగు నాసనములలో నొకటి నవలంబించి వాయువును రేచక పూరక కుంభకాభ్యాసముచేత వశపఱచుకొనవలయును. ఇట్లు ప్రాణవాయువును వశపఱచుకొనుటయే ప్రాణాయామ మనంబడును. అది సబీజం బబీజం బని ద్వివిధంబు. శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచవిషయములకుఁ బోవు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణమ్ము లనుపంచేంద్రియంబుల మరలుచుకొనుట ప్రత్యాహారంబు. ఇది ముముక్షునకు నవశ్యము చేయఁదగినది. ఇట్లొనరింప నింద్రియములు మనస్సున కధీనము లగును. పిమ్మట శుద్ధం బగుచిత్తమును పరబ్రహ్మమందుఁ జేర్చవలయును.

క. మనమున కెద్ది శుభాశ్రయ,
మనఘ! యెఱిఁగింపు, మఱి సమస్తాధారం
బనఁ జను యద్వస్తువు? య
స్మనన మశేషోరుదుఃఖమండలిఁ జెఱుచున్? 76

టీ. అనఘ = పరిశుద్ధుఁడా, మనమునకుక్ = మనస్సునకు, ఎద్ది=ఏవస్తువు, శుభాశ్రయము = శుభమైనస్థానము, మఱి = మఱియును, సమస్తాధారంబు = సకలమును ధరించునది, అనక్ = అనునటుల, యద్వస్తువు = ఏవస్తువు, చనుక్=ఒప్పును, యన్మననము = ఏదేవుని చింతనము, అశే...లిక్ - అశేష = సకలమైనట్టియు, ఊరు = విస్తారమయిన, దుఃఖమండలిక్ = శోకసమూహములను, చెఱుచుక్ = నష్టముఁ జేయునో, ఎఱింగింపుము = తెలుపుము.

తా. మానసంబున కేది శుభ మైనస్థానము, సకలాధారంబగు వస్తువేది, ఏదేవుని మననము సకల దుఃఖ సమూహంబులం బోఁగొట్టునో, పరిశుద్ధుండ వగు నోయి కేశిధ్వజుఁడా ! యెఱింగింపు మని పలికెను.

తే. అనినఁ గేశిధ్వజుఁడు వాని కనియె, 'బ్రహ్మ
మాశ్రయంబు మనంబున; కది యు పరము
నపరము ననంగఁ బొలుచు, నం దపర మనఁగ
మూర్తము, పరం బనంగ నమూర్త మనఘ! 77

టీ. అనినన్ = ఇట్లనఁగా, కేశిధ్వజుఁడు = జనకుండు, వాని కనియెన్ = ఆఖాండిక్యునకుఁ జెప్పెను, అనఘా = పరిశుద్ధుండవగు నోయిరాజా, మనంబునకున్ = చిత్తంబునకు, బ్రహ్మము = పరబ్రహ్మము, ఆశ్రయంబు = స్థానము, అదియ = ఆపరబ్రహ్మమే, పరమున్ = పరమనియు, అపరమున్ = అపరమనియు, అనంగన్ = అనునటుల, పొలుచున్ = ఒప్పును, అందున్ = ఆరెంటియందు, అపరమనఁగన్, మూర్తము, అనఁగా రూపముకలది, పరంబనంగన్, అమూర్తము, అనఁగా రూపము గాకుండునది.

తా. అట్లనఁగాఁ గేశిధ్వజుండు పరబ్రహ్మమే చిత్తమునకు నాశ్రయం బనియు, నా పరబ్రహ్మము పరాపరభేదంబులఁ జెంది యుండు ననియు, నపర మనఁగా రూపవత్పదార్థ మనియు, పర మనఁగా రూపవత్తనియు నాఖాండిక్యునకుఁ దెలిపెను.

మ. మును నాచెప్పిన రెంటిలోఁ బర మనన్ ముక్తాత్మ; దూరం బుపా
సనఁ గావింప నమూర్త; మింక పరసంజ్ఞం, బబ్జగర్భాది బ
ద్ధనికాయం బది మూర్త మైనను బరిత్యాజ్యంబు శశ్వత్త్రిభా
వనలం గూడుట నారురుక్షున కసేవ్యం బీద్వయంబు న్దుదన్. 78

టీ. మును = ముందు, నాచెప్పిన = నేఁ జెప్పినట్టి, రెంటిలోన్ = ద్వయములో, పరమనన్ = పరమనఁగా, ముక్తాత్మ = విడంబడిన బ్రహ్మము, అమూర్తము = ఆకారము లేనిది, గనుక, ఉపాసన గావింపన్ = ధ్యానముచేయుటకు, దూరంబు = శక్యము గాదు, ఇంక = ఇంకను, అపరసంజ్ఞంబు = అపరమను పేరుగలది, అబ్జగర్భాది = బ్రహ్మమొదలగు, బద్ధనికాయంబు = బద్ధజీవుల సమూహరూపము, అది = ఆయపరము, మూర్తమైనను = రూపవత్తైనను, శశ్వత్ = మాటిమాటికిని, త్రిభావనలన్ = భావనాత్రయముతోడను, కూడుటన్ = కూడియుండుటచేత, పరిత్యాజ్యంబు = సేవింపఁదగినది కాదు, ఆరురుక్షునకున్ = సాధకునికి, తుదన్ = కడపట, ఈద్వయంబున్ = ఈపరాపరములు రెండును, అసేవ్యంబు = విడువఁదగినది.

తా. పూర్వము నాచేతఁ జెప్పఁబడిన పరాపరములలోఁ బరము నిరాకారముగాన ముముక్షువు లగుజీవుల కుపాసనాశక్య మనియు, నపర మనుసంజ్ఞ గల చతుర్ముఖాది బద్ధజీవ సంఘరూపము సాకారమైనను భావనాత్రయవిశిష్ట మగుటం జేసి పరిత్యాజ్య మనియు, నారురుక్షునకు శరీరత్యాగకాలమందు నీరెండువిధంబు లుపాసనకుఁ దగినవి కా వనియును దాత్పర్యము.

వ. ఆభావనాత్రయం బెద్ది యనినఁ జెప్పెద బ్రహ్మభావనయుం గర్మభావనయు బ్రహ్మకర్మోభయభావనయు నందు బ్రహ్మభావనాయు

తులు సనందనాదులు, దేవాది స్థావరావరు లగుప్రాణు లందఱు కర్మభావనాభావకులు, హిరణ్యగర్భాదు లుభయభావనాపరు, లీ మూఁడుతెఱఁగులవారు భావనాత్రయాన్వితులు గావున నీత్రివిధాత్మక రూపంబ సేవ్యంబు, సనందనాదులునుం బ్రాగ్బ్రహ్మకల్పంబుల సంచరించుట భావనాబద్ధులై; యిబ్భావనాత్మకం బగు విశ్వంబు సంస్థితికి నవధి; దేవమనుష్యాది విశేషజ్ఞాన కర్మంబులు క్షీణించుటయ; యట్టి విశ్వంబై తోఁచు హిరణ్యగర్భాదులకంటె నన్యంబు పరాఖ్యం; బిది ముక్తరూపం బమూర్తంబై యుండు నని మొదల సూచించితిం గదా; తదాకారంబుఁ దేటపఱచెద; పూర్వోక్త దేవాది భేదరహితంబై తద్భేదరాహిత్యంబున నిట్టి దట్టి దని వచించుటకు గోచరంబుగాక యపక్షయాది రహితంబును సచ్ఛబ్దవాచ్యంబును నాత్మసంవేద్యంబును నై జ్ఞానైకనిరూపణీయం బగుచు జ్ఞానశబ్ద వాచ్యంబునుం దానయై బ్రహ్మాత్మకం బగుట బ్రహ్మ సంజ్ఞయుం గాంచి యొప్పు; మఱి భావనాత్రయాత్మక విశ్వవైలక్షణ్యంబె లక్షణంబుగాఁ గల యీరూపం బభ్యస్యమాన యోగుం డగుయోగికిం జింతింప నశక్యంబు. మఱి యపరం బని చెప్పంబడిన హిరణ్యగర్భుండు వాసవుఁడును ప్రజాపతులు మరుత్తులు వసువులు రుద్రులు ఆదిత్యులు తారకంబులు గ్రహంబులు గంధర్వ యక్ష రక్షో దైత్యాది సమస్త దేవయోనులు మనుష్యులు పశువులు అద్రులు సముద్రంబులు ద్రుమంబులు వెండియు నేకపాద ద్విపాద బహుపాదాపాదంబు లగు నితర భూతంబులుం దదుత్పత్తి హేతువులునుగా విలసిల్లునట్టి ప్రధానాదివిశేషాంత చేతనాచేతనాత్మక ప్రపంచభావం బగు స్థూలరూపం *బుపక్రాంత యోగు నకుఁ జింతింప శక్యంబు. శక్యమేనియుఁ దద్భావనాత్రయాత్మకం బగుట ,నశుభాశ్రయంబు గావున ముక్తిసాధనంబుగా దీ చెప్పఁబడిన సకల ప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితంబై యతనికి శరీరంబునై యుండు నట్టి విష్ణుశక్తులు మొదల నేఁజెప్పిన పరాపరాఖ్యలను దదతిరిక్తయగు కర్మాఖ్యనుం ద్రివిధములై యుండు నందుఁ గర్మాఖ్యశక్తి

* బు ప్రశాంత.

చేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మ జరామరణా ద్యనేక సంసారతాపంబు లనుభవించుచు దత్తత్కర్మానుగుణ శరీరంబు లెత్తి విజ్ఞాన తారతమ్యంబుల నొందుఁ దత్ప్రకారం బాకర్ణింపుము. 79

టీ. అభావనాత్రయం బెద్ది యనిన=అభావనాత్రయం బేది యనిన, చెప్పెదన్ = వచించెదను. బ్రహ్మభావనయు కర్మభావనయు బ్రహ్మకర్మోభయ భావనయు నని మూఁడు ప్రకారములు. అందున్ = ఆమూటియందు, సనందనాదులు = సనందనుఁడు మొదలగు మహాయోగు లెల్లను, బ్రహ్మభావనాయుతులు, దేవాదిస్థావరాంతరులగు=దేవతలు మొదలు పర్వత పాషాణములుతుదగాఁగల, ప్రాణు లందఱు = జీవులందఱును, కర్మభావనాభావకులు = కర్మభావనాయుతులు, హిరణ్యగర్భాదులు, ఉభయభావనాపరులు = కర్మబ్రహ్మఉభయభావనాపరులు, ఈమూఁడు తెఱంగులవారు = ఈమూఁడు విధంబులవారును, భావనాత్రయాన్వితులు = త్రిభావనలతోఁ గూడి యున్నవారు, కావునన్ = అట్లౌటవలన, ఈత్రివిధాత్మకరూపంబు = మూఁడువిధంబు లగురూపంబులు, అసేవ్యంబు = సేవింపఁదగినదికాదు, సనందనాదులు = సనందనుఁడు మొదలగువారును, ప్రాగ్బ్రహ్మ కల్పంబులన్ = మునుపటి బ్రహ్మకల్పములయందు, సంచరించుటన్ = జన్మము లెత్తుటచేతను, భావనాబద్ధులు = బ్రహ్మభావనచేత బద్ధులైనవారు, ఈ భావనాత్మకం బగు = భావనాస్వరూపంబైన, విశ్వంబు = జగత్తు యొక్క, స్థితికిన్ = ఉనికికి, అవధి = మర్యాద, దేవమనుష్యాది = దేవతలుమనుష్యులు మొదలగు, విశేష = నానావిధప్రపంచముయొక్క, జ్ఞానకర్మంబులు, క్షీణించుట = నష్టమౌట, ఇట్టి = ఈదృశంబైనట్టి, విశ్వంబై = జగత్తై, తోఁచు = కనుపించునట్టి, హిరణ్యగర్భాదులకంటెన్ = చతుర్ముఖాదులకంటెను, అన్యంబు = ఇతరమైనది. పరాఖ్యంబు = పర మను పేరు గలది, అది, ముక్తరూపంబు = రూపము లేనిది, అమూర్తంబై యుండుననిని, మొదల = తొలుతనే, సూచించితిఁగదా = జ్ఞాపకము సేసితిఁగదా, తదాకారంబున్ తేటపఱచెదన్ = తత్స్వరూపంబుఁ దెలిపెద, పూర్వో ...బై - పూర్వోక్త = మున్ను చెప్పఁబడిన, దేవాది భేదరహితం బై = దేవాది భేదంబులు లేనిదై, తద్భేద రాహిత్యమునన్ = ఆభేదము లేకపోవుటచేత, ఇట్టిదట్టిదని వచించుటకున్ = ఈదృశంబు తాదృశం బని పల్కుటకు, గోచరంబుగాక=విషయము గాక, అపక్షయాది రహితంబును, అపక్షయ = నాశము, ఆది = మొదలగు వికారము లచే, రహితంబు=విడువఁబడినది, సచ్ఛబ్దవాచ్యంబు - సత్=సత్తును, శబ్ద = శబ్దముచే, వాచ్యంబు = చెప్పఁదగినది, ఆత్మసంవేద్యంబును - ఆత్మ = జీవునిచేత, సంవేద్యంబు =

తెలియఁదగినదియును, జ్ఞానైకనిరూపణీయంబును = జ్ఞానముచేతనే నిరూపింపఁదగినది యును, అగుచున్, జ్ఞానశబ్దవాచ్యంబును = జ్ఞానమనుశబ్దముచేఁ జెప్పఁదగినదియును, తానయి, బ్రహ్మాఖ్యకంబగుటన్ = బ్రహ్మస్వరూపమగుటచేతను, బ్రహ్మసంజ్ఞ యయున్ = బ్రహ్మమనునట్టి నామమును, కాంచి=పొంది, ఒప్పున్ = ఒప్పును, మఱి, భావనా... బై - భావనాత్రయాత్మక = త్రిభావనాస్వరూపమైన, విశ్వ = జగత్తుకంటె, వైలక్ష ణ్యంబై = వేఱగుటై, లక్షణంబుగాఁగల = చిహ్నము గాఁగల, ఈరూపంబు = ఇట్టి రూపము, అభ్యస్యమానయోగుఁడగు = అభ్యసింపఁబడు యోగముగల, యోగికిన్ = యోగపంతునికి, చింతింప నశక్యంబు=అనుసంధానము చేయ శక్యము గాదు, మఱి యపరం బని చెప్పంబడిన, హిరణ్యగర్భుండు = చతుర్ముఖుండు, వాసవుండు = ఇంద్రుఁ డును, మొదలుగాఁ గ్రమాంపము = ఏకపాదాదితరభూతంబులును, తదుత్పత్తి హేతువు లుగాన్ = ఆభూతాది జన్మములకుఁ గారణంబులుగా, విలసిల్లునట్టి = ఒప్పుచున్నట్టి, ప్రధానాది విశేషాంత=ప్రధానము మొదలు వ్యక్తివిశేషములు తుదగాఁగల, చేతనా చేతనాత్మక = జ్ఞానాజ్ఞానజీవరూపమైన, ప్రపంచభావంబగు=ప్రపంచభావము గలయట్టి, స్థూలరూపంబు, ఉపక్రాంతయోగునకున్ =యోగమున కుపక్రమించినయోగికి, చింతింప శక్యంబు = ధ్యానసాధ్యంబు, శక్యమేనియున్ = ధ్యానసాధ్యంబైనను, ఫల్ =ఆ, భావ నాత్రయాత్మకంబగుటకున్ = భావనాత్రయ స్వరూపమగుటచేత, అశుభాశ్రయంబు = శుభాశ్రయముగాదు, కావునన్ = కాన, ముక్తిసాధనంబుగాదు = మోక్షసాధనంబు గాదు, ఈచెప్పఁబడినసకల ప్రపంచంబును, విష్ణుసమన్వితంబై, అతనికిన్ = ఆదేవునికి, శరీరంబు నైయుండున్, అట్టి విష్ణుశక్తులు = విష్ణుసామర్థ్యములు, మొదలనేఁ జెప్పిన = తొలుత నాచేఁ జెప్పఁబడిన, పరాపరాఖ్యలను = పర అపర అను నామములచేతను, పద తిరిక్తయగు = వానికివేఱైన, కర్మాఖ్యము=కర్మశక్తియనునట్లుగా, త్రివిధములై యుండును, అందున్ = వానియందు, కర్మాఖ్యశక్తిచేత వేష్టితయై=కర్మమను పేరుగలశక్తిచేతఁ జుట్టఁ బడినదై, అపరాఖ్యయగు = అపరమను పేరుగల, క్షేత్రజ శక్తి = పురుషశక్తి, జన్మ... లన్ - జన్మజరామరణాది = జననము ముదిమి చచ్చుట మొదలగు, అనేక సంసార తాపంబులన్ = బహువిధములగు సంసారమువలని వేదనలను, అనుభవించున్, తత్క... లు - తత్కర్మ = ఆయాకర్మలకు, అనుగుణ = సరియైనట్టి, శరీరంబులు = దేహములు, ఎత్తి = పొంది, విజ్ఞానతారతమ్యంబులన్ = విశేష జ్ఞానంబులయొక్క వాసులను, పొం దున్ = చెందును, తత్ప్రకారంబు = తత్క్రమంబు, ఆకర్ణింపుము = వినుము.

సీ. ఉండు నప్రాణులం దొక్కించు కాశక్తి;
స్థావరశ్రేణిఁ ద జ్జాతికంటె;

నెట్టి రోఁకటిబండ జెట్టి మన్నిండి ము
న్నగు సరీసృపములం దంతకంటె;
ఖగముల [1]వఱి వాని కంటె మృగావలి
యందు నూహింపంగ నంతకంటె,
దంతి గోముఖ పశు తతి నంతకంటె మా
ర్త్యకదంబకములయం దంతకంటె,
తే. యక్ష గంధర్వ నాగాళి నంతకంటె,
నంతకంటె నిలింపులం దంతకంటె
హరిహయునియందు, దక్షునం దంతకంటె,
నాద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె. 80

టీ. ఆశక్తి = ఆక్షేత్రజ్ఞశక్తి, అప్రాణులందుఁ = ప్రాణరహితవస్తుజాలమందు, ఒక్కించుక = కొంచెము, ఉండుఁ = ఉండును, తజ్జాతికంటెఁ = ప్రాణరహిత వస్తుజాతికంటెను, స్థావరశ్రేణిఁ = స్థావరపఙ్క్తులగు పర్వతవృక్షాదులయందు, ద్విగుణంబుగ నుండును, (ఈపద్యమునం దుదాహరింపఁబడిన స్థావరశ్రేణిశబ్దము మొదలు హిరణ్యగర్భశబ్దమువఱకు యథాక్రమంబుగా తచ్ఛబ్దవాచ్యంబు లగు భూతముల యందు నొకదానికంటె నొకదానియం దావిష్టశక్తి ద్విగుణంబు హెచ్చుగా నుండు నని యూహింపవలయు), తజ్జాతికంటె = ఆస్థావరజాతికంటెను, ఎట్టులు, రోఁకటిబండలు, జెట్టిపోతులు, మన్నిండి = మన్నుదినునట్టికణుదురు, మున్నగు = మొదలయిన, సరీసృపములందుఁ = సర్పములందును, అంతకంటెఁ, ఖగములఁ = పక్షులందు, వానికంటెఁ, మృగావలిఁ = మృగసమూహమందు, ఊహింపఁ = గ్రహింపఁగా, అంతకంటెఁ, దంతి...న్ - దంతి = ఏనుఁగు, గో = ఆవు, ముఖ = మొదలగు, పశు తతిఁ = పశుసంఘమందును, అంతకంటెఁ, మార్త్య...దుఁ - మార్త్య = మనుష్యసంబంధియైన, కదంబకములయందుఁ = గుంపులయందును, అంతకంటెఁ, యక్ష గంధర్వనాగాళిఁ = యక్షాదులయందును, అంతకంటెఁ, నిలింపులందుఁ = దేవతలయందు, అంతకంటెఁ, హరిహయునియందుఁ = దేవేంద్రునియందు, అంతకంటెఁ, దక్షునియందును, అంతకంటెఁ, ఆద్యుండు = మొదలివాఁడైన, హిరణ్యగర్భునందుఁ = చతుర్ముఖునియందు, క్షేత్రజ్ఞశక్తి యుండును.

ఆ. ఇట్టిరూపకోటు లెల్ల సవ్విష్ణుని
తనుచయంబు సుమ్ము ధరణినాథ!

1. యం దంతకంటె.

యతఁ డచింత్యశక్తి నఖిలభూతముల నా
కసమువోలె నిండి యొసఁగుఁ గాన. 81

టీ. ధరణినాథ = రాజా ! అతఁడు = ఆదేవుఁడు, అచింత్యశక్తిన్ = చింతింప నశక్యంబైన సామర్థ్యముచేత, అఖిలభూతములన్ = సకలభూతములయందు, ఆకసము వోలెన్ = ఆకాశమునుంబలె, నిండి = సంపూర్ణుఁడై, ఎసంగుఁగానన్ = ఒప్పునుగాన, ఇట్టిరూపకోటులెల్లన్ = ఏతాదృశరూప సహస్రంబు లన్నియును, అవ్విష్ణుని = ఆదేవుని యొక్క, తనుచయంబుసుమ్ము = దేహసమూహముసుమీ.

తా. ఓ ధరణినాథా ! ఆవిష్ణుం డప్రమేయం బగు నిజసామర్థ్యముచేత నిఖిల భూతములయం దాకాశముమాడ్కి నిండి ప్రకాశించుచుండును గాన నుక్తంబులగు నేతాదృశరూప సహస్రంబు లాదేవుని శరీర పుంజంబులు సుమీ ! యని కేశిధ్వజుండు పలికెను.

సీ. మున్నన్నినపరాఖ్య మునకు ద్వితీయమై
విష్ణు[1]సంజ్ఞఁ గను నుర్వీతలేశ
యోగిహృద్ధ్యేయ మై యొప్పు నమూర్తరూ
పం బొండు ; సత్సంజ్ఞఁ బ్రాజ్ఞకోటి
దాని వచించు; నేతద్రూపమె సమస్త
శక్తుల కెల్ల నాశ్రయత [1]నొంది
ప్రాగుక్త విశ్వరూపవిలక్షణతఁ గాంచి
కల్యాణ గుణభూతి గరిమఁ దనరి

తే. యతిమహత్త్వంబుచే వెల్గునట్టి శక్తి
నలరు బ్రహ్మంబు దేవతిర్యఙ్మనుష్య
నామచేష్టావదవతరణముల నాత్మ
లీల జగదుపకృతికిఁ గల్పించుచుండు. 82

టీ. ఉర్వీతలేశ = రాజా! మున్నన్నినపరాఖ్యమునకున్ = మునుపు చెప్పినపర మనియెడు పేరుగల బ్రహ్మమునకు, ద్వితీయమై = రెండవదియై, యోగిహృద్ధ్యేయమై= యోగిచిత్తములచేత ధ్యానము సేయఁదగినదియై, ఒప్పు...బు - ఒప్పు = ఒప్పుచున్న, అమూర్తరూపంబు = మూర్తభిన్నరూపంబు, ఒండు = ఒకటి, విష్ణుసంజ్ఞన్ = విష్ణువను పేరును, కనున్ = పొందును. ప్రాజ్ఞకోటి = పండితసమూహము, ని. "ధీరో మనీషీ జ్ఞః

1. సంజ్ఞనను, 1. c బొందిః

ప్రాజ్ఞస్సఖ్యావాన్పణ్డితః కవిః' యని యమరము. దానిక్ = ఆరూపమును, సత్సంజ్ఞన్ = సత్తనునామముచేత, పచించుచున్ = పలుకుదురు. ఏతద్రూపమె = ఈరూపమె, సమస్తశక్తుల కెల్లన్ = నానావిధములైన సామర్థ్యములకు, ఆశ్రయతన్ = స్థానమగుటను, ఒంది = పొంది, ప్రాగు...రన్ - ప్రాగుక్త = ముందు చెప్పఁబడిన, విశ్వరూప = జగద్రూపముకంటె, విలక్షణతన్ = వైలక్షణ్యమును, కాంచి = కని, కల్యాణగుణతతి = కల్యాణగుణ సంపత్తియొక్క, గరిమన్ = గురుత్వముచేతను, పనరి = ఒప్పి, అతిమహత్త్వంబుచేన్ = అత్యంత మాహాత్మ్యముచేత, వెల్గున్ = ప్రకాశించును, అట్టి, శక్తిన్ = సామర్థ్యముచేత, అలరు...బ-అలరు = ఒప్పునట్టి, బ్రహ్మంబ = పరబ్రహ్మమే, దేవ...లన్ - దేవ=దేవతలయందు, తిర్యక్ = మత్స్యాది తిర్యగ్జాతులయందు, మనుష్య=మనుష్యులందు, నామచేష్టావత్ = నృసింహ వామన మత్స్య కూర్మ వరాహ రామ కృష్ణాది నామములకుఁ దగిన చేష్టలు గల, అవతరణములన్ = అవతారములను, ఆత్మ లీలన్-ఆత్మ=తనయొక్క, లీలన్ = విలాసముచేతను, జగదుపకృతికిన్ = లోకోపకారమునకు, కల్పించుచుండున్ = చేయుచుండును.

తా. ఓయి భూనాయకుఁడా! మున్ను నేఁ జెప్పిన పరబ్రహ్మ మనియెడుబ్రహ్మమునకు రెండవదియై యోగులచేతఁ దెలియఁదగినది యైన మూర్తభిన్నరూపం బొక్కటి విష్ణు వనునామమును బొందియున్న దనియుఁ, బండితు లట్టిరూపంబును సత్తను సంజ్ఞచేత పచించుచున్నా రనియుఁ, నీరూపంబె నానావిధసామర్థ్యముల కాశ్రయతను బొంది పూర్వము చెప్పఁబడిన జగద్రూపముకంటెను వైలక్షణ్యముం గాంచి కల్యాణగుణ సంపద్గురుత్వముచేత నొప్పి యత్యంత మాహాత్మ్యము గలిగి ప్రకాశించుచున్న సామర్థ్యముచేత నొప్పును. అట్టి పరబ్రహ్మమే నిజవిలాసముచేత దేవతిర్యఙ్మనుష్యులయొక్క నామములు వ్యాపారములుం గలరామకృష్ణాద్యవతారములను లోకోపకారమునకై కల్పించుచుండును.

ఆ. కర్మభుక్తికొఱకుఁ గాఁ దిట్టి తల్లీల;
యతఁడు సకలజాతులందుఁ బుట్టు;
బుట్టినట్టి యతని భూరిచేష్టితము ల
వ్యాహతములు రావణాదివలన. 83

టీ. ఇట్టితల్లీల - ఇట్టి, తత్ = ఆదేవునియొక్క, లీల = విలాసక్రియ, కర్మభుక్తి కొఱకుఁ గాదు = కర్మానుభవముకొఱకుఁ గాదు, అతఁడు = ఆవిష్ణుదేవుండు, సకల జాతులందున్ = దేవమనుష్య తిర్యగాది సమస్తజాతులయందును, పుట్టున్ = జన్మము

నొందును. పుట్టినట్టి=జనియించిన, అతని = ఆదేవునియొక్క, భూరిచేష్టితములు=అధికము లైన వ్యాపారములు, రావణాదివలనన్ = రావణుండు మొదలగు దుష్టులవలన, అవ్యాహతములు = భగ్నములు గావింప నశక్యంబులు.

తా. ఆవిష్ణుదేవునియొక్క విలాసక్రియ స్వకీయ కర్మానుభవము కొఱకుఁగా దనియు, నాతఁడు తిర్యగాది నిఖిల జాతులయందుఁ బుట్టినను నతని వ్యాపార విస్తారంబులు దుష్టు లగు రావణాదులవలన భగ్నములు గావింప నసాధ్యంబు లనియును తా.

వ. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాది రూపంబు లనేకంబులు గలిగిన ముముక్షునకు జ్ఞానసిద్ధికిఁ బరవ్యూహవిభవాదిరూపంబులే చింతనీయంబులు; ప్రజ్వలితశిఖుం డగుపవనసఖుండు నీరస నికుంజంబు నెట్లు దహించు నట్లు చిత్తస్థుం డగునవ్విష్ణుండు యోగిజనంబుల సకల కిల్బిషంబులు నిర్దహించుఁ గావున సకలశక్త్యాశ్రయుం డైన యప్పరమాత్మునియందుఁ జిత్తంబు నిల్పుట విరుద్ధ యగు ధారణ యనంబడు; సర్వసంగంబునఁ జలాత్మకం బగుచిత్తంబునకుఁ ద్రిభావభావనాతీతుం డగునద్దేవుండు శుభాశ్రయుండై ముక్తికరుం డగు; నేతద్వ్యతిరిక్తు లగు బ్రహ్మాదిదేవతలు కర్మయోను లగుట నశుద్ధులు గావునఁ జిత్తంబున కవలంబనీయులు గారు; మఱి నిరవలంబ ధ్యానంబు పొందుపడదు గావున, ధారణాధ్యాన విషయంబై శుద్ధం బగు స్థూలరూపాంతరం బయ్యనంతునకుం గలదు, దానిసవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము. 81

టీ. అట్టిపరమేశ్వరునకు, బద్ధ, ముక్త, ఆది = మొదలైన రూపంబులు, అనేకంబులు కలిగినన్ = పెక్కులుగలిగియుండినను, ముముక్షునకున్ = సాధకునికి, జ్ఞానసిద్ధికిన్ = జ్ఞానము సిద్ధించుటకొఱకు, పర...లే - పర = వైకుంఠవాసుఁడైన పరవాసుదేవుఁడు, వ్యూహ = సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు, విభవ = రామకృష్ణాద్యవతారంబులు, ఆది= మొదలగు, రూపంబులె = స్వరూపములే, చింతనీయంబులు = ధ్యానవిషయంబులు, చిత్తస్థుఁడగు = మనంబున నిల్చినట్టి, విష్ణుండు = విష్ణువు, ప్రజ్వలిత శిఖుం డగు = మిగుల మండుచున్న జ్వాలలుగల, పవనసఖుండు = అగ్ని, నీరసనికుంజంబున్ = ఎండినపొదను, ఎట్లుదహించున్ = ఏవిధంబుగఁ గాల్చునో, అట్లు = అవిధంబుగ, యోగి...లు - యోగి జనంబుల = యోగులయొక్క, సకల కిల్బిషంబులు = సమస్తపాపములను, నిర్దహించున్ = కాల్చును, కావునన్ = కాన, సకలశక్త్యాశ్రయుండైన = సమస్త సామర్థ్యముల

కాధారమైన, అప్పరమాత్మునియందుఁ, చిత్తంబు నిలుపుట = మనం బుంచుట, విశుద్ధ యగు ధారణ యనంబడు, సర్వసంగంబునకున్ = నిఖిలవస్తుసంబంధములచేత, చలాత్మకం బగుచిత్తంబునకున్ = చంచలరూప మైనమనంబునకు, త్రిభావ...డు-త్రిభావ = మూఁడు భావములుగల, భావనా = ధ్యానమునకు, అతీతుం డగు = వెలిగా నున్నట్టి, అద్దేవుండు, శుభాశ్రయుండై=శుభస్థానమై, ముక్తికరుండగు=మోక్షమునిచ్చువాఁ డగును, ఏకతద్వ్యతిరిక్తులగు = కావిష్ణునకుభిన్నులైన, బ్రహ్మాదిదేవతలు = చతుర్ముఖుండు మొదలగు నిలింపులు, కర్మయోను లగుటన్ = కర్మమేకారణంబుగాఁగలవా రౌటచేత, అశుద్ధులు = అయోగ్యులు (మలినులనుట), కావునన్, చిత్తంబున కవలంబనీయులుగారు = మనస్సున కాశ్రయింపఁదగినవారలుగారు, మఱియును, నిర...బు - నిరవలంబ = ఆధారములేని, ధ్యానంబు, పొందుపడదు కావునన్ = సిద్ధింపదుగాన, ధారణాధ్యానవిషయంబై = ధారణాధ్యానంబులకు గోచరంబై, శుద్ధంబగు = నిర్మలంబగు, స్థూలరూపాంతరంబు = మఱియొకస్థూలరూపము, అయ్యనంతునకున్ = అపరబ్రహ్మమునకు, కలదు = ఉన్నది. దాని సవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము.

సీ. శరదిందుచకచకశ్స్మయజిత్ప్రసన్నాస్యు,
 దొడ్డకెందమ్మికన్దోయివాని,
నతికమ్రగల్లభాగాభోగఫాలాఢ్యు,
 మకరాంకరత్నకర్ణికలవానిఁ,
గాంబవోద్యచ్ఛ్రీవిశడంబినృత్తశిరోధి,
 సిరి పొల్చుమచ్చు వేరురమువాని,
నతనాభియుతవళిత్రితయశాతోదరు,
 జానులంబిచతుర్భుజములవానిఁ,

తే. గరివరకరోరు రుచిరజంఘ*ఘురమణీయు,
సమతబొందిన పదపల్లవములవాని,
హైమవసనుఁ, గిరీటహారాంగదాది
కలితు, శంఖరథాంగాదు లలరువాని. 55

టీ. శర...స్యున్ - శరదిందు = శరత్కాలచంద్రునియొక్క, చకచక = ధాళధళ్యముయొక్క, స్మయ = గర్వమును, జిత్ = గెలిచినట్టి, ప్రసన్న = ప్రసాదముగల, ఆస్యున్ = ముఖముగలవానిని, దొడ్డ...నిన్ -దొడ్డ = గొప్పలైన, కెందమ్మి = ఎఱ్ఱదామరలవంటి, కన్దోయివానిన్ = నేత్రయుగళముగలవానిని, అతి...ఢ్యున్ - అతికమ్ర = మిగు

* ఘూమనోజ్ఞ.

లఁ గమనీయమైన, గల్ల = చెక్కిళ్లయొక్క, భాగ = ప్రదేశముచేత, ఆభోగ = పరిపూర్తి గల, ఫాల = నొసటిచేత, ఆఢ్యుని = సంపన్నుఁడైనవానిని, మకర...నిన్-మకర = మొసళ్లు, అంక = చిహ్నముగాఁగల, రత్న = మణిఖచితములయిన, కర్ణికలవానిన్ = పోఁగులుగలవానిని, కాంబవ...ధిన్-కాంబవ = శంఖసంబంధియైన, ఉద్యత్ = విలసిల్లుచున్న, శ్రీ = కాంతియొక్క, విడంబి = పోలిక గలిగినట్టి, వృత్త = వట్రువైన, శిరోధిన్ = మెడగలవానిని, సిరి = లచ్చి, పొల్చు పేరురమువానిన్ - పొల్చు = ఒప్పునట్టి, మచ్చ = శ్రీవత్స మనుమచ్చ గల, పేరురమువానిన్ = గొప్ప ఱొమ్ముగలవానిని(లక్ష్మీదేవియు శ్రీవత్స మను మచ్చయును స్వామివక్షస్స్థలమం దుండుట ప్రసిద్ధంబు), నత...రున్-నత = లోఁతైన, నాభి = బొడ్డుతోడను, యుత = కూడియున్న, వళిత్రయ = మూఁడుతరులుగలిగిన, శాత=సూక్ష్మమైన, ఉదరున్ = బొజ్జగలవానిని, జాను...నిన్ - జానులంబి = మోఁకాళ్లపర్యంతము వ్రేలుచున్న, చతుర్భుజములవానిన్ = నాలుగుచేతులు గలవానిని, కరి...యున్ - కరివర = గజశ్రేష్ఠముయొక్క కర = తుండమువంటి, ఊరు = తొడలచేత, రుచిర=మనోహరమైన, జంఘా = పిక్కలచేత, రమణీయున్ = సుందరుఁడైనవానిని, సమ...నిన్ - సమతఁ బొందిన = సమమైనట్టి, పదపల్లవములవానిన్ = చిగురుటాకులవంటి పాదములు గలవానిని, హైమ...నున్ - హైమ = సువర్ణసంబంధియైన, వసనున్ = వస్త్రముగలవానిని, కిరీట...తున్ - కిరీట, హార, అంగద=బాహుపురి, ఆది = మొదలైనవానితో, కలితున్ = కూడియున్నవానిని, శంఖ...లు-శంఖ = శంఖము, రథాంగ = చక్రము, ఆదులు = మొదలుగాఁగల పంచాయుధములు, అలరువానిన్ = ఒప్పుచున్నవానిని.

తా. శరత్కాల చంద్రునియందలి ధావళ్యమును ధిక్కరించుచుఁ బ్రసన్నమై యున్న ముఖము గలట్టియు, గొప్పవైన యెఱ్ఱదామరలవంటి నేత్రయుగళము గలిగినట్టియు, మిగుల సుందరమగు చెక్కిళ్లు పరిపూర్తి గలనొసలు వీనిచే సంపన్నుఁ డైనట్టియు, మకరాంకములు రత్నఖచితములు నైన ప్రోగులుగలయట్టి శంఖకాంతి ననుకరించుచు వట్రువగానున్న మెడగలయట్టియు, లక్ష్మిచేతను శ్రీవత్స మను మచ్చచేతను నొప్పుచున్న ఱొమ్ముగల మిగుల లోఁతైన నాభితోఁగూడిన వళిత్రయముగల సూక్ష్మమగు బొజ్జగలయట్టియు, మోఁకాళ్లవఱకు వ్రేలెడి చతుర్భుజములుగలట్టియు, నేనుంగు తుండమువంటి తొడలచే నతిరమణీయంబగు పిక్కలచేత సుందరుండైనట్టియుఁ, జిగురుటాకులవంటి పాదములుగల్గి హైమవసనము గలట్టియుఁ, గిరీటహారాంగదాది సహితుఁడైనట్టియు, శంఖరథాంగాది పంచాయుధములచే నొప్పుచు నుక్తసకలలక్షణలక్షితుం డై యున్న జగదీశ్వరుం డగు శ్రీహరి దివ్యమంగళ విగ్రహమును సాధకుండు వక్ష్యమాణక్రమంబున ధ్యాన మొనర్పవలయును.

సీ. శ్రీవిష్ణు నీగతిఁ । జింతింప వలయుఁ [1]ద
న్మయుఁ డగు యోగి । క్రమంబుతోడ
నొక్కయంగమె మున్ను । చిక్క లోఁ భావించి
యది దృఢం బగుటయు । నవలియంగ
కము మఱి చింతింపఁ । గాఁ దగు నట్టి య
భ్యాసంబువలన [2]నయ్యవయవములు
నడచిన నున్న మానక యెద్దియేనియుఁ
జేయుచున్నను మదిఁ । బాయఁడేని;
తే. యతనిసామ్యంబు గని ముక్తుఁ । డగు; సురాది
భేదసంజనకాజ్ఞాన । మేదఁ పిదప
నలము(రు)కల్యాణగుణముల । హరికిఁ దనకు
లేని భేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు? 86

టీ. శ్రీవిష్ణున్ = శ్రీహరిని, ఈగతిన్ = వక్ష్యమాణ ప్రకారంబుగ, చింతింప వలయున్ = ధ్యానము సేయవలయును, తన్మయుఁడగు = ఆవిష్ణుస్వరూప మయ్యెడి, యోగి=యోగవంతుఁడు, క్రమంబుతోడన్, మున్ను = తొలుత, ఒక్కయంగమె=ఒకయవయవమునే, చిక్కన్ = గుఱుతుచిక్కునట్లుగ, లోన్ = లోపల, భావించి=చింతించి, అది దృఢం బగుటయున్ = ఆయంగము దృఢముగ మనంబులో నిలిచినపిమ్మట, అవలియంగకము-అవలి = ఆవలనున్న, అంగకము, మఱి = మఱియును, చింతింపఁగాఁదగున్ = ధ్యానము సేయవలయు, అట్టియభ్యాసంబువలనన్ = అటువంటివాడుకచేత, అయ్యవయవములు=ఆయంగములను, నడచినన్ = గమన మొనరించినను, ఉన్నన్=స్థితుండైనను, మానక = వదలక, ఎద్దియేనియుఁ జేయుచున్నను = ఏపని సేయుచుండినను, మదిన్=బుద్ధిని, పాయఁడేని = తొలఁగకుండఁ జేసెనేని, అట్లాచరించిన సాధకుండు, అతనిసామ్యంబు - అతని=అప్పరమాత్మునియొక్క, సామ్యంబు = సారూప్యము, కని=కాంచి, ముక్తుఁడగున్ = మోక్షమందును, సురాది...ము-సురాది = సురలు మొదలగు, భేద = భేదమును, సంజనక=పుట్టించుచున్న, అజ్ఞానము = అవిద్య, ఏదన్ = నివర్తింపఁగా, పిదపన్ = పిమ్మట, అల...ములన్-అలము = ప్రాప్తమగునట్టి, కల్యాణగుణములన్ = సౌశీల్యాది శుభగుణములచేత, హరికిన్=విష్ణునకు, తనకున్ = యోగికిని, లేని భేదము=ఎన్నఁటికి లేకుండు భేదమును, ఎవ్వాఁడు = ఎట్టివాఁడు కల్పింపఁగలఁడు = నిర్మాణము సేయ సమర్థుఁడౌను?

1. దన్మయుఁ డయి. 2. నయ్యవయవి మఱి.

తా. శ్రియఃపతియొక్క సారూప్యం బపేక్షించువార లీప్రకారము ధ్యానము సేయవలయును. ఎట్లనిన, మున్నొక్క యవయవమును మనంబున కంటునట్లుగా మిగుల భావన యొనర్చి యది దృఢముగ గుర్తు దగిలినపిమ్మట మఱి యొక యంగమును భావించుచు నిత్తెఱంగున నవయవంబుల నెల్ల ధ్యానించి తా నూరకున్నను లేక గమనాదివ్యాపారంబులు వడసి యున్నను మఱియు నెట్టి యవస్థ నొందియున్నను ధ్యానము మానక యుండిన నాయంగాంబులు మనంబు విడిచి కదల కుండున ట్లభ్యాసపాటవ మొనర్చ నేని యట్టిసాధకుండు శ్రీహరి సారూప్యము నొంది ముక్తుం డగును. దేవతలు మొదలగు వారభేదమును గల్పించుచున్న యజ్ఞానము నివర్తించిన పిదపఁ గల్యాణ గుణసమన్వితుండై యావిష్ణునకుం దనకును లేని భేదం బెవ్వఁ డేనియుం గల్పింపఁజాలఁడు.

క. నరవర! యిటు బంధచ్యుతి
[1]కొఱ కగు నంగాష్టకాఖ్య(ఢ్య) గురుయోగము వి
స్తరముగఁ జెప్పితి నింకఁ
గరణీయం బెద్ది నాకుఁ గల్పింపు మనన్. 87

టీ. నరవర=రాజా! ఇటు = ఈప్రకారము, బంధచ్యుతికొఱ కగు=సంసార బాధ మోచనమునకైనట్టి, అంగా...ము - అంగాష్టకాఖ్య = అంగాష్టక మను పేరం బరఁగిన, గురు=అతిశయంబగు, యోగము = సమాధిని, విస్తరముగన్=విపులమగునట్లు, చెప్పితిన్= వచించితిని, ఇంకన్ = ఇఁకను, నాకున్, కరణీయంబు = చేయందగినది, ఎద్ది = ఏది, కల్పింపుము = చెప్పుము, అనన్ = అనఁగా.

తా. ఓయి రాజా! ఈప్రకారముగా సంసార రూప బంధ మోచనంబునకై యంగాష్టకాఖ్యం బగు నుత్తమ యోగంబు సెప్పితి నింక నేఁ జేయం దగినది యెద్దియో తెలుపు మనఁగా నాఖాండిక్యుండు ముందు వచించుచున్నాఁ డనుట.

తే. 'నృప! కృతార్థుండ నైతి నా కింతకంటె
నర్థనీయంబు మఱి యెద్ది? యనుచు నతని
నర్చఁ గావించి వల దన్న నతఁ డొసంగు
తనదు తొంటి రాజ్యంబునఁ దనయు నిలిపి. 88

టీ. నృప = కేశిధ్వజుండా! కృతార్థుండ నైతిన్ = ధన్యుండనైతిని, నాకున్, ఇంతకంటెన్ = ఈయోగముకంటెను, అర్థనీయంబు = కోరఁదగినది, మఱియెద్ది = మఱియొకటి యేది, అనుచున్, అతనికిన్ = కేశిధ్వజునకు, అర్చఁగావించి = పూజయొనర్చి,

1. కర మగునంగాష్టకాఖ్యమున యోగము.

వలదన్నను = వలవదన్నను, అతఁడు = ఆకేశిధ్వజుండు, ఒసఁగు = ఇచ్చినట్టి, తనదగు నర్ - తనదు = తనయొక్క, తొంటిరాజ్యంబునర్ = పూర్వపు రాజ్యమునందు, తన తయుర్ = పుత్త్రకుని, ఉనిచి, ముందఱి కన్వయము.

తా. ఓయి కేశిధ్వజుఁడా! ధన్యుండవైతి నీ యోగంబుకంటె వేఁడఁదగినది యెద్దియు ను లేదనుచు నా కేశిధ్వజునకుం బూజఁ గావించి వలవదన్నను గేశిధ్వజుం డిచ్చిన తన పూర్వపు రాజ్యమునందుఁ దన పుత్త్రకుని నియమించి.

వ. పురోహిత ప్రధానుల నప్రాప్తయౌవనుం డగు నతని మెలపికొం డని నియోగించి, వారల దానసమ్మానాదులం బ్రోవు మని కుమా రునకు నప్పగించి, గోవిందచరణారవింద విన్యస్తమానసుండై ఖాం డిక్యుం డుభయకర్మంబులు డులిపి, యవ్వనంబ తపోవనంబుగాఁ గొంతకాలంబు కేశిధ్వజోపదిష్టభక్తియోగానుసంధానంబున మధు మథన సాధర్మ్యంబు నొందె; కేశిధ్వజుండునుఁ దత్పుత్త్రునిఁ దత్ప్రి ధానులఁ దదీయ రాజ్య పరిపాలన కనిచి మగుడి మిథిలాపురంబు ప్రవేశించి యోగాశ్రయుండై భోగంబులం బుణ్యంబులు తదితరం బుల దురితంబులు పక్షీణంబులుగా క్షోణీతలం బేలుచుండెం, గావున ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు, పాండ్యక్షి తీశా! నీ వతని భజియింపు మిదియె భక్తి యోగఁబు, దీనియందు నొక్క కొఱఁతగల, దంతరాయంబు నొందినఁ బునర్భవంబుఁ బొం దించి మఱి ముక్తిఁ జేర్చు, నట్లగుట నింతకంటె సులభోపాయం బాయోధనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శర ణాగత ధర్మంబ నిరపాయధర్మం బని పరిణతాంతఃకరణుం డగు నతనికి మూలమంత్ర పూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగ వత ప్రధానుం గావించిన 69

టీ. ఖాండిక్యుండు, పురోహితులను, ప్రధానులను, అప్రాప్తయౌవనుం డగు = వయసురానివాఁడైయున్న, అతనిర్ = ఆకుమారుని, మెలపికొండని = తీర్చికొండని, నియోగించి = ఆజ్ఞాపించి, వారలర్ = అమంత్రిపురోహితులను, దాన...లర్ - దాన = ఈవులు, సమ్మాన = బహుమానములు, ఆదులర్ = మొదలగువానిచేత, ప్రోవు మని = రక్షింపుమని, కుమారున కప్పగించి = పుత్త్రకుని వశము గావించి, గోవింద...డై- గోవింద = శ్రీహరియొక్క, చరణారవింద = పాదపద్మములయందు, విన్యస్త = ఉంచఁ

బడిన, మానసుఁడై = మనంబుగలవాఁడై, ఖాండిక్యుఁడు, ఉభయకర్మంబులు దులిపి = పుణ్యపాపముల దుల్లఁగఁగొట్టి, అవ్వనంబ = తానున్న యరణ్యంబె, తపోవనంబుగాన్ = తపమొనరించునట్టి యాశ్రమముగా, కొంతకాలంబు = కొన్నినాళ్లు, కేశి...నన్ - కేశిధ్వజోపదిష్ట = కేశిధ్వజునిచేత నుపదేశింపఁబడిన, భక్తియోగాను సంధానమ్మునన్ = భక్తియోగము నాచరించుటచేత, మధు...నన్ - మధుమథన = శ్రీమన్నారాయణుని యొక్క, సాధర్మ్యంబున్ = సమానధర్మమును, ఒందెన్ = పొందెను, కేశిధ్వజుండును, తత్పుత్త్రుని = ఆఖాండిక్యుని కుమారుని, తత్ప్రధానులన్ = అతని మంత్రులను, తదీయ రాజ్య పరిపాలన కనిచి = ఖాండిక్యునిరాజ్యమంతయు నేలుటకుఁబంపి, మగుడి = మరలి, మిథిలాపురంబు ప్రవేశించి = తాను మిథిలాపట్టణము సొచ్చి, యోగాశ్రయుండై, భోగంబులన్ = సుఖానుభవములచేత, పుణ్యంబులు = పుణ్యకర్మంబులు, తదితరంబులన్ = వానికంటెవేఱైన దుఃఖానుభవములచేత, దురితంబులు = పాపములు, ప్రక్షీణంబులుగాన్ = నశించునటుల, 'ప్రారబ్ధకర్మణాం భోగా దేవక్షయః' యనునట్టి న్యాయావలంబియై, క్షోణీతలం బేలుచుండెన్, కావున = అటుగాన, ముముక్షునకున్, ఉపాశ్రయణీయుండు = ఆశ్రయింపఁదగినవాఁడు, అయ్యధోక్షజుండు = ఆవిష్ణుండె, పాండ్యక్షితీశా = ఓయిరాజా! నీవు, అతనిన్ = ఆవిష్ణుని, భజింపుము = భజన సేయుము, ఇది భక్తియోగంబు దీనియందునొక్కకొఱఁతగలదు. అంతరాయంబు = విఘ్నము, ఒందినన్ = పొందినయెడల, పునర్భవంబుఁబొందించి = పునర్జన్మ మెత్తించి, మఱి = పిదప, ముక్తింజేర్చున్ = పరమపదమునందుఁజేర్చును, అట్లగుటన్ = అలాగగుటచేత, ఇంతకంటె సులభోపాయంబు, ఆయోధనమునన్ = తొల్లిభారతయుద్ధమందు, అయ్యధోక్షజుండు = ఆశ్రీకృష్ణుండు, గాండీవికిన్ = అర్జునునకు, ఉపదేశించిన శరణాగతధర్మంబ = శ్రీభగవద్గీతా చరమశ్లోకోక్తధర్మంబే, నిరపాయధర్మంబు = అపాయరహితమైన ధర్మము, అని = ఇట్లని, పరిణతాంతఃకరణుండగు = పరిపక్వమనస్కుండైన, అతనికిన్ = ఆపాండ్యరాజునకు, మూలమంత్రపూర్వకంబుగాన్ = శ్రీమదష్టాక్షరీమంత్ర సహితంబుగా, ద్వయంబు = వాక్యద్వయంబును, ప్రసాదించి = అనుగ్రహించి, భాగవత ప్రధానున్ = భాగవతోత్తమునిఁగా, కావించినన్ = చేయఁగా.

మ. వకుళాలంకృత యోగిహృన్నిలయ భాస్వత్పాండుభాస్వన్మయాం
  బక నాభీజలజాతసూతవిధిసంప్రాప్తస్మరారిష్ట ము
  ష్టికతోరార్పణకర్కటీఫలితకౌశిక్రూర రక్షోంగకా
  కృకవాహుధ్వజ దీర్ఘికాప్లవతపఃక్రీడోత్సవాద్యుత్సుకా. 90

టీ. వకుళా...య - వకుళ = పొగడపువ్వులచేతను, అలంకృత = అలంకరింపఁబడిన, యోగి = నమ్మాళ్వారనుయోగియొక్క, హృత్ = హృదయము, నిలయ = గృహముగాఁగలవాఁడా! భాస్వ...క - భాస్వత్ = సూర్యునియొక్క, పాండు = తెల్లనైన, భాస్వత్ = కాంతిగల చంద్రునియొక్క, మయ = స్వరూపమైన, అంబక = నేత్రద్వయముగలవాఁడా! ని. 'స్యాదంబకమిత్యాదృశి' యని నిఘంటువు. నాభీ...ష్ట - నాభీజలజాత = బొడ్డుతామరయందు, సూత = పుట్టిన, విధి = చతుర్ముఖునిచేతను, సంప్రాప్త = పొందఁబడిన, స్మర = మన్మథునికి, అరిష్ట = శత్రుఁడైన శివుఁడు గలవాఁడా! (విష్ణువువలన బ్రహ్మయు నతనివలన రుద్రుఁడును బుట్టిరనుట) ముష్టి...కా - ముష్టి = పిడికిలియొక్క, కఠోర = నిష్ఠురమైన, అర్పణ = కూర్పికి (అనఁగా ముష్టిఘాతమున కనుట). కర్కటీఫలిత = దోసపండుగాఁ జేయఁబడిన, ని. ఉర్వారుః కర్కటీస్త్రియా' మ్మని నిఘంటువు. కేళి = కేళియనునట్టి, ప్రవరరక్షః = కర్కశుండగురక్కసునియొక్క, అంగకా = దేహముగలవాఁడా, కృపీటాసుధ్వజ = కోడి టెక్కెమందుఁ గల కుమారస్వామియొక్క, దీర్ఘికా = సరస్సునందు, ప్లవ = తెప్పచేత నగు, తపక్రీడా = గ్రీష్మకాలమందలి కేళియొక్క, ఉత్సవ = మహోత్సవము, ఆది = మొదలగువానియందు, ఉత్సుక = ఆసక్తుఁడైనవాఁడా.

తా. భాగవత ప్రధానుఁడగు నమ్మాళ్వారు హృదయమందుఁ గ్రమ్మరుచున్నట్టియు సూర్యచంద్రులు నేత్రములుగాఁగలయట్టియుఁ దనవలనఁ బుట్టినట్టి చతుర్ముఖునియందుం బుట్టిన రుద్రుఁడు గలయట్టియుఁ గఠోర మగు ముష్టిఘాతముచేత దోసపండుంబలెఁ బగుల్పఁబడిన కేశిదనుజుఁడు గలయట్టియుఁ గ్రీష్మర్తువందు స్కందపుష్కరిణిలో నీఁదులాడుట యను నుత్సవమం దుత్సుకుఁడ వైనవాఁడా! యని తాత్పర్యము.

క. ఊరీకృతపాండవరథ, సారథ్య సయూథ్యగోపశాబకసహకే
లీరత భక్తప్రహ్లా, దారచితస్తోత్రపులకితాంచితగాత్రా. 91

టీ. ఊ...థ్య - ఊరీకృత = అంగీకరింపఁబడిన, పాండవ = అర్జునునియొక్క, రథ = అరదముయొక్క, సారథ్య = సూతత్వముగలవాఁడా! సయూథ్య...రత - సయూథ్య = చెలికాండ్రైన, గోపశాబక = గొల్లపిన్నవాండ్రతోడను, ని. 'పృథుకశ్శాబకశ్శిశుః' అని నిఘంటువు. సహకేళీ = కూడం గ్రీడించుటయందు, రత = ఆసక్తిగలవాఁడా! భక్త...త్రా-భక్త = అనురక్తుఁడైన, ప్రహ్లాద = ప్రహ్లాదునిచేత, ఆరచిత = విశేషముగాఁ జేయంబడిన, స్తోత్ర = స్తుతిచేత, పులకిత = సంజాత పులకమైన, అంచిత = ఒప్పుచున్న, గాత్రా = దేహముగలవాఁడా.

తా. అర్జునుని రథమునకు సారథియైనట్టియు, వయస్యులగు గొల్లలతోడి క్రీడల యం దాసక్తిగలయట్టియు, భాగవతుం డగు ప్రహ్లాదునిచేతఁ జేయఁబడిన స్తోత్రముచేత నైన రోమాంచముచే నొప్పుచున్న దేహముగలవాఁడా యని తాత్పర్యము.

స్రగ్విణి. ఆస్థితాహీంద్రశయ్యా దవీయస్తర
ప్రస్థితాంఘ్రి శ్రితవ్రాత[1]చేతోఘదా
కస్థలప్రస్పృశత్కాళియక్ష్వేళ(ళి)మూ
ర్ధస్థలీనృత్తమత్తల్లిహల్లీసకా. 92

టీ. ఆస్థితా...య్యా - ఆస్థిత = అధిష్ఠింపఁబడిన, అహీంద్ర = శేషుఁడనెడు, శయ్యా = పాన్పుగలవాఁడా! దవీ...ఘ్రి - దవీయస్తర=మిగులపొడువుగ, ప్రస్థిత=నడచిన, అంఘ్రి = పాదములు గలవాఁడా! శ్రితవ్రాత=భక్తసమూహముయొక్క, చేతః = మనంబులందలి, అఘ = పాపములను, దా = ఖండించువాఁడా! (దో = అవఖండనే అని ధాతువు), కస్థల...కా - కస్థల = ఉదకప్రదేశములు, ప్రస్పృశత్ =స్పృశించుచున్నట్టి యనఁగా మడుగునం దున్న, కాళియ = కాళియుఁడను సర్పముయొక్క, క్ష్వేళ = విషయుక్తమైన, మూర్ధస్థలీ = శిరఃప్రదేశమందు, నృత్త = ఆడఁబడిన, మత్తల్లి = మత్తల్లీ నృత్యముగ, హల్లీసకా = హల్లీసక మను మండల తాండవమును గలవాఁడా.

తా. శేషశాయి యైనట్టియు వామనావతారమందుఁ గడు దూరముగ నుంచఁబడిన యంఘ్రియు గముగలయట్టియు నాశ్రిత జనపుంజ చిత్తస్థితంబులగు పాపంబులఁ బోఁగొట్టునట్టియుఁ గాళియుం డనురక్కసుని శిరంబున నృత్తమొనర్చినట్టి యో శ్రీహరీ యని గ్రంథకర్త యొనర్చినధ్యానము.

మ. ఇది పాత్రప్రహారేశ్వరప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్త దివిస్పృక్పటుయంత్ర కొండపలి హృద్బాహాసి కద్రూజదీ
వ్య మదారోద్యమకృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగున్.

టీ. ఇది, పాత్ర...దన్ - పాత్రప్రహారేశ్వర ప్రభృతి = పాత్ర ప్రహారేశ్వరులు మొదలైన, బంహిష్ఠ = మిక్కిలి యధికులైయుండెడి, ఉత్కల=ఒడ్డెరాజులయొక్క, అనీక = సమూహముచేత, గుప్త = రక్షింపఁబడిన, దివిస్పృక్పటుయంత్ర కొండపలి హృత్ = ఆకాశము నొరయుచుండెడు సమర్థమైన యంత్రములు గలిగియుండెడి కొండపల్లిదుర్గమును హరించుచునుండెడి, బాహా = భుజమందలి, అసి = ఖడ్గ మనియెడు,

1. చేతోగదా.

కద్రూజ = సర్పముయొక్క, దీవ్యత్ = ప్రకాశించుచు నుండెడి, ఉదారోద్యమ = మహోద్యోగముగలిగిన, కృష్ణరాయనృపసంజ్ఞాస్తత్కృత = కృష్ణరాయలనియెడిపేరుగలిగిన నాచేతఁ జేయఁబడిన, ఆముక్తమాల్యదక్ =ఆముక్తమాల్యద యనియెడు ప్రబంధమునందు, హృద్యపద్యము = మనోహరపద్యములుగల, ఆశ్వాసము, తృతీయంబై = మూఁడవదియై, మహిన్ =భూమియందు, పొల్పగున్ =ఒప్పుఁగాత.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశ పయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదా వ్యాఖ్యానంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము

---

### చ తు ర్థా శ్వా స ము

క. శ్రీమందిరభుజమధ్యమ!
గోమండలకర్షి వేణుగుంఫన! దృప్య
ద్భౌమాహృతసురజనయి
త్రీ మణితాటంక! వృషగిరిస్థ! ఖగాంకా! 1

టీ. శ్రీ ..మ-శ్రీ=లక్ష్మీదేవికి, మందిర=నివాసస్థానమగు, భుజమధ్యమ = వక్షఃస్థలము గలవాఁడా! గోమం...న-గోమండల = ధేనుసమూహమును, కర్షి = ఆకర్షించు చున్న, వేణు = పిల్లఁగ్రోవియొక్క, గుంఫన-పూరించుటగలవాఁడా! దృప్య...క-దృప్యత్ భౌమ-దృప్యత్ = గర్వితుఁడగు, భౌమ = భూసుతుండగు నరకాసురునివలన, ఆహృత=అపహరింపఁబడిన, సురజనయిత్రీ = దేవతామాత యగు నదితియొక్క, మణితాటంక = రత్నమయకర్ణభూషణములు గలవాఁడా! వృషగిరిస్థ=వేంకటాచల నివాసా! ఖగాంకా=గరుడకేతనా!

తా. నరకాసురుఁ డదితికర్ణతాటంకములు తనపరాక్రమమువలనఁ దెచ్చియుండెను; వానిని శ్రీకృష్ణుఁడు మరలఁ గొనితెచ్చె నని శ్రీభాగవత ప్రసిద్ధము. తక్కినవి వేంకటరమణస్వామికి విశేషణములు.

వ. అవధరింపు మాసమయంబున. 2

టీ. ఇది గ్రంథకర్త స్వామికి విన్నవించెడు మాట. ఆసమయంబునన్ = విష్ణుచిత్తుఁడు పరతత్త్వనిరూపణముఁ జేసిన సమయమందు.

మ. బలిమిం ద్రెంపఁగఁ బోలెఁ బాయువడుచుం బర్యాయ[1]భంగంబునన్
గలనూలెల్లను [2]నంచు మోవఁ దెగి రాఁగాఁ గొంత సేపుండి తాఁ
బెలుచ న్గంటు పుటుక్కనం దునిసి వే పృథ్విం బడెన్ జాలె మి
న్నుల మ్రోసె న్సురదుందుభు ల్గురిసెఁ బెన్సోనై విరుల్[3]బోరనన్.

టీ. బలిమిన్ = బలాత్కారము చేత, త్రెంపఁగఁబోలెన్ = త్రెంచివేయుట చేత నన్నట్లు, పాయువడుచున్ = విచ్చిపోవుచు, పర్యాయభంగంబునన్ - పర్యాయ= క్రమముగా, భంగంబునన్ = తెగుటచేత, కలనూలెల్లను = ఆసూత్రమందుఁ గలిగి యున్న నూలంతయును, అంచు మోవన్ = చివరదనుక, తెగిరాఁగాన్ = తెగివచ్చు చుండఁగా, కొంతసేపుండి = కొంతకాలమచ్చటనుండి, తాన్ = జాలె యనుట, పెలు చన్ = కఠినముగా, గంటు=ముడుపు, పుటుక్కనం దునిసి = పుటుక్కనుశబ్దము గలుగు నట్లుగా భిన్నమై, వే=త్వరితముగా, జాలె = వరహాలసంచి, పృథ్విన్ = భూమి యందు, పడెన్. అంత, మిన్నులన్ = ఆకాశమందు, సురదుందుభుల్ = దేవతల భేరులు, మ్రోసెన్ = ధ్వనిచేసెను, విరుల్ = పుష్పములు, పెన్సోనై = పెద్దవర్షమై, బోరనన్=బోరనిధ్వని గలుగునట్లు, కురిసెన్ = వర్షించెను.

తా. విష్ణుచిత్తుఁడు పరతత్త్వనిరూపణము సేయఁగా నంతకుమున్ను విద్యా శుల్కముగా వ్రేలఁగట్టించియున్న వరహాల సంచికిఁ జుట్టియున్న సూత్రమందలి నూలంతయును దనకుఁ దానే తెగి యంచునకు వెడలఁగా ముడుపు పుటుక్కనుధ్వని సేయుచు సూత్రమునుండి తునిసి జాలె క్రిందఁ బడె ననియును, ఆపరతత్త్వ నిర్ణయ మునకు దేవతలు సంతోషించి దుందుభులు మ్రోయించి పుష్పవర్షములు గురిపించి రనియును భావము.

శా. ఆవేళ న్పతి పారితోషికము లీ నందంద పంపన్, భ్రమ
త్సేవివ్రాతముచే ద్రుతస్ఖలితయై దీవ్యన్మణిస్వర్ణభూ
షావాసచ్ఛటజానుదఘ్న యగుచున్ సంసచ్చతుశ్శాలికా
ద్రై వేశ్మాంతరపద్ధతి న్నెరసె గోత్రాచిత్రమాల్యాంబనన్. 4

టీ. ఆవేళన్=ఆసమయమందు, పతి = పాండ్యరాజు, పారితోషికములు = సంతోషపు బహుమతులను, ఈన్ = ఇచ్చుటకై, అందంద = అచ్చటచ్చటనే, పం పన్=సేవకులను బంపఁగా, భ్రమ...చేన్-భ్రమత్=తొట్రుపడుచున్న, సేవి = సేవకుల

1. భంగంబుగా. 2. నంటు. 3. బోరునన్.

యొక్క, వ్రాతముచేక్ = సమూహముచేత, ద్రుతస్ఖలితయై = త్వరితముగా జాఱినదై, దీవ్యన్మణిస్వర్ణభూషావాసచ్ఛట (ఇది కర్తృపదము), దీవ్యత్ = ప్రకాశించుచున్న, మణి = రత్నములు చెక్కిన, స్వర్ణభూషా = బంగారు సొమ్ములయొక్కయు, వాసః = వస్త్రములయొక్కయు, ఛట = సమూహము, సంస...లిక్-సంసత్ = సభా సంబంధినియగు, చతుశ్శాలికా=నాలుగు శాలలుగల మండపము యొక్కయు, రైవేశ్మ =బొక్కసపుటింటియొక్కయు, అంతర = మధ్యప్రదేశమందలి, పద్ధతిక్ = మార్గమందు, జానుదఘ్ని యగుచుక్ = మోఁకాలిబంటి యగుచు గోత్రా...బనక్-గోత్రా= భూమియొక్క, చిత్ర=నానావర్ణములుగల, మాల్యం బనక్ =మాలికాలంకారమోయను నట్లు, నెరసెక్ =వ్యాపించెను.

తా. పాండ్యరాజు సమయమందు సంతోషించి విష్ణుచిత్తుఁడు మొదలగు వారికి బహుమతు లొసంగుటకై పైపైని సేవకులను బొక్కసములకుఁ బంపఁగా వా రాయుగ్రాణమునుండి రత్నములు చెక్కిన కనకభూషణములను వస్త్రములను నవ్వారిగాఁ దెచ్చునప్పుడు త్వరపాటుచేత వారిచేతులలో నుండి జాఱిపడిన యవి రాజు మొదలగువారు గూరుచున్న సభామంటపము మొదలుకొని బొక్కసమువఱకు మార్గమధ్యమందు మోఁకాలియెత్తున నిండియుండె నని భావము. దీనిచే జాఱిపడిన రత్నాభరణాదులే యంతమిక్కుటముగా నుండఁగా బహుమతు లిచ్చిన రత్నాదులకు లెక్కయే లే దనుట. అలం. అతిశయోక్త్యర్థాపత్త్యుత్ప్రేక్షలు.

అ. వేదవేద్య మైన ¶ విష్ణుతత్త్వం బిట్లు
వాదు గెలిచి తెలిపి ¶ వసుమతీశు
భక్తి నోలలార్చి ¶ భగవత్ప్రపన్నుఁగాఁ
జేసి లోకహితము ¶ సేయుటయును. 5

టీ. ఇందు విష్ణుచిత్తుఁ డను కర్తృపద మధ్యాహార్యము. వేదవేద్య మైన = వేదములచేఁ దెలియఁదగిన, విష్ణుతత్త్వంబు=నారాయణతత్త్వమును, ఇట్లు, వాదు గెలిచి =వాదమున గెలిచి, తెలిపి = బోధించి, వసుమతీశుక్ = పాండ్యరాజును, భక్తిక్ = భక్తిరసమందు, ఓలలార్చి = తేలఁజేసి, భగవత్ప్రపన్నుఁగాక్-భగవత్ = శ్రీమన్నారాయణునియందు, ప్రపన్నుఁగాక్ = ప్రపత్తిగలవానిఁగా; చేసి=ఒనరించి, లోకహితము - లోక = లోకములకు, హితము=ఉపకారమును, చేయుటయును = చేయఁగానే.

శా. అద్ధావాగ్విబుధ మ్మహోవచనకవ్యాహార మాహోవచ
స్సిద్ధ మ్మాగ కృతతాం గతః కలి రితి ¶ శ్రీసూక్తివిద్యాధర

మిద్ధౌద్ధత్య మగా ల్లయంబి కుధియా ౹ మిత్థం వద త్కిన్నర
మ్మధీరాగ్రణి గెల్పుటుత్సవమునం ౹ దయ్యె న్నభ మ్మంతయున్. 6

టీ. నభమ్మంతయున్=ఆకాశమెల్లను, అధీ...దున్ - అధీరాగ్రణి = ధీరాగ్రేసరుఁడగు నావిష్ణుచిత్తునియొక్క, గెల్పుటుత్సవమునందున్ = విజయోత్సవమునందు, అద్ధావాగ్విబుధమ్ము - అద్ధా = యథార్థమనెడు, (అద్ధా యన్నది సత్యార్థకమైన యవ్యయము.) వాక్=మాటలుగల, విబుధమ్ము=(దేవతలు) గలదియు, అహోవచనకవ్యాహారము - అహో=అద్భుత మను, వచన=పలుకులు గల, కవ్యాహారము = పితృదేవతలుగలదియు, 'హవ్యకవ్యే దైవపిత్ర్యే' యని యమరము, ఆహావచస్సిద్ధమ్ము - ఆహా= చిత్రమనెడు, వచః = పలుకులుగల, సిద్ధమ్ము = సిద్ధులుగలదియు, ఆఃకృతతాంగతః కలిరితి శ్రీసూక్తివిద్యాధరమ్ము - కలిః = కలియుగము, కృతతాం = కృతయుగమాటను, గతః = పొందెను, ఆః = ఆశ్చర్యము, ఇతి = ఇట్లను, శ్రీసూక్తి = శుభవాక్యలుగల, విద్యాధరమ్ము = విద్యాధరులు గలదియు, ఇద్ధౌద్ధత్యమగాల్లయంబికుధియామిత్థంవదత్కిన్నరమ్ము - కుధియామ్ = కుత్సితబుద్ధులు గలవాండ్రయొక్క, ఇద్ధౌద్ధత్యమ్ - ఇద్ధ = వృద్ధిఁబొందియున్న, ఔద్ధత్యమ్ = ధౌర్త్యము, లయమ్ = నాశమును, అగాత్ = పొందెను గదా, ఇత్థంవదత్ = ఇట్లుచెప్పుచున్న, కిన్నరమ్ము = కిన్నరులుగలదియు, అయ్యెన్ = ఆయెను. అద్ధావాగ్విబుధమ్మునునది మొదలుగా నైదు కేవలసంస్కృతములవలెఁ గన్పడు వాక్యములనడుమ నున్న యద్ధాదిపదములు వానికి వేఱువేఱ బరమందున్నవాగాదిసంస్కృతశబ్దములతోడ నన్వయించుచుండ విబుధాదిశబ్దములు సమాసాంతగతములై తత్సమంబు లగుచు నుండుటవలన నపదాన్యవ్యయ సుప్తిఙ్త్వాతుమునా మను సూత్రంబునకు విరుద్ధమ్ము గాకుండుటం జేసి సుసంగతంబు లయ్యెను.

తా. ఆవిష్ణుచిత్తుండు వాదమున జయించినప్పు డాకాశమందుఁ జేరియున్న దేవతలు సత్య మనియును, పితృదేవత లహో యనియును, సిద్ధు లాహా యనియును, విద్యాధరులు కలియుగము కృతయుగ మాయె నిది యెంత వింత యనియును, కిన్నరులు దుర్జనులబింక మడఁగె ననియును, మెచ్చి సంతసిల్లి పలుకుచుండి రని భావము.

సీ. సెలవులు నాకుచు ౹ వెలియరుంగులు సూడ
కరిగి పాదూవాహ ౹ నరయువారు;
తమవ్రాల నుండునంత దలముఁ గానక దాఁటి
పేరెలుంగున బెట్టఁ ౹ జీరువారు;
నగరు వెల్వడుదాఁకఁ ౹ దెగి పోయి మఱి నిల్చి
తోడివిద్వాంసులఁ ౹ గూడువారు;

నెదురైన తమవాని ♦ గృహకృత్య మడిగి వాఁ
డనునవి తప్ప నూఁకొనెడివారు;
తే. 'వాద మే మాయె?' నన్న 'భూవరునిపక్ష
పాత మాదాసరికిఁ గల్గి ♦ బ్రతికె' ననెడు
వారు, 'నో లెం, డిటు విముక్త్యదూరమైన
వాకిట వసించు నెవ్వఁ' డనెడ్వారు నగుచు. 7

టీ. ముందు వచ్చెడు పద్యములోనుండు విద్వాంసు లనుకర్తృపద మధ్యాహార్యము. ఇదివఱలో వాదము సేయుచున్న యితరవిద్వాంసులు, నెలవులు = ఊర్ధ్వాధరోష్ఠసంధికోణములను, నాఁకుచుఁ = విన్నఁదనమున నాఁకికొనుచు, వెలియరుంగులు = నగరు వాకిట నున్న తిన్నెలను, చూడక = వీక్షింపకయే, అరిగి = అవలఁబోయి, పాదూవాహుఁ = పాదుకలు దెచ్చువానిని, అరయువారుఁ = వెదకెడువారు, వాకిటి తిన్నెలమీఁద నున్న తమ పాదుకలు దెచ్చెడు సేవకులను గానక యావల నరిగి వెదకుచుండి రనుట. తమ మ్రోలఁ = తమయెదుటనే, ఉండునందలముఁ = ఉన్నయాందోళికను, కానక = చూడక, దాఁటి = అతిక్రమించి, పేరెలుంగునఁ = పెద్దకంఠనాదముచేత, బెస్తఁ = బోయిని, చీరువారుఁ = పిలిచెడువారును, నగరువెల్వడుదాఁకఁ = రాజగృహము విడుచువఱకు, తెగిపోయి = కేడించిపోయి, మఱి = పిమ్మట, నిల్చి = నిలుచుండి, తోడివిద్వాంసులఁ = తమతోడిపండితులను, కూడువారుఁ = కలిసికొనువారును, రాజుభయముచేత నొండొరు లచ్చటఁ గలియక నగరు దాఁటిపోయి యొకరితో నొకరు గూడి రనుట. ఎదురైన = తమ కెదురుపడిన, తమవానిఁ = తమకు సంబంధించినవానిని, గృహకృత్యము = తమయింటివార్తను, అడిగి = ప్రశ్నచేసి, వాఁడు = ఆయడుగఁబడినవాఁడు, అనునవి = చెప్పెడు మాటలను, తప్పఁ = మనస్సునకుఁ దగులనియట్లు, ఊఁకొనెడువారు = ఊఁకొట్టెడువారును, తమయింటనుండి వచ్చినవాఁడు తమకెదురుపడఁగా వానిఁ దమ యింట్లవార్త యడిగి వాఁడు సెప్పెడు పల్కులయందు మనస్సులేక జరిగిన వాదమందే మతి గలిగి యూరక యూఁకొనుచుండి రనుట. వాదమేమాయెఁ = వాదుసెల్లినవిధమేమి, అన్నఁ = అని ఎవరేని యడుగఁగా, భూవరుని పక్షపాతము = రాజుయొక్క పక్షపాతము, ఆదాసరికిఁ = అవిష్ణుచిత్తునకనుటకు బదులుగాఁ దిరస్కారోక్తిగ నాదాసరివాని కని రనుట. కలిగి = ఉదయించి, బ్రతికెఁ = ఆదాసరి జీవించెను, రాజు పక్షపాతమువలన నావిష్ణుచిత్తుఁడు బ్రదికెనే కాక నిక్కమునకు మేమే జయించితి మని చెప్పి రనుట, అనెడు వారును = అని

చెప్పెడువారును, ఔ లెండు = ఔ సుద్ఘమింపుడు, ఇటు = ఈవిధముగా, విమర్శదూరమైన = విచారణకు దూర మగు, వాకిటన్ = ద్వారమందు ఎవ్వఁడు వసించున్ = ఎవ్వఁడు నిలుచును ? అన్ వారు నగుచున్ = అని పలికెడువారు నై, కలిసి యని ముందటిపద్యమున కన్వయము. ఇట్లు న్యాయవిమర్శలేని రాజు ద్వారమం దెవ్వఁడును నిల్వఁగూడ దని రనుట. ఇక్కడఁ బరాజితులయిన విద్వాంసుల స్వభావము వర్ణింపఁబడెఁ గాన స్వభావోక్త్యలంకారము.

తే. కలిసి యొకకొంతసేపు శృంగాటకముల
నగరుదెసఁ జూచుచునె మంతనంబు లాడి,
చనిరి విద్వాంసు లిండ్ల కజ్జనవిభుండు
రూఢి కతని మహాగజారూఢుఁ జేసి. 8

టీ. విద్వాంసులు = ఆపండితులు, శృంగాటకములన్ = నలుత్రోవలు గలిసెడు చోటులయందు, కలిసి = కూడుకొని, నగరుదెసన్ = రాజగృహముతట్టు, చూచుచునె = వీక్షించుచునే, మంతనంబులాడి = రహస్యములాడి, ఇండ్లకుఁ జనిరి = తమ గృహములకుఁ బోయిరి. అజ్జనవిభుండు = ఆపాండ్యరాజు, రూఢికిన్ = ప్రసిద్ధి కొఱకు, అతనిన్ = ఆవిష్ణుచిత్తుని, మహాగజారూఢున్ - మహాగజ = పెద్దయేనుఁగు మీఁద, ఆరూఢున్ = ఎక్కినవానిఁగా, చేసి = ఒనరించి; పురి నేఁగించి యను ముందటి పద్యముతో నన్వయము.

మ. 'పురి నే(యే)ఁగించి తదీయమైననగరంబుం జేర్పుఁ' డంచు న్వ(బ)డిన్
దొరలన్ రాజకుమారులన్ బనుపఁగాఁ దూర్యస్వనంబు ల్నిరం
తరవందిస్తుతులుం [1]జెలంగ గజఘంటావారకాంతాంఘ్రినూ
పురము ల్మ్రోయఁగఁ, గొల్చి వా రిరుగడం బో మార్గమధ్యంబునన్.

టీ. పురిన్ = మథురాపట్టణమందు, ఏఁగించి = మెఱవడిఁ జేయించి, ఊరేఁగించి యనుట, తదీయమైన = ఆవిష్ణుచిత్తునిసంబంధియైన, నగరంబున్ = పట్టణ మగు శ్రీవిల్లిపుత్తూరిని, చేర్పుఁ డంచున్ = ప్రవేశపెట్టుం డని, పాండ్యరా జనుట. దొరలన్ = రాజులను, రాజకుమారులన్ = రాచకొమరులను, పనుపఁగాన్ = పంపఁగా, తూర్యస్వనంబుల్ = వాద్యఘోషములును, నిరంతరవందిసుతులన్ = ఎడతెగని బట్టులకైవారములును, చెలంగన్ = విస్తరిల్లుచుండఁగా, గజ...ల్ - గజఘంటా = ఏనుఁగులకుఁ గట్టిన గంటలును, వారకాంతాంఘ్రినూపురముల్ = ఆటకత్తియలయొక్క పాదములయందలి

1. గజేంద్రహాయఘంటావార.

యందియలును, మ్రోయఁగాన్ = ధ్వనిసేయుచుండఁగా, వారు = రాజులు, రాజకుమారులు, వందిమాగధులు, వారకాంతలు మొదలగువారు, ఇరుగడన్ = పార్శ్వద్వయమందు, ద్విగుసమాసము, పోన్ = పోవుచుండఁగా, మార్గమధ్యంబునన్ = నడితెరువునందు, క్రియ ముందఱి పద్యమం దున్నది.

విష్ణుచిత్తునకు భగవంతుఁడు సాక్షాత్కరించుట

ఉ. ఇంగిలికంబునం దడిపిఁ యెత్తు కసీఁపు రెంటెమో యన
న్నింగి గరుత్పరంపరలనిగ్గున లేఁదొగ రెక్కు(క్కె)నంత వీఁ
చెం గలశాబ్ధిమీఁగడలజిడ్డెఱఁగించెడు కమ్మగాడ్పు; నిం
డెం గడు మ్రోఁత పెన్దిరువడిం గని; రాఖగరాజు మూఁపునన్. 10

టీ. నింగి = ఆకాశము, ఇంగిలికంబునన్ = హింగుళశబ్దార్థమగు నింగిలికము చేతను, తడిపి = ఆర్ద్రముఁజేసి, ఎత్తు = పైకెత్తిన, కసీసపు రెంటెమో = నీలవస్త్రమో, అనన్ = అనునట్లుగా, గరు...నిగ్గునన్ - గరుత్ = ముందు చెప్పఁబడు పెరియ తిరువడి ఱెక్కలయొక్క, పరంపరలన్ = పంక్తులయొక్క, నిగ్గునన్ = కాంతిచేత, లేఁదొగరెక్కెన్ = తరుణారుణకాంతి గలిగెను, అంతన్ = వెంటనే, గరుత్మంతుని ఱెక్కలెఱ్ఱనివిగావున వానికాంతులచే నాకాశ మెఱ్ఱనయ్యె ననుట. కల...జిడ్డు - కలశాబ్ధి = పాలసముద్రముయొక్క, మీఁగడల = మీఁగడలయొక్క, జిడ్డు = జిడ్డువాసనను, ఎఱఁగించెడు = తెలిపెడు, కమ్మగాడ్పు = సుగంధివాయువు, వీచెన్ = విసరెను, గరుత్మంతుఁడు కదలఁగానే యాయన ఱెక్కలవలనఁ బుట్టిన వాయువు క్షీరసముద్రపు మీఁగడలవాసనను రేఁపఁగా నావాసన లావాయువుతోఁ గూడ వచ్చె ననుట. మ్రోఁత = పెద్ద ధ్వని, కడున్ = మిక్కిలి, నిండెన్ = సంపూర్ణ మయ్యెను. పెన్దిరువడిన్ = పెరియ తిరువడి యని ద్రవిడభాషయందు శ్రీవైష్ణవసంకేతితమైన నామముగల వైనతేయుని, కనిరి = ఆరాజులు మొదలగువారు చూచిరి, ఆఖగరాజు మూఁపునన్ - ఆఖగరాజు = ఆపక్షీంద్రుఁడగు గరుత్మంతునియొక్క, మూఁపునన్ = స్కంధమందు, క్రియ ముందఱి పద్యమునం దున్నది.

తా. విష్ణుచిత్తునకుఁ బ్రత్యక్ష మగుటకు శ్రీ క్షీరసముద్రమునుండి స్వామి వెడలఁగానే గరుత్మంతుని ఱెక్కల యెఱ్ఱకాంతిచేత నాకాశ మింగిలీకముతోఁ దడిపి యెత్తిన పీలిగుడ్డవలె నీలలోహితవర్ణము గలిగియుండెను; నంతలోనే పాలమీఁగడ జిడ్డువాసనలతో వాయువులు విసరె; నంతలోనే గరుత్మంతుని ఱెక్కల ధ్వని వినంబడె; నంతలో నతివేగవంతుండగు గరుత్మంతుండు గానఁబడియె; నంత నతని వీఁపుమీఁద స్వామియుఁ దోఁచె నని భావము.

సీ. చిగురుఁబోట్లపుదోయిఁ గెందమ్ము లనఁ దార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర
నునుఁగప్పుమేనఁ దోఁచిన [1]తదర్వచ్ఛాయ
లీలఁ దాల్చుపసిండిచేల మెఱయ
వ్రాలిన యోగివర్గము నిర్మలాంతఃక
రణములువోలె హారములు దనర
సిరికిఁ బుట్టింటినెచ్చెలు లౌటఁ మనవికి
డాసె నా మకరకుండలము లమర

తే. [2]శ్రిత సిత మరాళ వాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలొ యనంగ
శంఖచక్రాంచితోరుహస్తములు దనరఁ
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. 11

టీ. చిగురు...న్-చిగురుఁబోట్లపు = చివుళ్లపొట్లముయొక్క, దోయిన్=ద్వంద్వమందు, కెందమ్ములనన్ = ఎఱ్ఱదామరపువ్వు లనునట్లు, తార్క్ష్య...ములన్ - తార్క్ష్య గరుత్మంతునియొక్క, హస్తోదరములన్ = కరతలపుటములయందు, దివ్యాంఘ్రులు = శ్రీపాదములు, అమరన్ = పొందుపడఁగా, నునుఁగప్పుమేనన్ = నిద్ద మగునీలవర్ణము గల దివ్యమంగళవిగ్రహమందు, తోఁచిన = ప్రతిఫలించిన, తదర్వ = అవాహనమగు గరుత్మంతునియొక్క, ఛాయలీలన్ = కాంతివలె, తాల్చు...చేల - తాల్చు = ధరియించిన, పసిండిచేల = కనకాంబరము, మెఱయన్=ప్రకాశించుచుండఁగా, వ్రాలిన...లెన్-వ్రాలిన=చేరినట్టి, యోగివర్గము = యోగీశ్వర సమూహముయొక్క, నిర్మలాంతఃకరణములువోలెన్=నిష్కళంకములగు అంతరంగములవలెను, వ్రాలిన యను శబ్ద మంతఃకరణశబ్దముతో నన్వయించునది. ఇది సమస్తపదము. హారములు = ముక్తాహారములు, తనరన్=ఒప్పుచుండఁగా, సిరికిన్=శ్రీదేవికి, పుట్టి...టన్-పుట్టింటి = జనక గృహసంబంధులైన, నెచ్చెలులౌటన్ = స్నేహితులౌటచేతను, మనవికిన్ = విన్నవించుటకు, డాసెనాన్=సమీపించెనో యనునట్లు, మకరకుండలములు = మకరాకారకర్ణభూషణములు, అమరన్, శ్రీదేవియును మకరములును సముద్రమునందే జనించుటంజేసి లక్ష్మికిఁ బుట్టినయింటి స్నేహములు గలవి గావున మిక్కిలి చనవు గలిగి శ్రియఃపతి వీనుల సమీపమునకుఁ జేరె ననుట. శ్రిత...లో - శ్రిత=చేరియున్న, సిత=తెల్లనైన మరాళ = హంసచేతను, వాత్యా = సుడిగాడ్పుచేతను, అభిహత=రేఁపఁబడిన, పరాగ=

1. తదూర్ధ్వచ్ఛాయ. 2. శ్రితసితచ్ఛద.

కెంధూళియొక్క, వలయ=వలయముచేతను, మండిత = అలంకరింపఁబడిన, కల్పశాఖలో యనంగన్ = కల్పవృక్షపుఁగొమ్మలో యనునట్లు, శంఖ...లు-శంఖ=పాంచజన్యము చేతను, చక్ర = సుదర్శనముచేతను, అంచిత=ఒప్పుచున్న, ఉరు=దీర్ఘములైన, హస్త ములు=భుజములు, తనరన్=ప్రకాశింపఁగా, శంఖము హంసవలెను, చక్రము పరాగ వలయమువలెను, భుజములు కల్పశాఖవలెను నున్న వనుట. కమలేక్షణుండు=తమ్మికంటి, చతుర్భుజుండు = నాల్గుభుజములు గలిగినస్వామి, తోఁచెన్ = ప్రత్యక్షమయ్యెను. ఉత్ప్రేక్షాలంకారము.

క. ఎప్పుడు హరి గని రమరులు
   ముప్పదియును మూఁడుకోట్లునమునిఁ గనుఁగొనువా
   రప్పుడు తత్కరములతో
   విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్. 12

టీ. ఎప్పుడు=ఏక్షణమందు, మునిఁగనుఁగొనువారు = విష్ణుచిత్తుని సేవించెడివారు, ముప్పదియును మూఁడుకోట్లు=త్రయస్త్రింశత్కోటిసంఖ్య గల, అమరులు = దేవతలు, హరిన్=స్వామిని, కనిరి=చూచిరో, అప్పుడు = ఆక్షణమందు, తత్కరములతోన్= వారిహస్తములతోడ, విప్పిన=తెఱవఁబడిన, గొడుగులును = దేవతల ఛత్రములును, మింటన్=ఆకాశమందు, వేగమ=శీఘ్రమే, మొగిడెన్=ముకుళిత మయ్యెను.

తా. ముందే స్వర్గమందలి ముప్పదిమూఁడుకోట్లు దేవతలు విష్ణుచిత్తునిఁ జూడ వచ్చియుండిరి గావున వారలు స్వామి వేంచేసినంతనే యగివఱిలోఁ దెఱవఁబడియున్న గొడుగులు ముడిచి హస్తములు మొగిడ్చి నమస్కరించిరి. అలం. సహోక్తి.

తే. [1]సామరదిదృక్షుఖస్థరక్షఃపిశాచ
   పుంజ మహిభుక్పతత్రప్రభంజనములు
   సోఁక వెఱఁ బాఱెఁ గల్గానకశూర్పవాత
   ఘట్టనలఁ [2]బాఱు పెనుఁబొల్లకట్టువోలె. 13

టీ. సామర...లు - సామర = దేవతలతోఁగూడిన, దిదృక్షు=చూడఁ (గోరిన) ఖస్థ=ఆకాశమందు నిలిచియున్న, రక్షఃపిశాచపుంజము=రక్కసులయొక్కయు పిసా సులయొక్కయు సమూహము, రక్షఃపిశాచాదులు దేవయోను లగుటంజేసి స్వర్గమం దుందు రనుట. అహి...ములు - అహిభుక్ = సర్పభక్షకుఁ డగు గరుత్మంతుని యొక్క, పతత్ర = ఱెక్కలవలని, ప్రభంజనములు = పెనుగాడ్పులు, సోఁకన్ =

1. సమ్మద. 2. బాఱి చనుపొల్ల.

స్పృశింపఁగానే, వెఱక్=వెఱపుచేతను, కళ్ళానక్=కళ్లమునందు, శూర్ప...లక్ - శూర్పవాత=చేటల గాడ్పులయొక్క, ఘట్టనలక్=ఒరపిళ్లచేత, పాఱు...న్-పాఱు= ఎగసిపోవుచున్నట్టి, పెను=పెద్దదియగు, పొల్లకట్టువోలెక్=తఱకలవలె, పాఱెక్ = పరుగెత్తెను. ప్రథమపాదమం దున్న సామరపదముయొక్క ప్రథమవర్ణమును రక్షశ్శబ్ద ముయొక్క యంతిమవర్ణముతోడ సంబంధపడునట్లు హ ల్పృథానముగా నుభయపదముల లోనిదిగా సాంబాదిశబ్దములవలె విశ్రమముఁ జెప్పినాఁడు. సమ్మదదిదృక్షు అను పాఠమున సంతోషమునఁ జూడఁగోరెడు అని యర్థము. కళ్ళాన నుచోట, 'వికృతౌ క్వచిచ్ఛలోపో మోర్ధీర్ఘశ్చాత ఆదినుస్యభవే' త్తను సూత్రానుసరణముగా, 'కం. మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా, ణానం గలుగంగ' ననియెడు భారతప్రయోగమువలె సంగతమైనది. అంతరిక్షమం దంతకు ముందున్నదేవతలతోడఁ జేరి యున్న రక్షఃపిశాచ సంఘము తమజాతికి విరోధి యగుస్వామికి వాహనమైన గరుత్మంతుని ఱెక్కలగాడ్పు తమపై వీవఁగానే భయపడి పరుగెత్తెను. దేవతలు మాత్రము నిలచి యుండిరి ; ఎట్లంటేని, కళ్ళమందు ధాన్యముమీఁదఁ జేటలచేఁ విసరఁగానే గట్టి నిల్చి పొట్టు చెదరి పోయిన ట్లని భావము.

క. నీరంధ్రకుసుమధారా
సారచరచ్చంచరీకసంకులకలఝం
కారానుకారి సంస్తవ
కారి మునిస్తోమసామగానం బెసఁగెన్. 14

టీ. నీరంధ్ర...బు - నీరంధ్ర = దట్టమైన, కుసుమధారా = పుష్పధారల యొక్క, ఆసార = వర్షమందు, చరత్ = సంచరించుచున్న, చంచరీక = తుమ్మెదల యొక్క, ఇన్దిన్దిరశ్చఞ్చరీకః' యని యమరము. సంకుల = అధికమైన, కల = అవ్యక్త మధురములగు, ఝంకార = ఝంకృతులను, అనుకారి = అనుకరించుచున్న, సంస్తవ = స్తోత్రములను, కారి=చేయుచున్న, ముని = నారదాదిమునులయొక్క, స్తోమ=సమూహాము యొక్క, సామగానంబు = సామవేదముయొక్కపాట, ఎసఁగెక్ = విస్తరిల్లెను, స్వామితోఁగూడ నారదాది మునీంద్రులు సామగానములు సేయుచుండఁగా నది పుష్ప వర్షమునఁ బడి తిరిగెడు తేఁటుల మ్రోఁతవలె మధురమై వీతెంచె నని భావము.

తే. అట్లు ప్రత్యక్షమైనపరమాత్ము నంత
రిక్షమునఁ గాంచి, ముని ప్రమోదాశ్రుజలము
నిగుడఁ బులకించి, కరటిఘంటికల తాళ
ములుగ ని ట్లని యమ్మహాత్ముని నుతించె. 15

టీ. అట్లు = పూర్వోక్తరీతిగా, ప్రత్యక్షమైన = సాక్షాత్కరించినట్టి, పద్మాక్షున్ = తామరలవంటి నేత్రములు గల స్వామిని, లేక, లక్ష్మీదేవియే నేత్రములయందుఁ గలస్వామిని, అంతరిక్షమునన్ = ఆకాశమందు, కాంచి = చూచి, ముని = విష్ణుచిత్తుఁడు, ప్రమోదాక్షిజలము = ఆనందబాష్పములు, నిగుడన్ = వెలికుబుకఁగా, పులకించి = గగుర్పాటుచెంది, కరటిఘుంటికలన్ - కరటి = తానెక్కి యున్న యేనుఁగుయొక్క, ఘుంటికలన్ = ఇరుప్రక్కలనున్న గంటలే, తాళములుగన్ = వాయించెడు తాళములు గాఁగా, అమ్మహాత్మునిన్ = ఆపరమాత్ముఁ డగుస్వామిని, ఇట్లని = వక్ష్యమాణక్రమముగా, నుతించెన్ = కొనియాడెను.

విష్ణుచిత్తుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట

కవిరాజవిరాజితము.—

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా
జయ జయ చంద్రదినేంద్రశతాయుతసాంద్రశరీరమహఃప్రసరా
జయ జయ తామరసోదరసోదరచారుపదోజ్ఝితగాంగఝరా
జయ జయ కేశవ కేశినిషూదనశౌరి శరజ్జలజాక్ష హరీ. 16

టీ. దానవ...రా - దానవ = రాక్షసులయొక్క, దారణ = ఛేదనమునకు, కారణ = హేతువులగు, శార్ఙ్గ = ధనువును, రథాంగ = చక్రమును, గదా = గదను, అసి = నందక మనుఖడ్గమును,ధరా = ధరించినస్వామీ!జయజయ = సర్వోత్కృష్టుఁడవుగాఁ బ్రవర్తిల్లుమా. దరా అనుపాఠమందు శంఖమును గలవాఁడా యని యర్థము. దానవదారణకారణ యని ప్రత్యేక విశేషణముగానుం జెప్పవచ్చును; జయజయ యని నాల్గు పాదములయందును వచ్చును. చంద్ర...రా - చంద్ర = చందురులయొక్కయు, దినేంద్ర = సూర్యులయొక్కయు, శతాయుత = అయుతశతసంఖ్యలయొక్క వలెనే, సాంద్ర = దట్టమైన, శరీర = దివ్యమంగళ విగ్రహముయొక్క, మహః = కాంతుల యొక్క, ప్రసరా = వ్యాప్తికలవాఁడా, తామ...రా-తామరస= తామరపువ్వులయొక్క, ఉదర = అంతర్భాగమునకు, సోదర = తోఁబుట్టువును, చారు = సుందరము నగు, పద = పాదముచేత, ఉజ్ఝిత = విడువంబడిన, గాంగ = గంగానదీసంబంధియగు, ఝరా = ప్రవాహము గలవాఁడా! కేశినిషూదన = కేశి యసురక్కసుని సంహరించినవాఁడా, శరజ్జలజాక్ష - శరత్ = శరత్కాలమందలి, జలజ = కమలమువంటి, అక్ష = కన్నులు గల వాఁడా! కేశవ = బ్రహ్మరుద్రుల కుత్పత్తిస్థాన మైనస్వామీ. 'క ఇతి బ్రహ్మణోనామ ఈశోఽహం సర్వదేహినామ్, ఆవాంతవాఙ్గేసంభూతౌ తస్మాత్కేశవనామవాన్.' అని

ప్రమాణము, శౌరి = హరీ, అని మంగళాశాసనము చేసెను. భగవంతునకు జీవకోటి యాశీర్వాదము చేయవచ్చునా యనినఁ బూర్వ మట్టియాచారము కలదు. 'పూర్వాం దిశం వజ్రధరః దక్షిణాం పాతు తే యమః, వరుణః పశ్చిమా మాశాం కుబేరస్తూత్త రాంఁదిశ' మ్మని సీతమ్మవారు శ్రీరాములవారికి మంగళాశాసనము చేసియున్నారు.

## మత్స్యావతారము

మ. దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుంచి, చాతుర్య మొ
ప్ప వడిం జౌకపుఁదెల్లకౌచుగమి దంభం బొంద మైఁ దాల్చి, వే
దవిశుద్ధాక్షరపఙ్క్తిఁ గ్రమ్మఱఁగ వేధం జేర్చెదో నాఁగఁ, ద
ద్భువనం బబ్ధిసితాంబుబిందు లలమం బ్రోద్యద్రుచిం దాఁటవే. 17

టీ. దివిజద్వేషిన్ = వేదచోరకుఁ డగుసోమకాసురుని, ఉదార... ర్తిన్ - ఉదార=కొలఁది తెలియరాని, వారిచర = మీనముయొక్క, మూర్తిన్ = శరీరముచేతను, త్రుంచి = ఖండించి, చాతుర్యము = విన్నాణము, ఒప్పన్ = తనర్చునట్లు, వడిన్ = వేగము చేత, (జౌకపు)...బు - చౌకపు = చదరమగు, తెల్లకౌచు = ధవళకాంతిగల పైపొట్టు యొక్క, గమి = సమూహ మనెడు, దంభంబు = వ్యాజము, ఒందన్ = పొందునట్లు, మైన్ = శరీరమందు, తాల్చి = ధరించి, వేద...పఙ్క్తిన్ - వేద = వేదములయొక్క, విశుద్ధ=శుభ్రములగు, అక్షర = అక్షరములయొక్క, పఙ్క్తిన్ = శ్రేణిని, క్రమ్మఱఁగన్ = మరల, వేధన్ = బ్రహ్మదేవుని, చేర్చెదో నాఁగన్ = చేర్తువో యనునట్లు, తద్భువనంబు = ఆబ్రహ్మలోకమును, అబ్ధి...లు=అబ్ధి=సముద్రముయొక్క, సిత = తెల్లనైన, అంబు = ఉద కములయొక్క, బిందులు = బిందువులు, అలమన్ = వ్యాపింపఁగా, ప్రోద్యద్రుచిన్ - ప్రోద్యత్ = వృద్ధిపొందుచున్న, రుచిన్ = కాంతిచేత, దాఁటవే = అతిక్రమింపవా. 'ఉదారోదక్షిణేఖ్యాతే దానశౌణ్డే మహత్యపి'యని రత్నమాల. 'స్త్రియాంమూర్తి స్తను స్తనూః' అనియును, 'కపటోస్త్రీవ్యాజ దమ్భోపధయశ్ఛద్మకైతవే' యనియు నమరము. నీవు మత్స్యరూపమును ధరించి వేదచోరకుఁడగు రక్కసుని వధించి వాఁడ పహరించిన వేదములు నేర్పుతో నప్పుడే బ్రహ్మ కిచ్చుటకై పోయెదవో యనునట్లు నీవు సంచరించు చుండుట వలన సముద్రోదకములు సత్యలోక మాక్రమింపుచుండఁగా నీ వాలోకమును దాఁటితి వనియు నప్పుడు నీమీనశరీరమందలి తెల్లనిపొలుసు పరిశుద్ధ ములగు వేదాక్షరములో యన్నట్లుండె ననియు భావము. కైతవాపహ్నుత్యనుప్రాణిత మైన యుత్ప్రేక్షాలంకారము.

చ. ఎలమి యుగాంతవారి కెదురెక్కుటఁ బడిఁ దాలుగహ్వరం
బులఁ జనుఁ* టివెల్లిబడిఁ బోవు సపక్షనగోరువాళ్ళరం
బులు దనుఁ దాఁకఁ దద్గతతఁ మ్రోయు నజాండను దైత్యు వేదప
ఙ్క్తులుగొని కూల్చినట్టి జయదుందుభిఁ జేసితి గా మురాంతకా.

టీ. మురాంతకా=మురాసురునిసంహరించినవాఁడా! ఎలమిన్=సంతోషముచేతను, యుగాంతవారికిన్ = ప్రళయోదకమునకు, ఎదురెక్కుటన్=ఎదురుగాఁ బోవుసమయమందు, వడిన్=వేగముచేతను, తాలుగహ్వరంబులన్ = దవుడలనెడు గుహలయందు, చను = పోవునట్టి, నీటివెల్లిబడిన్=జలప్రవాహమువెంట, పోయెడు, సప...లు-సపక్షనగ = ఱెక్కలతోఁ గూడియున్న మైనాకాదిపర్వతములును, ఉరు=గొప్పలగు, వాళ్ళరంబులు=తిమితిమింగిలములు మొదలగు జలచరములును, తనున్=బ్రహ్మాండము నను, తాఁకన్=తగులఁగా, తద్గతతన్=ఆదవుడలను పొందియుండుటచేతను, మ్రోయు=ధ్వనిఁ జేయుచున్న, అజాండమ=బ్రహ్మాండమే, దైత్యున్=సోమకాసురుని, వేదపంక్తులు గొని=వేద సమూహములను దీసికొని, కూల్చినట్టి=సంహరించినట్టి, జయదుంధుభిన్ = జయభేరినిగా, చేసితికా = ఒనర్చితివికదా! ఇచ్చట నజాండమ యని ప్రగమావిభక్తి. 'ఇతరత్రచద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్' అనుసూత్ర మనుసరించి యప్రాణి వాచక మగు జయదుందుభియందలి ద్వితీయకుఁ దుల్యమైనది. మఱియు, 'కర్మాదేః కర్తృత్వ' మిత్యాది సూత్రపద్ధతివలన జయదుందుభియందుఁ గూల్చినట్టి యనుపద మన్వయించుట సరిగా నున్నది.

తా. మీనము తన నైజగుణముచేత నీటి కెదురెక్కుట ప్రసిద్ధము గావున నీమత్స్యము ప్రళయోదక ప్రవాహమున కెదురెక్కుచుండఁగా నావేగమునకు నిలువలేక యానీటి వెంబడి మైనాకాది పర్వతంబులును దిమిప్రముఖంబు లగు మహాజలచరంబులు నవశంబులై దొరలి యామీనముయొక్క దవుడలలోఁ బడిన వనియును, జలప్రళయమందు బ్రహ్మాండము సెడకుండ సామత్స్యమూర్తి తనదవుడల నునిచికొని యున్నాఁ డనియును, వామైనాకాదు లావేగముచేత నాబ్రహ్మాండము దగులఁగా నది ధ్వనిఁ జేసెఁ గావున బ్రహ్మాండమే స్వామి వేదములు దీసికొని రక్కసుని వ్రక్కలించిన దానికి జయభేరివలె నుండె ననియు భావము. అలం. అనుభయతాద్రూప్యరూపకాలంకారము.

చ. మితి గడవం దిమింగిలత నొ మెఱ్ఱెయిఁ బెంచిన నీదు వాతఁ గు
త్సితపలలాశి యైనచిఱుఁ జేఁ పడ డ్రెళ్ళుట నీవు మ్రింగుటే?
శ్రుతు లగునూరుపు ల్మగుడఁ జొచ్చుతఱి స్వదేహనైర్ఘన్నై
ధిత జవశక్తి నీడ్చికొని తెచ్చుటకాక తదల్పతాల్పతన్. 10

* నద్విజయ.

టీ. మితి = పరిమాణము, కడవన్ = మీఱఁగా—కల్పము ముగియఁగా ననుట, తిమింగిలతన్ = మహామీనత్వమును! మెయ్మెయిన్ = అవలీలగా, పెంచిన = పెంచినట్టి, నీదు = నీసంబంధియైన, వాతన్ = వక్త్రమునందు, కుత్సిత...వ-కుత్సితపలలాశియైన = కుత్సితగాత్రుఁ డనియును, మీనములు మాంసము భక్షించుట ప్రసిద్ధము గావున నట్టి పలలాశియగు, చిఱుచేప=చిన్నచేప, అది = మత్స్యతారోపముచేత నమహద్వాచకము, రాక్షసుఁ డనుట, త్రెళ్లుట = పడుట, నీవు మ్రింగుటే = నీవు కబళించుటయా యని ప్రశ్నార్థకము. శ్రుతులగు = వేదమయములగు, ఊరుపుల్ = ఉచ్ఛ్వాసవాయువులు, మగుడన్ = మరల, చొచ్చుతఱిన్ = వక్త్రమునందుఁ బ్రవేశించునప్పుడు, తదల్ప తాల్పతన్-తత్ = ఆపలలాశియొక్క, అల్ప తాల్పతన్ = అత్యంతాల్పమాటచేతను, భవ...న్-భవత్=నీయొక్క, ఏధసైధన=అతిసమృద్ధిచేతను, ఏధిత = వృద్ధిచేయఁబడిన, జవ = వేగముయొక్క, శక్తిన్ = సామర్థ్యముచేతను, కొడ్చికొని తెచ్చుటకాక = తీసికొనివచ్చుటయేకాక, మ్రింగుట కాదనుట. తిమింగిలత మెయ్మెయి యనుచోట నికారము లోపించుటకు విరాటపర్వమున మ. "మగుడం గీచకుఁ బట్టి వాఁడును బలోత్సా దంబున న్బాహుఁగ, ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీవ్రక్రోధుఁ డై పట్టి బె, ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱు న్భుజబలాటోపంబుమై నొండొరు, న్మిగులం జాలక కొంత సేపువడి మెయ్మెయిం బోరి రుగ్రాకృతిన్." అన్నపద్యంబునం జతుర్థపాదంబునను, నిర్వచనోత్తరరామాయణమందు, ఉ. "ఆటున మూర్ఛవోయినప్రహస్తుఁ గనుంగొని యింకఁ జాఁకిన, న్గీటడఁగించు నర్జునుఁడు కేవలుఁడే యని భీతచిత్తులై, మేటిమగల్బలం బెడలి మెయ్మెయి మార్కొన లేక పాఱిన, న్గాటుకకొండవోలె దశకంఠుఁ డెదిర్చె మహీమహేంద్రునిన్." అనిన పద్యంబునఁ దృతీయపాదంబునను, దిక్కన సోమయాజిప్రయోగంబు కలిమిఁ జేసి యిందుం బ్రయోగింపంబడియె.

తా. ఇంతంత యని చెప్పఁగూడని యత్యున్నతశరీరముతో మత్స్యమూర్తి విహరించుచుండఁగా నాయన యుచ్ఛ్వాసవాయువులు మగిడి ముఖమందుఁ బ్రవేశించునప్పుడావాయువులవెంబడి నీమహామీనము ముందఱ నత్యల్పతనుం డయిన ట్లున్నయారక్కసుఁడు పనకుఁ దానే త్రెళ్లెను గాక యామత్స్య మది యొకయత్నముగా వాని మ్రింగ లే దనియును మహామత్స్యములును బర్వతాదులును బ్రవేశించెడు నావక్త్రమందీకుత్సితపలలభక్షక మగురాక్షసుఁ డనుచిన్న చేప పడిపోవుట చిత్రము గాదు. అలం. హేత్వపహ్నుత్యలంకారము.

కూర్మమూర్తి

మ. జలపూరప్లవమానమృణ్మయమహీసంరక్షకై గార యీ
బలె ముక్తామణిశుక్తిశంఖనికురుంబం బెల్లఁ జూర్ణంబుగా

బలభిద్వజ్ర సదృజ్ఞిజోపరిపరిభ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టిఘురట్ట మైనకమఠస్వామి న్నినుం గొల్చెదన్. 20

టీ. జల...కై - జలపూర = నీటిప్రవాహమందు, ప్లవమాన = తేలుచున్న, మృణ్మయ = మృత్తికావికార మగు, మహీ = భూమియొక్క, సంరక్షకై = రక్షణముకొఱకు, గారయాబలెన్ = గచ్చుసేయుటకొఱకువలె, ముక్తా...బు - ముక్తామణి= ముత్తెములయొక్కయు, శుక్తి = గుల్లయొక్కయు, శంఖ = సంకులయొక్కయు, నికురుంబంబెల్లన్ = సమూహమంతయును, చూర్ణంబుగాన్ = సున్నమగునట్లు, బల...ము - బలభిద్వజ్ర = దేవేంద్రుని వజ్రాయుధముతోడ, సదృక్ = సమానమైన, నిజోపరి = స్వకీయమైనపైభాగమందు, పరిభ్రామ్యత్ = తిరుగుచున్న, మహత్ = గొప్పదియైన, మందరాచల = మందరపర్వతముతోడ, సంఘృష్టి = ఒరసికొనుటకు, ఘురట్టమైన = అడుగు తిరుగలియయిన, కమఠస్వామిన్ = కూర్మరాజైన, నినున్ = నిన్ను, కొల్చెదన్ = సేవించెదను.

తా. సముద్రమథనకాలమందు మందరాచలముక్రిందఁ గమఠమూర్తియొక్క కర్పర మొరసికొనుచుండఁగా సముద్రమందలి ముత్తెములు ముత్తెపుఁజిప్పలు శంఖము లెల్ల నాపర్వతకర్పరములసందునఁ బడి నలిగి చూర్ణమగుచుండెఁ గావున సముద్రోదకములయందు మృద్వికార మగుభూమి నాని కరఁగు నని దాని గట్టిపఱచుటకై గారకొఱకు స్వామి సున్నము నూఱుచున్నాఁడో యన్నట్లుండె నని భావము. అలం. ఫలోత్ప్రేక్ష. సంఘృష్టిఘురట్ట మనుచో రూపకము.

వరాహమూర్తి

చ. ఒకమఱి బుద్దగింప విలయోదకము ల్పయి కుబ్బి, చిప్ప వ్ర
చ్చుకొని మహాభ్రవీథిఁ జన, సూకరత న్మెయి వెంచి, వెండి క్రిం
దికిఁ గయివ్రాలు తత్సలిలనిష్కలధార నదగపరస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమునుబంగరు ముంగరఁగా నొనర్ప వే? 21

టీ. ఒకమఱి = ఒకతూరి, బుద్దగింపన్ = ఫూత్కారముసేయఁగా, ఇది వరాహ చేష్ట, విలయోదకముల్ = ప్రళయజలములు, పయికుబ్బి = పైకినుబికి, చిప్ప = బ్రహ్మాండకర్పరమును, వ్రచ్చుకొని = భేదించుకొని, మహాభ్రవీథిన్ = మహాకాశముయొక్క వీథియందు, చనన్ = పోఁగా, సూకరతన్ = వరాహత్వమునందు, మెయివెంచి = శరీరమునుపెంచి, వెండి = మరల, క్రిందికిన్ = అధోభాగమునకు, కయివ్రాలు = దిగజాఱుచున్న, తత్స...ధారన్ - తత్ = మున్నుచెప్పఁబడిన, సలిల = ఉదకముయొక్క,

నిర్మల = తేటయయిన, ధారన్ = ధారచేతను, అదళపర = బ్రహ్మాండమునకుఁ బరమైనట్టి యు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, ప్రకృతిన్ = మాయ యనెడు స్త్రీకి, కనయజాండము = ఈబ్రహ్మాండమును, బంగరుముంగఱగాన్ = సువర్ణమయ నాసాభూషణముగాఁగ, ఒనర్పవే = చేయవా.

తా. వరాహావతారమందు నొక్కసారి ప్రళయసముద్రమందలి యుదకములలో నాదివరాహము నూఁతి నుంచి బుడ్డగింపఁగానే యాయుదకములు బ్రహ్మాండకర్పరము దాఁటి యావలఁ బైకి పోయి మగిడి వచ్చుచుండఁగా నాయుదకధార యాకర్పరమునకుఁ బైగా నున్నప్రకృతి యనెడు స్త్రీయొక్క ముక్కుకొన నున్నసన్న కాఁడవలె నుండె ననియును, బ్రహ్మాండ మాకాఁడకు నడికి యున్నబంగారుముంగరవలె నుండె ననియు నట్లొక్కసారి బుడ్డగించినమాత్రనే సముద్రోదకములు బ్రహ్మాండమును దాఁటఁ జేయునంత బలము గలిగినవరాహరూపమును స్వామి ధరించె ననియును భావము. అలం. ఉత్ప్రేక్షాలంకారము, అతిశయోక్త్యనుప్రాణితము.

### నృసింహమూర్తి

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్దామదీ
ర్ఘసటాఘాటముఁ బెల్లగించుగతి నాంత్రశ్రేణిఁ గిన్కం బెరం
జూసితక్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. 22

టీ. మర్త్యపంచాననా = ఓనరసింహ యని సంబుద్ధి. అసు...న్ - అసురేంద్ర = రాక్షసేశ్వరుఁ డగుహిరణ్యకశిపునియొక్క, ఆశయ = హృదయ మనెడు, కుండికా = కుండికయందలి, అచ్ఛ = తేట యయిన, రుధిర = నెత్తుటియందు, వ్యాప్త = ప్రతిబింబిత మైన, స్వక = స్వీయమైన, ఛాయన్ = నీడను, కాంచి = చూచి, సము...న్ - సముద్యత్ = విజృంభించుచున్న, ప్రతిసింహ = అన్యసింహ మనెడి, మత్సర = ఈసుతోడను, మిళత్ = కూడుకొన్న, చేష్టన్ = చిట్టకముచేతను, తదు...న్ - తత్ = ఆప్రతిసింహముయొక్క, ఉద్దామ = గొప్పలగునట్టియు, దీర్ఘ = నిడుపలగు, సటా = జూలువెండ్రుకలయొక్క, ఘాటమున్ = సమూహమును, పెల్లగించుగతిన్ = పెకలించునట్లుగా, ఆంత్రశ్రేణిన్ = ప్రేఁగులయొక్కపంక్తిని, కిన్కన్ = కోపముచేత, పెరంజూ...లు - పెరంజు = తెమల్చుచున్నట్టి, సిత = తెల్లనైన, క్రూర = తీక్ష్ణములైన, భవన్నఖావళులు = నీగోళ్లయొక్కపఙ్క్తులు, ప్రోచున్ = (మమ్ము)రక్షించును.

తా. స్వామి నృసింహావతార మెత్తినప్పుడు హిరణ్యకశిపునిహృదయముఁ జీల్చి యారక్తమందు నీడఁ జూచి ప్రతిబింబించిన తనరూపును మఱియొకసింహము రూప

మని మత్సరించి యాకోపముచేతఁ దత్సింహముయొక్క సటలు వెల్లఁగించెనో యన్నట్లు హిరణ్యకశిపుని ప్రేఁగులు బైటికి లాగె ననియు, నట్లు లాగిన తెల్లనితీక్ష్ణము లగుగోళ్లు తమ్ము రక్షించు నని మంగళాశీర్వచనము చేసె ననియు భావము. అలం. భ్రాంతిమదను ప్రాణితోత్ప్రేక్షాలంకారము.

ఉ. మునుమున్ దెల్పును దూఱఁదూఱ మఱికెంపున్ వెండియుం దూఱఁగం
దనగాయం గలనల్పుఁ దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁ డుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీతేజముం
గొనులీల న్విదళింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ! 23

టీ. మిథ్యాహరీ = మాయాసింహరూపధారి వగు నృసింహస్వామీ యని సంబుద్ధి. మునుమున్ = మొదలను, తెల్పును = ధావళ్యమును, దూఱఁదూఱన్ = ఉచ్చిపోఁగా, మఱి = పిమ్మట, కెంపున్ = ఎఱుపును, వెండియుం దూఱన్ = ఇంకను దూఱిపోఁగా, కంపనగాయన్ = గుండెకాయయుండఁగ, కల = కలిగినట్టి, నల్పున్ = నీలవర్ణమును, తోఁపన్ = కనుపడఁగా, విక్రమంబునన్ = పరాక్రమముచేతను, వాఁడు = ఆహిరణ్యకశిపుఁడు, ఉగ్రతన్ = బెట్టిదముచేతను, కొన్నయట్టి = గ్రహించిన, విలస...మున్ - విలసత్ = ఒప్పుచున్న, మూర్తిత్రయీ = పంచానన చతురానన జనార్దను లనియెడు ముగ్గురు మూర్తులయొక్క, తేజమున్ = తేజస్సును, కొనులీలన్ = మరలఁ గ్రహియించునట్లు, నఖ...చేన్ - నఖ = గోళ్లయొక్క, కోణ = కొనలయొక్క, శ్రేణిచేన్ = పఙ్క్తిచేత, అసుర...న్ - అసుర = రాక్షసునియొక్క, వక్షోభిత్తిన్ = గోడవంటి వక్షస్స్థలమును, విదళింపవే = చీల్పవా?

తా. హిరణ్యకశిపుని వక్షస్స్థలము ఛేదించినప్పుడు మొదటిభాగము తెగఁగానె తెల్లగా నుండె ననియును, మఱికొంత తెగఁగానె ఆమాంస మెఱ్ఱగా నుండె ననియు, కడకుఁ దెగఁగా గుండెకాయం దవిలి నల్లగా నుండె ననియును, ఆ మూఁడుకాంతులు దోఁచుట దొల్లి వాఁడు విక్రమించి శివుని తెల్లనితేజస్సును బ్రహ్మదేవుని యెఱ్ఱనితేజస్సును విష్ణుదేవుని నల్లనితేజస్సును గ్రహించెను గావున నవి వానిశరీరమునం దుండఁగా స్వామివారు వానిని మరల బైటికిఁ దీయుచున్నట్లుండె ననియు భావము. అలం. స్వభావోక్త్యనుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

### వామనమూర్తి

మ. బలిదైతేయభయాంధకారభరితబ్రహ్మాండగేహంబులోఁ
బలఁబై మండెడుతత్ప్రతాపమయదీపజ్వాల డిందన్ దడుం

దలమై మింటికిఁ గ్రక్కునన్ నెగయునుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గలనీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా! 24

టీ. వామనా! బలి...లన్ - బలి = బలిచక్రవర్తి యనెడు, దైతేయ=రాక్షసునివలని, భయ = భయ మనియెడు, అంధకార=కటికిచీఁకటిచేత, భరిత = నిండఁబడిన, బ్రహ్మాండ = బ్రహ్మాండ మనెడు, గేహాంబులోపలన్ = ఇంటిలోపలను, పైన్ = ఉపరిభాగమందు,మండెడు...ల - మండెడు ప్రజ్వరిల్లెడు, తత్ప్రతాపమయ = ఆ బలిచక్రవర్తియొక్క పరాక్రమరూపమైన, దీపజ్వాల = దివ్వెవెలుంగు, డిందన్ = మఱుఁగు పడునట్లుగా, కడున్ = మిగుల, దలమై = దట్టమై, మింటికిన్ = ఆకాశమునకు, గ్రక్కునన్ = వేగముగా, నెగయు...య - నెగయు = ఉద్గమించుచున్న, ఇది నకారాది పదము, ఉద్యత్ = ప్రకాశించుచున్న, తత్ = ఆదీపప్రభానివారణానంతర మయిన, మహాచ్ఛాయ నాన్ = పెద్దనీడయో యనఁగా, కలనీలాంగము - కల=ఉన్నట్టి, నీలాంగము = నల్లని శరీరమును, శింశుమారము = శింశుమారచక్రము, ఒరయఁగాన్ = అంటునట్లు, పెంపవే = పెనుపవా?

తా. బలిచక్రవర్తివలని భయమనెడు చీఁకటి బ్రహ్మాండ మనునింటిలో వ్యాపించి యుండె ననియును, దానిమీఁద ననఁగా మూఁడులోకము లతిక్రమించి యతని ప్రతాప మనియెడుదీపము వెల్గుచుండె ననియును, దద్దీపజ్వాల యడుగగునట్లంతకంటెఁ బైఁగా శింశుమారచక్ర మంటువఱకు స్వామివారు నల్లనిశరీరముఁ బెంపఁగా నది దీపమున కడ్డ మగుచ్ఛాయవలె నుండె ననియును భావము. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

పరశురామావతారము

మ. శమితక్షత్త్రకళత్రనేత్రజలవర్షావేళ నీకీర్తిహం
సము క్రౌంచస్ఫుటతావకాంబకసుషిం బోఁ జాఁగంగ నీక్షించి వ
ర్షము రా నంచలు నంద నేఁడుఁ జను నొచ్చ న్నాఁటి తచ్చేష్ట వా
యమిఁ దిర్యక్కృతి దా గతానుగతికం బౌఁగా కుఠారీహరీ. 25

టీ. కుఠారీహరీ = పరశుధారి వగుస్వామీ! యని సంబుద్ధి. శమిత...శన్-శమిత = నశింపఁజేయఁబడిన, క్షత్త్ర=రాజులయొక్క, కళత్ర=భార్యలయొక్క, నేత్రజల=కన్నీళ్లనియెడు, వర్షావేళన్ = వర్షాకాలమందు, నీ కీర్తిహంసము = నీకీర్తి యనెడునంచ, (ఇచ్చట సమాసాంతమగుటవలన ముపర్ణకము వచ్చినది.) క్రౌంచ...న్-క్రౌంచ=క్రౌంచగుబ్బలియందు, స్ఫుట = వ్యక్తమైన, తావక = నీసంబంధియగు, అంబక= బాణమువలని, సుషిన్=బిలమందు, 'రంధ్రం శ్వభ్రం వపాసుషి' యని యమరము.

చాఁగంగన్ = కదలిపోఁగా, వీక్షించి = చూచి, వర్షము రాన్ = వానరాఁగానే, అంచలున్ = హంసలును, ఇచ్ఛన్ = మనస్సునందు, తచ్చేష్ట - తత్ = ఆనీకీర్తిహంసముయొక్క, చేష్ట = గమనవ్యాపారము, నాఁటి = పాదుకొని, పాయమిన్ = ఎడఁబాయకుండుటచేత, అంద = ఆక్రౌంచబిలమందే, నేఁడున్ = కాలమందును, చనున్ = పోవును, తిర్యక్తతి - తిర్యక్ = పశుపక్షిప్రముఖతిర్యగ్జాతులయొక్క, తతి = సమూహము, తాన్ = తాను, గతానుగతికం బౌఁగా = ముందటఁ బోయినదానివెంటనే పోవునుగదా. అలం. అర్థాంతరన్యాసము.

తా. ఓ పరశురామావతారా! నీవు రాజులను సంహరించుటవలన వారిభార్యలు దుఃఖించుచుండఁగా వారికన్నీరను వర్షాకాలమందు నీకీర్తిహంసను, తొల్లి నీవు కుమారస్వామివలెనే శివునొద్ద విలువిద్య నేర్చికొని పరీక్షకొఱకుఁ గ్రౌంచపర్వతమును నీ బాణముచేత ఛేదించితివి కావున, నాబిలములో నుండి యావలికి వెడలి పోయెననియును. ఆపోవుట సూచి భూమియందలి యితరహంసలు వర్షాకాలమును రాఁగానే ఆ బిలములో నుండియే యిప్పటికిని మానససరస్సునకుఁ బోవు ననియును, తిర్యగ్జాతి యొకదానివెంట నొక్కఁడు పోవునేకాని జంటమిషువ దనియును భావము. హంసలు వర్షాకాలము రాఁగానే క్రౌంచపర్వత బిలముద్వారమున మానససరస్సునకుఁ బోవుట ప్రసిద్ధము. పరశురాముఁడు క్రౌంచపర్వతమును ఛేదించె ననుటను 'భృగుపతి యశో వర్త్మ యత్క్రౌంచరంధ్ర' మ్మని కాళిదాసప్రయోగము.

## శ్రీరామావతారము

మ. పవిధారాపతనంబు గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం [1]దూఱఁ బరిశ్రమంబునకు నుద్యోగించె నా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక [2]సలీలం జన్న యుష్మచ్ఛరు
జ్జవనాస్త్రం బొసఁగు న్నిరుల్ రఘుకులస్వామీ! రమావల్లభా! 26

టీ. రఘుకులస్వామీ = రఘువంశనాయకా! రమావల్లభా = శ్రీసీతానాథా! పవి...బున్ - పవి = వజ్రాయుధముయొక్క, ధారా = అంచుయొక్క, పతనంబున్ = ప్రహారమును, కైకొ...లన్ - కైకొనని = సరకుసేయని, అప్పౌలస్త్యు = ఆపులస్త్యవంశజుఁడైన రావణాసురునియొక్క, మై = శరీరముయొక్క, సప్తధాతువులన్ = త్వగసృగస్థిస్నాయు శుక్లవసామజ్జ లనియెడు నేడు ధాతువులను, తూఱన్ = ప్రవేశించుటకై, పరిశ్రమంబునకున్ = అలవాటునకు, ఉద్యోగించె నాన్ = ఆరంభించెనో యను

---

1. దూఱు పరిశ్రమం. 2. వెసం జన్నట్టి.

నట్లు, సప్త...బు-సప్త = ఏడైన, సాల = కిష్కింధాప్రాంతమందలి మద్దిచెట్లయొక్క, విభేదంబు=ప్రచ్ఛేదనము, ఒనరించి=చేసి, సిల్వక=విరమింపక, సలీలన్=క్రీడగా, చన్న= పోయిన, యుష్మ...బు - యుష్మత్ = నీయొక్క, మరుత్ = వాయువువలె, జవన = వేగము గలిగిన, అస్త్రంబు = బాణము, (వాయవ్యాస్త్ర మనియేనియుం జెప్పఁదగును.) సిరుల్ = శ్రీలను, ఒసఁగుత = ఇచ్చుఁగాక.

తా. దేవేంద్రుని వజ్రాయుధముచేతఁ బ్రహరింపఁబడియు లక్ష్యము సేయని రావణాసురుని కఠినమైన శరీరమందలి సప్తధాతువులను భేదించుటకై మున్నే యలవఱచుకొనుటకువలె సప్తసంఖ్యగల సాలవృక్షములమీఁద సుగ్రీవుని నమ్మకముకొఱకు శ్రీరామస్వామివారు బాణమును బ్రయోగింపఁగా నది యాసాలములలో దూఱి యావలఁ బోయె ననియు, నట్టి బాణము మీకు సిరు లొసఁగుత మనియును భావము.

సీ. స్యందనస్థితబిడౌజఃక్షత్తృజాడ్యకృ
జ్జంఘామరుద్గరుద్ఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్రకనదసృగ్గాహన
స్ఫుటశల్యహవ్యభుక్ఛూత్కృతములు
యోధవర్మితహృత్స్ఫుటోత్క్రాంతనిజపాత
సాలాశ్మకృతముహుస్థాత్కృతములు
పతితోగ్రరక్షకకబంధభారభృశార్తి
భుగ్నభోగఫణీంద్రఫూత్కృతములు

తే. శ్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు
దివ్యతాపకశార్ఙ్గకోత్ప్రేరితములు
కలుషము లడంచుఁ గాత లంకాపురాంగ
ణాంబరచరత్కలంబకదంబకములు. 27

టీ. స్యందన = రథమందు, స్థిత = ఉన్నట్టి, బిడౌజః = దేవేంద్రుని యొక్క, క్షత్తృ = సారథియగు మాతలికి, జాడ్య = మాంద్యమును, కృత్= చేయుచున్న, జంఘామరుత్ = పెనుగాడ్పులుగల, గరుత్ = ఱెక్కలయొక్క, ఝాత్కృతములు = ఝూత్కారములు గలవియు, క్రవ్యా...లు - క్రవ్య = మాంసమును, ఆశి = భక్షించెడురాక్షసులకు, రాట్ = రాజైన దశకంఠుని యొక్క, గాత్ర = దేహమందలి, కనత్ = ఒప్పుచున్న, అసృక్ = రక్తమందు, గాహన=మునుఁగుటచేత, స్ఫుట = వ్యక్తమైన, శల్య = ములుకులయందలి, హవ్యభుక్

= అగ్నియొక్క, ఘాత్కృతములు = ఘాత్కారములు గలవియగు, రోధో... లు - రోధః=జోదులయొక్క, వర్మిత = సంనాహకవచములుగల. హృత్పుట = హృదయపుటములవలన, ఉత్క్రాంత=వెడలిన, నిజ=స్వకీయములగు, హేతి = ప్రేటులుగల వగు, సాల = లంకాపురికోటలయందలి, అశ్మ = పాషాణములయందు, పృక్త = చేయఁబడిన, ముహుః=సారెసారెకుఁ గలుగు, ఠాత్కృతములు = ఠాత్కారములు గలవియగు, పతిత...లు - పతిత = పడిన, ఉగ్ర = భయంకరులగు, రక్షః = రక్కసులయొక్క, కబంధ=మొండెములయొక్క, భార=ప్రోగుచేతనైన, భృశ = మిక్కిలియగు, ఆర్తి= పీడచేత, భుగ్న=వంగిన, భోగ=పడగలుగల, ఫణీంద్ర = పాముఱేఁడగు శేషునియొక్క, ఫూత్కృతములు = ఫూత్కారములు గలవియగు, శ్రాంత...లు - శ్రాంత = బడలిన, రథ్య=తేరిగుఱ్ఱములకు, నితాంత=దట్టమగు, శ్వాసములు = నిడుద యుచ్ఛ్వాసవిగాయు, దివ్య...లు = దివ్య=శ్రేష్ఠమగు, తాపక=సంబాధియగు, కార్ముక=ధనువువలన, ఉత్ప్రేరితములు = విడువఁబడినవియగు, లంకా...లు - లంకాపుర = లంకాపట్టణము యొక్క, అంగణ = సమీపమందలి, అంబర = ఆకాశమునందు, చరత్ = చరించుచున్న, కలంబ=బాణములయొక్క, కదంబకములు = సమూహములు, కలుషములు = మాసాపములను, ఉడుచుఁగాత = అడచివేయుఁగాత. స. 'శతాంగస్స్యందనో రథః', 'బిడౌజాః పాకశాసనః', 'సూతః క్షత్తాచ సారథిః', 'జంఝావాతస్సవృష్టికః', 'గరుత్పక్షచ్ఛదాః పత్త్రం', 'రుధిరేసృగ్లోహితాస్ర రక్తక్షతజశోణితం', 'హుతభుగ్దహనోహవ్యవాహనః', 'భటా యోధాశ్చయోద్ధారః', 'సన్నద్ధోవర్మితస్సజ్జః,' 'ప్రాకారోవరణస్సాలః', 'ముహుఃపునశ్శశ్వదభీక్ష్ణమసకృత్సమాః', 'కబంధోఽస్త్రీక్రియాయుక్త మపమూర్ధకళేబరం', 'భోగస్సుఖేస్త్ర్యాది భృతావహేశ్చ ఫణకాయయోః', 'రథ్యోవోఢా రథస్యయః', 'కలంబమార్గణశరాః', 'నికురుంబం కదంబక' మ్మని యీయాపదముల కమరము. 'శల్యోవంశ శలాకాయాం శకుంతామరయోరపి, శల్యః కశ్చిన్మహీపాల' యని రత్నమాల.

తా. శ్రీరాముఁడు రావణునితో యుద్ధముసేయునప్పుడు స్వామి ధనుస్సువలన విడువఁబడి లంకాపట్టణ ప్రాంతములయందు సంచరించెడు బాణపరంపర లప్పుడు స్వర్గమునుండి దేవేంద్రునివలనఁ బనుపఁబడిన రథమందు సారథ్యముఁ జేయుచున్న మాతలికి మాంద్యము గలుగునట్లు, పార్శ్వములయందుఁ గట్టిన ఱెక్కలు పెనుగాడ్పుతో ఘూత్కారములు సేయునవియును, మఱియు రావణుని శరీరమందుఁ బ్రవేశించి ఘోష్ములతో నొఱసికొనినప్పుడు ములుకులలో నిప్పువడఁగా నందలి రక్తమాంసనిష్ఠుతోఁ జేరి చుంయుమని శబ్దము వెడలునవియును, నితరరాక్షసుల కవచములు చీరచి

హృదయములు భేదించి వెన్నులోనుండి దూఱి యంత నిలువక లంకాపట్టణపుఁగోట పాషాణములకుఁ బగులఁగా నారకు తాఁకారములు గలుగు ననియును, ఈబాణములచేత నెక్కుడు మిక్కుటియగు రక్కసుల పీనుఁగు పెంటలవలన నధిక భారముగల భూమిని భరింపలేక పడగలు వంచికొని శేషుఁడు బుసలు విడుచు ననియును, విడుపని యుద్ధమందు రణమునకుఁ బూన్చినవి వేలుపుల గుఱ్ఱములేసియు మిక్కిలి బడలికను జెందఁగా వానిబడలిక దీఱుటకుఁ బందిరి వేసినట్లు నెట్టమగు నీడ నిచ్చుచున్న వనియును, నట్టిబాణములు మా పాపములు పోఁగొట్టుఁగాక యని భావము.

బలరామావతారము

చ. 'క్షితి హలకృష్టిఁ బుట్టి యడఁగెన్ క్షితియందునె సీత' యంచుఁ ద
త్సతి విరహార్తిఁ బోడిమముఁ దాలిచి రామశరీర మెత్తి యీ
క్షితిఖనక్రియ న్మగుడఁ జెందఁగఁ గాక, కళిందజా[1]తట
క్షితి దున నేటికి న్హలముచే [2]మఱి నీ కవశాత్మత [3]న్హరీ. 28

టీ. హరి = ఓస్వామీ! ఇచ్చట హలీయనియును గలదు, సీత = సీతాదేవి, క్షితిన్ = భూమియందు, హలకృష్టిన్ = నాఁగలివలన దున్నుటచేత, పుట్టి = జనించి, క్షితియందునె = భూమియందే, అడఁగెన్ = అడఁగిపోయెను, అంచున్ = అనుచు, తత్సతి = ఆసీతయొక్క, విరహార్తిన్ - విరహ = ఎడఁబాపుచేనైన, ఆర్తిన్ = పీడచేత, పోడిమమున్ = తెల్లఁదనమును, తాలిచి=ధరించి, రామశరీరము = రామావతారము, (బలరామావతారమనుట.) ఈక్షితిఖనక్రియన్ - ఈక్షితి = ఈభూమియొక్క, ఖనన= త్రవ్వుటయొక్క, క్రియన్ = కార్యముచేతను, మగుడఁజెందఁగఁగాక = తిరిగిపొందుట కైకాక, కళింద...న్ - కళిందజా = కాళిందీనదియొక్క, తట = దరియొక్క, క్షితిన్ = భూమిని, మఱి = పదంపడి, హలముచేన్ = నాఁగలిచేతను, అవశాత్మతన్ - అవశ=స్వాధీనముగాని, ఆత్మతన్=శరీరము గలుగుటచేత, నీకు దున నేటికిన్ - దునన్ = దున్నుట, నీకేటికిన్ = నీకేమి యక్కఱ యనుట.—ఇచ్చట దున్ను ధాతువు 'ప్రశమ లుగ పిద్వినుల్యోః' అనుసూత్రమువలన దున అనియెడు ధాతువయ్యె. కం. 'దునకయు వెదబెట్టకయును' నను మొదలగు ప్రబంధపరమేశ్వరాది మహాకవి ప్రయోగసిద్ధం బయి యున్నది.

తా. స్వామీ! పూర్వము రామావతార మెత్తినప్పుడు సీతాదేవి భూమియందు జనకచక్రవర్తి దున్నించుచుండఁగాఁ బుట్టి కడపట స్వామివారిసభాస్థలితో భూమియందే

1. తటిన్. 2. గాని. 3. హలీ.

యడఁగిపోయెఁ గావున నారాముఁడే మరల బలరాముఁడై యవతరించి యాసీతావిరహమువలన మున్నునల్లనైన దేహము తెల్లనై యుండఁగా నాసీత భూమిలోనే యున్న దనియును, మున్ను దున్నుటవలననే పుట్టెఁ గావున మరల దున్ని యాసీతను బొందవలయు నని యూహించి విరహాతిశయమువలన మైమఱచి కాళిందీతీరభూమి నాఁగటిచే దున్నితి వేరొక ప్రయోజన మే మున్న దనియును భావము. యమునాతీరమును దున్నుటకు సీతాప్రాప్తిని ఫలముగా నుత్ప్రేక్షించినాఁడు గనుక ఫలోత్ప్రేక్ష.

## కృష్ణావతారము

ఉ. ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంతఫలకావలి బింబితమై [1]వెలుంగ నా
రాయణమూర్తిమత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచెనా
నో యదువీర! వృష్టిఁ బసి యూఱడఁ బ్రోవవె సప్తరాత్రముల్. 29

టీ. ఓయదువీర = ఓయాదవవీరుఁడ వగు శ్రీకృష్ణా యను యామంత్రణము. ఆయత...లి-ఆయత = పొడవగు, యుష్మత్ = నీయొక్క, ఆకృతి = ఆకారము, కరాగ్ర...లిక్-కరాగ్ర-కర=నీహస్తముయొక్క, అగ్ర = చివరయందలి, నగ = గోవర్ధనపర్వతము యొక్క, అంచల = అంచులవలన, వాంత = వెడలుచున్న, వారిధారా = ఉదకధారల తోడ, యుత = కూడిన, చంద్రకాంతఫలక = చంద్రకాంతపుఱాలయొక్క, ఆవళిక్ =పఙ్క్తులయందు, బింబితమై = ప్రతిఫలించినదై, వెలుంగక్ = ప్రకాశించుచుండఁగా, నారా...చేక్ - నారాయణ = నారాయణసంబంధియగు, మూర్తిమత్ = శరీరము గల, కవచరత్నముచేక్ = కవచశ్రేష్ఠముచేత, పరిరక్షక్ = మిక్కిలిసంరక్షణమును, గాంచెనాక్ = పొందెనో యనఁగా, వృష్టిక్ = దేవేంద్రనియుక్తవర్షమందు, సప్తరాత్రముల్ =ఏడురాత్రులు, పసి=పశుసమూహము, ఊఱడక్=ఊఱటచెందునట్లు, ప్రోవవె= సంరక్షింపవా?

తా. స్వామీ! కృష్ణావతారమెత్తినప్పుడు దేవేంద్రుఁడు సప్తరాత్రములు ప్రబలమగు వర్షము గురియింపఁగా నట్టికాలమందు గోవర్ధనగిరి హస్తాగ్రమునందు ధరించి గోవులను రక్షించితివి గావున నాపర్వత మెత్తినప్పుడు చుట్టును జాఱుచున్న యుదకధారలతోఁ గూడిన చంద్రకాంతములయందు నీయాకృతి ప్రతిఫలించుచుండఁగా నేదిక్కునఁ జూచినఁ గృష్ణమయమై యుండుటం జేసి శరీరముగల నారాయణకవచము గోవులుధరించినవియో యన్నట్లుండె ననియును నారాయణకవచ మాపదల నడంచుట

1. చెలంగ.

ప్రసిద్ధంబు గావున నట్టికవచధారణంబుననే యవి రక్షింపఁబడినట్లు గోవులను నీవు రక్షించితి వనియును భావము. నారాయణుఁ డనుపదమున కర్థ ముదకవాసియగు విష్ణువు గనుక నిచ్చట నుదకప్రతిబింబితమైన శ్రీకృష్ణవిగ్రహము నట్లు చెప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

బౌద్ధావతారము

మ. తరుణత్వత్సుతబాణపంచకమునం గైదైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మకజరద్బాణం బొకంట న్జెడక్
ద్వరఁ గావించితి వేటికో? యహహా! బుద్ధం బయ్యె నీభావ మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసాధ్యం బౌటఁ గా కేశవా! 30

టీ. కేశవా = బ్రహ్మేశానోత్పత్తికారణము వైనస్వామీ యని సంబోధనము. తరుణ...న్-తరుణ = లేఁతవాఁడగు, త్వత్సుత = నీకొడుకగు మన్మథునియొక్క, బాణ = బాణములయొక్క, పంచకమునన్ = ఐదింటిచేత, దైత్యాబలాశ్రేణిన్ - దైత్య = త్రిపుర రాక్షసులయొక్క, అబలా=భార్యలయొక్క, శ్రేణిన్=సమూహంబును, యుష్మ...టన్- యుష్మదాత్మక = భవన్మయమైన, జరత్ = ముదిమిగల, బాణంబొకంటన్ = ఒక్క బాణముచేతను, తద్వర...ము - తత్ = ఆదైత్యస్త్రీలయొక్క, వర = భర్తలయొక్క, సందోహము=సమూహము, చెడన్ = భంగపడునట్లు, ఏటికో = ఏలొకో, త్వరఁ గావించితివి=శీఘ్రముచేసితివి, అహహా = ఆహా! నీభావము=నీయభిప్రాయము , బుద్ధంబయ్యెన్= తెలియనయ్యెను. ఆత్తరుణీశీల = ఆస్త్రీలయొక్క పాతివ్రత్య మనియెడు, తనుత్రము= కవచము, ఏరికిన్ = ఎవ్వారికిని, అసాధ్యంబౌటఁగా = అసాధ్యమౌటచేతఁగదా యని త్వర గావించితి వనుట కన్వయము.

తా. త్రిపురసంహారకాలంబున నాత్రిపురస్త్రీలపాతివ్రత్య మసాధ్య మవుటం జేసి ముందఱవారిని జెఱచుటకు స్వామి తనకుమారుఁ డగుమన్మథుఁడు దనకంటె లేఁతవాఁ డగుటవలన నతని నైదుబాణములను ముసలివాఁ డగు తనరూప మయిన యొకబాణమును ద్వరితముగా వారిభర్త లగు త్రిపుర రాక్షసులఁ జెఱుపుట కుపయోగింపఁ జేసె నని ముఖ్య భావము. ముద్రాలంకారము.

కల్క్యవతారము

శా. ఘోరాపాగమహౌఘపంచకముఁ జెక్కు ల్సేయఁగా [1]నేర్ప(ర్పు)నా
ధారాపంచకధావనం జెలఁగుగంధర్వంబుఁ ద్రొక్కించు బ
ల్బీరంపున్మొఱకౌతుఁ గికటళరాళీవారవాణీభవ
ద్ఘోరుద్భాంతకృపాణికాద్యుతయవిద్యుద్గ్రంథి నిం గొల్చెదన్. 31

టీ. ఘోరా...న్ - ఘోర = కఠోరములగునట్టియు, అపార = పారములేనివియు, మహాత్ = అధికము లగునవియు నగు, అఘ = పాపములయొక్క, పంచకము = ఏనింటిని, 'స్వర్ణస్తేయీ సురాపాయీ బ్రహ్మహా గురుతల్పగః, మహాపాతకిన స్త్వేతే తత్సంయోగీచ పఞ్చమః' అని. ఇవి మహాపాతకములు. చక్కాల్ = భేదములు, [illegible] = చేయుటకు, నేర్పుక నాక్ = నేర్పుగలవా యనట్లు, ధారా...న్ - ధారా = [illegible] విశేషము లగు నాల్కాదిత [illegible] భేదించినట్లుగా [illegible]. 'గం యోధారా ఖ పఞ్చధారాః' యని యమరము. పంచ = ఏదింటిగాయొక్క, ధావనక్ = పరుగెత్తుటకు, చెలఁగు...బుక్ - చెలఁగు = ప్రకాశించుచున్న, గంధర్వంబుక్ = అశ్వమును, త్రొక్కించు...తుక్ - త్రొక్కించు = నడపించుచున్నట్టి, బల్ = [illegible], ఏచాపు=వీర గుణముగల, నెఱరౌతుక్ = పూర్ణరాహుత్తుడ వైనట్టి, కీకట...ఛటా... = బోయల యొక్క, కీకటదేశవాసులు=బోయలు, 'దేశభేదేచ కీకటః' యని నిఘంటువు. శరాళి = బాణసమూహములకు, ఒరవాణీభవత్ = కవచమగుచున్న, దోః = భుజములయందు, ఉద్భ్రాంత = త్రిప్పఁబడుచున్న, కృపాణికా = పట్టాకత్తులయొక్క, ద్వయ = జంట యనియెడు, విద్యద్భ్రాంతిక్ = మెఱుపులముడి గలిగిన, నిన్ = కల్కియగునిన్ను, కొల్చెదన్ = సేవించెదను.

తా. స్వామి కల్క్యవతారమున దుష్టమ్లేచ్ఛ [illegible] నెక్కిన [illegible], రవగాలు, జోడన, జళిపి యను పేరుగల [illegible] గమనవిశేషముల [illegible] నడుపుచుండఁగా బంచమహాపాపముల నడఁగఁద్రొక్కుటకు [illegible] గమనములు నేర్పుచున్నట్లుండు ననియును, రెండుచేతుల రెండుపట్టాకత్తులఁ బూని త్రిప్పుచుండఁగా నన్ని ప్రక్కల మెఱపులు మెఱసినట్లుండు ననియును, [illegible] సాచారమే యాకాలమందు స్వామి నెదిరింపఁగల బోయలబాణ పరంపరలకుఁ గవచమై యా బాణములను పైకి రానీకుండు ననియును భావము.

చ. అని [1]నుతియింపఁగా హరి సుధాశనవర్ధకిఁ జూచి 'పాండ్యుఁ డి
చ్చినధన మిమ్మునీశ్వరుఁ డశేషము భాగవతాస్మదీయగే
హనివహసాత్కరించి యకటా! కడు రిక్తత నొందు; నేతదీ
యనిలయ మప్పురి న్మణిమయంబును సార్థముఁ జేయు నావుడున్.

టీ. అని = ఈరీతిగాను, నుతియింపఁగాక్ = స్తోత్రము సేయఁగా, హరి = స్వామి, సుధాశనవర్ధకిక్ - సుధాశన = దేవతలయొక్క, వర్ధకిక్ = వడ్రంగియగు

1. వినుతింపఁగా.

విశ్వకర్మను, 'త్వష్టా తు వర్ధకీ త్వష్టా' యని యమరము. చూచి = ఈక్షించి, పాండ్యుం డిచ్చినధనము = పాండ్యరాజొసంగిన ద్రవ్యమును, ఇమ్మునీశ్వరుఁడు = ఈ విష్ణు చిత్తుఁడు, అశేషము = సమస్తమును, భాగ...చి - భాగవత = భగవద్భక్తులవిషయ మందు, అస్మదీయ = నాసంబంధులగు, గేహ = ఆలయములయొక్క, నివహ = సమూహమునకు, సాత్కరించి = వినియోగ పఱిచి, అకటా = అయ్యో, కడుఁన్ = మిక్కిలి, రిక్తతన్ = లేమిని, ఒందుక్ = పొందును. అప్పురిన్ = ఆవిల్లిపుత్తూరియందు, ఏతదీయనిలయము - ఏతదీయ = ఈవిష్ణుచిత్తుని సంబంధియగు, నిలయము = గృహమును, మణిమయంబుగు = మణిమయాకారము గాను, సార్థముగ్ = ధనసహిత మైనదిగాను, చేయుం= చేయుము, నావుఁడున్ అనఁగా.

తా. సుగమము.

తే. విశ్వకర్మయు నట్ల కావించె; నంత
నంబుజాక్షుఁడు నమ్ముని నాదరించి
యీక్షణాగోచరుం డయ్యె ఋషియు నేఁగి
పౌరులు [1]భజింప విల్లిపుత్తూరి కరిగె. 33

టీ. ఈక్షణాగోచరుండయ్యెన్ = అంతర్ధానముం జెందెను. కడమ సుగమము.

## విష్ణుచిత్తుని స్వపురప్రవేశము

క. స్థానికులు దన్ముని దిదృ
 క్షానందితు లగుచుఁ బురముఁ గైసేసి ప్రజ
 ల్తో [2]నరుగ నాగవాసము
 తో నెదురుగ నేఁగి రంత తూర్యము లులియన్. 34

టీ. స్థానికులు = శ్రీవిల్లిపుత్తూరిలోని దేవస్థానమందలి యధికారులు, తన్ముని = ఆవిష్ణుచిత్తునియొక్క, దిదృక్షా = దర్శనేచ్ఛచేత, ఆనందితులగుచున్ = సంతోషపడిన వా రగుచు, పురమున్ = విల్లిపుత్తూరిని, కైసేసి = అలంకరించి, ప్రజల్ = పౌరులు, తో నరుగన్ = కూడరాఁగా, నాగవాసముతోన్ = బోగముమేళముతోడ, ఎదురుగ నేఁగిరి = అభిముఖముగాఁ బోయిరి, తూర్యములు = వాద్యములు, ఉలియన్ = ధ్వని సేయుచుం డఁగా, అంతన్ = పిమ్మట, ఇది మొదటి కన్వయము.

తా. సుగమము.

1. భజింపఁగానె పుత్తూరి. 2. నడువ.

వ. ఇ ట్లెదుర్కొని పట్టపవిత్ర భగవత్ప్రసాదతీర్థంబు లుపాయనంబు
లుగాఁ బ్రణామంబు లాచరించి లేచి ప్రాంజలులై భస్త్రపరికర్మవర్తి
తం బగుబ్రహ్మరథంబున సబ్రాహ్మణభాగవతవతంసంబు నునిచికొని పోవు
సమయంబునఁ, బరస్పరసమేతంబు లగుపౌరజానపదజనంబులు గలసి
మెలసి నడుచునెడ మృదంగం బుపాంగం బావజంబు దండె తాళం
బురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె వాసెకొమ్ములు డోలు మౌరి
భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డక్క డక్కి చక్కిచుయ్యంకి లోనగు
ననంఖ్యాతవాదిత్రత్రితయ పరంపరలు మొరయ, నెడనెడఁ బడఁతు
కలుమలుఁపుగొనఁ, బట్టణాగతగజ ఘట్టఘోట్టాణఘోటక ఘంటికా
కదంబ ఘుర్ఘుర ఘోషంబుల కనుప్రాసంబులై విలాసినీమంజీరపుంజీరంబు
లెలుఁగియ్య, నల్లనల్లనం జాఁగుతతిఁ గెలంకులఁ గవచితకుథాకర్బుర
లగుకరివరకరేణుకంధరలం గనకాంకుశంబులు పూఁబూని సేవించి
పోవుసామంత భూకాంతకుమారభట్టంబులం బిట్టు గాంచి యొండొ
రుఁ గడవ, సంభ్రమించుచు వ్రొక్కి నిక్కి చేయెత్తి యెత్తిలి
నేత్రంబు లుత్తానతరళతారకంబులుగా మగిడి మగిడి పొగడుచుం
బోవుతతిఁ, దద్రాజకదంబకం బచ్చటిపడంతుకలకుం దమకుం బురి
కిం జనుదెంచినప్పుడెల్ల నెడగాం డ్రగుట మేలమాడఁబోలు నా
ప్రోలిమేళంపుఁ గళావతుల ప్రేయునెపంబునం గ్రామగ్రామగ్రామణు
లొసంగునారంగమాతులుంగజంబీరకుందకందుకాదులం బూర్వాను
భుక్త లగునక్తంకరముఖుల వైవ, ధళధళత్తరళలాటకంబును నంకు
రితస్మితంబునుగా నాతన్ముఖప్రేంఖోళితస్ఫీతసాకూతవిభ్రమాకేకరా
పాంగ విలోకనంబును నాచలితధమ్మిల్లంబునుంగా మొగంబులు
మొగిచికొని సంమర్దంబునం జనుమార్దంగికుల మూఁపుల మఱుఁ
గులం డాఁగి యన్నాగవాసంబు నాగరకవిలోకనంబునం జెలరేఁగి
మొగంబులు బిగించికొని వేడు రెత్తినగతి నరిదియెత్తఁ బ్రతిపదం
బును మర్దళముఖావమర్దనకుఁ గ్రుంగుటయు, బయలుపడి చేయునది
లేక యాకడకు మగిడి తుఱుము దిద్దుచుఁ దద్వారణాభినయవత్ప్ర
రాచీనకరాబ్జలై నుడివడునెడం బోడముకర్ణకుసుమావతంసకపోల
ఘురళీ కించిచ్చలనోపలక్ష్యవైలక్ష్య హాసకుందంబులు సాంద్రతర

చంద్రికాకందంబులందీటుకొలుపఁ, జాటూక్తివాచాట లగుజరఠవని
తలు తమకు మ్రొక్కం దారు మ్రొక్క కొక్కించుక యోరమో
మిడి వారియిరుపక్కియల నొవిఁగితొంటియంటుఁ దలంచి తలవాంచిన
వంచనం గటాక్షించి యెక్కసక్కెంబునకుఁ దమచేత మ్రొక్కించు
కొనువేడ్క నక్కడం బుడమితేఁడు లేమి సామాన్యమానవులం
గై కొనక సుమాళంబు వేదయంబుగావిద్యావయోవృద్ధులరగుమీరు
మ్రొక్కం దారు మ్రొక్కమి యెట్లు మ్రొక్కింపుం డనుటయు, గ్ర
క్కనం బోడము నొక్కనగవులమోముదమ్ములకు వేఱొక్కవింత
తెలివియెక్క మ్రొక్క నక్కడఁ గెడఁగూడి నడచు తోడిచేడియల
కన్దొరలకుఁ దమకుం దద్దయుం బొందు గలదను పెద్దఱికం బెలుక
పలుపఁ గెమ్మోవులు మఱంచి లోలోన నొయ్యనను చుక్కన నక్కి
లెకింగి దక్కెపొమ్మని తమ్మునమ్ముదునల్లీ ముందఱికి నూకి యక్క
క్క మ్రొక్కవే మనపాలివేలు పని బుజ్జగించియు బొమలుగొని
జంకించియు నెట్టకేలకు నొడంబఱిచినఁ, ద్రపాతగళనయనలై విరళ
విరళాంగుళాంజలిబంధంబుగా మ్రొక్కి కక్కసాన నిట్లు మ్రొక్కించి
హెచ్చి యచ్చయ్యాట మెడఁ బడకయుండఁ జిగురుగండెలుఁ
బోలె నల్లుకొని గొల్లన నగునల్లోలాంగనలఁ గల్లకోపంబునం గొట్టి
కసరుఁ జూప, భూపసంఘంబులపై నిగుడ మగుడ మఱునడు కొమిరె
హరిణలోచనలచలితకంకణ సంకులక్రేంకారంబు లాననామోద మే
దురాళి ఝుంకారంబుల బింకంబు లడంపఁ, జెవులసంకులు లోవంక
భుజంబులు కొంకి సిగలు గావిదుప్పటులు నొప్ప నిమ్ముదెప్పరంబై
ముప్పున నప్పురంబు సేరి, రసికజనబాంధవంబున బంధువియోగంబు
మఱచి, గంధకలనాకుసుమ ప్రగ్రథనాదుల నాంధ్యంబు లే కలరునం
ధ్రదేశీయు లగు గంధకారులు పాటిపాటి పద్యంపుమ్రొక్కులతో
వెట్టివెట్టికై వారంబుల గౌరఁ తత్తరులపై వచ్చు రాచవారిపై నాఁ
డువారిపై నాభువారిపైఁ జల్లఁగాఁ జల్లఁ బెల్లెగసి సృష్టియెల్లను ముష్టీ
కరించు నప్పుష్టభేద యగు పరిమళసమష్టిం బెట్టు పిష్టాతకంబు నభో
మండలికిం జండాతకంబై చండకిరణంబులు మాటుపఱుపఁ, బన్నీరు
నించిన నన్నీరుతిత్తు లొత్త, వియత్తలంబునం బాఱె కైవ్రాలు ధా

రల వాద్యంబులు దడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాప నగ్గి
రోయుచుండ, నష్మొత్త మత్తఱి నృత్తంబుఁ జూడ నిలిచి మెత్తమె
త్తన నడుచుచుండు మిండతండంబునుం దారు నప్పింపు పుండరీకాస్య
లవకాశంబుఁ గాంచి కాశకుసుమప్రతిఫలనపాండురంబులై పద్యార్తి
హృద్యపార్శ్వద్వయోద్యానపాదపంబులకుం బౌలుచెంగలువకా
లువలకుం డిగ్గి, కాసరదధిమండమానరంబులుగాఁ బిసికి యారంబెట్టిన
నారంగశృంగిబేరభంగంబులతోఁ గట్టిన కలమాన్నంపుఁజల్ది పోక
పొత్తులంగుడుపఁ గూర్చుండ వీక్షించి,కుక్షింభరిత్వంబునకు క్షాములై
తిరిగితిరిగి వేసరియోసరిలినదాసరిగుంపువారిపాల గోపాలభిక్ష
భిక్షించిభక్షింపఁ దీరక్షోణి నిలిపినతోరంపుదివెదారికోలల (తిరువిళ
క్కోలల) రంధ్రగోళంబుల నుత్కలంబులై మండు ధగధగనిజగ
జ్జ్యోతి దీపజాలంబుల మధ్య ధూపకుండికాంగారంబులనీ గాదఁగ్రాచి
నాదుఁ బరికింప వాయించు ధిమధిమిధ్వానంబులకుం బెదరి యా
వలి యుపవనశుకంబు లావలి కావలియుపవనశుకంబు లీవలికి దట్టం
బుగాఁ గట్టనితోరణంబులై పఱవఁ, వలలు విసరుటయు నోరు దెఱ
చుటయుఁ గేలు సఱచుటయుఁ దక్కుమిక్కుటంబగునక్కోలాహలం
బున నేపాటియుం బాట వినరాక మూకగట్టిన భాగవతజాతంబు
లేతేర, నూరూరి సుతపుతకుం దిగుగఁ బెద్ద ఓంటి సాతరించిన
పిలుకవాటుగోడిగల జావడంబులకుం బుట్టికాల్గట్టి విడువ నెత్తంబున
మెత్తని గడ్డికమేసి పోసరించి మాపుమాపున మేపుసజ్జకవణంపు
మేపునఁ బిడుక గొఱపంబు తోమకంబునఁ బుటపుటన్నై కఱియకం
బడి వ్రాతఁ గని గ్రైన నీడకని గ్రైనం బెదరుకొదమతట్టువగుంపు
కాలి కొలందికి వ్రేలు లాలుకుంచెలు గిలిచిన గవ్వగంటలగంటల
నలంకరించి మోలుగుమడ్డిం దోఁచి మూర కొక్కుకుసు జేన
కొక్కుండునుగాఁ గుట్టినడొల్లు టుల్లారు ఉల్లసిల్ల బల్లించిన పల్లం
బులన్నైఁ జిల్లతైలంబును వాసనకొడుపులం బూనినమణుంగుఁజంద్రి
కచేలలె రవణంబులుగా నెదురుగా వేడుకకుం జూడవచ్చిన యవ్వీటి
మేటిసాలె యగసాలె పటుసాలె వానె వైజాతి సాతు లెత్తెలకొమి
రెలు తునులపై వచ్చు తచ్చుమూసామజంబులం జూచి యేచిన

పెఱం దమయొక్కరింత లెక్కకొని వాగె లిరుగేలం గుదియంబట్టిన
నిలువ కయ్యుత్సవం బీక్షింప వచ్చిన ప్రజలం ద్రొక్కుచుం బోవఁ,
దస్మద్భృత్యవృద్ధవధ్వాతురాదులు దిట్ట నిట్టటునలేక ప్రాణంబులు పిడి
కిటం బట్టుకొని పోవుచున్న నవీనసవిధ కేదారంబులం ద్రెళ్లి చట్టలు
దిగంబడి వెడల లేకుండం దాటు దిగ నిష్టులేక బిమ్మటిగొని నలు
దెసలుం జూడం జూచి కేలు చఱచి హోహో యని గేలిసేయు గణి
కాకదంబంబుల చప్పటులు నిబిడనిష్కుటవిటపిఝాటమ్ములం బ్రతి
శబ్దంబులు పుట్టింప, నిట్లనూనవిభవంబు సిగురొత్త నత్తిరుపతి సొచ్చి
యచ్చక్రధరు నగరిమొగసల నిలుచుటయు, నవ్విష్ణుచిత్తుండు దద్ర
థావతరణంబు చేసి ధరణీధవ సమూహాస్థానికవ్యూహంబు వెంట
రా నవైష్ణవుంతు సేవించి, తత్ప్రసాదలబ్ధం బగు పరివట్టంబున
నలంకృతుండై, నానాలంకార సహితంబును రత్నకాంచన మయంబు
నగు నాత్మీయభవనంబుం గాంచి విస్మితుండై పుండరీకాక్షు మహి
మాభిలబ్ధనైభవంబు కాఁ దెలిసి తత్రత్యధాత్రీకళత్రవర్గంబుల ననిపి,
ప్రవేశించి తొంటికంటె శతగుణంబుగా భాగవతపూజాప్రవణుండై
యుండె నంత. 35

టీ. ఇట్లు = పూర్వోక్తప్రకారముగా, ఎదుర్కొని = ఎదురు గావచ్చి, పట్టు=తిరు వ్వరిచుట్టమును, పవిత్ర=పావనములైన, భగవత్ప్రసాద తీర్థంబులు=రంగమన్నారుస్వామి యొక్క యభిషేకోదకనిర్మాల్యాదులును, (ఇచ్చట గ్రంథకర్త 'తల్పాన్తరం పూర్వ' మ్మని ద్వంద్వమునకు నిషేధ మున్నప్పటికిని 'లక్షణహేత్వోః క్రియాయాః' యనుజ్ఞాపక సూత్రముచేతఁ బ్రయోగించియున్నాఁడు.) ఉపాయనంబులు కాఁగా = కానుకలు కాఁగా, ప్రణామంబు లాచరించి = నమస్కరించి, లేచి = ఉత్థితులై, ప్రాంజలులై = చేతులు జోడించినవారై, భర్మ...బగు - భర్మ = బంగారుమయమైన, పరిసర్మ = అలం కారముగేసను, వర్మితంబగు = సన్నద్ధమైన, బ్రహ్మరథంబునకు = బ్రహ్మరథమందు, అబ్భాగవతవతంసుఁబుఁ = భగవద్భక్త శిరోభూషణమయిన యావిష్ణుచిత్తుని, ని. 'గాఙ్గేయం భర్మకర్బురం', 'పరికర్మాఙ్గసంస్కారః', 'సన్నద్ధో వర్మితస్సజ్జః', 'పుంస్యు త్తంసావతంసౌద్వౌ కర్ణపూరేపి శేఖరే' యనియు నమరము. ఉనిచి = ఉంచి, కొని పోవు సమయంబునకు = వెంచేపు చేసికొని వెళ్లుకాలమునందు, పరస్పర...లగు - పర స్పర = అన్యోన్యమ్ము, సమేతంబులగు = కలసియున్నటువంటి, పౌర...బులు - పౌర = పట్టణమందలి, జానపద = పల్లెలయందలి, జనంబులు = నరులు, కలసి = కూడికొని,

మెలసి = వ్యాప్తమై, నడచునెడన్ = పోవుతఱి, మృదంగంబు = మద్దెల, ఉపాం గంబు = తిత్తి, ఆవజము = రుంజ, దండె=తంబురా, తాళంబు = లయకనుసరిగావాయించు కంచువాద్యము, ఉరుమ = వాద్యవిశేషము, కిన్నెర = తంత్రీవాద్యవిశేషము, సన్న గాళె = తిరుచ్చిన్నము, వీణె = విపంచి, ముఖవీణె = మోర్చింగు, వాసెగ్రోలు = పిల్లన గ్రోవి, డోలు = వాద్యవిశేషము, మౌరి = నాగసరమును, భేరి = దుందుభి, 'భేరీ స్త్రీ దుందుభిః పుమాన్' అని యమరము. గౌరు = కాహళి, గుమ్మెట = తుడుము, తమ్మె టంబు = డప్పు, డుక్క, చక్కి, డక్కి వాద్యవిశేషములు, చుయ్యంకి = సొన్నాయి, లోనగు = మొదలుగాఁగల, అసంఖ్యాత = లెక్కకుమిక్కుటమైన, (అంకాద్యాదివాద్య త్రితయ మనియును పాఠముగలదు) వ్యాది...లు-వాదిత్ర = వాద్యములయొక్క, త్రిత య = మూఁటియొక్క, పరంపరలు = సమూహములు, ని. 'తౌర్యత్రికం నృత్తగీత వాద్యం నాట్యమిదం త్రయ' మ్మని యమరము. మొరయన్ = ధ్వనిచేయఁగా, ఎడ నెడన్ = నడుమనడుమ, పడఁతుకలు = నాట్యస్త్రీలు, మలఁపుగొనన్ - ఎదురుతిరిగి నాట్యముచేయఁగా, పట్టణా...కున్ - పట్టణ = నగరములనుండి, ఆగత = వచ్చి నటువంటి, గజఘట్ట = ఏనుఁగుల సమూహముయొక్కయు, ఘోట్టాణ = ఘోట్టాణ దేశమందుఁ బుట్టిన, ఘోటక = అశ్వములయొక్కయు, ఘంటాకదంబ = గంటలసమూ హముయొక్క, ఘర్ఘరఘోషంబులకున్ = ఘర్ఘరధ్వనులకు, అనుప్రాసంబులై = అను కరణములై, విలాసినీ...లు - విలాసినీ = స్త్రీలయొక్క, మంజు = సుందరములయిన, 'మనోజ్ఞం మంజుమంజుళే' మ్మని యమరము. మంజీరంబులు = అందెలు, 'మంజీరో నూపురోస్త్రియామ్' మ్మని యమరము. ఎలుఁగియ్యన్ = ధ్వనిచేయఁగా, అల్లనల్ల నన్ = మెల్లమెల్లగా, చాగుతఱిన్ = నడచుసమయమందు, కెలంకులన్ = ప్రాంతములం దు, కవచి..లగు - కవచిత = కంచుకములుగాఁ జేయఁబడినటువంటి, సుధా = పృష్ఠాస్త రణములచే, కర్బురలు = చిత్రవర్ణములయిన, ని. 'ప్రవేణ్యాస్తరణం వర్ణః పరిస్తోమః కుథోద్వయోః' యని యమరము. కరి...లన్ - కరివర = గజశ్రేష్ఠములయొక్కయు, కరేణు = ఆడియేనుఁగులయొక్కయు, కంధరలన్ = కంఠప్రదేశములయందు, ని. 'కరే ణురిభ్యాం స్త్రీ నేభే' యనియు, 'కంఠోగళోఽథ గ్రీవాయాం శిరోధిః కంధరేత్యపి' యని యు నమరము. కనకాంకుశంబులు = బంగారపుసృణులు, చేఁబూని = చేతఁబట్టి సేవించిపోవు = విష్ణుచిత్తు ననుసరించిపోవుచున్నట్టి, సామంత...బులన్ - సామంత = తనదేశమును జుట్టికొనియున్న దేశములకు నధిపతులైన, భూకాంత = రాజుల యొక్క, కుమార = పుత్త్రులయొక్క, ఘట్టంబులన్ = సమూహములను, బిట్టుగాంచి = మిగులఁజూచి, ఒండొరుఁ...చున్ - ఒండొరున్ = ఒకరొకరిని, కడవన్ = అతిక్రమించుటకొఱకు, సంభ్రమించుచున్ = త్వరపడుచు, మ్రొక్కి = అంజలిఁ జేసి, నిక్కి = ఊబికి, చేయెత్తి = హస్త ప్రసారణముఁజేసి, ఒత్తిలి =

ఒక పార్శ్వమున కొంచెఁగి, నేత్రంబులు = కన్నులు, ఉత్తాన...గాఁ-ఉత్తాన = ఊటికి నట్టియు, తరళ = చంచలమయిన, తారకంబులుగాఁ = కనీనికలు గలిగినవి కాఁగా, (కనుపాపలు గలిగినవి కాఁగా ననుట.) ని. 'నిమ్నం గభీరం గంభీర ముత్తానం తద్విపర్యయే, చఞ్చలం తరళం చైవ తారకాఽక్ష్ణః కనీనికా' యనియు నమరము. మగిడిమగిడి = ఎదురు తిరిగితిరిగి, పొగడుచుం బోవుతఱిఁ = స్తోత్ర మొనరించుచు వెళ్లుసమయంబున, తద్రాజకదంబకంబు = ఆరాజకుమారవర్గము, అచటిపడఁతులకుఁ = అక్కడనున్న స్త్రీలకును, తమకుఁ = తమకును, (వచ్చినవారి కనుట). పురికిం జనుదెంచినపు డెల్లఁ = మధురకు వచ్చినప్పు డంతయు, ఎడకాండ్రగుటఁ = కుంటెనగాండ్రగుటచేత, మేల మాడఁ = పరిహాసమాడుటకొఱకు, పోలు=తగిన, ఆ ప్రోలి...లఁ-ఆ ప్రోలి=అప్పట్టణ మందలి, 'పట్టణంబున కాఖ్యలై బరగుచుండు, ప్రోలనఁగ వీడనంగను పొలపాఁడి' యని యాంధ్రనామసంగ్రహము. మేళంపు = నాగవాసము గూడివచ్చిన, కళా వతులఁ = వేశ్యలను, ప్రేయుసెపంబునఁ = ప్రేయునట్టి వ్యాజముచేత, గ్రామ...లు-గ్రామగ్రామ=ఊరూరియొక్కయు, గ్రామణులు = గ్రామాధికారులు, ని. 'గ్రామణీర్నాపితే శ్రేష్ఠః' యని యమరుఁడు. ఒసంగు...లఁ-ఒసంగు = తెచ్చియిచ్చిన, నారంగ = తీయనారింజ (కిచ్చిలి) పండ్లచేతను, మాతులుంగ = మాదీఫలములచేతను, జంబీర = నిమ్మపండ్లచేతను, కుందకందుకాదులఁ = మొల్లపూబంతులు మొదలగువానిచేతను, ని. 'ఫలపూరో బీజపూరో రుచకో మాతులుఙ్గకః' యనియు, 'స్యాజ్జంబీరే దన్తశఠః జంబజంబీరజంభలా' యనియు, 'గేందుకః కందుకః' యనియు నమరము. పూర్వానుభుక్త = ముం దనుభవింపఁబడినటువంటి, నక్తం...లఁ-నక్తంకర=చంద్రునివంటి, ముఖులఁ = మోములుగలస్త్రీలను, వైవఁ = ప్రేయఁగా, ని. 'నక్షత్రేశః క్షపాకరః' యని యమరము. ధళధళ...ను-ధళధళత్ = తళతళమనునట్లుగా, తరళ = మెఱయుచున్న, తాటంకంబును = కమ్మలుగలిగినదియు, ని. 'తాటంకః కర్ణపూరకః' యని యమరము. అంకు...ను-అంకురిత = ఉదయించినటువంటి, స్మితంబును గాఁ = చిఱునవ్వుగలదియు నగు నట్లుగ, తన్ముఖ...ను - తన్ముఖ = విటముఖ పర్యంతమును, ప్రేంఖోళిత = జోగినటువంటి, ని. ఆక్షేపద ర్థభిన్యాప్తా సీమ్న్యర్థే ధాతుయోగజ' యనియు, 'ప్రేంఖోళిత స్తరళిత స్తులితాందోళితావపి' యనియు నమరము. స్ఫీత = విశాలమైన, సాకూత = అభిప్రాయ సహితమైన, విభ్రమ = విలాసముగలిగిన, ఆకేకర = ఇంచుకంత యోరగా చూచుచున్నట్టి, అపాంగ = కడకన్నులయొక్క, ని. 'విశాలం విపులం స్ఫీత' మనియు, అపాంగౌ నేత్రయో రంతౌ' అనియు విశ్వామరములు. విలోకనంబును = చూపులు గలుగునట్లుగా, ఆచలిత...గాఁ - ఆచలిత = ఇంచుకంత చలింపఁబడిన, ధమ్మిల్లం

బుసుగాన్ = కొప్పుగలుగునట్లుగా, 'ధమ్మిల్లస్సంయతాః కచాః' యని యమరము. మొగంబులు తిగిచికొని = ముఖంబులఁ ద్రిప్పికొని, సమ్మర్దంబునన్ = సంఘమందు, చను...నన్-చను = వెళ్లుచున్న, మార్దంగికుల = మద్దెలవాయించువారలయొక్క, మూపుల = భుజములయొక్క, మఱుఁగులన్ = చాటున, డాఁగి = అదృశ్యమై, అన్యాగవాసంబు = ఆవేశ్యాసమూహము, నాగరక...నన్ - నాగరక = ఆపట్టణపు జనుల యొక్క, విలోకనంబునన్ = చూచుటచేతను, చెలరేఁగి = బిట్టురేఁగి, మొగంబులు = ముఖములు, బిగించి = ముడిచికొని, వేదురెత్తినగతిన్ = వెఱ్ఱెత్తినరీతిని, 'వెడగు వేదుఱు వెఱ్ఱివేరడి పీరడి వెంగలి వెంబరవి త్తనంగ'నని యాంధ్రనామ సంగ్రహము. అరిదియై త్తన్ = ఆశ్చర్యమగునట్లు, (అరులెత్తన్-అనుపాఠమందు దరువుబట్టుటకని యర్థము) ప్రతివదనంబును = అడుగడుగునకును, మర్దల...కున్ - మర్దలముఖ = మృదంగ ముఖముయొక్క, అవమర్దనకున్ = వాయించుటకు, ప్రంగుటయు = చంగఁగా, బయలువడి = బయటఁబడి, (మద్దెలకాండ్ర చాటున దాఁగియున్న వేశ్య లనుట) చేయునదిలేక = ఒనరించునట్టి యుపాయాంతరము దోఁచక, ఆకడకుమగిడి = నారం గాదుల వేయుచున్న విటులవైపునఁదిరిగి, తుఱుముదిద్దుచున్ = కొప్పుసవరించుచు, తద్వ్యా...లు ఐ - తత్ = ఆకంచుకాదులయొక్క, వారణ=నివారించుటయందు, అభినయవత్ = వ్యంజకముతోఁగూడిన, పరాచీన = పరాఙ్ముఖములైన, 'పరాఙ్ముఖః పరాచీన' యని యమరము. కరాబ్జలై = హస్తారవిందములుగలవారై, సుడినడుసెడన్ = తిరుగుచున్న సమయమందు, పొడము...లు-పొడము = కనుపడుచున్నటువంటి, కర్ణ కుసుమావతంస-కర్ణ=చెవులయందున్న, కుసుమ = పుష్పరూపమైన, అవతంస = భూషణముయొక్కయు, కపోల = గండస్థలములనియెడు, ఖురళీ = సాముచేయుప్రదేశముల యందు, కించిచ్చలన = ఇంచుకంతకంపనముతో, ఉపలక్ష్య = కూడుకొన్నటువంటి, వైలక్ష్య=ఆశ్చర్యముతోఁ గూడినటువంటి, 'విలక్షోవిస్మయాన్వితః' యని యమరము. హాసకుందంబులు = మల్లెమొగ్గలవంటి నగవులు, సాంద్ర...లన్-సాంద్రతరమైన = దట్టమైన, 'ఘనంనిరన్తరం సాంద్ర' మని యమరము. చంద్రికా = వెన్నెలయొక్క, కందంబులన్ = మూలప్రదేశములను, దీటుకొలుపన్ = సామ్యమునుబొందింపఁగా, ముఖము లనేకములుగాన బహువచనప్రయోగము. చాటూక్తి...లు-చాటూక్తి = చతురవాక్యములచేతను, వాచాట = గర్హ్యావాక్యములు గలిగినవారు, ని. 'వాచాటో బహుగర్హ్యవాక్' కని యమరము. అగుజరఠవనితలు = అయినవృద్ధాంగనలు, 'జరఠా జీర్ణ కర్కశా' అని నానార్థరత్నమాల. తమకున్=ఆ విటులకు, మ్రొక్కన్ = నమస్కరింపఁగా, తారు = తాము, మ్రొక్కక = అంజలిగావింపక, ఒక్కించుక = ఇంచు

కంత, ఓరమోమిడి = మాఱుమొగముచేసి, వారి...లన్-వారి = ఆవృద్ధస్త్రీలయొక్క, ఇరుపక్కియలన్=ఒదిఁగి, ఇరు=రెండైన, పక్కియలన్ = పార్శ్వములయందు, ఒదిఁగి= ఒత్తిగిలి, తొంటియంటుఁదలంచి = పూర్వపు సంబంధమును స్మరించి, తలవాంచినన్ = శిరస్సువంపఁగా, వంచనన్ = ఆరాజకుమారులు ఆస్త్రీలు నమస్కరింపని కపటమును, కటాక్షించి = చూచి, ఎక్కసక్కెంబునకున్ = పరిహాసమునకు, తమచేతన్ = ఆ స్త్రీల చేత, మ్రొక్కించుకొనువేడ్కన్ = వందనము చేయించుకొనవలయు నను కుతూహలము చేతను, అక్కడన్ = ఆస్థలమందు, పుడమిఱేఁడులేమిన్ = రాజులేనందువలన, సామాన్య మానవులన్ = సాధారణ జనులను, కైకొనక = లక్ష్యపెట్టక, సుమాళంబు = మనోభావము, వేద్యంబుగాన్ = తెలియుటకొఱకు, విద్యావయోవృద్ధులగు - విద్యా = గానాదులచేతను, వయసి = వయస్సుచేతను, వృద్ధులగు = పెద్దలగు, మీరు మ్రొక్కన్=మీరు నమస్కరింపఁగా, తాము = తాము, (వయస్త్రీ లనుట.) మ్రొక్కమియెట్లు = నమస్కరింపక పోవుటెట్లు, మ్రొక్కింపుఁడనుటయు = మీరు నమస్కరింపఁ జేయుఁడనుటయు, గ్రక్కునన్ = శీఘ్రముగ, పొడము...లన్ - పొడము = పుట్టుచున్న, మొక్కనగవులన్ = హాసాంకురములచేత, మోమువమ్ములకున్ = ముఖపద్మములకు, వేఱొక్క వింతతెలివియొక్కన్ = మఱియొక యాశ్చర్యపుఁదేట గనుపట్టఁగా, మ్రొక్కక=నమస్కరింపక, అక్కడన్ = ఆ స్థలమునందు, కెడగూడి = జతగూడి, నడచు = చనుచున్న, తోడిచేడియలకున్ = సహవాసపుస్త్రీలకు, అద్దొరలకున్ = ఆ రాజకుమారులు. తమకును = వారాంగనలకు, తద్దయుంబొందుగలదను - తద్దయున్ = ఎక్కువగా, పొందుగలదను = అనుకూల్యము గలదను, పెద్దఱికంబు = గొప్పతనము, ఎఱుకపఱుపన్ = బయలుపఱుచుటకొఱకు, కెమ్మోవులు = ఎఱ్ఱనియధరోష్ఠములు. మలంచి = మడిచి, (పెదవులు విఱిచియనుట) లోలోనన్=లోలోపల, ఒయ్యనొయ్యనన్ = మిగుల శీఘ్రముగను, చుక్కనన్ = రిక్కవేయఁగా, (అనఁగా నాశ్చర్యకరమైన ధ్వని విశేషము చేయఁగా ననుట (అక్కలెఱింగి=ఆజాడదెలిసి, దక్కెసొమ్మని = ధనము దొఱకెనని, తమ్మున్ = ఆస్త్రీలను, అమ్మసల్లు = ఆవృద్ధవేశ్యలు, ముందఱికి నూకి = అగ్రభాగమునకుఁ ద్రోచి, అక్కక్క = ఓయక్కక్క, (ఆదరముచేత ద్విరుక్తి.) మనపాలివేలుపు = మన పాలిటిదైవము, మ్రొక్కవే=వందనముసేయుము, అని బుజ్జగించియున్ = మంచిమాటలాడియును, బొమలగొని = భ్రూసంజ్ఞచేతను, జంకించియున్ = వెఱపించియును, ఎట్టకేలకున్ = కొంతసేపటికి. ఒడంబఱిచినన్ = సమ్మతింపఁజేయఁగా, త్రపా...లై-త్రపా = లజ్జచేతను, తరళ = చంచలములైన, నయనలై = నేత్రములు గలవారై, విరళ...గాన్ - విరళవిరళ = మిక్కిలి ఘొడములైన, అంగుళ =

ప్రేక్షగల, అంజలి బంధంబులు గాక్ = జోడింపఁబడిన చేతులు గలుగునట్లుగా, మ్రొక్కి = వందన మొనరించి, (విరళవిరళాంజలిబంధ మనియును పాఠము గలదు. కక్కసంబునక్ = బహుసంకటముచేతను, అట్లు = ఆలాగున, మ్రొక్కించి = నమస్కారము చేయించి, హెచ్చి = అతిశయించి, అచ్చయ్యాట మెడపడక యుండక్=అసల్లాప మెడము గాకుండఁగా, జిగురుగండెలువోలెక్ = జిగురుగండెల లాగున, (జిగురుగండె లనఁగాఁ బక్షులఁబట్టుటకొఱకు నశ్వత్థ క్షీరాదుల చేఁ బూయఁబడి వీసెలకుఁ బూయఁబడి యుండు పక్షిగ్రహణ యంత్ర విశేషములు) అల్లుకొని = చుట్టికొని, గొల్లనఁగ=గొల్లునఁహసించుచున్న, అల్లరింగనలక్ = అపహ్రస్థవేశ్యలను, కల్లకోపంబునక్ = అబద్ధపుఁ గోపముచేత, కొట్టి = ప్రహరించి, కసురుఁజూపు = కోపదృష్టి, అబ్బాపసంఘంబుపైక్ = ఆ రాజకుమార సంఘముమీఁద, నిగుడక్ = ప్రసరించునట్లున, మగుడక్ = మరలను, మఱుపడు = అదృశ్యలగునట్టి, కొమిరె...నలు-కొమిరె = పిన్నవయస్సుగల, హరిణలోచనల = లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలయొక్క, చలిత...రంబు-చలిత = కదలింపఁబడిన, కంకణ = కరభూషణములయొక్క, సంకుల = సంకీర్ణములైన, ని. 'సంకీర్ణం సంకులాకీర్ణే' యని యమరము. క్రేంకారంబులు = క్రేంకారధ్వనులు, ఆననా...లక్-ఆననా మోద-ఆనన = ముఖముయొక్క, ఆమోద = పరిమళమునకు, ని. 'ఆమోదస్సోఽతి నిర్హారీ' యని యమరము. మేదుర = పుష్టమైన, అళి= తుమ్మెదలయొక్క, ఝుంకారంబులక్ = ఝుంకారధ్వనులను, బింకంబు లడంపక్ = గర్వముల నణఁపఁగా, తిరస్కరింపఁగా ననుట, చెవులసంకులు - చెవుల = కర్ణ ప్రదేశములయందలి, సంకులు = సంకుపూసలును, లోవంకభుజంబులుక్ - లోవంక = లోపలికి వంగిన, భుజంబులుక్ = బాహువులును, కొంకిసిగలు = వంకరకొళబంధంబులు, కావిమవ్వట్లుక్ = చాయబట్టలను, ఒప్పక్ = అమరియుండఁగా, ఇమ్ము = స్వస్థలము, చెప్పరంబై = తప్పిపోయి, ముప్పునక్ = వార్ధక్యమందు, అప్పురంబు = ఆ శ్రీవిల్లిపుత్తూరు, చేరి=ప్రవేశించి, రసిక...నక్-రసికజన = సజ్జనులయొక్క, బాంధవంబునక్ = సహవాసముచేత, బంధువియోగము మఱచి - బంధువియోగంబుక్ = బాంధవుల నెడబాయుటకు, మఱచి = విస్మృతిజెంది, గంధకలనా...లక్ - గంధకలనా = బుక్కాచేయుట, కుసుమస్రక్ = పుష్పమాలికలయొక్క, గ్రసనాదులక్ = కూర్చుట మొదలగువానియందు, ఆంధ్యంబులేక = మాంద్యములేక, అలరు = ఒప్పుచున్నట్టి, ఆంధ్రదేశీయులగు = తెనుఁగు దేశమందుండివచ్చిన, గంధకారులు = బుక్కావాండ్రు, పాటి...తోక్ - పాటిపాటి = కొంచెకొంచెపు, పద్యంపు = పద్యములతోఁ గూడిన, మ్రొక్కులతోక్ = దండములతోడను, వెట్టివెట్టికైవారంబులక్ = చేతులు సాచి

చేయు పిచ్చిపిచ్చిస్తోత్రములతో, గోరు త త్తడులపై వచ్చు = ఏనుంగులమీఁదను గుఱ్ఱములమీఁదను వచ్చెడి, రాచరిపైన్ = రాజసంఘంబులమీఁదను, ఆఁడు వారిపైన్ = నాట్యమాడు స్త్రీలమీఁదను, ఆళువారిపై = పెరియాళ్వారి (విష్ణుచిత్తుని) పైని, చల్లఁగాఁజల్లన్ = మిగుల నవకీర్ణము చేయఁగా, పెల్లొగసి = విట్టెగసి, సృష్టియెల్లను = సర్వజగమంతయును, ముష్టికరించు=పిడికిటిపట్టిన వ్యాపించిన, అస్పష్టభేదయగు భేద మేర్పడకయున్న, పరిమళసముష్టింబెట్టు = వాసనలనీయుచున్న, పిష్టాతకంబుఁ = బుక్కా, ని. 'పిష్టాతః పటవాసకః' యని యమరము. నభోమండలికిన్ = అంతరిక్ష ప్రదేశమునకు, చండాతకంబై=అర్ధోరుకమై, చండకరకిరణమ్ములన్ = సూర్యకిరణములను, మాటుపఱుపన్ = ఆచ్ఛాదింపఁగా, పన్నీరు నించిన=హిమాంబువులచే నిండించిన అన్నీరు తిత్తులొత్తన్=(తన్నీరుతిత్తు లనియును పాఠము కలదు.) ఆపన్నీటి చర్మభస్త్రికలను బిగియఁబట్టఁగా, వియత్తలంబునం బారి = అంతరిక్షమున కెగసి, కైవ్రాలు = క్రిందుగా వంగుచున్న, ధారలన్=ఉదకధారలచేతను, వాద్యంబులు = మృదంగాదులు, తడిసినన్ = శ్లిన్నములుగాఁగా, విద్యోపజీవులు=ఆవాద్య విద్యలచేత జీవనము చేయువారు, పుష్కరంబులుఁగ్రాఁపన్ - పుష్కరంబులు = వాద్యభాండముఖంబులు, క్రాఁపన్ = కాఁచుటకొఱకు, ని. 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖే జలే' అని యమరము. అగ్గి రోయుచుండన్ = నిప్పును వెదకుచుండఁగా, ఆమ్మొత్తము = ఆసమూహము, అత్తఱిన్ = అసమయమందు, నృత్తంబుఁజూడనిలిచి = నాట్యమాడుటకు వీక్షింపనిలిచి, మెత్తమెత్తనన్ = మెల్లమెల్లన, నడచుచుండు = అరుగుచున్నట్టి, మిండతండంబును = విటసమూహమును, తారున్ = తామును, అప్పింపు...లు-అప్పిండు = సమూహమంపలి, పుండరీకాస్యలు=స్త్రీలు, అవకాశంబున్ = సమయమును, కాంచి = చూచి, కాశ... లు-కాశకుసుమ = తెల్లుపువ్వులయొక్క, ప్రతిఫలన = ప్రతిబింబించుటచేతను, పాండురంబులు=తెల్లనై, పద్యా...కము-పద్యా = మార్గములయందు, ని. 'హరిణః పాండురః పాండుః సరణిః పద్ధతిః పద్యా' యని యమరము. అతిహృద్య = మిగుల మనోహరములైన, పార్శ్వద్వయ = ఇరుప్రక్కలయందును, ఉద్యానపాదపంబులకున్ = ఆక్రీడావనమందున్న వృక్షములకు, పాఱు...కున్ డిగ్గి - పాఱు = ప్రవహించుచున్న చెంగలువ కాలువలకుడిగ్గి - చెంగలువ = ఎఱ్ఱకలువలుగల, కాలువలకున్ = సారణులకు, డిగ్గి = దిగి, కాసరీదధిమండ మాసరంబులుగాఁ బిసికి - కాసరీ = గేదెలయొక్క, దధి = పెరుఁగుచేతను, మండ = మీఁగడచేతను, ని. 'మండం దధిభవం మస్తు' అని యమరము. మాసరంబులుగాన్ = దట్టము గాను, పిసికి=కలిపి, ఊరంబెట్టిన సారంగశృంగిబేరభంగంబులతోన్ కట్టిన - ఊరంబెట్టిన = లవణముతోఁ జేర్చి సావఁ

బెట్టిన, నారంగ = నారింజకాయల (నారదబ్బ కాయల) యొక్కయు, శృఙ్గిబేర = అల్లముయొక్కయు, భంగంబులతోడన్ = తునకలతోడను, ని. 'ఆర్ద్రికం శృంగిబేరం స్యా' త్తని యమరము. కట్టిన=బంధించిన, కలమాన్నపుష్టద్ధి=రాజనపుఁ బియ్యపుటన్నము, 'మోస్తువిభక్త్యేకవచనకేపుంపూ' అని శబ్దానుశాసనుఁడు సూత్రించినాఁడు గనుక కలమాన్న మనుచోట మకారమునకుఁ బుమాదేశము వచ్చెను. పోకపొత్తులన్=క్రముకపుపట్టలయందు, పొత్తులన్ = ఏకపాత్రలయందు, కుడువన్=భోజనము సేయుటకు, కూర్చుండన్=ఆసీనులుగాఁగా, వీక్షించి=చూచి, కుక్షింభరత్వంబునన్ = ఉదరపోషణత్వంబుచేతను, క్షుత్క్షాములై = ఆఁకలిచేతఁగృశించినవారై, తిరిగితిరిగి = సంచరించి సంచరించి, వేసరి = విసిగి, ఓసరిలిన = అలసినట్టి, దాసరిగుంపు = దాసళ్ళసమూహము, చారిపాలన్ = చద్దిగుడుచుపొటులయొద్ద, గోపాలభిక్ష = అన్నభిక్ష, (దాసళ్లు భిక్షకుఁబోవునపుడు గోపాలభిక్షయని యడుగుట ప్రసిద్ధముగాన నిచ్చట గోపాలభిక్షయని ప్రయోగించినాఁడు. మాధుకర మన్నట్లు) భిక్షించి=యాచించి, భక్షింపన్=భోజనము చేయుటకు, తీరక్షోణులన్ = ఏటిదరినేలలయందు, నిలిపిన = ఉనిచిన, తోరంపు = లావగు, దివెదారికోలల = దిపపు కంబములయొక్క, (తిరువిళక్కోలలను పాఠమున నిదె యర్థము.) రంధ్రగోళంబులన్=సుషిరప్రదేశములనుండి, ఉత్కీలంబులై = ఉద్గతజ్వాలలై, మండు = వెలుఁగుచున్న, ధగధగని = ధగధగమనియెడు, జగజ్జ్యోతి దీపజాలంబులన్-జగజ్జ్యోతి (యనఁగాఁ బ్రమిదెలు మొదలగువానియందు వత్తివేయక మధ్యప్రదేశమందుఁ జమురుచేతఁ దడపఁబడిన గుడ్డలుగాఁనుగాఁ గలవాని నించి వెలుఁగించు దీపము), దీపజాలంబులన్ = దీపసమూహములచేతను, 'జాలంగవాక్ష ఆనాయే క్షారకే కపటే గణే' యని విశ్వము. మధ్య...లన్ - మధ్య = నూర్గముయొక్క నడుమను వేసిన ధూపకుండికాంగారంబులన్-ధూప = ఉపచారార్థము వేసిన సాంబ్రాణి పొగయొక్క, కుణ్డికా = పాత్రలయందున్న, ని. 'పుంసిచకుండః పీఠరేతోయాధారేచవహ్నిగర్తేచ, కుండోజారాజ్జాతస్సభర్తృకాయాంకమండలౌకుండీ' యని నానార్థరత్నమాల. అంగారంబులన్ = అగ్నులయందు, ని. 'అంగారోఽలాతముల్ముక' మ్మని యమరుఁడు. నీరారంగ్రాఁచి, నీరారన్ = తడియాఱునట్లుగ, గ్రాఁచి = తప్తముచేసి, నాదుఁబరికింపన్ = ధ్వనిచూచుటకు, వాయించు = ధ్వనిజేయునట్టి, ధిమిధిమిధ్వానంబులకున్ = ధిమిధిమియను ధ్వనులకు, బెదరి=జడిసి, ఈవలియుపవన శుకంబులు - ఈవలి = ఇవతలి వైపుననున్న, ఉపవన = ప్రాంతోద్యానవనమందలి, శుకంబులు=చిలుకలు, ఆవలికిన్ = ఆవలివైపునకును, ఆవలి యుపవనశుకంబులు=ఆవలి తోఁటయందున్న చిలుకలు, ఈవలికిన్ = ఇవతలికిని, దట్టంబుగాన్ = ఎడతెగకుండ, కట్టనితోరణంబులై = ఏర్పఱుపని మకర

తోరణంబులై, పఱవన్ = వ్యాపింపఁగా, తలలు విసరుటయున్ = శిరఃకంపనములు చేయుటయును, (అభినయించునపుడు తలలు కదలుచుండు ననుట.) నోరు దెఱచుటయున్ = పాడుటకు పదనములు విప్పుటయు, కేలుపఱచుటయున్ = చప్పట్లు గొట్టుటయును, తక్కన్ = తప్ప, మిక్కుటంబగు = అతిశయమైన, అకోలాహలంబునన్ = అకలకల ధ్వనియందు, 'కోలాహలః కలకలః' యని యమరము. ఏపాటియున్ = ఎంతమాత్రమును, పాట విన రాక = పాడుట వినఁబడక యుండఁగా, మూఁక గట్టిన = గుంపులై యున్న, భాగవతజాతంబులే తేరన్ - భాగవత = భగవద్భక్తులయొక్క, జాతంబులు = సంఘంబులు, 'ఉత్పన్నభూఃపయోర్జాతం బృందజాతోఽస్తునద్వయోః' యని యుత్పలమాల. ఏ తేరన్ = వచ్చుచుండఁగా, ఊరూరి సంతసంతకున్ - ఊరూరి = ప్రతిగ్రామముయొక్క, సంతసంతకున్ = ప్రతిసంతకును, (సంత యనఁగా వారమున కొక పర్యాయము సకల వస్తువులం జేర్చికొని యందఱకు విక్రయించుటయుఁ గ్రయమునకుఁ గొనుటయు నిట్టి వ్యాపారమునకు నిర్ణయించుకొన్న ప్రదేశము.) తిరుగన్ = సంచరించుటకు, పెద్దలు = ప్రముఖులు, ఇంటింటన్ = ప్రతిగృహమందును, సంక...కున్ - సంతరించిన = పోషించిన, పిలఁకవాటు = పిల్లలనిచ్చునట్టి, గోడిగలజావడములకున్ = ఆఁడుగుఱ్ఱపు తల్లులకు, పుట్టి = జనియించి, కాలుగట్టివిడువన్ = పొడవైన త్రాటిచేఁ బాదబంధన మొనరించి విడువఁగా, నెత్తంబునన్ = ఊరఁబాటియందు, మెత్తని = మృదువులైన, గఱిక మేసి = దూర్వనుదిని, బోసరించి = గర్వించి, మాపుమాపునన్ = ప్రతి సాయంకాలమందును, మేపు = తినిపించుచున్న, సజ్జకపణంపు మేపునన్ = గంటెకోటి మేతచేతను, పిడుక = కరీషమను, గొరపంబు = గుఱ్ఱమును దోమునట్టి సాధనముచేత, తోమకంబునన్ = శరీరశోధనముచేత, పుటపుటనై = నున్ననున్ననై, కరియకంబడి ప్రాతఁగనియైనన్ = నల్లకంబడి గుడ్డచూచినను, నీడఁగనియైనన్ = మనుష్యాదులనీడను వీక్షించినను, బెదరు = జడుపుఁగొనుచున్న - కొదమతట్టుపగుంపు, కొదమ = లేఁతలైన, తట్టువ = గుఱ్ఱముల యొక్క, గుంపు = సమూహము, కాలికోలందికి = పాదముల పర్యంతము, వ్రేలు = లంబితములై యున్న, లాలుకుంచెలు = ఎఱ్ఱని కుచ్చులు, లాలుకుంచె లనఁగా గంగెద్దుల వాండ్రు చేతపట్టుకొనిపచ్చు సౌరంపుకుచ్చు లని కొందఱు, కీలించిన = కట్టిన, గవ్వదండలన్ = సరాటికాసరములచేతను, కంటలన్ = గంటలచేత, అలంకరించి = ప్రసాధనముఁ జేసి, మొలుగుమడ్డిం దోచి = మోదుగుచెక్కవేసి కాఁచిననీళ్లతోఁ దడిసి, మూరకొక్కండును = హస్తప్రమాణమువ కొకటియును, జేనకొక్కండుగాన్ = అరమూర కొక్కటియును గలుగునట్లుగ, కుట్టిన = కుట్టబడిన, డొల్లుటుల్లారులుల్లన్ - డొల్లుటుల్లారులు = వ్రేలుజాలరు, ఉల్లసిల్లన్ = వెలుఁగునట్లుగా, (మోదుగుచెక్క రసముచేతను

రంగువేయఁగా, నలుపుపర్ణము పచ్చపుగాన నెఱ్ఱని పచ్చల నడుమను వీని నొక్కొటిని జేర్చి కట్టఁబడియున్న జాలరుల ననుట.) పల్లించిన = ఆయితపఱిచిన, పల్లంబుల పైన్ = పల్యాణముల మీఁద, చిల్లతైలంబును = ఇఱుగవగరుచు, వాసనఁగోలుపులన్ = పరిమళయుక్తమైన శలాకల చేతను, పూసిన = లేపనము చేయఁబడిన, మణుంగు = చలువచేయఁబడి నటువంటి, చంద్రికల చేలలె = తెల్లబట్టలె, రవణాంబులుగాన్ = భూషణములుగాను, ఎదురుగాన్ = అభిముఖముగాను, వేడుకం జూడవచ్చిన= సంతోషముచేత వీక్షించుటకై వచ్చిన, అవ్వీటి... లె - అవ్వీటి = ఆ శ్రీవిల్లి పుత్తూరియందున్న, మేటి = ప్రబలులైన, సాలె = వస్త్రకారులును, అగసాలె = స్వర్ణకారులును, పటుసాలె = పట్టునూలువాండ్రు, వాసె = హీనజాతికోమట్లును, వైజాతి = పలుపవాండ్రును, సాతులు = గోనెలు నేయువాండ్రును, (అనఁగాఁ బెగికెవాండ్ర నుట.) ఎత్తెలె = చాఁపలు నేయువాండ్రును, వీరలయొక్క, కోమిరలు = స్త్రీలు, (కోమరులు అను పాఠమున చిన్నవాండ్రనియర్థము.) తుములమై = సంకులమై, పచ్చు...లన్ - పచ్చు = ఏతెంచుచున్న, తచ్చమూసామజంబులన్ జూచి = ఆసేనయందలి యేనుంగుల వీక్షించి, ని. 'పృతనానీకినీచమూః' యని 'సామజః పేచకీ పూర్వ శ్రుతిశ్వేదన్తా ఇత్యపి' యనియు నమరము, ఏచిన=అధికమైన, వెఱన్ = భయముచేతను, తమ = తమయొక్క, ఎక్కిరింతలెత్తికొని = అశ్వములు దమపైనున్నవారి నెత్తుకొని, వాఁగెలిరుగేలంగుదియం బట్టినన్ - వాఁగెలు=కళ్లెములను, ఇరుగేలన్ = రెండు చేతుల చేతను, కుదియంబట్టినన్ = బిగియఁబట్టినను, నిలువక = ఆ స్థలమందుండకయె, అయ్యుత్సవంబీక్షింపవచ్చిన = ఆతిరునాళ్లఁజూడ నేతెంచినట్టి, ప్రజల్లన్ = మనుష్యులను, త్రొక్కుచున్, పోవన్ = పారిపోవఁగనె, తన్మధ్యవృద్ధవధ్వాతురాదులుదిట్టన్ - తన్మధ్య = ఆ త్రొక్కఁబడుచున్న వారి నడుమనున్న, వృద్ధ = ముదుసళ్లును, వధూ = స్త్రీలును, ఆతుర = రోగపీడితులును, ఆదులు = లోనగువారు, తిట్టన్ = శపింపఁగా, ఇట్టట్టనలేక=మాఱుమాటాడలేక, ప్రాణంబులుపిడికిటంబట్టికొని = అరచేతిలో నుసురులం బెట్టికొని, పోవుచున్ = వెళ్లుచును, నవీనసవిధకేదారంబులన్ - నవీన=నూతనములైన, సవిధ = సమీపమందున్న, కేదారంబులన్ = దమ్ముచేసిన పరిమళ్లలోను, ని. 'కేదారకం స్యాత్కైదార్యం క్షైత్రం కైదారకం గణే' యని యమరము. త్రెళ్లి = తుళ్లి, చెట్టలుదిగంబడి = చంకలబంటిఁ గ్రుంగిపోయి, (చప్పటలనియును పాఠము గలదు) వెడలలేకుండన్ = పైకిలేవలేకుండఁగా, తాటు= తాఁకు, దిగన్ = దిగుటకు, ఇమ్ములేక = స్థలముగానక, పిమ్మటఁగొని, ఉంగిటగుడిచి = మనోదుఃఖముఁబొంది, నలుదెసలున్ = నాలుగు దిక్కులను, చూడన్ = వీక్షింపఁగా, చూఁచి=వారిఁజూచి, కేలుచఱచి = చప్పట్లుగొట్టి, కోహోయని = కోహోయను పరిహాస

వ్యంజకమగుధ్వని విశేషముచేసి, గేలిసేయు = పరిహాసముఁ జేయుచున్న (తేరిచూచిహాసో యని గేలిసేయు నగ్నికాకదంబంబులయని యొకపాఠము. నగ్నిక యనఁగా సమర్తాడ నిది) గణికాకదంబంబుల = వేశ్యాసంఘములయొక్క, చప్పటులు = చేతులు తట్టుటలు నిబిడనిష్కుటవిటపిఘటాటంబులన్ - నిబిడ = దట్టమైన, నిష్కుట = ఉపవనముల యొక్క, విటపి = వృక్షములయొక్క, ఘటాటంబులన్ = సమూహములందు, ప్రతిశబ్దంబులు = ప్రతిధ్వనులు, పుట్టింపన్=ఇయ్యఁగా, ఇట్లు = ఇత్తెఱంగున, అనూనవిభవంబు = మహావైభవము, చిగురొత్తన్ = అంకురింపఁగా, అత్తిరుపతి = ఆ శ్రీవిల్లిపుత్తూరు, చొచ్చి= ప్రవేశించి, అచ్చక్రధరు = ఆ శ్రీమహావిష్ణునియొక్క, నగరిన్ = దివ్యమందిరము యొక్క, మోసలన్ = ముఖశాలయందు, నిలుచుటయున్ = ఉండఁగా, ఆ విష్ణుచిత్తుండు=ఆ పెరియాళ్వారు, తద్రథావతరణంబుఁ జేసి=ఆ బ్రహ్మరథమును డిగ్గి, ధరణీధవసమూహస్థానిక వ్యూహంబులు - ధరణీధవ = రాజులయొక్క, సమూహ = సంఘమును, స్థానిక = దేవస్థానాధికారులయొక్క, వ్యూహంబులు = సమూహములును, వెంటరాన్ = వెంబడించి రాఁగా, అవ్వైష్ణవకులు సేవించి = ఆస్వామిని దర్శనము చేసి, తత్ప్రసాదలబ్ధంబగు=ఆ పుండరీకాక్షుని యనుగ్రహమువలనఁ బొందఁబడినదైన, 'ప్రసాదస్తు ప్రసన్నతా' యనియమరము. పరివట్టంబునన్ = తిరుపరివట్టంబుచేత, అలంకృతుండై = భూషితుండై నానాలంకారసహితంబును - నానాలంకార = అనేక విధములగు ప్రసాధనముల తోడ, సహితంబును = కూడికొనినదియును, రత్న = మణులయొక్కయు, కాంచన = బంగారముయొక్కయు, మయంబుననగు = వికారమునైన, ఆత్మీయభవనంబుఁగాంచి = స్వీయగృహమును జూచి, విస్మితుండై = ఆశ్చర్యమునొందినవాఁడై, పుండ...గాన్ - పుండరీకాక్ష=శ్రీమహావిష్ణునియొక్క, మహిమ=ప్రభావముచేతను, అభిలబ్ధ = పొందఁబడిన, వైభవంబుగాన్=ప్రాభవముగాను, తెలిసి=ఎఱింగి, తత్ప్రత్య...లన్ - తత్ప్రత్య = అచ్చటనున్న, ధాత్రీకళత్ర=రాజులయొక్క, వర్గంబులన్=సమూహములను, అనిపి = పంపి, ప్రవేశించి=గృహప్రవేశమొనరించి, తొంటికంటెన్ = మునుపటికంటెను, శతగుణంబుగాన్=నూఱంత లధికముగా, భాగవతపూజాప్రవణుండై - భాగవత=విష్ణుభక్తులయొక్క, పూజా = సపర్యయందు, ప్రవణుండై = ఆసక్తి గలవాఁడై, ఉండెన్ = ఉండెను. అంతన్ = తరువాత.

తా. శ్రీవిల్లిపుత్తూరిలో నుండు దేవస్థానమందలి యధికారులు నృత్తగీత వాద్యములతోడ నా విష్ణుచిత్తు నెదుర్కొని నమస్కరించి యతనిం దాము తెచ్చిన స్వర్ణమయంబైన బ్రహ్మరథమునం దునిచికొనిపోవుతఱి మహావైభవంబులతో నందఱు వెంట నంటిరాఁగా నా విష్ణుచిత్తుఁడు పురము ప్రవేశించి కోవెలముందఱ బ్రహ్మరథంబు డిగ్గి

యచ్యుతుని సేవించి యాదేవుని యనుగ్రహంబును లబ్ధంబైన కాంచననిర్మితంబగు తన గృహము ప్రవేశించి తొల్లింటికంటె నధికంబుగ భాగవతపూజాపరాయణుం డై యుండె నని భావము.

మ. ఉలుపా ల్పట్టినయిండ్ల మజ్జననృపార్హోదారభుక్తిక్రియో
జ్జ్వలులై రే హరికొల్వునన్ వివిధలాస్యస్పర్ధిసుభ్రూభ్రుకుం
సులవాదు ల్సరి దీ(దే)ర్చి పుచ్చి మణివాసోభూషణగ్రామముల్ (న్)
జలజాతాక్షునకున్ సమర్పణము నిష్ఠం జేసి యవ్వేకువన్. 36

టీ. ఉలుపాల్పట్టిన = కానుకలు దెచ్చిన, ఇండ్లన్ = వారి గృహములయందు, మజ్జన = అభ్యంగాదుల చేతను, నృపార్హ = రాజయోగ్యమైన, భుక్తిక్రియా = భోజన వ్యాపారముల చేతను, ఉజ్జ్వలులై = వెలుగుచున్నవారలై, రే = రాత్రియందు, హరి కొల్వునన్ = భగవత్సన్నిధానమందు, వివిధలాస్యస్పర్ధి - వివిధ = పలుదెఱంగులైన, లాస్య=నాట్యములయందు, 'లాస్యంనృత్తంచనర్తన' మ్మని యమరము. స్పర్ధి = వివాద పడుచున్న, సుభ్రూ = స్త్రీలయొక్కయు, భ్రుకుంసుల = పురుషులయొక్కయు, 'భ్రకుంసశ్చ భ్రుకుంసశ్చ భ్రూకుంసశ్చేతి నర్తకః' యని యమరము. వాదులు = వివాదము లను, సరిదీర్చి=సరిపుచ్చి, (సమ్మతిపడఁజేయుట.) పుచ్చి - అంపి, (ఇచ్చి యను పాఠమున వారికి బహుమతులిచ్చి యని యర్థము.) మణివాసోభూషణ గ్రామముల్-మణి=రత్న ములును, వాసః = వస్త్రములును, భూషణ = ఆభరణములును, గ్రామముల్ = పల్లెలును, జలజాతాక్షునకున్ = పుండరీకాక్షునకు, నిష్ఠన్ = భక్తిచేతను, సమర్పణముఁ జేసి=సమ ర్పించి, అవ్వేకువన్ = ఆ తెల్లవాఱుజామున. అరిగిరి యను ననంతరపద్యములోని క్రియతో నన్వయము.

తా. అప్పుడా విష్ణుచిత్తు ననుసరించి వచ్చుచున్న పుడమిఱేండ్రు తమతమఁ గాను కలు దెచ్చి యిచ్చియున్న వారి గృహములయందు నభ్యంగస్నానములును రాజయో గ్యంబు లయిన భోజనకృత్యంబులం దీర్చికొని రాత్రియందు భగవత్కైంకర్యాసక్త చిత్తులై యాదేవమందిరముల కరుగుదెంచి యందనేకవిధ నాట్యములయందు వాదు లిడుచున్న నర్తకీనర్తకుల వాదములు దీర్చి పుత్తెంచి యప్పుండరీకాక్షునకు నతిభక్తితో డం బ్రత్నరత్నభూషణాంబర గ్రామాదుల నొసంగి తెల్లవాఱఁగానే.

తే. ప్రభువు లరిగిరి క్రమ్మఱఁ దమ పాండ్యనగరి
కమ్మునియు నట్లు వైష్ణవాళిభ్యర్చనంబుఁ
దనచిరంతనతులసీకాశదామకరణ
దాస్యమును జేసికొనుచుఁ దత్పరత నుండె. 37

టీ. క్రమ్మఱన్ = తిరిగియు, ప్రభువులు = అధికారులు, పాండ్యనగరికిన్ = మధురకు, అరిగిరి = వెళ్లిరి, అమ్మునియున్=ఆవిష్ణుచిత్తుడును, అట్లు=పూర్వప్రకారము, వైష్ణవాభ్యర్చనంబున్ = భాగవతారాధనమును, తన...ను - తన=తనయొక్క, చిరంతన = బహుకాలమునుండి యొప్పియున్న, తులసికాదామ = తులసిమాలికలయొక్క, కరణ=చేయుట యను, దాస్యమును = కైంకర్యమును, చేసికొనుచున్ = సలుపుకొనుచు, తత్పరతన్=భగవదాసక్తిచేతను, 'తత్పరే ప్రసితాసక్తౌ' అని యమరము. ఉండెన్.

తా. అప్పుడా ప్రభువులు మధురాపురంబునకు మరల నేతెంచిరి. పిమ్మట మునివరుం డైనయావిష్ణుచిత్తుండు మునుపటియట్ల తాను భాగవతారాధనమును, చిరకాలానుష్ఠితం బై యున్న తులసీమాలికాకరణరూపం బగుభగవత్కైంకర్యమును జేసికొనుచు నాదేవునియం దాసక్తి గలవాఁ డై యుండెను.

వ. ఒక్కనాఁడు మధ్యాహ్నసమయమాలికాసమారోపణానంతరంబున మందిరంబునకుఁ బోవుతనిఁ బ్రసాదమందస్మితసుందరవళక్షంబగుకటాక్షంబున వీక్షించి పక్షిపుంగవకేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. 38

టీ. ఒక్కనాఁడు=ఒకదినము, మధ్యా...నన్ - మధ్యాహ్నసమయ = మధ్యాహ్నకాలమందు, ని. 'సమయాః శపథాచార కాలసిద్ధాంతసంవిద' యని యమరము. మాలికాసమారోపణానంతరంబునన్=పుష్పమాల సమర్పణముఁ జేసిన పిదప, మందిరంబునకుం బోవు=తన గృహమునకు వెళ్లుచున్న, అతనిన్ = ఆవిష్ణుచిత్తుని, ప్రసాదమందస్మిత సుందరవళక్షంబగు - ప్రసాద = అనుగ్రహముచేతనైన, మందస్మిత = చిఱునవ్వుచేతను, సుందర = అందముగా, వళక్షంబగు = తెల్లనైన, ని. 'వళక్షో ధవళో ర్జునః' యని యమరము. కటాక్షంబునన్ = అపాంగదర్శనముచేత, వీక్షించి = చూచి, పక్షిపుంగవకేతనుండు = గరుడధ్వజుండు, (భగవంతుఁడనుట.) పుండరీకనికేతనకున్ = లక్ష్మితో, ఇట్లు= వక్ష్యమాణక్రమంబున, అనియెన్ = పలికెను.

తా. ఒక్కనాఁ డావిష్ణుచిత్తుండు మధ్యాహ్నకాలమున నిత్యము తాను పుష్పమాలికను స్వామికి నొసంగురీతిని సమర్పించి తనయింటికి వెళ్లుచుండగా నప్పు డప్పక్షిపుంగవకేతనుండైన విష్ణుదేవుం డతనిం దన కరుణాకటాక్షమునకుఁ బాత్రుంజేసి యాపద్మనికేతన యగులక్ష్మీదేవితో నిట్లని వచించెను.

**యామునాచార్యచరిత్రము**

తే. 'యామునాచార్యుఁ డొక్కఁడు శ నీమహాత్ముఁ
డొక్కఁడును గాదె మన్నతం శ బుద్ధగించి

రస్మదీయకృపాతిశయమున' ననిన
నిందిరాదేవి తనభర్తకు నిట్టు లనియె. 39

టీ. యామునాచార్యుఁ డొక్కఁడు = యామునాచార్యుఁ డొక్కఁడును, ఈ మహాత్ముఁడొక్కఁడును = ఈవిష్ణుచిత్తుఁ డొకఁడును, కాదె = వీరలిరువురే, గదా, మన్మతంబు = శ్రీవైష్ణవసిద్ధాంతమును, ఉద్ధరించిరి = నిర్వహించిరి, అస్మ...నన్ -అస్మదీయ = నాసంబంధియైన, కృపాతిశయమునన్ = దయాధిక్యముచేతను, అనినన్ = ఇట్లనఁగా, ఇందిరాదేవి = లక్ష్మీదేవి, 'ఇందిరా లోకమాతా మా' యని యమరము. తన భర్తకున్ = తనకు భర్తయైన శ్రీమహావిష్ణువునకు, ఇట్టు లనియెన్ = వక్ష్యమాణ క్రమంబున వచించెను.

తా. యామునాచార్యుం డనుఆళవందారును, విష్ణుచిత్తుఁడును, వీరిరువురే దా నాకృపకుం బాత్రులై వైష్ణవసిద్ధాంతం బుద్ధరించి రనఁగా విని యాలక్ష్మీదేవి తనభర్త యైన శ్రీవిష్ణుదేవునితో నిట్లనియె.

క. 'ఇతనికథ యెఱిఁగినది కా
యతఁ డేమి యొనర్చె' ననిన నబ్జాక్షుం డా
శతపత్త్రనిలయ కిట్లను
నతివ కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డాడిన్. 40

టీ. ఇతనికథ=ఈ విష్ణుచిత్తునిచరిత్రము, ఎఱిఁగినదికా = తెలియఁబడినదిగదా, అతఁడు = ఆయామునాచార్యుఁడు, ఏమి యొనర్చెన్ = ఏమి చేసెను, అనినన్ = ఇట్లు మందలింపఁగా, అబ్జాక్షుండు = పుండరీకాక్షుఁడు, ఆశతపత్త్రనిలయకున్ = ఆ యిందిరాదేవికి, ఇట్లనున్ = ఈలాగునఁ బలికెను, అతివ = ఓ లక్ష్మీ, ఆడిన్ = తొల్లిదొల్లను, మత్పదాశ్రితుఁడు, మత్పద = నాచరణములను, ఆశ్రితుఁడు = ఆశ్రయించినవాఁడు, ఒకఁడు = ఒక్కఁడు, కలండు = ఉండెను.

తా. ఈ విష్ణుచిత్తుని చరిత్రం బెల్లఁ దెలియంబడియున్నది గాని యయ్యామునాచార్యుం డేమి యొనరించెనో తెలియఁబడదు గాన వివరించి తెలుపు మనవుఁడు దప్పు డప్పుండరీకాక్షుం డాయబ్జాలయతో నోయింతీ యింతకుమున్ను మదీయచరణారవింద మరంద పాన ప్రముదిత హృదయుండై యొక్కరుం డుండె నని యానతిచ్చెను.

ఆ. అతఁడు చిఱుతనాఁడె యాచార్యకులమున
[1]వేదముఖ్యవిద్య లభ్యసించి

---

1. వేదశాస్త్రముఖ్యవిద్య లభ్య.

సించు చుండ నపుడు ♦ చెలువ యిప్పటిపాండ్య
నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు. 41

టీ. అతఁడు = ఆ యామునాచార్యుఁడు, చిఱుతనాఁడె = పిన్నవయస్సుననే, ఆచార్యకులమునన్ = గురుని గృహమునందు, ని. 'సఘాపాసః కులం క్షితిః' యని యమర శేషము. వేదశాస్త్ర-వేద=శ్రుతులు, శాస్త్ర = షట్ఛాస్త్రములు, విద్యలన్=కళలను, అభ్య సించుచుండన్=నేర్చుకొనుచుండఁగా, (అనఁగాఁ జదువులు చదువఁగా ననుట.) చెలువ = ఓలక్ష్మీదేవీ, అపుడు = ఆ కాలమందు, ఇప్పటి పాండ్యనృపతి పూర్వవంశ్యుఁడే = ఈపాండ్యరాజువంశమునఁ బూర్వము జనించినవాఁడే, ఒకండు = ఒకరాజు.

తా. యామునాచార్యుఁడు బాల్యమందె గురుకులవాస మొనరించుచు వేద శాస్త్రాది నిఖిలవిద్యలు గఱచుచుండు నవసరంబున నిప్పటి పాండ్యరాజుయొక్క వంశజుఁడగు పూర్వపు రాజులలో నొక్కరుఁ డుండెను. ఇక్కడ యామునాచా ర్యునికంటె విష్ణుచిత్తుఁడు పూర్వుఁడైనను యామునాచార్యుఁడు పూర్వుఁడని భగ వంతుఁడు చెప్పుటవలన లోకసంరక్షణార్థము భగవదవతారము లెట్లు పలుమాఱు కలుగునో అట్లే భాగవతావతారము లని యెఱుఁగునది.

తే. వెఱ్ఱిశైవంబు ముదిరి మద్విసుతి వినఁడు,
నతి యొనర్పఁడు మామక ♦ ప్రతిమలకును,
హరుఁడె పరతత్త్వ మను, మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నట్ల. 42

టీ. వెఱ్ఱిశైవంబు=చిత్తభ్రమరూపమైన శివభక్తి, ముదిరి = అతిశయించి, మద్వి నుతి వినఁడు = నాస్తోత్రముల నాలకింపఁడు (అనఁగాఁ జెవులఁ బెట్టఁ డనుట.) మామకప్రతి మలకును=నా సంబంధు లయినవిగ్రహములకును, నతి యొనర్పఁడు = నమస్కరింపఁడు, హరుఁడె = శివుఁడె, పరతత్త్వ మనున్ = పరబ్రహ్మ మనును, మదీయాలయములన్ = విష్ణుమందిరములయందలి, ఉత్సవములకున్ = తిరునాళ్లకును, ఉలుకున్ = అదరి పడును, నెయ్యురును=అతనిస్నేహితులును, అట్ల=ఆరాజువలెనే, (ఉలుకుదు రనుట.)

తా. ఆ రాజునకు వెఱ్ఱిశైవము ముదిరి విష్ణుస్తవములు చెవియందుఁ బెట్టక విష్ణు విగ్రహములకు నమస్కరింపక విష్ణుమందిరములయందు జరిగింపంబడు నుత్సవాదుల కసహ్యపడుచు శివుఁడే పరబ్రహ్మ మని తాను తనస్నేహితులతోఁగూడ నివ్విధంబుగా నుండెను.

సీ. అశ్రాంత జంగమార్చా ♦ శ్రద్ధ (సక్తి) వర్తిలు
వేదవిద్ద్విజపూజ ♦ వీటఁ [1]గలిపి;

---

1. గలుపు.

భౌమవారపు వీరభద్ర పళ్లెర మిడు
గృహదైవతంబు లిట్టింక లింక;
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు శం
కరదాస మయ్య భక్తప్రతతికి
నాద్యంబు లైనదేవాలయంబులు వ్రాల
నవని నిరాశ మఠాళి నిలుపు;

తే. జందె ముత్తరశైవంబుఁ జెంది త్రెంచుఁ
బతితు లారాధ్యదేవళ్ల కప్రాప్యు లనుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు
వెండి యే జంగ మెత్తినఁ వెఱఁగుపడును. 43

టీ. వేదవిద్ద్విజపూజన్ - వేదవిత్ = వేదార్థ మెఱింగిన, ద్విజ = బ్రాహ్మణుల యొక్క, పూజన్ = సపర్యను, వీటిఁగలిపి = వ్యర్థమగునట్లు చేసి, అశ్రాంతజంగమార్చాశ్రద్ధన్ - అశ్రాంత = ఎడతెగని, జంగమార్చా = జంగములపూజయందు, శ్రద్ధన్ = ఆసక్తిచేత, (అత్యంతజగమార్చా శ్రద్ధ ననియును పాఠము కలదు.) వర్తిలున్ = ప్రవర్తించును, భౌమ......ము-భౌమవారపు = అంగారకవారసంబంధియైన, వీరభద్రపళ్లెరము = వీరభద్రపళ్లెర మనుగణార్చనను, ఇడున్ = ఒనర్చును, గృహదైవతంబులు = ఇలువేల్పులు, ఇట్టింకలింకన్ = మిక్కిలి యింకిపోఁగా, (బెదిరి ముడిఁగియుండఁగా నని కొందఱు, ఆపక్షమున నిట్టింక లనఁగా జింకలు భయమునొంది దూరముగ వెళ్లుటకు యత్నించుసమయమున బెదరి ముడిఁగియుండు నవస్థావిశేషము.) షణ్ణవతిశ్రాద్ధచయము = తొంబదియాఱుతిథులు. శ్లో. 'అమాయుగమనుక్రాంతి ధృతిపాతమహాలయాః, తిస్రోష్టకాశ్చ విజ్ఞేయా షణ్ణవత్యః ప్రకీర్తితాః.' ఆరన్ = నశింపఁగా, శంకరదాసమయ్య = శంకరదాసమయ్య లని పేర్కొనంబడు, భక్తప్రతతికిన్ = శివభక్తుల సమూహములకు, పెట్టున్ = ఇడును, ఆద్యంబులైన = పురాతనములగు, దేవాలయంబులు = కోవెలలు, వ్రాలన్ = పడిపోఁగా, అవనిన్ = భూమియందు, నిరా...ళి-నిరాశ = జంగములకు, మఠాళి = సన్న్యాసులు మొదలగువారుండు గృహసమూహములు, నిలుపున్ = కట్టించును. (జంగమపీఠస్థులకు స్థిరంతులనియును, మఱియు వారలకే చరంతులనియు, లింగధారులయొక్క గురువులకు నయ్యలనియును వారిలోఁ వ్యవహారము గనుక స్థిరాళిమఠాళి యనుపాఠమున స్థిరంతులమఠముల నని యర్థము.) జందెము = యజ్ఞోపవీతమును, ఉత్తరశైవంబున్ = పిమ్మటవచ్చిన శైవంబును, చెంది = అంగీకరించి, త్రెంచున్ =

త్రెంచివైచుచు, పతితులు = వేదబాహ్యులైన, ఆరాధ్యదేవళ్లే = ఆరాధ్యదైవతములై (అనఁగా లింగధారులనుట.), ప్రాప్యులగుచున్ = పొందఁదగిన వారగుచును, ఉపనిషత్తులు = కాలాగ్నిరుద్రాద్యుపనిషత్తులను, వారిచేన్ = ఆ యారాధ్యులచేతను, ఉబ్బి = సంతోషించి, వినుచున్ = ఆలకించి వినుచును, వెండి = మఱియును, ఏ జంగము = ఏ జంగమదేవరైనను, ఎత్తినన్ = ప్రశంసచేసినను, వెఱఁగుపడున్ = ఆశ్చర్యపడును.

తా. అనఁగా నప్పాండ్యరాజు వైదికంబులగు కర్మముల మాని జంగాల సేవించుచు వారు చెప్పు శైవశాస్త్రములనే యాదరించుచుండె నని ముఖ్యతాత్పర్యము.

క. శివలింగముఁ దాల్చినజన
[1]నివహము లేమైనఁ జేయ నిది పాపము దా
నవుఁ గా దనఁ; డాసమయము
నవు నను విప్రులక యగ్రహారము లిచ్చున్. 44

టీ. శివలింగముఁ దాల్చిన = శివలింగముఁ గట్టికొనిన, జనవివహములు=నరసమూహములు, ఏమైనఁజేయన్ = ఏపని చేసినను, తాన్ = తాను, ఇది = ఇట్లొనర్చుట, పాపము = దురితమని, అవుఁగాదనఁడు = యుక్తమనిగాని అయుక్తమనిగాని చెప్పఁడు, ఆసమయమున్ = ఆయాచారమును, ని. 'సమయాశ్శపథాచార కాలసిద్ధాంత సంవిదః' యని యమరము. అవునను విప్రులక = అదియుక్తమని చెప్పుచున్న పుడమివేలుపులకే, అగ్రహారము లిచ్చున్ = గ్రామముల నొసంగును.

తా. మఱియు నారాజు లింగధారు లగుజనంబు లెటువంటి దుష్కృత్యము లొనర్చినను విచారింపక యుండుటయు కాక, యాశైవాచారము యుక్త మని తన యభిప్రాయము ననుసరించి పలుకుచుండు బ్రాహ్మణుల కగ్రహారాదుల నిచ్చుచుండెను.

తే. అతఁడు రాజ్యంబుఁ బాలించునవసరమునఁ
దనవశంబైనయట్టియత్తామ్రపర్ణిఁ
గలుగు నలపుట్టరాని[2]ముక్తామణివర
కులము మాహేశ్వరులకంధరలకుఁ దీతె. 45

టీ. అతఁడు = అప్పాండ్యరాజు, రాజ్యంబున్ = దేశమును, పాలించు నవసరమునన్ = ఏలుచున్న కాలమందు, తనవశంబైనయట్టి = తనయధీనమైన, అత్తామ్రపర్ణిన్ = ఆతామ్రపర్ణియనునదియందు, కలుగు...బు-కలుగు = జనించుచున్న, అల = ప్రసిద్ధమైన, పుట్టరాని = అపూర్వములైన, ముక్తామణివర = శ్రేష్ఠంబులగు ముత్తియ

1. నివహంబేమైన. 2. ముక్తామణికులంబు మాహేశ్వరుల కంధలకు నె లీతె.

ములయొక్క, కులంబు = రాశి, మాహేశ్వరుల కంధరలకున్ = లింగధారుల మెడ లకు, తీరెన్ = సరిపోయెను, (కంఠలకును దీని ననుపాతమున బొంతలకు సరిపోయె ననియర్థము.)

తా. ఆరాజు రాజ్యపాలనం బొనర్చుచుటచే దనదేశమందున్న తామ్రపర్ణి యను నదియం దుద్భవించి యమూల్యంబులై చెలంగుచున్న ముత్తియపుసరాసు లాలింగధారు లకు హారము లయ్యె నని భావము.

తే. అప్పు [1]డిచ్ఛుకు లగుబ్రాహ్మణౌఘ మెల్ల
నాత్మజనిభూమి విడువలే క లికభూతి
గడ్డముల నాన రుదురాక్షలిడ్డ సంది
సూతసంహిత లిఱికించి చొరఁ దొడఁగిరి. 46

టీ. అప్పుడు = అకాలమందు, ఇచ్ఛుకులగు = ఇచ్ఛానువర్తులైన, బ్రాహ్మణౌఘ మెల్లన్ = విప్రులందఱును, ఆత్మ జనిభూమిన్ = తమజన్మభూమిని, విడువలేక = త్యజింపఁజాలక, అలికభూతి - అలిక = ముఖమంపలి, భూతి = భస్మము, గడ్డములన్ = చుబుకప్రదేశములయందు, ఆనన్ = నిండఁగా, రుదు...దన్ - రుదురాక్షలిడ్డ = రుద్రా క్షలుకట్టికొనిన, సందిన్ = సందిటియందు, సూతసంహితలు = సూతసంహితా గ్రంథ ములను, ఇఱికించికొని = ఉనిచికొని, చొరఁదొడఁగిరి = ప్రవేశింప నారంభించిరి. ని. 'జనిరుత్పత్తిరుద్భవ' యనియు, 'భూతి ర్భస్మని ర్భసిత' యనియు నమరము.

తా. అపుడు జన్మభూమియం దపేక్ష గలకొందఱు బ్రాహ్మణు లారాజుయొక్క యిచ్ఛానువర్తనము గలవారలై తమముఖములయందు గడ్డములవఱకు వ్యాపించునట్లు విభూతిఁబూసి రుద్రాక్షలు ధరించుకొని చంకలలో సూతసంహిత యను గ్రంథము నిఱికించికొని యెదుటికి రా సాగి రని తాత్పర్యము.

క. శీలముఁ బట్టియు గంజాహాల లుపాంశున భుజించునధముల బైటం
జాలఁడు వైవన్ విప్రస్ఖాలిత్యము [2]బైట వేసికనుగిఱపు సభన్. 47

టీ. శీలమున్ = జంగమదీక్షను, పట్టియున్ = పూనియును, గంజాహాలలు - గంజా = గంజాయిని, హాలలు = వివిధమద్యములను, ఉపాంశునన్ = గహస్యమందు, భుజించునధములన్ = సేవించుచున్న నీచులను, బైటవైవన్ = బయలుఁబెట్టుటకు, చాలఁడు = శక్తిగలవాఁడగును, విప్రస్ఖాలిత్యమున్ - విప్ర = బ్రాహ్మణులయొక్క, స్ఖాలి త్యమున్ = తప్పిదమును, బైటవేసి = ప్రకటనవేసి, సభన్ = కొలువుకూటమందు,

1. డిచ్ఛుకు లగుచు బ్రాహ్మణులు గొంద, ఱాత్మ. 2. బైలు వేసి.

కనుగిఱపుఁడు = హేళనముచేయు మని సభ్యులఁ జూచి కనుసంజ్ఞఁజేయుచు. ని. 'సురా హలిప్రియాహాలా' యనియు, 'రహశ్చోపాంశు చాలిఙ్గ' యనియు నమరము.

తా. శైవదీక్ష వహించియు రహస్యముగా గంజాయిఁ దిని మద్యపానముఁ జేయుచున్నట్టి భ్రష్టులను బట్టి విచారించి శిక్షింపఁడుగాని, బ్రాహ్మణులకుఁ బ్రమాదముచేత సంభవించిన కొంచెపుఁదప్పిదములను సభయందు బయలుపఱిచి సభ్యులం జూచి హేళనముచేసి యాక్షేపింపుఁ డని కనుసంజ్ఞఁ జేయుచుండును.

క. ఆరాజుమహిషి [1]నియతి మ, దారాధనపరత నుండు; । నట్లుండియు దు
ర్వారవ్యథకుం గానదు, పారము విభుఁ డస్మదంఘ్రి । భక్తుఁడు గామిన్.

టీ. ఆరాజుమహిషి = ఆ పుడమిఱేనిపట్టపురాణి, నియతిన్ = భాగ్యముచేతను, మదారాధనపరతన్ - మత్ = నాయొక్క, ఆరాధన = పూజనమందు, పరతన్ = ఆసక్తిచేత, ఉండున్ = వర్తించును, అట్లుండియున్ = మద్భక్తురాలై యుండియును, విభుఁడు = ప్రియుఁడు, అస్మదంఘ్రిభక్తుఁడు గామిన్-అస్మత్ = నాయొక్క, అంఘ్రి = పాదములకు, భక్తుఁడుగామిన్ = భక్తుఁడు కాకుండుటంజేసి, దుర్వారవ్యథకున్ = మితిలేని మనోదుఃఖమునకు, పారమున్ = తుదను, కానదు = చెందదు.

తా. ఆ రాజుయొక్క భార్యమాత్రము తనసుకృతముచే నాసపర్యయందును రక్తి గలదియై యుండియుఁ, దనమగండు నాకు భక్తుఁడు గాక యుండుటంజేసి, తానపారం బగుదుఃఖసముద్రంబున మునింగియుండు.

వ. మఱియు నప్పురంధ్రిరత్నంబు. 49

టీ. మఱియున్ = ఇంకను, అప్పురంధ్రిరత్నంబు - పురంధ్రీ = సచ్చరిత్రగల వనితలలోపల, రత్నంబు = శ్రేష్ఠమైన యాపట్టపుదేవి.

సీ. వింగడం బైనట్టి । ముంగిట [2]నెలకొన్న
బృందావనికి ముగ్గు । వెట్టు దాన;
దశమినాఁ డేకభు । క్తముఁ జేసి యవలినాఁ
డోర్చి జాగరముతో । నుండు నిట్రు;
పారసి పోనీదు । పైనిద్రఁ బాఱుట
క్కలుపాడు మత్పుణ్య । కథలఁ ద్రోయు;
నేమంపుమానాళ్లు । కామింప దధినాథు;
మఱునాఁడు కన్నును । మనసు దనియ

1. యేని. 2. నిడికొన్న.

తే. నారజపువన్నెఁ బతిసెజ్జ కరుగుఁ గూర్మి;
నరుగుచోఁ నాభిఁ దుడిచి కప్పురపునాభిఁ
బెట్టు; నిట్టులు మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్ట మగుట. 50

టీ. వింగడంబైనట్టి = విరళముగ నున్నయట్టి, ముంగిటన్ = ముంగిలియందు, నెలకొన్న = పాదుకొనియున్న, బృందావనికిన్ = తులసీవనమునకు, తాన = తానె, మ్రుగ్గువెట్టున్ =రంగవల్లినిడును, దశమినాఁడు = దశమిదినసమందు, ఏకభుక్తముఁజేసి = ఒక్కప్రొద్దుండి, అవలినాఁడు = మఱుచటిదినము, (అనఁగా నేకాదశియం దనుట.) ఓర్చి=సహించి, జాగరముతోన్ = నిద్రలేమితోడను, నిట్రుఁడుండున్ = ఉపవాసముం డును, బారసి=ద్వాదశీవ్రతము, పోనీదు = విడువదు, పై నిద్రన్ = పారణానంతర మందుఁగలుగునిదురను, పాఱుటక్కులువాడు = బ్రాహ్మణస్త్రీలు పాడునట్టి, 'పాఱుఁ దనఁగఁ బుడమివేల్పు బాఁపఁ డనఁగ' నని యాంధ్రనామసంగ్రహము. మత్ = నా యొక్క, పుణ్యకథలన్ = పవిత్రకరంబు లగుచరిత్రములచేతను, త్రోయున్ = కడపును, నేమంపుమూనాళ్లు-నేమంపు = నియమమైన, మూనాళ్లు = దశమి యేకాదశి ద్వాదశి యను మూఁడు దివసములును, అధినాథున్ = పెనిమిటిని, కామింపదు = కోరదు, మఱు నాఁడు = ఆ మూఁడురోజులు కడచిన వెనుక, కన్నులు = నేత్రంబులు, మనస్సు = మన ంబును, తనియన్ = ఆనందించునట్లు, ఆరజపువన్నెన్ - ఆరజపు = మనోహరమైన, వన్నెన్ = సొగసుతోడను, పతి = ప్రియునియొక్క, సెజ్జకున్ = పానుపుమీఁదికి, కూర్మిన్ = ప్రేమచేత, అరుగున్ = వెళ్లును, అరుగుచోన్ = ప్రియునిం గలయుటకు వెళ్లి నపుడు, నాభిన్ =నిడుపుగఁ బెట్టిన కస్తూరిబొట్టును, తుడిచి = తీసివేసి, కప్పురపునాభిన్ = కర్పూరపుబొట్టును, పెట్టున్ = పెట్టుకొనును, (విభూతిచుక్క యని పెనిమిటి కగ పడున ట్లనుట.) ఇట్టులన్ = ఇవ్విధంబుగ, మద్భక్తిపుట్టియును=నాయందుఁ బూజ్యాను రాగ ముదయించియును, నిజేశునెడన్ = తనభర్తయందు, భక్తి చెడదు = అనురాగము విడువదు, మదిష్టమగుటన్ = నాకిష్టమైనయదియగుటచేతను, (స్త్రీలు పతివ్రతలై యుండుట తన కిష్ట మని తెలిసి యామె పతిభక్తి విడువ దనుట.)

తా. మఱియు సచ్చరిత్రలు గలవనితారత్నం బైన యారాణియు, విశాలం బైన నగళ్లయొక్క ముంగిళ్లయందు నెలకొనియున్న తులసీవనమందుఁ దాన మ్రుగ్గులు పెట్టుచు దశమినాఁ డొక్కప్రొద్దుండి యేకాదశిని శుద్ధోపవాసజాగరణములచేతఁ గడపి ద్వాదశినాఁడు పారణ యొనర్చి బ్రాహ్మణస్త్రీలు పాడుచున్న విష్ణుస్తోత్ర పాఠ ములచేత నిదురపోకయ ప్రొద్దుపుచ్చి యామూఁడురాత్రులు పతిసంభోగముఁ గోరక

నియమముచేత ని ట్లేకాదశీవ్రత మాచరించి యామముకాఁడు ప్రియుఁ డుత్సహించు నట్లు కన్నులపండువై సొబఁగైయున్న యలంకారమునఁ జెలంగుచు నత్యంతప్రీతితోడం గాంతునిఁ గూడం దలంచి పోవునవసరంబున ముందుఁ దనముఖంబున నిలువుగ నునిచి కొనియున్న కస్తూరీతిలకమును దుడిచి శైవదీక్ష వహించియున్న పరభక్త విభూతి యని యుత్సహించునట్లు కర్పూరముతోఁ జుక్కబొట్టు పెట్టి పతిశయ్యం జేరును. నాయం దిట్టిదుర్ఘటం బైనభక్తి జనించియును స్త్రీలకుఁ బతివ్రతాధర్మం బత్యంతాచరణీయం బని మచ్ఛాసనంబు సెఱింగియ పతిభక్తియందు మిగుల ననురక్తురాలై యుండె నని భావము.

క. వనజజరుద్రాదులు మ, త్తనువుల; తత్పూజనంబు ♦ తథ్యము మత్పూ
జనము;తదీప్సితఫలదా,తను [1]నేన నట్లైనఁ గలవు ♦ తరతమవృత్తుల్.51

టీ. వనజజరుద్రాదులు = బ్రహ్మయుఁ రుద్రుఁడు మొదలగువారు, మత్తనువుల = నాశరీరములే, తత్పూజనంబు-తత్ = వారలయొక్క, పూజనంబు = అర్చించుట, మత్పూజనమ = నన్నుఁ గూర్చి యొనర్చినపూజయే, తథ్యము = యథార్థము. తదీ...ను - తత్ = అట్లా బ్రహ్మరుద్రాదులను బూజించువారలయొక్క, ఈప్సితఫల = ఇష్టసిద్ధులకు, దాతను = ఇచ్చువాఁడను, నేన = నేనే, అట్లైనన్ = అలాగైనప్పటికిని, తరతమవృత్తుల్ = హెచ్చుదగ్గులు, కలవు = కలిగియుండును.

తా. ఈశానుఁడు, బ్రహ్మ లోనగువారందఱును నాశరీరంబు లగుటం జేసి వారల నారాధించినయెడ యథార్థముగ న న్నారాధించినట్లు సంతసించి యట్లొనర్చిన మనుజులకు నభీష్టార్థముల నిచ్చువాఁడను నేన యైనను నాకును వారలకును దారతమ్యము గలదు.

క. కేవలశరీరదృష్టిన, దేవతల వేఱ కలుగఁ ♦ దెలిసినజడులన్
నావాసుదేవతాస్థితి, భావింపనిపూజ సాంతఫలమై త్రిప్పున్. 52

టీ. కేవలశరీరదృష్టిన-కేవల=ముఖ్యముగ, శరీర=ఇతరదేవతల శరీరములయొక్క, దృష్టిన = చూచుటచేతనే, దేవతలన్ = అస్మచ్ఛరీరభూతులైన యితరదేవతలను, వేఱ కలుగన్ = ప్రత్యేకముగ నున్నట్లు, తెలిసినజడులన్ = ఎఱిఁగినయజ్ఞానులను, నావాసుదేవతాస్థితి-నా = నాయొక్క, వాసుదేవతా = వాసుదేవత్వముయొక్క, శ్లో. 'సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతివై యతః, అతోఽస్య వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే' అని విష్ణుపురాణము. స్థితిన్ = ఉంటను, భావింపని = తలపని, పూజ = ఆరా

1. నేనె యట్లైన.

ధనము, సాంతఫలమై-సాంత=అంతముతోఁగూడిన, ఫలమై = ఫలముగలదై, త్రిప్యక్ = మల్లించును.

తా. ముఖ్యముగ నితరదేవత లందఱు నా శరీరంబులే, కాన నట్టిదేవతలు నాకు వేఱుగా నున్నవారనియును, ప్రత్యేకఫలప్రదు లనియును, దెలిసికొనియున్న యజ్ఞులకు నా వాసుదేవత్వస్థితిని దెలియనిపూజ యల్పఫలప్రదాయకమై యనేక జననమరణ రూప దుఃఖములం ద్రిప్పుచుండు నని భావము.

వ. మఱియు నీరహస్యంబుఁ దెలియ కబ్భూపతి తామసుండై మామకీనంబు లగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుఁ దద్వృత్తుల కగు నుపద్రవంబుల నుపేక్షించుచు రక్షావిముఖుండై యుండ వీక్షించి కలియుగంబున ద్రవిడమండలంబునఁ గృతమాలాతామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను దద్దేశంబున కొండయం డతం డగుటను రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు నాయభిముఖ్యంబు సంవాదంబునంగాని పుట్టమియు నే విచారించి తదాభిముఖ్యకరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదిజయంబు సేయవలయు ననుతలం పవ్విప్రకుమారునకుం బుట్టింపనంత డేగి నానాదేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు వటువులకుం బెండ్లిండ్ల కనుపనీతుల కుపనయనంబులకుఁ బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు మఱియుఁ జెఱువు గడమబడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువదనియు నెడవునం జలిపంది రిడియెద మనియుఁ దిథి చిక్కె ననియుఁ దీర్థయాత్రఁ జనియెద మనియును వ్రతోద్యాపన కనియును వ్యాధి మాన్పుకో ననియును జెప్పి పంప నారాణివాసంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపుద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చువుముదుస ళ్లగు నర్షధరులచేతులకుం గ్రందుకొని చే సాఁచిన సందిటికితోరణంబులై తోఁచు నేకదండిత్రిదండిబ్రహ్మచారుల యున్నమితదండంబుల నిండా రుకాషాయకద్రువస్త్రకౌపీనపరంపరలం గ్రమ్మి *కావళ్లపడగలజాడఁ గొని కేవలకార్పణ్యంబ విద్యగాఁ దక్కినవిద్య లెఱుంగక వేఁడు

* కావళ్లపడగల జడగొని.

నీదృగ్విధానేక ప్రాణుల కాధారం బగు పడమటిద్వారంబుఁజేరి ప్రతి
దినాష్టకాష్టాదభజనకథాశ్రుతపూర్వ యగునాయుర్వేధవుదేవి కాశీ
ర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి వైదేశికుండ వైష్ణవ
పటుండ వాదిగలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలి
చెద వసుధావరుండు విష్ణుభక్తివిముఖుండు గావున వైష్ణవునిమనవి
విన్నవింప నెవ్వరు వెఱుతురు నీవు విష్ణుభక్తిపరాయణావు పతిహి
తాచారవుం గావున నీకు విన్నవించి పంపితి నీవిభుఁడు నీకు విధే
యుండు విన్న వించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని
వాడించి గెల్చి నీదుభర్తకు భగవద్భక్తి బుట్టించి కృతార్థుం గావిం
చెద నని విన్నవింపం బంచిన. 53

టీ. మఱియు. నీరహస్యంబుక్ = సర్వము నేననియెడి యేకాంతమును, తెలి
యక=ఎఱుంగక, అబ్జాపతి=ఆరాజు, తామసుండై=తమోగుణముగలవాఁడై, మామ
కీనంబులగు=మద్భక్తులైన, జనంబులక్=మనుజులను, సామాన్యబుద్ధింజూచుచు=సాధా
రణజనులని తలంచుచు, తద్వృత్తులకుక్-తత్ = ఆ భక్తులయొక్క, వృత్తులకుక్ =
మాన్యక్షేత్రాదులకు, అగు నుపద్రవంబులక్ = కలిగినబాధలను, ఉపేక్షించుచు = నివ
ర్తింపఁజేయక, రక్షావిముఖుండై=పాలించుటకుఁ బరాఙ్ముఖుండై, ఉండక్ = వర్తించు
చుండఁగా, వీక్షించి=చూచి, కలియుగంబునక్ = కలికాలమందు, ద్రవిడమండలం
బునక్=అరవదేశమునను, కృతమాలాతామ్రపర్ణీతటంబులక్ - కృతమాలా = కృతమాల
యను నదియొక్కయు, తామ్రపర్ణీ=తామ్రపర్ణీయనునదియొక్కయు, తటంబులక్ =
తీరములయందు, మద్భక్తులు=నాకు దాసులైన భాగవతోత్తములు, తఱచగుటక్ =
విస్తరిల్లియుండుటచేతను, శ్లో. 'కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః, క్వచి
త్క్వచిన్మహాభాగ· ద్రావిడేషు చ భూరిశ' యని శుకయోగీంద్రునివచనము. తద్దేశంబు
నకుక్ = ఆదేశమునకు, ఒడయండు = రాజు, అతండగుటక్ = ఆ పాండ్యరా
జగుటచేతను, 'ఒడయఁ డేలిక యెకిమీఁడు పుడమి ఱేఁడని' యాంధ్రనామసంగ్ర
హము. రక్షణశిక్షణంబులు రక్షణ=పాలించుటయు, శిక్షణంబులు = శాసించుటయును,
రాజముఖంబునంగాక = పార్థివునివలన నేకాని, నేన = నేనే, సాక్షాత్కరించి =
ప్రత్యక్షమై, చేయమియుక్ = చేయకుండుటయును, తద్రక్షణేచ్ఛ-తత్ = ఆభగవ
ద్భక్తులయొక్క, రక్షణేచ్ఛ = పాలనాభిలాషము, అస్మదాభిముఖ్యంబునంగాని -
అస్మత్ = నాయొక్క, అభిముఖ్యంబునంగాని = సన్నిధియందేకాని, పొడమ

మియున్ =పుట్టమియును, నాయాభిముఖ్యంబు-నా = నాయొక్క, అభిముఖ్యంబు = అనుకూల్యము, సంవాదంబునంగాని = సంవాదాత్ప్రామాణ్యంబను న్యాయముచేతనే కాని, పుట్టమియున్ = జనింపకుండుటయును, విచారించి = తలపోసి, తదాభిముఖ్యకరణార్థంబుగన్-తత్ =ఆరాజుయొక్క, అభిముఖ్య=అభిముఖుఁడగుటయొక్క, కరణార్థంబుగన్ =చేయుటకును, ఆస్థానంబుక్కి=సభను ప్రవేశించి, వాదిజయంబు - వాది=వాదులయొక్క, జయంబు=గెలుపును, చేయవలయున్ = ఒనరింపవలయును, అను = అనునట్టి, తలంపు=ఆలోచనను, అవ్విప్రవటుమారునకున్ =ఆబ్రాహ్మణవటువునకు, పుట్టింపన్ = జనింపఁజేయఁగా, అతండు=ఆవిప్రుఁడు, ఏఁగి = వెళ్లి, నానా...కున్ - నానాదేశాగత=బహుదేశములనుండి వచ్చినట్టియు, దీన=దరిద్రులైనట్టియు, అనాథ = దిక్కులేనట్టియు, వృద్ధ = వృద్ధులైనట్టి, భూసురకుటుంబములకున్ = బ్రాహ్మణసంసారులకు, ధాన్యాజినపటాదులు-ధాన్య=వడ్లును, అజిన=కృష్ణాజినములను, పటాదులు=వస్త్రములు లోనగువానిని, వటువులకున్ = బ్రహ్మచారులకు, పెండ్లిండ్లకును = వివాహములకును, అనుపనీతులకున్ =జందెములేనివారికి, ఉపనయనంబులకున్ = ఉపనీతులుగా నొనర్చుటకును, పంగ్వంధబధిరాదులకున్ = కుంటుగ్రుడ్డుచెవిటివాండ్రకు, సౌరభేయాదియానంబులును = ఎడ్లు మొదలగు వాహనంబులును, (సురభి యనఁగాఁ గామధేనువు; దానివలనఁ బుట్టినది. సౌరభేయ మనఁగా నెద్దు; అది మొదలైనవి యని విగ్రహార్థము.) మఱియున్ = వెండియును, చెఱువుగడమఁబడియెననియు = చెఱువుగుంటల పని ముగియకున్నదనియు, పేదగుడులకుఁ బూజనడుపదనియు = బీదవడియున్న దేవాలయములోని దేవతలకు ధూపదీపనైవేద్యాదులకు లేకయున్నదనియు, ఎడవునన్ = ఎడారిని, చలిపందిరిడియెదమనియున్ = పానీయశాలనేర్పఱిచెదమనియు, తిథి = పైతృకము, చిక్కుననియున్ = దిగఁబడుననియు, తీర్థయాత్రఁజనియెద మనియున్ =పుణ్యతీర్థంబుల సేవించుటకు వెళ్లెద మనియును, వ్రతోద్యాపనకనియున్ = శాస్త్రసిద్ధకర్మంబులఁ దుదిముట్టించుటకనియును, వ్యాధిమాన్పుకొనననియున్ = రోగముఁ బోఁగొట్టుకొనననియును, చెప్పిపంపన్ = వాక్రుచ్చియంపఁగా, ఆరాణివాసంబు = రాజుదేవి, గుప్తాగుప్తప్రకారంబులన్-గుప్త = రహస్యమైనట్టియు, అగుప్త = ప్రకటమైనట్టియు, ప్రకారంబులన్ = రీతులచేతను, పంపుద్రవ్యంబున్ - పంపు = అనిపినట్టి, ద్రవ్యంబున్ = సామగ్రులను, తెచ్చి = తీసికొని వచ్చి, ఇచ్చు...కన్ = ఇచ్చు = ఇడుచున్నయట్టి, ముదుసళ్లగు = వృద్ధులైనట్టి, వర్షధరుల = షండులయొక్క, చేతులకున్ = హస్తములకు, క్రందుకొని= సందడిగొని, చేసాచిన = హస్తప్రచారణము చేయుచున్న, సందిటితోరణంబులై= సందిళ్లతోఁ గట్టిన తోరణములై, తోఁచు...లన్ - తోఁచు=కనఁబడుచున్న, ఏక

దండి = స్మార్తసన్న్యాసులయొక్కయు, త్రిదండి = వైష్ణవసన్న్యాసు లనఁగా జియ్యరులయొక్కయు, బ్రహ్మచారుల = వటువులయొక్కయు, ఉన్నమిత=ఎత్తఁబడ్డ, దండంబులన్=కఱ్ఱలయందు, నిండా...లన్ = నిండారు=వ్యాపించుచున్న, కషాయ = ఎఱ్ఱనైనట్టియు, కద్రు = పచ్చనైనట్టి, ని. 'రాగద్రవ్యేకషాయోఽస్త్రీ నిర్యాసేపారదే రసే, పిశఙ్గౌ కద్రుపిఙ్గళౌ' అని యాదవామరములు. వస్త్రకౌపీన పరంపరలన్ - వస్త్ర = శాటులయొక్కయు, (దండములకుం గట్టు ముద్రవస్త్రము లనుట.) కౌపీన = గోఁచులయొక్కయు. పరంపరలన్ = సమూహములచేతను, క్రమ్మి = కప్పి, కావళ్ళపడగలజాడఁగొని - కావళ్ళ = కావలియున్న స్థానములందలి, పడగల = టెక్కెములయొక్క, జాడఁగొని = వైఖరిఁదెలిసి, (కావళ్ళ = వివిధములయొక్క, పడగల = కొసలవలెను, జడగొని = మెలికలుగొని,) కేవలకార్పణ్యాంబ = ఒక్క దీనత్వమే, విద్య కాన్ = చదువుగా, తక్కిన విద్యలెఱుంగక = పేఱుచదువు లెఱుఁగక, వేఁడు...కున్ - వేఁడు = యాచించుచున్న, ఈదృగ్విధ = ఇత్తెఱంగునున్నట్టి, అనేక = లెక్కకు మిక్కుటంబైన, ప్రాణులకున్ = చేతనులకు, ఆధారంబగు = ఆస్పదమైన, పశ్చిమద్వారంబున్ = వెనుకనున్న గుమ్మమును, (అనఁగా దిడ్డివాకిలి యనుట.) చేరి = ప్రవేశించి, ప్రతిదిన = దినదినమందును, అస్మత్పాద = నాచరణములయొక్క, భజనకథాశ్రుతపూర్వయగు = ముందువినఁబడిన భజనగాథలు గలదైన, (పూర్వము వినఁబడినవి శ్రుతపూర్వములు, దేనిచేత నాపాద భజనకథలు ముందు వినఁబడియున్నదో అది యని విగ్రహార్థము. భగవత్పాదారవిందధ్యానగరిష్ఠురాలనుట.) ఆయుర్వీధరుదేవికిన్ = ఆపాండ్యరాజుభార్యకు, ఆశీర్వచనాక్షతంబులు = మంగళాశాసనపూర్వకాక్షతలను, దౌవారికముఖంబునంబంపి = ద్వారపాలునిచేతఁ బంపి, వైదేశికుండన్ = పరదేశిని, వైష్ణవవటుండన్ = విష్ణుభక్తిగల బ్రహ్మచారిని, వాదిగలిగినన్ = విద్యావాదము చేయువాఁడున్నయెడ, విష్ణుతత్త్వంబె = నారాయణస్వరూపమే, పరతత్త్వంబని=పరమార్థమని, వాదించి=ప్రసంగమొనరించి, గెల్చెదన్ = జయించెదను. వసుధావరుండు=రాజు, విష్ణుభక్తివిముఖుండు కావునన్=నారాయణునియందుఁ బూజ్యప్రతిపత్తిలేనివాఁ డగుటంజేసి, వైష్ణవునిమనవి=విష్ణుభక్తుఁడనైన నాయొక్క విజ్ఞాపనమును, విన్నవింపన్ = ఎఱిఁగించుటకు, ఎవ్వరును = అందఱును, వెఱతురు = భయపడుదురు. నీవు, విష్ణుభక్తిపరాయణవు = విష్ణుభక్తియందాసక్తిగలదానవు, పతిహితాచారవుం గావున = భర్తకనుకూలంబగు సద్వృత్తిగలదానవుసుగనుక, నీకున్ = నీకొఱకు, విన్నవించి=విజ్ఞాపనముచేసి, పంపితిన్ = అనిపితిని, నీవిభుండు = నీభర్త, నీకు విధేయుండు=నీకు వశ్యుండు, విన్నవించి = విన్నపమొనరించి, నన్నున్, రప్పించి = పిలువఁ

మియున్ = పుట్టమియును, నాయాభిముఖ్యంబు-నా = నాయొక్క, అభిముఖ్యంబు = అనుకూల్యము, సంవాదంబునంగాని = సంవాదాత్ప్రామాణ్యంబను న్యాయముచేతనే కాని, పుట్టమియున్ = జనింపకుండుటయును, విచారించి = తలపోసి, తదాభిముఖ్యకరణార్థంబుగన్-తత్ = ఆరాజుయొక్క, అభిముఖ్య = అభిముఖుఁడగుటయొక్క, కరణార్థంబుగన్ = చేయుటకును, ఆస్థానంబుక్కి = సభను ప్రవేశించి, వాదిజయంబు - వాది = వాదులయొక్క, జయంబు = గెలుపును, చేయవలయున్ = ఒనరింపవలయును, అను = అనునట్టి, తలంపు = ఆలోచనను, అవ్విప్రకుమారునకున్ = ఆబ్రాహ్మణవటువునకు, పుట్టింపన్ = జనింపఁజేయఁగా, ఆతండు = ఆవిప్రుఁడు, ఏఁగి = వెళ్లి, నానా...కున్ - నానాదేశాగత = బహుదేశములనుండి వచ్చినట్టియు, దీన = దరిద్రులైనట్టియు, అనాథ = దిక్కులేనట్టియు, వృద్ధ = వృద్ధులైనట్టి, భూసురకుటుంబములకున్ = బ్రాహ్మణసంసారులకు, ధాన్యాజినపటాదులు-ధాన్య = వడ్లును, అజిన = కృష్ణాజినములను, పటాదులు = వస్త్రములు లోనగువానిని, వటువులకున్ = బ్రహ్మచారులకు, పెండ్లిండ్లకును = వివాహములకును, అనుపనీతులకున్ = జందెములేనివారికి, ఉపనయనంబులకున్ = ఉపనీతులుగా నొనర్చుటకును, పంగ్వంధబధిరాదులకున్ = కుంటుగ్రుడ్డుచెవిటివాండ్రకు, సౌరభేయాదియానంబులును = ఎడ్లు మొదలగు వాహనంబులును, (సురభి యనఁగాఁ గామధేనువు; దానివలనఁ బుట్టినది. సౌరభేయ మనఁగా నెద్దు; అది మొదలైనవి యని విగ్రహార్థము.) మఱియున్ = వెండియును, చెఱువుగడమఁబడియెననియు = చెఱువుగుంటల పని మునిగియున్నదనియు, పేదగుడులకుఁ బూజనడుపదనియు = బీదవడియున్న దేవాలయములోని దేవతలకు ధూపదీపనైవేద్యాదులకు లేకయున్నదనియు, ఎడవునన్ = ఎడారిని, చలిపందిరిడియెదమనియున్ = పానీయశాలనేర్పఱిచెదమనియు, తిథి = పైతృకము, చిక్కెననియున్ = దిగఁబడుననియు, తీర్థయాత్రఁజనియెద మనియున్ = పుణ్యతీర్థంబుల సేవించుటకు వెళ్లెద మనియును, వ్రతోద్యాపనకనియున్ = శాస్త్రసిద్ధకర్మంబులఁ దుదిముట్టించుటకనియును, వ్యాధిమాన్పుకొననియున్ = రోగముఁ బోఁగొట్టుకొననియును, చెప్పిపంపన్ = వాక్రుచ్చియంపఁగా, ఆరాణివాసంబు = రాజుదేవి, గుప్తాగుప్తప్రకారంబులన్-గుప్త = రహస్యమైనట్టియు, అగుప్త = ప్రకటమైనట్టియు, ప్రకారంబులన్ = రీతులచేతను, పంపుద్రవ్యంబున్ - పంపు = అనిపినట్టి, ద్రవ్యంబున్ = సామగ్రులను, తెచ్చి = తీసికొని వచ్చి, ఇచ్చు...కన్ = ఇచ్చు = ఇడుచున్నయట్టి, ముదుసళ్ళగు = వృద్ధులైనట్టి, వర్షధరుల = షండులయొక్క, చేతులకున్ = హస్తములకు, క్రిందుకొని = సందడిగొని, చేసాచిన = హస్తప్రచారణము చేయుచున్న, సందిటితోరణంబులై = సందిళ్ళతోఁ గట్టిన తోరణములై, తోఁచు...లన్ - తోఁచు = కనఁబడుచున్న, ఏక

దండి = స్మార్తసన్న్యాసులయొక్కయు, త్రిదండి = వైష్ణవసన్న్యాసు లనఁగా జియ్యరులయొక్కయు, బ్రహ్మచారుల = వటువులయొక్కయు, ఉన్నమిత=ఎత్తఁబడ్డ, దండంబులన్=కఱ్ఱలయందు, నిండా...లన్ = నిండారు=వ్యాపించుచున్న, కషాయ = ఎఱ్ఱనైనట్టియు, కద్రు = పచ్చనైనట్టి, ని. 'రాగద్రవ్యకషాయోస్త్రీ నిర్యాసేపారదే రసే, పిశఙ్గౌ కద్రుపిఙ్గళౌ' అని యాదవామరములు. వస్త్రకౌపీన పరంపరలన్ - వస్త్ర = శాటులయొక్కయు, (దండములకుం గట్టు ముద్రవస్త్రము లనుట.) కౌపీన = గోఁచులయొక్కయు. పరంపరలన్ = సమూహముల చేతను, క్రమ్మి = కప్పి, కావళ్ళపడగలజాడఁగొని - కావళ్ళ = కావలియున్న స్థానములందలి, పడగల = టెక్కెములయొక్క, జాడఁగొని = వైఖరిఁ దెలిసి, (కావళ్ళ = వివిధములయొక్క, పడగల = కొసలవలెను, జడగొని = మెలికలుగొని,) కేవలకార్పణ్యాంబ = ఒక్క దీనత్వమే, విద్య కాన్ = చదువుగా, తక్కిన విద్యలెఱుంగక = పెఱచదువు లెఱుఁగక, వేఁడు...కున్ - వేఁడు = యాచించుచున్న, ఈదృగ్విధ = ఇత్తెఱఁగునున్నట్టి, అనేక = లెక్కకు మిక్కుటంబైన, ప్రాణులకున్ = చేతనులకు, ఆధారంబగు = ఆస్పదమైన, పశ్చిమద్వారంబున్ = వెనుకనున్న గుమ్మమును, (అనఁగా దిడ్డివాకిలి ననుట.) చేరి = ప్రవేశించి, ప్రతిదిన = దినదినమందును, అస్మత్పాద = నాచరణములయొక్క, భజనకథాశ్రుతపూర్వయగు = ముందువినఁబడిన భజనగాథలు గలదైన, (పూర్వము వినఁబడినవి శ్రుతపూర్వములు, జేనిచేత నాపాద భజనకథలు ముందు వినఁబడియున్నదో అది యని విగ్రహార్థము. భగవత్పాదారవిందధ్యానగరిష్ఠురాలనుట.) ఆయుర్వీధరుదేవికిన్ = ఆపాండ్యరాజుభార్యకు, ఆశీర్వచనాక్షతంబులు = మంగళాశాసనపూర్వకాక్షతలను, దౌవారికముఖంబునంబంపి = ద్వారపాలునిచేతఁ బంపి, వైదేశికుండన్=పరదేశిని, వైష్ణవవటుండన్ = విష్ణుభక్తిగల బ్రహ్మచారిని, వాదిగలిగినన్ = విద్యావాదము చేయువాఁడున్నయెడ, విష్ణుతత్త్వంబె = నారాయణస్వరూపమే, పరతత్త్వంబని=పరమార్థమని, వాదించి=ప్రసంగమొనరించి, గెల్చెదన్ = జయించెదను. వసుధావరుండు=రాజు, విష్ణుభక్తివిముఖుండు కావునన్=నారాయణునియందుఁ బూజ్యప్రతిపత్తిలేనివాఁ డగుటంజేసి, వైష్ణవునిమనవి=విష్ణుభక్తుఁడనైన నాయొక్క విజ్ఞాపనమును, విన్నవింపన్ = ఎఱిఁగించుటకు, ఎవ్వరును = అందఱును, వెఱతురు = భయపడుదురు. నీవు, విష్ణుభక్తిపరాయణవు = విష్ణుభక్తియందాసక్తిగలదానవు, పతిహితాచారవుం గావున = భర్తకనుకూలంబగు సద్వృత్తిగలదానవునుగనుక, నీకున్ = నీకొఱకు, విన్నవించి=విజ్ఞాపనముచేసి, పంపితిన్ = అనిపితిని, నీవిభుండు = నీభర్త, నీకు విధేయుండు=నీకు వశ్యుండు, విన్నవించి = విన్నపమొనరించి, నన్నున్, రప్పించి = పిలువఁ

బంచి, వాదంబు = ప్రసంగమును, చేయింపఁగ = చేయించుటకు, ఓపుదేనిఁ=సమర్థురాలవై తివా, వాదించి=ప్రసంగించి, గెల్చి=ప్రతివాదులను జయించి, నీదుభర్తకుఁ= నీపతికి, భగవద్భక్తిఁ = శ్రీమన్నారాయణునియం దాసక్తిని, పుట్టించి = జనింపఁజేసి, కృతార్థుఁ = కృతకృత్యునిఁగా, కావించెదఁ = చేసెదను. అని=ఇట్లని, విన్నవింపం బంచెనఁ=విన్నపము చేయఁబంపఁగా.

తా. పెండ్లియు సీ రహస్యం బెఱుంగక పుడమిఱేఁ డజ్ఞానుం డై నాభక్తులను సామాన్యజనులమాడ్కిం జూచుచు వారల జీవనంబులకుం గలుగు సుప్రదయంబులను వారింపకయుండం జూచి న్యాయం బనురక్తి లేని యీరాజును వాదమున మెప్పించి నాభక్తుం గావింపనియెడఁ గలియుగంబునం గృతమాలాతామ్రపర్ణీ తీరములయందు బండిగ వాసముజేయు నాభక్తుల సద్దేశము నేలుచున్న యితండు సమ్మానింపఁడని విచారించి వాదమున జయించి రాజును విష్ణుభక్తుం గావింపవలయునను తలం పయ్యాముసాచార్యునకు నేఁ బుట్టింప నతం డచ్చటి కరిగి యనేకదేశములనుండి వచ్చు బహువిధ యాచకతండంబుల కిష్టార్థంబుల నిచ్చుచు మత్పాదసేవయం దనురక్తురాలై యున్న యాభూపతిదేవియొద్దకు దౌవారికముఖంబున మంగళాశాసనాత్తతలం బంపి వాది గల్గినయెడ విష్ణుతత్త్వంబె పరతత్త్వ మని సిద్ధాంత మొనరింపఁగలవాఁడ నయ్యును విష్ణుభక్తివిముఖుండైన రాజునకు నామనవి విన్నవించువారు లేకయుండుటం జేసి విష్ణుభక్తురా లగునీకు విన్నవించితిని. నీవు విష్ణుభక్తియు, పతిభక్తియునుఁ గల దానవగుటచేత నీభర్త నీకు వశ్యుఁడైయున్నవాఁడు గాన విన్నపముఁజేసి నన్నుఁ బిలువనంపి ప్రసంగముఁ జేయింపఁగలదాన వైతివేని వచ్చి సభయందుఁ బ్రసంగించి వాదులను జయించి నీ పతికి శ్రీవిష్ణుభక్తిఁ బుట్టించి ధన్యునిం జేసెద నని విన్నవింపు మని పంచె ననుట.

తే. గ్రీష్మసమయనిరుత్సాహకేకిరమణి
నవఘనధ్వని కలరుచందమున నలరి,
*యేకతపు నర్మగోష్ఠిఁ బ్రాణేశుతోడ
నతని విధ మెఱిఁగింప, నిట్టట్టు వడుచు. 54

టీ. గ్రీష్మ...ణి-గ్రీష్మసమయ = వేసవికాలమందు, ని. 'సమయాశ్శపథాచార కాలసిద్ధాంతసంవిదః' యని యమరము, నిరుత్సాహ = సంతోషరహితయైన, కేకిరమణి = ఆఁడునెమలి, నవఘనధ్వనికిఁ-నవ = క్రొత్తదైన, ఘనధ్వనికిఁ = ఉఱుమునకు, అలరు

* ఏకతము.

చందమునన్ = సంతసించుచున్నట్లుంబలె, అలరి = ఆనందించి, ఏక...ష్ఠిన్ - ఏకతప్పు = ఏకాంతమందైన, నర్మ = విలాసార్థమగు, గోష్ఠిన్ = ముచ్చటించునపుడు, ప్రాణేశుతోడన్ = పెనిమిటితో, అతనివిధము-అతని = ఆయ్యాముసాచార్యునియొక్క, విధము = ప్రసంగ మొనరించెద నన్నరీతిని, ఎఱిఁగింపన్ = తెలుపఁగా, ఇట్టట్టుపడుచున్ = ఆశ్చర్య మొందుచును.

తా. పిమ్మట నారాజుభార్య వేసవికాలమున నుత్సాహము లేకయున్న యాఁడునెమలి నూతనమేఘధ్వని విని యానందించు పోలిక నుబ్బి యుత్సహించి యేకాంతంబున సరససల్లాపము లాడువేళఁ దనప్రాణవల్లభునితో నయ్యామునాచార్య వర్యుం డానతిచ్చినవిధం బెల్ల నెఱిఁగింప నయ్యుర్వీనాథుం డాశ్చర్యమునొందుచు.

క. భూవల్లభుఁ 'డెట్టెట్టూ
తా వాదముఁ జేసి శివమతంబు జయింపం
గా వచ్చెనో? చూతముగా,
రావింపు' మటన్న నాఁటిరాత్రి చనంగన్. 55

టీ. భూవల్లభుఁడు = రాజు, ఎట్టెట్టూ = ఏలాగేలాగు, తాన్ = తాను, (బ్రహ్మచారి యనుట.) వాదముఁ జేసి = వాదించి, శివమతంబున్ = శైవమతమును, జయింపంగా వచ్చెనో = గెలువవచ్చెనో, చూతముగా = వీక్షించెదముగాని, రావింపుము = పిలువనంపుము, అటన్నన్ = అట్లనఁగా, నాఁటిరాత్రి = ఆ రాతిరి, చనంగన్ = వెళ్లఁగా.

తా. ఆ భూకాంతుం డేలాగున నాబ్రహ్మచారి వాద మొనరించి శివమతమును జయింపఁగలఁడో చూతము పిలువఁ బంపు మనుటయు, నిశిలోఁ దెల్లవాఱఁగా నని భావము.

వ. ప్రభాతంబునం [1]బరిమితాస్థానంబునం గొలువున్నభర్తమ్రోలఁ దానుండి యయ్యిందువదన యతనియనుమతిం బ్రతిహారిచేతఁ బిలువఁ బంచిన నబ్బ్యానిలింపకుమారుండు. 56

టీ. ప్రభాతంబునన్ = ప్రాతఃకాలమందు, పరిమితాస్థానంబునన్ = మితజనము గలసభయందు, కొలువున్న=కూర్చుండియున్న, భర్తమ్రోలన్ = పెనిమిటియెదుటను, ఉండి=నిల్చుండి, అయ్యిందువదన=చంద్రునివంటి = మోము గలయారాజుభార్య, అతని= ఆరాజుయొక్క, అనుమతిన్ = సమ్మతిచేత, ప్రతిహారిచేతన్ = ద్వారపాలకునిచేత,

1. బరిమితజనం బగునాస్థానంబునం.

పిలువఁబంచినన్ = రమ్మని చెప్పిపంపఁగానే, అబ్బానిలింపసమారుండు = ఆపుడమి వేల్పుకొమరుఁడు.

## యామునాచార్యుండు పాండ్యసభఁ జేరుట

క. ద్వారంబు సొచ్చి, కీలిత
గారుడమహిఁ వజ్రవేదికం జివురులఁ గెం
పారు నొకపిప్పలముఁ గని,
యా రావి న్వాదసాక్షికై వలగొనుచున్. 57

టీ. ద్వారంబు = ఏలజాకిలికిని, చొచ్చి = ప్రవేశించి, కీ...హిన్-కీలిత=చెక్కఁబడిన, గారుడ = మరకతమయమైన, మహిన్ = భూమియందు, వజ్రవేదికన్=రవలతోఁ గట్టినతిన్నెయందు, చివురులన్ = చిగుళ్ళచేతను, కెం...మున్ - కెంపారు = ఎఱ్ఱనగుచున్న, ఒకపిప్పలమున్ = ఒకయశ్వత్థవృక్షమును, కని = చూచి, ఆ రావిన్ = ఆ యశ్వత్థమును, వాదసాక్షికై=ప్రసంగమునకు సాక్షిగా నుండుటకై, వలగొనుచున్ = ప్రదక్షిణ మొనరించుచు నని యుత్తరపద్యముతో నన్వయము.

తా. పిమ్మట వాకారమునుండి నగరుఁ బ్రవేశించి పచ్చలచేతఁ జెక్కఁబడియున్నభూమియందు మిగుల వెలగల రవలచేతఁ గట్టంబడిన వేదికయం దెఱ్ఱనైన చిగుళ్లచేత నొప్పుచున్న యశ్వత్థవృక్షమును జూచి తాను జేయం బూనిన వాదమునకు దాని సాక్షిగాఁ గైకొను నిచ్చతోఁ బ్రదక్షిణ మొనరించుచును.

సీ. పసిఁడిగ చ్చుమర సోపానముల్ మూఁటఁ దుం
గితవిశాలితయుఁ జిత్రితయు నైన
సభ మహాకుథముపై శార్దూలచర్మకం(ఖం)
థా(డా)వృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టి (ట్టు) రా హారసంధి రు
ద్రాక్షా[1]యుతముఁ దాల్చి యలికభూతి
సురఁటిగాడ్పుల రాల నరుణాయతాక్షుఁడై
కులుగద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి
నంది ముద్రితపాణియందుఁ జెక్కుఁది యా
గమములు వినుచు హేమమము పొదివిన

1. రుద్రాక్ష.

తే. యలఁతి[1]రుదురాకగమికుట్టులందు మెఱయ
వెలిదపారంబు మించ దువ్వలువ గప్పి
యడపమును వాఁడివా లొక్కయతివ దాల్ప
భార్య వింజామ రిడ నొప్పుపాండ్యుఁ గనియె. 58

టీ. పసిఁడి=బంగారముయొక్క, గచ్చు = పూఁత, అమరన్ = ఒప్పుచుండఁగా, సోపానముల్ = మెట్లు, (అనఁగా నంతస్తు లనుట.) మూఁటన్ = మూఁటిచేత, తుంగిత=పొడుగింపఁబడినది, విశాలితయున్ = వైశాల్యముగలదిగాఁ జేయఁబడినట్టిదియు, చిత్రితయున్ = చిత్తరువులు గలదియును, ఐన సభన్ = అగు ఆస్థానమండపమందు, మహాత్ = అధికమైన, కుశముపైన్ = ఆస్తరణముపందు, శార్దూలచర్మకంథావృతుల్ - శార్దూలచర్మ = పులితోలుచేతను, కంథా = బొంతలచేతను, ఆవృతుల్ = కప్పఁబడినట్టియు, జటిలులును = జడలుగలిగియున్నట్టి, జరఠ=వృద్ధులైన, మాహేశ్వరులు = లింగధారులు, చుట్టిరాన్ = పరివేష్టింపఁగా, హారసంధిన్-హార = ముత్యాలపేరులయొక్క, సంధిన్ = సందులయందు, రుద్రాక్షాయుతముఁ దాల్చి - రుద్రాక్ష = రుదురాక్కముల యొక్క, ఆయుతముఁదాల్చి=పెక్కులు ధరించి, ని. 'శతఁసహస్రమయుతంలక్షమానం ల్యవాచక' మ్మని పదనము. అలికభూతి = ముఖమందలిభస్మము, సురఁటిగాడ్పులన్=వింజామరలగాలిచేత, రాలన్ = పడుచుండఁగా, అరుణాయతాక్షుఁడై = ఎఱ్ఱనై దీర్ఘములైనట్టి కన్నులుగలవాఁడై, కుఱుగద్దెన్ = కుఱుచపీఠమునందు, బిల్లన్ = వట్రువైన తలగడయందు, ప్రకోష్ఠ మునిచి=మోఁచేయాని, నంది...దన్-నందిముద్రిత=వృషాంకితాంగుళీయకముగల, పాణియందున్ = హస్తమునందు, చెక్కుఁదొ=గండస్థలమును జేర్చి, ఆగమములువినుచున్ = శైవాగమను లాలకించుచు, హే...మి - హేమము షాదివిన=పైఁడిపొదిగిన, అలఁతి = సన్నములయిన, రుదురాక = రుద్రాక్షములయొక్క, గమి = సమూహము, కుట్టులందున్ = అంటుపోఁగులందు, మెఱయన్ = వెలుంగఁగా, వె...బు-వెలి = తెల్లనైన, తపారంబు = పాగాను, మించన్ = అతిశయించునట్లుగా, దువ్వలువన్ = దుప్పటిని, కప్పి = ఆచ్ఛాదించికొని, అడపమును = తాంబూలపుసంచిని, వాఁడివాలు=పదును గలఖడ్గమును, ఒక్కయతివ తాల్పన్ = ఒకస్త్రీ ధరించియుండఁగా, భార్య = రాజపత్ని, వింజామర, ఇడన్ = విసరఁగా, ఒప్పు = చెన్నొందుచున్న, పాండ్యున్ = పాండ్యరాజును, కనియెన్ = చూచెను. (ఇది పంచపాదసీస మని కొందఱును, చతుష్పాద మని, మఱికొంద ఱైదవపాదములేకయు వక్కాణింతురు.)

తా. పసిండిపన్నెపూఁతచే నొప్పి మూఁడంతస్తులమెట్లును మిగుల పొడవు వెడల్పును గల్గి పలుతెఱంగులైన చిత్తరువులచేఁ జెన్నొందియున్న సభామంటపము నందు గొప్ప యాస్తరణంబునం బులితోళ్లను బొంతలును గప్పుకొని జడలు ధరించిన వృద్ధులగు లింగధారులు చుట్టుఁ బరివేష్టించియుండ రత్నహారములయొక్క నడుమ నడుమను రుద్రాక్షములం గూర్పించి ధరియించి నొసటం బుట్టిన విభూతి వింజామరల గాలికి రాలుచుండఁ గన్ను లెఱ్ఱఁజేయుచు చిఱుతగద్దియయందు బిల్లదిండుమీఁద మోచేయి యుంచి నంది ముద్రితంబులైన యుంగరములు గల హస్తమునఁ జెక్కిలి యుంచి కొని మాహేశ్వరులు చదువుశైవాగమముల నాలకించి వినుచుఁ గుందనపు బంగారముచేతఁ గట్టఁబడిన సన్నరుద్రాక్షల కుట్టుపోఁగులు గల్గి తెల్లనిపాగాను ధరించి నాణ్యపు దుప్పటి గప్పుకొని ఒకప్రక్కనడపమును వాఁడియైనకత్తి చేతం బట్టిన యొకస్త్రీ తన్ను సేవింపం బట్టపుదేవియైన తనభార్య వింజామర లిడుచుండం బ్రకాశించుచున్న యప్పాండ్యరాజుం గనియె నని భావము.

వ. కని వినతుం డై చేర నరిగి యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న నాదరింపక సంరంభి యై యవ్విశ్వంభరాభర్త యి ట్లనియె. 59

టీ. కని=చూచి, వినతుండై = నమ్రుఁడై, చేరనరిగి = సమీపమునకుఁ బోయి, యజ్ఞోపవీతంబు గాను కిచ్చి=జందె ముపాయనంబుగ నొసంగి, కూర్చున్నన్=ఆసీనుఁడు కాఁగా, ఆదరింపక = మన్నన చేయక, సంరంభియై = ఉద్రేకముగలవాఁడై, అవ్విశ్వంభరాభర్త=ఆ రాజు, ఇట్లనియెన్ = వక్ష్యమాణక్రమంబునఁ బలికెను.

తే. 'సంగతియె యోయి యిసుమంత యీ తింగణావు
తత్త్వనిర్ణయవాదంబు తరమె నీకు?
నోడితేనియుఁ బట్టి మొత్తుట్టో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొడువు. 60

టీ. ఓయి = ఓ బ్రహ్మచారీ! సంగతియె = యుక్తమా, ఇసు...వు - ఇసుమంత = ఇంచుకంత, తింగణావు = పిన్నవాఁడవు, తత్త్వనిర్ణయవాదంబు = స్వరూపనిశ్చయ ప్రసంగము, తరమె నీకున్ = నీకు శక్యమా, ఓడితేనియున్ = పరాజితుండవైతివేని, పట్టి = బలాత్కరించి, మొత్తుట్టోయనంగన్ = ఆర్తధ్వని చేయఁగా, లింగమును గట్టక = శివమూర్తి బంధింపక, ఉడుగము = మానము. ఎఱింగి = విచారించుకొని, నొడువు = మాటలాడుము.

తా. అప్పు డప్పాండ్యరాజు 'ఓ బ్రహ్మచారీ! న్యాయమా, నీవు మిక్కిలి చిఱుత వాఁడవు గాన స్వరూపసిద్ధాంత మె ట్లొనర్పఁగలవు. వాదమునఁ బరాజితుండవైతివేని

మొట్టోయన్నను వదలక పట్టి లింగముఁ గట్టించి పంపుదుము; విచారించి మాట లాడు మనిరి.

తే. వాదుల మటంచుఁ జెప్పించి ♦ వత్తు; రోట
మైన దయ నీరె యేమైన ♦ నని విలజ్జ
జాటుఁదనమున సభ లెక్కు ♦ చౌరవకాండ్రు;
[1]పాఱువారలసుద్ది సెప్పంగ నేల. 61

టీ. వాదుల మటంచున్ = ప్రాసంగికుల మని, చెప్పించి = వర్తమానముఁ బంపి, వత్తురు = ఏతెంచెదరు, ఓటమైనన్=ఓడినను, దయన్ = కృపచేత, ఏమైనన్ = కొంచె మైనను, ఈరె = ఇయ్యరా, అని = ఇట్లని, విలజ్జన్ = సిగ్గు లేకుండుటచేతను, జాటుఁదన మునన్ = మోసముచేతను, సభలు = ఆస్థానములను, ఎక్కు = ప్రవేశించునట్టి, చౌరవ కాండ్రు = ప్రవేశించు స్వభావముగల సాహసికులైనవారు, వత్తు రను క్రియతో నన్వయము. పాఱువారల = బ్రాహ్మణులయొక్క, సుద్ది = వృత్తాంతమును, చెప్పంగ నేల = వచించుట యెందులకు.

తా. మఱియు నారాజు ఏమియు నెఱుఁగని బ్రాహ్మణులు దాము వాదమం దోడినను, గరుణించి కొంచె మయిన నీయరా చూత మని తలపోసి ప్రాసంగికుల మని చెప్పికొనుచు వచ్చుచున్నారు. ఇట్లు లజ్జలేక మోసకాఱితనమున సభలను బ్రవేశించు నట్టిసాహసికు లగునావిప్రుల వృత్తాంత మే మని వచింపుదు నని నిందించె నని భావము.

వ. అని పలికి దరహాసంబుతో దేవిదెసఁ జూచి యి ట్లనియె. 62

టీ. అని పలికి = ఈలాగునఁ జెప్పి, దరహాసంబుతోన్ = చిఱునవ్వుతో, దేవి దెసన్ = భార్యదిక్కును, చూచి = వీక్షించి, ఇట్లనియెన్ = వక్ష్యమాణక్రమంబుగ వక్కాణించెను.

క. అస్మన్మతస్థుఁ డోడిన
భస్మము రుద్రాక్షములును ♦ బాసి యితనిచే
విస్మయముగఁ [2]దప్తపుముర
ఘస్మరచక్రాంకితుండఁ ♦ గాఁ గలవాఁడన్. 63

టీ. అస్మన్మతస్థుఁడోడినన్ = నాకిష్టమైన శైవమతస్థుఁడు పరాజితుఁ డాయెనా భస్మము = విభూతిని, రుద్రాక్షములును = రుదురాక్కములను, పాసి = త్యజించి, ఇతని చేన్ = ఈ పటువుచేతను, విస్మయముగన్ = ఆశ్చర్యముగా, తప్త...దన్ - తప్తపు =

1. పాఱుదురు వాండ్రసుద్ది చెప్పంగ నేల. 2. సాష్టము మురి.

తపింపఁబడిన, మురఘస్మర = మురాసురుని భక్షించిన విష్ణుదేవునియొక్క, చక్ర = చక్రముచేతను, అంకితుండక్ = చిహ్నితుఁడను, కాఁగలవాఁడక్ = అయ్యెదను. ని. 'భక్షకోఽమస్మరోద్మర' యని యమరము.

తా. ఇపుడు నడుచుచున్న వాదమున నా కభిమతుం డయినశివమతస్థుఁ డోడెనేని విభూతి రుద్రాక్షములం బరిత్యజించి నేనే బ్రహ్మచారిచేతఁ జక్రాంకితుండ నయ్యెద ననియె.

తే. ఉవిద! యీనీదువిద్వాంసుఁ డోడెనేని
నీకు నితనికే నన్న పూనికయ యన్న
'నొప్పితిమి దేవరానతి దప్పకున్నఁ
జాలు మఱి పంచభూతము ల్సాక్షిగాఁగ.' 64

టీ. ఉవిద = ఓస్త్రీ, ఈ నీదువిద్వాంసుఁడోడెనేని = ఈ నీపండితుఁడు పరాజితుఁడాయెనా, నీకక్ = నీకును, ఇతనికిక్ = ఈ యామునాచార్యునకును, ఏక్ = నేను, అన్న = అన్నట్టి, పూనికయ = ప్రతిజ్ఞయే, అన్నక్ = ఇట్లనఁగా, ఒప్పితిమి = మేము సమ్మతించితిమి. దేవర = తాము, ఆనతిక్ = చెప్పినమాటను, తప్పకున్నక్ = అతిక్రమింపకయుండిరా, చాలును = పర్యాప్తము. మఱి = మఱియును, పంచభూతములు = పృథివ్యప్తేజోవాయ్వాకాశములు, సాక్షిగాఁగక్ = నిష్పక్షపాతముచేసఁ జూచువారలుగాఁగా, తప్పకుండినఁ జాలు నని క్రింది కన్వయము.

తా. ఓ వనితామణీ! నీ పండితుఁడు డోడెనా నీవును నీ యామునాచార్యుఁడును నేఁ జెప్పినట్లే శైవదీక్ష వహింపవలసి యుండు ననఁగా విని, యా రాజుభార్య "యో స్వామీ మీయాజ్ఞ కొడంబడితిమి మీరును బంచభూతములు సాక్షిగా నానతిచ్చిన మాటను దప్పక నడపవలయు" నని ప్రత్యుత్తర మిచ్చె ననుట.

వ. అని పలుకు నయ్యిరువురప్రతిజ్ఞ లాకర్ణించి. 65

టీ. అని = ఇట్లని, పలుకు=వచించుచున్న, అయ్యిరువుర = అయిద్దఱ యొక్క, ప్రతిజ్ఞలు=శపథములను, ఆకర్ణించి = విని.

తే. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగఁ బసుపు
గోఁచి గట్టిన మోదుగుంతగోల నెగయఁ
బ్రాంజలి వినీతుఁ డై విన్నపం బటంచు
నర్ధముక్తాసనత నిట్టు లనియెఁ బతికి. 66

టీ. అతఁడు = ఆ యామునాచార్యుఁడు, మృగకృత్తి = కృష్ణాజినము, వెళవెళ యనఁగన్ = వెళవెళయాడఁగాను, పసుపుగోచిన్ = హరిద్రాకౌపీనము, కట్టిన = కట్టఁబడిన, మోదుగుఁగోలన్ = పలాశదండమందు, ఎగయన్ = చలింపఁగా, ప్రాంజలి = చేతులుజోడించినవాఁడై, నమ్రుఁడై, విన్నపం బటంచున్ = నేను విన్నపము చేయుచున్నట్టి వాక్యము నాలకింపు మటంచును, అర్ధముక్తాసనతన్ = సగము విడువఁబడిన యాసనము గలవాఁడై పలికెన్ = రాజునుగూర్చి, ఇట్టు లనియెన్ = ఈలా గనియెను.

తా. అట్లయ్యిరువురు నిర్ణయించుకొనిన శపథముల నాకర్ణించి యామునాచార్యుం డపుడు దాను ధరియించియున్న కృష్ణాజినము వెళవెళలాడఁగాఁ బాలాశదండమునందు బంధింపఁబడినగోచి చలించునట్లు సగము విడువఁబడ్డ యాసనముగలవాఁడై చేతులు జోడించి విన్నవించెద నాకర్ణింపు మని రాజునుగూర్చి పలికె ననుట.

క. 'దేవా! యిట్లని యానతి
యీ వల దేఁ గడుపుఁగూటి కిటు రా[1]నాడ
బ్బేవారిఁ బ్రోవ భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెనె గాదే. 67

టీ. దేవా = ఓరాజా ! ఇట్లని = ఈలాగని, ఆనతి యీవలదు = ఆజ్ఞయీయవలదు, ఏన్ = నేను, కడుపుగూటికిన్ = పొట్టవంటకమునకు, ఇటురాన్ = ఇక్కడికి రాను, నాడబ్బు = నాద్రవ్యము, ఏవారిన్ బ్రోవన్ = ఎవ్వరిని రక్షించుటకొఱకు? వర్ణికిన్ = బ్రహ్మచారికి, భిక్షాజీవిక=యాచ్ఞాజీవనము, విధి = బ్రహ్మ, సృజించెనెగాదె= సృష్టించియే యున్నాఁడుగదా.

తా. ఓయిరాజా ! నీ వీలాగున సెలవీయవలదు; నేను కడుపుకూటినిమిత్తమై వివాదముఁజేసెద నని చెప్పి వచ్చినవాఁడ కాను. నే నెవ్వరిని రక్షింపవలసియున్నది; బ్రహ్మచారికి బ్రహ్మ భిక్షావృత్తిని మున్నే సృజియించియుండలేదా యని భావము.

తే. ఎవ్వఁ డీ(డే)సర్వభూతస్థుఁ డిట్టెఱుంగు
నకును బ్రేరేఁచె నతనియానతియె తెచ్చె
నెఱిఁగినవి నాల్గు నొడువ నోట్లని లెస్స
యతఁడ బొంకిన నేమి సేయంగ వచ్చు. 68

టీ. ఎవ్వఁడు = విభగవంతుఁడు, ఈసర్వభూతస్థుఁడు = ఈసర్వాంతర్యామియై, ఇట్టెఱుంగునకున్ = ఈప్రకారమునకు, (వాదార్థమై యనుట.) ప్రేరేఁచెన్ = ప్రేరణ

1. నాడం బేవారి.

చేసెనో, అతని=ఆదేవునియొక్క, ఆనతియె = ఆజ్ఞయే, తెచ్చెన్ = తీసికొనివచ్చెను, అతఁడె=నన్నుఁదెచ్చినభగవంతుఁడే, బొంకినన్=అబద్ధమాడినను, ఏమి సేయంగవచ్చున్= ఏమిసేయఁగలను, ఎఱిఁగినవి=నాకుఁదెలిసినవి, నాల్గు=నాలుగుయుక్తులును, నొడువన్= చెప్పఁగా, ఎట్లేని = ఏలాగైనను, లెస్స=యోగ్యమె.

తా. సర్వాంతర్యామియైన యేదేవుండు న న్నిట్లు వాదముసేయు మని ప్రేరేపించెనో యట్టిభగవంతుండే బొంకినపుడు నే నేమి సేయంగలవాఁడను? నాకుం దెలిసియున్న నాలుగుయుక్తులను జెప్పెద; దానిపై నేలాగైనను యోగ్యమే యనిపలికె ననుట.

తే. పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర
యుక్తులను నిగ్రహస్థాన మొదవెనేని
యమ్మ దెచ్చినవిద్వాంసుఁ డనఁగ వలవ
దెట్లు గావింప వలయు నట్లట్ల చేయుఁ.' 69

టీ. పార్థివేంద్ర = ఓయిరాజా ! పంతమైనను=నీవాడిన ప్రతిజ్ఞనైనను, కానిమ్ము= జరగనిమ్ము, యుక్తులను = ప్రతివాదియుక్తులచేతను, నిగ్రహస్థానము = ఓడుట, ఒదవెనేని = వచ్చెనేని, అమ్మ = దేవరదేవి, తెచ్చినవిద్వాంసుఁడు = రావించినపండితుఁడు, అనఁగ వలదు=అని విచారింపకుము, ఎట్లు గావింపవలయున్=ఏలాగునఁ జేయవలయునో అట్లట్ల చేయుము = అలాగుననే చేయుము.

వ. అని య(యు)లుకు విడిచి పలికి, మగుడం గూర్చుండి, యతని యనుమతి వాదంబునకుం దొడంగి. 70

టీ. అని=ఈలాగని, అలుకు = భయమును, విడిచి = త్యజించి, పలికి=వాక్రుచ్చి, మగుడన్=మరలను, కూర్చుండి=ఆసీనుఁడై, అతనియనుమతిన్=ఆరాజుయొక్కయాజ్ఞచే, వాదంబునకున్=ప్రసంగమునకు, తొడంగి = ఉపక్రమించి.

తా. ఓయిరాజా ! నేఁ బ్రతివాదియుక్తులకు నోడితినేని మీరానతిచ్చినట్టి ప్రతిజ్ఞనైనను జరగింపుఁడు, అమ్మగారు పిలువంబంచిన విద్వాంసుం డని మన్నింపక మీకిష్టము వచ్చినయట్లు చేయింపుఁ డని పల్కె ననుట.

## అన్యమతఖండనము

సీ. అందులో నొకమేటి కభిముఖుండై యాతఁ
డనిన వన్నియును ము న్ననువదించి ;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొడఁ బడఁగఁ బల్కి ;

ప్రక్కమాటల నెన్నక యొక్కొకమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి ;
క్రందుగా రేఁగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి ; యమ్మొదలి వానికినె మగిడి ;
తే. మఱి శ్రుతిస్మృతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి
విజితుఁ గావించి దయ వానిఁ విడిచిపెట్టె. 71

టీ. అందులోన్ = ఆవాదులలో, ఒకమేటికిన్ = ఒకప్రౌఢవాదికి, అభిముఖుండై = ఎదురుగా నున్నవాఁడై, అతఁ డనినయన్నియున్ = అతండు సెప్పినయుక్తుల నన్నిటిని, మున్ననువదించి = ముందనువాదముఁ జేసి, తొడఁగి = ఉపక్రమించి, అన్నిటికిన్ = అతఁడు సెప్పినయుక్తులకన్నిటికిని, అన్నిదూషణంబులు = అన్నిదోషంబులు, వేగపడక = త్వరపడక, 'ప్రథమావైభక్తికమార్చిందుశ్చ మహాన్పతిక్రియాశ్లేషః' అనుసూత్రముచేత మువర్ణకలోపము. తత్సభ = ఆసభ్యులు, ఒడఁబడఁగన్ = సమ్మతించునట్లుగా, పల్కి = సంభాషించి, ప్రక్కమాటలన్ = పార్శ్వములనున్నవారు సెప్పునట్టియుక్తులను, ఎన్నక = గణనచేయక, ఒక్కొకమాటనె = ఒక్కొకయుక్తిచేతనే, నిగ్రహస్థాన మనుగ్రహించి = నిగ్రహస్థానమును బొందించి, యనుగ్రహించి, ('నిగ్రహస్థాన' మనఁగాఁ బ్రసంగదోషములకుఁ బేరు.) క్రందుగా రేఁగిన = దొమ్మిగాఁ బ్రసంగింపరాఁగా, కలఁగక = తొట్రుపాటుపడక, అందఱన్ = ఎల్లరను, తీర్చి = సమాధానపఱిచి, నిలిపి = ఉంచి, అమ్మొదలివానికినె = ఆ మొదలి విద్వాంసునకె, మగిడి = తిరిగి, మఱి = మఱియును, శ్రుతి = వేదములు, స్మృతి = ధర్మశాస్త్రములు, సూత్ర = వ్యాససూత్రములు, వీనియొక్క, సమాజమునకున్ = సమూహమునకు, ఐకకంఠ్యము = ఏకగ్రీవత, కల్పించి = చేసి, ఆత్మమతము = స్వమతము, జగ మెఱుంగఁగన్ = లోక మెఱుంగునట్లు, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, విజితుఁ గావించి = ఓడించి, దయన్ = కరుణచేత వానిన్ = అతనిని, విడిచిపెట్టె.

తా. ఆ వాదులలో నొకప్రౌఢవాది కభిముఖుండై యతఁడు సెప్పినయుక్తులను ముం దనువాదముఁ జేసి యుపక్రమించి పిమ్మట నా యుక్తుల కన్నిదూషణంబులును దాను త్వరపడక సభ్యులు మెచ్చునటులఁ బల్కి యిరుప్రక్కల నున్నవారు సెప్పుచున్న మాటల నెన్నక యొక్కొకయుక్తిచేత నిగ్రహస్థానము లొందవిన ననుగ్రహించి సభ్యులు దొమ్మిగా వచ్చి ప్రసంగింపఁ దాఁ దొట్రుపడక యందఱను సమాధానపఱిచి

యుంచి యామొదలివిద్వాంసునకే మరల వేదశాస్త్ర బ్రహ్మసూత్రములకు నేకవాక్యతఁ గల్పించి చెప్పి పిమ్మట స్వమతము సిద్ధాంత మని లోక మెఱుంగునట్లుగఁ జేసి యోడించి దయచేత వానిని విడిచిపెట్టును.

క. 'నీ వేమంటివి ర'మ్మం, చావలివానికిని మగిడి ॥ యట్లనె వానిం
గావించి, యొకఁడొకఁడు రా, నావిప్రుఁడువాదసరణి ॥ నందఱఁ గెలిచెన్.

టీ. నీ వేమంటివి = తొలుత దొమ్మిగఁ బ్రసంగింపవచ్చినవారలలో నొక్కనిం జూచి యీవు వల్కినదేమి, రమ్మంచున్ = రమ్మని యోడించి, ఆవలివానికిని=ఆవలనున్న మఱియొకనికిని, మగిడి=అభిముఖుండై, వానిన్=ఆ వానిని, అట్లనె=మొదలివాదినివలెనే, కావించి = చేసి, మఱియు నీప్రకారముగన్, ఒకఁడొకఁడు = ఒకనివెంట నొకఁడుగా, రాన్ = రాఁగాను, ఆవిప్రుఁడు = ఆ యామునాచార్యుఁడు, వాదసరణిన్ = వాదముఖమున, అందఱన్ = వాదుల నెల్లను, గెలిచెన్ = జయించెను.

తా. మఱియొకనితట్టు తిరిగి నీ వేమంటివి రమ్మని ప్రసంగించి యోడఁగొట్టి యావలివాని కెదురై వానిని నోడఁగొట్టి యీరీతి నొక్కొక్కఁడుగ రాఁగా నా విప్రుఁడు ప్రసంగించి యందఱ బ్రసంగించుసమయమున నోడఁగొట్టెను.

వ. ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు నగుటం బ్రతిష్ఠించిన. 73

టీ. ఇట్లు జయించి=ఇవ్విధమున గెలిచి, విష్ణుదేవుండె = శ్రీమన్నారాయణుండె, పరతత్త్వం బనియున్ = పరబ్రహ్మ మనియును, విశిష్టాద్వైతంబ=జీవేశ్వరులకు భేదప్రతిపాదన మగుటయె, మతంబున్=సిద్ధాంతమును, అగుటన్, ప్రతిష్ఠించినన్ = స్థిరపఱుపఁగా (స్థూల చిదచిద్విశిష్ట పరబ్రహ్మమునకును, సూక్ష్మ చిదచిద్విశిష్ట పరబ్రహ్మమునకును అభేద మని చెప్పుటయె విశిష్టాద్వైతశబ్దార్థ మనుట.)

క. ఆయెడను నొక్కపలు కెదు
రై యుండెడు పిప్పలమున ॥ నాయెను విన 'నో
హో యిది నిక్కము నృప నా
రాయణుఁడె పరంబు కొల్వు ॥ మతని' నటంచున్. 74

టీ. ఆయెడన్ = ఆసమయమందు, ఎ...నన్-ఎదురైయుండెడు = పురోభాగమున నున్నట్టి, పిప్పలమునన్ = రావిచెట్టునందు, ఓహో = ఓయీ, నృప = రాజా! ఇది=ఈ యామునాచార్యుఁడు చెప్పినది, నిక్కము = యథార్థము. నారాయణుండె =

1. ఆయెడ నొకపలుకం కెదు,

విష్ణుదేవుండె, పరంబు = పరబ్రహ్మము, అతనిఁ = ఆనారాయణుని, కొలువుము = సేవింపుము. అటంచుఁ = కూలాగంచును, ఒక్కపలుకు = ఒకవాక్యము, వినఁ ఆయెఁ = వినఁబడెను.

తా. ఇట్లుయ్యామునాచార్యుండు సిద్ధాంత మొనర్చినసమయమున నెదుట నున్న రావిమ్రానినుండి, 'యోయిరాజా! యీ బ్రహ్మచారి చెప్పినది నిజము. శ్రీమన్నారాయణుండే పరబ్రహ్మ మగుటంజేసి యద్దేవుని సేవింపు' మను నొక్కశబ్దము వినవచ్చెను.

వ. అప్పలుకులు విని ఖిన్నంబై యక్కూడినపాషండషండంబు తలవంచుకొని పోయిన నాయుర్వీధవుండు నతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి, హర్షాద్భుతరసోత్తరంగితాంతరంగుండై, భుజగశయనచరణకుశేశయభక్తి వొడమి కృతార్థతం బొంది, పాండ్యమండలమునకు భాగినేయుండ పట్టాభ్యుండు గావునఁ బాత్రం బని బ్రహ్మచారి యగునతనికిఁ దనకడగొట్టు చెలియలిం బరిణయంబు సేసి యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి, యువరాజుం జేసి, యధీతసాంగవేదుం డగునతనికి సధర్మశిరస్సభ్యస్తం బని యొఱంగి, యందు దివ్యాస్త్రమంత్రంబుల కలిమియుం దెలిసి, యమ్మహాత్మున కెచ్చరించి, దుస్సాధం బగువిరోధియూథంబు సాధింపు మని దండయాత్రఁ బనిచిన, నయ్యామునుండును సన్నద్ధుం డగుతఱిఁ దత్పురోహితప్రధానమంత్రివర్గంబు సన్నిహితంబు లగునివ్వారిశ్లేషకదినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయంబు సేయు మనుటయు, నత్తెఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. 75

టీ. అప్పలుకులు విని = ఆ వాక్యము లాలకించి, ఖిన్నంబై = విచారించునదై, అక్కూడినపాషండషండంబు = వాదమునకు నాయత్తపడి వచ్చిన యావేదబాహ్యుల సమూహము, తలవంచుకొని, (సిగ్గుచే ననుట) లేచిపోయినఁ = వెడలిపోఁగా, ఆయుర్వీధవుండును = ఆరాజును, అతనిమాహాత్మ్యంబునకుఁ = అయ్యామునాచార్యుని ప్రభావంబునకు, సంతోషించి = హర్షించి, సాష్టాంగ మెఱఁగి = ఎనిమిదియంగములతో నమస్కారమొనర్చి, (ఉరస్సు, శిరస్సు, దృష్టి, మనస్సు, వచస్సు, కాళ్లు, చేతులు, చెవులు ఈ యెనిమిదింటితోఁ జేయునమస్కారము సాష్టాంగము. దండవత్తుగా భూమిపయిం బడుట సాష్టాంగమండ్రు. 'ఎరగెఁ జేమోడ్చె నన నమస్కృతి యొనర్చె, ననుట కివి ధూర్యాలై చెల్లు' నని యాంధ్రనామసంగ్రహము.) హ...డై-హర్షాద్భుతరసఁసంతోష

రసముచేతను ఆశ్చర్యరసముచేతను, ఉత్తరంగిత = ఉప్పొంగింపఁబడిన, అంతరంగుండై = హృదయముగలవాఁడై, భు... క్తి-భుజగశయన = శేషశాయియొక్క, చరణకుశేశయ = పాదపద్మములయందు, భక్తి = భజింపవలయు నన్నయాసక్తి, పొడమి = పుట్టి, కృతార్థతంబొంది = కృతకృత్యుఁడై, పాండ్యమండలంబునకున్ = పాండ్యదేశమునకు, భాగినేయుండె = మేనల్లుఁడె, పట్టార్హుండుగావున = ప్రభుత్వమునకుఁ దగినవాఁడు గాన, పాత్రంబని = యోగ్యుఁ డని, బ్రహ్మచారియగునతనికిన్ = వటువైనట్టి యయ్యామునాచార్యునకు, తనకడగొట్టుచెలియలిన్ = తనచిన్నచెల్లెలిని, పరిణయంబు చేసి = వివాహము గావించి, అరణంబుగన్ = కట్నముగ, (అరణం బనఁగాఁ బెండ్లికాలమందు మామగా రల్లుని కిచ్చునట్టిద్రవ్యము.) అమ్మహాత్మునకున్ = ఆ వటువునకు, ధారాపూర్వకంబుగాన్ = దానముగా, అర్ధరాజ్యంబిచ్చి = సగముదేశము నొసంగి, యువరాజుంజేసి = యువరాజుగా నియమించి, అధీతసాంగవేదుండగు = షడంగవేదవేత్తయగు, అతనికిన్ = అయ్యామునాచార్యునకు, అథర్వశిరస్సు = అథర్వణశిఖ, అభ్యస్తం బని=చదువఁబడిన దని, ఎఱింగి=తెలిసి, అందున్ = ఆ యాథర్వణవేదమందు, దివ్య=మహిమగల, అస్త్రమంత్రంబుల = బ్రహ్మాస్త్రము మొదలగు నస్త్రంబులయొక్కయు, తత్సాక్షాత్కారము చేయుమనువులయొక్కయు, కలిమియున్ = కలిగియుండుటను, తెలిసి = ఎఱింగి, అమ్మహాత్మునకున్ = అతనికి, ఎచ్చరించి = ప్రస్తావమొనరించి, దుస్సాధంబగు = సాధింపశక్యముగాని, విరోధియూధంబున్ = శత్రుసమూహమును, సాధింపు మని = జయింపు మని, దండయాత్రన్ = యుద్ధయాత్రను, పనిచినన్ = చేయుమనఁగా, అయ్యాముసుండు = అయ్యామునాచార్యుండు, సన్నద్ధుండగుతఱిన్ = ప్రయాణోద్యుక్తుండైన సమయమునను, తత్పు...వర్గంబు-తత్ = ఆయామునాచార్యుని యొక్క, పురోహిత = పురోహితులయొక్కయు, ప్రధాన = మహామంత్రుల (దివానుల) యొక్కయు, మంత్రి = అమాత్యులయొక్కయు, వర్గంబు = గణంబు, సన్నిహితంబులగు = సమీపించియున్న, ఇవ్వార్షికదినంబులు = ఈ వానకాలపుదివసంబులు, కడపి = వెళ్ళఁజేసి, శరత్సమయంబునన్ = ఆశ్వయుజకార్తికమాసములయందు, విద్విషత్సంహారంబునకున్ = శత్రువులం బరిమార్చుటకు, విజయంబుసేయు మనుటయున్ = చనుం డనఁగా, అత్తెఱంగు = అవర్షాకాలప్రయుక్తప్రవిరోధమును, రాజునకున్ = ప్రభువునకు, ఎఱింగించి = తెలిపి, తత్సమ్మతంబునన్ = ఆరాజుయొక్కయనుమతిచేతను, నిలిచెన్ = వెళ్ళకయుండెను, అంతన్ = అటుపిమ్మటను.

తా. అపు డట్లద్భుతమగ నుత్పన్నములైన వాక్యములను విని చేయునది లేక ఘూషభయం దున్న పాషండు లగు దుర్వాదులు ఖిన్నులై లేచిపోయిరి. రా జయ్యాము

నాచార్య మహాత్త్వంబునకు మెచ్చి సంతసించి యవ్విప్రునకు దండవత్ప్రణామం బాచరించి శ్రీవిష్ణుదేవునియందు భక్తిజనించుటవలనఁ గృతకృత్యుండై తనరాజ్యము మేనల్లునికిం బట్టముగట్టునట్టిసంప్రదాయము గలది యగుటం జేసి యతనికిం దనముద్దు చెలియలి నిచ్చి వివాహంబొనర్చి యావివాహకాలమున ధారాపూర్వకముగఁ దన రాజ్యమున నర్ధరాజ్యమిచ్చి యువరాజుగా నియమించి తరువాత నధీతనిఖిలాస్త్రవేదుం డగు నతనిం జిరకాలముగఁ దన కసాధ్యులై యున్న శత్రురాజుల సాధింపు మని నియోగింప నందుల కయ్యామునాచార్యుం డొడంబడి యుద్ధయాత్ర వెళ్లుట కుద్యుక్తుఁడయ్యెను. కాని, మంత్రిపురోహితులు మొదలగువార లిప్పుడు సంప్రాప్తించియున్న వర్షాకాలము వెళ్లఁగానే దండయాత్ర యొనర్చుట యుక్త మని విన్నవించిన నవ్విధ మారాజునకుఁ దెలిపి యతని యనుజ్ఞ వడసి నిలిచియుండెను.

## వర్షాకాలవర్ణనము

ఉ. కర్కశుఁ డంట కోర్వక కుశేశయంబులు వాగ్పతి గూర్చినట్లు న
 య్యర్కుఁడుఁ దాను గూర్చి మఱి యాసలిలాధిపచిహ్నవాహతం
 బేర్కొలగంగ నాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్న నీర్ష్యఁ దాఁ
 గర్కటకస్థుఁ డయ్యె ననఁ గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. 76

టీ. అర్కుఁడు = సూర్యుఁడు, కర్కశుఁ డంటకున్ = కఠినుఁ డనుటకు, ఓర్వక = సహింపక, ఉదకంబులు = జలములను, వాగ్పతి గూర్చినట్లు = వరుణుఁడు సంగ్రహించినట్లు, అయ్యర్కుఁడున్ = ఆసూర్యుఁడును, తాను గూర్చి = తానును జల సంగ్రహముఁ జేసి, మఱి = తరువాతను, ఆ...తన్ - ఆసలిలాధిపచిహ్న = వరుణుని యొక్క గుఱుతయిన మొసలి, వాహతన్ = తనకు వాహనముగాఁగలదని అని, పేర్కొల గంగన్ = పేరువహించినదైన (ప్రసిద్ధమయిన) గంగానదియందు, ఆతఁడు = ఆవరు ణుఁడు, ఎలమిన్ = ప్రీతితో, మకరస్థితిన్ - మకర = మొసలియందు, స్థితిన్ = ఉండుటను, కన్నన్ = పొందఁగా, ఈర్ష్యన్ = అసూయచేత, తాన్ = తాను, కర్కటకస్థుఁ డయ్యె ననన్ = కుళీరమందుఁ బ్రవేశించెనో యన్నట్లు, అత్తఱిన్ = ఆసమయమందు, కర్కటకస్థితిఁగాంచెన్ = కుళీరమందుఁ బ్రవేశించెను. సూర్యునకు సహజమైన కర్కాటకరాశి ప్రవేశమునకు మకరస్థవరుణేర్ష్యాకృతత్వము నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్షాలంకారము.

తా. సూర్యుఁడు కఠినుఁ డనుట సహింపని వరుణుఁడు తాను జలములు సంగ్ర హింప నాసూర్యుఁడును జలగ్రహణ మొనర్చి, వరుణునిచిహ్నము తనకువాహన మగుటచే

ప్రసిద్ధమగునట్లు మొసలి యం దుండఁగా ననూయచే సూర్యుఁడుకూడఁ గర్కటకస్థితి గాంచెనో యన్నట్లు కర్కటరాశియందుఁ బ్రవేశించెను. అనఁగా వర్షాకాల మారంభ మయ్యెను.

తే. వనతతివరాహవాహారివాయుభుగ్వి
రోధివారణవర్షాభుసాలాధిఁ దొఱఁగె
నెండ్రి రవి చేర మూఁడవయెడకుఁ జేరు
తరణి ధరణిం బ్రమోదసంధాయి గాఁడె. 77

టీ. రవి = సూర్యుఁడు, ఎండ్రిన్ = కర్కటమును, చేరన్ = ప్రవేశింపఁగా, వన...ధిన్ - వనతతి = వనసమూహమును, వరాహ = అడవిపందులును, వాహారి = మహిషములును, వాయుభుగ్విరోధి = పాములకు విరోధులగు మయూరములును, వారణ = ఏనుఁగులును, వర్షాభులు = కప్పలును, ఆధిఁ దొఱఁగె = మనోవ్యథ మానెను. ని. 'వరాహసూకరోఘృష్టిః, నీలకణ్ఠోభుజఙ్గభుక్, కుఞ్జరోవారణః కరీ, లులాయో మహిషోవాహద్విషత్కాసరసైరిభాః, భేకేమండూకవర్షాభూః' అని యంతట నమరము. మూఁడవయెడకున్ = జన్మలగ్నతృతీయస్థానమునకు, చేరు = ప్రవేశించునట్టి, తరణి = సూర్యుఁడు, ధరణిన్ = భూమియందు, ప్రమోదసంధాయి = సంతోషమునిచ్చువాఁడు, కాఁడె = కాఁడా! అగును.

తా. 'షట్త్రిదశస్థో భానుః' అని జన్మరాశికి మూఁట నాఱింటఁ బదింట నున్న సూర్యుఁడు శుభఫలప్రదుఁడుగాన వనతతి, వారాహ, వాహారి, వాయుభుగ్విరోధి, వారణ, వర్షాభులనామాద్యక్షరము వకార మగుటవలన 'వోవా వీవో రోహిణీ' అని నామాద్యక్షరముచేత వీనికి రోహిణీనక్షత్రమాయెను గానఁ గృత్తికా త్రిపాదం రోహిణీ మృగశిరార్ధం వృషభ మని వృషభలగ్నమాయెను. అవృషభలగ్నమునకు మూఁడవదియైన కర్కాటకమందు రవి ప్రవేశింపఁగానే వర్షములు కురిసినందున యాఱింటికిని సంతోషకరుఁ డాయె నని చెప్పి సామాన్యముచేత విశేషమును సమర్థించి నందునఁ దద్రూపమగు నర్థాంతరన్యాసాలంకారము. అడవులు, అడవిపందులు, నెమిళ్లు, ఏనుఁగులు, కప్పలు జలము కోరుచుండుచుగాన వర్షాకాలము రాఁగానే వానిమనోవ్యథ తొలఁగెను. సూర్యుఁడు కర్కాటకము ప్రవేశించుటతోఁ దృతీయస్థానము చేరినరవి సంతోషప్రదుఁడే యగును గదా.

తే. వనధిగమనజగర్భార్కసజనిత ఘృణులు
మఱి ప్రసూతికి నతనిధామంబుఁ జేరె(ర)

ఘనతఁ జొచ్చినయిండ్లను । [1]దనయు లుండి
కాన్పునకుఁ బుట్టినిల్చేరుశ క్రమము గనమె. 78

టీ. వ...లు - వనధి = సముద్రముయొక్క, గమన = పొందుటచేతను, జ = పుట్టిన, గర్భ = చూలుగల (అనగా నుదకములోపలఁ గలిగినటువంటి), అర్క = సూర్యునివలన, జనిత = పుట్టినటువంటి, ఘృణులు = కిరణములు, మఱి = తదనంతర మందు, ప్రసూతికిన్ = ప్రసవించుటకు, అతనిధామంబున్ = ఆసూర్యునియొక్క స్థానమును, చేరెన్ = ప్రవేశించెను. ఘనతన్ = ఆధిక్యముచేతను, చొచ్చినయిండ్లన్ = అత్తవారిండ్లను, తనయలు = కొమార్తెలు, ఉండి = కాఁపురముండి, కాన్పునకున్ = ప్రసవమునకు, పుట్టినిల్చేరుక్రమము = తల్లిగారింటికిపెళ్లుమర్యాదను, చూడమా, చూచు చున్నా మనుట.

తా. సూర్యకిరణములే మేఘము లనిప్రసిద్ధి గాన సూర్యునివలనఁ బుట్టిన మేఘ ములు సముద్రునింబొందుటచే లోపల నిమిడియున్న యుదకములను గర్భములఁ దాల్చి ప్రసవమునకుఁ దమజన్మస్థానమైన సూర్యునిఁ జేరుచున్న పన్నట్లు వర్షించుచు గొప్పదనము చేత నత్తవారింటఁ గాఁపురముచేయుచున్న కొమార్తెలకు గర్భముగలుగఁగానే బిడ్డలం గను టకుఁ బుట్టినిల్లు చేరుచుండుమర్యాదవలె నొప్పెను. మేఘములు సముద్రోదకముచేత గర్భమును ధరించిలోకమునంతట వర్షించుచున్న వని ప్రతీతి గనుక నిట్లు వర్ణింపఁబడియె. అర్థాంతరన్యాసాలంకారము.

తే. ఉర్విఁ గాదంబినుల యల । యుమ్మనీరు
దొరుఁగఁ గేకులు కేకలు । తొఁన సేసె
ద్విజత నారణ్యకధ్వని । వినఁగఁ జేసి
గర్భము సుఖచ్యుతము సేయఁ । గడఁగె సనఁగ. 79

టీ. ఉర్విన్ = పుడమియందు, కా...రు-కాదంబినుల = మొయిళ్లగుంపుల యొక్క, అల=ప్రసిద్ధమైన, ఉమ్మనీరు = ప్రసవజలముఁ(అనఁగా గర్భకోశములో శిశువు నావరించియుండి ప్రసవకాలమున వెలువడునీరు.) తొరుఁగన్ = స్రవింపఁగా, ద్విజ తన్ = ద్విజత్వముచేతను, ని. 'దంతవిప్రాణ్డజాద్విజాః' యని యమరము. ఆరణ్యకధ్వని = ఆటవికజనము వర్షమురాఁగా వర్షమువచ్చె నని రొదచేయఁనుగనుక నది యనునారణ్యాక శాఖయొక్క ధ్వనిని, వినఁగఁజేసి = శ్రుతపటిచి, గర్భము సుఖచ్యుతముసేయన్ = సుఖప్రసవము గల్గునట్లొనర్చుటకు, కడఁగె ననఁగన్ = ఉపక్రమించినపనఁగా, కేకులు =

1. దనుజ లుండి.

నెమిళ్లు, కేకలు = కేకాస్వరములను, తోన = వెంబడిగానె, చేసెన్ = ఒనర్చెను. ఇచ్చట మేఘోదయమువలన సంతసించిన మయూరములయొక్క కేకలను సుఖప్రసవార్థమైన యారణ్యకశాఖాధ్వనికి హేతు వని యుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. లోకమందు వేకటి గలయువిదలకుఁ బ్రసవసమయమునఁ గల్గునుమ్మనీరు గానుపింపఁగా నక్కడ నుండుస్త్రీలు దానిం జూచి ప్రసవకాలం బనియూహించి తమలోఁ దాము గొలగొల లాడుట ప్రసిద్ధము గావున నావిధముగా నెమిళ్లు మేఘమ్ములనుండి యుబ్బునీరు స్రవింపఁగా దాము ద్విజు లగుటం జేసి సుఖప్రసవార్థ మారణ్యకశాఖ నధ్యయనముఁ జేసి వినిపించుటకు నుపక్రమించెనో యన్నట్లు వెంబడించి కేకానాదములం జేసెను.

మ. అలపర్జన్యుఁడు భానుఁ డన్ కొలిమిలో నభ్రంపుఁ బెన్గొప్పెరన్
జల మాఁగన్ బిడుగుక్కుజాత్యపుటయస్కాంతంబు నత్తున్కలో
పలఁ జూప న్మహిమీఁదిలోహరజముం బైఁ బర్వె నా లేచె వా
త్యలఁ బ్రాగ్దావమషు ల్మొగి ల్మొదల గృధ్రంబై దివిం [1]బర్వినన్. 80

టీ. అ...డు-అల = ప్రసిద్ధుఁడైన, పర్జన్యుఁడు = దేవేంద్రుఁడు (కమ్మరవాఁడు), భానుఁ డన్ = సూర్యుఁడనియెడు, కొలిమిలోన్ = అయోగోళమందు, అభ్రంపుఁ బెన్గొప్పెరన్ = మేఘమను పెద్దనీళ్లకాఁగును, జలమాఁగన్ = ఉదకములనాపుటకై, పి...బు - పిడుగు = అశనియను, ఉక్కు = లోహముయొక్క, జాత్యపు = సజాతీయమైన, అయస్కాంతంబు = సూదంటుఱాతియొక్క, అత్తున్కన్ = ఆశకలమును, లోపలన్ = అంతర్భాగమందు, చూపన్ = అతికింపఁగా, మ...ముక్ - మహిమీఁది = భూమండలముమీఁద నున్న, లోహరజమున్ = ఉక్కుపొడి, పైన్ = పైకి, పర్వెన్ = ఎగసి వ్యాపించెనో, నాన్ = అనునట్లు, వాత్యలన్ = సుడిగాడ్పులచేత, ప్రాగ్దావమషుల్ ప్రాగ్దావ = మొదలివైన కార్చిచ్చులయొక్క, మషుల్ = బూడిదలు, మొగిల్ = మేఘము, మొదలన్ = ప్రప్రథమమందు, గృధ్రంబై = గృధ్రంతపరిమాణముగలదై, దివిన్ = అంతరిక్షమందు, పర్విన్ = వ్యాపింపఁగా, లేచెన్ = ఎగసెను.

తా. తొల్దొల్త మేఘము గృధ్రమాత్రమై యంతరిక్షమున నుండునప్పుడు భూమియందున్న కార్చిచ్చుల మషీసమూహములు సుడిగాడ్పులచే నెగురఁగొట్టఁబడి పైకెగసి యందున్న స్వల్పమేఘమును గలయునపుడు పర్జన్యుం డను కమ్మరవాఁడు సూర్యుఁ

1. లేచినన్.

డనుకొలిమియందు మేఘమను నీళ్లకాఁగును నీరు కాఱకుండుటకై పిడుగుకన్కనకు సజాతి యైన సూదంటుఱాతి తునుకలు లోపల నతుకఁబెట్టఁగాఁ బుడమియందున్న లోహరజ పుంజములన్నియుఁ బయికి నెగసి యామేఘము నావరించి వృద్ధిఁబొందించునట్లుండెను. రూపకోత్థాపితమైన యుత్ప్రేక్షాలంకారము.

తే. ఇలకు డిగి చుట్టిచుట్టి దుమ్మెత్తి యెగసి
పోయి తమము ముంచుసుడిగాలిపుష్కరముల
గడలిపీ రభ్రకలభము ల్గ్రాసె ధరణి
నభ్రకరిశిక్ష దివి గాంచినట్టికరణి. 81

టీ. ఇలకుడిగి = భూమికిదిగి, చుట్టిచుట్టి = గిరగిరందిరిగి, దుమ్మెత్తి = ధూళిని గ్రహించి, ఎగసి = మీఁది కెగిరిపోయి, తమక్ = తమ్మును (అనఁగా మేఘములనుట), ముంచు=కప్పుచున్న, సుడిగాలి = తిరుగుడువాయువును, పుష్కరములక్ = తొండపు కొనలచేత, అ...ల్-అభ్ర = మేఘములనియెడు, కలభముల్ = ఏనుఁగుగున్నలు, కడలి నీరు = సముద్రమునఁ బానముఁ జేసియున్ననీటిని, దివిక్ = అంతరిక్షమందు, ధరణిక్ = భూమియందు, గ్రాసెక్ = వెళ్ళఁజల్లెను, అభ్రకరి = ఐరావతముయొక్క, శిక్షక్ = నేర్పుటను, కాంచినట్టికరణిక్=పొందెనోయన్నట్లు, ధరణిక్=భూమియందు, గ్రాసెక్ = వెడల నుమిసెను.

తా. లోకమునం దేనుఁగులు దొండముల కొనలచేత దుమ్మెత్తి పైకిఁజల్లుటయును నీటిని బీల్చి మరల వెళ్ళఁ జిమ్ముటయును బ్రసిద్ధముగావున, మేఘము లను నేనుఁగుగున్నలు భూమియందు లేచిన సుడిగాడ్పు లనుతుండములచేత సముద్రోదకమును పానముఁజేసి యైరావతముయొక్క సాహచర్యముచేత నంతరిక్షమం దభ్యాసముఁజేసిన విద్యచేతనో యన్నట్లు మరల వెళ్ళఁజిమ్మెను. ఇది రూపకోత్థాపితమైన యుత్ప్రేక్షాలంకారము.

తే. కృతపయఃపానవమేఘపృథుకములకు
రాలె నొయ్యన వడగండ్లపాలపండ్లు
మఱి బలాకాద్విజాళిసంప్రాప్తి గలిగెఁ
బెరుఁగ బెరుఁగంగ ధ్వనియు గంభీరమయ్యె. 82

టీ. కృ...కుక్-కృత = చేయఁబడిన, పయః = ఉదకములను క్షీరములయొక్క, 'పయఃపానీయ దుగ్ధయోః' యని రత్నమాల. పాన = త్రాగుటగలిగినట్టి, నవ = క్రొత్తలైన, మేఘ = మొయిళ్ళనియెడు, పృథుకములకుక్ = పసిబిడ్డలకు, 'పృథుకశ్శాబకశ్శిశుః' అని యమరము. ఒయ్యనక్ = మెల్లమెల్లఁగా, వడగండ్లపాలపండ్లు = వర్షోపలములను బాల్యదంతములు, రాలెక్ = పడెను, మఱి = వెనుకను, బలాకా = కొంగలనియెడు,

ద్విజాళి = పలువరుసయొక్క, సంప్రాప్తి = ప్రాప్తించుట, కలిగెన్ = సంభవించెను; పెరుఁగఁబెరుఁగంగన్ = నానాఁట వృద్ధిఁబొందఁగా, ధ్వనియు = శబ్దమును, గంభీర మయ్యెన్ = మిగుల నతిశయించెను.

తా. స్తన్యపానముఁజేయు పసిబిడ్డలకు మెల్ల మెల్లనఁ బాలపండ్లు రాలి, మరల పండ్లు మొలవఁగా నానాఁట వృద్ధిఁబొంది స్వరమతిశయించున ట్లుదకపానము గల నూతన జలధరములకు వడగండ్లను బాల్యదంతములు రాలి, పిమ్మటఁ గొంగలను దంతపఙ్క్తి గల్గి క్రమముగా వృద్ధిఁజెందఁగా గంభీరధ్వని యతిశయిల్లెను. శ్లేషానుప్రాణిత రూపకాలంకారము.

మ. తనతోయంబు నినరశ్ము లెత్త నిల వాత్యారేణుమూర్తి న్మహేం
ద్రునకుం జెప్పఁగ ముచ్చుఁ బట్ట దివమందుఁ విల్లు ఘటింపఁ భయం
బునఁ దద్రశ్మిసహస్రము న్వెస డిగెం బో డాఁగి వే గుమ్మరిం
ప నన౯ ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బుల న్వెల్లిపైన్. 83

టీ. ఇల=భూమి, త...బు-తన = తనయొక్క, తోయంబు=నీటిని, (తోయమను శబ్దము దేశ్యమగుటవలన ముఖ్యవస్తువును బోధించుచున్నదిగాన శ్రేష్ఠమైనపదార్థమనుట.) ఇనరశ్ములు = సూర్యకిరణములు, ఎత్తన్=అపహరింపఁగా, వా...ర్తిన్-వాత్యా=సుడిగాలి వలన నెగసినట్టి, రేణు=పరాగరూపమయిన, మూర్తిన్=శరీరముచేత, మహేంద్రునకున్= దేవేంద్రునకు, చెప్పఁగన్ = ఎఱింగింపఁగా, ఆయింద్రుండు, ముచ్చున్ = దొంగను, పట్టన్=పట్టుటకై, దివమందున్ = అంతరిక్షమందు, విల్లు ఘటింపన్=ధనుస్సును బూనఁగా, భయంబునన్ = భీతిచేత, తద్రశ్మి...మున్-తత్=ఆ సూర్యునియొక్క, రశ్మి=కిరణముల యొక్క, సహస్రమున్ = వేయును, వెసన్ = వేగముచేత, డాఁగి = కానరాకయుండి, వే = త్వరితముగా, వెల్లిపైన్ = ప్రవాహముమీఁద, కుమ్మరింపన్ = వర్షించుటకు, డిగెంబో = దిగెను గాఁబోలు, అనన్ = అనునట్లు, మించు = మెఱపు, వెలిఁగింపన్ = (కనుపించునట్లు) వెలుఁగుచేయఁగా, మబ్బులన్ = మేఘములయందు, ధారలు = నీటి ధారలు, తోఁచెన్ = కనఁబడెను.

తా. భూమి తనయుదకము లనుముఖ్యవస్తువులను సూర్యకిరణములు హరించి కొనిపోయిన వని సుడిగాలిచే రేపఁబడిన పరాగరూపమును దాల్చి యింద్రునితో మొఱవెట్ట నాయింద్రుఁ డంతరిక్షమం దాదొంగలనుఁబట్టుటకై తనధనుస్సును గనుపఱుపఁగా నందులకు భయమంది సహస్రకిరణములు నేకకాలమందు వానిని గుమ్మరింప నుద్యమించినవో యనునట్లు మేఘములనుండి వచ్చు నుదకధారలు మెఱపుల వెలుంగునఁ గానవచ్చుచుండెను. అలం. ఉత్ప్రేక్ష.

చ. తొలితొలివచ్చుధారల కెదుర్కొని తచ్ఛటఁ దీఁగెచుట్టుగా
నలముచు ధాత్రి లేచి పొలుపారె మలీమసబాష్పవల్లు ల
త్తొలితొలి ధారకే వెఱచి తొనె ఘనౌఘము వానకాళ్ళకుం
బలరిపుఁ డాలయాభ్రముల భంగిని సంకెల లూన్చెనో యనన్. 84

టీ. తొలితొలివచ్చు = ముందుముందుగవచ్చుచున్న, ధారలకున్=నీటిధారలకు, ఎదుర్కొని = ఎదిరించి, తచ్ఛటన్ = ఆధారాసమూహమును, తీఁగెచుట్టుగాన్ = లతాపరివేష్టన మన్నట్లుగా, అలముచున్ = చుట్టుకొనుచు, ధాత్రిన్ = భూమియందు, లేచి=ఉత్థితమై, మ...లు-మలీమస=నల్లనైన, బాష్ప=పొగలయొక్క, వల్లులు=తీఁగెలు, బలరిపుఁడు = ఇంద్రుఁడు, అత్తొలితొలిధారకే = ముందుముందుగురిసినయుదకధారకే, వెఱచి = మిగుల వర్షించు నని జంకి, తొనె = వెంబడినే, ఘ...కున్ - ఘనౌఘము= మేఘ సమూహముయొక్క, వానకాళ్లకున్ = ధారలను పాదములకు, ఆ=ప్రసిద్ధమయిన, లయ = ప్రళయకాలమందలి, అభ్రములభంగిని = పుష్కలావర్తాది మేఘములకుంబలె, సంకెలలు = నిగళబంధములు, ఊన్చెనో యనన్ = ఒనర్చెనోయన్నట్లు, పొలుపారెన్= ఒప్పుచుండెను. ని. 'సమితి ర్మండలీ పిండీ రింఛోళిః పటలీ ఛటా, మలీమసంతు మలినం కచ్చరం మలదూషితం, బాష్పనేత్ర జలోష్మణోః, అని 'వల్లీతు ప్రతతి ర్లతా' అని యంతట నమరము.

తా. నేలమీఁదఁ జినుకులు రాలఁగానే యందున్న వేఁడిమి పొగరూపమై పై కెగయుట ప్రసిద్ధముగావున ముంచు ముందు వర్షించు నుదకధారలచే గ్రీష్మాతప తప్తమైనభూమియొక్క పొగ తీఁగ లాధారల నెదుర్కొనుచుండ దేవేంద్రుండు తొలఁదొల్తఁ గనుపడినయుదకధారలకు వెఱచి ముందు విశేషముగా వర్షించుచున్న శంకచేత మున్ను ప్రళయకాల మేఘములైన పుష్కలావర్తాదులను నిర్బంధించినవిధమున నీమబ్బులకును సంకెలలు దగిలించెనో యన్నట్లొప్పుచుండెను. ఉత్ప్రేక్షాలంకారము.

చ. ఎడపక మున్ను మింటిపయి నేతగులంబును లేమి మూకతన్
*వెడలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డమువడ్డ వానిమే
యిడియ జవోష్మఁ బాఱెడురనీందులదట్టపుబండికండ్లచ
ప్పుడుగతి మ్రోసె రేవగలు భూరిభయంకరగర్జ లత్తఱిన్. 85

టీ. ఎడపక = ఎడతెగక, మింటిపయిన్ = ఆకాశమందు, మున్ను = వర్షాకాల మునకుఁ బూర్వమందు, ఏతగులంబును లేమి=ఏప్రతిబంధమును లేని కారణమున, మూక

* వెడలెఁ గఠోర మేఘములు వేమరు లడ్డము వడ్డ.

తన్ = చప్పుడులేనట్లు, వెడలెడుచోన్ = పోవువేళలందు, క...లు-కఠోర = దట్టమైన, ఘన = మబ్బులయొక్క, బృందములు = గుంపులు, అడ్డము వడ్డన్ = నిరోధింపఁగా, వానిమే = ఆ మేఘముల శరీరము, ఇడియన్ = నలఁగునట్లు, (ఇడియ నన్నది ద్రావిడ దేశీయము.) జవోష్మన్ = వేగముచేతి వేండ్రముచేత, పా...లిన్ - పాఱెడు = పఱు విడుచున్న, రవీందుల = సూర్యచంద్రులయొక్క, దట్టపు = సాంద్రమైన, బండికండ్ల = రథచక్రములయొక్క, చప్పుడుగతిన్ = ధ్వనివలె, రేవగలు = అహోరాత్రములు, భూరి...లు-భూరి = అధిమగునట్లు, భయంకర = భీకరములైన, గర్జలు = ఉఱుములు, అత్తఱిన్ = ఆసమయమందు, మ్రోసెన్ = శబ్దించెను.

తా. వర్షాకాలమునకుఁ బూర్వమున నాకాశమం దెడతెగక యేలాటి ప్రతిబంధము లేనికారణమున నిశ్శబ్దముగఁ బోవునప్పుడు దట్టమైన మబ్బులచాళ్ళడ్డమురాఁగా వానికాయములు నలఁగునట్లువేగముచేతివేఁడిమితోఁ బరువిడుచున్న దివాకరక్షపాకరుల యొక్క యరదముల చప్పుడులపగిది నహోరాత్రములపుడత్యంతభయంకరములై యుఱుము లుఱిమెను. అలం. వస్తూత్ప్రేక్ష.

చ. దినములవెంబడిం జడనిధి న్మును గ్రోలిననీరిలోనఁ బే
రినలవణంపుఘుట్టముల కే దృప్యదిరమ్మదదావము ల్దవు
ల్కొని పెటిలించునార్భటు లోకో యనఁగా సతతటిద్భయంకర
స్తనితములన్ సృజించె నతిసాంద్రఘనాఘనగర్భగోళముల్. ౪౮

టీ. దినములవెంబడిన్ = దినాలవరుసను, జడనిధిన్ = సముద్రమందు, మును గ్రోలిననీరిలోనన్ = మున్నుద్రావిన యుదకములోపల, పే...లన్ - పేరినన్ = ఘనీభవించిన, లవణంపుఘుట్టములన్ = ఉప్పుబిళ్లలను, దృ...ల్ - దృప్యత్ = అతిశయించినట్టి, ఇరమ్మద = మేఘజ్యోతి యనెడు, దావముల్ = కార్చిచ్చులు, తవుల్కొని=అంటుకొని, పె...కో అనఁగాన్ - పెటిలించు = పెట్లునట్లుగఁ జేయునట్టి, ఆర్భటులోకో యనఁగాన్ = ధ్వనులోయన్నట్టు, స...లన్ - సతతటిద్భయంకర = మెఱుపులతోఁగూడి భయంకరములైన, స్తనితములన్ = ఉఱుములను, అతి...ల్-అతిసాంద్ర = మిగులదట్టమైన, ఘనాఘన = వానకాలపు మొయిళ్ళయొక్క, గర్భగోళముల్ =ఉదరప్రదేశములు, సృజించెన్ = కావించెను. 'వార్షికాబ్దో ఘనాఘనః' యని యమరము. ఉత్ప్రేక్షాలంకారము.

తా. మేఘములు నానాఁట సముద్రమందుఁ ద్రావిన నీరు లోపలఁజేరి యుప్పుబిళ్ళలు కాఁగా వానిని మేఘాగ్నులు దహింపఁ నందుఁ బుట్టిన పెటపెటధ్వనులో యన్నట్లు మించులచేత భయంకరములై యున్న యుఱుము లామేఘములయం దొప్పుచుండెను.

మ. ఇనరశ్ముల్ తృష వార్ధిఁ జేరి జల మొక్కింతానినాత్మోష్మ జు
య్యన వెంటం బొగముంచికో నెగసి వాతాధూతతత్సంధులం
గన నౌచుం గళదశ్రులై వడఁకు రేఖం దిక్తటప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచలల్ మెఱసె నాసారంబు దోరంబుగన్. 87

టీ. ఇనరశ్ముల్ = సూర్యకిరణములు, తృషన్ = దప్పిచేత, వార్ధిన్ చేరి = సముద్రమును బొంది, జలము ఒక్కింత ఆనన్ = ఉదకమును గొంత పానముచేయఁగా, వెంటన్ = వెంటనే, ఆత్మోష్మన్ = స్వకీయమైన యుబ్బచేత, జుయ్యనన్ = జుయ్యుమని ధ్వని పెట్టఁగా, పొగముంచికోన్ = ధూమముగప్పుకొనఁగా, ఎగసి = అంతరిక్షమున కెగసి, వా...లన్-వాత = గాలిచేతను, ఆధూత = కదలింపఁబడిన, తత్సంధులన్ = ఆమబ్బు యొక్క సందులయందు, కననౌచున్ = అగపడుచు, గ...లు ఐ-గళత్ = జాఱుచున్నట్టి, అశ్రులై = కన్నీళ్లుగలవై (వడ దగిలినపుడు కన్నుల నీరుగాఱుట ప్రసిద్ధము.) వడఁకు రేఖన్ = కంపించుచందమున, ది...టన్ - దిక్తట = దిగంతములయందు, ప్రోత్థిత = పుట్టినట్టి, స్తనయిత్నుచ్ఛటన్ = మొయిళ్లగమియందు, ఆసారంబు = ముసురువాన. తోరంబుగన్ = అతిశయింపఁగా, చంచలల్ = మెఱుపులు, మెఱసెన్ = వెలిఁగెను. ని. 'స్తయిత్ను ర్వలాహకః, ధారాసంపాత ఆసారః చఞ్చలా చపలాఽపిచ' యని యంతట నమరము.

తా. సూర్యుని కిరణరూపము లగు మేఘములు సముద్రోదకమును బీల్చుటవలన దమయొక్క యూష్మముచేతఁ జుంయ్యుమని శబ్దించుచుండ, వెంటనే పొగ చుట్టికొన్నందునఁ బైకెగసి వాయువుచేతఁ గదలింపఁబడినందువలనఁ, దమయందుఁ గానవచ్చుచుఁ గాఱుచున్నకన్నీరు గలవై కంపించుచందంబున నున్న మెఱుపులు దిగంతములయందు జనించిన మేఘములయందు జడివాన గురియుచుండఁగాఁ బ్రకాశించెను.

మ. ఇలకుం గల్గినజీవనంబుల నిజానిష్టోగ్రమార్తాండమం
డల మానం దనవైరివైరి సఖుఁ డౌటం దద్రవిం బీల్చి య
య్యల కొక్కుమ్మడిఁ గుమ్మరింపఁ దగుఁ దానెంతైన నంత్రైనమం
డలముల్ రాహువుపాసంగఁదాల్చుగతి మింటం బర్వె[1] నీలాభ్రముల్.

టీ. ఇలకున్ = భూమికి, క...లన్-కల్గిన = ఉన్నటువంటి, జీవనంబులన్ = ఉదకములను, ని...ము-నిజ = రాహువునకు, అనిష్ట = శత్రువైన, ఉగ్ర = తీక్ష్ణమైన, మార్తండమండలము = సూర్యుని బింబము, ఆనన్ = పానము సేయఁగా, అపహరింపఁగా, త...రి-తన = తనయొక్క, వైరివైరి = పగవాని పగవాఁడు, సఖుఁడౌటన్ = మిత్త్రుఁడగుట

1. గాలాభ్రముల్. 2. వదలి.

చేతను, (అనఁగా లోకమందుఁ దనశత్రునిశత్రువు దనకు మిత్త్రుఁడౌట ప్రసిద్ధముగాన భూమియందున్న జలముల నపహరించిన సూర్యునకు శత్రువైన రాహువునకును భూమికిని మైత్త్రి యనుట.) తద్రవిన్ = ఆసూర్యుని, పీల్చి = ఊటుకొని, (ముందు సూర్యుఁడు హరించిన యుదకములను మరల నాకర్షించి యనుట.) అయ్యిలకున్ = ఆభూమికి, ఒక్కమ్మడిన్ = ఒకపర్యాయమే, కుమ్మరింపన్ = కురియుటకు, తాన్ = ఆరాహువు, ఎంతైనన్=ఎంతటియాకృతిగలవాఁడైనను, తగున్=సమర్థుఁడగునో, అంతైనమండలమున్= అంతటను బెరుఁగుచున్న బింబమును, రాహు = సైంహికేయుఁడు, పొసంగన్ = సరిపడు నట్లు, తాల్చుగతిన్ = ధారణ మొనరించెనో యన్నట్లు, నీలాభ్రముల్ = నల్లమబ్బులు, మింటన్ = ఆకాశమందు, పర్వెన్ = వ్యాపించెను.

తా. ఆకాశమం దంతట వ్యాపించియున్న నల్లమబ్బులను జూడఁగా భూమి తనజలములను సూర్యుఁడు పానముఁజేసి హరింపఁగా వానిని మరల రప్పించుకొనవలయు నన్న యభిప్రాయముతోఁ సూర్యునకు విరోధియైన రాహువుతోఁ జెప్ప నతఁడు భూమికి మిత్త్రుఁడౌటంజేసి యాసూర్యకిరణములయం దున్న యుదకములను గ్రహించి వర్షించుట కుద్యమించి తగురీతిఁ దాల్చిన మండలమో యన్నట్లుండెను. ఉత్ప్రేక్షాలంకారము.

తే. పుట్టవెడలి నభోభిత్తిఁ బట్టుశక్ర
కార్ముకపుఁబెద్ద పలువన్నె కట్లజెట్టి
దైన నడచెడు కాళ్ళగుంపనఁగ గాలిఁ
గార్కొని దిగంతముల వానకాళ్లు నడచె. 89

టీ. పుట్టవెడలి = వల్మీకమునుండి బయలుదేఱి, శ్లో. 'వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుః ఖండ మాఖండలస్య' యని కాళిదాస ప్రయోగము. నభోభిత్తిన్ = ఆకాశమని యెడుగోడను, ప...డి-పట్టు = అవలంబించునట్టి, శక్రకార్ముకపు=ఇంద్రధనుస్సనియెడు, పెద్ద = గొప్పదైన, పలువన్నె = నానావర్ణములుగల, కట్లజెట్టిది = కట్లుగలశతపది సంబంధి, ఐన, న...పు-నడచెడు = చనుచున్నట్టి, కాళ్లగుంపు అనఁగన్ = పాదముల చాళ్లనునట్లు, గాలిన్ = వాయువుచేత, కార్కొని = నల్లనివై, వానకాళ్లు=వర్షధారలు, దిగంతముల్ = దిక్తటములయందు, నడచెన్ = ప్రవర్తించెను.

తా. వల్మీకమునుండి వెడలి యాకాశ మనుగోడ నాశ్రయించి నడచుచున్న యింద్రధను స్సనియెడు బహువిధముల వన్నెలుగల కట్లుగలిగియున్న జెట్టికాళ్ళో యనునట్టు నలుగడలయందును వర్షధారలు కానఁబడెను. అలం. రూపకోత్థాపిత మయిన యుత్ప్రేక్ష.

చ. ఒకచినుకున్ సపస్య యగు ॥ నుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకము లటంచు లోఁ గనలి ॥ దట్టముగా నల మేఘుఁ డాడుచుం
డక చన నూఁదఁగాఁ దొరఁగు ॥ నాళిపుటుండలు వోలె రాలెఁ ద
క్కక పడు వర్షధారల ము ॥ ఖస్థములై కరకాని కాయముల్. 90

టీ. ఒకచినుకున్ = ఒక్కబిందువునుకూడ, సపస్య = పయిరుతోఁగూడినది, అగు ఉర్వికిన్ = ఐనభూమికి, చాతకములు = వానకోయిలలు, మూఁగి = చుట్టుకొని, డిగ్గఁగ నీవు = జాఱనీయవు (తామే వర్షబిందువుల నన్నిటిని పానము చేయుచు) అటంచున్ = ఈలాగనుచును, అల = ప్రసిద్ధుఁడైన, మేఘుఁడు = జలధరుఁడు, లోన్ = లోపలను, కనలి = కోపించి, దట్టముగాన్ = నిబిడముగా, ఆడుచుండక = సంచరింపక, చనన్ = పోవునట్లు, ఊఁదఁగాన్ = వెళ్ళనూఁదఁగా, తొరఁగు = పడుచున్న, నాళిపుటుండలు వోలెన్ = క్రోవియందలియుండలవలెను, (లోకమునఁ బిట్టలు పట్టువారు నోటిలో నుండలు వేసికొని గొట్టముతో వానిఁ బిట్టలపైఁ బడున ట్లూఁదుట ప్రసిద్ధము గానఁ బ్రయోగించినాఁడు.) కరకానికాయముల్ = వడగండ్లరాసులు, తక్కక = ఎడతెగక, పడు=పతనమగుచున్న, వర్షధారల = వానకాళ్ళయొక్క, ముఖస్థములై = అగ్రములయందున్నవై, రాలెన్=పడెను. శ్లో. 'సర్వంసహాపతితమంబు న చాతకానా' మని యున్న ప్రకారము భూసంస్పృష్టజలము చాతకములకు రోగహేతువుగాన నంతరాళముననే గ్రహించుట ప్రసిద్ధము.

తా. చాతకపక్షు లొకబిందువునైనను సస్యములతోఁ గూడిన భూమియందుఁ బడనీక నడుమనే పానముఁజేసి గుంపై యాడుచుండం జూచి మేఘుఁ డాత్మలోఁ గోపించి యాచాతకపక్షులను వెళ్లఁగొట్టుటకై పిట్టలం బట్టువాఁడు నోటనుంచినయుండలను గొట్టముద్వారమున వెళ్లగొట్టుచందమున నాఁడు రువ్వు నాళిపుటుండలో యనునట్లు నిరంతరవర్షధారాముఖమున వడగండ్లు పడెను.

సీ. ఎలగోలుజల్లుము ॥ న్పెళపెళ నేటవా
ల్పడి గాలి నట్టిండ్లఁ ॥ దడిపి చనఁగ;
నట్టెతో వడగండ్ల ॥ కట్లావులు దుమార
మావులు రేఁచి రెంపడవదియుఁ జన
మఱి మూఁడవది నిల్చి ॥ మెఱసి బిట్టుఱిమి శీ
కరవారిసృష్టిఁ జీకటిగ నలమ
నుయ్యేలచేరుల ॥ యోజఁ బైపై వెండి
జల్లుపై జల్లు పె ॥ ల్లల్లుకొనఁగ

తే. భూభిదాపాది దుర్భరాంభోభరంపు
వడి మరుజ్ఝంఝఁ దెరలక కడవ వంచి
నట్లు హోరని ధారౌఘ మైక్యమొంది
విన్ను మన్నును నొకటిగా వృష్టి బలిసె. 91

టీ. ఎలగోలుజల్లు = మొదటవచ్చినవానజల్లు, మున్ = ప్రథమమందు, పెళపెళన్ = పెళపెళధ్వనితో, ఏటవాల్పడి = వంపుగా వాలి, గాలిన్ = వాయువుచేతను, నట్టిండ్లన్ = గృహమధ్యభూములను, తడిపి = నాన్చి, చనఁగన్ = పోఁగా, అట్టె = ఆప్రకారమే, తోన్ = వెంబడిగానే, వడగండ్ల = వర్షోపలములయొక్క, కట్టావులు = కావిరులు, దుమారము = పరాగమును, ఆవులు = ఉబ్బలను, రేఁచి = ఎగురఁజేసి, రెండవదియున్ = రెండవదియైనజల్లును, చనన్ = పోఁగా, మఱి = పిమ్మట, మూఁడవది = తృతీయమైన వానజల్లు, నిల్చి = నిలువఁబడి, మెఱసి = మించులను వెలిఁగించి, బిట్టుఱిమి = మిగుల గర్జించి, శీకర = తుంపరలతోఁగూడిన, వారిన్ = ఉదకముచేత, సృష్టిన్ = ప్రపంచమును, చీకటిగ నలమన్ = అంధకారమగునట్లు చుట్టుకొనఁగా, ఉయ్యేలచేరులయోజన్ = డోలయొక్కగొలుసులవలెను, పైపైన్ = మీఁదమీఁదను, (వెంటవెంట ననుట.) వెండి = మఱియును, జల్లుపైన్ = వర్షము మీఁదను, జల్లు = వర్షము, పెల్లు = అతిశయముగ, అల్లుకొనఁగాన్ = క్రమ్ముకోఁగా, భూ...న్ - భూభిదాపాది - భూ = భూమియొక్క, భిదా = భేదమును, ఆపాది = ప్రతిపాదించుచున్న, నిర్భర = భరింపశక్యముగాని, అంభోభరంపు = ఉదకాతిశయము యొక్క, వడిన్ = వేగముచేతను, మరుజ్ఝంఝన్ = ఝంఝామారుతముచేతను, 'ఝంఝాషూవాతస్సవృష్టికః' యని యమరము. తెరలక = తెమలక, కడవ వంచినట్లు= బానకుమ్మరించినవైఖరిని, హోరని = హోరుమనుధ్వనితోఁగూడి, ధారౌఘము = ధారాసమూహము, ఐక్యమొంది = ఏకీభవించి, విన్నుమన్నునొకటిగా = ఆకాశభూములు రెండునొక్కటి యగునట్లు, వృష్టి = వర్షము, బలిసెన్ = వృద్ధిఁబొందెను.

తా. పెళపెళధ్వనితో మొదటి జల్లేటవాలుగా వచ్చి గాలిచే గుమ్మములనుండి లోనికిఁ జొచ్చి నట్టిల్లు దడిపి చనఁగా వెంటనే రెండవజల్లు వచ్చి వేఁడిపొగలు, ధూళిపొగలు రేఁపి చనఁగా మూఁడవజల్లు వచ్చి కొంతసే పాఁగి యుఱుములతో మెఱపులతోఁ దుంపరలతో నంధకారబంధుర మొనర్చి చనఁగా నటుపైని జల్లుపై జల్లు వచ్చి కారుక్రమ్మి దుర్భరవర్షాజలవేశమునకుఁదోడు ఝంఝామారుతము రాఁగా భూమ్యాకాశము లేకమగునట్లు హోరుమనుధ్వనితో విడువకుండఁగ నేకధారగాఁ గడవలతో నీరుపోసినట్లు వర్షమధికమయ్యెను.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘమున్
డలపుర్ మద్దెల గ్రుంగ లేవను మరుత్సార్దంగికుం డర్థి నె
త్త లలి న్నేలకు వ్రాలుచు న్నెగయుచుం [1]దా రాడున త్తెల్లజ
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె ధారలును దక్లోలేంద్రగోపంబులున్.

టీ. అలపర్జన్యుఁడు = ఆ యింద్రుఁడు, కే...పు - కేకి = మయూరములనియెడు, పాత్రములన్ = నటులయొక్క, గుంపు = సమూహమును, ఆడించుచోన్ = నాట్యమాడించుతఱి, మరుత్సార్దంగికుండు = వాయువనెడు (మద్దెలఁ గ్రుంగవైచు) మద్దెలకాఁడు, లలిన్ = విలాసముగా, అర్థిన్ = ప్రియముతో, మేఘముండలపున్ మద్దెల = మబ్బుల గుంపను మృదంగము, క్రుంగన్ = వంగఁగా, లేవను = ఉత్థితముకాఁగా, ఎత్తన్ = పైకెత్తఁగా, ధారలును = ఉదకధారలును, నేలకున్ = భూమికి, వ్రాలుచున్ = వంగుచును, ఎగయుచున్ = మీఁదికి నెగయుచును, తా...లున్ - తారాడు = జీరాడుచున్న, ఆ త్తెల్లజల్లులున్ = ఆ ధవళమయిన జాలరులును, తల్లోలేంద్రగోపంబులున్ - తత్ = ఆ వర్షధారలయందు, లోల = చలించుచున్న, 'చలన్లోలంచలాచల' మని యమరము. ఇంద్రగోపంబులున్ = ఆర్ద్రపురుగులును, కెంగుచ్చులున్ = ఎఱ్ఱనికుచ్చులును, అయ్యెన్ = ఆయెను. రూపకాలంకారము.

తా. ఆ ట్లమోఘముగా వర్షించుసమయంబున నా ప్రసిద్ధుం డగుపర్జన్యుఁడు మయూరము లనునటుల నాడించునపుడంబున మేఘములు మృదంగములుగా, వాయువు మద్దెల వాయించువాఁడుగా, జలధారలు జాలరులుగా, వానియందు జలించుచున్న యార్ద్రపురుగులు గెంగుచ్చులుగాఁ గన్పట్టెను.

ఉ. ఓహరిసాహరిం బ్రథమ మొల్కెడుధారల గాడ్పు లేటవా
ల్గా హాతి నీడ్చి వీఁగు ప్రజలం గలఁప న్మొగు లొందె నంబుభృ
ద్వాహచలద్రథత్వము మోద మ్మెఱుఁగన్ ధ్వజ మెక్క నౌటగా
నాహదనం జెలంగుజన మాంతము నూళ్ళకుఁ బోవ శామియున్.

టీ. ఓహరిసాహరిన్ = అవిచ్ఛిన్నముగా, ప్రథమము = ముందఱగా, ఒల్కెడు ధారలన్ = కురియుచున్న నీటిధారలను, గాడ్పులు = వాయువులు, హాతిన్ = తమయొక్క కొట్టుచేత, వీటవాల్గాన్ = చేటచేర్పుగా, ఈడ్చి = ఆకర్షించి, వీఁగు ప్రజలన్ = మఱుగులయందు దాఁగినజనులను, కలఁపన్ = తడపివ్యాకులపెట్టఁగా, మొగులు = మేఘము, అం...ము-అంబుభృద్వాహ = దేవేంద్రునకు, 'తురాషాణ్మేఘ

1. తారాడు న త్తెల్లజల్లులమన్ గుచ్చులు.

వాహనః' యని యమరము. చలద్రథత్వము-చలత్=కదలుచున్న, రథత్వము=స్యందనభావమును, ఒందెన్ = పొందెను, తేజన మింతపనముం దేల వెళ్లక నిల్చియుండె ననుశంకను వారించుచున్నాఁడు.—మొదల్ = తొలుప, మెఱుఁగన్ ధ్వజము = మించనియెడు టెక్కెము, ఎక్కఁగాఁగాన్ = ఆరోహణముచేయఁగా, అహవనన్ = ఆధ్వజారోహణ సమయమందు, చెలంగుజనము = ఉన్నప్రజలు, ఆంతము = కడవటికును, 'ఆజీమవర్ధేభి వ్యాప్తౌ సీమా ర్థేధాతుయోగజే' యని యమరము. ఊళ్లకున్ = గ్రామములకు, పోవరామియున్=పోఁగూడక యుండుటయు సముతము, (వాన వెలియువఱ కనుట.) నొందె నని పూర్వముతో నన్వయము.

తా. ముందుగ నవిచ్ఛిన్నముగాఁ గురియుచున్న వర్షధార లనుగాడ్పులు విసరుచున్న వేగముచేతఁ జేటచేర్పు గా లాగి, మఱుఁగున దాఁగినట్టి ప్రజలను గ్లేశపెట్టఁగా, మేఘము లింద్రునకుఁ జలద్రథమగుటను బొందెను. లోకమునం దుత్సవాదులలో ధ్వజారోహణకాలమందున్న జనులు ధ్వజావరోహణమువఱకు నచ్చటనే యుండుట ప్రసిద్ధముగాన, మించనియెడు ధ్వజము నెత్తగానే యచ్చటనున్న జనులు తుదవఱకు నుండిరో యన్నట్లు కదలుటకు యత్నములేకయావర్షమునందు దడిసిరి. మేఘము లింద్రునికి రథముగాను, వర్షధారలు తేజుమోకులుగాను, మఱుఁగున వంగిన ప్రజలు రథ మీడ్చువారుగా నుత్ప్రేక్షింపఁబడెను.

తే. మిగుల నామని బచ్చచాంపేయకముల
నమ్మి కడపళ్ళఁ దము వైచినాఁడు మగుడ
నాసపడువారి నవ్విన ట్లల్ల విచ్చెఁ
గలయ మూతులు కేతకీగహనతతులు. 94

టీ. మిగులన్ = మిక్కిలియును, ఆమనిన్ = వసంతఋతువునందు, పచ్చచాంపేయకములన్ - పచ్చ = పసుపువన్నెగల, చాంపేయకములన్ = సంపెఁగలను, 'భండీరోప్యథచాంపేయ శ్చంపకో హేమపుష్పకః' యని యమరము. నమ్మి = నిత్యమని విశ్వసించి, కడపళ్లన్ = కడపటను, (కంచెలో ననుట) తమున్ = కేతకులను, వైచి = పడవయిచి, నాఁడు = వర్షర్తువునందు, మగుడన్ = తిరిగియును, ఆసపడువారిన్ = ఆశించెడువారిని, నవ్వినట్లు = అపహసించినట్లు, అల్లన్ = మెల్లఁగా, కేతకీగహనతతులు= మొగలితోఁటవరుసలు, కలయన్ = అంతటను, మూతులు = ముఖములు, విచ్చెన్ = వికసించెను.

తా. ఆ వర్షర్తువం దంతట వికసించియున్న మొగలిపువ్వులను జూడఁగా వసంతఋతువునందుఁ బ్రబలియున్న సంపంగిపువ్వులను నమ్మి తమ్ముఁ గడపట వేసి యిపుడాసం

పంగులు లేకపోవుటచేత మరల నపేక్షించుచున్న జనులను జూచి నవ్విన ట్లుండెను. ఆపత్త నమునందుఁ దోఁటలచుట్టును మొగలిపూవు లుండుట ప్రసిద్ధము గాన, గడపట వేసినట్లు వర్ణించెను. ఉత్ప్రేక్షాలంకారము.

చ. అనయము నందనంబు దివిఁయందున యుండి ప్రసూనవాసనల్
గని పఱతెంచిపోవు నలకారు మెఱుంగులె పోవ రాక చి
క్కెనొ నవగంధలుబ్ధభుజగీపరివేష్టన నా మొగిళ్లఁ పిం
డునఁ జెలఁగెం బసిండితగఁడుం దెగడుం బురు రేకు మొత్తముల్.

టీ. అనయము = ఎల్లప్పుడును, నందనంపు దివియందు సె = నందనవనముతోడి యాకాశముననందే (స్వర్గ మునందే), ఉండి = కాలముగడపి, ప్రసూనవాసనల్ = నందనోద్యాన కుసుమామోదములను, కని = పొంది, పఱతెంచిపోవు = (వర్షించుటకు భూమికి దిగివచ్చిన మేఘములతోడను) వచ్చి మరలిపోవుచున్నట్టి, అల = ప్రసిద్ధమైన, కారుమెఱుఁగులె = తొలకరిమెఱుపులె, నవ = క్రొత్తదైన, గంధ = పరిమళమునందు, 'గంధేగంధకఆమోదే వేశేసంబంధగర్వయోః' యని విశ్వము. లుబ్ధ = లోభపడుచున్న, భుజగీ = ఆఁడునాగుఁబాములయొక్క, పరివేష్టనన్ = చుట్టుకొనుటచేతను, పోవరాక చిక్కెనో = చనఁజాలక పట్టుపడెనో, నాన్ = అనునట్లు, మొగిళ్లపిందునన్ = మొగిలి వనమందు, పసిండితగడున్ = బంగారురేకును, తెగడున్ = తిరస్కరించుచున్న, పువు రేకుమొత్తముల్ = పువ్వులరేకులసమూహములు, చెలఁగెన్ = ప్రకాశించెను. హేతూ త్ప్రేక్ష వస్తూత్ప్రేక్ష.

తా. ఆ దేశమునందుఁ గంచెలవరుసలనుండెడు మొగళ్ళయందుఁ జొక్కపుబంగారు రేకులను మించు పువ్వులరేకులఁ జూడఁగా నాకాశముననే యనవరతముసుండునం దనోద్యానవనప్రసూన పరిమళముల గ్రహించి తమకాధారములగు మొయిళ్ళవెంట వర్షించుటకై భూమికినరుగుదెంచి మరల పోవుచున్న మెఱుపు లానవగంధమునందాసక్తములయిన స్త్రీసర్పములచేతఁ జుట్టఁబడి కదలుటకు శక్తిలేక నిలుచుబడియున్నవో యన్న ట్లుండెను.

చ. బలుసెక నించువి ల్లడుగుఁవట్టినదే యిపు డాకుబూపె గెం
పులఁ ద్రిరుచిత్వ మూఁది మరుఁముష్టి బిగిం దివిఁ గ్రాయుమౌక్తికం
బులజడి [1]దీన నందఱకుఁ గొ బో యిది యింద్రుని చేవి పుట్టి రాఁ
గెలనమొ నాఁగ బొ ల్పెలుఁగిం గరకాస్త్రతి నొప్పె మేఘముల్.

1. జుమ్మనం దొరఁగుఁబో.

టీ. బలుసెకన్ = మిక్కుటమగువెట్టచేతను, (గ్రీష్మకాలమం దనుట.) ఇంచువిల్లు = చెఱకువిల్లు, అడుగుపట్టినదే=భూమినిఁబడ వేసినదే, (అనఁగా మొలువ వేసినదేఱకే యనుట.) ఇపుడు = ఈవర్షాకాలమందు, ఆకుబూదిగెంపులన్-ఆకు = పచ్చనియాకుల చేతఁ బసరువర్ణము, బూది = నడుమనుండు తెలుపు, కెంపుల్ = చెఱకున నుండెడియెఱుపును, వీనిచేత, త్రిరుచిత్వము = హరిత శ్వేత రక్తము లనియెడు త్రివిధకాంతులుగలిగియుంటను, ఊఁది = పొంది, మరుముష్టిబిగిన్ = మన్మథునిపిడికిటిబిగిచేతను, దివిన్ = ఆకసమునందు, మౌక్తికంబులజడి = ముత్యపువర్షము, దీనన్ = ఈ ధనుస్సును, క్రాయున్ = వెళ్లఁగ్రాయును, అంతఱకున్ పో = ఎల్లవారికిని పోవునుజుమీ, ఇది = ఈ ధనుస్సు, ఇంద్రునిదేని = ఇంద్రునిదైన పక్షమున, పుట్టరాఁ గెలసమె = పుట్టలోనుండి యేలవచ్చెను, నాఁగన్ = అనునట్లుగా, పోలు = చూడఁదగిన, విలుజిగిన్ = ఇంద్రధనుః కాంతిచేత, కరకాస్రుతిన్ = వడగండ్లవానచేత, మేఘము = మొయిల్లు, ఒప్పెన్ = చెన్నొందెను.

తా. గ్రీష్మకాలమందు వెట్టచేత నిక్షుధనుస్సు నేలం బడియుండి యిప్పు డాకు బూది కెంపు లనియెడు మూఁడువర్ణములు గలిగినదై మరునిముష్టిబిగిచే వెలుపలికి మౌక్తికముల వర్షించుచున్నదిసుమా! అట్లుగాక ఇంద్రునిదైన యీ ధనుస్సు పుట్టనుండి రావలసిననిమిత్త మేమని తోఁపింపఁజేయుచున్న యింద్రధనుఃకాంతితోఁ గూడిన వడగండ్లచేత మేఘము లొప్పుచుండెను. శుద్ధాపహ్నవానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

చ. అతిజల మబ్ధిఁ గ్రోలె నితఁ డంతయు రా నతివృష్టిదోషమౌ
మితి నిపు డబ్దతం బరిణమించినతోయమె చాలుఁ బంట క
న్మతి నలధాత గట్ట గగనంబున వర్తులత స్సమంతతో
[1]వృత మగు సేతుమండలము శ్రీబరివేషము సుట్టె భానునిన్. 97

టీ. ఇతఁడు = ఈ సూర్యుఁడు, అబ్ధిన్ = సముద్రమందు, అతిజలము = మిక్కిలి నీటిని, క్రోలెన్ = పానముచేసెను. అంతయున్ = పానముచేసిన యుదకమంతయును, రాన్ = వచ్చినపక్షమున, అతివృష్టిదోషమౌన్ = అతివృష్టిరూపమగు నీతిబాధ యగును, మితిన్ = తగుమాత్రముచేతను, ఇపుడు = ఈ సమయమందు, అబ్దతన్ = మేఘత్వముచేత, పరి...మె-పరిణమించిన = ఏర్పడిన, తోయమె = ఉదకమే, పంటకున్ = సస్యములు ఫలించుటకు, చాలున్ = సరిపోవును, అన్మతిన్ = అనునట్టితలంపుచేత, అలధాత = ఆ బ్రహ్మ, కట్టన్ = కట్టగట్టఁగా, గగనంబునన్ = ఆకాశమందు, వర్తులతన్ = వలయాకృతిచేతను, స...ము అగు - సమంతతః = అంతటను, వృతమగు =

1. వృతి యగు.

చుట్టికొనియున్న, సేతుమండలము = మండలాకారమగు కట్టయొక్క, శ్రీక్ = కాంతి చేత, పరివేషము = ఐరదగుడి, భానునిక్ = సూర్యుని, చుట్టెక్ = చుట్టుకొనెను.

తా. సూర్యునిఁ జుట్టికొనియున్న పరివేషమును జూడఁగా నీ భానుఁ డధ్యయం దతిశయముగ నుదయించ మొనరించియున్నవాఁడు. అందులకుఁ గారణ కష్టరూపమునఁ గురిసి నచో నతివృష్టిదోషము ఘటించును. మేఘరూపము వహించి యిప్పుడు మితముగ వర్షించిన యుదకము సస్యములకుఁ జాలియున్నయది యని భావ మాలోచించి యాసూర్యునికిరణములకు గమనము లేకుండుటకై పరివేష మనుమిషచేత నాసహస్రాంశుని బంధించెనో యన్నట్లుండెను.

తే. గగనరంగస్థలంబున ౯ మిగులఁ బ్రౌఢి
మమునఁ గాళిక [1]నిల్చి కోలము నటింపఁ
బోరి మొగంబున రాలు నిప్పుక లనంగ
గుంపులై రాలె మహి [2]నింద్రగోపతతులు. 98

టీ. గ...నక్ - గగన = ఆకాశమనియెడు, రంగస్థలంబునక్ = నాట్యభూమి యందు, మిగులక్ = మిక్కిలి, ప్రౌఢిమమునక్ = దిట్టతనముచేత, కాళిక = మబ్బులగుంపనెడి కాళికాశక్తి, 'మేఘజాలేఽపి కాళికా' యని యమరము. నిల్చి = నిలువబడి, కోలమునటింపక్ = నాట్యమొనరింపఁగా, (నీలికోలము ధరింప అని శ. ర. అప్పుడు నీలి కోలము = నల్లనివేషము ధరించి నాట్యము చేయఁగా నని యర్థము.) పోరిక్ = అధికముగా, మొగంబునరాలు = ముఖమునుండి పడుచున్న, నిప్పుకలనంగక్ = అగ్నికణములో యన్నట్లు, ఇంద్రగోపతతులు = ఆర్ద్రపురుగులు, గుంపులై = మొత్తములై, మహిక్ = భూమియందు, రాలెక్ = పడెను. రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తా. ఆకాశ మను నాట్యభూమియందు మిగుల నైపుణ్యముతో మబ్బులగుంపను కాళికాశక్తి నల్లనివేషము ధరించి నాట్యము చేయఁగా నామె మొగమునుండి రాలు కణములో యన్నట్లారుద్రపురుగులు భూమిపై గుంపులుగఁ బడెను.

క. ద్యుమణికరాళి మొగుళ్లై
యమవస శశి గలయఁ గూర్చి ౯ పూవ నోటయు న
య్యమృతపుబిందులె క్రమ్మఱ
నుమిసెడు ననవానఁ గరక ౯ లుడుగక రాలెన్. 99

టీ. ద్యు...ళి-ద్యుమణి = సూర్యునియొక్క, 'ద్యుమణిస్తరణిర్మిత్రః' యని యమరము. కరాళి = కిరణపఙ్క్తి, మొగుళ్లై = మేఘములై, అమవసక్ = అమావాస్య

1. నీలి. 2. నింద్రగోపకములు.

యందు, శశి=చందమామ, కలయన్=తమతోఁ గలియుటవలన, కూర్చి=అమృతబిందువులను గూడఁబెట్టికొని, (చంద్రుం డమృతకిరణుం డగుటచేత ననుట. అమావాస్యనాఁడు చంద్ర సూర్యు లేకస్థానగతు లౌట ప్రసిద్ధము.) 'దర్శస్సూర్యేందుసంగమః' యని యమరము. వాచనాటయు కిన్ = వేళరాఁగానే, అయ్యమృతబిందులె = అయ్యమృతకణములనే, క్రమ్మఱన్ = మగుడను, ఉమిసెడు ననన్ = వెళ్లఁగ్రక్కుచున్నవో యన్నట్లు, వానన్ = వర్షముతోను, కరకలు = వడగండ్లు, ఉడుగక, ఎడతెగక, రాలెన్ = పడెను.

తా. ఉవిచ్ఛిన్నముగా వర్షముతోఁగూడ రాలుచున్న వడగండ్లను జూడఁగా సూర్యకిరణములు మేఘములై యమావాస్యయందుఁ జంద్రునితోఁగూడి గ్రహించినాని కూడఁబెట్టియున్న యమృతబిందువులను సమయము తటస్థింపఁగా మరల వెళ్లఁగ్రక్కుచున్నవో యన్న ట్లుండెను.

చ. స్ఫురణ మొగుళ్లపై మొదలఁ బొల్చి జలస్రుతి నాఁడునాఁటికిం
కరఁగుచుఁ బుట్టుచుండుమణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గె
న్నురుగులు గట్టినట్లులు గనుంగొన [1]నయ్యె సురేంద్రగోపముల్
కరఁగినవింటియప్పసరుకైవడిఁ [2]దెట్టెలు పెట్టుపచ్చికన్. 100

టీ. స్ఫురణన్ = ప్రకాశముచేత, మొగిళ్లపైన్ = మేఘములమీఁద, మొదలన్ = ప్రథమమందు, పొల్చి = ఒప్పి, జ...తిన్ - జల=ఉదకముయొక్క, స్రుతిన్ = స్రవణముచేతను, నాఁడునాఁటికిన్ = దినదినమునకు, కరఁగుచున్ = కరఁగిపోవుచు, పుట్టుచున్ = ఉత్పత్తియగుచు,ఉం...మ ఎల్లన్-ఉండు=ఉన్నటువంటి, మణికార్ముక = ఇంద్రధనుస్సుయొక్క, రక్తిమ ఎల్లన్ = అరుణ్యమంతయును, వెల్లిన్ = వఱదయందు, కెన్నురుగులుగట్టినట్లులు = రక్తవర్ణముగల ఫేనము లయినట్లు, కనుంగొననయ్యెన్=చూడ శొంపై యుండెను, కరఁగిన = ద్రవించి స్రవించిన, వింటియప్పసరుకైవడిన్ = ఆమణిధనుస్సుయొక్క యాకుపచ్చవర్ణమువలె, తె...కన్ - తెట్టెలుపెట్టు = సాంద్రమగు పచ్చికన్ = పచ్చికయందు, సురేంద్రగోపముల్ = ఆర్ద్రపురుగులు, కనుంగొనన్ ఒప్పెన్ - అని క్రిందికి నన్వయము.

తా. ఇంద్రధనుస్సుయొక్క యెఱ్ఱఁదనమంతయు మొదట మేఘములపైఁ బ్రకాశించి జలపాతముచేఁ గ్రమక్రమముగఁ గరఁగుచుఁ బుట్టుచుఁ దుదను వఱదయం దెఱుపు రంగుగల నురుగులైనట్లు గనుపట్టఁజొచ్చెను. కరఁగిపోయినయింద్రధనువుయొక్క యాకుపచ్చవర్ణమువలె నొప్పుపచ్చికయందు నార్ద్రపురుగులు ఎఱుపునురుగులవలె నొప్పెను.

1. నొప్పెఁ దదింద్రగోపముల్. 2. దెట్టువ గట్టుపచ్చికన్.

చ. పెళపెళ మబ్బు బిట్టుఱుమ భీతి విదూరశిలాంకుర [1]చ్ఛటో
త్పులకినియై ప్రియు న్నిదుర వోవుహరి న్వడిఁ [2]గౌఁగిలింపఁగాఁ
దలరి ధరిత్రి సాఁచుగరు [3] దాల్చినకే లనఁ గంకణంపుమ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁదాల్చి నదు ల్వడిఁ జొచ్చె వారిధిన్.

టీ. మబ్బు = మేఘము, పెళపెళన్ = పెళపెళమని, బిట్టుఱుమన్ = విశేషముగా గర్జింపఁగా, భీతిన్ = భయముచేతను, వి...నిఐ- విదూరశిలా = వైదూర్యములయొక్క, అంకుర = మొలకలయొక్క, ఛటా = సమూహముచేతను, (ఛల యనుపాఠమున వ్యాజముచేత నని యర్థము.) ఉత్ = ఉద్గతమైన, పులకినియై=రోమాంచముగలదై, మేఘములుఱుమఁగా వైదూర్యాంకురములు పుట్టుట ప్రసిద్ధము. శ్లో. 'విదూరభూమిర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాకయేవ' అని కాళిదాసమహాకవిప్రయోగము. ప్రియున్ = ఇష్టుఁడైనట్టియు, ని...రిన్-నిదురవోవు = నిద్రించుచున్న, హరిన్ = శ్రీకృష్ణస్వామిని, వడిన్ = వేగముచేత, కౌఁగిలింపఁగాన్ = ఆలింగనమొనరించుటకొఱకు, తలరి = త్వరపడి, ధరిత్రి = భూమి, సాఁచు...లు-సాఁచు = ప్రసరింపఁజేసినట్టియు, గరుదాల్చిన = పులకాంకురితమైనట్టి, కేలుఅనన్ = హస్తమోయన్నట్లు, కంక...లన్ - కంకణంపు = కంకణపత్తు లనియెడు వలయములయొక్క (జాత్యేకవచనము.) మ్రోఁతలన్ = శబ్దముల చేతను, పులు = పచ్చికసవు, తేలన్=మునుఁగక పైనుండునట్లు, వండు=బురద, పయిన్ = మీఁదను, తాల్చి=ధరియించి, నదుల్ = ఏళ్లు, వడిన్=వేగముతో, వారిధిన్ = సముద్రమందు, చొచ్చెన్ = ప్రవేశించెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. మేఘములు పెళపెళమని యుఱుమఁగా భూదేవి భీతినొంది నిద్రవోవు తనభర్త యగు శ్రీమహావిష్ణువును గౌఁగిలించుకొనుటకుఁ జాఁచినపులకాంకురములు గల హస్తమో యన్నట్లు కంకణధ్వనులు విస్తరిల్లఁగా వండునీళ్లతోఁ బచ్చికసవును దాల్చి ప్రవాహములు సముద్రమును బ్రవేశించెను.

తే. కేకిషడ్జంబె తక్కఁ గోకిలపుఁబంచ
మం బఱుటఁ దోయిపదరులు మది(ఱే)బొసఁగమి
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో నమృత మయ్యెఁ
బ్రోషితల చేరికకు సంపు బోటివోలె. 102

టీ. కేకిషడ్జంబె తక్కన్ = నెమిలియొక్క షడ్జస్వరముదప్ప, ని. 'షడ్జం మయూరో వదతి పికః కూజతి పఞ్చమ' మ్మని యమరము. కో...బు - కోకిలపు = కోయిలయొక్క, పంచమంబు = పంచమస్వరము, అఱుటన్ = లేకపోవుటవల్ల, తో...లు - తోయి =

1. ఛ్ఛలో. 2. దాలుపుఁ గేళ్లన. 3. వెస.

మేఘములయొక్క, కదరులు = ధ్వనులు, (ఉఱుము లనుట.) మదిర్ పొసఁగమిర్ = మనంబునకుఁ దగనిదై యుండుటవలన, అదియుర్ = ఆషడ్జస్వరమును, ప్రియుర్ = వల్లభుఁడైన సముద్రుని, కూర్పర్ = కూర్చుటకై, నదులచోర్ = సరిత్తులపట్లను, అమృతమయ్యెర్ = సుధారసమాయెను. (హితమాయె నని యర్థము.) ప్రోషితలర్ = విరహిణులయిన స్త్రీలకు, సేరికకుర్ = నాథులపొందునకు, అంప...లెర్ - అంపు = పంపునట్టి, బోటివో లెర్ = మందయానవలె, హితమయ్యె నని క్రిందికి నన్వయము. శ్లో. 'దేశాంతరగతే కాంతే భవన్ప్రోషితభర్తృకా' యని వారిలక్షణము.

తా. వర్షాకాలమునందు నెమిళ్ళయొక్క షడ్జస్వరముదప్ప కోయిలలయొక్క పంచమస్వరము లేమింజేసి మేఘములయొక్క గర్జనధ్వను లుల్లమునకు నిష్టములుగాక యాషడ్జస్వరమే విరహిణులైయున్న వామలోచనలను దమతమనాథులచెంతకుఁ జేర్చు నట్టిబోటివలె నదులకు వానికిఁ బ్రియుఁడయిన సముద్రునిగూర్చుట విషయమై యిష్ట మాయెను. ఇచ్చట మయూరమునకు నదీసముద్రములకు దౌత్యవర్ణనముఁ జేయుటవలన దూతీసామ్యము చెప్పఁబడెను గనుక నుపమాలంకారము.

తే. తతతనువు రాహు సోమామృతంబు మ్రింగఁ
జక్రి దునిమిన మెడగంటి ౯ చాయఁ బొలిచె
నసితమేఘస్థమణిధను ౯ వాసుదర్శ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్య ౯ బింబ మలరె. 103

టీ. అ...వు-అసిత=నల్లనైన, మేఘస్థ = మేఘమందున్న, మణిధనువు = ఇంద్ర ధనుస్సు, త...హు- తత = విస్తారమయిన, తనువు = దేహముగల, రాహు = సైంహికే యుఁడు, సోమామృతంబు = చంద్రసుధను, మ్రింగర్ = కబళింపఁగా, చక్రి = శ్రీమహా విష్ణువు, తు...యర్-తునిమిన = ఖండించిన, మెడ = కంఠమందలి, గంటి = గాయము యొక్క, చాయర్ = పోలికచేతను, పొలిచెర్ = ఒప్పెను, ప్రతిసూర్యబింబము = ప్రతిఫలితసూర్యబింబము, ఆసుదర్శనం బనఁగర్ = తునిమి యావంక నిలిచియున్న చక్రమో యన్నట్లు, నింగిర్ = ఆకాశమందు, అలరెర్ = ప్రకాశించెను.

తా. మితిలేని శరీరము గల రాహువు చంద్రునియందున్న యమృతకళ గ్రసింప రాఁగా శ్రీమహావిష్ణువుచేత ఖండింపఁబడిన కంఠమందలి గాయముమాడ్కి మేఘమధ్య స్థం బింద్రధనుస్సును, ఆరాహుకంఠమును ఛేదింపవచ్చియున్న చక్రమువలెఁ బ్రతి సూర్యబింబమును బ్రకాశించెను. ఉత్ప్రేక్షాలంకారము.

చ. స్వరుఖరతాబ్రసాహిరిపురజాలమదాచిరరుక్శిఖిప్రభా
కరకబకాతివాస్సృతికిఁ[1] గా లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు నాఁ గలయట్టిసప్తసా
గరములు మేఘుఁ డానె నొకొకా యనఁగాఁ గనుపట్టెఁ బీనిచేన్.

టీ. వీనిచేన్ = స్వరుఖరతాదిగుణములు గలిగియుండుటచేత, స్వ...కిన్ - కాన్ - స్వర = పిడుగునకు, ఖరతా = తీక్ష్ణతగలుగుటకు నాకరము, అబ్ర...స - ఉన్ = ఉదకమునకు, రస = మాధుర్యముగల్గుటకు నాకరము. అహిరిపుజాల = నెమిళ్ళగుంపులకు, మద = గర్వముగలుగుటకు నాకరము, అచిరరుక్ = మెఱపులనియెడు, శిఖి = అగ్నికి, ప్రభా = దీప్తిగలుగుటకు నాకరము, కరక = వడగండ్లకు నాకరము, బక = కొంగలకు నాకరము, అతివాస్సృతికిఁగాన్ = శుద్ధోదకమును వర్షించుటకు నాకరము, సి. 'శతకోటిస్స్వరుశ్శంబోదంభోళిరశనిర్ద్వయోః, నీలకంఠో భుజంగభుక్, వర్షోపలస్తు కరకః, ఆపస్త్రీభూమ్ని వార్వారి' యని యంతట నమరము. మేఘుఁడు = అభ్రము, లవణ=ఉప్పుయొక్కయు, ఇక్షు = చెఱకుపాలయొక్కయు, సురా = కల్లుయొక్కయు, ఆజ్య = నేతియొక్కయు, దధి = పెరుగుయొక్క, ఉదాకరములు = సముద్రములును, దుగ్ధ = పాలయొక్కయు, శుద్ధజల = మంచినీళ్ళయొక్కయు, కంధులు = సముద్రములు, నాన్ గలయట్టి = అను పేళ్ళతోనుండునట్టి, (లోనగునట్టియనుపాఠము పొసఁగియుండమింజేసి దిద్దుపాటు చేయఁబడెను.) సప్తసాగరములన్ = సప్తసముద్రములను, ఆనెనొకొకా = పానము చేసెనాయేమి, అనఁగా = అనునట్లు, కనుపట్టెన్ = చూపట్టెను. హేతూత్ప్రేక్షాలంకారము. యథాసంఖ్యాలంకారమును.

తా. మేఘములయందు స్వరుఖరతాది గుణములు గనుపట్టుటంజేసి తత్తద్గుణ హేతుభూతంబులైన సప్తసముద్రములయందు నీ జలధరంబు లుదపానమొనరించి వచ్చెనో యన్నట్లు గానంబడుచుండెను.

మ. తనిమం బచ్చ మెఱుంగు గోఁచియు మణీధనోర్వజ్వలాపాథముం
గొని పుట్టం గొడు గబ్బ నెమ్మిపురియాకు ల్విప్పి శబ్దంబు మిం
చ నతస్ఫారరజోబలిత్వమున నుచ్చస్ఫూర్తి మిఁ దన్ని వే
ఘననీలాంగుఁడు గాంచె బాద[2]సలిలౌఘంబున్ మరుత్సృష్టమున్.

టీ. తనిమన్ = సూక్ష్మత్వముతోఁ గూడిన, వ...యున్ - వచ్చ = పచ్చని, మెఱుంగు = మెఱుపనియెడు, గోఁచియున్ = కౌపీనమును, మ...మున్ - మణీధనస్స =

1. బకాచ్ఛవాస్సృతులకై. 2. వలితో.

ఇంద్రచాప మనియెడు, ఉజ్జ్వల = వెలుంగుచున్న, ఆషాఢముక్ = దండమును, 'పాలాశో దండ ఆషాఢ' యని యమరము. కొని = వహించి, పుట్టంగొడుగబ్బక్ = పుట్ట గొడుగులనుగొడుగులు గలుగఁగా, నె...ల్ - నెమ్మిపురి = నెమిలిపించ మనియెడు, అకు ల్విప్పి = పొత్తమందలియాకులువిచ్చి, శబ్దంబుమించక్ = ఉఱుములనియెడు వేదవాక్య ములు బయలుదేఱఁగా, (కేకాధ్వను లనియెడు వేదవాక్యము లనియైనఁ జెప్ప వచ్చును.) న...నక్-నత = అడఁగిన, స్ఫార = అతిశయమైన, రజోబలిత్వమునక్ = పరాగ మను బలిచక్రవర్తిగలుగుటచేతను, ఉ...ర్తిక్-ఉచ్చ=ఉన్నతమైన, స్ఫూర్తిక్ = పటిమచేతను, వే = శీఘ్రముగ, మిన్ దన్ని = ఆకాశమందునిలిచి, ఘననీలాంగుఁడు - ఘన = మేఘమనెడు, నీలాంగుఁడు = వామనుఁడు, మరుత్ = దేవతలచేతను వాయువు చేతను, సృష్టముక్ = కల్పింపఁబడిన, పాదసలిలౌఘంబుక్ = పాద్యోదక ప్రవాహ మును (వానకాళ్ళను), కాంచెక్ = పొందెను.

తా. చిన్న పచ్చని మెఱుపనెడిగోఁచియు నింద్రధనుస్సనుదండమును దాల్చి పుట్ట గొడు గనుఛత్రము లభింపఁగా నెమలిపించ మను గ్రంథముననుండి పుటలు విప్పి యుఱుము లనువేదవాక్యములతో నడఁగిపోయిన పరాగ మనుబలిచక్రవర్తిచే గొప్ప శక్తిచే నాకాశమును దన్ని వాయు వనుదేవతచే వానకాళ్లను పాద్యోదకమును మేఘుఁ డను వామనమూర్తి పొందెను. మేఘుఁడు మెఱుపు మొదలగు లక్షణములను వహించి యుండఁగాఁ బసుపుగోఁచి మొదలగువానిని ధరించియున్న వామనస్వామిగా రూపింపఁ బడెను. కాన నిట రూపకాలంకారము.

క. ఘనవృష్టికతన ఫణు లే
 పున నలవల్మీకరంధ్రములు మూయఁగ నె
 త్తినగొడుగు లనఁగ ఛత్రా
 కనికాయం బవనినెల్లకడలం బొడమెన్. 106

టీ. ఘనవృష్టికతనక్ = ఎక్కుడువానగల్గుటచేతను, ఫణులు = సర్పములు, ఏపునక్ = ఉదుటుచేతను, అల = ప్రసిద్ధములయిన, వల్మీకరంధ్రములు - వల్మీక = పుట్టలయొక్క, రంధ్రములు = బిలములను, మూయఁగక్ = కప్పుటకొఱకు, ఎత్తిన = పైని నిలిపిన, గొడుగు లనఁగక్ = ఛత్రము లనునట్లు, ఛత్రాకనికాయంబు=పుట్టుగొడు గులయొక్క సమూహము, అవనిక్ = పుడమియందు, ఎల్లకడలక్ = సకలదిక్కుల యందును, పొడమెక్ = పుట్టెను.

తా. మిక్కుటముగా వర్షములు గురియుచుండఁగా సర్పములు దమ నివాస స్థానములయిన పుట్టలకలుఁగు మూయుటకై యెత్తిన ఛత్రములో యన్న ట్లెల్లదిక్కుల యందును బుట్టగొడుగులు కానవచ్చెను. ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణంబు బఱఁ గ్రూరవా పురోం
గారకయోగమూఁది తిరుగన్ సకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ *నంతలును నింతలునై పడుతన్నభశ్చ్యుతాం
గారశిశుప్రతానములకైవడి రాలె సురేంద్రగోపముల్. 107

టీ. మేఘుఁడు = వలాహకుఁడు, మింటన్ = అంతరిక్షమందు, సారెకున్ = మాటిమాటికిని, ని...బు-నిజ = తనయొక్క, స్ఫురణంబు = స్ఫూర్తి, అఱన్ = చెడునట్లు, క్రూరవహా = కఠినమైనట్టి, పురోంగారకయోగమూఁది = పురోంగారక మను నవయోగము వహించి, తిరుగన్ = అచ్చటనుండి మరల.గా, శ్లో. 'పురోంగారేస్వనాశ్చ్విశ్చి పురశ్శుక్రే ప్రవర్షతి' అని జ్యోతిశ్శాస్త్రమునం దున్నది. సకుటుంబమున్ = దారపుత్త్రాదులతో నున్న, తద్గ్రహంబున్ = ఆ యంగారక గ్రహమును, ఎంతేరుషన్ = అధికమైనకోపముచేతను, ద్రొబ్బన్ = క్రిందికిఁ బడఁద్రోయఁగా, *అంతలు నింతలునై = ఇంతంతతునియలై, పడు = పడుచున్నట్టియు, త...డిన్ - తన్నభః = ఆయాకాశమువలనను, చ్యుత = జాఱిన, అంగార = అంగారకునియొక్క, శిశుప్రతానములకైవడిన్ = పిల్లల గుంపులవలె, ని. 'అంగారాభూసుతోల్మకే' యని రత్నమాల. సురేంద్రగోపముల్ = ఇంద్రగోపపురుగులు, రాలెన్ = పడెను.

తా. ఇంద్రగోపములు పుడమియందు రాలఁగా మేఘుఁ డంతరిక్షమునందుఁ దన మహిమను నంగారకగ్రహము పురోంగారకయోగమును వహించి యడంచుచుండం జూచి, పిమ్మట నాయోగమునువదలి వెళ్లుచున్న యాయంగారకగ్రహమును, దారపుత్త్రాదులతో నత్యంతరోషముచేత భూమిపయిఁ బడద్రోయఁగాఁ దుత్తుమురులై పడుచున్న దానిపిల్లలో యన్నట్లుండెను.

క. కాకోదరాహితుల వ
ల్మీకంబులఁ దూర్చి మెఱసి మేఘుం డని గుం
పై కనుఁగొని పొగడెడు నన
భేకధ్వను లెసఁగె వృత్తిభేదానుకృతిన్. 108

టీ. కాకోదరాహితులన్ - కాకోదర=సర్పము లనియెడు, అహితులన్ = శత్రువులను, మెఱసి = మెఱుపులమెఱయఁజేసి, మేఘుండు = ఘనుఁడు, వల్మీకంబులన్ =

*అంతలును = పెద్దగుంపులును, ఇంతలును = చిన్నగుంపులును, ఐ.—ఆరుద్రపురుగులు (ఇంతలును అంతలును ఐ = చిన్నమొత్తములును పెద్దమొత్తములునుంగా) రాలెన్.—అని, వే. టీ. అంతలు, ఇంతలు అనుపదములకు పెద్దగుంపులు, చిన్నగుంపులు అనునర్థము భాషలో లేదు.

పుట్టలను, తూర్చెన్ = ప్రవేశింపఁజేసెను, అని = ఈలాగని, గుంపై = మొత్తములై, కనుఁగొని = చూచి, పొగడెడు ననన్ = స్తోత్రముచేయుచున్నవో యనునట్లు, వృత్తభేదానుకృతిన్ - వృత్తభేద = మండూకాది వృత్తభేదములయొక్క, అనుకృతిన్ = అనుకరణముచేతను, భేకధ్వనులు = కప్పకూఁతలు, ఎసఁగెన్ = అతిశయించెను.

తా. ఉప్పుడు మండూకాదివృత్తభేదముల ననుకరించు భేకధ్వనులు గలుగఁగా నవి మేఘుఁడు దమకు శత్రువులైన సర్పములను మెఱపుల మెఱయఁజేసి పుట్టలలోఁ బ్రవేశింపఁ జేసెనని తలంచికొని సంతోషించి గుంపుగూడి యామేఘమును బొగడు చున్నవో యన్నట్లుండెను. క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్ష.

తే. మొగిలు మైచీకటులు నెక్కుడౌజిగి మెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె
సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్ర
పుచ్చుఘనునకు నిట్టి దద్భుతమె *తలఁప. 109

టీ. మొగిలు = మేఘుఁడు, మై చీకటులన్ - మై = శరీరముయొక్క, చీకటులన్ = అంధకారముచేతను, ఎక్కుడౌజిగి మెఱుఁగులన్ = అధికమైన కాంతిగల మెఱుపుల చేతను, పగలు = దినమును, రాతిరి = రేయిగా, రాతిరి = నిశను, పగలు = దినముగాను, చేసెన్ = కావించెను. సకలమును = సర్వప్రపంచమును, నిద్రపుచ్చు = ప్రళయ కాలమందుఁ దనయుదరంబున నునిచికొని నిద్రింపఁజేయునట్టి, కేశవునిన్ = శ్రీమహా విష్ణువును, ని...నకున్-నిద్రపుచ్చు = సుప్తిబొందించుచున్న, ఘనునకున్ = మేఘునకును, అధికునకును, (భగవంతుండు వర్షాకాలమందు యోగనిద్రాసక్తుఁడని ప్రసిద్ధముగాన నిద్రపుచ్చు నని ప్రయోగించెను.) ఇట్టిది = పగలు రాత్రి, రాత్రి పగలుగాఁ జేయుట, తలఁపన్ = విచారింపఁగా, అద్భుతమె = ఆశ్చర్యమా ! కాదనుట. అర్థాపత్త్యలంకారము. యథాసంఖ్యాలంకారముగూడఁ గలదు.

తా. పెనుచీకటిచేతను జొక్కపుమెఱుపులచేతను మేఘుఁడు రాత్రిని బగలుగను బగటిని రేయిగ నొనర్చె ననఁగా నంధకారము గ్రమ్ముకొనునట్లుగాఁ జుట్టికొని వర్షించుచు మెఱుఁపులు మెఱయుచుండెను. సమస్త విశ్వములను యోగనిద్రాసక్తుఁడగు విష్ణుమూర్తి తనయుదరమున నుంచుకొని సుషుప్తి నొందించుచు గాన నట్టి శ్రీవిష్ణుమూర్తినే నిద్రింపఁజేయు మేఘుఁడు రాత్రి పగలు ,పగలు రాత్రి చేయఁగలుగుటలో నేమాశ్చర్యమును లేదుగదా !

---

* యనఁగ.

తే. ధూళి యడఁగిన మఱి మింట దోఁచె శంప
జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి
ఖనదిఁ దత్ఛ్రీవిభూషేచ్ఛఁ గడుగ మెఱయు
మృదుమహీగతవసురజోరేఖ యనఁగ. 110

టీ. ధూళి = దుమ్ము, అడఁగినన్ = అడఁగఁగా, మఱి = పిమ్మటను, మింటన్ = అంతరిక్షమందు, శంప = మెఱుపు, తోఁచెన్ = కనుపించెను, పర్జన్యుఁడు = ఇంద్రుఁడు, జ...ణిన్-జలధర = మేఘమనియెడు, ద్రోణిన్ = దోనెయందు, (అనఁగా జలగడుగువాఁడు మసికట్టఁబడి గెడు పలక యనుట.) మన్నున్ = భూమియందలి ధూళి రూపమైన మృత్తికను, ఎత్తి = ఊంచికొని, ఖనదిన్ = ఆకాశగంగయందు, తచ్ఛ్రీ విభూషేచ్ఛన్-తచ్ఛ్రీ = ఆగగనలక్ష్మికి, విభూషేచ్ఛన్ = భూషణముకొఱకైన యిచ్ఛ చేతను, కడుగన్ = క్షాళనముచేయఁగా, మెఱయు = జ్వలించుచున్న, మృదుమహీగత= మృదువైన భూమియందున్న, వసు = బంగారముయొక్క, రజః = ధూళియొక్క, రేఖ యనఁగాన్ = చాలనఁగా, తోఁచె నని క్రిందటి కన్వయము.

తా. వర్షముచేత భూమియందలి దుమ్మడఁగఁగాఁ బిమ్మటఁ గానవచ్చినవిద్యుల్లత పర్జన్యుఁడు మేఘ మనుదోనెయందు భూపరాగము నెత్తికొని గగనలక్ష్మికి భూషణములు చేయవలయు నన్న యిచ్ఛచేత నాకాశగంగయందుఁ గడుగఁగాఁ బ్రకాశించు చుండెను.

తే. స్థూలపరిపక్వకాననోదుంబరాగ్ర
రంధ్రముల వాననీరు సొరంగ వెడలె
మశకపఙ్క్తులు దావధూమంబు లడఁగ
రచ్చ సేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. 111

టీ. స్థూ...లన్-స్థూల = గొప్పవైన, పరిపక్వ = పండియున్న, కానన = అడవి యందలి, ఉదుంబర = మేడి పండ్లయొక్క, అగ్ర = తుదలయందున్న, రంధ్రములన్ = బెజ్జములయందు, వాననీరు సొరంగన్ = వర్షోదకము ప్రవేశింపఁగా, మశకపఙ్క్తులు = దోమలచాళ్ళు, దావధూమంబులడఁగన్ = కాఱుచిచ్చులపొగలణఁగఁగా, విశ్రాంతికిన్ = శ్రమమునుబోఁగొట్టుకొనుటకొఱకు, రచ్చ సేయంగన్ = కొలువు సేయుటకు, వెడలెన నఁగన్ = బయలుదేఱె నన్నట్లు, వెడలెన్ = బయలుదేఱెను.

తా. వానలు మెండుగాఁ గురియుటచేత నడవియందలి పరిపక్వములైన మేడి పండ్లనుండి దోమలగుంపులు వెడలెను. అవి కాఱుచిచ్చులు చల్లాఱుటం జేసి విశ్రాంతి కొఱకుఁ గొలువుచేయ నాలోచించి బయలువెళ్లెనో యన్నట్లుండెను.

---

† తీవ్రిలి.

స్రగ్ధర. గ్రావాళిం గేతకీకోరకకుటజరజోరాజిదూర్వాంకురశ్రీ
తోఁ వీక్షింపం దివానుత్రుటి మఱుఁగుపడుచుం దోఁచు చిట్లా తిరోభా
వావిర్భావంబులం బాయక పొరయ నభస్సభ్రముల్ గప్పి పై నెం
తే విప్పెపింఛికల్ బర్హిణులు దిరుగఁ బెల్లింద్రజాలంబుఁ జూపెన్.

టీ. గ్రావాళిన్ - గ్రావ = పర్వతములయొక్క, ఆళిన్ = సమూహమందు, ని॰ 'అద్రిగోత్రగిరిగ్రావాచలశైలశిలోచ్చయాః' యని యమరము. కే...జి-కేతకీకోరక = మొగిలిమొగ్గలయొక్కయు, కుటజ = కొండమల్లెమొగ్గలయొక్క, ని. 'కలికా కోరకః పుమా' ననియు, 'కుటజో గిరిమల్లికా' యనియు నమరము. రజోరాజి = పరాగపఙ్క్తి, దూ...తోన్ - దూర్వాంకుర = గఱికమొలకలయొక్క, శ్రీతోన్ = సంపదతో, వీక్షిం పన్=చూడఁగా, ది...టిన్ - దిన=పగటియొక్క, అనుత్రుటిన్ = ప్రతిక్షణమందును, 'స్త్రియాం మాత్రా త్రుటిః పుంసి' యని యమరము. మఱుఁగుపడుచున్ = కనుపడక యుండు చును, తోఁచుచున్ = కనఁబడుచును, ఇట్లా = ఈప్రకారమయిన, తిరోభావావిర్భా వంబులన్ - తిరోభావ = కనఁబడకయుండుటను, ఆవిర్భావంబులన్ = కనఁబడుటను, పాయక = ఎడతెగక, పొరయన్ = పొందఁగా, నభస్సు=శ్రావణమాసము, అభ్రముల్= మేఘములను, కప్పి = పఱపి, పైన్ = మీఁద, బర్హిణులు = నెమిళ్లు, పింఛికల్ = పురులు, ఎంతేవిప్పె = మిక్కిలి వ్యాప్తములై, తిరుగన్ = ఆడుచుండఁగా, పెల్లు = అధికమైన, ఇంద్రజాలంబున్ = ఇంద్రజాల మనుశాంబరవిద్యను, చూపెన్ = కను పఱచెను.

తా. వర్షాకాలమునఁ బుష్పించుచున్న కుటజకేతకాదుల పరాగములును గఱిక కాంతులును గొంతవడిఁ గన్పట్టియుఁ గొంతవడిఁ గన్పడకయు నిట్లు తిరోధానావి ర్భావముల నెడతెగక పొందఁగా శ్రావణమాసమునైంద్రజాలికుఁడు మేఘములను తెరవేసి నెమిళ్లయొక్క వెడల్పులైన పింఛములు వ్యాపింపఁజేసి యతిశయమైన యింద్రజాలవిద్యను గనుపఱచెను. భస్మమును దూర్వయును నెమిలిపింఛము నింద్రజాల సాధనములు. తిరోధానావిర్భావము లింద్రజాలగుణములు. ఇవి యన్నియు నప్పుడు కలిగియున్న వనుట.

తే. గిరులతటజంబుతరువులఁ జ దొరఁగుపండ్లఁ
బుట్టె జంబూనదులు గానఁ జ బొదువు మొయిలు
మేన నవి *సోఁకునెడలుగా జ మిఁతిఁ దటిచ్ఛ
లంబునను శుద్ధజాంబూనదంబు లయ్యె. 113

* సోఁకనలువుగా.

టీ. గిరుల = కొండలయొక్క, తట = చరులయందుఁబుట్టిన, జంబుతరువులన్ = నేరేడుచెట్లనుండి, తొ...న్-తొరఁగు = రాలుచున్న, పండ్లన్ = ఫలములవలన, జంబూనదులు = నేరేడుపండ్లరసపుటేళ్లు, పుట్టెన్ = ఉదయించెను, కానన్ = అడవియందు, పొ...నన్ - పొదువు = ఆలముకొన్న, మొ...లు = మేఘములయొక్క, మేనన్ = శరీరమందు, అవి = ఆ జంబూనదులు, సో...గా - సోఁకు = తాఁకునట్టి, ఎడలుగా = తావులేగదా, మితిన్ = మేరదప్పక, త...ను తటిత్ = మెఱుపనియెడు, ఛలంబునను = వ్యాజముచేత, శు...లు - శుద్ధ = చొక్కములైన, జాంబూనదంబులు = సువర్ణములు, అయ్యెన్ = ఆయెను.

తా. మేఘములయందుండు మెఱుపును జూడఁగాఁ గొండలయువలి చరులయందు జనించియున్న నేరేడుచెట్లనుండి రాలుచున్నపండ్లయందుఁ బుట్టిన జంబూనదు లడవియందెల్లదిశల నుండఁగా నం దలముకొన్న మేఘములయొక్క దేహములందు నవి సోఁకినందున జంబూనది ప్రవహించినచో స్వర్ణమగునట్టి మర్యాద దప్పక తటిత్తు లనువ్యాజము పొంది మొయిళ్ళు శుద్ధజాంబూనదమయము లాయెను. అపహ్నవాలంకారము.

తే. సురభిబడిఁ జన్న సప్తలాశోకకమల
కువలయామ్రాళికిఁ గదంబకుటజనీప
కకుభయూధికలను సాయకములు మరున
కేను గల్గి గేదఁగిసురెకయెక్కుడయ్యె. 114

టీ. సురభిబడిన్ = వసంతునివెంబడిగా, చన్న = పోయినటువంటి, ని. 'సురభిస్తు గవి స్త్రియాం, వసంతచైత్రయోః పుంసి త్రిషు సౌమ్యసుగంధినోః' అని రత్నమాల. సప్తలా = విరజాజియొక్కయు, 'సప్తలా నవమాలికా' యని యమరము. అశోక = కంకేళియొక్కయు, కమల = పద్మముయొక్కయు, కువలయ = కలువయొక్కయు, ఆమ్ర = మామిడియొక్కయు, ఆళికిన్ = సమూహమునకు, క...లు - కదంబ = కడిమిపువ్వును, కుటజ = కొడిసెపువ్వును, నీప = కడపపువ్వును, (అమరమున గదంబనీపములు పర్యాయములుగాఁ జెప్పఁబడియున్నను శుకులు' బిల్వవకుళామ్రకదంబనీపాః' అన భిన్నజాతిగాఁ బ్రయోగించియున్నారు గనుక నీ గ్రంథకర్తయును రెంటిని వేఱుగాఁ జెప్పె నని యెఱుఁగఁదగును.) కకుభ = మద్దిపువ్వును, 'ఇంద్రద్రుకకుభోఽర్జునః' యని యమరము. యూథికలు = అడవిమొల్లయును, 'గణికాయూథికాంబష్ఠా' యని యమరము. అను = అనునట్టి, సాయకములు = బాణములు, మరునకున్ = మన్మథునకు, ఏను కల్గి = పంచబాణములకుఁ బ్రతినిధి పంచబాణములుగల్గియు, గేదగిసురె = మొగలిరేకను సురియకత్తి, ఎక్కుడయ్యెన్ = శ్రేష్ఠమాయె నని యర్థము. ఆఱవయాయుధమాయె నని భావము.

తా. వసంతునితోడ నరిగిన సప్తలాశోకాది పంచబాణములకు బదులుగా నీ వర్షర్తువందుఁ గదంబకుటజాది పంచసాయకములు గల్గియుఁ గేతకీకుసుమ మెక్కుడయ్యె ననఁగా నీ ఋతువు వసంతర్తువుకంటె నతిశయముగా స్మరోద్దీపక మాయెను.

క. నటనపరకేకిపాత్ర
స్ఫుటయవనిక లన మొగుళ్లు పొదివె భూభృ
త్తటుల నవి యాకు దిను చిట
పొటరవము చెలంగెఁ దాళములచప్పుడు నై. 115

టీ. న...లు అనక్ - నటన = నాట్యమునందు, పర = ఆసక్తములైన, కేకి = నెమళ్లనియెడు, పాత్ర = నాట్యస్త్రీలయొక్క, స్ఫుట = వ్యక్తమైన, యవనికలనక్ = నీలితెరలో యనఁగా, 'ప్రతిసీరాయవనికాస్యాత్తిరస్కరణీచసా' యని యమరము. భూభృత్తటులక్ = కొండలచరులయందు, పొదివెక్ = వ్యాపించెను, అవి = ఆ మేఘములు, ఆకుదిను = పర్ణములను దినుచున్న, చిటపొటరవము = చిటపొటయనుధ్వని, తాళములచప్పుడునై = తాళధ్వనియై, (నాట్యోప యోగితాళంబు లనుట.) చెలఁగెక్ = ఒప్పెను. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

తా. అప్పుడు నెమళ్లనియెడునాట్యస్త్రీలు నాట్యముసేయఁగా మబ్బులు కొండలలోని యాకులు మేయుచుండఁ గల్గిన చిటపొటధ్వనులు తాళములుగా నామేఘములు నీలపుఁదెరగుడ్డలుగా నొప్పుచుండెను.

చ. జలధర ముప్పుతోఁ బులుసు నొసఁగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచి దోఁటఁ బె
న్పులుసు గరుళ్లఁ గ్రాయ నవి వోవడగండ్లన రాలెఁ గాని నాఁ
డిలఁ బడువానిఁ దిన్న యపుడే చలిఁ బండ్లు వడంగ నేటికిన్. 116

టీ. జలధరము = మేఘము, ఉప్పుతోక్ = లవణముతోఁగూడిన, పులుసు = ఆమ్లము, రసంబు = రుచిని, ఒసఁగునని = ఇచ్చునని, అప్పయోధిక్ = ఆ లవణసముద్రమును, ఇంపొలయఁగక్ = ప్రీతిగల్గునట్టుల, క్రోలి = పానముఁజేసి, పైక్ = ఆ పిమ్మటను, దధిపయోధియుక్ = పెరుఁగుసముద్రమును, క్రోలఁగక్ = త్రావఁగా, ప్రాఁచి దోఁటక్ = అది ప్రాచీనమైనదిగాన, (పులిసినపెరుఁగనుట.) పె...ళ్లక్ - పెన్పులుసు=మిగులఁ బుల్లనైన, కరుళ్లక్ = పెరుఁగుగడ్డలను, క్రాయక్ = వెళ్లఁగ్రక్కఁగా, అవివో = అట్లువెళ్ళఁగ్రక్కఁబడిన పెరుఁగుగడ్డలే, వడగండ్లనక్ = కరక లనునట్లుగా, రాలెక్ = పతనమునొందెను, కానినాఁడు = ఈవడగండ్లు దధికణములు కాకపోయె నేని, ఇలక్ = భూమియందు, పడువానిక్ = పతనమగుచున్న యావడగండ్లను, తిన్న

యపుడే=తినఁగానే, పండ్లు=దంతములు, చలివడంగ నేటికిక్ = జిల్లుమని చల్లబడుట సిన నిమిత్తమేమి ?

తా. అపుడు రాలుచున్న వడగండ్లను నోటిలోవేయఁగాఁ బండ్లు జివ్వనితీపు గలవై పులుసు దగిలిన దంతములమాడ్కి వస్త్వంతరముల నమలుటకు శక్తి చాలకుండు టంజేసి మేఘము పులుసుతో నుప్పు గలిపినట్లయిన మిక్కిలి రుచిగా నుండు నని తలంచి ముందు లవణసముద్రమున నీరు ద్రావి యాపిమ్మట దధిసముద్రమును బానముచేయఁగా నది ప్రాఁచిదౌటవలన మిక్కిలి పులుసుగా నుండెను గాన దాని వెళ్ళఁ గ్రక్కఁగానే యాగడ్డలే వడగండ్లనువ్యాజమున రాలుచున్నవి. ఉత్ప్రేక్షాలంకారము.

తే. అపు డసల్లకు డిగక మేఘాళి పొదువు
నచలములపైనె దొడ్డికట్టగుమృగాళి
జాడఁ జూపట్టె మీఁదిపర్జన్యధన్వి
నృపున కగు తెరవేఁటయాయిత మనంగ. 117

టీ. అపుడు = ఆ వర్షాకాలమునందు, అసల్లకుడిగక = బురదలలోదిగక, మేఘాళి= మబ్బులచాళ్లు, పొదువు = చుట్టుకొన్న, అచలములపైనె = కొండలమీఁదనె, దొడ్డి కట్టగు = దొడ్డిలోఁ దోలఁబడినవానివలె నిలిచియున్న, మృగాళిజాడ = లేళ్లగుంపువలె, మీ...న్వి - మీఁది = పయినున్న, పర్జన్య = ఇంద్రుఁడనియెడు, ధన్వి = ధనుర్ధరుఁడైన, నృపునకుక్ = రాజునకు, అగు = అయినటువంటి, తెరవేఁటయాయితము = సిద్ధమయిన తెరవేఁట, అనంగక్ = అనునట్లు, చూపట్టెక్ = కానవచ్చెను. (తెరవేఁట యనఁగా గొప్పయధికారులు వేఁటకు వెడలునవసరంబున ననుగతులయిన వేఁటకాండ్రచేత మృగము లొక్కచోటఁ గూడియుండునట్టుగఁ జుట్టును తెరవేసి సమకూర్చుట.)

తా. ఆవానకాలమునందు జడిసి బురదలకు డిగ్గక మబ్బులగుంపు చుట్టును వ్యాపింపఁ బడియున్న కొండలపైని దొడ్డికట్టుగా నిలువఁబడియున్న మృగములవలెఁ బర్జన్యుం డనువిలుకాఁ డగు దొడ్డరాజునకై సిద్ధపఱపఁబడిన తెరవేఁటయో యన్నట్లుండెను.

చ. తడి తల డిగ్గి ముంప జడశీతం దుది రెప్పలఁ గన్ను విప్పి పు
ల్పొడచుచు నీరు ముంగరలన్‌పోలిక ముక్కునఁ గూడ నోటఁ గొం
తొడియుచు గూఁటికిట్టు సగన్ మొత్తుచు రెక్కపిసర్పు మున్నుగా
వడఁకుచునె కాక [1]చేష్టుడిగెన్ పక్షులు వక్షము జానువుల్ చొరన్.

టీ. తడి = నీరు, తలడిగ్గి = తమతలలనుండి దిగి, ముంపక్ = ముంచుకొనఁగా, (అనఁగా వర్షము దొల్తఁ బక్షులతలలుదడిపి పిమ్మట వానిశరీరములను దడుపఁగా

1. చేయుడిగె.

నమట.) జడతన్ = జాడ్యముచేతను, తుదిఱెప్పలన్ = పక్షాగ్రములచేత, కన్నువిప్పి = నేత్రములు దెఱచి, పుల్పొడుచుచు = కన్నులుపులకరించుచుసు (అనగాఁ దెఱవఁగూడని కన్నుల నతిప్రయత్నమునఁ దెఱచి లోనినీళ్లు వెలువరించుచు.) నీరు = వర్షోదకము, ముంగరల పోలికన్ = ముక్కఱలవలె వడి, ముక్కులఁగూడన్ = నాసికలయందు వ్రేలఁగా, నోటన్ = వదనముచేతను, కొంతొడిచుచు = కొంతస్వీకరించుచుసు, గూఁటికట్టెలు, గూఁటిపుడకయందు, సగము = అర్ధము, ఒత్తుచున్ = తుడుచుచుసు, పక్షులు = పిట్ట = జానువుల్ = తమ మోఁకాళ్ళు, వక్షము = ఎద, చొరన్ = చొచ్చియుండఁగా, వడఁకుటె కాక = కంపమొందుటయేకాక, ఱెక్కవిదుర్పు మున్నుగాన్ = పక్షవిధూననము మొదలయిన, చేష్ట = వ్యాపారము, ఉడిగెన్ = మానెను.

తా. ఆసమయంబునఁ బిట్టలు గూండ్లయందు ముద్దలుగాఁ దడుపఁబడి కాళ్లు ముడుచుకొని చలికి వడంకుట దక్క నొండుచేష్ట లుడిగి యుండెను.

క. చెందు నెఱసంజ కుంకుమ
క్రందునఁ గెంపెక్కుదివికి గాశ్మీరత రా
నిందుశిలాత్వము రవి గని
యెం దోయముఁ గురియ నేల యిటు గాకున్నన్. 119

టీ. చెందు = ప్రాప్తమైన, నెఱసంజ = పూర్ణసంధ్యారాగమనియెడు, కుంకుమ = కుంకుమపువ్వుయొక్క, క్రందునన్ = అతిశయముచేత, కెం...కిన్ - కెంపెక్కు = ఎఱుపెక్కిన, దివికిన్ = ఆకాశమునకు, కాశ్మీరత = కాశ్మీరదేశత్వము, రాన్ = రాఁగా, రవి = సూర్యుఁడు, ఇందుశిలాత్వము = చంద్రకాంతమణియగుటను, కనియెన్ = పొందెను. ఇటుగాకున్నన్ = సూర్యుఁడు చంద్రశిల గాకుండెనేని, తోయమున్ = జలమును, కురియనేల = వర్షింప నిమిత్తమేమి ?

తా. సంధ్యాకాలమునందు వర్షించుచుండఁగా నెఱుపుఁజెందినసంధ్య యను కుంకుమపువ్వుచేత నెఱ్ఱనైన యాకసమునకుఁ గాశ్మీరదేశత్వము రాఁగా సూర్యుఁడు తద్దేశోద్భవ మని ప్రసిద్ధికెక్కిన యిందుశిలాత్వమును బొందెను. అటుగాకపోయెనేని యాసూర్యుఁ డుదకంబుల వర్షించుటకు హేతు వేమని ప్రజలు తలంచున ట్లుండెను.

చ. అలజలరాశి నీటఁ బగ లర్కకరావళి చూలు దాల్పఁగా
నలమిన యార్ష్యరాత్రి ధవళాంశుకరావళి దానుఁ దాల్పఁ ద
జ్జలముల కాస మూఁగికొనుచాడ్పున నాడి వహించెఁ జూలు *మ
బ్బుల నిల ముంచు నీలఘనపుంజమువల్ల బలాకనూలికల్. 120

* నంబుల నిల ముంచు. (జలముచే భూమిని మునుఁగఁజేయు.)

టీ. అల = ప్రసిద్ధమైన, జలరాశి = సముద్రముయొక్క, నీటన్ = ఉదకముచే, పగలు = పవటియందు, అర్కకరావళి = సూర్యకిరణసమూహము, 'బలహస్తాంశవః కరా' యని యమరము. చూలుదాల్పఁగాన్=గర్భముధరియింపఁగా, అలమినయార్ష్యన్ = జనించిన యసూయచేత, రాత్రిన్ = రేయియందు, ధవళాంశుకరావళి=చంద్రకిరణ సమూహము, తామున్ = తాముసు, తాల్పన్ = గర్భములుధరియించుకొనుటకు, తజ్జల ములకున్ = ఆసముద్రోదకములఁ ద్రావుటకై, ఆసన్ = ఆశతో, మూఁగికొనుచాడ్పు నన్ = చుట్టుకొనినవిధమున, ఆడి = సంచరించి, బలాకమాలికల్=తెల్లకొంగలచాళ్ళు, 'బలాకాబిసకంఠికా' యని యమరము. మబ్బులన్ = చీకట్లచేతను, ఇలన్ = భూమిని, ము...ల్లన్ - ముంచు = కప్పుచున్న, నీలఘన = కాలమేఘముయొక్క, పుంజము వల్ల = సమూహమువలనను, చూలు=గర్భమును, వహించెన్ = ధరియించెను.

తా. తెల్లకొంగలు రాత్రులయందు నంధకార మగునట్లు భూమియందుఁ గప్పి యున్న నల్లమబ్బులను మాలికలుగాఁ జుట్టికొని యానీళ్ళు త్రాగి గర్భము ధరింపఁగా సూర్యకిరణములు పగటియందు సముద్రోదకముచేసి గర్భముధరియింపఁజూచి యీర్ష్య గలవియై చంద్రకిరణములు దాముసు గర్భముల ధరియించుటకొఱకు నాసముద్రోదక ములం బీల్చుటకై తిరుగుచున్నట్లుండెను.

క. ఉఱుము విని యలకకై దివి
వెఱఁ బఱచుమరాళపటలి కే విడిచినఁ బడు న
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. 121

టీ. ఉఱుమున్=గర్జితమును, విని=ఆలకించి, అలకకై = అలకాపురమునకేదురై, దివిన్ = అంతరిక్షమునందు, వెఱన్ = భయముచేత, ప...లి - పఱచు = పఱువిడు చున్నట్టి, మరాళపటలి = అంచలగుంపు, విడిచినన్ =వదలఁగా, పడు = పతనమునొందు చున్నట్టి, అ...నన్ - అక్కఱచిన = ఆయంచలుగొఱికిన, బిసలవవిసరము = తామర తూఁడుతునుకలసమూహముయొక్క, తెఱఁగునన్ = చందమునను, వడగండ్లు = వర్షో పలములు, ధవళదీధితిన్ = తెల్లనికాంతితోడను, రాలెన్ = పడెను.

తా. ఆకాశమునం దలకానగరోన్ముఖమై యంచలగుంపు పోవుచుండఁగా నుఱు ములధ్వని విని భయపడి నోటనున్న తామరతూఁడులముక్కలు విడిచి వేయఁగా నవి పుడమిఁ బడుచున్నవిధమున వడగండ్లు తెల్లనివై పడెను.

క. తటిదుత్సారితఫణభృ
త్పటలి నిరన్నంబు లయ్యెఁ గే దక్కవు బర్హుల్

నటన మతిహర్ష హేతూ
త్కటలాభం బిడునె మది క్షుధ స్నీర్వట్టున్. - 122

టీ. బర్హుల్=నెమళ్లు, త...లిక్ - తటిత్ = మెఱపులచేత, ఉత్సారిత = పోఁ దోలఁబడిన, ఫణభృత్ = పాములయొక్క, పటలిక్ = సమూహముచేత, నిరన్నంబుల య్యుక్ = నిరాహారములైనప్పటికిని, నటనము = నాట్యమాడుటను, తక్కవు = మానవు, అ...బు-అతిహర్ష = అత్యంతసంతోషమునకు, హేతు = కారణముయొక్క, ఉత్కట=అధికమైన, లాభంబు = ప్రాప్తి, మదిక్ = మనంబునందు, క్షుధక్ = ఆకలిని, నీర్వట్టుక్ = దప్పిని, ఇడునె = కలుగఁజేయునా! (చేయ దనుట).

తా. మెఱపులు మెఱసి పాములగుంపులను బుట్టలోనికిఁ ద్రోలివేసిన కారణమున నాహారము లేనప్పటికిని నెమిళ్లు తమనృత్యమునుమాత్రము మానకుండెను. పరమసంతోష సమయమున నాఁకలిదప్పులు మనస్సునకుఁ దోఁపవుగదా! అర్థాంతరన్యాసాలంకారము.

సీ. రవిఁ జూచి కుడుచువారలకును గృకలాస
మ్ములకును దృష్టి మిన్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయిద్విజశ్రేణి కిలు సేరు
మొదవులకును భ్రాంతి మదిఁ జనించె
[1]హాలజీవిసందోహములకు బలాకికా
విసరంబులకు మంచి వెదలు [2]దొరకె
నెలమిఁ బొల్పగుయాధికలకు సంతలకూట
ములకును మఱి పిచ్చిమొగ్గ లొదవె
తే. నతిథిసంఘంబునకు నీనినట్టియెనుప
కదుపులేఁగలగమికి వారకట్టు లెసఁగె
మంటిమిద్దెలవారికి మరుపనులకు
నెలఁత వాసినవారికి నిదుర చెడియె. 123

టీ. రవిక్ = సూర్యుని, చూచి = వీక్షించి, కుడుచువారలకును = భోజనము సేయువారికిని, కృకలాసములకును = తొండలకును, 'సరటః కృకలాసస్స్యాత్' అని యమరము. దృష్టి = చూపు, మిన్నులనె = అంతరిక్షమందే, నిలిచెక్ = ఉండెను. (ఆదిత్యునిఁ జూడక భుజింప మను నియమము గలవారలకుఁ దద్దర్శనాపేక్షచేతను, దొండలకు వానిపొలసునందున్న నీరుచొచ్చిన వాని దేహము లాడుచున్నవిగానఁ గొమ్మలం దూర్ధ్వ

1. హాలిభీజ 2. దొరికె.

ముగ నిలిచియుండుటచేతను గనుచూపు లంతరిక్షమంద యుండు ననుట.) సం...కిన్ - సంధ్యార్ఘ్యదాయి - సంధ్యా = సాయంకాలమునందు, అర్ఘ్యదాయి = అర్ఘ్యప్రదానము చేయునట్టి, ద్విజశ్రేణికిన్ = పుడమివేల్పులసంఘమునకును, ఇలుసేరు, మొదవుల కున్ = ఇండ్లకువచ్చుచున్న పసులకును, భ్రాంతి=సాయంకాలమను భ్రమము, మదిన్ = బుద్ధియందు, జనించెన్ = పుట్టెను. హాలజీవిసందోహమునకున్ = వ్యవసాయముఁ జేయు జనసమూహమునకును, బలాకికావిసరంబులకున్ = తెల్లకొంగలగుంపులకును, మం...లు-మంచి = అనుకూలమైన, వెదలు = చల్లఁబడ్డచేలు చక్కఁగా మొలచుటయు, గర్భధారణమును, దొరకెన్ = ప్రాప్తించెను. శ్లో. 'గర్భం బలాకా దధతేఽభ్రయోగా న్నాకేనిబద్ధావలయం సమంతా' త్తని కర్ణోదయమందుఁ బ్రయోగము. ఎలమిన్ = ఉత్సాహముతో, పొ...కున్-పొల్పగు = ఒప్పుచున్న, యూథికలకున్=మొల్లల భేదములకును, సంతలకూటములకును = సంతలకువచ్చి కూడియున్న జనములకును, (సంత యనఁగా గ్రామాంతరములనుండి వర్తకులు నానావిధంబులైన సరకులందెచ్చి బస్తీగా నుండుగ్రామమునకు వెలపలనునిచి యావస్తువులను విక్రయించెడు బజాఱు.) మఱి = మిక్కిలియును, విచ్చుమొగ్గలు = పరువిడుటయు, మొగ్గలఁవిచ్చుటయును, ఒదవెన్=కలిగెను. (అనఁగా వర్షాకాలమునందుఁబుష్పించునట్టియూథికలు వికసించినవనియు, వర్షముర్రాఁగా సంతకువచ్చిన ప్రజ లూళ్ళకు విచ్చిపోయి రనియు భావము.) అతిథి సంఘంబునకున్ = అతిథిసమూహమునకును, ఈ...కిన్-ఈనినట్టి, ఎనుప=గేదెలయొక్క, కదుపు = సంఘముయొక్క, లేఁగలగమికిన్ = దూడలసమూహమునకు, వాకట్టులు = వాగ్బంధనములు, ఎసఁగెన్ = అతిశయించెను, (మేరదప్పినవర్షము గురియుచుండఁగా సంచరించుట కుపాయ మొందని యతిథులకు నన్నములేనందునను - గేదెకదుపుల లేఁగలకుఁ జలిచేత దవడలుమూసికొని పాలుగుడువఁగూడనందునను వాగ్బంధనము లౌదవె ననుట.) మంటిమిద్దెలవారికిన్ = మంటితో మేడలేర్పఱచుకొన్నవారికిని, మరు పనులకు = మన్మథవ్యాపారములకు, నెలంతన్ = స్త్రీలను, (ఇది జాత్యేకవచనము.) పాసిన వారికిన్=ఎడఁబాసినవారికిని, నిదురచెడియెన్=నిద్రలేకపోయెను (అనఁగా మంటిమిద్దెలు గలవారికిఁ బైనున్నమన్ను వర్షముచేతఁ గఱఁగి యింటిలో పడుటచేతను, మన్మథ వ్యాపారములకు స్త్రీలులేనివారికి విరహవేదన గల్గుటచేతను నిదురలేకయుంట ప్రసిద్ధము మఱుపనులకు నెలంతఁబాసినవారికనుదాని కితరవ్యాపారార్థము స్త్రీల నెడఁబాసినవారికని కొన్నివ్యాఖ్యానములలో నున్నది. మరుపనులకును నిద్రలేకపోయెననియైనం జెప్ప వచ్చును. అపక్షమున నవి యధికముగా జరగెననిభావము.) శ్లో. 'వర్ణ్యానామితరేషాంవా ధర్మైక్యం తుల్యయోగితా' యను లక్షణముచేత నొప్పియున్న తుల్యయోగితాలంకారము. రెండవగీటున భ్రాంతిమదలంకారము.

ఉ. కాలునిదున్న నందినయి గంటలుదున్నక మంటినా మహా
కాలుఁనినందిదున్నయి కర్దమమగ్నత లేక మంటి నా
హాలికు లెన్నఁడుం దెగనియౌరులచేలును జౌడుమళ్లుగాం
గా లలి నేరుసాఁగి రిలఁ గల్గుపసింగొని పేద మున్నుగన్. 124

టీ. కా...న్న-కాలుని = యమునియొక్క, దున్న = వాహనమైనమహిషము - 'కాలో దండధరః శ్రాద్ధదేవః' యని యమరము. నందినయి=వృషభమై, గంటలు = అవురు దుబ్బులను, దున్నక = కృషిచేయక, మంటినాక్ = బ్రదికితిననఁగా, మహాకాలునినంది = రుద్రునకు వాహనంబైనవృషభము, 'మహాకాలో మహానటః' యని యమరము. దున్నయి = దున్నపోతునై, కర్దమమగ్నతలేక = బురదలయందుఁ గాళ్ళుదిగఁబడలేక - 'పంకో స్త్రీ శాదకర్దమౌ' యని యమరము. మంటినాక్ = బ్రదికితి ననునట్లుగ, హాలికులు = కృషీవలులు, ఎ...ను-ఎన్నఁడుందెగని=ఏదినమందునుదున్నని, ఔరులచేలును = గంటలు గల చెలికలును, చౌడుమళ్లునుగాక్ = ఊషరములగు కేదారములుగా, లలిక్ = ఆసక్తిచేతను, పేదమున్నుగాక్ = దరిద్రుఁడు మొదలుగా, ఇ...సిక్ కొని = ఇలఁగల్గు= భూమియందున్న, పసింగొని = పశుమాత్రమునంతయును గూర్చి, ఏరుసాగిరి = మడక కట్టి దున్నిరి.

తా. దున్నపోతులకు వెలిదుక్కి కష్టముగనుక యమునికి వాహనమగుటవల్ల దున్నక సుఖించితి నని యామహిషమును, ఎద్దులకు రొంపిదుక్కి కష్టముగనుక నీశ్వరునకు వాహనమైనందున దున్నవలసినదిలేదని యావృషభమును నెంచునట్లుగాఁ బుడమియం దెల్లెడల నుండుపశువులం దెచ్చి బీదలు మొదలగు హాలికులు బీటిచేలు చవుటికయ్యలుగూడ దున్నిరి.

క. వరుజుబడి రొంపిఁ ద్రొక్కఁం
జరణంబులఁ జుట్టి పసిఁడిచాయకడుపులం
బౌరి నీరుకట్టె లమరెను
బిరుదులు హాలికులు దున్నఁ బెట్టిరో యనఁగన్. 125

టీ. వరజుబడిక్=మడిగనిమవెంబడిని, రొంపిఁద్రొక్కక్=మడిలోనీరువెళ్ళకుండునట్లు బురదను ద్రొక్కఁగా, చరణంబులక్ = పాదములను, చుట్టి = చుట్టికొని, పసిఁడి చాయకడుపులక్ = బంగారువన్నెగల యుదరములతోఁగూడిన, నీరుకట్టెలు=నీరుతొట్టి పాములు; పౌరిక్ = ఔద్ధత్యముచేతను, హాలికులు = కర్షకులు, దున్నక్ = దుక్కియందు, బిరుదులు=తమకు సరియెవ్వరును గారని గండపెండెరములు, పెట్టిరోయనఁగక్ = ధరియించిరో యన్నట్లు, అమరక్ = ఒప్పెను.

తా. కర్షకులు మడిలో బురదను ద్రొక్కుచుండఁగా వారిపాదములను జుట్టుకొన్న బంగారువన్నెగల పొట్టలతోఁగూడిన నీరుకట్టెలు, సేద్యకాండ్రు తమ గొప్పఁదనమును జాటుటకై దుక్కియందు ధరించిన గండపెండేరములా యన్నట్లుండెను.

క. నాని శిఖి వంటచెఱకుల
చే నఱ నవి వెండి వంటచెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల
బోనంబులె యయ్యెఁ బ్రొయ్యిపాగయమి వృష్టిన్. 126

టీ. శిఖి = అగ్ని, వంటచెఱకులచేన్ = వంటకట్టియలచేతను, నాని = తడిసి, అఱన్ = చల్లాఱఁగా, (ఎడతెగని వానలచేతఁ దడిసియున్నకట్టెలు నిప్పుమీఁద వేయఁగానే యాయగ్ని చల్లాఱె ననుట.) అవి = ఆయింధనములు, వెండి = మఱియును (అనఁగా విచారింపఁగా ననుట.) వంటచెఱకులెయగుటన్ = వంటకుయోగ్యమయిన చెఱకులని యన్వర్థము లగుటచేతను (అనఁగా బెల్లమువండుటకుఁ దగిన చెఱకులు రసఘనములైయుండి గానుగయందుంచి త్రిప్పఁగా నెట్లు రసమును వెళ్లఁగ్రక్కునో యాతీరుననే ప్రొయిలోనఁ బెట్టఁగానే కట్టియలు నీరు నడియుటంజేసి వంటచెఱకు లన్నపేరు సార్థకమాయె ననుట.) బోనంబు = అన్నము, ప్రజకున్ = జనమునకు, జక్కుల బోనంబులెయయ్యెన్ = కామేశ్వరునిఁగొల్చు జక్కులవాండ్ర యన్నమాయెను. (అనఁగా శూద్రులయొక్క పెండిలిమొదలగు నుత్సవములయందు జక్కులవాండ్రు అరివేణిపెట్టిన శూన్యభాండములను దలమీఁదమోచికొని బోనాలుబోనాలనిపల్కుట ప్రసిద్ధముగానఁ దత్తుల్యంబాయె నని భావము.) ప్రొయ్యి = పొయ్యి,వృష్టిన్ = వర్షము చేతను, పొగయమిన్ = రాఁజకయుండుటచేత నని క్రిందికి నన్వయము.

తా. వానకుఁ దడిసినవంటచెఱుకులు పొయిలోఁబెట్టఁగా వానిచే నగ్ని చల్లాఱెను. వండుట కారంభించుటతోడనే నీటిని గ్రక్కి నిప్పార్పుటవలన గానుగులోనుంచి త్రిప్పఁగా రసముచిప్పిలు చెఱుకులఁబోలి సార్థకనామభాజనములయ్యెను. వానచేతఁ బొయ్యిలోని నిప్పు రాఁజకపోవుటచేఁ బ్రజలభోజనములు మిథ్యాభోజనము లయ్యెను.

సీ. ఇల్లిల్లు దిరుగ నొక్కింత బ్బు శిఖ యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు రాఁజిన *రవులుకొల్పాసలె
గాని కల్గదు గూడు దానఁ గలిగ

* రవులుకొల్వాసాలఁ.

నేని కూ రగుట మం ది దైనఁ బెన్పొగ సుఖ
భుక్తి సేకూర దా భుక్తి యిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న
తే. మాజ్యపటముఖ్యలయ మెన్న రాలయాంగ
దారులయ మెన్న రంతికకారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బడక మఱుఁడు
వెడవెడనె యార్వ నొగిలి రగ్జడిని గృహులు. 127

టీ. ఇల్లిలు = ప్రతిగృహమునకును, తిరుగన్ = వెళ్లఁగా, శిఖి=అగ్ని, ఒక్కింత = కొంచెము, అబ్బున్ = దొరకును, అబ్బెనేని = దొరకినచో, ఇంటిలోఁబూరి = ఇంటిపైకసవును, ఇడి = దానిపై నునిచి, విసరకరాఁజదు = వీజనముసేయక యంటికొనదు. రాఁజినన్ = అంటికొనినను, రవులుకొల్పాసలెకాని = ప్రజ్వలింపఁజేయు నపేక్షయొకటి దక్క, దానన్ = ఆమంటవలన, కూడు = అన్నము, కల్గదు = దొరకదు (రవులు కొల్పాసాలఁగాని యను పాఠమునందు గృహములలోని వాసములను విఱిచి పెట్టక గాని రగులదని యర్థము.) కలిగెనేని = అన్నమైనప్పటికిని, కూరగుట = శాకమగుట, మందు = ఔషధము (అనఁగా దుర్లభమనుట.) ఐనన్ = శాకమైనను, పెన్పొగన్ = ప్రబలమైన ధూమముచేతను, సుఖభుక్తిచేకూరదు = సుఖకరమైనభోజనముదొరకదు. ఆభుక్తియిడినన్ = ఆభోజనము పెట్టినను, బహుజనాన్నము = ఇంటిలో నున్నవారల కెల్ల వండిన యన్నము, ప్రాగ్భోక్తలకే = తొలుబంతి భోజనముఁ జేయువారలకే, తీఱున్ = సరిపోవును (అకాలమునకువచ్చిన యతిథులఁ బరిహారింపరామింజేసి వారల కిడుటచేతఁ బక్వాన్నము సరిపోవు ననుట.) తీఱన్ = సరిపోఁగా, నారులకున్ = ఆఁడు వారలకు, పునఃప్రయత్నము = మరలవంటయొనర్చుట, ఒదవున్=కలుగును, అంతికకున్= ప్రొయ్యికి, ఆ...ము - ఆజ్య = నేతిచేతఁ దడుపఁబడిన, పటముఖ్య = కోకలు లోనైన వానియొక్క, లయము ఎన్నరు = నష్టము విచారింపరు, ఆ...ము - ఆలయ = ఇంటి యొక్క, అంగదారు=వాసాలయొక్క, లయము = నాశమును, ఎన్నరు = లెక్కింపరు (పొయ్యిమండుటకై నేతిలో బట్టలుదడిపివైచియు వాసాలు పెఱికివైచియును వాని నష్టమును లెక్కింపకుండిరనుట.) ఆ...ణి - ఆరజనిక = రాతిరివఱకును, పచన = పాకముసేయుటచేతను, నాంధః = అన్నములేకయుండిన, గృహిణి = ఇల్లాలు, రామిన్ = రాకపోవుటవలన, పడకన్ = శయ్యయందు, మఱుఁడు = పచ్చువిల్తుఁడు, వెడ

పెడనై=పెళపెళమని, అర్వక్ = పేగిరింపఁగా, అజ్జడిక్ = అముసురునందు, గృహులు = గృహస్థులు, నొగిలిరి = కృశించిరి. (అనఁగాఁ దొట్రుపడి రనుట.)

తా. ఆసమయంబునందు నెల్లదిక్కులయందు సతీపతులంద ఱాహారమజ్జనశయనాదులయందుఁ గ్లేశము నొందున ట్లెడతెగక జడివానలు గురియుచుండెను.

చ. పిడుగుల కల్కి లోఁ దొలిచి భీరులు కంచముఁ జల్లునీధితు
ల్గడపల వెళ్ళిరాఁ బొగలఁ గావిరిబ్రుంగెడు పుల్లగృహంబు లె
ల్లెడఁ గనుపట్టె [1]నూళ్ళ నిల యెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గిన సవిద్యుదురుస్తనయిత్నులో యనన్. 128

టీ. పిడుగులకుక్ = అశనిపాతములకు, అల్కి=వెఱచి, భీరులు = భయస్వభావముగల స్త్రీలు, 'భీరుర్బిమ్బాధరాఙ్గనా' యని నిఘంటువు. కంచము = భోజన పాత్రమును, లోఁదొలిచి = కడపలకులోపలనేకడిగి, చ...ల్-చల్లు = త్రిప్పికొనుటచేఁ జల్లఁగాఁబుట్టిన, దీధితుల్ = కాంతులు, కడపలవెళ్ళిరాక్ = దేహళులదాఁటిరాఁగా, పొగలక్=ధూమములచేతను, కా...లు-కావిరిబ్రుంగెడు = ధూమ్రవర్ణము గప్పినట్టి, (వర్షాకాలమందుఁ దడిసిన గృహములకుఁ బొగచుట్టికొనియుండుట ప్రసిద్ధము.) పుల్లగృహంబులు = పూరి యిండ్లు, ఎల్లెడక్ = ఏదెసఁజూచినను, ఊళ్ళక్ = గ్రామములయందు, ఇలయెల్లను = భూమియంతయును, ముంచి = వాననీళ్ళచేత నిండింపఁజేసి, రసాతలంబుపైక్ = పాతాళముమీఁద, విడియఁగక్ = ఆక్రమింపవలయునని, ద...లో అనక్ - ఉరు = గొప్పలయిన, దండుడిగ్గిన = భూమియందుసేనాసమేతమైవిడిసిన, సవిద్యుత్ = మెఱుములతోఁగూడిన, స్తనయిత్నులోయనక్ = మేఘములోయనునట్లు, కనుపట్టెక్ = చూపట్టెను

తా. పిడుగులు పడుచుంటచే భయపడి స్త్రీలు గుమ్మములోపలనుండియే కంచములు తొలిచి చల్లఁగాఁబుట్టినకాంతులు గుమ్మములుదాఁటి బయట ప్రకాశించుచుండ, గ్రామములందెల్లెడల ధూమ్రముతోనిండిన గడ్డియిండ్లు కానవచ్చుచుండెను. ఆయిండ్లు భూమినంతను జలమయమొనర్చి పాతాళముపై దండెత్తి విడిసిన మెఱుములతోఁ గూడిన మేఘములో యనునట్లుండెను. ఉత్ప్రేక్షాలంకారము.

చ. గొడుగుల గాలిఁ గూల్చి మఱి కోలలతోడన పాఱ నాన్పఁ జే
ద్పడ జడి మేఘుఁ డట్లక(గు)ట పాంథులపైఁ దన కెంతవైరమో
తడిసినమేన నింకి యది దారవియోగజవహ్నిఁ గొంత కొం
తుడిపె విఘాతరక్ష విష మొక్కొకమా టమృతంబు సేయుటన్.

1. నీళ్ల.

టీ. మేఘుఁడు=జలధరుఁడు, గొడుగులన్ = ఛత్రములను, గాలిన్ = వాయువు చేతను, కూల్చి = ఎగురఁగొట్టి, మఱి = పిమ్మట, కోలలతోడన = గొడుగుకఱ్ఱలుమాత్రము చేతఁబట్టి, పాఱన్ = పఱువిడుచుండఁగా, జడిన్ = వర్షముచేతను, చేడ్పడన్ = బాధ పడునట్లుగ, నాన్చెన్ = తడిపెను. అట్లు = ఆలాగుతడుపునట్లు, అకట = అయ్యో, తన కున్=మేఘునికి, పాంథులపైన్ = పధికులమీఁద, ఎంతవైరమో = ఏపాటివిరోధమో (నాన్చె నని క్రిందికన్వయము.) విధాతరక్ష=విరించియొక్క రక్షణము, విషము=గరళ మును, ఒకొక్కకమాటు = ఒకొక్కకపర్యాయము, అమృతంబుసేయుటన్ = సుధగాఁ జేయుటవలన, అది=ఆవర్షము, తడిసిన మేనన్ = నానినశరీరమందు, ఇంకి = ఇగిరి, దార వియోగజవహ్నిన్ = భార్యలవిరహమువల్లఁబుట్టినయగ్నిని, కొంతకొంతడిపెన్ = కొంత వడిఁ బోఁగొట్టెను. ఈపద్యమునందుఁ బూర్వార్ధంబున వ్యాఘాతాలంకారంబు నుత్త రార్ధంబున విచిత్రాలంకారము. శ్లో. 'స్యాద్వ్యాఘాతో తథాకారి తథాకారి క్రియేత చేత్, విచిత్రం యత్ప్రియత్న శ్చే ద్విపరీతఫలేప్సయా॥' అని వానికి లక్షణము.

తా. మేఘునకుఁ బాంథులపై నెంతవైరమోకాని వాయువుచే వారి గొడుగుల నెగురఁగొట్టి మిగిలిన గొడుగుకఱ్ఱలతోనే వారిని బరుగిడఁజేసి వర్షముచే తడిపి బాధించెను. కాని, యొకొక్కక్కప్పుడు బ్రహ్మదేవుని కృపవలన విషమమృతమగునట్లు వర్షజలము తడిసిన పాంథులశరీరములఁ జొచ్చి యందలి భార్యావియోగాగ్నిని గొంతవఱకైనను బోఁగొట్టుచుండెను.

తే. దవులఁ జల్లని తూఱ నంతకుమునుపటి
జల్లునీ రూని వచ్చునాజల్లు మొదలి
గాలి యెలగోలుచేఁ గొమ్మగదలి జల్లు
దలపడకమున్ను వంగుళ్లఁ దడిపెఁ దరులు. 130

టీ. తరులు = వృక్షములు, దవులన్ = దూరమునందు, జల్లని = వానయనుకొని, దూఱన్ = వానిక్రిందికిఁబోఁగా, అంతకమునుపటిజల్లు = దూరముననుండి వచ్చువానకంటె మున్నుగురిసియున్నవానయొక్క, నీరాని = ఉదకముగలవై, వచ్చునాజల్లు = దూరమున వచ్చుచున్నయావానయొక్క, మొదలి=ముందుగవచ్చిన, గాలియెలగోలుచేన్=ఎలగోలు గాలిచేతను, (దండునకు ముందుగాఁబోయి హెచ్చరికచేయుటకు నెలగోలని చెప్పుట ప్రసిద్ధము.) కొమ్మగదలి = శాఖ చలనమునొంది, జల్లుదలపడకమున్న = వచ్చుచున్న వర్షము రాకమునుపే, వంగుళ్ళన్ = నమ్రములైయున్నకొమ్మలు మొదలగువానియందు నిలిచియున్న జలముచేతను, తడిపెన్ = నాన్చెను, పథికుల వని పూర్వపద్యమున నుండు కర్మ నధ్యాహరింపవలయును.

తా. పాపము పధికులు దూరమునుండి వచ్చుచున్న వర్షపుజల్లునఁ దడవకుండుటకై వృక్షముల క్రిందకుఁ జేరఁగా, నంతకుఁ బూర్వపుజల్లువలన నాచెట్టుకొమ్మలపై నాకులలో నిలిచినవాననీటిచే యాక్రొత్తజల్లు వచ్చులోపలనే వారు తడిసిరి.

చ. రయమున వృష్టికై యొదిఁగి ♦ రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి ♦ నాతనిపై నృపతిం గజాదిని
ర్ణయముల *మొత్తులాడుదురు ♦ మబ్బొకయించుక విప్ప విచ్చుమొ
గ్గయి మఱి పాఱిపోదురు సమస్తదిశాగతులైనయధ్వగుల్. 131

టీ. స...ల్-సమస్తదిశ = సకలదిశనుండి, ఆగతులైన = వచ్చినట్టి, అధ్వగుల్ = తెరువరులు, రయమునన్ = వేగముచేత, వృష్టికై = వానకై, ఒదిఁగి = చోటుచాల కడంగికొని, రచ్చలపైన్ = ధర్మపుచావిళ్ళ యరుఁగులమీఁద, హయపతిమీఁదన్ = అశ్వపతిపైని, దంతిపతిన్ = గజపతిని, అతనిపైన్ = ఆగజపతిమీఁదను, నృపతిన్ = నరపతిని (అశ్వపతి ప్రబలుఁడు, వానికంటె గజపతి ప్రబలుఁడు, గజపతికంటె నరపతి ప్రబలుఁడని యనుట.) ఉగ్రతన్ = కోపముతోడను, విధియింతురు=నిర్ణయింతురు, గజాదినిర్ణయములన్-గజ=యేనుఁగులు, ఆది=మొదలగువానియొక్క, నిర్ణయములన్ = నిశ్చయించుటలయందు, మొత్తులాడుదురు = కలహపడుదురు (అనఁగా నశ్వపతి యొక్కుఁడని యొక్కండును, గజపతియ ప్రబలుండని మఱియొక్కండును, నందఱకంటె నరపతి యధికుండని యన్యుండును, వానికంటె వీనికి నశ్వము లెక్కువనియు, వీనికంటె వానికి గజంబులు తక్కువనియు, నీ మొదలగు గజాదిసంఖ్యానిర్ణయాభినివేశములచేతఁ గలహించుచుందు రనుట.) మబ్బు = మేఘము, ఒకయించుకవిప్పన్ = కొంచెము విడువఁగానే, మఱి=పిమ్మట, విచ్చుమొగ్గయి = ప్రోగువీడినవారలై, పాఱిపోదురు = ఎవ్వరిదారిని వారు వెళ్ళుదురు.

తా. పలుదెసలనుండి వచ్చిన బాటసారులు వర్షమురాఁగానే త్వరితముగా ధర్మసత్రముల యరుగులపైఁ జేరి యహంకారములతో సక్రోధులై యశ్వపతిమీఁద గజపతి గజపతిపై నృపతియనియు వానికంటె వీనికి వీనికంటె వానికి గజము లెక్కువ యశ్వములు తక్కువ యాదిగాఁగల వ్యర్థభాషణములఁ గలహించుచుందురు. ఇంతలో మేఘములు విడువఁగానే యొక్కరును నిల్వక తమతమ దారులఁబట్టి పోవుచుందురు.

క. తనరె బలిభుక్తతులు నిం
డిన గ్రామశ్రీల కఱితి ♦ నీలము లగుటం

* నిర్ణయములఁ గొట్టులాడుదురు.

గనియెఁ దృణగ్రాహిత నన
గొనుకసవులఁ జైత్యతరుల [1]గూండ్లిడుభ్రమణన్. 132

టీ. బలిభుక్తతులు = కాకులగుంపులు, 'ధ్వాంక్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసా అపి' యని యమరము. నిండిన గ్రామశ్రీలకున్ = సంపూర్ణగ్రామలక్ష్ములకు, అఱితి = కంఠమునందున్న, నీలములగుటన్ = ఇంద్రనీలమణులౌటచేత, తనరెన్ = ఒప్పెను, చైత్యతరులన్ = ఉద్యానపాదములందు, 'చైత్యమాయతనే బౌద్ధే బింబే చోద్యానపాదపే' యని విశ్వము. గూండ్లిడుభ్రమణన్-గూండ్లిడు=గూండ్లుపెట్టుటకొఱకు, భ్రమణన్=తిరుగుటచేతను, కొనుకసవులన్=పట్టికొనిపోవుతృణములచేతను, తృణగ్రాహితన్= తృణగ్రాహిత్వమును, కనియెన్ = పొందెను, అనన్ = అనునట్లు, తనరెను అని క్రింది కన్వయము

తా. నీలములు తృణగ్రాహులుగాన నావిధముగఁ గాకులగుంపులు గ్రామసమీపముననుండు నుద్యానమందలిచెట్లయందుఁ గూండ్లు గట్టికొనవలయునన్న యిచ్ఛచేతఁ గఱచికొనిపోవుచున్న కసవులను జూడఁగా దండిగైన గ్రామలక్ష్ములు కంఠమునందు ధరియించిన హారమందలి నీలమణులు తృణంబులని గ్రహించుచున్నవో యన్నట్లుగా నొప్పెను.

మ. వసతుల్వెల్వడి వానకై గుడిసె మోవన్ రాక తా నానియే
పసగా నిల్చినజమ్ముగూడఁ బొల మంబళ్లోయుచుం బట్టి పె
న్ముసురం దీఁగెడు కాఁపుగుబ్బెతల పెన్గుబ్బ ల్పునాస ల్వెలిం
బిసికిళ్లుం బిసికిళ్లు హాలికుల కొర్పించె న్నభస్యంబునన్. 133

టీ. వసతుల్ = గృహములు, వెల్వడి = బయలువెళ్లి, వానకై = వర్షబాధానివృత్తికొఱకు, గుడిసెమోవన్ = పొలములోఁ గాపునిమిత్తమై వేయఁబడ్డకుటీరముదగిలికొనఁగా, రాక = లోపలికిరాక, తాన్ = తాను, ఆనియే = తగిలికొనియే, పసగాన్ = ఒప్పిదముగా, ని...దన్-నిల్చిన = నిలువంబడియున్న, జమ్ముగూడన్ = జమ్ముచేగట్టఁబడ్డ గూడయందు, (జమ్ముగూడ కావలిగుడిసెలోనికి రాక గుడిసె దగిలి నిలిచియుండఁగా ననుట.) పొలము = కృషిసేయుభూమికి, అంబళ్లోయఁచున్ = నంబలిమోచికొనుచు, పట్టి = ధరియించి, పెన్ముసురందున్ = జడివానయందు, ఈ...ల్ - ఈఁగెడు = గుడిసెలోపలం దూఱునట్టి, కాఁపుగుబ్బెతల = కాఁపువాండ్రవనితలయొక్క, పెన్గుబ్బల్= గొప్పవైనకుచములును, పునాసల్ = పూర్వసస్యంబులైన సజ్జలుమొదలయినవియును (పునర్వసుకార్తెయందుఁ జల్లఁబడ్డధాన్యములు గనుకఁ బునాస లని వ్యవహారము.) వెలిన్ = వెలుపలను, హాలికులకున్ = కృషిఁజేయు శూద్రులకు, పిసికిళ్లున్ = కుచగ్రహణము

1. గూడెడు.

లును, పిసికిళ్లు = కంకులు నల్పుటబును, నభస్యంబునన్ = భాద్రపదమాసమునందు, అర్పించెన్ = ఒసంగెను.

తా. భాద్రపదమాసమునందు గృహముల వెలుపడి జమ్ముగూడయందుఁ బొలమున కంబలి, యన్నము మున్నగునవి మోచికొనిపోవుచు గొప్పవానయందు గుడిసెలు దూఱు కాఁపుస్త్రీల కుచములు, పునర్వసునక్షత్రమునఁ జల్లిన పునాసపస్యములు, కర్షకులకు గుచములు నలుపుటయుఁ గంకులునలుపుటయు నను పనులు కలుగఁజేసెను.

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టాఱుకో
గిరము ల్మేసి తమిం గొమల్పొలము వోకగ్రేపు ల్మెయుల్నాఁక మేఁ
కెరువుంగుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. 134

టీ. గురుగున్ = గురకటశాకమును, చెంచలి = తుమ్మికశాకము, తుమ్మి = ద్రోణ శాకము, లేఁదగిరిసాకున్ = కోమలమైన తంటెపుఁగూరయును, తింత్రిణీపల్లవోత్కరమున్ = చింతచిగురును, కూడన్ = వానితోఁగలిపి, నూనియలతోన్ = తైలముతో, పొరంటి = పొరఁటి, కట్టావి = చుట్టు నావిరి బాఱి మిగుల వేఁడియయిన, కుట్టాఱుగ+ ఓగిరముల్ = కుఱుచయారికకూళ్లు, (మూఁడు నెలలకుఁ బండునవి కుఱుచయారిక లనియు నయిదు నెలలకుఁ బండునవి పెద్దారికలనియుం జెప్పుదురు.) మేసి = తిని, తమిన్ = రాత్రి యందు, కొమల్ = కొడుకులు, (చెట్లకు శాఖలవంటివారు గనుక నిట్లు చెప్పవచ్చును.) పొలముపోన్ = చేలుగాయఁబోగా, రెడ్లు = పెత్తనముచేయుకాఁపులు, ప్రభుత్వైకాప్తిన్ = అధికారమొకటియబ్బుటచేత, అజ్జడిన్ = ఆ ముసురునందు, క్రేపుల్ = దూడలు, మెయుల్ = దేహములను, నాఁకన్ = లేహనమొనరింపఁగా, మేఁకెరువుంగుంపటి = మేఁకలయెరువున నెత్తియుంచిన కుంపట్లుగల, మంచమెక్కిరి = మంచముపైఁ బవ్వళించిరి (వానకుఁ దడియు నని దూడలను మంచపుఁగోళ్లకుఁగట్ట నవి దేహములను నాఁకుచుండఁగా శయనించి రనుట.)

తా. ఆవర్షాసమయమున గురకటము, తుమ్మికము, ద్రోణము, తంటెఁగూర, చింతచిగురు పొరఁటి నూనెలతో నావిరిత్రెబ్బుచున్న కుఱుచయారికలకూళ్లు మెక్కి, పుత్త్రులు పొలమున కేఁగఁ దాము దమమంచముల కోళ్లకుఁ గట్టిన దూడలు తమ శరీరములు నాకు చుండఁగా మంచముక్రింద మేఁకయెరువుపలన రాఁజు కుంపటు లుంచుకొని తమ గొప్పఁదన ముట్టిపడ రెడ్లు పవ్వళించిరి.

సీ. మణియప్పిఁ గెలిబఁఱిబ్రాహ్మణషడ్డసుధ వీను
సోలాడఁ బ్రొద్దెక్కఁ గ మేలుకాంచి

ఘుమఘుమవత్సుమగంధరాజాంగమ
ర్దనపైఁ జిరోష్ణమజ్జనము లాడి
మిసిమిదువ్వలువ బన్నసరంబు మొగలిజే
కులఁ దాల్చి జామెక్కి కొలువొసంగి
జాంగలామిషముతో శాల్యన్న మధికహ
య్యంగవీనంబుగా నారగించి
తే. మృగమదము మించుతములంపుఁ టిరులు మోవి
దలముగా సాగరుహసంతిఁ వెలుఁగ సౌధ
శిఖరవాతాయనాగతాంచిరరుగంశు
నతదృగవరోధములతోడ నగిరి నృపులు. 135

టీ. మణియష్టిక్ = మణిమయమైనదండమునందున్న, కే... ధ - కేలిబర్హిణ = పెంపుడు నెమళ్ళయొక్క, షడ్జ = షడ్జస్వరమనియెడు, సుధక్ = అమృతమునందు, వీనులు = చెవులు, ఓలాడఁక్ = జలకమాడఁగా, (అనఁగా వీనులకు విందై నిండఁగా నని భావము.) ప్రాద్దెక్కి = సూర్యోదయంబైన మఱి కొంతసేపటికి, మేలుకాంచి = నిద్రలేచి, ఘు...పైక్ - ఘుమఘుమవత్ = ఘుమ్మనివాసించుచున్న, సుమగంధరాజ = కుసుమలధమను ద్రవ్యముయొక్క, అంగమర్దనపైక్ = నలుఁగుబెట్టినమీఁదట చిరోష్ణ = మిక్కిలివేఁడిగలయుదకములచేత, మజ్జనములు = జలకములు, ఆడి = సలిపి, (చిరోష్ణమజ్జనములాడి యని యున్నందున నుష్ణశబ్దమునకు నుష్ణోదక మని యర్థముఁ జెప్పవలయును.) మిసిమిదువ్వలువక్ = సరిగ తళతళలాడుదుప్పటిని, బన్నసరంబుక్ = బన్నసరములను హారములను, మొగలిజేకులక్ = మొగిలిపువ్వులను, తాల్చి = ధరియించి, జామెక్కి = జాము ప్రొద్దెక్కినవెనుక, కొలువొసంగి = సభఁజేసి, జా...తోక్ - జాంగల = మరుభూమియందలి, ఆమిషముతోక్ = మాంసముతోడను, (అనఁగా మరు భూమియందు సంచరించెడు కౌఁజు, పూరేఁడు, ఉడుము, ఏఁదుఁబంది మొదలగు వాని మాంస మనుట.) 'పలలం క్రవ్యమామిష' మ్మని యమరము. శాల్యన్నము=రాజనపు సాదమును, అధికహయ్యంగవీనంబుగాక్ = అప్పుడు వెన్నగాఁచిననేయి యెక్కుడు గాఁ గలుగునట్లు 'తత్తుహయ్యంగవీనం యద్ధ్యో గోదోహోద్భవం ఘృత' మ్మని యమ రము. ఆరగించి = భోజనముఁజేసి, మృగమదముమించు = కస్తూరియెక్కువగాఁగల, తములంపుటిరులు = విడెముజే నల్లనైనకాంతులు, (కస్తూరి యధికమగుటవలన నల్లగా నుండుటచేత నిరు లనుట.) మోవిక్=పెదవిపై, దళముగాక్=దట్టముకాఁగా, సాగరుహ సంతివెలుఁగక్ = అగరుచెక్కతో నించినకుంపట్లు ప్రజ్వలించుచుండఁగా, సౌ...న్ -

సౌధ = ఉప్పరిగెలయొక్క, శిఖర = పైయంతస్తులయందున్న, వాతాయన=గవాక్షముల నుండి, ఆగత=వచ్చినట్టి, అచిరరుక్ = మెఱుపులయొక్క, అంశు=కాంతులచేతను, నత=వంపఁబడిన, దృక్=చూపులుగల, అవరోధములతోడన్ = అంతఃపురస్త్రీలతో, 'శుద్ధాంత శ్చావరోధశ్చ' యని యమరము. నృపులు = రాజులు, నగిరి = ఆనందించిరి.

వ. ఇట్లు సాంద్రసలిలధారాసారమాసరంబు లగు వార్షికవాసరంబులు ప్రశాంతం బగుటయుం దదనంతరంబ. 136

టీ. ఇట్లు=ఈవిధముగా, సా...లు-సాంద్ర=ఘనమైన, సలిల=ఉదకములయొక్క, ధార=ధారలయొక్క, ఆసార = సమ్యక్ప్రవర్షణములచేతను, మాసరంబులగు = వ్యాప్తము లైన, వార్షికవాసరంబులు=వానకాలపుదినములు, ప్రశాంతంబగుటయున్=శాంతింపఁగా, తదనంతరంబ = అటుపిమ్మట.

ఉ. రాజమరాళలబ్ధగిరిరంధ్రము శాలివనీశరావలీ
వైజననంబు యజ్వహుతవాజహుతాశయ భాస్వదిందిరాం
భోజసమాగమం బుదితబోధభుజంగశయోపచారనీ
రాజనఫుల్లహల్లకసరం బుదయించె శరద్దినం బిలన్. 137

టీ. రా...ము-రాజమరాళ = రాజహంసలచేత, లబ్ధ=పొందఁబడిన, గిరిరంధ్రము=క్రౌంచపర్వతముయొక్క బిలముగల్గినట్టియు, (అంచలు మానససరోవరమున వర్షాకాలము వెళ్లఁబుచ్చి శరదృతువు రాఁగాఁ గ్రౌంచపర్వతపుబిలములోఁజొచ్చి దశార్ణాదిదేశంబులకు వచ్చుట ప్రసిద్ధము.) శాలివనీ = రాజనపుఁజేలకు, శరావలీ = రెల్లుగంటలసమూహా మునకును, వైజననంబు = ఈనునెలయైనదియును, 'సూతిమాసో వైజననః' యని యమరము. యజ్వ = విధ్యుక్తప్రకారము జన్నముఁజేసినవారిచేత, హుత = హోమము చేయఁబడ్డ, వాజ = హవిస్సుగల, హుతాశనము = శ్రౌతాగ్నిగలదియును, (అపుడు సోమయాజులు నూతనాన్నభోజనముకొఱకు నాగ్రయణేష్ట్యాదికముఁజేసి రనుట, లేక, వాజివాజపేయము గలయదియైనఁ జెప్పవచ్చును. శరద్వాజపేయము ప్రసిద్ధము.) భా...బు - భాస్వత్ = వెలుంగుచున్న, ఇందిరా = లక్ష్మికి, అంభోజ = కమలములతోడి, సమాగమంబు = కలయికగలదియును, (శరదృతువునందుఁ గమలములకు వికసనముగల్గుటంజేసి వానియందే లక్ష్మి నివసించె ననుట.) ఉ...బు-ఉదిత = జనించిన, బోధ = మేల్కనుటగల, భుజగశయ = దామోదరునకు, ఉపచార = పూజనార్థమైన, నీరాజన = నివాళియయిన, ఫుల్ల=వికసించిన, హల్లక = చెంగల్వలుగల, సరంబు=కొలంకులు గలిగినట్టి, 'హల్లకం రక్తసంధ్యకమ్' మని యమరము. (అనఁగాఁ జాతుర్మాస్యము లప్పటికిఁ గడచినవి గాన భగవంతుండు నిద్రమేలుకొనఁగా శరల్లక్ష్మి నీరాజనమెత్తెనో యన్నట్లు

చెన్నొందియున్న యెఱ్ఱచెంగల్వలతో నొప్పియున్న కొలంకులు గలదనుట.) శరద్దినంబు = శరద్వాసరము, ఇలన్ = భూమియందు, ఉదయించెన్ = కనుపడెను, వికసించిన చెంగల్వలను నిద్రమేలుకొన్న యీశ్వరునకు శయనోపచారనీరాజనముగా వర్ణించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. పుడమిపై వర్షాకాలము కడచిన శరత్కాలము ప్రవేశించెను. ఆశరద్వాసరము రాజహంసలతోఁగూడిన క్రౌంచపర్వతబిలము గలది. అనఁగా శరత్కాలము రాఁగానే రాజహంసలు క్రౌంచనగబిలమునుండి దశార్ణాదిదేశములకుఁ బోఁ జొచ్చును. మఱియు నది శాలిధాన్యపుఁజేలు, రెల్లుగంటలసమూహమును కలకాలము; యజ్ఞము చేయువారు వాజపేయ మొనర్చి హోమములుచేయు శ్రౌతాగ్ని కలకాలము; లక్ష్మీదేవి కమలములఁ బ్రవేశింప నవి వికసించుకాలము; మఱియు భుజగశయనుఁడు నిద్ర మేల్కొనఁగా నాతనికి నీరాజనముగాఁ బూచి వికసించియున్న చెంగలువలుగల సరోవరములు గలకాలము.

క. కరము పొగ రెక్కె నంబర
మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణఁ బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలాసితామలరుచులన్. 133

టీ. కరము = మిక్కిలి, అంబరము = గగనము, ఉ...లు- ఉరు = అధికమైన, విద్యుత్ = మెఱుపులనియెడు, దీపకళికలు = దీపాంకురములు, ఉ...ణన్-ఉమిసిన = చిమ్మినటువంటి, (శ్లో. 'నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాదిగౌణవృత్తివ్యపాశ్రయమ్, అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్ష్యాంవిగాహతే' అని ఆచార్యదండి చెప్పియున్నారు గాన నుమిసిన - అనునది మొదలగువానికి గౌణార్థములె కాని ముఖ్యార్థములు చెప్పఁగూడదు.) ధూమ = పొగయొక్క, స్ఫురణన్ = స్ఫురించుటచేత, పొగచూరె ననఁగాన్ =ధూమితమాయెనో యన్నట్లు, హ...లన్-హరిమణి =ఇంద్రనీలములవలెను, జంబూఫల= నేరేడుపండ్లవలెను, అసిత = నల్లనై, అమల = స్వచ్ఛములైయున్న, రుచులన్ = కాంతులచేతను, పొగరెక్కెన్ = మదించెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. శరత్కాలప్రవేశముకాఁగానే యాకాశము మిక్కిలి నలుపెక్కెను. ఆయాకాశము విస్తారములగు విద్యుద్దీపముల యంకురములు చిమ్మిన దట్టపుఁ బొగచేత ధూమిత మయ్యెనో యన్నట్లు ఇంద్రనీలములవలెను నేరేడుపండ్లవలెను నల్లనైన స్వచ్ఛకాంతులచే నొప్పారెను.

ఆ. సాంధ్యరాగలహరి సామిరంజితములై
తిరిగె మింట నిదుర దెలిసినట్టి
యిందిరాధిపతికి నెత్తుకర్పూరనీ
రాజనంబు లన శరద్ఘనములు. 139

టీ. శరద్ఘనములు = శరత్కాలమేఘములు, సా...లు ఐ-సాంధ్య = సంధ్యా సంబంధియయిన, రాగ = రక్తిమయొక్క, లహరి = తరంగములచేతను, 'మహాత్సూల్లోల కల్లోలా లహర్యుత్కలికేసమే' అని యమరశేషము. సామి=సగము, రంజితములై=కెంపు వర్ణములుగలవిగాఁ జేయఁబడినవై, ని...కిన్ - నిదురదెలిసినట్టి = నిద్రమేల్కాంచిన, ఇందిరాధిపతికిన్=లక్ష్మీరమణునకు, ఎ...నన్-ఎత్తు = పట్టినటువంటి, కర్పూరనీరాజనంబు లనన్ = ఘనసారపునివాళులో యన్నట్లు, మింటన్ = అంతరిక్షమునందు, తిరిగెన్ = సంచరించెను, 'సామిత్వర్ధే జుగుప్సితే' యనియు, 'ఇందిరా లోకమాతా మా' యనియు నమరము. ఉత్ప్రేక్షాలంకారము.

తా. ఆశరత్కాలమేఘములు సంధ్యాకాలమునందలి యెఱుపురంగుచే సగమెఱుపు గలవై నిద్రమేల్కన్న విష్ణుమూర్తికిఁ బట్టుకర్పూర నీరాజనములో యన్నట్లాకసమున సంచరించెను.

చ. అళిగరుదంచలామలత దంతరబింబిత యయ్యెఁ బాకని
ర్దళితమహాఫలౌఘహరి తచ్ఛదకర్కరికావనాలి నాఁ
గలమవనభ్రమచ్ఛుకని కాయములోపల సాంధ్యర క్తిమం
బలఁతిగఁ దాల్చి మింటఁ గన నయ్యె విపాండుపయోదఖండముల్.

టీ. వి...ల్-విపాండు = మిగులఁ దెల్లనైన, పయోద = మబ్బులయొక్క, ఖండ ముల్=శకలములు, క...ము-కలమవన = పండినరాజనపుచేలమీఁద, భ్రమత్ = తిరుగు చున్న, శుకనికాయము =చిలుకలగుంపు, లోపలన్ = శరత్కాలమేఘములలోపల, సా ...బు - సాంధ్య = సంధ్యాకాలసంబంధియైన, రక్తిమంబు = ఎఱుపు, అలఁతిగన్ = కొంచెముగా, తాల్చి = ధరియించి, పా...లి-పాక = పండుటచేతను, నిర్దళిత = మిక్కిలి విరిసిన, మహాత్ = గొప్పవైన, ఫల = పండ్లయొక్క, ఓఘ=సమూహముగల్గియు, హరిత చ్ఛద = పచ్చనియాకులుఁగల, కర్కరికావనాలి = దోసతోఁటలగుంపు, అ...త - అళి = తుమ్మెదలయొక్క, గరుత్ = ఱెక్కలయొక్క, అంచల = కొనలవలెనున్న, అమల = నిర్మలమయిన, తత్ = ఆకాశముయొక్క, అంతర = నడుమను, బింబిత = ప్రతిఫలించె నోయో, అయ్యెనాన్=అన్నట్లు, కననయ్యెన్ = చూడనొప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. పండినపైరులమీఁద సంచరించుచున్న చిలుకలగుంపును దమయందు దించు కంతసంధ్యాకాలికర క్తిమను ధరియించిన తెల్లని మేఘఖండములును బరిపక్వములై పండి విరిసిన గోష్పపండ్లును బచ్చనయినయాకులునుం గల దోసతోఁటలు ద్విరేఫముల ఱెక్కలమొనలవలె నైగనిగ్యము గలయయ్యాకాశమునందుఁ బ్రతిఫలించెనో యన్న ట్లుండెను.

క. ఘుణగణవిహరణఁ జివికిన
మణిధనువునఁ దొరఁగు నుసి సమానములై ద
ర్పణనిభనభమునఁ బరిణత
శణకణహారిణములు *జలదశకలము లొలసెన్. 141

టీ. ఘు...ణన్-ఘుణ = నుసిపురుగులయొక్క, గణ = సమూహముయొక్క, విహరణన్ = సంచారముచేత, చి...నన్-చివికిన = వానలకుఁదడిసి శిథిలమయిన, మణి ధనువునన్ = ఇంద్రధనువునందుండి, తొ...లు ఐ-తొరఁగు = పడుచున్నటువంటి, నుసి సమానములై=పరాగసదృశములై, పరి...లు-పరిణత = పరిపక్వములయిన, శణ = జనుప నారయొక్క, కణ = లేశములవలెను, హారిణములు = తెల్లనైనటువంటి, జలదశకల ములు=తెల్లని మబ్బుతునుకలు, ద...నన్-దర్పణ=అద్దముతోడను, నిభ = సమానమయిన, నభమునన్ = ఆకాశమందు, ఒలసెన్ = సంచరించెను. శరత్కాలమేఘములను మణి ధనువుయొక్క పరాగము లని యుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. శరత్కాలమేఘశకలములు పండియెండిన జనుపనారలేశములవలె మిక్కిలి తెల్లనై, నుసిపురుగులు పట్టుటచేఁ జీకిపోయిన యింద్రధనుస్సునుండి రాలిపడు పొడి వలె, నద్దముతో సమానముగ స్వచ్ఛమైన యాకాశమున, సంచరించెను.

క. రవిశశిముకురములు శర
ద్యువతి మెఱుఁగువెట్టుభూతి యో యనఁ బర్వెన్
బవనాహతసప్తచ్ఛద
నివహపరాగంబు దివికి నిర్మలకాంతిన్. 142

టీ. ర...లు-రవిశశి = చంద్రసూర్యు లనియెడు, ముకురములు = అద్దములను, శరద్యువతి = శరదృతువనుజవరాలు, మెఱుఁగువెట్టు = కాంతిఁగలుగఁజేయునట్టి, భూతి యో యనన్ = భస్మమో యనఁగా, ప...బు-పవన=వాయువుచేతను, ఆహత = ఎగురఁ గొట్టఁబడిన, సప్తచ్ఛద = ఏడాకుల యరంట్లయొక్క, నివహ = సమూహముయొక్క, పరాగంబు = పుప్పొడి, దివికిన్ = అంతరిక్షమునకు, ని...తిన్-నిర్మల = స్వచ్ఛమయిన, కాంతిన్=తేజస్సుచేతను, పర్వెన్ = వ్యాపించెను. ఉత్ప్రేక్షాలంకారము.

* పాండుజలదము లొలసెన్.

తా. లోకమునం దద్దమునకు వచ్చిన మాలిన్యమును భస్మముచేతఁ దుడుచుట ప్రసిద్ధము గాన నటు వర్షాకాలమందుఁ జంద్రసూర్యు లనునద్దములకు నైర్మల్యము దక్కువ పడఁగా వానికి మెఱుఁగెక్కించి చక్కఁబఱచుటకై శరద్వనిత యుంచిన విభూతియో యనున ట్లాసమయమందు సప్తచ్ఛదపరాగములు గాలిచేత నెగరఁగొట్టం బడి యంతరిక్షమున వ్యాపించెను.

స్రగ్ధర. సంభూతజ్ఞప్తివాతాశనశయనము విశ్వంభరుం డూఁదిలేవన్
గంభీరప్రక్రియాన్మగ్నత డిగు జగతిం గ్రందుగాఁదోఁచు వర్షా
దంభోళిస్థూలరంధ్రోద్గతసితపృథుపాతాళజాతాంబుధారా
స్తంభంబుల్పోలె నెన్నుల్ ధవళరుచిశర స్తంబపఙ్క్తిం జనించెన్.

టీ. స...ప్తిన్-సంభూత = జనించినట్టి, జ్ఞప్తిన్ = మెలఁకువచేతను, వాతాశన శయనమున్ = శేషపర్యంకమును, విశ్వంభరుండు = శ్రీమహావిష్ణువు, 'విశ్వంభరః కైటభజి ద్విధుశ్శ్రీవత్సలాంఛనః' యని యమరము. ఊఁదిలేవన్ = ఊనుకొనిలేవఁగా, గం... తన్-గంభీరప్రక్రియా=నిమ్న ప్రకారమగునట్లు, మగ్నతన్=మునుంగుటవల్లను, డిగు = క్రిందికినడఁగినట్టి, జగతిన్=భూమియందు, క్రందుగాన్=దట్టముగా, తో...ల్-తోఁచు=కానవచ్చుచున్న, వర్షా=వానకాలమందలి, దంభోళి=పిడుగులయొక్క, స్థూలరంధ్ర = గొప్పబెజ్జములవలన, ఉద్గత = బయలుదేఱిన, సిత = తెల్లనైన, పృథు = గొప్పలైన, పాతాళజాత = పాతాళలోకమందుఁబుట్టిన, అంబుధారాస్తంభంబుల్ పోలెన్ = స్తంభములవంటి యుదకధారలవలె, శరస్తంబపఙ్క్తిన్ = ఱెల్లుకాఁడలవరుసయందు, ఎన్నుల్ = కంకులు, ధవళరుచిన్ = తెల్లనికాంతితో, జనించెన్ = పుట్టెను. ఇందు ఱెల్లు యొక్క యెన్నులను బిడుగులరంధ్రములనుండి బయలువెళ్ళినట్టి పాతాళజలధారా స్తంభములుగా నుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. ఆశరదృతువునం దేదిక్కునఁ జూచినను ఱెల్లుపొదలు ఎన్నులు దీసి తెల్లగాఁ బ్రకాశించుచుండెను. అది యెట్లుండె నన శ్రీమహావిష్ణువు శేషపర్యంకమునుండి నిద్రమేల్కొని యూనుకొనిలేవఁగాఁ గ్రిందికడకు భూమియందుఁ బడినపిడుగులు చేసిన రంధ్రములండి పాతాళమునఁ బడు స్తంబములవంటి జలధారలవలె ఱెల్లుకాఁడల కెన్నులు తెల్లనై పుట్టెను.

తే. నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర దెలిసి
యడుగుఁ దనమీఁద మోప నోర్చువనిరమణి
కంటకితగాత్రి యయ్యె నాఁగా విపాక
పరుషకంటకశాలిమంజరులు వొలిచె.

టీ. నీరజేక్షణుఁడు = విష్ణుదేవుఁడు, అవ్వేళన్ = ఆ శరత్సమయమునందు, నిద్ర దెలిసి = నిదుర మేల్కాని, అడుగున్ = పాదమును, తనమీఁదన్ = భూమిపైని, మోపనో = ఉంచఁగానో, అవనిరమణి = భూదేవి, కంటకితగాత్రియయ్యెనాఁగాన్ = పులకితాంగియయ్యెనన్నట్లు, విపాక = పండుటచేత, ప...లు - పరుష = వాఁడియై యున్న, కంటక = ముండ్లుగల, శాలిమంజరులు = సన్నవరియెన్నులు, పొలిచెన్ = ఒప్పెను. హేతూత్ప్రేక్షాలంకారము.

తా. పండి ముదురైనందున వాఁడిమి గలిగియున్న ముండ్లతోనుండు సన్నవరి యెన్నులం జూడఁగా నా శరదృతువునందుఁ గమలాక్షుండు నిద్ర లేచి యడుగుఁ దనమీఁద నుంచుటచేత నాభూదేవి పులకితగాత్రి యాయె ననున ట్లుండెను.

మ. స్ఫుటభూయోభ్యతిశంక వార్ధి నినరశ్ముల్మిన్ను చేర్పం దటి
చ్ఛట లౌర్వంబుగఁ గారుకొంచు ఘనమై క్ష్మాఁ దీర వర్షింప న
చ్ఛోటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు గాకున్న నొ
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే.

టీ. స్ఫు...కన్ - స్ఫుట = వ్యక్తమైన, భూయోభ్యతిశంకన్ = అగస్త్యుండు మరలఁ బానముఁ జేయు ననుభయముచేత, 'శంకావితర్కభయయోః' అని యమరము. ఇనరశ్ముల్ = సూర్యకిరణములు, వార్ధిన్ = సముద్రమును, మిన్ను చేర్పన్ = అంతరిక్షమును బొందింపఁగా, (సూర్యకిరణములు సముద్రోదకమును మేఘములందుఁ జేర్పఁగా ననుట.) తటిచ్ఛటలు = విద్యుత్సమూహములు, ఔర్వంబుగన్ = బడబాగ్నిగా, కారుకొంచున్ = నల్లనిదై, ఘనమై = మేఘమై, క్ష్మాన్ = భూమిని, తీరవర్షింపన్ = ఉదకమంతయు వానలుగురియఁగా, అచ్ఛోటనున్ = ఆ యాకాశమునందును, గలశీసూనుండు = అగస్త్యుఁడు, తోఁచి = కనుపించి, గ్రసింపఁబోలున్ = సముద్రోదకమును బానము జేసెఁ గాఁబోలు, కాకున్నన్ = అట్లుగాకుండెనేని, ఒక్కటన్ = ఏకరీతిగా, తా...ల్ - తారా = చుక్కలును, గ్రహ = అంగారకాదిగ్రహములును, భాస్కర = సూర్యుఁడును, ఇందు = చంద్రుఁడును, (అనియెడు) మణి=రత్నములును, శుక్తుల్=ముత్యపుఁజిప్పలును, వ్యక్తమై = స్ఫుటమై, తోఁచునే = కానవచ్చునా, కానరా వనుట.

తా. శరత్సమయమున నంతరిక్షమందు మేఘములు లేక, నక్షత్ర సూర్యేందులు స్ఫుటముగఁ బ్రకాశించుటను నగస్త్యోదయమగుటను జూడఁగాఁ బూర్వ మగస్త్యునికి వెఱచి మేఘరూపమును వహించి యాకాశమును జెందియున్న సముద్రుని నగస్త్యుఁడు మరలఁ బానము జేసియుండును. లేకపోయెనేని యందుండు తారాగ్రహము లనియెడు

రత్నములును సూర్యచంద్రు లనుముత్యపుఁజిప్పలును గానవచ్చుటకుఁ గారణము లే దనునట్లు తోఁచుచుండెను.

చ. అలమలయాద్రి కుంభభవుఁ డన్కతకంబు శరత్తుకుండమం
డలిఁ బ్రతిబింబకైతవమున న్దమ కిచ్చిన వారిదేవత
ల్గొలఁకులకేలఁ దాప నిడి తోమఁ గలం కడఁగెం దదీయత
త్ఫలతకు హ్రస్వమౌటె కరి తారక లంబువుఁ దేర్చునే యనన్.

టీ. అ...న్ - అలము=ప్రసిద్ధమైన, మలయాద్రి = పటీరపర్వతమునందున్నట్టి, కుంభసంభవుఁడు = అగస్త్యుఁడు, 'అగస్త్యః కుంభసంభవః' యని యమరము. అన్కతకంబున్=అనుచిల్లగింజను, 'చక్షుష్యః కతకః కాంతికృ' త్తనిరత్నమాల. శ...న్-శరత్తు=శరదృతువు, కుండమండలిన్ = సరస్సమూహములందు, ప్రతిబింబకైతవమున్ = ప్రతిఫలనవ్యాజముచేతను, తమకున్ = ఆవారిదేవతలకు, ఇచ్చినన్ = ఇయ్యఁగా, వారిదేవతల్=జలదేవతలు, గొలఁకులకేలన్ = తరంగములను హస్తములచేతను, తాఁపనిడి = మెట్టుతాతిమీఁదఁబెట్టి, తోమన్ = అరగఁదీయఁగా, కలంకడంగెన్ = కాలుష్యము దీఱెను, తదీయ = ఆ యగస్త్యుని సంబంధియైన, తత్ఫలతకున్ = ఆ చిల్లగింజౌటకు, హ్రస్వమౌటె = చిన్నదౌటయే, కరి = సాక్షి, (చిల్లగింజ గనుక నే రాచినందున హ్రస్వమాయె ననుట.) (అట్లుగాకుండెనేని) తారకలు = నక్షత్రములు, అంబువున్ = ఉదకమును, తేర్చునే = తేఁటగాఁజేయునా, చేయ వనుట. అనన్ = అనునట్లు కలంకడఁగె నని క్రియాదికన్వయము, రూపకానుప్రాణితాపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్షాలంకారము.

తా. మలయపర్వతముపై నున్న యగస్త్యుఁ డను నిండుపగింజను శరదృతువు సరస్సులలోఁ బ్రతిబింబించు వ్యాజమున వారిదేవతల కీయఁగా నాజలదేవతలు కెరటములనుచేతులతో సోపానశిలలపైఁ బెట్టి యాచిల్లగింజ నరగఁదీయఁగా జలములు కలఁకలు దేఱి స్వచ్ఛములయ్యెను. అగస్త్యుఁడు చిల్లగింజయాయె ననుట కాచిల్లగింజ నరగఁదీయఁగా చిన్నదౌటయే సాక్ష్యము. అట్లు కానినాఁడు నక్షత్రములు నీటికాలుష్యమును బాపలేవు గదా యనునట్లు జలములు స్వచ్ఛము లయ్యెను.

చ. ఇలకు సుధాసమత్వము వహింప శరజ్జలజాక్షి కుండమం
డలి సలిలంబు కల్మష మడంగ మొగు ల్వీరియెండఁగాయుచోఁ
జిలుకు నిశాకరజగపటలి చెన్ను వహించెఁ దరంగపఙ్క్తిపై
దళదరవిందకైరవక దంబకడారపరాగపూగముల్.

టీ. తరంగపఙ్క్తిపైన్ = కరుళ్లబంతిమీఁద, ద...త్ - దళత్ = వికసించు, చున్న, అరవింద = పద్మములయొక్కయు, కైరవ = కలువలయొక్క, కదంబ = సమూహములయొక్క, కడార=పచ్చనైనటువంటి, 'కడారః కపిలః పింగః' యని యమరము. పూగముల్=సమూహములు, 'పూగో వితానం ప్రకరః' యని యమరము. ఇలకున్ = భూమికి, సుధాసమత్వము = అమృతసామ్యము, వహింపన్ = పొందునట్లు, శరజ్జలజాక్షి = శరత్కాలమనుస్త్రీ, కుండమండలిన్ = కొలంకులసమూహమందు, 'కుండంపిఠరేస్త్రీయాం ధారవిశేషేచవహ్నిగర్తేచ, కుండో జారాజ్జాతస్సుభర్తృకాయాం కమండలౌ కుండీ' యని రత్నమాల. సలిలంబు = ఉదకము, కల్మషమడంగన్ = కలుషముపోవుటకు, మొగుల్ = మబ్బులు, విరి = విరిసిన, ఎండగాయుచోన్ = ఎండకాయఁగా, చి...లి చిలుకు = చల్లఁబడినటువంటి, నిశారజఃపటలి = పసుపుపొడిరాశియొక్క, చెన్ను = సౌందర్యమును, వహించెన్ = పొందెను.

తా. ఆసమయమున వికసించిన తామరలయొక్కయుఁ గలువలయొక్కయుఁ బరాగములు తరంగముల పైఁబడి శరదృతు వనుస్త్రీ యుదకములోని కల్మష మడఁగించి రుచిఁబుట్టించుటకొఱకుఁ జల్లిన పసుపుపొడివలె నుండెను.

ఉ. హెచ్చినమైత్త్రిఁ బద్మినుల కెల్ల ఘనాత్యయకారకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయుటకునై యలక్రౌంచనగంబుపేరిక
మ్మచ్చున నీడ్చుశర్వగిరి యందలి వెండిశలాకపిండు నా
వచ్చి మరాళిమాలికలు వ్రాలెఁ గొలంకులఁ జక్రఝుంకృతిన్. 148

టీ. హెచ్చినమైత్త్రిన్=అతిశయించినస్నేహముచేత, పద్మినులకెల్లన్ = తామరకొలంకు లను పద్మినీస్త్రీల కంతయును, ఘనాత్యయ = మేఘావసానమనెడు (అనఁగా శరదృతు వనుట.) కారకుండు = అగసాలెవాఁడు, సొమ్ము = భూషణము, అచ్చుపడంగన్ = సమముగనుండులాగున, చేయుటకునై = తీఁగెగా నొనరించుటకై, అల = ప్రసిద్ధమైన, క్రౌ...నన్ - క్రౌంచనగంబుపేరి = క్రౌంచపర్వతమనియెడు పేరుగల, కమ్మచ్చునన్ = వెండిబంగారు తీఁగెతీయునట్టి యుక్కుకమ్మచ్చుయొక్క బెజ్జమందు, ఈః...నాన్ - ఈడ్చు = లాగెడు, శర్వగిరియందలి = కైలాసపర్వతమునందున్న, వెండిశలాకపిండునాన్ = రజతపుఁదీఁగలసమూహమో యనునట్లు మరాళీమాలికలు = హంసలబంతులు, వచ్చి = ఏతెంచి, కొలంకులన్ = సరస్సులయందు, చ...తిన్ - చక్ర = సుడిగాలియొక్క, ఝుంకృతిన్ = ఝుంకారముతోడను, వ్రాలెన్ = దిగెను.

తా. మిక్కిలి యనురాగముతోఁ దామరకొలఁకులను పద్మినీస్త్రీలకు శరదృతు వను స్వర్ణకారుఁడు అందమగుభూషణ మొనర్చుటకై క్రౌంచాచల మను కమ్మచ్చునందు

లాగు కైలాసపర్వతమందున్న వెండితీఁగల సమూహమో, యనునట్లు కడువేగముగా హంసలసమూహము వచ్చి శరదృతువునందుఁ గొలఁకులఁ జేరెను.

తే. కుంభజుఁడు వార్ధితోఁ గ్రోలి కుక్షి నున్న
మించుముక్తాచ్ఛటలె కుమ్మరించె ననఁగ
జలజదళములఁ దేటలుఁ జవులు నయిన
యంబుకణములు వొలిచెఁ బద్మాకరముల. = 149

టీ. కుంభజుఁడు = అగస్త్యుఁడు, వార్ధితోఁ గ్రోలి = సముద్రముతోఁగూడఁ బానముచేసి, కుక్షి నున్న = ఉదరములోనున్న, మించు = అతిశయించిన, ముక్తాచ్ఛటలె = ముక్తికసమూహములే, కుమ్మరించె ననఁగన్ = మగుడదిగువఁబోసెనో యనఁగ, జలజదళములన్ = తామరాకులయందు, తేటలు = స్వచ్ఛమైనటువంటియు, చవులునైన = రుచిగలవియునైన, (ముత్యాలలో నొక్క లెక్కకు చవి యనిపేరుగనుక నవి యనియు నర్థము.) అంబుకణములు = ఉదకబిందువులు, పద్మాకరములన్ - పద్మ=తామరలకు, ఆకరములన్ = గనులైన కొలఁకులయందు, వొలిచెన్ = ఒప్పెను.

తా. తామరచెఱువులయందలి పద్మపత్రములమీఁదఁ జేరిన స్వచ్ఛములు రుచికరములునైన జలబిందువులు, అగస్త్యుఁడు సముద్ర మాపోశనించినపుడు కడుపులోనికిఁ జొచ్చిన ముత్యముల సమూహమును మరల వెలికి దిగువఁబోసెనో యన్నట్లొప్పారెను.

చ. కెరలు స్రవంతి పైయిసుక క్రిందగువేళ నినుండు మేఘపుం
దెర సనఁ జల్లఁగా విరహదీప్తకరప్లుత మాసజీరకో
త్కరగుడ మట్లు పద్మినులఁ గ్రమ్ముసకేసరమాధ్వి పొల్చెఁ బైఁ
గర మరుదారెఁ దేంట్లు [1]సెకఁ గందినముత్తెపుసేసలో యనన్. 150

టీ. కె...క - కెరలు=ప్రవహించుచున్న, స్రవంతి = నదులయందు, 'స్రవంతీ నిమ్నగాపగా' యని యమరము. పైయిసుక=ప్రవాహవేగముచేత నీళ్లతోఁ గలిసి పైగాఁ బ్రవహించుచున్నయిసుక, క్రిందగువేళన్ = అడుగుఁబట్టినప్పుడు, (వేగముతగ్గినప్పుడిసుక క్రిందఁబడుట ప్రసిద్ధము. స్రవంతి యనఁగా నిసుకపోసియుండు ఘటికాయంత్రమునకును బేరుగనుక దానిలోఁ బైయిసుక క్రిందికి రాఁగా ననియు నర్థము.) ఇనుండు = సూర్యుఁ డనునాయకుఁడు, 'ఇనస్సూర్యేప్రభౌ' యని యమరము. మేఘపుందెర సనన్=మేఘమనుతెర దీయఁగా, చల్లఁగాన్=చిలుకరింపఁగా (ఉంచఁగా ననుట.) వి...ము అట్లు - విరహ=వియోగవేదనచేత, దీప్త = వెచ్చనైన, కర=హస్తమందు, ప్లుత=

1. సెగఁ గట్టిన..

తేలుచున్న, సజీరకోత్కర = జీలకఱ్ఱతోఁగూడిన, గుడమట్లు = బెల్లమువలె, పద్మినులన్ = తామరపువ్వులనియెడుపద్మినీజాతిస్త్రీలయందు, క్ర...ధ్వి - క్రమ్ము = వ్యాపించినట్టి, సకేసరమాధ్వి = కేసరములతోఁగూడినమకరందము, పొల్చెన్ = ఒప్పెను, 'పద్మినీకరిణీశ్రీ స్త్రీ సరోజనలినీషుచ' యని రత్నమాల. (విరహతాపతప్తమైన హస్తమందు గుడ ముంచఁగాఁ గరఁగి పాకమైనట్లు మకరంద ముండె ననుట.) తేంట్లు = తుమ్మెదలు, సెకన్ = తాపముచేతను, కం...లో అనన్ - కందిన=కమలినటువంటి, ముత్తెపుసేసలో అనన్ = ముత్యాలతలంబ్రాలోయనునట్లు, పైన్ = ఉపరిభాగమందు, కరము= మిక్కిలి, అరుదారెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. తామరపువ్వులయందుఁ గేసరములతోఁ గూడినమకరందము నదులవేగము తగ్గినపుడు మేఘపుఁదెర తొలఁగఁగా సూర్యుఁడు పైయిసుక క్రిందికిఁ జల్లఁగా నదిపద్మినులహస్తములఁబడి విరహవేదనచే దీప్తమగుహస్తమునఁ బెట్టిన జీలకఱ్ఱతోఁగూడిన బెల్లమువలె నొప్పెను. విరహవేదనచేఁ గమలిన ముత్యాలసేసలవలె వానిపైఁ దుమ్మెదలొప్పారెను.

చ. జలజదళస్థతోయములు సందుల క్రిందుగఁ దోఁచుమింటినీ
డలుఁ గనుపట్టె నత్తఱిఁ దటాకములన్ లఘిమంబు రెంటిలోఁ
దెలియఁ దరంగఁ బైకెగయు తేఁటులచేరులఁ దూన్పఁ దోయము
ల్పలుచనఁ దేలి మిన్నడుగువట్టెఁ గడుం దళమాటనో యనన్. 151

టీ. జ...లు - జలజదళ = పద్మపత్త్రములయందు, స్థ = ఉన్నటువంటి, తోయములు = ఉదకములును, సం...గన్ - సందుల = ఆ పద్మపత్త్రములసందులయొక్క, క్రిందుగన్ = అధోభాగమునందు, తో...లు - తోఁచు = కనుపించుచున్న, మింటినీడలున్ = ఆకాశముయొక్క ప్రతిఫలనములును, అత్తఱిన్=ఆ శరత్సమయమునందు, లఘిమంబు = చులకఁదనము, రెంటిలోన్ = ఆకాశజలములలోను, తెలియన్ = ఎఱుంగుటకొఱకు, తరంగఁబైకెగయు = కరుళ్లచేతఁ బైకెగయుచున్న, తేఁటుల = తుమ్మెదలనియెడు, చేరులన్ = దారములచేతను, తూన్పన్ = తామరాకు లనియెడు తూనికెసిబ్బులయందుఁ దూఁపఁగా, తోయముల్ = ఉదకములు, పలుచనన్ = తేలికయగుటవల్ల తేలి = పైకిఁదేలి, మిన్ను = ఆకాశము, కడున్ = మిక్కిలియును, దళమాటనో = మందమాటచేతనో, అడుగువట్టెన్ = క్రిందికిఁ బోయెను. అనన్ = అనఁగా, తటాకములన్ = సరస్సులయందు, కనుపట్టెన్ = చూపట్టెను.

తా. తామరాకులయందు నీరును, వానిసందులయందుఁ దటాకములోనియుదకమునఁ బ్రతిఫలించిన యాకాశముయొక్క నీడలను జూచి, యాకాశము తేలి

కయో, లేక యుదకములు తేలికయో, చూత మను సంకల్పముచేతఁ దేంట్లను దారములు గలతటాక మనుతక్కెడయందుఁ దూనికవేయఁగా నుదకములు పలుచన గనుక మీఁదికి వచ్చెను; మిన్ను దళముగనుక నడుగుఁబట్టెను.

మ. ఇలకు న్వ్రేఁగుగఁ బండుతీరవన పుండ్రేక్షుచ్ఛట ల్దీపు ల
గ్గలమై వ్రాల నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రిప్పు రాట్నంపుగుం
డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పాఱన్ విచ్చు పంకేరుహం
బుల నాడెం దొలుసంజఁ దేఁటివలయంబుల్తారఘుంకారముల్. 152

టీ. ఇలకున్ = భూమికి, వ్రేఁగుగన్ = బరువగునట్లు, పం...ల్ - పండు = పరిపక్వమైన, తీర = దరియందలి, వన = ఉద్యానవనమందున్న, పుండ్రేక్షుచ్ఛటల్ = నామాలచెఱకుగుంపులు, 'రసాలఇక్షు స్తద్భేదాః పుండ్రకాంతారకాదయః' యని యమరము. తీపులు = మాధుర్యములు, అగ్గలమై = అతిశయమై (రసము విస్తరించి యనుట), వ్రాలన్ = మీఁదవంగఁగా, ఉరుస్వనంబులు = అధికమైనధ్వనులు, ఎసఁగంగాన్ = ఒప్పఁగా, త్రిప్పు = త్రిప్పఁబడుచున్న, రాట్నంపుగుండ్రలునాన్ = చెఱకుగానుగయొక్క కోల లోయఁగా, తేనె = మకరందము, కొలంకులన్ = సరస్సులయందు, పొరలిపాఱన్ = లుంఠితమై ప్రవహింపఁగా, విచ్చు = వికసించుచున్న, పంకేరుహంబులన్ = పద్మములయందు, తారఘుంకారముల్ = గంభీరములయినధ్వనివిశేషములు గల, తేఁటి... బుల్ - తేఁటి = తుమ్మెదలయొక్క, వలయంబుల్ = మండలాకారభ్రమణంబులు, తొలుసంజన్ = ప్రాతస్సంధ్యయందు, ఆడెన్ = తిరిగెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. తీరమందలి చెఱకులు వంగి తటాకములలో నున్న కమలములమీఁదఁ బడియుండ నా కమలంబులయందలి మకరందములు సరస్సులలోఁ బొరలి పాఱుచుండఁగా నందు మండలాకారభ్రమణములు సేయుచున్నతుమ్మెదలయొక్క ధ్వనులు చెఱకుగానుగకోలలధ్వనులవలె నుండెను.

సీ. హాలనమత్కదళికందాభతిర్యఙ్నతా
స్యమునఁ గొమ్మొకటి మోసనఁగఁ గ్రుంగఁ
గటముల డిగి చిబుకమున రేఁ జేరిన
మద మంజనగ్రంథిమాడ్కి మెఱయ
ఛిద్రోత్థహాతవలత్కద్రూజ మనఁ జుట్టు
తో నిప్పుతో దరిఁ జొ దొండ మాడ
తెల్లువెల్లలు నీటఁ జొ ద్రెళ్ళి ఫేనము వండు
నయి పునగప్రావృడాశయము నొసఁగ

తే. ఘనరజోవృష్టికై మీఁదికన్ను మొగుడఁ
గటిదెసలు నిక్క బరితోలు కదలఁ గీలు
మదము తిక్తత నదులకీఁ దదనుకృద్వృ
షాలితోఁ దేంట్లు పఱవఁ గోరాడెఁ గరులు. 153

టీ. హ...నన్ - హాల = నాఁగేటిదుక్కిచేత, నమత్ = వంగుచున్నటువంటి, కదళికంధాభ = అనఁటిదుంపసామ్యముగల, తిర్యక్ = అడ్డముగా, నత = వంగినటువంటి, ఆస్యమునన్=ముఖమందు, కొమ్మొకటి=ఒకవిషాణము (దంత మనుట), మోసు+అనఁగన్ = ఆకువిప్పనియరఁటిమొలక యనునట్లు, త్రుంగన్ = వంగఁగా, కటములన్ = గండస్థలము నుండి, డిగి = జాఱి, చిబుకమునన్ = గడ్డమందు, రేన్ = రాత్రియందు, పే...ము-పేరిన = ఘనీభవించిన, మదము = దానము, అంజనగ్రంథిమాడ్కిన్ = కాటుకడబ్బి వలెను, మెఱయన్ = ఒప్పఁగా, ఛి...ము - ఛిద్రోత్థ = రంధ్రమువలన ఱయలువెడలి నట్టియు, హత = కొట్టఁబడినదిగనుక, వలత్ = చుట్టుకొనుచున్న, కద్రూజముఅనన్ = సర్పమో యనఁగా, చుట్టుతోన్ = పెనఁచికొనుటతోడ, విప్పుతోన్ = విడఁదీయుట తోడను, దరిన్ = నదీకూలమందు, తొండము=శుండాదండము, ఆడన్ = చలించుచుం డఁగా, జెల్లు = శరములు, పెల్లలు = మంటిగడ్డలును, నీటన్ = ఉదకమునందు, త్రెళ్లి = పడి, ఫేనము = నురువును, వండును=ప్రవాహముతోవచ్చియున్న బురదయును, ఆయి = అయినదై, పు...మున్-పునః = మరలను, ప్రావృడాశయమున్ =వర్షాకాల మనుబుద్ధిని, ఒసఁగన్ = పుట్టింపఁగా, (అనఁగాఁ దెల్లనిజెల్లు నురుఁగుగా మంటిపెల్లలు వండునుగానున్నందున వర్షాకాల మను బుద్ధిని బుట్టించె ననుట.) ఘనరజోవృష్టికై-ఘన= అధికమైన, రజః = పరాగముయొక్క, వృష్టికై = వర్షమువలన (చల్లుటవలన ననుట.), మీఁదికన్ను = పైనేత్రము, మొగుడన్ = మూయఁబడఁగా, కటిదెసలు = మొల ప్రక్కలు (పిఱుఁదు ప్రక్క లనియుం జెప్పఁదగును), నిక్కన్ = పైకెగయఁగా, బరితోలు = పార్శ్వమందున్న చర్మము, కదలన్ = చలింపఁగా, కీలు = స్రవించుచున్న, మదము=దానోదకము, తిక్తతన్ = సౌగంధ్యమును, నదులకున్ = సరిత్తులకు, ఈన్ = ఒసఁగఁగా, 'కటుతిక్తకషాయాస్తు సౌరభ్యేఽపి ప్రకీర్తితాః' యని యాదవము. తత్ = ఆ తమ్మును, అనుకృత్ = అనుకరించుచున్న (పోల్చిన యనుట.), వృషాలితోన్=వృషభ సమూహముతోఁగూడను, 'సుకృతేవృషభేవృషః' యని యమరము. తేంట్లు=తుమ్మెదలు, పఱవన్ = తమవ్యాపారమునకు వెఱచి పాఱిపోఁగా, కరులు = ఏనుంగులు, కోరాడెను = తొండముతో నేలఁబొడిచి దుమ్మెత్తి పైఁ జల్లులాడెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. ఆశరత్కాలమునం దేనుఁగులు మదించి తొండములతో నేలఁబొడిచి దుమ్మెత్తి పైఁజల్లులాడుచు విహరించెను.

శా. గండద్వంద్వగళత్కరాళమదరేఖల్ ఫుల్లసప్తచ్ఛదా
ఖండక్షోదసిత ల్ప్రకీర్ణకములై కర్ణద్వయిన్ మించఁగాఁ
గొండల్ ద్రవ్వినమన్ను కత్తులగతిం గొమ్ముంగొన ల్ముంప వే
దండంబుల్చవుదంతు లొటఁ దెలిపెం దండెత్త భూపాలికిన్. 154

టీ. గం...ల్ - గండద్వంద్వ = కపోలద్వయమువలన, గళత్ = జాఱుచున్న, కరాళ=దట్టమైన, 'కరాళో దంతురే తుఙ్గే' యని రత్నమాల. మదరేఖల్ = దానప్రవాహపుచాళ్లు, ఫుల్ల...ల్ - ఫుల్ల = విచ్చినటువంటి, సప్తచ్ఛద = ఏడాకులయరంట్ల యొక్క, అఖండ = అధికమైన, క్షోద = పుప్పొడిచేత, సితల్ = తెల్లనైనవై, ప్రకీర్ణకములై = చామరములై, 'చామరంతుప్రకీర్ణక' మ్మని యమరము. కర్ణద్వయిన్ = శ్రోత్రయుగమును, మించఁగాన్ = అతిక్రమించికొమ్ములపర్యంతమురాఁగా, కొండల్ ద్రవ్వినమన్ను = పర్వతములుకొరాడినమట్టి, కత్తులగతిన్ = ఒరలతోనున్నఖడ్గముల రీతిని, కొమ్ముంగొనల్ = దంతాగ్రములను, ముంపన్ = కప్పఁగా, వేదండంబుల్ = మత్తేభములు, భూపాలికిన్ = రాజమండలమునకు, దండెత్తన్ = యుద్ధయాత్రకొఱకు, చవుదంతులొటన్ = చతుర్దంతదంతావళములొటను (అనఁగా నైరావతములొట) తెలిపెన్ = చూపెను. చామరసదృశములైనమదరేఖలు కొమ్ములమాడ్కినుండెను.

తే. అప్పు డన్యోన్యవిజిగీషు లైనదొరల
కవ దొనలనుండి లబ్ధలక్ష్యంబు లైన
స్వాన్వయశరాళిచేఁ గీర్తి చాలఁ గనెనొ
యన వనాళిఁ బ్రఫుల్లశరాళి మెఱసె. 155

టీ. అప్పుడు = ఆశరత్సమయమునందు, అన్యోన్యవిజిగీషులైన = ఒండొరుల జయింపనిచ్ఛగల్గినటువంటి, దొరల = నృపులయొక్క, కవ = రెండైన, దొనలనుండి = తూణీరములందుండి, లబ్ధలక్ష్యంబులైన = పొందఁబడినగుఱిగలవియైన, 'లక్షం లక్ష్యం శరవ్య'మ్మని యమరము. స్వాన్వయశరాళిచేన్-స్వ = తమయొక్క, అన్వయ = వంశము గల, (తాము శరశబ్దవాచ్యులు గనుకన నుట.) శరాళిచేన్=బాణసమూహముచేత, కీర్తి చాలఁగనెనొయనన్ = అధికమైనయశస్సును బొందెనోయనఁగా, వనాళిన్ = అరణ్యపంక్తియందు, ప్ర...ళిన్-ప్రఫుల్ల=వికసించిన, శరాళి=కాశకుసుమపంక్తి, మెఱసెన్ = వెలిఁగెను. శ్లేషానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తా. కీర్తి తెలుపని కవిసమయము గాన తెల్లుపువ్వులుం దెల్పగుటంజేసి యపుడవి విస్తరించి యున్నందున విస్తారమైనకీర్తిని బాణములు పొందెనో యన్నట్లుండెను.

తే. దరులతడివందు పొదువుమూఁపురము లంటు
తెల్లుగంటల నాఁబోతు కెలుల్లసిల్లె
గిరుల మోరలుసవి సముదీర్ణ సలిల
జలధరచ్ఛేదములు వ్రాలఁ జెలఁగుకరణి. 156

టీ. ద...లు - దరుల = నదీకూలములందలి, తడివందు=కర్దమము, పొదువు = వ్యాపించిన, మూఁపురములు = కకుత్ప్రదేశములను, అం...లన్-అంటు = తగిలికొనునట్టి తెల్లుగంటలన్ = పూచినతెల్లుగంటలచేత, ఆఁబోతులు = అచ్చువేయఁబడిన కోడెలు, ఉల్లసిల్లెన్=మిగుల నొప్పెను, గి...విన్-గిరుల=కొండలయొక్క, మోరలసవిన్ = శిఖరములను బుద్ధిచేత, స...లు-సముద్గీర్ణ = కురియఁబడిన, సలిల = ఉదకములుగల, జలధరచ్ఛేదములు = మబ్బుతునియలు, వ్రాలఁజెలఁగుకరణిన్ = చేరఁజూచెడుచందమునను, ఉల్లసిల్లె నని క్రింది కన్వయము.

తా. పర్వతశిఖరము లనుభ్రమచేత వర్షించినమబ్బుతునుకలు చేరఁబోవుచుండెనా యనునట్లు నదీకూలము లందలి తడివున్నన మెదలినమూఁపురములను పూచినతెల్లుగంట లంటుకొనిన యాఁబోతు లపుడు మిక్కిలి చెలువొందెను. ఉత్ప్రేక్ష.

తే. గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు వియన్నది జలములఁ గడుగఁ బిసుక
నెఱియు కుంకుడుపండులనురువులనఁగఁ
బలపలని పాండురాంబుదపఙ్క్తు లమరె. 157

టీ. గగనలక్ష్మి = ఆకాశలక్ష్మి, ని...లు-నిజ = స్వీయమైన, ఉరు = గొప్పలైన, నక్షత్రమాలికలు = చుక్కలపంక్తులనియెడు నిరువదియేడు ముత్యములుగల హారములు 'సైవ నక్షత్రమాలాస్యాత్సప్తవింశతి మౌక్తికా' యని యమరము. వి...లన్ - వియన్నది = ఆకాశగంగయందలి, జలములన్ = ఉదకములయందు, కడుగన్ = మురికి నెత్తుటకొఱకు, పిసుకన్=నలఁపఁగా, నె...వులు అనఁగన్-నెఱియు = వ్యాపించునట్టి, కుంకుడుపండుల = కుంకుడుపండ్లయొక్క, నురువులుఅంగన్ = ఫేనములో యనునట్లు, పలపలని = పలుచనైన, పాండుర = తెల్లనైనట్టి, అంబుదపఙ్క్తులు = మబ్బుల చాళ్లు, అమరెన్ = ఒప్పెను. శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

తా. ఆకాశమనులక్ష్మీదేవి చుక్కలవరుసలనియెడు తనగొప్పహారములు ఆకాశ గంగాజలములఁ గడిగిస్వచ్ఛము లొనర్చుటకొఱకందుఁ బిసికి వ్యాపింపఁజేసిన కుంకుడు కాయనురుఁగులో యన్నట్లు పలుచనై తెల్లగ నున్న మేఘపంక్తు లొప్పారెను.

శా. అప్పు ల్వారిధిచేతఁ బుచ్చుకొని కార్యంబైన ము న్గొన్నయ
య్యప్పుల్దొచనియుక్ సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా
నప్పుణ్యాతివిశుద్ధజీవుఁడు నిజాచ్ఛాంగంబులం దోఁచు న
ట్లొప్పారెన్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్. 158

టీ. అప్పుల్ = ఉదకములు, ఋణములును, వారిధిచేక్ = సముద్రునిచేతఁ పుచ్చుకొని = కైకొని, కార్యంబైనక్ = పనితీఱఁగా, ము...క్-మున్గొన్న = ముందు పుచ్చుకొనినట్టి, అయ్యప్పుల్ = ఆ యుదకములను, ఋణములను, దొచనియుక్ = దూర దేశములువెళ్లియును - వానకాలము గడచియును, సవృద్ధికముగాక్ = అధికముగా వడ్డితోఁగూడను, అవ్వార్ధికే = ఆ సముద్రునికే, తీర్పఁగాక్ = సరిపుచ్చఁగా, అ...డు - అప్పుణ్యా = ఆఋణముక్తిరూప సుకృతముచేతను, అతివిశుద్ధ = మిగులఁ బరిశుద్ధుఁడైన, జీవుఁడు = ప్రాణి, ని...లక్-నిజ = స్వీయములైన, అచ్ఛ = స్వచ్ఛము లైన, అంగంబులక్ = అవయవములందు, తోఁచునట్లు, = అగపడునట్లు శశిబింబ గర్భితములై = చంద్రబింబ ముదరమందుఁ గలవియై, ద్యో...ల్ - ద్యోచారి = అంత రిక్షమున సంచరించుచున్న, శుభ్రాభ్రముల్ = తెల్లని మబ్బులు, ఒప్పారెక్ = ఒప్పిద మాయెను.

తా. 'శ్లో. బ్రహ్మహా ముచ్యతే పాపైః ఋణీ తు నకదాచన' యన్నట్లు ఋణ మపరిహార్యమైన పాపము గనుక నట్టిపాపముచేత విముక్తుఁ డైనమనుజునిమాడ్కిఁ జంద్రగర్భితము లైనమేఘములు వెలింగెను. శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

చ. విశదపయోదపుంబొరలఁ వేష్టనచే నొకమై నభోమణిక్
లశునపటత్వ మొందుట మనంబున నారసి కాంచి విష్ణుఁ డ
య్యశివతకై పదంబు వలయంబునఁ బాపి యవస్తులో భక
ర్కశతఁ బ్రబోధ మొంది సిరిఁగాంచి చెలంగెఁబయఃపయోనిధిన్.

టీ. వి...చేక్-విశద = తెల్లనైన, పయోదపు = మేఘములవైన, పొరల = ఆవరణములయొక్క, వేష్టనచేక్ = వ్యాప్తిచేత, ఒకమైక్ = ఒక ప్రదేశమునందు, నభోమణిక్ = (సూర్యుని)ఆకాశమందలి మణిని, లశునపటత్వ మొందుటక్ = లశునపట మనుదోషము పొందుటను, మనంబునక్ = చిత్తమందు, ఆరసి = విచారించి, కాంచి = చూచి, విష్ణుఁడు = లక్ష్మీరమణుఁడు, అయ్యశివతకై = ఆదోషనివృత్తికై, రత్నజ్ఞులమెత్తుగల

కెంపునకు మణి యని సంజ్ఞ గాన వానికిఁ గలుగు లశునపట మనుదోషము ద్యుమణియైన సూర్యునికి శరత్కాల మేఘరూపముతోఁ గలుగఁగాఁ జూచి శివంకరము గాదు గనుకఁ దన్నివృత్తికై యనుట.) వలయంబున్ = పరివేషమువలనను (అందెవలనను,) పదంబు = పాదమైన యాకాశమును, పాపి = విడిపించి, (అప్పుడు పరివేష ముండ దనుట.) అవస్తు లోభకర్కశతన్ = కూడనివస్తువునందు లోభముచేతఁ గఠినుండు కాకపోవుటవలన, (అనఁగాఁ దోషవస్తువులయం దాసక్తిలేనివాఁ డౌటవలన ననుట.) ప్రబోధమొంది = జాగ్రత్తనొంది, మేలుకొని, పయఃపయోనిధిన్ = పాలసముద్రమునందు, సిరిఁగాంచి = సంపద నొంది, శ్రీమహాలక్ష్మినిఁ బొంది, చెలంగెన్ = ఒప్పెను.

తా. సూర్యుఁ డను నాకాశమణిని దెల్లని మేఘములు చుట్టుకొని లశునపట మను దోషము పరివేషమై యావరింపఁగా విష్ణువు చూచి యది శుభకరముగా దని పరివేషము నుండి విడిపించి దోషవస్తువులం దనాసక్తుఁడు గనుక నాతఁడు మేల్కాని లక్ష్మీసహితుఁడై పాలసముద్రమునఁ బవళించి వెలుఁగొందెను.

ఉ. అంబరవాసు లగ్నిక్రియకై ద్యుమణిస్ఫటికోపలంబునం
దుం బడయన్శరజ్జలదతూలపరంపరఁ గొంత పై ఘటిం
పం బెలుచం జనించి మఱి మట్టున నిల్వక *యాక్రమించెఁగాఁ
కం బరితాపమూనె ననఁ గాసె మొగుల్విరియెండ లత్తఱిన్. 160

టీ. అంబరవాసులు = దివిషదులు, అగ్నిక్రియకై = వహ్నిఁ బుట్టించుటకై, (వర్షర్తువునందు క్షీణమైనదాని ననుట.), ద్యుమణిస్ఫటికోపలంబునందున్ - ద్యుమణి = సూర్యుఁ డనియెడు, స్ఫటికోపలంబునందున్ = స్ఫటికశిలయందు, పడయన్ = పొందుట కొఱకు, శ...రన్ - శరజ్జలద = శరన్మేఘము లనియెడు, తూలపరంపరన్ = దూది ప్రోగును, కొంత = కొంచెము, పైఘటింపన్ = మీఁద నుంచఁగా, పెలుచన్ జనించి = విస్తరించి యగ్నిపుట్టి, మఱి = పిమ్మటను, మట్టునన్ = కొద్దిగా, నిల్వక = నిలిచియుండక, కాఁకన్ = వేఁడిమిచేత, పరితాపమూనన్ = వ్యాకులత్వమును బొందునట్లు, ఆక్రమించెన్ = వ్యాపించెను. అనన్ = అనఁగా, అత్తఱిన్ = ఆసమయమునందు, మొగుల్విరి యెండన్ = మబ్బువిరిసిన యెండలు, కాసెన్ = తపించెను.

క. కంజహితాస్తోదయవేళ
సంజ కడల నడుమఁ గప్పు సంధిల మిన్నొ
ప్పం జూడఁ బ్రకృతిశబరీ
గుంజానాసావిభూష కొమరు భజింపన్. 161

* నిల్వకయాక్రమింప నాఁకంబడి తాపమూనె.

టీ. కం...జ - కంజహిత = సూర్యునియొక్క, అస్తోదయపు = అస్తమయోదయములయొక్క, ఎఱసంజ = ఎఱ్ఱసంధ్యారాగము, కడలన్ = దిక్కులయందును, కప్పు = నైల్యము, నడుమన్=మధ్యప్రదేశమందును, సంధిలన్ = వ్యాపింపఁగా, మిన్ను = అంతరిక్షము, ప్ర...రు - ప్రకృతిశబరీ = మూలప్రకృతియనుచెంచితయొక్క, గుంజానాసావిభూష=గుఱిగింజముక్కఱయొక్క, కొమరున్ = సౌందర్యమును, భజింపన్ = పొందునట్లుగా, చూడన్ = వీక్షింపఁగా, ఒప్పెన్ = చెన్నొందెను.

తా. సంధ్యాకాలములయందు దానిరక్తిమముఁ దిగంతములవఱకు వ్యాపించియుండఁగా నంతరిక్షమునడుమ నల్లనై ప్రకృతి యను కిరాతస్త్రీయొక్క ముక్కఱయందు నలుపు పైపైపుగా నుంచి యడ్డముగాఁ గ్రుచ్చిన గుఱిగింజవలెఁ జూడనొప్పెను. రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

తే. గూండ్లకై శాలిమంజరు ల్గొనుచు మూఁగి
యంబరంబునఁ బఱచు కీ రాళి వాలిచెఁ
బసరుటొంటొంటియాకుతోఁ బండఁ బాఱి
ఛేదభయమున నెగసిన చే లనంగ. 162

టీ. గూండ్లకై = కులాయములకై, శాలిమంజరులు = వరిమెన్నులు, 'వల్లరీమంజరీస్త్రియా' మ్మని యమరము. కొనుచున్ = గ్రహించికొనుచు, మూఁగి = గుంపులుగూడి, అంబరంబునన్ = ఆకాశమునందు, పఱచు = ఎగసిపోవుచున్న, కీరాళి = శుకపంక్తి, 'కీరశుకౌ సమౌ' అని యమరము. పసరుటొంటొంటియాకుతోన్ = పసరువర్ణముగలయొక్కొకపర్ణముతోడను, పండఁబాఱి = పరిపక్వములై, ఛేదభయమునన్ = తమ్ముఁగోసివేయుదు రన్నభయముచేత, ఎగసినచేలనంగన్ = పైకెగరినపైరుచేలో యన్నట్లు, పొలిచెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్ష.

సీ. శ్రీలు దా రౌట నా శ్రితపద్మకర్ణికా
కృతిఁ జెపు ల్కమలక ర్ణికల మెఱయ
నతనుసారథ్యకృ ద్రతిరేఖ మంచెపై
నదలించు రొదఁ జిల్క పడుపు పఱవఁ
దొగల మొగ్గలపైవ దూల మేగమిఁ బెట్టు
చప్పట్లఁ జన్నులు జడలు గదల
వెడత్రోవ మును చెప్పి వడి నవ్వ దిరుగు న
ధ్వగులకొలఁది నప త్రపయు మరల

తే. నధరరదనప్రసాదంబు ౹ నడుగ నోరు
దెఱచెనో యన ప్రీలి ము ౹ త్తెములు తోఁచు
చెఱకు జంఘులఁ బోలమి ౹ శిరసు వాంచు
రాజనముఁ గాచు గోపికా ౹ రాజి పొలిచె. 163

టీ. తారు=శ్రోత్రములు, శ్రీలు = శ్రీకారములు, లక్ష్ములును, ఔటన్ = అయి నందువలన, ఆ...తిన్ - ఆశ్రిత = ఆశ్రయించిన, పద్మకర్ణికాకృతిన్ = తామర మీఁదిలవలెను, చెవుల్ = కర్ణములు, కమలకర్ణికలన్ = తామరమిద్దెలతో, మెఱయన్ = వెలుఁగఁగా, అతను = పెనిమిటియైన మన్మథునకు, సారథ్యకృత్ = రథమునడుపుచున్న, రతిరేఖన్ = మన్మథునిభార్యయయిన రతివలె, (సారథ్యముచేయుచు రతీదేవి చిలుక గుఱ్ఱము నెట్లదలించునో యట్లనుట.) మంచెపైన్ = మంచెమీఁదను, అదలించురొదన్ = నివారించుధ్వనిచేత, చి...న్ - చిల్కపదుపు = కీరపంక్తి, పర్వన్ = పరువిడు చుండఁగా, తొ...లన్ - తొగల = కలువలయొక్క, మొగ్గలన్ = కుట్మలములను, వైవన్ = విసరివేయఁగా, దూరమేగమిన్ = ఆచిలుకలు దవ్వుగా వెళ్ళనందున, పెట్టు చప్పట్లన్ = చేతుల తట్టుటలచేతను, చన్నులు = కుచములును, జడలు = కేశపాశ ములును, కదలన్ = చలింపఁగా, ముసు = పూర్వము, వెడత్రోవన్ = దబ్బఱమార్గ మును, చెప్పి = పల్కి, నవ్వన్ = హాసముచేయఁగా, వడిన్ = శీఘ్రముగా, తిరుగు = మరలవచ్చుచున్నటువంటి, అధ్వగులకొలఁదిన్ = పథికులతోడనే, అపత్రపయున్ = సిగ్గును, మరలన్ = మళ్లఁగా, (పథికులకుఁ దప్పుదారిఁ జెప్పి నవ్వఁగా నది గ్రహించి యా పథికులు మళ్లిరాఁగా లజ్జించి రనుట.) అ...బున్ - అధర = పెదవియొక్కయు, రదన = దంతములయొక్క, ప్రసాదంబున్ = అనుగ్రహమును, అడుగన్ = యాచిం చుటకొఱకు, నోరుదెఱచెనోయనన్ = వదనమువిప్పెనోయనఁగా, ప్రీలి = పగిలి, ముత్య ములు = మౌక్తికములు, తోఁచు = కనుపడునట్టి, చెఱకున్ = ఇక్షువనమును, జంఘులఁ బోలమిన్ = తమపిక్కలకు సరిపోలనందున, శిరసువాంచు = తలవంచికొనిన, రాజన మున్ = శాలిసస్యమును, కా...జి - కాచు = రక్షించుచున్న, గోపికారాజి = చేలకా పరిస్త్రీలవరుస, పొలిచెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్ష.

తా. చెఱకులు తమయందలి రసమాధుర్యముకంటె నాచెఱకు తోఁటకాచు స్త్రీలయొక్క యధర రసమాధుర్య మధిక మనియుఁ, దమలో నున్న ముత్యముల చక్కఁ దనముకంటె నాస్త్రీలయొక్క పలువరుసల చక్కఁదన మతిశయ మనియు, నధరరదన ములకు నోఁడి పరాజితులయినవారు నోరిగిలించి వేఁడుకొన్నట్లు కనుపులు పగిలి గర్భగతములయిన ముత్యములు గన్పట్టుచెఱకును, తమపైరు పొట్ట లాస్త్రీల పిక్కలకు

సాటిరానందున సిగ్గుచేఁ దలవాంచికొన్నట్లు పండి వంగియున్న రాజనపుచేలను గాచుచున్న స్త్రీలు శ్రీమహాలక్ష్మికి నాశ్రయస్థానమైన కమలకర్ణికలు బహిర్నిర్గతము లయినందున శ్రీసదృశములయిన శ్రోత్రములు గనుక వాని నవి యాదరించినట్లుగఁ జెవులయందుఁ గమలకర్ణికలు ధరించికొని మన్మథరథరథ్యంబు లయిన చిలుకల నదలించురతీదేవిమాడ్కిఁ జిలుకలం దోలుచుఁ గలువపువ్వులతోఁ దోలఁగా నవి దూరము పోనందునఁ జప్పట్లుఁ గొట్టుచు నధ్వగులకు వెడత్రోవఁ జెప్పి నవ్వఁగా వారు మట్లట తోనె సిగ్గు గలవా రయి యొప్పిరి.

తే. నింగి యత్తఱిఁ దామహానీలమైన
గరిమకుం దగబహుతృణగ్రాహి యయ్యె
ననఁగఁ బరిణత కలమాదిక యవసరాశి
తతులు గిరు లన నభ్రంకషతఁ జెలంగె. 164

టీ. నింగి = ఆకాశము, అత్తఱిన్ = ఆశరదృతువునందు, తాన్ = తాను, మహానీలమైన=మిగుల నల్లనైనట్టియు నీలమణియైనట్టియు, గరిమకున్ = ఆధిక్యమునకు, తగన్ = అర్హమగునట్లు, బహుతృణగ్రాహి = చాలకసవును గ్రహించునది, అయ్యెననఁగన్ = ఆయెనో యన్నట్లు, పరిణత = పండియున్న, కలమాది = వరిమొదలగువాని యొక్క, యవసరాశి = గడ్డివాములయొక్క, తతులు = వరుసలు, గిరులనన్ = కొండలో యనునట్లు, అభ్రంకషతన్ = ఆకాశమునొరసికొనుటచేత, చెలంగెన్ = ప్రకాశించెను. పరిణామోత్ప్రేక్షాలంకారములు.

మ. అయనిష్ఠన్ ధవళాతపత్త్రి దగు నయ్యాగంబు సాగంగ నం
దు యమిశ్రేణులు రాఁగఁ బుంగవకకుత్స్థుం డల్ల వర్షాదినా
త్యయరాముండు సలక్ష్మణుం డినున కోజోవాప్తిగా విల్లు ని
ర్దయతం ద్రుంపఁ బ్రభగ్నశాల్యవని సీతాలబ్ధి గాకుండునే. 165

టీ. అయనిష్ఠన్ = శుభావహవిధినిష్ఠచేతను, 'అయశ్శుభావహో విధిః' యని యమరము. ధవళాతపత్త్రిదగు = తెల్లదామరగొడుగుగల శరదృతువుదైన, అయ్యాగంబు = ఆరాకయును, ధవళాతపత్త్రిదగు = తెల్లని గొడుగుగల జనకునిదైన, అయ్యాగంబు = ఆ యజ్ఞమును, (ఇచ్చట = ధవళశబ్దముచేతఁ బుండరీకమును లక్షింపఁబడును. 'పుండరీకాతపత్త్రస్తం వికసత్కాశ చామర' మ్మని రఘువంశమున శరదృతువర్ణనమున్నది.), సాగంగన్ = జరఁగగా, అందున్ = ఆ శరత్కాలమందును, ఆ జన్నమునందును, యమిశ్రేణులు = హంసపంక్తులును, యోగిబృందములును, (యమిన్ శబ్దమునకు ఋషు లర్థము, ఆఋషులకు హంస లను పేరుగలదు గనుక లక్షితలక్షణచేత హంస లన్న

యర్థము.), రాఁగన్ = వచ్చుచుండఁగా, పుంగవకకుత్సుండు = ఎడ్లయొక్క మూఁపుర
ములయందున్నట్టియు, కకుత్సులలోఁ శ్రేష్ఠుఁడైనట్టియు, పుంగవాదు లుత్తరపదములై
శ్రేష్ఠార్థము నిచ్చునవి యైన నిచ్చట శ్లేషనిమిత్తము పూర్వపదమాయెను. 'ప్రాధాన్యే
రాజలింగే చ వృషాంగే కకుద స్త్రియా' మ్మని యమరము. అల్ల = ప్రసిద్ధమైన, వర్షా
...డు-వర్షాదినాత్యయ = శరదృతు వనెడు, రాముండు = శ్రీరాముఁడు, సలక్ష్మణుండు=
ఆఁడు బెగ్గురులతోఁ గూడినవాఁడును, సుమిత్రానందనునితోఁ గూడినవాఁడును,
'సారసస్యతు లక్ష్మణా' యని యమరము. (సారసపక్షులు వర్షర్తువునందుఁ బిల్లలు
వెట్టి శరత్కాలమునందు వ్యాపించునవి యనుట.) ఇనునకున్ = సూర్యునకును,
జనకునకును, ఓజోవాప్తిగాన్ = తేజమును, గీర్తియును, గలుగునట్లుగా, విల్లు = మణి
ధనుస్సును, శివధనుస్సును, నిర్దయతన్ త్రుంపక = సంకోచింపక విఱువఁగా, ప్రభగ్న
శాల్యవనిన్ = కోయఁబడిన రాజనాలు గల భూమియందు, సీతాలబ్ధికాకుండునే =
నాఁగేటిచాలుయొక్క లాభము కలుగకుండునా (పొలమున వరి గోయఁగానే మరల
దున్ని రనుట.) 'సీతాలాంగలపద్ధతిః' యని యమరము. ప్రభగ్న = విఱుచుటచేత, శాలి=
ఒప్పుచున్న, (మాగాణి) అవనిన్ = భూమియందు, సీతాలబ్ధికాకుండునే = వైదేహి
ప్రాప్తి కాకపోవునా? (కలుగు ననుట.) రూపకానుప్రాణిత శ్లేషాలంకారము. 'నానార్థ
సంశ్రయశ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాస్పద' యని శ్లేషలక్షణము.

క. మొగులు విరియెండ వెండియు
నిగుడ శుకశ్రేణి పసరు నింగి న్నిండన్
బెగడెఁ బ్రజ హారితవాజుల
గగనమణిస్యందనంబు గదిసెనొ యనుచున్. 166

టీ. మొగులు = మేఘములు, విరియెండ = విరిసినయెండ, (శరత్కాలాతప
మనుట.) వెండియున్ = మిక్కిలియును, నిగుడన్ = వ్యాపింపఁగా, శుకశ్రేణి = చిలు
కలపదుపుయొక్క, పసరు = పచ్చనిచాయ, నింగిన్ = ఆకాశమందు, నిండన్ = పూర్ణ
మగుచుండఁగా, హా...జు - హారితవాజుల = పచ్చడాలుగల గుఱ్ఱములుగల, 'హాలాశో
హారితోహరిత్, వాజివాహార్వ గంధర్వా' యనియు నమరము. గగనమణిస్యంద
నంబు = సూర్యరథము, కదిసెనొయనుచున్ = సమీపించివచ్చెనో యని, ప్రజ = జనము,
బెగడెన్ = జడిసెను. అతిశయోక్త్యలంకారము.

తే. భువి సరసకైరవశ్రేణి పోవఁద్రోల
దివిఁ గన త్తద్విహానక్షత్రదీప్తి దఱుమఁ

గృష్ణపక్షపువాసిలే \ కిరులు దనదు
నలుపునను గూడె నన నైల్యో మొలసె నభము. 167

టీ. భువిక్ = భూమియందు, స...సరః = కొలఁకులయందున్న, కైరవశ్రేణి = తెల్లనికలువబంతి, 'సితే కుముద కైరవే' యని యమరము. పోవద్రోలక్ = వెళ్లఁ దోలఁగా, దివిక్ = అంతరిక్షమందు, కనత్ = ప్రకాశించుచున్న, గ్రహ = అంగారకాదులయొక్కయు, నక్షత్ర=అశ్విన్యాదులయొక్కయు, దీప్తి = కాంతి, తఱుమక్=వెళ్లఁ గొట్టఁగా, ఇరులు = అంధకారములు, కృష్ణపక్షపువాసిలేక = బహుళపక్షపు రేలబలిమిలేక, తనదునలుపునను = తననైల్యముతోడను, కూడె ననక్ = కలిసెనో యన్నట్లు, నభము = ఆకాశము, నైల్యమొలసెక్ = అతినైల్యమును బొందెను. ఉత్ప్రేక్షాలంకారము.

క. క్రేపుదలఁచి పసి మేయుచుఁ
జేపినపాల్గలయ నెండ \ చేఁ బాంథజనుల్
దూపింపమి కజుఁ డంపిన
యాపాగా యనఁగ నదుల \ నంచలు మెఱసెన్. 168

టీ. పసి = పశుసమూహము, మేయుచుక్ = పొలముకసవుఁదినుచును, క్రేపుతలఁచి = లేఁగదూడలను తలంచికొని, చేపినపాలు = వెలికుబికి ప్రవించినక్షీరములు, కలయక్ = నద్యుదకములతోఁ జేరఁగా, ఎండచేక్ = ఆతపముచేతను, పాంథజనులు = అధ్వగులు, దూపింపమికిక్ = పానముసేయనందునకు, (ఎండలోఁ దప్పిగొన్నవారు పాలుద్రావకుంట ప్రసిద్ధము.) అజుఁ డంపిన=ఆనదులలోనిక్షీరనీరములు వేఱుపఱుపు మని బ్రహ్మదేవుఁడనిపినట్టి, ఆ పా గాయనఁగక్=తనవాహనపంక్తియో యనునట్లు, అంచలు = హంసలు, మెఱసెక్ = వెలిఁగెను. ఉత్ప్రేక్షాలంకారము.

తే. వెదమొదవుఁ గూడఁబోలేమి \ వెచ్చఁగొ్రొవ్వ
*స్వల్పమెడసూప వెడలెనో \ యనఁగ నెట్టకేలకును గ్రుంగి తెచ్చు అం \ కెలు నిగుడఁగ
మందగతి గున్కు వృషభము \ ల్మందపిఱుఁద. 169

టీ. వెదమొదవుక్=ఋతుమైనధేనువును, కూడక్ = కలియుటకు, పోలేమిక్ = నడువలేనందున, వెచ్చక్=తాపముచేత, క్రొవ్వు = కంఠమువఱకున్నమదము, స్వల్పము=

* 'కల్పమెడచాఁప...యనఁగ'-వే. పా. (కల్పక్=కరఁగునట్లు, మెడచాఁపక్ = కంఠమును దీర్ఘీకరించినందున - అని టీక) ఆపాఠమున యతిభంగము.

కొంచెము, ఎడసూపఁగాన్ = సందువిప్పఁగా, వెడలెనోయనఁగన్ = బయలు దేఱెనో యనఁగా, ఎట్టకేలకున్ = కొంతతడవునకు, క్రుంగి = భూమికివంగి, తెచ్చుటుంకెలు = రప్పించెడు వృషభధ్వనులు, నిగుడఁగన్ = సాగఁగా, వృషభముల్ = ఆఁబోతులు, మందపిఱుఁదన్ = పసులగుంపువెనుక, మందగతిన్ = మెల్లనినడకతో, గుస్కోన్ = కొంచెముగాఁ బఱువు పెట్టెను.

తే. శరధిజలమెల్ల రిత్తగాఁ ♦ గురియ నుప్పు
డొక్కఁ బేరిన నత్తెల్పె ♦ చిక్కి మీఁదఁ
గాన నగుచున్న దచ్ఛత ♦ చే ననంగఁ
బఱచు శరదభ్రములమేని ♦ పాండి మమరె. 170

టీ. శరధిజలమున్ ఎల్లన్ = సముద్రోదకమంతయు, రిత్తగాఁగురియన్ = శూన్యమగు నట్లువర్షింపఁగా, ఉప్పు = జలమందుండు లవణాంశము, డొక్కన్ పేరినన్ = కడుపులో ఘనీభవింపఁగా, అత్తెల్పెచిక్కి = ఆలవణముయొక్క ధావళ్యముమాత్రము మిగిలి, అచ్ఛతచేన్ = నైర్మల్యముచేత, మీఁదన్ = మేఘముపై, కాననగుచున్నది = చూడఁబడు చున్నది, అనంగన్ = అనునట్లు, పఱచు = పరువిడుచున్న, శ...మ-శరదభ్రముల = శర త్కాలమేఘములయొక్క, మేని = దేహముయొక్క, పాండిమ - ధావళ్యము, అమరెన్ = ఒప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

క. శరనిధి మునుగ్రోలినని
ర్ఝరజలములు గురిసి మేఘ ♦ భావం బఱి యె
క్కరములు కరములె కా జిగి
నొరిమె ననన్ రవియు మెఱసె ♦ నుడిగెను మొయిలున్. 171

టీ. శరనిధిన్ = సముద్రమునందు, మునుగ్రోలిన = మున్నుపానముచేసిన, నిర్ఝర జలములు = అధికోదకములు, కురిసి = వర్షించి, మేఘభావంబఱి = జలధరత్వమును బోఁగొట్టికొని, అక్కరములు = ఆ సూర్యకిరణములు, కరములె కాన్ = సూర్యకిరణ ములుగానె కాఁగా, రవి = సూర్యుఁడు, జిగిన్ = తేజస్సుచేత, ఒరిమె ననన్ = తీక్ష్ణుఁ డాయె నన్నట్లు, మెఱసెన్ = ప్రకాశించెను. మొయిలున్ = మేఘమును, ఉడిగెన్ = శాంతించెను. హేతూత్ప్రేక్ష.

క. ప్రాశించిన నీరంతయుఁ, బో శరదభ్రములు మగుడఁ ♦ బూరింపఁగనా
వేశించెఁ గొలంకుల నన, గాశ ప్రతిబింబపటలికడు నొప్పారెన్.

టీ. శరదభ్రములు = శరత్కాలమేఘములు, ప్రాశించిననీరంతయున్ = మునుపు దామగ్రోలినయుదకమంతయు, పోన్ = వెళ్ళఁగా, మగుడఁబూరింపఁగన్ = మరల

నిండించుకొనుటకు, కొలంకులన్ = సరస్సులయందు, ఆవేశించెన్ = ప్రవేశించెను, అనన్ = అనునట్లు, కాశప్రతిబింబపటలి = తెల్లుపువ్వుల ప్రతిమానసమూహము, కడున్ = మిగులను, ఒప్పారెన్ = చెన్నొందెను.

తే. కొలనఁ గరిదంపతులు పద్మ కళిక లొకటి
కొకటి యానెత్తమకరంద మొలుక నమరె
నివి శరత్పద్మనిలయకు నెలమితోడఁ
గవల నభిషేకమున కెత్తు కడవ లనఁగ. 173

టీ. కొలనన్ = సరస్సులయందు (జాత్యేకవచనము), కరిదంపతులు = సతీపతులైనయేనుఁగులురెండు, పద్మకళికలు = అఱవిరితమ్మిమొగ్గలు, ఒకటికొకటి యానెత్తన్ = పరస్పరమిచ్చుటకై పైకెత్తఁగా, మకరందము = పూఁదేనె, ఒలుకన్ = స్రవించుచుండగా ఇవి = ఈ పద్మముకుళములు, శరత్పద్మనిలయకున్ = శరల్లక్ష్మికి, ఎలమితోడన్ = సంతోషముచేతను, కవలన్ = జోడుగా, అభిషేకమున కెత్తు = స్నానమొనరించుటకుత్తిప్తమైనట్టి, కడవ లనఁగన్ = కుంభములోయన్నట్లు, అమరెన్ = ఒప్పెను.

తా. తామరకొలంకులయందుఁ గ్రీడించుచున్నగజమిథునముఁజూడఁగా, శ్లో. 'లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః' అన్న శ్లోకంగులు శ్రీమహాలక్ష్మికి హస్తంబులయందు సువర్ణకుంభములను ధరించి యభిషేక మొనరించు చందంబునఁ గానవచ్చుచుండెను.

తే. పంక మడుగంటి తేటిన బావు లెల్లఁ
బంకములె చేసెఁ గ్రమ్మఱఁ బంకజములు
గళితమకరందయుతరజః కర్దమమునఁ
గారణగుణంబు గలుగదే కార్యమునకు. 174

టీ. పంకము = అడుసు, అడుగంటి = అధఃప్రదేశముఁబట్టి, తేటినబావులెల్లన్ = స్వచ్ఛోదకములుగల్గినకొలంకులన్నియును, పంకజము = కమలములు, గ...నన్ = గళిత = జాఱినటువంటి, మకరందయుత = పూఁదేనియతోఁగూడిన, రజఃకర్దమమునన్ = పరాగ పంకముచేతను, క్రమ్మఱన్ = మగుడను, పంకములె = కర్దమయుక్తములైనవిగానే, చేసెన్ = ఒనర్చెను. కారణగుణంబు = కారణముయొక్కగుణము, కార్యమునకున్ = క్రియకును, కలుగదె. (కలుగు ననుట.)

తా. కమలములు పంకజములుగాన నీళ్లను బంకయుక్తములుగాఁ జేసెను. సామాన్యముచేత విశేషమును సమర్థించిన యర్థాంతరన్యాసాలంకారము. శ్లో. "జ్ఞేయ

స్సోఽర్థాంతరన్యాసో వస్తుప్రస్తుత్య కించన, తత్సాధనసమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః అని దానిలక్షణము.

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం
గొసరి జనుల్వార్ధి నీరు గ్రోలితి వీనిన్
పసికై మా కిమ్మని క
న్కసరుడుగం గావ నప్పగించెదుమాడ్కిన్. 175

టీ. జనుల్ = మనుష్యులు, కొసరి = వేఁడికొనుచును, వార్ధి = సముద్రమందలి, నీరు = ఉదకము, క్రోలితి = పానముచేసితివి. వీనిన్ = మాకుపయోగమైన యీయుదకమును, పసికై = పశువులకొఱకై, మాకున్ = మాకొఱకు, ఇమ్మని = విడుపు మని, కన్కసరుడుగన్ = కోపప్రయుక్తమైన నేత్రదోషము నివర్తించుటకై, కావన్ = ఆయుదకమును ద్రావక రక్షించుటకొఱకు, అప్పగించెదుమాడ్కిన్ = ఇదిగో రక్షింపు మని యొప్పగించినరీతిని, అగస్త్యార్ఘ్యములన్ - అగస్త్య = అగస్త్యునికి, అర్ఘ్యములన్ = జలాంజలులను, ఒసంగిరి = ఇచ్చిరి. హేతూత్ప్రేక్ష. శరదృతువునందు నగస్త్యుని కిచ్చునట్టి యర్ఘ్యముల ని ట్లుత్ప్రేక్షించెను.

క. పరుషాతపతప్తం బగు
ధరణీపాత్రమునఁ బడుట దళ మయ్యెఁ జుమీ
పరిపక్వంబై యనఁగా
శరదిందుజ్యోత్స్న రేలు సాంద్రతఁ గాసెన్. 176

టీ. ప...నన్-పరుష=కఠినమైన, ఆతప = ఎండచేతను, తప్తంబగు = కాఁగినటువంటి, ధరణి = భూమియనెడు, పాత్రమునన్ = ఆధారమందు (పెనముమీఁదననుట), పడుటన్ = పతనమగుటచేత, దళమయ్యెఁజుమీ = దట్టమాయెనుజుమా, అనఁగాన్ = అనునట్లు, పరిపక్వంబై = పండినదై, శరదిందుజ్యోత్స్న = శరచ్చంద్రచంద్రిక, రేలు = రాత్రులయందు, సాంద్రతన్ = దట్టముగా, కాసెన్ = వెలిఁగెను.

తే. వృష్టితఱి నిడ్డజెనఁ ద్రావఁ గ్రిందనుండి
తేటనదినీటఁ దనవెంటఁ దేలుమీల
తళుకుతో నాఁచులత దోఁచె వెలికి [1]జమిలి
వెండిమీఁ లెక్కువెంద్రుకవిల్లువోలె 177

టీ. వృష్టితఱిన్ = వర్షాకాలమునందు, ఇడ్డ = పెట్టిన, జెనన్ = చేఁపలయొక్క జెనను, త్రావన్ = పానముసేయుటకొఱకు, క్రిందనుండి = అడుగునఁబట్టి, తేట=నిర్మల

1. జమిలిః జములుః ప్రయోగాంతరములేదు. 'జములు సేత' యనివ్యవహారము. ఇంకనువిచార్యము.

పైన, నదినీటన్ = ఏటియుదకమందు, తనవెంటన్ = ఆనాఁచుతీఁగవెంబడి, తే... తోన్-తేలు = పైకివచ్చుచున్న, మీల = మత్స్యములయొక్క, తళుకుతోన్ = కాంతి తోడ, వెలికిన్ = బైటికి, జ...లు-జమిలి=జోడుజోడయిన, వెండిమీలు = రజతము చేతఁజేయఁబడినమత్స్యములు, ఎక్క = పైకెగయఁగా నొప్పుచున్న, వెండ్రుకవిల్లు వోలెన్ = గుఱ్ఱపుతోఁకవెండ్రుకలచేఁగట్టిన ధనుస్సోయన్నట్లు (ఇది దాసరివాండ్రు వాయించువాద్య మనియు దీని పేరు కామాచి యనియుఁ జెప్పుదురు.) నాఁచులత దోఁచెన్ = ప్రాఁచితీఁగ గన్పించెను.

తా. వానకాలమందుఁ జేఁపలు నాఁచుతీఁగవెంట గ్రుడ్లు విడిచియుండ వానిం దినుటకు నీళ్లనుండి యానాఁచుతీఁగ వెంబడిని మత్స్యములు పైకి రాఁగా, నదిదాసరి వాండ్రు గుఱ్ఱపువెండ్రుకలచేత వింటిబద్దకట్టి వానిమీఁద వెండితగుళ్లచే మత్స్యముల నేర్పఱచి వాయించునప్పుడవి పైకెగయుటవలెఁ గన్పట్టెను.

క. హంసము క్రౌంచముతొలి రా
మాంసలరుచి వచ్చెఁ దాను ♦ మలయముశిఖిఁ బా
ల్హంస విఱువ నీ ర్వెఱిచెను
హంసమున కగస్తి పరమ ♦ హంసం బగుటన్. 178

టీ. హంసము=అంచపిట్ట, క్రౌంచముతొలిరాన్ = క్రౌంచపర్వతబిలముననుండి రాఁగా, తాను = ఆయగస్త్యుఁడును, మలయముశిఖన్ = మలయపర్వతాగ్రముననుండి, మాంసలరుచిన్ = అధికకాంతిచేతను, 'బలవాన్మాంసలోంసలః' యని యమరము. వచ్చెన్ = ఉదయించెను. హంసమునకున్=చక్రాంగమునకు, అగస్తి = అగస్త్యమహర్షి 'అగస్త్యోఽగస్తిరిత్యపి' యని ద్విరూపకోశము. పరమహంసంబగుటన్ = పరమహంస యనుఋషియగుటచేత, హంస = అంచ, పాల్=క్షీరమును, విఱువన్ = నీరముతో వేఱు పఱపఁగా, నీర్వెఱిచెను = తాను నీళ్ళలోనిబురదను బోఁగొట్టెను.

తా. హంసలు పాలునీళ్ళ నేర్పఱుప నగస్త్యుఁడు నీరుబురద నేర్పఱచినందున పరమహంస యనునట్లు శరదృతువునందు నుదకములు కలకలుఁడిగి నిర్మలము లాయెను.

తే. క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు ♦ గాంచె మింట
నవి యహంసచ్ఛదాచ్ఛాద ♦ నానుభూతి
హంసతతు లయ్యెఁ గావన్న ♦ నరుణచూడ
గుప్తభుజగాశనాండము ♦ ల్గుఱులు గావె. 179

టీ. క్రౌంచము = కొంచగుబ్బలియందున్నరంధ్రము, ఒకకొన్నిగ్రుడ్డులు = కొన్ని అండములను, మింటన్ = తనపైభాగమందు, కాంచెన్ = వహించెను. (పరశురాముని

బాణముచేతఁ దొలువఁబడిన క్రౌంచాచల రంధ్రమునుండి హంసలు మానససరో
వరంబునకుఁ జనుటయు, మరలి వచ్చుచుండుటయుఁను గల దని సంప్రదాయము.)
అవి = ఆక్రౌంచాచలములోని గ్రుడ్డులు, అహంస = దానియందురాకపోకలుగల హంసే
తరములైన పక్షులయొక్క, ఛద = ఱెక్కలయొక్క, ఆచ్ఛాదన = కప్పుటయొక్క, అను
భూతిక్ =అనుభవముచేత, హంసతతులయ్యెఁగ్ = అంచలగుంపులాయెను, కావన్నెక్ =
హంసగ్రుడ్లనితరపక్షులుపొదిగిన హంసపిల్లలుగానేరవన్నట్లాయెనా, అ...ల్ - అరుణ
చూడ = కోళ్ళచేతను, 'కృకవాకుస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధః' యని
యమరము. గుప్త=పొదుగఁబడిన, భుజగాశన = నెమళ్ళయొక్క, అండముల్=గ్రుడ్డులు,
గుఱులుగావె = చిహ్నములుకావా (అవు ననుట) ఇందు సామాన్యముచే విశేషమును
సమర్థించిన యర్థాంతరన్యాసాలంకారముచేత నుత్థాపితంబైన యసంబంధమైన సంబం
ధముఁ గలుగఁజేసిన యతిశయోక్త్యలంకారము.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం
బులపయి దట్టపుంజిలుము వోవఁగఁ దారలకంచు గీయఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువు
ల్కెలఁకులఁ బాసిపోఁజెలఁగెఁ గ్రేంకృతు లిచ్చుమరాళమాలికల్.

టీ. వారిదేవతలు = జలాధిదేవతలు, కలయఁగన్ =అంతటను, కాంచు = చూచు
చున్నటువంటి, సరోవర = కొలంకు లనియెడు, దంభ = వ్యాజముగల, దర్పణంబుల
పయిన్ = అద్దములమీఁదను, దట్టపుంజిలుము = సాంద్రమైన మాలిన్యము, పోవఁగన్ =
పోవునట్లు, తారు=ఆజలాధిదేవతలు, అలకంచున్ =ఆయద్దమైనకంచును, గీయఁగాబలెన్ =
తోమిగీతఁబెట్టినందువలననోయన్నట్లు, నలువంకలన్ = నాలుగుదిక్కులయందును,
కలయన్ = వ్యాపించునట్లు, పాయక = విచ్ఛిన్నముగాక, తేలుచున్ = పోవకమీఁ
దనేయుండుచు, పద్మరేణువుల్ = నళినపరాగములు, కెలఁకులఁబాసిపోన్ =ప్రక్కలకు
విడిపోవునట్లు, క్రేం...ల్ - క్రేంకృతులిచ్చు = క్రేంకారములుచేసెడు, మరాళమాలి
కల్ = అంచలబంతులు, చెలఁగెన్ = ఒప్పెను. అపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్షాలంకారము.

తా. జలదేవతలు దా మెల్లెడలఁజూచు సరోవరములను నద్దములపైఁగల దట్టమగు
మాలిన్యము పోవునట్లు తోమిగీఁతపెట్టిరో యన్నట్లు హంసలసమూహము లవిచ్ఛిన్నములై
క్రేంకారము లొనర్చుచుఁ బొలుపారెను. వానిక్రేంకారములచే నలినపరాగములు ప్రక్క
లకుఁ బోవుచుండెను.

సీ. అర్కమండలి కభ్ర మడ్డమైనంతనె
దొఱఁగి మూసి మోము బిట్టెత్తి చూచి

ఘుమఘుమధ్వని గాలి ౕ గుహాఁ జొరఁ బురి యొకిం
చుక విచ్చి కని తలం ౕ చుకొని వంచి
నిష్పుష్ప కేతకీ ౕ నేత్రాంబు వొత్తి భే
కపుఁ డెంకి పడియచోఁ ౕ గర్ణ మొగ్గి
కేకకుఁ ద్య్రవనత ౕ గ్రీవమై రాక యొ
క్కింం తార్చి వాత నే ౕ మేమొ కమిచి
తే. వెడలు బీతెండకును శర ౕ ద్వృక్షు ముడిగి
వార్షికమె యెక్కి త్రోటిని ౕ ర్వ్యంకపక్ష
తులను గిరుపుచు వెఱ్ఱిచూ ౕ పుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ ౕ గేకు లుండె. 181

టీ. అర్కమండలికిఁ = సూర్యమండలమునకు, అభ్రము = మేఘము, అడ్డమై నంతనె=కొంచె మాచ్ఛాదకముకాఁగానే, ఎఱమాని = మేఁతవిడిచి, మోము=ముఖమును, బిట్టెత్తి=పొడవుగానెత్తి, చూచి = వీక్షించి, (వానకాల మనుభ్రాంతిచేఁ జూచి యనుట.) ఘుమఘుమధ్వని = ఘుమఘుమశబ్దముచేత, గాలి = వాయువు, గుహాఁజొరఁ = గుహాలోఁబ్రవేశింపఁగా, పురి యొకించుక విచ్చి=పింఛమును గొంచెము విచ్చి, (గాలిచేతఁ గల్గినధ్వనిని మేఘధ్వని యనిభ్రమించి యనుట.) కని = చూచి, తలంచుకొని = అది యుఱుముగా దనివిత్కరించి, వంచి = పింఛమునుమరలనడంచి, నిష్పుష్ప కేతకీ నేత్రాంబు వొత్తి = పువ్వులులేని మొగలిచెట్లయొక్క కన్నీరు దుడిచి, భేకపుఁడెంకి = కప్పలపనికి పట్టైన, పడియచోఁ = పల్వలములోనినెఱియకై, కర్ణ మొగ్గి = చెవి వంచి(కప్ప కూఁతలు గలిగినవర్ష ము గల దన్న ప్రతీతినిఁబట్టి యనుట,) కేకకుఁ = తనవాక్కునకు, త్ర్య...ది - త్ర్యవనత = మూఁడుమాఱులువంచఁబడిన, గ్రీవమై = మెడగలదై, రాక= ఆకేకాధ్వనియును వెడలక, ఒక్కింం తార్చి = కొంచెముధ్వనిసేసి, వాతఁ = నోటిచేతను, ఏమేమొ కమిచి = ఏమేమోచప్పరించుకొనుచు, వె...కుఁ-వెడలు = కలిగిన, బీతెండకుఁ = తీక్ష్ణాతపనివృత్తికొఱకు, శరద్వృక్షముఁ = ఏడాకు లరఁటిచెట్టును, డిగి = విడిచిపెట్టి, వార్షికమైయెక్కి = గుష్మమునారోహించి, 'శారదో విషమచ్ఛదః, వార్షికం త్రాయమాణాస్యా'త్తని రెంటికి నమరము. (వర్షాకాలమున నెక్కియున్న వృక్షమున నెక్కినవర్షము కలుగు నని శరద్వృక్షము విడిచి వార్షికవృక్షమున నెక్కె ననుట.) త్రోటిఁ = ముక్కుచేతను, 'చంచుస్త్రోటిరుభేస్త్రియా'మ్మని యమరము. ఇర్వ్యంకపక్ష తులను = ఉభయపార్శ్వపక్షమూలములను, 'స్త్రీపక్షతిఃపక్షమూల' మ్మని యమరము. గిరుపుచుఁ = వెండ్రుకలు దువ్వికొనుచు, వెఱ్ఱిచూపునఁ = వికృతపుదృష్టిచేత, ఉరం

బుక్ = బొమ్మును, కెలఁకులన్ = ఇరుప్రక్కలను, కనుంగొనుచున్ = చూచికొనుచు, కానన్ = అరణ్యమునందు, కేకులు = నెమిళ్ళు, ఉండెన్ = నివసించెను.

క. వెలుతు రస లంటి యెండియు
లలి విప్పమిఁ జెడక శిఖిక । లాపము వని వ
ర్తిలెఁ బర్జన్యుఁడు నటన
మ్ముల మెచ్చి మెఱుంగుఁగాసె । ముద్రించె ననన్. 182

టీ. శిఖికలాపము-శిఖి = నెమిళ్లయొక్క, కలాపము = పురి, అసలంటి = బురద తగిలి, వెలుతురు=మబ్బువిడిచినయెండచేతను, ఎండియున్=ఆఱియును, లలివిప్పమిన్ = ఎప్పటికిని విడఁజేయకపోవుటవలన, (సామాన్యముగాఁ దడిసినపురులు విప్పరావు ; బురద యంటి యెండి యున్నట్లున్న వనుట.) చెడక = చెడిపోక, వనిన్ = అడవియందు, పర్జన్యుఁడు = వర్షదేవత, నటనమ్ములన్ = నాట్యమును, మెచ్చి = శ్లాఘించి, మెఱుంగుఁగాసెన్ = ప్రకాశించుచున్న చిత్రవస్త్రమును, ముద్రించెననన్ = ముద్రవేసెనోయన్నట్లు, వర్తిలెన్ = ఉండెను.

తా. వానకాలపుబురదలు తమకలాపములకు నంటి యెండచేత నిగిరినందున శరత్కాలమునందు నెమిళ్లు పింఛములు విప్పి యాడకయుండఁగా వర్షదేవత నెమిళ్లయొక్క నృత్యములకు మెచ్చి తననటులు మఱియొకచో నాడకుండునట్లు ముద్రవేసెనో యన్నట్లుండెను.

సీ. చక్రస్తనప్రకా । శమునకు ఫేనంపుఁ
గొం గిడి కొనకొనఁ । గొళ్ల గొణఁగి
యశ్మనితంబంబు । హంసహారమును బ
రాగ రేఖాస్వర్ణ । రశనముగను
జలశాటిపులినంపు । జఘనంబుపై జాఱి
వ్యస్తవేతసభుజ । స్వస్తిక మిడి
తనిమతో వెచ్చనై । తటశరప్రతిబింబ
హాసాలి బాష్ప లు । చ్ఛ్వాసములును
తే. నగుచు నిలిచి చెందొవకంట । నలిగి తమ్ము
లంటుకై యొత్తు పదనతి । నలరి కువల
మధులవారి నబ్ధిఁ జెందిపై । మగతనముల
నొక్కెడలఁ గూడుచు స్రవంతు । లుబ్బుఁ బెనఁచె. 183

టీ. స్రవంతులు=నదులు, 'స్రవంతీ నిమ్నగాపగా' యని యమరము. ఉచ్ఛ్వాసములును = పరీవాహము లనునిట్టూర్పులను, 'జలోచ్ఛ్వాసాః పరీవాహాః' యని యమరము. అగుచున్ =అయినవై, చెం...టన్-చెందొవ=ఎఱ్ఱగలువయనియెడు, కంటన్ = నేత్రముచేత, అలిగి = కోపగించి, (శరత్కాలమందుఁ బ్రవాహములు తక్కువైనందునఁ బెనిమిటియైన సముద్రునితోఁ దమకు సంపర్కము లేమింజేసి ప్రణయకోపమునొంది యనుట.) తమ్ములంటు = పద్మములనంటుచున్న, కైయొత్తు = సముద్రపుఁగాలువల పొంగుట యనెడు, (కై=హస్తముచేతను, ఒత్తు=పట్టుటగల,) పద = పాదములయందు, నతిన్ = నమస్కారముచేతను, అలరి = సంతసించి, చ...కున్-చక్రస్తన = కోకము లనియెడు కుచములయొక్క, ప్రకాశమునకున్ = కనుపించుటకొఱకై, ఫేనంపు = నురుఁగనియెడు, కొంగు = పైఁటచెఱఁగు, ఇడి=విడిచి, (భర్తకుఁ గుచంబులు గన్పించుటకై పైఁటచెఱఁగుఁ దొలఁగించె ననుట,) కొనకొనఁ గోళ్ళన్ = జలకుక్కుటములను వ్యాజముచేత (బొల్లి కోళ్ళనుట.) గొణఁగి = జల్పితముఁజేసి (అనఁగా మణితములనుట) అశ్మనితంబంబున్ = పాషాణములనుకటిపశ్చాద్భాగమును, 'పశ్చాన్నితంబః స్త్రీ కట్యాః' మ్మని యమరము. హంసహారమును = మరాళము లనుముత్యాలసరము, ప...ను - పరాగరేఖా = పద్మరేణువులబంతియే, స్వర్ణరశనముగను = బంగారు మొలనూలుగాను, జల శాటి - జల = ఉదకము లనియెడు, శాటి = వస్త్రము, పులినంపు = ఇసుకదిన్నెయనియెడు, జఘనంబుపైన్ = కటిపూర్వభాగముమీఁదనుండి, జాఱన్ = గళితముకాఁగా, 'క్లీబేతు జఘనంపురః' యని యమరము. వ్య...ముఇడి-వ్యస్త = వేఱైనట్టి, వేతస=ప్రబ్బలిచెట్లనియెడు, భుజ=బాహువులయొక్క, స్వస్తికమిడి = స్వస్తికబంధమునుంచి, (భుజస్వస్తికమనఁగా భర్తనాలింగనమొనర్చుటకై చేయునట్టి భుజబంధవిశేషము.) తనిమతోన్ = సూక్ష్మరూపముతోడ, వెచ్చనై = వేఁడియై, త...లు-తట = తీరమందున్న, శర = ఱెల్లుపువ్వులయొక్క, ప్రతిబింబ = ప్రతిఫలనములనియెడు, హాస = నవ్వును, అళి = తుమ్మెదలనియెడు, బాష్పలు = సకజ్జలానందబాష్పములు గలవియై, కువలమధులహరిన్ - కువల= కలువలయొక్క, 'కువాలం కులం కువ' మ్మని నానార్థరూపకోశము. మధు = మకరందముయొక్క, లహరిన్ = ప్రవాహముచేతను, అబ్ధిన్ = సంద్రమును, చెంది = పొంది, హైమగతనములన్ =పురుషాయితములచేత, ఒక్కెడలన్ = ఒకొక్కప్పుడు, కూడుచున్= కలయుచును, ఉబ్బన్ పెనఁచెన్ = సముద్రుని నుప్పొంగించెను.

తా. సముద్రముయొక్క సమీపమునకుఁ గలువమకరందప్రవాహముతో వచ్చి శరత్కాలమందుఁబ్రవాహములు లేమిఁజేసి కూటమి లేకుండుటవలనఁ బ్రణయకోప

ప్రయుక్తంబైన నేత్రరక్తిమలు గల్గిన వెల్లకలువలచే నొప్పుచు నుప్పుకాలువల పోటుని యెడు హస్తములతో నొత్తుటచేత నమ్రత్వమునకు సంతసించి యొకానొకప్పుడు గూడుచుఁ బురుషాయితరతులచేత నదులు నమ్ముద్రుని సంతోషమును బొందించెను. (ఈపద్యమునకుఁ బెక్కండ్రు పెక్కువిధములుగ నర్థవర్ణనంబులు చేయుదురు. అవి యన్నియు మిగులరసయుక్తంబులుగా నుండునందున గ్రంథవిస్తరభీతిచేత నిందు పేక్షింపం బడియె. పురుషాయితలక్షణము. 'నటదుత్తుంగపయోధరంబు గతమందాక్షక్రియో దారమ, స్ఫుటనాగంతురమక్షికోణనివసత్స్వేషదర్పంబునం, ఘటితాలింగనవామనీ కృతకుచాగ్రప్రోథరోమాంచమై, విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనావీరాయితం బెంతయున్.' అని నరసభూపాలీయమున నున్నది.) రూపకాలంకారము.

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృతక్షత్త్రధర్ముండు గావున దిగ్విజయయాత్ర ధర్మం బని యానీతబలషట్కంబు నాకృష్టసామంత రాట్కంబుగా వెడలి. 184

టీ. ఇట్లు = ఈయుక్తక్రమంబున, శరత్సమయంబు = శరదృతువు, ఎసంగినన్ = ఒప్పఁగా, (యామునాచార్యుండు), అంగీకృత = అంగీకరింపఁబడిన, క్షత్త్రధర్ముండు గావునన్ = క్షాత్త్రములుగలవాఁడౌటచేత, దిగ్విజయయాత్ర - దిక్ = తూర్పు మొదలగు దిశలయొక్క, విజయ = గెలుపునిమిత్తమై, యాత్ర = తర్లిపోవుట, ధర్మంబని = న్యాయ మని, ఆనీత = పిలువంబడిన, బలషట్కంబు = షడ్విధం బైన సైన్యము గలుగునట్లును (మౌల్యభృత్యాదిరూపముగ బలము షడ్విధము.) శ్లో. షడ్విధం బలమాదాయ ప్రతస్థే దిగ్జిగీషయా' యని కాళిదాసుని ప్రయోగము. ఆకృష్ట = ఆకర్షింపఁబడిన, సమస్త = ఎల్ల వారైన, సామంతరాట్కంబుగాన్ = తనదేశమునకుఁ జుట్టుప్రక్కల నుండురాజులు గల్గునట్లును, వెడలి = యుద్ధయాత్రకు బయలువెడలి.

మహాస్రగ్ధర. గజఘోటస్యందనాళీకబళితధరణింగాద్రవేయాధిరాణ్మూ
ర్ధజరత్నశ్రేణు లంతర్మణులసవతులై క్ష్మ మ్రగ్గఁ బాదాంతకుంత
ధ్వజవాతాఘాతఘూర్ణద్ధ్వనధులరవభుగ్లాస్యాదృశ్యము ల్మీఱఁగాఁ ద
ద్ద్విజరాజన్యుండు విద్విడ్ద్విదళన మనిఁ గావించె దిగ్జైత్రయాత్రన్.

టీ. గ...ణిన్ - గజ = ఏనుగులయొక్కయు, ఘోట = గుఱ్ఱములయొక్కయు, స్యందన = అరదములయొక్కయు, ఆళీ = సమూహముచేత, కబళిత = మ్రింగఁబడిన, ధరణిన్ = భూమియందు, కా...ట్ - కాద్రవేయ = పాములకు, అధిరాట్ = దొరయయిన శేషునియొక్క, మూర్ధజ = తలలయందుఁబుట్టిన, రత్నశ్రేణులు = రత్నాలపట్టికలు, అంత

ర్ణ ఖులసవతులై=భూమి రత్నగర్భ గనుకఁ దా మాభూమిలో నున్నరత్నములలో సమాన ములై యనుట.) ప్రగ్గక్ = అవిలిపోఁగా, పా...ల్ - పాదాత = పదాతిసేనాసంబంధి యైన, కుంత = ఈటెలయందున్నటువంటి, ధ్వజ = టెక్కెపుబట్టలయొక్క, వాత = గాలి యొక్క, ఆఘాత = తాఁకుడుచేతను, ఘూర్ణత్ = పొంగుచున్నటువంటి, వనధుల=సము ద్రములయొక్క, రవకుల్ = ధ్వనులు, వాద్యముల్ = మద్దెల, డోలు, వీణె, సన్నాయి మొదలగువానిని, మీఱఁగాక్ = అతిశయింపఁగా, తద్విజరాజన్యుండు = విప్రుఁడైన యారాజు, (యామునాచార్యుఁడనుట.) దిగ్జైత్రయాత్రక్ = దిగ్విజయయాత్రయందు, అనిక్ = యుద్ధమందు, విద్విడ్విదళనముక్ = పగతురయొక్కసంహారమును, కావించెక్ = ఒనర్చెను.

క. జన్నములు చేసి దానము
లన్నానాదేశవిప్రులకుం దనిపి సుసం
పన్నత ననిశము బహుభో
గోన్నతుఁడై యాదమఱచి యుండె నశంకన్. 186

టీ. జన్నములు = యజ్ఞములు, చేసి = కావించి, దానములక్ = ఉదకధారా పూర్వకంబుగ నిచ్చినయావులచేతను, నానాదేశవిప్రులక్ = బహుదేశములనుండివచ్చిన బ్రాహ్మణులను, తనిపి = తృప్తినొందించి, సుసంపన్నతక్ = సకలసమృద్ధిగలవాఁడౌట చేత, అనిశముక్ = ఎల్లప్పుడును, బహుభోగోన్నతుఁడై = ఎక్కుడైనసుఖములచే నతిశ యించినవాఁడై, అశంకక్ = వెఱపులేనట్లు, ఆదమఱచి = పరాకునొంది, ఉండెక్ = వసించెను. రాజ్యమోహముచేత జ్ఞానభక్తివైరాగ్యములు మఱచి యుండె ననుట.

వ. మఱియు నతనిరాజ్యంబునఁ గసవుఁ గఱచి చే యెత్తి మొఱఁ బెట్టుట కరులయందె, యట్టునట్లువడ మెడఁ బట్టిత్రోయుట వెడ వెడం బోవుపల్లవులం బండువతలంటులకు నింటికిం దెచ్చుపణ్యాంగ నాభ్రాతల పరిహాసచేష్టలయంద, సున్నము మెత్తుటయుం బట్టుకొరు లంబట్టుటయు సౌధసౌవర్ణభూమాది నిర్మాణంబులయంద, కానెచట్టుట యుఁ గత్తి గట్టుటయుఁ గ్రికవాకులకలహంబులయంద, యతులక్ష్య తులనాదిఘర్షణాదిదోషంబులు జాంబూనదపరీక్షాదులయంద, యే దేనియుం గన్ను వేయుట మృదంగాదివాదిత్రంబులయంద, ధాతు వాదంబులు తెఱ చగుట శాబ్దికులయంద కాక, యితరస్థలంబుల లే కుండ రాజ్యపరిపాలనంబు సేయుచుండె. 187

టీ. మఱియున్ = వెండియు, అతనిరాజ్యంబునన్ = అయ్యామునాచార్యుని దేశమందు, కసవుఁగఱచి = తృణముగఱచి, చేయెత్తిమొఱఁబెట్టుట = హస్తమును పైకెత్తి యెలుఁగిడుట, కరులయందు = ఏనుంగులయందె, (చెయ్యనఁగాఁగరము, అది గలది కరి యని వ్యవహారము.), అట్లునట్లుపడన్ = అయాలాగునఁ బతనమగునట్లు, మెడ బట్టి త్రోయుట = గళముఁబట్టి యావలికిం ద్రొబ్బుట, వెడవెడంబోవు = మెల్లమెల్లనెనడచుచున్నట్టి, పల్లవులన్ = విటులను, 'షిడ్గఃపల్లవికో విటః' యని యమరము. పండువతలంటులకున్ = సంవత్సరాదిపండువు మొదలగు సంతోష దినములయం దభ్యంగము సేయుట కొఱకు, ఇంటికిందెచ్చు = గృహమునకు రావించుచున్న, పణ్యాంగనాభ్రాతల = వేశ్యాసహోదరులయొక్క, పరిహాసచేష్టలయందు = ఎగతాళివ్యాపారములయందె, సున్నము మెత్తుటయున్ = సుధాలేపమును, పట్టుకాఱులంబట్టుటయు = కంసాలవానికొఱముట్లలో నొకవిధమైనవాని చేతంబట్టుటయు, సౌధసౌవర్ణభూషాదినిర్మాణంబులయందు - సౌధ = మేడలయొక్కయు, సౌవర్ణ=సువర్ణమయములైన, భూషాది = ఆభరణాదులయొక్కయు, నిర్మాణంబులయందు = చేయుటయందె, (సున్నముఁబూయుట మేడలకును, బట్టుకారులం బట్టుట స్వర్ణభూషాదులకు ననుట,) కాసెచుట్టుటయున్ = లాఁగుమీఁద గోకకట్టుటయు, కత్తిగట్టుటయున్ = ఖడ్గబంధనమును, కృకవాకులకలహంబులయందు = కుక్కుటయుద్ధంబులయందె, అ...లు - అతుల్య = సరిగానివస్తువుతో, తులనా = తూఁచుట, (పోల్చుట యని యొకయర్థము.) ఆది = లోనగు, ఘర్షణాదిదోషంబులు = ఒరయుట మొదలైనవి, జాంబూనదపరీక్షాదులందు = స్వర్ణశోధనాదులయందె, 'రుక్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదోస్త్రియామ్' మ్మని యమరము. ఏదేనియున్ = ఏవస్తువునైనను, కన్నువేయుట = అభిలాషపడుట, మృదంగాది వాదిత్రంబులయందు = మద్దెలమొదలగు వాద్యములయందె, (మద్దెలకు వేయునట్టికన్ను కరణి యని చెప్పఁబడును.) 'చతుర్విధమిదం వాద్యం వాదిత్రాతోద్యనామక' మ్మని యమరము. ధాతువాదంబులు దఱచగుట = మోసములు మెండగుటయు, భూవాదిధాతువులవిషయమైనవాదములు విస్తరిల్లుటయును, శాబ్దికులయందకాక = వైయాకరణులయందెకాని, (ఈ కాకయనుపద మన్ని సావధారణసప్తమ్యంతములతో నన్వయింపవలసినది.) ఇతరస్థలంబులన్ = వేఱుచోట్లను, లేకుండన్ = లేక యుండునట్లు, రాజ్యపరిపాలనంబు = ప్రజాపాలనము, చేయుచుండెన్ = ఒనరించుచుండెను.

తే. తత్పితామహుఁ డైననాథముని శిష్యుఁ
డైనశ్రీపుండరీకాక్షు ననుఁగుశిష్యుఁ
డైన శ్రీరామమిశ్రాఖ్యుఁ డార్తిఁ దనదు
పరమగురుపౌత్త్రునకు నిట్టి బంధ మెట్లు. 188

టీ. తత్పితామహుఁడు=అయ్యామునాచార్యునికిఁదండ్రితండ్రి, అయిన = అయినటువంటి,నా...డు-నాథముని=శ్రీమన్నాథమునికి, శిష్యుఁడు = అంతేవాసి, అయిన = అయినట్టి, శ్రీ...డు-శ్రీపుండరీకాక్షు = యోగియగునప్పుండరీకాక్షునకు, (ఈయన పేరు ద్రవిడభాషయందు ఉయ్యక్కొండా రని యందురు.) అనుఁగుశిష్యుఁడు = ప్రియచ్ఛాత్రుఁడు. 'ఛాత్రాంతేవాసినౌ శిష్యేః' యని యమరము. అయిన = అయినటువంటి, శ్రీరామమిశ్రాఖ్యుఁడు = శ్రీరామమిశ్రుం డను నామముగలయోగి, (ద్రవిడభాషచేత నీయన పేరు మణక్కాల్ నంబి యందురు) ఆర్తిక్ = బాధచేత, తనదు = తనకు, పరమగురు = పరమాచార్యుఁడైన నాథమునికి, పౌత్త్రునకు = మనుమఁడైన యామునాచార్యునకు, (ఇందున కుదాహరణము. శ్లో. పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా' యని యామునాచార్యుని ప్రయోగము. అనుంగుశిష్యుఁడై శ్రీరామమిశ్రాఖ్యుఁ డన్న చో శ్రీరామమిశ్రునికి నాచార్యుఁడు శ్రీపుండరీకాక్షుండు, ఆయనకు నాచార్యుఁడు శ్రీమన్నాథముని గనుక నాయన యాచార్యునకు నాచార్యుండు పరమాచార్యుండు గానఁ బరమగురు పౌత్త్రుఁ డని ప్రయోగింపఁబడెను.) ఇట్టి బంధ మెట్లు = ఇటువంటి రాజ్యప్రాప్తిరూపమైన ప్రతిబంధక మేలాగు సంభవించెను?

వ. యోగసామ్రాజ్యంబు మఱచి సామ్రాజ్యంబునం దాసక్తుఁ డయ్యె
నట్టిమహాత్మువంశంబునం బుట్టినట్టి యితం డి ట్లగుట యతివ్యతి
క్రమంబు. 189

టీ. యోగసామ్రాజ్యంబుమఱచి = ఐశ్వర్యరూపమైనశక్తియోగ ప్రపత్తియోగములను విడిచి, సామ్రాజ్యంబునందాసక్తుండయ్యెక్ = సమ్రాట్టుయొక్క భావము సామ్రాజ్యము, 'శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞస్స సమ్రా' ట్టని యమరము. అట్టిమహాత్మువంశంబునంబుట్టినట్టి = అటువంటి మహాపురుషుని కులమునందు జన్మించిన, ఇతండు = ఈ యామునాచార్యుండు, ఇట్లగుట = రాజ్యాసక్తుండౌట, అతివ్యతిక్రమంబు=మిగుల నతిక్రమము.

సీ. వృషశైలఝురవారిఁ ద్రిషవణస్నానంబు
నిష్ఠఁ గావించి యాహ్నికముఁ దీర్చి
యేకాంతగుహా తత్తటీకుశాసనమున
నుండి లక్ష్మీశాంఘ్రిపుండరీక
మంకురత్పులక హర్షాశ్రువై దహరపు
ష్కరమున భావించి సవిత దిరుగ

యజ్ఞోపవీతపద్మాక్షమాలికతోడి
 యోగపట్టికఁ గూడి యురము మెఱయ
తే. శౌరిఁ దద్ధరణీధ్రవాస్తవ్యుఁ గొలిచి
 సతియు నాలర్కశాకమంచితము వండ
 నిల్లునకుం దున కర్పించి వేల్మిఁ దీర్చి
 యిట్లు తనుయాత్ర నడపు మున్నితనితాత. 190

టీ. వృషశైలఝరవారిన్—వృషశైల=ఘటికాచలముయొక్క, (దీనికి ద్రవిడభాష యందు అళగర్ తిరుమల యని నామము. నారాయణాద్రివృషభాద్రి వృషాద్రి యని పర్యాయములుగాను వ్యవహారము గలదు.) ఝరవారిన్ = సెలయేటియుదకమందు, త్రిషవణస్నానంబు = మూఁడువేళలయందు జలకములాడుటను, నిష్ఠన్=నియమముచేత, కావించి = చేసి, ఆహ్నికమున్ = సంధ్యావందనాది కృత్యమును, తీర్చి = ఒనర్చి, ఏ...హన్—ఏకాంత = రహస్యమైన, గుహా = గుహలుగల, తత్ = ఆ వృషశైలము యొక్క, తటీ = చఱియందు, కుశాసనమునన్=దర్భాసనమునందు, ఉండి = కూర్చుండి, లక్ష్మీశ = శ్రీపతియొక్క, అంఘ్రిపుండరీకము = పాదపద్మమును, అంకురత్ = మొలచు చున్న, పులక = రోమాంచమును, హర్షాశ్రువై ఆనందబాష్పములు గలవాఁడై, దహరపుష్కరమునన్ = హృత్పుండరీకమందు, 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండ ముఖే జలే, వ్యోమ్ని ఖడ్గే జలే పద్మే తీర్థౌషధివిశేషయోః' అని యమరము. భావించి = ధ్యానించి, సవితదిరుగన్=ప్రొద్దు పడమటికి మళ్లఁగా, యజ్ఞోపవీత = జంధెముతోడను, పద్మాక్షమాలికతోడి = తామరపూసలతోడను గూడిన, (ఇది తులసిపూలదండల కుప లక్షణము. శ్లో. 'యే కంఠలగ్నతులసీనళినాక్షమాలా యే బాహుమూలపరిచిహ్నితశంఖ చక్రాః, యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాస్తే వైష్ణవా భువనమాశు పవిత్రయంతి' యని యున్నది. యోగపట్టికన్ = యోగులు జంధెముగా వేసికొనునట్టి యల్లికపట్టు పట్టెడను, కూడి = కలిసి, ఉరము = ఱొమ్ము, మెఱయన్ = వెలుంగఁగా, తద్ధరణీధ్ర = ఆ వృషశైలమందు, వాస్తవ్యున్ = ఉన్నటువంటి, శౌరిన్ = సుందరబాహువును, కొలిచి = సేవించి, సతియున్ = నాథమునిభార్యయును, అంచితము = ఒప్పైన, అలర్కశాకము = ముండ్లముస్తెకూరను, వండన్ = పచనముఁ జేయఁగా, ఇల్లునకుందు నకున్ = తనయింట నారాధింపఁబడు కమలనాభునకు, అర్పించి = సమర్పణముచేసి, వేల్మిన్ = ఔపాసనాదిహోమములను, తీర్చి = ఒనర్చి, మున్ను = పూర్వమందు, ఇతనితాత = ఈయామునాచార్యునికిఁ బితామహుండైన శ్రీమన్నాథముని, ఇట్లు = ఉక్తక్రమంబుగా, తనుయాత్రన్ = శరీరయాత్రను, నడపున్ = కడపును.

క. తొడిఁబడి *విషయాతురు నవి
విడువు మనుటకంటెఁ గలదె ? వేఱేపగ నే
ర్పడరఁ గథాదుల నొకవెం
బడి దోఁపం బలికి మైత్రి ? వాపుట యొప్పున్. 191

టీ. తొడిఁబడి = త్వరపడి, విషయాతురున్ = స్రక్చందనాదివిషయముల యందాసక్తుఁడైన వానిని, అవి = ఆ విషయములను, విడువు మనుటకంటెన్ = విడిచి పెట్టుమనుటకంటె, వేఱేపగ = అన్యమైనవిరోధము, కలదె = ఉన్నదా, (లే దనుట.) నేర్పు = చతురత్వము, అడరన్ = ఒప్పఁగా, కథాదులన్ = భారతాదికథలయందు, ఒకవెంబడితోఁపన్ = ఏదేనొకక్రమముదోఁచునట్లు, పలికి = తెలిపి, మైత్రి = విషయ ములయందున్న స్నేహము, పాపుట = వదల్చుట, ఒప్పున్ = తగును.

క. వసుధం బుత్త్రాదికదు
ర్వ్యసనము సైతము దండ్రి ? వారించుటకున్
వసపడ దఁట మఱి రాజ్య
వ్యసనము వారింప నెంతవాఁ డెవ్వాఁడున్. 192

టీ. వసుధన్ = భూమియందు, పుత్త్రాదిక = సుతులు మొదలగువారియొక్క, దుర్వ్యసనము సైతమును = స్త్రీద్యూతాదిచింతయైనను, తండ్రి = జనకుఁడు, వారించు టకున్ = నివర్తింపఁజేయుటకు, వసపడదఁట = శక్యము గా దఁట, మఱి = ఇఁకను, రాజ్యవ్యసనమున్ = దొరతనపుఁజింతను, వారింపన్=నివర్తింపఁజేయుటకు, ఎవ్వాఁడున్= ఎవ్వఁడును, ఎంతవాఁడు = ఎంతటివాఁడు, (ఎట్టివాఁడైనను మాన్పలేఁ డనుట.)

ఆ. నల్లఁ గ్రోల నిచ్చి ? మెల్లనె చివ్వంగి
నోరి జింకఁ దివియు ? నేరు పొదవు
వేఁట కాఁడువోలె ? విషయాళివలనఁ ద
త్తృష్ణఁ దీఱ నిచ్చి ? త్రిప్ప టురువు. 193

టీ. నల్లన్=రక్తమును, క్రోలనిచ్చి = త్రావనిచ్చి, మెల్లనె=తడవుగానె, చి... కన్ - చివ్వంగి=తరక్షువుయొక్క, నోరి = నోటియందున్న, జింకన్ = లేడిని, తి...

* విషయాతురున్ = శబ్దాదులయిన యింద్రియార్థములచేత - రోగియైనవానిని అని వే. టీ. శ. ర. లో 'ఆతురుఁడు = వ్యాధిగ్రస్తుఁడు, తెవులుగొంటు' అని యున్నది. ఉండుఁగాక; దానిమీఁదనే ఆధారపడి - 'విషయ+ఆతురున్ = విషయములచేత - రోగి యైనవానిని' అని యర్థము చెప్పఁగూడదు. విషయములయందు, - ఆతురున్ = ఆసక్తిగల వానిని - అని చెప్పవలెను. "ఆతుర Eager, over anxious" - అప్టె.

లెన్ - తివియు = తీయునట్టి, నేరుపాదవు = నైపుణ్యముగల్గినట్టి, వేటకాఁడు వోలెన్ = మృగయునివలె, విషయాళివలనన్=శబ్దాదివిషయసమూహమందు, తత్తృష్ణన్ = ఆ యామునాచార్యునియొక్క యాశను, తీరనిచ్చి = ముగియనిచ్చి, త్రిప్పుట=మళ్లించుట, ఊరువు = మంచిది.

వ. కావున నెట్లయిన నితని నింక నుపేక్షింప రా దుపాయంబునఁ
జొచ్చి యొక్కరీతిం ద్రిప్ప వలయు నుర్వి నాహారదోషంబె విజ్ఞాన
నాశంబునకు మూలం బని వితర్కించి. 194

టీ. కావునన్, ఎట్లయినన్ = ఏలాగైనను, ఇతనిన్ = ఈయామునాచార్యుని, ఇంకన్ = ఇఁకమీఁదను, ఉపేక్షింపరాదు. (అలక్ష్యముసేయరాదు.) ఉపాయంబునఁ జొచ్చి = నేర్పుతోఁబ్రవేశించి, ఒక్కరీతిం ద్రిప్పవలయున్ = ఒకానొకప్రకారముచేత మళ్లింపవలయును, ఉర్విన్ = భూమియందు, ఆహారదోషంబు = భోజనమువలనిదోషంబు (అనఁగాఁ బాప మనుట. ఆశ్రయనిమిత్తజాతస్వరూప దుష్టాహారవర్జనంబువలనఁ గాయ శుద్ధియనియున్నదిగావున), విజ్ఞాననాశంబునకున్=మతిచెడుటకు, మూలం బని= కారణం బని, వితర్కించి = ఊహించి.

క. ముల్లుదలకొననినవకపుఁ, బల్లవములతోడ ముక్తి భామచెవులకుం
బల్లేరుఁబువ్వులగుపువు,లుల్లసిలునలర్కశాక మొదుగుగఁగొనుచున్.

టీ. ముల్లుదలకొనని=కంటకముపుట్టని, నవకపు = లేఁతలైన, పల్లవములతోడన్ = చిగుళ్లతో, ము...కున్ - ముక్తిభామ = మోక్షాంగనయొక్క, చెవులకున్ = కర్ణములకు, పల్లేరుఁబువ్వులగు, (అనఁగాఁ బల్లేరుపువ్వులనెడు భూషణములవలెనున్నవియనుట.) పువులు = పుష్పములు, ఉ...ము-ఉల్లసిలు=ఒప్పుచున్న, అలర్కశాకము = ముండ్లముస్తె కూర, ఒదుగుగన్=విస్తారముగా, కొనుచున్ = సంగ్రహించికొనుచు, శ్లో. 'అయత్నతో యామున మాత్మదాస మలర్క పత్త్రార్పణ నిష్క్రయేణ, యః క్రీతవా నాస్థితయావ రాజ్యం నమామి తం రామ మమేయసత్త్వమ్' అని ప్రసిద్ధము.

తే. తెచ్చి యొకవైష్ణవుఁడు గాను కిచ్చె ననుచు
బానసపుబాడబులచేతఁ బంపుటయును
నతఁడు ప్రియపడి వండించి యారగింపఁ
దెచ్చు నిచ్చఁ గొన్నాళ్లిట్లు దెచ్చుచుండ. 196

టీ. ఒకవైష్ణవుఁడు=ఒకవిష్ణుభక్తుఁడు, తెచ్చి = తీసికొనివచ్చి, కాను కిచ్చె ననుచున్ = ఉపహారమొసంగెనని, బానసపుబాడబులచేతన్ = వంటబ్రాహ్మణులచేతను, పంపుటయును = అంపఁగా, 'అథద్విజాత్యగ్రజన్మభూదేవ బాడబాః' అని యమరము,

అతఁడు=అయ్యాముసాచార్యుండు, ప్రియపడి = ఇష్టపడి, వండించి=పచనము చేయించి, ఆరగింపఁగ = భోజనము చేయఁగా, ఇచ్చఁగ = ప్రియముతో, తెచ్చఁగ = మరలఁదెచ్చి యిచ్చును. కొన్నాళ్లు = కొన్ని దినములు, ఇట్లు = ఈప్రకారముగా, తెచ్చుచుండఁగ = తెచ్చియిచ్చుచుండఁగా.

వ. ఒక్కనాఁ డతండు భోజనసమయంబున సకలశాకాస్వాదనంబు సేయుచు వచ్చి తచ్ఛాకంబు నంజుచుం దలంచుకొని యేతదానీత యగుభాగవతు భోజనానంతరంబ మమ్ముం గాన్పింపుం డనిపలికి పాణిప్రక్షాళనాచమనానంతరంబ యతనిం గాన్పించుకొని నమస్కరించి వచ్చిన ప్రయోజనం బడుగుటయు నతం డి ట్లనియె. 197

టీ. ఒక్కనాఁడు = ఒక్కదినమునందు, భోజనసమయంబునఁగ = ఆరగింపుతఱి, స...బు - సకల=సమస్తమైన, శాక=వ్యంజనములయొక్క, ఆస్వాదనంబు = రుచిచూచుటనుచేయుచు, వచ్చి=క్రమముగావచ్చి, తచ్ఛాకంబుఁగ = ఆముండ్లముస్తెకూరను, నంజుచుఁగ = ఆస్వాదించుచును, తలంచుకొని=జ్ఞప్తితెచ్చుకొని, ఏతదానీతయగు = ఈకూర దెచ్చినట్టి, భాగవతుఁగ = భగవద్భక్తుని, భోజనానంతరంబ = ఆరగించినవెనుకనే, మమ్ముం గాన్పింపుం డని = మమ్ముఁ గనుఁగొనఁజేయుం డని, పలికి = నుడివి, పాణిప్రక్షాళనాచమనానంతరంబ = చెయిగడిగి యుపస్పర్శముచేసినపిమ్మటను, అతనిం గాన్పించుకొని= ఆమహాభాగవతునిం గానిపింపఁజేసికొని, నమస్కరించి = సేవించి, వచ్చిన ప్రయోజనం బడుగుటయు = ఆగమనకార్యమును బృచ్ఛసేయఁగా, అతండు = ఆ శ్రీరామమిశ్రుఁడు, ఇట్లనియెఁగ = వక్ష్యమాణక్రమంబునం బలికెను.

క. మీ పెద్దలు గూర్చిననిక్షేప మొకటి సహ్యజనితసింధుజలాంత
ర్ద్వీపమున నుండ నీకుం, జూపంగా వచ్చితిని వసుమతీనాథా. 198

టీ. వసుమతీనాథా=ఓయిరాజా ! మీ పెద్దలు = వృద్ధులయిన మీపితృ పితామహాదులు, కూర్చిన = కూడఁబెట్టినట్టి, భక్తిచేత సేవించినట్టియు, నిక్షేపమొకటి = ప్రాఁతిపెట్టినయొకనిధి, స...నఁగ - సహ్య = సహ్యపర్వతమునందు, జనిత = పుట్టినటువంటి, సింధు = కావేరియొక్క, జలాంతః = ప్రవాహద్వయమధ్యమున నున్న, ద్వీపమునఁగ = దీవిగడ్డయందు, ఉండఁగ=ఉండఁగా, నీకుఁగ = నీకు, చూపంగాఁగ = కనుపఱచుటకొఱకు, వచ్చితిని = విచ్చేసితిని.

క. నా కేటికి నిక్షేప మ్మనాకు నిధియు నాకరంబు గీ నరనాథులసొ
మ్మేకాన విన్నవించెద, నాకర్ణింపుము తదీయమగువిధ మెల్లన్. 199

టీ. నిక్షేపము = ధననిధి, నాకేటికిఁ = నాకెందులకు, అనాకు=అనిపలుకకుము, నిధియుఁ = నిక్షేపమును, ఆకరంబుఁ = గనియును, నరనాథులసొమ్మేకానఁ =రాజుల ద్రవ్యమేగనుక, విన్నవించెదఁ = తెలిపెదను, దదీయమగు = ఆనిక్షేపసంబంధియైన, విధమెల్లఁ = స్వరూపమంతయును, ఆకర్ణింపుము = వినుము.

సీ. స్ఫటల మణు ల్మీఱ శాంతమై శ్వేతమై
నట్టి త్రాఁచొక్కటి చుట్టియుండు
రక్షోగృహీత మనఁ బ్రథ తొల్లి గల దది
పొలయ దందేఁడాఱునెలలు గాని
యేపాటిబలి యైనఁ జేపడుఁ బ్రాణిహిం
సాదిపూజనముల కాసపడదు
తనవెలుం గొగి నిరంజనదృష్టికినె లక్ష్య
మై యుండు నయ్యు నింతంత గాదు
తే. రత్న మొక్కటిపై నపూర్వంబు మెఱయుఁ
గలదు పద్మంబు శంఖంబు పలుకు లేటి
కక్షయ మనంత మాద్య మేకాంతమందు
భూప నీ కొక్కనికె కాక చూపరాదు. 210

టీ. స్ఫటలఁ = పడగలయందు, మణులు = రత్నములు, మీఱఁ = అతిశయింపఁగా, 'స్ఫటాయాంతు ఫణాద్వయోః' అని యమరము. శాంతమై = ఓర్పుగల్గినదై, శ్వేతమైనట్టి = తెల్లనైనటువంటి, త్రాచొక్కటి = ఒకకృష్ణసర్పము, చుట్టియుండుఁ = పరివేష్టించియుండును (ధనక్షేపమును సర్పము చుట్టికొనియుంట ప్రసిద్ధముగానఁ బ్రకృతమందు రంగనాయకుని యామునాచార్యునియొక్క పూర్వు లుంచిన నిక్షేపముగా రూపించిచెప్పినందున ద్వ్యర్థిగా శ్రీరంగేశ్వరునియందలి ధర్మములను నిధి ధర్మములు గాను, నాయన శేషశాయి యగుటవల్ల సర్పావతారములకు నిధు లని వ్యవహారము గలదు గనుక నట్టి నిక్షేపమునకు సర్పము చుట్టికొనియున్నట్లును జెప్పుట యుక్తము.) ర...ము - రక్షః = రక్కసునిచేత, గృహీతము = స్వీకరింపఁబడ్డది, అఁ = అనెడు, ప్రథ=ప్రసిద్ధి, తొల్లి=పూర్వమునందు, కలదు=కద్దు, అది = ఆప్రసిద్ధి, అందుఁ = ఆనిధియందు, ఏఁడు = సంవత్సరమునకైనను, ఆఱునెలలుగాని = షణ్మాసములకుంగాని, పొలయదు=పొందదు (నిక్షేపమునకు రాక్షసగృహీతత్వముండునుగనుక నట్లిక్కడ శ్రీరంగనాయకుఁడు పూర్వము విభీషణునిచేత స్వీకరింపఁబడిన విభీషణుఁ డాఱుమాసములకు నొకపర్యాయముగాని సంవత్సరమునకు నొకపర్యాయముగాని పూజయొనర్చు

చుండుట ప్రసిద్ధముగాన నిప్పుడా నిక్షేపమునకు రాక్షసగృహీతత్వము నిరంతరము లేదు సులభముగా గ్రహింపవచ్చుననుట.) ఏపాటిబలియైనన్ = నిశ్చలచిత్తుఁడై యెంత మాత్రముపూజచేసినను, చేపడున్ = అనుగ్రహించును. 'బలిః పూజోపహారయోః' అని యమరము. ప్రాణి = జంతువులయొక్క, హింసాది = కాయక్లేశాదులవలన, పూజనము లకున్=అర్చనలను (ద్వితీయార్థమందుషష్ఠి), ఆసపడదు = అపేక్షింపదు (లోకమునందు నిక్షేపమును బొందువారలు ప్రాణిహింసాది బలులొసంగి దానిం గొనుట ప్రసిద్ధము గాన నట్లుగాక సూక్ష్మబలిచేత నబ్బు ననిచెప్పుటవలన సులభోపాయముచేతనే శ్రీరంగేశుఁడు ప్రసన్నుఁడౌ ననుట), తన=అనిక్షేపముయొక్క, వెలుంగు = జ్వలించుట (అనఁగాఁగను పించుటయనుట), ఒగిన్ = ప్రయత్నముచేత, నిరంజనదృష్టికినె = కాటుకఁబెట్టని కన్నులుగలవానికె, లక్ష్యమైయుండున్ = చూడఁదగినదై యుండును (ధననిక్షేపాములం జూచువారు గంటఁ గాటుకఁబెట్టిచూచుట ప్రసిద్ధమైనను నీనిక్షేపమును జూచుటకు నది యక్కఱలేదనుట), తనవెలుంగు = స్వప్రకాశము, ఒగిన్ = యత్నముచేత, నిరంజన = బంధరహితమైన, దృష్టికినె = జ్ఞానముగలవానికె, లక్ష్యమైయుండున్ = చూడఁదగి నదైయుండును (కేవలచర్మచక్షుస్సులకు గోచరము గాదనుట), అయ్యున్ = కనుపించున దయ్యును, ఇంతంతగాదు = ఇంతమాత్రమని లెక్కింపరాదు, (అనిధి యింత యనియు శ్రీరంగనాయకులమహిమం బింతయనియుం జెప్ప శక్యంబుగాదనుట), పైన్=అనిక్షేపము మీఁదను, రత్నమొకటి = ఒకమణి, మెఱయున్ = వెలుగొందును, శంఖంబుపద్మంబు = శంఖపద్మాది సంఖ్యగలద్రవ్యము, కలదు = కద్దు (శ్రీరంగనాథునియందు శంఖము నాభి యందు పద్మముండుట ప్రసిద్ధము.) పలుకు లేటికి = మాటలెందుకు, అక్షయము = నాశ రహితము, అనంతము = అంతములేనిదియు, దేశకృతకాలకృతపరిచ్ఛేదములేనిదియు, ఆద్యము=బహుకాలముగనుండియున్నదియు, సర్వభూతాదియు, ఏకాంతము = రహస్య మైనదియును, అందున్ = అని చెప్పెదను, భూప = ఓయివిప్రప్రభుఁడా, నీకొక్కనికె కాక = నీకుమాత్రమేకాని, చూపరాదు = అన్యులకుఁ జూపఁగూడదు. అనఁగా నితరులు చూడఁగూడ దనుట (అసాధారణభగవద్భక్తిఖని యైన నాథముని మనుమఁడవు గనుక నీ కాయోగ్యత గల దని భావము.)

వ. అని విన్నవించిన సంతసించి సేనాసమేతుండై యతండు మున్నుగా శ్రీరంగంబున కరిగి కావేరీచంద్రపుష్కరిణులఁ దీర్థం బాడి రంగ నాథు సేవించి సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతం డి ట్లనియె.

టీ. అని = ఇట్లని, విన్నవించినన్ = విజ్ఞాపనముచేయఁగా, సంతసించి = సంతోషించి, సేనాసమేతుండై = సేనతోఁగూడుకొనినవాఁడై, అతండు=ఆ శ్రీరామమిశ్రుఁడు, మున్నుగాన్ = ముందుగాను, శ్రీరంగంబునకరిగి = శ్రీరంగ మను దివ్యక్షేత్రమునకు వెళ్లి, కావేరీ చంద్రపుష్కరిణులన్ = కావేరీ చంద్రపుష్కరిణులయందు, తీర్థమాడి = స్నానముఁజేసి, రంగనాథున్ = రంగనాయకుని, సేవించి = నమస్కరించి, సాభిప్రాయంబుగాన్ = అకూతసహిత మగునట్లు, అతనిన్ = ఆ శ్రీరామమిశ్రుని, కటాక్షించినన్ = చూడఁగా, అతండు = ఆ శ్రీరామమిశ్రుఁడు, ఇట్లనియెన్ = వ్యక్ష్యమాణక్రమంబుగఁబలికెను.

క. మీ పెద్దలు గూర్చినని
క్షేప మ్మిది గొమ్మటంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁ జూపిన
నాపృథివీపతిహఠాదపాస్తభ్రముఁడై. 202

టీ. మీ పెద్దలు = మీపూర్వికులయిన నాథమునిప్రభృతులు, కూర్చిన = సంపాదించిన, నిక్షేపమ్ము = ధననిక్షేపము, కొమ్మటంచున్ = దీనింబరిగ్రహింపు మని, శ్రీరంగపతి = శ్రీరంగనాయకునియొక్క, శ్రీపదయుగ్మమున్ = శోభాయుక్తమగు పదద్వంద్వమును, చూపినన్ = కనుపింపఁజేయఁగా, ఆపృథివీపతి = ఆయామునాచార్యుఁడు, హ...డు ఐ-హఠాత్ = అదరుపాటున, 'ప్రసహ్యతుహఠార్థక' యని యమరము. అపాస్త = పోఁగొట్టఁబడిన, భ్రముఁడై = భ్రాంతిగలవాఁడై.

వ. గ్రక్కునఁ దనపూర్వదశఁ దలంచి యిన్నాళ్లు దనప్రమాదంబునకుం బరమ నిర్వేదన నొంది నీ వెవ్వండ వనుటయు, నే మీపితామహుం డగునాథముని ప్రశిష్యుండ, నయ్యోగివరుండు భావిభవజ్ఞుండై చెలంగి భాగవతవతంసంబ వగునీచేత నిర్విశిష్టాద్వైతంబు సకలభూతహితంబుగా వెలయం గల యది యని నిశ్చయించి నీకు ద్వయంబుపదేశింపు మని తన శిష్యుఁ డగు పుండరీకాక్షున కుపదేశించిన నతండు భోగాసక్తుండ వైన నిన్నుపాయంబునఁ దెలిపి నీ కుపదేశింపు మనుటయుఁ బనివింటి ననిన సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి యతనిచేతం బంచసంస్కారసంస్కృతుండై యంత నిలువక తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగుడి వచ్చి కుమారునందు రాజ్యభారంబుఁ బెట్టి బంధుమిత్త్రామాత్య సమేతం బగు బలచతుష్టయంబును బ్రకృతివర్గంబును నతని కొప్పగించి యిట్లనియె. 203

టీ. గ్రక్కునన్ = శీఘ్రముగా, తన...శన్ - తన = తనయొక్క, పూర్వదశన్ = పూర్వమైనస్థితిని, తలంచి = స్మరించుకొని, ఇన్నాళ్లు = ఇన్నిదినములు, తన= తనయొక్క, ప్రమాదంబునకున్ = మఱపునకు, పరమనిర్వేదనన్ = అధికమైన విషాదమును, ఒంది = చెంది, నీ వెవ్వండ వనుటయున్ = నీ వెవ్వండ వనఁగా, నేన్ = నేను, మీపితామహుండగు=మీతండ్రితండ్రియైన, నాథమునిప్రశిష్యుండన్ = నాథముని యొక్క యనుంగుశిష్యుఁ డయిన పుండరీకాక్షున కంతేవాసిని, ఆ యోగివరుండు = శ్రీమన్నాథముని, భా...బు - భావి = కాఁగల, భవత్ = మీయొక్క, జన్మంబు = అవతారమును, ఎఱింగి = తెలిసి, భాగవతవతంసంబవగు భగవద్భక్తశిరోభూషణంబయిన, నీచేతన్ = ఇవ్విశిష్టాద్వైతంబు (స్థూలచిదచిద్విశిష్టపరమాత్మకు సూక్ష్మచిదచిద్విశిష్టపరమాత్మకు నభేద మని చెప్పుటయే విశిష్టాద్వైతశబ్దార్థము) సక...కాన్ - సకలభూత = నిఖిలప్రాణులకును, హితంబుగాన్ = మేలగునట్లు, వెలయంగలయది = శోభింపఁగలది, అని నిశ్చయించి = అట్లనిరూఢిఁజేసి, నీకు ద్వయం బుపదేశింపుమని = నీకుమంత్రరత్నదానముఁజేయుమని, తనశిష్యుండగు పుండరీకాక్షున కుపదేశించినన్ = తనయంతేవాసియైన పుండరీకాక్షునకు ద్వయమంత్రదానము చేయఁగా, అతండు = ఆపుండరీకాక్షుండు, భోగాసక్తుండ వయిన = అర్థకామాదులయం దిచ్ఛగలవాఁడ వయిన, నిన్నున్ = నిన్ను, ఉపాయంబునం దెలిపి = నేర్పుచేత నెఱింగించి, నీకుపదేశింపు మనుటయున్ = నీకు ద్వయమంత్రదానముఁజేయు మనఁగా, శ్లో. 'నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనం చోపాయం కర్తవ్యభాగం త్వథమిథునపరః ప్రాప్యమేవం ప్రసిద్ధం; స్వామిత్వం ప్రార్థనాం చ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతా, న్మంతారం త్రాయతేచేత్యనిగతనియమం షట్పదోయం ద్విఖండః' అనిద్వయమంత్రలక్షణము. పనివింటి ననినన్ = వచ్చితిననఁగా, సాష్టాంగంబుగాఁబ్రణమిల్లి = అష్టాంగయుక్తమగునట్లు నతియొనర్చి, అతనిచేతన్ = ఆ శ్రీరామమిశ్రునిచేతను, పంచసంస్కారసంస్కృతుండై = అయిదు శోధనలచేత శోధింపఁబడినవాఁడై, పంచసంస్కారముల నఁగా, శ్లో.'తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః, అమీ పరమసంస్కారాః పరమైకాంతిహేతవః' యని దానిలక్షణము. అంతనిలుపక = అంతమాత్రముచేత విరమింపక, తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై = చతుర్థాశ్రమమునకు వచ్చుటకుద్యుక్తుండై (అనఁగా యత్యాశ్రమమున కనుట), స్కంధావారంబునకున్ = దండుదిగియున్న స్థలమునకు, మగుడివచ్చి = తిరిగివచ్చి, 'స్కంధావారోనివేశన' మ్మనినిఘంటువు. కుమారునందున్ రాజ్యభారంబుఁ బెట్టి = రాజ్యంబునఁ బుత్త్రునభిషిక్తుంజేసి, బంధుమిత్త్రామాత్యసమేతం బగు = బాంధవమిత్త్రామాత్యులతోఁ గూడియున్న, బలచతుష్టయం

బును = చతురంగసైన్యమును, ప్రకృతివర్గంబును = ప్రజాసమూహమును, అతనికిన్ = ఆకుమారునికి, ఒప్పగించి = అధీనముఁ జేసి, ఇట్లనియెన్ = వక్ష్యమాణక్రమంబునఁ బల్కెను. 'రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపిచ' యని యమరము.



క. ఏపట్టున విసువక ర
క్షాపరుఁడవు గమ్ము ప్రజల కే చిక్కి విపన్ను
ల్గూపెట్టిన విని తీర్పుము
కాపురుషులమీఁద నిడకు కార్యభరంబుల్. 204

టీ. ఏపట్టునన్ = ఏసమయమునందును, విసువక = వేసరక, ప్రజలచిక్కన్ = జనులపట్లను, రక్షాపరుఁడవు గమ్ము = రక్షణపరతంత్రుఁడ వగుము, విపన్నుల్ = ఆపద నొందినవారలు, కూపెట్టినన్ = మొఱపెట్టఁగా, విని = ఆలకించి, తీర్పుము = వారియాపదలఁదొలఁగఁజేయుము, కార్యభరంబుల్ = గొప్పపనులను, కాపురుషులమీఁదన్ = కుత్సితజనులయందు, ఇడకుము = ఉంచకుము.

తే. రాష్ట్రవర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరుదానఁ గా ర్యమె యనంగ
రాదు బ్రహ్మోత్తరము లైన ప్రజలయేక
ముఖపుఁగోర్కిఁ దదంతరాత్ముం డొసఁగఁడె. 205

టీ. రాష్ట్రవర్ధనము = ప్రజాభివృద్ధిని, (రాష్ట్ర మనఁగా దేశ మనియుం జెప్ప వచ్చును.) ఎదన్=హృదయమందు, కో...లు-కోరు=అపేక్షించుచున్నటువంటి, రాజు= ఏలికయొక్క, మేలు = వృద్ధిని, రాష్ట్రమును = ప్రజయును, కోరున్ = అపేక్షించును. దానన్=అట్లుకోరుటవలన, కార్యమె=ప్రయోజన మేమి, అనంగ రాదు = అనఁగూడదు, బ్రహ్మోత్తరములైన = బ్రాహ్మణులులోనగు, ప్రజల = జనములయొక్క, ఏకముఖపుఁగోర్కిన్ = ఒకరూపమయినకోరికను, తదంతరాత్ముండు = వారి యంతర్యామియయిన శ్రీమన్నారాయణుఁడు, ఒసఁగఁడె = ఇయ్యఁడా (ఇచ్చు ననుట.)

ఆ. ఆజ్ఞవలయు నృపతి కాభీరభిల్లాది
కంపకోల నూల నాజ్ఞ చెల్లు
నంట సార్వభౌముఁ డైన భూపతియాజ
కెల్లవారుఁ దల్ల డిల్లవలదె. 206

టీ. నృపతికిన్ = రాజునకు, ఆజ్ఞ = సెలవు, వలయున్ = వాలాయముకావలయును, ఆ...కిన్ - అభీర = గొల్లలకును, భిల్లాదికిన్ =చెంచువాండ్రు బోయవాండ్రు మొదలగువారికి, 'భేదాః కిరాతశబరపుళిందా మ్లేచ్ఛజాతయః, గోపేగోపాలగోసంఖ్య

గోధుగాభీరవల్లవాః' యని రెంటికినమరము. అంపకోలన్ = అంపకట్టుచేత, నూలన్ = దారపుంబోగుచేతను, ఆజ్ఞచెల్లునంట = ఉత్తరువుచెల్లుబడియగునంట, (అడవులయందుండెడు పశుప్రాయులైన పాళెగాండ్రుసహిత మెవనికైన నభయదానముచేసిన వాని చేత నొకయంపకట్టె గాని నూలుపోంగు గాని తమ ముద్రగా నిచ్చినపక్షమున మఱి యతనిని జోరు లంట రనిప్రసిద్ధము.), సార్వభౌముండైన = సకలభూమండలము నేలుచున్న, భూ...కున్ - భూపతి = రాజుయొక్క, ఆజ్ఞకున్ = ఉత్తరువునకు, ఎల్లవారున్ = సకలజనులు, తల్లడిల్లవలదె = వెఱువవలదా, భూమండలమునకంతయుం బ్రభుత్వముచేయుచుండు రాజున కెల్లవారును భయముతోంగూడి వశంవదులై యుండవలయును.

క. దుర్గము లాప్తద్విజవర, వర్గమునకె యిమ్ము దుర్గ సైవ త్తత్తతి క
  త్యర్గళధరాధి రాజ్యవి, నిర్గతసాధ్వసత పొడమకనిలుపకు కొండిన్.

టీ. దుర్గములు = స్థలజలగిరివనదుర్గములను, ఆ...కె - ఆప్త = ప్రియులయిన, ద్విజవరవర్గమునకె = బ్రాహ్మణోత్తమ సమూహామునకె, ఇమ్ము = ఇయ్యంగావలయును, (దుర్గాధిపత్యంబు లనుట.) దుర్గవత్ = స్థలదుర్గాదులుగల, తత్తతికిన్ = ఆద్విజబృందమునకు, అత్యర్గళ = నివారింపశక్యముగాని, ధ...తన్ - ధరాధిరాజ్య = భూమండలాధిపత్యముచేత, వినిర్గత = పోయినటువంటి, సాధ్వసత = భయముగలుగుట, పొడమన్ = జనించునట్లు, కొండిన్ = కొద్దిని, నిలుపకు = ఉంచకుము. 'భీతిర్భీస్సాధ్వసంభయం' అని యమరము.

తా. దుర్గాధిపత్యమును బొందినవాండె పాటిశత్రువు వచ్చినను వెఱవక యెదిరించుటకు యుక్తమైన బలస్తోమములం గూర్చి వానిం భరియింపుము.

ఆ. మొదలం బెనిచి పిదపం గుదియింప నెవ్వాండుం
  దనదు తొంటిహీన దశం దలంపం
  డలుగుం గాన శీల మరయుచుం గ్రమవృద్ధిం
  బెనిచి వేళవేళం బనులు గొనుము. 208

టీ. మొదలన్ = ప్రథమమందు, పెనిచి = వృద్ధిచేసి, పిదపన్ = వెనుక, కుదియింపన్ = తగ్గింపంగా, ఎవ్వాండున్ = ఎటువంటివాండయినను, త...శన్ - తనదు = తనయొక్క, తొంటిహీనదశన్ = ముందటితక్కువస్థితిని, తలంపండు = స్మరింపండు, అలుగుంగానన్ = కోపించునుగనుక (అనంగా దొర తన్నుం దగ్గించినాం డని కోపగించునుగాని తానున్న తక్కువస్థితిని దలంపం డనుట.), శీల మరయుచున్ = వానివానినడవడి కెఱింగికొనుచును, (స్వభావము ననియైనం జెప్పవచ్చును.) 'శీలం స్వభావే సద్వృత్తే'

యని యమరము. క్రమబుద్ధిఁ బెనిచి = పర్యాయముగా వృద్ధినొందించి, వేళవేళన్ = ఎల్లసమయములయందును, పనులు గొనుము = కార్యములు చేయించుకొనుము.

ఆ. అనభిజాతుఁ గీక । టాలయు నశ్రుతు
నలుకువాని బొంకు । పలుకువాని
నాతతాయి గడుసు । నన్యదేశ్యు న ధర్ము
విడుము విప్రునేల । వేఁడితేని. 209

టీ. అనభిజాతున్ = హీనకులముగలవానిని, కీకటాలయున్-కీకట = శబరపల్లి యందు, ఆలయున్ = గృహముగలవానిని, అశ్రుతున్ = పాండిత్యము లేనివానిని, అలుకువానిన్ = పిఱికిని, బొంకుపలుకువానిన్ = దబ్బరలాడువానిని, ఆతతాయిన్ = ద్రోహచింతకుని, శ్లో. 'అగ్నిదోగరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారా పహ ర్తాచ షడేతే ఆతతాయినః' యని యాతతాయిలక్షణము. గడుసున్ = అపవాద భయములేనివానిని, అన్యదేశ్యున్ = దేశాంతరస్థుని, అధర్మున్ = ధర్మశూన్యుని, విప్రున్ = ఇట్టిబ్రాహ్మణుని, ఏలవేఁడితేని = ఉద్యోగమిచ్చి పోషింపఁదలంచితివేని, విడుము = వదలుము. ఇట్టివారలు బ్రాహ్మణులైనను బహిష్కారింపు మనుట.

క. తక్కుము మిగులఁ బథిచ్యుత
పక్కణవర్ధితులఁ దొల్లి । భ్రష్టగువిప్రుం
డొక్కండలుగఁడె ప్రోచిన
కొక్కెరపై నొక్కపూట । కూటికిఁగాఁగన్. 210

టీ. మిగులన్ = మిక్కిలి, పథిచ్యుత = స్వవృత్తిభ్రష్టులై దుష్ట సంసర్గముగల, పక్కణవర్ధితులన్ = శబరవాటికలయందుఁ బెరిగినటువంటి బ్రాహ్మణులను, తక్కుము = విడువుము. తొల్లి = పూర్వమునందు, భ్రష్టగు = చెడిపోయినట్టి, విప్రుండొక్కండు= బ్రాహ్మణుఁడొక్కరుండు, ప్రోచిన = తన్నుఁగాపాడినట్టి, కొక్కెరపయిన్ = కొంగ మీఁద, ఒక్కపూటకూటికిఁగాఁగన్ = ఏకకాలాహారమునకుఁగా (మాంసార్థియై మేలు మఱచి యనుట.), అలుగఁడె = కోపింపఁడా. (ఈకథ మహాభారతమందలి శాంతిపర్వం బున రాజధర్మమందుఁ జెప్పఁబడియున్నయది.)

తా. బ్రాహ్మణుఁడై జన్మించినను మద్యమాంసముల మఱిగి భ్రష్టుఁడైనవాఁడు నిరంతరము దానికై కులాచారములు మొదలగువానియందు లక్ష్య ముంచక స్వేచ్ఛాను సారముగ వర్తిల్లుచుండును గనుక నట్టివాని కధికార మియ్యఁగూడదు.

చ. చదివి యధర్మభీరు నృప । శాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు డె
బ్బదిటికి లోను నేఁబదికి । బాహ్యమునై యరుజ న్స్వపూర్వులై

మద మత్సరరాజప్రార్థన సమాత్యతఁ గైకొని తీర్చుపాఱువా
రొదవిన నంగము ల్మిగుల నూర్జితమౌటకుఁ బూఁట చాలదే. 211

టీ. చదివి = శాస్త్రాదులం బఠించి, అధర్మభీరు నృపశాస్త్రవిధిజ్ఞతలన్ = అన్యాయభీతితోను రాజనీతి పరిజ్ఞానముతోను గూడి, వయస్సు = ప్రాయము, 'ఖగబాల్యాదినోర్వయ' యని యమరము. డెబ్బదిటికిన్=సప్తతి సంవత్సరములకు, లోనన్ = లోపుగాను, ఏఁబదికిన్ = పంచాశద్వర్షములకు, బాహ్యముగ = వెలపటిదిగాను, ఐ = కనివాఁడై, అరుజన్ = రోగములేమియందు, స్వపూర్వులై = తమ పెద్దలనాటనుండి కనిపెట్టియున్నవారై, మదమత్సర = మాత్సర్యాదులు లేక, రాజు = నృపునియొక్క, ప్రార్థనన్=వేఁడుకొనుటచేత, అమాత్యతన్=ప్రధానత్వమును, కైకొని = అంగీకరించి, తీర్చు=కార్యనిర్వాహము చేయునట్టి, పాఱువారు = బ్రాహ్మణులు, ఒదవినన్ = లభించిరేని, అంగముల్ = రాజ్యాంగములు, 'స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలానిచ, రాజ్యాంగాని' యని యమరము. మిగులన్=మిక్కిలియు, ఊర్జితమౌటకున్ = వృద్ధిబొందుటకు, పూఁటచాలదె = ఆఱదినము చాలదా, నీతిశాస్త్రమందుఁ జెప్పంబడియున్నలక్షణములుగల మంత్రి దొరికినట్లాయె నేని క్షిప్రమున రాజ్య మభివృద్ధి నొందును.

వ. అట్టిమంత్రివర్గంబు దొరక దేని. 212

శా. నీతిం దాన తలంచిచేయఁ బని గాక నీ కాకపోనీ బల
వ్రాతార్థాఢ్యత నెమ్మి నుండక యొరుం బ్రోవ న్మంత్రి యంచుం గుణా
తీతుం గుమ్మడికాయ యంత యగుము త్తైంబై మనం బేర్వ న
ట్లే తా నాతనిచేతిలో బ్రదుకువాఁడే యాఁ జూమీ మీఁదటన్.

టీ. నీతిన్=రాజన్యాయముచేతను, తాన తలంచి=తానే యోజించి, చేయన్=రాజ్యపాలన మొనరింపఁగా, పనిగానీ = కార్యముతీరనీ, కాకపోనీ = కార్యముతీరకపోనీ, బ...తన్-బలవ్రాత = సేనాసమూహముచేతను, అర్థ=ధనముచేతను, ఆఢ్యతన్ = ఒప్పియుండుటచేతను, 'ఇభ్యఆఢ్యోధనీస్వామి' యని యమరము. (ధనబలములుగల్గి స్వతంత్రుఁడై యుంటచేత ననుట.) నెమ్మినుండక=నెమ్మది నుండక, గుణాతీతున్ = సద్గుణముల నతిక్రమించినట్టి (అనఁగా గుణశూన్యుఁడనుట), ఒరున్ = మఱియొక పురుషుని, మంత్రియంచున్ = అమాత్యుఁడని, ప్రోవన్ = రక్షింపఁగా, గుమ్మడికాయయంతయగుముత్తెంబై=కూశ్మాండప్రమాణమైన మౌక్తికమై (గుమ్మడికాయయంతముత్తె మనఁగా శరీరమందు ధరింపఁగూడ దనుట), మనంబేర్పన్ = మనోవ్యథసేయఁగా (స్వాధీనుఁడుగాకయనుట. అట్లే = అలాగుననే, తాన్ = పరాధీనుఁడయినతాను, ఆతనిచేతిలోన్ = అస్వవశుఁడుగానిమంత్రిహస్తములో, మీఁదటన్ = వెనుకను, బ్రదుకువాఁడేయాఁజూమీ =

అతఁడు చెప్పినట్లు విని జీవింపవలయుఁజుమా. (అనఁగాఁ దగినమంత్రి దొరక నపుడు నీతిశాస్త్రపరుఁడై తానే యెల్లపనులు చూచికొనుచు స్వతంత్రుఁడై యున్న రాజు సుఖపడును.)

క. ఒక్కనివిరివికినె దొర
లెక్కండ్రే నొక్కనొకని వెంబడి నచుఁగుల్
పెక్కండ్రు నిలువఁ బనులగుఁ
గక్కసము గుదింపఁ బెంపఁగాఁ గాకుండున్. 214

టీ. ఒక్కనివిరివికినె = ఒకని కివిస్తరించియిచ్చుదానికే, దొరల్ = ఉద్యోగస్థులు, పెక్కండ్రేని = అనేకులయినేని (అనఁగా నొకయధికార మనేకుల కిచ్చినప్పు డనుట,) ఒక్కనొకనివెంబడిన్ = వారిలో నొకనొకనివెంట, అచుఁగుల్ = వారివారి స్నేహితులు, పెక్కండ్రు = అనేకులు, నిలువన్ = నిలిచియుండఁగా, పనులు = రాజకార్యములు, అగున్ = అనుకూలములగును, కుదింపన్ = తగ్గింపఁగా, కక్కసము = కఠినము, పెంపఁగాన్ = వృద్ధిసేయఁగాను, కక్కసము గాకుండున్ = కఠినముగాకుండును.

క. ధనముఖ్యము కేవల మే
పనికిన్ రా దాస్థ గలిగి పలువురు ప్రభువుల్
పనిసేయక తద్వశ్యం
బునకు నలోభానృశంస్యములు ఋతముఁ జెలుల్. 215

టీ. పలువురు = పెక్కండ్రైన, ప్రభువులు = గొప్పయుద్యోగస్థులు, పనిసేయక = ముందు నిలువంబడి శ్రద్ధతోఁ గార్యమొనర్పక, ధనముఖ్యము = ధనప్రాధాన్యము, కేవలము ముఖ్యముగా, ఏపనికిన్ రాదు = ఏప్రయోజనమునకును రాదు, తద్వశ్యంబునకున్ = వారు స్వాధీనులౌటకు, అ...ల్ -అలోభ = లోభరాహిత్యమును, అనృశంస్యముల్ = క్రౌర్యరాహిత్యమును, ఋతమున్ = సత్యమును, చెలుల్ = స్నేహితులును, (ఉండవలయు నని యధ్యాహారము.)

తా. అనఁగా రాజునకు ధనమున్మాత్రముండి యుపయోగింపదు, గొప్పవారి సాహాయ్యమును ముఖ్యముగ నుండవలయును గాన, వారు స్వాధీను లగుటకై యౌదార్యమును, క్రౌర్యము లేకయు, సత్యప్రవర్తనమును గల్గి మిత్త్రులతోఁగూడి యుండవలయు ననుట.

క. భాండాగారహయాద్యము
లుండియు ననువగుమనుష్యులొదవమి నవియున్

మండలము నవయ నరికొ్ాది
గుండిన సింహాసనంబులుర్వి న్వినమే. 216

టీ. భాం...లు - భాండ = మూలధనముయొక్క, ఆగార = గృహమును, (బొక్కస మనుట.) 'స్యాద్భాండమశ్వాభరణే మంత్రే మూల వణిగ్ధనే' యని యమరము.) (ఇచట వణిగ్ధనము గాకుండినను మూలధనమాత్రమందే ప్రయోగము.) హయాద్యములు= గుఱ్ఱములు మొదలగునవి, ఉండియుఁ = ఉండినను, అనువగుమనుష్యులు = తగిన మనుజులు, ఒదవమిఁ =లేనందువలనను, అవియుఁ=ఆయర్థబలములు రెండును, మండల ముఁ = రాష్ట్రమును, నవయఁ=నశించిపోఁగా, అరికిఁ = శత్రునకు, ఒదిగుండిన=మూల వీగుచున్న, సింహాసనంబులు = వానినధిష్ఠించురాజులను (అనఁగా సంస్థానముల ననుట), ఉర్విఁ = భూమియందు, వినమే = వినుచున్నామా (అనఁగా నెవ్విధంబున నయినను మంచి మనుష్యులం గూర్చికొనియుంట యుక్త మనుట.)

తే. బాహుజాంఘ్రిజముఖవిడంబనకు నయిన
గొలిచి మనువిప్రధర్మంబుఁ దెలిసినైన
బూని సంకటముల నిల్చుఁగాన దఱచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము. 217

టీ. బా...కుఁ - అయినఁ - బాహుజ = క్షత్త్రియులును 'మూర్ధాభిషిక్తో రాజ న్యో బాహుజః క్షత్త్రియో విరా'ట్టని యమరము. అంఘ్రిజ=శూద్రులును, ముఖ = మొద లగువారిని, విడంబనకుఁ అయినఁ = అనుకరింపవలయుననియైనను, కొలిచి = పూర్వ మందు రాజసేవయొనర్చి, మ...బుఁ-మను=కాలముగడపి బ్రదుకుచున్న, విప్ర=బ్రాహ్మ ణులయొక్క, ధర్మంబుఁ = ఆచారమును, తెలిసినైనఁ = గ్రహించియైనను, అతఁడు = ఆవిప్రుఁడు, సంకటములఁ = ఇక్కట్టువేళలయందు, పూని = వహించుకొని, నిల్చుఁగానఁ = నిలువంబడుచున్నాఁడుగనుక, పతికిఁ=రాజునకు, తఱచు=విస్తారముగా, బ్రాహ్మణునిఁ = విప్రుని, ప్రభుఁజేయుట = అధికారిగా నియమించుట, హితము = అనుకూలము.

ఉ. ఆయతికాని కీకు మమరాలయముఖ్యము లాతఁ డర్థతృ
ష్ణాయుతుఁడై నిజోర్వి నగుసస్యసమృద్ధి దద్ధనముం దొరల్చి రా
జాయతనంబుఁ జేర్చు మఱియట్టి దపథ్యము దాన నొంటిఁ గాఁ
డే యధికారి గావలయునించుక తిన్నను వాఁడె రూపఱున్. 218

టీ. ఆయతికానికిఁ = ధనముగూర్పఁబట్టువానికి, అమరాలయముఖ్యములు = దేవా లయము మొదలగువానిని, (అనఁగా దేవబ్రాహ్మణ జీవనాధికారముల ననుట.) ఈకుము =

ఇయ్యకుము, అతఁడు = ఆయుద్యోగస్థుఁడును, అర్థతృష్ణాయుతుఁడై = ద్రవ్యాశతోఁ గూడినవాఁడై, నిజోర్వినగునష్టిక్ = తానుద్యోగముఁ జేయునట్టి దేశమునందైన నష్టికి, తద్ధనముల్ = ఆదేవబ్రాహ్మణులయొక్క ద్రవ్యమును, దొరల్చి = హరించి, రాజాయతనంబుల్ = నృపునియింటిని, చేర్చుక్ = చేర్చును, మఱి = అనంతరమందు, అట్టిది = ఆదేవబ్రాహ్మణద్రవ్యప్రాప్తి, అపథ్యముగానక్ = రాజునకుఁగీడుగావున, ఒంటిగాఁడె = ఒక్కఁడె, అధికారికావలయుల్ = ఉద్యోగస్థుఁడుగా నుండవలయును (దేవబ్రాహ్మణ ద్రవ్యలేశముగలసినను రాజునకుఁ బాతకముగాన నది కలియకుండున ట్లధికారిని వేఱుగా నేర్పఱచుటయుక్తము) ఇంచుకతిన్నను = అట్లు నియమింపఁ బడినవాఁడు కొంచెము భక్షించినను, వాఁడె = ఆదేవబ్రాహ్మణ వృత్త్యధికారియే, రూపఱుల్ = నశించిపోవును.

చ. మును దనసీమ చేసికొని ∮ ముల్లిడి గుద్దట వెండి చేనిమె
త్తనకయి వేరు వెల్లఁకియుఁ ∮ ద్రవ్వెడుకర్షకునట్లు శత్రుతో
నెనసియునైన దుర్గబల ∮ మేకొనియైన నిజాత్మ చింతలే
క నెగడఁజేసి లోన మఱి ∮ కంటకశోధనఁ జేయు టొప్పగున్. 219

టీ (రాజైనవాఁడు) మును = ప్రథమమందు, తనసీమచేసికొని = తనయావరణము కావించికొని, ముల్లిడి = చుట్టును గంచెవేసి, వెంబడి = మఱియును, గుద్దటక్ = గుద్దలిచేత, చేలిమెత్తనకయి = వరిమొదలగునవి ఫలించునట్టి ప్రదేశమునకున్న మన్ను మృదువగుటకై, వేరు = వృక్షాదులమూలమును, వెల్లఁకియుల్ = మోటువు (జాత్యేకవచనము.) త్రా...ట్టు-త్రవ్వెడు = ఖననముచేయుచున్న, కర్షకునట్లు = కాఁపువానివలె, శత్రుతోక్ = పగతునితోడ, ఎనసియయైనక్ = కపటస్నేహము చేసియైనను, దుర్గబలమే కొనియైనక్ = స్థలజలాది దుర్గములం గైకొనియైనను, తనసీమచేసికొని = రాష్ట్రము తన యధీనముచేసికొని, నిజాత్మ = తనహృదయమును, చింతలేక = పరునిచేత నుపద్రవము కలుగునను విచారములేక, నెగడఁజేసి = ఒప్పఁజేసి, లోనక్ = ఆరాజ్యమందు, మఱి = పిమ్మట, కంటకశోధనక్ = క్షుద్రశత్రునిరసనమును, 'సూచ్యగ్రే క్షుద్రశత్రౌచ రోమహర్షేచకంటకః' యని యమరము. చేయుటొప్పగుక్ = చేయుట యుక్తము.

క. మొదలనె యొరుదలకానిం
జెదరంగా నాడ కాత్మఁ ∮ జింతింపు పదిం
బదిగ మృష యేని మఱి విడు
ముద స్తుగాఁ గాక యుండ ∮ నొక్కమతమునన్. 220

టీ. ఒరుదలకానిక్ =పిశునుని (కొండెగాని ననుట.) మొదలనే = ప్రథమమంటె, చెదరంగానాడక = చెదరిపోవునట్టుచెప్పక, ఆత్మక్ = మనస్సునందు, పరింబదిగక్ = లెస్సగా (పదిపర్యాయము లనుట), చింతింపుము = విచారింపుము, మృషయేని = అబద్ధమాయెనా, మఱి = పిమ్మట, ఒక్కమతమునక్ = ఒకపక్షమునను, ఉదస్తుఁగాఁగాక యుండక్ = పరాభూతుండు గాకుండునట్లు, విడుము = వదలుము.

తా. కొండెగాండ్రఁ దూలనాడిన రాజునకు రహస్య వృత్తాంతములు తెలియవు గనుక చెదరనాడఁగూడదు.

క. ధరణి నసాధ్యనగాటవు
లిరవుగ భూపీడ సేయు నెఱుకుల పొరుగూ
ళ్లిరవుగ నస్థితిశూరుల
కెరవుగ నిచ్చునది మిథము నెట్లయిన నురున్. 221

టీ. ధరణిక్ = భూమియందు, అ...లు-అసాధ్య = సాధింపనలవిగాని, నగ = కొండలును, అటవులు = అరణ్యములును, ఇరవుగక్ = టెంకిచేసికొని, భూ...ళ్లు - భూపీడసేయు = భూమికుపద్రవము చేయుచున్న, ఎఱుకుల = ఈ పేరుగలనీచజాతివాండ్ర యొక్క, పొరుగూళ్ళు=సమీపగ్రామములను, అస్థితి=స్థితిదప్పినటువంటి, శూరులకుక్ = శౌర్యముగలపురుషులకు, (విదేశములనుండి స్థితిదప్పివచ్చిన శూరుల కనుట.)ఇరవుగక్ = ఉనికిపట్టుగా, ఎరవుగక్ = మనోవృత్తికిగాను, ఇచ్చునది = ఇయ్యవలయును, మిథముక్ = పరస్పరమును, ఎట్లయినక్ = స్పర్ధచేతనేలాగైనను, ఉరుక్ = మేలగును.

తా. ఇట్లొనర్చితివేని వైదేశికులైన శూరులు డగినను మిగుల హాని లేదు, ఆటవికులు డగిరేని యది మిక్కిలియు మేలౌను.

వ. విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గూడుకొన్న రాజునకుఁ బ్రజాబాధ దఱుఁగ దెట్లేని బెదరు వాపి వారలం జేకూర్చుకొన వలయు నవిశ్వాసంబును విశ్వాసంబును నలుకయు నెలమియు నతి వైరంబును నత్యానుకూల్యంబును నల్పులగుట నల్పంబునన యగు నెట్లంటేని. 222

టీ. విశేషించియుక్ = మిగులఁగా, అప్పార్వతీయబలంబు = అయ్యాటవికసేన, లోనం గూడుకొన్నక్ అడవిలోమెండైయుండెనా, రాజునకుక్ = మండలాధిపతికి, ప్రజాబాధ తఱుఁగదు = జనపీడతక్కువపడదు (రాజునకుం దిరుగంబడి పోరు లేక వానిదేశమున కుపద్రవము చేయుచుండు రనుట), ఎట్లేనిక్ = ఏలాగైనను, బెదరువాపి= జడుపుదీర్చి, వారలక్ = అయాటవికులను, చేకూర్చుకొనవలయుక్ = అనుకూలముచేసి

కొనవలయును, అవిశ్వాసంబును = నమ్మకపోవుటయును, విశ్వాసంబును = నమ్ముటయును, అలుకయుఁ = కోపమును, ఎలమియుఁ = ఆర్ద్రహృదయత్వమును, అతివైరంబుఁ = అత్యంతవిరోధమును, అత్యానుకూల్యంబును = అత్యంతసహకారిత్వమును, అల్పులగుటఁ = తుచ్ఛజాతులగుటవలన, అల్పంబున = స్వల్ప కార్యముచేతనే, అగుఁ = కలుగును, ఎట్లంటేని = ఏవిధంబంటివా.

శా. విల్లుం దానును భిల్లుఁ డొక్కఁడరుగ న్విం దింట దుగ్ధాన్నముఁ
భిల్లుం డన్యుఁడు వెట్ట నార యుడుక న్వీక్షించి దొబ్బంచు వాఁ
డెల్ల న్వమ్ముగఁ జేసి త న్ననుపరా నెందేఁ దెగం జూడఁగా
నుల్లంబై చన నంపు నార చెడు నా నూహించి పోనంపఁడే. 223

టీ. విల్లుఁ దానును = వింటిబద్దయును దానును (విల్లుచేతఁబట్టియనుట), భిల్లుఁ డొక్కఁడు = ఒక బోయవాఁడు, అరుగఁ = పోఁగా, భిల్లుఁడన్యుఁడు = మఱియొక బోయవాఁడు, ఇంటఁ = తనగృహమందు, దుగ్ధాన్నముఁ = పాలన్నమును, విందు = ప్రీతిపూర్వకమైనభోజనమును, పెట్టఁ=ఇడఁగా, నారయుఁడుకన్వీక్షించి = వానియింటి జానకి త్రాటికొఱకై ప్రొయిమీఁదఁ బక్వమగుచున్న పట్టతాటలపై నెఱ్ఱఁగాబొంగిననీటిని జూచి, దొబ్బఅంచుఁ = మాంస మనియెంచి, (ఇది తనకుఁబెట్టకపోయెఁ గదాయని కొంచెపుఁబనిగా విచారించి కోపించి యనుట.) వాఁడు = అతఁడు, ఎల్లఁ = దీనినంతయును, వమ్ముగఁజేసి = వ్యర్థపఱచి, తన్ననుపరాఁ = వాఁడు తన్ననుపుటకొఱకుఁ గొంత దూరమురాఁగా, ఎందేఁ = ఎక్కడనైనను, తెగంజూడఁగాఁ = చంపఁదలఁపఁగా, ఉల్లంబై = మనస్సుగలవాఁడై, చననంపుము = పోనంపుము, నారచెడునాఁ = ప్రొయిమీఁద నుడుకఁబెట్టినచ్చినత్వక్కు చిమిడిపోవుచున్నది వెళ్లవలెననఁగా, ఊహించి = ఆ పిమ్మట నుడుకునది నారగాని మాంసముకాదని వితర్కించి, పోనంపఁడే = పోవునట్లు సెలవిచ్చి పంపఁడా, (చంపకయె పోనిచ్చె ననుట.) అల్పుల కతివైరాత్యానుకూల్యము లల్పకార్యములవలననే పుట్టుచున్న వనిభావము.

క. ఆపాలుఁగూటనే నిజ, మేపాటియుఁ దప్ప రాడి రేనెరసునఁ గొం
తేపాటిగన్న నలుఁగుదు, రీపని యెంతనక వెడఁగుగొలువ నాటవికుల్.

టీ. ఆటవికుల్ = భిల్లపుళిందాదులు, ఆ పాలుఁగూటనె = ఆ క్షీరాన్నముఁ బెట్టుటచేతనే, ఆడిరేఁ=పలికిరా, నిజమేపాటియుఁ దప్పరు = తామాడినయథార్థమైన పలుకు నెంతమాత్ర మతిక్రమింపరు. నెరసునఁ = తప్పిదము విషయమై, కొంత = కొంచెము, ఏపాటిగన్నఁ = ఏ మాత్రము చూచినను, ఈపని = ఈ కార్యము, ఎంతనక =

ఎంతమాత్రమని యెంచక, వెడఁగుటెదన్ = వెఱ్ఱిమనస్సుచేతను, అలుగుదురు = కోపగింతురు.

తా. బోయవాండ్రు మొదలగు నల్పజనులు కారణములంబట్టి ప్రసాదనిగ్రహములు గలవారగుదురుగాని గొప్పకార్యములకుఁ దగినట్లు గొప్పగా యోజింపరు.

తే. ఆటవికవశ్యకలన సత్యమున వైరి
మనుజపతిమైత్త్రి దూతసన్మానమునను
గూర్మి దఱిఁ భృతిఁ గాల్వురకు సపారి
తోషికపుసేవ నెలమి రాౌతులకుఁ గలుగు. 225

టీ. ఆ...న-ఆటవిక=పుళిందాదులయొక్క, వశ్యకలన = స్వాధీనకరణము, సత్యమునన్ = యథార్థము వచించుటచేత, కలుగున్ = అగును, (సత్యవాక్యమునకే వశ్యులగుదురనుట)వై...త్రి-వైరి=శత్రువైన, మనుజపతి=నృపునియొక్క, మైత్త్రి = స్నేహము, దూతసన్మానమునన్ = వారిరాయబారులను బహుమానించుటచేతను, కలుగున్ = సంభవించును, తఱిన్ = కోరిన సమయమందు, భృతిన్ = జీతమిచ్చుటచేతను, కాల్వురకు = పదాతులకు, కూర్మి=మైత్త్రి, కలుగున్ = సంభవించును, 'భృతిర్భరణమూల్యయోః' యని రత్నమాల. సపారితోషికపుసేవన్ = బహుమానములతోఁగూడఁ గొలిపించుకొన్నందువల్లను, రౌతులకున్ = అశ్వారోహకులకు, ఎలమి = సంతోషము, కలుగున్ = సంభవించును. (రాజైనవాఁడు సమయములనుబట్టి వారివారికిం దగినట్లు నడపింపవలయు ననుట.)

క. మేలగుఘోటకమును శుం
డాలంబును నాప్తసుభటునకె యిమ్ము తఱిన్
మేలగుమేఁపున మందురఁ
బాలింపుము దొరలపాలుపఱుపకు మెపుడున్. 226

టీ. తఱిన్=ఆయా సమయములయందు, మేలగుఘోటకమును = గొప్పయశ్వమును, శుండాలంబును = ఏనుంగును, మందురన్ = వాజిశాలయందు, 'వాజిశాలాతు మందురా' యని యమరము. (ఇది గజశాలకు నుపలక్షణము.) మేలగుమేపునన్=మంచి మేఁతచేత, పాలింపను = సంరక్షింపను, ఆ...ట-ఆప్త=ఇష్టుఁడైన, సుభటునకె = మంచి రాౌతునకె, ఇమ్ము = ఒసంగుము, ఎపుడున్ = ఏ సమయమందును, దొరలపాలుపఱుపకుము = గొప్పయధికారులవశము చేయకుము.

తా. గజాశ్వాదులకు సుఖరక్షణము చేయఁదలంచితివేని దానినొప్పి నెఱుంగక యారోహణముఁజేయునట్టి గొప్పయుద్యోగస్థుల కధీనముచేయక యాప్తుఁడైన బంటున కధీనము సేయుము.

తే. కార్య మొక్కఁడు గనిన మా ॥ త్సర్యమున నొ
కండు గా దని ఖండించుఁ ॥ గన్నెఱింగి
యిరువురను గా దనక కొ ॥ ల్వు విరిసి మీఁద
నల్లవాఁ డెన్నినది సేయ ॥ నగు శుభంబు. 227

టీ. ఒక్కఁడు = ప్రధానపురుషుఁడు, కార్యము = పనిని, కనినన్ = తెలిసి చెప్పఁగా, మాత్సర్యమునన్ = అట్లుచెప్పినవానిమీఁది ద్వేషముచేతను, ఒకండు = మఱియొకఁడు, కాదనిఖండించున్ = అతఁడు చెప్పినట్లు కాదని భంగపఱచును, కన్నెఱింగి = వారిద్దఱిలోని యాలోచనక్రమము నెఱఁగి, ఇరువురను = ఆలాగునఁ జెప్పిన వారిద్దఱను, కాదనక = నిషేధింపక, కొల్వువిరిసి = సభ చాలించి, మీఁదన్ = పిమ్మటను, అల్లవాఁడు = మాత్సర్యములేక లోత్తహితముఁ జెప్పినవాఁడు, ఎన్నినదిసేయన్ = విచారించిన కార్యమునే చేయఁగా, శుభంబు = మంగళము, అగున్ = ఔను.

క. పగ వెలిఁ గని లోదస్యులఁ
జిగురింపఁగఁ జేసి నృపతి ॥ చిక్కువడఁ బను
ల్దెగి సేయక తా రే ది
క్కుగ నడతు రశంక నల్లి ॥ కొని దుస్సచివుల్. 228

టీ. పగవెలిఁగని = రాజునకుసమనంతరదేశమునందుండునట్టి విరోధుల నుండఁ జూచి, లోదస్యులన్ = స్వరాష్ట్రమునందలి క్షుద్రశత్రువులను, 'దస్యుఃశాత్రవశత్రవః' యని యమరము. చిగురింపఁగన్ = పల్లవింపఁగా, చేసి = ఒనర్చి, నృపతి = రాజు, చిక్కువడన్ = గ్రహింపఁబడునట్లు, పనుల్ = రాచకార్యములను, తెగిచేయక = సాహసించి యొనర్పక, తారేదిక్కుగన్ = వేఱుమంత్రులులేక రాజునకుఁ దామే యాధారమగునట్లు, దుస్సచివుల్ = దుష్టమంత్రులు, అశంకన్ = భయములేనట్లు, అల్లుకొని = కొందఱుగట్టుకొని, (ఏకీభవించి యనుట.) నడతురు=ప్రవర్తింతురు, (కావున నట్టి దుర్మంత్రులు లేక యుండునట్లుగఁ బ్రభుత్వము సేయవలయును.)

క. ఇప్పింతు రాత్మవశులకుఁ
దప్పింతురు పరుల కాడి ॥ తప్పింతురు రా
జిప్పగిదివాఁడె యని వే
చెప్పినఁ బెఱవారు నమ్మి ॥ చేరక యుండన్. 229

టీ. ఆత్మవశులకున్ = తమకు స్వాధీనులై యుండువారలకు, ఇప్పింతురు = వలయువస్తువుల నియ్యఁజేయుదురు, పరులకున్ = తమ కనుబంధములేనివారలకు, తప్పింతురు = ఇయ్యకుండునట్లు చేయుదురు, ఆడితప్పింతురు = రాజుపలికినమాట దొలఁగు

నట్లుచేయుదురు, వే = వేయివిధములుగా, చెప్పినన్ = పలికినను, రాజు = ఱేఁడు, ఇప్పుగిదివాఁడెయని= ఈలాగునఁజెప్పి తప్పెడువాఁడేయని, పెఱవారు = అన్యులెవ్వరును, నమ్మి = విశ్వసించి, చేరక యుండన్ = దగ్గఱవచ్చిచేరకుండునట్లు, రాజుచేత నాడి తప్పింతు రని క్రిందికన్వయము.

ఆ. వాఁడిఁ బొదలు జఠర ॥ వైశ్వానరుఁడు కఫ
ప్రముఖదోషయుక్తి ॥ బలిమిచెడిన
వెలి మహౌషధంబు ॥ బలమిచ్చుగతిఁ బ్రతి
సేయ వారిమదముఁ ॥ జెఱుచుఁ బరుఁడు. 230

టీ. వాఁడిన్ = తైక్ష్ణ్యముచేత. పొ...డు-పొదలు=ప్రబలుండైన, జఠరవైశ్వానరుఁడు = జౌదరాగ్ని, కఫప్రముఖదోషయుక్తిన్ = శ్లేష్మాదిదోష సంబంధముచేత, బలిమిచెడినన్=సత్త్వహీనుఁడుకాఁగా, వెలిన్ = వెలుపలనున్న, మహౌషధంబు = శ్రేష్ఠమైనభైషజ్యము, బలమిచ్చుగతిన్ = జఠరాగ్నికి సత్త్వముగలుగఁజేయునట్లు, ప్రతిసేయన్ = బదులుగా నొకసమర్థుని నియమింపఁగా, పరుఁడు = ఆ యధికారమునకు వచ్చినపురుషుఁడు, వారిమదముఁన్ = ఆ దుర్మంత్రులయొక్క మదమును, చెఱచున్ = అడంచును.

వ. వారిమిగిలి ప్రతిసేయ నెట్లంటేని. 231

టీ. వారిమిగిలి = పూర్వమునందున్న యీమంత్రుల నతిక్రమించి, ప్రతిసేయను ఏలాగున నితరపురుషునిఁదేవచ్చును. అంటేని = ఈలాగంటివా చెప్పెదను.

క. భండారముతో హయమద
శుండాలఘటాళి దనదు ॥ సొమ్మై పాగా
నుండిన నంతటఁ బాయదె
పండితుఁడును బిరుదునైన ॥ పతికిని బయలై. 232

టీ. భండారముతోన్ = బొక్కసముతోడను, హ...హయ = గుఱ్ఱముల యొక్కయు, మదశుండాల = మదపుటేనుంగులయొక్కయు, ఘట=గుంపులయొక్కయు, ఆళి=వరుస, తనదుసొమ్మై = తనయధీనమై, పాగా నుండినన్ = శాలయం దుండఁగా, అంతటన్=అటుపిమ్మటను, పండితుఁడును = ఎఱుకగలవాఁడును, బిరుదునైన = శూరుఁడునైనటువంటి, పతికిన్ = రాజునకు, బయలై = దుర్మంత్రివ్యాపారము నివృత్తమై, పాయదె = పోదా, (పోవు ననుట.)

క. కుడుపున నొకకడి దఱిఁగినఁ
జెడఁ జూచుటె కాక పతికిఁ ॥ జెలియఖుం గలఁడే

యిడ నని విడువం జెల్లునె
నడపవలయు నేర్చినట్లు నమ్మకయె కృపన్. 233

టీ. కుడుపునన్ = భోజనమందు, ఒకకడి = ఒక్కకబళము, తఱఁగినన్ - తక్కువ పడఁగా, చెడఁజూచుటె కాక = రాజునకుఁ జెఱుపుఁ దలంచువారే కాని, పతికిన్ = రాజునకు, చెలియున్ = మిత్త్రుఁడును, కలఁడే = ఉన్నాఁడా, (లేఁ డనుట.) ఇడ నని = ఇట్టి వీరులకుఁ బెట్ట నని, విడువన్ = త్యజించుట, చెల్లునె = తగునా, (విడువం గూడ దనుట.) నేర్చినట్లు = తగినయట్లు, నమ్మకయె = వారియందు మనంబున విశ్వాసముంచకయె, కృపన్ = దయ చేతను, నడపవలయున్ = పోషింపవలయును, (సేవకులకుఁ దక్కువపడ నట్లు పోషింపకున్న స్వప్రయోజనములు జరుగవు గానఁ జక్కఁగాఁ బోషింపవలయును.)

చ. ఒకటికి రోయకుంటఁ గను మున్నిడియుం ద్రుపదుండు మారణే
ష్టికి బసిఁ జూపి వేఁడ మునిసింహుఁ డొకండు తమన్న వేల్చుఁ బం
డొకఁ డపవిత్రభూమిఁ గని యొల్లక యేఁ జనఁ దా గ్రహించె రో
య కనియెఁ గాన నట్లెఱుఁగ నౌఁ జను సర్వముఁ గాన శక్యమే.

టీ. ఒకటికిన్ = ఒకయకృత్యమునకు, రోయకుంటన్ = అసహ్యపడకుండుట చేత, ఉన్నవియున్ = తక్కినవడవడికలను, కనుము = తెలిసికొనుము, ద్రుపదుండు = పాంచాలుఁడు, మారణేష్టికిన్ = హింసారూపమైన హోమమునకై, పసిన్ = పెక్కు గోవులను, చూపి = అగపఱిచి, వేఁడన్ = ఇచ్చెద నని ప్రార్థింపఁగా, మునిసింహుఁ డొకండు = ఉపయాజుఁడు అనుమునిశ్రేష్ఠుం డొకండు, 'స్యురుత్తరపదే వ్యాఘ్రపుంగ వర్షభకుంజరాః, సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' యని యమరము. తమన్న వేల్చున్ = తమజ్యేష్ఠభ్రాతయైన యాజుఁడు పాపకర్మ మని రోయక హోమము సేయును, అదెట్లంటేని, పండొకఁడు = ఒకఫలమును, అపవిత్రభూమిన్ = అపరిశుద్ధస్థలమందు, కని = పడియుండఁగాఁ జూచి, ఒల్లక = ఆఫలమును గ్రహింపక, ఏన్ = నేను, చనన్ = అవలికిఁ బోఁగా, తాన్ = మాయన్నయైన యాజుఁడు, రోయక = ఏవగింపక, గ్రహించెన్ = పుచ్చుకొనెను, అనియెఁగానన్ = ఆలా గనెను గనుక, (అనఁగా ఫలాపేక్ష గలవాఁడు గనుక నాయనయొద్దకు వెళ్లిన మారణయజ్ఞమును జేయించును గాన నచ్చటికి వెళ్లు మని ద్రుపదునితోఁ బల్కెను గనుక ననుట.) అట్లెఱుఁగనౌన్ = స్థాలీపులాకన్యాయముచేత నట్లెఱుంగవలయును, చనుసర్వమున్ = జరగువానినన్నిటిని, కానన్ = పరీక్షించిచూచుట, శక్యమె = సాధ్యమా. (కా దనుట.)

క. వీఁ డెడరునఁ గీ డెన్నిన
వాఁ డని జయమైన హింస వదలికొనుము శ్రీ

పోఁడి మహిం యేమికొలఁప
ల్వాఁడి సెడిన నట్టిదయకు ౯ వైరియు నమ్మున్. 235

టీ. వీఁడు = ఈపురుషుఁడు, ఎడరునన్ = ఇక్కట్టుసమయమునందు, కీడు = అనిష్టమును, ఎన్నినవాఁ డని=తలంచినవాఁడని, (గూఢశత్రువును, తదపష్టబుద్ధుండైన బలవద్విరోధియు ననుట.) జయమైనన్ = ఉపాయముచేత గెలిచినపిమ్మట, హింసవదలి = చంపఁదలఁక, శ్రీ = ఐశ్వర్యముయొక్క, పోఁడిమి = అతిశయమును, కొసము = హారింపుము, అహి = పాము, కొలఁపల్వాఁడి సెడినన్ = పంటిమైత్రిక్ష మడఁగినపిమ్మట, ఏమి కొలఁ = ఏమిచేయఁగలదు?, వైరియున్ = శత్రువును, అట్టిదయకున్ = అటువంటివిరోధిని జంపకవిడిచినకృపకు, నమ్మున్ = విశ్వసించును, (హింసాపరుఁడు గాకుండెనేని శత్రువైనను నమ్ము ననుట.

తే. దేశవైశాల్య మర్థసిద్ధికినిమూల
మిల యొకింతైన గుంటకాల్వలు రచించి
నయము పేదకు నరిఁ గోరుగనను నొసంగి
ప్రబలఁ జేసిన నర్థ ధర్మములు పెరుగు. 236

టీ. దేశవైశాల్యము-దేశ = రాష్ట్రముయొక్క, వైశాల్యము = విప్పుగల్గుట, అర్థసిద్ధికిన్ = ధనాదాయమునకు, మూలము = హేతువు, ఇలయొకింతైనన్ = (అట్లు విస్తారముగాక) భూమికొంచెమైనను, గుంట = తటాకములు, కాల్వలు = పఱఁదకాలువలు, రచించి = కలుగఁజేసి, పేదకున్=దరిద్రుఁడైన కాఁపువానికి, అరిన్ = పన్నునందును, కోరునను = వారకమందును, నయము = మేలు, ఒసంగి = కలుగఁజేసి, ప్రబలన్ = వృద్ధిపొందునట్లు, చేసినన్ = ఒనర్చినట్లాయెనా, అర్థధర్మములు = ధర్మార్థములు, పెరుగున్ = వృద్ధినొందును.

తే. ప్రజ లవిసి చన్నఁ బిలువ కప్పసులఁ గొలుచు
నమ్మి యిం డ్లింధనంబున ౯ కాయె ననెడు
కలని నక్కైన యధికారి ౯ గలనృపతికి
నేడుదీవులు గొన్న సమృద్ధి లేదు. 237

టీ. ప్రజలు తనరాష్ట్రమునందలిజనులు, అవసి = నొగిలి, చన్నన్ = లేచిపోఁగా, పిలువక = మరలవారిని నొడంబఱచి వెంటఁబెట్టుకొనిరాక, అప్పసులన్ = వారిపశువులను, కొలుచున్ = ధాన్యమును, అమ్మి = విక్రయించి, ఇండ్లు = వారిగృహములు, ఇంధనంబులకాయెన్ = వంటచెఱకున కొదిగెను, అనెడు = అనునట్టి, కలనినక్కైన =

పోరిలోని జంబుకమువలె నశుభమును గోరుచున్న, అధికారిగల = ఉద్యోగస్థుఁడు గల్గినట్టి, నృపతికిన్ = రాజునకు, ఏడుదీవులు = సప్తద్వీపములను, కొన్నన్ = గ్రహించినప్పటికిని, సమృద్ధి లేదు = సంపద చేకూరదు.

మహాస్రగ్ధర

ఉర వౌచాగంబు భోగంబు భయము నొకపాలుగ్ర సేనావనార్థం
బిరువాల్నిండారుబండారిలుచొర నొకపాలిట్లుగా నాయ మొప్పం
జరదృష్టిన్ వైరిపక్షేక్షణమును శుచిశస్తస్వపక్షేక్షణంబున్
ధరణీనాథుం డొనర్పందగుఁ దగ దునుమందస్కరాళిన్నిజోర్విన్.

టీ. రాజు దనకువచ్చునట్టి యాయతిని నాలుగుపాళ్లుచేసి, ఉరవు = అధికము, ఔ చాగంబు = ఐన త్యాగమును, (ఇది త్యాగశబ్దభవము.) భోగంబు = స్వానుభవమును, ఉభయమున్ = రెంటికిని, ఒకపాలు = ఒకభాగము, ఉ...-ఉగ్ర = ప్రతాపశాలియైన, సేనా = చతురంగబలముయొక్క, అవనార్థంబు = రక్షణముకొఱకు, ఇరువాల్ = రెండుభాగములును, నిం...లు-నిండారు = సంపూర్ణమయి, భండారిలు = కోశాగారమును, చొరన్ = ప్రవేశించుటకై, ఒకపాలు = ఒకభాగమును, ఇట్లుగాన్ = ఈచతుష్ప్రకారములుగా, ఆయమొప్పన్ = అర్థాగమ మేర్పడియుండఁగా, 'అర్థాగమో భవేదాయ' యని యమరము. చరదృష్టిన్ = చారు లనియెడు నేత్రముచేత, 'అపసర్పశ్చ స్స్పశ' యని యమరము. వైరిపక్షేక్షణమును = శత్రుపార్శ్వదర్శనమును, శుచిశస్తస్వపక్షేక్షణంబున్ = మంత్రులులోనగు స్వపక్షజనదర్శనమును, ధరణీనాథుండు = రాజు, ఒనర్పందగున్ = చేయఁదగును, నిజోర్విన్ = తనరాజ్యమునందు, తస్కరాళిన్ = దొంగలగుంపును, తునుమందగున్ = చంపుట యోగ్యమగును.

క. లాలన నారక్షులఁగమి
నేల దెలిసి ముచ్చు నాజ్ఞయిడ కతఁడు చెఱిం
బో లాఁతి నిడ నయశ మెం
తే లేవదె శూలపృథువణిజ్న్యాయమునన్. 239

టీ. లాలనన్ = బహుమానముచేత, ఆరక్షులగమిన్ = తలవరులగుంపును, ఏలి = పోషించి, తెలిసి = ఎఱిఁగి, ముచ్చున్ = దొంగను, ఆజ్ఞయిడక = వెంటనే శిక్షింపక, చెఱిన్ = బందిఖానాలోనుండి, అతఁడు = ఆదొంగ, పోన్ = పాఱిపోఁగా, లాఁతి నిడన్ = వాఁడుపలాయితుఁడైనందునఁ దలవరులు తనుకాజ్ఞ వచ్చునని యన్యునిం దెచ్చి యాచెఱసాలలో నుంచఁగా, శూలపృథువణిజ్న్యాయమునన్ = కొఱ్ఱున వేయఁబడిన పెద్ద కోమటిసెట్టి న్యాయ్యమువలె, అయశ మెంతే లేవదె = అపకీర్తి యధికముగ రాదా,

(వచ్చు ననుట.) అదెట్లన, నపరాధముఁ జేసినవానిం గొఱ్ఱునవేయున ట్లొక వివేకములేని రాజాజ్ఞ చేయఁగాఁ, గొఱ్ఱునవేయునవసరంబునఁ బెద్దకొఱ్ఱునం దపరాధిని వేయునెడఁ దగియుండదు చూడవచ్చిన యీపెద్దకోమటిసెట్టి తగియున్నాఁ డని యొకండు చెప్పఁగా యుక్త మని యెంచి యట్లుపెద్దసెట్టినే కొఱ్ఱునవేయించినరాజున కెంత యపకీర్తి గలిగెనో యంత యపకీర్తి గల్గు ననుట.

చ. ఎఱుఁగ నగుఁ స్వశక్తి నవనీశుఁడు నాలుగుపాళ్లఁ మూఁడుపా
ళ్లెఱుఁగక మోచినట్టిపని కిష్టసుహృత్తతి దెల్ప నొక్కపా
లెఱుఁగ నగు న్నయార్థ్యమతి నిట్లు నిరాగ్రహుఁడైనఁ జేయునె
త్తఱి విపదుగ్రదండపరతంత్రుఁడు గాక చిరంబు రాజ్యమున్. 240

టీ. అవనీశుఁడు = రాజు, నాలుగుపాళ్లన్ = తెలియందగిన నాలుగంశముల యందు, స్వశక్తిన్ = తనసామర్థ్యముచేత, మూఁడుపాళ్లు = మూఁడంశములను, ఎఱుఁగ నగున్ = తెలియఁదగును, ఎఱుఁగక మోచినట్టిపనికి = ఎఱుకపడనట్లు దాఁచియుంచిన విషయమునకు, ఇష్ట = ఆప్తులైన, సుహృత్తతి = మిత్త్రబృందము, తెల్పన్ = ఎఱుక చేయఁగా, ఒక్కపాలు = ఆయొకభాగమును, ఎఱుఁగ నగున్ = తెలిసికొనవలయును, నయ్యార్థ్యమతిన్ = నీతియుక్తమైన బుద్ధిచేత, ఇట్లు = ఉక్తప్రకారముగా, నిరాగ్రహుఁడైనన్ = కోపములేనివాఁడాయెనా, ఎత్తఱిన్ = ఏసమయమునందును, వి...డుగాక- విపత్ = తనకుఁగల్గినయాపదకును, ఉగ్రదండ = అపరాధులవిషయమైన భయంకరంబగు దండమునకును, పరతంత్రుఁడుగాక = అధీనుఁడుగాక (క్రూరదండము సేయక యనుట.), చిరంబు = బహుకాలము, రాజ్యమున్ = దొరతనము, చేయున్ = ఒనర్చును.

తే. కన్నొకటి నిద్రవోఁ బెఱొకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబుమీఁది
యచ్ఛభల్లంబుగతి భోగ మనుభవించు
నెడను బహిరంతరరులపై దృష్టివలయు. 241

టీ. కన్నొకటి = ఒకనేత్రము, నిద్రపోన్ = నిదురింపఁగా, పెఱకంటన్ = రెండవ నేత్రముచేత, జాగరంబుగావించు మేలుకొన్నటువంటి, భూరుహాగ్రంబుమీఁది = చెట్టుయొక్కకొనయున్న, అచ్ఛభల్లంబుగతిన్ = భల్లూకమువలె, 'ఋక్షాచ్ఛభల్లభల్లూకాః' యని యమరము. భోగ మనుభవించునెడను = రాజ్యసుఖానుభవముఁ జేయునప్పుడు, బ...పైన్ - బహిరంతః = బాహ్యాంతరములయం దున్న, అరులపైన్ = శత్రులమీఁద, దృష్టివలయున్ = చూపు నుంచవలయును.

ఉ. అక్షరపక్షపాతమున నర్థము నూళ్లు నొసంగ నుబ్బునన్
భిక్షుజటాధరాదికులు భిన్ననిజవ్రతు లౌదురైన దు
ర్భిక్షరుజా శిశుచ్యుతులు పెక్కగు భక్తియ చాలు దాన నా
తత్క్షుభితత్వమే యఘము దార్పదు శంకఁ దలంగు మియ్యెడన్.

టీ. అ...నన్-అక్షర=నాశమునొందని, (విద్యాపరముగానైనఁ జెప్పవచ్చును.) పక్షపాతమునన్ = దాక్షిణ్యముచేత, (చెడనియనుగ్రహముచేత ననుట. అక్షరముఁ జదివియున్నారన్న పక్షపాతముచేత ననియుం జెప్పవచ్చును.) అర్థమున్ = ధనమును, ఊళ్ళన్ = గ్రామములను, ఒసంగన్ = ఈయఁగా, ఉబ్బునన్ = పొగరుచేతను, భి...లు-భిక్షు = సన్న్యాసులు, జటాధర=జడలు ధరించినవారును, ఆదికులు = లోనగువారు, భిన్ననిజవ్రతు లౌదురు=నియమభ్రంశముగలవారౌదురు, ఐనన్ = అట్లగుటవలన, దు...లు-దుర్భిక్ష = క్షామమును, రుజా = ముక్కఁడిమొదలగు వ్యాధులును, శిశుచ్యుతులు = బాలారిష్టములును, పెక్కగున్ = విస్తరిల్లియుండును, భక్తియచాలున్ = వారిపట్లఁ బూజ్యానురాగమేచాలును, దాన నాన్ = ఆ యర్థగ్రామాదుల నియ్యనందున, అగు తత్క్షుభితత్వము = అగునాసన్న్యాసులు మొదలగువారు క్షోభపడుట, ఏయఘమున్ = ఏ పాపమును, తార్పదు = రాజును బొందింపదు ? ఇయ్యెడన్ = ఈపట్ల, శంకన్ = భయములు, తలంగుము = విడువుము 'శంకావితర్క భయయోః' యని యమరము.

క. విను వారత్రయవిజ్ఞాపన కోర్వుము వధ్యకోటి పట్టునఁ జెదరం
దనకప్పుడె కీడగు నను, జనముంబట్టుటకుమునుప శస్త్రమ చాలున్.

టీ. విను = ఈచెప్పెడిహితము వినుము. వధ్యకోటిపట్టునన్ = చంపఁ దగిన ప్రజలపట్లను, వా...కున్ - వారత్రయ = మూఁడుమాఱులు, విజ్ఞాపనకున్ = విన్నపమునకు, ఓర్వుము = సహించుకొనుము. (మూఁడు నేరములను గావుమనుట.) చెదరన్ = వాఁడు దప్పించుకొనివెళ్లినా, తనకున్ = రాజునకు, అప్పుడె = విడువఁగానే, కీడు = అనిష్టము, అగునను = సంభవించునని తోఁచెడు, జనమున్ = మనుష్యులను, పట్టుటకున్= పట్టుకొనివచ్చుటకు, మునుప = ముందె, శస్త్రమ = శస్త్రమె, చాలున్ = పర్యాప్తము.

తా. పట్టుబడిన శత్రువును విడిచిపెట్టిన హానికర మని తోఁచెనా యప్పుడ హతునిం గావింపుము.

క. శూరాలాపములకు నతి
శూరుఁడుఁ [1]దా నయ్యు నృపతి సోఁకోర్వఁ దగు

1. దాశైనపతియుఁ జోఁకోర్వఁదగున్.

న్వా రుబ్బుదు రందున నిజ
శూరత దొరలందుఁ గనుట సూ కార్య మిలన్. 244

టీ. నృపతి=రాజు, తాను అతిశూరుఁడుఅయ్యున్ = మిగులఁ బరాక్రమవంతుఁడైనప్పటికిని, శూరాలాపములకున్=వీరుఁడాడెడి శౌర్యవాక్యములకు, చోఁకు =తగులు, ఓర్వఁదగున్ = శూరాలాపశ్రవణజన్యమైన యహంకృతి సహించి యుండఁదగును, అందునన్ = అట్లోర్చి వినుటవలన, వారు = ఆశూరులు, ఉబ్బుదురు = ఉత్సాహమును విడువరు, ఇలన్=భూమియందు, నిజశూరతన్ = స్వీయశూరత్వమును, దొరలందున్ = తనకు సరియైన ప్రభువులందు, కనుట = చూచుట, కార్యముసూ = యుక్తమునుమీ. (అనఁగాఁ దనభటుల శూరాలాపంబుల నోర్వవలయు ననుట.)

శా. రేవుల్మావు మతంగజంబులు మణిశ్రీఖండముక్తాదియున్
రా వాణిజ్యము పెంచి యేలఁగ నగు వర్షంపునెవ్వన్ రుజన్
హావళ్ళందిగు నన్యభూప్రజల రా జాయాయిజాత్యోచితిన్
బ్రోవంగాఁ దగుఁదోఁట దొడ్డిగను లా ప్తుల్చూడఁ బంపం దగున్.

టీ. రేవుల్=ఓడలుదిగునట్టి కరవాకపట్టణములందె, (సప్తమ్యర్థమందుఁ బ్రథమ.) మా...లు - మావు = అశ్వములును, మతంగజంబులు = ఏనుఁగులును, మణి = రత్నములును, శ్రీ...యున్-శ్రీఖండ = చందనము మొదలగు పరిమళద్రవ్యములును, ముక్తాదియున్ = ముత్యములు మొదలగునవియును, రాన్=వచ్చునట్లుగా, వాణిజ్యము పెంచి = బేరము పెంపుసేసి, ఏలఁగనగున్ = పాలింపవలయును, వర్షంపునెవ్వన్ = క్షామముచేత, రుజన్ = రోగములచేతను, హావళ్లన్ = అలసటలచేతను, దిగు=చేరినటువంటి, అన్యభూప్రజలన్ = దేశాంతరప్రజనులను, రాజు=ప్రభువు, ఆయాయిజాత్యోచితిన్ = వారివారి కులములకుఁ దగినట్లుగా, ప్రోవంగాఁదగున్ = రక్షింపవలయును, తోఁట = ఉద్యానవనములు, దొడ్డి=పశువులమందను, గనులు = రత్నములుండు నాకరములును, ఆప్తుల్ = తనకుహితముఁగోరుచున్నవారు, చూడఁబంపందగున్ = పరామర్శచేయుటకై పంపుట యుక్తము.

తా. సముద్రతీరముననుండు పట్టణములకుఁ దురంగగజమణి శ్రీఖండాదులు వచ్చునట్లు వర్తకము వృద్ధిఁజేయించి యోడలలోని సరకులు సులభముగా దిగునట్లుగా నవతరణమార్గంబులం గాపాడవలయును.

ఆ. హాదను వచ్చుదాఁక నపరాధిపై రోష
మూఁగి చెఱుకువలయు హాదను వేచి

లక్ష్యసిద్ధిదాఁకఁ గ లావున శర మాఁగి
కాఁడ విడుచు వింటిఁ గ వాఁడువోలె. 246

టీ. పదనువచ్చుదాఁకన్ = తనకు సమయమువచ్చువఱకును, అపరాధిపైన్ = తప్పుచేసినవానిమీఁద, రోషమున్ = కోపమును, ఆఁగి = అడంచికొని, పదను = సమయమును, వేచి = కనిపెట్టి, లక్ష్యసిద్ధిదాఁకన్ = గుఱి తనకులోనయ్యెడు పర్యంతము, లావునన్ = తనబలిమిచేతను, శరమాఁగి = బాణము నాకర్షించిపట్టి, కాఁడవిడుచు = బాణమును దిగఁబడునట్లు వదలుచున్న, వింటివాఁడువోలెన్ = ధానుష్కునివలె, చెఱుపవలయున్ = నిగ్రహింపవలయును.

శా. పోవం బోలు లఘుప్రయాణము దినంబు ల్గొన్ని యొండొంటనే
కావైరిక్షితి కంబువు ల్పిఱుఁద రాఁగా నిల్చు జాలుంబలెం
ద్రోవన్ సైన్యము గూడ వైరిబలసాంద్రుం డైనఁ బూజాదులం
బోవం బోలుఁ జరోక్తిచేత నపదేఁగ బోకావరింపం దగున్. 247

టీ. (రాజు) కావైరిక్షితికిన్ = కుత్సితశత్రునియొక్క భూమికి, లఘుప్రయాణము = కొంచెపుపైనములుగ, దినంబుల్గొన్ని = కొన్నిదినములు, ఒండొంటనే = ఒకటొకటిగా, అంబువుల్ = ఉదకములు, పిఱుఁదరాఁగా = వెంబడిరాఁగా, నిల్చుజాలుంబలెన్ = ముందుపోవుచున్న కొంచెము నీళ్లు వెనుక మెండుగవచ్చునీళ్లు కూడువఱకు నిలుచుచందమున, త్రోవన్ = మార్గమందు, సైన్యముగూడన్ = తనసేనకలిసికొను పర్యంతము, పోవంబోలున్ = వెళ్లఁదగును, వైరి = ఆశత్రువు, బలసాంద్రుండైనన్ = బలవంతుఁడాయెనా, పూజాదులన్ = వారుసేయునట్టి యుపచారములకే, పోవంబోలున్ = మళ్లికొని వెళ్లవలెను, చరోక్తిచేతన్ = వేగులవారివేగుచేతను, అపదేన్ = వాఁడు స్వల్పుఁడని వినఁబడెనా, పోక = వెనుకకు మళ్లక, ఆవరింపందగున్ = చుట్టుకొనవలయును.

చ. ద్రవిణము నొవ్వఁగొంట నొఱఁగ ద్రాబలతో నిడుచుంట భూమిగొం
తవలికి నిచ్చుచుంట ప్రథమమాప్తతఁ జూడక శంక నుంట లోఁ
బోవయు నృపాళికై యభయమము న్మణిభూషలు గుప్తిఁ బంపి భూ
ధవుఁ డరియందిడందగు భేదం దనయం దివి మాన్పుకోఁదగున్.

టీ. ద్రవిణము = ధనమును, నొవ్వన్ గొంట = తనరాజ్యమందలి ప్రజలునొచ్చునట్లు పుచ్చుకొనుటయు, 'హిరణ్యం ద్రవిణం ద్యుమ్న' మ్మని యమరము. ఒఱన్ = ఆలోచనను, ద్రాబలతోన్ = పందలతోడ, ఇడుచుంటన్ = చేయుచుండుటయును, భూమి గొంతఁజొంతదేశమును, అవలికిన్ = వెలుపలికి, ఇచ్చుచుంట = ఒసంగుచుండుటయును,

(శత్రువులు బలాత్కరించి తనభూమి నాక్రమింపఁగా; మంచిపని యని సమ్మతించి యుండుట యనుట. ఈమూఁడు రాజదోషములను), ప్రథమాప్తతక్ = ముఖ్యముగా నిష్ఠలాటను, చూడక = విచారింపక, శంకనుంటక్ = అహితమ్మఁ జేయుచున్న సంశయముతో నుండుటచేత, లోన్=లోపల, పొవయు=పొగరాఁజుచున్నట్టి, నృపాళికై = శత్రువునొద్దనుండు రాజులకొఱకు, అభయముక్ = అభీతిదానమును, మణి = రత్నములను, భూషలు = ఆభరణములను, గుప్తిక్ = రహస్యముగా, పంపి=అనిపి, భూధవుఁడు= రాజు, భిదక్ = భేదోపాయముచేతను, అరియందిడఁదగుక్ = శత్రువునందుంపఁదగును, ఇవి = ఈచెప్పఁబడిన మూఁడురాజదోషములు, తనయందు మాన్పుకోఁదగుక్ = తనయొద్ద లేకుండఁ జేసికొనవలయును.

తా. శత్రురాజు తనకుఁ బరమాప్తులయిన సామంతరాజులయం దపనమ్మకపడఁగా నందుచేత వారు లోపల దుఃఖించుచుండు సమయమున, వారి కభయదానముచేసి, మణిభూషాదులిచ్చి, భేదపఱచి,శత్రురాజతనిరాజ్యమునందలి ప్రజలునొచ్చునట్లు పన్నుపుచ్చుకొనులాగున, దుష్టులతో నాలోచించునట్లును, వైరులు దనభూమి నాక్రమించుకొన్నప్పుడు సోమరితనముననో కయ్యమునకు వెఱచియో కొంతభాగము నిచ్చులాగునను, జేయుచు, దనరాష్ట్రమునందు నివి పుట్టకుండునట్లు విచారించుకొనుచుండవలయును.

క. అహితుఁడు వేఁడిన నేలెడు
మహి సగమే నిచ్చి తెగనిమైత్త్రి గొని విభుం
డహిభయము మాన్పికోఁ దగు
నహిభయ మహిభయముకంటె నధికము గాదే. 249

టీ. అహితుఁడు = శత్రువు, వేఁడినక్ = అడిగినచో, ఏలెడుమహిక్ = తాను రాజ్యముఁ జేయుచున్నట్టిభూమిని, సగముఇచ్చియేక్ = అర్ధమిచ్చియైనను, తెగనిమైత్త్రి గొని = విడువని స్నేహము సంపాదించి, విభుఁడు = రాజైనవాఁడు, అహిభయముక్ = స్వపక్షభీతిని, మాన్పికోఁదగుక్ = నివారించుకొనఁదగును, 'మహీభుజా మహిభయం స్వపక్షప్రభవం భయ' మ్మని యమరము. అహిభయము = స్వచక్రభీతి, అహిభయము కంటెక్ = సర్పభీతికంటెను, అధికముగాదే = అతిశయముకాదా.

తా. రాజులు స్వపక్షమువలననే భయమువచ్చునప్పుడు పగవానికైనను ప్రియము చెప్పి యతఁడు సగమురాజ్యము గోరిన నిచ్చి స్వపక్ష భయమును మానుపకొనవలయును.

చ. పలుకులు వేయు నేమిటికిఁ బార్థివుఁ డాత్మభుజాభృతక్షయా
తలమున గుట్టుఁ జేసు బహుళార్థా యరయించి యడంచి చంచలా

క్షులగమిలో మెలంగుపురుషుండును బోలె నశంక నించుచున్
మెలఁగఁడ యేని రాజ్యఫలమే యది రాజ్యము దుఃఖలబ్ధికే. 250

టీ. పలుకులు=మాటలు, వేయునేమిటికిన్ = వేయియేందులకు, పార్థివుఁడు = రాజు, ఆ...నన్-ఆత్మభుజా = తనబాహువుచేతను,భృత = వహింపఁబడిన, 'దోర్దోషాచ భుజ'యని ద్విరూపకోశము. క్ష్మాతలమునన్ = భూతలమందు, గట్టుఁబేడు = గూఢ శత్రువు, (తనరహస్యమును బయలుపఱచువాఁడనుట) (విరోగినీ సముత్కరముల కీడు చూచుటకు దర్పకురేఁపెడు కట్టుపేడని వారాహప్రయోగము.) బహుధా =అనేక ప్రకారములచేత, అరయించి = వెదకించి, (తెలిసి యనుట.) అడంచి = అడఁచివేసి, చంచలాక్షులగమిలోన్ = స్త్రీసంఘములోపల, మె...లెన్ - మెలంగు = సంచరించుచున్న, పురుషుండునుబోలెన్ = నరునిచందంబున, (స్త్రీలసమక్షమునందుఁ బురుషుండేలాగున నిర్భయుండై యుండునో యట్లనుట.) అశంకనించుచున్ = నిర్భయముఁ జేసికొనుచు, మెలఁగఁడయేని = సంచరింపకపోయెనా, అది = అట్టింటి, రాజ్యఫలమే = దొరతనముఁ జెల్లించుటకుఁ బ్రయోజనమా, రాజ్యము = దొరతనము, దుఃఖలబ్ధికే = అసుఖప్రాప్తికొఱకు (గనుక లోపల నహితు మాచరించువారిని మట్టుఁబెట్టవలయు.)

తే. బెదరి చేరని బలియుఁ ని బిగియఁ బట్ట
కతని మైవడి నే వచ్చి హత్తఁ జేఁత
క్రమము పెనఁగెడుబలుమీను త్రాటఁ జేఁదు
నొడ్డుగాలంపువేఁటకాఁ డుపమ గాఁడె. 251

టీ. బెదరి = ఉలికి, చేరనిబలియున్=దేశమునకున్ రాకమున్న ప్రబలశత్రువును, బిగియఁబట్టక = శ్రమపడిగ్రహింపక, అతనిమైవడినేవచ్చి = తనకుఁదానేవచ్చి, హత్తఁ జేఁత = తనకుఁ బట్టుపడులాగునఁజేయుట, క్రమము = యుక్తము, పె...ను-పెనఁగెడు = లాగులాడుచున్న, బలుమీను = గొప్పమత్స్యమును, త్రాటన్ = త్రాటిచేత, చేఁదు = చేఁదుచున్నటువంటి, ఒడ్డుగాలంపువేటకాఁడు = గట్టుననున్నట్టి బడిశధారియగు లుబ్ధకుఁడు, (గాలమును మత్స్యముపట్టఁగానే వడితో లాగిన నాసూత్రము తెగును గాన నట్లు గాకుండ లాగుచును వదలుచును మెల్లఁగాఁ జేఁదుకొనుచున్నబడిశధారి యనుట.) ఉపమగాఁడే = దృష్టాంతముగాఁడా. (కావున నెట్టికార్యమునైనను నేర్పుతో సాధింపవలయు ననుట.)

సీ. దండపారుష్యంబు కొండెంబున నతర్క-
మరిసంధి కేడయినాక మరలఁబడుట

యవలితప్పెన్నికన్న విదేశ్యుఁ జెఱచుట
ప్రతిప్రవర్తకున కేర్పడఁగఁ జేత
జనులవిశ్వాసంబు ॥ గనుఁగొని మెలఁగుట
విశ్వసనీయుల ॥ వేర్పఱచుట
మోమోట మంత్రంబుచో ॥ మిక్కిలిడుకొంట
మంత్రభేత్తకు నాజ్ఞ ॥ మఱచియుంట

తే. వింత పుట్టినఁ గనుగల్గి ॥ చింతసేయ
కుంట మాన్యులపట్టున ॥ నొక్క చూపె
చూడకుంట విహీనులఁ ॥ గూడుకొంట
వ్యసనియైయుంట చలముంట ॥ వలదు పతికి. 252

టీ. దండపారుష్యంబు = కఠినశిక్షయు, కొండెంబునకు = పైశున్యమందు, అత ర్క్యము = చర్చచేసిపరీక్షింపకుండుటయు, అరి = శత్రునితోడ, సంధికి = సమాధాన పడుటకు, ఎడయాక = సందీయక, మరలఁబడుట = తిరుగుబాటగుటయు, అవలితప్పెన్ని కన్న = దేశాంతరమునుండి తనకక్కడి స్వామిచేసినయపరాధమునెంచి తన్నునమ్మి చూడవచ్చిన, విదేశ్యుకు=వైదేశికుని, చెఱచుట = చెడగొట్టుట, ప్రతిప్రవర్తకునకు = ప్రతికూలుఁడైన ప్రధానికి, ఏర్పడఁగన్ = తేటపడునట్లు, చేత = ఆలోచనసేయుటయు, జనులవిశ్వాసంబు=ప్రజలకుఁగల యప్రీతిని, కనుంగొని = తెలిసికొని, మెలఁగుట=వారితోఁ గూడియుంటయు, విశ్వసనీయులన్ = నమ్మఁదగినవారలను, వేర్పఱచుట = భేదము గలవారిని ఎన్నికొనుటయు, మోమోటన్ = ముఖప్రీతిచేత, మంత్రంబుచోన్ = ఆలోచించుస్థలమందు, మిక్కిలిడుకొంట = ఆలోచనకుఁ దగినివారినిఁజేర్చుకొనుటయును, మంత్రభేత్తకున్ = ఆలోచనవెల్లడిచేసినపురుషునకు, ఆజ్ఞ = శిక్షవిధించుటను, మఱచి యుఁంట=విస్మరించియుండుటయు, వింతపుట్టినన్ = ఉత్పాతములుజనింపఁగా, కనుగల్గి = మెలఁకువగలవాఁడై, చింతసేయకుంట = వానికిఁబ్రతిగావింపనాలోచింపకుండుటయు, మాన్యులపట్టునన్=పూజ్యులవిషయమై, ఒక్కచూపె = ఏకరీతిగా, చూడకుంట = పూజ సేయకుండుటయు. హీనులన్ = దుష్టులతోడ, కూడుకొంట = సహవాసముఁజేయుటయు, వ్యసనియైయుంట=స్త్రీ ద్యూతమృగయాది-చింతలు గలవాఁడైయుండుటయు, చలముంట= పట్టుదలకలిగియుండుటయును (అనఁగా మాత్సర్యముకలిమి యనుట), పతికిన్ = రాజునకు, వలదు = కూడదు,

తా. రాజైనవానికి నీపద్యమునందుఁ జెప్పంబడియున్న దండపారుష్యాది దుర్గుణ ములు లేకయుండెనేని చిరకాలము రాజ్యసుఖ మనుభవించుచుండును.

క. త్రివిధోత్పాతములొదవిన, నవనివిభుఁ డువిడువలయు నధిక ద్రవ్యం
బవనీసురముఖసురముఖ,పవనసఖముఖముల భుక్తిబలిహోమవిధిన్.

టీ. త్రివిధోత్పాతములు = దివ్యభౌమాంతరిక్షము లనియెడు మూఁడు తెఱంగులై తెలియవచ్చునట్టికీళ్లు, ఒదవినన్ = జనింపఁగా, అవనివిభుఁడు = రాజు, అ...లన్-అవనీసురముఖ = బ్రాహ్మణముఖమందును, సురముఖ = దేవతావదనమందును, పవనసఖముఖములన్ = అగ్నిముఖమందును, భుక్తి = భోజనములచేతను, బలి = పూజోపహారాదులచేతను, హోమవిధిన్=వ్రేల్చుటచేతను, అధికద్రవ్యంబుం = వెక్కుధనమును, విడువవలయున్ = వినియోగము చేయవలయును, క్రమాలంకారము.

తా. త్రివిధోత్పాతలక్షణము. వృద్ధవసిష్ఠుఁడు చెప్పియున్నాఁడు. 'దివిజా యే ఋక్షగ్రహాస్తేదివాఖ్యా మహాఫలదాః, పరివేషేంద్రధనురుల్కా గంధర్వ నగరనిర్ఘాతాః, గగనవికారజ మేతన్మధ్యమఫలదం తథాంతరిక్షం చ, భూమిభవాభౌమాస్స్యశ్చరస్థిరా వస్తుసంభవాయేచ, ఏతేఽధమఫలదాస్స్యస్తేషాం కథయామి ఫలాని రూపాణి. ఆబాలవిద్వజ్జనసుప్రసిద్ధం యద్వస్తురూపంప్రకృతం తతోన్యత్, ఉత్పాతమాణ్యాస్త్రివిధం వదంతి దివ్యాంతరిక్షక్షితిజన్మభేదమ్.' తదుత్పత్తికారణము వృద్ధవసిష్ఠుఁడు చెప్పియున్నాఁడు. 'అధర్మతత్త్వసత్యాచ్చ నాస్తిక్యా దతిలోభతః, అనాచారా న్నృణాం నిత్య ముపసర్గః ప్రజాయతే, తద్భేదా స్త్రివిధోత్పాతా జాయంతే దుఃఖరోగదాః, దివ్యాంతరిక్షక్షితిజాః వికారా ఘోరరూపిణః.' వరాహోక్తి 'మనుజానామపచారా దపరక్తాదేవతాస్సృజంత్యేతాన్. తత్ప్రతిఘాతాయ నృపశ్శాంతిం రాష్ట్రే ప్రయుంజీత.' గార్గివచము. 'అకృత్వా శాంతికం రాజా దుఃఖాం భోధా నిమజ్జతి, పురే జనపదే కోశే వాహనేషు పురోహితే, స్త్రీష్వాత్మనిచ పుత్రేషు పచ్యతే చైవ మష్టసు.' అనియున్నందున, రాజట్టియుత్పాతంబులు గలుగకుండునట్లు పాలింపవలయు, నొకవిధంబున నవి గలిగెనేని, యవ్యవహితముగఁ దచ్ఛాంతియైనను జేయవలయును.

ఉ. స్పర్ధ పరస్పరంబు దొరలపట్టున యోధులపట్టునన్ నృపుల్
వర్ధన మొందఁ జేయఁదగు నవారిహితాహితచర్య లొందవం
తర్ధి మిథోవ్యథావహ హితత ప్రథమానసమానతా ప్రథా
ధూర్ధరతాదులం దగిలి ద్రోహపుఁజింతఁ దలంప రేమియున్. 254

టీ. నృపుల్ = రాజులు, దొరలపట్టునన్ = గొప్పయుద్యోగస్థులవిషయమునను, యోధులపట్టునన్ = వారిక్రింద నుండుభటుల విషయమునను, పరస్పరంబు = ఒండొరులను, స్పర్ధ=విరోధము, వర్ధనమొందన్ = వృద్ధిఁబొందునట్లుగ, చేయఁదగున్ = చేయ

వలయును (అట్లు కలహాముపుట్టించినట్లయినను), వా...లు - వారి = వారలయొక్క, హితాహితచర్యలు = మంచిచెడ్డనడతలు, అంతర్ధిక్ = దాఁగుటను, ఒందవు = పొందవు, మి...లక్ - మిథః = అన్యోన్యము, వ్యథావహ = దుఃఖహేతువగు, హిత = ఇష్టులని, ప్రథమాన=ప్రసిద్ధులై, సమానతా=సములై యుండుటచేతనైన, ప్రథా=ప్రసిద్ధియొక్క, ధూర్ధరతాదులక్=ధురంధరత్వము మొదలగువానియందు, తగిలి=తగులుకొని, ఏమియున్= ఇంచుకంతైనను, ద్రోహపుఁజంతక్ = చెడుచింతను, తలంపరు = స్మరింపరు. (అందఱును హితాచరణమునం దాసక్తులై యుందు రనుట.)

చ. ధరణిపుఁ డెందునేఁ దగదు ♦ తాఁ జన నూఱట కొక్కనిం దగుం
దొర నొనరించి పంప నరి ♦ దుర్బలుచేఁ జెడఁ డాతఁ డర్థభూ
కరితురగర్ధి లేక కొఱగాఁ డటు సేయ ద్విజాన్యుఁ డల్కకే
నెరపు నతండునున్ వలయు ♦ నిండినదుర్గబలోర్వి యీఁ దగున్.

టీ. ధరణిపుఁడు = రాజు, ఎందునేన్ = ఎచ్చటికెచ్చటికేనియును, తాన్ = తాను, చనఁదగదు = చనరాదు కనుక, ఊరటకున్ = తనకుసహాయముగా నుండుటకు, ఒక్కనిన్ = ఒక్కని, దొరన్=ప్రభువునుగా, ఒనరించి = చేసి, పంపన్ = అంపుట, తగున్ = యుక్తము, అరి = ప్రబలశత్రువు, దుర్బలుచేన్ = బలహీనునిచేత, చెడఁడు = సాధింపఁబడఁడు (కావున), ఆతఁడు = ఆయధికారపురుషుఁడు, అ...ర్ధి - అర్థ = రొక్కముయొక్కయు, భూ = వలయునట్టి భూమియొక్కయును, కరి = ఏనుంగుల యొక్కయు, తురగ=గుఱ్ఱములయొక్కయును, ఋద్ధి=సమృద్ధి, లేక = లేకయుండెనేని, కొఱగాఁడు=పనికిరాఁడు, అటుసేయన్ = అట్లు పెంపుఁజేసినదపుటకు, ద్విజాన్యుఁడు = క్షత్రియుఁడు లోనగువాఁడు, అల్కకే = అళుకులేక, నెరపున్ = తగినవాఁడై నిలుచును, అతండునున్ = ఆబ్రాహ్మణుఁడును, వలయున్ = రాజునకాప్తుఁడై యుండ వలయును, నిం...ర్వి - నిండిన = నిండారిన, దుర్గబలోర్వి = దుర్గమును గజతురంగబల ములును భూములును, ఈఁదగున్ = ఇయ్యఁదగును. దుర్గస్థలములు బ్రాహ్మణుల కీయక క్షత్రియాదుల కిచ్చిన వారు మల్లఁబడి పోరుదు రనుట.)

క. అడవులు గడిదేశములవి
దడములుగాఁ బెంపు మాత్మ ♦ ధరణీస్థలికిన్
నడుములవి పొల్లుపొల్లుగఁ
బొడిపింపుము దస్యుబాధ ♦ పొందక యుండన్. 256

టీ. గడిదేశములవి = గడిస్థలములయందుఁగల, అడవులు = విపినములను, దడ ములుగాన్ = బలుఁబిడిగా, పెంపుము = వృద్ధిఁబొందింపుము, ఆ...కిన్ - ఆత్మ = తన

యొక్క, ధరణీస్థలికిన్ = దేశమునకు, నడుములవి = మధ్యముననుండునట్టి యడవులను, దస్యుబాధ = దొంగలవలనియుపద్రవము, పొందకయుండన్ = కలుగకుండునట్లు, పొల్లు పొల్లుగన్ = తునుకలుగా, పొడిపింపుము = నఱికింపుము.

తా. నీయేలుబడిదేశమునందు మధ్యమున నున్న యడవులను జోరబాధ లేక యుండుటకై పొడిపొడిగాఁ గొట్టివేయింపుము.

చ. క్షమఁ గుఱుమన్నెపుంగహనచారిజనం బెడ దోషదృష్టి కు
డ్యముఁ గడుగంగఁ బూన్కి దెగ దల్గిన సర్వము బాస నీగి వ
శ్యముగ నొనర్పఁ దాడి కగు నొంగడి కొల్లలకు న్శతాపరా
ధమును సహస్రదండము నతర్క్యము సర్వము నేలువానికిన్. 257

టీ. క్షమన్ = భూమియందు, కుఱుమన్నెపుంగహనచారిజనంబెడన్ = కొంచెపాటిమన్నెఱికముగల యాటవికజనులపట్ల, దోషదృష్టి = దోషమెంచుట, కుడ్యమున్ = మంటిగోడను, కడుగంగఁబూన్కి = మన్ను లేవకుండఁ గడుగుటకు దొరకొన్నచందము, అల్గినన్ = వారిపట్లఁగోపగించినను, సర్వము దెగదు = మొదలంట తెగదు, బాసన్ = సత్యవాక్యము చెప్పుటచేత, ఈగిన్ = వాహనాదుల నిచ్చుటచేతను, వశ్యముగన్ = తనకు వారు వశవర్తు లగునట్లుగా, ఒనర్పన్ = చేసికొన్నట్లయిన, దాడికిన్ = శత్రువుల మీఁదదండెత్తుటకు, అగున్ = పనికివచ్చును, గడికొల్లలకున్ = గడిదేశములు కొల్లఁబెట్టుటకును, ఔన్ = పనికివచ్చును, సర్వమున్ = సమస్తమును, ఏలువానికిన్ = పరిపాలనముఁజేయు రాజునకు, శతాపరాధమును = అనేకులు చేయునట్టియపరాధమును, సహస్రదండమున్ = అనేకజనులను శిక్షించుటయును, అతర్క్యము = తలంచుట యుక్తముకాదు.

తే. సింధుర మహాశ్వముఖ్యము లేర్చు దౌల
దీవివణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెలమేలు గలుగఁ బ్రాంత
వారిఁగాఁ జేయు మరి నవి చేరకుండ 258

టీ. సిం...ల్-సింధుర = ఏనుఁగులును, మహాశ్వ = గొప్పయశ్వములు, ముఖ్యముల్ = లోనగువానిని, చే...కున్-చేర్చు = తెచ్చుచున్నట్టి, దౌల = దూరముననున్న, దీవివణిజులకున్ = ద్వీపములయందలి వర్తకులకు, ఊళ్లు = గ్రామములు, పురిన్ = నీపట్టణమందు, సద్గృహములు = మంచియిండ్లును, కొలువున్ = నిత్యము నీసేవయును, తేజము = బహుమానములును, వెలమేలు = వారికొనుమొదలుమీఁద నాదాయమును, కలుగున్ = కలుగునట్లుగా, (చేసి) అవి = అగజాదివస్తువులు, అరిన్ = నీశత్రువును, చేరకుండన్ = చెందకయుండునట్లు, ప్రాంతవారిఁగాన్ = వారలను నీవారినిగాను, చేయుము = ఒనర్చుకొనుము.

తే. గడినృపులరాయబారులయెడఁ గొలువున
సరససల్లాపములు రాజు సలుపవలయుఁ
గార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక
వలయు నవి మైత్త్రిఁ దా దేలఁ బలుకవలయు. 259

టీ. రాజు = ప్రభువు, గ...డన్-గడినృపుల = తనభూమికి సమనంతరదేశాధిపతుల యొక్క, రాయబారులయెడన్ = నియోగులపట్లను, కొలువునన్ = తనకచేర్చియందు, సరససల్లాపములు = రసయుక్తములగు మంచిమాటలె, సలుపవలయున్ = ఆడవలయును, కార్యఖడ్గములు = కార్యసమాచారములను ఖడ్గసమాచారములను, అనుచరుల్ = సమీపస్థులు, కానన్ = తెలియునట్లు, పలుకవలయున్ = వచింపవలయును. అవి = చారులచేత నట్లు చెప్పఁబడినమాటలను, తాన్ = రాజు, మైత్త్రిన్ = స్నేహాభిప్రాయముచేత, తేలఁ బలుకవలయున్ = ఆమాటలు తప్పిదము లైనవి కావని తేలఁబలుకవలయును.

తే. తా నవంబుగ దొరఁజేయువానిమంత్ర
మునకు వేగమె లోఁజేయఁజనదు వాఁడు
క్రొత్తమన్నన రహిఁ ననుఁగులకుఁ జెప్ప
నయిన నదిచెడు మఱి వాఁడు నడఁగుఁ గాన. 260

టీ. (రాజు), తాన్ = తాను, నవంబుగన్ = క్రొత్తగా, దొరఁజేయువానిన్ = దొరతన మిచ్చి పెంపుఁజేసిననరుని, మంత్రమునకున్ = ఆలోచనకు, వేగమె = వేగిరముగా, లోఁజేయఁజనదు = కూర్చికొనఁగూడదు, (అట్లుచేర్చుకొనినట్లాయెనా) వాఁడు = ఆక్రొత్తయుద్యోగస్థుఁడు, క్రొత్తమన్ననన్ = నూతనపుబహుమానములకు నుప్పొంగి, రహిన్ = తేజముతో, అనుఁగులకున్ = తన నెయ్యురకు, చెప్పన్ = చెప్పఁగా, అయినన్ = కొనసాగినను, అది = ఆ కార్యము, చెడున్ = కాకపోవును, మఱి = ఇంతియకాక, వాఁడున్ = అట్లు మంత్రమును బైటఁబెట్టినవాఁడును, అడఁగున్ = చెడిపోవును, కానన్ = కావున, (మంత్రమునకు లోఁజేయఁగూడ దని యన్వయము.)

సీ. హితబహుశ్రుతధర్మరతశూరతాస్వపూ
ర్వతల మన్ద్విజుల దుర్గముల నిలిపి
పులిజున్ను మొదలుగాఁ బురుషాయుషావధి
కం దుండ సవరణ ల్పొందుపఱిచి
చీమంత యైనను సామంతకోటికి
మితము దప్పక యుండ వృత్తు లొసంగి

యాయాధికవ్యయాశనధికంబునుం బ్రజా
  విరుజంబుగాఁగ బంకడరువుఁ గూర్చి
తే. క్షీణరిపుధాత్రిఁ జరదృష్టిచేతఁ జూచి
  బకగతి హఠాద్గ్రహించి తాఁ బ్రజయు నొవ్వ
  కయ పగఱగాత్రములనె చీకాకుపఱచు
  నృపతి డెందానఁ జేయిడి నిద్రవోవు. 261

టీ. హిత...లన్ - హిత = కుశలచింతచేతను, బహుశ్రుత = విశేషశాస్త్రపరిచితి చేతను, ధర్మరత = న్యాయాసక్తిచేతను, శూరతా = మగఁటిమిచేతను, స్వపూర్వతలన్ = తనవంశక్రమానుగతత్వముచేతను, (కూడి) మన్ ద్విజులన్ = వృద్ధియగుచున్న బ్రాహ్మణులను, దుర్గములన్ = దుర్గస్థలములయందు, నిలిపి = ఉంచి, పులిజున్ను మొదలుగాన్= పులిజున్ను మొదలైన నిఖిలంబగు నపూర్వవస్తువులును, పురుషాయుషావధికిన్ = నూఱు సంవత్సరములవఱకును, అందుండన్ = ఆదుర్గములయం దుండునట్లు, సవరణల్ = పద్ధతులు, పొందుపఱిచి = కలుగఁజేసి, సామంతకోటికిన్ = తన్నుఁగొలుచుచుండుమన్నెగాండ్రకు చీమంతయైనను = కొంచెమైనను, మితమున్ = ఆడుకొన్నరీతిని, తప్పక యుండన్ = తప్పిపోకుండ, క్షితులు = భూములు, ఒసంగి = ఇచ్చి, ఆయాధికవ్యయానధికంబును = ఆదాయ మెక్కుడుగాను వ్యయము తక్కువగాను, ప్రజావిరుజంబుగాఁగన్ = తనదేశప్రజలు నొవ్వనియట్లుగా, బండరువున్ కూర్చి = బొక్కసము నించి, క్షీ...త్రిన్ - క్షీణరిపు = క్షయిష్ణువైనశత్రునియొక్క, ధాత్రిన్ = దేశమును, చర దృష్టిచేతన్ = వేగువాండ్రచేతను, చూచి = ఎఱింగి, బకగతిన్ = కొంగచందమునఁ బొంచియుండి, హఠాద్గ్రహించి = సమయము తటస్థింపఁగా నొక్కడాఁటున నాక్రమించి, తాన్ = తానును, ప్రజయున్ = తనయొక్క ప్రజలును, నొవ్వకయ = నొప్పిఁజెందకయే, ప...నె - పగఱ = తనశత్రువులయొక్క, గాత్రములనె = దేహములనే, చీ...తి - చీకాకుపఱచు = కలఁకపడునట్లు చేయుచున్న, నృపతి = రాజు, డెందానన్= ఱొమ్మున, చేయిడి=హస్తము నుంచుకొని, నిద్రవోవున్=సుఖముగా నిద్రించును. (ఇందుఁ జెప్పఁబడియున్నవిధముగా రాజు ప్రవర్తించెనేని యెందేనియు ఖేదమునొందక సుఖంబుల ననుభవించుచుండు ననుట.)

క. ఎచ్చో గజఘోటక్రయ, తచ్చర్వణసుభటజీవి తద్విజసురపూ
  జోచ్చనిజభోగములకగు, వెచ్చము వెచ్చంబు గాదు విత్తంబునకున్.

టీ. విత్తంబునకున్=రాజార్జించినధనమునకు, ఎచ్చోన్ = ఏకాలమందును, గ...లకున్-గజ = ఏనుంగులయొక్కయు, ఘోట = అశ్వములయొక్కయు, క్రయ = కొను

టకును, తచ్ఛర్వణ=వానిమేపునకును, సుభటజీవిత = మంచిరాణువకు నిచ్చునట్టి జీతముల కును, ద్విజ = బ్రాహ్మణులయొక్కయు, సుర = దేవతలయొక్కయు, పూజా = పూజల కును, ఉచ్చనిజభోగములకున్ = ఉన్నతములైన తనయనుభవములకును, అగు = అగునటు వంటి, వెచ్చము = వ్యయము, వెచ్చంబుకాదు = వ్యయముకాదు. (పైని చెప్పఁబడిన వానివిషయమై వ్యయ మవశ్యముగాఁ జేయవలయుఁ గాన నిది దుర్వ్యయ మని తలంపరాదు.)

ఆ. ప్రతిన వలదు వైరి పట్టున నృపతికి
దండువెడలఁ దీఱ కుండుఁ దీఱు
గాక యుండియుండి కాలాంతరమున నౌ
గార్యకాఁడొ యంక గాఁడొ నృపుఁడు. 263

టీ. నృపతికిన్ = రాజునకు, వైరిపట్టునన్ = పగతునిపట్టున, ప్రతిన = ప్రతిజ్ఞ, వలదు=ఎప్పటికిని కూడదు, దండువెడలన్=యుద్ధయాత్రకుఁబోయినను, తీఱకుండున్ = నిర్ణయించుకొన్న సమయమునకు ముగింపుకాకపోవును, తీఱున్ = ముగింపగును, కాక యుండియుండి = అప్పటికిఁ గాకుండనుండియుండి, కాలాంతరమునన్ = మఱియొక సమయమందు, ఔన్=అవును, నృపుఁడు=రాజైనవాఁడు, కార్యకాఁడో=కార్యపరుఁడో, అంకగాఁడో = సమరశీలుఁడో (అనఁగాఁ గాకువుచేతఁ గార్యపరుఁడె యనుట.)

క. పోరానిపట్లఁబొడుచుట,వైరిబలముదిరుగ జయమెుస్వర్గమెుయగునా
నారూపయంత్రతత్ప్రాకారాదులపట్లఁ బ్రజనె కవియింపఁ దగున్.

టీ. రాజు, పోరానిపట్లన్ = శత్రువులుపైకివెళ్లుటకు వసరులేకయున్న సమయ ములను, పొడుచుటన్ = పోరునఁ గొట్టుటచేత, వైరిబలము = శత్రుబలము, తిరుగన్ = వివంకఁబోవ నశక్యమై తెగించి తిరుగుబాటుకాఁగా, జయమెు=గెలుపైనను, స్వర్గ మెు= వీరస్వర్గమైనను, అగున్ = సిద్ధమౌను, (అనఁగాఁ ద్రోవలేక యిక్కట్టున నున్న శత్రు వులబలమును జెనకరా దనుట.) నానారూపయంత్ర = పలుతెఱఁగులగు నాయుధవిశేష ములపట్లను, తత్ = ఆ శత్రురాజులయొక్క, ప్రాకారాదులపట్లన్ = కోటలుమొదలగు వానియందును, ప్రజనె = తనబలమునె, కవియింపం దగున్=కవియునట్లుచేయవలయును గాని తాను బోఁగూడ దనుట.

చ మనమున కొండు రెండుమఱు మంత్రములన్నరిపోవఁ జెప్పినం
జనపతు లాతనిం బిలువ సాగుదు రాగతి సారెఁ బిల్చున

చ్చనువునకే ధనాది గొని ౯ సంగతిగానివి క్రొవ్వి చేయఁ జె
ప్పు నృపతి తద్బహిశ్చరితోము జరుచేఁ బరికింపఁగాఁ దగున్. 265

టీ. మనమునకున్ = రాజులయొక్క యుల్లమునకు, ఒందు రెండుమఱు = ఒకటి రెండుమాఱులు, మంత్రములన్ = ఆలోచనలను, సరిపోవన్=సరిపడునట్లు, చెప్పినన్ = చెప్పినట్లాయెనా, జనపతులు = రాజులు, ఆతనికి=అట్లుదమమనంబునకు సరిపడఁ జెప్పియున్నవానిని, పిలువసాగుదురు = పిలువనారంభింతురు, ఆగతిన్ = ఆతీరునను, సారెఁ బిల్చు = మాటిమాటికిఁబిలువనంపినట్టి, అచ్చనువునకే=ఆచొరవకే, ధనాది = రొక్కము మొదలగువానిని, కొని=వారివలన సంపాదించికొని, క్రొవ్వి = మదించి, సంగతిగానివి = అసంగతములయిన కొన్నిపనులను, చేయన్ = ఒనర్చుటకై, చెప్పున్ = నిర్ణయించును, (అట్లుగావున), నృపతి = రాజు, తత్ = ఆయాలోచన చెప్పువానియొక్క, బహిశ్చరితమున్ = వెలినడవడిని, చరుచేన్ = వేగువానిచేత, పరికింపఁగాఁదగున్ = తెలిసికొనవలయును.

తా. రాజైనవాఁడు రెండుమూఁడు ఆలోచనలకే ఛేలుపోయి వాని నమ్మియుండక వీఁడు పరహితుఁడై యోజనలు చెప్పుచున్నవాఁడో, లేక తనకు హితబుద్ధినిఁ జెప్పుచున్నాఁడో, యని వాని వెలినడవడి నితరులచేఁ దెలిసికొనవలయును.

క. గడివాఁడు చెడునెయేఁ దగుఁ
బెడఁ జేయుట చెడఁడయేని ౯ చెల్మియె తగుఁ బై
గడివాఁ డేపని కగుఁ దన
గడివాఁ డరియైనఁ దనకె ౯ గడికావఁబడున్. 266

టీ. గడివాఁడు = తనపగవానిమానిసియై తనగడి సరిహద్దుననుండువాఁడు, చెడు నెయేన్ = చెడునట్లుతోఁచినపక్షమున, చెడఁజేయుట = అట్లుపొడిచిచెఱుపుట, తగున్ = యుక్తము, చెడఁడయేని = చెడఁ డని తోఁచినట్లాయెనా, చెల్మియె తగున్ = వానితో మైత్రియొనర్చుటయె మంచిది, తనగడివాఁడు = తనయొక్కయెల్లయందుఁ గావలియుండువాఁడు, అరియైనన్ = తనకుశత్రువైనట్టాయెనా, పైగడివాఁడు = పరునిసీమయొక్కగడి కాచువాఁడు, ఏపనికగున్ = ఏమికార్యమునకు వచ్చును, తనకె = తనకొఱకే, గడికావఁబడున్ = గడి రక్షింపఁబడును.

తే. రాష్ట్ర మెరియించుకొనుము దుర్గములు తదవ
రోధ మగుపడ్డఁ బుట్టింటికారూఢి నడపు

పరుషములు తద్రిపులరాయబారులెదుటఁ
బలుకకుము సంధి యొకవేళఁ గావలసియుండు. 267

టీ. రాష్ట్రము = నీ శత్రురాష్ట్రమును, దుర్గములు = వారిదుర్గస్థానములను, ఎరియించుకొనుము = హరింపుము, తదవరోధము = వారిస్త్రీలు, అగపడ్డన్ = దొరకితేని, పుట్టింటిరూఢిన్ = ఆ స్త్రీలు పుట్టినింట నుండఁగా నేమిమర్యాద నడుచునో యట్టి మర్యాదను, నడపుము = జరగింపుము, త...టన్-తద్రిపుల=ఆ శత్రువులయొక్క, రాయబారుల = సంధిమాటలాడువారియొక్క, ఎదుటన్ = ముందరను, పరుషములు = కఠినవాక్యములు, పలుకకుము = వచింపకుము, ఒకవేళన్ = ఒకసమయమునందు, సంధి = సమాధానము, వలసియుండున్ = కావలసియుండును గనుక పరుషము లాడఁగూడ దని పూర్వముతో నన్వయము.

ఆ. అభిచారఘనగరాంబుదూషితరుజ్ని
రంతరాద్రిగహనదంతురోగ్ర
కీకటోర్వి మేరుగిరిసమార్థము వచ్చు
నేని చొరకు మంపు మిడుముకొనఁగ. 268

టీ. అభిచార = అభిచారక్రియలు చేయుజనులచేత, ఘన=నిబిడమైయున్నట్టియు, గరాంబు = విషజలములచేతను, దూషిత = దుష్టమైనట్టియు, రుజ్నిరంతర = వ్యాధిబహుళమైనట్టియు, అద్రి = కొండలచేతను, గహన = కాఱడవులచేతను, దంతుర = ప్రవేశింప నశక్యమైనట్టి, ఉగ్ర కీకటోర్వి = ధూర్తులగు మ్లేచ్ఛులయొక్క భూములను, మేరుగిరి = హేమాద్రితో, సమ = తుల్యమైన, అర్థము=ద్రవ్యము, వచ్చునేని=లభించునట్లుండినను, చొరక = నీవు వెళ్లక, ఇడుముకొనఁగన్ = ఆదేశముల నాక్రమించునట్లు, అంపుము = దళములనుమాత్రము పంపుము.

క. రాణింపఁ బల్కి తనపని
జాణై కొనుఁ గొలుచు సంతసపుఁదఱిఁ దొలఁగుం
ద్రాణ చెడఁ గపటమానిసి
నాణె మెఱుఁగ బచ్చు గాఁగ నరపతికిఁ దగున్. 269

టీ. కపటమానిసి = కుత్సితుఁడైన మనుష్యుఁడు, రాణింపన్ = ఇంపుపుట్టునట్లుగా, పల్కి = మాటలాడి, జాణై = చతురుఁడై, తనపనిన్ = స్వప్రయోజనమును, కొనున్ = కాఁజేసికొనును, సంతసపుఁదఱిన్ = దొర లుత్సాహవంతులై యున్నసమయంబునను, కొలుచున్ = కొలువుఁజేయును, త్రాణచెడన్ = దొర కించుక బలిమిదప్పి

దిగులొందఁగా, తొలఁగుఁగ్ = దాఁటిపోవును, నాశము = మంచిచెడ్డలను, ఎఱుఁగక్ = తాఁ దెలిసికొనుటకు, బచ్చు తాఁగక్ = కోమటివానివలె నుండుట, నరపతికిక్ = ఱేనికి, తగుఁగ్ = అమరియుండును.

సీ. తజ్జ్ఞమండలిఁ గూర్చి ॰ ధాతువుల్ దెలిసి హే
మాదులఁ గొని ప్రకృ ॰ త్యనుగుణాల్ప
జీవనాహృతులచేఁ ॰ జెలఁగి మహాబలో
ద్రేకంబు మర్దన ॰ రిత్తఁ జేసి
స్నేహార్ద్రుఁ డగుచు న ॰ శేషంబుఁ బోషించి
నరవర్ణములతప్పు ॰ సరణు లుడిపి
సతతద్విజప్రతి ॰ ష్ఠాశాలి యై బలి
యించుపట్టులు బలి ॰ యించి పలుచఁ
తే. జేయుపట్టులు పలుచఁగాఁ ॰ జేసి తేజ
మెసఁగ శోధన మఱవక ॰ యెసఁగవలయు
సాంగరాజ్య మొకెత్తుగ ॰ స్వాంగరాజ్య
మొక్కయెత్తుగ నృపతి యాయుష్యపరత. 270

అవ. ఈపద్యమునందు స్వాంగరాజ్యమును బాలించుభంగి సాంగరాజ్యమును రాజైనవాఁడు పరిపాలింపవలయు నని రెండర్థములు వచ్చునట్లు చెప్పుచున్నాఁడు.—

టీ. తత్ జ్ఞమండలిక్ = వైద్యులను, అభిజ్ఞులను, కూర్చి = కలయఁజేసి, ధాతువుల్ = సప్తధాతువులను, సువర్ణాదిజనకములైనధాతువులను, తెలిసి = ఎఱింగి, హేమాదులఁగొని = సువర్ణభస్మము మొదలగువానిఁ బుచ్చుకొని, అధాతువులయం దుండు సువర్ణరజతాదులను స్వీకరించి, ప్ర...చేక్ - ప్రకృతి = తనశరీరప్రకృతికిని, ప్రజలకును, అనుగుణ = తగునట్లు, అల్పజీవన = మితమైనయన్నోదకములయొక్కయు, మితమైన ద్రవ్యములయొక్కయు, ఆహృతులచేక్ = పుచ్చుకొనుటచేత, చెలంగి = ఒప్పి, మహాబలోద్రేకంబుక్ = వాయువుయొక్కప్రకోపమును, ప్రబలశత్రువుయొక్కయౌద్ధత్యమును, మర్దనక్ = అంగమర్దనచేతను, దండించుటచేతను, రిత్తఁ జేసి = మట్టుపఱిచి, స్నేహార్ద్రుఁడగుచ్ = అభ్యంజనమును, ప్రేమయుఁగలవాఁడై, అశేషంబులక్ = సకలావయవములను, సమస్తప్రజలను, పోషించి = పెంపొందఁజేసి, నరక్ = పలితమును, వర్ణములతప్పుసరణులు = దేహమందు దాయాస్థానముల పన్నెలు మాఱుటను, నరవర్ణముల = మనుష్యులయొక్క బ్రాహ్మణాదివర్ణములయొక్క, తప్పుసరణులు = శాస్త్రవిరుద్ధాచారము

లను, ఉడిపి=తదుచితక్రియలచేతను మాన్చి, సతతద్విజప్రతిష్ఠాశాలియై = ఎల్లప్పుడుఁబలు వరుసలకును, బ్రాహ్మణులకును దార్ఢ్యప్రతిష్ఠలను సంపాదించుటచే నొప్పుచున్నవాఁడై, బలియించుపట్టులు బలియించి = హస్తముష్ట్యాదులను, దుర్గములను బలియఁజేసి, పలుచఁ జేయుపట్టులు బలుచఁగాఁజేసి = ఉదరాదులను, మధ్యదేశమునందలి యడవులను బలు చఁగాజేసి, తేజమెసఁగన్ = ఇంద్రియప్రతాపము లభివృద్ధియగునట్లు, శోధనన్ = వస్తిశోధనను, నగరశోధనను, మఱవక = విస్మృతిచెందక, నృపతి = రాజు, ఆయుఃష్య పరతన్ = ఆయుర్వృద్ధియందాసక్తుఁడౌటచేతను,. స్వాంగరాజ్యము = తనశరీరము, ఒక్కయెత్తుగన్=ఒకవంతుగాను, సాంగరాజ్యము = సప్తాంగములతోడిరాజ్యము, ఒక్క యెత్తుగన్ = ఒకవంతుగాను, ఎసఁగవలయున్ = పెంపొందవలయును.

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కాల్య
వేళఁ గార్తాంతిక ద్విజులగోష్ఠి
జాము వోవ నమాత్య సామంతపూర్వకం
బర్థార్జనస్థ కాయస్థగోష్ఠి
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం
బగుసూనసూపకృన్మృగయుగోష్ఠి
యపరాహ్ణమున దేవతార్చనపూర్వకం
బార్యధర్మాధికృద్యతులగోష్ఠి
తే. భుక్తిమీఁద విదూషకపూర్వకము పు
రాణకవిగోష్ఠి చారపూర్వకము సంజ
జాముగాయకగోష్ఠి నిశన్ సుషుప్తి
పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసఁగుఁ బతికి. 271

టీ. పతికిన్ = రాజునకు, కాల్యవేళన్ = ప్రభాతసమయమునందు, 'ప్రత్యూషో హర్ముఖంకల్య' యని యమరము. సౌ...ము- సౌఖశాయనిక = సుఖశయనమాయని యడుగువారును, 'భృగ్వాదీననుగృహ్ణంతుసౌఖశాయనికానృషీ' నని రఘువంశమునందుఁ గవిపుంగవుఁడైన కాళిదాసుని ప్రయోగ మున్నది. భిషక్ = వైద్యులును, పూర్వకము = మొదలుగా, కార్తాంతికద్విజులగోష్ఠి = జ్యోతిశ్శాస్త్రవిదులైన విప్రులయొక్క సంబం ధమును, జామువోవన్ = జాముప్రొద్దెక్కిన వెనుకను, అ...బు-అమాత్య - మంత్రులును, సామంత = అమరగాండ్రును, పూర్వకంబు = మొదలుగా, అ...ష్ఠి-అర్థార్జనస్థ = ద్రవ్యార్జనాధికారమునం దుండువారలయొక్కయు, కాయస్థ = కరణాలయొక్కయు,

గోష్ఠి = సంబంధమును, దినమధ్యమమునన్ = మధ్యాహ్న సమయమునందు, మ...బు-మర్దన = అంగమర్దనముఁ జేయునట్టి, మల్ల = జెట్టివాండ్రు, పూర్వకంబుగన్ = లోనుగా, సూ...ష్ఠి సూద = వంటకమువండువారియొక్కయు, సూపకృత్ = పప్పుకూరలువండు వారలయొక్కయు, మృగయు = వంటవారికి మాంసముదెచ్చియిచ్చునట్టి వేటకాండ్ర యొక్కయు, గోష్ఠి = సాంగత్యమును, అపరాహ్ణమునన్ = పగటితృతీయభాగము నందు, దేవతార్చనాపూర్వకంబు = దేవపూజ మొదలుగా, అర్య=పూజ్యులయొక్కయు, ధర్మాధికృత్ = ధర్మాధికారులయొక్కయు యతుల = జ్ఞానము నుపదేశించుచున్న మానులయొక్కయు, గోష్ఠి = సభయును, భుక్తిమీఁదన్ = భోజనముఁ జేసినపిమ్మటను, విదూషకపూర్వకము = వికటకవులు మొదలుగా, పు...ష్ఠి - పురాణ = పౌరాణికుల యొక్కయు, కవి = కవీశ్వరులయొక్కయు, గోష్ఠి = సభయును, సంజజాము = సాయం కాలమునందు, చారపూర్వకము = వేగులవారు మొదలుగా, గాయకగోష్ఠి = పాఠకుల యొక్కగోష్ఠియును, నిశన్ = రాత్రియందు, సుషుప్తిపూర్వకము = నిద్రవోవుట మొద లుగా, ప్రేయసీగోష్ఠి = తనప్రియురాలిగోష్ఠియును పొసఁగున్ = ఒప్పును.

క. హితులు హితాహితులు సదా
హితులును నై రాజునెడల నిటు త్రివిధమునన్
క్షితి ననుచరు లుందురు సం
తతముగ్ మఱి వారిఁ దెల్పెదన్ విను మనఘా. 272

టీ. ఈపద్యార్థము తరువాతిపద్యమున స్పష్టమగునుగనుక దీనికి టీక వ్రాయ లేదు.

చ. హితులు భిషగ్గ్రహజ్ఞబుధబృందకవీంద్రపురోహితు, ల్హితా
హితులు ధనార్జనాదినృపకృత్యనియుక్తులు, వెండి కేవలా
హితులు దశావశార్పితసమృద్ధరమాభరణేచ్ఛు, లౌట నా
హితమును సల్లఁ గాఁ జతురవృత్తిఁ జరించుట నీతి జేనికిన్. 273

టీ. భి...ల్ భిషక్ = వైద్యులును, గ్రహజ్ఞ=జ్యోతిషికులును, బుధబృంద = విద్వత్సమూహమును, కవీంద్ర = కవివరులును, పురోహితుల్ = పురోహితులును, హితులు = ఇష్టులు ధ...లు-ధనార్జనాది = ద్రవ్యముపోగుచేయుట మొదలగు, నృప కృత్య = రాజకార్యములయందు, నియుక్తులు=అధ్యక్షులుగా నియమింపఁబడినవారలు, హితాహితులు = హితులుగా నహితులుగా నుందురు. వెండి=మఱియు, దశావశార్పిత = ఆయాదశావశము చేత నగరికీయఁబడినట్టి, సమృద్ధరమాభరణేచ్ఛులు = సమగ్రమైన క్షమయైశ్వర్యములను సమయభేదములయందు మరలఁ బొందవలయు నని కాచియుండు

వారలు, కేవలాహితులు=కేవలశత్రువులు, ఔటన్ = అట్లగుటవలన, అహితమును=వారి పట్లతాఁజేసినహితమును, అట్లకాన్ = తదనుగుణమగునట్లుగా, చతురవృత్తిన్ = నైపుణి చేత, చరించుట = వర్తించుట, ఱేనికిన్ = రాజునకు, నీతి = తగినది.

ఆ. పాత్రభూతు లెస్సఁగ బరికించి యతఁ డడు
గకయు నొకఁడు*సెప్పకయు మునుపుగఁ
బనసపండ్లు దిగినపరిగ స్వప్నము గన్న
నెఱిగ నొసఁగి వెఱఁగు పఱచు టొప్పు. 271

టీ. పాత్రభూతున్ = సత్పాత్రుఁడైనవానిని, లెస్సన్=చక్కఁగా, పరికించి = తెలిసి, అతఁడు = ఆయోగ్యపురుషుఁడు, అడుగకయున్ = అడుగకుండుటకును, ఒకఁడు సెప్పకయున్ = మఱియొకఁడు దరనికి దాన మిమ్మని తనతోఁ జెప్పకుండుటకును, మును పుగన్ = పూర్వమే *పనసపండ్లు దిగినపరిగన్ = మొత్తములుగాఁ బనసపండ్లొకసారి దిగినచందముగా, స్వప్నముకన్న నెఱిగన్ = కలలో సకలవస్తుజాతముల నొక్కపర్యాయ ముగాఁ జూచినరీతిని, ఒసంగి = ఒక్కసారిగానే హేరాళముగా నిచ్చి, వెఱఁగుపఱచుట= ఆసత్పాత్రు నద్భుతమొందఁజేయుట, ఒప్పున్ = తగును.

---

* 'చెప్పకయున్ మునుపు =,రాజు నీకు సత్కారము చేయనున్నాఁడని ఆతనితో ఎవ్వఁడును చెప్పక ముందే - ఇచ్చి అశ్చర్యపెట్టుట ఒప్పున్' అని వే. టీ. అనుచితము.

'పనస...రిగన్ = ఉన్నట్టే ఉండి ఒకక్షణములో పనసచెట్టునిండ పనసపండ్లే దిగఁబడిన నెట్లుండునో ఆవిధముగాను. అభూతోపమ' అని వే. టీ.

పనసపండ్లు దిగుట యనఁగా పనస (చెట్టున) పిందెలు పుట్టుట యని సంప్ర దాయార్థము.—"దిగుట To come forth as fruit from the bud' బ్రౌను.

పనస వనస్పతి. అనఁగా పూఁతలేకయే కాయలు కాయుచెట్టు, మేడివంటిది. కావున ఫలోత్పత్తికిముం దెట్టిసూచనయు నుండదు. ఉన్నట్లేఉండి చెట్టు ఆపాదమస్తకము పిందెలుపుట్టి కూర్చుండును.

పనస తటాలున సమృద్ధిగా ఫలించి ఆశ్చర్యము కలిగించునట్లు రాజు తటాలున సమృద్ధిగా సత్కరించి ఆశ్చర్యమును గొలుపవలె నని యర్థము. చక్కనిఉపమ.

'పనసపండ్లు దిగినపరిగన్' అనుదానికి టీయమునకు—'పనసపండ్లే దిగఁబడిన నెట్లుం డునో ఆవిధముగాను' అని యర్థముచేయుటయు, అది 'అభూతోపమ' యనుటయు సరి కాదు.

క. పితృదేవక్రియలనువిధిఁ, బితృక్రియలెసూక్ష్మలగుటఁబితృభక్తుఁడవై
శ్రుతిశీలతపశ్శాంతా, చ్యుతభక్తులకొసఁగి పనుపు మున్నతగతికిన్.

టీ. పితృ = పితృదేవతలయొక్కయు, దేవ=దేవతలయొక్కయు, క్రియలన్ = కర్మములయందు, విధిన్ = విధిశాస్త్రముచేతను, పితృక్రియలె = పితృప్రీతికరములైన కర్మములె, సూక్ష్మలగుటన్=బుద్ధిమంతులచే విచారింపఁదగిన యతిశయము గలవి యగుట చేత, పితృభక్తుఁడవై = నీవును బితృభక్తి గలవాఁడవై, శ్రుతిశీలతపశ్శాంతాచ్యుతభక్తులకున్ = శాస్త్రాధ్యయనముచేలను మంచినడకలచేతను వయస్సుచేతను శాంతులై యచ్యుతునిభక్తిగల్గియున్న వారలకు, ఒసంగి = అభీష్టవస్తువుల నిచ్చి, ఉన్నతగతికిన్= పితృలనూర్ధ్వలోకములకు, పనుపుము = అంపుము.

క. దానము ద్విజరక్షణకును
జ్ఞానము నిజరక్షణకుఁగ శరణముఁ జొరు మెం
తే నారాయణు 'రాజ్యాం
తే నరకం ధ్రువ' మటంట దీఱునె యొంటన్. 276

టీ. (బ్రాహ్మణసంరక్షణము రాజధర్మ మగుటంజేసి) దానము = తాఁజేయునట్టి దానములు, ద్విజరక్షణకును = బ్రాహ్మణసంరక్షణకొఱ కనియు, జ్ఞానము = శ్రీపతిసర్వోత్కృష్టుఁ డనియు నీ సమస్తచేతనులు నతనికి దాసభూతు లనియు నెఱుంగుట, నిజరక్షణకుఁగన్ = తనరక్షణార్థమనియును, (తెలిసి), ఎంతేన్ = మిక్కిలి, నారాయణున్= శ్రీమన్నారాయణుని, శరణముఁజొరుము=లెస్సఁగా శరణువేఁడుము, రాజ్యాంతే నరకం ధ్రువ మటంట=రాజునకు రాజ్యాంతమునందు నరకము నిశ్చయ మను లోకోక్తి గలదు గావున నది, ఒంటన్ = మఱియొక్కదానివలన, తీఱునె=తొలఁగునా (తొలఁగ దనుట.)

తే. ఆలు పతిభక్తి స్త్రీపుంస పాళి వావి
యతి వశిత్వము దిగుజాతు లగ్రజాతి
ననుసరించుట హితవృత్తి నధిపునికి
భృత్యుఁ డొదవుట నృప దండ భీతిఁ జుమ్ము. 277

టీ. నృప = ఓయిరాజా! ఆలు = భార్య, పతిభక్తి = భర్తవిషయమైన పూజ్యానురాగమును, స్త్రీ...ళి-స్త్రీపుంస = స్త్రీపురుషులయొక్క, పాళి = పఙ్క్తి, వావి = వరుసలను, యతి = జడదారి, వశిత్వము = ఇంద్రియనిగ్రహమును, దిగుజాతులు=తక్కువజాతివారు, అగ్రజాతిన్ = మొదటిజాతివారిని, అనుసరించుట =భక్తియుక్తులై యనుసరించియుండుటయును, అధిపునికిన్ = ఏలెడువానికార్యమునకు

హితవృత్తిక్ = మంచినడతగలవాఁడై, భృత్యుఁడు = బంటు, ఒదవుట = ఉపయోగ పడుటయును, దండభీతిఁజుమ్ము = దండభయముచేతఁజుమీ. (ఇట్లుండుటంజేసి రాజులకు యుక్తదండ మవశ్యకర్తవ్య మనుట.)

ఆ. చంపి ధార్మికుండు, సతిఁ బొందె మఱి బ్రహ్మ
చారి, బొంకి సత్యశాలి, యార
గించి సదుపవాసి, కేడించి శూరుఁడు,
చిందె ధనియు, నగు విచిత్రసరణి. 278

టీ. చంపి = దుష్టులను మచ్చుమాపి, ధార్మికుండు = ధర్మాత్ముఁడును, సతిక్ =తన ధర్మపత్నిని, కూడి = ఋతుకాలములయందుఁగలిసి, బ్రహ్మచారియు = బ్రహ్మచర్యము సల్పువాఁడును, బొంకి = పరులకు మేలు గలుగుపట్ల దబ్బఱలాడి, సత్యశాలి = యథార్థ వాది, ఆరగించి, (ఆవేళయందు భుజింపక) 'సాయంప్రాతర్ద్విజాతీనా' మనువిధి ననుసరించి యినుమాఱుమాత్రము భోజనముచేసి, సదుపవాసి =ఆహారరహితుఁడును, కేడించి= గురుజనాదులతో వారియనుమతిని సంప్రాప్త మగుయుద్ధముపట్ల విముఖుఁడై చాలించి, శూరుఁడు = వీరుఁడును, చిందె = సత్పాత్రమందు మెండుగ వ్యయముచేసి, ధనియుక్ =ధనికుఁడును, విచిత్రసరణిక్ = అద్భుతరీతిని, అగుక్ = అవును. (కావున ధర్మ సూక్ష్మమును దెలిసి నడవవలయు ననుట).

తా. దుష్టుల నుక్కడంచువాఁడు ధర్మాత్ముం డనియును ; ఋతకాలములయందు మాత్రము భార్యాసంగమముచేయువాఁడు బ్రహ్మచారి యనియును ; పరులకు మేలు కల్గునిమిత్త మబద్ధములాడువాఁడు సత్యవంతుఁ డనియు ; దినమున కినుమాఱులు భోజనముచేయుఁవాఁడు సదోపవాసి యనియును ; పెద్దలయనుమతిచే శత్రువును జయింపకయే యుద్ధమునుండి మఱలినవాఁడు శూరుఁ డనియును ; ధనమును సద్వినియోగ మొనర్చువాఁడు ధనికుఁ డనియును భావము.

ఆ. ప్రణిధి స్వపురగృహియు భాషావిదుఁడు ప్రణి
ధ్యంతరావిదుండు నగునతండు
లింగమాత్రకృశుఁడు లిప్స్వాధికద్రవ్య
దానధనియుఁ గాక తఱియెఁ జొరఁడు. 279

టీ. ప్రణిధి = వేగువాఁడు, 'ప్రణిధిః ప్రార్థనే చరే' యని యమరము. స్వపుర గృహియు = తనపట్టణమునందుఁ గాఁపుర ముండువాఁడును, భాషావిదుఁడు = నానా భాషలు దెలిసినవాఁడును, ప్రణిధ్యంతరావిదుండు = దేశాంతరపువేగరులను దెలిసిన

వాఁడును, లింగమాత్రకృశుఁడు = ఏచిహ్నమును లేనివాఁడును, లి...యు - లిప్సా = తాఁగోరినంతకంటె, అధికద్రవ్య = అధికద్రవ్యమును, 'వాంఛాలిప్సామనోరథః' యని యమరము. దానన్ = దొరయిచ్చుటచేత, ధనియు = ధనవంతుఁడును, కాక = కాని వాఁడై, తలఁయఁజొరఁడు = ఆవృత్తికిఁ బ్రవేశింపఁడు.

క. తనుభృశ దమనజ సుకృతము
 ధనదత్తినె కొనఁగవలయుఁ దత్తదృతుకమ
 ర్దనమజ్జనభోజనలే
 పన వసన ప్రసవ వహన పరతం బతికిన్. 280

టీ. త...ము - తను = శరీరమును భృశ = మిక్కిలి, దమనజ = ఉపవాసాదు లుండి శోషింపఁజేయుటచేత సంపాదించునట్టి, సుకృతము = పుణ్యము, పతికిన్ = రాజునకు, ధనదత్తినె = ద్రవ్యము సమితముగా నిచ్చుటచేతనే, కొనఁగవలయున్ = గ్రహింపవలయును, త...తన్ - తత్తదృతుక = ఆయాకాలములకు ననుకూలములైన, మర్దన = అంగమర్దనము, మజ్జన = స్నానము, భోజన = అభ్యవహారము, లేపన = మైపూఁతయు, వసన=వస్త్రము, ప్రసవ=పుష్పము, వహనపరతన్=వీనియొక్క సేవతోనుండి కొనవలయు నని పూర్వపద్యముతో నన్వయము.

క. నానావిధషాడబముల
 నాను [1]నృపాహార మెపుడు నపరాహ్ణమునం
 గాని మఱి [2]శుద్ధకోష్ఠువు
 గానితమి న్భుక్తి యెపుడుఁ గడుఁ బథ్య మగున్. 281

టీ. నృపాహారము = రాజులుభోజనముచేయువంటకము మొదలగునది, ఎపుడున్ = ఏకాలమందును, నా...లన్ - నానావిధ=పలుతెఱంగులైన, షాడబములన్ = రుచులతోడను, అనున్ = కూడియుండును, అపరాహ్ణమునంగాని = అపరాహ్ణమందే కాని, మఱి = అటుగాక, శుద్ధకోష్ఠువు = గర్భగోళశుద్ధి, కానితమిన్ = కాకుండునట్టి త్వరచేత, భుక్తి=భోజనము, ఎపుడు=ఏసమయమందు, కడున్ = మిగులను, పథ్యము = హితము, అగున్ = ఔను. (ఎపుడునుగాదనుట. అనఁగా నపరాహ్ణమునందు భోజనము చేసినట్లాయె నా శరీరమునకు సౌకర్యకరముగా నుండు ననుట.)

క. విను వర్గ సమత నృపుఁడు
 న్నను ధర్మాంశంబె హెచ్చె నా పెఱ మడి కై
 త్తినసీరును దెగి యలరా
 జనపుమడికి నెక్కినట్లు చను ముదమందన్. 282

---

1. ఉపాహార మని డీ. పి. శా. 2. శుద్ధకోష్ఠతఁ, గానితమిన్ భుక్తి...

టీ. నృపుఁడు = రాజు, వర్గసమత = ధర్మార్థకామము లనియెడు త్రివర్గసంపద యందు సమత్వముతో, ఉన్నన్ = ఉండఁగా, ధర్మాంశంబె = అందు ధర్మముమాత్రము, హెచ్చెనా = అతిశయించెనా, వెఱమడికిన్ = మిగిలినమళ్లకు, ఎత్తిన = కట్టఁబడిన, నీరును = ఉదకమును, తెగి = గండిచేసికొని, దాఁజనపుమడికిన్ = వరిపైరుకయ్యకు, ఎక్కినట్లు = పాఱినచందముగా, ముదమందన్ = సంతోషించుట, చనున్ = తగును.

క. వెలయించునట్టి యొకమణి
వెలుఁగాశం గొనుము ధరణి § వెండి సువేషో
జ్జ్వలతకు వలదే వాసర
ముల మణులవిభూషణములు § భూపతి దాల్పన్. 283

టీ. వెలయించునట్టి = నిర్దోషమై వెలుఁగునట్టి, ఒకమణికిన్ = ఒకజాతిరత్నములలోఁ జేరత్నమునైననొక్కటిని, వెలుఁగాశన్ = కాంతియందుఁగల యపేక్షచేతను, కొనుము = విడువక ధరియింపుము, వెండి = ఇంతియేగాక, ధరణికిన్ = భూమియందు, భూపతి = రాజు, సువేషోజ్జ్వలతకున్-సువేష = మంచియలంకారముయొక్క, ఉజ్జ్వలతకున్ = ప్రకాశించుటకు, వాసరములన్ = ఏడువారములయందును తాల్పన్, ధరియించుకొనుటకు, మణులవిభూషణములు-మణుల = రత్నములచేఁ జెక్కఁబడిన, విభూషణములు = సొమ్ములు, వలదె = వలదా, అవశ్యముగ ధరియింపవలె నని కాకువు (అనఁగా నేజాతి యందైనను ఘనమైనరత్న మొకటి ప్రకాశార్థమై నిరంతరము ధరియింపవలయు ననియు, మఱియు నేడు వారాలలోఁ గ్రమంబుగ నాయావారాధిపతులైన గ్రహములకుఁ జెప్పఁబడిన రత్నములసొమ్ముల నాయాదినములయం దలంకరించుకొనవలయు ననియు భావము.)

క. చేయునది రాజ్యమఁట యఘ
మే యవధిగ నీఁగువార § మే మనఁ జన దా
మ్నాయంబు నశక్యాను
ష్ఠేయముఁ జెప్పదు స్వశక్తిఁ § జేయఁగఁ జెప్పున్. 284

టీ. చేయునది = చేయుచుండునది, రాజ్యమఁట=ప్రభుత్వమఁట, అఘము = ఈ పాపమును, ఏయవధిగన్=ఎన్నాళ్లకు, ఏము = మేము, నీఁగువారము = పోఁగొట్టుకొనఁ గలవారము, అనఁజనదు = అని తలంపఁగూడదు, ఆమ్నాయంబును = వేదమును, స్వశక్తిన్=శక్త్యనుసారముగా, చేయఁగన్ = చేయవలయునని, చెప్పున్ = విధించును గాని, అశక్య=సాధ్యము గాని, అనుష్ఠేయమున్ = కృత్యమును, చెప్పదు = విధింపదు, (అనఁగా శక్త్యనుగుణముగ ధర్మమాచరించి యధర్మపరిహార మొనర్చినఁ బాపంబు లంట వనుట.)

వ. మను దండధరాదులు విశేషించి దోషం బెఱింగి దండించియె ధర్మ
పరు లనంబరఁగిరి ప్రజాపరిపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు [1]బహు
ముఖంబులం బుట్టింపం బుట్టి విరాట్సమ్రాట్ప్రభృతి వేదోదితశబ్ద
వాచ్యుండై దేవసదృశుం డగుమూర్ధాభిషిక్తుఁడు సోఁకోర్చియిలకు
వగునలజళ్లు తీర్చినంగాక జన్మంబు సఫలం బగునె కేవలేంద్రియప్రీతి
బందీకృత పరకళత్రపథికపరిషత్ప్రహారణప్రాప్తవిత్తములఁ బాటచ్చర
ప్రభులకు జరుగదే యింత లాంపట్య మేమి పని యని యవనియెడ
నవనవై ముఖ్యంబు చెల్ల దెట్లనినఁ దొల్లి కృతయుగంబునఁ గృతవీర్య
నందనుం డగుసహస్రబాహుం డాత్మీయదోస్తంభసంభృత యగు
నీవిశ్వంభర నేద్వీపంబున నేనాఁట నేవీట నేత్రోవ నేక్రేవ నేవేళ
నెవ్వఁ డేమి సేయం దలంచు నప్పు డందందు నసిముసల చాపాది
శస్త్రాస్త్రధారియై తోఁచి యాజ్ఞయిడు నట్లాజ్ఞయిడ నంతిమం బగు
నీయుగంబున యాగానుసారంబుగా మితసారం బగు రాజలోకంబున
కు శక్యంబు గాదుగదా యొక్క రాజలోకంబునకన నేల యిక్కాలం
బునందలిభూసురులకు నక్కాలంబునందలి భూమిదివిజులకుఁ గలశక్తి
యున్నదె యొక్కబాడబుండు కడలినీరుగ్రుక్కంగొనియెనొక్కవిప్రుం
డు స్రష్టృసృష్టికిఁ బ్రతిస్రష్ట యయ్యె నొక్కబ్రాహ్మణుండు బ్రహ్మదం
డంబున బ్రహ్మాస్త్రంబు వారించె నట్టియనుష్ఠానంబు మాకు లే దెం
దేమి ప్రయోజనం బని శక్త్యనుష్ఠానంబు వీరికి విడువవచ్చునే వీ
రితరుల కుపాసనీయులు గాక పోయిరె కావున సావధానుండవై శక్తి
కొలఁది శ్రుతదృష్టంబు లుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచరించుచు
నశక్యంబునకార్తశరణాగతపక్షుకుం డగుపుండరీకాక్షు మీఁద భారం
బిడి యనహంకృతిఁ బ్రవర్తిల్ల నెల్ల సంసిద్ధులు కరస్థంబు లగు నది
యట్లుండె నట్లయిన పట్టబద్ధుం డగు రాజు ధర్మంబునంద దృష్టి యిడి
నడపవలయువరుణవైశ్రవణ వాయువైశ్వానర వాసవాదుల జన్మం
బులును బహుభవారబ్ధక్రియాలబ్ధంబుల భూర్భువస్స్వర్గాదులగునిజ్జ
గంబులును ధర్మప్రతిష్ఠితంబులు కావునఁ దదాచరణచణుండవై ఋ
ణత్రయంబును నీఁగి సమానులం దుత్తమశ్లోకుండవై రాజ్యపరిపాల

1. బాహులం బుట్టింప.

నంబు సేయు మని యభిషిక్తుం జేసె నిది మదీయభక్తప్రభావం బని
యంబుజాలయ కానతిచ్చె. 285

టీ. మనుదండధరాదులు = మనువు యముఁడు మొదలగువారు, విశేషించి దోషం బెఱింగి దండించిరి = మిగులదోషంబులఁ దెలిసి శిక్షించిరి, ధర్మపరులనఁబరగిరి = ధర్మాసక్తచిత్తు లని నుతికెక్కిరి, ప్రజానాథుండు = చతురాననుఁడు, ప్రజాపాలనంబు పనిగాన్ = ప్రజాసంరక్షణార్థముగా, బహుముఖంబులన్ = ఇంద్రాదిదిక్పాలకులయం శంబులందు, పుట్టింపన్ = జననమొందింపఁగా, పుట్టి = జనించి, వి...డుఐ-విరాట్ = విరాట్టు, సమ్రాట్ = సమ్రాట్టు, ప్రభృతి = మొదలగు, వేద = ప్రాఁజదువులయందు, ఉదిత = చెప్పఁబడిన, శబ్ద = వాచకపదములకు, వాచ్యుండై = అభిధేయుండై, దేవసదృ శుండగు=దేవతలతో సరియగు, మూర్ధాభిషిక్తుండు=రాజు, సోఁకోర్చి=కష్టమును సహించి, ఇలకున్ = భూమికి, అగు = కలుగుచున్న, అలజళ్లు = ఉపద్రవములను, తీర్చినంగాక = నివారింపఁజేయకగాని, జన్మంబు = పుట్టుక, సఫలంబగునె = సార్థకమగునా, కే...తి - కేవల=ముఖ్యముగా, ఇంద్రియ = కర్మేంద్రియములయొక్క ప్రీతి=తృప్తి, బ...లన్ - బందీకృత = చెఱసాలలోనుంచఁబడియున్న, పర = ఇతరులయొక్క, కళత్ర = స్త్రీల చేతను, పథిక = తెరువరులయొక్క, పరిషత్ = సమూహాము, ప్రహారణ = కొట్టుట చేతను, ప్రాప్త = లభించినటువంటి, విత్తమ్ములన్ = ధనములచేతను, పాటచ్చరప్రభు లకున్ = దొంగదొరలకును, జరుగదె = కాలము గడవలేదా, ఇంతలాంపట్యమేమిపని యని = ఇంతటియాయాసమెందులకని, అవనియెడన్ = భూమిపట్ల, అ...ఖు - అవన= రక్షించుటయందు, వైముఖ్యంబు = విముఖభావము, చెల్లదు = కూడదు, ఎట్లనినన్ = ఏలాగంటివా, తొల్లి = పూర్వకాలమందు, కృతయుగంబునన్ = కృతయుగమందు, కృతవీర్యనందనుండగు = కృతవీర్యునిపుత్త్రుండైన, సహస్రబాహుండు = సహస్రబాహుఁ డనువాఁడు, ఆ...త - అగు - ఆత్మీయదోస్తంభ = తనభుజములచేతను, సంభృతయగు = భరింపఁబడినదైయున్న, ఈవిశ్వంభరన్ = ఈభూమిని, ఏద్వీపంబునన్ = ఏదీవియందు, ఏనాఁటన్ = ఏదినమందు, ఏపీటన్ = ఏపట్టణమందు, ఏత్రోవన్ = ఏమార్గమం దును, ఏక్రేవన్ = ఏకార్యమందును, ఏవేళన్ = ఏసమయమందును, ఎవ్వఁడు = ఎట్టి వాఁడు, ఏమిసేయం దలంచున్ = ఏమియొనర్చుటకుఁ జింతించుచుండునో, అప్పుడు అందందు = అప్పుడె వానినంతయుం నెఱింగి యక్కడక్కడ, అ...రి ఐ - అసిముసల చాపాది = కత్తి, రోఁకలి, విల్లు లోనుగాఁగల, శస్త్రాస్త్రధారియై = శస్త్రాస్త్రములధరిం చినవాఁడై, తోఁచి = కనఁబడి, ఆజ్ఞయిడున్ = దండించును, అట్లాజ్ఞయిడన్ = ఆలాగుదండించుటకు, అంతిమంబగు = కడపటిదైన, ఈయుగంబునన్ = ఈకలియుగ

మందు, యాగానుసారంబుగాన్ = యజ్ఞములకుఁదగినట్లు, మితసారంబగు = స్వల్ప
బలముగల, రాజలోకంబునకున్ = నృపవర్గమునకు, శక్యంబుగాదుగదా, ఒక్కరాజ
లోకంబునకున్ = ఒకక్షత్త్రియజనమునకు, అననేల = చెప్పనేమిటికి, ఇక్కాలంబు
నందలి = ఇప్పుడున్నటువంటి, భూసురులను = బ్రాహ్మణులకు, అక్కాలంబు నందలి =
అప్పుడున్నటువంటి, భూమిదివిజులకున్ = భూసురులకును, కలశక్తి - కల = కలిగి
యున్న, శక్తి = నిగ్రహసామర్థ్యము, ఉన్నదె = కలదా, ఒక్కబాడబుండు = అగస్త్యుఁ
డనునొక పుడమివేల్పు, కడలినీరు = సముద్రోదక మంతయును, గ్రుక్కం గొనియెన్ =
పుక్కిలియం దిమిడ్చెను, ఒక్కవిప్రుండు = విశ్వామిత్త్రుఁ డనునొకద్విజుఁడు, స్రష్టృ
సృష్టికిన్ = బ్రహ్మసృష్టికి, ప్రతిస్రష్ట యయ్యెన్ = మాఱుసృష్టిచేయువాఁడాయెను,
ఒక్కబ్రాహ్మణుండు - వసిష్ఠుం డని నుతికెక్కినయొకమునివర్యుండు, బ్రహ్మదండంబునన్ =
బ్రహ్మదండముచేత, బ్రహ్మాస్త్రంబున్ = చతురాననాస్త్రమును వారించెన్ = మట్టుపఱి
చెను, అట్టియనుష్ఠానంబు=అటువంటి తపశ్చర్య, మాకున్ లేదు=మాయందుఁగనఁబడదు,
ఎందేమి ప్రయోజనం బని = దేనియందేమికార్యమని, వీరికిన్ = ఈద్విజులకు, శక్త్య
నుష్ఠానంబు = యథాశక్తి నాచరించుట, విడువవచ్చునె = త్యజింపఁదగునా వీరు =
ఈబ్రాహ్మణులు, ఇతరులకున్ = క్షత్త్రియాదులకు, ఉపాసనీయులుగాక పోయిరే =
పూజ్యులుగాక యున్నారా, కావునన్ =అట్లుండుటచేత, సావధానుండవై = జాగ్రత్త
గలవాఁడవై, శక్తికొలఁదిన్ =సామర్థ్యానుగుణముగా, శ్రుత = వినఁబడినవానిని, దృష్టం
బులు = చూడఁబడినవానిని, ఉపేక్షింపక = అశ్రద్ధచేయక, రక్షణశిక్షణంబులు = శిష్ట
సంరక్షణదుష్టశిక్షణంబులను, ఆచరించుచున్ = చేయుచును, అశక్యంబునకున్ = నీకు
నలవిగాని కార్యవిషయమై ఆర్తశరణాగతరక్షకుండగు = దీనజనసంరక్షణబద్ధదీక్షుండగు,
పుండరీకాక్షుమీఁదన్ = శ్రీమన్నారాయణునిమీఁద, భారంబిడి = బరువుంచి, అన
హంకృతిన్ = అహంకారరాహిత్యముచేత, ప్రవర్తిల్లన్ = సంచరింపఁగా, ఎల్లసంసిద్ధులు=
సకలకార్యసిద్ధులును, కరస్థంబులగున్ = అఱచేతిలోనుండునవి యగును, అదియట్లుండె=
అదియాలాగుండెను. అట్టైన = ఆవిధమైన, పట్టబద్ధుండగు = పట్టముగట్టఁబడిన, రాజు =
ప్రభువు, ధర్మంబునంద = ధర్మమునందే, దృష్టియిడి = జ్ఞప్తినుంచి, నడపవలయున్ =
ప్రవర్తింపవలయును, వ...లు - వరుణవైశ్రవణ వాయువైశ్వానర వాసవాదుల =
వరుణకుబేరానిలధనంజయేంద్రాదులయొక్క, జన్మంబులును = ఉత్పత్తులును, బ...ల -
బహుభవారబ్ధ = అనేకజన్మములయందారంభింపఁబడిన, క్రియా = యాగాదిక్రియల
చేతను, లబ్ధంబుల = పొందఁబడిన, భూర్భువస్స్వరాదులగు, ఇజ్జగంబులును = ఈలోక
ములును, ధర్మప్రతిష్ఠితంబులుకావునన్ =ధర్మమునందాధారపడియుండునవిగనుక, తదాచరణచణుం

డవై = దాని నాచరించుటయం దుదక్షుండవై, ఋణత్రయంబును = ఋషిదేవపితృ ఋణములను, నీఁగి = తీర్చి, సమానులందఱ్ = నీతోడివారలలో, ఉత్తమశ్లోకుండవై = కీర్తికరుండవై, రాజ్యపరిపాలనంబు = ప్రజాపరిపాలనంబు, చేయు మని = ఒనర్పు మని, అభిషిక్తుఁ జేసెన్ = పట్టాభిషిక్తుఁ గావించెను, ఇది = నాచేతఁ జెప్పఁబడినయీసంగతి, మదీయభక్తప్రభావం బని = నాభక్తుని ప్రభావ మని, అంబుజాలయకున్ = లక్ష్మీదేవికి, అనతిచ్చెన్ = తెలియునట్లు సెలవిచ్చెను.

శా. దుగ్ధాంభోధిమహాగృహోత్సుక! సుధాంధోబృందచూడామణీ
రుగ్ధారాశబలీకృతాంఘ్రియుగ! కారుణ్యాంబుసింధూభవ
ద్దృగ్ధామా! ధృతమంథ! సింధురవరార్తిక్షేపిదోశ్చక్ర! శ్రీ
ముగ్ధాలాపరసాదరా! కృతపలాన్మూర్ఛత్స్వనోద్యద్దరా! 286

టీ. దు...క-దుగ్ధాంభోధి = పాలసముద్రమనియెడు, మహాగృహ = గొప్ప మందిరమందు, ఉత్సుక = ఆసక్తుఁడవైనస్వామీ, సుధాంధోబృంద=వేల్పులగుంపులయొక్క, చూడామణీ = శిరోరత్నములయొక్క, రుగ్ధారా = కాంతిపరంపరచేతను, శబలీకృత = శబళవర్ణముగాఁ జేయంబడిన, అంఘ్రియుగ = పాదయుగళముగలవాఁడా, కా...మా - కారుణ్యాంబు = దయారస మను నీటికి, సింధూభవత్ = సముద్రమగుచున్న, దృక్ = చూపులకు, ధామా = ఉనికిపట్టైనవాఁడా, ధృ...థ-సిం...క్ర-ధృత = మోయఁబడిన, మంథ = కవ్వపుఁగొండగలవాఁడా, సింధురవర = గజేంద్రునియొక్క, ఆర్తి = ఖేదమును, క్షేపి = పోఁగొట్టుచున్నటువంటి, దోః = భుజమందలి, చక్ర = చక్రాయుధము గలస్వామీ, శ్రీ...రా - శ్రీ = లక్ష్మీదేవియొక్క, ముగ్ధాలాప = ముద్దుపలుకుల యందును, రస = శృంగారాదిరసములయందును, ఆదరా = ఆదరముగలయోస్వామీ, కృ...రా-కృత = చేయఁబడిన, పలాత్ = రక్కసులయొక్క, మూర్ఛ = మూర్ఛగల, స్వన = ధ్వనిచేతను, ఉద్యత్ = విజృంభించుచున్న, దరా = శంఖముగల యోస్వామీ యని యాశ్వాసాంతమున భగవత్ప్రార్థన.

క. కరధృతదరారివితరణ
పరిపాలితతొండమాన్నృపాలక! పునరు
త్తరితనరసప్తబాలక!
శరణాగతసేవధీ! భుజంగాశరథీ! 287

టీ. క...క - కరధృత = హస్తముచేతధరింపఁబడిన, దరారి = శంఖచక్రముల యొక్క, వితరణ = ఇచ్చుటచేత, పరిపాలిత = రక్షింపఁబడిన, తొండమాన్నృపాలక=తొండమాన్ చక్రవర్తి యను రాజు గలవాఁడా, (తొండమాన్ చక్రవర్తికి శంఖ

చక్రము లిచ్చె ననుట ప్రసిద్ధము), పు...క-పునరుత్తరిత=మరలఁ బ్రతికింపంబడఁగ, నర = విజయునికి, సప్తృ = మనుమఁడైన, బాలక = చిన్నవాఁడుగలవాఁడా. శ...ధీ - శరణాగత = శరణుఁబొందినవారికి, సేవధీ = నిధియైన యోస్వామీ, భు...థీ-భుజంగాశ = గరుత్మంతునిచేత, రథీ = రథముగలస్వామీ.

మత్తకోకిల. కుండలిద్విషదుగ్రకేతన ! గోత్రభిద్ద్రుమహారిదో
శ్చండిమోత్పులకీకృతాంగక సత్య ! దౌత్యకురూక్తవా
క్పండితత్వయశోనిధీకృత పాండవేయ ! కపర్దికో
దండఖండన ? పాటవాంచదుదారదారసమాగమా ! 288

టీ. కుం...న-కుండలి = సర్పములకు, ద్విషత్ = శత్రువైన గరుత్మంతుఁడే, ఉగ్ర=భయంకరమైన, కేతన = ధ్వజముగాఁగలవాఁడా, గో...త్స-గోత్రభిత్ = దేవేంద్రునియొక్క, ద్రుమ=వృక్షమును, హారి = హరించినటువంటి, దోః = భుజములయొక్క, చండిమ = అతికోపముచేతను, ఉత్పులకీకృత = పులకాంకురయుక్తముగాఁ జేయఁబడిన, అంగక = అవయవములుగల, సత్య = సత్యభామగలవాఁడా, దౌ...య-దౌత్య = దూతభావముచేతను, కురు = కౌరవులవిషయమందు, ఉక్త = పలుకఁబడిన, వాక్ = మాటలయందు, పండితత్వ = పాండిత్యముచేతను, యశోనిధీకృత = కీర్తిమంతులుగాఁ జేయఁబడిన, పాండవేయ = పాండుకుమారులుగలస్వామీ, క...మా-కపర్ది = శివునియొక్క, కోదండ = వింటియొక్క, ఖండన=విఱుచుటయందలి, పాటవ = నేర్పుచేత, అంచత్ = ఒప్పుచున్నటువంటి, ఉదార = గొప్పదియైన, దారసమాగమా = సీతాసంయోగముగల స్వామీ.

మ.ఇది సింహాచలదంభకేసరిపదాభీష్టార్చనాపుణ్యల
బ్ధదురట్టంకణ పొట్టునూరివిజయస్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాక్షర కృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసపదంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్.

టీ. ఇది, సిం...దన్-సింహాచల = సింహాద్రియందలి, దంభకేసరి = మాయానృసింహుఁడైనస్వామియొక్క, పద = పాదములయొక్క, అభీష్ట = ఇష్టములైన, అర్చనా = పూజలచేతనైనట్టి, పుణ్య=సుకృతముచేత, లబ్ధ = పొందఁబడినటువంటి, దురట్టంకణ=ప్రయత్నముచేనాటఁదగినటువంటి, పొట్టునూరి = పొట్టునూరియందలి, విజయస్తంభోపల = జాతిజయస్తంభమందు, ఉట్టంకిత = వ్రాయఁబడినటువంటియు, అంక = బిరుదై

నటువంటియు, దృఢ = శాశ్వతమైనటువంటి, ఇష్టాక్షర=అభిమతవర్ణములు గల్గిన, కృష్ణ రాయనృపసంజ్ఞ = కృష్ణరాయధరణీకాంతుండనియెడు పేరుగల్గిన, అస్మత్ = నాచేత, కృత = రచియింపఁబడిన, ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యను ప్రబంధమందు, నాలవది=నాలవదియైన, ఆశ్వాసవరంబు=శ్రేష్ఠమైనయాశ్వాసము, హృద్యంబై = సకల కవిజనమనోహరంబై, మహిన్ = భూమియందు, పొల్పుగన్ = ప్రసిద్ధ మగును.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యద వ్యాఖ్యానంబునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు.

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము.

---

### ప ం చ మా శ్వా స ము

క. శ్రీనీలా జాంబవతీ
మానసతామరసవిహరమాణమిళిందా!
భానద్యుదయకళిందా!
నానాంఘ్రిశిరోక్ష! శేషనగహర్యక్షా! 1

టీ. శ్రీ...దా - శ్రీ = లక్ష్మీదేవియొక్కయు, నీళా = నీళాదేవియొక్కయు, జాంబవతీ = జాంబవతీదేవియొక్కయు, మానస = మనస్సులనియెడు, తామరస=తామర పూవులయందు, విహరమాణ = విహరించుచున్న, మిళిందా = భృంగమా, భా... దా - భా=శరీరకాంతి యనియెడు, నదీ=యమునానదియొక్క, ఉదయ = ఉత్పత్తికి, కళిందా = కళింద మను పేరుగల పర్వతమా, (కాళిందీనది కాంతివంటి శరీరకాంతిగల వాఁడనుట.), నా...క్ష - నానా = అపరిమితములైన, అంఘ్రి = పాదములును, శిరః= శిరములును, అక్ష = కన్నులును గలవాఁడా, (ఇది పురుషసూక్తప్రశస్తము.), శే... క్షా-శేషనగ=శేషాచలమందు, హర్యక్షా=సింహమా, అని స్వామికి విశేషణములు.

వ. అవధరింపు మవ్విష్ణుచిత్తుండు. 2

టీ. అవధరింపుము = చిత్తగింపుము, అవ్విష్ణుచిత్తుం డనుకర్తృపదము ముందటి పద్యమున కన్వయింపఁగలదు.

మహాస్రగ్ధర.

ఒకనాఁ డామ్రాంకురౌఘంబురు కుసుమ కుడుంగోదరక్షోణిఁ దల్ప
ప్రకరం బై కాంతుచే ముక్కోబతులఁబదరిపైఁ బ్రౌఢి వాటించినిట్టూ
ర్పొకదొట్టం డస్సి వీరాయిత మఱి మఱి తారెట్లము న్నట్లయానా
ఖకలం గందర్పుఁడోటంబైఱేఁగి తఱిమివీఁపేసె నానంటుతోఁటన్. 3

టీ. ఒకనాఁడు = ఒక్కదినమందు, (ఇచ్చట సప్తమికిఁ బ్రథమ.), ఆమ్రాంతర్ = మామిడిచిగుళ్లయొక్క, ఓఘంబు = సమూహము, ఊరు = గొప్పలగు, కుసుమకుడుంగ = పూవులపొదలయొక్క, ఉదర = అంతఃప్రదేశములయందలి, క్షోణిక్ = భూమియందు, తల్పప్రకరంబై - తల్ప = సెజ్జలయొక్క, ప్రకరంబై = పరంపరయై, కాంక్షచేఁ = కోరికచేత, ముక్ = ప్రథమమందు, పతులన్=తమనాయకులను, పవరి = రజ్జులాడి, పైఁబ్రౌఢి = ఉపరతిని, పాటించి = ఉపక్రమించి, నిట్టూర్పు = ఉచ్ఛ్వాసము, ఎకదొట్టన్ = ఉద్గతముకాఁగా, డస్సి = ఆయాసపడి, పేరాయితము = ఆయుపరతిని, అఱి=ఉడిగి, మఱి=పిమ్మట, తారు = తాము, (ఆనాయికలనుట.), మున్ను = ఉపరతికిఁ బూర్వమందు, ఎట్ల = ఏవిధమో, అట్లయ్యాన్ = ఆవిధముగానేయగున్, (మరలఁ గ్రిందై రనుట.), నాయికలన్ = స్త్రీలను, కందర్పుఁడు = మన్మథుఁడు, ఓటంబు = ఓడిపోవుటను, ఎఱిఁగి=తెలిసి, తఱిమి = వెంబడించి, వీఁపేసె నాన్=వీఁపునఁగొట్టెనో యనఁగా, అంటు = అంటుకొన్న, తోఁటన్ = ఉద్యానమునందు, (ఈపద్యమునందు ఆమ్రాంకురౌఘం బనునది కర్తృపదము, అంటు అను ధాతువుతోడ నన్వయింపఁదగినది. మఱియు విష్ణుచిత్తుం డను కర్తృపదముతో నన్వయింపఁదగిన క్రియాపదము పైపద్యమం దున్నది.

తా. మామిడి చిగుళ్ల శయ్యలయందు స్త్రీపురుషులు చేరి యుపరతమందుఁ బురుషుల నోడించునట్లు నాయికలు పంతగించి తాము పురుషులపైఁ జేరి యుపరతి సల్పుచు నాయాసమువలన రోఁజుచు నుపరతిఁ జాలించి పూర్వము తా మెట్లు క్రిందై యుండిరో యట్లే మరలఁ బురుషులకుఁ గ్రిందైరి. కావున, నా సంగ దెఱింగి మన్మథుఁడు స్త్రీలు ఉపరతి చాలించి యోడినందులకుఁ గుఱుతుగా నోడినవారిని వీఁపునఁ గొట్టుట ప్రసిద్ధ మగుటవలన వారిని వీఁపునఁ గొట్టఁగా నైన గాయములో యను నట్లు మున్ను శయ్యగాఁ బఱచికొన్న యాచిగుళ్లే చెమ్మటలుగల స్త్రీలవీఁపున నంటుకొని యుండెను. ఇట్టివనమం దొక్కనాఁడు విష్ణుచిత్తుండు, అని వెనుకపద్యముతో నన్వయము.

ఉ. వింగడ మైన యొక్కవనవీథిఁ గనుంగొనె నీడ సున్నపుర్
రంగుటరంగు పచ్చలయరం గయి పో వెలిదమ్మిబావికిం
జెంగట నుల్లసిల్లు తులసీవనసీమ శుభాంగి నొక్కబా
లం గురువిందకందళదళ ప్రతిమాంఘ్రికరోదరాధరన్. 4

టీ. వింగడము = విశాలము, ఐన, ఒక్కవనవీథిన్ = ఒకశృంగారవనశ్రేణియందు, సున్నపుర్రంగుటరంగు = సున్నపురంగు గల తెల్లనితిన్నె, నీడన్ = వనచ్ఛాయ

చేత, పచ్చలయరంగయిపోన్ = మరకతమయవేదిక యగుచుండఁగా, వెలిదమ్మిబావికిన్ = తెల్లదామరపూవులుగలబావికి, చెంగటన్ = సమీపమందు, ఉల్లసిల్లు = ప్రకాశించుచున్న, తులసీవనసీమన్ = తులసీవనప్రదేశమందు, శుభాంగిన్ - శుభ = శుభలక్షణయుక్తములగు, అంగిన్ = అవయవములు గలిగినట్టియు, కు...రన్ - కురువింద = కురువింద మను పేరుగల యొకజాతి కెంపులయొక్క, సీ. 'సలలిత మత్తకోకిలవిలోచనద్యుతిఁ దనరారుఁ గురువింద మనెడుకెంపు' అని రత్నశాస్త్రము. కందళ = మొలకలయొక్క, దళ = చెక్కలతోడ, ప్రతిమ = సరియైన, అంఘ్రికరోదర = పాదతలహస్తతలములును, అధరన్ = మోవియుఁగల, ఒక్కబాలన్ = ఒకబాలికను, కనుంగొనెన్ = విష్ణుచిత్తుఁడు చూచెను.

తా. విష్ణుచిత్తుఁడు శృంగారవనవీథిలో నీడలు దేఱెడు తెల్లని సున్నపురంగుగల యరఁగు చెట్టుల నీడలచేత మరకత మయమైనట్లు కనఁబడు చుండఁగా దాని సమీపమునందలి తెల్లదామరకొలని చెంగట నొక్క తులసీవనమందు శుభలక్షణ లక్షితురాలగు నొకస్త్రీ శిశువును జూచెను.

చ. కనుఁగొని విస్మయం బొదవఁగా గదియం జని సౌకుమార్యమున్
దనురుచియున్సులక్షణవితానముఁ దేజముఁ జెల్వుఁ గొంత సే
పనిమిషదృష్టిఁ జూచి యహహా యనపత్యున కమ్ముకుందుఁడే
తనయఁగ నాకు నీశిశువుఁ దాఁ గృప సేసె నటంచు హృష్టుఁడై. 5

టీ. కనుఁగొని = చూచి, విస్మయంబొదవఁగాన్ = ఆశ్చర్యమంకురింపఁగా, కదియంజని=సమీపించిపోయి, సౌకుమార్యమున్ = సుకుమారత్వమును, తనురుచియున్ = దేహకాంతియును, సు...మున్-సులక్షణ = శుభలక్షణములయొక్క, వితానమున్ = సమూహమును, తేజమున్ = తేజస్సును, చెల్వున్ = సౌందర్యమును, కొంతసేపు = కించిత్కాలము, అనిమిషదృష్టిన్ = ఱెప్పపాటులేనిచూపుచేత, చూచి = వీక్షించి, అహహా=ఆశ్చర్యము, అమ్ముకుందుఁడే = ఆవిష్ణుదేవుఁడే, అనపత్యునకున్ = సంతానములేనివాఁడనగు నాకు, తనయఁగన్ = కూఁతుఁగా, ఈశిశువున్ = ఈబిడ్డను, తాన్ = తాను,(విష్ణువనుట,) కృపసేసెన్ = దయచేసెను, అటంచున్=అనుకొని, హృష్టుఁడై = హర్షముగలవాఁడై.

తా. సుగమము.

క. కొనిపోయి ధర్మగేహిని
కనురక్తి నొసంగఁ గొంగి యాయమయును జేఁ

పు నిజస్తన్యంబులచేఁ
బెనిచె న్గో మొప్ప నిట్లు । పెరుఁగఁ గ్రమమునన్. 6

టీ. కొనిపోయి = ఆ శిశువును దీసికొనిపోయి, ధర్మగేహినికిన్ = తనభార్యకున్, అనురక్తిన్ = అనురాగముతో, ఒసంగన్=ఇయ్యఁగా, పొంగి = సంతోషించి, ఆయమ యును = ఆమెయు,చే...చేన్-చేఁపు = పొంగివచ్చుచున్న, నిజస్తన్యంబులచేన్-నిజ = స్వకీయములగు, స్తన్యంబులచేన్ = చనుఁబాలచేతను, గోము = గారాము, ఒప్పన్ = పొందికయగునట్లు, పెనిచెన్=సాఁకెను, ఇట్లుపెరుఁగన్=ఈవిధమున బెరుఁగుచుండఁగా, క్రమమునన్ = క్రమక్రమముగా నని ముందటి పద్యమున కన్వయము.

సీ. వాతెఱ తొంటికై । వడి మాటలాడదు
కుటిలవృత్తి వహించెఁ । గుంతలంబు
లక్షులు సిరులు రా । నఱచూడ్కిఁ గనుఁగొనె
నాడించె బొమగొని । యాననంబు
చనుఁగొమ ల్నిగయవక్ష ముపేక్షఁ గడకొత్తెఁ
బాణిపాదము లెఱ్ఱ । వాఱఁ దొడఁగె
సారెకు మధ్యంబు । దారిద్ర్యములచెప్పె
ఊఁచోర్ధ్వ కిటులోఁగఁ । జొచ్చె మేను
తే. పట్టిగాంభీర్య మొక్కఁడు । వెట్టుకొనియె
నాభి నానాఁటి కీగతి । నాఁటిపొందు
చవుకయైనట్టి యిచ్చటఁ । జనదు నిలువ
ననుచు జాఱెనకరణి బాల్యంబు జాఱె. 7

టీ. వాతెఱ = అధరోష్ఠము, తొంటికైవడిన్ = పూర్వమువలె, మాటలాడదు= సంభాషింపదు, (యౌవన ప్రాదుర్భావము కాఁగానే రాజసము హెచ్చె ననుట.), కుంతలంబులు = తలవెండ్రుకలు, కుటిలవృత్తిన్=కుటిలవ్యాపారమును, వహించెన్ = ధరియించెను, (పూర్వమువలె సాధారణముగ నుండక కౌటిల్యమును దాల్చె నని యర్థము, వంకర లాయె నని భావము.), అక్షులు = కన్నులు, సిరులు రాన్ = సంపదలు దమకు రాఁగానే, అఱచూడ్కి = సగముచూపు చేత, కనుఁగొనెన్ = చూచెను. (చిన్ననాఁటి వలెఁ జూడ దని యర్థము, యౌవనాతిశయముచేత రక్త శ్వేత నీలవర్ణములు గలిగి మెఱుఁగెక్కి విలాసములు గలిగె నని భావము.), ఆననంబు = ముఖము, బొమగొని = కనుబొమముడివైచి, ఆడించెన్ = కదలించెను. (పరిహాసమునకు బొమలాడించె నని యర్థాంతరము. మొగము చిట్లించుకొనె నని యర్థము. జవ్వనమునఁ గనుబొమలకు

గాంతి యెక్కె నని భావము.), చనుఁగొమల్ = స్తనాంకురములు, నెగయక్ =ఎగయఁగా, వక్షము = ఱొమ్ము, ఉపేక్షన్ = ఒప్పరికించుటచేత, కడకొత్తెన్ = అవల ద్రోఁచెను (స్తనములనియెడు వస్త్వంతరములుగలుగఁగానే తన్నుపేక్షించి చేర నీయక మూలకుఁ ద్రోచె నని యర్థము. జవ్వనమందుఁ జన్నులు చెన్నుమీఱె నని భావము.), పాణిపాదములు = కరపాదములు, ఎఱ్ఱవాఱుదొడఁగెన్ = కినుకచేత నరుణవర్ణము వహించెను, (యౌవనము రాఁగానే కాలుసేతులు మిగులఁ దొగరుజిగి యెక్కె నని భావము.), సారెకున్ =మాటిమాటికి, మధ్యంబు = నడుము, దారిద్ర్యములు=తనలేములే, చెప్పెన్ = ఉచ్చరించెను. (తన లేమియే తెలుపునుగాని పిన్ననాఁటివలెఁ గలిమిఁ దెలుపదని యర్థము, నడుము సన్నమయ్యె నని భావము.), మేను = శరీరము, ఆర్చొర్వక = మునుపటివలె మాలిన్యమునోర్వక, ఇటు = ఈప్రకారముగా, లోఁగఁజొచ్చెన్ = సంకోచింప నారంభించెను, (సందడి కోర్వదని యర్థము, నాగరకము హెచ్చయ్యెనని భావము.), నాభి = పొక్కిలి, వట్టిగాంభీర్యమొక్కఁడు = ప్రయోజనములేనియొక్క గంభీరతను, పెట్టుకొనియెన్ =ఉంచుకొనెను. (తొల్లింటియట్లు గాక బెట్టుగా నుండె నని యర్థము. మిక్కిలి లోఁతాయె నని భావము.), నానాఁటికిన్ = నాఁడునాఁటికి, ఈగతిన్ = ఈవిధముచేత, నాఁటిపొందు = అలనాఁటి స్నేహము, చవుకయైనట్టి = ఎల్లిదమైనట్టి, ఇచ్చటన్ = ఈయమశరీరమందు, నిలువఁజనదు = ఉండఁగూడదు, అనుచున్ = ఇట్లని, జాఱినకరణిన్ = వదలిపోయినట్టుగా, బాల్యంబు = పసితనము, జాఱెన్ = తొలఁగిపోయెను.

శా. హేమాభాంగవిభాధరారుణిమవక్త్రేందుప్రభాశ్రీలఁ ద
ద్భామారత్నము వొందదయ్యె మును దత్తద్వర్ణయుక్తాఖ్యలన్
శ్యామాత్వం బళిగర్వధూర్వహకచచ్ఛాయాచ్ఛటం గాంచె నొఁ
గా మున్నుర్వి శిరఃప్రధాన మనువాక్యం బెమ్మెయిం దప్పునే. 8

టీ. తద్భామారత్నము = ఆకన్యారత్నము, మును = మొదలును, హే...లన్- హేమాభాంగవిభా - హేమ = బంగారుయొక్క, ఆభా = కాంతివంటికాంతిగల, అంగ = నెమ్మేనియొక్క, విభా = పచ్చనికాంతియొక్కయు, అధరారుణిమ - అధర = వాతెఱయొక్క, అరుణిమ = ఎఱ్ఱనికాంతియొక్కయు, వక్త్రేందుప్రభా-వక్త్ర = నెమ్మొగముయొక్క, ఇందుప్రభా = చంద్రకాంతియొక్కయు, శ్రీలన్ = సంపదలచేత, తత్తద్వర్ణయుక్తాఖ్యలన్-తత్తత్ = ఆయా, వర్ణ = పీతరక్తాదులగు వన్నెలకు, యుక్త= తగినట్టి, ఆఖ్యలన్ = నామధేయములను, పొందదయ్యెన్ = పొందనియదియయ్యెను. అ...టమ్ - అళిగర్వధూర్వహ - అళి = తుమ్మెదలయొక్క, గర్వ = గర్వముయొక్క,

ధూశి = భారమును, వహ = వహించిన, కచ = క్రొమ్ముడియొక్క, ఛాయా = నీలకాంతులయొక్క, ఛటన్ = సముదాయముచేత, శ్యామాత్వంబు=శ్యామలవర్ణము గలిగిన దనుటను, ('శ్యామా యౌవనమధ్యస్థా' యని యునికింజేసి యౌవన మధ్యస్థభావము ననుట.) కాంచెన్ = పొందెను, ఔఁగా = యుక్తమేకదా, మున్ను = పూర్వమందు, ఉర్విన్ = భూమియందు, శిరః ప్రధాన మను = శిరస్సే ప్రధాన మనియెడు, వాక్యంబు= మాట, 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధాన' మ్మనియెడు వాక్యము. ఎమ్మెయిన్ = ఏరీతిచే నైనను, తప్పునే = తప్పునా, తప్ప దనుట.

తా. ఆకన్యక శరీరము బంగారువన్నెగలిగి యున్నదానివలన నొండె, అధరోష్ఠ మెఱ్ఱఁగానుండినదానివలన నొండె, నెమ్మోము చందురువన్నెగలిగి యుండినదానివలన నొండె, తత్తద్వర్ణానుసరణముగా హేమాంగి, బింబోష్ఠి, చంద్రముఖి యనియెడు నిట్టి నామములు వహింపక తేఁటులతోఁ దీటగు నల్లని తలవెండ్రుకలకాంతి కనుగుణముగ శ్యామ యనునామము వహించెను. శ్యామ యన యౌవనమధ్యస్థురా లనియును సర్వశరీర మందు శిరమే ప్రధాన మగుటచేత నా శిరఃకాంతియే ప్రధానముగా నా పేరు వచ్చె ననియును భావము.

క. ఆయతభుజైకచక్రుం
డాయదుపతి దొమ్మిఁ గెలువఁ గనడరుమరుని కా
లాయసచక్రపరంపర
లో యన నుంగరపుఁగురులు ౯ యువతికి నమరున్. 9

టీ. ఆ...డు-ఆయత = నిడుదయగు, భుజ = భుజమందు, ఏక = ఒక్కటైన, చక్రుండు = సుదర్శనచక్రముగల, ఆయదుపతిన్ =ఆప్రసిద్ధుఁడగు శ్రీకృష్ణుని, దొమ్మిన్= క్రందుకయ్యముచేతను, గెలువన్ = జయించుటకొఱకు, అ...లో - అడరు = విక్రమించుచున్న, మరుని = స్మరునియొక్క, కాలాయసచక్రపరంపరలో-కాల = నల్లనైన, ఆయస = ఉక్కుతోఁజేయఁబడిన, చక్ర = చక్రములయొక్క, పరంపరలో = సమూహములో, అనన్ = అనునట్లు, ఉంగరపుఁగురులు = కుటిలకుంతలములు, యువతికిన్ = ఆయువిదకు, అమరున్ = ఒప్పును.

తా. ఈ గోదాదేవి శ్రీకృష్ణుని మోహింపఁగలదియై యున్నదిగావున నొక్క చక్రము మాత్రము గలిగిన యా శ్రీకృష్ణుని గెలుచుటకై యుద్యోగించిన మన్మథుని యుక్కుచక్రముల గుంపులో యన్నట్లాయువతియొక్క యుంగరములుగాఁ బ్రకాశించుచున్న తలవెండ్రుక లొప్పును.

తే. సకలసీమంతినీలోకకసమతిశాయి
భాగ్యవర్ణావళులు వ్రాసెఁ ౯ బద్మగర్భుఁ

డనఁగఁ గర్పూరతిలక రజోవదాత
ఫాలమునఁ గుంతలశ్రేణి పడఁతి కమరు. 10

టీ. పడఁతికిన్ = ఆ స్త్రీకి, పద్మగర్భుఁడు = బ్రహ్మదేవుఁడు, స...లు-సకల = సమస్తమైన, సీమంతినీ = స్త్రీలయొక్క, లోక = జనసములను, సమతిశాయి = మిక్కిలి యతిశయించుచున్న, భాగ్య = భాగ్యముగల, వర్ణ = అక్షరములయొక్క ఆవళులు = పఙ్క్తులను, వ్రాసె ననఁగన్ = లిఖియించెనోయనునట్లు, కర్పూరతిలక = కపురంపుఁదిలకముయొక్క, రజః = పరాగముచేత, అవదాత = ధవళవర్ణముగల, ఫాలమునన్ = నెన్నుదుటియందు, కుంతలశ్రేణి = ముంగురులగుంపు, అమరున్ = ప్రకాశించును.

తా. కర్పూరతిలకముయొక్క పరాగముచేతఁ దెల్లనైన లలాటమందు నల్లని ముంగురు లోలయు చుండఁగా నీ యమ యెల్ల పల్లవాధరలకంటె నధికతమభాగ్యము గలది యగు నని తమ్మిచూలి వ్రాసిన శుభాక్షరములవలె నుండెను. వస్తూత్ప్రేక్ష.

శా. సైరంధ్రుల్పయి కెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికం దీర్ప వా
లారుంగన్నులమీఁదఁ జూచుతఱి ఫాలాంచచ్చతుర్థీనిశా
స్ఫారేందుం గనె వక్త్ర మక్కనుటఁగా పర్వేందుఁ డాత్మప్రభా
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభాచోరంబనుఁ లోకముల్. 11

టీ. వక్త్రము = ముఖము, సైరంధ్రులు = అలంకరించెడు స్త్రీలు, పయికెత్తి = పైకెగయనెత్తి, కజ్జలమున్ = కాటుకను. పక్ష్మశ్రేణికన్ = తొంగలిఱెప్పలయందు, తీర్పన్ = దిద్దుచుండఁగా, వాలారుంగన్నులన్ = నెఱిసోగలగు నేత్రములచేత, మీఁదన్ = ఊర్ధ్వభాగమందు, చూచుతఱిన్ = ఈక్షించునప్పుడు, ఫాల = లలాట మనియెడు, అంచత్ = ఒప్పుచున్న, చతుర్థీనిశా = చవితినాఁటిరాత్రియందు, స్ఫారేందున్-స్ఫార = ప్రకాశించుచున్న, ఇందున్ = చందురుని, కనెన్ = చూచెను. అక్కనుటగా = అచూచుచేతనేకదా, పర్వేందుఁడు = పున్నమనాఁటి చందమామ, ఆత్మప్రభాచోరుండు - ఆత్మ = తనయొక్క (ముఖముయొక్క యనుట.), ప్రభా = కాంతులయొక్క, చోరుండు = మ్రుచ్చు, ఉండఁగన్ = కానవచ్చుచుండఁగా, తన్నున్ = ముఖము ననుట, లోకములు = జనములు, తద్గతవిభాచోరంబనున్-తత్ = ఆచంద్రుని, గత = పొందిన, విభా = కాంతియొక్క, చోరంబనున్ = దొంగయనును.

తా. సైరంధ్రులు ముఖమును బైకెత్తి ఱెప్పలయందుఁ గాటుక పెట్టుచుండఁగా విశాలము లగు నేత్రములచేత స్వభావముగాఁ బైని జూచునప్పుడు లలాట మనియెడు చవితినాఁటి చంద్రుఁడు గనఁబడుటచే నీ దోషమున నీమొగముఁ జూచిన

వారెల్ల ముఖకాంతి దొంగిలిన పూర్ణచంద్రుఁ డటుండఁగా నీ నెమ్మొగమే చంద్రుని కాంతిని దొంగలించిన దని వచింతురు. ఇందువలనఁ గాంతిచే ముఖచంద్రుల కభేద మని భావము.

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగ మృగం బలసూడున కిందు రేతు నే
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁగా
నినుపఁ జన న్బగం దనదు నెత్తుటఁ బొట్టిడుకొంట కాక వా
సనక యన న్మొగం బమరుఁ జామకు ఫాలము పచ్చికస్తురిన్. 12

టీ. మొగంబు = ముఖము, కనుఁగవన్ = నేత్రద్వయముచేత, తన్నున్ = మృగము ననుట, గెల్వఁగన్ = జయింపఁగా, మృగంబు = ఇట్టి, అలసూడునకున్ = అవిరోధమునకు, నేను = మృగమనుట, ఇందున్ = చంద్రుని, రేతున్ = ప్రేరేపుదును, అని = అనుచు, రుచిదక్కన్ = కాంతిదప్ప, తత్పరిమళాఢ్యత-తత్ = ఆముఖమందలి, పరిమళ = పరిమళమువంటిపరిమళముచేత, ఆఢ్యత = చాలియుండుట, లేమిన్ = లేకుండుటచేత, అతండు = ఆచంద్రుఁడు, కొంకన్ = సంకోచింపఁగా, తాన్ = ఆ మృగము, నినుపన్ = నింపుటకు, (నిండించుటకనుట.), చనన్ = పోవఁగా, పగన్ = చలముచేత, తనదు = ఆమృగముయొక్క, నెత్తుటన్ = రక్తముచేత, బొట్టిడుకొంట కాక = తిలకముపెట్టుకొనుటేకాని, వాసనక = వాసనకా, అనన్ = అనునట్లుగా, ఫాలముపచ్చికస్తురిన్-ఫాలము = లలాటముయొక్క, పచ్చికస్తురిన్ = ఆర్ద్రకస్తూరిచేత, చామకున్ = ఆశ్యామకు, అమరున్ = ఒప్పును.

తా. ఆశ్యామయొక్క ముఖము లలాటమందలి కస్తూరితిలకముచేతఁ బ్రకాశించుచుండఁగా, నాముఖము తనయందలి కన్నుదోయిచేత నిట్టిని జయింపఁగా నాపగఁ దీర్చుకొనుటకుఁ జంద్రునితోఁ గలిసికొని యామొగమును గెల్చుటకు నతనిఁ దోడు రమ్మన, ముఖమునకువలెఁ దనకును గాంతియున్నదే కాక, పరిమళము లేమిం జేసి యతఁడు సంశయించుచుండఁగా నామృగ మనఁగా గస్తూరీ మృగ మగును గావున నది పరిమళమును నతనికొసంగఁ బూనుకొనఁగా నిదియంతయు సహింపక యా మొగము మృగము నెత్తుటిచేతఁ దిలక ముంచుకొనెనేకాక వాసనకొఱకుఁ గాదు. మఱియు సమస్తపరిళములు ముఖమందుఁ గలిగి యున్నవి.

తే. కడిఁది విలు చేది గుఱికీలుకఱచి నిలుపు
మరుని కువలయశరము కంపములఁబోలుఁ
దార కడకంటికై సారెకు చేరిచేరి
వేగ మగుడ సలజ్జదృగ్విభ్రమములు. 13

టీ. తార = కనుగ్రుడ్డు, కడకంటికై = నేత్రాంతమువఱకు, సారె=మాటిమాటికి, చేరిచేరి=ప్రవేశించిప్రవేశించి, వేగ మగుడన్ = శీఘ్రముగా మరలుచుండఁగా, సలజ్జ దృగ్విభ్రమములు-సలజ్జ = సిగ్గుతోఁగూడిన, దృక్ = చూపులయొక్క, విభ్రమములు = విలాసములు, (ఇది కర్తృపదము.), కడిఁదివిలు-కడిఁది=బలువగు, విలు=ధనుస్సును, చేది= ఆకర్షించి, గుఱికిన్ = లక్ష్యసిద్ధికొఱకు, (ఇచ్చటఁ జతుర్థికి షష్ఠి), కీలకఱచి = పండ్లు బిగియబట్టుకొని, ని...లన్ పోలున్-నిలుపు = నిల్వఁబట్టిన, మరుని = మన్మథునియొక్క, కువలయశరము=కలువతూపుయొక్క, కంపములఁబోలున్ =చలనములను బోలును.

తా. ఆ నెలఁత మెఱుఁ గెక్కిన కడకంటిచూపులు మన్మథుఁడు పెద్దవిలు పూని తివిచి గుఱికుదురునంతకు నల్లెత్రాటికి ధనుర్దండమునకు నడుమఁ జలింపించుచున్న కలువబాణములవలె నుండెను.

తే. నవ వయస్సీధుమదముచే శ్రవణకూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
నిడిన శృంఖల లనఁ గాటుకిడిన దీర్ఘ
పక్ష్మ రేఖలఁ గనుదోయి పడఁతి కలరు. 14

టీ. నవ=నూతనమైన, వయః=వయస్సనియెడు, సీధుమదముచేన్ = మద్యమదముచేత, 'మైరేయమాసవస్సీధు'వని యమరము. శ్ర...లన్-శ్రవణ = చెవులనియెడు, కూపములన్ = నూతులయందు, పండెడుశంకన్ = పడునను సంశయముచేత, నలువ = చతుర్ముఖుఁడు, చాపలము లుడుగన్ = నేత్రముల చంచలభావములు తగ్గునట్లుగా, ఇ...నన్-ఇడిన = ఉనిచిన, శృంఖల లనన్ = సంకెళ్లనునట్లు, కా...లన్-కాటుకిడిన= కాటుకపెట్టుకొనిన, దీర్ఘ = నిడుదలగు, పక్ష్మ = ఱెప్పలయొక్క, రేఖలన్ = రేఖలచేతనే, కనుదోయి=నేత్రద్వయము, పడఁతికిన్ = ఆగోదాదేవికి, అలరున్ = ప్రకాశించును. (ఈ పద్యమందు సీధుమద మనఁగా గజమద మని యర్థము చేసిన పక్షమున సీధు కూప పతన శృంఖలాది పదములవలన గజము సుద్యోతమాన మగుచున్నది గాన, నది యధ్యాహార్యము. ఆపక్షమున సీధు వనఁగా గజనేత్ర మదమునకుఁ బేరైనను వంశ కరీరకరికలభాదిశబ్దంబులవలె గ్రహింపవలయును.)

తా. ఆ పడఁతియొక్క నిడువాలిక లగుచు వీనులవఱకు నున్న కాటుకకన్నులు తనయందలి యౌవనమును సారాయిమదముచేతఁ జెవులనునూతులలోఁబడు, (సీధు వనఁగా గజనేత్రమద మను నర్థమున నేనుఁగులు మదించినప్పుడు నేత్రములలో మదముచేతఁ గన్నెఱుంగక నూతులలోఁ బడినట్లే యీ కన్నులును శ్రవణ కూపములందుఁ బడు) నను సంశయముచేత వాని చాంచల్య ముడుగునట్లుగా నేనుఁగులకుం

భోలెఁ జతుర్ముఖుఁడు సంకెళ్లు వేసెనో యన్నట్లు తఱచు వెండ్రుకలుగల తొంగలి ఱెప్పలతోఁ గూడి ప్రకాశించుచున్నవి. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష. శ్లో. 'దానం కపోలయో స్సీధు రక్ష్ణోశ్శ్రుతిర్యోస్తు సాగరః, కరాగ్రే సీకర స్సిక్థం స్తనాగ్రే మేహనే మదః. హృదయే ఘర్మ సలిలం మేఘస్తు చరణవ్రజే, సంజ్ఞ యాష్టమదాహ్వాతే జాయంతే భద్రదంతినః' అని గజమదవిభేద మెఱుఁగవలయును.

చ. అనయము రాగ మొప్ప సహజాననచంద్రకటాక్షపంక్తి ప
ర్విన నఘశంకఁ గర్ణమనుశ్రీ మఱువెట్టుఁ జెలంగి చెండుఁగొ
ట్టన నవనిఁబడ్డకమ్మ మగుడం గొనునంతకు నంసపాళి నం
గన యిడి దాఁచుపేరఁ బెఱకర్ణముకమ్మ పయిం దళుక్కనన్. 15

టీ. అనయమున్ = ఎల్లప్పుడును, రాగము = అనురాగము, ఒప్పన్ = స్ఫుటము గాఁగా, స...క్తి-సహజ = తోఁబుట్టువగు, ఆననచంద్ర=ముఖచంద్రునియొక్క, కటాక్ష= క్రేఁగంటి చూపులయొక్క, పంక్తి = చాలు, పర్విన్ = వ్యాపింపఁగా, అఘశంకన్= పాపమువచ్చునసెడుసందియముచేత, కర్ణమనియెడు=వీననియెడు, (కర్ణము శ్రీకారము వలెనున్నది గనుకను శ్రీకారము లక్ష్మీరూపము గనుకను ఇట్లు రూపకము చేసెను.) శ్రీన్ = సిరిని, అంగన = ఆయింతి, చెలంగి = విజృంభించి, చెండుఁగొట్టన్ = కందుకక్రీడలుసలుపుచుండఁగా, అవనిబడ్డ=భూమిపైఁబడిన, కమ్మ=కర్ణభూషణమును, మగుడన్ = మరల, కొనునంతకున్ = గ్రహించువఱకు, అంసపాళిన్-అంస = భుజాగ్రముయొక్క, పాళిన్ = ప్రదేశమందు, ఇడి = ఉనిచి, దాఁచుపేరన్ = గుప్తచేసెడునెపముచేత, పెఱకర్ణముకమ్మ = రెండవవీనుతాటంకము, పయిన్ = ఉపరిభాగమందు, తళుక్కనన్ = తళుక్కనిమెఱయఁగా, మఱువెట్టున్ = మఱుఁగువెట్టును. అపహ్నవముచేత నుత్ప్రేక్ష గలిగియున్నది. అది గమ్యకర్ణశ్రీయన్నది రూపకాలంకారము.

తా. లోకమందుఁ బుణ్యాంగన యగు సహోదరి వట్టిచెవుల నుండఁగాఁ బురుషుఁడు చూడఁ గూడదు కావున, నీయంగన శ్రీకారమువంటి తన కర్ణ మనెడులక్ష్మిని దాను జెండు గొట్టునప్పు డదరి క్రిందఁబడిన కమ్మను దాను మరలఁ దీసికొనువఱకు నా చెవికి సహోదరుఁడగు మొగ మనియెడు చంద్రుఁడు సూడకుండ నాచెవిం దన భుజాగ్రమందుంచి దాఁచుచున్న దనియెడు నెపముచేత నాకర్ణమును గనఁబడకుండఁ జేయును; శిరము ప్రక్కకువంచి భుజాగ్రముచే నొకచెవి దాఁచినప్పుడు రెండవచెవి కమ్మపైఁ దళుక్కని మెఱయుచున్నది.

శా. నాసాచంపకత స్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోల సం
త్రాసంబందియుఁ బల్కుచో నలము వక్త్రింబేల నా నేల యం

దే సౌరభ్యము లేదు కుందములుగావే దంతము ల్గానినాఁ
డాసక్తిక్ బ్రతిబింబదంభమున నేలా వ్రాలఁ దజ్జాలికిన్? 16

టీ. నాసాచంపకతక్-నాసా = నాసికయనియెడు, చంపకత్ = సంపెఁగపువ్వు గలుగుటచేత, సుగంధము = ఆ సంపెఁగవాసన, అచటక్ = ఆముఖమందు, రాక్=వచ్చుచుండఁగా, భృంగముల్ = తుమ్మెదలు, క్రోలక్ = ఆస్వాదించుటకు, సంత్రాసంబు= భయమును, అందియుక్ = చెందియును, పల్కు-చోక్ = ఆయువిదపలుకునప్పుడు, వక్త్రంబు = ముఖమును, అలమునేల = ఏటికిముసరుకొనును, నాక్ = అనఁగా, ఏల = ఏటికి, (తుమ్మెదలకు సంపెఁగవాసన విరోధ మనుట.), అందు = ఆముఖమందు, ఏసౌరభ్యములేదు = ఏ పరిమళములేదు? (అన్ని పరిమళములునున్నవనుట.), దంతములు=రదనములు, కుందములుగానే = మొల్లమొగ్గలుగావా? కానినాఁడు = కానియెడల, తజ్జాలికిక్ = ఆభృంగజాలికి, ఆసక్తిక్=శ్రద్ధచేత, ప్రతిబింబ=ప్రతిఫలన మనియెడు, దంభమునక్=నెపముచేత, వ్రాలక్=వ్రాలుట, ఏలా=ఏమియక్కఱ?

తా. ఆయువిదనాసిక సంపెఁగపూవువలె నుండును, ముఖమందు నా సంపెఁగ వాసనలకు భయంపడి తుమ్మెదలు ముసర వెఱచియు మరల మాటలాడునప్పుడు మఱి యొక పరిమళము రాఁగా దానికొఱకు ముసరును, సర్వ పరిమళములు ముఖమందుఁ గలవు, దంతములు మొల్ల మొగ్గలవలె నుండును, తుమ్మెదలు ముఖము మీఁదఁ దిరుగునప్పు డాదంతములమీఁదఁ బ్రతిఫలించుచుండును. వ్యాజోక్తి, భ్రాంతిమదతిశయోక్తి, రూపకాలంకారములు.

తే. శంఖసామ్యంబు రా మున్ను జలజభవుఁడు
సరసిరుహపత్త్రనేత్ర కంధర యొనర్చె
జవ్వనము వచ్చి వెండి సాక్షాత్కరించు
శంఖమున చేసె నును గంధసారచర్చ. 17

టీ. జలజభవుఁడు=తమ్మిచూలి-బ్రహ్మ, మున్ను=పూర్వమందు, శంఖ...బు-శంఖ= శంఖముతోడి, సామ్యంబు = సరియగుట, రాక్ = వచ్చునట్లు, సరసిరుహపత్త్రనేత్ర= తమ్మిఱేకులవంటి కన్నులుగల యాశాలఁతియొక్క, కంధర = కంఠమును, ఒనర్చెక్ = నిర్మించెను. జవ్వనము=యౌవనము, వచ్చి=ప్రాదుర్భవించి, వెండి = మరల, సా...సవగు, సాక్షాత్కరించు=ప్రత్యక్షమైనట్టి, శంఖమున = శంఖమునే, ను...ర్చక్-నును= మృదువగు, గంధసారచర్చ - గంధసార = మంచిగంధముయొక్క, చర్చ = పూఁత చేతను, చేసెక్=ఒనర్చెను.

తా. ఆ సరసిజాక్షి కంఠము శంఖముతో సమ మగునట్లు బ్రహ్మ మున్నే నెఱ్పెను, కాని యౌవనమువచ్చి గంధపుఁబూతచేత ధవళవర్ణమును గలుగఁజేసి ప్రత్యక్ష శంఖమునే చేసెను, దీనివలన బ్రహ్మకంటె యౌవనమే యధికతర మని భావము. అలం. ఉపమా గమ్యోత్ప్రేక్షలు.

క. కమలదళేక్షణ సంగీ
తమున నిగుడుమంద్రమధ్యతార త్రిస్థా
నములకుఁ దీర్చిన రేఖల
క్రమమగు రేఖాత్రయమునఁ గంఠం బమరున్. 18

టీ. క...నక్-కమలదళేక్షణ=గానమందు, ని...కుక్-నిగుడు=పుట్టు, మంద్ర మధ్యతార=మంద్రము, మధ్యను, తారమనియెడి, త్రి=మూఁటియొక్క, స్థానములకుక్= ప్రదేశములకు, తీ...నక్-తీర్చిన=దిద్దినట్టి, రేఖల క్రమమగు = గుఱుతు రేఖల క్రమము గల, రేఖాత్రయమునక్ = వళిత్రయముచేతను, కంఠంబు = కంఠము, అమరుక్ = ఒప్పును. 'మంద్రస్తు గంభీరేతారోఽత్యుచ్చైస్త్రయస్త్రిషు, విలంబితం ద్రుతం మధ్య' మ్మని యమరము. 'యస్యాస్త్రిస్రో గళే రేఖా దృశ్యంతే సా పతివ్రతా' యని సాముద్రిక శాస్త్రము.

తా. ఆయమ పాటఁబాడునప్పుడు మంద్ర మధ్య తారము లనియెడు స్వరములు మూఁడు పుట్టుటకు స్థానములయిన వని గుఱుతుకొఱకు మూఁడు రేఖ లున్నవో యనునట్లు కంఠమున మూఁడు వళులు ప్రకాశించును. ఉత్ప్రేక్షాలంకారము.

తే. లలన మృదుబాహుబిసయుగలతలు గడఁగి
బిసలతాశ్రీలనెల్లను వెస హరించె
మఱి హరింపంగఁ గా యవి నెఱులు విఱిగి
సారె దనుయాత్రఁ దంతులఁ జరపుచుండు. 19

టీ. ల...లు-లలన = ఆస్త్రీయొక్క, మృదు = మెత్తనగు, బాహు=భుజములని యెడు, బిస = తామరతూఁడులయొక్క, యుగ = జంటయొక్క, లతలు = తీఁగెలు, కడఁగి = యత్నపడి, బిసలతాశ్రీలనెల్లను - బిసలతా = లోకమందలితామరతూఁడుల యొక్క, శ్రీలనెల్లను = సంపదలనన్నిటిని, వెసక్ = వేగముగాను, హరించెక్ = కైకొనియెను, మఱి = మరల, హరింపంగఁగా = గ్రహింపఁగానేకదా, అవి=తూఁడులు, నెఱులు=పూర్ణత్వములు, విఱిగి = విరిసిపోయి, సారె = పలుమాఱును, తనుయాత్రక్= దేహయాత్రను, (శరీరపోషణము ననుట.), తంతుల = నూలిపోఁగులచేతనే (తంతువులే యాహారముగా.), జరపుచుండుక్ = కడపుచుండును.

తా. అయమయొక్క కోమలము లగు బాహువు లనియెడు తామరతూఁడులు చెలరేఁగి యెల్లతూఁడుల కాంతిసంపదల నపహరింపఁగా నవి గుంపు చెదరి మఱియొక విధముచే బ్రతుకఁ జాలక నూలిపోఁగులు వడికికొని శరీరయాత్రఁ గడపు ననిఁయును, దామరతూఁడులు విఱిగెనేని వానిలో నూలిపోఁగు లుండు ననియును భావము. అలం. రూపకానుప్రాణితగమ్యోత్ప్రేక్ష.

మ. తళుకొత్తున్భుజకీర్తివజ్రఘృణి సూత్రస్యూతహారస్ఫుర
త్కళికాచిత్ర కుచద్వయోపరిగళాధస్స్వల్పవిస్తారదై
ర్ఘ్యలసత్తిర్యగురస్తటం బనువివాహాంచన్మనోజాత పా
టల దంతచ్ఛదబోడబాసికము దంఁడలో ల్వ్రాలెఁ గేల్లింతికిన్. 20

టీ. ఇంతికిన్ = ఆస్త్రీకి, కేల్లు = హస్తములు, భు...ఘృణి - భుజకీర్తి = బాహుపురులయందలి, వజ్ర = మగఱాలయొక్క, ఘృణి = కాంతులనియెడు, సూత్ర = దారములచేత, స్యూత = కూర్పఁబడిన, హార = పూవులపేరులయందు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, కళికా = మొగ్గలచేత, చిత్ర = చిత్రవర్ణముగలయట్టియు, కుచద్వయ=చనుదోయికి, ఉపరి = పైఁగాను, గళాధః - గళ = కంఠమునకు, అధః = క్రిందుగాను, స్వల్ప = అల్పమైన, విస్తార=వెడల్పుచేత, దైర్ఘ్య = పొడవుచేత, లసత్ = ఒప్పుచున్నట్టియు, తిర్యక్ = అడ్డమగు, ఉరస్తటంబును = వక్షస్థలమనియెడు, వివా ...చ్ఛద - వివాహ = పెండ్లియందు, అంచత్ = ఒప్పుచున్న, మనోజాత = మన్మథుని యొక్క, పాటల = ఎఱ్ఱనగు, దంతచ్ఛద=వాతెఱగల రతీదేవియొక్క, బోడబాసికము= శిఖరములేని బాసికముయొక్క, దండలో ల్వ్రాలెక్ = ఇరుగడలవ్రేలుచున్నదండలవలె, తళుకొత్తుక్ = మెఱయును.

తా. ఆయింతియొక్క కంఠమునకు దిగువగాను గుచముల కెగువగా నున్న ప్రదేశము కొంచెము వెడలుపును బొడువును గలిగియున్నది. భుజకీర్తులయందలి వజ్రకాంతు లావక్షఃప్రదేశ మందలి పూలదండలయందుఁ బ్రతిఫలింపఁగా నా మొగ్గల చేత నది విచిత్ర వర్ణముగలదియై మన్మథుఁడు రతీదేవిని వివాహమైనప్పుడా రతీదేవి ముఖమందుఁ గట్టిన బాసికమువలెనే యుండెను, హస్తములు రెండు నా బాసికమునకు రెండుపార్శ్వములయందు వ్రేలుచున్న దండలో యనునట్లును ఉండెను.

చ. ఒదవెడుజవ్వనంబు వెలిఁకొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁ గూడి బి
ట్టదుమఁగ లేత లొట దిగ నాఁకకుమీఱను లేక వక్షపుం
జదుపునఁ బ్రక్కల న్మెఱసి చప్పటలై మఱి లావుగూడఁ బైఁ
బొదలె ననంగఁ బిక్కటిలెఁ బొల్తుకచన్నులు నాఁడునాఁటికిన్. 21

టీ. పొ...లు - పొల్తుక = ఆ పొలఁతియొక్క, చన్నులు = స్తనములు, (ఇది కర్తృపదము. (ఒ...బు-ఒదవెడు = పుట్టుచున్న, జవ్వనంబు = యౌవనము, వెలికొత్తఁగన్ = బైటఁద్రోయఁగా, పయ్యెద = పైఁటచెఱఁగు, సిగ్గుఁగూడి = లజ్జనుగూడికొని, బిట్టు=గట్టిగా, అదుమఁగన్ = లోపలికిఁద్రోయఁగా, లేఁతలాటన్ = తరుణములాట చేత, దిగన్=దిగివచ్చుటకును, అఁకకుమీఱును = అజ్ఞకతిక్రమింపను, లేక = చాలక, వ...నన్ - వక్షపున్ = వక్షస్థ్సలసంబంధియగు, చదుపునన్ = సమ్మర్దముచేత, ప్రక్కలన్=పార్శ్వములందు, మెఱసి = ప్రస్ఫుటములై, చప్పటలై = అడఁగినవై, మఱి = పిమ్మట, లావుగూడన్ = బలమురాఁగా, పైఁబొదలె ననంగన్ = పైకి వ్యాపించినవో యన్నట్లు, నాఁడునాఁటికిన్ = దినక్రమమున, పిక్కటిలెన్ = విస్తరిల్లెను.

తా. ఆ యుగ్మలికుచములను యౌవనము బయిటఁ ద్రోయుచుండఁగాను సిగ్గు వచ్చి పైఁటచెఱఁగుతోఁ గూడి మరల లోపలికిఁ ద్రోయఁగా నవి లేఁతవి గావున దిగి వచ్చుటకును బై కెగయుటకును నేరక యురస్థ్సలమందె యొత్తిడిం బడి పార్శ్వముల కొఱఁగి అడఁగి చప్పటలై పిమ్మటఁ గ్రమక్రమముగా లేఁతఱికము వదలఁగానే బలము వచ్చి పైకిఁ బిక్కటిల్లెను. (యౌవనప్రాదుర్భావము కాఁగానే చనుదోయి కానఁబడె ననియును, లజ్జ దోఁచె ననియును, దరువాతఁ గుదురులుఁ గట్టి యుదరమెల్ల నాక్రమించి స్తనములు క్రిక్కిఱిసి పిక్కటిల్లె ననియును భావము.)

తే. వృతరఘూత్తమశాప మొక్కింత విడిచి
విడిచి కడ కేఁగ నప్పుడప్పుడ కవిసెడు
చక్రయుగ మన ఱొమ్మొయ్య నాక్రమించి*
కొమిరెచన్నులు పృథుచూచుకముల నమరె. 22

టీ. వృ...ము - వృత=ఆవరించిన, రఘూత్తమ = శ్రీరామునియొక్క, శాపము= శపించుట,ఒక్కింత=ఒక కొంచెము, విడిచివిడిచి = వదలివదలి, కడ కేఁగన్ = తొలఁగి పోఁగా, అప్పుడప్పుడ = తత్కాలమందే, కవిసెడు = కూడుకొనియెడు, చక్ర = జక్కవలయొక్క,యుగము అనన్=కవయో యనునట్లు, ఱొమ్ము-వక్షస్థ్సలమును, ఒయ్యన్= మెల్లఁగా, ఆక్రమించి = వ్యాపించి, కొమిరె = ఆ యువతియొక్క యనికాని, కొమిరె చన్నులు = ఉదుటుకుచములనికాని, పృథు = కొంచెము పెద్దవియగు, చూచుకములన్ = చనుమొనలచేత, అమరున్ = ఒప్పును. చక్రవాకములకురాత్రియెల్లవియోగముగలుగునట్లు శ్రీరాముఁడు సీతాదేవి వియోగ మనుభవించునప్పుడు శాపమిచ్చుట పురాణప్రసిద్ధము.

* ఆక్రమించు, కొమిరెచన్నులు లేఁగప్పుకొనల నమరె.

తా. చక్రవాకద్వయము తమకు సంభవించిన శ్రీరామ శాపమునువదలి యప్పు డప్పుడే కలియుచుండిన నెట్లుండునో యా రీతిగానే వట్రువయై యొండొంటికిఁ జేరువయై కుచద్వయము ఱొమ్ము నాక్రమించెను, ఆపక్షులముక్కులవలెనే చనుమొన లొప్పారెను.

క. తా రెట్లట్లుగఁ దమ్ముం
జేరిన ముత్తెంపుసరులఁ జేడియచన్నుల్
లోరెంట లుడిపె ఘనమగు
వారు నిజార్జవముఁ జేరువారికి నీరే. 23

టీ. చేడియచన్నుల్ = ఆబాలికస్తనములు, తారెట్లు = తామెట్లో, అట్లుగన్ = ఆరీతిగానే (అనఁగా రెండుస్తనములు వేఱుగా దూరముననుండి నానాఁటఁ జేరువకువచ్చి యొరసికొన్నట్లనుట), తమ్ముంజేరిన = తమ్మునాశ్రయించిన, ముత్తెంపుసరులన్ = ముక్తాహారములను, లోరెంటలు = లోపలిజాటలను, ఉడిపెన్ = పోఁజేసెను, ఘనమగువారు = ఘనతగలవారు, నిజార్జవము - నిజ = స్వకీయమగు, ఆర్జవము = ఒయ్యారమును, చేరువారికిన్ = తమ్మునాశ్రయించినవారికిని, ఈరే=ఇయ్యరా (ఇత్తురనుట).

తా. కుచములు తాము మధ్యభాగమున సందు లేక కదిసియున్నవి గావున నందుఁ జేరిన హారములును గుచమధ్యమందు విరళముగ నుండుటకు తావులేక కుచములయం దన్నిపేట లొక్కటఁ గూడి ఘను లైనవారు దమవలెనే యుండుటకుఁ దమ యాశ్రితులకుఁ దమ సుగుణము లిచ్చురీతి నొప్పారెను. అర్థాంతరన్యాసాలంకారము.

తే. విరహితతిమీఁది కోపాన మరుఁడు దివియ
వేగమై పైఁడియొఱతోన విసరఁ గుట్లు
దునిసి బైటికి నసిధార దోఁచె ననఁగఁ
గనకరుచి మధ్యలత నారు కాంత కలరు. 24

టీ. కాంతకున్=ఆయింతికి, ఆరు=నూఁగారు, (ఇది కర్తృపదము,)వి...నన్ - విరహి=వియోగులయొక్క, తతిమీఁది = సమూహముపైనున్న, కోపానన్ = కోపము చేత, మరుఁడు=స్మరుండు, తివియన్ = ఒఱలోనుండితీయుటకు, వేగమై = వేగము గలవాఁడై, సీ. 'అప్సరోనికురుంబ మాటలఁ బాటలు నైవినోదింపంగ నమరగణ' మని యును, క. 'కాచికొనివచ్చితగనా, నేచినయట్లచటనచట నిలిపితిమునినా,థా చేటును భంగంబును, నైచిత్తముశోకమునకు నగ్గంబయ్యెన్' అనియు నున్న భారతప్రయోగంబుల కలిమి నగుధాతువునకు కలిమిఅర్థము. పైఁడియొఱతోన = కనకమయమగునొఱతోఁ

గూడనే, విసరఁ జనఱుకుటకువిసరఁగా, కట్లు=ఆయొఱకట్లు, తునిసి = తెగి, బైటికిఁ = బాహ్యప్రదేశమునకు, అసిధార = కత్తివాదర, తోఁచెఁ అనఁగ = కానవచ్చెనను నట్లుగా, కనకరుచి = బంగరుకాంతిగల, మధ్యలతఁ = కొఁదీఁగెయందు, అలరుఁ = ప్రకాశించును.

తా. మన్మథుఁడు విరహులపైఁ దన కధికమగు కోపము రాఁగా నా కోపాతిశయముచేతఁ గత్తి బైటికిఁ దీయు నంత తడవులేక వేగము పడి పసిఁడి యొఱతోనే యాఖడ్గమును విసరఁగా నా వేగమువలన నొఱను గట్టి యున్న కట్లు తెగి యా సందున నా కత్తివాదర కనఁబడినట్లు బంగారు వన్నెగల కొఁదీఁగెయందు నల్లని కాంతిగల నూఁగారు ప్రకాశించెను. ఉత్ప్రేక్షాలంకారము.

క. అండజగామిని యూరుపుఁ
బిండువలపు లాన నాభిబిలము వెడలి చ
న్గొండల నడుమను బ్రాఁకెడు
కుండలియో యనఁగ నారు కొమరొప్పారున్. 25

టీ. అం...లు - అండజగామిని = ఆహంసయానయొక్క, ఊరుపుఁబిండు = ఉచ్ఛ్వాసవాయుసమూహముయొక్క,వలపులు=పరిమళములను, ఆనఁ=ఆస్వాదించుటకు, నాభిబిలము = బొక్కిలియనుబిలమునుండి, వెడలి = బయలుదేఱి, చన్గొండలనడుమను = కుచగిరులమధ్యమున, ప్రాఁకెడు = ప్రాఁకుచున్న, కుండలియో యనఁగఁ = త్రాఁచుఁబామోయనునట్లు, ఆరుకొమరు - ఆరు=రోమరాజియొక్క, కొమరు = సౌందర్యము, ఒప్పారుఁ = తనరును.

తా. మఱియు నాహంసయానయొక్క నూఁగారు పరిమళముగల యుచ్ఛ్వాస వాయువుల నాస్వాదించుటకై నాభి యనియెడు బిలములోనుండి వెలువడి చన్నులనియెడు కొండలనడుమ నెగఁబ్రాఁకుచున్న కాలసర్పమో యనున ట్లుండెను. (సర్పములు వాయుభక్షణము సల్పు ననియు, వాని కున్నత పర్వములయందుఁ బ్రాకుటయందుఁ బ్రయాసము గావున మెల్లగఁ బ్రాఁకుచుండు ననియును భావము.)

క. అంగన నిలిచిన బాహువు
లుం గౌనును నేరుపఱుచు లోకమునకు ర
త్నాంగద కాంచీభేదము
లుం గెళవుల నడిమిచుక్కలు న్నూఁగారున్. 26

టీ. అంగన=ఆయింతి, నిలిచినఁ = నిలుచునప్పుడు, లోకమునకుఁ = చూచెడు జనమునకు, రత్నా...లును-రత్న=మణిమయములైన, అంగద=బాహుపురుల యొక్కయు,

కాంచీ=మొలనూలియొక్కయు, భేదములు = వేఱుపాటులును, కె...లుఁ - కెళవుల = పార్శ్వములయందలియును, నడిమి = మధ్యప్రదేశమందలియును, ఉనుకులుఁ=ఉండుట లును, నూఁగారుఁ = రోమావళియును, బాహువులుఁ=బాహువులును, కౌనును=నడుమును, వివపఱుచుఁ = వివరించును.

తా. నడుమును గోమలములగు బాహువులును సమకృశము లై యున్నవి గావునఁ, జూచు వారి కాభేద మెఱుక పడకుండఁగా భుజకీర్తులును పార్శ్వద్వయమందు నిలుచుట లును బాహువులఁ దెలుపుట, మొలనూలు నడుమ నుండుట, నూఁగారు నీమూఁడును ఇది నడు మని తెలుపును, అట్లుకానియెడలఁ జేతు లెయ్యవియో నడు మెద్దియో తెలియుట కష్టము.

క. తనుమధ్యవళీభంగము
లను గూర్పఁగ నవియుఁ దత్కులములయగుటఁ గం
తుని యిడిన పత్తిఱేకనఁ
జను నొడ్డాణమున నడుము శ్యామకు నమరున్. 27

టీ. శ్యామకుఁ = ఆశ్యామకు, త...ను - తను = సూక్ష్మమగు, మధ్య=నడుము యొక్క, వళీ=త్రివళు లనియెడు, భంగములను = విఱుగులను, కూర్పఁగఁ=అదుకుటకు, అవియుఁ = ఆవళులును, తత్కులములయగుటఁ = ఆబంగారుజాతిగలవేయవుటచేత, కం...నఁ-కంతుని=మన్మథుఁడనియెడు నగసాలెవానియొక్క, ఇడిన = ఉనిచిన, పత్తిఱేక నన్=పత్తికట్టునిమిత్తముంచినబంగారుఱేకో యనునట్లు, చను=ఒప్పుచున్న, ఒడ్డాణమునఁ = కాంచీగుణముచేతను, నడుము=మధ్యము, అమరుఁ=చెన్నగును.

తా. సూక్ష్మ మగు నడుముయొక్క వళు లనియెడు తునుకలకు మన్మథుఁ డదుకు పెట్టఁ దలఁచి బంగారు బంగారుతోనే యదుకును గావున నావళులు బంగారుతునుకలే యగుట నా మధ్యవళుల నడుమఁ దన పత్తిఱేకను బంగారు ఱేకు వేసి యదికి బిగించెనో యనునట్లున్న యొడ్డాణముచేత నడుము పొల్పారును. రూపకోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

క. లేఁగౌఁదీఁగె నితంబము
ప్రేఁగునఁ ద్రెవ్వుటయుఁ గని విరించి బిగింపన్
లోఁగి ముడియిడియె వదలుగ
నాఁ గౌకస్తని గభీరనాభి చెలంగున్. 28

టీ. లేఁగౌఁదీఁగె = లేఁతయగుమధ్యలత, ని...నన్ - నితంబము = పిఱుఁదు యొక్క, ప్రేఁగునన్ = భారముచేతను, త్రెవ్వుటయుఁ = తెగిపోఁగా, కని = చూచి విరించి=బ్రహ్మదేవుఁడు, బిగింపన్=బిగియించుటకు, లోఁగి = సందేహించి, వదలుగన్ =

బిఱ్ఱులేకుండ, ముడియిడియెనాన్ = ముడివేసెనోయనునట్లు, కోకస్తని = ఆచక్రవాక స్తనియొక్క, గభీరనాభి = లోఁతైనపొక్కిలి (ఇది కర్తృపదము), చెలంగున్ = ప్రకాశించును.

తా. సృష్టికర్త యగుబ్రహ్మదేవుఁ డాకోకస్తనియొక్క పిఱుఁదుల భారము చేత లేఁత కౌను దీఁగె లాగఁబడి తెగుటఁ జూచి మరల సంధించుటకు యత్నపడి బిగియించిన మరలఁ దెగునేమో యని సందేహించి వదలుగా ముడివేసి మరల సంధించిన ముడియో యన్నట్లు నాభి ప్రకాశించును. ఉపమోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

క. వెలఁది కటిపేర నిల నొక
పులినము దిగఁబడియె సింధుపులినపుఁబఙ్క్తిన్
నలువ యది పడఁగఁగాదే
తెలియుట కం దంచపదము దిరముగ నిలిపెన్. 29

టీ. సింధు...పఙ్క్తిన్-సింధు = నదీసముద్రములయొక్క, పులినపు = ఇసుక దిన్నియలయొక్క, పఙ్క్తిన్ = శ్రేణియందు, వెలఁదికటిపేరన్-వెలఁది=ఆస్త్రీయొక్క, కటి=పిఱుఁదనియెడు, పేరన్=వ్యాజముచేత, ఇలన్ = భూమియందు, ఒక పులినము = ఒక్కయిసుకదిన్నియ, దిగఁబడియెన్ = తప్పిపోయెను. నలువ = చతుర్ముఖుఁడు, అది = ఆపులినము, పడఁగఁగాదే = తప్పిపోవుటచేతనేకాదా, తెలియుటకు = ఎఱుఁగుటకొఱకు, అందు=ఆసింధు పులిన పఙ్క్తియందు, అంచపదమున్ = హంసపాదమును, తిరముగన్= స్థిరముగా, నిలిపెన్=ఉనిచెను.

తా. ఆయువతి పిఱుఁదు ఇసుక తిన్నియవలె నున్న దనియును, మున్ను బ్రహ్మదేవుఁడు సముద్రతీరములయందును నదీతీరములయందును సైకతములు సృజించునప్పు డా పఙ్క్తిలో నీయువతి పిఱుఁదను నిసుకదిన్నె చేరక దిగఁబడియెను గాన నది యెఱిఁగి యక్షర పఙ్క్తిలో దిగఁబడినయక్షరమునకు గుఱుఁతుగా నక్కడ హంసపాదము పెట్టుట ప్రసిద్ధము గావున, నట్టి విధముగానే యిది దిగఁబడుట దెలియుటకొఱకు నాపులినపఙ్క్తియందు సంచరించెడు హంసలయొక్క పదచిహ్నములనియెడు హంసపాదము పెట్టెను. వ్యస్తరూపకానుప్రాణిత హేతూత్ప్రేక్షాలంకారము.

తే. కదళి దివియించె నగ్రాంఘ్రికంబు తొడల
పెనుపు నెట్లన్నఁ బొరల శోధన నడంచు
కొన్న యాఁదోఁకపాటును గొప్ప విప్ప
మెఱయు గోర్మ్రిచ్చులును గెంపు గుఱులు గావె. 30

టీ. కదళి=అరఁటిచెట్టు, అగ్రాంఘ్రికంబు = పాదాగ్రముయొక్కయు, తొడల = ఊరువులయొక్కయు, పెనుపున్ = అతిశయమును, తివియించెన్ = లాఁగికొనెను. ఎట్లన్నన్ = అది యేవిధమున ననఁగా, పొరల = అరఁటిపట్టలపొరలయొక్క, శోధనన్ = శోధించుటచేత, (దొంగదగ్గఱనుండు వస్త్రాదులలోని పొరలసందుల సోదా చూచుట యనుట.), అడంచుకొన్న = దాఁచుకొన్నట్టి, అఁదోఁకపాటును = గోపుచ్ఛాకారమును, (ఇది తొడల పెనుపు), కొప్పువిప్పన్ = అరఁటిపువ్వువిప్పఁగా, (దొంగ సిగముడి విప్పఁగా ననుట.), మెఱయు = బయటఁబడునట్టి, గోర్మ్రిచ్చులును= గోళ్లనుదొంగలును, (అరఁటిపువ్వులోని తెల్లనికుసుమలలోఁ గొన్ని గోళ్లవలెనుండును. వాని నిచ్చటఁ జౌర్యసాధకనఖాంకారాయుధములుగాఁ జెప్పినాఁడు. ఆయరఁటి పువ్వునందే మఱియొకవిధమయిన కుసుమలకు దొంగ లని పేరు కలదు), కెంపు=పద్మరాగమును, అరుణకాంతియును, (దొంగ సిగవిప్పినప్పుడు కెంపు గనుపడె ననుట.),గుఱులు= నిదర్శనములు, కావె=కావా, అవు ననుట. (ఈ పద్యమునందుఁ గ్రమవ్యత్యయమయినను దోషావహంబు గాదు, ప్రయోగములు గలవు.)

తా. ఈయమ తొడల సౌందర్యమును, పాదాగ్రముల యొప్పిదమును, అరఁటిచెట్టు మ్రుచ్చిలింపఁగా నది యెట్లెఱుంగ వచ్చె ననఁగాఁ, బొరలు విప్పఁగాఁ దొడల యందలి సౌందర్యమును; పువ్వనియెడు కొప్పు విప్పఁగా నందలి కెంపును గేసరములును పాదతల రక్తకాంతియును నఖాకార శస్త్రములును సాక్షులై యుండఁగా వేఱు నిదర్శనముతోఁ బనిలేదు.

తే. వసుధలో నెట్టి శ్రీ గలవారి వేని
కరభములు దాస్యములు చేయుఁ సరసిజాక్షి
యూరువుల కెట్టన్నఁ బైఁ దారు మోచు
గొడుగులును నల్లకలశముల్ గుఱులు గావె. 31

టీ. వసుధలోన్ = భూమిలో, ఎట్టి శ్రీగలవారివేని=ఏవిధమైనసంపద గలవారినైనను, కరభములు=హస్తభాగవిశేషములు, ఊరువులకున్ = పెందొడలకు, దాస్యములు = పరవుడములు, చేయున్=ఒనర్చును, అటు=ఆవిధము, ఎట్టన్నన్=ఎట్లనఁగా, పైన్=తమ మీఁద, తారు=తాము, మోచు = వహించెడు, గొడుగులును = ఛత్రములును, అల్లకలశముల్ = ఆప్రసిద్ధములగు పూర్ణకుంభములును, (దాస్యములుచేసెడువారు తమహస్తముల యందు గొడుగులను జలాహరణమునకుఁ గలశములను దాల్తు రనుట.), మఱియు నుత్తమ స్త్రీల హస్తములయందు ఛత్రకలశాదిరేఖ లుండు ననుట. శ్లో. 'అంకుశం కుండలం ఛత్రం యస్యాః పాణితలే భవేత్, పుత్రం ప్రసూయతే నారీ నరః పృథివీపతిః. యస్యాః

కరతలే పద్మం పూర్ణకుంభం తథైవ చ, రాజపత్నీత్వమాప్నోతి పుత్రైశ్చ సహ మోదతే.'
అని సాముద్రికశాస్త్రము. గుఱులు గావె=గుర్తులు గావా? (ఔ ననుట.)

తా. లోకమందలి యెంత సంపదగల స్త్రీల కరభములైన నాయమ యూరువులకు దాస్యము సేయునే కాక, యాయమ యూరువులతోఁడ సామ్యముఁజెంద నేరవు. అవి దాసులై యుండుటకు గుఱుతు లేమనిన, నాహస్తములయందు రేఖాకారములగు ఛత్రములును గలశములు నుండుటయే, అట్టి రేఖలుగల భాగ్యవతులు గావున నే యీ యమ్మ వారికి దాస్యములు సేయుటకుఁ గలుగుననియును; సాధారణస్త్రీల కది దొరక దనియును భావము. ఉత్తమస్త్రీల చేతులయందుండు ఛత్ర కలశ రేఖల నూరు సేవార్థము ధరించిన ఛత్రకలశములుగా నుత్ప్రేక్షించినాఁడు గనుక నుత్ప్రేక్షాలంకారము.

క. వలరాజుకుటుంబము న,గ్గలముగఁ బోషించుకలమగర్భములయ్యెన్
   బోలఁతుకజంఘు లతిశ్యా,మల మంజీరస్థనిబిడమరకతకాంతిన్. 32

టీ. పో...లు - పోలఁతుక = ఆపోలఁతియొక్క, జంఘులు = పిక్కలు, అ...తిన్ - అతిశ్యామల=మిక్కిలి శ్యామలవర్ణములుగల, మంజీరస్థ = అందియలయందున్న, నిబిడ=దట్టములగు, మరకత=పచ్చలయొక్క, కాంతిన్=ప్రకాశముచేత, వ...మున్ - వలరాజు=మన్మథునియొక్క, కుటుంబమున్ = సంసారమును, అగ్గలముగన్ = అధికముగా, పో...లు అయ్యెన్ - పోషించు=ప్రోచెడు, కలమగర్భములయ్యెన్ = వరిపొట్టలయ్యెను. (శ్యామలహరిద్వర్ణముల కభేదం బగుటకు 'మరకతమణిస్తంభగంభీరబాహు' వని శ్రీకృష్ణకర్ణామృతమునందును, 'శుకాంకనీలోపలనిర్మితానాం' అని మాఘకావ్య తృతీయ సర్గమందును, సీ. 'అభినవజలధరశ్యామంబు లగుచోటు లాకు జొంపంబుల ననుకరింప' అని విరాటపర్వంబున నునికిం జేసి మరకతంబులయందు శ్యామలవర్ణము గలుగునట్లు నిచ్చటఁ జెప్పఁబడియె.)

తా. ఆ పోలఁతి పిక్కలతి నిర్మలములై యుండుటం జేసి పాదకటకములయందలి దట్టమగు పచ్చలకాంతిచే వ్యాప్తము లై వరి పొట్టలవలెఁ బచ్చని వన్నెగలిగియున్నవి. ఈ వరి పొట్టలు మన్మథుని కుటుంబ పోషణమునకు మిక్కిలి యుపయోగ మగుచున్నవి.

తే. ఉవిద నిద్దంపుజంఘుల సవతుఁ గోరి
   కలమగర్భంబు లఢఁచు లోఁ గంటకములు
   చాతురుల మించి మఱి దివసక్రమమున
   నిలువ కవి బాహిరము లైనఁ దలలు వంచు. 33

టీ. ఉ...తుక్-ఉవిద = ఆయువతియొక్క, నిద్దంపు = స్నిగ్ధములగు, జంఘుల = పిక్కలయొక్క, సవతున్ = సాపత్న్యమును, కోరి = అపేక్షించి, కలమగర్భంబులు

రాజనపుంబొట్టలు, కంటకములు = తనయందలిదోషములు, (వరికి జూంజూయుముండ్లు గలిగి యుండుట ప్రసిద్ధము.), చాతురులన్ = నేర్పులచేత, మించి = అతిశయించి, లోన్ = తనలోనే, అడఁచున్ = దాఁచుకొనును, మఱి = పిమ్మట, అవి=ఆకంటకములు, నిలువక= లోపల నిముడక, దివసక్రమమునన్ = నానాఁట, బాహిరములైనన్ = బయల్పడఁగా, తలలు వంచున్=సిగ్గుచేత శిరములు వంచును.

తా. నిద్దములగు నాయువిదపిక్కలతో రాజనపుంబొట్టలు సామ్యము రాఁ గోరి తమ యంతర్దోషములు బయల్పడనీక నేర్పుచేత దాఁచెనే కాక మఱికొన్ని దిన ములలోనే యా కంటక దోషము గనఁబడఁగా నా వరిపొట్టలు సిగ్గుచేతఁ దలలు వంచుకొనును. (అనఁగా నాయమ పిక్కలు మిక్కిలి నునుపు గలిగియున్న వనియును వరి పొట్టలు మొదట సామ్యమునకు వచ్చినను వెనుక వెన్ను తీయఁగానే ముండ్లు బయలఁ బడుటయు భారముచేతఁ దలలు వంచుటయును బ్రసిద్ధ మని భావము.)

చ. ఇలఁగల వస్తుసంతతులకెల్లను గచ్చిడు మత్స్వభావపా
టలరుచి యింక వేఱ యొకడా లిడవచ్చునె లక్కనీట మ
మ్మలమిన దెంతముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగునట్లు మించు నఖములై మెఱయన్ గొమరారు నింతికిన్.

టీ. ఇలన్ = భూమియందు, క...కన్ ఎల్లను - కల = ఉన్నట్టి, వస్తుసంత తులకెల్లను=సమస్త వస్తుసముదాయములకు, మ...చి-మత్ = మాయొక్క, స్వభావ = ప్రకృతిచేతనే, పాటల = ఎఱ్ఱని, రుచి = కాంతి, గచ్చిడున్ = వన్నెఁబెట్టును, ఇంక వేఱ=మఱియితరమగు, ఒకడాలు=ఒకవర్ణమును, ఇడవచ్చునె = మాకుఁబెట్టవచ్చునా, ఇది=ఈయమ, లక్కనీటన్ = లాక్షారసముచేత, మమ్మున్=మము, అలమినది = పూసి నది, ఎంతముగ్ధ=ఎంత తెలియనిది, అంచున్=అనుచు, పదాబ్జములు = అడుగుదమ్ములు, (ఇది కర్తృపదము.), అంగుళీముఖంబులన్-అంగుళీ = వ్రేళ్లనియొడు, ముఖంబులన్ = మొగములచేత, నగునట్లు = పరిహాసించునట్లు, మిం...ల్-మించు = అతిశయించునట్టి, నఖముల్=గోళ్లు, మెఱయన్=ప్రకాశింపఁగా, ఇంతికిన్ = ఆయమకు, కొమరారున్= ఒప్పును, ముగ్ధ యన్నందుకు, "శ్లో. ముగ్ధేత్యాద్వాదశం స్త్రీణాం మధ్యేయష్టాదశం స్మృతమ్, అత ఊర్ధ్వం ప్రగల్భేతి వ్యవస్థాత్రయముచ్యతే." అని యాధారము.

తా. ఆయమ పాదాబ్జములకు మంగళార్థమై లాక్షారస మిడఁగా నప్పు డాపాద ములు లోకమందలి సమస్తవస్తువులకు వన్నెఁ బెట్టెడు మాకు వేఱొకవన్నెఁ బెట్ట వచ్చునా యిది యెఱుంగక యీ ముగ్ధ మాకు లక్కనీరుపూసె నని వ్రేళ్లనియొడు

ముఖములచేతఁ బకపక నవ్వుచున్నవో యన్నట్లు గోళ్లు తెల్లఁగా మెఱయుచుండఁగా నాపాదము లొప్పుచున్నవి.

క. లలనోపరిపదకచ్ఛప
 ములు బలిమి మెయిన్ గజప్రభూతగతిశ్రీ
 విలసనముఁ గొనఁగఁగాదే
 కలిగెన్ గజకచ్ఛపోగ్రకలహం బుర్విన్. 35

టీ. ల...లు - లలనా = ఆయమయొక్క, ఉపరిపద = మీఁగాళ్లపైయెడ, కచ్ఛపములు=తాఁబేళ్లు, బలిమి మెయిన్ = బలాత్కారముచేత, గజ=ఏనుఁగులయొక్క, ప్ర...లు-ప్రభూతగతి = ఒయ్యారపునడకయొక్క, శ్రీ=సంపదయొక్క, విలసనమున్ = విలాసమును, కొనఁగఁగాదే = గ్రహింపఁగాఁగదా, ఉర్విన్ = భూమియందు, గజ కచ్ఛపోగ్రకలహంబు-గజ=ఏనుఁగుయొక్కయు, కచ్ఛప=తాఁబేటియొక్కయు, ఉగ్ర= భయంకరమయిన, కలహంబు = పోరాటము, కలిగెన్ = ఉదయించెను.

తా. ఆ లలనయొక్క మీఁగాళ్లు తాఁబేళ్లవలెను, గజగమనమువంటి గమనము గలిగియు నున్నవి. ఆకచ్ఛపములు గజముయొక్క గమనసంపదను హరింపఁగా దాని వలన నా యేనుఁగునకును దాఁబేటికిని గలహము సంభవించెను; దానిచేతనే భూమియందు గజకచ్ఛప సంవాద మను సామెత యేర్పడెను.

తే. తరుణితనుకాంతియెదుట నూతనహరిద్ర
 తులకురాలేక యత్యంతమలిన యయ్యె
 నౌటఁగా రాత్రి యన నిశ యనఁ దమిస్ర
 యన నిశీథిని యన క్షప యనఁగఁ బరఁగె. 36

టీ. నూతనహరిద్ర=పచ్చిపసుపు, తరుణి=ఆలేమయొక్క, తను=శరీరముయొక్క, కాంతియెదుటన్=ప్రకాశముముందఱ, తులకురాలేక=సామ్యమునకురాలేక, (త్రాసునకు రాలేక యనుట.), అత్యంతమలినమయ్యెన్ = మిక్కిలి మాలిన్యమునొందెను. (పచ్చిపసు పెండిన పిమ్మటఁ బైన నల్లగా నగును.), ఔటఁగా = కాఁబట్టియేకదా, రాత్రియనన్, నిశ యనన్, తమిస్ర యనన్, నిశీథిని యనన్, క్షప యనన్ (ఇవియన్నియు రాత్రికి నామములు. ఈపేళ్లే పసుపునకును జెల్లును. 'నిశాఖ్యాకాంచనీ పీతా హారిద్రా వరవర్ణినీ' అని నిఘంటువు; కాన నీపేరులచేత నా పసుపు), పరఁగెన్ = ఒప్పెను. (కరఁగె నను పాఠమును గలదు. పసుపురాచినఁ గరఁగుట ప్రశస్తము.)

తా. ఆమె సుందరశరీరము పచ్చిపసుపురంగును మించి మిక్కిలి ప్రకాశించుచుండెను.

సీ. అయ్యిందువదన ధరాంగన గావునఁ
ప్రాఙ్మైత్రిఁ బొరుగులభాగవతుల
గృహములందు మరాళికైకావళీ హారి
ణీ మనోజ్ఞా స్రగ్విణీ సమాఖ్య
లమర జనించి వయస్యలై నాగక
న్యలు పుత్త్రికావివాహములయందుఁ
బాడు పద్మాలయాపరిణయామేయగే
యముల ననంతకళ్యాణగుణము
తే. లద్భుతం బొప్ప విని విని యతనిఁ గవయు
బుద్ధి ప్రాగ్జన్మసంస్కారమున జనింపఁ
[1]దదవతారానుమేయకథాసుధాను
కలితలీలానుకృతుల వర్తిలుచు నుండి. 37

టీ. అయ్యిందువదన = ఆచంద్రముఖి, ధరాంగన గావునన్ = భూమిదేవియగుట చేత, ప్రాఙ్మైత్రిన్ = పూర్వజన్మస్నేహముచేత, నాగకన్యలు = భుజంగకన్యలు, పొ...దున్ - పొరుగుల = సమీపములయందలి, భాగవతుల = భగవద్భక్తులయొక్క, గృహములందున్ = తిరుమాళిగలయందు, మరాళికా, ఏకావళీ, హారిణీ, మనోజ్ఞా, స్రగ్విణీ అనియెడు, సమాఖ్య లమరన్ = నామధేయము లొప్పుచుండఁగా, జనించి = అవతరించి, వయస్యలై = ఆయమకు నెచ్చెలులై, పుత్త్రికావివాహములయందున్ = బొమ్మల పెండ్లిండ్లయందు, పా...లన్ -పాడు = గానముచేసెడు, పద్మాలయాపరిణయ = లక్ష్మీకళ్యాణ మనియెడు, అమేయ = లెక్కకు మీఱిన, గేయములన్ =పాటలయందు, అనంతకళ్యాణగుణములు - అనంత = విష్ణువుయొక్క, కళ్యాణ = మంగళకరములగు, గుణములు = గొనములు, అద్భుతంబొప్పన్ = అబ్బురముగలుగునట్లు, వినివిని, అతని = అవిష్ణుదేవుని, క...ద్ధి కవయు = కూడెడు, బుద్ధి = మనీష, ప్రాగ్జన్మసంస్కారమునన్ - ప్రాగ్జన్మ = పూర్వజన్మసంబంధియగు, సంస్కారమునన్ = సంస్కారముచేత, (ఇచ్చటఁ దృతీయార్థమున సప్తమి.), జనింపన్ = పుట్టఁగా, తదవతారానుమేయకథాసుధాను కలిత లీలానుకృతులన్ - తత్ = ఆస్వామియొక్క, అవతార = రామకృష్ణాద్యవతారములయొక్క, అనుమేయ = ఊహింపఁదగిన, కథాసుధా = అమృతమువంటి కథల తోడ, అనుకలిత = కూడికొన్న, లీలా = విలాసములయొక్క, అనుకృతులన్ =అనుకారములచేత, వర్తిలుచునుండి = ఒప్పుచు.

---

1. దదవతారకథాగోష్ఠిఁ దదవతార.

సీ. తమతండ్రి శ్రీశదత్తశ్రీలు గృహమునఁ
  ద్రవ్వితండములయ్యుఁ ౹ దనదు తొంటి
స్రగ్వినిర్మాణదాస్యం బనుత్సేకత
  జరపుచుఁ బ్రజ్ఞ వైష్ణవపురాణ
సంహితావ్యాఖ్యారచనఁ బ్రొద్దుఁ గడపుచుఁ
  గట్టెడుకమ్మచెంగలువవిరుల
తోమాలె లలకలు ౹ దువ్వి కంతునకు [1]నా
  ర్ద్రినిబద్ధఖేటకం ౹ బనఁగ నీల
తే. వృషకకుద్రేఖ నెడమకొక్కింత యొఱగ
నిడిన ధమ్మిల్లవలయంబు ౹ నడుగనందుఁ
గొంతసే పర్థిఁ గీలించి ౹ కూపవారి
నీడ వీక్షించి క్రమ్మఱ ౹ గూడ నునుచు. 38

టీ. తమతండ్రి = ఆమె తండ్రియగు విష్ణుచిత్తుఁడు, గృహమునన్ = తమయింటి యందు, శ్రీశదత్తశ్రీలు-శ్రీశ=శ్రియఃపతిచేత, దత్త = ఇయ్యఁబడిన, శ్రీలు = సిరులు, 'శోభాసంపత్తిపద్మాసు లక్ష్మీ శ్రీరితికథ్యతే'యని హలాయుధము. త్రవ్వితండములయ్యున్ = తఱుఁగకయుండినను, తనదు = తనసంబంధియగు, తొంటి = తొల్లింటి, స్రగ్వినిర్మాణదాస్యంబు-స్రక్ = పుష్పమాలికయొక్క, వినిర్మాణ=కూర్చుట యనియెడు, దాస్యంబు= కైంకర్యంబు, అనుత్సేకతన్ = గర్వములేమిని, జరపుచున్ = చేయుచును, ప్రజ్ఞన్ = జ్ఞానముచేత, వై...నన్ - వైష్ణవపురాణసంహితా = శ్రీవిష్ణుపురాణసంహితయొక్క, వ్యాఖ్యారచనన్ = వ్యాఖ్యానముఁజేయుటచేత, ప్రొద్దుఁగడపుచున్ = కాలక్షేపముఁ జేయుచు, కట్టెడు = కూర్చుచుండెడు, కమ్మ = సుగంధముగల, చెంగలువవిరుల = ఎఱ్ఱ గలువపూలయొక్క, తోమాలెలు = దండలు, (ఇచ్చట ద్వితీయార్థమందుఁ బ్రథమ.), అలకలు = కురులు, దువ్వి, కంతునకున్ = మన్మథునకు, ఆర్ద్రి = నెమలిరెక్కలచేత, నిబద్ధ = కూర్పఁబడిన, ఖేటకంబనఁగన్ = కేడెమో యనునట్లు (కూర్పరబద్ధ యనుపాఠమున మోచేతఁగట్టఁబడిన యనియర్థము.), నీలవృషకకుద్రేఖన్ - నీలవృష = నల్లని యాఁబోతుయొక్క, కకుత్ =మూఁపురముయొక్క రేఖన్ =ఆకారమువంటియాకారము చేత, 'వృషాఙ్గేకకుదం త్రిషు' అని యమరము. ఎడమకున్ =వామపార్శ్వమునకు,ఒక్కింత= ఇంచుకంత, ఒఱగన్ =ఒఱగఁగా, ఇడిన=ఉనుచుకొనిన, ఆనఁగాదిద్దిన, ధమ్మిల్లవలయంబు= వట్రువయగు కొప్పుయొక్క, 'ధమ్మిల్లస్సంయతాఃకచాః' అని యమరము. అడుగునందున్ =

1. కూర్పరబద్ధ.

అంతర్భాగమందు, కొంతసేపు, అర్థిన్ =కోర్కెచేత, కీలించి=తుఱుముకొని, కూపవారిన్ = నూతినీటియందు, నీడ వీక్షించి = నీడఁజూచుకొని, క్రమ్మఱన్ = మగిడి, గూడన్ =తమ తండ్రియుంచిన పుష్పముల పుటికలోను, ఉనుచున్ = ఉంచును. 'గూడ' అనఁగా వైష్ణవపరిభాషయందు బుట్ట యనియర్థము.

తా. ఆచంద్రవదన తనతండ్రియగు విష్ణుచిత్తుండు శ్రియఃపతికృపవలన నధిక తర సంపదలు గలిగినను గర్వింపక పూర్వమువలెనే పుష్పమాలికాకైంకర్యముఁ జేయుచు శ్రీవిష్ణుపురాణవ్యాఖ్యానముచేతఁ గాలక్షేపముఁ జేయుచుఁ గూర్చెడు చెంగలువ దండ లను దాను కొప్పులో ధరించి నూతిలో నీడఁజూచుకొని మరల వానినిఁగూడ బుట్టలో నునుచును. ఆకొప్పు నెడమప్రక్క కొఱఁగి యుండును.

ఉ.*ఆ నవలా యలంతి పసుపాడి దుకూలముఁ దాల్చి గుబ్బచన్
గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుముతేటల నిగ్గుదేఱఁ గ
ర్ప్రానన నాభిఁ దీర్చి పితృబద్ధ లతాంతము లర్థిఁ గొప్పునం
బూని యొకింత సే పునిచి పుచ్చి చెలిం గని వెచ్చ నూర్పుచున్. 39

టీ. ఆనవలా = ఆయింతి, (అన్యదేశ్యమగుటంజేసి దీర్ఘాంతము.), అ...డి-అలం తి=స్వల్పమగు, పసుపాడి = పసుపుతోడి స్నానముచేసి, (ఆనవలావలంతి యను పాఠ మున స్త్రీరత్న మనియర్థము.), దుకూలము = ధౌతవస్త్రమును, తాల్చి=ధరించి, గుబ్బ చన్గోనలన్=గుబ్బ చనుగొనలయందు, (కోణశబ్దమువలనఁ గోన కోన అనురూపములు గలుగును, లేక, స్తనములు పర్వత సమములు గనుకఁ దత్ప్రదేశములను గోన లన వచ్చును.) తావులు = పరిమళములు, ఉప్పతిలన్=ఉదయించునట్లు, కుం...గ్గు-కుంకుమ తేటల = కుంకుముకాంతులయొక్క, నిగ్గు=నిగారింపు, తేఱన్ = కానరాఁగా, కర్ప్రానన= కర్పూరముచేతనే, నాభిన్ = తిరుమణిని, తీర్చిదిద్ది, పితృబద్ధలతాంతములు-పితృ = తండ్రియగువిష్ణుచిత్తునిచేత, బద్ధ = కట్టఁబడిన, లతాంతములు = పుష్పములను, అర్థిన్= కోరికచేత, కొప్పునన్=ధమ్మిల్లమందు, పూని = ధరించి, ఒకింతసేపు, ఉనిచి=ఉంచుకొని, పుచ్చి = మరలఁదీసి, చెలిన్ = చెలికత్తెను, కని = చూచి, వెచ్చన్ = వేఁడిమిగాఁగ, ఊర్పుచున్ = ఉచ్ఛ్వసించుచు - అని ముందటిపద్యముతో నన్వయము.

క. మీాపాడిన హరిచందము
లేపాడిగఁ దలఁపవచ్చు నితఁ డేసతులం
గాపాడినవాఁ డనుఁగై
తోపాడినఁ దన్ను వలచి తొయ్యలులారా ? 40

* ఆనవలావలంతి.

టీ. తోయ్యలులారా = స్త్రీలారా, మీపాడిన హరిచందములు = మీయొక్క పాటలలోని స్వామియొక్క రీతులు, ఏపాడిగ = ఏమర్యాదగాను, తలఁపవచ్చుఁగా = ఊహింపవచ్చును, ఇతఁడు=ఈహరి, తన్నువలచి=తన్ను మోహించి, త్రోపాడినన్ = వెంబడించినను, అనుఁగై = వారికిఁ బ్రియుఁడై, ఏసతులన్ = ఏస్త్రీలను, కాపాడిన వాఁడు. ఈ ప్రశ్నవలన నాస్వామి మర్యాదలేనివాఁడనియును, దన్ను మోహించిన స్త్రీలనైనను దాను స్నేహించి కాపాడ లేదనియును, బరిహసించుట.

తే. తాను సురమాని నృపతనుల్ దాల్చి యకట
కామినీతతి నుడికించుకంటె నట్టె
గండెయును నల్లదాసరిగాఁడు కిరియు
హరియు నై పోవుటయ మంచి దనుయుగంబు. 41

టీ. తాను = ఆహరి, సు...ల్-సురమాని = వామన పరశురామ బుద్ధుల యొక్కయు, నృప=శ్రీరామునియొక్కయు, తనుల్ = శరీరములు, తాల్చి = వహించి, అకట=అయ్యయ్యో, కామినీతతిన్=స్త్రీ సమూహమును, ఉడికించుకంటెన్ = తపింపఁ జేయుటకంటెను, అట్టె = ఆప్రకారమే, (మరల నవతారాంతరముఁ బొందకుండు నట్లనుట), గండెయును=మత్స్యమును, అల్లదాసరిగాఁడును = కూర్మమును, కిరియున్ = వరాహమును, హరియున్=సింహమును, అయి, అనుయుగంబున్=ప్రతియుగమందును, పోవుటయ=పోవుటే, మంచిది=మేలు.

తా. ఆ హరి వామన పరశురామ బుద్ధ రామావతారములయందు స్త్రీలను దపింపఁ జేయుటకంటె మత్స్య కూర్మ వరాహ సింహ రూపములతోనే ప్రతియుగ మందు నుండుటయే మేలు; ఇట్లు తిర్యగ్జాతిరూపములతో నుండిన స్త్రీ లెవ్వరును మోహింపరు గావున వారికిఁ దాపము లేకుండును.

క. ఆతనువుల లేరుగదా
నాతులు మఱి కాక కలిగినను నవ్వగ తిర్య
గ్జాతికి నీజాతికిఁ గల
యాతీవ్రత గలదె యెఱుఁగ గ కి ల్లే లంటిన్. 42

టీ. ఆతనువులన్ = ఆమత్స్యకూర్మాద్యవతారములయందు, నాతులు = స్త్రీలు, లేరుగదా, మఱికాక = వెండియు నటుగాక, కలిగినన్ = స్త్రీ లుండినను, 'విష్ణోర్దేహాను రూపాం వై కరోత్యేషాత్మన స్తనుం' మనియున్నది గనుకఁ దిర్యగ్జాతిస్త్రీ లుండవచ్చు ననుట.), వగ=భేదము, తిర్యగ్జాతికిన్ = ఆమత్స్యకూర్మాదితిర్యక్(స్త్రీ)జాతికి, ఈజాతికిన్=ఈమనుష్యజాతికిఁ గలిగిన, ఈతీవ్రత = ఈత్వరపాటు, కలదె = కలుగునా, అని

మరల, ఎఱుఁగక = తెలియక, ఇట్లేలంటి = ఈవిధముగా నేమిటి కంటి నని ముందటి పద్యముతో నన్వయము.

తే. 'ఆత్మవ త్సర్వభూతాని' యనుట బొంకె
ముద్దియల కైన వలవంత ముచ్చటలను
నాటపాటలఁ గతలఁ గొంతతడఁగుఁ గాని
నోరు లేనిజంతువులకు నొప్పి ఘనము. 43

టీ. ఆత్మవత్సర్వభూతాని - సర్వభూతాని = సమస్తభూతములును, ఆత్మవత్ = తనవలెనే, అనుట = అని చెప్పుట, బొంకె=అసత్యమా, (సత్యమే యనుట.), 'మాతృవత్పరదారాణి పరద్రవ్యాణి లోష్టవత్, ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి.' యని శ్లోకము. ముద్దియలకున్ = మనుష్యస్త్రీలకు, ఐన = కలిగిన, వలవంత = విరహతాపము, ముచ్చటలను = ఒండొరులకుఁ జెప్పుకొనుటచేత, ఆటపాటలన్ = నృత్యగానములచేత, కతలన్ = ఆహారికథలచేతను, కొంతతడఁగుఁగాని = కొంత మట్టుపడునుగాని, నోరులేనిజంతువులకున్ = మాటలాడలేనిజంతువులకు, నొప్పి = ప్రయాసము, ఘనము= అధికము.

తా. పై పద్యమందు నెఱుఁగక యని మరలఁ దెలిసి మనుష్యస్త్రీలకు ముచ్చటలు మొదలయినవానిచేతఁ గొంత విరహతాప మాఱును గాని, యీ మత్స్యకూర్మాది తిర్యగ్జాతి స్త్రీలకే పాపము తాప మధికము.

మ. ధరపై నీతఁడు పూర్వకల్పముల సక్తస్త్రీవిశాలాంబకాం
బురుహశ్రేణి జలంబు మైఁ బులకలున్ బూరించుచున్ బెంచు దు
ర్భరకర్మం బలమంగ వచ్చుజలచారస్తబ్ధరోమత్వకే
సరిత ల్పొం డవతారదంభమున నాచ్ఛాదించుఁ దాఁ బ్రౌఢిమన్.

టీ. ఈతఁడు=ఈహరి, ధరపైన్ = భూమిమీఁద, పూర్వకల్పములన్ = పూర్వయుగములయందు, స...ణిన్-సక్త = తనయందు మోహము గల, స్త్రీ=స్త్రీలయొక్క, విశాల=వెడఁదలగు, అంబకాంబురుహ=కమలములవంటి నేత్రములయొక్క, శ్రేణిన్ = పఙ్క్తియందు, జలంబు = ఉదకమును, మైన్ = శరీరమందు, పులకలున్ = రోమాంచములును, పూరించుచున్ = నిండించుచును, పెంచు = వృద్ధిఁబొందఁ జేసెడు, దుర్భర = భరింపరాని, కర్మంబు=సంచితకర్మము, అలమంగన్ = వ్యాపింపఁగా, వచ్చు= సంభవించునట్టి, జలచారస్తబ్ధరోమత్వకేసరితల్ = నీటఁదిరుగుటయు, నిట్టవొడిచిన రోమములు గలుగుటయు, (మెడమీఁదఁ గొనవెండ్రుకలు గలుగుటయును), తాన్ = ఈహరి, ప్రౌఢిమన్ = నేర్పుచేతను, పొందు = ఇతరములగు, (ఇదియొండనుశబ్దము

పకారాదిగా నుండు, సెట్లన్నను, ఒచ్చెము-పొచ్చెము, ఊను,-పూను, ఒనరించు - పొన రించు, ఇత్యాదులవలె నని యెఱుఁగవలయు.), అవతారదంభమునన్ =అవతార మనియెడు నెపముచేత, ఆచ్ఛాదించున్ = మఱుఁగుపఱుచును, కైతవాపహ్నవాలంకారము. 'కైత వాపహ్నుతిర్వ్యక్తా వ్యాజాద్యైర్నిహ్నుతిఃపదైః' అని దానిలక్షణము.

తా. ఆ హరి పూర్వయుగములయందు భూమిమీఁదఁ దన్ను మోహించిన స్త్రీల కోరికలు దీర్పక వారిని విరహమందు మునుఁగఁ జేసి దుఃఖపెట్టినాఁడు. కావున నా కర్మపరిపాకము దన కనుభవమునకు రాఁగా 'శుభకృచ్ఛుభ మాప్నోతి పాపకృత్పాప మశ్నుతే' యన్నట్లా స్త్రీలకుఁ గన్నీరు గలుగఁజేసిన హేతువువలన నా కన్నులతో సరియగు మీనుమేనితోఁ దాను నీటిలోఁ దిరుగు నట్లేర్పడఁగా నది మత్స్యావతారము గాను, మఱియు నా స్త్రీలశరీరములయందు గగుర్పాటు గలుగఁజేసిన హేతువువలనఁ దనకు నట్లు నిక్కపొడిచిన రోమములురాఁగా నది వరాహావతారముగాను, మఱియు వానివలననే తనకు మెడమీఁదఁ గొనవెండ్రుకలు గలుగఁగా నరసింహ ముఖము గల యవతారముగాను నేర్పడెను. కావున నది యా కర్మానుభవ మని తెలియరాకుండ నాతఁడు చక్కనినేర్పుతో మఱుఁగు పెట్టుచున్నాఁడు.

క. అనిమిషముని మనుజాధిప
జననంబుల నీతఁ డెట్లు ౕ జలజాక్షులఁ గూ
ర్చినవారి నేఁచె దయలే
కనిన వినుఁడు మీదుపాటులంద తెలిపెదన్. 45

టీ. అనిమిషముని=వామన పరశురాములయొక్కయు, మనుజాధిప = శ్రీరాముని యొక్కయు, జననంబులన్ = అవతారములయందు, ఈతఁడు = ఈహరి, కూర్చినవా రిన్ = ప్రేమపడినవారైన, జలజాక్షులన్ = స్త్రీలను, దయలేక = కృపమాలి, ఎట్లేఁచె ననినన్ =ఏరీతిచే ఖేదపెట్టె ననఁగా, మీదుపాటులంద = మీసంబంధులగు పాటలయందే, తెలిపెదన్ =ఎఱిఁగించెదను, వినుఁడు = వినుండు.

చ. మొదల నుపేంద్రుఁడై యితఁడౕమోఘుహతిం భృగుపత్నిఁ ద్రుంచియ
మ్ముదుసలి గేహినీవిరహముం దనయట్లన పొందు మన్న నా
కదియును దేవకార్యమున ౕ కయ్యెడునంచు వహించి త్రోఁచు లా
వెద వటు వయ్యు లచ్చి మది ౕ కెన్నఁడుఁ బాయని జాలి నింపఁడే?

టీ. ఇతఁడు=ఈహరి, మొదలన్=ప్రథమమందు, ఉపేంద్రుఁడై=విష్ణుమూర్తియై, అమోఘహతిన్ = బీఱుపోని వ్రేటుచేత, భృగుపత్నిన్ = భృగుమహామునిభార్యను, త్రుంచి=సంహరించి, అమ్ముదుసలి = ఆవృద్ధయినభృగువు, తనయట్లన=తనవలెనే, గేహినీ

విరహముఁ = భార్యావిరహమును, పొందు మన్నఁ = అనుభవింపు మనఁగా, నాకది యును = నాకాభార్యావియోగమును, దేవకార్యమునకుఁ = దేవతలకార్యముకొఱకే, అయ్యెడునంచుఁ=అవునని, వహించి=ఆశాపమును వహించి, ద్రోఁచు=కాలమునుగడపు నట్టి, లావెడఁ=దృఢమయినమనస్సుచేత, వటువయ్యుఁ = తాను బ్రహ్మచారియయ్యును, లచ్చిమదికిఁ = లక్ష్మీదేవిమనస్సునకు, ఎన్నఁడుఁ = సంతతమును, పాయని = విడువని, జాలి=విచారమును, నింపఁడే=నిండింపఁడా? వ్యతిరేకప్రశ్న.

తా. భృగుభార్యను దునిమి యా వృద్ధొసంగిన శాపము దేవతల కార్యముకొఱకగు నని తాను సమ్మతిగా వహించి వామనుఁడై యవతరించి బ్రహ్మచారియై యుండి యును వివాహము చేసికొనక నిత్యానపాయిని యయిన లక్ష్మికి నెడఁబాటువలని వ్యసనమును గలుగఁ జేసెను కదా! విష్ణుమూర్తి దేవతలకోరికపై భృగు భార్యను దునుముట భృగుమహర్షి భార్యావిరహతాపమునందు మని విష్ణుని శపించి భార్యను బ్రదికించుకొనుట, పురాణప్రసిద్ధము.

మ. ప్రళయార్కోగ్రకుతారకోణము నృపత్రైవిధ్యవత్పీఠికా
ఖ్యలఁ ద్రిస్థానము లేడుమార్గు వరుసన్ ఘట్టించు దోశ్శక్తిఁ గీ
ర్తిలసద్వల్లకి మ్రోయ రక్తయయి యెంతే వశ్యయౌ భూసతీ
తిలకంబుం దుదఁ ద్రోవఁ గశ్యపున కార్తిం బిడ్డయై పోవదే? 47

టీ. ప్ర...ము-ప్రళయార్క=విలయసూర్యునివలె, ఉగ్ర=తీక్ష్ణమగు, కుతార= గంద్రగొడ్డలి యనియెడు, కోణము = వీణవాయించెడుకడ్డిని, 'కోణా వీణాదివాదన' మ్మని యమరము. నృ...లఁ - నృప=రాజులయొక్క, త్రైవిధ్యవత్=శత్రుమిత్రోదాసీన భేదములచేత మూఁడువిధములుగల, పీఠికా=సింహాసనము లనియెడు, ఆఖ్యలఁ = పేళ్ల చేత, త్రిస్థానములు=మంద్రమధ్యతారకములనియెడు మూఁడుస్థానములను, ఏడుమార్గు= సప్తవారములు,వరుసఁ = షడ్జాదిసప్తస్వరక్రమముగా, ఘట్టించు = కొట్టెడు, వాయించెడు, దోశ్శక్తిఁ = భుజశక్తిచేత, కీర్తిలసద్వల్లకి - కీర్తి = యశ మనియెడు, లసత్= ఒప్పుచున్న, వల్లకి=వీణ. మ్రోయఁ=ధ్వనిసేయఁగా, రక్తయై=అనురక్తిగలిగినదైయని యును, రాజరక్తముచేతఁ దడఁపఁబడి యెఱ్ఱనిదై అనియును, ఎంతేఁ=మిక్కిలి, వశ్యయౌ =స్వాధీనపడిన, భూసతీతిలకంబుఁ = భూదేవి యనెడు పతివ్రతారత్నమును, తుదఁ ద్రోవఁ=కడకుఁద్రోయఁగా, కశ్యపునకుఁ = కశ్యపుఁడనుబుషికి, ఆర్తిఁ =ఆయాసముచేత, బిడ్డయై=పుత్త్రికయై, పోవదే=పోవదా, పోయె ననుట. (త్రైవిధ్యవత్తనుతావునఁ బూర్వవ్యాఖ్యానముల ననుసరించి శత్రుమిత్రోదాసీనభేదముచేత నని వ్రాసితిమిగాని శత్రు, శత్రుమిత్ర, మిత్త్రశత్రుభేదముచేత మూఁడువిధములు చెప్పుట యుక్త మని తోఁచుచున్నది.)

తా. పరశురాముఁడు కుఠార మనెడు కడ్డిచేతఁ ద్రివిధ నృపసింహాసనము లని యెడు మంద్రాదిస్థానముల నేడు మాఱులు ఘట్టింపఁగా మూఁడే ళ్లిరువదియొక్క మాఱయ్యె; నట్లు దోర్బలముచేత వాయించెఁ గావునఁ గీర్తి యనెడువీణయొక్క మ్రోఁత విని, యనురక్తురాలగు భూమినిఁ దా నేలక కశ్యపునకు ధారవోసిన, నావె పతివ్రత గనుక నతనిఁ బొందక యతనికి బిడ్డయై కాశ్యపి యని పిలువఁబడెను.

మ. తనసౌందర్యము చెప్పఁగాఁ గరఁగి పద్మాకాంత రప్పించి మో
హన కంజంబున వైచి తియ్యమిడు నెయ్యంబొప్పఁ బైకొన్న మీ
ఱి నృశంసత్వమునం దొలంగి చని వెట్టిం జేసెఁ గాకుత్స్థుఁ డై
న నిలింపారివిదారిచందములు డెందానన్విచారింపుఁడా. 48

టీ. త...ము - తన = ఆహారియొక్క, సౌందర్యముఁ = చక్కఁదనమును, చెప్పఁగాఁ = జనులు చెప్పఁగా, కరఁగి = ప్రియపడి, పద్మాకాంత=శ్రీదేవి, రప్పించి= రావించి, మోహనకంజంబునన్ = మోహమునుగలుగఁజేసెడు పద్మముచేత, వైచి= విసరివేసి, తియ్యమిడు = మాధుర్యమొసఁగెడు, నెయ్యంబొప్పన్ = ప్రేమమించఁగా, పైకొన్నన్ =కౌఁగిలింపరాఁగా, మీఱి = ఆయమ నతిక్రమించి, నృశంసత్వమునన్ = క్రౌర్యముచేత, తొలంగి = విసర్జించి, చని = పోయి, వెట్టింజేసెన్ = ఉన్మత్తురాలినిఁ జేసెను, కాకుత్స్థుఁడైన=ఆకాకుత్స్థవంశజాతుఁ డైన, నిలింపారివిదారి = రాక్షసాంతకునియొక్క, చందములు=చర్యలు, డెందానన్ = మనస్సునందు, విచారింపుఁడా= ఆలోచింపుఁడు.

తా. శ్రీరాముల సౌందర్యమును విని శ్రీదేవి పిలిపించి విలాసముగాఁ దన చేతికమలముచేత వైచి యతిప్రేమచేఁ గౌఁగిలింప రాఁగా, నది తప్పుఁజేసి యొప్పక కఠినచిత్తుఁడై తొలఁగి యా యమను వెట్టినిగాఁ జేసిన యా రామునిచందము మీరే మదిలో విచారింపుఁడు.

చ. చెలువముఁ దాల్చి త న్నవయఁ జేరిన రాగిణి రావణస్వసన్
నలువురు నవ్వ న త్తెఱఁగొనర్పక యేలిన వియ్యమై యతం
డలుగఁడు సీత కిట్టి తలఁపాత్మఁ దలంపక యాయమ న్వృథా
కలహమునం దనుం దొఱఁగు కాఁకకు నాఁకకు లోను సేయఁడే.

టీ. చెలువము=సౌందర్యమును, తాల్చి=తాను వహించి, తన్ = తన్ను, నవయన్=కూడుటకు, చేరిన=సమీపించిన, రాగిణిన్=అనురాగముగల, రావణస్వసన్ = రావణుని తోఁబుట్టువగు శూర్పణఖను, నలువురు = చూచిననలుగురు, అనఁగా సర్వజను లనుట, నవ్వన్=పరిహసింపఁగా, అత్తెఱఁగు=ఆరీతిని, (ముక్కు చెవులు గోయుట

ననుట.), ఒనర్పక = చేయక, ఏలినన్ = పాలించినను, వియ్యమై = సంబంధియై, (అనఁగా బావమఱఁది యై యనుట.), అతండు = ఆరావణుఁడు సీతకున్ = సీతాదేవికి, అలుగఁడు = కోపింపఁడా, ఇట్టితలఁపు = ఈ యాలోచనను, ఆత్మన్ = బుద్ధియందు, తలంపక=ఆలోచింపక, ఆయమన్ = ఆమెను, అనఁగా సీతాదేవిని, పృథాకలహము నన్=రిత్తకయ్యముచేత, తనున్ = తన్ను, తొలఁగు = ఎడఁబాసెడు, కాఁకకున్ = తాపమునకును, ఆఁకకున్=రావణునింటిచెఱలో నుండుటకును, లోను సేయఁడే=లోఁబడఁ జేయలేదా?

తా. ఆ శ్రీరాముఁడు దాను సుందరుఁడు గావునఁ దన్నుఁ జూచి మోహించి వచ్చిన శూర్పణఖను నలుగురు నవ్వున ట్లాభంగిఁ జేయక యేలికొనెనేని, దానికి సోదరుఁ డగు రావణుండు దనకు బావమఱఁదియై సీత నిమిత్తము కోపింపఁడుగదా? ఈ సంగతి యాలోచింపక వట్టి పోరు పెట్టుకొని, సీత, తన్నెడఁబాసి తాపముఁ జెందునట్లును, రావణుని నిర్బంధమునకు లోఁబడునట్లును చేసినాఁడుకదా!

శా. ఫీట్కారస్రవదస్రమై పెదవి గంపింప న్మొఱ ల్గిట్టి ప్రా
వృట్కాలాంబుదగర్జ గెల్వఁగ వలచ్ఛ్రీఖండశాఖాసిత
త్విట్కుంభీనసరేఖఁ గే లసిలతాభృద్బాహు వేష్టింప ముం
రాట్కంఠీరవమై యొనర్చె వడి సోణాలంట ఘోణాచ్ఛిదన్. 50

టీ. ఫీ...మై-ఫీట్కార = ఫీట్టనుధ్వనితోడ, స్రవదస్రమై - స్రవత్=కాఱుచున్న, అస్రమై=నెత్తురుగలదై, పెదవి = ఓష్ఠము, కంపింపన్ = వడఁకుచుండఁగా, మొఱల్=ఆర్తనాదములు, కిట్టి = సమీపించి, ప్రావృట్కాలాంబుద = వర్షాకాల మేఘముయొక్క, గర్జన్=ఉఱుమును, గెల్వఁగన్ = జయింపఁగా, వ...న్-వలత్=చుట్టుకొనుచున్న, శ్రీఖండ=చందనవృక్షముయొక్క, శాఖా = కొమ్మయందలి, అసిత=నల్లనగు, త్విట్ = కాంతిగల, కుంభీనస = త్రాఁచుపాముయొక్క, రేఖన్ = పోలికచేత, కేలు = శూర్పణఖాహస్తము, అసిలతా = లతవంటిఖడ్గమును, భృత్ = ధరించుచున్న, బాహున్ = భుజమును, (తే. 'నేలనాలుగు చెఱఁగుల నృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ, యగ్గలించి నాయెదుట బాహప్పళించి, కడఁగఁజాలెడు మల్లులం గాన నెందు.' అన్న పద్యమందుఁ దృతీయపాదమున వువర్ణకము లేనియట్లు సోమయాజి విరాటపర్వంబునం బ్రయోగించెఁ గావున నిచ్చటను వువర్ణకము లేకయే చెల్లుబడియయ్యె.) వేష్టింపన్=చుట్టుకోఁగా, మున్ = పూర్వమందు, రాట్కంఠీరవమై = రాజసింహమై, ఘోణాచ్ఛిదన్ = నాసికాచ్ఛేదమును, సోణాలంటన్ = సౌసామూలమునసుండు నెముక లంటునట్లు వడిన్ = వేగముచేత, ఒనర్చెన్ = చేసెను.

తా. మున్ను దాను రాజసింహమై స్త్రీబాధఁ జేయకుండెదు నియమము గల్గియు, శూర్పణఖయొక్క నాసికను శల్యము దగులునట్లు ఛేదింపఁగా నాముక్కు దెగునప్పుడు ఫీట్టనుధ్వనితోఁగూడ రక్తము గాఱుచుండఁగా దాని పెదవిఁ వడవడ వడఁకుచుండఁగా మొఱ్ఱో యను నార్తనాద ముఱిమి నట్లుండఁగా దానిచేయి దనచేతినిఁ జుట్టుకొనఁగా నతి వేగముగా దాని ముక్కు సెవులు గోసెనుకదా! (లక్ష్మణుఁడు గోసిన నయ్యాజ్ఞ తనదిగావునఁ దానే యని తాత్పర్యము.)

తే. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె! తా నుల్లసముల
నేఁప నది రక్కసియ యాట * నెగ్గె? వలచి
స్త్రీలు దలవంపఁ దానవచ్చెనది చాల
కాఁడుదాని † బజీతు సేయంగ నగునె? 51

టీ. ఒల్లక్ = నేనిష్టపడను, పొమ్మన్నన్ = పొమ్మనిచెప్పఁగా, పోదే=ఆశూర్పణఖ పోదా, తాను=ఆరాముఁడు, ఉల్లసములన్ = పరిహాసములచేత, ఏఁపన్ = తపింపఁజేయఁగా, అది=ఆశూర్పణఖ, రక్కసియ యాటన్ = రాక్షసియేయాటచేతను ఎగ్గె=తప్పిదమా. (ఔట యెగ్గె యను పాఠమున రాక్షసియాటయె తప్పిదమా యనియర్థము.), వలచి= మోహపడి, స్త్రీలు=విన్నకన్నస్త్రీలు, తలవంపన్ = శిరమువంచుగొనునట్లు, తాన వచ్చెన్ = శూర్పణఖ తానే వచ్చెను, అదిచాలక=అట్లువచ్చుటయేచాలక, ('వనిత తనంతఁ దా వలచివచ్చినఁ జుల్కనగాదె ధారిణికిన్' అని మనుచరిత్రమున నున్నది,), ఆఁడుదానిన్ = స్త్రీని, బజీతుసేయంగన్ = రచ్చసేయఁగా, అగునే=తగునా.

తా. శ్రీరాముఁడు శూర్పణఖ మోహించి వచ్చినప్పుడు వలదు పొమ్మని తాను జెప్పెనేని యది పోదా? అట్లు సేయక దానిని పరిహాసములచేత నడియాసలు గల్పించి మిగుల వగలం బొగిలించినాఁడు. అది మోహము గలిగినది గావున నట్లువచ్చుట దానికిఁ దప్పుగాదు. లోకమందీవార్త స్త్రీలు విని, తలలు వంచునట్లు దనంతనతాను వచ్చుటచాలక మరల దాని నిట్లు రచ్చలఁబెట్టవచ్చునా?

మ. తను నంటన్ సతు లౌటఁ గోరు మునిబృందంబుం దదాపాదప
ద్వనజక్షోదము గల్గియు న్వ్రజజనిం దా వల్లవస్త్రీలఁగా
జననం బందఁగఁ జేసి కూడియును నాసక్తాత్మలం గాందినీ
తనయప్రేరణఁ బాసె భోజపుర యాత్రాదంభసంరంభియై. 52

టీ. తనున్ = తన్ను, అంటన్ = కవియుటకు, సతులౌటన్ = స్త్రీలగుటను, కోరు=అభిలషించెడు మునిబృందంబున్ = మునులసమూహమును, త...ము - తదా

* యెగ్గె. † బజారు.

పాది-తత్=ఆస్త్రీత్వమును, ఆపాది=కలుగఁజేయునట్టి, పదవనజ = పాదపద్మముయొక్క, క్షోదము = పరాగము, 'పదంఘ్రిశ్చరణో౽స్త్రియా'మ్మనియు, 'చూర్ణే క్షోదస్సముత్పింజ' యనియు నమరము. కల్గియుక్=తాను గలిగియుండియును, పెఱజనిక్ = మఱియొకజన్మమందు, తాక్ = తాను, వల్లవస్త్రీలఁగాక్ = గోపాంగనలఁగా, 'గోధుగాభీరపల్లవాః' యని యమరము. జననంబందఁగఁజేసి = పుట్టునట్లుచేసి, కూడియును = సంభోగించియు, ఆసక్త = తనయందుఁదగిలిన, ఆత్మలక్ = చిత్తములుగల యాస్త్రీలను, కాందినీతనయప్రేరణక్ = అక్రూరునిప్రేరణచేత, (అక్రూరుని తల్లిపేరు కాందిని.) భోజపురయాత్రారంభసంరంభియై-భోజపుర=మథురాపురమునకు, యాత్రా = ప్రయాణమనెడు, దంభ = నెపముచేతను, 'కపటో౽స్త్రీవ్యాజదంభోపధయ శ్ఛద్మకైతవే'యని యమరము. సంరంభియై=ప్రయత్నముగలవాఁడై, పానెక్ = విడిచెను.

తా. శ్రీరామావతారమందు 'రామస్సర్వాంగసుందరః' యనినట్లును, 'రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అనునట్లును, గలిగిన తన సౌందర్యమును జూచి మునిజనులుఁ దన్నుఁ గవియుటకై స్త్రీత్వము నపేక్షింపఁగా నప్పుడే వారలను స్త్రీలనుగాఁ జేయక - అనఁగా ఱాతిని నాతినిగాఁ జేసినవాఁ డనుట - అట్టి పాదపద్మపరాగము గలిగియుండియు నప్పు డట్లు చేయక, తానొక యవతార మెత్తి యా కృష్ణావతారమందు వారిని గోపికలుగాఁ బుట్టఁ జేసి యప్పుడు వారితోఁ గలసియు సంతత మట్లుండక తన్ను మరిగియున్న స్త్రీలను విడిచి యక్రూరప్రేరణవలన మథురాపట్టణమునకుఁ బోఁడా? అట్లు పోవుటవలన నాస్త్రీలకు వెత గలిగించినాఁడు కదా!

చ. వాతల నొనర్చె మోహితల నల్ల యయోముఖి నాపులస్త్యభూ
సుతను విరూప లౌట ననుచో ముసలి న్పెద నిట్టతాడువం
టతివ రమించెఁ దా ముసలియయ్యు రహిన్ మఱుగుజ్జుపేష్యకై
ధృతినెడి యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది యేలఁడే. 53

టీ. మోహితలక్ = వలచిన, అల్లయయోముఖిక్ = అప్రసిద్ధినొందిన యయోముఖి యను రాక్షసస్త్రీని, ఆపులస్త్యభూసుతను=పులస్త్యనందనుఁడగు విశ్రవసునికూఁతురగు శూర్పణఖను, విరూప లౌటక్ = రూపహీనలగుటచేత, వాతలనొనర్చెక్ = భంగపఱిచెను, అనుచోక్ = అనెడుపట్ల, (వారు సౌందర్యము లేనివారుగనుక భంగపఱచె నందమా యనిన ననుట.), ముసలిక్ = వృద్ధనదానిని, పెద = పెద్దదియగు, నిట్టతాడు వంటి=నిడుతాటిమ్రానివంటి, అతివక్ = రేవతీదేవిని, (ఇచ్చటఁ దదాదిగణపతిత సంధి వికల్పము), తాక్=తానును, ముసలియయ్యుక్ = ముదుసలివాఁడయ్యును, రమించెక్ = భోగించెను, (యుగాంతరమునుండి వృద్ధయినదియుఁ బెద్ద పొడవుగలదియుఁ నైన

రేవతీదేవిని దాను ముసల మను నాయుధము గలబలరాముఁ డయ్యును మోహించి రమింపఁడా? స్వరూపముచేత నానురూప్యమును గలుగఁ జేసికొని రమింప లేదా! అని భావము.) 'తాలాంకో ముసలీహలీ' యని యమరము. మఱుగుజ్జు ప్రేష్యకై=కుబ్జ యగుపరిచారికకై, ధృతిసెడి=ధైర్యములేక, ఉగ్రసేనునకున్ = ఉగ్రమైనసేనగలవానికి, (ఉగ్రసేనుఁడను పేరుగల కంసజనకుని కనుట.), ప్రేష్యతన్ = పరిచారకత్వమును, ఒంది యున్ = తానుబొందియును. (దాని కనురూపుఁడై యనుట.), దిద్ది = దానికుబ్జతనుదీర్చి, ఏలఁడే=పరిపాలింపఁడా.

తా. ఓచెలులారా! అయోముఖియు శూర్పణఖయు మోహించిరేనియు వారు లావణ్యవతులు గారు. కావున వారినిఁ దా నేలుకొన లే దని మీ రంటిరేని, బలరాముఁడు దాను ముసలియయ్యును నిడుపాటి తాటిచెట్టువంటి ముసలిది యగు రేవతిని రమింప లేదా? కృష్ణుఁ డుగ్రసేనునికిఁ బరిచారకుఁడయ్యును మఱుగుజ్జగు త్రివక్రను జక్కఁగా దిద్ది యామెను రమింపఁడా? (అతనికిఁ బక్షపాతమే కాక లావణ్యతారుణ్యాది గుణములతో నక్కఱలే దని భావము.)

తే. తనకు నందఱుఁ గూర్పఁ బృందావనమున
నొకతె రతిఁ దేల్చి కాఁక నొండొకతెఁ బ్రేల్చి
యంత రాధకు మేలువాఁడైన మురారి
యెల్ల సతులకు నెద నుడుకే యిడండె. 54

టీ. తనకున్=ఆ కృష్ణునకు, అందఱున్ = వల్లవపల్లవాధరలెల్లను, కూర్పన్ = మోహపడియుండఁగా, బృందావనమునన్ = బృందావనమందు, ఒకతెన్ = ఒక్క గోపికను, రతిఁ దేల్చి=సురతసుఖ మనుభవింపఁజేసి, ఒండొకతన్ = మఱియొకగొల్లతను, కాఁకన్ = విరహతాపముచేత, ప్రేల్చి = తపింపఁజేసి, అంతన్ = అనంతరమందు, రాధకు=రాధ యనుప్రసిద్ధగోపికకు, మేలువాఁడై = అనుకూలుఁడై, మురారి = ఆశ్రీ కృష్ణుఁడు, (ఇది కర్తృపదము.), ఎల్లసతులకున్ = సర్వస్త్రీలకు, (రతిఁదేలినట్టియు రతిఁ దేలనట్టివారి కందఱ కనుట), ఎదన్ = హృదయమందు, (జాత్యేకవచనము.), ఉడుకే=తాపమునే, ఇడండె=ఉనుపఁడా.

వ. అని యిట్లు త్రపాభరంబున నుపాలంభదంభంబుగాఁ జేయు పునఃపునస్స్మరణంబున నంతఃకరణరాగంబు దేటపడం దెలిసి బోటులిబ్బోటి కైటభారియెడ నాటుకొన్న కన్నెకూర్మి లజ్జావశంవద యై వెలివిరియంగానీక పుటపాకనికాశం బగు కాఁకఁ జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్ల కిటకిట నగుచున్న దింత నియ్యింతి

యెరవు మాన్చి యింగితం బెఱుక పఱచుకొని చింతాపనోదంబు
సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు నర్మగర్భంబుగా నిట్లనిరి. 55

టీ. అనియిట్లు=ఈపూర్వోక్తప్రకారంబుగా, త్రపాభరంబునన్ = సిగ్గువేఁగు చేత, ఉపాలంభదంభంబుగాన్ = నిందావ్యాజముగా, చేయు = చేయుచున్న, పునఃపునస్స్మరణంబునన్ = సారెసారె కగుస్మరణముచేత, అంతఃకరణ = మనస్సునందలి, రాగంబు = కృష్ణునివిషయమున ననురాగము, తేటపడన్ = బయల్పడఁగా, తెలిసి = ఎఱిఁగి, బోటులు=చెలులు, ఇజ్జోటి = ఈయువతి, కైటభారియెడన్ = కృష్ణునియందు, నాఁటుకొన్న=పాదుకొనినట్టి, కన్నెతనాన్ = వివాహమునకుముందు గలిగినయనురాగమును, లజ్జావశంవదయై = లజ్జాపరవశురాలై, వెలివిరియంగానీక = బయల్పడనీయక, పుటపాకనికాశంబగు = పుటమువేసినపాకముతో సరియగు, కాఁకన్ = అంతస్తాపముచేత, చీకాకుపడి=చికాకుపడి, నాఁడునాఁటికిన్ = నానాఁటికి, నగుచున్నట్ల = నవ్వుచున్నట్లే, కిటకిటనగుచున్నది = సంకటపడుచున్నది, ఇంతన్ = ఇంతట, ఇయ్యంతి=ఈయువతియొక్క, ఎరవు మాన్చి = ఆయాసము నడంచి, ఇంగితంబు = అభిప్రాయమును, 'ఇంగితం హృద్గతో భావ' అని యమరశేషము. ఎఱుకపఱచుకొని = ఎఱిఁగింపఁజేసికొని, చింతాపనోదంబు - చింతా = విచారముయొక్క, అపనోదంబు = పరిహారమును, చేయకున్నన్ = చేయక యుంటిమేని, ప్రమాదం బని = మోసమగు నని తలంచి, నవ్వుచున్=హసించుచు, నర్మగర్భంబుగాన్=విలాసగర్భమగునట్లు, ఇట్లనిరి = ఈవక్ష్యమాణక్రమముగా ననిరి.

ఉ. ఎవ్వరు నట్లపో నెరసు లెన్నకమానరు ప్రాణభర్తలన్
దవ్వుల నున్న కాఁకకతనన్మఱి వారలు వశ్యులైనఁ దా
రెవ్వరి నొల్ల రొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటండ్రు బోటి దా
నివ్వలఁ దేరకత్తె యగు నిట్టివి నీతలవే గనే చెలీ. 56

టీ. ప్రాణభర్తలన్ = ప్రాణేశ్వరులను, దవ్వుల నున్న=దూరముననున్నట్టి, కాఁకకతనన్ = తాపహేతువుచేత, నెరసులు = తప్పులను, ఎన్నక మానరు = లెక్కింపకపోవరు. ఎవ్వరున్=ఎల్లవారును, అట్లపో = ఆప్రకారమే, మఱి = పిమ్మట, వారలు = ఆప్రాణభర్తలు, వశ్యులైనన్ = స్వాధీనపడిరేని, తారు=స్త్రీలు, ఎవ్వరి నొల్లక = ఎవ్వరినైన నిచ్చగింపక, ఒక్కటయి = సతీపతులేకమై, ఇంద్రుఁడు చంద్రుఁడటండ్రు=ఆభర్త నింద్రుఁడు చంద్రుఁ డనియందురు, ఇవ్వలన్ = ఈవలను, బోటి=చెలికత్తె, తాన్ = తాను, తేరకత్తెయగున్ = అన్యురాలవును, ఇట్టివి=ఇట్టివార్తలు, నీతల వేగనే = నీతల మీఁదనే యుదయించెనా, సర్వత్ర కల వనుట. చెలీ యని సంబోధనము.

తా. దూరమందుఁ బ్రియుఁ డున్నప్పుడు లోకమందలి స్త్రీ లందఱును భర్తల తప్పు లెన్నక పోరు. వారు సమీపించి వశపడినప్పుడు వారి నింద్రుఁడు చంద్రుఁ డని భాషించుచు నేకమై యుందురు. పూర్వము ప్రియుని బిలుచుట మొదలగు పనుల యందు నక్కఱ గలిగి యున్న చెలికత్తె యప్పుడు తేరకత్తెయగు నిట్టి పనులు నీకే కలిగినవా? అంతటఁ గలిగి యున్నవియే.

క. అనుటయు నెలనగ వడఁచుచుఁ
గన లించుక తెచ్చి యొడుగఱచుచు నయ్యం
గనలఁ గందుకనికరముఁ
గొని వ్రేయుచుఁ గెలను చూచుకొనుచుం బలికెన్. 57

టీ. అనుటయున్ = ఇట్లనిన, ఎలనగవు = లేఁతనవ్వు, అడఁచుచున్ = బయలు మెఱయనీకమాటుపఱచుచు, కనలు = కోపము, ఇంచుక=కొంచెము, తెచ్చి = బయలు పఱచి, ఓడుగఱచుచున్=ఓష్ఠముదంతపఙ్క్తిచే గఱచుకొనుచు, అయ్యంగనలన్ = ఆ స్త్రీలను, కందుకనికరమున్ = చెండులపిండును, కొని = గ్రహించి, వ్రేయుచున్=కొట్టుచును, కెలను = పార్శ్వమును, చూచుకొనుచున్ = ఈక్షించికొనుచు, పలికెన్ = (ఆయింతి) పలికెను.

క. విడువక మీగానము సొగ
సిడుటయు మఱి పాడుఁడనుట యెగ్గే? పాసెం
బడిగినవారే పేదలె?
కొడిమెలు గట్టకుఁడి యతనిఁగొని పని యేలా? 58

టీ. విడువక=ఎడతెగక, మీగానము = మీయొక్క పాట, సొగసిడుటయున్ = ఇంపొసంగినందున, మఱి = ఇంకను, పాడుఁ డనుట=గానముసేయుఁడని చెప్పుట, ఎగ్గే= తప్పా, పాసెంబు = పాయసము, అడిగినవారే = వేఁడినవారే, పేదలె = దరిద్రులా, (పాయసము మధురమైయుండిన దాని నడిగినవారు దరిద్రులా? ఆమాధుర్యము గ్రోల నిచ్ఛగించినవారే యనుట.), కొడిమెలు = లేనినిందలు, కట్టకుఁడీ = పెట్టకుఁడు, అతనిఁ గొని = ఆకృష్ణుని గ్రహించి, పని యేలా=ఏమియక్కఱ గలదు.

శా. పోనిండన్న వయస్య లిట్లని రగుం బో నీక్కు మిం కిప్పుడే
గాని మ్మిం కొక కొంతసేపునకునే గానీ సఖీ యెల్లియే
గానీ నీనుడిఁ దన్మనోజ్ఞగుణము ల్గానీ తదన్యాయము
ల్గానీ డిందనఁ జింత నీ కతనిపైఁ గా కెవ్వరిం దేల్చెదే! 59

టీ. పోనిండన్నన్ = ఆయమ పోనిండనిచెప్పఁగా, వయస్యలు = చెలులు, ఇట్లనిరి = ఈవక్ష్యమాణక్రమముగా ననిరి, అగుంబో = ఔనుపో, నిక్కము నిశ్చయమే, ఇం కిప్పుడే గానిమ్ము = ఇంకమీఁద నిప్పుడేగాని, ఇఁకొకకొంతసేపునకునేగానీ = ఇంకొకకొంతకాలమునకేకాని, (ఇచ్చట నవధారణార్థకమగునేకారము షష్ఠీవిభక్త్యంతిమద్రుతముమీఁదవచ్చినది), సఖీ=ఓచెలీ, ఎల్లియేగాని = ఱేపేకాని, నీనుడిన్ = నీవాక్యమందు, తన్మనోజ్ఞగుణముల్ గానీ = ఆస్వామియొక్క మనోహరములగు గుణములుగానీ, తదన్యాయముల్గానీ - తత్ = ఆస్వామియొక్క, అన్యాయముల్గానీ = నేరములయినఁగానీ, డిందినన్ = జాఱిన, (నీనోర వచ్చెనేని యనుట,) చింత=విచారము, నీకు, అతనిపైఁగాక=ఆస్వామిమీఁదనేకాని, ఎవ్వరిం దేల్చెదే = మఱియెవ్వరిని బ్రస్తావింతువు?

తా. ఎక్కడి ప్రసంగము లని పోనిం డని యాయమ చెప్పఁగాఁ, జెలు లగును, నీమాట నిక్కమేకాని, యింకమీఁద నిప్పుడే కాని, మఱికొంతసేపునకేకాని, ఱేపే కాని, నీనోట నా శ్రీకృష్ణుని మంచిగుణములేకాని, చెడుగుణములేకాని, వచ్చెనా, యప్పుడు నీమది యతనియందుఁ దగిలియుండును గాక; మఱి యెవ్వరిని నీవు దలంపవు గదా!

సీ. నఖముఖోజ్ఝితపరాఙ్ముఖముక్తబాష్పాంబు
పటిమ దీపపుఁజిటిచిటలు దెలుపఁ
పొరినుపాంశూత్సృష్టఘూత్కృతు లక్రోశమధ్య
పార్శ్వముహుఃప్రకంపములు దెలుప
నొదవెడుగాద్గద్య మదటిపాటునఁ బల్క
రింపఁ బుట్టెడు కేకరింత దెలుప
వలవంత విసువు కాంతల పుట్టు దూషించు
కారణంబుల తొంటికథలు దెలుప
తే. నలఁతఁ బొనుపుపైఁ బొరలాట దెలుపఁ
దెగువ లోలోననే నవ్వు నగవు దెలుపఁ
గలఁక మామీఁదిపసి లేని కసరు దెలుపఁ
బోలఁతి రేలు నీయున్కియే పులుగుగాదె. 60

టీ. మఱియు సఖీవాక్యము, న...ఖు - నఖముఖ=కొనగోళ్లచేత, ఉజ్ఝిత = విదలింపఁబడినట్టియు, పరాఙ్ముఖ=ఆవలిమొగమై, ముక్త=విడువఁబడిన, బాష్పాంబు = కన్నీళ్లయొక్క, పటిమ = పటుత్వమును, దీపపుఁజిటచిటలు = దీపమువలనఁబుట్టిన చిటచిటధ్వనులు, తెలుపన్ = ఎఱిఁగింపఁగా, (ఆయమ యావలి మొగమై కన్నీరు విడుచుచు

నా బాష్పాంబువులు గోనగోళ్ల విదిలింపఁగా నవి దీపముమీఁద బడి చిటచిట యనుచుండఁగా జలసంబంధము లేక దీపమందుఁ జిటచిటధ్వని పుట్టదు గనుక నిదియ జ్ఞాపకమయ్యె ననుట), పొరిఁ=మిక్కిలియు, ర...ల్-ఉపాంశు=ఏకాంతమున(రహస్యముగా), ఉత్సృష్ట=విడువఁబడిన, ఫూత్కృతుల్=ఫూత్కారములను, కృ...లు-కృశ=కృశించిన, మధ్య = నడుముయొక్క, పార్శ్వ=ప్రక్కలయందలి, ముహుః ప్రకంపములు = సారె సారెకుఁగదలుటలు, తెలుపన్=తెలియఁజేయఁగా,(ఎవ్వరికినిఁ దెలియకుండ రహస్యముగా నాయాసముచేత బుసలు విడువఁగాఁ బ్రక్కలు గదలు ననుట), ఒ...ము - ఒదవెడు= జనించెడు, గాద్గద్యము = డగ్గుత్తిక పడుట, అదటిపాటునన్ = హఠాత్కారముగా, పల్కరింపన్ = మేము పల్కరింపఁగా, పుట్టెడు = ఉదయించెడు, కేకరింత = కుత్తుక సరుదుకొనుట, తెలుపన్ = తెలుపఁగా, (చెలికత్తెలు హఠాత్తుగాఁ బిలిచినఁ బలుకఁబోఁగా నాయమకుఁ గలిగెడు డగ్గుత్తిక యాచెలులకుఁ దెలియకుండఁ గేకరించెడు నెపముచేత మఱుఁగు పఱుచు ననుట), వ...వు - వలవంత = విరహతాపమువలననైన, విసువు=వేసటను, కాంతలపుట్టు = స్త్రీలజన్మమును, దూషించు = దూషించెడు, కారణంబుల = హేతువులుగల, తొంటి కథలు = పూర్వకథలు, తెలుపన్ = తెలియఁజేయఁగా, (స్త్రీలై పుట్టఁగూడ దని యనేకపూర్వకథాదృష్టాంతములు చెప్పు ననుట.), అలంతన్=ఆయాసమును, పానుపుపైన్ = శయ్యమీఁద, పొరలాట = పొరలాడుట, తెలుపన్ = తెలుపఁగా, (విరహాతిశయముచేతఁ బడక కుదురక పొరలు ననుట.), తెగువ= ప్రాణత్యాగమునకుసాహసమును, లోలోన నే నవ్వు = లోలోపలనే యపహసించెడు, నగవు=హాసము, (నడచునడకలు, పలుకుపలుకులు అను వ్యవహారము ననుసరించి నవ్వు నగవన్నప్రయోగము), తెలుపన్=తెలియఁజేయఁగా,('మరణేసతి కిం భయ'మ్మనిన రీతిగాఁ దెంపుఁజేసి లోలోపలనే ప్రచ్ఛన్నముగా నవ్వు ననుట), కలఁక=కలంగుటను, మామీఁది= మాపైఁగలిగిన, పనిలేని = కారణముమాలిన, కసరు = గద్దించుట, తెలుపన్=తెలియఁగా, (మనస్సు తాపాతిశయముచేతఁ గలుషించి యుండుటవలనఁ జెలులను గారణములేక కసరిపైచు ననుట), శౌలఁతి=ఓఘంతీ, రేలు = రాత్రులయందు, నీయుస్కియే= నీవర్తనమే, పులుగుగా దెఱుగుత్తుగాదా.

తా. సుగమము.

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము ? నీచెలి దీర్ఘికఁ దీర్థమాడ నా
యుఱుతఁ దగిల్చి పోవుఁ దనహారము వోయిన నేను బోవుదున్
మఱువక వెంటఁ బోవ జలోమగ్నత నొ నది సున్నమైనఁ దాఁ
గఱకటి పెట్టి సొమ్మడుగుఁగాని నిజార్తి యెఱుంగ దేమియున్. 61

టీ. ఒకసఖి తక్కినసఖులతో ననుమాట,—ఒకదద్భుతముఙ్ = ఒకయబ్బురమును, ఎఱుఁగరుగా= తెలియరుగా, ఈచెలి=ఈసఖి అనఁగా గోదాదేవియనుట, దీర్ఘికఙ్=డిగ్గియయందు, తీర్థమాడఙ్ = స్నానముసేయుటకు, తనహారము=తనముత్తియపుఁదేరు, నాయఱుతఙ్ = నాకంఠమందు, తగిల్చి=ఉనిచి, పోవుఙ్ = చనును, పోయినఙ్ = తానటుపోయిన, నేనుఁబోవుదుఙ్ = నేనునుబోదును, మఱువక=విస్మృతిలేక, వెంటఁబోవఙ్= వెంబడిఁబోఁగా, జలమగ్నతఙ్ = నీటియందుమునుఁగుటచేత, అది=ఆహారము, సున్నము= చూర్ణము, ఔన్=అవును, ఐనఙ్=అట్లు సున్నముకాఁగా, తాఙ్=తాను, అనగా నీయమ, కఱకఱిపెట్టి=బాధించి, సొమ్ము=తన హారమును, అడుగుఁగాని=వేఁడునుగాని, ఏమియుఙ్= కొంచెమైనను, నిజార్తి = తన ప్రయాసమును, ఎఱుంగదు=తెలియనేరదు, ముగ్ధ యగుటనని భావము.

తా. ఈ యమ విరహతాపముచేతఁ గ్రాఁగుడువలన శరీరమందలి ముక్తాహారములు పెటిలి యుండిన నవియే నాయమతోడ నీటమునిఁగి నప్పుడు విరిసి సున్నమాయె ననియు, నంతతాప మీయమ యనుభవించుచున్న దనియుఁ నొకచెలి కడమచెలులతోఁ జెప్పెను.

చ. అనిన మరాళి పల్కు విన వా హరిణీ యొకనాఁడు కస్తురిం
  గొని యిడు బొట్టునా కనుచుఁ గూర్మి నొసంగినఁ బెట్టుచుండఁ జు
  ట్టనుచు మొగంబు వ్రేసినటు లౌ తనయూర్పుల నింకి యింకి పో
  యిన పలుబేంట్లు గోరఁ గొని యెత్తనె పట్టెను మాటిమాటికిన్.

టీ. అనినఙ్ = ఇట్లనఁగా, మరాళి = మరాళి యనియెడిచెలి, పల్కుఙ్ = పలుకును, హరిణీ, వినవా = విను మనుట, ఒకనాఁడు = ఒకదినమందు, కస్తురింగొని = కస్తూరినిదీసికొని, ఇడు బొట్టు నా కనుచుఙ్ = నాకుఁ దిలకముఁబెట్టుమని, కూర్మిఙ్ = ప్రేమచేత, ఒసంగినఙ్ = కస్తూరినీయఁగా, పెట్టుచుండఙ్ = తానుబొట్టుపెట్టుచుండఁగా, చుట్టనుచుఙ్ = చుట్టుమని, మొగంబువ్రేసినటులౌ = మొగమడఁచినట్లగునట్టి, తనయూర్పులఙ్ = తనయుచ్ఛ్వాసవాయువులచేత, ఇంకి యింకిపోయిన=మిక్కిలి తడియాఱిన, పలుబేంట్లు = కస్తూరియొక్క పెక్కుబీఁటికలు, మాటిమాటికిఙ్ = సారెసారెకు, గోరఁగొని = గోటిచే గ్రహించి, ఎత్తనె = ఎత్తివేయుటకే, పట్టెను = ప్రొద్దుసరిపోయెను.

తా. మరాళి హరిణితోఁ జెప్పెడు పల్కు:—వినవే చెలీ! యీ యమ నొకనాడు నాకుఁ గస్తూరి తిలకముఁ బెట్టు మనఁగా నా మొగ మడఁచినట్లు దన వేఁడి నిట్టూర్పు లెగయఁగా వానివేఁడిమిచేత నానుదుటి తిలకము పెట్టునప్పుడే రొరడిపోవు

చుండఁగా నాబీఁటికలు దన గోటితోడ మాటిమాటి కెత్తనే కాలము సరిపోయెను గాని బొట్టుపెట్టుటకుఁ గాలము చాలక పోయెను. చూచితివా యాయమ తాపాతిశయము!

మ. అనినన్ స్రగ్విణి వల్కెఁ దన్నుఁ జెలులారా నే లతాడోలఁ జి
క్కన నూఁపం దెగి వ్రాల దీని చనువ్రేఁకం బే క్రియం దాల్తునో
యని పట్టం దినమధ్యమార్కరుచిఖిద్యన్మంజరుల్బోని వా
డినపాలిండ్లను బెండుబొమ్మగతి నుండెన్ సందిటం జుల్కనై. 63

టీ. అనినన్=అనఁగా, స్రగ్విణి = స్రగ్విణి యనుచెలి, వల్కెన్ = వక్ష్యమాణ రీతిచేతఁబలికెను, చెలులారా = సఖులారా, తన్నున్ = ఈయమను, నేన్ = నేను, లతాడోలన్ = తీఁగెయుయ్యెలయందు, చిక్కనన్ = దృఢముగా, ఊఁపఁగాన్ = ఊఁగింపఁగా, తెగి = అలత ఈయమశరీరతాపముచేతఁదెగి, వ్రాలన్ = ఈమె దిగువఁ బడఁగా, దీని=ఈయమయొక్క, చనువ్రేఁకంబు = స్తనభారము, ఏ క్రియన్ = ఏరీతిగా, తాల్తునో=ధరింతునో, అని=అనుకొని సంశయించుచు, పట్టన్=ఈయమను బట్టుకొనఁగా, ది...ను-దినమధ్యమ=పట్టపగటి, అర్క=సూర్యునియొక్క, రుచి = ఎండచేత, ఖిద్యత్= వాడుచున్న, మంజరుల్బోని = పూలగుత్తులవలె నున్న, వాడిన = మ్లానములగు, పాలిండ్లను = పయోధరములచేత, బెండుబొమ్మగతిన్=బెండుతోఁ జేసినబొమ్మవలె, సందిటన్= నాకౌఁగిటియందు, చుల్కనై=లఘువై, ఉండెన్ = నిలిచెను.

తా. ఆమె వియోగతాపముచేతఁ గృశించ శరీరము తేలిక యయ్యె ననిభావము.

వ. అని తనయవస్థ దోఁపనాఁడిన ననాదరయుంబోలె వారల కిట్లనియె.

టీ. తనయవస్థన్=తనవిరహదశను, తోఁపకాడినన్=బయల్పడఁ బలుకఁగా, అనాదరయుంబోలెన్ = ఆదరములేనిదానివలె, వారల కిట్లనియె.

క. ఆర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి
నేర్పుగలవయస్యలట్లు నెలఁతలు మీ మీ
నేర్పునఁ బలికెద రక్కఱ
యేర్పడ మీ కీ విచారమేటికిఁ జెప్పుఁడీ. 65

టీ. ఆర్పఁగన్ = పోఁబుచ్చుటకును, తీర్పఁగన్ = దిద్దుటకును, మిక్కిలి = అధికముగా, నేర్పుగలవయస్యలట్లు = పోఁడిమి గలచెలులవలెనే, నెలఁతలు = స్త్రీలారా, మీమీనేర్పునన్ = మీమీసామర్థ్యముచేత, పలికెదరు = చెప్పెదరు, అక్కఱ = అవశ్యకము, ఏర్పడన్ = కుదురునట్లు, మీ కీవిచార మేటికిన్=మీకీచింతయేల, చెప్పుఁడీ=చెప్పుఁడు.

తా. ఆర్పఁ దీర్ప నేర్పుగల చెలులవలె నక్కఱ గలిగినట్లు మీమీచాతుర్యముల కొలఁది బలికెదరుగాక మీకీ యాలోచన మేల? చెప్పుఁడు.

వ. అని మేలంబు సేసికొని తేలిపోఁ బలికి పుటపాకప్రకారంబగు వియోగ దవథుభరం బవ్వధూరత్నం బడంచికొని యుండియు నుండలేక నిశా సమయంబుల నొక్కొక్కమాటు తనలోన. 66

టీ. అని = ఇట్లని, మేలంబుసేసికొని=పరిహాసముచేసికొని, తేలిపోఁబలికి=అలక్ష్యముగా మాటలాడి, పుటపాకప్రకారంబగు = పుటము వేసినలోపలఁగు ములుచున్నట్లగు, వియోగదవథుభరంబు = విరహతాపాతిశయమును, అవ్వధూరత్నంబు = ఆబోటిమేటికి, అడంచికొనియుండియున్ = మఱుఁగుపఱుచుకొని యుండియు, ఉండలేక=నిలువఁజాలక, నిశాసమయంబులన్=రాత్రులయందు ఒకొక్కకమాటు=ఒకొక్కక్క తూరి, తనలోనన్ = తనంతటనే, ఈవక్ష్యమాణప్రకార మనుకొనుచుండు నని మీఁది కన్వయము.

సీ. అభినవకువలయశ్యామకోమలమైన
డామూఁపు మకరకుండలముఁ దాల్ప
ని స్తులాస్యశ్రీ వయ స్తంభనిక్షిప్త
నింబచ్ఛదభ్రువల్లంబు నిక్కఁ
బరువంపు మంకెనవిరి వంపు నరవంపు
వాతెఱ చెంద్రఁపువానఁ గురియ
నందంపు మెఱుఁగువాలారు కన్గవ చూడ్కి
శ్రవణ కుండల కాంతిసవతుగాఁగ

తే. సప్తభువనాంగనానురంజనకు సప్త
విధ పరీవాహముగ గానసుధ వెలార్చు
మాడ్కి వేణువుపై వ్రేళ్లమార్చిమార్చి
మరులుకొలిపితె గోవింద మందసతుల. 67

టీ. అ...ము - అభినవ = అప్పుడు వికసించిన, కువలయ = నల్లగలువవలెనే, శ్యామ = చామనచాయకలిగినదై, కోమలము = మృదువు, ఐన, డామూఁపు = ఎడమ భుజశిఖరము, మకరకుండలమున్ = వామకర్ణ మకరకుండలమును, తాల్పన్ = వహింపఁగా, (వేణుగానము సేయు నప్పుడు మెడ యొఱగ నిడఁగా నెడమ భుజము మీఁదికిఁ గుండలము వచ్చె ననుట.), నిస్తుల = సరిలేని, ఆస్యశ్రీ = ముఖకాంతియొక్క, వయసి= వలయున్నను, స్తంభ = నిల్పుటకొఱకు, నిక్షిప్త = దృష్టిదోషములేకుండ నుపుపఁబడిన నింబచ్ఛద = వేపాకువంటి, భ్రూ = కనుబొమ, (ఈశబ్దము హ్రస్వాంతము నగును,

'భ్రుకుటిర్భ్రుకుటిస్త్రియామ్' అని అమరము.) అల్పంబు = ఇంచుకంత, నిక్కన్ = నిక్కు-చుండఁగా, (సంస్కారవిశేషముచేత వేఁపాకు వయస్తంభకర మని ప్రసిద్ధము. కనుబొమ యెగురవేయుచు గానముసేయునెడల ముఖకాంతి వయస్సతిక్రమింపకుండ దృష్టిదోషమురాని యట్లుంచిన వేఁపాకువలె నాకనుబొమ యుండె ననుట), ప...రి-పరువంపు = తెస్స వికసించిన, మంకెన విరి = బంధూకపుష్పమును, పంపు = నమ్రముగాఁ జేయుచున్న, అ...ఱ-అరవంపు = సగము వంచిన, వాతెఱ = అధరోష్ఠము, చెం...నన్-చెంద్రంపు = సిందూరసంబంధియగు, వానన్ = వర్షమును, కురియన్ = వర్షింపఁగా, (పెదవి సగము మడిచి పిల్లఁగ్రోవి నూఁదు చున్నాఁ డనుట.), అం...డ్కి - అందంపు = అందమగు, మెఱుఁగు=నిద్దమగు, వాలారు = నిడుద యగు, కన్గవ=నేత్రద్వయముయొక్క, చూడ్కి= దృష్టి, శ్ర...తి-శ్రవణకుండల = కర్ణకుండలముయొక్క, కాంతి = కాంతికి, సవతుఁ గాగన్ = సమానమగుచుండఁగా, (ఆ గానమప్పు డట్టి చూడ్కి కర్ణాంతాయతములగు నేత్రముల కొనలను వ్యాపించియుండె ననుట), స...కున్-సప్తభువన = భూర్భువస్సువరాది సప్తలోకములయం దున్న, అంగనా = స్త్రీలయొక్క, అనురంజనకున్ = అనురక్తి గలిగించుటకు, సప్తవిధపరీవాహముగన్ = ఏడు తెఱఁగులగు ప్రవాహము లగునట్లు, 'జలోచ్ఛ్వాసాః పరీవాహాః' అని యమరము. గానసుధన్ = గానామృతమును, వెలార్చు మాడ్కిన్ = పైకుబుకఁజేసెడురీతిగా, వేణువుపైన్ = పిల్లఁగ్రోవిమీఁద, వ్రేళ్లు = అంగుళములను, మార్చిమార్చి = పరివృత్తిఁజేసి, గోవిందా = ఓయి శ్రీకృష్ణుఁడా, మంద సతులన్ = గోపికాస్త్రీలను, మరులు కొలిపితె = మోహపడఁజేసితివే, శ్రీకృష్ణుని వేణుగానవినోదము ననుసంధించుచున్న దని భావము.

ఉ. అక్కట రాధ నీకుఁ దగవా మగవారల నత్తమామలం
దక్కి ముకుందవేణుకలనాదపుటీలకు లేటిమొత్తమై
త్రెక్కొనుకాఁకచే నడికిరేలరుదెంచిన గోపికావళిన్
బొక్కఁగఁజేసి తద్రుచిరశభోగము గుత్తగ నీవ కైకొనన్. 63

టీ. రాధ = ఓ రాధికా, మగవారలన్ = భర్తలను, అత్తమామలన్ = శ్వశ్రూశ్వశురులను, తక్కి = కిసరించి, ము...కున్-ముకుంద = శ్రీకృష్ణునియొక్క, వేణు = పిల్లనఁగ్రోవియొక్క, కల = అవ్యక్తమధురమగు, నాదపుటీలకున్ = గానమనునీలకు, (ఈల యనఁగా జారచోరు లొండొరులకుఁ దెలుపుకొను సంకేతనాదము), లేటి మొత్తమై = మృగీసమూహమువలె నై, త్రె...చేన్ - త్రెక్కొను = భరింపఁగూడని, కాఁకచేన్ = తాపముచేత, నడికిరేలు = అర్ధరాత్రులయందు, అ...ళిన్-అరుదెంచిన= వచ్చినట్టి, గోపికావళిన్ = గోపికాసమూహమును, పొక్కఁగఁజేసి = పరితపించున

ట్లొనర్చి, తద్రు చిరభోగము-తత్ = ఆ కృష్ణునియొక్క, రుచిర = ఇంపైన, భోగముక్ = అనుభవమును, గుత్తగక్ = గుత్తఁజేసినట్లు, నీవ = నీవే, కైకొనక్ = గ్రహించుట, నీకుక్ = నీకు, తగవా = మర్యాదయే, అకట = అయ్యో, (ప్రథమపాదమందుఁ బ్రశ్నా కలిత దీర్ఘ యతి).

తా. తాను దాప మనుభవించుచు రాధ నుద్దేశించి శ్రీకృష్ణ సంభోగము సమస్త గోపికలకు లేకుండఁ జేసి గుత్తఁ జేసినట్లు నీ వొక్కతెవే యనుభవింప వచ్చునా యని రాధను దూఱుచున్నది.

ఉ. అక్కమలాత్ముఁ డొక్కతె నిజాంసమునం డిడి కుంజపుంజపుం
జక్కికిఁ గొంచుఁబోవఁ బెఱచాన లినాత్మజవెంట వ్రేఁగున
న్మిక్కిలి డిగ్గు పాదసరణిం జని రోయుదు రట్టి రోసి తా
రక్కడఁ గాంచు టేమి వలదా యభిమాన మొకింత యింతికిన్?

టీ. అక్కమలాత్ముఁడు = ఆ కృష్ణుఁడు, ఒక్కతెక్ = ఒకస్త్రీని, నిజాంసము నందుక్ = తనమూఁపునందు, ఇడి = ఉనిచికొని, కుంజపుంజక్కికిక్ = పొదరిండ్ల గుంపుతావునకు, కొంచుఁబోవక్ = తీసికొనిపోవఁగా, పెఱచానలు = ఇతర స్త్రీలు, ఇనాత్మజవెంటక్ = సూర్యతనయయగు యమునానదివెంబడి, వ్రేఁగునక్ = భారము చేత, మిక్కిలి = అధికముగా, డిగ్గు = దిగఁబడియున్న, పాదసరణిక్ = కాలిజాడను, చని=పోయి, రోయుదురు = వెదకుదురు, అట్టి = అప్రకారమే, రోసి = వెదకి, తారు = తాము, అక్కడక్ = ఆ పొదరిండ్లప్రదేశమందు, కాంచుటేమి = చూచుట యేమున్నది, ఇంతికిక్ = స్త్రీకి, అభిమానము = కొలువు, ఒకింత = కొంచెమైనను, వలదా = ఉండవలదా?

తా. శ్రీకృష్ణుఁడు గోపికల వంచించి యొక్కదానిఁ దనభుజము మీఁదఁ గూర్చుండఁబెట్టుకొని పొదరిండ్లచాటునకుఁబోఁగా, నాగోపికలందఱును కృష్ణునిం గానక స్త్రీని మోచికొనిపోవుచున్న భారముచేత నాయనపాదములు యమునానది సికతా తలంబుల మిగుల దిగఁబడియుండిన నాజాడను బోయి వెదకెదరుగాక; అట్లు వెదకి శ్రీకృష్ణునిఁ జూచుటవలన నాగోపికతోఁగూడి యున్నప్పుడు దమకేమిపనియని స్త్రీకిఁ గొంచెమైన నభిమానముండవలదా యని దూఱెను.

చ. ఇలు గలనైన వెల్వడని యాలువుటాండ్రకుఁ దాపికత్రైవై
యులు కెడలించి శౌరి తను యోగపు వాచవిఁ జూపి మీఁదఁ బె
ల్లలము వియోగవహ్ని భవోదంతర సైకతపఙ్క్తి పొంత వం
తలఁ బొరలించి తాఁ దుఃశమనస్వన వ్యగ్రమయ్యాఖనందనీ! 70

టీ. ఉగ్రమయూఖనందనీ = తీక్ష్ణకిరణములుగల సూర్యునియొక్క కూఁతురవైన యో యమునానదీ, ఇలు = గృహమును, కలనైనన్ = స్వప్నమందేని, వె...కున్ - వెల్వడని = వెడలిరాని, ఈలువుటాండ్రకున్ = మానవతులగుగోపికలకు, తాపికత్తెవై = కుంటెనకత్తెవై, ఉలుకెడలించి = (వారల) భయముదీర్చి, శౌ...విన్ - శౌరి = శ్రీకృష్ణుని యొక్క, తను = శరీరముయొక్క, యోగపు = సంయోగ మనియెడి, వాచవిన్ చూపి= వాగ్రుచిఁజూపి,(విటునియొద్దనుండి మధురవస్తువులు కొనివచ్చి స్త్రీల కిచ్చి రుచిఁ బుట్టించి యనుకూలపఱుచుట దూతికకు యుక్తమే గనుక వాచవి యని ప్రయోగించినాఁడు.), మీఁదన్ = అనంతరమందు, పెల్లు = అధికముగా, అ...హ్నిన్-అలము = వ్యాపించు చున్న, వియోగవహ్నిన్ = విరహాగ్నిచేత, భ...తన్-భవత్ = నీయొక్క, అంతర = మధ్యప్రదేశమందలి, సైకత = ఇసుకదిన్నెలయొక్క, పఙ్క్తి = సమూహముయొక్క, ప్రాంతన్ = సమీపమందు, వంతలన్ = తాపములచేత, పొరలించితి = వారినిఁ బొరలునట్లుచేసితివి, శమనస్వసవు కాదు=యమునితోఁబుట్టువగుదువు, 'యమునా శమన స్వసా' యని యమరము.

తా. ఓ యమునానదీ! నీవు జగములఁ దపింపఁజేసెడు సూర్యునికిఁ గూఁతురవై యంతకుం డగుయమునికిఁ దోఁబుట్టువైతివి గావున, నీ కఠినగుణమునకుఁ దగినట్లు స్వప్న మందైన నిల్లు వెడలని మానవతులగు గొల్లసతుల కెడకత్తెవై యిల్లు వెడలించి భయము వాపి మొదల నతనితోఁ గూడున ట్లొనర్చి యారుచిఁ జూపి పిమ్మట నా కృష్ణుని నెడఁ బాపి నీ యిసుకదిన్నియలమీఁద వారలు విరహాగ్నిచేతఁ బొరలాడునట్లు చేసితివి గదే? యెంత కఠినాత్మురాలవే?

వ. అని యొంటిపాటునం దనలోనం బలుకు పలుకు లాలించి పొంచి యున్న వయస్య లాస్యంబు లపహాస్యచంద్రికాతుందిలంబులు గాఁ దోఁచి భామ యే మేమి నీ మనం బెఱింగియే కదా మును మున్న యతఁడిమాటలు మానలే వంటి మని మూఁదలించినం గిందు దవన తాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగపున నడంచి మఱి మొఱంగ ననువుపడక యందంబుఁ గూడుకొని వారి కిట్లనియె. 71

టీ. అని = ఈరీతిగా, ఒంటిపాటునన్ = ఏకాంతమందు, తనలోనం బలుకు పలుకులు=తనలోఁ దా ననియెడుమాటలు, ఆలించి = విని, పొం...లు-పొంచియున్న = డాఁగియున్న, వయస్యలు = సఖులు, ఆస్యంబులు = మొగములు, అ..గాన్-అప హాస్య = మేలంపు నవ్వు లనియెడు, చంద్రికా = వెన్నెలచేత, తుందిలంబులుగాన్= పిక్కటిల్లినట్లుగా, తోఁచి = కనఁబడి, భామ = ఓయింతీ, ఏ మేమి, ఎఱిఁగియేకదా =

తెలిసినేకదా, మునుమున్న = ప్రథమమందే, అతనిమాటలు = ఆస్వామివార్తలు, మానలేవంటిమని=విడువఁజాల వంటిమి మనుచు, మూదలించినన్ = ప్రస్తావింపఁగా, (తాఁక నాడఁగా ననుట.), కించిదవనతాననయై = కొంచెముదలవంచుకొన్నదై, నెమ్మొగంబు = ముఖముయొక్క, వెలవెలపాటు = సిగ్గుచేఁ జెల్లఁబోవుటను, లేనగవునన్ = లేఁత నగవు చేత, అడంచి = మట్టుపఱిచి, మఱి = ఇఁకను, మొఱఁగన్ = దాఁచఁగా, అనువు పడక = వలనుగాక, అందంబుఁగూడుకొని = వారినిగలపికొని, వారి కి ట్లనియె=ఆ చెలుల కిట్లనియె.

తే. నాఁడు మన మున్న నెట్లొ పూఁబోఁడులార ;
యనిన వారలు మగుడ నాయమకు ననిరి
యింతి నాఁ డుండ కెందుఁ బోయితివి నీ వ
టన్న నచ్చెరువడి వారి కతివ పలికె. 72

టీ. పూఁబోఁడులార = ఓ చెలులారా ! నాఁడు = ఆ గోపికాకృష్ణుల క్రీడాకాల మందు, మన మున్నన్=నేను మీరు నుండినను, ఎట్లొ=ఏవిధమగునో, అనినన్=అనఁగా, వారలు=ఆచెలులు, మగుడన్ = మరల, ఆయమకున్ = ఆమెకు, అనిరి = చెప్పిరి, ఇంతీ = ఓచెలీ, నాఁడునీవుండక = ఆకాలమందునీవుండక, ఎందుఁబోయితివి = ఎక్కడఁబోయితివి, అట్లన్నన్ = ఆప్రకార మనఁగా, అచ్చెరువడి = ఆశ్చర్యపడి, అతివ = ఆ యింతి, వారికిఁ బలికెన్ = ఆచెలుల కనియెను.

తే. సకియలార త్రైకాలికజ్ఞానవంతు
లైన ఋషులట్ల పలికెద రంత యొఱుక
యెదఁ గలిగెనేని యొఱిఁగింపుఁ డేను మొదల
నెవ్వతె నటన్న మఱి వార లిట్టు లనిరి. 73

టీ. సకియలార = సఖులారా, త్రై...లు - త్రైకాలిక = భూతభవిష్య ద్వర్త మానకాలత్రయసంబంధియగు, జ్ఞానవంతులు=జ్ఞానముగలవారు, ఐన, ఋషులపట్ల=మునీశ్వరులవలె, పలికెదరు=వచించెదరు, అంతయొఱుక = తాదృశజ్ఞానము, ఎదన్ = హృదయమందు, కలిగెనేని = ఉండెనేని, ఏను=నేను, మొదలన్ = ప్రథమమందు, (పూర్వజన్మమందనుట), ఎవ్వతెను, ఎఱిఁగింపుఁ డటన్నన్=తెలుపుఁ డనఁగా, మఱి=పిమ్మట, వారు = ఆచెలులు, ఇట్టు లనిరి.

మ. దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి చూఁపోప కిం
తవ్వుబిల్లుంబని యంత స్వామి మది నీర్ష్యాక్రోధము ల్పొందడిం

ప విరిం బోక ద్రుమంబుఁ గైకొనఁబతి కీ న్మందన్నమ్రానెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య వీ వహహా కావా? భామినీ నావుడున్. 74

టీ. ది...త్నిన్-దివిజద్రు = కల్పవృక్షముయొక్క, ప్రసవంబున్=పుష్పమును, ని. 'స్యాదుత్పాదేఫలేపుష్పే ప్రసవోగర్భమోచనే' యని అమర. కాంచిన = పొందిన, సపత్నిన్=సవతాలగురుక్మిణిని, చూచి = కాంచి, చూపోపక = ఓర్వలేక, ఇంతవుజిల్లుం బని=ఇంతైనచిన్నపనిని, అంతసేసి = అంతగాఁజేసి, మదిన్ = మనస్సునందు, ఈర్ష్యాక్రోధముల్ - ఈర్ష్యా=ఈసును, క్రోధముల్=కోపమును, సందడింపన్ = పెనఁగొనఁగా, విరిన్ = పుష్పముచేత, పోక=చనక, ద్రుమంబునన్ = వృక్షమును, కైకొనన్=గ్రహింపఁగోరి, పతిన్=భర్తయగుశ్రీకృష్ణుని, మందన్నన్=ఔషధ మనఁగా, మ్రానెల్లన్= వృక్షమెల్లను, తేన్=తెచ్చునట్లు, అవధింబెట్టిన = శ్రమపెట్టినట్టియు మేరఁబెట్టినట్టి సత్యవు = సత్యభామవు, ఈవు=నీవు, కావా, అహహా = ఆశ్చర్యము, 'అహేహోత్యద్భుతేఖేదే' యని యమరము. భామినీ = ఓయింతీయనిసంబోధనము, ('కోపనాసైవ భామినీ' యనియున్నది గనుకఁ గోపముగలదానా యనుట), నావుడున్ = అనఁగా.

తా. ఓభామినీ! నీసవతియగు రుక్మిణీదేవి శ్రీకృష్ణునిచేతఁ బారిజాత పుష్పము గ్రహింపఁగా నీవు చూచి యోర్వఁజాలక యీసును జలంబును మెఱయ స్వల్పమగు నక్కార్యంబు నెంతోఁ గొప్పఁ జేసి యలిగి యా పుష్పముమాత్రమేగాక స్వర్గము నుండి పారిజాత వృక్షమునే తెప్పింపఁగోరి మం దనిన మ్రానెల్లఁ దెప్పించునట్లు తలంచి యాప్రకారము శ్రీకృష్ణుని శ్రమ పఱచి పారిజాతవృక్షమును బడసిన సత్యభామవు నీవే కాదా?

వ. గ్రక్కనం బ్రత్యుత్పన్నవిజ్ఞానయై గృహదీపికారోపణంబునం గృహ
గత పదార్థంబు లొక్కమాఱె దృగ్గోచరంబు లగునట్లు జన్మాంత
రంబున నయ్యనంతునితోడి క్రీడాప్రపంచంబు సద్యస్సమనుభూతం
బైన తెఱంగునం దోఁచిన. 75

టీ. గ్రక్కనన్ = వెంటనే ప్రత్యుత్పన్నవిజ్ఞానయై - ప్రత్యుత్పన్న = ఉదయించిన, విజ్ఞానయై = విశేషజ్ఞానముకలదై, గృహదీపికారోపణంబునన్ = నిలయమందు దీపముంచుటచేత, గృహగతపదార్థంబులు = ఇంటిలోనున్న వస్తువులు, ఒక్కమాఱె = ఒకసారియె, దృగ్గోచరంబులగునట్లు = దృష్టివిషయములయినభంగిని, జన్మాంతరంబునన్ = పూర్వజన్మమందు, అయ్యనంతునితోడి = ఆశ్రీకృష్ణస్వామితోడి, క్రీడాప్రపంచంబు - విహారవైపుల్యము, సద్యస్సమనుభూతంబయిన తెఱంగునన్ = అప్పుడు లెస్సగా ననుభవించినమాడ్కిని, తోఁచినన్ = అగపడఁగా.

ఉ. వాలికకన్నులం బొడముువారి సకజ్జల మాశ్రితశ్రవో
గోళక మై తదంతికపుఁగుంతలవల్లికిఁ దల్లిఁదోడుగా
మైలవలి న్నన ల్నిగుడు మైఁ బులకల్పొడమ న్గ్లథాంగియై
సోలినఁ జూచి డెందములు సుబ్బున హా యనిబోఁటు లర్మిలిన్. 76

టీ. వాలిక=నిడుదలగు, కన్నులన్ = నేత్రములయందు, పొడము = ఉదయించెడు, వారి=బాష్పము, సకజ్జలము = కాటుకనీటితోఁ గూడినదియై, ఆశ్రిత = ఆశ్రయింపఁబడిన, శ్రవః = చెవు లనియెడు, గోళకమై = గోళములుగలదై, తదంతికపు= ఆకర్ణసమీపమునందున్న, కుంతలవల్లికిన్ = తలవెండ్రుకలు అనుతీఁగెకు, తోడుగాన్ = తల్లియుఁదోఁబుట్టువుగాఁగా, (కాటుకతో నల్లనై యున్నదిగావునఁ గురులకు సమానమైన దనుట.), మైలవలిన్ = శరీరమనియెడి యేలకితీఁగెయందు, (లవలి = వెన్నెలతీఁగ యనికొందఱు), ననల్=పుష్పములు, నిగుడుమైన్=పుట్టెడిరీతిచేత, పులకల్ = రోమాంచములు, పొడమన్ = పుట్టఁగా, గ్లథాంగియై = బెండువడినదేహముగలదియై, సోలినన్ = మూర్ఛిల్లఁగా, చూచి=వీక్షించి, బోఁటులు=చెలికత్తియలు, డెందములు = అంతరంగములు, చుబ్బనన్ = చుఱుక్కనఁగా, హాయని = అయ్యోయనియంగలార్చి, అర్మిలిన్=కూర్మిచేత, ఆయమయందలి ప్రేమచేత నని ముందఱి పద్యముతో నన్వయము.

తా. ఆయమ కన్నీరు నింపుచుండ నది చెవులునిండి తలవెండ్రుకలు దడుపఁగా నెమ్మేను గగుర్పొడువఁగా సోలినఁ గాంచి డెందంబులు గంది తోడి పూఁబోఁడులు ప్రేమంబున నిట్లనిరి.

ఉ. ఎంతకుఁ దెచ్చెనే సరసిజేక్షణచెయ్దము లందుమీఁద జ
న్మాంతరవర్తనంబు హృదయంబున కిత్తఱి నెచ్చరించి గో
రంతలు గొండలంత లగునట్లుగఁ జేసితి మంచుఁ జేటికా
వాంతసతాళవృంతమృదువాతహిమాంబుకణాళిఁ దేర్చినన్. 77

టీ. స...ల్-సరసిజేక్షణ=పద్మాక్షియగునీయమయొక్క, చెయ్దముల్ = వ్యాపారములు, ఎంతకుఁదెచ్చెనే = ఎంతవఱకుఁదెచ్చెను, అందుమీఁదన్ = ఆకష్టముమీఁఁద జన్మాంతరవర్తనంబు = పూర్వజన్మ వ్యాపారమును, హృదయంబునకున్ = ఎదకు. ఇత్తఱిన్ = ఈసమయమందు, ఎచ్చరించి = ఎఱుకపఱచి, గోరంతలు = గోరంత స్వల్పములగుకార్యములు, కొండలంతలగునట్లుగన్ = పర్వతోపమానము లగునట్లుగా చేసితి మంచున్ = కావించితి మని, చేటికా = పరిచారికలచేత, వాంత = వీవఁబడిన, సతాళవృంత = వీవనలతోఁగూడిన, మృదువాత = మందమారుతముగల, హిమాంబు= పన్నీటియొక్క, కణాళిన్ = బిందుపరంపరచేత, తేర్చినన్=మూర్ఛఁదేల్పఁగా, (విసన

కట్టులమీఁదఁ బన్నీరు చిలుకరించి చెలికత్తియలు పరిచారికలచేత వీవఁ జేసి సేదఁ దేర్చి రనుట).

క. తెలిసి కను దెఱచి । వెండియు
జలజేక్షణ తన్ముకుంద । చరణస్మృతిని
శ్చలతఁ గను మొగిచి । మఱి య
శ్రులు ఱెప్పలఁ దోఁపఁ దెఱచి । చూచి సఖులతోన్. 78

టీ. తెలిసి = తెలివొంది, కనుదెఱచి = నేత్రము విచ్చి, వెండియున్ = మరలను, జలజేక్షణ = ఆనాయిక, తన్ముకుందచరణస్మృతినిశ్చలతన్ - తన్ముకుంద = ఆ శ్రీకృష్ణునియొక్క, చరణస్మృతి = పాదస్మరణమందు, నిశ్చలతన్ = స్థైర్యముచేత, కనుమొగిచి = నేత్రము మూసి, మఱి = పిమ్మట, అశ్రులు = బాష్పజలములు, ఱెప్పలన్ = పక్ష్మములయందు, తోఁపన్ = కానరాఁగా, తెఱచి = కనుదెఱచి, చూచి = వీక్షించి, సఖులతోన్ = చెలులతోడ. అని ముందఱి కన్వయము.

క. మీ రెవ్వ రనుటయును శృం
గారిణి మే మురగకన్యకల మింతకు ము
న్ధారుణి కేతెంచితి మన
నారామలఁ గౌఁగిలించి । యార్తి న్బలికెన్. 79

టీ. మీ రెవ్వ రనుటయును = మీ రెవ్వ రనఁగా, శృంగారిణి = ఓసుందరీ, మేమురగకన్యలము = మేమునాగకన్యలము, ఇంతకుమున్ = ఈజన్మమునకుముందు, ధారుణికేతెంచితిమనన్ - భూలోకమునకు వచ్చితి మనఁగానే, ఆరామలన్ = ఆస్త్రీలను, కౌఁగిలించి = ఆలింగనముఁ జేసికొని, ఆర్తిన్ = మనస్తాపముచేత, పలికెన్ = వచించెను.

ఉ. అట్టి మురారి కప్పుడనుఁ । గై మఱి యీకలివేళఁ గ్రమ్మఱం
బుట్టి వియోగవేదనలఁ । బొక్కెడు నీ తను వేల తండ్రి దా
నిట్టగు నన్ను నింకొకని । కియ్యక తొల్తన యోగశక్తిఁ బోఁ
బెట్టెద దీని వెండియు నుపేంద్రపదాంబురుహంబు పట్టెదన్. 80

టీ. అట్టిమురారికిన్ = అట్టిశ్రీకృష్ణునకు, అప్పుడు = ఆకాలమందు, అనుఁగై = ప్రియురాలనై, ఇచ్చట అనుఁగునై యని యుండవలసినను అది వైకల్పికవిధిగాన అనుఁగై అనియు నుండవచ్చును. ఇట్లు ఆదిపర్వంబున - గీ. 'కౌరవుల కెల్ల గురుఁడైన కారణంబు' అని ప్రయోగింపఁబడియున్నది.) మఱి = పిమ్మటను, ఈకలివేళన్ =

ఈకలియుగకాలమందు క్రమ్మఱన్ = మరల, పుట్టి = జనించి, వియోగవేదనలన్ = విరహవేదనలచేత, పొక్కెడు=పరితపించెడు, ఈతను వేల = ఈశరీరమేటికి, తండ్రి= మాజనకుఁడు, తాను=ఆయన, ఇట్టగు = ఈరీతిగలిగియున్న, నసున్ = నను, ఇంకొక నికిన్=మఱియొకనికి, ఈయకతొల్లన = ఇయ్యకముందఱనే, దీనిన్ = ఈశరీరమును, యోగశక్తిన్=యోగబలముచేత, పోఁబెట్టెదన్ = విసర్జించెదను, వెండియున్ = మగిడి, ఉపేంద్ర = ఆత్రివిక్రమునియొక్క, పదాంబురుహంబు = చరణసరోజమును, పట్టెదన్= అవలంబించెదను.

తా. అట్టి శ్రీకృష్ణునకుఁ దొల్లి ప్రియురాలనై యుండియు నీకలివేళ మరల జనించి వియోగతాపముచేతఁ గ్రాఁగెడు నీదేహమును మాతండ్రి నన్నొకని కియ్యక మున్నే యోగశక్తిచేశ విడిచి మగిడి యాయుపేంద్రు పాదపద్మంబ యవలంబించెద నని భావము.

క. అది యొండె భక్తి యెవ్వతె
యెద విశ్లేషైకభీరువృత్తిఁ బ్రియలా
భదశన్మెయిఁ దొఱఁగించును
హదనున నదిగాక యున్నయవి వైశికముల్. 81

టీ. ఎవ్వతె = ఏస్త్రీయైన, ఎదన్ = హృదయమందు, వి... త్తిన్ - విశ్లేష = వియోగమువలన, ఏక=ముఖ్యముగు, భీరువృత్తిన్=భయంపడినవర్తనముచేత, ప్రియలాభ దశన్ = ప్రియునియొక్కలాభదశయందే, హదనునన్ = మంచిసమయమందు, మెయిన్=శరీరమును, తొఱఁగించును = జార్చునో, అది = ఆశరీరత్యాగవ్యాపారము, ఒండె=ఒకటే, భక్తి=పతిభక్తి, అదిగాక=అట్లుగాకుండినను, ఉన్నయవి = మిగులునట్టి భక్తులు, వైశికముల్ = 'విత్తమాత్రోపాధిక సకలపురుషాభిలాషా సామాన్యా' యను నట్లు వేశ్యాభక్తియేకాక నిక్కము గావనుట.

తా. ఏయింతి తనప్రాణనాథుఁడు దాఁపున నుండినప్పుడే యితనితో వియోగము గలుగునేమో యను భయముచేత మంచిసమయము గనుఁగొని శరీరత్యాగము సేయునో యాపెదే పతిభక్తిగాక యితరములైనవి వేశ్యాభక్తివంటి వని భావము.

తే. అనినవారలు పల్కి రాయదువతంస
మెందుఁ జన్నాఁడు విభు రంగమందు నిల్చె
వేగపాటేల? యతఁడ నీవిభుఁ డగుటకు
నర్చనాదుల నిప్పాటిశ్రీహరి భజింపు. 82

టీ. అనినన్ = ఇట్లుచెప్పఁగా, వారలు పల్కిరి = ఆచెలు లీవక్ష్యమాణక్రమముగా వచించిరి, ఆయదువతంసము = ఆయాదవరత్న మగు శ్రీకృష్ణుఁడు, ఎందుఁజన్నాఁడు = ఎక్కడ కేఁగినాఁడు, వినుము = ఆలకింపుము, రంగమంద = శ్రీరంగక్షేత్రమందే, నిల్చెన్ = నివసించెను, వేగపాటేల = త్వరపడుటయేటికి, అతఁడ = ఆస్వామియే, నీవిభుఁ డగుటకున్ = నీభర్తయగుటకు, ఇవ్విటిహరిన్ = ఈశ్రీవిల్లిపుత్తూరున నున్న స్వామిని, అర్చనాదులన్ = పూజాదులచేత, భజింపుము = సేవింపుము.

తా. ఆశ్రీకృష్ణుఁ డిప్పు డెచ్చటికిఁబోలేదు, శ్రీరంగమందే యున్నాఁడు గావున నతఁడు నీభర్త యగుటకు నీయూర నున్న వడపెరుంగోయి లుడయ రనుస్వామినిఁ బూజనాదులచేతఁ గొల్వుము.

చ. అలుకకుమన్నఁ దేటి మఱి ♦ యంతటనుండియు వేళవేళ నె
చ్చెలు లిడు తెల్వులన్ మగుడఁ ♦ జింతల సంతమసంబుల న్సమా
కలితత మించె సొమ్మిడని ♦ కార్శ్యమునన్ హృదయంబున న్సదా
పలపలగాక నీలముల ♦ బన్నసరంబయి నిర్మలాంగికిన్. 83

టీ. అలుకకుమన్నన్ = వెఱవకు మని చెప్పఁగా, తేటి = తెలివొంది, మఱి = అనంతర మందు, అంతటనుండియున్ = అప్పుడు మొదలుకొని, వేళవేళన్ = ప్రతికాలమందు, నెచ్చెలులు = చెలికత్తియలు, ఇడు = ఉనిచెడి, తెల్వులన్ = జ్ఞానము లనెడు ధావళ్యముల తోడను, మగుడన్ = మరల, చింతల = విచారము లనియెడు, సంతమసంబులన్ = చీకటులతోడను, సమాకలితత = కూడుకొనుట, (ఇది కర్తృపదము.), నిర్మలాంగికిన్ = స్వచ్ఛశరీరముగల యాయువిదకు, సొమ్మిడని = భూషణము ధరింపని, కార్శ్యమునన్ = కృశించుట చేత, హృదయంబునన్ = ఎదయందు, సదా = ఎల్లప్పుడును, పలపలగాక = పలచనగాక నీలములబన్నసరంబయి = నీలములతోడఁ గూర్చిన ముక్తాహారమై, మించెన్ = ఒప్పెను.

తా. ఆయమకుఁ గృశత్వము చేత సొమ్ము లిడకుండినను హృదయమందుఁ జెలుల మాటలఁ దెల్వులును, మరలఁ గలిగెడు చింతాభరంబులను చీకటులును, గూడికొని నీలములతోఁ జేర్చిన ముత్తెపు సరమువలె నుండెను, దీనికిఁ జింతాసంతమసంబులు నీలములవలెను, చెలుల మాటలవలనఁ గలిగెడు తెలువులను తెలుపులు ముత్తెములవలె నుండె ననియును, లో నున్నభావము నిర్మలాంగియాట బయలఁ దోఁచెను.

తే. ఎలసి యేప్రొద్దుఁ గనువొందక ♦ నీక మరుఁడు
కలహమున కంకకాఁడయి ♦ కాలు ద్రవ్వఁ
బాండుబహుళక్షపాపరం ♦ పరలు వెడల
కింటిలో నేదుముల్లయ్యె ♦ నిందుముఖికి. 84

టీ. ఎలసి=కనుపెట్టుకొని, ఏప్రొద్దునన్=సంతతమును, కనువొందనీక=కన్నుమూయనీక, మరుఁడు = స్మరుఁడు కలహమునకున్ = పోరాటమునకు, అంకకాఁడై = మిక్కిలి పట్టుదలగలవాఁడై కాలుద్రవ్వన్ = కాలుద్రవ్వుచుండఁగా, పా...లు-పాండుబహుళక్షపా = శుక్లపక్ష బహుళపక్ష రాత్రులయొక్క, పరంపరలు=వరుసలు, వెడలక=కదవక, ఇందుముఖికిన్ = ఆచంద్రముఖికి, ఇంటిలోన్=గృహమందు, ఏదుముల్లయ్యెన్=ఏదుఁబాదిముల్లుండినట్లై యాయెను.

తా. మన్మథుఁ డెడతెగక యెప్పుడుఁ గనువైచి నిద్రఁబట్టనీకుండఁ గచ్చకుఁ గాలు ద్రవ్వుచుండఁగా శుక్లపక్షరాత్రులును బహుళపక్షరాత్రులు నొక్కఁడుగానే చక్కఁగా జరుగక యేదుముల్లింటిలో నుండిన నాయింటివారి కెటు క్షేమములేక నిద్దుర పట్టక పోవునో, యారీతిగానే యాయమ శ్రమపడుచుండెను. శల్యమ్ముగరోమ మింటనున్న నాయింటఁ గలహము కలుగుననుట ప్రసిద్ధము. ఇచ్చట శుక్లపక్షరాత్రులు తెల్లగాను కృష్ణపక్షరాత్రులు నల్లఁగా నుండునుగనుక వానిపరంపర యేదుఁ బాదిముల్లుఁగాఁ జెప్పఁబడెను. ఆరోప్యమాణమయిన యేదుఁబాదిముల్లు కలహమును గలుగఁజేయుట కుపయోగించెను గనుక పరిణామాలంకారము.

మ. తలిరుంగైదువుజోదునానతి వధూధైర్యంపుఁబెన్గోట కం
దళితాహర్ముఖయంత్రకారుఁ డలుక న్నానాఁటికిం ద్రెళ్లఁ గో
మలమార్తండమరీచిదీపకళికోష్మం జూఁడి యేయుం దళ
ద్దళపాథోరుహలోహనాళకుహరోద్యచ్చంచరీకాశ్మముల్. 85

టీ. కందళితాహర్ముఖయంత్రకారుఁడు = అంకురించినప్రాతఃకాలమనియెడు ఫిరంగికాతు, త...తిన్ - తలిరుంగైదువు=చిగురుటాకుబాఁకుగల, జోదు=యోధుఁడగు మన్మథునియొక్క, ఆనతిన్=ఆజ్ఞప్తిచేత, వ...ట - వధూ=ఆవనితయొక్క, ధైర్యంపు=ధైర్యమయమగు, పెన్గోట = పెద్దకోట, నానాఁటికిన్ = దినక్రమముగా, త్రెళ్లన్ = కూలుటకు, కో...ష్మన్ - కోమల=మృదువులగు, మార్తండ = బాలసూర్యునియొక్క, మరీచి=కిరణములనియెడు, దీపకళికా = మొగ్గవంటిదీపములయొక్క, ఊష్మన్ = వేఁడిమిచేత, చూఁడి=ముట్టించి, ద...ల్ - దళత్=వికసించుచున్న, దళ=రేకులుగల, పాథోరుహ=కమలము లనియెడు, లోహనాళ = ఫిరంగులయొక్క, కుహర = బిలములనుండి, ఉద్యత్=వెడలుచున్న, చంచత్=మదించిన, చంచరీక=తుమ్మెదలనియెడు అశ్మముల్ = గుండ్లను, అలుకన్=కోపముచేత, ఏయున్=ప్రయోగించును.

తా. ప్రాతఃకాల మనెడు ఫిరంగికాతు మన్మథుఁ డను యోధవరుని సెలవొంది యాయమ ధైర్యమనియెడు కోట నానాఁటికిఁ గ్రిందఁ గూలుటకై, బాల సూర్యకిరణ

ములు సోఁకుటవలన వికసించుచున్న కమలము లనియెడు ఫిరంగులలోనుండి వెడలెడు గండుదుమ్మెద లనియెడు గుండ్లను బారు సేయుచు; అప్పు డాకిరణజ్వాలయే జానకి ప్రాతి రంజకపువేఁడిమియై యుండెను; ఆయమకు రాత్రులు ధైర్యము లేదాయెఁగదా ప్రాతః కాలమందును లేదాయెను; సాయంకాలములందుఁ గమలములు ముకుళించు నప్పుడు తుమ్మెద లాకమలములలోఁ జొచ్చియుండి సూర్యోదయము కాఁగానే వికసించిన వానిలోనుండి వెడలు చుండెను.

తే. సురుచిరవితానదంభకౌసుంభధారి
తుహినధారాగృహాంగి బిందువులు చెదర
పొంత ఘటయంత్రసరముఁ ద్రిప్పుచు జపించు
మగువధృతి దూల మధ్యాహ్నమంత్రవాది. 86

టీ. మధ్యాహ్నమంత్రవాది = మధ్యాహ్నమనియెడిమాంత్రికుఁడు, మ...తి - మగువ=ఆయమయొక్క, ధృతి=ధైర్యము, తూలక్=చలించుటకై, సు...రి - సురుచిర= ప్రకాశించుచున్న, వితాన=మేలుకట్టనియెడు, దంభ=వ్యాజముగల, కౌసుంభ = కాషాయ వస్త్రమును, ధారి = ధరించినవాఁడును, తు...గి - తుహినధారాగృహ = మంచువంటి ధారలుగల గృహమనియెడు, అంగి = శరీరముగలవాఁడునై, (ఇవిరెండును మధ్యాహ్న మంత్రవాదికి విశేషణములు), బిందువులు=ధారాబిందువులు, (బిందువు లనఁగా ధైర్యము యొక్క ప్రాణము లనికొందఱు, బంధువ లను పాఠమున్నను ప్రాణము లనియే యర్థము. 'బంధుర్బంధూకపుష్పే స్యాత్ప్రాణబంధోశ్చ భర్తరి' అని విశ్వము.) చెదరక్ = పడు చుండఁగా, ఘ...ముక్ - ఘటయంత్ర=కుంభయంత్ర మనియెడు, సరముక్=జపమాలి కను, త్రిప్పుచుక్=పరివృత్తిఁజేయుచు, పొంతక్ = సమీపమున, జపించుక్ = జపము సేయును.

తా. తొగ రద్దిన చందువ లనియెడు కాషాయములను ధరించి మంచువలె ధారలు గురిసెడు గృహ మనియెడిశరీరము భస్మధూసరిత మైనట్లు తెల్లఁగా నుండఁగా, జలము వెదచల్లుచుఁ దిరుగుచున్న ఘటయంత్ర మనియెడు జపమాలిక ద్రిప్పుచు మధ్యాహ్న మనియెడు మాంత్రికుఁడు మగువ ధైర్యము చెడిపోవుటకుఁ దన నోటి తుప్పరలు రాలు నట్లు జపముఁ జేయుచుండును. దీనివలనఁ దాపోపశమనార్థమై నీటి తుంపురులు నెగయు చున్న ఘటయంత్రములుగల యింటిలో నాయమ యుండఁగా, నక్కడను దాప మధిక మాయె నని తోఁచుచున్నది. ఘటయంత్ర మనఁగా నొక మోకు వెంటఁ గడవలు గట్టి బావిలోఁ జేఁదుచు రాఁగాఁ గొన్ని మునుఁగునవియు మఱికొన్ని నీరు గ్రమ్మరించునవియై యుండును.

ఉ. తామరసాప్తతామ్రముఖ దంష్ట్రిత విస్ఫుట మల్లి హల్లక
స్తోమరజచ్ఛటాంగక మధుద్యుతి తారవియద్ద్రుచంక్రమో
ద్దామపితృప్రసూప్లవగి దైన్యరుతోత్థరథాంగపోత చిం
తామయనిద్రలం బొలసి తాపముసేయఁ దొడంగె నింతికిన్. 87

టీ. తా...ఖ-తామరసాప్త=కమలాప్తుఁ డగుసూర్యుఁ డనియెడు, తామ్ర = ఎఱ్ఱనైన, ముఖ=మొగముగలయట్టియు, దంష్ట్రిత = కోఱలుగాఁ జేయఁబడిన, విస్ఫుట = వికసించిన, మల్లి=మల్లెపువ్వులు గలిగినట్టియు, హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, స్తోమ=సమూహముయొక్క, రజః=పుప్పొళ్లయొక్క, ఛటా = ప్రోగనియెడు, అంగక = శరీరముగలయట్టియు, మధు=మకరందముయొక్క, ద్యుతి = కాంతివంటి కాంతిగల, తార=నక్షత్రములనెడు కనుగ్రుడ్లుగలట్టియు. (శ్లిష్టరూపకము), వియత్=ఆకసమనియెడు, ద్రు=వృక్షమందు, చంక్రమ=సంచరించుటయందు, ఉద్దామ=అడ్డపాటులేనియదియును నగు, పితృప్రసూ = సాయంసంధ్యయనెడు, ప్లవగి = ఆఁడుకోఁతి, 'సాయంసంధ్యా పితృప్రసూ' అని యమరము. దైన్యరుత=దీనాలాపములతోడ, ఉత్థ=లేచినట్టి, రథాంగ=చక్రవాకములనియెడు, పోత=పిల్లలుగలదియై, చింతామయ=చింతావికారములగు, నిద్రలన్=నిద్దురలయందు, పొలసి=కనఁబడి, ఇంతికిన్ = ఆయమకు, తాపముసేయన్ = తాపము గలుగఁజేయుటకు, తొడంగెన్=ఉపక్రమించెను.

తా. 'స్వప్నే మయాయం వికృతో ఽద్యదృష్టశ్శాఖామృగశ్శాస్త్రగణైర్నిషిద్ధః' అని సుందరకాండమందును, 'స్వప్నే వానరమార్జాలభల్లూకాదుఃఖహేతవః' అని గ్రంథాంతరమున నున్నట్లు, స్వప్నమందు వానరదర్శనము శుభావహముగాదు గావున 'కోయం తామ్రముఖః కపి' అనినట్లు అస్తమింపఁబోయెడు సూర్యుఁ డనియెడు నెఱ్ఱని ముఖము గలిగి, సాయంకాలమందు వికసిల్లుచున్న మల్లెమొగ్గలనియెడు తెల్లని కోఱలు గలిగి, యెఱ్ఱగలువ పుప్పొడి తిప్ప యనియెడు పచ్చని శరీరము గలిగి, 'పింగాక్షం పురతస్థ్సితే' నున్న ట్లాపూలమకరందమువలె పింగళ వర్ణము గల నక్షత్రము లనెడుకనుగ్రుడ్లు కలిగి యాకస మనియెడు చెట్టుమీఁదఁ దిరుగుచు నస్తమయకాలమందు నొండొంటిఁ బాసి దీనాలాపములు సేసెడు జక్కవ లనియెడు పిల్లలతోఁ గూడిన సాయంసంధ్య యనియెడు నాఁడుకోఁతి, యాయమకు నిద్రలు లేకున్నను శరీర మెఱుఁగరాని చింతామయ నిద్రలోఁ దోఁచుచుండుఁ గావున, నాయమ మిగుల వగలం బొగులుచుండెను.

వ. ఇట్లుత్తలంగున సకల కాలంబుల నారటంబునకు నూఱటఁ గాన కుండి

యు నప్పుండరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున
నారాధారమణుం గ్రమ్మఱం జెంద డెందంబునం దలంచి. 88

టీ. ఇత్తెఱంగునన్ = ఈప్రకారముగాను, సకలకాలంబును = అహోరాత్రములు, ఆరటంబునకు = పరితాపమునకు, ఊటాటంగానకుండియున్ = ఉపశాంతి పొందకుండియు, అప్పుండరీకాక్షి = ఆనాయిక, అందుండు = ఆ శ్రీవిల్లిపుత్తూరుననుండు, పుండరీకాక్షు = విష్ణువుయొక్క, ఆరాధనంబునన్ = పూజచేయుటచేతను, ఆ రాధారమణున్ = ఆ శ్రీకృష్ణస్వామిని, క్రమ్మఱం జెందన్ = తిరిగిపొందుటకు, డెందంబునన్ తలంచి = మనస్సున నెంచుకొని

సీ. పద్మాస్య ప్రతిదినప్రత్యూషమును మౌన
నియతి మేల్కాంచి సఖీచయము మ్రోల
హేమపాత్రిక హరిద్రామలకాద్యధిక
స్నానీయవస్తువ్రజంబుఁ గొనుచు
ధౌతాంశుకంబులుఁ దడియొత్తులును దేర
నంతఃపథంబునఁ నరిగి నిజగృ
హారామదీర్ఘికఁ ననుసంహితద్రావి
డామ్నాయయై స్నానమాచరించి

తే. పర్జనీలేశ పూర్ణసౌభాగ్యదాంగ
ధూతి చకచక లీరెండతోడ మాఱు
మలయ నిడువెండ్రుకలగుంపుఁ మలఁచివైచి
వేగ వెడవెడఁ దడియొత్తి విధియుతముగ. 89

టీ. పద్మాస్య = ఆకమలముఖి, ప్రతిదినప్రత్యూషమును = ప్రతిదినప్రాతఃకాలమందును, మౌననియతిన్ = మౌనవ్రతముచేత, మేల్కాని = నిద్దురలేచి, సఖీచయము = చెలులమొత్తము, మ్రోలన్ = తనముందఱ, హేమపాత్రికన్ = బంగారుపళ్లెరమునందు, హ...బున్ - హరిద్రా = పసుపును, ఆమలక్యాదిక = ఉసిరికపిండిమొదలగు, స్నానీయ = స్నానమునకుఁ దగిన, వస్తు = ద్రవ్యములయొక్క, వ్రజంబున్ = సమూహమును, కొనుచున్ = గ్రహించుకొనుచు, ధౌతాంశుకంబులు = ఉదికినచీరలును, తడియొత్తులును = తడిఁదుడుచుకొను వస్త్రములును, తేరన్ = తెచ్చుచుండఁగా, అంతఃపథంబునన్ = పెరటిత్రోవను, అరిగి = పోయి, ని...య ని-నిజగృహ = తమయింటి సంబంధియగు, ఆరామ = ఉద్యానమందలి, దీర్ఘికన్ = డిగ్గియయందు, అనుసంహిత = అనుసంధానము

సేయఁబడిన, ద్రావిడామ్నాయరై = ద్రావిడవేదముగలదియై, ('నమామ్యహం ద్రావిడ వేదసాగరమ్' అనియు, 'ద్రవిడోపనిషద్గాథాం పఠితస్య ద్విజస్యవై, యోవై పాదోదకం పాతి స పునాతి వసుంధరామ్' అని యున్నది గనుక ద్రవిడవేదానుసంధానముఁ జేసెఁ గనుట.) స్నానమాచరించి = తీర్థమాడి, ప...లు-పర్జనీలేశ = పసుపుపొడికి, పూర్ణ= మెండుకొన్న, సౌభాగ్య = సొబఁగుఁదనమును, ద = ఇచ్చునట్టి, అంగ = శరీరము యొక్క, ధూళి = పడఁకుటయొక్క, చకచకలు = చాకచక్యములు, ఈరెండతోడన్= బాలాతపముతోడ, మాఱుమలయన్ = ప్రతిఘటింపఁగా, ని...పు-నిడు = దీర్ఘములగు, వెండ్రుకలగుంపు = కేశములసమూహము, మలఁచివైచి = వెనుకకు వేసికొని, వేగన్= శీఘ్రముగా, వెడవెడన్ = అసమీచీనముగా, తడియొత్తి = ఒడలుదుడిచి, విధియు తముగన్=శాస్త్రవిధిప్రకారముగా నని ముందఱికన్వయము. 'లలాటే కేశవం ధ్యాయే' త్తని యూర్ధ్వపుండ్రప్రకరణమం దున్నది గనుక విధియుత మని ప్రయోగింపఁబడెను.

ఉ. కుందరదాగ్ర నెన్నొసలఁగుమ్మడిగింజతెఱంగు పాండుమృ
ద్బిందువుఁ దీర్చి చెందిరముఁ బేచకశీర్షముపైఁ బలె న్గటిం
జందురకావిజీ బమరఁగ జల్లని రేయిటి తట్టుపు న్గళు
ల్విందులఁదేల నూనెముడిఁ బెండ్రుకలం దడి తావు లీనఁగన్. ౧౦

టీ. కుందరదాగ్ర = మొల్లమొగ్గలవంటిదంతాగ్రములుగల యాయువతి, నెన్నొసలన్ = లలాటమందు, పాండుమృత్ = తిరుమణియొక్కయు, గుమ్మడిగింజతెఱఁగు = కూశ్మాండ బీజముయొక్కరీతిగా, బిందువుఁన్ = తిలకమును, తీర్చి = దిద్ది, చెందిరము= సిందూరము, పేచకశీర్షముపైఁబలెన్ = గజమస్తకముమీఁదవలె, 'పేచకః పేచకీ తథా' అని ద్విరూపకోశమందును, 'సామజః పేచకీశూర్ప శ్రుతిర్ద్వేదండ' అని యమరమునను. చందురకావిజీబు = చంద్రకావిజిల్గుచీర, కటిన్ = పిఱుందున, అమరన్ = ఒప్పఁగా, చల్లని = శీతలమగు, రేయిటి = రాత్రియలఁదిన, తట్టుపుగ్గు=సాంకవవిశేషము, అళుల్= తుమ్మెదలు, విందులఁదేలన్ = విందుభోజనములు సేయఁగా, నూనెముడి వెండ్రుకలన్= నూనె గలిగి ముడివేయఁబడిన కేశపాశమునందు, తడితావులీనఁగన్ = ఆర్ద్రపరిమళములు సృజింపఁగా అని ముందఱికన్వయము.

తా. ఆమె తిరుమణిని శ్రీచూర్ణమును బెట్టుకొని, చంద్రకావిచీర ధరించి యుండెను, రాత్రి శరీరమందు ధరించిన పుగ్గు వాసనలకుఁ దుమ్మెదలు గ్రమ్ముకొను చుండఁగా, మెఱుఁగురాచియున్న వెండ్రుకలు ముడియిడ నాఘెనుండి యొక వింత పరిమళము వచ్చుచుండెను.

తే. బోటి గట్టిన చెంగల్వపూవుబెత్తుఁ
దరు పరిణతోరుకదళిమంజరియుఁ గొనుచుఁ
బోయి గుడి నంబి విజనంబుఁ జేయఁ జొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్నె ముగ్గు వెట్టి. 91

టీ. బోటి = చెలికత్తె, క...త్తు-కట్టిన = కూర్చిన, చెంగల్వపూవుబెత్తుక్ =ఎఱ్ఱ కలువ పూవులదండయును, త...యుక్-తరు=వృక్షమనఁదే, పరిణత = లెస్సగాఁబండిన, ఊరు=పెద్దదైన,కదళి=అరఁటిపండ్లయొక్క, మంజరియుక్ = గెలయును,కొనుచుక్ = గ్రహించుచు, పోయి = చని, నంబి = అర్చకుఁడు, గుడిక్ = కోవెలను, విజనంబుఁజేయక్ = జనరహితమగునట్లు గావింపఁగా, చొచ్చి = అచ్చటఁ బ్రవేశించి మ్రొక్కి = స్వామికి దండము సమర్పించి, వేదికక్ = తిన్నెయందు, ప...గ్గుక్-పలువన్నె = పెక్కురంగులు గల, ముగ్గుక్ = రంగవల్లిని, పెట్టి = తీర్చి.

తే. కపిలగవి సర్పిఁ బృథు దీపకళికఁ దీర్చి
ద్వయముతో వక్షమునఁ గల్వదండ సేర్చి
యగరు ధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాలి నైవేద్య మిచ్చి. 92

టీ. కపిలగవి = కపిలధేనువుయొక్క, సర్పిక్ = నేతిచేత, పృథు = పెద్దయగు, దీపకళికక్ = దీపజ్వాలను, తీర్చి = వెలిఁగించి, ద్వయముతోక్ = ద్వయ మనియెడు మంత్రోచ్చారణముతోడ, వక్షమునక్ = స్వామివక్షస్థ్సలమందు, కల్వదండ = చెంగల్వ మాలికను, చేర్చి = సమర్పించి, అగరుధూపంబులిడి = అగరుచెక్క పొడితో ధూపములు వేసి, శ...లిక్-శర్కరా = చక్కెరతోడను, ఆజ్య = నేతితోడను, యుక్త = కూడి యున్న, హృద్య = మనోహరములగు, కదళీఫల = అరఁటిపండ్లయొక్క, ఆళిక్ =సమూహమును, నైవేద్యము = ఆరగింపను, ఇచ్చి = సమర్పించి.

క. ఖండిత పూగీ నాగర
ఖండంబులు ఘన శశాంకఖండంబులచే
*హిండితములు గావించి య
ఖండస్థిరభక్తి నొసఁగి కదళి చెలులతోన్. 93

టీ. ఖం...లు-ఖండిత = కత్తిరింపఁబడిన, పూగీ = పోకలయొక్కయు, నాగర= సొంటియొక్కయు, ఖండంబులు = తునుకలను, ఘ...చేక్-ఘన = గొప్పలగు, శశాంక ఖండంబులచేక్ = కర్పూరశకలములచేతను, 'ఘనసారశ్చంద్రసంజ్ఞః' అని నిఘంటువు.

---

* హిండిత మగు తాంబూలము.

హిండితములుగావించి = కలియఁగూర్చి, (హిండిత మగు తాంబూలము.) అఖండ = కొదవలేని, స్థిర = తిరమయిన, భక్తిన్ = భక్తిచేత, ఒసఁగి = స్వామికి సమర్పించి, కదలి = అచ్చటనుండి వెడలి, చెలులతోన్ = సఖులతోడ నని ముందఱి కన్వయము.

తే. చెలువ గర్భగృహ ప్రదక్షిణముఁ జేసి
వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణతీర్థముఁ గొని తత్ప్రసాదలబ్ధ
మయినమాల్యముఁ దాల్చి గేహమున కరుగు. 94

టీ. చెలువ = ఆసుందరి, గ...ముక్-గర్భగృహ = గర్భగృహమునకు, ప్రదక్షిణముఁ జేసి = వలగొని, వినతయై = నమ్రయై, మౌళిన్ = శిరమునందు, శఠకోపమును = శ్రీశఠకోపమును, ధరించి=వహించి, చరణతీర్థముక్=ఆస్వామివారి శ్రీపాదతీర్థమును, కొని = పుచ్చుకొని, త...ముక్-తత్ = ఆస్వామియొక్క ప్రసాద = ప్రసన్నత్వము చేత, లబ్ధమయిన = లభించిన, మాల్యముక్ = పూదండను, తాల్చి = ధరించి, గేహము నకున్ = తనయింటికి, అరుగున్ = పోవును.

క. ప్రతిదినము నిట్లు చని య
చ్యుతపూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుతధైర్య యగుచు నయ్యదు
పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచు నుండున్. 95

టీ. ప్రతిదినముక్ = అనుదినమందును, ఇట్లు = ఈరీతిగా, చని = పోయి, అచ్యుతపూజ = ఆస్వామిపూజనము, ఒనర్చి=చేసి, వచ్చి = మరల నింటికివచ్చి, సుదతి= ఆయమ, వియోగ = విరహముచేత, చ్యుత = జాఱిన, ధైర్యయగుచుక్ = ధైర్యము గలదియై, అయ్యదుపతి=ఆశ్రీకృష్ణునియొక్క, గుణములు = కల్యాణగుణములను, ద్రవిడ భాషక్ =ద్రావిడభాషయందు, పాడుచునుండుక్ = గానముచేయుచుండును. ఈయమ స్వయముగా తిరుప్పావై యను ద్రవిడప్రబంధము చేసి దానిని గానము చేసెను.

తే. మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి పెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్ట మాఁడు ననుచుఁ
దొలఁగె నన నుత్తరాశకుఁ దొలఁగెఁ దరణి. 96

టీ. మొదలక్ = ప్రథమమందు, ఆముక్తమాల్యద - ఆముక్త = ధరించివిడువఁ బడిన, మాల్య = పుష్పమాలికలను, ద = స్వామి కిచ్చిన చూడిక్కొడుత్త నాచ్చియా

రనియెడు నాయమ్మయొక్క, మదనతాప - మదన = మన్మథునిచేతనైన, తాప=విరహతాప మనియెడు, తరణి = సూర్యునియొక్క, పెనువెట్టన్ = అధికోష్ణముచేత, వేగిన = పరితపించిన, దక్షిణాశ = దక్షిణదిక్కు, మత్కృత = నాచేతఁజేయఁబడిన, ఊష్మకున్ = వేఁడిమికి, తుదముట్టన్ = పరిసమాప్తమగునట్లు, మాఁడు నరుచున్ = మాఁడిపోవునని, తొలఁగెనన్ = తొలఁగెనో యనునట్లు, తరణి=సూర్యుఁడు, ఉత్తరాశకున్ = ఉత్తర దిక్కునకు, తొలఁగెన్ = సంచలించెను, ఉత్తరాయణగతుఁ డాయెను.

తా. ఇప్పుడె చూడికొ్టడుత్తనాచ్చియారుయొక్క విరహతాప మనెడు సూర్యదీప్తిచేత నీదక్షిణదిక్కు వేఁగుచున్నది; దీనిపై నేను వేఁడిమిఁ జేసితినేని యీదిక్కు మాఁడి పోవు నని తలంచి సూర్యుఁ డాదిక్కునుండి తొలంగెనో యనున ట్లుత్తరాయణ ప్రవేశమాయెను. ఆచూడికొ్టడుత్తనాచ్చియారు ధనుర్మాసమం దీవ్రతము బూని ముప్పది దినములు ముప్పది పాటలుగాఁ దిరుప్పావై పాడె ననియును, బిమ్మట మకరసంక్రమణము ప్రవేశించె ననియును భావము. రూపకోత్థాపితహేతూత్ప్రేక్షాలంకారము.

చ. తెలియఁగ వచ్చె నట్టితఱిఁ దిగ్మకరుండు ధనాధిపాశకై
తొలఁగినకారణం బలివ దుర్వహ దీర్ఘవియోగవహ్ని పె
ల్లలమిన తద్దిశం దగిలినట్టి తనూష్మ ఘనీభవన్మహా
జలమయశంకరశ్వశురశైలముఁ గోనల చల్వఁ దీర్పఁగన్. 97

టీ. అట్టితఱిన్ = ఆసమయమందు, తిగ్మకరుండు = తీక్ష్ణకిరణుండగు సూర్యుఁడు, ధనాధిపాశకై = కుబేరదిక్కునకై, తొలఁగిన కారణంబు = తొలఁగిచనినహేతువు, అ...హ్ని - అలివ = ఆచూడికొ్టడుత్తనాచ్చియారుయొక్క, దుర్వహ=వహింపఁగూడని, దీర్ఘ = పొడువగు, వియోగవహ్ని = విరహాగ్ని, పెల్లు = అధికముగా, అ...శన్ - అలమిన=వ్యాపించినట్టి, తద్దిశన్ = ఆదక్షిణదిశయందు, త...ష్మన్ - తగిలినట్టి = తనకు నంటినట్టి, తనూష్మన్ = శరీరతాపమును, ఘ...ల్వన్ - ఘనీభవత్ = కరుడుగట్టిన, మహాజలమయ = మహోదకవికారమగు, శంకర = ఈశ్వరునకు, శ్వశుర = మామయగు, శైలము = హిమవత్పర్వతముయొక్క, కోనల=చరులయందలి, చల్వన్ = శైత్యముచేత, తీర్పఁగన్ = పోఁగొట్టుకొనుట కని, తెలియఁగవచ్చెన్ = ఎఱుకపడవచ్చెను.

తా. సూర్యుఁడు దక్షిణదిక్కునుండి యుత్తరదిక్కునకుఁ జనుటకుఁ గారణ మనఁగా, దక్షిణ దిశయందుఁ జూడికొ్టడుత్తనాచ్చియారుండెఁ గాన ఘాదికెక్కల్లు వ్యాపింపఁగా సూర్యుఁ డచ్చట నుండఁగా

వలన హిమవత్పర్వతము చఱియలలోని శైత్యముచేత నాకాఁక నడంచుకొనుటకై యా యుత్తర దిశకుఁ బోయెను. కావ్యలింగానుప్రాణితఫలోత్ప్రేక్షాలంకారము.

తే. కినిసి వలఱేఁడు దండెత్తఁ ◊ గేతు వగుట
మీన మిలఁ దోఁచు టుచితంబ ◊ మేష మేమి
పని యనఁగనేల ? విరహాఖ్యఁ ◊ బాంథయువతి
దాహమునకగ్గి రాఁగఁ ద◊త్తడియు రాదె ? 98

టీ. కినిసి = కోపించి, వలఱేఁడు = మన్మథుఁడు, దండెత్తక్ = విరహులమీఁద దండెత్తిరాఁగా, కేతువగుటక్ = టెక్కెమౌటచేత, మీనము = మత్స్యము, (మీనసంక్రాంతి యనుట.), 'ప్రద్యుమ్నో మీనకేతనః' అని యమరము. ఇలక్ = భూమియందు, తోఁచుట = కనఁబడుట, ఉచితంబ = తగినదియే, మేషము = మేఁక, (మేషసంక్రాంతి యనుట.), ఏమిపనియనఁగ నేల=ఏమిపనికివచ్చెననుటయేల, విరహాఖ్యక్ = విరహమనెడు పేరిచేత, పాం...కుక్ - పాంథ = వియోగవతులగు, యువతి = ఉవిదలయొక్క, దాహమునకుక్ = దహించుటకై, అగ్గి = అగ్ని, రాఁగక్=వచ్చుచుండఁగా, తత్తడియుక్ = వాహనమును, రాదె = రాదా. (వచ్చును.)

తా. మన్మథునకు మీనము టెక్కెము గావున నతఁడు దండెత్త వచ్చునప్పుడది కనఁబడుట సరియే గాని, మేష మేల వచ్చె ననఁగా నగ్ని మేషవాహనుఁడుగావున నతఁడు విరహ మను నామముచేత వియోగినులను దహించుటకై రాఁగా నతని వాహనముకూడవచ్చెను, మీన సంక్రాంతి వచ్చి యానెల గడచి మేషసంక్రాంతి వచ్చెను. శ్లేషచేత మీనమేషములకు సంతాపకరత్వము చెప్పినాఁడు గనుక నలంకారముచేత వస్తుధ్వని.

చ. ప్రియ పరిరంభణ ద్రఢిమ ◊ పెల్లిఁకఁ జైత్రుఁడు వచ్చి చేయఁగా
వ్యయ మని సీతునంద చెలువ ◊ ల్బెదవు ల్దడుపంగ వచ్చెఁ దా
రయమునఁ బేర్చి యా ఋతువు ◊ రాఁ జలి విచ్చి తొలంగి రయ్యవ
స్థయుచితమే కదా విపది ? ◊ ధైర్య మనం జనుమాట యింతకున్. 99

టీ. ప్రి...ల్లు-ప్రియ = ప్రియులయొక్క, పరిరంభణ = ఆలింగనములయొక్క, ద్రఢిమ = దార్ఢ్యముయొక్క, పెల్లు = ఆధిక్యమును, ఇఁకక్ = భవిష్యత్కాలమందు, చైత్రుఁడు = మధుమాసము, వచ్చి = ఆసన్నుఁడై, వ్యయముసేయఁగా = నాశము సేయునుగదా, అని = అనుకొని, సీతునంద = చలికాలమందే, చెలువల్ = సుందరులు, పెదవుల్దడుపంగక్ = భయముచేతఁ బెదవులుఁ దడుపుకొనుచుండఁగా (చలి

చేతఁ బగిలిన పెదవులను నాలుకలచేఁ దడుపుదురు గనుక దానిని భయానుభావము గాఁ జెప్పినాఁడు), ఆ ఋతువు=ఆవసంతర్తువు, తాన్ = తాను, రయమునన్ = వేగము చేతను, పేర్చి=అతిశయించి, వచ్చెన్=ప్రవేశించెను, రాన్ = అట్లురాఁగా, చలివిచ్చి = చలిదీఱి, (భయములేకయనుటయును, వసంతర్తువురాఁగానే చలిపోయెననుట), అయ్యవస్థ = అట్లు భయపడి పెదవులుదడుపుటయును, చలిచేతఁదడుపుచుండుటయును, తొలంగిరి=విడిచిరి. ఇంతకున్=ఇంతపనికిని, విపది ధైర్యమనంజనున్ = ఆపదయందు ధైర్యముండవలయు ననఁగా నొప్పుచున్న, మాట = వాక్యము, 'విపది ధైర్య మథాభ్యుదయే క్షమా' అను వాక్యమనుట, ఉచితమేకదా = తగినదేకదా.

తా. స్త్రీలందఱు తమ ప్రియుల బిగి కౌఁగిలింత లింకఁ జైత్రుఁడు వచ్చి యిప్పటివలె నుండనీక నశింపఁజేయు నని చలికాలమందే భయపడి పెదవులు దడిపి కొను చుండఁగా నతఁడు రానే వచ్చెను; అట్లు రాఁగా వారు చలిదీఱి యా యవస్థ విడిచిరి, విపది ధైర్య మనుమాట యీపని కుచితమే కదా! చలికాలములో వలెఁ జైత్రమాసములో గాఢాలింగనము లుండ వనియును, జలిచేతఁ బెదవులు పగులఁగా నాలుక కొనలచేఁ దడుపుకొందు రనియును, వసంతర్తువు రాఁగానే చలి తగ్గెననియును,వారా పెదవులు దడుపుట మాని రనియును భావము. హేతూత్ప్రేక్ష, శ్లేషాలంకారములు.

ఉ. సృష్ట బహువ్రణం బయిన శీతున కల్కి నిజోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁ గొన్న దిమ్మధు విశీయన కింతులుమోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్న యొచ్చె మఱఁ జేసిన వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొనర్చిరి వసంతున కూఱట దోహదంబులన్. 100

టీ. ని...మున్-నిజోష్ఠపల్లవ-నిజ = తమయొక్క, ఓష్ఠపల్లవ = మోవిచిగురుల యొక్క, ఉచ్ఛిష్టమున్ = ఎంగిలిని, కొన్నది = గ్రహించినది, ఇమ్మధువు = ఈతేనియ, ఇసీయనక = ఛీయనక, ఇంతులు = స్త్రీలు, సృ...బు-సృష్ట = సృజింపబడిన, బహువ్రణంబు = పలుగాయములుగలది, ఐన, శీతునకున్ = చలికాలమునకు, అల్కి = వెఱచి, మోవిన్ = అధరోష్ఠమునందు, తన్మధూచ్ఛిష్టమున్-తత్ = తమచేతనిరసింపఁబడినట్టి, మధూచ్ఛిష్టమున్ = తేనియకెంగిలియైనమయినమును, 'మధూచ్ఛిష్టంతు సిక్థకమ్' అని యమరము. కొన్న=గ్రహించిన, ఒచ్చెము = లోపమును, అఱఁజేసినన్ = పోవునట్లొన ర్పఁగా, వారు = ఆస్త్రీలు, కృతంబెఱింగి = ఉపకారమెఱిఁగి, వసంతునకున్ = మధుమాసమునకు, దోహదంబులన్ = దశవిధదోహదములచేత,' తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం, పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తు తత్క్రియా' యని దోహదప్రకారము. ఊఱటన్ = విశ్రాంతిని, విస్పష్టముగాన్ = ప్రకట మగునట్లు, ఒనర్చిరి = చేసిరి.

తా. స్త్రీలు మున్ను తేనియద్రావునెడ నది యోష్ఠపల్లవములయందలి మాధుర్యమును ఋచ్చుకొన్నదిగానఁ దమయెంగిలి తిన్న దని తెలిసియు దానికి రోఁతపడక చలికి వెఱచి తమ పెదవులయం దున్నట్టి తేనియ కెంగిలి యగు మయినమును జలిపుండ్ల కడ్డముగాఁ బెట్టుకొనియుండిరి. వసంతర్తువు రాఁగానే చలి పోయెను గావున, వారలామయినము వదలునట్లు, అనఁగా తమ నా చిన్నతనము నీ వసంతుఁడు పోఁగొట్టె నని యుపకారస్మృతి గలిగి, యందులకుఁ బ్రత్యుపకారముగా వసంతుని కార్య మగు పుష్పింపఁజేయుటను దామే దోహదములచేతఁ గనఁబఱచి యతనికి నూఱట గలుగఁజేసిరి. పరివృత్త్యలంకారము.

మ. మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుం గమ్మ లేగాడ్పుఁ దే
రున నేతెంచు లతాంతబాణునకు సూర్యుండు న్మహిం గ్రొత్తగా
ననుకూలించెఁ జలంబున న్విరహిణీప్రాణాపహారంబు సే
యన యూహించు విధాత కృత్య మది యేలామానునెప్పట్టునన్.

టీ. మునుపే=పూర్వమే, చంద్రబలంబుగల్గి=గ్రహచార రీతిచేతఁ జంద్రబలంబు గల్గి, (మన్మథునికిఁ జంద్రుఁడు స్నేహితుఁ డనుట), మ...నన్ - మలయంపు = మలయపర్వతసంబంధియైనట్టియు, కమ్మ = పరిమళించునట్టి, లేగాడ్పు = మందమారుతమనియెడు, తేరునన్=రథమందు, ఏ...కున్-ఏతెంచు = వచ్చునట్టి, లతాంతబాణునకున్= పుష్పాస్త్రుఁడగు మన్మథునికి, సూర్యుండున్ = సూర్యుఁడును, మహిన్ = భూమియందు, క్రొత్తఁగా = నూతనముగా, అనుకూలించెన్ = చాలివచ్చెను. (సూర్యుఁడు మేషమునఁ బ్రవేశించి వసంతర్తువును లేఁగా నది మన్మథునకు సాహాయ్యమయ్యెననియును, చంద్రసూర్యు లనుకూలించి రనుటవలనను, మహిననుటవలనను, గాల దేశములు మన్మథునికి మేలిమిపై యుండెననియును భావము.) చలంబునన్ = దీర్ఘక్రోధముచేత, విరహిణీప్రాణాపహారంబు - విరహిణీ = పాంథస్త్రీలయొక్క, ప్రాణ = ప్రాణములయొక్క, అపహారంబు = అపహారణమును, చేయన = చేయుటకే, (అవధారణము), ఊహి...ము- ఊహించు = సంకల్పించెడు, విధాత = బ్రహ్మయొక్క, కృత్యము = కార్యము, అది= అట్టిది, ఎప్పట్టునన్ = ఎచ్చోటనైన, ఏలామానున్ = ఏమిటికి విరమించును, కొనసాగు ననుట. అర్థాంతరన్యాసాలంకారము.

క. మలయకటకోటజస్థిత
కలశీసుత సేవ నిట్లు గనెనో తదాశా
నిలుఁ డనఁగ నలసవృత్తిన
మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిన్. 102

టీ. మ...వన్-మలయ = మలయపర్వతముయొక్క, కటక = చఱియయందలి, 'కటకం వలయే సానౌ రాజధానీ నితంబయోః' అని నిఘంటువు. ఉటజ=పర్ణశాలయందు, స్థిత = ఉండిన, కలశీసుత = కలశసంభవుఁ డగు నగస్త్యమహామునియొక్క, సేవన్ = శుశ్రూషచేత, తదాశానిలుఁడు-తత్ = ఆదక్షిణపుదియగు, ఆశా = దిశయందలి, అనిలుఁడు = వాయువు, ఇట్లు = ఈవక్ష్యమాణక్రమముగా, కనెనో యనఁగన్=పొందెనో యనునట్లు, అలసవృత్తిన - అలస = ప్రాలుమాలిన, వృత్తిన = వర్తనముచేతనే, మెలఁగుచున్ = సంచరించుచు, మిహికాజలధిన్-మిహికా = మంచనియెడు, 'ప్రాలేయం మిహికాచసా' అని యమరము. జలధిన్ = సముద్రమును, ఆపోశనించెన్=ఆపోశనము చేసెను.

తా. సముద్రపానముచేసియున్న యగస్త్యుఁడు నివసించెను దక్షిణదిశయందే మలయమారుత ముండును గావున, నాయనయొద్ద శుశ్రూషచేసి తానును దనగురువు వలెనే మంచనియెడు కడలిని ద్రావె ననియును 'మీానే శీతనివారణ' మ్మని యున్నది గావునఁ జైత్రమాసమందు మంచు ఇనికిపోవుటచే, మంద మారుతము వీచెను.

క. మలయతరు న్యాయము యిలఁ
గలతరువుల కెల్లఁ జేయఁ గాఁ బొలసెఁ జుమీా
యలరించు నెపంబునఁ బరి
మళితములుగ ననఁగ నచటి మారుత మొలసెన్. 103

టీ. మ...మ - మలయతరు = మలయపర్వతమందలి చందనవృక్షములయొక్క, న్యాయము = న్యాయమే, (పరిమళగుణమే యనుట), ఇలన్ = భూమియందు, కల తరువుల కెల్లన్ = ఉన్న సమస్తవృక్షములకును, చేయఁగాన్ = చేయుటకై, అలరించు నెపంబునన్ = పుష్పించెడువ్యాజముచేత, పరిమళితములుగన్ = సంజాత పరిమళము లగునట్లు, పొలసెఁజుమీా = వీచెనుజుమీా, అనఁగన్ = అనునట్లు, అచటిమారుతము = ఆమలయపర్వతమందలి వాయువు, ఒలసెన్ = పొలసెను.

తా. మలయ పర్వతమందలి చందనవృక్షములకుఁ గల పరిమళగుణమే భూమి యందలి యెల్ల చెట్లకుఁ గలుగఁ జేసెడు నిమిత్తము వానిఁ బుష్పింప జేసెడువ్యాజము చేతఁ బరిమళము గలిగె ననిపించి సంచరించెనో యనునట్లు, మలయ మారుతము వీచెను. ఎల్ల తరువులు లెస్సగా పుష్పించి పరిమళించుచుండెను.

ఉ. కుప్పసము ల్వదల్చి రిఱిక్రిగుబ్బల నొత్తిలి హత్తి వేగుఁజా
మిప్పలలర్చు గాడ్పుల కళిధిశఁ గ్రమంబున ఘర్మ శంకమై

నుప్పతిలంగ దోమతెరల్ లుప్పర మెత్తిరి దక్కి యూష్మముల్
దెప్పరమైన లోహాశకకోటి ప్రకటీకరణంబుఁ గామినుల్. 104

టీ. కామినుల్ = వలపుగలయింతులు, కుప్పసములు = కూర్పాసములను, (అవికల ననుట), పదల్చిరి = సడలించిరి, ఇఱిగుబ్బలన్ = క్రిక్కిఱిసిన గొప్పచన్నులచేత, (వలిగుబ్బల నను పాఠమున శీతలస్తనములచేత ననియర్థము. 'కూపోదకం వటచ్ఛాయా తాంబూలం స్తనమండలం, శీతకాలే భవేదుష్ణముష్ణకాలేతు శీతల' మ్మని యున్నది. అధీశున్ = తమప్రియుని, ఒత్తిలి = ఒత్తిగిలి, హత్తి = ఆలింగనము చేసికొని, క్రమంబునన్ = కొంతసేపునకు, మైన్ = శరీరమందు, ఘర్మశంక = చెమ్మటపోసె ననుసందియము, ఉప్పతిలంగన్ = ఉత్పత్తికాఁగా, వేగుజాము = వేకువజామునందు, ఇప్పలలర్చు=ఇప్పచెట్టుఁ బుష్పింపఁజేసెడు, గాడ్పులకున్ = వాయువులకుఁగా, దోమతెరలు= మశకబాధానివృత్త్యర్థముగా వేసియున్న తెరబట్టలను, ఉప్పరమెత్తిరి = పైకెగయవేసిరి, ఊష్మముల్=కాఁకలు, దెప్పరమైనన్=అతిశయముకాఁగా, లో...బున్-లోహాశకటీ= ఇనుపకుంపట్లయొక్క, ప్రకటీకరణాంబున్ = బయల్పఱచుటను, తక్కిరి = మానివేసిరి.

తా. కామినులు చలికాలమందువలె అవికలు దొడుగక యవి సడల్చి తామొత్తిగిలి నాథులఁ గౌఁగిలించుకొని తమ క్రిక్కిఱిసిన గుబ్బలు వారి ఱొమ్ములు దాఁకున ట్లునిచికొని కొంతసేపునకు శరీరమందుఁ జెమట పోసె నని సంశయించి ప్రభాతసమయమందు నిప్పపూల విప్పఁ జేసెడు వాయువులు మెల్లన వీచుచుండఁగా మంచముల దోమతెరలు పైకెగయ నెత్తిరి గాని, తొల్లింటి యట్లు యినుపకుంపటులు గదలింపరైరి. స్వభావోక్త్యలంకారము.

మ. అరుణాంశుండు హిమర్తువన్ రజని డీనై క్రుంకి పుష్పర్తువా
సర కల్యోదితుఁ డౌచు మున్న యిడుటన్ వ్యామాకుచాలేపసం
కరసాంద్రాగ్నిశిఖారుణప్రభఁ గొనెన్ గాకున్నఁ గాలజ్ఞప
త్త్రిరుతం బెట్లు చెలంగు మానకుపితస్త్రీ కర్ణ దంభోళియై. 105

టీ. అరుణాంశుండు = అరుణకిరణుండగు సూర్యుఁడు, హి...నిన్-హిమర్తువన్= హేమంతఋతు వనియెడు, రజనిన్ = రాత్రియందు, డీనై = దుర్బలుఁడై, క్రుంకి = అస్తమించి, శ్లో. 'ఉపచితేషు పరేష్వసమర్థతాం వ్రజతి కాలవశా ద్బలవానపి, తపసి మందగభస్తి రభీశుమా న్నహి మహాహి మహానికరోభవేత్.' అన్నట్లు హేమంతర్తువునందు సూర్యుఁడు బలహీనుం డనియును రాత్రియందు బలహీనుండై యస్తమించి యనియును భావము). పు...డు-పుష్పర్తు=వసంతర్తువనెడి, వాసర = దినముయొక్క, కల్య = ప్రాతఃకాలమందు, 'ప్రత్యూషోహర్ముఖం కల్యమ్' అని యమరము. ఉదితుఁడౌచున్ =

ఉదయించుచు, మున్నయిడుటన్ = మునుపు నిలచియుండుటచేత, శ్యా...భన్ - శ్యామా = చామలయొక్క, కుచ = గుబ్బలయందలి, ఆలేప = కలపముతోడను, సంకర= కూడియున్న, సాంద్ర=దట్టమగు, అగ్నిశిఖ = కుంకుమపువ్వనెడి యగ్నిజ్వాలయందలి, అరుణప్రభన్ = ఎఱ్ఱనగుతనకాంతిని, కొనెన్ = మరల గ్రహించెను. 'కామినీ స్తనభర గిరిదుర్గసీమ్ని నిర్భయ నిలీన నిదాఘ భార' అన్నట్లు స్త్రీల కుచములయందుఁ జలికాలమున నగ్ని దాఁగుట ప్రసిద్ధము. సూర్యుఁ డస్తమించునప్పుడు దన తేజ మగ్నిలోఁ నునుచుట 'దినాంతే నిహితం తేజ స్సవిత్రేవ హుతాశన' అన్నట్లు ప్రసిద్ధము. మఱియు 'కుంకుమేగ్నిశిఖం మతమ్' అను నిఘంటువుచేత నగ్నిశిఖ యను నామముగల కుంకుమ పువ్వు స్త్రీలు కుచములయందు హేమంత సమయమం దలఁదికొని యుండిరి గనుక నాకుంకుమపువ్వునందలి యరుణకాంతి యనుట. హిమర్తువను రాత్రి చని, వసంతర్తువను మఱునాఁటి ప్రభాతము వచ్చె ననుట. కాకున్నన్ = అట్లురాకున్న. కా...ఖ- కాలజ్ఞపత్త్రి = కుక్కుటములయొక్క, రుతంబు = నాదము, మా...శి-మానకుపితస్త్రీ= నాథునితప్పునఁ గోపించియున్న స్త్రీలయొక్క, కర్ణ = చెవులకు, దంభోళి ఐ=వజ్రాయుధమువలెఁ గఠోరమై, ఎట్లు చెలంగున్ = ఏభంగి విజృంభించును? కాలజ్ఞపత్త్రి యనఁగా 'కాలం వసంత కాలం కానాతి వేత్తీతి కాలజ్ఞ' అను వ్యుత్పత్తిచేతఁ గోకిలము 'కాలజ్ఞా పికకుక్కుటౌ' అని శాశ్వత నిఘంటువున నున్నది గనుక 'వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః' అని యన్నట్లు, కోయిలలు గూసె ననుటయుఁ, జెల్లవాఱు జామునఁ గోడికూసినఁ బొలయలుకఁ బూనియున్న పొలఁతులకు భయ మగు ననుటయును. వసంతర్తువునందుఁ గోయిల కూయఁగానే మానకుపితురాలగు స్త్రీకి విరహము గలుగు ననుటయు ప్రసిద్ధములు.

తా. సూర్యుఁడు చలికాలము వదలి వసంతకాలమందు లెస్స ప్రకాశించెను. కావున, నాహేమంతర్తు వతనికి రాత్రిప్రాయమై యుండెను; అప్పు డతని కరుణ కాంతి హిమప్రచ్ఛన్నమై యుండును; వసంతర్తువు ప్రాతఃకాలము వలె నుండును; అప్పుడు స్త్రీలు స్తనములయందుఁ గుంకుమ పువ్వులఁదుకొనుట మానిరి గావున నది సూర్యసంబంధి యగు నరుణాకాంతియై యుండి యాస్త్రీల స్తనములయందలి యగ్నికి నొప్పగింపఁబడి మరల గ్రహియింపఁబడిన ట్లుండెను. ఆ వసంతర్తువు సూర్యోదయకాలము గానిపట్ల కాలజ్ఞములగు కోయిలలయొక్కయుఁ, గోళ్లయొక్కయుః గూఁత లేల వినవచ్చును? అవి విని మానకుపితలగు యువతులు భయంపడుటకుఁ గతంబేమి? అనుమానానుప్రాణిత రూపకాలంకారము.

తే. మృగదాలేపమును మాని శరగరుకలనఁ
జన్నుఁగవ మీఁది కొప్పిరి కబ్బన్నసరము

లొంటి కురువేరు పోఁచకుఁ గంటగింప
రైరి తుఱిమెడు సరపుష్పాలం దతివలు. 106

టీ. అతివలు = స్త్రీలు, మృగమదాలేపమును = కస్తూరి యలఁదుకొనుటను, అగరు కలనన్ = అగరుగంధ మలందుకొనుట, మానిరి = విసర్జించిరి, చన్నుఁగవమీఁదికిన్ = కుచద్వయోపరిభాగమునకు, బన్నసరములు = ముత్యాలహారములు, ఒప్పిరి = సమ్మతించిరి, తుఱిమెడు = తమకురులయందుఁ జెక్కెడు, సరపుష్పాలందున్ = దండలుగట్టిన పుష్పములయందు, ఒంటికురువేరు పోఁచకున్ = ఒక్కఁడైనలామజ్జకలేశమునకు, కంటగింపరైరి = ఏవగింపరైరి. ఏవగింపక ధరించి రనుట. ఇవి యన్నియు సమశీతోష్ణము లగు నుపచారములు. స్వభావోక్త్యలంకారము.

చ. చిలువసుధారసాధరల చెల్వపుఁబుక్కిటితావిఁ దీయనై
వలపులనందు తత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొట్టనై
వెలువడి తద్గుణద్వితయ వేధఁ జుమీ యన ప్రానుపట్టుటల్
తలిరులు పుట్టుటల్ గలుగఁ దారొకనెఁ జందనశైలవాతముల్.

టీ. చందనశైలవాతముల్ = మలయమారుతములు, చి...విన్ - చిలువసుధారసాధరల = అమృతరసమువంటి యధరోష్ఠములుగల నాగకన్యలయొక్క, చెల్వపు = సుందరమగు, పుక్కిటితావిన్ = పుక్కిళ్లపరిమళముచేత, తీయనై = మధురమై, వ... ష్మన్ - వలపులనందు = ప్రేమవశ్యులయిన, తత్ప్రియుల = ఆయాఁడుబాములమగలగు మగపాములయొక్క, వక్త్రవిష = పుక్కిళ్లవిషమనియెడు, జ్వలన = అగ్నియొక్క, ఊష్మన్ = వేఁడిమిచేత, ఒట్టనై = తీక్ష్ణమై, వెలువడి = బయలుదేఱి, తత్ =ఆ, గుణ= మాధుర్యతీక్ష్ణత్వగుణములయొక్క, ద్వితయ = ద్వంద్వమువలన నయిన, వేధన్ =వేధచేత, చుమీ = చుమా, అనన్ =అనఁగా, ప్రానుపట్టుటల్ = ఆ వాయువులుసోఁకుటవలన శరీరములు నిశ్చేష్టితములగుటయు, ఆకులురాలి ప్రాఁకులుమాత్ర మగపడుచుండుటయు, (ఇది విషాగ్నిగుణము), తలిరులుపుట్టుటల్ = చెట్లయందుఁ జిగుళ్లుదయించుటయును, (ఇది యధర మాధుర్య గుణము), కలుగన్ =కలుగునట్లుగా, తారొకనెన్ = విసరెను.

తా. మలయమారుతము వచ్చునప్పు డాఁడుఁబాములు మగపాము లాపర్వతము మీఁద నీ వాయువును భక్షించుటచేత రెండు గుణములు గలిగి యాఁడుఁబాముల పానముచేతఁ జిగుళ్లుపుట్టుటయును మగపాముల పానముచేత ప్రానువ్వట్టుటయును గలుగును. (ఈ పద్యమునందు వ్యుత్క్రమము దోషావహంబుగాదు. 'ఊర్ధ్వపుండ్రం వామభ్యేచ్ఛిద్రంతు ధారయేత్, శృణు షణ్ముఖ తన్మధ్యే ఉమయాహం శ్రియా హరిః,' అనియున్నది.

మ. మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం జ్రీ బాటీర భూభృద్వల
న్మృదువాతం బతిపక్వ పాదప లతా వృంతావళీ మూలరం
ధ్రదళత్పంకజకర్ణికాగణహరిద్రాభంగ భా భాసుర
చ్ఛదన చ్ఛద్మవివర్తికాంచన కనచ్చక్రచ్ఛటాఛీత్కృతిన్. 108

టీ. పా...బు - పాటీరభూభృత్ = మలయపర్వతమందు, వలత్ = సుడియుచున్న, మృదువాతంబు = మందమారుతము, అ...తిక్ - అతిపక్వ = మిగులఁబండిన, పాదప = వృక్షములయొక్కయు, లతా = తీఁగెలయొక్కయు, వృంత=పూఁదొడిమల యొక్క, 'వృంతం ప్రసవబంధనే' మ్మని యమరము. ఆవళీ=పఙ్క్తులయొక్క, మూలరంధ్ర= మొదళ్లగండ్లనుండి, దళత్ = విరియఁబడుచున్న, పంకజకర్ణికా = తామరమిద్దెల యొక్క, గణ=సమూహముయొక్కయు, హరిద్రాభంగ = పసుపుఁజిందఱలయొక్కయు, భా = కాంతివంటికాంతిచేత, భాసుర = ప్రకాశించుచున్న, ఛదన = ఆకులనియెడు, ఛద్మ=వ్యాజముచేత, వివర్తి = గిఱగిఱగిఱతిరొనుచున్న, కాంచన = బంగారుచేత, కనత్ = ప్రకాశించుచున్న, చక్ర = బండికండ్లయొక్క, ఛటా = గుంపుయొక్క, ఛీత్కృతిక్ = ఛీత్కారముచేత, మ... త్తిక్ -మదన = మన్మథునికి, స్యందనతా = రథమగుటయందు, స్వవృత్తిక్ = తనవ్యాపారమును, తెలిపెక్ = ఎఱుకపఱిచెను.

తా. చెట్లమీఁదనుండియుఁ దీఁగెలమీఁదనుండియుఁ బండుటాకులు దొడిమ లూడి తామర మిద్దెలవలెను బసుపు జిందఱలవలెను బచ్చనై కొంచెము ధ్వనితో గిఱగిఱఁ దిరుగు చుండెను. అవి యట్లగుట వాయువు మన్మథునికి రథమగుటకు గుఱుతుగా నాబండి బంగారు చక్రములు దిరుగుచున్నవో యన్నట్లుండెను. 'మందానిలస్యందనకి' అని దక్షిణ వాయువునకు మన్మథరథత్వము ప్రసిద్ధము. కైతవాపహ్నవాలంకారము.

వ. తదనంతరంబ. 109

సీ. త్వష్టా వశా రక్త రాంశకవ మరణ్యానిమ
ధూదితారుణిమవల్లుర్వరగరసని
కోద్గతి తరుగరుత్మద్గరు ద్గణ ముద్ధ్భ
దాహార్య్యజీమూతరోహితంబు
నవ మిళిందప్రవాహశ్రేణికనిమంత్రణ శోభ
నాతత ప్రతతివాహేయస విభక్త
పరభృతౌఘప్రాప్త పత్త్రిక మాలతీ
త్రాసామయావహార్ధ్రితితజము

తే. ప్రమదవన వనదేవతాసముదయాంగ
రాగ మినజ హరిజగత్ప్రాణ శాణ
కషణదళితదళాంతసంక్రాంత కాంతి
ఘనమణిశలాకచిగురాకుఁగలయ మొలిచె. 110

టీ. క్ష్మా...ము-క్ష్మా=భూమి యనెడు, వశా=ఆఁడేనుఁగునకు, 'కరణీ ధేనుకా వశా' అని యమరము. రక్త = ఎఱ్ఱనగు, రాంకవము=బూర్నీసును, 'రాంకవం మృగరోమజమ్' అని యమరము. అరణ్యాని = మహారణ్యమునకు, 'మహారణ్యమరణ్యానీ' అని యమరము. మధు = వసంతర్తువనుమద్యముచేత, ఉదిత = పుట్టినట్టి, అరుణిమ - ఎఱుపును, వల్మీ రగ = తీఁగెలనియెడు పాములయొక్క, రసనికా = నాలుకయొక్క, ఉద్గతి = బయలు వెడలుటయును, తరు...ము-తరు=వృక్షములనియెడు, గరుత్మత్ = గరుత్మంతులయొక్క, గరుత్ = ఱెక్కలయొక్క, గణము = సమూహంబును, ఉ...బు - ఉద్భిత్ = పొద లనియెడు, అహార్య జీమూత = కల్పితమేఘములకు, రోహితంబు = కొరడును, 'ఇంద్రాయుధం శక్రధను స్తదేవ ఋజురోహితమ్' అని యమరము. న...లి-నవ = నూతనమగు, మిళింద=తుమ్మెదలనియెడు, ప్రాహుణిక = అతిథులయొక్క, ప్రతతి=సమూహంబును, వా...క-వాయస = కాకులతోడ, విభక్త = వేఱుపడిన, పరభృత = కోయిలలయొక్క, ఓఘ=గుంపుచేత, ప్రాప్త = పొందఁబడిన, పత్త్రిక = విభాగపరిష్కార పత్త్రికయును, (వసంతఋతువు రాఁగానే కాకులతోఁ గోకిలలు వేఱుపడుట ప్రసిద్ధము), మా...ము-మాలతీ = జాజిచెట్టునకు, త్రాస = భయమనెడు, ఆమయ = రోగమును, ఆవహ = కలుగఁజేయునట్టి, ఆర్ద్రక్షతజము=పచ్చిరక్తంబును, ప్ర...ము-ప్రమదవన = క్రీడోద్యానములయందలి, వనదేవతా = వనదేవతలయొక్క, సముదయ = సమూహముయొక్క, అంగరాగము = కుంకుమంపుమైపూఁతయును, ఇనజ = సూర్య పుత్త్రిఁ డగుయమునియొక్క, 'ఇనసూన్వర్యే ప్రభావపి' అని నిఘంటువు. హరిత్ = దిక్కగుదక్షిణసంబంధియగు, జగత్ప్రాణ=వాయు వనియెడు, శాణ=సానతోడి, కషణ = ఒఱపిడిచేత, దళిత= రాల్పఁబడిన, దళ = ఆకుల నెడుపొరలయొక్క, అంత = నాశముచేత, 'అంతో నాశో ద్వయోర్మృత్యు' అని యమరము. సంక్రాంత = నెరసినట్టి, కాంతి = దీప్తిగల, ఘన = గొప్పయగు, మణిశలాక = రత్నపుకణికయునగు, చిగురాకు = పల్లవములు, (జాత్యేకవచనము), కలయన్ = అంతటను, మొలిచెన్ = మొనసూపెను.

తా. భూమి యనియెడు నాఁడేనుంగుపైఁ గప్పిన యెఱ్ఱబూర్నీసువలెను, మహారణ్యమునకు వసంతఋతు వను మద్యముచేతఁ దోఁచిన రక్తకాంతివలెను, తీఁగె లనియెడు పాములు దమ నాలుకలు వెడల నిడెనో యనునట్లును, వృక్షము లనియెడు

గరుడ పక్షుల రెక్కలో యనునట్లును, పాద లనియెడు కల్పిత మేఘములకు గొరడు లను పగిదిని, తుమ్మెద లను నభ్యాగతులనుఁ బ్రోత్తగఁ బిలుచుటకై యునిచిన శోభనాక్షతములగు చందమునను, కాకులతోడఁ గూడియుండి యప్పుడు వేఱుపడిపోయెడు కోకిలముల కొదవిన విభాగ పత్త్రికలయందమునను, జాజిచెట్లకు భయరోగమును గల్పించు ప్రోత్తసెత్తుటి భంగిని, క్రీడోద్యాన వనదేవతలు నెమ్మేనులఁ బూసికొన్న కుంకుమంపు మైపూఁత భాతిని, మలయమారుత మను సానతో నొఱయంబడి రాలిన యాకులచేతఁ గానఁబడిన మెండగు దీప్తి గలిగిన గొప్ప రత్నశలాకలజోకయనం దగి చిగురాకు మొనసి కనఁబడియెను.

తే. శరనిధుల మాఘ్యములు దీఱె మరున కట్టి
యడరున జయింతు మని కదా యద్దినాళిఁ
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ దద్వైరిఁ గనియుఁ
బెద్ద లిపురాకుఁబట్టైన పెట్టువడిరి. 111

టీ. మరునకుక్ = స్మరునికి, శరనిధులక్ = అంపదొనలయందు, మాఘ్యములు= మొల్లపువ్వు లనియెడు బాణములు, తీఱెక్ = సమసిపోయెను, (వసంతర్తువులో మొల్లలు పూయ వనుట.), అట్టియడరునక్ =ఆసంకటమునందు, (బాణము లేనివేళ ననుట), పెద్ద లు=వృద్ధులు, (యోగు లనుట), జయింతుము = మన్మథునిఁ గెల్తము, అనికదా=అనియే కాదా, ఆద్దినాళిక్ = ఆమాఘదినపరంపరయందు, క్రూరతిథిక్ = క్రూరతిథియైన, కృష్ణ రజనిక్ = బహుళపక్ష చతుర్దశి రాత్రియందు, (శివరాత్రినాఁ డనుట.), తద్వైరిక్= ఆ మన్మథవైరి యగుశివుని, కనియుఁక్ = చూచియు, (సేవించి యనుట.), ఇపురాకుఁ బట్టైన = చిగురాకనియెడు పట్టాకత్తిచేతనే, పెట్టువడిరి = దెబ్బఁదినిరి.

తా. పెద్దలగువారు మన్మథునికి మొల్లములుకులు లేని తఱి వేచి, యాయిఱుకట మున నతని గెల్త మని తలంచి, యతని విరోధియగు శివునిఁ గ్రూరతిథి యగు చీఁకటి రాత్రియందుఁ జూచియుఁ బ్రయోజనము లేక పోవుటయేకాక, యా మన్మథుఁడు తనకుబాణములు లేకుండినను చిగురా కనియెడు పట్టాకత్తిచేతనే వసంతర్తుప్రారంభ కాలమునందు వారలఁ బ్రహరించి జయము గొనెను.

తే. అవని నప్పుడు దవోదితుం డైన యట్టి
మరునకుం గుసుమర్తు వోన్మంత్రసాని
బొడ్డుగోసిన కోడవలిఁ బోలె విరహి
దారకం బయ్యెఁ గింశుకకోరకంబు. 112

టీ. అవనిన్ = భూమియందు, అపుడు = తత్కాలమందు, నవోదితుండైన = నూతనముగా నుదయించిన, (అభ్యుదయమొందిన యనుట). అట్టి=ఆప్రసిద్ధుఁడగు, మరున కున్=స్మరునకు, కుసుమర్తు వన్=వసంతర్తు వనియెడు, మంత్రసాని=సుఖప్రసవముచేయించునట్టిస్త్రీ, బొడ్డుగోసిన = నాభినాళచ్ఛేదముఁజేసిన, కొడవలిఁబోలెన్ = లవిత్రము వలెనే, కింశుకకోరకంబు = మోదుగుమొగ్గ, విరహి = వియోగులకు, దారకంబయ్యెన్ = ఛేదకమాయెను.

తా. వసంతర్తువునందు మోదుగులు పుష్పింపఁగా నామొగ్గ వంకరగా నెఱ్ఱనై యుండుటవలన నప్పుడు పుట్టిన మన్మథుని బొడ్డు గోసిన నెత్తురుతోడిలిక్కికొడవలి వలె నుండి విరహులకు వేధఁ జేయున దాయెను.

చ. కుసుమములెల్లఁ గామినులకొప్పుల నుండ నటుండ లేమి సి
గ్గెసఁగఁగ వంగినట్లు జనియించె ననల్ మఱి వంగి జీవితే
శసమితి కొమ్ములం గరఁచి చల్లఁ గుచక్షణి కాంగరాగమా
టసదె యటంచు రాగిలిన యట్టులు రాగిలి విచ్చెఁ గింశుకిన్. 113

టీ. కుసుమములెల్లన్ = సమస్తపుష్పములును, కా...లన్-కామినుల = యువతులయొక్క, కొప్పులన్ = ధమ్మిల్లములయందు, ఉండన్ = ధరింపఁబడియుండఁగా, అటుండలేమిన్=తా మట్లుండ లేకపోవుటచేత, (నిర్గంధములగుటచేత ననుట.), సిగ్గెసఁగఁగన్ = లజ్జ యతిశయింపఁగా, వంగినట్లు = నమ్రములైనటువలె, ననల్ = మొగ్గలు, జనియించెన్ = పుట్టెను మఱి = పిమ్మట, వంగి = అట్లే వంగియుండి, జీవితేశసమితి - జీవితేశ=ఆస్త్రీలప్రాణనాథులయొక్క, సమితి = సమూహము, గరఁచి = రసముదీసి, కొమ్ములన్ = చిమ్మనగ్రోవులచేత. చల్లన్ = చిమ్ముచుండఁగా, (మోదుగుపూమొగ్గల రసము దీసి వసంతములాడుదురనుట), కు...ట - కుచ=స్తనములయందు, క్షణిక = క్షణమాత్రముండెడు, అంగరాగమాట = మైపూఁతయగుట, అసదె = స్వల్పమా, (అన్ని పుష్పములవలెఁ గొప్పులయం దుండుటకంటెఁ జన్నులపైఁ జేరుట సామాన్యముగా దనుట), అటంచున్ =అనుకొను, రాగిలినయట్టులు = రంజిల్లినభంగి, రాగిలి=రక్తిగలిగి, కింశుకిన్ = మోదుగుచెట్టునందు, విచ్చెన్ = వికసించెను, ఎఱ్ఱనై మోదుగుపువ్వులు వికసిల్లె ననుట.

ఉ. నైపుణిఁ జందనాద్రి గహనద్రుమ సౌరభ వీచిఁ దామ్రప
ర్ణీ పరిలబ్ధ మౌక్తికమణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శాపవనుండు సల్లు వెదఁ జల్ల జనించెన కాక వానికే
లా పొడమంగ నిప్పొలప మప్పుడు నావనిఁ దోఁచెఁ గ్రొన్ననల్.

టీ. దక్షిణాశాపవనుండు = దక్షిణదిగ్వాయువు, నైపుణిన్ = నేర్పుచేత, తామ్రపర్ణీ = తామ్రపర్ణీనదియందు, పరిలబ్ధ = గ్రహింపఁబడిన, మౌక్తికమణి = ముక్తామణుల

యొక్క, ప్రకరంబులు = సమూహములును, చం...చిన్ - చందనాద్రి = మలయ పర్వతముయొక్క, గహన = అరణ్యమందలి, ద్రుమ = చందనవృక్షములయొక్క, సౌరభ = పరిమళముయొక్క, వీచిన్ = తరంగమందు, తోఁచి = తోఁగఁజేసి, (తడిసి యనుట), *చల్లువెదన్ = చల్లెడువెదయందు, (లోకమందు గొర్రువెద, చల్లువెద యని రెండువిధములు. వానిలో వరుసగా నేర్పడియుండునది గొర్రువెదయును, అంతటవ్యాపించి యుండునది చల్లువెదయును గనుక చల్లువెద యన్నాఁడు.) చల్లన్=విత్తనము వేయఁగా, జనించెనకాక = మొలచెనేకాని, అప్పుడు = అవసంతకాలమందు, వీనికిన్ = ఈ మొగ్గలకు, అప్పొలపము = అపొలుపు, (ముత్తెములవంటి రూపమును బరిమళమనుట.), పొడమంగన్ = పుట్టుటకు, ఏలా = ఏమిపని, నాన్ = అనునట్లు, క్రొన్ననల్ = క్రొత్తమొగ్గలు, వనిన్ = వనములయందు, (జాత్యేకవచనము.), తోఁచెన్=కనుపడెను.

తా. వనములయందు ముత్తెములవంటి రూపము గలిగి పరిమళముతోడ మొగ్గలు పుట్టఁగా మలయమారుతము తామ్రపర్ణీనదిలోని ముత్తెములేతెచ్చి యవి మలయవృక్ష పరిమళలహరీతరంగములో నేర్పుగా ముంచి యవియే వెదఁబెట్టి చల్లిన కారణముచేత మొలకలెత్తినవేకాని లేనియెడ నీచెట్లమీఁది మొగ్గల కా శృంగారము రాదు. ఇట్లు చెప్పుటచేత మలయమారుత మొకకర్షకుఁ డని ధ్వనించుచున్నది.

క. వీరుద్ద్రుమమిథునమేళన
కై రతిపతి యేయ దుస్సి హరితద్యుతిఁ బై
నారెగయఁ బొటమరించిన
నారసముల మొనలనంగ ననలవి మించెన్. 115

టీ. వీ...కై-వీరుత్ = లతలయొక్కయు, ద్రు=వృక్షములయొక్కయు, మిథున= ద్వంద్వముయొక్క, మేళనకై = సంపర్కముకొఱకు, రతిపతి = మన్మథుడు, ఏయన్ = బాణము నేయఁగా, దుస్సి = నాటియావలనుండి యావలికిఁబోయి, హరితద్యుతిన్ = పచ్చనికాంతిచేత, పైన్=ఉపరిభాగమందు, నారెగయన్ = నారయొగసి పోవునట్లు, పొటమరించిన = అంకురించిన, నా...గన్-నారసముల = బాణములయొక్క, మొనలు అనంగన్=అగ్రములో యనునట్లు, ననలుఅవి=ఆమొగ్గలు (వ్యస్తవిశేషణము.), మించెన్ = అతిశయించెను.

తా. లతావృక్షసంపర్కమునకై మన్మథుఁ డాలతలను వృక్షములను దన నారసములచే నేయఁగా నవి యాలతావృక్షశరీరమ్ములలోఁదూఱి వెన్నులయందు మొనలఁ జూపుచున్నవో యన్నట్లు మొగ్గలు బలిసెను.

---

* చల్లు వెదచల్ల ప్రశస్తము. (చల్లు వెదకుఁగాని దాని వ్యతిరేకరూపమగు గొర్రు వెదకుఁగాని ప్రయోగాంతరములు లేవు. గొర్రు వెద. శ. ర. సూ. నిలలో నగ్రాహ్యము. చింత్యము. చల్లు = చల్లఁబడునవి-విత్తనములు వెదచల్లన్ = అంతటను చల్లుటచే.)

చ. తనయుదరంబునం బొడమి ♦ తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁ గో
ల్కొను ధరణీజ సంతతికిఁ ♦ గోరక దంతము లించుకంత ని
క్కినయది యాదిగాఁగఁ జెలఁగెన్ వనలక్ష్మి కడుం జెలంగఁగాఁ
జనుఁ బ్రియుఁడైన మాధవుని ♦ సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్.

టీ. తనయుదరంబునన్ = తనగర్భమందు, పొడమి = పుట్టి, తా...లు-తామ్రరుచి = అరుణకాంతులయొక్క, ఛటలు = సమూహములు, ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా, కో...కిన్-కోల్కొను = వృద్ధిఁబొందుచున్న, (శిశువులు పుట్టినప్పుడెఱ్ఱగానుండుటయు నానాఁటికి వృద్ధియగుటయుఁ బ్రసిద్ధము), ధరణీజ = వృక్షములనియెడు, సంతతికిన్ = సంతానమునకు, కో...లు-కోరక=మొగ్గ లనియెడు, దంతములు = పండ్లు ఇంచుకంత = కొంచెము, నిక్కినయది = అంకురించినది, ఆదిగాఁగన్ = మొదలుకొని, వనలక్ష్మి = వనలక్ష్మియనెడు పొలతి, కడున్ = మిక్కిలి, చెలఁగెన్ = సంతోషించెను, ప్రియుఁడు = ఇష్టుఁడు, ఐన, మాధవుని = వైశాఖమాస మనియెడు పురుషునియొక్క, సంగతి = సాంగత్య మనియెడుసంపర్కము, మీఁదటన్ = భావికాలమందు, చాలన్ = చాలునట్లు, కల్గుటన్ = కల్గునను హేతువుచేతను, చెలంగఁగాఁజనున్ = సంతోషింపఁదగును.

తా. లోకమందలి స్త్రీలు తమ సంతానమునకుఁ బండ్లు మొలిచెడుపఱకు బాలింతలై పురుషసాంగత్యము లేకుండి పండ్లు మొలవఁగానే పురుషులు దమతో సంభోగింతురని సంతోషపడినట్లుగానే, వనలక్ష్మియు వృక్షములు చిగిర్చి వృద్ధియై మొగ్గలు పొడమిన కారణంబున నావృక్షములు బిడ్డలనియును, మొగ్గలు వారిపండ్లనియును, వైశాఖమాసము తనపురుషుఁ డనియును, ప్రకాశము సంతోషమనియును, నన్నట్లు చెలువయ్యెను. వనలక్ష్మి యనియు, మాధవునిసంగతి యనియుఁ జెప్పుటవలన, లక్ష్మికి మాధవ సాంగత్యము యుక్తమే యని భావము. బాలింతలకు బిడ్డలకు దంతములు మొలచునంతవఱకుఁ బురుష సంపర్కము గూడ దని స్మృతులయందుఁ బ్రసిద్ధము.

సీ. మును నన ల్దమిఁ బట్టి ♦ ముంగాళ్లముక్కుచోఁ
దనలఁ జీలిచి పసరొల్కినన విడిచి
పరువంపు విరి గొందుఁ ♦ లరసి చాలై త్రోవఁ
బెట్టి యీరము లీఁగు ♦ పిండుఁ దగిలి
క్రొవ్విరి దొలుత నొక్కఁడు గని యది వ్రాలు
తఱి దాని నిలఁబడఁ ♦ దాఁచి క్రోలి

యాకురాలుపుగండ్ల నానెడు నాస నిం
తడుగూది బంకంటి యంగలార్చి
తే. యెట్టకేలకు నొకఁ డబ్బఁ బొట్టనిండఁ
గ్రోలి యది గాలిఁ గదలినఁ గూలు నగుచు
బ్రమదవనపాలికలు వేడ్కఁ బట్ట నగుచు
మధుదినాదిక్షుధాభ్రమ న్మధుపచయము. 117

టీ. మ...ము-మధుదినాది = వసంతర్తుప్రారంభదినమందు, క్షుధా=ఆఁకలిచేత, భ్రమత్ = తిరుగుచున్న, మధుపచయము = తేఁటిగుంపు, ముసు = మొదలను, ననల్ = మొగ్గలను, తమిన్ = మోహముచేత, ముంగాళ్లన్ = అగ్రాంఘ్రులచేత, పట్టి = అవలంబించి, ముక్కుజోడనలన్ = నాసికాబిలద్వయములచేత, పీలిచి = దూఁటికొని, పసరొత్తినన్ = పసరువాసనరాఁగా, విడిచి = వానివిసర్జించి, ప...లు-పరువంపు = పక్వములగు, విరి = పూలుగల, గొందులు=మూలమూలలు, అరసి=వెదకి, చాలై = గుంపుగొని, త్రోవఁబెట్టి = పోవుటను మార్గముఁబెట్టి, కేరములేఁగు = పొదలు దూఱెడు, పిండున్ = సమూహమును, తగిలి = వెనుముట్టి, తొలుతన్ = ప్రథమమందు, క్రొవ్విరిన్ = క్రొత్తపుష్పమును, ఒక్కఁడు = ఒకభృంగము, కని = చూచి అది వ్రాలుతఱిన్ = అదిముసరికొనునప్పుడు, దానిన్ = ఆభృంగమును, ఇలఁబడన్ = భూమియందుఁబడునట్లు, తాఁచు = తన్ని. క్రోలి=మకరందము పానముసేసి, ఆకురాలుపుగండ్లన్ = ఆకులురాలిన తొడిమలమొదళ్లయందు, ఆనెడునాసన్ = పానముసేసెడునాశచేత, ఇంత = కొంచెము, అడుగూఁది = పాదము నిలిపి, బంక=అవృంత మూలనిర్యాసము, అంటి = స్పృశించికొని, అంగలార్చి=కాలువెలుపలికిరాక ఖేదపడి, ఎట్టకేలకున్ = కొంతసేపునకు, ఒకఁ డబ్బన్=ఒక పుష్పముదొరకఁగా, పొట్ట నిండన్ = కడుపునిండునట్లు, క్రోలి = మకరందపానముసేసి, అది = ఆపుష్పము, గాలిన్ = వాయువుచేత, కదలినన్ = చలింపఁగా, నగుచున్=నవ్వుచును, ప్రమదవనపాలికలు= శృంగారవనములను బరిపాలించెడు పొలఁతులు, పట్టన్ = పట్టుకొనుటకు, అగుచున్ = దుర్బలములై వశపడుచు, కూలున్ = క్రిందపడును.

సీ. మరుదూఢమలయాహి గరధూమ్యలనుగళ
న్మనసిజరథపదాంజనకళికలు
త్రాసధావచ్ఛిశిరత్యక్తబాష్పముల్
పికపంచమస్వరోచ్ఛేద వీణ

లబ్ధాగమన్మరందాసారజంబువుల్
  హిందోళ సాక్షాన్ముకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీల గుళికలు
  జాత్యనుల్లసనార్త శ్యావతతులు
తే. చైత్రసంజీవనౌషధీజాతచేత
  నాత్మజని హేతు తరువునార్యాయి యువతి
  కరవిధూతహసంతికేంగాలచయము
  లభుల పజ్ఝ్కలు వనుల నొత్తాడఁ దొడఁగె. 118

టీ. మ...మ్య-మరుత్ =వాయువుచేత, ఊఢ=వహింపఁబడిన, మలయ-మలయ పర్వతమందలి, అహి=సర్పములయొక్క, గర = విషముయొక్క, ధూమ్యలు = ధూమ సమూహములైనట్టియు, (వాయువశముచేతనే పొగ లెగయుననియు విషధూమములు మిగుల నల్లనై యుండు ననియుఁ భావము.), అ...లు-అనుగళత్ = విడువక జాఱుచున్న, (ఇది యంజన కళికలకు విశేషణము.), మనసిజ=మన్మథునియొక్క, రథపద = బండిచ క్రములయందలి, అంజనకళికలు=కందెనముద్దలయినట్టియు, (వసంతర్తువునందుఁ గ్రొత్తగా మరుఁడు వెడలెఁ గావునఁ దేరుచక్రముల కప్పుడు కందెన వేయఁగా నాచక్రములు దిరుగునప్పు డా కందెనముద్దలు జాఱు ననుట.), త్రా...త్ - త్రాస = భయముచేత, ధావత్ = పాఱిపోవుచున్న, శిశిర=శిశిరర్తువుచేత, త్యక్త = విడువఁబడిన, బాష్ప ముల్ = కన్నీళ్లయినట్టియు, (శిశిరర్తువు వెడలినప్పుడు దుఃఖించె ననుట.), పి...లు-పిక= కోయిలలయొక్క, పంచమస్వర=పంచమస్వరముయొక్క, ఉద్భేద=పుట్టుటకు, వీణలు =కస్తూరివీణలైనట్టియు, 'పికః కూజతి పంచమమ్' అని నిఘంటువు. వీణయందు పంచమ స్వర ముండుటకు 'శ్రుతిభ్యస్స్యు స్స్వరాష్షడ్జర్షభ గాంధార మధ్యమాః, పంచమో ధైవ తశ్చాథ నిషాద ఇతి సప్తధా, తేషాం సంజ్ఞాస్సరిగమ పధనీత్యపరా మతాః', అని సంగీత శాస్త్రము. అబ్దాగమత్ = వర్షాకాలమువలె నాచరించుచున్న, మరంద = మకరందము యొక్క, ఆసార = ధారాసంపాతమునకు, జంబువుల్ = నేరేడుపండులైనట్టియు, (వర్షాకాలమందు నేరేళ్లు ఫలించు ననుట, అబ్దాగమ మనఁగా సంవత్సరాగమము, అబ్దా గమమే అబ్దాగ మని శ్లిష్టరూపకము.) హిం...లు-హిందోళ = ఆ కాలమందుఁ బాడఁదగిన విష్ణుప్రియమైనహిందోళగానమునకు, సాక్షాత్ = ప్రత్యక్షమయిన, ముకుంద = కఱివేల్పుయొక్క, రోచులు = శరీరకాంతులయినట్టియు, ('శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకమ్' అని సంగీతశాస్త్ర ప్రసిద్ధము. కావున నప్పు డా రాగమునకు సంతోషించి ప్రసన్నుఁడై వచ్చి గోవిందునిశరీరకాంతులవలె నుండె ననుట.)

అ...లు - అభిసారికా = ప్రియులకొఱకు సంకేతస్థానములను గూర్చి పోవుచుండెడు స్త్రీలయొక్క, 'కాంతార్థి నీతు యాయాతి సంకేతం సాభిసారికా' అని యమరము. అంశుక = వస్త్రములకు, ఉద్యన్నీలగుళికలు = సద్యోనైల్య సంపాదకఘుటికా విశేషములు, (అభిసారికలు తమ గోపనార్థమై నీలవస్త్రములు ధరింతు రనుట), జా...లు - జాతి = జాజులవలన, అనుల్లసన = ప్రకాశములేకుండుటంబట్టి, ఆత్త = పొందఁబడిన, శాప=తిట్లయొక్క, తతులు = సమూహములైనట్టియు, (వసంతర్తువునందు జాజులు వికసిల్లవు గావున నవి వసంతునిఁ దిట్టఁగా నాశాపములే యిట్లు వచ్చె ననుట), చై...లు-చైత్ర=చైత్రమాస మనియెడు, సంజీవనౌషధీ = సంజీవముచేత, జాత = ఉదయించిన, చేతన చైతన్యముగల, ఆత్మ = తమయొక్క, జని = జన్మమునకు, హేతు = కారణములగు, తరు = వృక్షములనుగూర్చి, పునర్యాయి = మగిడిపోవుచున్న, యువతి= ఉవిదలయొక్క, కర = హస్తములచేత, విధూత = పాఱఁజల్లఁబడిన, హసంతికా=కుంపట్లయందలి, ఇంగాల = బొగ్గులయొక్క, చయములు = సమూహములైనట్టియు, ('నిర్ధూమాం?రభరితహసంతికాయంత్రస్య చ' అని భోజరాజున్నట్లు, చలికాలమందు స్త్రీలు కుంపట్లెత్తియుండి వసంతర్తువు రాఁగానే చలిదీఱుఁ గావున నాకుంపట్లు పారఁ జల్లఁగా నందలి నల్లబొగ్గులకు వసంతర్తువనెడు సంజీవనౌషధము దగిలి ప్రాణములువచ్చి తమ జన్మములకు హేతువులగు వృక్షములను గూర్చి మరలఁ బోవుచున్న ట్లుండె ననుట.) అళికులపఙ్క్తులు = తుమ్మెదలగుంపులు, వనులన్ = వనములయందు, అట్టాడన్ = సంచరించుటకు, తొడఁగెన్ = ఉపక్రమించెను.

తే. ద్విజతఁ గాంచియు మధుసేవ ? విడువలేక
జాతిఁ బాసినతేంట్లనిస్స్వనముఁ గూడు
కొనుటనో యనఁ గోకిలస్వనము సెలఁగెఁ
దనకు మఱి పంచమత్వంబు ? దప్పకుండ. 119

టీ. ద్విజతఁగాంచియున్=విప్రత్వమును బొందియును, 'దంతవిప్రాణ్డజాద్విజా' అని నిఘంటు వున్నదిగానఁ దుమ్మెదలు నండజము లగుటచేతఁ బక్షు లయ్యె ననుట. మధుసేవన్ = మద్యపానమును, విడువలేక = విసర్జింపలేక, (మకరందపాన మనుటయుం నిది కోకిలపర్యాయ మైనప్పుడు ద్విజత్వమును వసంతర్తుసేవ యనుట.), జాతిన్ = తమ ద్విజజాతిని, పా...న్-పాసిన = విడిచిన, తేంట్ల = తుమ్మెదలయొక్క, నిస్స్వనమున్= నాదమును, కూడుకొనుటనో = సంయోగించుటచేతనో, (తుమ్మెదలు మధుసేవవలనఁ గులభ్రష్టము లయిన వనియును, (జాతిని విడిచె ననుట.),అనన్ =అనునట్లు, కోకిలస్వనము= పికస్వరము, తనకు, మఱి=పిమ్మట, పంచమత్వంబు = పంచమస్వరత్వమును, ఐదవ మహా

పాతకుఁడగుటయును, 'పికఃకూజతి పంచమమ్' అన్నట్లు పంచమస్వరత్వ మగుటయుఁ 'దత్సంయోగీ చ పంచమ' యనున ట్లుయిదవవాఁ డగుటయు ననుట, తప్పకుండఁ = తప్పిపోకుండునట్లు, చెలఁగెన్ = ఒప్పెను, (కోకిలములకుఁ బంచమస్వరము స్ఫుటముగా వచ్చె ననుట.)

ఉ. పూచినమావులం దవిలి ♦ పూవిలుజోదువ కమ్మె మాధవుం
డేచిన శంక నాతఁ డవి ♦ యేకొనియే పథికావళీజయ
శ్రీచణుఁ డయ్యె నట్టిద యకృత్యముచే నగునట్టిపీడయుం
గోచరమాౌనె దైవ మనుకూలము నై పరుమేలు దీటినన్. 120

టీ. మాధవుండు = వసంతుఁడు, పూ...లన్-పూచిన = శరీరముపూచిన, మావులన్ = గుల్మములను, తవిలి = అంటి, ఏ...కన్-ఏచిన = అతిశయించిన, శంకన్ = అనర్థశంకచేత, పూవిలుజోదునకున్ = కుసుమకార్ముకునకు, అమ్మెన్ = విక్రయించెను, (గుల్మములకు శరీరములు పూచెనేని యవి కీడుసేయుట యశ్వశాస్త్రప్రసిద్ధ మనుటయుఁ బూచిన మామిళ్లనుటయును), అవియేకొనియే = ఆ పూచిన మావులనే కొనియే, అతఁడు = ఆమన్మథుఁడు, ప...డు-పథికావళీ = విరహిసమూహముయొక్క, జయశ్రీ = జయసంపదయందు, చణుఁడు అయ్యెన్ = సమర్థుఁడయ్యెను, అట్టిద = అట్టిదేకదా, అకృత్యముచేన్ = దుష్కార్యముచేత, అ...యున్-అగునట్టి = కలుగునట్టి, పీడయున్ = ఆర్తియును, దైవమనుకూలమునై = దైవమనుకూలించియుండియు, పరుమేలు-పరు = శత్రువుయొక్క, మేలు = మంచికాలము, తీటినన్ = సమాప్తికాఁగా, గోచరమాౌనె = తనకుఁ గనపడునా, (మావుల నమ్మినవాఁడు మాధవుఁడు గనుక దైవ మనుకూలమై యని చెప్పెను, దైవానుకూల్యమున్నప్పుడు జయ మెవ్విధముననైనఁ గలుగు ననుట.)

తా. వసంతర్తువునందు మామిడిచెట్లు లెస్సఁగాఁ బూచెను, మన్మథుఁ డా పువ్వులచేతఁ బథికులను జయించెను. కీడు చేయవలసిన పూచినమావులు జయప్రదము లయినట్లు చెప్పుటవలన వ్యాఘాతాలంకారము. 'స్యాద్వ్యాఘాతో తథాకారి తథాకారిక్రియేత చేత్' అని దానిలక్షణము. ఆవ్యాఘాతాలంకారము మావు లను తావున శ్లేషమూలకాభేదాతిశయోక్తిచేత ననుప్రాణితము గనుక నా రెంటికిని సంకరము. దీని కర్థాంతరన్యాసాలంకారముతో సంసృష్టి.

మ. ఉరుశక్తి న్మధుమాసదోర్గ్ధ పిదుకఁ ♦ జ్యోత్స్నగవీచంద్రమః
స్ఫురదూధగ్రవిముక్తమైన నిబిడజ్యోత్స్నాపయఃపూరముల్
విరియం బాఱినగొజ్జఁగ ల్గురియ ముస్నిరైన యక్కమ్మనీ
రు రహిం గూడిన నేర్పరించు గము లై ♦ రోలంబకాదంబముల్.

టీ. మధుమాసదోగ్ధ - మధుమాస = వసంతర్తు వసెడు, దోగ్ధ = పాలుపిదుకువాఁడు, ఊరుశక్తిన్ = మహాబలముచేత, పిదుకన్ = పిండఁగా, జ్యో...మున్- జ్యోత్స్నా=వెన్నెలరాత్రియనెడు, గవీ=గోవుయొక్క,చంద్రమః=చందమామ యనెడు, స్ఫురత్ = గొప్పదైన, ఊధః = పొదుగువలన, ప్రవిముక్తమైన = కురిసిన, నిబిడ = దట్టమైన, జ్యోత్స్నా = వెన్నెలయనెడి, పయః = పాలయొక్క, పూరమున్ = సమూహమును, వి...ల్-విరియంబాఱిన = వికసించిన, గొజ్జెఁగల్ = గొజ్జంగిపూలు, కురియన్ = వర్షింపఁగా, మున్నీరైన = సముద్రప్రాయ మయిన, అక్కమ్మనీరు = ఆమకరందమును, రహిన్ = సొంపుగా, కూడినన్ = కలిసికొనఁగా, రోలంబకాదంబముల్ - రోలంబ = తుమ్మెదలనియెడు, కాదంబముల్ = కలహంసలు, గములై = గుంపులై, ఏర్పరించున్ = ప్రత్యేకపఱుచును. (వెన్నెలయందు గొజ్జెఁగఁపూఁదేనెను దుమ్మెదలు గ్రోలెననుటయు, హంసలు పాలు నీరు వేఱు పఱుచుటయు ప్రసిద్ధము లనుట). రూపకాలంకారము.

ఉ. దిగ్గియ నంచతూఁడు గొని కీ తీరవనేక్షువువంకమీఁదుగా
నగ్గెడ ఫుల్లకేసరముసందు వసింపఁగ నెక్కునూలిను*
న్ప్రగ్గము నం దనారత మరంద సరస్యరవిందగోష్ఠికిన్
వెగ్గలమాడు తేంట్లు మరువింటికిఁ బూనె గుణద్వయత్వమున్. 122

టీ. దిగ్గియన్ = దీర్ఘికయందు, రూ. డిగ్గియ), అంచ = హంస, తూఁడు = కమలనాళమును, కొని = గ్రహించి, తీ...గాన్ - తీర = దరియందలి, వన = వనముయొక్క, ఇక్షువు = చెఱకుయొక్క, వంకమీఁదుగాన్ = వంపుమీఁదుగా, అగ్గెడన్ = ఆప్రాంతమందు, ఫు...దున్-ఫుల్ల = పుష్పించిన, కేసరమునందున్ = పొన్నచెట్టునందు, 'పున్నాగః పురుషస్తుఙ్గః కేసరో దేవవల్లభః' అని నిఘంటువు. వసింపఁగన్ = వ్రాలఁగా, ఎ...మున్ - ఎక్కు = ఆచెఱకునకెక్కినట్టి నూలి = ఆబిసనాళతంతు సంబంధియగు, నున్ = నునుపైన, ప్రగ్గమున్ = సూత్రంబు, అందు = ఆపొన్నచెట్టున, అ...కిన్- అనారత = ఎడతెగని, మరంద = మకరందముయొక్కయు, సరసీ = ఆడిగ్గియయందలి, అరవింద = కమలములయొక్క, గోష్ఠికిన్ = సమాజమునకును, వెగ్గలము = అధికముగా, ఆడు = సంచరించుచున్న, తేంట్లు = తుమ్మెదలును, మరువింటికిన్ = మన్మథుని ధనువునకు, గుణద్వయత్వమున్ - గుణ = గొనయములయొక్క, ద్వయత్వమున్ = జంటతనమును, పూనెన్ = వహించెను.

---

* ఒక్కనూలి

తా. ఒక సరస్సులోనుండి హంస తామరతూఁడు ద్రుంచుకొని దానివరి నున్న చెఱకువంకమీఁదుగాఁ బొన్నచెట్టుమీఁద వ్రాలఁగా నాబిసనాళతంతువు లాచెఱకునకుఁ దగుల్కొని యది యొక యల్లెత్రాడుగాను, మఱియు నా పొన్నపూలమకరందము కొఱకు నా సరస్సునందలి కమలముల మకరందముకొఱకు నెడతెగక చాలుగట్టి యా చెఱకువంకమీఁదుగానే తిరుగుచున్న తుమ్మెద లొక్క యల్లెత్రాడు గాను, ఈరెండును రెండల్లెత్రాళ్లుగా మన్మథునికి ధనుస్సయిన యా చెఱకున కమరుటఁ బాంధ విజయమునకై మన్మథుఁడు తన వింటికి బటువుగా రెండల్లెత్రాళ్లు వేసికొనెను.

చ. నిడుద మధూళిక ల్నడుమనే కొని తీఁగెలు సాఁగఁ జుట్టుకొం
చడవిఁ గడార కాచకటకాకృతి సుళ్ళ మెలంగె గాడుపుల్
జడగతి నధ్వనీనపరిషత్పటునిశ్వసితానలం బెదు
ర్పడ మఱి సార్చులై చురచురన్ దుద సుళ్లుగ స్రుక్కెనో యనన్.

టీ. ని...ల్-నిడుద = పొడువులగు, మధూళికల్=మకరందధారలను, నడుమనే= భూమినిఁ బడకుండ మధ్యభాగముననే, కొని=గ్రహించి, తీఁగెలుసాఁగన్=(మకరందము జిగటగావున) తీఁగెలు సాఁగునట్లు, చుట్టుకొంచున్ = వలయితము లౌచు, గాడుపుల్= వాయువులు, అ...బు - అధ్వనీన = పథికులయొక్క, పరిషత్ = సమూహముయొక్క, పటునిశ్వసిత = పెద్దనిట్టూర్పులయొక్క, అనలంబు = అగ్ని, ఎదుర్పడన్ = తన కెదురు గాఁగా, మఱి = పిమ్మట, సార్చులై = మంటలతోఁ గూడినవై, చురచురన్ = చుఱ చుఱ యనఁగా, తుదన్=అగ్రమందు, సుళ్లుగన్=ఆవర్తములుగలుగఁగా, స్రుక్కెనో యనన్ = శోషించెనో యనునట్లు, అడవిన్ = అరణ్యమందు, కడార-కపిలవర్ణముగల, 'కడారః కపిలః పిఙ్గ' అని నిఘంటువు. కాచకటక=గాఁజుచుట్టయొక్క, ఆకృతి=ఆకారము వంటి యాకారముగల, సుళ్లన్ = ఆవర్తములచేత, జడగతిన్ = మందగమనముచేత, మెలంగెన్ = సంచరించెను.

తా. పుష్పములనుండి జాఱెడు మకరందధారలు క్రిందఁబడకుండ నడుమనే గ్రహించి తీఁగెలు సాఁగునట్లు వలయితములై గాజులవలెఁ గపిల వర్ణము గలిగి యడవులయందు వాయువులు సంచరింపఁగా విరహులయొక్క నిట్టూర్పుచిచ్చెదురు పడఁగా మండుచునగ్రముల సుళ్లవలె ముడుఁచుకొని సుఱసుఱ స్రుక్కెనో యన్నట్లుండెను.

చ. కురిసిన క్రిందిపుప్పొడులఁ గొంచు నగంబుల మీఁదికై పికం
గరుచులఁ గొన్ని పెల్లెగసెఁ గాడ్పులసుళ్లలి మాధవుండు రా

నెరవుగఁ బూవుసొమ్మిడి వనేందిర భూమికి వెండి మెట్టతా
మరరవణంబు రాఁ గొన భ్రమద్గతులౌ మరచుట్టులో యనన్. 124

టీ. క...లన్ - కరిసిన = పుష్పములనుండి రాలినట్టి, క్రింది = వృక్షముల క్రిందనున్న, పుప్పొడులన్ = పుష్పరజములను, కొంచున్ = గ్రహించుచు, అగంబుల మీఁదికై = వృక్షములపైకిఁగాను, పిశంగరుచులన్ = పచ్చనికాంతులచేత, కొన్ని = కతిపయములగు, గాడ్పులసుళ్లు = వాయువులయొక్క యావర్తములు, (కర్తృపదము) పతి = భర్తయగు, మాధవుండు = విష్ణుఁడు, (వైశాఖమాసము ననుట.) రాన్ = రాఁగా, వనేందిర = వనలక్ష్మి, పూవుసొమ్ము = పుష్పము లనియెడు ఆభరణము, మె...బు-మెట్టతామర=స్థలకమల మనియెడు, రవణంబు=భూషణము, రాన్=రాఁగా, ఆభూషణము, భూమికిన్=నేలకు, ఎరవుగనిడి = ఎరవుగాఁబెట్టి, వెండి = మఱియు, కొనన్=తీసికొనఁగా, భ్రమద్గతులౌ - భ్రమత్ = తిరుగుచున్న, గతులౌ=గమనములు గల, మరచుట్టులోయనన్ = చీలలోయనునట్లు, పెల్లు=అధికముగా, ఎగసెన్ = ఉద్గమించెను. సుళ్లనుకర్తృపదమునకు 'హలోలోశ్చ' అను సూత్రముచేత నుల్లోపమై యీ రూపము వచ్చెను.

తా. భూమికిని దనకును భర్తయగు మాధవుఁడు రాఁగా, వనలక్ష్మి తనకుఁ గల పూవుసొమ్మును భూమి కెరవుగాఁ బెట్టి భూమికిఁ గల మెట్టతామర యను వేఱొక వింతసొమ్ము తాను బెట్టుకొనఁగా మరలు దిరుగుచున్న మరచుట్టులో యనునట్లు చెట్లక్రింద రాలిన పుప్పొడులు రేపికొని పచ్చని వన్నెగలిగి కొన్ని సుడిగాడ్పులు చెట్లపై కెగసెను.

చ. తరుణులు దోహదాన మధుధార నన ల్వకుళాళి నింపఁగాఁ
దరుణుల మేము గామె యని తద్గతలై వనదేవత ల్సురన్
ధర వకుళౌఘ మెల్లను నన ల్గనఁ గ్రాయఁగ నించుబుగ్గలై
దొరసె మధుప్రపూర్ణత మధూకములం బృథుపాండుపుష్పముల్.

టీ. తరుణులు=యువతులు, దోహదాన=దోహదమువలన, మధుధారన్ = మద్యధారచేత, వకుళాళిన్=పొగడచెట్ల పఙ్క్తియందు, ననల్=పుష్పములను, నింపఁగాన్=నిండింపఁగా, 'వకుళో ముఖసీధునా' అన్నట్లనుట, ఏము=మేము, తరుణులము గామె=యువతులము గామా, అని=అనుచు, తద్గతలై-తత్=ఆ వనమును, గతలై=పొందినవై, వనదేవతల్ = వనదేవతలు, సురన్=మద్యముచేత, (మకరందముచేత ననుట.), ధరన్=భూమియందు వకుళౌఘము=పొగడలగుంపు, ఎల్లను=సమస్తమును, ననల్గనన్=మొగ్గలం వేయునట్లు క్రాయఁగన్ = ఉమియుటకై, నిం...లు-నించు=నిండించియున్న, బుగ్గలై=

పుక్కిళ్లన్, మధూకములక్ = ఇప్పచెట్లయందు, పృ...లు-పృథు=పెద్దవియగు, పాండు=తెల్లనగు, పుష్పములు = పువ్వులు, మధుప్రపూర్ణతన్ - మధు=మకరందముచేత, ప్రపూర్ణతన్=మిక్కిలి నిండియుండుటచేత, దొరసెన్=పోలెను.

తా. ఇప్పపువ్వులు మిగులఁ దెల్లనై మకరంద భరితములై యుండఁగా దశవిధ దోహదములలో నొకఁడైన ముఖసీధువుచేతఁ దరుణులు పొగడచెట్లను బుష్పింపఁ జేయఁగాఁ జూచిన వనదేవతలు తాము ను దరుణులగుట నారీతిగానే సమస్త వకుళ వృక్షములను బుష్పింపఁ జేయుటకై యత్నపడి యుమియుటకై తెల్లని మద్యముఁ బుక్కిళ్లఁ బట్టియుండఁగా నా బుగ్గలవలెనుండెను.

చ. తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ము వృథా విరులెత్తఁ జేసె మో
పరులుగఁ జైత్రుఁ డంచుఁ దదభావమనోభవవహ్ని వెచ్చి ని
ర్భరమధుపాళిధూమము పరాగపు నీఱును దేనెగట్టెచాఁ
దరుదుగఁ దాల్పఁగా గొరవులై యొరగంబడెఁ గొన్ని భూజముల్.

టీ. త...టన్-తరుణుల=ఉవిదలయొక్క, కౌఁగిటన్ = ఆలింగనముచేత, న...మ్మున్-ననుచు = పుష్పించునట్టి, తమ్మున్ = తమ్మును, (గోరింటలను), 'ఆలిఙ్గనాత్కురవక' అన్నట్లనుట. వృథా=వ్యర్థముగా, చైత్రుఁడు=వసంతర్తువు, మోఁపరులుగన్=బరువు మోసెడువారిఁగా, విరులెత్తన్=పుష్పములెత్తునట్లుగా, చేసెన్=ఒనర్చెను. అంచున్=అనుచు, త...హ్ని - తత్ = ఆయువత్యాలింగనముయొక్క, అభావ = లేమిచేత, మనోభవ=మన్మథసంబంధియయిన, వహ్నిన్=అగ్నిచేత, వెచ్చి = దగ్ధములై, ని...ము-నిర్భర=నిబ్బరములైన, మధుప=తుమ్మెదలయొక్క, ఆళి=పఙ్క్తి యనెడు, ధూమము=పొగయును, పరాగపు=పుష్పరజోమయమగు, నీఱును=భస్మమును, తేనెకట్టెచాఁదు = మకరందమనియెడు కట్టెచాఁదును, (పచ్చికట్టె కాలునప్పుడు లోపలినీరు పైనబికి చాఁదుగట్టుననుట), అరుదుగన్=వింతగా, తాల్పఁగాన్=ధరింపఁగా, కొన్ని భూజముల్ = కొన్నిచెట్లు, కొరవులై=ఆలాతములై, (కొరవులనఁగా గురువకములు) ఒరగంబడెన్ = నేలవ్రాలెను. (తాపభరముచే ననుటయుఁ బుష్పభరముచే ననుటయు) ఆలాతమనునర్థమున శకటరేఫము. శ్లేషయందు రేఫద్వయము గ్రాహ్యము.

తా. కురవకశబ్దభవములై కొరవు లని చెప్పఁబడియెడు గోరింటలు స్త్రీల యాలింగనములచేతనే మేము పూయుదుమే యట్టి మమ్ము నీ చైత్రుఁడు బరువుచేటుగాఁ దాను వృథా పుష్పింపఁజేసె నని యాస్త్రీల యాలింగనము లేకుండుటవలని మదనాగ్నిచేతఁ దపింపఁ బడినందులకుఁ జిహ్నముగాఁ దుమ్మెదలు పొగ లెగసినట్లును, బుప్పొడి బూది రేఁగినట్లును, మకరందము దానిలోని నీరు పేరి నల్లఁబడి చాఁదుగట్టినట్లుండఁగాఁ నొరగఁబడి

తమ పేరు సార్థక మగునట్లు కోఱపులవలె నుండెను, ఆకులు మొదలగునవి కనుపడకుండు నట్లు లెస్స పూచి యుండెను. అలం. గమ్యోత్ప్రేక్షాలంకారము.

ఆ. ఫలశలాటు లురల ♦ నళులకై తమకూడు
చెఱుప మావు లంటి ♦ చెలువ పిండు
మగుడ ననలు నింప ♦ మొగము గన్నులు నెఱ్ఱ
వాఱె మిగుల శౌక ♦ పైకములకు. 127

టీ. చెలువపిండు = సుందరీసమూహము, ఫలశలాటులు = పండ్లుగాయలు, ఉరలన్=రాలిపోవునట్లు, అళులకై= తేఁటులకొఱకు, తమకూడు = తమ యాహారము చెఱుపన్ = చెఱుచుటకై, మావులు = మామిడిచెట్లను, అంటి = స్పృశించి, 'కరస్పర్శేణ మాకంద' యనునట్లనుట. మగుడన్ = మరల, ననలు = పుష్పములను, నింపన్ = నిండింపఁగా, శౌకపైకములకున్ = చిలుక కోకిలల గుంపులకు, మొగము = ముఖమును, కన్నులు = నేత్రములును, మిగులన్ = అధికము, ఎఱ్ఱవాఱెన్ = కోపముచేత నెఱ్ఱ నయ్యెను, (చిలుకలకు ముఖమును గోయిలలకుఁ గన్నులును వసంతర్తువునందు మిక్కిలి యెఱ్ఱనైయుండుట ప్రసిద్ధమనుట). హేతూత్ప్రేక్షగమ్యాలంకారము.

మ. అతులప్రేమరసార్ద్రయై యోర్తు ప్రియహాస్యక్రీడ సంకేత వం
చితయై తత్క్షణజాంగజజ్వరమిళచ్చిత్తభ్రమం బూని నా
పతి నోవృక్షమ కానవే యన సపుష్పం బయ్యె గోఁ గంతలో
నతఁడు న్దోఁచిన నవ్వుడు న్విరిసెఁ బ్రాంతాంచన్నమేరుద్రువున్.

టీ. అ...ర్ద్రి-అతుల = సమానములేని, ప్రేమరస = ప్రేమయొక్క, హాస్యక్రీడన్ = యైన, ఓర్తు = ఒక్కనాతి, ప్రి...డన్-ప్రియ = తననాథునియొక్క, హాస్యక్రీడన్ = పరిహాసక్రీడయందు, (దాఁగిలిమూఁతయనుట), సంకేత=సంకేతస్థానమందు, వంచితయై= మోసపోయినదై, త...బు-తత్క్షణజ = అప్పుడే పుట్టిన, అంగజజ్వర = విరహజ్వరము తోడను, మిళత్ =కూడికొన్న, చిత్తభ్రమంబు = మనశ్చాంచల్యమును, ఊని = పొంది, ఓవృక్షమ = ఓచెట్టా, నాపతిన్ =నానాథుని, కానవే = చూడవా, అనన్ = అని పల్కఁగా, గోఁగు = కర్ణికారము, సపుష్పంబయ్యెన్ =పుష్పములతోఁ గూడినదయ్యెను, 'సల్లాపతఃకర్ణికారః' అన్నట్లనుట. అంతలోన్ = ఆపల్కరించునంతలో, అతఁడున్ = ప్రియుఁడును, తోఁచినన్ = కానరాఁగా, నవ్వుడున్ = నవ్వఁగానే, (ఆస్త్రీయనుట), ప్రాంతాంచన్నమేరుద్రువున్ - ప్రాంత = చేరువను, అంచత్ = ఒప్పుచున్న, నమేరు ద్రువున్ = సురపొన్నచెట్టును, విరిసెన్ = పుష్పించెను. 'నమేరుర్హాసితేన చ'.

తా. ఒకస్త్రీ తన నాథునిఁ గనుమఱచి వెదకుచు నొక కొండగోఁగుచు బలుకరింపఁగా నది పుష్పించెను. అంతలోనే తననాథుఁడు గనిపించిన నాయింతినవ్వఁగానే యాచేరువ నున్న సురపొన్నచెట్టును బుష్పించెను.

తే. స్థాణు వొక్కండు మగవాఁడు ♦ దలఁక కుమియ
ఫల మొసఁగె నట్లె కినియక ♦ పద్మవదన
వదనసురఁ గూర్మి నొసఁగ నీవలదె పుష్ప
మైన ననుమాడ్కి నుమిసిన ♦ నలరెఁ బొగడ. 129

టీ. స్థాణువు = మొద్దును, శివుఁడును, ఒక్కండు మగవాఁడు = ఒక్కపురుషుఁడు, తలఁకక=సంకోచింపక, ఉమియన్ = ఉమ్మివేయఁగా, కినియక = కోపింపక, ఫల మొసఁగెన్=పండిచ్చెను, (కోరిక నిచ్చెను), 'స్థాణూ రుద్ర ఉమాపతిః' అని అమరము. (స్థాణువుపైఁ బోయ కన్నప్ప యనువాఁడు పూజార్థము పుక్కిటి సురనుమియఁగాఁ గోపగింపక కామితఫల మిచ్చెనఁట. ఇది శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రసిద్ధము.) అట్లె= ఆప్రకారమే, పద్మవదన = తమ్మివంటి మొగముగల యువిద, వదనసురన్ = తననోటి యందలిమద్యమును, కూర్మిన్ = ప్రేమచేత, ఒసఁగన్ = ఇయ్యఁగా, పుష్పమైన నీవలదె = పూవేనియునీవలదా, అనుమాడ్కిన్ = అనియెడురీతిచేత, ఉమిసినన్ = ఉమియఁగా, పొగడ = వకుళవృక్షము, అలరెన్ = పుష్పించెను. 'వకుళోముఖసీధునా'.

తా. మున్నొక మగవాఁడు స్థాణువు పై నుమిసిన నతనికి ఫల మొసఁగి యుండఁగాఁ, దామరవంటి మోము గలయువతి పుక్కిటిసుర నొసఁగఁగాఁ బువ్వైన నియ్యవలదా? యన్నట్లు, పొగడపై నొకమగువ యుమియఁగా నది పూచె నని భావము.

తే. మధువుఁ గాంతలపుక్కిటిమధువుఁ బెళ్లె
యీర్ష్యఁ బస సూపఁ బొగడపై ♦ నెలయ దాన
విరిసెఁ దొల్లిటి దళములు ♦ విరులు జడిసె
దీన నగ్గెల్పునకు నుబ్బి ♦ తేఁటు లార్చె. 130

టీ. మధువున్ = వసంతమాసమును, కాంతల = స్త్రీలయొక్క, పుక్కిటి=బుగ్గలయందలి, మధువున్=మద్యమును, పెళ్లె=సమాననామముచేతనైన, ఈర్ష్యన్=కసుచేత, పస = తమతమహెచ్చులను, చూపన్ = కనఁబఱుచుటకై, పొగడపైన్=వకుళవృక్షము మీఁద, ఎలయన్ = వ్యాపింపఁగా, దానన్ = అవ్యాపించుటచేత, తొల్లిటిదళములు= మున్నున్నసైన్యములు, (ఆకులనుట), 'దళం శస్త్రీ ఛదే ఛదే' అని నిఘంటువు. విరిసెన్= విచ్చెను, (రాలె ననుట), విరులు = తొల్లింటిపువ్వులు, జడిసెన్ = భయపడెను, (క్రొత్త పువ్వులు జడిగొనెననుట), దీనన్ = ఈహేతువుచేత, ఆగ్గెల్పునకున్=ఆవసంతవిజయ

మునకు, ఉబ్బి = సంతసించి, తేఁటులు = తనపక్షమునన్న తుమ్మెదలు, ఆర్చెన్ = సింహనాదముచేసెను, (ధ్వనిచేసె ననుట.)

తా. మధు వను నామము వసంతర్తువునకును మద్యమునకుఁ జెల్లును గావున, నా నామైక్య వైరముచేతఁ దమతమ పస పొగడచెట్టుపైఁ గనుపింపఁగా, నువిదల పుక్కిళ్ల మధువుచేఁ జిగిరించి పుష్పించియున్న యాకులను బువ్వులను రాలిచి, వసంత ర్తువు పొగడను మరలఁ బుష్పింపఁజేసెను; మరలఁ బూచినపూల కలరి తుమ్మెదలు మ్రోసెను.

ఉ. మేకొని తాఁచినం భృగువు మెచ్చిన వానికి మర్త్యభార్యయౌ
శ్రీకి నివాసమై చెలిమి సేయుట నిట్టిప్రశాంతిగల్గెనో
కాకన నాతి దన్ని నవికాసము నొంది వనస్థలస్థితా
శోకము సేసె మెచ్చునఁ బ్రసూనరజఃకనకాభిషేకమున్. 131

టీ. తాఁచినన్ = తన్నినను, మేకొని = అంగీకరించి, భృగువున్ = భృగుమహా మునిని, మెచ్చిన వానికిన్ = మెచ్చుకొన్నయావెన్నునకు, మ...ర్య-మర్త్య = మను ష్యుఁడైన రామావతారమందలి, భార్య = గృహిణి, ఔ శ్రీకిన్ = ఐన శ్రీదేవియగు సీతకు, నివాసమై = ఉనికిపట్టై, చెలిమిసేయుటన్ = స్నేహముచేయుటచేత, ఇ... తి - ఇట్టి = ఈవిధమయిన, ప్రశాంతి = అధికశాంతి, కల్గెనో కాక = కలిగినకాక, అ నన్ = అనునట్లు, నాతి=ఒకయింతి, తన్నినన్ = తన్నఁగా, వికాసమునొంది = వికసిల్లి 'అశోకశ్చరణాహాత్యా' యన్నట్లనుట. వ...ము - వనస్థల = వనప్రదేశమందు, స్థిత= ఉన్నట్టి, అశోకము = అశోకవృక్షము, మెచ్చునన్ = సంతుష్టిచేత ప్ర...మున్ - ప్రసూనరజః = పుప్పొడియనియెడు, కనకాభిషేకమున్, చేసెన్ = ఒనర్చెను.

తా. తొల్లి భృగుమహాముని తన్నఁగాఁ గోపింపక మెచ్చుకొన్న విష్ణుదేవు నికి, రామావతారమందు భార్యయైన సీతాదేవికి లంకయందు నివాసస్థానమై చెలిమి చేయ నా సంబంధముచేతఁ దనకు నట్టి శాంతగుణము గలిగెనో యనున ట్లశోకవృక్షము దనొక్క నాతి దన్నఁగాఁ బుష్పించి పచ్చని పుప్పొడిచేత నాయింతికిఁ గనకాభిషేకముఁ జేసిన ట్లుండెను. భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యము నరయుటకై ఋషులచే నియమింపఁబడి విష్ణుమూర్తిని దన్నెను. (శివబ్రహ్మ లాతఁ డొనర్చిన యవమానము సహింపలేకపోయిరి. విష్ణువు సహించెను. అందుచే విష్ణువే పరమశాంతమూర్తి పూజా ర్హుఁడు నని భృగువు చాటెను.)

మ. అళు లేతద్వదనేందు రాగ మిళనా ప్రాదుర్భవత్కోరకం
బులతేనె ల్పృథలంచు రా నొకతె నోమ్మోమెత్తఁ జైత్రంపుఁబు

వ్వులలోఁ దద్గుణు లయ్యెఁ గంధఫలిఁ బువ్వు ల్వుట్టి పోఁదోలె నొ
చ్చెల చేఁదై తఱచెందుఁ [1]దల్లి బడిఁ గోల్చెట్టౌట యేకా మహిన్. 132

టీ. ఒకతె = ఒక్కచాన, నెమ్మోము మెత్తఁగ్ = ముఖమెత్తఁగా, అళులు = తుమ్మెదలు, ఏ...ల్ - ఏతద్వదనేందు - ఏతత్ = ఈనాతియొక్క, వదన = ముఖమని యెడు, ఇందు = చంద్రునియొక్క, రాగ = రక్తితోడ, మిళనా = కూడుటచేత, ప్రాదుర్భవత్ = పుట్టుచున్న, కోరకంబుల = మొగ్గలయొక్క, తేనెల్ = మకరందములు, సుధలంచున్ = అమృతములని, (తియ్యనైయుండు నవి యనుట), 'ముఖరాగేణ చంపకః' అనునట్లనుట. చైత్రంపుఁబువ్వులలోన్ = చైత్రుఁడు వికసింపఁజేసిన పుష్పములలో, తద్గుణులయ్యెన్ = ఆకాంతాముఖగుణములే కలవి యయ్యెనా యనికాకువు, (కాలేదనుట), గంధఫలిన్ = సంపెఁగయందు, పువ్వుల్వుట్టి = పుష్పము లుదయించి, చేఁదై = తిక్తమై, పోఁదోలెన్ = వెడలఁగొట్టెను, ఒచ్చెల=ఇది ఖేదోక్తి ఓచెల్లయనుటకు రూపాంతరము. ఎందున్ = ఎచ్చటనైనను, మహిన్ = భూమియందు, తఱచు = బహుళముగా, తల్లిబడిఁగోల్చెట్టౌటయేకా = తల్లివలెఁ బెరిఁగిన కోలిచెట్టువంటిదేకదా!

తా. ఒకస్త్రీ మొగమెత్తఁగా దాని ముఖచంద్రసుధసంయోగమువలనఁ బుట్టిన సంపెంగమొగ్గలలోని మకరందము చంద్రవలెనే తియ్యఁగా నుండు నని తుమ్మెదలు రాఁగాఁ జెట్టునఁ బుట్టుటచేఁ బూర్వపుగుణమే కలిగి సంపెంగ పువ్వులు తుమ్మెదలకు మిక్కిలీ చేఁదై చేరకుండఁ బాఱఁదోలెను; బిడ్డలకుఁ దల్లి గుణమే యుండు నని కదా లోకోక్తి. అర్థాంతరన్యాసాలంకారము.

చ. అలరెఁ బ్రియాళు వోర్తు ప్రియమాట వసంతముఁ బాడ నప్పు డ
వ్వెలఁదిసపత్ని భక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగమున్
ఛలమునఁ దన్నుఁ బాడఁగ వసంతుఁడు దా దయచేసెఁ గాక యా
[2]యెలె నిజశక్తినా యనుచు నీపసకుం గొదవెట్టె నీసునన్. 133

టీ. ఓర్తు = ఒక్కతె, ప్రియమాటన్ = తనకిష్టమాటవలన, వసంతమున్ = వసంతరాగమును, పాడన్ = గానముసేయఁగా, ప్రియాళువు = ప్రేంకణపుఁజెట్టు, అలరెన్ = పుష్పించెను, 'వసంతస్సహాయస్తు వసంతర్తౌ ప్రగీయతే' అను సంగీతశాస్త్రసంప్రదాయమునఁ బాడఁగా 'గీత్యా ప్రియాళు ర్నితరాం' అన్నట్లు పుష్పించెననుట. అప్పుడు = ఆకాలమందు, అ...త్ని - అవ్వెలఁది = ఆపాడినచేడెయొక్క,

1. తల్లిబడి కోల్చెవాట; తల్లిబడి కోల్చెట్లాట.

2. ...ఆ, యలె నిజశక్తి నా యనుచు నాపసకున్ గొదవెట్టె నీసునన్. (శ. ర. సా. వ్రాతప్రతిపాఠము)

సపత్ని = సవతి, వేల్పులు = దేవతలు, భక్తికిని, మెత్తురఁగానక్=మెచ్చుకొందురుగావున, రాగము = వసంతరాగము, అక్ఛలమునక్=అను నెపముచేత, తన్నుక్ = ఆవసంతుని, పాడఁగక్ = గానముసేయఁగా, వసంతుఁడు, తాక్ = తాను, దయచేసెఁగాక = కృప చేసెను గాని, ఈ ప్రియాళువును బుష్పింపఁజేసెనుగాని యనుట. నిజశక్తినా నిజ= ఈ బిడయొక్క, శక్తినా = సామర్థ్యముచేతనా, ఆయెలె = అప్పుడేయాయెలే, ఇది నిస్సారార్థకము. అనుచుక్ = అనిపల్కుచు, కాపసకుక్ = ఈ పాటఁబాడి పుష్పింపఁజేసిన స్వారస్యమునకు, ఈసునక్=సవతియందలి యీర్ష్యచేత, కొదవెట్టెక్ = కొఱఁతను ఆరోపించెను.

తా. ఓర్తు వసంతరాగముఁ బాడఁగాఁ బ్రేంకణము పూచెను; దానికి నాస్త్రీయొక్క సవతి మెచ్చుకొనక యీసుచేత వేల్పులు భక్తికి మెత్తురు గావున, వసంతమనియెడు తన పేరుగల రాగముచేతఁ దన్నుఁ బాడఁగా, నావసంత దైవతమే యీ చెట్టును బుష్పింపఁ జేసెనుగాని, యీపె కింత సామర్థ్యమా యని నిరసించెను.

తే. అధరసుధఁ బ్రాణిజతఁ బ్రాణి యగుచు మౌక్తి
కాండమాలిక నిడెను నాసాగ్రమౌక్తి
కంబ యనఁజాలు ననలిచ్చె గతజరత్సు
మంపు వావిలి మొగమూర్పు నింప నోర్తు. 134

టీ. ఓర్తు = ఒక్కతె, మొగమూర్పు = మొగమునందలి యుచ్ఛ్వాసమును, నిఁపక్ = నిండింపఁగా, 'సిందువారో ముఖానిలాత్' అనునట్లనుట. అధరసుధక్ = అధరమందలి యమృతస్పర్శముచేత, ప్రాణిజతక్ = ప్రాణముగల ముత్తెపుఁ జిప్పవలనఁ బుట్టినదగుటచేతక్, ప్రాణియగుచు=తానును బ్రాణము గలదగుచు, నాసాగ్రమౌక్తికంబ- నాసా = ఆపొలఁతిముక్కుయొక్క, అగ్ర=కొనయందలి, మౌక్తికంబ=ముక్తాభూషణమె, మౌ...కక్-మౌక్తికాండ = ముత్తెంపుగ్రుడ్లయొక్క, మాలికక్ = పఙ్క్తిని, ఇడెను = పెట్టెను, అనక్ = అనునట్లు, గతజరత్సుమంపు-గత = రాలిపోయిన, జరత్ = ముదురువైన, సుమంపు = పువ్వులుగల, వావిలి=నిర్గుండీవృక్షము, చాలు నన లిచ్చెక్=శ్రేణిగా నుండు మొగ్గలనీనెను.

తా. ఒక్క మగువ నిట్టూర్పు నింపఁగా దానివలనఁ బువ్వులు రాలిపోయిన వావిలిచెట్టునందుఁ గ్రొత్తగా శ్రేణిగట్టి మొగ్గలు గనిపించెను; అవి యాస్త్రీయొక్క యధరమందలి యమృత స్పర్శముచేతఁ బ్రాణము గల ముత్తెపుఁ జిప్పలోఁ దాను బుట్టియున్నందునను, దానును బ్రాణముగలదై యానెలఁత నాసాభూషణ మగు మౌక్తికము పాలుగా ముత్తెపు గ్రుడ్లు పెట్టిన ట్లుండెను.

చ. ఘనమగు నాకురాలి తిలకం బతిరిక్తత నున్న నోర్తు లోఁ
గనికర మూని కన్నుఁగవఁ గాయజుఁ డిల్లడ యిడ్డ తూపులే
యనువుగ నించెఁగాక మఱి యంటక ముట్టక యొక్కచేష్టలే
క నెగడెఁ జూడ్కి నంట యిది కల్లనఁగా నలరించెఁ జూపులన్.

టీ. ఓర్తు=ఒకయింతి, ఘనమగు = దట్టమైన, ఆకురాలి, తిలకంబు=బొట్టుగుచెట్టు, అతిరిక్తతన్ = మిక్కిలిదారిద్ర్యముచేత, ఉన్నన్ = ఉండఁగా, లోన్ = మనస్సులో, కనికరము = కారుణ్యమును, ఊని=ఊహించి, కన్నుఁగవన్ = తననేత్రద్వయమందు, కాయజుఁడు = పూవిల్తుఁడు, ఇ...లే-ఇల్లడఇడ్డ = దాఁచియుంచిన, తూఁపులే = బాణములే, అనువుగన్ = సొగసుగా, నించెఁగాక = ఈపె నిండించెఁగాని, మఱి = లేనియెడ, అంటకముట్టక = తగలకతాఁకకయే, (ఇది జాత్యుక్తి), ఒక్కచేష్టలేక = ఒకవ్యాపారము లేక, చూడ్కిన్=చూపుచేత, నెగడె నంట = వృద్ధియయ్యె ననుట, ఇది = ఈ పల్కు, కల్లనగా=అసత్యమనునట్లుగా, చూపులన్ = వీక్షణములచేత, అలరించెన్ = పుష్పింపఁ జేసెను, 'తిలకో వీక్షణేన చ' యన్నట్లనుట.

తా. ఒక బొట్టుగుచెట్టున నాకులు రాలి బీదగిలి యుండఁగా, నొకతె మిక్కిలి గనికరముతో దానిఁ జూడఁగా నప్పుడే తప్పక విప్పగల గొప్పపువ్వు లుప్పతిల్లె. నది మదనుని యంప గుదులం దాఁచియున్న యాచకోరలోచన కనులయందలి యా ములుకులు మరల వెడలించి యా తిలకముపై నెలయించెఁ గాని, లేకున్న నీజోక నంటక ముట్టకయే చిట్టలుం బెట్టకయే యట్టిపడ్డట్టు లిట్టు పువ్వులు పుట్టుట కల్ల యని యెల్ల రనునట్లొప్పియుండెను.

తే. సాంద్రమకరందవృష్టి రసాతలంబుఁ
దొరఁగు పువ్వుల భువియుఁ బూధూళి నభము
విక్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురువిరోచనజనిత మహోష్మ ముడుఁగ. 136

టీ. సాం...ష్టి-సాంద్ర = తఱచైన, మకరంద = పూఁదేనియలయొక్క, వృష్టి = వానచేత, రసాతలంబున్ = పాతాళమును, తొరఁగు = రాలుచున్న, పువ్వులన్=పుష్పములచేత, భువియున్ = భూమిని, పూధూళిన్ = పుష్పరజముచేత, (మిశ్రసమాసము), నభమున్ = ఆకాశమును, విక్రమత్రయిన్=ఈ చెప్పఁబడిన మకరంద పుష్పరజము లని యెడు మూఁడువిధములైన విక్రమముచేత, మాధవుఁడు = వసంతుఁ డనియెడు త్రివిక్రముఁడు; ఉ...మ-ఉరు = విస్తారమైన, విరోచన = సూర్యునిచేత, జనిత=పుట్టింపఁబడిన,

మహోష్మము = మహాప్రతాపము, అడఁగక్ = శాంతిబొందునట్లు, ఆక్రమించెక్ = త్రిలోకముల నాక్రమించెను.

తా. మాధవుం డని విష్ణునకుఁ దగిన పేరుగల వసంతుఁడు, సూర్యప్రతాపము బలిప్రతాపమువలె నడఁగునట్లు, పాతాళమర్త్య స్వర్గలోకములను వరుసగా మకరందపుష్పరజముచేత మూఁడడుగులచేత నాత్రివిక్రమునివలె నాక్రమించెను, వసంతర్తువునందు సూర్యుఁ డంత విస్తారముగా వేఁడిమిఁ జూపఁడని భావము. ప్రకృత వసంతవర్ణనముచేత నప్రస్తుత త్రివిక్రమ పరిస్ఫూర్తి గలుగుటవలన సమాసోక్త్యలంకారము.

క. ఊఁదుకొనఁ బడుమధూలిక
యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్
నీడలు దిరిగియుఁ దిరుగని
జాడఁ దరు ల్వొలిచె నవ్వసంతపువేళన్. 137

టీ. ఊఁదుకొనక్=భూమియూటపట్టునట్లు, (ఊఁదుకొను. నాఁటు అని సూ. ని. కాని యర్థ మిట సరిపడునట్లు తోఁచదు. ఊఁదుకొను=ఊఁదుచుకొను చుఁలోపము. కొను స్వార్థమున నైనపుడు ఊదుకొను = బురదయగు అనుట యుక్తము.) ప...డుక్-పడు=స్రవించుచున్న, మధూళిక = మకరందధారలయొక్క, ఓడికలకుక్ = ప్రవాహములకు, క్రిందక్=అధోభాగమందు, క్ర...ట్లక్-క్రమ్మియుండెడు=ముసరుకొన్న, తేంట్లక్ = తుమ్మెదలచేత, నీడలు దిరిగియుక్=ఛాయలు ప్రొద్దువెంబడి మఱియొకదిక్కునకుఁ దిరిగియుఁను, తిరుగనిజాడక్ = తిరుగనిరీతిగానే, తరుల్ = వృక్షములు, అవ్వసంతపువేళక్= ఆవసంతకాలమందు, పొలిచెక్ = ఒప్పెను.

తా. ఆ వసంతర్తువునందు మకరంద మధికమై స్రవింపఁగా నావాసనకుఁ జెట్ల క్రింది భూమిమీఁదఁ దుమ్మెదలు గ్రమ్ముకొని లేవక నల్లనై యుండెఁ గావునఁ బ్రొద్దువెంట నీడలు దిఁగినను దిరుగనియట్లే యీచోట్లు నీడలవలె నుండెను.

చ. శతదళమంజరీధవళచైత్రనిశామలచంద్రికౌఘముల్
వృత వియదంత కేళి వనవృక్ష లతాంతరజశ్ఛట న్గళం
కితఁ గని కామినీకమనకేళియుఁ బోఁ జెడవా నగాటవీ
కతకపరాగ మొక్కదెసఁ గ్రమ్మి యనచ్ఛత మాన్పకుండినన్.

టీ. శ...ల్-శతదళ = తెల్లదామరపువ్వులయొక్క, మంజరీ = గుత్తులవలెనే, ధవళ = తెల్లనైన, చైత్ర=చైత్రమాససంబంధినులగు, నిశా = రాత్రులయందలి, అమల= స్వచ్ఛమైన, చంద్రికా = వెన్నెలలయొక్క, ఓఘముల్ = జలప్రవాహములు, 'ఓఘః వితానే వేణ్యాం చ' అని నిఘంటువు. వృత=ఆవరింపఁబడిన, వియదంత=ఆకాశప్రదేశము

గల, కేళివన = ఉద్యానవనములయందలి, వృక్ష = చెట్లయొక్క, లతాంత=పుష్పముల యొక్క, రజః = పరాగముయొక్క, ఘటన్ = సమూహముచేత, కళంకితన్ = బురద గలుగుటను, కని = పొంది, న...ము-నగాటవీ-నగ = పర్వతములయందలి, అటవీ=అడవుల యందలి, కతక = చిల్లచెట్లయొక్క, పరాగము = రజము, ఒక్కదెసన్=ఒకదిక్కునందు, క్రమ్మి = వ్యాపించి, అనచ్ఛతన్ = స్వచ్ఛముగాకుండుటను, మాన్పకుండినన్ = పోగొట్టకుండుటచేత, కామినీకమన = విటీవిటులయొక్క, కేళియున్ = క్రీడయును, పోన్ = పోవునట్లుగా, చెడవా = చెడిపోవా, (పోవుననుట).

తా. తెల్లనైన చైత్రమాస రాత్రులయందలి వెన్నెల లనియెడు నిర్మలోదక ప్రవాహము లుద్యానవనములలోని పుష్పాదుల తిప్పలచేతఁ గలఁగినవై యుండఁగా నవి తేఱుట కొకమాలను గొండల యడవులలోని చిల్లచెట్ల పుష్పాదులు వ్యాపించి యా కలఁక దీర్చి యా నీరు దేర్చిన తెనైయుండునే కాక, యట్లు చేయకుండిన నా ప్రవాహములు విటీవిటుల క్రీడల కుపయోగింపక తాముఁ జెడిపోవును. (బురదనీటిలోఁ జిల్లపొడిరాల్చిన నీరు తేరుట ప్రసిద్ధము).

సీ. శైత్యపాండిమలు దుషారాంతమునఁ జేరె
　　ఇరులుకొ ద్రాక్షపందిరుల విరుల
వలయగానముల యురక్తలకార్శ్యమునఁ జేరె
　　మలయంపుఁ గమ్మపోవలులనలుల
సౌరభోల్లాసముల్జాతి గ్రుంగఁగఁ జేరె
　　నలరారు కొదమ క్రోవులను నెలను
స్ఫుట జటామస్కరంబులు ప్రతిచ్యుతిఁ జేరె
　　నంచన ప్లక్ష సంతతుల వృతుల
తే. స్వభృతపరభృత వినుత రసాలపరిష
దమారహార్క్ష ప్త బహురహాస ప్రహారవిహార
మాణ మానవతీ *పరిమ్లానిమాని
వారి వారిజ వనగంధవాహ మొలసె. 139

టీ. తుషారాంతమునన్-తుషార = మంచుయొక్క, అంతమునన్ = నాశకాల మందు, (శిశిరర్తువు గడవఁగాననుట), శైత్యపాండిమలు = చల్లఁదనమును దెల్లఁదనమును, (ఇవి మంచిగుణములు), ఇరులుకొన్ = చీఁకట్లు గ్రమ్ముచున్న, ద్రాక్షపందిరులన్ = ద్రాక్షా కాయమానములయందును, విరులన్ = పుష్పములయందు, చేరన్ = ప్రవేశిం

* రతి.

చెను. (ద్రాక్షపందిళ్లు బలసి యల్లికొనెఁ గావున నచ్చటఁ జల్లఁదనమును, పుష్పములు వికసిల్లఁగా నందుఁ దెల్లఁదనమును జేరె ననుట), అ...నన్—అయుక్తుల = ప్రియులతోఁ గూడికొనని విరహముగల స్త్రీలయొక్క, కార్శ్యమునన్ = కృశించుటయందు, వలయగానములు = వారియొక్క కంకణములును సంగీతములును, మలయంపు = మలయ పర్వతసంబంధులగు, కమ్మ = పరిమళించుచున్న, వీవలులన్ = వాయువులయందును, అలులన్ = తుమ్మెదలయందును, చేరన్ = ప్రవేశించెను, (విరహముచేత స్త్రీలు కృశింపఁగా వారి కంకణములు దూసిపోయె ననియుఁ, జింతచేత గానములు మానిరనియు, నా చిహ్నములు వరుసగా సుడిగాడ్పులయందుఁ గంకణత్వమును దుమ్మెదలయందు గానమును జేరె ననుట), జాతి = జాజి, (జాత్యేకవచనము), క్రుంగఁగన్ = అడఁగి పోఁగా, సౌరభోల్లాసముల్ = వానియొక్క పరిమళ ప్రకాశములు, అలరారు = పుష్పించుచున్న, కొదమ క్రోవులను = గున్నలయిన క్రోవిచెట్లయందును, (పరిమళ మనుట), నెలను = చంద్రునియందును, (ప్రకాశ మనుట). చేరన్ = ప్రవేశించెను, ప్రతిచ్యుతిన్-ప్రతి = సన్న్యాసులయొక్క, చ్యుతిన్ = జాఱుటచేత, (వసంతర్తువు రాఁగానే సన్న్యాసులు వ్రతమును గాపాడుకోఁజాలక పోయిరనుట), స్ఫుట = స్పష్టము లగు, జటా = వారియొక్క జడలును, మస్కరంబులు = వేణుదండములును, నందన = ఉద్యానములలోని, ప్లక్ష = జువ్విచెట్లయొక్క, సంతతులన్ = సమూహములయందు, (జటా స్వరూపములుగ నూడలు దిగె ననుట), వృతులన్ = ఆవరణములయందు,(వెలుఁగులవెదుళ్లు గానవచ్చె ననుట). 'వేణుమస్కరతేజనా' అనియును, 'ప్రాచీనం ప్రాంతతో వృత్తి' అనియు నిఘంటువులు. చేరన్ = ప్రవేశించెను, స్వభృత = తమచేతఁ బోషింపఁబడిన, పరభృత = కోయిలలచేతను, వినుత = శ్లాఘింపఁబడిన, రసాల = తియ్యమామిళ్లయొక్క, పరిషత్ = గోష్ఠులయందు, అహరహః = దినదినమును క్లప్త = చేయఁబడిన, బహు = అనంతములగు, రహః = ఏకాంతములందలి, ప్రహర = జాముల యందు, విహరమాణ = విహరించుచున్న, మానవతీ = ఈలువుటాండ్రయొక్క, పరిమ్లానిమ = హెచ్చైనబడలికను, అనివారి = మిక్కిలి నివారించుచున్న, వారిజవనగంధ వాహము = కమల వనములమీఁదుగా వీచెడు వాయువు, ఒలసెన్ = విసరెను.

తా. మామిడితోఁటయందుఁ గోయిలలు చిగుళ్లకొఱకు గుంపులు గూడి కూయఁచుండఁగా నవి యనియెడు గడియారములచేతఁ బ్రొద్దులు గడపుచు స్త్రీ లుండఁగా వారి బడలికలు వాయువులు దీర్చును. కడమ సుగమము. పర్యాయాలంకారము. 'పర్యాయో యది పర్యాయేణైకస్యానేకవర్ణన' మ్మని దానిలక్షణము.

ఉ. సారెకుఁ గీరము ల్ఫలరసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం
గా రహిఁ దన్మధూళికకుఁ గా నళిపఙ్క్తులు వెంట గ్రుమ్మరం
గా రొదమించె నందుఁ జిలుక ల్వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం
ధోరుచు లానఁగా సరిపెణు ల్జనుల ట్లిడి పెంపఁగా బలెన్. 140

టీ. సారెకున్ = మాటిమాటికి, కీరముల్ = చిలుకలు, ఫల = పండియున్న, రసాలము = తియ్యమామిడియొక్క, శాఖలలోనన్ = కొమ్మలలోపల, త్రిమ్మరంగాన్ = సంచరించుచుండఁగా, రహిన్ = శృంగారమును, తన్మధూళికకుఁగాన్ - తత్ = ఆఫలములయొక్క, మధూళికకుఁగాన్ = రసధారకుఁగాను, అళిపఙ్క్తులు = తేఁటిచాళ్లు, క్రుమ్మరంగాన్ = తిరుగఁగా, అందున్ = ఆవనమందు, వనలక్ష్మియున్ = వనదేవతయును, తద్వచస్సుధాంధోరుచులు - తత్ = ఆచిలుకలయొక్క, వచః = పలుకు లనెడు, సుధాంధః = అమృతరూప మగునన్నముయొక్క, రుచులు = చవులను. ఆనఁగాన్ = ఆస్వాదించుటకై, జనులట్ల = భూప్రజలవలెనే, సరిపెణల్ = గొలుసులను, ఇడి = ఉనిచి, చిలుకల్ = చిలుకలను, పెంపఁగాబలెన్ = పెనుచుచున్నట్లు, రొద = ధ్వని, మించెన్ = అతిశయించెను.

తా. పండిన తియ్యమామిడి కొమ్మలలోఁ దిరుగుచున్న చిలుకల వెంబడి తుమ్మెదలు మెదలఁగా నవి సరిపెణులవలె నుండెఁ గావున, వనలక్ష్మియుఁ నిలుకల పలుకులు విని యలరుటకై మనుష్యులవలెనే చిలుకలకు గొలుసులు వేసి పెనుచు చున్నట్లుండఁగాఁ జిలుకలు రొదసేసెను.

సీ. ప్రతిహాంతృతాత్తకోటత చన్న భృంగసం
ఘపుటంగములచేతఁ గాయమెత్తి
యమదిశాగత మరుత్త్వాత్రిణియై *దదళిరం
గస్థలాబ్జినిఁ దమ్మికన్ను దెఱచి
ప్రాంతఫుల్లామ్ర సంశ్రయి తచ్ఛటాహారో
ద్గతి లేచి చెలిఁ జైత్రుఁ గౌఁగిలించి
యురు పరాగపుకాటి నుద్దండ వాప్యుత్ప
లస్రవత్సీధు రత్యస్ర ముడిపి
తే. క్రమ్మఱఁ బలాశ కటకాముఖమునఁ గీర
చలితశాఖాస్ఫుటాశోకశిరముఁ గూర్చఁ

* వికచరంగత్స్థలా; కదళీరంగస్థలా.

దద్రతికిఁ గాఁగఁ చలికాలఁ దన్ని మంచు
పాండురాంగుఁడు విడిచిపోఁ బ్రదికి మరుఁడు. 141

టీ. మరుఁడు = మన్మథుఁడు, వ్ర...త - వ్రతి = వ్రతములు గలవారియొక్క, హంతృతా = హత్యచేతను, ఆప్త=సంభవించిన, కీటత=పురుగగుట, చన్నక్ = పోఁగా, భృం...తక్ - భృంగసంఘపు = తేఁటిగుంపులనెడు, అంగములచేతక్ = అవయవముల చేత, కాయమెత్తి=(తాను) దేహమెత్తి, (సన్న్యాసులను జంపుటచేతఁ బురుగు జన్మము వచ్చెననుట), య...ణి-ఐ-యమ = యమునియొక్క, దిశా = దిక్కువలన, ఆగత = వచ్చినట్టి, మరుత్ = వాయువుచేత, ప్రాణి ఐ = ప్రాణములుగలవాఁడై, త...లిక్-తదళి = మున్నుచెప్పఁబడిన తుమ్మెలకు, రంగస్థల = నృత్తస్థలమైన, అబ్జినిక్ = కమలలత యందు, తమ్మి = తామరయనియెడు, కన్ను = నేత్రమును, తెఱచి = విచ్చి, (అందఱ ప్రాణములు దీయువాఁడు యముఁడు మరల నీ మరుని ప్రాణములను బాపె ననుట, పుట్టినపిదప శిశువు గన్నుదెఱచు ననుట), ప్రాం...తిక్ - ప్రాంత = సమీపమందలి, ఫుల్ల = పుష్పించిన, ఆమ్ర = మామిడిచెట్టును, సంశ్రయ = ఆశ్రయించినట్టియు, తచ్ఛటా-తత్ = ఆతుమ్మెదలయొక్క, ఛటా = సమూహముయొక్క, హాతాద్గతిక్ = అలవోకచేతను, లేచి = ఉద్గమించి, చెలిక్=స్నేహితుడైన, చైత్రుక్ = వసంతమాసమును, కౌఁగిలించి = ఆలింగనముచేసికొని, (ఎడఁబాసి యాపదఁజెందినవారు తమచెలినిఁ జూడఁగానే కౌఁగిలించుకొనుట ప్రసిద్ధము), ఊ...టిక్ - ఊరు = విస్తారమగు, పరాగపు = పుప్పొడిరూపమగు, శాటిక్ = వస్త్రముచేత, ఉద్దండ = అధికమగు, వాపి = డిగ్గియయందలి, ఉత్పల = కలువపువ్వువలన, స్రవత్ = జాఱుచున్న, సీధు = మకరందమనియెడు, రత్యస్రము-రతి=తనభార్యయగు రతీదేవియొక్క, అస్రము = కన్నీటిని, ఉడిపి = తుడిచి, (తన విరహముచేత రతీదేవి దుఃఖించు చుండఁగా మరల నుదయించి యాయమకన్నీరు దుడిచె ననుట), క్రమ్మఱక్ = మరలను, ప...నక్-పలాశ = మోదుగుఁబువ్వనియెడు, కటకాముఖమునక్ = కటకాముఖమనుహస్తమందు, 'తర్జనీమధ్యమామధ్యే పుంఖో౽౦గుష్ఠేనపీడ్యతే, యస్మిన్ననామికాయోగాత్ సహస్తః కటకాముఖమ్' అని తల్లక్షణము. కీ...ముక్-కీర=చిలుకచేత, చలిత = కదలింపఁబడిన, శాఖా = కొమ్మయందు, స్ఫుట=వికసించిన, అశోక = అశోక పుష్పమనియెడు, శరముక్=బాణమునకు, కూర్చెక్ = సంధించెను, మ...డు - మంచు = శిశిరర్తువనియెడు, పాండురాంగుండు = తెల్లనిశరీరముగల శివుఁడు, తద్రతికిఁగాఁగక్ = అట్టిరతీదేవికొఱకు, చలికాలక్ = చలియనుపాదముచేత, తన్ని = తాఁచి, విడిచి = ఇతనినంతట విసర్జించి, పోక్ = పోఁగా, బ్రదికి = జీవించి, కూర్చెననుదానితో నన్వయము, (చలికాల మనియెడు శివుఁ డీ మన్మథునిం దుదముట్టఁ

జంపక, కాలఁ దన్ని రతీదేవియందుఁ గరుణించి, యామెకై వీనిని విడిచెఁ గావున, జైఁ జెప్పినట్లు బ్రదికి యిట్లాయె ననుట).

చ. చిగురుఁ బికాళికి న్ఫలముఁ జిల్కలగుంపునకు న్మధూళిఁ దేఁ
టిగమికిఁ దావి గాలికి విటీవిటకోటికిఁ బువ్వులుం దలం
బుగఁ గృప నీనియు న్సురభి పుంస్త్వముఁ బాంథులచోటఁ బూనెన
ట్లగుఁ బ్రజ కోర్కులిచ్చు తన యాత్మఁ దలంచినదబ్బదే యనన్.

టీ. సురభి = వసంతర్తువు, (కామధేనువు ననియుం జెప్పఁదగు), పికాళికిన్ = కోయిలచాలునకు, చిగురు = పల్లవమును, చిల్కలగుంపునకున్ = శుకసమూహమునకు, ఫలమున్ = పండును, తేఁటిగమికిన్ = భృంగచయమునకు, మధూళిన్ = మధుధారను, గాలికిన్ = మలయమారుతమునకు, తావిన్ = పరిమళమును, విటీవిటకోటికిన్ = కామినీకమనసముదాయమునకు, పువ్వులున్ = పుష్పములును, దలంబుగన్ = దట్టముగా, కృపన్ = దయచేత, ఈనియున్ = ఇచ్చియును, (ఈనుట స్త్రీధర్మముగనుక నది గలిగియు నని పుంస్త్వవిరోధము), అట్లగున్ = ఆరీతి యగును, ప్ర...బు-ప్రజ=జనము యొక్క, కోర్కులు = కామితములను, ఇచ్చు = ఒసఁగునట్టి, తనకున్, ఆత్మన్ = బుద్ధియందు, తలంచినది = ఊహించినది, అబ్బదే = లభింపదా, అనన్=అనునట్లు, పాంథుల చోటన్ = విరహులవిషయమున, పుంస్త్వమున్ = మగతనమును, పూనెన్=వహించెను, (విరహులనుమాత్రము బాధించె ననుట).

తా. సురభి యనఁగా వసంతర్తువును గామధేనువునుగాన, నది స్త్రీవ్యక్తియైన నందఱకుఁ గోరిక లిచ్చునట్టి సామర్థ్యము గలిగి యున్న తనకు ఆమగతనము గోరినచో రాదా యనునట్లు పుంస్త్వముం దాల్చెను.

సీ. సహకార ఫలరస సౌరభ్యములఁ గూడి
మాధ్వి మోవులఁ గదంబముగ వలవ
మలయజోదరత జంభల ఫలత్వగ్గత
శ్రీ మించుచెవులఁ గోజ్జెఁగలు మెఱయ
శశి కదళోదరచ్ఛదపుఁ బావడలూరు
చకచకఁ బట్టి పాలికిఁ బెనంగఁ
ద్రోక్కు తేంట్లకుఁ గాక లెక్కింపఁ జెరివిన
గంధఫలీపజ్క్తిఁ గబరు లలరఁ

తే. [1]గేలఁ గలవంటకపుఁదావికిని బులిమిన
ఘుసృణములు మించ నసల బేరెసఁగెడు వన

---

1. గేలుఁగల వంటకపుఁ దావికిని బులిమిన, ఘుసృణమును మించు నసల చేరెసఁగుఁ భువన్యముల నషేరు రజోవృష్టి బూద సరవ.

ములు నమేరురజోవృష్టిఁ గ బూదిఁ జఱవ
నింతు లెనసిరి పూఁబొదరిండ్లఁ బతుల. 143

టీ. స...లన్-సహకారఫల = తియ్యమామిడిపండ్లయొక్క, రస=రసముయొక్క, సౌరభ్యములన్ = పరిమళములను, కూడి = కలిసికొని, మాధ్వి = తేనె, మోవులన్ = వాతెఱలయందు, కదంబముగన్ = కలపముగా, వలవన్ = పరిమళింపఁగా, (మామిడి పండ్లరసమును మద్యమును స్త్రీలు గ్రోలుదు రనుట), మ...తన్-మలయజ = చందనము, ఉదరతన్ = లోపలఁగల్గియుండుటచేత, జం...శ్రీన్ - జంభలఫల = దూదినిమ్మపండ్ల యొక్క, త్వక్ = చెక్కులను, గత = పొందిన, శ్రీ = కాంతివంటికాంతిచేత, మించు = అతిశయించుచున్న, చెవులన్ = శ్రోత్రములయందు, గొజ్జెఁగలు = గొజ్జెఁగపూలు మెఱయన్ = ప్రకాశింపఁగా, (స్త్రీలు గొజ్జెఁగపూలను కర్ణభూషణములుగా నునిచికొని రనుట), క...లు - కళికదళ = కర్పూరపుటరఁటిచెట్టుయొక్క, ఉదర = గర్భమందలి, ఛదపు = మోపువంటి, పావడలు = అంగదట్టములు, ప్రావారములు, ఊ...కన్ - ఊరు = తొడలయందలి, చకచకన్ = మెఱసెడుకాంతిని, పట్టి = అవలంబించి, పొలికిఁ బెనంగన్ = భాగమునకుఁ బెనఁగులాడఁగా, (లేఁత యరఁటిమోవులవంటి పావడలు గట్టుకొని రనుట), తొ...కన్-తొ్రొక్క = (వాసనలకై తమతలలు) ద్రొక్కుచున్న, తేంట్లకున్ = తుమ్మెదలకు, కాఁకలు = తాపములను, ఎక్కింపన్ = అతిశయింపఁజేయు టకు, చె...క్తిన్-చెరివిన = తుఱిమినట్టి, గంధఫలీపఙ్క్తిన్ = సంపెఁగపూలచాలుచేత, కబరులు = క్రొమ్ముడులు, అలరన్ = ప్రకాశింపఁగా, (తమ తలలమీఁద వ్రాలుచున్న తేఁటులకోటుపడి వానికి భయముకొఱకు సంపెఁగపూలు దుఱిమి రనుట). కేలన్ = హస్తమందు, క...కిన్-కలవంటకపు = చిత్రాన్నములయొక్క, తావికిన్ = పరిమళము పోవుటకుగాను, పు...లు - పులిమిన = పూసికొనియున్న, ఘుసృణములు = కుంకుమపుఁ బూఁతలు, మించన్ = అతిశయింపఁగా, [శర్కరాన్నము (చక్కెరపొంగలి) మొదలగు కలవంటకములను భుజింపఁగా నావాసన తెలియకుండుటకుఁ జేతులయందుఁ గుంకుమ పూవుఁ జేర్చి రనుట], ననలన్ = పుష్పములచేత, పే...లు - పేరెసఁగెడు = మిక్కిలి యొప్పుచున్న, వనములు = తోఁటలు, న...ష్టిన్ - నమేరు = సురపొన్నలయొక్క, రజః = పుప్పొడులయొక్క, వృష్టిన్ = కురియుటచేత, బూదిన్ = భూతిని, (దుమ్ము ననుట), చఱవన్ = పూయుచుండఁగా, (స్త్రీలమీఁదఁ బుప్పొడులు రాలుచుండు ననుట), ఇంతులు = యువతులు, పూఁబొదరిండ్లన్ = పూచిన నికుంజములయందు, పతులన్ = తమనాథులను, ఎనసిరి = పొందిరి.

తా. స్త్రీలు లెస్సగా నలంకరించుకొని నికుంజగృహములయందుఁ దమ నాథులతోఁ గ్రీడించిరి.

వ. అట్టి వసంత సమయంబున. 144

ఉ. కామిని మేఘరంజి మధుగర్వ మడంతు నటంచు లో నిజ
క్షేమముఁ గోరి పాడి మణిచిత్రమరుత్తృణతాచిరద్యుతి
స్తోమవలాహకావలులు దోఁచి ప్రఫుల్లకదంబకేతకో
ద్దామ సమీరణాహతులఁ దాపము నీ నొరగు న్విచేష్టతన్. 145

టీ. కామిని = చూడికుడుత్తనాచ్చియారు, మధుగర్వము - మధు = వసంతర్తువు యొక్క, గర్వము = క్రొవ్వును, అడంతు నటంచున్ = అడఁచెద నని, లోన్ = అంతరంగమందు, నిజక్షేమమున్ = తన సేమమును, కోరి = అపేక్షించి, మేఘరంజిన్ = మేఘరంజి యనియెడురాగమును, పాడి = గానముచేసి, మ...లు - మణి = మణిమయమైనట్టియు, చిత్ర = నానావర్ణములుగల, మరుత్తృణత = దేవధనువు, అనఁగా నింద్రచాపమును, అచిరద్యుతి = మెఱుములయొక్కయు, స్తోమ = సమూహముగల, వలాహక = మేఘములయొక్కయు, బెగ్గురుపులుఁగులయొక్కయు, అవలులు = పఙ్క్తులు, తోఁచి=కనఁబడి, ప్ర...లన్ - ప్రఫుల్ల = వికసిల్లిన, కదంబ = కడిమిపూవులయొక్కయు, కేతక = గేదంగులయొక్కయు, ఉద్దామ = అధికమగు, సమీరణ = వాయువుయొక్క, ఆహతులన్ = వీచుటలచేత, తాపమున్ = సంతాపము, ఈన్ = కలుగఁజేయఁగా, విచేష్టతన్ = చేష్టలుడుగుటచేత, ఒరగున్ = సోలును, (ఇచట మూర్ఛారూపమయిన మన్మథావస్థ చెప్పఁబడినది).

తా. వసంతర్తువు హెచ్చి యుండుటచేత దానిమద మడంతు నని తన క్షేమముఁ గోరి మేఘరంజిరాగము నా చూడికుడుత్తనాచ్చియా రాలాపముఁ జేయఁగా, నంత మేఘోదయమై వెంటనే యాచిహ్నము లన్నియుఁ గల్గి యావర్షర్తువునందుఁ బుష్పించెడు కడిమి గేదఁగి పూలమీఁదుగా వాయువులు విసరుటవలన మిక్కిలి తాప మొదవఁగా నాయమ చేష్టలు దక్కి మూర్ఛ మునిఁగెను.

తే. అతివ పూర్ణేందు భీతిఁ దదశ్మశాలఁ
దొంగి యతఁ డందు నినుమడి తీండ్రఁ దోఁప
మింటి పయినుంట గా దని యింటిపైకిఁ
దెచ్చుకొంటి నటంచుఁ బెన్ జిచ్చు వెడలు. 146

టీ. అతివ = ఆయింతి, పూ...తిన్ - పూర్ణేందు = నిండుచందురునివలన, భీతిన్ = భయముచేత, తదశ్మశాలన్ = ఆచంద్రకాంతశాలయందు, తొంగి = పరుండి, (శయ

నించి యనుట), అతఁడు = ఆ చంద్రుఁడు, అందు = ఆ చంద్రకాంతశాలయందు, ఇ...ద్రన్-ఇనుమడి = ద్విగుణమయిన, తీంద్రన్ = వేంద్రముగా, తోఁపన్ = కనఁబడఁగా, మింటిపైన్ = ఆకసముమీఁద, ఉంట=ఉండుట, కా దని = కూడ దని, ఇంటిపైకిన్=గృహముమీఁదికి, తెచ్చుకొంటిన్, (ప్రతిబింబరూపముగా ననుట), అటంచున్ = అని, పెన్ టిచ్చన్ = మిక్కిలిచీఁదఱచేత, వెడలున్ = ఆ చంద్రకాంతశాలనుండి వెడలును.

తే. భ్రమరగీతిక మాయ విపంచి మీట
దాన శ్రుతిఁగూడి మిగులఁ దద్రక్తి హెచ్చ
వే నివారించి లేచి దైవికము నెదుట
యుక్తులు ఫలింప వనుచు బిట్టార్చి నవ్వు. 147

టీ. భ్ర...క-భ్రమర = తేఁటులయొక్క, గీతిక = పాట, మాయన్ = మాయుటకు, (వినరాకుండుట కనుట), విపంచిన్=వీణను, మీటన్ = వాయింపఁగా, దానన్= ఆమీటుటచేత, శ్రుతిన్ = సుతియందు, కూడి = కలసికొని, మిగులన్ = అధికముగా, తద్రక్తి = ఆ భృంగగానానురక్తి, హెచ్చన్ = అతిశయింపఁగా, వే = వేగముగాను, నివారించి = చాలించి, లేచి, దైవికము నెదుటన్ = దైవయత్నముముందఱ, యుక్తులు = మనయుక్తులు, ఫలింప వనుచున్ = తుదముట్టవని, బిట్టార్చి = పెద్దనిట్టూర్పు విడిచి, నవ్వున్ = హసించును. (పూర్వపద్యమున నున్న యతివ యను కర్తృపదమున కనువృత్తి చేసికోవలయును).

తే. వెలఁది కతితాపదం బయ్యె విరులపాన్పు
మును దదంఘ్రిహతాది భర్త్సనలు గన్న
తరులఁ బొడమిన వ్రాఱట దన కొసఁగునె
పొంచి తటివేచి మిగుల నొప్పించుఁగాక. 148

టీ. వెలఁదికిన్=ఆయింతికి, విరులపాన్పు = పుష్పశయ్య, అతితాపదంబయ్యెన్ =మిక్కిలితాపముచేసెను, మును=పూర్వము, త...లు - తదంఘ్రిహతాది - తత్ = ఆయమయొక్క, అంఘ్రిహత=కాలితన్నులే, ఆది=మొదలగు, భర్త్సనలు=తిరస్కారములను, క...లన్ - కన్న=పొందిన, తరులన్ = వృక్షములయందు, పొడమినవి= పుట్టినయాపుష్పములు, పొంచి=వంచించి, తటివేచి=సమయముఁగనిపెట్టి, మిగులన్ = అధికముగా, నొప్పించుఁగాక = నొప్పిగలుగఁజేయునేకాక, తనకు, ఊఱట = సుఖమును, ఒసగునె=ఇచ్చునా, (ఇయ్య వనుట.) అనఁగా, దోహదములయందు తన చే

'అశోకశ్చరణాహత్యా వకుళో ముఖసీధురా' అన్నట్లు, పాదతాడనాదులగు తిరస్కారములఁ జెందిన యశోక వృక్షము మొదలగునవి సుఖము నీయ వనుట.

శా. పూజాదంభమునన్ బరాకుమెయి ముందున్ బ్రోఁ బోఁడి నేర్పూఁది చే
తోజాతానల మార్ప శాస్త్రసరణిన్ దూలి న్హరి న్వ్రాసి ల
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయవాలోకం బేయుచో వెండి వ
క్షోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీసున్దాపమున్ మీఱఁగన్. 149

టీ. ప్రోఁబోఁడి = అవనిత, పూజాదంభమునన్ = పూజయనెడు వ్యాజముచేత, పరాకుమెయిన్ = హెచ్చరికలేనియట్లు, మున్ = మొదలను, నేర్పు=సామర్థ్యమును, ఊఁది=అవలంబించి, చేతోజాతానలము = మన్మథాగ్నిని, ఆర్పన్ = మాన్పుటకు, శాస్త్రసరణిన్=శాస్త్రమార్గముచేత, తూలిన్ = తూలికచేత, హరిన్ = శ్రియఃపతిని, వ్రాసి=లిఖించి, ల...ష్టిన్ - లజ్జా=సిగ్గుచేతనయిన, జాడ్య=జడభావముచేత, ఆకుల=వ్యాకుల మగు, దృష్టిన్=చూడ్కిచేత, ప్రత్యవయవ = ప్రతియవయవముయొక్క, ఆలోకన్=చూచుటను, చేయుచోన్ = ఒనర్చునెడ, వెండి = మరల, వ...మన్ - వక్షః=ఆస్వామివక్షస్థ్సలమందు, జాగ్రత్=విలసిల్లుచున్న, రమన్=శ్రీదేవిని, కాంచి=చూచి, ఈసున్ = (సపత్నీభావమున నగు) ఈర్ష్యయును, (ఇది యీర్ష్యాశబ్దభవము), తాపమున్ = సంతాపమును, మీఱఁగన్ = అతిశయింపఁగా, తల్లడిలున్=పరితపించును.

తా. ఆ లేమ తనవిరహ మార్పఁ దలంచి శాస్త్రోక్త మార్గముగా వక్షస్థ్సలమందు శ్రీదేవి గలుగునట్లు, స్వామియొక్క రూపమును బూజావ్యాజముచేతఁ బరాకుగాఁ జిత్తరువునందుఁ గలమతో వ్రాసి, పిమ్మట లజ్జనొంది, యాస్వామియొక్క ప్రత్యవయవ సౌష్ఠవమును జూచుచున్నప్పుడు వక్షస్థ్సలమందుఁ దాను వ్రాసిన లక్ష్మీదేవిని చూచి, తన సవతి యగుట నీసును దాపము నతిశయింపఁ దల్లడిల్లు చుండును.

చ. కుముదసరస్తటస్ఫటికకూలవనోత్పలశయ్య వ్రాలి పూ
ర్ణిమలఁ బికాళి కుట్టుసుఱు ద్రిక్కఁగ ధర్మపుదార వట్టు శే
షము రెయి మల్లికాళిరుతి సక్కఁగఁ జేయకయుండ నిల్పు నా
యమ మఱునాఁటికిం గలుగ నాంతగళచ్ఛ్రితిగుంభితాశ్రువుల్. 150

టీ. కుముదసరః = వెలిగలువడిగ్గియయొక్క, తట = దరియందలి, స్ఫటిక = స్ఫటికమణివికార మగు, కూల=తీరమందలి, వన = ఉద్యానమందు, ఉత్పలశయ్యన్ = కలువపూలపాన్పునందు, వ్రాలి = సొరఁగి, పూర్ణిమలన్ = పున్నమలయందు, పికాళిన్ = కోయిలగుంపుచేత, కుట్టుసుఱు = కొఱప్రాణము, త్రిక్కఁగన్ = మిగులునట్లు, ధర్మపు ధార=ధర్మోదకధారను, ప...ముపట్టు=గ్రహించుపట్టి, శేషము = మిగిలియున్నదాని,

రేయి=రాత్రియందు, మ...లి-మల్లికా = మల్లెపూలయందలి, అళి=తుమ్మెదలయొక్క, రుతి = ధ్వని, చక్కఁగఁజేయకయుండక = కడతేర్పకుండునట్లు, ఆయమ = ఆమె, మఱునాఁటికిక = మఱుచటిదినమునకు, కలుగక=ఉండుటకు, నా...ల్ - నాంత= అనంతముగ, గళత్=జాఱుచున్న, శ్రుతి=చెవులయందు, గుంభిత=నింపఁబడిన, అశ్రువుల్= కన్నీళ్లు, నిల్పుక=నిలుచునట్లుసేయును.

తా. ఆమె పున్నమలయందుఁ దెల్ల కలువ డిగ్గియ దరులయందు స్ఫటికమయ తీరములయందుఁ గలువపూసెజ్జయందు మేను వైచి యుండఁగాఁ బగలు కోయిల గుంపులు ప్రాణమానములను క్షీణింపఁ జేయుచుండఁగా వానిని యాచించి ధర్మోదకధారం బట్టి కొంచెము మిగులఁ జేసికొనఁగా నా మిగిలిన దానిని రాత్రియందు మల్లెపూలపైఁదిరిగెడు తేఁటుల మ్రోత నిరవశేషముఁ జేయకుండ రెండవనాఁటికుండుటకై చెవుల నిండఁ గన్నీరు నించును. అనఁగా నామ్రోఁత వినకుండా నా నీ రడ్డపడుననియు, దుఃఖించు చున్నప్పుడు నేత్రకోణములనుండి జాఱిన యశ్రువులు వీనులు నిండె ననియు భావము. ఇచట నామెకు సాత్త్వికభావము చెప్పఁబడెను. తే. 'సత్త్వ మన మనోవృత్తిజంబులైన, భావములు సాత్త్వికము లష్టభావితములు.' 'స్తంభరోమాంచ బాష్ప వైస్వర్యకంప, నలయ వైవర్ణ్యఘర్మసంజ్ఞలఁ దనర్చి' అని దాని లక్షణము.

తే. నెలఁతఁ గుచకుంభయుగళ ముండియు వియోగ
జలధి నీఁదింప లే దయ్యె సఖులు వంచు
చున్న పన్నీటివెల్లి లోఁగొన్నకతన
ముంప కది లాఘవమునఁ దేలింపఁగలదె. 151

టీ. కుచకుంభయుగళము-కుచ = పాలిండ్లనియెడు, కుంభ = కుంభములయొక్క, యుగళము=ద్వంద్వము, ఉండియుక = కలిగియు, నెలఁతక = ఆ కోమలిని, వియోగజలధిక = విరహసముద్రమును, ఈఁదింపలే దయ్యెక = ఈఁదఁజేయలేక పోయెను, సఖులు=ఆమె చెలులు, వ...నక-వంచుచున్న=కుమ్మరించుచున్న, పన్నీటి వెల్లిక=పన్నీటి ప్రవాహమును, లోఁగొన్నకతనక=ముంచిన హేతువుచేత, అది=ఆ కుంభ యుగము, ముంపక=మునుఁగఁజేయక, లాఘవమునక=తేలికగా, తేలింపఁగలదే =తేలఁజేయఁగలదా (లే దనుట.)

తా. ఆమెకుఁ దాపోపశమనముకొఱకుఁ జెలులు పన్నీ రమితముగా వంచుచున్నను దానిచేతనైనను దాపము దీఱక యది యొక సముద్రప్రాయమై యుండెను.

ఉ. చంచలనేత్ర దాల్చు జలజాతమృణాలసరంబు వేగ స
ల్లించినఁ బాఱు తెంచి కబళించి తదూష్మకు నంగలార్చు రా

యంచకుచేష్టఁ గాంచి యిఁకనైన నను గందుమొ యంచు మోమె వీ
క్షించినఁ దోఁచు లేనగవుచే నేరుచు బోంట్ల కొకింత ప్రాణముల్. 152

టీ. చంచలనేత్ర=ఆచంచలాక్షి, తా...బుల్ - తాల్చు=ధరించిన, జలజాత మృణాల=తామరతూఁడులయొక్క, సరంబుల్ = మాలికను, వేగక్ = తెల్లవాఱఁగానే, సళ్లించినక్=సడలించి యీవలవేయఁగా, పాఱుతెంచి=పరువెత్తివచ్చి, కబళించి=మ్రింగి, తదూష్మకుక్-తత్ = ఆబిసనాళసంబంధియగు, ఊష్మకుక్ = (శరీర స్పర్శచేతనైన) వేఁడిమికి, అం...ష్టక్-అంగలార్చు = వగర్చుచున్న, రాయంచ=రాజహంసయొక్క, కుచేష్టక్=వెఱ్ఱిచేష్టను, కాంచి = చూచి, ఇఁకనేనియుం, కందుమొ యంచుక్=నవ్వును జూతుమే మో యని, మోమె=ఆమెముఖమునే, వీక్షించినక్=తాము చూడఁగా, తో...వు - తోఁచు=అగపడిన, లేనగవు=ఆమెయొక్క చిఱునగవు, బోంట్లకుక్ = చెలులకు, ఒకింత = ఇంచుకంత, ప్రాణముక్, చేరుచుక్ = ఒడఁగూర్చును.

తా. ఆమె తాపోపశమనార్థమై తామరతూఁడులసరములు ధరించి యుండి మఱునాఁడు తెల్లవాఱినవెనుక నవి వీడఁదీసి పాఱవైచిన, నప్పటి పెంపుడు హంస వచ్చి యామృణాళము గబళించి వెంటనే (యవి యామె విరహతాపముచేత వేఁడిమి యెక్కియున్నవి గావున నాహంసకు గొంతులోఁ గనరెత్తఁగానే), ఊమియుచు నంగలార్చుచునుండెఁ, గావున నావింతఁ జూచియైన నీయమ నవ్వునా యని యామె మోమే చూచుచుండఁగా, నామె నవ్వెను. ఆచిఱునగవు వలనఁ జెలులకుఁ బ్రాణము వచ్చి ధైర్యము గలిగెను. (ప్రాణసంశయము గలిగినప్పుడు నవ్వు వచ్చెనేని బ్రదుకుట ప్రసిద్ధము.)

ఉ. శ్రీపతిమీఁదిగీతములఁ బ్రేమ విపంచిక నంటఁ బాణిసం
తాపము సోఁకి మెట్లమయిసంబు గరంగిన డించి పాడు నా
లాపినిఁ దాల్చి పెన్నెమటశీల న్మఱి తంత్రులు జబ్బుగాఁ గలా
లాపిని దాన పాడును గళంబును గద్గదమైన మ్రాన్పడుక్. 153

టీ. కలాలాపిని - కల = అవ్యక్తమధురములగు, ఆలాపిని = ఆలాపములుగల యూమంజుభాషిణి, శ్రీ...మన్ - శ్రీపతిమీఁది=శ్రియఃపతిమీఁది, గీతముల=గీతముల యందలి, ప్రేమన్ = ప్రేముడిచేత, విపంచికక్ = వీణను, అంటక్ = స్పృశింపఁగానే, పాణిసంతాపము=విరహముచేతనైన చేతులవేఁడిమి, సోఁకి=తగిలి, మెట్లమయినంబు=వీణమెట్లకువేసియున్న మైనము, కరంగినక్ = కరఁగిపోఁగా, డించి=ఆవీణను దించి, ఆలాపినిక్=తంబుర్యాను, తాల్చి=ధరించి, పాడుక్ = గానముచేయును, మఱి=పిమ్మ

టను, పెజ్జెనమటలన్=ఆయాసమువలనఁగలిగిన యెక్కుడు చెమ్మటలచేతను, తంత్రులు =తంబురాతంతులు, జబ్బుగాన్ = భిన్నముకాఁగా, తాన = తానే, పాడును= గాత్రమునఁబాడును, గళంబును = కంఠమును, గద్గదమైనన్ = డగ్గుత్తికపడఁగా, మ్రాన్పడున్ = చేష్టయుండుగును, (నానాఁటికి విరహ మధికమాయె ననుట), ఇవియు సాత్త్వికభావములే.

తే. ప్రతికుసుమతల్పమునఁ జాఱిపడిన తప్త
వలయ మలినాంకయుగము వర్తులతఁ బొలిచెఁ
జూడ నిఁక మానధైర్యము లెల్లున్న లనుచు
సుదతి బోఁట్లకుఁ ద్రపవ్రాసి చూపె ననఁగ: 154

టీ. సుమతి = మంచిపలువరుసగలయాయువిద, చూడన్ = ఆలోచింపఁగా ఇఁకన్=భావికాలమందు, మానధైర్యముల్=మానమును దాలిమియు, సున్న లనుచున్= పూజ్యము లని, (లే వనుట), త్రపన్=సిగ్గుచేత, బోంట్లకున్=చెలులకు, వ్రాసి చూపె ననఁగన్=లిఖించి కనుపఱిచె ననునట్లు, ప్రతికుసుమతల్పమునకున్=అన్ని పూలపాన్పు లందును, జా...ము - జాఱిపడిన=కృశత్వముచేత వీడిపడిన, తప్త=శరీరతాపముచేతఁ దపింపఁబడిన, వలయ = కంకణములయొక్క, మలిన=నల్లపడిన, అంక=చిహ్నముల యొక్క, యుగము=ద్వంద్వము, వర్తులతన్=వట్రువగుటచేత, పొలిచెన్=ఒప్పెను.

తా. పూలపాన్పులు శరీర తాపముచేత వాడిపోవుచుండఁగా వేఱువేఱ మరలఁ బఱచుచుండఁగా నట్టి యన్నిపాన్పులందును జాఱిపడిన కంకణద్వయము యొక్క మలినములగు గుండ్రని గుఱుతులు సుదతి తన కిఁకమీఁద మానధైర్యములు రెండు లేవని తాను సిగ్గుచేతఁ జెప్పలేక చెలులకుఁ దెలియునట్లు వ్రాసి చూపెనో యను నట్లు కనిపించెను.

ఉ. ఆవనజాక్షి కాఁకఁ బొరలాడ నలంగిన సొమ్ము జీరలున్
వేవిన నూడ్చి యూడ్చి మఱి వేఱ వహించుట వారకప్తముల్
గా వనమాలిసేవయెడఁ గాంక్ష నొదుంగక కల్ల తెల్విత్రో
నే వలవంత దాఁగఁ జరిఁయించిన డాఁగమిఁ జూచి నెవ్వగన్. 155

టీ. ఆవనజాక్షి = ఆపద్మాక్షి, కాఁకన్ = విరహతాపముచేత, పొరలాడన్ = పొరలఁగా, నలంగిన = శుణ్ణము లైనట్టి, సొమ్ము = భూషణమును, చీరలున్ = వస్త్రములును, వేవినన్ = తెల్లవాఱఁగానే, ఊడ్చి యూడ్చి = పరిహరించిపరిహరించి, (అతిశయంబున ద్విరుక్తి.), మఱి=అవల, వేఱ=ప్రత్యేకమయినవాని, వహించుట = ధరించుటయే, వారకప్తములాన్ = అవసరనిర్ణీతము లగునట్లుగా, వనమాలిసేవయెడన్ =

భగవత్సేవపట్టున, కాంక్షన్ = ఆసక్తిచేత, ఒదుంగక = వెనుదీయక, కల్ల తెల్వితోఁ నే = లేని తెలివితోడనే, వలవంత = విరహతాపము, దాఁగన్ = ప్రచ్ఛన్నమగునట్లు. చరియించినన్ = సంచరించినను, డాఁగమిన్ = దాఁగకుండుటచేత, చూచి = వీక్షించి, (దీనికి వెనుకటిపద్యముననున్న విష్ణుచిత్తుఁ డన్నది కర్తృపదము), నెవ్వగన్ = ఖేదము చేత, (ముందటిపద్యముతో నన్వయము.)

తా. ఆమె విరహాతిశయముచేతఁ బొరలి పొరలి నలఁగిన సొమ్ములును వలువలును వదలివదలి మరల ధరించుచు, నాధరించుటయనునది, శృంగారము కొఱకనునట్లు, గను పఱిచి, భగవత్సేవయందుఁ గాంక్షమానక లేని తెలివిని దెచ్చుకొని, తన తాపము తెలియకుండునట్లు సంచరించిన, విరహము దాఁగక బయల్పడఁగాఁ జూచి విష్ణుచిత్తుఁడు ఖేదపడెను.

క. పుత్త్రియుఁ దాఁ గామిని నొక
పుత్త్రియు నట్లుండుటకు నరిబుద్ధేక్షుధనుగ
పత్త్రియగు విష్ణుచిత్తుఁ డ
పత్త్రపలే కదియు నేతపంబో యనుచున్. 156

టీ. తాన్ = ఆవిష్ణుచిత్తుఁడు, పుత్త్రియున్ = పుత్త్రవంతుఁడును, కామిని = కాకుండుటచేతను, ఒకపుత్త్రియున్ = తనయొక్క యొకకూఁతురును, అట్లుండుట కున్ = ఆరీతిగనుండుటకును, అబుద్ధేక్షుధనుగపత్త్రి - అబుద్ధ = ఎఱుంగఁబడని, ఇక్షుధనుః=చెఱకువిల్తునియొక్క, పత్త్రి = ములుకులుగలవాఁడును, అగు విష్ణుచిత్తుఁడు = అగు నా పెరియాళ్వారు, అపత్త్రపలేక = లజ్జలేక, అదియున్, ఏతపంబో = ఏమితపస్సో, అనుచున్ = అనియెంచుచు.

తా. ఆ విష్ణుచిత్తుఁ డెన్నఁడును మదన శరప్రహార మెఱుఁగనివాఁడు గావున నాయమకుఁ గల్గినది విరహ మని యెఱుఁగక యామె యట్లుండుటయు నొక తపమే యని తలఁచెను.

వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయాతనుగ్లాని కత్యంత దుఃఖితుం డై తత్కారణం బెఱుంగక వలదని మార్గ్యంబున వారించి చూచి యంత కంత కగ్గలం బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కార ణానంతరంబునఁ, దనమనోనిర్వేదనం బన్నగరివెన్నునకు విన్న వింపం బున ర్నమస్కృతిఁ జేసి, దేవా దేవర దాసియగు మదీయ పుత్త్రి యేమిగుఱించియో విచిత్రంబగు వ్రతచర్యం గాత్రశోషంబు సేయుచున్నది, వలదన్న విన దపుత్త్రకుండ నగునాకుఁ బుత్త్రియైనను బుత్త్రకుండైనను దాన యే నేమి సేయుదు, మఱి తన తపశ్చర్య

తెఱంగు మా తపశ్చర్య తెఱంగు గాదు, ఏము భవద్దివస భవజ్జని దివస రాత్రులం దక్క గణరాత్ర జాగరంబు లెఱుంగ, మేము బిసబీ జాతువలయంబులు దక్క బిసవలయంబు లెఱుంగ, మేము ప్రసాద కుసుమంబుఁ జెవిఁ జెరువుటఁ దక్క నవి గప్పుకొన నందు శియ నింప నెఱుంగ, మేము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దా నంగంబులు దడిపి కొను, నేము చాంద్రాయణంబులఁ జంద్రవృద్ధి బడిఁగడి యెక్కించినఁ దా డించు, నేము నిదిధ్యాస నిశ్వాస నిరోధంబు సేసి నం దాఁ దద్ధ్యానదశ వెలికి నిగుడించు, నేము చిన్ముద్రకై హృద యంబునం గేలు సేర్చినందాఁ గిసలయోత్తరీయంబులు వహిం చు, నేము సితపక్ష నూత్నేందుఁ గీర్తించినం దాఁ బూర్ణేందు ను పాలంభించు, నిట్లుగాఁ బ్రవర్తిల్లు చున్నయది, యిది యేటితపం బున్వాదంబు గానోపు, నెంత భవదీయభక్తి గలిగిన మాదృశులకుఁ బ్రకృతి సంబంధంబు విడుప దంతర్యామిని నీవెఱుంగని యది లేదు, దీని తెఱం గెఱింగింపవే యనవుఁడు, ననుకంపాతిశయంబునఁ దచ్ఛాం దసంబునకు మందస్మితంబు సేసి మందరధరుం డి ట్లనియె. 157

టీ. తలపోసి=పైఁ జెప్పిన ట్లాలోచించి, ది...కిన్ - దినదినప్రవర్ధమాన = నానాఁటికి వృద్ధియగుచున్న, తనయా తనుగ్లానికిన్ = కూఁతుయొక్క శరీర కృశత్వ మునకు, అత్యంతదుఃఖితుండై=మిక్కిలి దుఃఖించినవాఁడై, తత్కారణంబు = ఆ విరహ హేతువును, ఎఱుంగక = తెలియక, వల దని, మౌగ్ధ్యంబునన్ = మూఢభావము చేత, వారించి = నివారించి, చూచి, అంతకంతకున్ = అప్పటప్పటికి, అగ్గలంబగు దున్=విరహము దుస్సహము కాఁగా, గుడికిం జని = స్వామికోవెల కేఁగి, పూ...... నన్ - పూజాంతిమ = పూజాంత్యమగు, నమస్కరణానంతరంబునన్ = నమస్కార మైన పిమ్మట, తనమనోనిర్వేదనంబు = తనమనఃఖేదమును, అన్నగరివెన్నునకున్ = ఆ శ్రీవిల్లిపుత్తూరులోని మన్నారుస్వామికి, విన్నవింపన్ = విజ్ఞాపనము చేయుటకు, పున ర్నమస్కృతిఁ జేసి = మరల నెఱఁగి, దేవా = ఓస్వామీ, దేవరదాసి యగు = దేవరవారి దాసురాలగు, మదీయపుత్త్రి = నాకూఁతురు, ఏమిగుఱించియో=ఏఫలమునుగూర్చియో, (విరించిగుఱించి తపంబుసేసె నని భారతప్రయోగము కలిమిం జేసి యిది కర్మప్రవచనీ యార్థక మగుదేశ్యషష్ఠము), విచిత్రంబగు = వింతయైన, వ్రతచర్యన్ = నియమాచర ణముచేత, గాత్రశోషంబు = శరీరశోషణమును, చేయుచున్నది = కావించుచున్నది, వల దన్న వినదు. అపుత్త్రకుండ నగునాకున్=పుత్త్రులులేనినాకు, పుత్త్రియైనను బుత్త్రి

కుండైనను, తాన = కూఁతు రేనియుం గోడు కేనియుఁ దానే, ఏనేమిసేయుదుక్ = నే నేమి యాచరింతును, మఱి = ఇంకను, తనతపశ్చర్యత తెఱంగు = తానుదపము చేసెడురీతి, మాతపశ్చర్య తెఱంగుకాదు, (విలక్షణతప మనుట), ఏము = మేము, భ...క్-భవద్దివస = దేవరవారి దినముయొక్క, (హరివాసర మనుట), భవజ్జనిదివస=దేవరవార లవతరించిన జయంతుల దినములయొక్క, రాత్రులం దక్కక్ = రాత్రులయందేకాక, గ...లు-గణరాత్ర = పెక్కురాత్రులయందు, జాగరంబులు = నిద్ర లేకుండుటలు, ఎఱుంగము (విరహాతిశయమున నామెకు రాత్రులయందు నిద్ర లే దనుట, ఈరీతిగానే ముందఱను తెలియఁదగును), ఏము బిసబీజాక్షవలయంబులుదక్క = మేము తామరపూసలమాలికలు దక్క, ఇది భాగవతలక్షణము. 'యే కంఠలగ్నతులసీ నలినాక్షమాలా యే బాహుమూలపరిచిహ్నితశంఖచక్రాః, యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాస్తే వైష్ణవా భువనమాశు పవిత్రయంతి' యని యున్నది. బిసవలయంబు లెఱుంగము = తామర తూఁడుల మాలిక లెఱుంగము, (తాపోపశమనమున కామె ధరించె ననుట), ఏము ప్రసాదకుసుమంబుఁ జెవిఁ జెరువుటఁదక్క=మేము ప్రసాదలబ్ధమగుపూవుఁ గర్ణమందుఁ జెక్కుకొనుటేకాక, అవి గప్పుకొన నందు శయనింప నెఱుంగము = పూలు మేనఁ గప్పుకొనుటను బూలపైఁ బవ్వళించుట నెఱుఁగము. (ఆమె యట్లుసేసె ననుట), ఏము చెంబులక్ భవత్తీర్థంబు గ్రోలినక్ = మేము పానపాత్రములచేత దేవరవారి యభిషేకతీర్థంబు పానముసేసినను, తా నంగంబులు దడిపికొనుక్ = తాను శరీరము) దడుపుకొనును, (తాపశాంతి కనుట), ఏము = మేము, చాంద్రాయణంబులక్ = చాంద్రాయణము లనియెడు వ్రతములయందు, చంద్రవృద్ధిబడిక్ = చందురు వృద్ధి వెంటను, కడి యెక్కించినక్ = అన్నకబళము వృద్ధిఁ జేసిన, తాక్ డించుక్ = తాను తగ్గించును, (విరహాతిశయముచే ననుట), ఏము = మేము, నిదిధ్యాసనిశ్వాసనిరోధము సేసినక్ = బ్రహ్మధ్యానమందు యోగమునవలంబించి శ్వాస నిరోధింప, తాక్ = తాను, తద్ధ్యానదశక్ = ఆబ్రహ్మధ్యానదశయందు, వెలికి నిగుడించుక్ = బహిర్గతములఁ జేయును, (తాప మోపలేక నిట్టూర్పునిగుడించు ననుట), ఏము=మేము, చిన్ముద్రనై, హృదయంబునక్ =ఎదయందు, కేలు=హస్తమును, చేర్చినక్ = ఉంచిన, తాక్ = తాను, కపోలంబునక్ =చెక్కిటియందు, చేర్చుక్ = ఉంచును, (చింతచేత ననుట), ఏము, వల్కలోత్తరీయంబులు = నారచీరలు, వహించినక్ = తాల్చిన, తాక్, కిసలయోత్తరీయంబులు=తలిరాకుఁజీరలు, వహించుక్ = ధరించును, (తాపశాంతి కనుట), ఏము, సితపక్షపూర్ణేందుక్ = శుక్లపక్షంబునందలి క్రొన్నెలను, కీర్తించినక్ = కొనియాడిన, తాక్, పూర్ణేందుక్ = నిండుచందురుని, ఉపాలంభించుక్ = దూషించును, (ఉద్దీపకుఁ డగుటచేత ననుట), ఇట్లుగాక్ = ఈరీతిగా, ప్రవర్తిల్లుచున్నయది, ఇది యేటితపంబు,

ఉన్మాదంబు కానోపుఁ = వెఱ్ఱియైయుండవచ్చును, ఎంత భవదీయభక్తి గలిగినఁ = మీయందు భక్తి యెంతయుండినను, మాదృశులకుఁ =మావంటివారికి, ప్రకృతిసంబంధంబు= మాయాసంబంధము, (తనయాదివిమమకార మనుట), విడువదు = వదలదు, అంతర్యామివి నీవెఱుంగనియది లేదు =సర్వాంతర్యామివగు నీకుఁ దెలియనిది లేదు, దీని తెఱంగు= ఈపడుచునడవడి, ఎఱింగింపవే= తెలియఁజేయవే, అనవుడుఁ =అనఁగా, అనుకంపాతిశయంబునఁ = దయాతిశయముచేత, తచ్ఛాందసంబునకుఁ =అవిష్ణుచిత్తుని వైదికత్వమునకు, మందస్మితంబుసేసి = చిఱునగవునవ్వి, మందరధరుండు = గట్టుదాల్పువేల్పు, ఇట్లనియెఁ = ఈవక్ష్యమాణక్రమముగాఁ బలికెను.

ఉ. కంధరనీలవర్ణ ! మధుకైటభనాగసువర్ణ ! యోగిహృ
ద్గ్రంధిభిదోత్థభోగివనితాస్వనవచ్ఛ్వసనస్రవచ్ఛిర
స్సంధివసన్నిశాపతిరసస్రుతిదుగ్ధపయోధివీచికా !
మంధరకేళికాదర ! సమాశ్రితపఙ్క్తిశిరోధిసోదరా ! 158

టీ. కంధర = జలధరమువలె, నీల = నల్లనైన, వర్ణ = మైవన్నెగలవాఁడా, మధుకైటభ = మధుకైటభరాక్షసు లనెడు, నాగ = పాములకు, సువర్ణ = గరుత్మంతుఁడగువాఁడా, యోగి = అష్టాంగయోగములుగల మునులయొక్క, హృద్గ్రంధి = హృదయగ్రంధియొక్క, భిదా = భేదించుటచేత, ఉత్థ = ఏగసినట్టి, భోగివనితా = ఆఁడుబాముయొక్క, (కుండలినీశక్తి 'శక్తిః కుండలినీనామ బిసతంతునిభా శుభా' యని వామకేశ్వరమహాతంత్రము). స్వనవత్ = ధ్వనిగల్గిన, శ్వసన = నిట్టూర్పుచేత, స్రవత్ = స్రవించుచున్న, శిరస్సంధి = కపాలమందు, వసత్ = వసించుచున్న, నిశాపతిరస = అమృతము యొక్క, స్రుతి = స్రావ మనెడు, దుగ్ధపయోధి = పాలకడలి యొక్క, వీచికా = అలలయొక్క, మంధర = మెల్లనైన, కేళికా = క్రీడయందు, ఆదర = ఆదరణముగలవాఁడా, సమాశ్రిత = ఆశ్రయించిన, పఙ్క్తిశిరోధి=పఙ్క్తికంఠుఁడగు రావణునియొక్క, సోదరా = తోఁబుట్టువగు విభీషణుఁడు గలవాఁడా.

* క. కరధృత దరారి వితరణ ... ... 159

(ఇది పూర్వాశ్వాసాంతమున వచ్చినపద్యము గనుక నిక్కడ వ్రాయ లేదు.)

తోటకవృత్తము.

ద్రుహిణాండకరండకధుర్వహగ
ర్భ హరార్భకదుర్భరకోపక్వతపగి

---

* క. ప్రపదానిశసతిచర్యా, త్రిపదానన పర్యనాక దేవాద్యమర; ద్విపదాన వాహితోదిత, విపులాత్మ భవాభవారి విశ్రుతనామా!

కుహనార్భక వార్భృతకోనిరిహా
రిహిరణ్మయహర్మ్య చరిష్ణుపదా. 160

టీ. ద్రుహిణాండకరండక = బ్రహ్మాండ కటాహములయొక్క, ధూర్వహ=భారము వహించిన, గర్భ = కడుపుగలవాఁడా, కుమారార్భక = కుమారస్వామియొక్క, దుర్భర = భరింపఁగూడని, పక్వ = పరిపక్వమైన, తపః = తపముచేత, కుహనార్భక = కపట బాలుఁడవై యవతరించినవాఁడా, వార్భృతకోనిరి-వాః=ఉదకములచేత, భృత=నిండిన, కోనిరి=స్వామి పుష్కరిణియందు, హారి = ఒప్పుచున్న, హిరణ్మయహర్మ్య=స్వర్ణమయ మంటపమందు, చరిష్ణు=సంచరించెడు, పదా = పాదములుగలవాఁడా.

మ. ఇది యంధ్రోక్తి యథార్థనామయవనాసృక్పూర్ణ కెంబావివా
రిదపద్ధత్యవరోధి వప్రవలయశ్రేణీవిఘాతక్రియా
స్పద సేనాగ్రద కృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైనపద్యంబులన్.161

టీ. ఇది = ఈగ్రంథము, అంధ్రోక్తి = ఆంధ్రభాషచేత, యథార్థనామ=అన్వర్థ నామముగల, యవనాసృక్ = మ్లేచ్ఛరక్తముచేత, పూర్ణ = నింపఁబడిన, కెంబావి = కెంబావి యను పట్టణముయొక్క, (దీనికే యాంధ్రోక్తి యథార్థనామము), వారిదపద్ధతి= మేఘమార్గమును, అవరోధి = అడ్డగించుచున్న, వప్రవలయ = వలయములవంటి కోటలయొక్క, శ్రేణి = పఙ్క్తులయొక్క, విఘాత = పడఁగొట్టుటయొక్క, క్రియా= కార్యమునకు, ఆస్పద = కారణమగు, సేనా = దండునకు, అగ్రద = అగ్రేసరుఁడైన, కృష్ణరాయమహిభృత్సంజ్ఞ = కృష్ణరాయ భూపాలుఁ డను పేరు గల, అస్మత్= నాయొక్క, ఆముక్తమాల్యదక్ = ఆముక్తమాల్యద యను ప్రబంధంబునందు, హృద్యం బైన = మనోహరము లగునట్టి, పద్యంబులక్ = పద్యములచేతను, పంచమంబు = ఐద వది యగు, ఆశ్వాసము, అమరుక్ = ఒప్పును.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తి మంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీ ధురీ ణుండు నాత్రేయ గోత్ర పవిత్రుండును వావిళ్లవంశపయోరాశి రాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదావ్యాఖ్యానమునందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము

## ష ష్ఠా శ్వా స ము

క. శ్రీకారికృపార్ద్రేక్షణ!
వైకుంఠ! యకుంఠభక్తవరద! పదాబ్జా
స్తోకమరందాయితగం
గా! కాకోదరనగోదయస్థపతంగా! 1

టీ. శ్రీ...ణ-శ్రీకారి=లక్ష్మీకరమగు, కృపా=దయచేత, ఆర్ద్ర=తడిసిన, ఈక్షణ=దృష్టిగలవాఁడా, వైకుంఠ = అ...ద-అకుంఠ = భంగములేనియట్లు, భక్త = భక్తులకొఱకు, వరద = వరములొసంగెడువాఁడా, పదాబ్జ=పాదకమలమునకు, అస్తోక=సమృద్ధమైన, మరందాయిత = మకరందమువలెనుండెడు, గంగా = గంగానదిగలవాఁడా, కాకోదరనగ = శేషశైలమనియెడు, ఉదయ = ఉదయపర్వతమందు, స్థ=ఉన్నట్టి, పతంగా=సూర్యుండైన వాఁడా!

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. 2

మాలదాసరి

చ. కలఁ డొకరుండు పేరుకొనఁగాని కులంబు మదీయభక్తుఁ, డి
య్యిలమును వాఁడు వామనత౯ నే వసియించిన* పుణ్యభూమియం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి పాడు మము౯ లాలస మంగళనామకైశికిన్. 3

టీ. పే...బు-పేరుకొనఁగాని = చెప్పరాని, కులంబు = కులమందలి, మదీయ = నాదగు, భక్తుఁడు, ఒకరుండు = ఒక్కఁడు, కలఁడు = ఉండెను, వాఁడు = అతఁడు, మును=తొల్లి, వామనత౯ = వామనావతారమునందు, ఏ౯ = నేను, వ...కున్-

* వసియింపనో పుణ్యభూమి నందులకు—పాఠాం.

వసియించిన=నివసించినట్టి, పుణ్యభూమియందులకు = దివ్యదేశప్రాంతమునకు, (ఆ దివ్య దేశము తిరుక్కురుంగుడి యనుట.) ఒకయోజనత్రయపుదూరపుటూరన్ = ఒక మూఁడు యోజనములదూరము గల యూరియందు, వసించి = నివసించి, బ్రాహ్మవేళలన్ = బ్రాహ్మముహూర్తములయందు, (తెల్లవాఱ నాల్గు గడియలు గల దనఁగా ననుట) చను దెంచి=వచ్చి, మంగళనామకైశికిన్=మంగళనామకైశికి యను రాగముచేత, లాలసన్= కోరికతో, మమున్=మమ్ము, పాడున్=గానముసేయును:

తా. పంచమకులమందుఁ బుట్టిన మాభక్తుఁ డొక్కఁడు గలఁడు. అతండు తొల్లి నేను వామనావతారముచేత వసించిన దివ్యదేశమునకు మూఁ డామడలదూరమం దొక గ్రామమందు వసించి ప్రభాతసమయములయందు మంగళనామకైశికిచేత మమ్ము గానము సేయుచుండును.

వ. అహరహంబు నమ్మహాత్ముండు. 4

అహరహంబు = ప్రత్యహము-ప్రతిదినము.

✓క. జాత్యుచితచరిత్రమః మ
త్ప్రీత్యర్థం బూఁది తనదు హృదయము శుచితా
నిత్యంబుగఁ దత్తనుసాం
గత్యముమసిపాఁత మానికంబై యొదుఁగున్. 5

టీ. జా...మ-జాత్యుచిత=తనజాతికిఁ దగినట్టి, చరిత్రమః=నడవడియే, మత్ప్రీ త్యర్థంబు = మాసంతోషముకొఱకు, ఊఁది = వహించి, ('శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్' అను గీతావాక్యము ననుసరించి యనుట.) తనదు హృదయము= తనసంబంధి యగునంతరంగము, శు...గన్-శుచితా=పరిశుద్ధత్వమునందు, నిత్యంబుగన్= స్థిరమగుచుండఁగా, త...ము-తత్తను = ఆచండాల శరీరముయొక్క, సాంగత్యము = సంగమ మనెడు, మసిపాత = మసిగుడ్డయందలి, మానికంబై=మాణిక్యమై, ఒదుఁగున్= ఒదిఁగి యుండును.

తా. అతఁడు మద్భక్తుఁడైనను మాకు వర్ణాశ్రమాచారములయందుఁ బ్రీతి గావున నది యెఱిఁగి తా నొక యాధిక్యమునకుఁ బోక, తన కులోచితాచారమందే నిలిచి, తన హృదయము నిత్యపరిశుద్ధమై, యాచండాల శరీరసాంగత్య మనెడు మసిగుడ్డను గట్టిన మాణిక్యమువలె నుండును.

సీ. చముఱైన తోల్కుబుసంబు *టెంకియును ని
త్తళి శంఖ చక్ర కుండలము లమర

* టెక్కియును=ఒకవిధమగు కుళ్లాయి, డక్కియును=చర్మవాద్యవిశేషము.

దివెదారికొమ్ముఁ దోల్తిత్తియు జోడమ్ము
మెడమీఁది మొగలాకుగొడుగుఁ దనర
మత్పాదరక్షయు మావు పెన్నొక్కఁ గు
ట్టిన యోటి తిపిరిదండెయును మెఱయఁ
జిటితాళములు సంక పుటిక నొక్కొకమాటు
గతిరయంబునఁ దాఁకి కలసి మొరయ
తే. వలుఁద వనమాలకంటెయు మలినతనువు
బట్టెతిరుమన్ను బెదరుఁగెంపుట్టుఁ జూపు
బసుపుఁబోడితోలు పల్లంబు నెసక మెసఁగ
వచ్చు సేవింప సురియాళ్వు వైష్ణవుండు. 6

టీ. చమురైన = చము రంటిన, తోల్కుబుసంబు=చర్మకూర్పాసము, (తోలు చొక్కా యనుట), టెంకియు=కుళ్లాయియును, ఇ...లు-ఇత్తళి=ఆరకూటమయములగు, శంఖచక్రకుండలములు=శంఖచక్రముల చెవులపోఁగులు, అమరన్ = ఒప్పుచుండఁగా: దివిదారికొమ్ము=భజనమున్నగువానిలో ననేక దీపము లుంచెడు దీపస్తంభము. తోల్తిత్తియున్=చర్మపుఁ దిత్తియును, జోడమ్ము=ధనుస్సునఁ జేర్పక చేతితో కొడిచెడు బాణమును, ('చాపాసపేక్షిత శరమొప్పుజోడ'మ్మన యని దేశ్యనామార్థకోశము. "సీ. చాపానపేక్షియా శరమొప్పుచుండు ( జేయమ్మచనంగ జోడమ్మనంగ" ఆం.భా.౨, ౨౧౩. బోడమ్మని యనేకపుస్తకపాఠము, అప్పుడు ములుకులేని బోడి బాణ మని యర్థము.) మె...గున్-మెడమీఁది=అంసముమీఁదనున్న, మొగలాకుగొడుగు = కేతకీపత్త్రములఁ గూర్చినఛత్త్రమును, తనరన్ = ప్రకాశింపఁగా, (మొగలాకను నెడ మొగలి+ఆకు పరిమిత్యర్థకము పరమగునపుడు వలె నాకాద్యాదులు పరమగు నపుడును నిత్యసంధి), మత్పాదరక్షయున్ = మాపాదుకయును, మా...కన్-మావు=గుఱ్ఱముయొక్క, కు...ను-కుట్టిన = కూర్చినట్టి, ఓటి=ఓడువాసిన, తిపిరిదండెయును=సొరకాయదండెయు, ఒకవిధమగు చిన్నవీణె.) మెఱయన్ = ప్రకాశించుచుండఁగా, చిటితాళములు = చిఱుతాళములు, చంక పుటికన్ = చంకనున్నభవనాశిని, ఒక్కొకమాటు=ఒక్కొక్కతూరి, గతిరయంబునన్=గమనవేగముచేత, తాఁకి=తగిలి, కలసి=ఏకమై, మొరయన్ = ధ్వనిచేయఁగా, వ...యున్-వలుఁద=వట్రువయగు, వనమాలకంటెయున్=తులసిపూసలపేరును, (కుతికంటె నుట), మలినతనువున్=మాసిన శరీరమును, (దేహాభిమాని గాఁ డనుట), పట్టెతిరుమన్ను= పట్టెలుగా స్ఫుటమైన శ్రీమృత్తికయును, బెదరుఁ గెంపుట్టుఁ జూపున్ = బెదరుచు నెఱ్ఱనైయున్న చూడ్కియు, (ఎఱ్ఱని బెదరుఁజూపు లనుట) పసుపుఁబోడితోలుపల్లంబున్=పసుపుఁ బట్టించిన కుఱుచ యగు చర్మపుఁ జన్నిదమును. (పసుపుఁ బోడితోఁడి

వలువయు నని యొక పాఠము), ఎసక మెసఁగన్ = ఒప్పుచుండఁగా, సురియాళు వైష్ణవుండు=ఆ మాలదాసరి, సేవింపవచ్చున్=సేవార్థమై వచ్చుచుండును. (ఊరియాళనియుం బాఠము కలదు. ఆపక్షమున నవలంబించిన యని యర్థము.) "సీ. పరఁగుఁ జండాలుండు సురియాళువనఁగను మాల డంచనఁగను మాలఁ డనఁగ." ఆం. భా.

శా. గండాభోగముల న్ముదశ్రులహరుల్గప్ప న్నుతుల్పాడి యా
దండ [1]న్వ్రేగులు డించి భక్తిజనితోద్యత్తాండవం బాడు నా
చండాలేతరశీలుఁ డుత్పులకియై చాండాలిక న్మీటుచున్
గుండు ల్నీరుగ నెండ గాలి పసి తాఁకుం జూడ కాప్రాహ్ణముల్.

టీ. ఆ చండాలేతరశీలుఁడు = చండాలురకంటె నితరులగు సజ్జనులయొక్క శీలము వంటి శీలము గల యతఁడు, 'శ్వపచోఽపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః, విష్ణుభక్తి విహీనస్తు ద్విజోఽపి శ్వపచాధమః' అన్నట్లనుట. గండాభోగములన్-గండ=చెక్కిళుల యొక్క, ఆభోగములన్ = పరిపూర్ణత్వములయందు, 'ఆభోగః పరిపూర్ణతా' అని నిఘంటువు. (అనఁగా అంతట ననుట), ము...ల్-ముదశ్రు = ఆనందబాష్పములయొక్క, లహరుల్=ప్రవాహములు, కప్పన్=ఆచ్ఛాదించుచుండఁగా, నుతుల్పాడి=కీర్తనలుపాడి, ఆదండన్=అసమీపమందు, వ్రేగులు=తనబరువులు, డించి=దించి, ఉత్పులకియై = గగుర్పాటుగలవాఁడై, గుండుల్=పాషాణములు, నీరుగన్=గానశక్తిచేతఁ గరఁగి నీరగునట్లు, చాండాలికన్=తనవీణను, చాండాలికా తు కండోలవీణా చండాలవల్లకీ' అనినిఘంటువు. మీటుచున్ = వాయించుచును, ఎం...కున్-ఎండ=అతపముయొక్కయు, పసి=ఆఁకలి యొక్కయుఁ, తాకున్=వేధను, చూడక=లక్ష్యముసేయక, అప్రాహ్ణముల్=అపరాహ్ణమగు దనుక, భ...బు-భక్తిజనిత=భక్తిచేతఁబొడమిన, ఉద్యత్=లెస్సైన, తాండవంబు=నాట్యమును, ఆడున్=ఆడును. (అప్రాహ్ణ మనుచోటఁ బ్రాహ్ణ మనఁగా నహస్సులో మూఁడవ భాగ మని అనఁగా పదిగడియల ప్రొద్దెక్కు వఱ కని కొంద అందురు.)

తా. జాతిచేతఁ జండాలుఁడైనను సద్గ్రవర్ణములవారి శీలమువంటి శీలముగల యీమాలదాసరి ప్రతిదినమును దనబరువుల నాచెంత దింపి యెండను, గాలిని, నాఁకలిని గణింపక మధ్యాహ్న మగుదనుక నొడ లంతయు గగుర్పాటు నెందుచుండఁగా, రాలు గరఁగునట్లు, చండాలవీణను మీటుచు, భక్త్యుద్రేకమున నాస్తోత్రములు పాడి, భక్త్యుద్రేకమునఁ దాండవ మాడును.

తే. అట్లు దడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగి
గర్భమంటపిఁ గడిగిన కలఁకజలము

---

1. ... వ్రేగు లడంచి...

లోని తాతొట్టి నిండి కాలువగఁ జాఁగి
గుడి వెడలి వచ్చునది శూద్రుఁ డిడఁగఁ గ్రోలి. 8

టీ. అట్లు=ఆప్రకారము, తడవుగన్=చాలసేపు, కొల్చి=సేవచేసి, సాష్టాంగము=కర చరణ వక్షో లలాట భుజములతోఁ గూడునట్లు, ఎఱఁగి=నమస్కరించి, గర్భమంటపిన్=గర్భగృహమును, క...ము-పడిగిన = క్షాళనముఁ జేసిన, కలఁకజలము = కలుషోదకము, లోని=లోపలనున్న, తాతొట్టి=తాలితొట్టి, నిండి=పూర్ణమై, కాలువగన్ = కుల్యగాను, చాఁగి=ప్రవహించి, గుడి వెడలివచ్చునది = గుడినుండి వెలికి పారివచ్చుచున్న జలమును, శూద్రుఁడు=నాలవజాతివాఁడు, ఇడఁగన్=ఒసఁగఁగా. క్రోలి=పానముఁజేసి.

తా. ఇట్లు చాలసేపు సేవించి నమస్కరించి గర్భగృహముఁ గడిగిన సమ్మార్జనోదకము లోపలి తొట్టి వెలువడి బైటికిరాఁగాఁ, దాను పంచమకులీనుఁడు గావున, నాయుదకము నంటక శూద్రుని నొక్కని యాచించి, యతనిచేతఁ దెప్పించుకొని పానముచేసి యని ముందటి కన్వయించును.

ఉ. ఆతఁడు ముఖ్యజాతిఁ గని నంతన పాయుచు నెండ గాలి నెం
తో తడవుం బ్రసాద విని యోగము వార్చి వసించుచుం ద్రివ
ర్ణేతరజాతి మెచ్చి దయ నిడ్డ ప్రసాదము దండెసాఁచి శ్ర
ద్ధాతిశయంబునన్ వినతి నంది భుజించుఁ గొనుం దదంబువున్. 9

టీ. అతఁడు=ఆదాసరి,ముఖ్యజాతిన్=శ్రేష్ఠజాతిగలవానిని,(బ్రాహ్మణాదుల ననుట), కనినంతన=చూచినమాత్రనే, పాయుచున్=తొలఁగుచును, ఎండన్=ఆతపమందును, గాలిన్=వాయువునందును, ఎంతోతడవున్=ఎంతోసేపు, (చిరకాల మనుట), ప్రసాద=ప్రసాదముయొక్క, వినియోగము=పంచిపెట్టుటను, వార్చి=నిరీక్షించి, (ఉ. 'ఇంతననేలయేను భుజగేశ్వరురాకయ వార్చినాఁడ నా, కంతవు నంతవుం గుడువ నాఁకలి నీళులు ద్రావఁ దృష్ణ యొక్కింతయు లేదనియును; తే. 'అనిన నీరాక వార్చి మహాశతోఁడ, నున్న విప్రునికోర్కి నీ వాక్యభంగి' ననియును; 'అనఘ నారాక వార్చి నీవధికనిష్ఠ, నిట్లు లున్కికిఁ గారణం బేమికోర్కి' యనియును; ఇత్యాది శాంతిపర్వప్రయోగము లుండుట నిచ్చట గొంద ఱపేక్షార్థక మని చెప్పుదురు.) వసించున్=నివసించును; త్రివర్ణేతరజాతి-త్రివర్ణ=బ్రహ్మ క్షత్రియ వైశ్యులకంటె, ఇతర=అన్యుఁడైన, జాతి=శూద్రజాతిగలవాఁడు, మెచ్చి=హర్షించి, దయన్=తనయందలికృపచేత, ఇడ్డ = ఒసఁగిన, ప్రసాదమున్, దండెసాఁచి=చేతనున్నదండె సాచి, శ్రద్ధాతిశయంబునన్=అత్యాసక్తితోడను. వినతిన్=వినయముతోడను, అంది=అందుకొని, భుజించున్=సాపడును, తదంబువున్=వానిచే నొసఁగఁ బడిన తీర్థమును, కొనున్=గ్రహించును.

తా. ఆతఁడు గర్వ మించుకేని లేనివాఁడును, ప్రసాదాదులయం దత్యంత శ్రద్ధ గలవాఁడును నగుట విప్రులను గాంచి తొలఁగుచు చాలవఱకు వేచి యే శూద్రుఁడో యొసఁగిన ప్రసాదము భక్తితో భుజించి తీర్థమును గ్రోలును.

వ. ఇట్లు దన [1]దివాకీర్తిజని నగు పరమార్తి నైచ్యంబు సకలజన శోచ్యంబుగా గుడి [2]లాఁపరా తూపరాణి కడ నిలిచి బహిరావరణ నిట్లుండి యొక్కనాఁడు. 10

టీ. ఇట్లు=ఈరీతిగా, త...నిఁ-తన=తనయొక్క, దివాకీర్తిజనిఁ=నికృష్టమగు పంచమజన్మముచేత, 'చండాలప్లవమాతఙ్గ దివాకీర్తిజనంగమాః' అని యమరము.అ...బు-అగు=కల్గినట్టి, పరమార్తి=అధికమగునార్తినల్లనైన, నైచ్యంబు=నీచభావము, (జాత్యుచిత వినమ్రభావ మనుట), స...గాఁ - సకలజన = ఎల్లవారలకు, శోచ్యంబుగాఁ=క్లేశార్హముగాఁగను, (ఇతనిఁ జూచి యందఱు జాలింబడి కనికరింతు రనుట), గు... గుడి = కోవెలయొక్క, లాఁపరా=చదరమగుపలకతాలుగల, తూపరాణికడఁ = జల దారిదాపున, నిలిచి=నిలుచుండి, కొలిచి=సేవించి, బహిరావరణ ప్రదక్షిణంబు కావించి= బహిఃప్రాకారమున కావల వలగొని, (తాను బంచముఁ డగుటచేత గుడిలోపలికిఁ జనం డనుట), ప్రొద్దెక్కఁ=ప్రొద్దుపోఁగా, ని...కుఁ-నిజ=స్వకీయమగు, పక్కణంబునకుఁ= పల్లెకు, 'పక్కణశ్శబరాలయః' అని నిఘంటువు. పోవుచుండుఁ=చనుచుండును,ఇట్లుండి= ఈరీతి వచ్చుచుం బోవుచుండి, ఒక్కనాఁడు=ఒక్కదివసంబున. లాఁపరా తూపరాణి— 'సీ. తూపురాణపు టమ్ము తూ మొప్పరము జలదారి యనంగను దనరును జల, గీ. నిర్గమము తన్ముఖంబున నీటితోడ వచ్చు తృణములఁ జొరనినిపలక పేరు, లాఁపరా యంచు జనులు పల్కఁగను వెలయు.' ఆంధ్రభాషార్ణవము.

క. అద్దమరే యద్దాసరి
యద్దండ బిడాలగాహితాలయకృకవా
కూద్దండరవము విని చను
ప్రొద్దాయె నటంచుఁ బాడఁ బోవుచుఁ ద్రోవన్. 11

టీ. అద్దమరేయి=అర్ధరాత్రమునందు, అద్దాసరి=మాలదాసరి, అద్దండఁ=ఆసమీప మందు, బి...ము-బిడాల=పిల్లిచేతను, 'ఓతు ర్బిడాలో మార్జాలః' అని నిఘంటువు. గాహిత=ప్రవేశింపఁబడిన, ఆలయ=ఇంటియందలి, (కోళ్ళగుడిసె యనుట.) కృకవాకు = కోళ్ళయొక్క, ఉద్దండ=అధికమైన, రవము=రవళిని, విని=ఆకర్ణించి, చనుప్రొద్దు = తాను నిత్యముం బోయెడు సమయము, ఆయె నటంచున్=అయ్యె ననుకొని, పాడఁబోవుచున్= గానము సేయ నేగుచును, త్రోవన్=మార్గమందు. తరువాతి కన్వయము.

1. దివాకీర్తిజనీనంబగు. 2. తూపల.

తా. అర్ధరాత్రసమయమందుఁ గుక్కుటాలయములోనికిఁ బిల్లి చొఱఁగా వెఱచి కూఁత లిడిన దాను విని వేకువ కోడికూఁత లని తలంచి తాను నిత్యముగాఁ బాడ నేఁగెడు సమయ మాయె నని బయలుదేఱి పోవుచు మార్గమందు. ఇది ముందటి కన్వయ మగును.

ఆ. మరులుఁదీఁగె మెట్టి యిరు లన్న నో యని
యెడు తమిస్రఁ గాడుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్యగహనవాటిఁ జొచ్చి చనుచు. 12

టీ. మరులుఁదీఁగెన్ = మర్లుమాతంగి తీఁగను (దీనిం ద్రొక్కినవారుదారి తప్పుదురు) మెట్టి = ఆ దాసరి త్రొక్కి, ఇరు లన్నన్ = చీకటు లని పిలువఁగానే, ఓ యనియెడు = ఓ యని పలికెడునట్టి, (కటికిచీకటి యనుట), తమిస్రన్=చీకటి రాత్రియందు 'తమిస్రా తామసీరాత్రిః' అని యమరము. కాడుపడి= త్రోవదప్పి (దిగ్భ్రమ చెంది) పొలంబులెల్లన్=పొలము లన్నియు, తిరిగి = దిమ్మదిరిగి, తూర్పు=ప్రాగ్దిశ, తెల్లనౌతఱిన్ = తెల్లఁబడుసమయమందు, (ప్రభాతసమయ మనుట), ఒక్కశూన్యగహనవాటిన్ = ఒక్కనిర్జనమ్మపుటడవిప్రదేశమందు, చొచ్చి = ప్రవేశించి, చనుచున్=పోవుచు.

సీ. ఇడిసిన యిడుప్పులయెడలఁ బొత్రె నుత్త
రేను గసింద కోరింద పొదలఁ
గెడసిన [1]గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యదవకాఁపురముండు నాఖుతతుల
సగముదుమ్మునఁ బూడి చిగిరింత వామూయఁ
బెరిఁగిన నూటిపాఁతఱ బొఱియలఁ
జీమలు ప్రాలీడ్వఁ జివికిన వెలుఁగుప
ట్టునఁ బండి యొండి క్రుంగిన గునుకులఁ
తే. బెంటదొగ్గళ్ళలోఁ గడుపంటి శ్మశ్రు
చలనములఁ గ్రుక్కు జీర్ణోతువులఁ బొలంబు
దుండిగల మళ్ల యారులఁ [2]దూలి రాడు
చిక్కు నేఱాల పాడఊసీమఁ జనుచు. 13

1. గరిసెల క్రింద నాఁకటఁగ్రుస్సి. 2. ధూళిదొగడ; దూళిరగడ్డు.

టీ. ఇ...లన్-ఇడిసిన=విరిగిన, ఇడుపుల యెడలన్=గోడలయందు పా...లన్-పాత్రేను=చిటిరేఁగుచెట్లయొక్కయు, ఉత్తరేను=అపామార్గములయొక్కయు, కసింద=కాసమర్దములయొక్కయు, కోరింద=కోరింద చెట్లయొక్కయు, పొదలన్=పొదరులచేత, కె...దన్-కెడసిన=క్రిందికొఱఁగినట్టి, గరిసెల క్రిందన్=గాదెబొట్టల క్రిందను, లాఁగలన్=బొక్కలయందు, క్రుస్సి=కృశించి, అదవకాఁపురముండు = అస్థిరనివాసమున్నట్టి, ఆఖుత తులన్=మూషకములగుంపులచేత, సగము = అర్ధభాగము, దుమ్మునన్ = గాలిదువ్వచేత, పూడి=పూడ్వఁబడి, చిగిరింత=చిగిరింతగడ్డి, వామూయన్=మొగముమూయఁగా, పె...లన్-పెరిఁగిన=ఎదిగినట్టి, నూతి=చేఁదుడు బావులయొక్కయు, పాఁతర=పాఁతరలయొక్కయు, బొఱియలన్=బొందలచేత, (నూతి పాఁతర గుంటలు సగముపూడి యదిమొదలు గడమ చిగిరింత బలసియున్నదనుట), చీమలు=పిపీలికలు, ప్రాలు=బియ్యమును, ఈడ్వన్ = ఆకర్షించుకొని పోఁగా, చి...నన్-చివికిన=జీర్ణమయినట్టి, వెలుగుపట్టునన్=దొడ్డికంపల పట్టున, పండి=(గునుకుధాన్యము) పక్వమై, ఎండి=శుష్కించి, క్రుం...లన్-క్రుంగిన=అడఁగిపోయిన, గునుకులన్=గునుకుఁగసవుచేత, పెంటదొగ్గళ్లలోన్ = పెంటలమీఁది దొగ్గలి చెట్లయందు, కడుపంటి = కడుపు వెన్నున నంటుకొని, (అశనములేక నకనకలాడు ననుట), శ్మశ్రు=మీసములయొక్క, చలనములన్ = కదలుటలచేత, క్రు...లన్ - క్రుక్కు = అడఁగియున్న, జీర్ణోతువులన్ = ముసలిపిల్లులచేతను, ‘తద్భ్రుందేశ్మశ్రుపుంముఖే, ఓతుర్బిడాలో మార్జాలః’ అనియు నిఘంటువు. పొ...లన్-పొలంబు=పొలముయొక్క, దుండిగలు=దుండిగపుఁజెట్లచేతను, మళ్ల=వరిమళ్లయొక్క, ఔరులన్ = ఔరుగసవు గంటలచేతను (కృషిలేకయుండుటచేతఁ బొలములందు దుండిగములును, వరిమళ్లయందు వీరణపు గంటలును మొలిచిన వనుట), తూలి=నేలకు వ్రాలి, రాడుచిక్క = నిట్రాడుమాత్రము మిగులునట్లున్న, ఏతాలన్ = ఏతములచేతను, పాడఱుసీమన్=పాటుపడిన ప్రదేశమందు (కొంచము మాత్రము గనుపడుచు జలయంత్రములు దుమ్మునఁ బూడిపోయిన పాడుభూమి యనుట), చనుచున్=పోవుచును.

క. అపమార్గత నరుగుచు మా
ర్గపు ధామార్గవపుఁ గంటకంబులఁ గాళ్లన్
విపరీతత నూఁదుచు నే
రుపున న్బల్లేరు లీడ్చి త్రోయుచుఁ జనుచున్. 14

టీ. అపమార్గతన్=తప్పుదారిలో, అరుగుచున్=పోవుచు, మా...లన్-మార్గపు=తానుబోయెడిమార్గమందలి, ధామార్గవపు=ఉత్తరేనిచెట్లసంబంధులగు, ‘అపామార్గశ్శైఖరికో ధామార్గవమయూరకౌ’ యని నిఘంటువు. కంటకంబులన్=ముండ్లను, కాళ్లన్=

కాళ్లనుండి, విపరీతతః=ప్రతిలోమముగా, ఊడ్చుచుఁ=పొరాల్చుచు, సేరుపునః= ఉపాయముచేత, పల్లేరు=పల్లేరుగాయలముండ్లను, ఊడ్చి = ఊడదలాగి, త్రోయుచుఁ, చనుచుఁ = పోవుచును.

తా. ఆమాలదాసరి దారితప్పి నడచుచు నుత్తరేనిముండ్లు కాళ్ల కంటుకొనఁగా వానిని బ్రతిలోమముగాఁ దుడిచివైచుచుఁ, బల్లేరుగాయలు గ్రుచ్చుకొనఁగా వానిని మెలఁకువతోఁ దొలఁగించుకొనుచుఁ బోవుచుండెను.

శా. కాంచె న్వైష్ణవుఁ డర్ధయోజన జటాఘాటోత్థశాఖోపశా
ఖాంచద్ఘాటచరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత వ్రణచ్ఛలన లిప్యాపాదితా ధ్వన్యని
స్సంచారాత్తమహాఫలోపమఫలస్ఫాయ ద్వటక్ష్మాజమున్. 15

టీ. వైష్ణవుఁడు = ఆభాగవతుఁడు, అర్ధయోజన=రెండుపరుగుల నిడివిగల, జటా= ఊడలయొక్క, ఘాటా=పైభాగపుఁ బ్రక్కలనుండి, ఉత్థ=మొలిచినట్టి, శాఖా=కొమ్మల యొక్కయు, ఉపశాఖా=ప్రక్క కొమ్మలయొక్కయు, అంచత్=ఒప్పుచున్న, ఝాట= గుంపులయందు, చరత్=సంచరించుచున్న, మరుత్=వాయువుయొక్క, రయ=వేగముచేత, దవీయః=దవ్వుగా, ప్రేషిత=చిమ్మఁబడినట్టియు, ఉద్యత్=ఎగురు చున్నట్టియు, ఛద=ఆకుల యందు, ఉదంచత్=స్ఫుటము లగుచున్న, కీట=పురుగులచేత, కృత=చేయఁబడిన, వ్రణ= బొంద లనియెడు, ఛలన=వ్యాజము గల, లిపి=అక్షరములచేత, ఆపాదిత=సంపాదింపఁబడిన, అధ్వన్య=మార్గస్థులయొక్క, నిస్సంచార=సంచారభావముచేత, ఆత్త=పొందఁబడిన, మహా ఫల-మహాత్=శ్రేష్ఠమైన, ఫల=పుణ్యఫలముతోడ, ఉపమ = సామ్యముగల, ఫల=పండ్ల చేతను,స్ఫాయత్=వృద్ధిఁబొందుచున్న, వటక్ష్మాజముః=మఱ్ఱిచెట్టును, కాంచెః=చూచెను.

తా. ఆభాగవతుఁ డామార్గమందు రెండుకోసుల నిడివిగల యూడలు దిగి యూడలయందే యనేక శాఖోపశాఖలు గలిగి యాశాఖలయందలి యాకులమీఁదఁ బురుగులు దొలిచిన బొందలతోఁ గూడ నవి పీడి వాయువశముచేత దూరముగాఁ గొట్టు కొనివచ్చి యెగురుచుండఁగా నావృక్ష, మచ్చట బ్రహ్మరక్ష స్సున్నది, యీ త్రోవను రావల దని, మార్గస్థులకుఁ దెలియుటకు నాయాకు లనెడు జాబులమీఁదఁ బురుగులచేఁ దొలువఁబడిన గీఁత లనియెడు నక్షరములు వ్రాసి పంపుచున్నదో యన్నట్లును, దానివలన మార్గస్థు లా మార్గమున సంచరింపకుండుటంజేసి, మహాపుణ్యఫలముచేఁ గలిగె ననుటకు సమానముగా గొప్పలగు పండ్లచేత నొప్పుచున్న యొక్క పెద్దమఱ్ఱిచెట్టును జూచెను. ఉత్ప్రేక్షాలంకారము.

ఆ. కాంచి యాతఁ డొక్క । కాలి[1]త్రోవయు నంత
గాంచి యందుఁ దెరువుఁ । గాంచినదియ
పరమలబ్ధి గాఁగఁ । ద్వరితంపుగతి నవ్వ
టావనీజ మంత । నంతఁ గదిసి. 16

టీ. కాంచి=ఆవృక్షమునట్లుచూచి, ఆతఁడు = ఆభక్తుఁడు, అంతన్=అంతట, ఒక్క కాలిత్రోవయున్=ఒక కాలిమార్గమునుగూడ, కాంచి=చూచి, అందున్ ఆ పాడుపడిన సీమయందు, తెరువుఁగాంచినదియ=మార్గము లభించుటయే, పరమలబ్ధిగాఁగన్= పరమలాభముగా, త్వరితంపుగతిన్=శీఘ్రగమనముచేత, అవ్వటావనీజము = ఆ మఱ్ఱిచెట్టును, అంతనంతన్=అంతటంతటను, కదిసి=చేరవచ్చి. తర్వాతిపద్యముతో నన్వయము.

సీ. [2]ఎలనీటి బొండలంబులువోలె మెదడెల్ల
జుఱ్ఱి వైచిన డొల్లు । పుఱ్ఱెగములు
నెఱచి గీఱిన జీర । లేర్పడఁ దుదముట్టఁ
జీకిన నులిపచ్చి । కీకసములు
దొనదొనమను నీఁగె । తుట్టెల రూ పేఱు
పడక క్రంపలను వ్రే । లెడు గరుసులు
ఘూళ్ల మక్కెక్కి మంటగళ్ల తిప్పలు రేఁగు
వడువున గాలి నాడెడు వెఱికలు
తే. దునిసిన నరాంగకముల బోఁతులను గమిచి
పోక యొండొంటితోఁ [3]బిఱుగీఁకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి వ్రస్సి వలచు
వరుగు దఱచగు ముఱుత్రోవ । నరిగి యెదుట. 17

టీ. ఎ...లెన్-ఎలనీటి = లేఁతనీరుగల, బొండలంబులువోలెన్ = టెంకాయ బొండ్లములవలెనే, మెదడెల్లన్=మస్తిష్కమంతయు, జుఱ్ఱి=పీల్చి, వైచినన్=పరిహరింపఁగా, డొల్లు=దొరలాడుచున్న, పుఱ్ఱెగములున్ = నరకపాలసమూహములును, (ఎళనీరు త్రావి పాఱవైచిన టెంకాయ బొండ్లములవలెనే తలకాయల మెదడు జుఱ్ఱివేయఁగా నాపుఱ్ఱెలు డొల్లుచున్న వనుట), ఎఱచి గీఱిన జీరలు=మాంసము గీచుకొన్న గీఱలు, ఏర్పడన్=కనుపడునట్లు, తుదముట్టన్=కడవెడలునట్లు, చీకిన=చప్పరించిన, న్రు...ఖు-నులిపచ్చి=కొంచెముపచ్చిగల, కీకసములు=ఎముకలను ('కీకసం కుల్య మస్థిచ' అని

1. ఢొంకయు. 2. ఎడనీటి బొండ్లాలవడువున. (శ. ర. పా.) 3. బోరి ఫీకులాడు.

నిఘంటువు.) దొనదొనమను=దొనదొన ముసరికొను చప్పుడుగల, ఈఁగెతుట్టెలన్ =మక్షికారాసులచేత, రూపేఱుపడక=రూపము తెలియరాక, క్రంపలను = కంప వెలుగులయందు, వ్రేలెడు=వ్రేలాడుచున్న, గరుసులు = పచ్చిచర్మములును, ధూళ్లన్ =దుమ్ములచేతను, మక్కొక్కి=మక్కుడువారి, మం...లు-ముంగళ్ల = తురకులయొక్క, తిప్పలు=(వెండ్రుకల) పెంటలు, రేఁగువడువునన్ =రేఁగినట్లు, గాలిన్ =వాయువుచేత, ఆ ...లు-ఆడెడు చలించుచున్న, వెఱకలు=వెండ్రుకలును, తు...లన్ -తునిసిన ఖండింపఁ బడిన, నర=మానవులయొక్క, అంగకములన్ =అవయవములను, పొత్తులను=కూడ, కమిచి=కబళించి, పోక=ఆవల జరుగక, ఒండొంటితోన్ =పరస్పరమును, పిఱువీఁకులాడు= వాదులాడుచున్న, శ్వాపదంబులున్ = దుష్టమృగ విశేషంబులును, పదహతిన్ =కాలి తన్నుచేత, ప్రస్సి=ప్రయ్యలై, వ...గు-వలచు=కంపుగొట్టుచున్న, వరుగు=మాంసపు వరుగును, (వరు గనఁగా గృధ్రవిశేషము లనియుఁ జెప్పవచ్చును), తఱచగు=దట్టముగాఁ గలిగిన, ముఱుత్రోవన్ =మాంసములు ముఱిగియున్న దుర్గంధమార్గమున, అరిగి=పోయి ఎదుటన్ =ముందఱ. తరువాతి కన్వయము.

తా. ఆబ్రహ్మరక్షస్సనేకులను బట్టి చంపుచుండుం గాన నాప్రదేశమందు మెదడు జుఱ్ఱివైచిన కపాలములును, శల్యములు మాంసముతోడ నోటఁగఱచి పండ్లఁగీఱి తిని పాఱవేసినయవియును, శరీరములు చర్మము లొలిచి కంపలమీఁద వేయఁగా నీఁగెలు మూఁగి రూపు గానరాకుండునవియును, బహుకాలముగా ననేకులఁ జంపుటచేత వారి తలలవెండ్రుకలు కుప్పలై పడియుండి ధూళిచేతఁ గొంత బ్రుంగుడువడి గాలిచేత మంగళ్ల పెంటలు రేఁగినట్లు రేఁగుచుండు నవియును, దునిఁగిపోయినమానవావయవముల నవ్వాల నివ్వాలఁ గబళించి దుష్టమృగములు పీఁకులాడుచుండునవియును, గాళ్లఁదన్ని బ్రద్దలుచేసి యెండవేసిన వరుగులును గలిగి, యిట్టిబీభత్సరసాస్పదంబైన యా ముఱు మార్గమున నతఁ డరుగుచుండెను.

సీ. ముంగాళ్లఁ జాఁగిపై । ముచ్చుఁజూపులు వర్వ
బొమిక లెత్తుచుఁ బాఱి । పోవు శునులఁ
బలలతోరణములు । పట్టి బిట్టెగయ శా
ఖా[1]ధూతి నెగయు కం । కముల రొదల
నడ్డంబు దిరిగి [2]త । లాహతిఁ బడి రొండి
హ స్తంబు లిడి యంగ । లార్చుకపుల
డబ్బాటుమై నొక్కొ । [3]డలు సూపి యవిమాయ
నడఁగ వేఁటెడఁ జూపు । వ్యాపృతులను

1. ఘాతి. 2. కరా. 3. దలఁజూపి.

తే. [1]నెవ్వఁడో యొక్కఁ డున్న వాఁ డిందు, వాఁడు
నరుఁడు గాఁ, డింధనాదికా హరణమునకు
వేళయును గాదు, పొలగాలి వీచెఁ, దెరువు
నెడ, వనుచు జాలిగొని సంశ యించువేళ. 18

టీ. ముంగాళ్లన్ = ముందఱికాళ్లచేత, చాఁగి = చాఁగిలిపడి, పైన్ = ఊపరిప్రదేశమున, మ్రుచ్చుఁ జూపులు = దొంగచూపులు, పర్వన్ = వ్యాపింపఁగా, బొమికలు = శల్యములను, ఎత్తుచున్ = ఎత్తుకొనుచు, *పా...లన్ - పాఱిపోవు=పరుగులిడుచున్న, శునులన్=కుక్కలచేతను, పలలతోరణములు = మాంసపుఁదోరెములను, పట్టి=కఱచుకొని, బిట్టు = పెల్లుగా, ఎగయన్ = ఎగసిపోవఁగా, శాఖాధూతిన్ = కొమ్మలు గదలుటచేత, ఎ...లన్ - ఎగయు = పుట్టుచున్న, కంకముల = రాబులుగులయొక్క, 'లోహపృష్ఠస్తు కంకస్స్యాత్' అని నిఘంటువు. రొదలన్ = శబ్దములచేతను, అడ్డంబు దిరిగి= ఆబ్రహ్మరక్షస్సున కడ్డాలు వచ్చి, తలాహతిన్ = అఱచేతిప్రేటును, పడి = పొంది, (దెబ్బఁ దిని యనుట), రొండిన్ = కటిప్రదేశమందు, హస్తంబులు ఇడి=చేతులిడుకొని, అంగలార్చు=మిడుకుచున్న, కపులన్=కోఁతులచేతను, డబ్బాటుమైన్ = హఠాత్కారముగా, ఒక్కెడలు చూపి = ఒక్కదిక్కు గానుపించి, అవి=ఆప్రదేశములు, మాయన్ = టక్కుచేత, అడఁగన్ = కనఁబడకపోఁగా, వేఱెడన్ = మఱియొక్కదిక్కును, చూపు = కనఁబఱచుచున్న, వ్యాపృతులను = వ్యాపారములచేతను, ఇందున్ = ఈప్రదేశమందు, ఎవ్వఁడోయొక్కఁడున్నవాఁడు, వాఁడు, నరుఁడు గాఁడు = మానవుఁడు గాఁడు, ఇం...కున్ - ఇంధన = శుష్కములు, ఆదిక = మొదలుగాఁగలవన్యవస్తువులయొక్క, ఆహరణమునకున్ = తెచ్చుటకును, వేళయును గాదు=సమయంబును గాదు, పొలగాలి = మాంసపుగాలి, వీచెన్=విసరెను, తెరువున్ = మార్గంబును, ఎడవు = దవ్వు, అనుచున్=అని తలఁచుచు, జాలిగొని = వెతఁగూరి, సంశయించువేళన్ = సందియపడునప్పుడు. తరువాతి పద్యముతో నన్వయము.

సీ. మృతమర్త్య రెంటాన నిడ్డఁ జాలక నెత్రు
రంజిల్లు పెనుబొట్ట ముంజివానిఁ

---

1. గని యెవఁడో యొక్కరుం డిందుఁగలఁడు వాఁడు.

* 'పాఱిపోవుశునులన్=పలాయనమగుచున్న యాఁడుఁగుక్కలను. శును లేమి? మగవిరావా? రావు. వీనికి చౌరవయు జిత్తును ఎక్కువ కావున ఇవి ముందువచ్చును. శుని - స్త్రీలింగము; శ్వానము - పుంలింగము' అని, వే. టీ.

ఇదియంతయు ఇకారాంత పుంలింగమైన 'శుని' శబ్దమున్నసంగతి యెఱుఁగమిచేత పెరిఁగినవ్రాత. "శుని. ఇ. పుం. కుక్క" - శ. ర. "శునిః = A dog" - ఆప్టి.

బల్లచీమల వక్ర భల్లాతకియుఁబోలె
నెఱ్ఱ[1]దుప్పటి నొప్పు కఱ్ఱివాని
వ్యత్యస్త హస్తిమ స్తాభఁ బాయగు గడ్డ
మును దంష్ట్రికలుఁ బొల్చు మొగమువానిఁ
గడుదుర్గ్ల నిడుత్రుట్టి గతిఁ [2]జోఁగలోఁ బాండు
రత మించు కపిలకూర్చంబువాని

తే. నెఱకుఁదెరువరిఁ గన శాఖ లెక్క జాఱు
ప్రేవుజంబెంబుఁ గసరి పైఁ బెట్టువాని
వ్రేలు డగుబొజ్జ గల బూరగాలివానిఁ
జెంబుతలవాని నవటుకచంబువాని. 19

టీ. మృతమర్త్యున్ = చచ్చినమానవుని, కెంటానన్ = కౌపీనముగా, ఇడ్డన్ = పెట్టుకొనఁగా, చాలక=పొడవుసాలక, నెత్రురంజిల్లు = రక్తమంటియున్న, పెనుపొట్ట = పెద్దకడుపునందలి, ముంజివానిన్ = కటిసూత్రముగలవానిని, (శవమును గౌపీనముగాఁ బెట్టుకొన్న నది పొడవుసాలక యీడ్చియీడ్చి మొలత్రాటిలో దోఁపుకొనఁగా దాని నెత్తురు పొట్టకంటె ననుట), పల్లచీమలన్ = బాఁపనచీమలచేత, వక్రభల్లాతకియుఁబోలెన్=వంకరజీడిచెట్టువలె, ఎఱ్ఱదుప్పటిన్ = రక్తవర్ణముగల దుప్పటిచేతను, ఒ...నిన్ - ఒప్పు = ఒప్పుచున్న, కఱ్ఱివానిన్ = నల్లనిమేనుగలవానిని, వ్య...భన్ వ్యత్యస్త = క్రిందుమీఁదయిన, హస్తి= ఏనుంగుయొక్క, మస్త = తలయొక్క, ఆభన్ = రీతివంటి రీతిచేతను, పాయగు = పాయలైన, గడ్డమును, దంష్ట్రికలున్ = కోఱలును, పొల్చు = మెఱయుచున్న, మొగమువానిన్ = ముఖముగలవానిని, (కుంభికుంభస్థలము తలక్రిందుఁ జేసిన నాకుంభస్థలములవలెఁ బాయవడ్డ గడ్డమును నాదంతి దంతములవంటి కోఱలును గలిగి యున్న వనుట), క...తిన్ - కడుఁదుర్గ్ల=కణుఁదురీఁగెలయొక్క, నిడు = నిడుదయైన, త్రుట్టిగతిన్=పెఱవలె, చోఁగలోన్=గుంతలో, (చొంగులో ననుట), పాండురత = తెల్లఁదనము, మిం...నిన్ - మించు = అతిశయించుచున్న, కపిల = కడారవర్ణముగల, కూర్చంబువానిన్ = భ్రూమధ్యదేశముగలవానిని, 'కూర్చమస్త్రీ భ్రువో ర్మధ్యమ్' అని నిఘంటువు. ఎఱకుఁదెరువరిన్ = ఎఱుకువాఁ డగుమార్గస్థుని, కనన్ = చూచుటకొఱకు, శాఖలెక్కన్ = కొమ్మలనెక్కఁగా, జాఱు = జాఱిపోవుచున్న, ప్రేవుజంబెంబున్ = ప్రేగులజన్నిదమును, కసరి=గద్దించుకొని, పైఁ బెట్టువానిన్ =భుజముమీఁదికి ద్రోచికొనువానిని, వ్రేలుడగు = వ్రేలాడుచున్న, బొజ్జగల = బొజ్జగలిగిన, బూరగాలివానిన్ = ఊఁచకాళ్లవానిని, చెంబుతలవానిన్ = చెంబువలె నున్ననైన బట్ట

1. త్రుప్పట; దుప్పల. 2. జొంగ.

గట్టిన శిరముగలవానిని, అవటుకచంబువానిన్-అవటు = మెడ్డెనగుంటగానుండు, 'అవటు ర్ఘాటా కృకాటికా' అని నిఘంటువు. కచంబువానిన్ = జుట్టుగలవానిని, (కర్తృ పదక్రియాపదము లీపద్యమందు లేవు గావునఁ గుళికము. 'క్వచి త్కుళికసంఖ్యా దావత్రసాహిత కృద్భవేత్' అని యథర్వణోక్తి).

తే. కండకన్నులవాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నాముఁ, గుంభ
జాను వనునొక్కద్విజనిశాచరునిఁ గనియె. 20

టీ. కండకన్నులవానిన్ = కండపెరిగిన కన్నులు గలవానిని, ఆఁకటను = ఆఁకటి చేతను, ('షోపవిభక్తికసామ్నామత్వం స్యాత్సప్తమీతృతీయార్థే' అను సూత్రము చేత నత్వము.) బండతిట్లన్ = బూతుఁదిట్టులచేత, బేతాళికలన్ = ఆఁడుదయ్యాలను, సారెన్=పల్మఱును, తిట్టువానిన్=తిట్టుచుండెడువానిని, నగగరిమవానిన్-నగ = పర్వతము యొక్క, గరిమవానిన్ = గురుత్వమువంటి గురుత్వముగలవానిని, (కొండంతవాఁడనుట), అన్వర్థనామున్ = సార్థకనామధేయముగలవానిని, కుంభజానువు అన్=కుంభజానువను పేరుగల, (కుంభజాను వనఁ గుండలవంటి మోకాళ్లు గలవాఁ డనుట), ఒక్క = ఒక్కఁ డైన, ద్విజనిశాచరునిన్ = బ్రహ్మరాక్షసుని, కనియెన్ = చూచెను.

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహీరుహశాఖి నుగ్గుగా
వీఁడును మున్ను రే పగటి వేళకు మానిసి యాటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట, లావరి యాట, నిల్చి యా
వాఁడిశరంబుచే నడువ, వాఁ డది ద్రుంపుడు, వీఁడు నుద్ధతిన్. 21

టీ. వాఁడును=ఆబ్రహ్మరాక్షసుఁడును, కంటిన్=చూచితిని, పోకుము అని=పోవకు మని, మహీరుహశాఖి=చెట్లమొత్తము, నుగ్గుగాన్=చూర్ణమగునట్లు, వ్రాలెన్=దుమికెను, వీఁడును = ఈదాసరియును, మున్ను = పూర్వమందు, రేపగటివేళకున్ = రాత్రి యొక్కపగటియొక్కసమయమునకు, మానిసియాటన్ = తగినమనుష్యుఁడౌటచేత, పోరి లోన్ = యుద్ధమునందు, వాఁడిమిన్ = పరాక్రమముచేత, కొంతకాలము = కొన్నాళ్లు, ఇలవ్రాలుటన్ = భూమియందుఁ బ్రసిద్ధిపొందినవాఁ డగుటచేతను, లావరి యాటన్=బలముగలవాఁడౌటచేతను, నిల్చి = ఎదిరించి, ఆవాఁడిశరంబుచేన్ = మున్ను దాను దెబ్బతిన్న వాఁడ ద్యుతియెడు బాణముచేత, ('సంస్కృతపదేన పరిమితమాంధ్ర పదం శర్మధారయో భవతి'అను సూత్రముచేత, మఱియు 'నాంధ్రం మద్వర్ణపర్యంతం సంస్కృ తేన సమస్యతే'అను నథర్వణోక్తిచేతను 'వాఁడిమయూఖము ల్గలుగువాఁ డపరాంబుధిఁ

జేర...నేటికి న్రాఁడు కచుండు' అను వాగనుశాసనప్రయోగముచేతను సాధువు) అడువన్ = కొట్టఁగా, వాఁడు = ఆరక్కసుఁడు, అది = బాణమును, ('ఇతరత్రచ ద్వితీయాతస్యాః ప్రథమాచ జడపదానాంస్యా'. త్తనుసూత్రముచేత ద్వితీయకుఁబ్రథమ.) త్రుంపుడున్ = విఱిచివేయఁగా, వీఁడును = ఈదాసరియును, ఉద్ధతిన్ = గర్వముతో. తరువాతిపద్యముతో నన్వయము.

సీ. తిగిచిన నడుగులు । దెమలక ఱొమ్మప్ప
ళించి యవ్వలికిఁ[1]గే । డించి దాఁటి
చఱచిన వంచించి । చరమభాగమునకై
తిరిగి,[2]తత్క్రియ కగు । దృష్టి నిలిపి
పైఁబడ్డఁ జనుమఱ । పట్టు[3]కొడ్డుకయుండు
పిడికిళ్ల బలిమి లోఁ । బడక నిలిచి
చొరఁజూడఁ గ్రుంగి ము । ష్టులబిగి కోటగాఁ
జొరవీక తిరిగెడు । చోన తిరిగి

తే. యసుర వధసాధనము రోయు । నపుడు గ్రుద్ధి
తాఁచి తిరిగినఁ గృతముష్టి । దండ నిలిచి
[4]యెడకొలఁది వెనుక నడునొయ్య । నడిచి యడిచి
మత్పదస్మృతి యాత్మ నే । మఱక యతఁడు. 22

టీ. తిగిచినన్ = ఆరాక్షసుఁడుదన్నుఁబడలాగినను, అడుగులుదెమలక = తనయడుగులుగదలక, ఱొమ్ము=వక్షఃస్థలము, అప్పళించి = ఆస్ఫాలించి, అవ్వలికిన్ = ఆవలికి, కేడించి = తొలఁగి, దాఁటి=లంఘించి, చఱచినన్ = ఆరాక్షసుఁ డఱచేతవ్రేసినను, వంచించి=కికురించి, చరమభాగమునకై=వెనుకదిక్కునకై, తిరిగి=మరలి, తత్క్రియ కగు= మఱలఁజఱచుటకైన, దృష్టి = చూపు, నిలిపి, పైఁబడ్డన్ = ఆయసుర తనపైఁబడి రాఁగా, చనుమఱపట్టుకున్ = ఱొమ్ము మీఁదికి, ఒడ్డుకయుండు = కొనియుండెడు, పిడికిళ్లబలిమిన్ =ముష్టిబలముచేత, లోఁబడక = లోఁకువగాక, నిలిచి, చొరఁజూడన్ = ఆయసురచొచ్చిరాఁబోఁగా, క్రుంగి = తాను వంగి, ముష్టులబిగి = పిడికిళ్లబిగువే, కోటగాన్=వప్రముగా, చొరవీక = చొరవ యీయక, తిరిగెడుచోన = ఆయసురతిరిగెడుచోటనే, తిరిగి, అసుర = ఆరక్కసుఁడు, వధసాధనము = తన్నుఁజంపెడుసాయమును, రోయునపుడు=వెదకునప్పుడు, క్రుద్ధి=పిడికిటఁబొడిచి తాఁచి=తన్ని, తిరిగినన్ = వాఁడు దిరుగఁగానే, కృత=అమర్పఁబడిన, ముష్టి=పిడికిటియొక్క, దండన్ = ప్రాపున,

1. జండించి. 2. తత్క్రియకును. 3. కొడ్డుదునుండు. 4. యక్కొలఁది వెక్క నడ నొయ్యనడిచి యడిచి.

నిలిచి, ఎడకోలఁది = సందుచ్చికొక్కనకొలఁదియు, వెనుక = వానివీఁపును, నడుము = మధ్య దేశమును, ఒయ్యన్ = క్రమముగా, అడిచియడిచి = కొట్టికొట్టి, ('వెనుకనడుగొయ్య నడచినడచి' అనిచో వను పాఠమునందు అప్పుడు వెనుకకుఁబోయియనుట) మత్పదస్మృతి= మాపాదానుచింతనమును, అత్మన్ = బుద్ధియందు, ఏమఱక = మఱచిపోక, అతఁడు = ఆదాసరి, (ఇది కర్తృపదము), (అసుర యనుచోట 'స్త్రీత్వ బహుత్వే సురాదే రసమాసే' అను సూత్రముచేత నది సురాదిగణపఠితమైన నేకవచనమందు స్త్రీత్వము. 'కం. చంపునొకో యక్కటా కా, రింపం దలఁచునొకో లఘుచరిత్రంబులకుం, బంపఁ గడంగునొకో శం, కింపం డీక కఱకుటసుర గీ డొనరింపన్.' అని నిర్వచనోత్తరరామాయణ ప్రయోగము.)

తే. [1]త్రోచి పోఁజూడఁ దనరాక్షసీచయంబు
నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ
బోయె నదె వాఁడు రారె రారే యటంచుఁ
బాఱి వారును దానును బట్టికొనుడు. 23

టీ. త్రోచిపోఁజూడన్ = ఆదాసరితట్టివైచిపోవ నుద్యోగింపఁగా, తనరాక్షసీచయంబు నెల్లన్ = తనరాక్షసస్త్రీలనందఱను, చీరినన్ = పిలువఁగా, డిగ్గి = చెట్టు దిగి, వా రేఁగుదేరన్ = వారు రాఁగా, వాఁడు = ఆమనుష్యుఁడు, పోయెనదె = అదిగో పోయెను, రారె రారేయటంచున్ = రండురండనుచు, ('ఏదోతౌ వ్యతిరేకా దపిసంప్రార్థనపరా క్రియాణాంస్త' అనుసూత్రముచేత వ్యతిరేకరూపము: మీఁది యేకారము సంప్రార్థన పరము.) పాఱి = ఉఱికి, వారును = ఆయాఁడు రక్కసులును, తానును = కుంభజానుఁడును, పట్టికొనుడున్ = ఆదాసరిని బట్టుకోఁగానే.

క. [2]పెంబోతద్దాసరి య
ప్డు బదహతులను గపోణికపోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగుచుఁ బో
వం బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్. 24

టీ. పెంబోతు = పెనుబోతగు, (బలసినవాఁడనుట; బంబోతనికొందఱందురు.) అద్దాసరి = ఆదాసుఁడు, అప్డున్ = అప్పుడును, ('పోశ్చ తదాద్యర్థవాచకేష్వాతౌ' అను సూత్రము చేతఁ బువర్ణోపరివిద్యమానమగు నుత్వమునకు లోపంబును 'తద్ద్రితంచ బిందుస్స్యాత్' అని చెప్పఁబడిన సూత్రముచేత ప్రథమాసమశబ్దముమీఁద సముచ్చయార్థక మగు ద్రుతం

1. తాఁచి. 2. బంబోతద్దాసరి.

బునకుఁ బూర్ణబిందువును వచ్చినది.) పదహతులను = కాలితన్నులచేతను. కఫోణిపోటులన్ = మోఁచేతి పోటులచేతను, ఇరుమైలన్ = రెండుప్రక్కలయందును, పొడుచుచున్ = పెనఁగుచు, పోవన్ = పోవఁగా, పట్టి=ఆదాసరిని బట్టుకొని, వటంబుఁ జేర్చి=మఱ్ఱిచెట్టుదాపునఁ జేరిచి, వాఁడు = ఆయసుర, ఇట్లనియెన్.

తా. ఆదాసరి బలవంతుఁ డగుటచేత నారక్కసునిఁ దనకాళ్లతోఁ దన్నుచు, మోఁచేతులతో నాతని ప్రక్కలఁ బొడుచుచుఁ బెనఁగులాడుచుఁ బోవుచుండెను. అట్లయ్యు నారక్కసుఁ డాతనిఁ బట్టుకొని మఱ్ఱిచెట్టుకడఁ జేర్చి యాతనితో నిట్లు పలికెను.

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము ◦ తృష్ణం బాసి సంతర్పణ
మ్మూరింబో నసిఁ ద్రుంచి పొంగెడు [1]భవన్ముండాస్ర ధారోష్మ మిం
పారం గ్రోలి పిశాచి నీదు కఱకు ◦ ట్లందీ నదస్తాలకాం
తారాంతర్నృకపాలకుండవిగళన్మైరేయముం [2]గ్రోలెదన్. 25

టీ. సారాస్వాదనన్ = నీక్రొవ్వుఁజవిచూచుటచేత, ప్రాణపంచకము = నాపంచప్రాణములును, తృష్ణన్=దప్పిని, పాసి=విడిచి, సంతర్పణన్=తృప్తిచేత, మూరింబోన్ = సంతోషింపఁగా, (క. 'మదిలోన నన్నుఁ దలఁచుచు, బదరీఫలమాత్ర హవ్యభాగము నలునం, దొదవించి తేనియును న, భ్యుదయము నే నొంది మూరిఁ బోవనె చెపుమా.' అనియును; గీ. 'గాడ్పుమురిపెంపు నెందును గల్గియెల్ల, వారిమనసులు వేడ్కల మూరిఁ బోయె' ననియును, హరివంశమునం దెఱ్ఱాప్రగడగారి ప్రయోగము.) అసిన్ = కత్తిచేత, త్రుంచి=ఖండించి, పొం...ము-పొంగెడు=పొంగుచున్న, భవన్ముండ=నీబోడితలయొక్క, అస్రధారోష్మము=వెచ్చనిరక్తధారను, ఇంపారన్ = ఇష్టముదీఱునట్లు, క్రోలి=పానముఁ జేసి, పిశాచి = ఈయాఁడుపిశాచము, నీదు = నీసంబంధియగు, కఱకుట్లు = కడ్డితోఁగుట్టి కాల్చినమాంసఖండములను, అందీన్=అందియియ్యఁగా, (క. 'నమ్మము నైదువ మోఁపగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం దిమ్మనుడు సేయునది లే, కమ్మగ్గుం దమ్మహీజ మలసత నెక్కన్.' అని విరాటపర్వమునందును; క. 'ఇతఁడు మదీయ పురోహితుఁ, డితనికిఁ దగనెల్ల పనులు నెఱిఁగించిపుడే, ధృతరాష్ట్రకడకుఁ బనుపుఁడు, చతురవచనరచనఁగఱపి సంప్రీతి మెయిన్ ? అని యుద్యోగపర్వమందును; సోమయాజిగారును ప్రయోగించినారుగాన నీక్త్వార్థకయిత్వసంధి సాధువు.) అ...మున్-అదః=ఈ, తాలకాంతార = త్రాటితోపుయొక్క, అంతః = లోపలనున్న, నృ=నరులయొక్క, కపాల= పుఱ్ఱెయ లనియెడు, కుండ = కుండలనుండి, విగళత్ = జాఱుచున్న, మైరేయమున్ = మద్యమును, క్రోలెదన్=త్రాఁగెదను.

1. భవన్ముండంబు ధారోష్మ 2. త్రాగెదన్.

క. వ న్నిం తలయించినఖలు
నిన్నుఁ బుజువిధి వధింతు నే యని యార్పుల్
మి న్నందఁగ బుస కొట్టుచు
నన్నీచుఁడు పొగరు వెడలు నవ్యక్తోక్తిన్. 26

టీ. నన్నున్=నన్ను, ఇం తలయించిన = ఇంతకష్టపెట్టిన, ఖలున్ = దుష్టుఁడైన, నిన్నున్=నిను, ఋజువిధిన్ = మృదువైనరీతిచేత, వధింతు నే = చంపుదునా, (చంప ననుట), అని=అనుచు, ఆర్పుల్ = బొబ్బరింతలు, మిన్నందఁగన్ = ఆకసమంటఁగా, బుస కొట్టుచున్=నిట్టూర్పు విడుచుచు, అన్నీచుఁడు = ఆరాక్షసుఁడు, పొ... క్తిన్-పొగరు వెడలు=మదము బయల్పడునట్టి, అవ్యక్తోక్తిన్=ఉన్మత్తభాషణముచేతను.

తే. అసియుఁ బాత్రయుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలగగ్గర ద్రోయ నశ్వుజముతోడ
నొరగి రక్కసుతో దైన్యవిరహితముగ
ధర్మ మెఱిఁగించుసూక్తి నాతండు పలికె. 27

టీ. అసియున్ = ఖడ్గమును, పాత్రియున్ = రక్తముఁబట్టుటకుఁబాత్రమును, తేన్ = తెచ్చుటకై, పంచి=ఆజ్ఞాపించి, అంత్రవల్లిన్=తీఁగెవంటిప్రేఁగుచేత, కోలగగ్గర కాళ్లకుఁద్రాడుతగిలించి యెద్దును మూటకట్టుగాగట్టి పడవేయునట్లుగా పడవేసి గీ. ఎద్దులను గాళ్లగట్టి క్రిందేయుటొప్పఁ గోలగగ్గర యనఁగ...' ఆంధ్రభాషార్ణవము. అశ్వుజముతోడన్=ఆమఱ్ఱిచెట్టుతో, ఒరగి, రక్కసుతోన్ = రాక్షసునితో, దైన్యవిరహితము గన్ = విన్నఁబాటులేనివిధమున, ధ... క్తిన్-ధర్మమెఱిఁగించు = ధర్మపద్ధతిని దెలిపెడు, సూక్తిన్ = మంచిమాటచేత, ఆతండు = ఆహరిదాసుఁడు, పలికెన్ = పచించెను.

తా. ఆసురియాళుని బ్రహ్మరాక్షసుఁడుకట్టి, మఱ్ఱిచెట్టున కావింపఁగా, నతండు ధైర్యముతో నారాక్షసునిం జూచి యిట్లనియెను.

చ. విను మొకమాట రాత్రిచర! వేగిర మేటికి నిన్ జయింతురే
యనిమిషు లైన? భాజనగతాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్
వెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప మిందు కై
కొనలకు నాకు మేనియెడఁ గాంక్షయు లే దిది వోవు టే యురున్. 

టీ. రాత్రిచర = ఓరక్కసుఁడా, ఒకమాట వినుము, వేగిర మేటికిన్=వేగమేల, అనిమిషులైనన్ = దేవతలేని, నిన్ జయింతురే=నిన్నుజయింపఁగలరా, (గెల్వలే రనుట), నేన్=నేను, భా...ము-భాజనగత = కంచములోనికివచ్చిన, అన్నము = అశనము నే, నేను,

ఇఁకన్ = ఇఁకమీఁద, ఎందుఁబోయెదన్ = ఎచ్చటికిఁ బోఁగలను (భావిక్రియ) పెనఁగక, ప్రాణరక్షణము = స్వజీవసంరక్షణము, ఉపేక్షయొనర్చుట = ఒప్పరికించుట, పాపము. ('హంతు మభ్యాగతం శత్రుం యశ్శక్త్యా న నివారయేత్, స ఆత్మఘ్న ఇతి ఖ్యాతో రౌరవంనరకం వ్రజేత్' అనియున్నది.) ఇందుకై = ఈపనికై, (ఇందనునది యేత దర్థకమగు దేశ్యపదము గావున దీనిమీఁదఁ జతుర్థీవిభక్త్యర్థకమగు కైవర్ణమువచ్చెను, కావుననే యిందుమీఁద నిందుచేత మొదలగునవి గలుగును.) కనలకు = అలుగకు, నాకు, మేనియెడన్ = శరీరముకట్లు, కాంక్షయున్ = అపేక్షయు, లేదు, ఇది = ఈమేను, పోవుటే = నశించుటే, ఉరున్ = మేలగును.

ఆ. హీనజన్మ మఱుట ♦ యెవ్వఁడే నొకప్రాణి
సంతసిలుట ముక్తి ♦ పొంతఁ గనుట
మేలెకాదె శిబియ ♦ మేల్బంతిగాఁడె న
శ్వరపుదేహ మమ్మి ♦ పరము గొనుట. 29

టీ. హీనజన్మము = చండాలజన్మము, అఱుట = పోవుటయును, ఎవ్వఁడేని = ఎవ్వఁడైనను, ఒకప్రాణి = ఒకపురుషుఁడు, (వీనిశబ్దమున కికారలోపము), సంతసిలుంట = సంతోషించుటయు, ముక్తిపొంత = మోక్షసమీపమును, కనుట = పొందుటయు, మేలె గాదె = మంచిదేకదా, న...ము-నశ్వరపు = శాశ్వతముగాని, దేహము = తన శరీరమును, అమ్మి = వెలపుచ్చి, పరముగొనుట = మోక్షము గ్రహించుటయందు, శిబియ = శిబిచక్రవర్తియే, మేల్బంతిగాఁడె = మార్గప్రదర్శకుఁడుగాఁడా, (అగు ననుట).

చ. తెవు లయినం, గ్రహం బయినఁ, ♦ దే లయినం, గర మైన, నాత్మ పెం
దెవు లయిన, న్జలం బయినఁ, ♦ దెక్కలియైన, మృగాగ్ను లైన, మే
ల్తవు లయిన, న్రణం బయినఁ♦ద్రాఁ చయిన, న్పిడుఁ గైనఁ, దీర్చు పే
లవ తను వూర కే చెడ కిల న్గృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే.

టీ. తెవులయినన్ = వ్యాధియేనియు, గ్రహంబయినన్ = పిశాచమేనియు, తేలయినన్ = వృశ్చికమేనియు, గరమయినన్ = విషమేనియు, ఆత్మ పెందెవులయి నన్ = పెద్దమనోవ్యాధియేనియు, జలంబయినన్ = ఉదకమేనియు, తెక్కలియైనన్ = చోరుఁడేనియు, మృగాగ్నులైనన్ = మృగములేనియు నగ్నియేనియు మేల్తవులయినన్ = స్త్రీధనవ్యాసంగమైనను, రణంబయినన్ = పుంఁడేనియు, (రణంబు = యుద్ధము) త్రాఁచయినన్ = సర్పమేనియు, పిడుఁగైనన్ = అశనియేనియు, ఊరకే = వ్యర్థముగానే, చెడక = చెడిపోక,

* దీర్చు పేలవు తనువూరకే-పాఠాంతరము.

ఇలక్ = భూమియందు, కృశుక్ = ఆఁకలిచే గృశించిన, ఒక్కనిక్ = ఒక పురుషుని, ప్రోచుట = పోషించుట, ఒప్పదే = తగదా, (ఒప్పు ననుట.)

తా. రోగాదులచేత నీ తనువు నశింపకుండ నాఁకలిగొన్న యొక్కనికిఁ దృప్తిగా నిచ్చుట మంచిదికదా యని యాతఁడనెను.

వ. అది యట్లుండె నింకొక్క హితంబు సెప్పెద, ననియును బ్రాణభయంబున నాడు కార్యవశంపు మాటగాఁ దెలియక యాథార్థ్యస్థంబ కాఁ దెలిసి వినుము. వినకున్న భూతహితంబుఁ గోరి యుచ్చరించు మాట కీశ్వరుండైన మెచ్చుఁగదా ? వ్యాఘ్ర సింహ వరాహ వృక జంబుకాది శరారువులయం దొక్క తిర్యక్కవు గావు; దేవయోనివి, నీకును మాకుంబలెఁ గర చరణ ముఖాపఘనంబులు గలవు; మాటలను మాయట్ల అక్ర్తవ్యక ర్తవ్యతావిచారంబులు సమానంబ, మఱచి యంటి; స్థావరంబులకంటెఁ గీటాదులకు, వానికంటె మఱి మృగాదులకు, వానికంటె మఱి పశు పతంగాదులకు, వానికంటెను మాకును, మాకంటెను మీకును, గరచరణ కళేబరాది పాటవం బెక్కుడు, విజ్ఞానంబును ఘనం, బిట్టి నీ కేకాంత కుత్సావహంబగు బీభత్స *పథ్యాపథ్య భక్ష్యాభక్ష్య పేయాపేయవివేకంబులు లేకునికి యుక్తమే, రుచిగాదు శుచిగా దీదురాహారం బిదియు సకల దురితావతంస యగు హింస నొనరుడునది, హింస పరలోకంబునం గదా బాధకంబు, పరలోకంబు ప్రాణాంతంబునంగదా చిరస్థిరప్రాణుల మగు మా కేల హింసాభయం బన వలదు; ప్రాణభయంబు మనుష్యుల మగుమాకు నేఁడైన, మీకు మఱునాఁడైన నవలి నాఁడైనఁ దుద యుగాంతంబునందైన నిడుపు గుఱుచల నెప్పుడుఁదప్పదు. అంత వ త్త్వంబునకుఁ దారతమ్యం బేమి? మున్నీటనైనను మునుంగుట సరి యగుటఁ బర్వతంబునకుం బరమాణువునకు నేమి యంతరంబు, మీఁదు విచారింప వలవదే, తపోలబ్ధవరాదులం బూర్వంబునం గీర్వాణుల గర్వం బడంచి హెచ్చిన హిరణ్యకశిపు దశముఖాదులు శతసహస్ర సంఖ్యాక సంవత్సరంబులు జీవించియుం బంచత్వంబుఁ బొంది తారు మున్ను జయించిన జముచేతనే చిక్కరే ? యిక్క

* వధ్యావధ్య.

డికి మీారు ప్రబలులరైన నక్కడికి వాఁడు ప్రబలుండు, సకలభూత తారతమ్యంబును నిజ నిజస్థానవిశేషంబునన వచ్చు, నచ్చండాంశు సుతుని వీట మేర దప్పిన మాకుం దప్పనియట్ల బాధ మీాకుం దప్పదు, మీారు నాసౌరిముఖ బర్హిర్ముఖులు జాతిఁ దలపోయ భ్రాతలట్లయ్యుం బరంబున మీారు వారు బాధ్యబాధకతల నొందు చున్నారీతై జసం బగు తారతమ్యంబునకుం దమస్సత్త్వంబులు హేతువులు, వాని కాహ్వృతులు హేతువులు వ్యాహృతులం గ్రతువుల చరుపురోడాశావాహుతులభుక్తులం బవిత్రులై యమర్త్యతమీాకంటె నతిదీర్ఘ కాలంబు వారు జీవించెద రప్పావనతఁ జూచికదా సదా చతుర్ముఖాంశజుం డగుసుధాంశుండు గరంగి సకలరసముల కవధి యగు సుధా రసంబున నాప్యాయనం బొనరించుచున్న వాఁ డేతదర్థంబు మా కుచ్చరింపరాదుగాని [1]వేదంబు ప్రథమకళ యనలుండు త్రావు నని చెప్పు, మఱియు నాయాకళ లాయావేల్పులకుం గ్రమంబునం జెప్పు, నింత విచారించి రుచించినట్ల నడుపు మనినఁ గహకహ నవ్వి యద్దోహారికి సుర ద్రోహి యిట్లనియె. 31

టీ. అదియట్లుండెక్ = ఆనీతియారీతినుండెను, ఇంకొక్కహితంబుసెప్పెదక్ = మఱియొకహితము వచించెదను, అదియును = ఆమాటయును, ప్రాణభయంబునక్ = ప్రాణభీతిచేత, ఆ...గాక్-ఆడు = వచించెదు, కార్యవశంపు = పనిగడపుకొనుటకైన, మాట కాక్ = పలుకుగా, తెలియక = తలంచక, మాధ్యస్థంబ కాఁ దెలిసి = మధ్యస్థపు మాటగానె తెలిసి, వినుము = ఆలకింపుము, వినకున్నక్ = నీవువినకుండినను, భూత హితంబుఁగోరి = లోకోపకార మపేక్షించి, ఉచ్చరించు మాటకుక్ = వచించెడు పలు కునకు, ఈశ్వరుండైనక్ = పరమాత్ముఁడైనను, మెచ్చక్ కదా = హర్షించునుగదా, వ్యాఘ్రసింహవరాహవృకజంబుకాది=పులి సింగము పంది తోఁడేలు నక్కమొదలగు, శరారువులయందుక్ = ఘాతుకజంతువులయందు, ఒక్కతిర్యక్కవుకావు=ఒకతిర్యగ్జం తువవుగావు, దేవయోనివి = దేవతలలో నొక భేదమైనవాఁడవు, 'విద్యాధరోప్సరో యక్ష రక్షోగంధర్వకిన్నరాః, పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోమీ దేవయోనయః' అని యమరము. అనఁగా, రక్షఃపిశాచములును దేవయోనులే యనుట. నీకును మాకుంబలెక్ = నీకును మాకువలెనే, క...లు-కరచరణముఖ = కాలుసేతులు మొదలగు, అఘనంబులు =అవయవములు 'అంగప్రతీకోవయవో౽పఘనో౽థ కళేబరే' అని యమరము.

* వేదంబు ప్రథమకళ యనల మని చెప్పు.

కలవు=ఉన్నవి, మాటలునుమాయట్ల = సంభాషణములునుమావలెనే, అ...లు-అకర్తవ్య కర్తవ్యతా=చేయరాని చేయవచ్చిన పనులగుటయొక్క, విచారంబులు=ఆలోచనములు, సమానంబ=సమమే, హా = అహాహా, మఱచియంటి = మఱచిపోయి యిట్లు పలికితిని, స్థావరంబులకంటెన్ = వృక్షాదిస్థావరంబులకంటెను, కీటాదులకున్ = పురుగులు మొదలగువానికిని, వానికంటెన్ = ఆకీటకాదులకంటె, మఱి = అధికముగా, మృగాదులకున్ = మృగములు మొదలగువానికిని, వానికంటెన్ = ఆమృగాదులకంటె, మఱి, పశుపతంగాదులకున్=పశుపక్ష్యాదులకును, వానికంటెను = ఆపశ్వాదులకంటెను; మాకును, మాకంటె మీకును, కరచరణకళేబరాదిపాటవంబు=ఇంద్రియశరీరాది పటుత్వము, ఎక్కుడు = అధికము, విజ్ఞానంబును = విన్నాణంబును, ఘనంబు=అధికము, ఇట్టి నీకు, ఏ...బు-ఏకాంత=ముఖ్యముగ, కుత్సా=నిందకు, ఆవహంబగు=సంపాదకమైన, 'కుత్సా నిందా చ గర్హణే' అని యమరము. బీ...లు-బీభత్స=రోఁతయైన, పథ్యాపథ్య=హితాహితములయొక్కయు, (వధ్యావధ్య యనుపాఠమునఁ జంపఁదగిన చంపఁదగని యని యర్థము), భక్ష్యాభక్ష్య=తినఁదగినవియు, తినరానివియును అయినట్టివానియొక్కయు, పేయాపేయ = త్రాగఁదగిన త్రాఁగరానివానియొక్కయు, వివేకంబులు = జ్ఞానములు, లేకునికి=లేకుండుట, యుక్తమే=తగునా, (తగ దనుట) ఈదురాహారంబు = ఈ దుర్భోజనము, రుచిగాదు=చవిగాదు, శుచిగాదు=పవిత్రముగాదు, ఇదియు = ఈదురాహారమును, సకలదురితావతంసయగు=సమస్తపాపశేఖరమైన, హింసన్ = హింసించుట చేత, ఒనగూడునది=సంభవించునట్టిది, హింస=అట్టుహింసించుట, పరలోకంబునఁగదా= లోకాంతరంబునంగదా, బాధకంబు = బాధకము, పరలోకము = అట్టి లోకాంతరము, ప్రాణాంతంబునంగదా, = ప్రాణావసానమైనప్పుడుగదా, చిర = బహుకాలము, స్థిర= తిరముగానుండునట్టి, ప్రాణులమగు = ప్రాణములుగలమాకు, ఏలహింసాభయంబనవలదు =హింసలవలనవచ్చెడువెఱపేలయనఁగూడదు, ప్రాణభయంబు=ప్రాణభీతి, మనుష్యులమగు మాకు, నేఁడైనన్ = నేఁడుగలిగిన, మీకు, మఱునాఁడైనన్, అవలినాఁడైనన్ = ఆమఱునాఁడైనను, తుదన్ = చివరను, యుగాంతంబునందైనన్ = యుగప్రళయ మప్పుడేనియును, నిడుపుగుఱుచలన్ = దీర్ఘహ్రస్వకాలముగా, ఎప్పుడుఁదప్పదు, అంతవత్త్వంబునకున్ = చావుగలుగుటకు, తారతమ్యంబేమి=కాలముయొక్క హెచ్చు తగ్గులేమి, మున్నీటనైనన్ = సముద్రమందైనను, ('మువ్వన్నె ముప్పా)ద్దు మున్నీరు ముక్కాఁక ముచ్చిచ్చనఁగఁ గబ్బములను మఱియు, నిరువంక యిరుచెస యిరుగెడ యిరువాఁగు ద్విగువేకవచనాంత మగుచుఁ దనరు.' అనుటచే నేకవచనాంత ద్విగు సమాసము.) మునుంగుటపరియగుటన్=మునిఁగిపోవుట సమానముగావున, పర్వతంబునకున్ = కొండకును, పరమాణువునకున్ = దృగ్గోచరముకాని నలుసునకు, ఏమి ఘంతరంబు=ఏమిభేదము, ('కో మజ్జతోరణుకులాచలయోర్విశేషః'. అన్నట్లు సముద్ర

మందుఁ బర్వతమేనియుఁ బరమాణువేనియుం మునుఁగునని యట) మీఁదు = ముందఱకలుగు నది, విచారింపవలవదే = ఆలోచింపవలదా, తపః=తపములచేత, లబ్ధ=పొందఁబడిన, వరాదులన్=వరములు మొదలగువానిచేత, పూర్వంబునన్=తొల్లిటికాలమందు, గీ... బు-గీర్వాణుల=దేవతలయొక్క, గర్వంబు=పొగరు, అడంచి, హెచ్చిన=అతిశయించిన, హి...లు-హిరణ్యాకశిపు, దశముఖ=రావణాసురుఁడు, ఆదులు = మొదలగువారు, శ... లు-శతసహస్రసంఖ్యాక=నూఱువేలులెక్కగల, వత్సరంబులు=ఏండ్లు, జీవించియున్ = బ్రదికియుండియును, పంచత్వంబుఁబొంది = మృతినొంది, తారు మున్ను జయించిన= తాము పూర్వముజయించినట్టి, జముచేతనే చిక్కరే=యమునిచేతనే పట్టుపడరా, ('ఈజ ముఁ డనునది సంస్కృతభవ ప్రాకృత తత్సమము. 'జడా మోముఖసమాదయః ప్రాకృత తత్సమా' యనియును; సీ. 'జడయను జముఁడను శబ్దము సంస్కృత ప్రాకృత సమమై ప్రశస్తిఁగాంచు'నన్నట్లనుట.) ఇక్కడకున్=ఈలోకమునకు, మీరు, ప్రబలుల రైనన్=బలవంతులరైనను, అక్కడికిన్=ఆలోకమునకు, వాఁడు=ఆయముఁడు, ప్రబలుఁడు=బలవంతుఁడు, స...లను-సకలభూత=సమస్తభూతములయొక్క, తారతమ్యంబును =ఎక్కువదక్కువలును, ని...న-నిజనిజ = తమతమ, స్థానవిశేషంబునన = స్థానబలము చేతనే, వచ్చున్ = వచ్చును, అ...టన్-అచ్చండాంశుసుతుని=ఆయుష్ణకరుని కుమారుఁ డగు యమునియొక్క, వీటన్=పట్టణమందు, మేర దప్పినన్ = దురాచారముఁజేసిన, మాకుం దప్పనియట్ల = మనుష్యులమగుమాకును దప్పనట్లుగానే, బాధ=నరకయాతన, మీకున్ తప్పదు = మీకునుదప్పదు, (పాపఫల మందఱకు నొక్కటే యనుట), మీరున్= రాక్షసులైనమీరును, ఆసౌరిముఖబర్హిర్ముఖులు = ఆయముఁడు మొదలగు దేవతలు, జాతిఁదలపోయన్=జాతిని విచారింపఁగా, భ్రాతలు=అన్నదమ్ములు, అట్లయ్యున్, పరంబునన్=పరలోకమునందు, మీరువారును, బాధ్యబాధకతలన్ = బాధ్యబాధకభావము లను, ఒందుచున్నారు, (మీరు బాధింపఁబడువారును వారు బాధించెడువారు ననుట), ఈతైజసంబగు=ఈతేజస్సంబంధియగు, తారతమ్యంబునకున్ = హెచ్చుతగ్గులకు, తమ స్సత్త్వంబులు=తమ స్సత్త్వగుణములు, హేతువులు=వరుసగాఁ గారణములు, వానికిన్= అట్టి తమస్సత్త్వగుణంబులకు, ఆహృతులు=ఆహారములు, హేతువులు = కారణములు, వ్యాహృతులన్ = భూర్భువరాదిమంత్రములచేత, క్రతువులన్ = యజ్ఞములయందు, చ...లన్ - చరు = అన్నముయొక్క, పురోడాశ = హవిస్సుయొక్క, ఆహుతు ల=హవనములయొక్క, భుక్తులన్=భుజించుటచేత, పవిత్రులై = పావనులై, అమర్త్యతన్=చావులేకుండుటచేత, మీకంటెన్, అతిదీర్ఘకాలంబు = మిక్కిలి నిడుపైన కాలము, వారు=ఆదేవతలు, జీవించెదరు=బ్రదికెదరు, అప్పావనత = ఆపవిత్రత్వ

మును, చూచికదా=ఈక్షించియేకదా, సదా=నిరంతరమును, చతుర్ముఖాంశజుండగు =బ్రహ్మాంశసంభూతుండైన, సుధాంశుఁడు = అమృతకరుండగు చంద్రుఁడు, కరఁగి = తాను గరఁగి, సకలరసములకున్ = సకల మాధుర్యములకు, అవధియగు = పరమావధి యగు, సుధారసంబునన్ = తన యమృతరసముచేత, ఆప్యాయనంబు = తృప్తిని, ఒన రించుచున్నవాఁడు = చేయుచున్నవాఁడు, ఏతదర్థంబు=ఈయర్థము, మాకుచ్చరింపరాదు గాని=మాకుఁ జెప్పఁగూడదుగాని, వేదంబు = శ్రుతి, ప్రథమకళ = చంద్రుని ప్రథమ కళను, అనలుండును = అగ్ని, త్రావునని = పానము సేయునని, చెప్పున్ = ప్రతిపాదిం చును, మఱియున్ = ఇంకను, ఆయాకళలు, ఆయావేల్పులకున్ = ఆయాదేవతలకు, క్రమంబునన్=వరుసగా, చెప్పున్, ఇంత = నేఁజెప్పిన యీయావదర్థమును, విచారించి= ఆలోచించి, రుచించినట్లు=నీకింపగునట్లె, నుడువు మనినన్=వర్తిల్లు మనఁగా, కహ కహ, (ఇదియనుకరణశబ్దము) నవ్వి=హసించి, అద్దోహారికిన్=ఆ మాలదాసరికి, సురద్రోహి= బ్రహ్మరాక్షసుఁడు, ఇట్లనియె.

క. చంపకు చదువుల మేము ప
ఠింపనిశాస్త్రములె? మాపఠింపని శ్రుతులే?
యింప వవి నమ్మవేఁ 'బ్రథ
మాం పిబతే వహ్ని' యనెడు నీ మాటవుఁ గాదే. 32

టీ. చదువులన్=చదువులచేత, చంపకుము=బాధింపకుము, మేము, పఠింపని= చదువని, ('భవతిక్రియాపదానాం త్రివిధానామించుగాగమ' అను సూత్రముచేతఁ బఠించుచు నని రాఁగా, 'వ్యతిరేకాదౌ భావినిచాత్స్యాత్' త్తను సూత్రముచేత నా చువర్ణకమునకత్వమువచ్చియా చవర్ణమునకు 'వ్యతిరేకాదికేచచోఽపస్స్యాత్' త్తను సూత్రముచేతఁ బత్వమువ దానిపైఁ 'బ్రతిషేధవాచినాం ని' యను సూత్రముచేత నివర్ణకమునువచ్చెను.) శాస్త్రములె = చదువులా, (అన్నియు మేము చదివితి మనుట) మా...లే-మా = మా యొక్క, పఠింపని శ్రుతులే = చదువని వేదములా (ప్రథమార్థమందు షష్ఠి. 'సీ. తెల్లంబు గాఁగ మీకెల్ల సుయోధను చేసినకుటిల విచేష్టితములు', అని యుద్యోగపర్వము.) అవి=ఆవేదశాస్త్రములు, ఇంపవు=మాకు రుచింపవు, (ఇంచు అనుటకు మధుర మగు అని-యర్థము. దీనికి ఆ. 'జిహ్వ మరలఁ బడఁగ జిలుకల కగ్నిశ, పించె సురలు చెవుల కించునట్టి, పలుకు వాని- కొసఁగిరి' అని యానుశాసనికపర్వప్రయోగము. కొందఱీ - యించువిల్కాఁడని తియ్యవిల్తునకుఁ జెప్పుదురు; దీనికి వ్యతిరేకార్థమందు నా: పత్వము వచ్చెను.) నమ్మవేన్ = నమ్మవేని, ప్రథమాంపిబతేవహ్నిః - ప్రథమాం పిబతే వహ్నిః ద్వితీయాం పిబతే రవి రిత్యాదివచనము, ('లోపః నమ- అదికే విసర్గస్య'

అనుస్వారముచేత విసర్గలోపము.) అనెడు=అనునట్టి, (ఇది 'అనుకృతేఽస్తివాక్యంతు' అను సూత్రానుసరణముగా ననుకరణము.) మాటవుక్, కాదె=అటుగాదా.

మ. నిలు మోహో మము వారి భ్రాంత లనుచుఁ బీవంటివారల్సుధా
శులపూతాశులు గారటంటి ప్రతిపత్సోమాంశముక్రోలు ముక్
జ్వలనుండం టిఁక నొండు నిన్నడిగెదన్ సర్వాశిగాఁడా? యతం
డిలఁ దన్న్యాయము చాలు మాకు నఘ మే? వృద్ధానుచారంబిఁకన్.

టీ. నిలుము=నిలువుము, ('కం. నిలువుము పిలువుము కొలువుము, గెలువుము విడువు మనఁగాఁ దగినబహుళబ్దం, బులకుం దృతీయ వర్ణము, దొలఁగిన దోషం బులేదు తుహినాంశుధరా.' అని యడిదము సూరయ కవిసంశయవిచ్ఛేదంబునం జెప్పి వీనికి నుదాహరణంబులఁ జెప్పినాఁడు.) ఓహో = పరిహాసార్థకము, మముక్ = మమ్మును, వారిభ్రాంత లనుచుక్=ఆదేవతల తోఁబుట్టువు లనుచును, నీవంటి = నీవుచెప్పితివి, వారల్=ఆదేవతలు, సుధాశులు = అమృతాశనులు, అపూతాశులుకారు=అపవిత్రాహారులుగారు, అటంటి = అలాగంటివి, ప్ర...ముక్ - ప్రతిపత్=పాడ్యమి నాఁటి, సోమాంశముక్ = చంద్రకళను, జ్వలనుండు = అగ్ని, ముక్ = మున్నుగాను, క్రోలు నంటి=పానముఁజేయునంటివి, ఇఁకన్=ఇంకను, (నిత్యమసుత్తమపురుష క్రియాస్వితి' యనుసూత్రముచేత నిత్యసంధి,) ఒండు=ఒకసంగతి, నిన్నడిగెదన్, అతండు ఆ యగ్ని హోత్రుఁడు, సర్వాశిగాఁడా = అన్నిటితిండికాఁడుగాఁడా, ఇలన్ = భూమియందు, తన్న్యాయమే = ఆన్యాయమే, మాకున్, చాలు=ఆచారము (పర్యాప్త మనియును జెప్పవచ్చును) ఇఁకన్=ఇంకను, వృద్ధానుచారంబు=పెద్దలవలె యహులదూలఁగ నడుచుట, అఘమే=పాపమా, (కాదనుట).

తే. హరికి సఖుఁడును రథమును నగుగరుడుఁడు
దొరకినమృతంబు సురలకు మరల నిచ్చి
యహులు గూడుగ వరమున నడిగి కొనఁడె ?
యమృత మైనను జవుల జాత్యన్నసమమె ? 34

టీ. హరికిన్ = విష్ణునకు, సఖుఁడును=చెలికాఁడును రథమును = వాహనమును, 'నాగాంతకో విష్ణురథః' అని యమరము. అగు = అయినట్టి, గరుడుఁడు = గరుత్మానుఁడు, దొ...బు-దొరకిన = తనకులబ్ధమైన, అమృతంబు = సుధను, సురలకున్ = దేవతలకు, మరలనిచ్చి=క్రమ్మఱనొసంగి, అహులు=సర్పములు, కూడుగన్=తనకాహారముగా, వరమునన్ = వరముచేత, అడిగి = యాచించి, కొనఁడె = గ్రహింపఁడా, అమృతమైనను = సుధ యేనియు, చవులన్=రుచులచేత, జా...మె=జాత్యన్న=దమ తమ జాత్యుచితాహారమునకు, సమమె=సరియగునా. (కాదనుట.)

చ. నిదురయుఁ గూడుఁ బోఁ జదివి నే నిటఁ గన్నదియేమి యెవ్వఁ డీ
చదువుల యర్థవాదపుమృషల్ విని బేల్పడుఁ నీవు మాయెడం
జదువుల మాటలాడి కనఁజాల వొకానొక మెచ్చు నొక్కఁ డీ
చదివినకూర వింతచవి చాలఁగఁ దెమ్మను మెచ్చు దక్కఁగన్. 35

టీ. నిదురయున్=నిద్రయును, కూడున్ = అన్నమును, పోన్ = పోవునట్లు, చదివి=పఠించి, నేను, ఇటన్=ఇచ్చటను, కన్నది = పొందినది, ఏమి = ఏమి గలదు? ఎవ్వఁడు=ఏపురుషుఁడు, ఈ...ల్ - ఈచదువుల = ఈశాస్త్రములయొక్క, అర్థవాదపు=అర్థవాదసంబంధులగు, మృషల్ = కల్లమాటలు, విని=ఆకర్ణించి, బేల్పడున్ = బేలుపోవును, (ఎవ్వఁడును బేలోవఁ డనుట), ఈవు = నీవు, మాయెడన్ = మాపట్లను, చదువులమాటలాడి = శాస్త్రార్థప్రసంగముచేసి, ఒక్కఁడు = ఒక్కటి, ఈ...ర - ఈ చదివిన = పఠించిన, (చదిపినయన్నపాఠమున నెనిచిన యనియర్థము) కూర=శాకము, వింతచవి = క్రొత్తరుచిగలది, చాలఁగఁదెమ్ము = చాలునంతతే, అను = ఇట్లనియెడు, మెచ్చు=శ్లాఘ, దక్కఁగన్=వినా, ఒకానొకమెచ్చున్ = ఒకానొక్కఁడైనశ్లాఘను, కనఁజాలవు = పొందఁజాలవు.

తా. ఈశాస్త్రప్రసంగముల వలన నేమి ప్రయోజనము లేదు. దీనికి బేలుపోవువాఁ డెవ్వఁడును లేఁడు. ఈ చదివినకూర క్రొత్త రుచి గలది; యా కూరనే మఱియు నింత పెట్టుమందును. నీ కీ చదువులచేత నావలన నంతకంటె నే మేలును గలుగదు. నీ వెన్ని చదివినను నిన్ను వధింపక విడువను-

వ. అని గీష్పతి మతం బవలంబించి నిజాలాపహేళనపరుండైన రక్కసు కుతర్కోక్తులకుం గృష్ణస్మరణంబు సేసి, యిందులఁబొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో, మీఁదఁ గార్యంబు గల మాకు దీనిఁ గాదనం బని లే-దని యందంబుఁ గూడుకొని ఛందోనువర్తనపరుండై నీచపంస్కృతికి రోసి, తన్ముఖోల్లాసంబునకు శబ్దచ్ఛలంబున నంతర్గతంబున సుగతు నిడుకొని నీవు సర్వజ్ఞుండ వేను నరుఁడ, హీనకులుండ, ననభ్యస్తశాస్త్రిుండ. నీ కుత్తరంబీ శక్తుండ నే, మద్వచనస్ఖాలిత్యంబులు సహించి దయచేసి నమ్మి మఱ్ఱాప్ర్థనంబు గావింపుము.

టీ. అని ఇట్లని, గీ...బు-గీష్పతి=బృహస్పతియొక్క, మతంబు = మతమును అవలంబించి, ని...డు - నిజ=స్వకీయములగు, ఆలాప = పల్కులయొక్క, హేళన = పరిహాసించుటయందు, పరుండు ఐన = ఆసక్తుఁడైన, ర...కున్ - రక్కసు = రాక్షసుని

యొక్క, కళోర్కు = కళంకలయొక్క, ఉక్తులకున్ = మాటలకు, కృష్ణస్మరణంబుసేసి కృష్ణకృష్ణ యనుకొని, ఇదములకున్ = ఈ నీతర్కములకు, పాం...న్ - పొందుపడు = సమాధానకరములగు, ప్రత్యుత్తరంబులన్ = బదులుమాటలచేత, వీనిఁ గెలఁకినన్ = వీనిఁ గెరలించినను, బుద్ధిక్షోభంబుగాన్ = మనశ్శ్లేశమగునట్లు, ఇంతకంటెన్ = చిన్న దానికంటెను ఏమియబద్ధంబులు = ఏమిమినరానివి, వినఁబడునో, మీఁదన్ = తరువాత ను, కార్యంబుగలమాకున్ = భగవత్సేవయనుపనిగలిగినమాకు, దీనిన్ = వీఁడుసెప్పిన యీమాటను, కాదనం బనిలేదని = కాదనుట కక్కఱ లేదని, అందంబుఁగూడుకొని = ఉల్లాసముఁదెచ్చుకొని, ఛందోవర్తనపరుండై - ఛందః = వానియిష్టముయొక్క, అను వర్తన=అనుసరించివర్తించుటయందు, పరుండై=ఆసక్తుఁడై, నీచసంస్మృతికిన్=హీనస్మరణ మునకు, రోసి=ఏవగించి, తన్ముఖోల్లాసంబునన్ = వానిముఖప్రీతికొఱకు, శబ్దచ్ఛలంబు నన్=శబ్దవ్యాజముచేత, అంతర్గతంబునన్ = మనస్సునందు, సుగతునిడుకొని = బుద్ధ దేవునునిచికొని, నీవుసర్వజ్ఞుఁడవు = నీవన్నియు నెఱింగినవాఁడవు' 'సర్వజ్ఞశబ్దమున కర్థాంతరము బుద్ధుఁ డనుట. ఏను = నేను, నరుండ = మనుష్యుఁడను, హీనకులుండన్= నీచజాతివాడను, అ...డన్-అనభ్యస్త=అభ్యసింపఁబడని, శాస్త్రుండన్=శాస్త్రములు గల వాఁడను నీ కుత్తరంబీ శక్తుండనే=నీకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకు సమర్థుఁడనా? (కానుట). మత్=నాయొక్క, వచః = పలుకులయందలి, స్ఖాలిత్యంబులు = తప్పులను, సహించి = సైరించి, దయచేసి=కృపయునిచి, నమ్మి=విశ్వసించి, మత్ప్రార్థనంబు = నా వేఁడుకోలును, కావింపుము. చేయుఁము.

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మునుపాపై నొక్క నీకా యశో
భిఖ్యన్నేనును జేర్తు మేనొయొసఁగఁ దప్పింపన్వ్రతం బొక్కఁడే
ముఖ్యంబై యొనరింను దాని సఫలం బ్జేయఁగా లేపుగా
'సఖ్యం సాప్తపదీన'మన్మన మిథస్స్నాజ్ఞత్య మూహించుచున్. 37

టీ. మునుపు = మొదలనే, దైత్యులందున్ = రక్కసులయందు, ప్రఖ్యాతుం డవు=ప్రసిద్ధుఁడవు, ఆపైన్=అందుమీఁద, ఒక్కఁడైన, యశోభిఖ్యన్ = కీర్తికాంతిని, 'అభిఖ్యానామశోభయోః' అని యమరము. నేనును, చేర్తున్=సంపాదింతును, మే యొసఁగన్=నాశరీరము నీ కిచ్చుటకు, తప్పింపన్ = తప్పింపఁజేయను, వ్రతంబొక్క డే=ఒక్కవ్రతమే, ముఖ్యమై = ముఖ్యముగాఁగలిగి, ('అప్సరోనికురుంబమాటలు పాటలు, సై వినోదింపంగ నమరగణము' అనియును; 'ద్వాదశదినము లాతఁడు గారవిం పంగ వర్తించి పండ్రెండువత్సరముల, ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి యరుక్కని యుదయంబు నస్తమయము, నగుచోట్ల పొలిమేర లైన' అను నీ మొదలగు కాంతి

సర్వప్రయోగములును ; కం. 'కాచికొని వచ్చి తగవా, నేచిన యట్లచట నచట నిలిపితి మునినా, థా చేటును భంగంబును, నైచిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్.' అని మాసలపర్వప్రయోగంబును గలిమిం జేసి అగుధాతువునకు కలిమి అర్థముగా జెప్ప వలయును.) ఒనరింతున్ = చేయుదును, దానిన్=ఆవ్రతమును, సఖ్యంసాప్తపదీనమను= సఖ్యంసాప్తపదీనంస్యాత్తనువాక్యప్రకారమగు, (ఏడడుగులుతోడ నడిచిన స్నేహము గలుగు ననుట) మ...ము-మన = మనయొక్క, మిగస్సాంగత్యము=ఒండొరులచెలిమిని, ఊహించుచున్ = తలంచుచును, సఫలంబున్ = ఫలముతోఁగూడినదానిఁగా, చేయఁ గాలేవుగా=చేయలేవా. అనిప్రార్థన.

తా. మన మిరువురము చెలికాండ్ర మగుటవలన నావ్రతమును సఫలము చేయుమని వానిని గోరుకొనెను.

వ. అని యొద్దియుం జేసి. 38

క. ఈకుఱంగటి యీకురుగుడి
వైకుంఠునిఁ బాడి వత్తు ; వ్రతముగఁ దత్సే
వాకృతి కడపట నశనము
నీకౌదు ముఖ్య మిదియ ; నేఁ డగుతుదకున్. 39

టీ. ఈ...నిన్ - ఈ కుఱంగటి = ఈసమీపమందలి, ఈకురుగుడి = ఈతిరుక్కురుంగుడియొక్క, వైకుంఠునిన్ = వెన్నుని, వ్రతముగన్=నియమముగా, పాడివత్తున్= గానముచేసివచ్చుచుందును, త...తిన్ - తత్సేవా = ఆకొలువనియెడు, కృతి=కార్యము యొక్క, కడపటన్ = అంతమునందు, అశనము నీ కౌదున్ = నీ కాహారమగుదును, నేఁడగుతుదన్ = నేఁటితుదకు, ఇదియ = ఇట్లగుటయే, ముఖ్యము=శ్రేష్ఠము, వ్రతముగ, కడపటనగునశనము, నీకౌదునని పాఠాంతరముగల దట్లేని, తత్సేవే = ఆభగవంతునికొలువే, కడపటన్=అంత్యమందు, అగున్=అగును.

ఉ. అంచు నతండు పల్క దరహాసతఁ జెక్కిలి గొట్టి లెస్స పం
డించితి వోయి దాసరిఁ పనిం దెరువాటులు గొట్టికొట్టి మే
న్వొంచి విరక్తి దాసరివి ; నిన్నఁగదా యయినాఁడ వీపమున్
గొంచెముఁ జేసి త్రాడ్గొటికిఁ గోఁ దల పోసెదు మెచ్చితి న్నినున్.

టీ. అంచున్=ఇట్లనుచు, అతండు = ఆదాసుఁడు, పల్కన్=చెప్పఁగా, దరహాసతన్=చిఱునగవుగలుగుటచేతను, చెక్కిలిగొట్టి = చెంపఁగొట్టి (చిఱునగవునఁ జెంపమీఁద మెల్లనఁగొట్టె ననుట) ఓయిదాసరి, లెస్సపండించితివి=చక్కఁగాఁబొంకముఁజేసితివి, పనిన్ = అదనియందు, తెరువాటులుగొట్టికొట్టి = త్రోవదొంగతనములుచేసి చేసి, మేన్వొంచి=

శరీరముఁబెంచుకొని, విరక్తిన్ = వైరాగ్యముచేత, నిన్నఁగదా = నిన్నటిదినమున నేకదా, దాసరివయినాఁడవు, ఈమముల్ =ఇట్టి మమ్మును, కొంచెముఁజేసి = తగ్గవఱచి, త్రాడ్గొలికి గోన్ =ఉచ్చుగొలుకుకొనుటకు, (తప్పించుకొనిపోవుటకనుట, త్రాడనుపదంబున డువర్ణము మీఁది యుత్వమునకు లోపము వచ్చినది) తలపోసెదు=ఆలోచించెదవు, నిసున్ =నిన్ను, మెచ్చితిన్ = మెచ్చుకొంటిని, (ఇట్లు పరిహాసించె ననుట).

శా. ఏ రాజ్యంబు నరుండు నోరి కడివో ♦ నీబోధ మాలించు నిం
కే రాజ్యంబు నరుండు బాసకయి మే ♦ నీఁ దాన యేతెంచుఁ దీ
పార న్నేఁ జననీమియు న్మగిడి నీ ♦ వా రామియుం దెల్ల మే
లా రంతు ల్పలుపల్కు లంత్యకుల! యేలా చింత లేలా వగల్. 41

టీ. ఏ...డు-ఏరాజ్యంబు = ఏదేశమందలి, నరుండు = ప్రాణి, నోరికడివోన్ = నోటికందిన కబళముపోవునట్లు, ఈబోధము = ఈయుపదేశమును, ఆలించున్ = వినును. (ఎవ్వఁడు వినఁ డనుట) ఇంకన్ = మఱియును, ఏరాజ్యంబునరుండు=ఏసీమపురుషుఁడు, బాసకయి=ప్రయాణమునకై, మేను = శరీరమును, ఈన్ = ఇచ్చుటకు, తాన=తనకుఁ దానే, ఏతెంచున్=వచ్చును, (ప్రమాణముఁ జేసితినే యని యెవ్వఁడును రాఁ డనుట) తీపారన్ = రుచిమీఱఁగా, (ప్రీతిచేత ననుట) నేన్=నేను, చననీమియున్=పోనియ్యకుండుటయును, మగిడి=తిరిగి, నీవు, ఆ రామియున్ = ఆరాకుండుటయును తెల్లము = స్పష్టము, అంత్యకుల = చండాలుఁడా, ఏలారంతుల్ = రచ్చలేమిటికి, పలుపల్కులు = పెక్కుమాటలు, ఏలాచింతలు = విచారములేల, ఏలావగల్ = దుఃఖములేల.

తా. ఏదేశమందైనను దన నోటి కందిన యాహారమును విడిచెడువాఁడును లేఁడు, బాసయిచ్చి వచ్చితి నని తనశరీర మెక్కని కాహారముగా నొసఁగినవాఁడును లేఁడు, కావున నిన్ను విడుచుటయు లేదు, నీవు మరల వచ్చుటయును లేదు. చండాలుఁడా! నీ మాట నమ్ముదునా, యింక నీ యఱపులతోడను విచారములతోడ నధిక ప్రసంగములతోడను దక్కులతోడను బ్రయోజనము లేదుసుమా!

తే. అనిన: జెవి మూసి నారాయణా యటంచు
నతఁడు నను నమ్మవే పిశితాశి యొక్క
శపథమున నమ్ము మని వాఁడు ♦ సమ్మతింప
వేనవే ల్సత్యములు వల్కి ♦ వినకయున్న. 42

టీ. అనినన్=ఇట్లనఁగా, చెవిన్ = కర్ణమును, మూసి = ఆచ్ఛాదించుకొని, నారాయణాయటంచున్, అతఁడు = ఆదాసుఁడు, పిశితాశి = ఓరాక్షసుఁడా, నను నమ్మవే = నన్ను నమ్మవా, ఒక్కశపథమునన్ = ఒకప్రమాణముచేత, నమ్ము మని = విశ్వ

సింపురుని, వాఁడు, సమ్మతింపక = ఒప్పికొనునట్లు, వేనవేల్ సత్యములు = వేవేలుసత్యములు, పల్కి=వచించి, వినకయున్నన్ =వాఁ డంగీకరింపకుండఁగా.

ఉ. ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు వసించు నిజ్జగం
బెవ్వనియందు డిందు మఱి యెవ్వనియం దిది యట్టి విష్ణుతో
నివ్వల నొక్కవేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన నిన్గదియ నేని యన న్విని బంధ మూడ్చినన్. 43

టీ. ఎవ్వనిచూడ్కిఁజేసి = ఏపురుషుని వీక్షణముచేత, జగంబు = జగత్తు (అంత్యహల్లోపమై జగం బని యర్థ్యి), జనియించున్=కల్గునో, ఎవ్వనియందున్ = ఏపురుషుని యందు, ఇజ్జగంబు = ఈజగము, వసించున్ = నిలుచునో, ఇది = ఈజగము, మఱి = పిమ్మటను, ఎవ్వనియందున్ = ఏపురుషునియందు, డిందున్ = లీనమగునో, అ... తోన్ - అట్టి=తాదృశుఁడైన, విష్ణుతోన్ = వాసుదేవునితో, ఇవ్వలన్ = ఈవలను, ఒక్కవేల్పున్ = మఱియొకదేవతను, గణియించిన = సరిగా లెక్కఁబెట్టిన, పాతకి నౌదున్=పాపముగలవాఁడనౌదును, (విష్ణునితో మఱియొక దైవము సమాన మని చెప్పుట కంటె నధిక మగు పాపము లే దనుట) నేఁడ=నేఁటిదినమే, నేన్=నేను, ఎవ్విధినైనన్= ఏచొప్పుననైనను, నిన్ కదియనేని = నిన్నుఁజేర రాకపోతినా, (ఇది పూర్వముతో నన్వయము) అనన్=ఇట్లనఁగా, విని=ఆలకించి, బంధమూడ్చినన్ = కట్టు విప్పఁగానే,

తా. నేఁటిదినమే నిన్ను నే నేప్రకారముగానైనఁ జేర రాకపోతినేని విష్ణుని తోడ సరియగు నొక దేవుఁడున్నాఁ డని చెప్పెడు వాని పాపమునఁ బోఁగలవాఁడ నని యామాదాసుఁడు ప్రమాణముఁ జేయఁగా నా రక్కసుఁడు మాఱు పల్కక కట్టు విడిచెను. ఈపద్యముతో నీపద్యమును పోల్చి చూడుఁడు: "ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై, యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం, బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁదానయైనవాఁ, డెవ్వఁడు వానినాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్." భాగ. ౮ ఆ. ౭౩.

చ. అతఁడు తదల్పపాపఫల మందుట సుంకము దీఱి పోయి త
చ్ఛ్రుతదళపత్త్రనేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి రణద్విపంచియై
స్తుతికలితప్రబంధములఁ జొక్కఁగఁ బాడి యసత్యభీభర
ద్రుతగతి వచ్చి రాత్రిచరుతో వ్రతపూర్తి గతార్తి నిట్లనున్. 44

టీ. అతఁడు=ఆదాసుఁడు, త...ము-తదల్ప = ఆకొంచెమైన, పాప = పాపము యొక్క, ఫలముఅందుట = ఫలమునుబొందుటయనెడు, సుంకము = అభ్యంతరము, (బంధింపబడినఫల మనుట) తీర్చి = చెల్లించుకొని పోయి, తచ్ఛ్రుతదళపత్త్రనేత్రునకున్ =

ఆకమలదళనయనుఁడగు తిరుక్కురుంగుడిస్వామికి, చాఁగిలిమ్రొక్కి=దండప్రణామముఁ జేసి, రణద్విపంచిరయై - రణత్ = మ్రోయుచున్న, విపంచిరయై = వీణగలవాఁడై, స్తు... లన్-స్తుతి = నుతులతోడను, కలిత = కూడుకొన్న, ప్రబంధములన్ = గ్రంథములచే, చొక్కఁగన్ = స్వామిసంతోషించునట్లు, పరవశమొందునట్లు, పాడి = గానముఁ జేసి, అ..తిన్ - అసత్యభీభర = అప్రమాణ భయాతిశయముచేత, ద్రుత = వేగముగల, 'లఘుక్షిప్రమరంద్రుతమ్' అని యమరము. గతిన్ = గమనముచేత, వచ్చి, రాత్రిచరుతోన్=అరక్కసునితో, వ్రతపూర్తి = వ్రతపూరణముచేత, గత=పోయిన, ఆర్తిన్ = పీడచేత, ఇట్లనున్=ఈ ప్రకార మనును.

ఉ. నీ చెఱఁ బాసి పోయి రజనీచర చక్రి భజింప ముక్తి పొం
దే చెర యే చెఱం దవుల కే నీక నుండఁగఁ జూడు పంచుచో
నేచరణంబు లేయుదర కే మేయుర మేశిర మేకరంబు లీ
వాచరణంబు లాయుదర కా మాయుర మాశిర మాకరంబులున్. 45

టీ. రజనీచర = ఓయిరేద్రిమ్మరీ, నీచెఱన్ = నీనిర్బంధమును, పాసి = విడిచి, పోయి = చని, చక్రిన్ = స్వామిని, భజింపన్ = సేవింపఁగా, ముక్తి=మోక్షము యొక్క, పొందు = స్నేహము, ఏచెర = హెచ్చునురా, ఏన్ = నేను, ఇఁకన్ = ఇఁక మీఁద, ఏచెఱన్=ఏనిర్బంధమందును, తవులన్ = చిక్కుపడను, పంచుచోన్ = నన్నుఁ బనుపునప్పుడు, ఏచరణంబులు = ఏపాదములో, ఏయుదరము=ఏకడుపో, ఏయురము = ఏవక్షస్థలమో, ఏశిరము = ఏశిరస్సో, ఏకరంబులు=ఏహస్తములో, ఆచరణంబులు, ఆయుదరము, ఆయురము, ఆశిరము, ఆకరంబులున్, నీవు = నీవు, ఉండఁగఁజూడు = ఉండఁజూచికొనుము.

తా. నీ చెఱ వదలి పోయి స్వామి సేవఁ జేసి యెల్ల బంధములు వదలి వచ్చి నాఁడను, నీవు నన్నుఁ బంపు నప్పు డే కా ళ్లేకడుపు నేవక్ష మేశిర మేహస్తములు గలిగియుంటినో యాకాళ్లు మొదలగునవి యిప్పు డుండఁ జూచికొమ్మని చెప్పెను.

తే. అనినఁ దత్సత్యమునకు నేత్రాంబు లురలఁ
బ్రమద పులకితగాత్రుఁడై పాఱుఁ టసుర
యిన్నుని మధ్యందినపుటెండ కే తనదు పెద్ద
బట్టతల మించఁ బ్లవు జేరఁ కే బాఱు తెంచి. 46

టీ. అనినన్ = ఇట్లనఁగా, తత్సత్యమునకున్ - తత్ = ఆదాసరియొక్క, సత్యమునకున్ = నిక్కువమునకు, నేత్రాంబులు = ఆనందబాష్పములు, ఉరలన్ = స్రవింపఁగా, ప్ర...దు-ప్రమద = సంతోషముచేత, పులకిత = గగురుపారిన, గాత్రుఁడై=

శరీరముగలవాఁడై, పాఱుటసుర = బ్రహ్మరాక్షసుఁడు, (తే. 'పాఱుఁడల్లుఁడుదమ్ముఁడ స్పదములోఁలి, దగు సమాసముల్లైన డుత్వములు పాయు, నల్లువాఁ డ్రనఁ బాఱు వాం డ్రనఁగఁ దమ్ముఁ, గుఱ్ఱ లనఁ దెన్గుపదములు గొన్ని యిట్లు' అని యడిదము సూరయగారు కవిసంశయవిచ్ఛేదంబునఁ జెప్పిరిగావున నిది సంగతమయ్యె) ఇ...డ- ఇనుని = సూర్యునియొక్క, మధ్యందినపుటెండ = మధ్యాహ్న సంబంధియైనయెండ, త...లన్-తనదు = తనసంధియగు, పెద్దబట్టతలన్ = బట్టతలయందు, మించన్ = తళ తళమెఱయుచుండఁగా, ప్లవున్ = అసురియాళుని, 'చండాలప్లవమాతంగ దివాకీర్తిజ నంగమాః' అని యమరము. చేరన్ = సమీపించునట్లు, పాఱుతెంచి = పఱువెత్తి,

ఉ. కొండయుఁబోలె భక్తి వల గొంచునె వాఁడునిజద్రుమభ్రమీ
హిండన వ్రాలుపాకలపుఁ టేనుఁగుఁబోలె నొస ల్తదంఘ్రిలం
దుండ రొద న్మహాగిరులు హోరనఁ బ్రస్తుతి వ్రాలి దంష్ట్రికా
దండము లెత్తి పట్టిన పదం బొకఁ డొక్కఁడ నెత్తిఁ జేర్చుచున్. 47

టీ. కొండయుఁబోలెన్ = పర్వతమువలె, భక్తిన్=భక్తిచేత, వలఁగొంచునె = ప్రదక్షిణముసేయుచునె, వాఁడు = ఆరాక్షసుఁడు, ని...నన్ - నిజ = తన్నుఁగట్టిన, ద్రుమ=వృక్షముయొక్క, భ్రమీ=చుట్టు తిరుగుటయొక్క, హిండనన్ = ఆవృత్తిచేత, వ్రా...లెన్-వ్రాలు = పడునట్టి, పాకలపు = పాకల మనురోగముగల, (ఆరోగమువచ్చి నప్పుడుమదముచేత శిరస్సుపగులు నందురు. 'గజరోగస్తు పాకల' యని నిఘంటువు) ఏనుఁగుఁబోలె = గజమువలెనే, నొసల్ = ఆరాక్షసునిలలాటము, తదంఘ్రిలందున్ = ఆదాసుని పాదములయందు, ఉండన్ = తగిలియుండునట్టు, రొదన్ = తనకంఠధ్వనిచేత, మహాగిరులు=పెద్దకొండలు, హోరనన్ = ప్రతిధ్వనియియ్యఁగా, ప్రస్తుతి = స్తోత్రము చేతను, వ్రాలి = ప్రణామముచేసి, దంష్ట్రికాదండము = దండములవంటి నిడుకోలలు, ఎత్తి = మీఁదికెత్తి, పట్టిన = తానుబట్టుకొన్న, పదంబు = ఆదాసరిపాదమును, ఒకఁడొక్కఁడ = ఏకైకముగా, నెత్తిన్ = తనశిరమునందు, చేర్చుచున్ = ఉంచుకొనుచు.

తా. కొండవంటి శరీరముగల యారక్కసుండు హరిదాసునకుఁ బ్రదక్షిణము సేయుచుఁ దనస్తోత్రచేత నద్రులు మార్మ్రోయఁగాఁ బ్రస్తుతిసేయుచు నా దాసరి పాదముల వ్రాలఁగా నేనుఁగు దనకట్టు కంబముచుట్టు తిరిగి బృంహితధ్వనితో నేల వ్రాలినట్లుండెను, మఱియు నాబ్రహ్మరాక్షసుఁ డాసురియాళువైష్ణవుని పాదమొక్కొ క్కఁడె మెల్లన నెత్తి భక్తిచేత నెత్తిమీఁదఁ బెట్టుకొనెను.

శా. ఈసర్వంసహ దేవదానవమహీభృన్మానివాచాతప
శ్శ్రీసర్వస్వము నేతదన్యకృతులం జెప్పంబడు న్ఘోర మ్హా

నీసత్యం బురరీకృతాంత మిల నెంతే వృద్ధనై మంటినే
నాసత్యం బిఁక నిన్నుఁబోలెఁ గృతసంధా ధూర్వహుల్లేమికిన్.48

టీ. ఈసర్వంసహన్=ఈభూమియందు, దే...మున్-దేవ=వేల్పులయొక్కయు, దానవ = రక్కసుల యొక్కయు, మహీభృత్ = పుడమిఱేండ్రయొక్కయు, మౌని = జడదారులయొక్కయు, వాచాతపః = వచనరూప తపస్సులయొక్కయు, శ్రీ = సంపదలయొక్క, సర్వస్వమున్ = అంతయును, ఏ...లన్ - ఏతత్ = ఈశరీరదానవాఙ్మయముకంటె, అన్య = ఇతరములైన, కృతులన్ = కార్యములయందు, చెప్పఁబడున్ = వచింపఁబడును, (దేవాదులంద అితరవిషయములయందు సత్యములు చెల్లించుకొని రే కాక యిట్లు మేనువిడుచుటకై నెఱవేర్చుకొన రనుట) ఘోరమౌ=భయంకరమైన, 'ఘోరంభీమంభయానక' మ్మని యమరము. నీసత్యము = నీబుణము, ఉరరీకృతాంతము - ఉరరీకృత = అంగీకృతమగు, అంతము = అవధిగలది, (రాద్ధాంత మనుట) ఇలన్ = భూమియందు, నేను, ఎంతేన్ = మిక్కిలియు, వృద్ధనై = పెద్దవాఁడనై, (తే. 'ఉత్తమజ్ఞానవృద్ధునా నుండె నేని, బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు' అనిసభాపర్వంబునను; ఆ. 'దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ, మాటవినెడు దురభిమానఘనుఁ'డని యుద్యోగపర్వంబునను ; చ. 'అవినయబుద్ధి వై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటినీవు మూ, ర్ఖవు శిశుపాల యింక బలుక న్వలసె న్సభలోన'నని సభాపర్వంబునను ; ఉ. 'ఆదిఁ దొడంగి మూఁడుకృతు లంధ్రకవిత్వ విశారదుండు వి, ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్,' అని విరాటపర్వంబునను బ్రయోగంబులుండుటం జేసి వృద్ధ సాధువయ్యె.) మంటిని = బ్రతికితిని, ఇఁకన్ = ఇంతటిమీఁడ, నిన్నుఁబోలెన్=నీవలెను, కృ...కిన్ - కృత = చేయఁబడిన, సంధా = ప్రమాణముయొక్క, ధూర్వహుల్ = భారమునిర్వహించుకొనువారు, లేమికిన్ = లేకుండుటకు, నాసత్యంబు = నాప్రమాణము, (నేను బ్రమాణముఁ జేసెద ననుట).

తా. దేవతలయందును, రాక్షసులయందును, మునులు రాజులు మొదలగువారి యందును, నీసత్యము లేదు ; నీసత్యమే సిద్ధాంతము. దీనికి నేను బెద్దవాఁడను గావున నీతో సమానులగు సత్యవంతులు లే రని ప్రమాణముఁ జేసెదను.

చ. ఇతరులు నీకు నీడె మఱి యాధృతి నీస్మృతి నీబుతేరిత
స్థితిగతి నీమురారిపద సేవన *జీవనవన్మతిన్ సమా
దృత కలగాన †సింధు లహరీ ప్లవన ప్లవభావ భా గురు
శ్రుతి తతబద్ధతుంబికిఁ గు రుంగుడినంబికృపావలంబికిన్. 49

* జీవన. † విహరత్.

టీ. సమాదృత=ఆదరింపఁబడిన, కల = అవ్యక్తమధురమగు, గాన = పాటయనెడు, సింధు = నదియొక్క, 'సింధుర్నాసరితిస్త్రియామ్' అనియమరము, లహరీ = ప్రవాహమునందు, ప్లవన = తేలుటయందు, (విహరత్ అను పాఠమున విహరించుచున్న యని యర్థము). ప్లవభావ= తెప్పయాటను, 'ఉడుపంతు ప్లవః కోల' అని యమరము. భాక్ = పొందిన, ఉరు=అధికమైన, శ్రుతి=సుతిచే, తత=దండెయందు, 'తతం వీణాదికంవాద్య' మ్మనియమరము. బద్ధ=కట్టఁబడిన, తుంబికిన్ = సొరకాయగలిగినట్టియు, కురుంగుడి= కురుంగుడి యను నామధేయము గల దివ్యదేశమందలి, నంబి=నంబియను తిరునామము గల స్వామియొక్క, కృపా=దయను, అవలంబించినయట్టి, నీకున్, ఈధృతిన్ = ఈధైర్యముచేతను, ఈస్మృతిన్=ఈజ్ఞానముచేతను, ఈబుతేరిత = ఈసత్యవాక్యము యొక్క, 'సత్యంతథ్యమృతం సమ్యక్'అని యమరము. స్థిత=నిలుకడయైన, గతిన్=ప్రాప్తిచేతను, ఈమురారిపదసేవన = ఈశ్రీకృష్ణపాదసేవచేత, జీవనవత్=బ్రతుకుగల, (సీవనవత్తను పాఠమున భగవత్సేవానిత్య సంబంధముగల యనుట) మతిన్=బుద్ధిచేతను, మఱి యితరులు=మఱియన్యులు, ఈడె=సమానమా, (ఎవ్వరును సమానులు గా రనుట).

తా. జలప్రవాహములయందీఁతకాయలు తేల్చునట్లే గానరసప్రవాహమందు మునుఁగకుండ నీ వీణకాయయుఁ దేల్చును. కడమ సుగమము.

తే. అనిన నాతనిఁ గౌఁగిట నునిచి పలికె
వ్రత మొనర్పించె నని భాగవతవతంస
యోయి రజనీచరేంద్ర నీయురుకృపాక
టాక్షమునఁ జేసి ధన్యుఁడనైతి ననఘ. 50

టీ. అనినన్=ఇట్లనఁగా, భాగవతవతంసము = అపరమభాగవతుఁ డగు దాసరి, వ్రతము=తన గానవ్రతమును, ఒనర్పించెనని=అరాక్షసుఁడు నెఱవేర్పించెనని, అతనిన్= ఆరక్కసుని, కౌఁగిట నునిచి = ఆలింగనముచేసికొని, పలికెన్=వచించెను, ఓయిరజనీ చరేంద్ర=ఓరాక్షస శ్రేష్ఠుఁడా, నీ=నీయొక్క, ఉరు = అధికమగు, కృపా=దయతోడి, కటాక్షమునఁజేసి = క్రేఁగంటిచూపుచేత, అనఘా=ఓయి పాపరహితుఁడా, ధన్యుఁడనైతిన్=కృతార్థుఁడనైతిని.

ఉ. కాసలు బండికండ్లు మఱి ప్రాణభయంబున లక్షనేసినం
గ్రాసము గృచ్ఛ్రలబ్ధ ముడుగ న్వసమే యిది నీక చెల్లె నో
భూసురవంశపుణ్యజన పుణ్యజనాంకము తావకీనమే
పో సముకూరెడిం గులముపొత్తున దైత్యులకెల్ల నంకతన్. 51

టీ. బొసలుబండికండ్లు=ప్రమాణములు చక్రములవంటివి (లేదా బొసలు బండి కండ్లన్నది, తాయిరప్పు, త్రాళ్లు తగుల్లను వానివలె నాడెటుమాట.) మఱి=అధికముగా, ప్రాణభయంబునన్=ప్రాణభీతిచేత, లక్షసేసినన్=నూఱువేలు చేసినను, కృచ్ఛ్రలబ్ధము=ప్రయాసముచేత వచ్చినట్టి, 'స్యాత్కష్టం కృచ్ఛ్రమాభీలమ్' అని యమరము. గ్రాసము=ఆహారమును, ఉడుగన్=విడుచుటకు, వశమే=వశమా (శక్యముగాదనుట), ఇది=ఇట్లు విడుచుట, నీకచెల్లెన్=నీకే యొప్పెను, ఓభూసురవంశ్యపుణ్యజన=ఓ బ్రాహ్మణవంశమునఁ బుట్టినపుణ్యాత్ముఁడా, లేక, ఓబ్రహ్మరాక్షసుఁడా, ('యాతుధానః పుణ్యజనః' యని నిఘంటువున్నది కావునఁ బుణ్యజనశబ్దమునకు రాక్షసుఁడు నర్థమగును) పుణ్యజనాంకము=పుణ్యజనుఁ డనెడుబిరుదు, తావకీనమేపో = నీసంబంధియైనదే, కులము పొత్తునన్=కులసామ్యముచేత, దైత్యులకెల్లన్ = రక్కసులకెల్లను, అంకతన్ = నామధేయమగుట చేత, సమకూరెడిన్=కలుగుచున్నది.

తా. నీవింతపుణ్యాత్ముఁడవుగావునఁ బుణ్యజనుఁడను బిరుదు నీకే చెల్లెను; ఇంతియ కాక, నీకులమువా రగుటవలన రాక్షసుల కందఱకును నీకువచ్చిన పుణ్యజననామమే వచ్చెనని భూషించెను.

చ. కడుపు మహాక్షుధ న్నకనకంబడ నన్గృతకృత్యుఁ జేయఁ బో
విడిచితి వేము జాత్యముగ వేధవిధించినకూడు మీకు నీ
యెడ నొకకీడు గల్ల దిఁక నే మనిన న్మఱి నీకు నానసూ
బడలిక దీఱ ని_త్తనువుఁ బారణసేయుము మైత్రిగల్గినన్. 52

టీ. కడుపు=నీయుదరము, మహాక్షుధన్ = పేరాఁకలిచేతను, నకనకంబడన్ = సొటసొటలఁబోవఁగా, (ఇవి జాతి సాధారణభాషలు) నన్=నన్ను, కృతకృత్యున్ = కృతార్థునిఁగా, చేయన్=ఒనరించుటకు, పోవిడిచితివి = విడిచిపెట్టితివి, ఏము=మేము, మీకు, జాత్యముగన్ = జాత్యుచితముగా, వేధ=బ్రహ్మదేవుండు, విధించిన=నిర్ణయించిన, కూడు=ఆహారము, (మీకు మానవులమైనమేమే యాహారమనుట) ఈయెడన్=ఈకార్యమునందు, ఒకకీడుగల్లదు=మీకొకదోషములేదు, ఇఁక నే మనినన్ = ఇంతటనీవే మేనియుఁజెప్పినను, మఱినీకు నానసూ = మఱినీకు నొట్టుసుమా, మైత్రిగల్గినన్=నాయందు స్నేహముండెనేని, బడలికదీఱన్=నీశ్రమదీఱునట్లు, ఇత్తనువున్=ఈనాదేహమును, పారణముసేయుము=భుజింపుము.

క. ఈమాట చొప్పరపాచ్చెము
లేమికి నీశ్వరుఁడ కరి నిశలింపవిరోధి

నామెయి మేదోమయ దృ
ప్తామిషములు మెసవు మన్న § నతఁ డను నార్తిన్. 53

టీ. నిలింపవిరోధీ = ఓయిరాక్షసుఁడా, ఈమాటన్ = ఈవాక్యమందు, పొర పొచ్చెము=కపటము, లేమికిన్=లేకుండుటకు, ఈశ్వరుండు = అంతర్యామియగు పరమాత్ముఁడే, కరి=సాక్షి, నామెయి = నాశరీరమందలి, మే...లు-మేదోమయ=మెదడు గల, దృప్త = క్రొవ్వియున్న, ఆమిషములు = మాంసములను, మెసవుమన్నన్ = మెక్కుమనఁగా, అతఁడు=ఆగాక్షసుఁడు, ఆర్తిన్=జాలిచేత, అనున్=ప్రత్యుత్తరమిచ్చెను.

శా. ఎట్టా యి ట్టగునయ్య పల్క దయ లే § కిన్నాళ్లు నీకూడె యీ
పొట్టం బెట్టి మహాఘలబ్ధతనువుం § బోషించి యెన్నాళ్ళ కే
నెట్టే నొక్కతపస్వి యొక్కవ్రతి రాఁడే చూడఁడే తత్కృపన్
బుట్టు న్నీ గెద దీనినా నొదవి యో § పుణ్యాత్మ యెట్లంటివే. 54

టీ. ఎటా = ఎట్లు, (ప్రశ్నార్థకము) ఇట్టు=ఈ ప్రకారము, దయలేక = కృపమాలి, పల్కనగునయ్య = పల్కవచ్చునటయ్యా, ఇన్నాళ్లను = జరిగినంతకాలమును, ఈకూడె = ఈమనుష్యమాంసాహారమే, ఈపొట్టంబెట్టి = ఈనింద్యమైనడొక్కలోఁ బెట్టుకొని, మ ... బ్ధిన్-మహాఘ = మహాపాపముచేత, లబ్ధ = ప్రాప్తించిన, తనువున్ = శరీరమును, పోషించి = పెంచుకొని, ఎన్నాళ్లకేని = ఎన్నిదినములకైనను, ఎట్టేని = ఏరీతిగానైనను ఒక తపస్వి = ఒక తపసి, ఒక్కవ్రతి=ఒకనియమముగలవాఁడు, రాఁడే = రాఁడా, చూడఁడే=వీక్షింపఁడా, (ఇవి వ్యతిరేక ప్రశ్నార్థకములు) తత్కృపన్ = వానిదయచేత, దీనిపుట్టున్=ఈజన్మమును, ఈగెదనాన్=పాపికొనియెద నని తలఁచుచుండఁగా, ఒదవి = అట్లులభించి. ఓ పుణ్యాత్మ=ఓయిపుణ్యాత్ముఁడా, ఎట్లంటివే=ఏవిధముగానంటివే.

తా. ఇదివఱలోఁ గలకాలము నీ మానవ మాంసమే యాహారముగాఁ గొనుచుండి మేను పెంచుకొని యెన్నఁటికైన నొక్క సన్న్యాసియైన రాఁడా, యొక్కభక్తుఁడైన రాఁడా, నన్ను చూడఁడా, యాయనదయచేత నీపాపపుజన్మముఁ బోఁగొట్టుకొందు నని యున్నందులకు నీ వట్లువచ్చియు నే మంటివి ?

క. మీవంటి భాగవతులుం
బావనులుగఁ జేయరేని § మఱిగతి యేదీ
మావంటివారి కిఁక మా
యేవము వెనుకటిది చూడ § కీక్షింపు కృపన్. 55

టీ. మీవంటి భాగవతులు, పావనులుగన్ = పవిత్రు లగునట్లుగాను, చేయ రేని = చేయకుండిన, ఈమావంటివారికి, మఱిగతి = గత్యంతరము, ఎద్ది=ఎద్ది? ఇఁకన్ = ఇంతటను, వెనుకటిది = పూర్వముగలిగిన, మాయేపము = మాహేయమును, (అకృత్య మనుట) చూడక = ఆలోచింపక, కృపన్ = దయచేత, కాక్షింపుము = చూడుమా.

తే. స్వధితియైనను ద్విజుఁ దిన్న ♦ శస్త్రమైన
సరియకాఁ గాంచనము చేయుఁ ♦ బరుసవేది
యీయసాధారణన్యాయ ♦ మెన్నవలదె
మాదృశులచోటఁ గదియు భ ♦ వాదృశులకు. 56

టీ. పరుసవేది = స్పర్శవేధి యనియెడుసిద్ధరసము, స్వధితియైనను = గొడ్డలియై నను, 'ద్వయోఃకుఠారస్స్వధితి' అని యమరము. ద్వి...నన్-ద్విజుఁ=విప్రుని, తిన్న = సంహరించిన, శస్త్రమైనన్ = ఆయుధమైనను, సరియకాన్ = సమానముగానే, కాంచనముచేయున్=బంగారే చేయును, స్పర్శవేధి యినుమునుబంగారముచేయుట ప్రసిద్ధము) మాదృశులచోటన్ = మావంటివారియెడల, క...కున్-కదియ=చేరవచ్చునట్టి, భవాదృశులకున్ = మీవంటివారికి, ఈయసాధారణన్యాయము=ఈవిశేషన్యాయమును, ఎన్నవలదె=గణింపవలదా? అనఁగా గణింపవలయు ననుట.

తా. పరుసవేది యినుమును సువర్ణమును జేసినట్లే మీరు మమ్ముఁ బవిత్రులను జేయవలయును.

తే. అనిన దేహార్పణము నొల్ల ♦ కార్తిఁ బలుకు
కృపణత కతఁ డభిప్రాయ ♦ మెద్ది యనిన
నిత్తుఁ దను వంట యనుకంప ♦ యే మదాత్మ
కసటుఁ బాపుటయే యనుకంప గాక. 57

టీ. అనినన్ = ఈరీతిఁ బలుకఁగా, దేహార్పణమున్ = శరీరము నిచ్చుటను, ఒల్లక=ఇచ్చగింపక, ప...కున్ - పలుకు - ఆరక్కసుండువచించునట్టి, కృపణతకున్ = దైన్యమునకు, అతఁడు - ఆదాసరి, అభిప్రాయము = రాక్షసుఁడ వైననీతాత్పర్యము, ఎద్ది యనినన్ = ఏది యనఁగా, మదాత్మ=నాయాత్మయొక్క, కసటున్ = బ్రహ్మరక్షస్త్వరూపమగు మాలిన్యమును, పాపుటయే = పోఁగొట్టుటయే, అనుకంపగాక = దయగాని, 'కృపాదయానుకంపాస్యాత్' అని యమరము. తనువు = శరీరమును, ఇత్తునంట= ఇచ్చెదననుట, అనుకంజయే=కనికరమా; (కా దనుట).

తా. దేహసమర్పణము నొల్లక జాలిఁబడి వేఁడుకొన్న యారక్కసునిఁ గాంచి; యాదాసరి నీయభిప్రాయ మే మని యడుగఁగా, వాఁడు నా బ్రహ్మరక్షస్త్వము వదల్చుటయే దయగాక శరీర మిచ్చెద ననుట దయగా దని చెప్పెను.

శా. ఘంటాకర్ణుని మించుకర్మమొకొ నాకర్మంబు మౌనీంద్రులం
దుంటల్సేయఁడె మాన్పి యీఁడె భగవంతుం డట్టి శ్రీ యట్టి శ్రీ
కంటె న్భాగవతుండు మించ నొసఁగం గా లేఁడె యామేలు నా
కంటింప న్మఱి రాదె పూజనము గాదా ప్రాణిమేల్చక్రికిన్. 58

టీ. నాకర్మంబు = నేఁజేసినచెడ్డపని, ఘంటాకర్ణునిన్ = ఘంటాకర్ణుఁడనువాని, మిం...కొ-మించు = అతిశయించెడు, కర్మమొకో=కర్మ మే మోకా, మౌనీంద్రులన్ = మునిశ్రేష్ఠులను, తుంటల్సేయఁడె=(వాఁడు)నఱికివేయలేదా, భగవంతుండు=షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు శ్రియఃపతి, మాన్పి = ఆ పాపము నుడిపి, అట్టి శ్రీ = అట్టిసంపదను, ఈఁడె = ఈయఁడా, (మోక్షపదవి నిచ్చె ననుట) అట్టిశ్రీకంటెన్ = అటువంటిసంపదకంటెను, మించన్ = అధికమగునట్లు, భాగవతుండు = ఆభగవద్దాసుఁడు, ఒసఁగంగా లేఁడె = ఇయ్యలేఁడా, మఱి = ఇంకను, ఆమేలు = అట్టియుపకారమును, నాకు, అంటింపన్రాదె = కలుగునట్లుచేయఁగూడదా, ప్రాణిమేలు = ప్రాణికొఱకగునుపకారము, చక్రికిన్=శ్రియఃపతికి, పూజనముగాదా = పూజించుటగాదా, ('సంతోషంజనయేత్ప్రాజ్ఞస్తదేవేశ్వరపూజనమ్' అన్నట్లుగా జనులకు సంతోషముఁజేయుటే యీశ్వరునిఁ బూజించుట యనుట. దీనికి, 'జనస్యాశయమాలక్ష్య యో యథా పరితుష్యతి, తం తథైవానువర్తేత పరారాధన పండితః' యని అష్టాంగహృదయమందుఁ బ్రమాణాంతరము గలదు.)

తా. ఘంటాకర్ణునికంటె నే నెక్కుడగు పాపము సేయలేదనియును, శ్రియఃపతి యాతనిపాతకము లడంచి చెప్పనలవిగానియట్టి మహోన్నతపదవి నొసంగలేదా, యాభగవంతునికంటె నెక్కుడుగా భాగవతులు నొసంగలేరా, యట్టి యుపకారము నీవు నాకుఁ జేయఁగూడదా, యొకప్రాణికి మేలు సేయుటయే పరమేశ్వరునిఁ బూజించుట కాదా, కావున నన్ను రక్షింపు మని యా రాక్షసుఁడు వేఁడికొనెను.

వ. అనిన విని మాతంగుం డాతెఱంగెఱుంగ్గైన సంగతం బగు ననిన నాతం డే నొక్క బ్రహ్మరాక్షసుండఁ గుంభజానుసంజ్ఞుఁడ నుగ్రకర్ముండనై యీన్యగ్రోధం బాశ్రయించి వంచనం బథికపంచజనచర్వణంబు సేయుచుండుదు. పూర్వంబున సోమశర్మ యను భూబర్హిర్ముఖుండఁ బ్రాగ్జని ద్విజుండఁ గాన దయనీయుండన యొక్క దుష్కర్మంబున నిష్ఠతి నీవు కైటభారిం బాడిన నేఁటి పాటఫలంబు

సజలంబుగా నా కిచ్చితేని బీభత్సకుత్సార్హం బగు నీజన్మంబు వేఁగు,
నీకు నార్తరక్షణంబున నగు సుకృతం బనంతంబు సిద్ధించు, నత్యంత
ధర్మసాధనం బగు నిష్మేను నిల్లుసేరు ననిన, (నష్మేని) మాటలకుఁ గల
కల నవ్వి యవ్విష్ణుదాసుం డి ట్లనియె. 59

టీ. అనిన విని=ఇట్లనఁగా నాలించి, మాతంగుండు = ఆసురియాళు, ఆ తెఱంగు = ఆరీతి, (బ్రహ్మరక్షస్త్వనివృత్తి యనుట) ఏ తెఱంగైనన్ =ఏవిధమైనను, (ఏమి చేయఁగా ననుట) సంగతంబగు ననినన్ = అనుకూలించు ననఁగా, ఆతండు, ఏనొక్క బ్రహ్మరాక్షసుండన్, కుంభజానుసంజ్ఞుండన్ = కుంభజాను వను పేరుగలవాఁడను, ఉగ్రకర్ముండనై- ఉగ్ర = ఘోరములగు, కర్ముండనై = కృత్యములు గలవాఁడనై, ఈన్యగ్రోధంబాశ్రయించి = ఈమఱ్ఱిచెట్టునఁ జేరికొని, వంచన= మోసముచేత, ప...బు-పథిక = మార్గస్థులగు, పంచజన = మనుష్యులయొక్క, చర్వణంబు = నమలుటను, చేయుచుండుదున్ = కావించుచుందును ; (మనుష్యులను భక్షించుచుందు ననుట) పూర్వంబునన్ = పూర్వకాలమందు, ఈబ్రహ్మరాక్షసుఁడను గాకము న్ననుట) సోమశర్మ యను = సోమశర్మ యను పేరుగల, భూబర్హిర్ముఖుండన్ = భూమిసురుండను, ప్రాగ్జనిద్విజుండ గానన్ = పూర్వజన్మ బ్రాహ్మణుఁడను గావున, దయనీయుండన = దయఁ జేయదగినవాఁడనే, ఒక్కదుష్కర్మంబునన్ = ఒక దుష్కార్యము చేత, ఇట్లైతిన్ = ఈవిధముగా నైతిని, నీవు, కైటభారిన్ = శ్రియఃపతిని, పాడిన = గానముచేసిన, నే...బు-నేఁటి= ఈదినము యొక్క, పాటఫలంబు = గానఫలము, సజలంబు గాన్ = ఉదకధారాపూర్వకంబుగా, నా కిచ్చితేని = నాకు నొసంగితివా, బీభత్స కుత్సార్హంబగు-బీభత్స = రోఁతకును, కుత్స = నిందకును, అర్హంబగు = తగినట్టి, ఈజన్మంబు = ఈబ్రహ్మరాక్షసజన్మంబు, వేఁగున్ = కడతేరును, నీకును, ఆర్తరక్షణంబున నగు = దీనసంరక్షణచేత గలిగెడు, సుకృతంబు = పుణ్యము, అనంతంబు = మితిలేనిదై, సిద్ధించున్ = ఒనఁగూడును, అత్యంత = మేరమీఱిన, ధర్మ = ధర్మమునకు, సాధనంబగు = ఉపాయమగు, ఇష్మేనున్ = ఈనీశరీరమును, 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అని ప్రమాణము. ఇల్లుసేరు ననినన్ = నీయిల్లుసేరుననఁగా, అష్మేనిమాటలకున్ = ఆశరీరముకొఱకగు మాటలకు, కలకల (ఇది యనుకరణ శబ్దము) నవ్వి = పరిహసించి, ఆవిష్ణుదాసుఁడు = ఆభాగవతుఁడు, ఇట్లనియెన్ = ఈవక్ష్యమాణ క్రమముగాఁ జెప్పెను.

తా. శరీరము నీయిల్లు సేరు నని రక్కసుఁ డనియెఁ గావున, తనశరీరమందపేక్షలేని యాదాసుఁ డందులకు నవ్వెను. కడమ సులభము.

క. ఇటువంటివి యిట కెక్కుడు
విటదిగుడువి యొంద నెన్ని యే నిదియును నొ
క్కటి యొకనాంటిద కా దొక
త్రుటి గీతఫలంబు నొసఁగు దనె యిమ్మెయికిన్. .. 60

టీ. ఇటువంటివి = ఇట్టి శరీరములును, ఇట కెక్కుడువి = ఇంతకధికములగుశరీరములును, ఇటదిగుడువి = ఇంతకుఁ దక్కువగు తనువులును. ఎన్నియేని = ఎన్నియైనను, ఒందన్ = పొందను. (అనేకతనువులు దాల్చియున్నా ననుట) ఇదియును = యీదేహము, ఒక్కటి = ఇదివఱకుఁ జెందినవానిలో నొకటి, ఇమ్మెయికిన్ = ఈశరీరమునకై, ఒకనాఁటిదకాదు = ఒకనాఁటి పాటఫలమే కాదు, ఒకత్రుటి = ఒక చిటిక వేయునంతకాలము యొక్క, గీతఫలంబున్ = గానఫలమును, ఒసఁగుదు నె = ఇత్తునా, ఇయ్య ననుట.

తా. ఇటువంటి శరీరములు నింతకు మించినవియును దక్కువైనవియు ననేకము లెత్తి యున్నాఁడను గావున, నాశరీరములలో నిది యొక్కటే కాని, దీనికొఱకు నా పాటఫల మొక్కనాఁటిదే కాదుగదా యొక్క త్రేల్మిడి ఫలమైన నియ్య నని చెప్పెను.

సీ. దిక్పాలతను వెత్తి తిరిపంపుఁదనుఁ దోన
యెన్నిమార్లెత్త మీఁ యేను నీవు?
మాతంగతను వెత్తి మశకంపుఁదనుఁ దోన
యెన్నిమార్లెత్త మీఁ యేను నీవు?
కేసరితను వెత్తి కీటంపుఁదనుఁ దోన
యెన్నిమార్లెత్త మీఁ యేను నీవు?
ధరణీశతను వెత్తి దాస్యంపుఁదనుఁ దోన
యెన్నిమార్లెత్త మీఁ యేను నీవు?
తే. సోమయాజుల మెన్నిమాఱ్లౌము శ్వపచ
కులుల మెన్నిమాఱులు గాము పాము
గాములమ యెన్నిమాఱులు గాము వెండి
కంసరిపుభక్తుల మొకండె కాము గాని. 61

టీ. కం...ము-కంసరిపు=కృష్ణునికి, భక్తులము = సేవకులము, ఒకండె=ఒక్కఁడే, కాముగాని, ఈ యేనును = ఈనేనును, ఈవు=నీవును, ది...వు-దిక్పాల = ఇంద్రాద్యష్టదిక్పాలకులయొక్క, తనువు=శరీరమును, ఎత్తి=తాల్చి, తోన = వెంటనే తి...నున్-పంపురితిభిక్షు = ముష్టెడు, తనున్ = శరీరమును, ఎన్నిమార్లు = ఎన్నిపర్యాయములు,

ఎత్తము = ధరింపము, (ఇంద్రాదులమై సంపద లనుభవించియుఁ బుణ్యక్షయము కాఁగానే మరల భిక్షుకులమై నీవును నేనును వెక్కుమాఱులు భూమిపైఁ బుట్టితి మనుట) ('తోన యెన్నిమార్లెత్త మీయేనునీవు' అనునర్థమునే తక్కిన మూఁడుపాదంబులందును గ్రహించు నది) మా...వు - మాతంగ=ఏనుఁగుయొక్క, తనువు = శరీరమును, ఎత్తి, మశకంపుఁ దనుక్=దోమశరీరమును, (కడమ సుగమము) కేసరితనువు=సింహశరీరమును, ఎత్తి కీటంపుఁ దనుక్=పురుగురూపమును (కడమ సుగమము), ధరణీశతనువు=రాజశరీరమును, ఎత్తి, దాస్యంపుఁదనుక్ = బానిసరూపును (కడమసుగమము), సోమయాజులము=యజ్ఞములను జేసినవారము, ఎన్నిమార్లాము = ఎన్నిమాఱులు గాలేదు, (అనేక పర్యాయము లైతి మనుట) శ్వపచ = శునకమాంసభక్షకులము, ఖగకులులము=పక్షిజాతులము, ఎన్ని మాఱులుగాము = ఎన్నిపర్యాయములై యుండలేదు. పాముగాములము = సర్పగ్రహాము లము, (గా మన్నది గ్రహశబ్దభవము) ఎన్నిమాఱులు గాము = ఎన్నిపర్యాయములై యుండలేదు.

తా. నీవును నేనును దిక్పాలాద్యనేకజన్మము లెత్తినామేకాని, యేజన్మమందేని విష్ణుభక్తిగలవారము గాము, కావున మరలమరల నాజన్మములు వచ్చుచుండెను, విష్ణుభక్తి గలిగిన పిదప జన్మములేదు.

ఆ. [1]ఊఁతనీరు చెలఁది ♦ నేఁత మూఁటాయిటి
దూది యెండపసుపు ♦ తోఁటయక్క
రంబు మేను దీనికరపిఁ బుణ్య మమ్ముట
కప్పురంబు వెట్టి ♦ యుప్పు గొనుట. 62

టీ. మేను=శరీరము, ఊఁత యనఁగా, అడుగున లావుగను పైని సన్నముగను నుండునట్లు రెండువైపుల మూఁతలేకుండఁగ వెదురుపేళ్లతో నల్లిన మత్స్యగ్రహణ సాధనము, "గీ.ఊఁత యలజల్లెఁ జేఱువుల నుండరాక, కార్మొసల్లె సెగల్లను గవులు విడిచి, తరలి చెంతల నూతిగుంతలవసించె." వేం. పంచ. ౧-౨౮౮. "సీ.వలయన జాలంబుపరఁగు...తద్భేద మొప్పు నూఁతన..." ఆంధ్రభాషార్ణవము. ౧. ౧౫౮. ఊఁతనీరు=ఊఁతలో నిలుచు నీరు ఊఁతలో నీరు నిలువదు కనుక మిక్కిలి క్షణిక మని భావము.) చెలఁదినేఁత=సాలెపురుగు నేసిన నేఁతలోఁగట్టిన, మూఁట, ఆయిటిదూది=ఎండకాలము గాలిలోఁ బెట్టినదూది (బూరుగు దూది యని కొందఱు) ఎండపసుపు = ఎండలో నుంచిన పసుపు, (ఎండలో నునిచిన పసుపునకు వర్ణము చెడు ననుట; మఱియును సాయంప్రాతఃకాలములయందు నెండలో నునిచినవస్తు వాక్షణము మాత్రము పచ్చగా నుండు నావల నుండదు గాన నా వర్ణ మని

[1]. పూఁతనీరు, ఊఁతనీరు,

కొంద ఱందురు) తొట్టియక్కరంబు = బోసినోటివాఁ డుచ్చరించినయక్షరము, (పుఱుఁగు దొల్చిన యక్షర మని కొంద ఱందురు) [అనఁగా మేను పీనిపలెనే శాశ్వతముగాక నష్ట మగు ననుట] దీనిరహి = దీనిప్రకాశమునుగూర్చి, (కర్మప్రవచనీయకము లేకయే కేవల ద్వితీయమీఁద షష్ఠ్యర్థము వచ్చును. అందులకు, ఆ. 'అరుగుదెంచి యన్నయడుగులఁ గడు నార్త, నాద మడరఁ ద్రెళ్ళి నాథుఁ బనవి, యేడ్చుచున్న నల్ల యెత్తి యమ్ముద్దియఁ, దడవి కన్ను నీరు దుడిచి యలఁడు.' అని యుత్తరరామాయణమునందు సోమయాజి ప్రయోగము మఱికొన్నియుం గలవు.) పుణ్య మమ్ముట=పుణ్యము విక్రయముచేయుట, కప్పురంబు = కర్పూరమును, పెట్టి=ఇచ్చి, ఉప్పు=లవణమును, కొనుట=గ్రహించుటయే.

తా. ఈ యస్థిర మగు శరీరముకొఱకుఁ దన పుణ్యమును వ్యయముచేయుట కర్పూర మమ్మి యుప్పుగొనుటయే యగును.

వ. అనిన దనుజుం డిట్లనియె. 63

క. సంగీతఫలంబునఁ గో
సంగీ సగమైనఁ దయపొసఁగ నీవే మిన్
మ్రింగిన గ్రుక్కన్వారిధి
కిం గొఱఁతయె కొదయె విష్ణుకీర్తన కనినన్. 64

టీ. గోసంగీ = ఓగోసంగిదాసరీ, (మాతంగదాసుఁ డనుట) "సీ. గోసంగి మాదిగ గూబరి యన, మాతంగుఁడగు..."ఆంధ్రభాషార్ణవము. అ. అర్థా. సంగీతఫలంబునన్ = నేఁటిగానఫలమందు, సగమైనన్ = అర్ధభాగమైనను, దయపొసఁగన్ = దయయొప్పునట్లుగా, ఈవే=ఇయ్యవే, (వ్యతిరేకార్థకముమీఁద నేకారమువచ్చిన సంప్రార్థనపర క్రియ) మిన్=మీనము, మ్రింగిన=ఆహారించిన, గ్రుక్కన్=గ్రుక్కెఁడునీటిచేత, వారిధికిన్=సముద్రమునకు, కొఱఁతయె=తక్కువగునా, విష్ణుకీర్తనకున్, కొదయె = నీకుఁ దక్కువగునా, (సముద్రమున కుదకము దఱుగనియట్లు నీకు హరికీర్తన తఱుగ దనుట.) అనినన్ = ఇట్లనఁగా.

శా. ఏలా నొంచెద దేయ మిట్లడిగి యెంతే బాస మేనంబలం
బో లీలావటుగీతకీర్తనఫలంబో నీయెడ మున్ను పా
తాళప్రశ్నలు మాని మేన్గొనుము బేతాళచ్ఛలోక్తిన్ రుషం
దూలింప దలఁతేని పుట్టు మఱి నూతుల్దివ్వ బేతాళముల్.

టీ. ఆదేయము=ఇయ్యఁగూడనిదానిని, ఇట్లు అడిగి=ఈరీతినియాచించి, ఏలా నొంచెదు=ఏలనొప్పించెదవు, మున్ను = మున్ను, నీయెడన్=నిపట్ల, ఎంతే = ఎంతయును, బాస=నాప్రమాణము, మేనన్ పలంబో=దేహమందలిమాంసమో, లీ...బో-లీలావటు=

మాయా బ్రహ్మచారియగు వామనునియొక్క, గీత=గానము సేయబడిన, కీర్తన = కీర్తనల యొక్క, ఫలంబో=ఫలమో, (మున్ను నేను శరీర మిచ్చెద నని ప్రమాణముఁ జేసితినే కాని గానఫల మిచ్చెద నని చేయలే దనుట) పాతాళ ప్రశ్నలు = అగాధప్రశ్నములను, (పాతాళమం దిప్పు డే మున్న దని యడిగిన ట్లనుట) మాని=విడిచి, మేన్గొనుము=శాశరీ మును గ్రహియింపుము, బేతాళ ఛలోక్తిన్ - బేతాళ = మీ బేతాళజాతిసంబంధియగు ఛలోక్తిన్=దంభపుమాటచేత, రుషన్=రోషముచేశ, (నాకు రోషము పుట్టించి యనుట) తూలింపన్ = తూలఁజేయుటకు, తలఁ తేని = తలఁచినట్లాయెనా, మఱి = ఇంకను, నూతుల్ త్రవ్వన్=కూపములు త్రవ్వఁగా, (ఇంక నిట్టి ప్రశ్నలు సేయఁగాననుట) బేతాళముల్=మఱికొన్ని బేతాళగ్రహములు, పుట్టును = ఉత్పత్తియగును, 'బావి త్రవ్వఁ బోఁగా భూతము బయలుదేఱెను' అన్నసామెతయర్థము నిక్కడఁ జెప్పినాఁడు. మఱి యును 'తూలింపం దలఁ తేని బుద్ధిమఱి నూతుల్ద్రవ్వ నాతాళముల్' అని కొందఱు పాఠాంతరముగాఁ జెప్పి దానికిఁ దాటిచెట్ల ప్రమాణమున బావులు ద్రవ్వవలయు నని యెడు బుద్ధివంటి దని యర్థము చేయుదురు.

తా. ఇంకఁ బాతాళప్రశ్నలు మాని, నేను చేసిన ప్రమాణ ప్రకారముశాశరీర మును భక్షింపుము; తడవుఁజేసి నన్నలఁతపెట్టవలయు నని తలంచి మఱియుఁ ద్రవ్వితివా మఱికొన్ని బేతాళములు వచ్చి నన్ను భక్షించుఁ గావున, మనమాటచొప్పున నీవె భక్షింపు మని చెప్పెను.

వ. అనిన సాలకటంకటేయుండు సాలఁ గటకటంబడి కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని కటకటా! కైటభారి కనుంగులగు డింగరీలు దయాళు వులు గావలవదే? తొల్లి దర్శన ప్రవర్తకుండై వైయాసికంబు లగు సూత్రంబులు వివరించి విస్తరశ్రవు నద్వైతవైశిష్ట్యంబుఁ బ్రతిష్ఠిం చిన లక్ష్మణాఖ్య యోగీంద్రుండు చిరకాలసేవ సంతుష్టుండై నిజదేశి కుం డగు పూర్ణాహ్వయుం డనధికారుల కీకు మని విధియుక్తంబుగాఁ దనకుఁ బ్రసాదించిన గీతాచరమార్థంబుఁ గృపాతరంగితుండై రం గేశధామ దామోదరనామ చామీకరగోపురంబెక్కి యుచ్చైస్స్వ నంబున నుచ్చరించిన గురుం డలిగిన, దేవా! దేవరయాజ్ఞ మీఱకయె న్నొక్కరుండ రౌరవంబునం బడకుండుట మేలో? భాగవతపరిషత్తు నకుఁ బరమపద మగపడుట మేలో? యని వితర్కించి నీ వుచ్చరిం చుటగా నుచ్చరించితి నని తదభినందితుం డయ్యె, నతండ నిజచ్ఛాత్ర సత్రంబునకుఁ బ్రత్యహంబును గల్యంబున మూల్యం బొల్లక గవ్యం

బు సమర్పించి వేఁడిన వల్లవీవల్లవులకుఁ బరమపదంబుఁ బ్రసాదించె, నతండ బంధముక్తుం డయ్యు నవతారాంతరంబునఁ గాలాంతరంబున సంకుచితజ్ఞానులై విషయపరు లగు నరులకుం బరమునందలి తీపాదప సుందరజామాతృ నామంబున నర్చిరాదిగతి విశదీకరించె, నతండ యిటమీఁద యాదవగిరి టెంకణంబు పాషండసంకులంబుగా వచ్చినఁ దచ్చ్యుతికి శఠకోపసమాఖ్య సంభవించి నీరంధ్రవాదంబున నంధ్రాదివిషయ విద్వజ్జనంబుల న ధోక్షజవిషయవాదభిక్ష వేఁడి దిగ్విజయంబు సేసి గరుడకుధర గుహాకుంఠ నృకంఠీరవంబు కుహనాత్రిదండిమై బ్రుసీ *కుసుంభాంబరాంభగకుండిక లాసంగ నంగీకృతాంతిమాశ్రముం డై ఫణిప కణభు గక్షపాద బాదరాయణ కపిల జైమిని శాసనంబులు మత మహానస మహీసురులు మున్నుగా నెంతేవాసి నంతేవాసులకుఁ దెలివి పఱుపం బరమహంసానుష్ఠాన పరకాష్ఠయై పదయుగ ప్రపన్న భువనప్రపంచపంచజనహృదయ భవనంబులం బద్మాపద్మాక్షులు పల్లేర్లు దుడిచి †పాడెక్కభక్తి బోధించి భూతలంబుఁ బావనంబు సేయంగలవాఁడు, మఱియు హాయవదనపదారాధకుండై వేంకటేశుం డను నింకొక్క మనీషి మధుమథనమతప్రతిపాదకం బగు ప్రబంధశతంబు రచించి శిలోంఛవర్తనంబునం దపంబు సేయం దనకు జరచ్ఛదన శాకదానంబు నగస్త్రోర్వీరుహాంబునకు నిర్వాణం బొసంగం గలం డిట్టి యేష్యంబులు మదీయ దివ్యబోధంబున నెఱింగియుండు నేతాదృశం బగు త్రైకాలిక జ్ఞానంబు కలిమి నిష్మేను మాననీయంబుగదా యంటేని యది జాత్యంబుదక్కఁ దపస్సత్యశమదమాది లబ్ధంబు గాదు ; నిషాది భవిష్యదర్థంబులఁ జెప్పుచున్నది, అది శుచియే? కౌశికంబు డబ్బాటిగబ్బలుఁగు గౌళికనుంబెంటిపైఁడికంటి లోనగుతిర్యక్కులు శావిప్రయోజనసూచకంబులై యున్నయవి యవి తపస్వులే? యట్ల మావిజ్ఞానంబును నెట్లనిన, నాస్తిక్యంబువలన శాస్త్రంబులెడ నధీతిబోధంబులు దక్క నాచరణప్రచారంబులు లేమి ధర్మంబు దూరం బడి నిమిత్తంబుగా నిత్తెఱం గెఱుంగక భవోత్తారకంబు గాదు, గావునఁ

---

* కౌసుంభకాంభకుండిక. † పాదక్క.

గలుష రహితకాయంబునం గాని కల్యాణంబు లబ్ధంబుగాదు, గావునఁ బట్టి యిశ్వరూపవిగ్రహం బనుగ్రహంబున నుడిపి కృతార్థుఁ జేయు మని పాదంబుల వ్రాలి పాటం బాతికపా లేని యీవే యనిన, నతం డదియును నీలే నన్నుఁ, బోని మ్రొక్కుప్రభాతసమయంబునం బాడిన చరమగీతంబైన నిల్చి ప్రపన్నుం డగు నన్ను విపన్నుం జేయు మని లేవకున్నం, బరమ దయార్ద్రుండై, 'యట్ల కానిమ్ము లె'మ్మని యతని లేవ నెత్తి, యత్తను ప్రాప్తిప్రకారంబు సవిస్తరంబుగాఁ జెప్పు మనిన నవధరింపు మని యప్పాలదిండి దుఃఖార్తుండై యిట్లనియె. 66

టీ. అనినన్ = ఇట్లనఁగా, *సాలకంటకటేయుండు = సాలకటంకటా వంశస్థుఁడగు నారాక్షసుఁడు, చాలన్ కటకటంబడి=మిక్కిలి దుఃఖించి, కార్యేచ్ఛన్=ప్రయోజనాభిలాషచేత, కన్నీరు, గ్రుక్కుకొని=అడఁచుకొని, కటాకటా=అయ్యయ్యో, కైటభారికిన్=శ్రీపతికి, అనుంగులగు=హితులగు, డింగరీలు=దాసులు, లేక భక్తులు. (డింగరీఁడు-సం. డింగరః. క. డింగర. "ద్వి. మీబంట మీదూడ మీడంగరీఁడ," బసవపు. ౪ ఆ. ౧౦౨౧. పంక్తి.) దయాళువులు=కృపగలవారు, కావలవదే=కావలదా, తొల్లి=పూర్వమందు, దర్శన ప్రవర్తకుండై=మతనిర్వాహకుఁడై, వైయాసికంబులగు=వ్యాసప్రోక్తంబులగు, సూత్రంబులు=వేదాంతసూత్రములు, వివరించి=వ్యాఖ్యాన మొనరించి, వి...బు-విష్టరశ్రవు=నారాయణుని యొక్క, అద్వైతవైశిష్ట్యంబు=విశిష్టాద్వైతమును, ప్ర...డు-ప్రతిష్ఠించిన=సిద్ధాంతముఁ జేసినట్టి (సూక్ష్మచిదచిద్విశిష్టబ్రహ్మము జగత్కారణ మనియు, స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మము కార్య మని యనుట), లక్ష్మణాఖ్యయోగీంద్రుండు = రామానుజాచార్యు లనెడు యోగిశ్రేష్ఠుఁడు, (ఎంబెరుమానారు లనుట), చిరకాలసేవన్ = బహుకాలశుశ్రూషచేత, సంతుష్టుండై, నిజ = తనయొక్క, దేశికుండు = ఆచార్యుఁడు, అగు పూర్ణాహ్వయుండు = ఐన పెరియనంబిగా రనియెడు ద్రవిడ నామముగల పూర్ణాచార్యులు, అనధికారులకున్ = యోగ్యతలేనివారికి, ఈకుము అని=ఇయ్యకు మని, విధియుక్తముగాన్ = శాస్త్రోక్తప్రకారముగా, తనకున్, ప్రసాదించినన్ = అనుగ్రహింపఁగా, గీతాచరమార్థంబు=భగవద్గీతాచరమశ్లోకార్థము, కృపాతరంగితుండై - కృపా = దయచేత, తరంగితుండై = సంజాతతరంగములుగలవాఁడై, రం...బు-రంగేశ - శ్రీరంగనాయకులయొక్క, ధామ=కోవెలయందలి, దామోదరనాను = దామోదర మనుపేరు

* ఈసాలకటంకట హేతిప్రహేతు లను నాదిమ రాక్షసులలో నొకఁడైన హేతికిఁ గుమారుఁ డగు విద్యుత్కేశునకు భార్యయును సుకేశుఁ డను రాక్షసునకు దల్లియు సంధ్య యనువానికిఁ గూఁతురు నైనది.—ఈకథ శ్రీమద్రామాయణోత్తర కాండమునందుఁ బ్రసిద్ధము.

గల, చామీకర=స్వర్ణమయమగు, గోపురంబు, ఎక్కి, ఉచ్చైస్స్వనంబునన్ = గంభీర కంఠనాదముచేత, ఉచ్చరించి=పలికి, (తిరుమంత్రద్వయ చరమార్థములను గోపురమెక్కి చాటినాఁడనుట) గురుండు=తమయాచార్యులగుపూర్ణాహ్వయులు,అలిగినన్=కోపింపఁగా దేవా=స్వామీ, దేవరయాజ్ఞ మీఱక = దేవరవారియాజ్ఞనుల్లంఘింపక, ఏ నొక్కరుండ= నే నొక్కఁడనే, రౌరవంబునన్=నరకమునందు, పడకుండుట=కూలఁబడుండుట, మేలో = మంచిదో, భాగవతపరిషత్తునకున్ = భాగవతసమూహమునకు, పరమపదంబు = మోక్ష స్థానము, అగపడుట=లభించుట, మేలో = మంచిదో, అని=యిట్లని, వితర్కించి = తల పోసి, నీ వుచ్చరించుటగాన్ =మీరే యుపదేశించినట్లుగా, ఉచ్చరించితిని = అని చెప్పితి నని, తదభినందితుండయ్యెన్-తత్ = ఆ పెరియనంబిగారిచేత, అభినందితుండయ్యెన్ = మెప్పించుకొనియెను; అతండ = ఆరామానుజగురుఁడే, ని...గున్-నిజ = తనయొక్క, ఛాత్ర=శిష్యులయొక్క, 'ఛాత్రాన్తేవాసినౌ శిష్యే' అని యమరము. సత్త్రంబుల కున్ = రామానుజకూటములకు, 'సత్త్ర మాచ్ఛాదనే యజ్ఞే సదా దానే వనేఽపి చ' అని విశ్వము. ప్రత్యహంబును=ప్రతిదినమును, కల్యంబునన్ = తెలవాఱఁగనె, 'ప్రత్యూషో హర్ముఖం కల్య' అని యమరము. మూల్యంబు = వెలను, 'మూల్యం వస్నోఽప్యవక్రయః' అని యమరము. ఒల్లక = ఇచ్చయింపక, గవ్యంబు = గోసంబంధియైన పాలు పెరుఁగు నేయి, సమర్పించి వేఁడినన్ = యాచింపఁగా, పల్లవీవల్లవులకున్=గోపికా గోపకులకు, పరమపదంబున్, ప్రసాదించెన్ = కృపనొసఁగెను, అతండ = ఆయుడ యవరులే, బ...య్యున్=బంధ = కర్మబంధమువలన, ముక్తుండయ్యున్ = విడువఁబడిన వాఁడైనను, అవతారాంతరంబునన్=మఱియొక యవతారమందు, కాలాంతరంబునన్= మఱియొక కాలమందు, స...లై-సంకుచిత = తక్కువపడని, జ్ఞానులై = ఎఱుక గలవారై, విషయపరులు = శబ్దాదివిషయాసక్తులు, మనుజులకున్ = ఐనమానవులకు, పరమునందలి=మోక్షమునందలి, తీపు=రుచి, ఒదవన్ = పుట్టునట్లుగా, సుం...న్ - సుందరజామాతృ = సుందరజామాతృఁడనియెడు, నామంబునన్ = నామధేయముచేత, అర్చిరాదిగతి = అర్చిరాదిమార్గగమనము, (ముక్తులగువారు సూర్యమండలమును భేదించు కొని పోవు మార్గప్రకారము ననుట) విశదీకరించెన్ = తేటపఱచెను, అతండ = ఆ యెంబెరుమానారే, ఇటమీఁదన్ = భవిష్యత్కాలమందు, యాదవగిరికోణంబు = యాదవాచలప్రాంతము, (తిరునారాయణపురప్రాంత మనుట), పా...పాషండ = వేద బాహ్యులచేతను, సంకులంబు = సంకరము, కావచ్చినన్, తచ్చ్యుతికిన్ - తత్ = ఆ పాషండులయొక్క, చ్యుతికిన్ =నాశమునకు, శఠకోపసమాఖ్యన్ = శఠకోపులనునామ ధేయముచేత, సంభవించి = అవతారమెత్తి, నీరంధ్రవాదంబునన్ = ఎడతెగనిప్రసంగ

ముచేత, అం...లన్-అంధ్రాదివిషయ = ఆంధ్రదేశము మొదలగుదేశములందలి, విద్వజ్జనంబులన్=విద్వాంసులను, అ...త్షన్-అధోక్షజవిషయ = భగవద్విషయమగు, వాద=ప్రసంగ మనియెడు, భిక్షన్ = భిక్షను, వేఁడి = అడిగి, దిగ్విజయంబుసేసి = దిక్కులను గెలిచి, గ...దున్ - గరుడకుధర = గరుడాచలముయొక్క, గుహాయందున్, (అహోబిలమనుట), అ...బుఅకుంఠ = అప్రతిహతుఁడైన, నృకంఠీరవంబు = నరసింహస్వామి, కుహనాత్రిదండి ఐ = కపటసన్న్యాసియై, బ్రు...బు-బ్రుసీ = జపాసనమును, 'ప్రతినామాసనం బ్రుసీ' అని యమరము. కుసుంభాంబర = కాషాయమును, అంభఃకుండికలు = కమండలువును, ('కౌసుంభరాంభకుండికలు' అను పాఠమున రాంభ మనఁగా వేణుదండ మని యర్థము; కడమ సుగమము.) ఒసంగన్ = ఇయ్యఁగా, అం...డుఐ - అంగీకృత=గ్రహింపఁబడిన, అంతిమ = కడపటిదైన, ఆశ్రముండై = యత్యాశ్రమముగలవాఁడై, ఫ...లు-ఫణిప = శేషునియొక్కయు, కణభుక్ = కణాదునియొక్కయు, అక్షపాద = గౌతమమునియొక్కయు, బాదరాయణ = వ్యాసునియొక్కయు, కపిల = కపిలుని యొక్కయు, జైమిని = జైమినియొక్కయు, శాసనంబులు = విధులు, (వీరిమతములనుట), మ...లు - మత = తమమతముయొక్క, మహానస = వంటసముందలి, మహీసురులు = బ్రాహ్మణులు, (వాచకు లనుట.), మున్నుగాన్ = మొదలుగా, ఎంతేవాసిన్=మిక్కిలిచక్కఁగా, అంతేవాసులకున్ = శిష్యులకు, తెలివిపఱుపన్ = బోధించుటకై, ప...ష్ఠ ఐ-పరమహంస = యతీశ్వరులయొక్క, అనుష్ఠాన=ఆచారమునకు, పరకాష్ఠ ఐ=పరమావధియై, ప...లన్ - పదయుగ = తమపదద్వంద్వమునకు, ప్రసన్న = ప్రపత్తిఁ జేసినట్టి, భువన = లోకములయొక్క, ప్రపంచ = లోకమందలి, పంచజన = నరుల యొక్క, 'పంచజనాః పురుషాః పూరుషా నరాః' అనియమరము. హృదయ = మనస్సులనియెడు, భవనంబులన్ = గృహములయందు, పద్మాపద్మాక్షులు = శ్రీశ్రీపతులు, పల్లేర్లు = కామక్రోధాదు లనియెడు కంటకములను, తుడిచి = ఊడ్చివైచి, పాదు=శూన్యములగువానిని, ఎక్కన్ = ప్రవేశింపఁగా, ('పాదెక్కను' అని పాఠాంతరము, అట్లైనఁ బాదుకొనఁగా ననియర్థము,) భక్తిబోధించి = భక్తినుపదేశించి, భూతలంబున్ = భూప్రదేశమును, పావనంబుసేయంగలవాఁడు = పవిత్రముఁజేయఁగలఁడు, మఱియు=ఇంకను, హయవదన = హయగ్రీవస్వామియొక్క, పద = పాదములయొక్క, ఆరాధకుండై = పూజించెడువాఁడై, వేంకటేశుండను = వేంకటేశాపరనామముగల వేదాంతదేశికుఁ డనుట. ఇంకొక్కమనీషి = మఱియొక్క విద్వాంసుఁడు, మ...బు-మధుమథన=మధుసూదనుఁడగు శ్రీపతియొక్క, మత=మతముయొక్క, (శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వ మని యనుట) ప్రతిపాదకంబు, ప్రబంధశతంబు = నూఱుప్రబంధములను,

గల, చామీకర=స్వర్ణమయమగు, గోపురంబు, ఎక్కి, ఉచ్చైస్స్వనంబునన్ = గంభీర
కంఠనాదముచేత, ఉచ్చరించి=పలికి, (తిరుమంత్రద్వయ చరమార్థములను గోపురమెక్కి
చాటినాఁడనుట) గురుండు=తమయాచార్యులగుపూర్ణాహ్వయులు,అలిగినన్=కోపింపఁగా
దేవా=స్వామీ, దేవరయాజ్ఞ మీఱక = దేవరవారియాజ్ఞనుల్లంఘింపక, ఏ నొక్కరుండ=
నే నొక్కఁడనే, రౌరవంబునన్=నరకమునందు, పడకుండుట=కూలకుండుట, మేలో =
మంచిదో, భాగవతపరిషత్తునకున్ = భాగవతసమూహమునకు, పరమపదంబు = మోక్ష
స్థానము, అగపడుట=లభించుట, మేలో = మంచిదో, అని=యిట్లని, వితర్కించి = తల
పోసి, నీ వుచ్చరించుటగాన్ =మీరే యుపదేశించినట్టుగా, ఉచ్చరించితిని = అని చెప్పితి
నని, తదభినందితుండయ్యెన్-తత్ = ఆ పెరియనంబిగారి చేత, అభినందితుండయ్యెన్ =
మెప్పించుకొనియెను; అతండ = ఆరామానుజగురుఁడే, ని...కున్-నిజ = తనయొక్క,
ఛాత్ర=శిష్యులయొక్క, 'ఛాత్రాన్తేవాసినౌ శిష్యే' అని యమరము. సత్త్రంబుల
కున్ = రామానుజకూటములకు, 'సత్త్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేపిచ' అని
విశ్వము. ప్రత్యహంబును=ప్రతిదినమును, కల్యంబునన్ = తెల్లవాఱుజామున, 'ప్రత్యూషో
హర్ముఖం కల్య' అని యమరము. మూల్యంబు = వెలను, 'మూల్యంవస్నో౽ప్యవక్ర
యః' అని యమరము. ఒల్లక = ఇచ్ఛయింపక, గవ్యంబు = గోసంబంధియైన పాలు
పెరుఁగు నేయి, సమర్పించి వేఁడినన్ = యాచింపఁగా, వల్లవీవల్లవులకున్=గోపికా
గోపకులకు, పరమపదంబున్, ప్రసాదించెన్ = కృపనొసఁగెను, అతండ = ఆయుడ
యవరులే, బ...య్యున్=బంధ = కర్మబాధమువలన, ముక్తుండయ్యున్ = విడువఁబడిన
వాఁడైనను, అవతారాంతరంబునన్=మఱియొక యవతారమందు, కాలాంతరంబునన్=
మఱియొక కాలమందు, సం...లై-సంకుచిత = తక్కువపడిన, జ్ఞానులై = ఎఱుక
గలవారై, విషయపరులు = శబ్దాదివిషయాసక్తులు, అగునరులకున్ = ఐనమానవులకు,
పరమునందలి=మోక్షమునందలి, తీపు=రుచి, ఒదవన్ = పుట్టునట్లుగా, సుం...నన్ -
సుందరజామాతృ = సుందరజామాతృఁ డనియెడు, నామంబునన్ = నామధేయముచేత,
అర్చిరాదిగతి = అర్చిరాదిమార్గగమనము, (ముక్తులగువారు సూర్యమండలమును భేదించు
కొని పోవు మార్గప్రకారము ననుట) విశదీకరించెన్ = తేటపఱచెను, అతండ = ఆ
యెంబెరుమానారే, ఇటమీఁదన్ = భవిష్యత్కాలమందు, యాదవగిరికోణంబు =
యాదవాచలప్రాంతము, (తిరునారాయణపురప్రాంత మనుట), పా...పాషండ = వేద
బాహ్యులచేతను, సంకులంబు = సంకరము, కావచ్చినన్, తచ్చ్యుతికిన్ - తత్ = ఆ
పాషండులయొక్క, చ్యుతికిన్=నాశమునకు, శఠకోపసమాఖ్యన్ = శఠకోపులనునామ
ధేయముచేత, సంభవించి = అవతారమెత్తి, నీరంధ్రవాదంబునన్ = ఎడతెగని ప్రసంగ

ముచేత, ఆం...లన్-ఆంధ్రాదివిషయ = ఆంధ్రదేశము మొదలగుదేశములందలి, విద్వ
జ్జనంబులన్=విద్వాంసులను, అ...జన్-అధోక్షజవిషయ = భగవద్విషయమగు, వాద=
ప్రసంగ మనియెడు, భిక్షన్ = భిక్షను, వేఁడి = అడిగి, దిగ్విజయంబుసేసి = దిక్కులను
గెలిచి, గ...దన్ - గరుడకుధర = గరుడాచలముయొక్క, గుహయందున్, (అహో
బిలమనుట), అ...బుఅకుంఠ = అప్రతిహతుఁడైన, నృకంఠీరవంబు = నరసింహస్వామి,
కుహనాత్రిదండి ఐ = కపటసన్న్యాసియై, బ్రు...లు-బ్రుసీ = జపాసనము, 'ప్రతినా
మాసనం బ్రుసీ' అని యమరము. కుసుంభాంబర = కాషాయమును, అంభఃకుండికలు =
కమండలువును, ('కౌసుంభరాంభకుండికలు' అను పాఠమున రాంభ మనఁగా వేణుదండ
మని యర్థము; కడమ సుగమము.) ఒసఁగన్ = ఇయ్యఁగా, అం...డుఐ - అంగీకృత=
గ్రహింపఁబడిన, అంతిమ = కడపటిదైన, ఆశ్రముండై = యత్యాశ్రమముగలవాఁడై,
ఫ...లు-ఫణిప = శేషునియొక్కయు, కణభుక్ = కణాదునియొక్కయు, అక్షపాద =
గౌతమమునియొక్కయు, బాదరాయణ = వ్యాసునియొక్కయు, కపిల = కపిలుని
యొక్కయు, జైమిని = జైమినియొక్కయు, శాసనంబులు = విధులు, (వీరిమతము
లనుట), మ...లు - మత = తమమతముయొక్క, మహానస = బానసమందలి, మహీ
సురులు = బ్రాహ్మణులు, (పాచకు లనుట.), మున్నుగాన్ = మొదలుగా, ఎంతేవాసిన్ =
మిక్కిలిచక్కఁగా, అంతేవాసులకున్ = శిష్యులకు, తెలివిపఱుపన్ = బోధించుటకై,
ప...ష్ఠ ఐ-పరమహంస = యతీశ్వరులయొక్క, అనుష్ఠాన=ఆచారమునకు, పరకాష్ఠ ఐ=
పరమావధియై, ప...లన్ - పదయుగ = తమపదద్వంద్వమునకు, ప్రసన్న = ప్రపత్తిఁ
జేసినట్టి, భువన = లోకములయొక్క, ప్రపంచ = లోకమందలి, పంచజన = నరుల
యొక్క, 'పంచజనాః పురుషాః పూరుషా నరాః' అనియమరము. హృదయ = మనస్సు
లనియెడు, భవనంబులన్ = గృహములయందు, పద్మాపద్మాక్షులు = శ్రీ శ్రీపతులు,
పల్లేర్లు = కామక్రోధాదు లనియెడు కంటకములను, తుడిచి = ఊడ్చివైచి, పాడు=
శూన్యములగువానిని, ఎక్కన్ = ప్రవేశింపఁగా, ('పాడెక్కను' అని పాఠాంతరము,
అట్లైనఁ బాడుకొనఁగా ననియర్థము,) భక్తిబోధించి = భక్తినుపదేశించి, భూతలంబున్ =
భూప్రదేశమును, పావనంబుసేయంగలవాఁడు = పవిత్రముఁ జేయఁగలఁడు, మఱియు=
ఇంకను, హయవదన = హయగ్రీవస్వామియొక్క, పద = పాదములయొక్క, ఆరాధ
కుండై = పూజించెడువాఁడై, వేంకటేశుండను = వేంకటేశాపరనామముగల వేదాంత
దేశికుఁ డనుట. ఇంకొక్కమనీషి = మఱియొక్క విద్వాంసుఁడు, మ...బు-మధుమథన=
మధుసూదనుఁడగు శ్రీపతియొక్క, మత=మతముయొక్క, (శ్రీమన్నారాయణుఁడే
పరతత్త్వ మని యనుట) ప్రతిపాదకంబు, ప్రబంధశతంబు = నూఱుప్రబంధములను,

రచించి = ఏర్పఱిచి, శిలోంఛవర్తనంబునన్ = శిలోంఛవృత్తులచే జీవించుటచేతను, (శిలోంఛము లనునవి ప్రత్యేకవృత్తు లనవలయును. శిల మనఁగా నియమగ్రహోపాదానము ; ఉంఛ మనఁగా రాలిన నీవారాదులను గ్రహించునది.), తపంబుసేయన్=తపస్సుచేయుచుండఁగా, తనకున్ = ఆవేదాంతదేశికునకు, జ...బు-జరచ్ఛదన = ముదురాకులనియెడు, శాకదానంబుసేయు, అగస్త్యోర్వీరుహంబునకున్ = అగిసెమ్రానికి, (ఇచ్చట నలరోర్వీరుహంబున కని కొందఱుచు దానికి ముల్లుచ్చిచెట్టని చెప్పికొంద్రు) నిర్వాణంబు = పరమసుఖమును, ఒసంగంగలండు = కృపసేయఁగలఁడు, ఇట్టియేవ్యంబులు = భవిష్యదర్థంబులు, మ...నన్ - మదీయ = నాసంబంధియగు, దివ్యబోధంబునన్ = దివ్యజ్ఞానముచేత, ఎఱింగియుండుదున్ = తెలిసికొనియుందును, ఏతాదృశంబు= ఇటువంటిది అగు, త్రై...మిన్ - త్రైకాలిక = భూతభవిష్యద్వర్తమానకాలత్రయ సంబంధియగు, జ్ఞానంబు=తెలివియొక్క, కలిమిన్ = ఉనికిచేత, ఇమ్మేను = ఈ శరీరము, మాననీయంబుగదా = పూజ్యమేకదా, అంటేని = అంటివా, అది=అజ్ఞానము, జాత్యంబుదక్కన్ = జాతిప్రయుక్తముగాని, తపస్సత్యశమదమాది లబ్ధంబు - తపః = తపమును, సత్య=నిక్కమును, (సత్త్వమనికొందఱు) శమ = మనోనిగ్రహమును, దమ = బహిరింద్రియనిగ్రహమును, ఆది = మొదలగువానిచేత, లబ్ధంబు=పొందఁబడినది, కాదు, విషాది=ఎఱుకుది, భవిష్యదర్థంబులన్ = కాఁగలకార్యములను, చెప్పుచున్నది = వచించుచున్నది, అది=అగ్గది చెప్పునది, శుచియే = పవిత్రురాలా, (కాదనుట), కౌశికంబు = గూబయు, డబ్బు = ఒకానొక శకునపక్షి, ఆటి = ఒకజాతిబాతు (ఆడేలు లేక ఒక జాతిచేప.) గబ్బులుఁగు = కుక్కుభము (అడవికోడి - వీనిని గంపలతోఁదెచ్చి యమ్ముదురుగాన గబ్బులుఁ గని పేరువచ్చెను. "సీ....కుక్కుభంబు గబ్బులుఁగు గంపపులుఁగనఁగ, వఱలు..." ఆంధ్రభాషార్ణవము. ౨. ౧౭. గౌళి = బల్లి, కనుంబెంటి = జీలుగుపిట్ట (ఇది కాఁగల ప్రయోజనమును సూచించు నొకానొకపక్షి.) పైఁడిగట్టి = బంగారురంగువంటి రంగుగల నేత్రములుగల యొకపక్షి విశేషము. లోనగు = మొదలైన, తిర్యక్కులు = తిర్యగ్జంతువులు, భా...లు-భావిప్రయోజన = ముందటిపనులకు, సూచకంబులై = తెలియఁజేయునవియై, ఉన్నయవి = ఉన్నవి, అవి = ఆకౌశికాదులు, తపస్వ్యలే = తపస్సంపన్నములా, మావిజ్ఞానంబును = మావిన్నాణమును, అట్ల=ఆప్రకారమే, ఎట్లనినన్ = అది యేప్రకారమ్మనఁగా, నాస్తిక్యంబువలనన్ = నమ్మకములేకుండుటవలన, శాస్త్రంబులేదన్ = శాస్త్రములపట్ల, అధీతిబోధంబులు = చదువుట తెలియుటలు, తక్కన్ = తప్ప, ఆ...లు-ఆచరణ = ఆచరించుటయు, ప్రచారంబులు = ఆచరింపఁజేయుటలును, లేమిన్ = లేకుండుటచేత, ధర్మంబు, దూరంబు = మాకు లేదు, అది నిమిత్తంబుగాన్ = ఆదికారణముగా, ఇత్తెఱంగు ఎఱుంగక = ఈమార్గముఁదెలియక, భవోత్తారకంబు = సంసారోద్ధారంబు, కాదు, కావునన్ = కాఁబట్టి, క...ని-కలుష = పాపముచేత, రహిత = విడువఁబడిన, కాయంబునంగాని = శరీరముచేతఁగాని, కల్యాణంబు = మోక్షశుభము, లబ్ధంబుగాదు = లభింపదు, కావునన్ — కాఁబట్టి ఇ...బు-

ఇవ్విరూప = ఈవికృతరూపముగల, విగ్రహంబు = నాశరీరమును, అనుగ్రహంబునన్ = ప్రసాదముచేత, ఊడిపి = పోఁగొట్టి, కృతార్థున్ చేయు మని = ధన్యునిం జేయు మని, పాదంబుల వ్రాలి = పాదాక్రాంతుఁడై, పాటన్ = గానమందు, పాతికపాలేని=పాదాంశమైనను, ఈ వేయనినన్ = ఇయ్యవే యనఁగా, అతండు = ఆదాసరి, అదియును = ఆ పాతికపాలైనను, ఈలే నన్నన్ = ఇయ్యలే ననఁగా, పోనిమ్ము = పోనీ, ఈ ప్రభాత సమయంబునన్ = నేఁటిప్రాతఃకాలమందు, పా...నన్ - పాడిన = గానముసేసిన, చరమగీతంబైనన్ = కడపటిపాటయైనను, ఇచ్చి = ఒసంగి, ప్రపన్నుండన్ = శరణాగతుఁడను, అగునన్ను, అవిపన్నుం జేయు మని=ఆపదలేనివానిఁగాఁ జేయుమని. లేవకున్నన్ = పాదములపైనుండి లేవకుండిన, ప...డు ఐ - పరమదయా=ఉత్కృష్టదయ చేత, ఆర్ద్రుఁడై= చల్లనివాఁడై, అట్లకానిమ్ము, లెమ్మని, అతనిన్ = ఆరాక్షసుని, లేవనెత్తి, అ...బున్ - అత్తను = ఆరాక్షసశరీరముయొక్క, ప్రాప్తి = వచ్చుటయొక్క, ప్రకారంబున్ =రీతిని, సవిస్తరంబుగాన్, చెప్పు మనినన్, అభ్వాలదిండి = ఆమాంసభక్షకుండగురాక్షసుఁడు, దుఃఖార్తుండై = దుఃఖపీడితుండై, అవధరింపు మని, ఇట్లనియె.

* * * * * *

ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్పదునాల్గు నేర్చి వా
క్చండిమఁ జర్చ గెల్తు ఘట † శాసుల శ్రోతులఁ దప్పు వట్టుదున్
‡ ఖండల ముష్టిఁ విప్పఁ గని నవ్వుదు వెండి ప్రయోక్తల న్సుధీ
మండలిగ్రాంధికత్వ మవమానము సేయుదు జల్పవాది నై. 67

టీ. చోళభూమిన్ = చోళదేశమందు, ఒకయూరన్ =ఒకగ్రామమందు, ఉండుదున్ =నివసింతును, కళల్ =విద్యలు, పదునాల్గు = చతుర్దశసంఖ్యాకములగువాని, 'అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ' అనియును, అంగము లా అనుటకు, 'శిక్షా వ్యాకరణం కల్పో నిరుక్తం జ్యోతిషం తథా, ఛందశ్చేతి షడంగాని' అనియు ప్రమాణము. నేర్చి, ఘటశాసులన్ = తార్కికులను, (ఘటశాస్త్రులనుపాఠమున నిదేయర్థము), వాక్చండిమ = వాక్ప్రచండత్వముయొక్క, చర్చన్ = ఆక్షేపముచేత, గెల్తున్ = జయింతును, శ్రోతులన్ = యాగతంత్రజ్ఞులను, తప్పువట్టుదున్ = స్ఖాలిత్యములుపట్టుదును, వెండి = మఱి

* ఇంతవఱకు షష్ఠాశ్వాస మనియు నికనుండి సప్తమాశ్వాస మనియుఁ గొన్ని ప్రతులందుమాత్రమే కలదు. (కాని ప్రథమాశ్వాసము 90, ద్వితీయాశ్వాసము 100, తృతీయము 93, చతుర్థము 290, పంచమము 150, ఉండఁగా 65, 66 పద్యములతో రెండాశ్వాసములు రచింపబడిన వనుటకన్న నివి 137 నుగలిసి యేకాశ్వాస మనుటయే యుక్తము.

ఇచ్చటఁ గొన్ని ప్రక్షిప్తపద్యములు గలవు. వానిని ఆశ్వాసాంతమునఁ గనందగు. † శాస్త్రుల ‡ ఖండల ముష్టి విప్పఁగని నవ్వుదు వెండిప్రయోక్తలన్.

యును, ప్రయోక్తలన్ = షోడశకర్మాధికారులను, ఖం...ష్టి-ఖండల = ఖండకారికల యొక్క, ముష్టి=సంచికను, విప్పన్ = విప్పఁగా, కని=చూచి, నవ్వుదున్ = పరిహసింతును, సు...ము-సుధీ = విద్వాంసులయొక్క మండల = సమూహముయొక్క, గ్రాంథికత్వము = గ్రంథనిపుణతను, జల్పవాదినై = జయేచ్ఛచేత కథలను వాదించువాఁడనై, అవమానముసేయుదును.

వ. ఇన్నడవడిం బ్రభిన్నగండంబగు వేదండంబునుంబోలె మదాంధుండనై యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె నచ్చదువె పరబ్రహ్మంబై పెద్దలఁ జెనకి యోడియు సరియైతి ననియును సరిపోయి జయించితి ననియు నబద్ధంబు లాడి చిల్లర ప్రభువులం భ్రమియించుచుండి దీక్షితులం జూచి యియక్షు వొడమి ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోయి యప్పురంబున. 68

టీ. ఇన్నడవడిన్ = ఈనడతచేత, ప్రభిన్నగండంబు - ప్రభిన్న = మదముకాఱుచున్న, గండంబు = చెక్కులు గలది, అగు, వేదండంబునుంబోలె=ఏనుంగువలె, మదాంధుఁడనై = మదముచేత మత్తుఁడనై, అ...బ్ధిన్-అల్పవిద్యా = కొంచెపువిద్యయొక్క, లబ్ధిన్ = ప్రాప్తిచేత, విడువన్=మూఁటవిచ్చుటకును, ముడువన్=మరలమూఁటఁగట్టుటకును, వేసరని = విసువని, వీసంబు = వీసముకాసులుకల, రెడ్డియుంబోలెన్ = రెడ్డివాని వలెనే అచ్చదువె = నాకు వచ్చియున్న యాచదువే, పరబ్రహ్మంబై = చాలగొప్పదై, పెద్దలన్ = వృద్ధులను, చెనకి = ప్రసంగమునకుఁ గదలించి ఓడియున్ = అపజయము బొందియు, సరియైతి ననియున్=సమముగాఁ బ్రసంగించితి ననియు, సరిపోయి=వారితో సరియై, జయించితి ననియున్ = గెల్చితిననియును, అబద్ధంబులాడి = దబ్బరలాడి, చిల్లర ప్రభువులను, భ్రమియింపఁ జేయుచుండి, దీక్షితులంజూచి = ఆహితాగ్నులను గాంచి, ఇయక్షు=యజ్ఞముఁ జేయవలయునను కోర్కె, (యష్టు మిచ్ఛా ఇయక్షా - అని వ్యుత్పత్తి,) వొడమి = అంకురించి, ద్రవ్యభిక్షార్థినై = ద్రవ్యభిక్షను గోరినవాఁడనై, మధురకున్ = మధురాపట్టణమునకు, పోయి, అప్పురంబునన్ = ఆమధురాపట్టణమందు.

సీ. బహిఁవడ్డద్విజున కొల్పపుఁ బాచితం విడి
    పసిఁడికై తా వానిబంతిఁ గుడిచి
కలసి వణిక్పురోహితులతోడఁ బుణ్యాహ
    ముల బియ్యములకు నైకో మొత్తులాడి
శశి రవి గ్రహ జపస్నానాదికము లెల్ల
    దొరలవాకిండ్ల కేదొద్ద యిచ్చి

*పచ్చిబ్రత్తితో ల్బత్తి ॥ చుచ్చాల మెట్లొంది
కొనఁ దాన యూరెల్లఁ ॥ గుత్తపట్టి
తే. దర్భపోటులఁ దిని లేనితఱుల మైత్రి
నంటి పితృశేషము భుజించి ॥ యదియు నెడల
నక్కవాడల నఱకూళ్ళు ॥ మెక్కి మీఁద
వీనిశేఖర మొకతులార్త్విజ్యము కొని. 69

టీ. బ...కన్ - బహిపడ్డ=వెలివేయఁబడిన, ద్విజునకున్=విప్రునకు, అ...బు - అల్పపు = కొంచెమయిన, పాచితంబు = ప్రాయశ్చిత్తమును, ఇడి = పెట్టి, పసిఁడికై=ధనముకొఱకు, తాన్=తాను, వానిబంతిన్ = వాని పఙ్క్తియందు, కుడిచి = భుజించి, వ...డన్ - వణిక్=కోమట్లయొక్క, పురోధలతోడన్ = పురోహితులతో, కలసి = చేరుకొని, పు...కై - పుణ్యాహముల = కోమటిండ్ల పుణ్యాహవాచనముల యొక్క, బియ్యములకున్=తండులముకొఱకు, మొత్తులాడి=కలహించి, శ...లు ఎల్లన్ - శశి = చంద్రునియొక్కయుఁ, రవి = సూర్యునియొక్కయు, గ్రహ = గ్రహణముల యందుఁ జేయఁనట్టి, జప=జపములు, స్నాన = స్నానములు, ఆదికములెల్లన్ = మొద లగునవి యెల్ల, దొరలవాకిండ్లకే = ప్రభుద్వారములకే, దొద్దయిచ్చి = కొల్లయిచ్చి (దానములకొఱకై తాను జేసిన నవగ్రహజపము మొదలగునవి ధనికుల వాకిండ్లనే ధారఁబోసె ననుట), ప...లు - పచ్చి = ఆర్ద్రమగు, ఇఱ్ఱితోలు=కృష్ణాజినము, బత్తె చుచ్చాలమెట్లు=ఎనుము మేఁక ఆవు వీని వరుసలను, అందికొనన్ = దానముపట్టుటకై, తాన=తానే, ఊరెల్లన్ = ఆపట్టణమెల్లను, గుత్తపట్టి = గుత్తచేసి, (పచ్చిఱ్ఱితోల్పట్టి చిచ్చుల నని పాఠాంతరము. అట్లయిన పచ్చి జింకతోళ్ళం గ్రహించి వేసవికాలములయం దనియర్థము.), దర్భపోటులన్=నిమన్త్రణములయందు, తిని=భక్షించి, లేనితఱులన్= ఆ బ్రాహ్మణార్థములు లేని కాలములయందు, మైత్రిన్ = స్నేహముచేత, అంటి = చేరి, పితృశేషము = తద్దినపుఁగూడు, భుజించి = మెసవి, అదియున్ = ఆపితృశేషమును, ఎడలన్=దొరకక పోఁగా, అక్కవాడలన్ = పూఁటకూలియిం డ్లుండు వీథులయందు, అఱకూళ్లు=చాలిచాలని యర్ధాశనములను, మెక్కి=తిని, మీఁదన్ = అనంతరమందు వీని=ఈకార్యముయొక్క, శేఖరము = శిరోభూషణమగు ఒక...ము-ఒక=ఒకటియైన తులా = తులాభారముయొక్క, ఆర్త్విజ్యము = ఋత్విగ్భావము, (తులాభార దాన మనుట), కొని = గ్రహించి.

---

* పచ్చిఱ్ఱితోల్పట్టి చిచ్చుల.

తా. ఈపైనిచెప్పినవన్నియును బాహ్యహేతువులు గాన నింద్యము లయిన స్వార్థాతురత్వమును బట్టి యన్నియుం జేసియుండెను.

ఉ. ఇ ట్టొనగూర్చి వైశ్యునకు నిచ్చి చన న్మఱి పుచ్చి చౌకము
ల్వెట్టుచు వడ్డిలెక్క లటు వెట్టుచు ధారణవాసికై కొదల్
పెట్టుచు వాఁడు రేఁగి మఱి పెట్టుదుఁ బెట్ట ననంగఁ మిట్టఁ గూ
వెట్టుదు నిట్టు పోరఁ గని పెట్టుక యొక్కరుఁ డుండి వెండియున్. 70

టీ. ఇట్టు=ఈప్రకారము, ఒనగూర్చి=కూడఁబెట్టి, వైశ్యునకున్ = కోమటికి, ఇచ్చి=వడ్డికిచ్చి, చనన్ = మరల నూరికిఁ బోవుటకై, మఱి=పిమ్మట, పుచ్చి = తీసికొని, చౌకముల్=ఉడ్డలు, (నాలుగేసి యనుట) పెట్టుచున్=ఇడుచు, వడ్డి లెక్కలు, అటు పెట్టుచున్=ఆప్రకారము వేయుచును, ధారణవాసికై=బియ్యము మొదలగువాని ధర వారడికై, కొదల్పెట్టుచున్ = తక్కువలు సేయుచు, వాఁడు=ఆకోమటి, రేఁగి=చెల రేఁగి, మఱి=పిమ్మటను, పెట్టుదుఁ బెట్ట ననంగన్=ఇత్తునీయనని చెప్పఁగా, మిట్టన్ = రచ్చ మిట్టయందు, కూపెట్టుదును=కూఁతలు పెట్టుచును, ఇట్టుపోరన్ = ఇట్లు పోరుచుండఁగా, ఒక్కరుఁడు = ఒకమానిసి, కనిపెట్టుకయుండి = కాచుకొనియుండి, వెండియున్ = మరలను.

తా. ఇట్లు కూడఁబెట్టిన ధనము కోమటికి వడ్డికిచ్చి నే నమ్మిన బియ్యము మొదలగు వాని ధర వారడికొఱకును జిల్లరవడ్డికొఱకును బీకులాడి రచ్చలలోఁ జెప్పుకొను చుండఁగా నొక్క దొంగ కనిపెట్టుకొని యుండెను.

సీ. వెలివాడఁ బనిక్రొత్తోమలకవా ల్గొని నూనె
యిడి తంగెడాకుగోల్పెడు తహాతహ
కూర్చుంబు గొరిగించుకొని యుష్ణతోయంపు
టంగడిఁ దలయంటుకాడి తడవు
వంట పుట్టింటి కొప్పంటికంటెను బాలు
పెరుఁగు నేఁ గూర లంపెడు తెగువలు
సంబెళ విదలించి తాంబూలదళ పూగ
నివహంబుఁ జాలంగ నించు నుబ్బు
తే. బ్రహ్మచారిభుజంబు మాత్రకు సడింపఁ
బ్రాలు నాలికి మేలుచీరలు గొనియెడు
సంభ్రమంబును బెఱపాంథజనులఁ బయన
మడుగు ప్రశ్నంబులను మత్ప్రయాణ మెఱిఁగి. 71

టీ. వెలివాడన్ = చండాలవాటికయందు, పని = పనితనముగల, క్రొత్తమలక
వాల్ = క్రొత్తపాదరక్షలు, కొని=వెలచేసి, నూనెయిడి = నూనెఁబూసి, తంగెడాకు,
కట్టెడు = ఆపాదరక్షలకుఁగట్టునట్టి, తహతహ=త్వరపాటును, కూర్చంబు = కనుబొమల
సందు, 'కూర్చమస్త్రీభ్రువోర్మధ్యమ్' అని నిఘంటువు. గొరిగించుకొని=క్షౌరముఁ జేయించు
కొని, (సొగసునకుఁ గనుబొమలసందుమాత్రమే గొరిగించుకొనె ననుట,) ఉష్ణతోయంపు=
వేడినీరమ్మైడు, అంగడిన్ = దుకాణమందు, తలయంటుకాడి = అభ్యంగము సమ
యమునైన, (తలయంటుకాఁడు అనుపాఠమున నభ్యంగముఁ జేసికొని తిరిగెడు,) తడవు=
ఆలస్యమును, వంటపుట్టి = వంటఁజేసిపెట్టెడు పెద్దమ్మయొక్క, ఇంటికిన్ = గృహ
మునకు, ఎప్పటికంటెను = పూర్వముకంటెను, పాలు పెరుఁగునేగూరలు = పాలును,
పెరుఁగును, నేయిని, శాకములును, అంపెడు = పంపునట్టి, తెగువలు=ఔదార్యములను,
సంబెళ = వక్కాకుపెట్టె, విదలించి = విప్పి, తాంబూలదళ = తమ్ములపాకులయొక్క,
పూగ=పోకలయొక్క, నివహంబున్=సమూహమును, చాలంగన్ = చాలునట్లు, నించు=
నిండించునట్టి, ఉబ్బు = ఉత్సాహమును, బ్రహ్మచారి = శిష్యునియొక్క, భుజంబు =
మూపుననున్న, మాత్రకున్ = అసిమికి, సడింపుఁబ్రాలు = దంపుడుబియ్యమును, ఆలి
కిన్=భార్యకుఁగాను, మేలుచీరలు = మంచిమంచి కోకలను, కొనియెడు = గ్రహించెడి,
సంభ్రమంబు = చిడిముడిపాటును, పెఱ = ఇతరులగు, పాంథజనులన్ = మార్గస్థులను,
పయనమడుగు=ప్రయాణ మెప్పు డనియడిగెడు, ప్రశ్నంబులను=ప్రశ్నలచేతను, మత్ప్ర
యాణము = నాపయనము, ఎఱిఁగి = తెలిసికొని.

తా. పైనిచెప్పినప్రకారము ప్రయాణసన్నాహము గాఁగా దొంగ లెస్సఁగాఁ
దెలిసికొనియుండెను.

క. హత్తుకొని యొక్కకొందఱ
నత్తెరువుం గట్టఁ బనిచి యందఱ క్రియఁ దాఁ
దిత్తొకటియుఁ గొని తే మఱి
యుత్తర ముత్తర మటంచు నొకప్రొద్దుకడన్. 72

టీ. హత్తుకొని = వెంబడించికొని, ఒక్కకొందఱన్ = మఱికొందఱన్, అత్తెరు
వున్ = ఆమార్గమును, కట్టఁబనిచి = అఱికట్టఁబంపి, అందఱ క్రియన్ = అందఱివలెనే,
తాన్ = ఆదొంగ, తిత్తి = సంచి, ఒక్కటియుఁగొని తేన్ = ఒక్కటి తీసికొనిరాఁగా,
మఱి = అనంతరమందు, ఉత్తరముత్తరమటంచున్ = పోవలసినదుత్తరదిశయని, ఒకప్రొద్దు
కడన్=ఒకప్రొద్దువేళను. ('తిత్తియొకటికొని' అనుట సాధువు.)

తే. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి
వారు సన నేను ముడిమోపు వటువకెత్తి
పోవ వాఁ డిందు రం డని త్రోవ యడవిఁ
బెట్టి యొకవాఁగు డిగ నీల వెట్టుటయును. 73

టీ. లేచిపోవంగన్ = లేచిపోవుచుండఁగా, తత్తఱ మేచి = త్వరపాటతిశయించి, తోడివారు చనన్ = తోడిమార్గస్థులుపోఁగా, నేను, ముడిమోపు=మూటబరువు, వటువకెత్తి=బ్రహ్మచారికెత్తి, పోవన్ = పోవుచుండఁగా, వాఁడు=ఆచోరుఁడు, ఇందు రం డని= ఇటురం డనుచు, త్రోవ=మార్గమును, అడవిఁ బెట్టి = అడవిలోఁ బెట్టి, ఒక వాఁగు డిగన్= ఒక వంక దిగఁగానే, ఈలవెట్టుటయును = ఈలవేయఁగానే, (జార చోరు లీలవెట్టుట వారిసంజ్ఞ).

క. అఱచేతిప్రాలు గనున
త్తఱిఁ బడె నొకయంపకట్టె దానికి నిలువం
బిఱుబిఱ్ఱున ఱాలు వడెం
దెఱపియుఁ గనలేక సాతు దిరుగంబడియెన్. 74

టీ. అఱచేతిప్రాలు = అఱచేతిగీఱలు, కనున త్తఱిన్ = చూచెడుకాలమందు, (అరుణోదయకాల మనుట.), ఒక యంపకట్టె = అంపకోల, పడెన్ = వ్రాలెను, దానికిన్ = ఆయంపకఱ్ఱకు, నిలువన్ = మార్గమునడువకనిలువఁగా, బిఱుబిఱ్ఱునన్ = బిరుసుబిరుసుగా, ఱాలువడెన్ = పాషాణములుపడెను, సాతు = పథికసమూహము, తెఱపియున్ =పోవుటకుసందును, కనలేక= తెలియక, తిరుగంబడియెన్ = వెనుదిరిగెను.

*

మహాస్రగ్ధర

కవిసె న్గల్పాంతజంతు గ్రసనభృశబుభుక్షాత్వరత్ర్యక్షపార్శ్వ
ప్లవమానోత్పాతభూత ప్రకరపటిమ హా లాహలస్పర్ధిహేతి
చ్ఛవిరేఖానేక రాహూ చ్ఛలితరవులు రక్తశ్ఛమూజిత్ప్రళింద
ప్లవబృందంబుల్వనిస్బకల్వడిఁ బోడుపాడుమకన్పల్కులు స్సుల్కులు
స్రాన్.

టీ. కల్పాంత=ప్రళయకాలమందు, 'క్షయఃకల్పాంత ఇత్యపి.' అని యమరము. జంతు = ప్రాణులయొక్క, గ్రసన = భక్షణమందు, భృశ = మిక్కిలియగు, బుభుక్షా = ఆఁకలియొక్క, 'భోక్తు మిచ్ఛా బుభుక్షా', త్వర = వేగము గలిగిన, త్ర్యక్ష =

*వ. అంశ.

ఫాలాక్షునియొక్క, పార్శ్వ = ప్రక్కలయందు, ప్లవమాన = పరువులెత్తుచున్న, ఉత్పాత = భయంకరములైన యుల్కాదులతోఁ గూడిన, భూత = భూతములయొక్క, ప్రకర = సమూహముయొక్క, పటిమన్ = సామర్థ్యమువంటి సామర్థ్యముతో, హాలాహల = కాలకూటముతోడ, స్పర్ధి = కలహించెడు, హేతి = ఆయుధములయొక్క, ఛవి = కాంతులయొక్క, రేఖా = పఙ్క్తు లనియెడు, అనేక = పెక్కులైన, రాహు= రాహుగ్రహములచేత, ఉచ్చలిత = చలింపఁజేయఁబడిన, రవులు = సూర్యుఁడు గలిగి నట్టి, రక్షశ్చమూ = రాక్షససేనను, జిత్ = జయించుచున్న, పుళింద = కిరాతకుల యొక్కయు, ప్లవ=చండాలురయొక్కయు, బృందంబుల్ = సమూహములు, వనిన్ = అడవియందు, బల్వడిన్ = మిక్కిలివేగముగా, పొడుపొడు మన్ = పొడుపొడు మని యెడు, (ఇది యామ్రేడిత ప్రార్థనార్థకము), పల్కులున్ = మాటలును, ములుకులున్=బాణములును, రాన్=రాఁగా, కవిసెన్=చుట్టుకొనెను.

తా. ప్రళయకాలరుద్రుని సూరెలఁ బాఱుతెంచుచున్న మహాభూతములవలెఁ బటిమ గలిగి యనేక రాహువులనెడు బుద్ధిచేత సూర్యుఁడు భయపడునట్టి యాయుధ కాంతులు కాలకూటమును మీఱుచుండఁగా ననేక కిరాతకులును జండాలురును గుంపులు గూడుకొని వాఁడితూపు లేయుచుఁ బొడుపొడు మని పల్కుచు నలుదిక్కులఁ గ్రమ్ముకొనిరి. 'భూత-గ్లపన' అనియు, 'ప్లవబృందంబుల్ వనిన్ - బల్వడి' అనియు వే. దిద్దుబాటులు. దిద్దుట అనవసరము.

వ. ఇట్లు చెట్లు వెడలి విండ్లు వంచుకొని ముంచుకొను నన్నల్లప్రజం
జూచి హల్లకల్లోలంబై విఱుగంబడు నెడ. 76

టీ. ఇట్లు=ఈప్రకారము, చెట్టువెడలి = అడవిలోనుండి వెడలివచ్చి, విండ్లు = ధనువులను, వంచుకొని=ఎక్కుపెట్టివంచి, ముంచుకొనుచున్న = మీఁదఁబడుచున్న అన్నల్ల ప్రజన్ = ఆ కిరాతసంఘమును చూచి 'క. ఏలలఁ బాడుచుఁ దగవిలు, గోలలఁగొని నల్లప్రజలు గుములై నడువన్' అని వేంకటనాథుని పంచతంత్రము. (౨. ౧౮౭) హల్లకల్లోలంబై=పెద్దరంతై, విఱుగంబడు నెడన్=విఱిగిపోవునప్పుడు.

సీ. పసలేదు నిలరోయి ౹ పాతకులా రని
దేవాయుధంబులు ౹ బూవువారు
పైఁడిబొసముఁ జెట్లఁ ౹ బడవైచి [1]దుడ్డుపె
ట్లకుఁ బాఱుచునె యొలె ౹ లైవ్చువారు
బరువు డించి కటారికి పరుఁజించి నిల్పి యిం
దెందు వచ్చెద రని ౹ యెదురువారు

1. దుడ్డుఁ బెట్లకుఁ బాఱుచునె యొడల్ డాచువారు,

వస్త్రంబు గొండు దేవర యోయి యిది చన్నఁ
బస్తని దయపుట్టఁ బలుకువారు
తే. కలవి మామూఁక నిప్పింతుఁ దోలఁగుఁ డొకటి
యాఁడుదానిఁ జేనంటకుఁ డనుచుఁ బెద్ద
తనము నభిమానమును దెంపు గనఁగఁ బలికి
నిలిపి దోఁపిచ్చువారునై తొలఁగి రపుడు. 77

టీ. పసలేదు=పలువంది లేరు, (దొంగలు గొంచె మనుట.) పాతకులారా = ద్రోహులార, నిలరోయి=నిలువుఁడోయి. అని, దేవాయుధంబులు=పాషాణములును దుంట కట్టెలును, (ఇక్కడ దేవశబ్దమునకు యజ్ఞ మని యర్థము చేసి దాని యాయుధములు దారుమయములుగాను పాషాణమయములుగా నుండును గనుక రాలును దుంటకట్టెలు ననవచ్చును.), ఊవువారు=విసరువారును, పైఁడిబాసముగ్ = బంగారు మొదలగునది, (పైఁడిబాస మనునది నానుడుమాట), చెట్లఁగ్=వృక్షములయందు, పడవైచి=పాఱవైచి, దుడ్డుపెట్లకుగ్=దుడ్డుకఱ్ఱలదెబ్బలకు, పాఱుచునే=పరువిడుచునే, ఒలెగ్=వస్త్రములను, వైచువారు=పాఱవేయువారును, బరువు=తామెత్తుకొన్నబరువును, డించి = దిగువదించి, కటారి పరుఁజించి=కటారి యమర్చుకొని, నిల్చి, ఇం దెందు వచ్చెదరని, ఎదురువారు=ఎది రించెడువారును, వస్త్రంబుఁగొండు=ఈబట్టను దీసికొనుఁడు, ఇది=ఈమాట, దేవరయో యి=దేవతయోయి, చన్నగ్=ఇదిపోయినట్లాయెనా, పస్తు=ఉపవాసముండవలసివచ్చును, అని, దయపుట్టగ్ = దయగలుగునట్లు, పలుకువారు = మాటలాడెడువారును, మా మూఁకగ్=మాగుంపునందు, కలవి=కలిగినవస్తువులు, ఇప్పింతుగ్ = ఈఁజేసెదను, తొలఁ గుఁడు=తొలఁగిపొండు ఒకటి=ఒకటి వినుఁడు, ఆఁడుదానిగ్ = స్త్రీని, చేనంటకుఁడు = చేతఁ దాఁకవలదు, అనుచుగ్ = ఇట్లని, పెద్దతనముగ్ = (ఆగుంపులోఁ దమకుఁగల యధికార మనుట) అభిమానములు, (స్త్రీలయెడలఁ గల పరు వనుట), తెంపు = తెగువ, సొమ్ములు పోయినఁ బోవుఁగాక స్త్రీలను దాఁకకున్న మంచి దని తలంచుట), కనఁగగ్ = తెలియునట్లు, పలికి=చెప్పి, నిలిపి=గుంపును నిలువఁజేసి, దోఁపిచ్చువారునై=చూఱనొసఁ గువారై, తొలఁగిరి=విముఖులైరి, అపుడు.

సీ. తొడువింటివాఁడుసన్నద్ధుఁడై పోవక యెదు
ర్పడువాండ్రఁ దోడిబడఁ బదరి పొడిచి
పిసుఁ గీక పెసఁగినఁ బెద్ద నొంపక యెట్టఁ
బాఁకించి చేఁ గలపాటి *నాఁచి
యాయితంబై చించుకరిగెడువాఁ డేటు
లవి మీఁతె చన్న వెక్కదవులు టుడిగి

* దోఁచి.

పొదవు చే లేకయ ౯ ఫుటఫుటయును నైన
వాని శోధింప నవ్వలికిఁ బనిచి
తే. పొదలఁ దూఱిన నీటెచాపుల వెడల్చి
కట్టుబట్టలు గొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి గనపరాకులు నిగిడ్చి
చెప్పుటట్టలు శోధించి ౯ సిగలు విప్పి. 78

టీ. తోడువింటివాఁడు=అంబుదొడిగిన విల్లుగలవాఁడు, చన్దోవఁ=పోయెడు త్రోవను, పోవక = వీఁగక, ఎదుర్పడువాండ్ర = ఎదురైనవారిని, తోడఁబడఁ = తొట్రుపడునట్లు, పదరి = హుంకరించి, పొడిచి, పిసుఁగు=పీసుఁగు, (లోభియనుట.), ఈక = తనసొమ్మియ్యక, పెనఁగినఁ = పెనఁగులాడఁగా, పెద్ద=మెండ్లుగాను, నొంపక= నొప్పింపక, ఎఱ్ఱఁ = నెత్తురును, పాఱించి=కాఱునట్లు పొడిచి చేగలపాటి=చేతనున్న మాత్రము సొమ్ము, నాఁచి=అపహరించి, ఆయితంబై = ఆయత్తపడినవాఁడై, చించుక= గుంపును చించుకొని, అరిగెడువాఁడు, = పోవునట్టివాఁడు, అవియేటులు = ఆదొంగల ప్రహారములను, మీఱి = అతిక్రమించి, చన్నఁ = పోయినను, వెఁదవులుట = వెంబడించుట, ఉడిగి = మాని, (మార్గస్థుఁ డెవ్వండేని గుంపుఁ జించుకొనిపోఁగా దొంగలు వానిఁ దఱుమ రనుట.), పొదవు = ద్రవ్యము, చేలేకయ=చేతలేకయే, ఫుటఫుటయును నైన వానిఁ = బలిసిలావైనవాని, శోధింపఁ = వానిదాఁపున సొమ్ములు చూచుటకు, అవ్వలికిఁ=ఆవలికి, పనిచి=పంపి, (బలముగలవాఁడు గుంపులోనున్నవాని నవ్వలికి దొంగలు పంపిరనుట), పొదలఁదూఱినఁ = కొందఱు పొదలోఁదూఱఁగా, ఈటెచాపులఁ = ఆపొదలమీఁదికిఁ బొడిచెదమని ఈఁటెలు చాచుటలచేత, వెడల్చి = వారివి బయలికి రప్పించి, కట్టుబట్టలు=కట్టుకొన్న వస్త్రములు సైతము, కొని=గ్రహించి, ప్రాఁతబట్ట= జీర్ణవస్త్రమును, దయను=దయచేత, గోఁచులకుఁ=కౌపీనములకుఁగా, ఇచ్చి = ఒసఁగి, *గనపరాకులు=గన్నేరాకులవంటి యమ్ములయలుఁగులను, నిగుడ్చి = లోపలదూర్చి, చెప్పుటట్టలు = పాదరక్షలయట్టలు, శోధించి = వెదకి, సిగలు = జుట్టు, విప్పి, (మార్గస్థులు చెప్పుటట్టల సందులను సిగలయందును సొమ్ములు దాఁచియున్నా రని దొంగలు వానినెల్ల శోధించి రనుట).

వ. ఇట్లు పాటచ్చరులు పెచ్చువెరిఁగి విచ్చలవిడి నుచ్చావచంబులగు సార్థంబు నర్థంబు లపహరించు సంకులంబున. 79

టీ. ఇట్లు = ఈవిధముగా, పాటచ్చరులు=చోరులు, 'ప్రతిరోధిపరాస్కంధి పాటచ్చర మలిమ్లుచా' అని యమరము. పెచ్చువెరిఁగి = చెలరేఁగి, విచ్చలవిడిఁ =

* గనవరాకులు; గనిపరాకులు. (కనపరాకులు అని బ్రౌను.)

స్వేచ్ఛచేత, ఉచ్చావచంబులగు = అనేకవిధములగు, 'ఉచ్చావచం నైకభేద' మ్మని యమరము. సార్థంబు = బాటసారులయొక్క, అర్థంబులు = ధనములు, అపహరించు = దోఁచుకొనెడు, సంకులంబునన్ = సందడియందు.

సీ. కటినుండి చనుమొఱకు గడిగాఁగ బిగియించి
        కట్టిన నిడు నీలికాసె మెఱయఁ
బిల్లిగడ్డము మించఁ బెరిఁగి మీసలు కుక్షి
        గోళంబుమీఁద నుయ్యాల లూఁగ
బూఁది బ్రుంగిన మొగంబున వడిఁగట్టుమై
        నపుమైలఁ ప్రాఁజాఁదునాఁ జెలంగఁ
జిటిప్రేలి పూసపైఁ ఘటియిల్లు వెడపట్టు
        చిమ్ముల సురియ డాలుమ్మరముగ
తే. నూరనుండియుఁ గనుపెట్టుకొనుండువాఁడు
        తప్పిపోఁ నన్ను డబ్బాటుతోఁ దాఁ బొడగని
        యట్టివేళఁ గాకశ్మశ్రు వనెడు నొక ప్ర
        చండ చండాల చోరభటుండు తఱిమి. 80

టీ. కటినుండి = పిఱుఁదుదగ్గఱనుండి, చనుమొఱ = ఱొమ్ము, గడిగాఁగన్ = హద్దుగా, బిగియించి = బిగించి, కట్టిన, నిడు = పొడువైన, నీలికాసె = నీలిదట్టి, మెఱయన్ = ప్రకాశింపఁగా, పిల్లిగడ్డము = పిల్లిగడ్డమును, మించన్ = అతిశయించునట్లు పెరిఁగి, మీసలు = మీసాలు, కుక్షిగోళంబుమీఁదన్ = గుండ్రని కడుపు మీఁద, ఉయ్యాల లూఁగన్ = డోలాయమానము లగుచుండఁగా, బూఁదిన్ = తానుబూసికొన్న బూడిదచేత, బ్రుంగిన = కప్పఁబడిన, మొగంబునన్ = ముఖమందు, వడిఁగట్టు = వడియఁగట్టిన, మైనపుమైల = మధూచ్ఛిష్టమాలిన్యము, ప్రాఁజాఁదునాన్ = ప్రాఁతచాఁదు చుక్కయను నట్లు, చెలంగన్ = ఒప్పఁగా, (వడియఁగట్టిన మైనపుమైలను జాఁదుచుక్కవలెఁ బెట్టు కొన్నాఁ డనుట), చిటిప్రేలి = కనిష్ఠికాంగుళియొక్క, పూసపైన్ = గనుపుమీఁద, ఘటియిల్లు = సంగతమైన, వెడపట్టు = దసిలిగాఁబట్టుటయొక్క, చిమ్ముల = విసరుటలు గల, సురియ = సురకత్తియొక్క, డాల్ = కాంతి, ముమ్మరముగన్ = అతిశయిల్లఁగా, ఊరనుండియున్ = నేను వెడలిన గ్రామమునసుండియును, కనుపెట్టుకొనుండువాఁడు = వేచి యున్నవాఁడు, తప్పిపోన్ = తప్పించుకొనిపోఁగా, నన్ను, డబ్బాటు = అదాటున, (హఠాత్కారముగా ననుట), తాన్ = ఆమొదలిచోరుఁడు, పొడగని = గుఱుతుఁ జూచి, అట్టివేళన్ = ఆసమయమందు, కాకశ్మశ్రు వనెడు = కాకశ్మశ్రు వను పేరుగల

ఒక = ఒక్కఁడైన, ప్రచండ = మిక్కిలియుద్దండుఁడైన, చండాల = మాలఁడైన, చోర = దొంగయగు భటుండు = బంటు, తఱిమి = వెంబడించి.

చ. కవ వటు డించి యేఁగునుకఁగా సురెఁ గొంకులఁ దార్చి కూలుడు
న్నివిడిన బొజ్జపై మిగులు నిద్దపు దోవతి దట్టి డొల్లిరాఁ
దివిచి పెనంగ వల్లువముఁ ద్రెంచి యనంతుని గంట్ల కూనపుం
జెవులుగ గౌదకట్టు [1]గసెచేరుల టెక్కియు దోఁపునొల్చి పోఁ. 81

టీ. కవ = నాకు జతయగు, వటున్ = బ్రహ్మచారిని, డించి = డిగ్గవిడిచి, ఏన్ = నేను, గునుకఁగాన్ = పరుగెత్తఁగా, సురెన్ = వానికత్తిని, కొంకులన్ = నాజాను సంధులయందు, తార్చి = అంటవ్రేసి, (క్రొంకులఁ గూర్చి యని కొందఱండ్రు), కూలుడున్ = క్రిందఁబడఁగానే, నివిడిన = నిగిడినట్టి, (పై కుబికినట్టి యనుట), బొజ్జపైన్ = వ్రేలెడుకడుపుమీఁద, మిగులు = వ్యాపించియున్న, (ముల్లె యున్న దని తెలియునట్లుబ్బుకొనియున్న దనుట). నిద్దపు = స్నిగ్ధమగు, దోవతి = దోవతియొక్క, దట్టి = కట్టును, డొల్లిరాన్ = జాఱివచ్చునట్లు, తివిచి = ఈడ్చి, పెనంగన్ = నేను పెనఁగులాడఁగా. వల్లువము = వరహాలముల్లె, త్రెంచి = తెగఁగోసికొని, అనంతుని గంట్లకున్ = కుట్టుపోఁగులకుఁ బైగానున్న గణుపులవఱకు, (నాగుఁబడిగపోఁగులుగల బొందలవఱకనియునుఁ జెప్పవచ్చును.) కూనపున్ = తెగిపోయినట్టి, చెవులుగన్ = చెవులు గలుగునట్లుగా, (చెవులు డెగునట్లుగా బోఁగులు తెంపినాఁ డనుట.) గౌదకట్టు = చెంపలను మూసికట్టిన కట్టు. "గీ. చెంపలను మూసి కట్టుట చెలఁగు గౌద,కట్టనంగను......" ఆంధ్రభాషార్ణవము. 3-32," కసెచేరుల = బొందెచేరులుగల, టెక్కియున్ = కుళ్లాయియు, దోఁపు నొల్చి = దోఁచుకొని, పోన్ = పోవుచుండఁగా.

క. నోరిసని నుండ కే నో
రోరి యకట మా సమీపపుటూరనె మనియున్
దూరము వోయితివే సొ
మ్మేరీతిని నీకు దక్కునే కానిరా. 82

టీ. నోరిసనన్ = నోటిశనిచేత, ఉండక = ఊరకుండక, ఏను = నేను, ఓరోరి, (ఇది నీచసంబుద్ధి), అకట = అయ్యో, మా = మాయొక్క, సమీపపు = దాఁపున నున్న, ఊరనే = గ్రామమందే, (తములపాకు మొదలగు పదములకువలె పుగాగమము), మనియున్ = బ్రదికియుండియు, దూరము వోయితివే = దూరమేఁగితివా, సొమ్ము = ఈధనము, ఏరీతిని = ఏవిధముచేతనైనను, నీకు దక్కునే = నీకు నిల్చియుండునా, కానిరా = కానిమ్మురా.

---

1. గల.

* తే. అనిన నలఁతిగఁ గోల్పోక * యతఁడు రెడ్డి
రాజుఁ గను నని కోదయుఁ దీర్పంగ మగిడి
యంత పరియును పైప్రజ * కలికి పాఱి
పోవ వాఁడును వెడపోట్లు * వొడిచి చనియె. 83

టీ. అనినన్ = ఇట్లనఁగా, అలఁతిగన్ = కొంచెముగా, కోల్పోక = నశింపక, అతఁడు=ఆయన, రెడ్డి=పటేలును, అనఁగా గ్రామాధికారిని, రాజున్=ప్రభువును, కను నని=చూచు నని, కోదయున్=కోణఁతయును, తీర్పంగన్ = తీర్చుటకై, (చంపుటకై యనుట.), మగిడి=మరలివచ్చి, అంత = సమస్తమైన, పరియును = తనతోడిగుంపును, పైప్రజకున్ = పైఁగావచ్చెడువారికి, అలికి=భయపడి, పాఱిపోవన్ = పరువెత్తఁగా, వాఁడును=ఆకాకశ్మశ్రుండును, వెడపోట్లు=తప్పుపోట్లు, పొడిచి, చనియెన్=పోయెను.

ఉ. అంతటఁ జేరువఁ బెద్దెరువునం దరుదెంచు పిఱిందిమంది మ
త్కాంత సహోదరుండును నొకం డరుదెంచుచు సాతు వడ్డ వృ
త్తాంత మెఱింగి నన్నరసి * తాఁ గని యార్తి నొకండు దా నతి
శ్రాంతుని నన్నుఁ గావట దిసంతులు గొట్టుచు మోచు కేఁగుచోన్.

టీ. అంతటన్ = తదనంతరము, చేరువన్ = సమీపమందు, పెద్దెరువునందున్ = రాజమార్గమందు, అరుదెంచు=వచ్చుచున్న, పిఱిందిమందిన్ = వెనుకటిప్రజయందు, మత్కాంత సహోదరుండును = నాభార్యతోడఁబుట్టినవాఁడును, ఒకండు = ఒకపురుషుండు, అరుదెంచుచున్ = వచ్చుచును, సాతు = సార్థము, (పథికసమూహ మనుట.), వడ్డ=పొందిన, వృత్తాంతము = వార్తను, ఎఱింగి = తెలిసి, నన్నరసి=నన్ను విచారించి, తాన్=తాను, కని=చూచి, ఆర్తిన్ = దుఃఖముచేత, తా నొకండును = నామఱఁది యొక్కఁడే, అతిశ్రాంతునిన్=మిక్కిలిబడలియున్న, నన్ను, కావటన్ = కావటిబుట్టయందు, మోచుక = మోచికొని, దిసంతులుగొట్టుచున్ = నానేరములు పరిహాసముగా నెన్నుచు, (మఱఁదిగావున దుఃఖమందును దన యవివేకమునకుఁ బరిహాసించె ననుట), ఏఁగుచోన్=పోవుచుండఁగా.

తా. అంతట సమీపమందలి పెద్దబాటను వచ్చెడు కొంతమందిలోఁ గలిసి నా యిల్లాలి తోఁబుట్టినవాఁడు వచ్చుచుండి త్రోవను దోఁపు వడిన ప్రజవార్త విని నన్ను విచారించి వచ్చి చూచి వగచి మిగులఁ బడలియున్న నన్నుఁ గావటిలోఁ నునిచికొని తా నొక్కఁడును మోచికొనుచుఁ నన్ను నేరము లెన్నుచుఁ బోయెను.

---

* అనిన లాఁతుగఁ గోల్పోక యతఁడు రాజు, రెడ్డి గను నని కోదయుఁ దీర్పంగ మగుడి. (శ. ర. పా. పాఠాంతరము.)

సీ. కొంగవాల్నఖుతుల లంగుళులఁ బట్టుక జబ్బ
లంటఁ గుట్టిడ వెజ్జు నరయువారు
తలఁ బడ్డగుదియదెబ్బలఁ బాఁత మసి యిడి
యంబలి గంజి యిండ్ల నడుగువారు
తమసేగిఁ జెప్పుకో దయమీఱ విని చీరఁ
జించిచ్చువారి దీవించువారు
నొలివడ్డ నెపమునఁ గలలేని సిరిఁ జెప్పి
చుట్టలపైఁ దాడి వెట్టువారు
తే. నైన పాంథులచేతఁ గ్రందైన యూళ్ల
జాడగా నిటఁ దెచ్చియీనీడ డించి
పాఱు నీ రానఁ బోవ నొవ్వారి మగిడి
వచ్చునాలోన నీ రూపు వచ్చె నాకు. ౨౫

టీ. కొంగవాల్ = కొంగవాలుగావంకలైన, నఖుతులు = గాయములు, (కొంగవాలనఁగా సూలవాని చేతి కత్తి. కం. 'సురియాఖు చేతికత్తికి, నరులందఱు పేరువెట్టినారు ధరిత్రి, స్మరి కొంగివాలనంగను, దిరుమలపై నుండు దేవదేవ ముకుందా' అని దేశ్యనామార్థకోశమందుఁ జెప్పఁబడియున్నది: కాన, నట్లైనఁ గొంగవాల్ = ఆకత్తిచేతనైన, నఖుతులు = గాయము లని చెప్పునది.) అంగుళులన్ = వ్రేళ్లచేత, పట్టుక = బిగఁబట్టుకొని, జబ్బలను = తుంట్లను, అంటన్ = కదిసికొనునట్లు, కుట్టిడన్ = కుట్టుటకై, వెజ్జున్ = వైద్యుని, అరయువారు = వెదకెడువారును, తలన్ = శిరమునందు, పడ్డ = పడినట్టి, గుదియ = దుడ్డుకఱ్ఱలయొక్క, దెబ్బలన్ = గాయములయందు, పాఁతమసి యిడి = గుడ్డకాల్చినమసి యదిమి, అంబలి, గంజి, ఇండ్లన్ = ఇంటింటను, అడుగువారు = యాచించువారును, తమసేగి = తమకుఁగలిగినకీడును, చెప్పుకోన్ = తెలియఁజేసికొనఁగా, దయ = కృప, మీఱన్ = అతిశయించునట్లు, విని = ఆకర్ణించి, చీరన్ = వస్త్రమును, చించిచ్చువారిన్ = చించియొసంగెడువారిని, (చించిచ్చు, 'చించియిచ్చు', క్వార్థ ఇత్తునకుసంధి) దీవించువారు = ఆశీర్వదించెడివారును, ఒలివడ్డ = దోఁపిడిపడిన, నెపమునన్ = వ్యాజముచేత, కల = కలిగినట్టియు, లేని = లేనట్టియు, సిరిన్ = తమసంపదను, చెప్పి, చుట్టలపైన్ = బంధువులమీఁద, దాడివెట్టువారు = దండువెడలెడువారును, (తాము దోఁపుడుపోయినసాకుచేతఁ గొంచెము పోయినను గొప్పగాఁ జెప్పుకొనుచుఁ జుట్టాల యిండ్లమీఁదికి భోజన వస్త్రాదులకుఁ బోయి రనుట), ఐన = ఈరీతి గలిగిన, పాంథులచేతన్ = దోఁచఁబడినమార్గస్థులచేత, క్రందైన = సందడిగల, ఊళ్ల

జాడగాన్ = గ్రామములమీఁదుగా, ఇటఁదెచ్చి = నామఱఁది నన్నిక్కడికిఁ దెచ్చి, ఇన్నిడ డించి = ఈమఱ్ఱిచెట్టునీడను గావడిదించి, పాఱు = ప్రవహించెడు, నీరు = ఉదకమును, ఆనఁబోవన్ = పానముసేయఁబోఁగా, నోవ్వారి = నొప్పిఘనమై, మగిడివచ్చు నాలోనన్ = తిరిగి వచ్చునంతలోనే, ఈరూపు = ఈబ్రహ్మరాక్షసరూపము, నాకు, వచ్చెను.

వ. కయ్యంబునఁ బాఱఁబాఱఁ గాయంబు గాయంబు సేసి వెఱ వేఁకిఁగొలి
పిన కాకశ్మశ్రు నామధేయచండాలు కరాళవేషంబు గన్నులం గట్టిన
ట్లుండఁ గడఁగనుట నిట్టి కరాళవేషంబు గలిగెఁ గైశికిగాన ఫలదానం
బునదీని మానుపవే! అనిన నతం డేను ఫలంబెఱుంగ, ఫలంబుపరమేశ
ముఖోల్లాసంబ యాజ్ఞాకైంకర్యంబులకు ననుమతి కైంకర్యంబులకు
ఫలపరిమాణ గణన ప్రపన్నుల కెక్కడియది? కాన బంధకం బగుట
ఫలం బింతంత యందుఁ గొంతఁ గొమ్మన వెఱతు భగవంతుండ
రక్షించు నూఱడిలు మన్న నన్నోరిమాట నోరన యుండ నతండు. ౪౯

టీ. కయ్యంబునన్ = మున్ను చోరులకును బధికులకును గలిగిన జగడమునందు, పాఱఁబాఱన్ = మిక్కిలి పరువెత్తఁగా, కాయంబు = నాశరీరమును, గాయంబుసేసి = రక్తసిక్తముఁజేసి, వెఱవేఁకి = భయజ్వరమును, కొలిపిన = కలుగఁజేసిన, కాకశ్మశ్రు నామధేయ చండాలు = కాకశ్మశ్రుఁడను పేరుగల మాలనియొక్క, కరాళవేషంబు = భయంకరాకారము, కన్నులం గట్టిన ట్లుండన్ = ప్రత్యక్షముగాఁ బొడఁగట్టినట్లుండఁగా, కడఁగనుటన్ = పంచత్వము బొందుటచేత, ఇట్టికరాళవేషంబు = ఈవిధమైన బీభత్సరూపము, కలిగెన్ = నాకు సంభవించెను. (అంత్యకాలమం దాచండాలునిరూపమే స్మరణకు వచ్చెను గావునఁ దదనుగుణముగా నిట్టిరూపము వచ్చె ననుట), కైశికిగానఫల దానంబునన్ - కైశికిగాన = మంగళకైశికీగానముయొక్క, ఫలదానంబునన్ = ఫలము నా కొసఁగుటచేత, దీనిన్ = ఈవికృతాకారమును, మానుపవే = పోఁగొట్టవే, అనినన్ = ఇట్లనఁగా, అతండు = ఆభగవద్దాసుఁడు, ఏను = నేను, ఫలం బెఱుంగన్ = గానఫలము నెఱుఁగను, ఫలంబు = ఆఫలము, పరమేశ = శ్రీపతియొక్క, ముఖోల్లాసంబ = ముఖోల్లాసమే. ఆజ్ఞాకైంకర్యంబులకున్ = వేదశాస్త్రములచేత విధింపఁబడినకైంకర్యములకును, (సంధ్యావందనాదుల కనుట), అనుమతికైంకర్యంబులకున్ = భృత్యుఁడు సేయుకీర్తనాది కైంకర్యములకును, ఫలపరిమాణ = ఫలపరిమితియొక్క, గణన = లెక్కపెట్టుట, ప్రపన్నులకున్ = భగవద్దాసులకు, ఎక్కడియది = ఏదది, కానన్ = కాఁబట్టి, బంధకం బగుటన్ = ఆగానము బంధకారణంబు

గావున (పునర్జననహేతు వనుట.) ఫలంబు = ఆగానఫలము, ఇంతంత = ఇంతయంతయని యును, అందుఁ = ఆగానఫలమందు, కొంత = కొంతభాగమును, కొమ్మన వెఱతుఁ = గ్రహింపుమనుటకు భయపడుదును, భగవంతుఁడ = శ్రీపతియే, రక్షించుఁ = కాచును, ఊఱడిలు మన్నఁ=స్వస్థచిత్తుఁడవుగ మ్మనఁగా, అన్నోరిమాట, నోరన యుండఁ=నోట నే యుండగా, (అంతశ్శీఘ్రముగా ననుట), అతండు = ఆ బ్రహ్మరాక్షసుఁడు.

సీ. స్నిగ్ధ త్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ
హిమధవళోపవీతములతోడఁ
బుణ్యషడ్ద్వితయోర్ధ్వపుండ్రవల్లులతోడఁ
దులసికాబ్జస్రగావళులతోడఁ
గౌపీన కటిసూత్రకాషాయయుగితోడ
జలపూర్ణశుభకమండలువుతోడఁ
బాణిస్థదివ్యప్రబంధసంపుటితోడఁ
నుత్తరవాక్పూర్వకోక్తితోడఁ

తే. బడిపిడిజిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖివోలె నమ్మేను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁడై నిల్చె ! సోమశర్మ. 87

టీ. స్నిగ్ధ=నిద్దమైనట్టియు, త్రిభాగ=మూఁడుపాళ్లయందు, ముండిత = భద్రా కరణముఁ జేయఁబడిన, శిరః=శిరమునందలి, శిఖతోడఁ=జుట్టుతోడను, (శిరస్సుమూఁడు భాగముల క్షౌరముసై యొక్కభాగమందు శిఖయు నుండె ననుట), హిమ = మంచు వలెనే, ధవళ = తెల్లనగు, ఉపవీతములతోడఁ = జన్నిదములతోడను పుణ్య = పవి త్రములగు, షడ్ద్వితయ=పండ్రెండైన, ఊర్ధ్వపుండ్రవల్లులతోడఁ=లతలవంటి యూర్ధ్వ పుండ్రములతోడను, తులసి = తులసిపూసలయొక్కయు, అబ్జ = తామరపూసల యొక్కయు, స్రక్=మాలికలయొక్కయు, ఆవళులతోడఁ = సమూహములతోడను, కౌపీన=గోవణముతోడను, కటిసూత్ర=మొలత్రాటితోడను, కాషాయయుగితోడఁ = రెండుకాషాయవస్త్రములతోడను, (ఇది ద్వంద్వసమాసము 'సర్వోద్వంద్వో విభాష యైకద్భవతి' అన్నట్లేకవచనాంతము. కాషాయయుగళితో ననియుం గొందఱందురు), జల = తీర్థముచేత, పూర్ణ=నిండిన, శుభమంగళమైన, కమండలుతోడఁ = పాత్ర తోడను, పాణిస్థ=హస్తమందున్న, దివ్యప్రబంధ = ద్రావిడవేదముయొక్క, సంపుటితోడఁ = పుస్తకముతోడను, (సంపుటముతో ననికొందఱు) ఉత్తరవాక్ = ద్వయమందలి

యుత్తరవాక్యమే, పూర్వక = పూర్వముగాఁగల, ఉక్తితోడన్ = సంభాషణముతోడ, (ద్వయానుసంధానముఁ జేయుచున్నాఁ డనుట, ఇచ్చట నుత్తరవాక్యము నెడఁ జరమ సదాచారాధ్యయనసమృద్ధి, పొల్చు=ఒప్పుచున్న, (బ్రహ్మవర్చసముఁ బ్రోచు నని కొందఱందురు.) అట్లైన, బ్రహ్మవర్చసమున్ = బ్రహ్మవర్చస్సును, పొల్చు = ఒప్పుచుండెడి, భాగవతలక్ష్మితోన్ = భాగవతకాంతితోడను, ధూమపటలినుండి = పొగగుంపువలన, వెడలు=బహిర్గతుఁడగు, శిఖివోలెన్ = అగ్నిహోత్రునివలెను, అమ్మేను = ఆ రాక్షస శరీరమును, వెడలి=వెలువడి, చూడఁజూడన్=చూడఁగాఁజూడఁగా, సోమశర్మ, వైష్ణవుఁడై=విష్ణుభక్తుఁడై, నిల్చెన్=నిలిచెను.

వ. ఇట్లు భాగవతపరిచయప్రభావంబున బ్రాహ్మణ్యంబె కాక భాగవత శ్రీయునుం గలిగి యుప్పొంగి యినుమడియగుచందంబునం బరమ హర్షభరితుండై స్వరూపానురూపంబుగా నతనికిఁ బూజఁగావించి. 58

టీ. ఇట్లు=ఈప్రకారము, భాగవత = భగవద్దాసునియొక్క, పరిచయ = గుఱుతెఱుకయొక్క, ప్రభావంబునన్ = మహిమచేతను, బ్రాహ్మణ్యంబె కాక = విప్రత్వమే కాక, భాగవత శ్రీయునున్=భాగవతసంపదయును, కలిగి, ఉప్పొంగి, ఇనుమడియగు చందంబునన్ = ద్విగుణితమగునట్లు, (బ్రాహ్మణ్యము వైష్ణవత్వముచేత రెట్టించె ననుట). పరమహర్ష=పరమానందముచేత, భరితుండై=పరిపూర్ణుఁడై, స్వరూపానురూపంబుగాన్ = సంప్రదాయమునకుఁ దగినట్టుగా, అతనికిన్=ఆనంబాడువాని ననుభాగవతునకు, పూజన్= సపర్యను, కావించి=ఒనరించి.

సీ. జయ దరుత్తరణసంసరణాబ్ధదళనీర
జయజయ గాయకసార్వభౌమ
జయ శౌరిగాథారసజ్ఞ పుణ్యరసజ్ఞ
జయజయ తత్త్వసంశయలవిత్ర
జయ *జనార్వాచీనజనిసంగవంచక
జయజయ దేశికచరణశరణ
జయ యుక్తవాక్ప్రీతిస్థాత్మృణీకృతదేహ
జయజయ భగవదాజ్ఞాకృతిస్థ
తే. జయ సకలజంతుసమచిత్త జయ దయార్ద్ర
జయ ముకుందాన్యదేవోక్తిశాస్త్రబధిర

* జయార్వాచీన.

జయ చతుర్ద్వయభక్తిలక్షణచితాంగ
జయ మురారిప్రపన్నాంఘ్రిజలజమధుప. 89

టీ. దురుత్తరణ=తరింపశక్యముగాని, సంసరణ = సంసార మనియెడి, అబ్దదళ = తామరాకునందలి, నీర=ఉదక మైనవాఁడా, (తామరాకుపై నీరు దాని నంటకుండి నట్లు నీవు సంసారమందుఁ దగులవనుట), జయ = జయ మగుఁగాక, గాయక సార్వభౌమ = కీర్తనాపరులకుఁ జక్రవర్తివైనవాఁడా, జయజయ, శౌరి=శ్రీపతియొక్క, గాధా = కథలయొక్క, రస = సారస్యమును, జ్ఞ=తెలిసిన, పుణ్య = పవిత్రమగు, రసజ్ఞ=జిహ్వగలవాఁడా, జయ, (నీనాలుక భగవద్గుణకథన మధుర రసమును దెలిసిన దనుట), తత్త్వసంశయ = పరబ్రహ్మ మేదో యను సంశయమునకు, లవిత్ర = కొడవలి యైనవాఁడా, (తత్త్వశబ్దము పంచవింశతి తత్త్వములకు నన్వయింపవచ్చును, అట్టి వాని సందేహనివర్తకుఁ డనుట.), జయజయ, జన=జనులయందు, అర్వాచీన=తక్కువగు, జని=జన్మముయొక్క, 'జనిరుత్పత్తిరుద్భవః' అనియమరము. సంగ = సాంగత్యముచేత, వంచక=మోసముసేయువాఁడా, (మహిమ గూఢము చేసి జాతిని బ్రకటించువాఁ డనుట. మఱియు జనులకు నీచజన్మములు రాకుండఁ జేసెడివాఁడ వనుట. జయజయార్వాచీనజని సంగవంచక యనుపాఠమున, ఇఁకను పచ్చుజన్మముల సంబంధములేనివాఁ డని యర్థము.) జగు, దేశిక = ఆచార్యులయొక్క, చరణ = శ్రీపాదములే, శరణ = రక్షకముగాఁ గలవాఁడా, 'శరణం గృహరక్షిత్రోః' అని యమరము. జయజయ, ఉక్త=పలుకఁబడిన, వాక్ = మాటయొక్క, ప్రతిష్ఠా=నిలుకడచేత, తృణీకృత=తృణప్రాయముగాఁ జేయఁబడిన, దేహ = నిజశరీరముగలవాఁడా, (సత్యమందు బుద్ధియునిచి దేహాభిలాష లేనివాఁ డనుట.), జయ, భగవత్ = భగవంతునియొక్క, ఆజ్ఞా=ఆనతిని, కృతి=చేయుటయందు, స్థ = స్థిర పడినవాఁడా, సకల = సమస్తములైన, జంతు=ప్రాణులయందు, సమ = సరియైన, చిత్త= హృదయముగలవాఁడా, జయ, దయార్ద్ర=దయచేతఁ జల్లనివాఁడా, జయ, ముకుంద = మోక్షప్రదుఁడగు నారాయణునికంటె, అన్య = ఇతరుఁడగు, దేవః అస్తి = దేవుఁడున్నాఁ డనెడు, శాస్త్ర=శాస్త్రమందు, బధిర=చెవిటివాఁడా, (విష్ణునికంటె నన్యదైవము గల దను చదువు వినఁ డనుట), జయ, చతుర్ద్వయ=ఎనిమిదివిధములైన, భక్తిలక్షణ = భక్తి చిహ్నములచేత, చిత = వృద్ధియయిన, అంగ=దేహముగలవాఁడా, (ఇచట భక్తి యెనిమిది విధము లనుటకుఁ బ్రమాణము. 'మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనం, స్వయ మభ్యర్చనం చైవ మదర్థే దంభవర్జనం, మత్కథాశ్రవణే భక్తిః సర్వనేత్రాంగ విక్రియా, మమానుస్మరణం నిత్యం యచ్చమా ముపజీవతి, భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే, స విప్రేంద్రస్సచ శ్రీమాన్ సయతిస్స చ పండితః' అని

యున్నది), జయ, మురారి=మురాసురమర్దనుం డగు శ్రీపతియొక్క, ప్రసన్న=ప్రపత్తి చేసిన భక్తులయొక్క, అంఘ్రిజలజ = పాదపద్మములకు, మధుప=భృంగమనైనవాఁడా, జయ.

వ. అని ప్రస్తుతించి ప్రదక్షిణంబు గావించి పునర్భవభయంబున భవన భార్యాప్రముఖ సుఖ విముఖుండై బదరీవనాదిపురుషోత్తమాధిష్ఠిత పుణ్యభూములఁ బౌనఃపున్యంబుగం దీర్థయాత్ర జరించుచుఁ బరమ నిర్వృతిం బొందె నిప్పుణ్యకథ వహనసమయంబునఁ గుహనావరాహంబువలన మహీమహిళ మదీయ పూజోపచితోపచారంబుల విశేషఫలదంబు గానంబ యన విని వైష్ణవియుం దాఁ గావునఁ దదాకలన కుతూహలంబునం గూఁతురై నీ కోదవి యహరహంబును విప్రలంభదంభేరితాగాధగాథార్థసమేతకీతరసంబునం బ్రొద్దుపుచ్చుట గాని వేఱొండుగా దేమి తపంబుసేయుచున్నదియో యం టెంత కంటెఁ బరమతపం బున్నదే? యన్నియును మేలయ్యెడు, శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొనిపోయి రమ్మనుటయుఁ, బ్రసాదమ్మని ప్రణామమ్ము సేసి పసిండి పల్లకి నబ్బాలికారత్నంబు నునిచి పరిచారికా శతంబును భాగవతపరిషత్తునుం గొలువఁ బ్రయాణపర్యాయంబులఁ బరమానురాగంబునం బోయి. ౧౦

టీ. అని=ఇట్లని, ప్రస్తుతించి=కొనియాడి, ప్రదక్షిణంబుగావించి = వలగొని, పునర్భవభయంబునన్=మరలజన్మములుగలుగునను భయముచేత, భవన=ఇల్లును, భార్యా=ఇల్లాలును, ప్రముఖ=మొదలగు, సుఖ=సుఖములవలన, విముఖుండై = పరాఙ్ముఖుండై, బదరీవనాది=బదరికారణ్యము మొదలైన, పురుషోత్తమాధిష్ఠిత - పురుషోత్తమ = నారాయణునిచేత, అధిష్ఠిత=నెలకొనఁబడిన, పుణ్యభూములన్ = దివ్యదేశములయందు, పౌనఃపున్యంబుగన్=మాటిమాటికి, తీర్థయాత్రఁజరించుచు=తీర్థయాత్రలయందు సంచరించుచును, పరమనిర్వృతిన్ = పరమసుఖమైన మోక్షమును, పొందెను=ప్రాపించెను, ఇప్పుణ్యకథ=ఈపవిత్రచరిత్ర, వహనసమయంబునన్ = వరాహావతారమై వహించినప్పుడు, కుహనావరాహంబువలనన్=మాయావరాహమువలన, (వరాహావతారుఁడే యనుట.), మహీమహిళ=భూకాంత, మదీయ=నాసంబంధములగు, పూజా = పూజలయందు, ఉపచిత = వృద్ధిఁబొందిన, ఉపచారంబులన్ = కైంకర్యములయంద, విశేషఫలదంబు=హెచ్చుఫలము నొసంగునది, గానంబ యనన్=గానమే యనఁగా, విని=ఆలకించి, తాన్=ఆభూకాంత, వైష్ణవియునున్ = విష్ణుసంబంధినియును, కావునన్=కాఁ

బట్టి, తదాకలన=ఆ గానము సేయుటయందలి, కుతూహలంబునన్ = వేడుకచేత, కూఁతురై=పుత్రికయై, నీ కొదవి = నీకుఁ గనఁబడి, అహరహంబును = ప్రతిదినమును విప్రలంభ = వియోగ మరియెడు, దంభ = వ్యాజముచేత, ఈరిత = పలుకఁబడిన, అగాధ= గంభీరములైన, గాథా=కథలయొక్క, అర్థ = అర్థముతోడ, సమేత = కూడియున్న, గీతరసంబునన్ = గానరసముచేత, ప్రొద్దుపుచ్చుటగాని = కాలక్షేపము సేయుటగాక, వేఱొండు గాదు=మఱియొకటి గాదు, ఏమితపంబు సేయుచున్నదో యంటి = ఏమి తప మాచరించుచున్నదో యంటివి, ఇంతకంటెన్ = ఇట్లు గానము సేయుచుండుట కంటెను, పరమతపం బున్నదే = హెచ్చుతప స్సున్నదా, (లేదనుట), అన్నిటును= యావత్కార్యములును, మేలయ్యెడున్ = మంచి వగును, శ్రీరంగంబునకున్ = శ్రీరంగస్థలంబునకు, రంగేశు సేవింపన్ = శ్రీరంగనాయకుని సేవించుటకై, తోడుకొని= ఆయమను దోడ్కొని పోయి ర మ్మనుటయున్ = పోయిరమ్మనఁగా, ప్రసాదమ్మని = మహాప్రసాద మని, ప్రణామమ్ముసేసి = నమస్కరించి, పసిండిపల్లకిన్ = కనకాందోళిక యందు, అబ్బాలికారత్నంబున్ = ఆగోదాదేవిని, ఉనిచి = ఇడికొని, పరిచారికా శతంబును = అనేకపరిచారికలును, భాగవతపరిషత్తును = భగవద్భక్తసమూహంబును, కొలువన్ = భజింపఁగా, ప్రయాణము పర్యాయంబులన్ = పయనంపువరుసలచేత, పరమానురాగంబునన్=పరమానందముచేత, పోయి=(ఆవిష్ణుచిత్తుఁడు) వెడలి.

తా. ఆ నంబాడువాను చరిత్రము పూర్వము వరాహావతారమున విష్ణుదేవుఁడు భూదేవికిఁ జెప్పఁగా, గానకైంకర్య మధికఫలదం బని, యట్లు, పాడుటకై యాభూమియె యీచూడికుడుత్తనాంచారాయెను. ఆయమను శ్రీరంగనాయకుని సేవార్థమై తీసికొని పొమ్మని వడపెరుంగోయి లుడయవరు సెప్పఁగా నా విష్ణుచిత్తుం డట్లు బంగరు పల్లకిలో గోదాదేవి నటకుఁ గొనిపోయెను.

మ. చని కాంచె న్విరజాభిధాంతర వపుః స్సహ్యోద్భవాతీరనం
దనవాటీ వలయద్రుమావళి దళాంతర్దృశ్య పాపాళి భం,
జన చాంపేయసుమాయమాన విషమః స్వర్ణావృతివ్రాత ర
శ్మి నభస్స్పృక్ఛిఖరాళి దీపకళికాశృంగంబు శ్రీరంగమున్. 91

టీ. చని = ఆవిష్ణుచిత్తుం డరిగి, విరజా = విరజానదియనెడు, అభిధాంతర = మఱియొకపేరుగల, వపుః = దేహముగల, సహ్యోద్భవా - సహ్య = సహ్యపర్వతము వలన, ఉద్భవా = ఉదయించిన కావేరీనదియొక్క, 'కావేరీ విరజా సేయమ్' అని ప్రమాణము. తీర=దరియందలి, నందనవాటీ=వనవీథియొక్క, వలయ = మండలమందలి, ద్రుమ=వృక్షములయొక్క, ఆవళి = సమూహముయొక్క, దళ=ఆకులయొక్క, అంతః=

సందులనుండి, దృశ్య=చూడఁదగినట్టియుఁ, పాప=దోషము లనియెడు, అళి=తేఁటులయొక్క, భంజన=భంగపఱుచుటయందు, చాంపేయ = సంపెఁగలయొక్క, సుమాయమాన = పువ్వులవలెనుండెడు, విషమ=బేసియగు సప్తసంఖ్యాకములైన, స్వర్ణావృతి=సువర్ణప్రాకారములయొక్క వ్రాత=సమూహమునందలి, రశ్మి=కాంతులచేత, నభస్స్పృక్=ఆకాశము నొరయుచున్న, శిఖర=శిఖరములయొక్క, అళి = పఙ్క్తుల నియెడు, దీపకళికా=మొగ్గల వంటి దివ్వెలయొక్క, శృంగంబుక్=కొనలు గలిగిన, శ్రీరంగముక్=శ్రీరంగస్థలమును, కాంచెక్=చూచెను.

తా. విరజానామాంతరముగల దేహముచేత నొప్పుచున్న కావేరీతీరమందు దట్టములగు వనములయందలి తరువుల యాకులసందులఁ గానవచ్చుచున్న యేడుబంగారు ప్రాకారముల కాంతులు పాపము లనియెడు తుమ్మెదలకుఁ దలదిమ్ము పుట్టించి పాఱఁదోలెడు సంపంగిపూలవలె నుండెను; పైశిఖరములు దీపకళికలవలె మెఱయుచు మిన్నంటి యుండెను.

క. చోళీహల్లకచితకచ
పాళీ పాళీభవ ద్విపంచీస్వనభృం
గాళీ కవేరదుహితృ మ
రాళీధ్వను లెసఁగుగాడ్పు ప్రతివడ యుడిపెక్. 92

టీ. చోళీ = చోళదేశస్త్రీలయొక్క, హల్లక = ఎఱ్ఱకలువపలతోడ, చిత = కూర్పఁబడిన, కచ = కొప్పుదులయొక్క, పాళీ = సమూహములకు, పాళీభవత్ = పఙ్క్తిగట్టునట్టియుఁ, విపంచీ = వీణెలయొక్క, స్వన=నాదమువంటినాదముగల, భృంగ = తేఁటులయొక్క అళి = సమూహములయొక్క, కవేరదుహితృ = కావేరియందలి, మరాళీ=హంసికలయొక్కయు, ధ్వనులు=కంఠనాదములు, ఎసఁగు=మీఱెంచునట్టి, గాడ్పు= వాయువు, ప్రతి = నియమవంతుఁడగు నావిష్ణుచిత్తునియొక్క, వడ=మార్గాయాసమును, ఉడిపెక్=పోఁగొట్టెను.

తే. అతఁ డఘమర్షణస్నాన మమ్మరుద్వృ
ధాంబువుల నాడి మాధ్యాహ్నికాదిఁ దీర్చి
స్నాతయు నలంకృతయు నౌ తనయను దోఁడు
కొనుచు వైష్ణవపరిషత్తు గొలువ నరిగి. 93

టీ. అతఁడు=అవిష్ణుచిత్తుఁడు, అమ్మరుద్వృధాంబువులక్ = అకావేరీ తీర్థముల యందు, అఘమర్షణస్నానమాడి = అఘమర్షణసూక్తములను చెప్పుచు స్నానముచేసి, *మాధ్యాహ్నికాదిక్=మాధ్యాహ్నిక బ్రహ్మయజ్ఞానుష్ఠానములును, తీర్చి = నిర్వర్తించి

స్నాతయయ్ = స్నానముఁ జేసిన యట్టిదియు, అలంకృతయయ్ = సర్వాలంకార శోభితురాలును, ఔ=అగునట్టి ('వాయిరవుర్వక్రతనూ' అనుసూత్రముచేత నిది వక్రతమము.) తనయను=తనకుమారికను, తోడుకొనుచున్ = వెంటఁబెట్టుకొనుచు, వైష్ణవ = విష్ణుభక్తులయొక్క, పరిషత్తు=సమూహము, కొలువన్=సేవింపఁగా, అరిగి=పోయి.

సీ. చరణంపు సరిపణి ◆ మొరపంబు విన్న *దం
   తులతోనె యెదురు నింతులకుఁ దొలఁగి
యిడి నట్టి మణిముష్టి ◆ గృహుల యారతి కెంపు
   జాళ్లనే కలయ వాకిళ్ళఁ జల్లి
ప్రసవాది తావికిఁ ◆ బ్రతిగృహేశార్థభ
   క్ష్యపువల్లు వనకె పోలె ◆ శ్వాస ముడిపి
నృత్తగీతోత్థశా ◆ రిస్తుతి కీర శా
   రి జయట్ల యర్థోర ◆ రీకృతి విని
తే. వలభి రత్నాంశువులఁ గట్టు ◆ తెలుపు చిత్ర
మగుట కోర్వక దిగదిగ ◆ నరిగి ధాన్య
మడిగెడు విరక్తభాగవ ◆ తాళివలన
వెల్లదీవియపోని య ◆ వీ్వీడు సొచ్చి. 94

టీ. చరణంపు = స్త్రీలపాదములయందలి, సరిపణి = భూషణవిశేషముయొక్క, మొరపంబు=ధ్వనిని, విన్ = వినఁగానే, దంతులతోనె = ఏనుఁగులతోడనే, ఎదురు = తమకెదురుపడెడు, ఇంతులకున్ = స్త్రీలకు, తొలఁగి = ఓరసిల్లి, (స్త్రీలపాదభూషణరవము వినఁగానే యందలి యతియపాత్రపరులగు వైష్ణవు లేనుంగులకుఁ దొలఁగినట్లే యాస్త్రీలకుఁ దొలఁగుదు రనుట. శ్రీరంగమం దేనుంగులును గల వనుట.), ఇడినట్టి = తమకు నిచ్చినట్టి, మణిముష్టి = మాణిక్యభిక్ష, గృహుల = ఆగృహస్థులయొక్క, ఆరతి = నీరాజనములయందలి, కెంపుజాళ్లనే = రత్నములయందే, కలయన్ = కలియునట్లు, వాకిళ్లన్ = వారి ద్వారములయందు, చల్లి = పారఁజల్లి, (వీరు పేద లని యైశ్వర్యవంతులగు నచ్చటి గృహస్థులు వీరు వాకిండ్లయం దుండఁగానే వీరికి రత్నభిక్షఁ బెట్టఁగా వైరాగ్యమువలన నవి యొల్లక మరల వారు వీరికి రతనాలయారతి సమర్పించెడు పళ్లెరములలోనే కలియఁబోయుదురుగాక; తండులములుదక్క మఱియొకటి యంట రనుట.), ప్రసవాది = పుష్పము మొదలగుదానియొక్క, తావికిన్ = పరిమళమునకు, ప్రతిగృహేశార్థ = ప్రతి తిరుమాళిగల పెరుమాళ్లకొఱకైన, భక్ష్యపు = పణ్యారముల సం

* ధంతుల కట్టు.

బంధియగు, వల్పునకెపోలె = వాసనకెవలె, శ్వాస ముడిపి = ఉచ్ఛ్వాసమును జాలించి, (అభిక్షుకులు పుష్పాదులయం దాసక్తి కూడ దని యందులకును తిరుపణ్యారములు స్వామి కారగింపు గాకమునుపు మూర్కొన్న నపచార మగు నని యావాసనకును బోకుండఁ దమ శ్వాసమును బిగఁబట్టుదు రనుట.), నృత్త = నాట్యములయందును, గీత=పాటలయందును, ఉత్థ=కలిగిన, శౌరి=శ్రీపతియొక్క, స్తుతి = వినుతిని, కీర = చిలుకలవలనను, శారి = గోరువంకలవలనను, జయట్లు = పుట్టిన దానివలెనే, అర్ధోరరీకృతి = అర్ధాంగీకారముచేత, విని = ఆకర్ణించి, (ఆయతియపాత్రపరులు విరక్తులుగావున నృత్తగానాదులయందు నాసక్తిలేకయుఁ గీరశారికాదిభాషలనువలెనే యందు భగవన్నామ ముండుటవలన దాని నర్ధాంగీకారముగా విందు రనుట.), వలభి = లోపలయందలి, రత్న = రతనములయొక్క, అంశువులన్ = కాంతులచేతను, కట్టు = తాము ధరించుకొన్న, తెలుపు = ధవళవస్త్రము, చిత్రమగుటకున్ = చిత్రవర్ణమౌటకు, ఓర్వక = సహింపక, దిగదిగనరిగి = బిసబిసఁబోయి, ధాన్యము = తండులమును, అడిగెడు = యాచించునట్టి, విరక్త = విరక్తులగు, భాగవతాళివలనన్ = భగవద్భక్తసమూహమువలన, వెల్లదీవియపోని = శ్వేతద్వీపమువలె నున్న, అవ్వీడు = ఆశ్రీరంగస్థలము, చొచ్చి = ప్రవేశించి, (ఆ శ్రీరంగమందు భిక్షమెత్తెడు భాగవతులు శ్వేతద్వీపమునుండి యవతరించిన నిత్యసూరులేకాక మనుష్యులు గాని యింద్రాది దేవతలుగాని కారు. ఇందులకుఁ బ్రమాణము. శ్లో. 'దిదేవిషతిమానుషస్సచలితద్విభూషత్యసౌ శిశర్విషతిసర్వదా వివిధయిష్య తేతేనచ, ముముక్షిషతితత్త్వగత్యవగతేస్స నిస్సంశయం నిని త్యిషతి సర్వదా సచరి రంగభిక్షూషతిః.' అని శ్రీపరాశరభట్టరు శ్రీసూక్తికలదు. దీనికి సరియగు తెనుఁగు మదీయము. చ. 'నరుఁ డమరత్వ మాయమరనాకతయాతఁ డతండు సెప్పడున్, గిరిశతఁ గొంక కాతఁడును గీర్యువతీశతయాతఁ డెంతయుంన్, మురిప మెలర్ప ముక్తతయు ముక్తుఁడు నిత్యత నిత్యుఁడు న్నిరం, తరమును రంగభిక్షుకతఁ దప్పక కోరుదు రోలి నాత్మలన్').

ఉ. గోపురకందరాళికడ కేకు న్నశిపుష్కరిణీకణార్ద్రిసం
తాపహరానిలంబులువితానరణన్మణికింకిణీకలా
లాపముల న్సుఖంబడుగ నాఁటిఁటఁ జొచ్చి యకాండగాహనా
చాపలకృన్మరుద్గణముఁ జండుఁ డదల్చెడు లోనివాకిటన్. 95

టీ. గోపురకందరాళి = దరులవంటిగోపురములపఙ్క్తియొక్క, కడకున్ = తుదవఱకు, శశిపుష్కరిణి = చంద్రపుష్కరిణియందలి, కణ=జలబిందువులచేత, ఆర్ద్రి = చల్లనైనట్టియు,సంతాపహార = సేదదేర్చెడు, అనిలంబులు=వాయువులు, వితాన=మేలుకట్ల

యందలి, రణత్ = మ్రోయుచున్న, మణికింకిణీ=రతనంపుమువ్వలయొక్క, కల = జిలిబిలి యగు, ఆలాపములన్ =ధ్వను లనియెడు పలుకులచేత, సుఖం బడుగన్ =కుశల ప్రశ్నము సేయఁగా, ఆఱిటఁజొచ్చి = ఆఱుప్రాకార ములయందుఁ బ్రవేశించి, అకాండ=అసమయ మందు 'కాండో౽స్త్రీదండబాణార్వవర్గా వసరవారిషు' అని నిఘంటువు. గాహనా=ప్రవే శించుటయందె, చాపలకృత్ = త్వరపడుచున్న, మరుద్గణమున్ = దేవతాసమూహ మును, చండుఁడు = చండుఁడను ద్వారపాలకుఁడు, అపల్చెడు = రావల దని యదలించు చున్నట్టి, లోనియేడిటన్ = సప్తమ గోపురద్వారమందు.

తా. విష్ణుచిత్తుం డరిగెడు నవసరంబున దేవతలు సేవింప వచ్చిన నది వారికి నసమ యం బని యా దేవతలను జండుఁ డను ద్వారపాలకుం డదలించుచు లోపలికి రాకుండఁ జేయునట్టి సప్తమప్రాకారద్వారమందుఁ జేరె నని భావము. కడమ సులభము.

ఉ. వేత్రముఁ గేలఁ బూని మణివేది కుథంబుపయిన్ సితాంబురు
ణ్ణేత్రుని ముద్రవ్రేల్మెఱయ నిశ్చలులై యిరుమైన్ మనాఙ్నమ
ద్గాత్రుల దంతివక్త్రులశతంబు వినీతి భజింప నొప్పు త
త్సూత్రవతీశు వందనముతోఁ గని యాతఁడు భక్తి సేయఁగన్.

టీ. వేత్రమున్ =బెత్తమును, కేలన్ =హస్తమందు, పూని = వహించి, మణివేది= రత్నంపుటరుగునందలి, కుథంబుపయిన్ = తివాచీమీఁదను, సితాంబురుట్ = పుండరీ కములవంటి, నేత్రుని=కన్నులుగల శ్రీపతియొక్క, ముద్రవ్రేల్ = ముద్రతోడి యుంగ రముగలయంగుళము, మెఱయన్ =ప్రకాశింపఁగా, నిశ్చలులై=చలింపనివారై, ఇరుమైన్ =ఉభయపార్శ్వములయందు, మనాక్ =ఇంచుకంత. 'కించిదీషన్మనాగల్పే' అని నిఘంటువు. నమత్ =నమ్రములగు, గాత్రుల = దేహములు గలవారగు, దంతివక్త్రుల=గజ ముఖులయొక్క, శతంబు = నూఱు, (నూఱ్వురుగజముఖు లనుట.), వినీతి=వినయముచేత భజింపన్ =సేవించుచుండఁగా, ఒప్పు=మెఱయుచున్న, తత్ =ప్రసిద్ధుఁడగు, సూత్ర వతీశున్ = సూత్రవతీదేవినాథుఁడగువిష్వక్సేనుని. (విష్వక్సేనుఁడు గజముఖశతముచేఁ బరివేష్టింపఁబడుటకుఁ బ్రమాణము. 'యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం, విఘ్నన్నిఘ్నం సతతం విష్వక్సేనం తమాశ్రయే' అని గలదు.). వందనముతోఁ గని = నమస్కారపూర్వకముగాఁ గాంచి, ఆతఁడు = ఆవిష్వక్సేనుఁడు, భక్తిసేయఁగన్ =కొలువఁగా.

తే. అవిదితపురందరాయుధంబై నకనక
శిఖరియునుబోలె నెఱకలఁజిగులు దెసల
నింగి నీరెండఁ గాయ వేదాంగువినత
సుతుని నతిఁ గాంచి మగుడఁ దదున్నతియుఁ గాంచి. 97

టీ. అవిదిత = ఎఱుఁగఁబడని, పురందరాయుధంబైన = వజ్రివజ్రముగలయట్టి, కనకశిఖరియునుబోలెన్ = మేరుపర్వతమువలెనే, (ఇంద్రునిచేత జెక్కలు ప్రక్కలింపఁబడని బంగరుకొండవలె నున్నాఁడనుట.) ఎఱకల=పక్షములయొక్క, జిగులు = కాంతులు, దెసలన్=దిశలయందును, నింగిన్=ఆకాశమందును, ఈరెండగాయన్ = చల్లని యెండ గాయుచుండఁగా, (కాంతు లాతపమువలె నుండె ననుట.) వేదాంగుని=ఛందోమయుఁడైన, 'కాంతస్తే పురుషోత్తమః ఫణిపతిశ్శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ' అని ప్రమాణము. వినతసుతుని=వైనతేయుఁడగు గరుత్మంతుని, నతిన్=నమస్కారముచేత, కాంచి=చూచి, మగుడన్=మరల, తత్+నతియున్ = ఆవైనతేయుని నమస్కారమును, కాంచి = పొంది.

వ. అతనిచే విజ్ఞాపనంబు సేయించి యనుమతిం గాంచి చతుర్భుజులు జలధరశ్యాములు శతపత్త్రలోచనులు చపలాపిశంగవసనులు వనమాలికాబద్ధబాహుమధ్యులు నైన మధుమథన ప్రతిబింబంబులుంబోని పారిపార్శ్వకులఁ బరాంకుశ ప్రభృతిముక్తుల సేవించుచుఁ దదభినందితు లై చని మహావకాశంబును మణిమయస్తంభ సంభృతంబును శాతకుంభకుంభశోభితశేఖరంబును నై చిత్రనేత్రవితానలంబమాన నానాప్రసూనదామ ముక్తాగుళుచ్ఛాచ్ఛచామరంబును నుద్వేలకాలాగరుధూపధూపితంబు నగు మహావిమానమధ్య విధుకాంతవితర్ది కాతలంబునఁ జరణముఖ తత్త్వత్రితీకాధిష్ఠిత ధర్మాదిసూరి పరిషదాత్మకంబును దేజోమయంబును నగు విపులవిమల పీఠంబునఁ బరిమళా లోలరోలంబజాలం బగు నంబురుహంబు జాంబూనదత్వి డుత్తమర్ణవిస్తీర్ణ కర్ణికోపరివీథి నూధస్యపాథోనిధానంబునకుఁ బ్రథమహేతుభూతం బగు భూతతన్మాత్రయుంబోలెఁ బారద స్ఫటిక బటీర పాండురుచి పుండరీకంబుల పసకు మసమసక లెసకొల్పు మిసిమి గల భోగిభోగభాగంబునం బరభాగంబు మిగులఁ దదాత్మకంబ యగు సుపర్వాంబున మహార్హ కేయూరమణికర్బురం బగుకూర్పరంబూని మననపర ముని మనోరాగరస మార్జనంజేసి మిగుల నరుణిమ వహించెనో యనఁ జాలు కెంగేలు కపోలంబునం గదియం ద్రిదశ తరు కుసుమ కంచుకిత కంచుకికంచుకాత్మకం బగు దుకూలని చోళంబుశనొత్తగిలియున్నవానిం గరిం గటికటిం బెట్టి బిట్టు దనచేత చక్రంబునం దెగిన వక్రంబు పూజ్యం బగు సాయుజ్యంబు నొందెనో

యన నుపరి పరిదృశ్యమాన గండస్థలస్థ మణిమకరకుండల ప్రతిబింబ
రుచి డంబరంబునం బరమ సౌందర్య మకరంద నిష్యంది యగు ముఖా
రవిందంబున నందంబగువాని నిర్నిమిషదృష్టినెట్టుకొని చూచుతఱి
నీలావదాతంబు తెప్పవట్టు తఱి బిట్టిదుర్కొను కలధౌత గౌర
గౌర మహామహాగపూరంబున మునింగి దుర్నిరీక్ష్యయు నగు
నిజ రుచిర మూర్తివలనఁ దనకు సాకార నిరాకారతలు వారికిఁ
జూపు దూపున దీపించువానిఁ, గళత్రంబు లగు శ్యామా
చ్ఛాయలచేతఁ బ్రేముడిం బొదువంబడిన యట్లు కప్పులుఁ దొంగలు
నగుపక్ష్మకాలికల నొప్పు సోమ సూర్యాత్మకంబు లగు వెడంద నిడు
వాలు టెఱ్ఱసెరల కన్నులం గెందమ్మితేకుల వెదచల్లువాని మంకెన
విరి బింకంబు నింకించు నధరశోణిమ నెపంబున వెలుంగు ముఖజనిత
మహాశానుతోఁ దత్సఖుం డగు గంధవహుం గూర్ప నిక్కొనన
నొక్కింత నిక్కి చొక్కంపుఁ బొటములఁ జూపట్టె తిలకుసుమ విలస
నాపహాసి యగు నాస భాసమానుం డగువాని నుదరజాత శ్వేద
ధామతామరసంబుఁ గనుంగొని మహాదాశ్రయంబు గనిన పూర్ణి
మాశశాంకుం డనుశంక నాతనికి నాకు వైరంబు మాన్పు మని
తత్సహోదరి గావున రత్నకాంచనంబులు లంచంబులుగా నివేదించి
యడుగు లొత్తు నిందిరకు వరవుం బడియున్న రాహు వసం
గేయూర కటక మణి ముద్రికాంకితం బగు దీర్ఘ బాహుపరిఘంబు
కటితటోత్సంగంబునం మెఱయువాని నురస్థ్సల న్యస్త నిస్తులాస్తోక
కౌస్తుభ గభస్తి మండలంబున నిండోలగంబుండు పుండరీకనికేతన
తనుచ్ఛాయ యన నచ్ఛాచ్ఛం బగు శ్రీవత్సంబున లోచనోత్సవంబుఁ
గావించువాని విజితమృగనాభినాభి సౌరభ్యంబునకు* నెగయు
నుత్తుంగ భృంగ మాలిక యన మెఱయు నసిత పేశలతులసీపలాశ
దామంబున నభిరామ కోమలాలంకృతి యగువానిఁ గపట కరటి
విరోధిగ్రై యసుర యసుఱుం గొని మగడ మనుజాంగంబు నంగీక
రించునెడఁ దలంపంబడమి నట్లన యుండె నన బడుగు బడుగగునడుము
పసఁ గడు నొడిక మగువాని ఘన జఘన చరమేతర ధరాధరాధిత్య
కాతలంబునం గాంచన కాంచికామణిమకుట గగనమణి గాయు

నీరెండమెం డనంబరఁగు మెఱుంగు పీతాంబరంబునం బొదువంబడి
దాని సన్నఁదనంబు వెలుపలం దోఁపఁ గనక పుష్యరాగంపుఁ దెర
వాఱు వైడూర్యమణిస్తంభయుగంబునుంబోలెఁ గించిదావిర్గాలిత
నీలిమం బగు నూరుయుగళంబువానిఁ ద్రైవిక్రమం బగు విగ్రహం
బుతో నాగ్రహంబున మీఁదికిం జాఁచు తఱిఁ జంక్రమణ రయం
బునం దగిలివచ్చిన మణిమయస్వర్భువనజాంబూనదప్రాకారవలయం
బనం దీండ్రించు నుద్దండ గండపెండెరంబునం బోడము నఖండ
ప్రభామండలంబునం బరిమండితంబులై మఱ్ఱిపండుల వడువుగల
మడమల బెడంగు పడి భావి నిజ కమఠావతార సూచకంబులుం
బోలెఁ గొదమతాబేళ్ల మేళ్లనగు మీఁగాళ్లతోఁ గోకనద మృదూ
దరంబు లమర మెఱుఁగు జుక్కల జిగి మొక్కపఱుచు నఖ చక్ర
వాళ చంద్రికల భక్తజన మనస్తమోవిదళనంబుఁ గావించుచు హల
కులిశ కలశ కమల మకరాంకు శాంకితంబులై లక్ష్మీకుచకుంకుమా
కలన నరుణారుణంబు లగు చరణంబులం దాపత్రయాపహారణంబు
సేయువాని నారాయణుం బురాణపురుషుఁ బురుషోత్తముఁ బ్రణ
తార్తిహరు వాసుదేవు హృషీకేశు సీశనుతు విభీషణవరదు ననంగ
జనకు రంగరమణుం గాంచి సహసమాగత భాగవతపరిషత్సమేతం
బుగాఁ దానుం దనుజాతయుం బ్రమద భయ భక్తిరసమగ్నుఁడై
జయజయశబ్దంబులతో సర్వాంగాలింగిత క్షోణీతలంబు లగు నమ
స్కారంబులు గావించి నిల్చి నిటలతటఘటితాంజలి యై యిట్లని
నుతియించె. 98

టీ. అతనిచేన్=ఆవైనతేయునిచేత, విజ్ఞాపనంబు సేయించి=శ్రీరంగనాయకునకుఁ దనరాక విన్నపంబు సేయించి, అనుమతిం గాంచి = సెలవును బొంది, చతుర్భుజులు = నాలుగు భుజములుగలవారును, జలధర = మేఘమువలెనే, శ్యాములు = నీలచ్ఛాయగల వారును, శతపత్త్ర=తామరలవంటి, లోచనులు = కన్నులుగలవారును, చపలా = మెఱుపులవలెనే, పిశంగ=పచ్చనైన, వసనులు=వస్త్రములు గలవారును, (పీతాంబరు లనుట), వనమాలికా=తులసీవనమాలికలతోడ, బద్ధ=కూర్పఁబడిన, బాహుమధ్యులును = వక్షస్స్థలములు గలవారును, ఐన=అయినట్టి, మధుమథన = మధుసూదనుఁడైన శ్రీహరియొక్క, ప్రతిబింబంబులుంబోని=ప్రతిబింబములవంటి, పారిపార్శ్వకుల = పార్శ్వవర్తుల గునట్టి, పరాంకుశ=నమ్మాళ్వారులే, ప్రభృతి = మొదలగు, ముక్తులన్=ముక్తాత్ములను.

సేవించుచున్ = భజించుచును, తదభినందితులై = వారిచేత నాదరింపఁబడినవారై, చని = అవలనరిగి, మహావకాశంబును = మహావిశాలమైనదియును, మణిమయరత్నవికారము లైన, స్తంభ = స్తంభములచేత, సంభృతంబును = భరింపఁబడినదియును, శాతకుంభకుంభ = బంగరు కలశములచేత, శోభిత = అలంకృతములైన, శేఖరంబును = శిఖరములు గలది యును, ఐ = అయినదై, చిత్ర = వింతవన్నెలుగల, నేత్ర = వస్త్రములచేత నైన; 'స్యాజ్జటాంశుకయోర్నేత్రమ్' అని యమరము. వితాన = మేలుకట్లయందు, 'అస్త్రీవి తానముల్లోచకః' అని నిఘంటువు. లంబమాన = వ్రేలుచున్న, నానా = అనేకవిధములగు, ప్రసూనదామ = విరిసరులును, ముక్తాగుళుచ్ఛ = ముత్తెముల గుత్తులును, అచ్ఛచామరం బును = తెల్లని జల్లులుగలదియును, ఉద్వేల = మేరమీఱిన, కాలాగరు = కృష్ణాగరువు యొక్క, ధూప = ధూపముచేత, ధూపితంబును = ధూపింపఁబడినదియును, అగు = అవు నట్టి, మహావిమానమధ్య = మహా గర్భగృహమధ్యమందలి, విధుకాంత = చంద్రకాంత శిలలచేఁ జేయఁబడిన, వితర్దికాతలంబునన్ = వేదికాస్థలమందు, చరణముఖ = పాదములు మొదలగు, తత్తత్ప్రతీక = ఆయాయవయవములయందు, అధిష్ఠిత = ఉన్నఁబడిన, ధర్మాది = ధర్మవర్గప్రముఖులగు, సూరి = నిత్యసూరులయొక్క, పరిషదాత్మకంబును = సమాజ స్వరూపమైనట్టిదియును, తేజోమయంబును = ప్రకాశస్వరూపమైనట్టిదియును, అగు = అవునట్టి, విపుల = పెద్దదైనట్టిగను, విమల = నిర్మలమగునట్టి, పీఠంబునన్ = సింహాసన మందు, నవిమళ = క్రొత్తావులతోడను, ఆలోల = సంచరించుచున్న, రోలంబ = తుమ్మెదలయొక్క, 'ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరోఽళి చ' అని నిఘంటువు. జాలంబగు = సమూహముగల, అంబురుహంబు = కమలముయొక్క, జాంబూనదచ్ఛవిన్ = బంగరురంగునను, ఉత్తమర్ణ = అప్పొసంగెడునట్టియు, విస్తీర్ణ = వెడలుపైన, కర్ణి కోపరిపీఠిన్ = మిద్దియపైజెనయందు, ఊధస్యపాథోనిధానంబునకున్ = క్షీరవారి రాశికి, (ఊధస్య మనఁగాఁ బొదుఁగువలనఁ బుట్టినది గావున క్షీర మనుట, ఈశబ్దము మానవజాతియందు స్తన్యమువలె నుండును.), ప్రథమహేతుభూతంబగు = ఆదికారణ మైన, భూతతన్మాత్రగుణంబో లె = అదిభూతమువలెనే, (సూక్ష్మావస్థగల క్షీరమువలె ననుట.), సాగర = సాగరసముయొక్కయు, 'రసస్స్వాదశ్చ పారదే' అని నిఘంటువు. స్ఫటికమణులయొక్కయు, పటీర = శ్రీగంధముయొక్కయు, పాండురుచి = చలి వెలుంగుయొక్కయు, (చంద్రుఁ డనుట), పుండరీకంబుల = తెలి విరిదమ్ములయొక్క, పసకున్ = మేలిమికి, (ధావళ్యమున కనుట.), మసమసకలు = మాలిన్యమును, ఎస కొల్పు = ఆపాదించుచున్న, మిసిమి గల = కాంతిగలయట్టి, భోగిభోగ-భోగి = శేషుని యొక్క, భోగ = శరీరముయొక్క, 'భోగస్సుఖే ధనే చాహిశరీరఫణయోర్నతిః' అని

నిఘంటువు. భాగంబునకున్ = ప్రదేశమునకు, పరభాగంబు = గుణోత్కర్షము, 'పరభాగో గుణోత్కర్షః' అని నిఘంటువు. మిగులన్ = అతిశయించునట్లు, తదాత్మకంబయగు = ఆశేషశరీరమయమగు, ఉపబర్హంబునన్ = తలగడయందు, 'ఉపధానంతూపబర్హమ్' అని నిఘంటువు. (మఱియు శేషుఁడే యుపధాన మగుటకు, శ్లో. 'నివాసశయ్యాసనపాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాంగతో యథోచితం శేష ఇతీర్యతేజనైః' అనియాళవందారుశ్రీసూక్తిప్రమాణము.), మహార్హ = మిక్కిలియుచితమగు, కేయూర=బాహుపురియందలి, మణి=రత్నములచేత, కర్బురంబగు=చిత్రవర్ణమైన, కూర్పరంబు=మోచేతిని, 'స్యాత్కఫోణిస్తుకూర్పరః' అని నిఘంటువు. ఊని=ఊఁదుకొని. మననపర=ధ్యానపరులైన, ముని=మునులయొక్క, మనః=మనస్సులయందలి, రాగరస=అనురాగరసముయొక్క, మార్జనం జేసి = తుడుచుటచేత, (మునిమానసములకు విరక్తి గలుగఁజేసె ననుట.), మిగులన్=అధికమగునట్లు, అరుణిమ=ఎఱ్ఱఁదనమును, వహించెనో యనన్ = తాల్చెనో యనుటకు, చాలు=తగిన, కెంగేలు=ఎఱ్ఱని హస్తము, కపోలంబునన్=చెక్కిటియందు, కదియన్=సమీపింపఁగా, (చెంపక్రింద శ్రీహస్తముఁ బెట్టుకొన్నా రనుట.) త్రిదశతరు = కల్పవృక్షములయొక్క, కుసుమ = పువ్వులచేత, కంచుకిత=కప్పఁబడిన, కంచుకి=శేషునియొక్క, కంచుకాత్మకంబగు = కుబుసమేయైనట్టి, దుకూలనిచోళంబునన్ - దుకూల=వలిపెమైన, నిచోళంబునన్ = సెజ్జవలువయందు, (పడకదుప్పటి యనుట.), ఒత్తిగిలియున్నవానిన్ = ఒంటిప్రక్కను బవ్వళించియున్నట్టియు, కరిన్=గజేంద్రుని, కఱకఱింబెట్టి=బాధపెట్టి, బిట్టు=కఠినముగాను, తనచేతిచక్రంబునన్=సుదర్శనముచేత, తెగిన = ఖండితంబైన, నక్రంబు = మకరము, పూజ్యంబగు=పూజింపఁదగిన, సాయుజ్యంబున్ = భగవద్దివ్యమంగళవిగ్రహ సాంగత్యమును, ఒందెనో యనన్=పొందెనోయనునట్లు, ఉపరి = మీఁదిభాగమందు, పరిదృశ్యమాన = లెస్సగా కానవచ్చుచున్న, గండస్థల = చెక్కిటియందు, స్థ=ఉన్నట్టి, మణి=రత్నఖచితమైన. మకరకుండల=మకరాకారమగుకర్ణభూషణముయొక్క, ప్రతిబింబరుచి=ప్రతిఫలనకాంతులయొక్క, డంబరంబునన్ = ఆధిక్యముచేత, పరమసౌందర్య = మిన్నయగుచెన్నెడు, మకరంద=పూఁదేనియను, నిష్యంది యగు = కురియుచున్న, ముఖారవిందంబునన్=మోముఁదామరచేతను, అందంబగువానిన్ = సుందరుఁడగునట్టియు, నిర్నిమిషదృష్టి = ఱెప్పవాల్పనిచూడ్కిచేతను, నెట్టుకొని = ప్రయాసపడి, (కథంచనార్థకము.), చూచుతఱిన్=సేవించునప్పుడు, నీలావదాతయుఁన్ = నల్లనితెల్లని వర్ణము గలిగినదియును, ఱెప్పవట్టుతఱిన్ = ఱెప్పవాల్పుగలిగి చూచునప్పుడు, బిట్టు = అధికముగాను, ఎదుర్కొను=నేత్రములకెదురయ్యెడు, కలధౌత=రజతమువలె, గౌరగౌర=

మిక్కిలి తెల్లనైన, మహత్ =అధికమైన, మహః= తేజముయొక్క, 'తేజోధామమహో విభా' అని నిఘంటువు. పూరంబునన్ = ప్రవాహమందు, మునింగి = ఆచ్ఛాదింపఁబడి, దుర్నిరీక్ష్యయిన్ =చూడ శక్యము గానిదియు, అగు = అవునట్టి, నిజ=స్వకీయమగు, రుచిర=మనోహరమైన, మూర్తివలనన్ = దివ్యమంగళవిగ్రహమువలన, తనదు=తన, సాకార నిరాకారతలు = ఆకారముతోఁ గూడియుండుటయును నాకారములేకుండుటయును, వారికిన్ =సేవించువారికి, చూపురూపునన్ = కనఁబడిచెడురీతిచేతను, దీపించువానిన్ =వెలుంగుచున్నట్టియు, కళత్రంబులగు=చంద్రసూర్యులభార్యలయిన, శ్యామా= రాత్రిచేత, ఛాయచేత = ఛాయాదేవిచేత, (రాత్రియు నలుపు చాయ గావున సాయమగును నలు పనుట.), ప్రేమడిన్ =ప్రేమముచేత, పొదువంబడినయట్లు=అలింగనము చేయఁబడినట్లు, కప్పులు=నల్లనివియు, తొంగలులున్ = దీర్ఘములయినవియును, అగు= అవునట్టి, పక్ష్మ=ఱెప్పలయొక్క, కాలికలన్ = నైల్యములచేత, ఒప్పు = సుందరమగుచున్న, సోమసూర్యాత్మకంబు లగు=చంద్రసూర్యమయములగు, వెడంద = విశాలములును, నిడువాలు = దీర్ఘములైన, ఎఱ్ఱసెరల=రక్తరేఖలుంగల, కన్నులన్ = నేత్రములచేత, కెందమ్మిఱేకులన్ = ఎఱ్ఱదామరపూరేకులను, వెదచల్లువానిన్ = వ్యాపింపఁజేయుచున్నవాని, (స్వామికిఁ జంద్రుఁడొక్కనయనంబును సూర్యుఁ డొక్కనయనం బగుటచేత వారిపుర భార్యలయిన రాత్రియును ఛాయాదేవియును వచ్చి తమ నల్లనికాంతులు గానవచ్చునట్లు వారి నాలింగనముఁ జేసికొని విడువకయుండినట్లు నల్లని తొంగలి ఱెప్ప లొప్పె ననుట), మంకెనవిరి=బంధూకపుష్పముయొక్క, బింకంబున్ = గర్వమును, ఇంకించు=ఇవురఁజేసెడు, అధర = వాతెఱయొక్క, శోణిమ = అరుణకాంతి యనెడు, నెపంబునన్ = వ్యాజముచేత, వెలుంగు = తేజరిల్లుచున్న, ము...తోన్-ముఖ=నెమ్మోమువలన, జనిత=ఉత్పన్నుఁడగు, హుతాశనుతోన్=అగ్నిహోత్రముతో (ముఖమువలన నింద్రుండు నగ్నియుఁ బుట్టుట శ్రుతిప్రసిద్ధము), తత్సఖుండగు=అయ్యగ్నిచెలియైన, గంధవహుంగూర్పన్ =వాయువునుగలుపుటకై, నిక్కె నసన్ =నిక్కినదోయనునట్లు, ఒక్కింత = ఇంచుకంత, నిక్కు, చొక్కంపు = సుందరములైన, పొటమలన్ = పుటములచేత, చూపట్టి = దర్శనీయమై, తిలకుసుమవిలసనాపహాసి యగు=నువ్వుబువ్వువవ్వును నవ్వునట్టి, నాసన్ = ముక్కుచేత, భాసమానుం డగువానిన్ = ప్రకాశించుచున్నట్టియు, (కొంచెము నిక్కిన ముక్కుపుటములలోనుండి నిట్టూర్పులు వెడలు ననుట.) ఉదరజాత = నాభియందుఁ బుట్టిన, శ్వేత = తెల్లనగు, ధామ=కాంతి గల, తామరసంబున్ = కమలమును, కనుంగొని = చూచి, మహదాశ్రయంబు గనిన = మహదాశ్రయమును బొందిన, 'నీచాశ్రయోనకర్తవ్యఃకర్తవ్యోమహదాశ్రయః' అన్న ట్లనుట. పూర్ణిమాశశాంకుం

డనుశంకన్ = పున్నమనాఁటిచందురుం డనుసందియంబున, (తెల్లని నాభీకమలము చంద్రునివలె నుండె ననుట), అతనికిన్ = ఆచంద్రునికి, నాఁడున్ = రాహువున కనుట. వైరంబుమాన్పుమని = పగలేకుండఁజేయుమని, తత్సహోదరిగావునన్ = ఆచంద్రునికిఁ దోఁబుట్టువగుటం జేసి, రత్నకాంచనంబులు = మణికనకములు, లంచంబులుగా నివేదించి = ఉపాయనములుగా సమర్పించి, అడుగులొత్తు = స్వామిపాదము లొత్తుచున్న, ఇందిరకున్ = శ్రీదేవికి (దీనికిఁ దత్సహోదరి యనునది విశేషణము), వరముంబడియున్న = ప్రాణాచారముపడియున్న, రాహు వనన్ = రాహుగ్రహ మనునట్లు (చంద్రుఁడు తొల్లిదుర్బలుఁడై యుండి మహదాశ్రయముఁ జేసినపిదపఁ దనకుఁ జేటు గలుగు నని యులికి రాహుగ్రహ మిట్లు చేసిన ట్లుండె ననుట). కేయూర = భుజకీర్తులచేతను, కటక=కడియములచేతను, మణిముద్రికా=రతనంపుముద్దుటుంగరములచేతను, అంకితంబగు=చిహ్నితమైన, బాహుపరిఘంబు=పరిఘాయుధమువంటి దీర్ఘభుజము, కటీతటోత్సంగంబునన్=పిఱుందు ప్రక్కమీఁదను, మెఱయువానిన్ = ప్రకాశించుచున్నట్టియు, ఉరస్స్థల=వక్షస్స్థలమందు, న్యస్త=ఉనుపఁబడిన, నిస్తుల=సరిలేని, అస్తోక = స్థూలమగు, కౌస్తుభ = కౌస్తుభమణియొక్క, గభస్తి=కాంతులయొక్క, మండలంబునన్ = సమూహమందు, 'మండలంచక్రవాళకమ్' అని యమరము. నిండోలగం బుండు = నిండుసభదీఱిన, పుండరీకనికేతన = కమలనివాసినియగులక్ష్మీదేవియొక్క, తనుచ్ఛాయ యనన్ = దేహకాంతియో యనునట్లు, అచ్ఛాచ్ఛంబగు = మిక్కిలిస్వచ్ఛమగు, శ్రీవత్సంబునన్ = శ్రీవత్స మనుమచ్చచేత, లోచనోత్సవంబుఁ గావించువానిన్ = కన్నులపండువుచేయునట్టియు, విజిత=గెలువఁబడిన, మృగనాభి=కస్తూరిగల, సౌరభ్యంబునకున్ = నెత్తావికి, నెగయు=వచ్చుచున్న, (ఎఱఁగు నని పాఠాంతర మట్లేని వాలుచున్న), ఉత్తుంగ = తఱచైన, భృంగమాలిక యనన్=తుమ్మెదలవరుస యనఁగా, మెఱయు = తనరుచున్న, అసిత=నల్లనైన, పేశల = లేఁత యగు, తులసిపలాశ = తిరుతుళాయిదళములయొక్క, దామంబునన్ =వనమాలికచేత, అభిరామ=సుందర మగు, కోమల=మృదువైన, అలంకృతియగువానిన్ =అలంకారముగలయట్టియు (ఆకృతియగువాని నని కొంద ఱందురు.), కపటకరటివిరోధియై = మాయాసింహమై, అసుర = హిరణ్యకశిపునియొక్క, ఉసుఱుకొని=ప్రాణాపహారముఁజేసి మగుడన్ = మరల, మనుజాంగంబున్ = మానవాకారమును, అంగీకరించునెడన్ = గ్రహియించునప్పుడు, తలంపంబడమిన్ = జ్ఞప్తిరాకుండుటచేత, అట్లన యుండె ననన్ = ఆప్రకారమే యుండె ననునట్లు, బడుగుబడుగగు = మిక్కిలిసూక్ష్మమగు, నడుముపసన్ - నడుము = మధ్యముయొక్క, పసన్=మేలిమిచేత, కడున్ =మిక్కిలి, ఒడికమగువానిన్ = శృంగారమైనట్టివానిని, ఘన=గొప్పయైన, జఘన=

పిఱుఁదనియెడు, చరమేతరధరాధర=ఉదయపర్వతముయొక్క, అధిత్యకాతలంబునన్ = ఊర్ధ్వప్రదేశమందు, 'ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వమధిత్యకా' అని యమరము. కాంచనకాంచికా=బంగారుమొలనూలియందలి, మణిమకుట=మణిశ్రేష్ఠ మనియెడు, గగనమణి=సూర్యుఁడు, కాఁగు = వ్యాపింపఁజేయు, ఈరెండమెండునన్ = బాలాతపాతిశయమనునట్లు పరఁగు=ఒప్పుచున్న, మొఱుంగు=కాంతివిశిష్టమైన, పీతాంబరంబునన్ = కట్టుబంగరుపుట్టముచేత, పొదువంబడి=ఆచ్ఛాదింపంబడి, దాని=అవస్త్రముయొక్క, సన్నఁదనంబునన్ = పలుపెదనముచేత, తననున్నదనంబు=తొడదోయినునుపు, (పరుషోసరశేషైవ సమాసేనుమతోభవేత్, అద్రుత్సారసాచందు పట్టికూర్చి విభక్తిషు, తనేచకుత్రచిదతోవికారాచ్ఛాపికేచన' అనునథర్వణోక్తిచేత, సమాగమము.) వెలుపలం దోఁపన్ = బయిటఁగానరాఁగా, కనకపుష్యరాగంపు-(=కనకపుష్యరాగము లను మణులయొక్క: లేక, కనక=బంగారుయొక్కయు, పుష్యరాగము లనుమణులయొక్కయు;) కనక = బంగారుయొక్కయు, పుష్యరాగంపు=పుష్యరాగములయొక్కయు సంబంధముగల, తెరవాఱు = తెరలుగలిగిన; లేక, తెరవారు=నూలిపోఁగులుపైఁదిరిగినట్లుండు, వైదూర్యమణి=వైదూర్యరత్నవికారములగు, స్తంభ = స్తంభములయొక్క, యుగంబునుంబోలె=జతవలెనే,

ఆ. 'పగలు గొంది గానఁబడెడు బిడాలంబు, పన్నువోలె వెలుఁగు గల్గి నూలు,
తిరుగు నట్లు మీఁదఁ దెరవాఱు వైదూర్య,రత్నమున కిది ప్రయత్న మమరు.'

అని వైదూర్యలక్షణము. కించిదామీలిత = కొంచెము గప్పఁబడిన, నీలిమంబగు = నైల్యముగల, ఊరుయుగళంబువానికి = తొడదోయిగలయట్టియు, త్రైవిక్రమంబగు = త్రివిక్రమావతారసంబంధియగు, విగ్రహంబుతోన్ = నెమ్మేనితోడ, ఆగ్రహంబునన్ = కోపముచేత, మీఁదికిఁజాఁచుతఱిన్ = గగనంబునకు బ్రసరింపఁ జేయునప్పుడు, చంక్రమణరయంబునన్ = ప్రసరణవేగముచేత, తగిలి వచ్చిన = చుట్టివచ్చిన, మణిమయ = రత్నవికారమైన, స్వర్భువన = స్వర్గలోకమందలి, జాంబూనద ప్రాకారవలయంబనన్ = వలయమువంటి బంగారుకోట యనునట్లు, తీండ్రించు = మెఱయుచున్న, ఉద్దండ = అధికమైన, గండపెండెరంబునన్ = పాదకటకమందు, పొడము = పుట్టునట్టి, అఖండ = ఎడతెగని, ప్రభా = కాంతులయొక్క, మండలంబునన్ = సమూహముచేత, పరిపిండితంబులై = కూర్పఁబడినవై, మట్టిపండువడువుగల = వటఫలసౌందర్యము గలిగినట్టి, మడిమలన్ = పార్ష్ణిభాగములచేత, బెడంగువడి = ప్రకాశించి, భావి = కాఁగల, నిజ= స్వకీయమైన, కమఠావతార = కూర్మావతారమునకు, దాచకంబులుబోలె = సూచకములవలెనే, కొదమతాఁబేళ్లు = లేతతాఁబేళ్లయొక్క (తాఁబేలు తామేలనియుఁనుం గలదు), మేల్లన్ = మేలులను, నగు = హసించెడు, మీఁగాళ్ళతోన్ = ప్రపదంబులతోడ,

కోకనద=ఎఱ్ఱగలువలవలెనే, 'రక్తోత్పలం కోకనదమ్' అని యమరము. మృదు=కోమలము లైన, ఉదరంబులు = గర్భములు (అఱకాళ్ళనుట.), అమరన్ = ఒప్పఁగా, మెఱుఁగుఁ జుక్కల = ప్రకాశముగల నక్షత్రములయొక్క, జిగి = కాంతిని, మొక్కపఱుచు = భంగపఱుచునట్టి, నఖ=గోళ్లయొక్క, చక్రవాళ = మండలములయొక్క, చంద్రికలన్ = వెన్నెలలచేత, భక్తజనమనః = భక్తులమనస్సులయందలి, తమః = శోక మను చీఁకటి యొక్క, 'రాహౌ ధ్వాంతే గుణే శోకే తమశ్శబ్దాఽభిధీయతే' అని నిఘంటువు. విదళ నంబున్=ఛేదనమును, కావించుచున్ = చేయుచును, హలకులిశకలశకమలమకరాంకుశ = హలకులిశాదితత్తద్రేఖలచేత, అంకితంబులై = చిహ్నితములై, లక్ష్మీసుచకుంకుమాకలనన్ = కలుములజవరాలి పాలిండ్ల చెందిరంపుఁబూఁతచేత, అరుణారుణంబులగు = తఱుచు కెంజాయగల, చరణంబులన్ = శ్రీపాదములచేత (శ్రీదేవిస్వామి పాదములను దన యక్కునఁ జేర్చుకొనిన నవి మిగులఁ గెంపెక్కె ననుట.), తాపత్రయాపహరణంబు సేయువానిన్ = ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములను తాపత్రయమును రూపుమాపు నట్టి, నారాయణున్, పురాణపురుషున్, పురుషోత్తమున్, ప్రణతార్తిహరున్, వాసు దేవున్, హృషీకేశున్, ఈశనుతున్, విభీషణవరదున్, లనంగజనకున్, రంగరమణున్ = ఏవంవిధ నామధేయములు గల శ్రీరంగనాయకస్వామిని, కాంచి = దర్శనము చేసి, సహ సమాగత=తనతోడవచ్చిన, భాగవత = భగవద్భక్తులయొక్క, పరిషత్సమేతంబుగాన్ = సమాజముతోఁగూడ తానున్ = ఆ విష్ణుచిత్తుండును, తనుజాతయున్ = కొమార్తె యగు చూడికుడుత్తనాంచారును, ప్రమదభయభక్తిరసమగ్నులై, జయజయశబ్దంబు లతోన్ = జయజయమనువాక్కులతో, సర్వాంగాలింగిత = సర్వావయములచేత స్పృశింపఁబడ్డ, క్షోణితలంబులగు=భూతలములుగల, నమస్కారంబులు, కావించి నిలిచి, నిటలతట = లలాటప్రదేశమందు, ఘటిత = కూర్పఁబడిన, అంజలియై = దోసిలిగలవాఁడై, ఇట్లని = ఈవక్ష్యమాణక్రమముగా, స్తుతియించెన్ = వినుతించెను. (ఆ విష్ణుచిత్తుఁ డనుట.)

తే. విధిగృహాక్షయవిత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకుపుణ్యరాశికిని బ్రణతి
ధనపతి భ్రాతృకుల దేవతకు జొహారు
నతమృడాదిక సుమనస్సునకు నమస్సు. 99

టీ. విధి = చతుర్ముఖునియొక్క, గృహ=ఇంటియందు, అక్షయ = నాశములేని, విత్త = ధనమునకు, సేవధికిన్ = నిక్షేపమయిననీకు, శరణు=నమస్కారము, (శ్రీరంగనాయ కులు బ్రహ్మగృహమందలి తిరువారాధన యని ప్రసిద్ధము.) చిర = తడవుగాను, కృత = చేయఁబడిన, ఇక్ష్వాకు = ఇక్ష్వాకుమహారాజుయొక్క, పుణ్య = సుకృతములయొక్క,

రాశికిని = ప్రోవైననీకు, ప్రణుతి = వందనము (తరువాత ఇక్ష్వాకుమహారాజునకుఁ దపఃఫలముపై తోఁచితి వనుట), ధనపతి=కుబేరునకు, భ్రాతృ = తమ్ముఁడైన విభీషణునకు, కుల దేవతవు = కులదైవమైననీకు, జోహారు = జోహారు (పిమ్మట శ్రీరాములవలన విభీషణునకు వచ్చితి వనుట) నత = నమ్రులైన, మృడాదిక = శివుఁడు మొదలగు, 'గిరీశో గిరిశో మృడః' అని యమరము. సుమనస్సునకున్ = దేవతలు గలవానికి, 'సుపర్వాణస్సుమనసః' అని యమరము. నమస్సు = నమస్కారము.

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
నప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నణుసమూహములకును న
ణీయు నిన్ను ననాధారు నిత్యు సత్యు. 100

టీ. సర్వేశున్ = సర్వప్రపంచనాథుఁడైనట్టియు, సర్వాత్మకునిన్ = సర్వాంతర్యామి యైనట్టియు, అనంతున్ = అంతరహితుఁ డయినట్టియు, అప్రకాశున్ = చక్షురగోచరుఁడయినట్టియు, అభేద్యున్ = ఇయత్తా పరిమాణ విశిష్టుఁ డని తెలియ శక్యుఁడుగానియట్టియు, సమస్తలోక = సర్వలోకములయొక్క, సముదయ = వృద్ధికి, ఆధారున్ = మూలాధారమైనట్టియు, అణుసమూహములకును = సూక్ష్మవస్తురాసులకంటె, అణీయున్ = పరమాణుస్వరూపుఁడైనట్టియు, నిత్యున్, అనాధారున్, సత్యున్, నిన్నున్, కొలుతున్ = సేవింతును. ఇక్కడ చెప్పిన అణీయస్త్వాదులు శ్రుతిప్రసిద్ధములు.

క. నారాయణు భూ ప్రభృతిక
గౌరవవద్వస్తువితతికంటె మిగిలి పెం
పారు గరిష్ఠతగల పర
పూరుషు శరణంబువేఁడి ప్రోగడెద నిన్నున్. 101

టీ. నారాయణున్=(నరసమూహము నారము. దానికి ఆయన మనియును, అది అయనముగాఁగలవాఁడనియును, వ్యుత్పత్తిద్వయము చేయుటచేత) ఆధారత్వాధేయత్వములు గల యట్టివానిని, భూ = భూమి, ప్రభృతిక = మొదలుగాఁగల, గౌరవవత్=గరిమముగల, వస్తువితతికంటె = భూతసమూహముకంటెను, మిగిలి=అతిశయించి, పెంపారు = వృద్ధియగుచున్న, గరిష్ఠతగల = అతిగురుత్వము గలిగిన, పరపూరుషున్ = పరమపురుషుఁడ వైన, నిన్నున్, శరణంబు వేఁడి, ప్రోగడెదన్ = కొనియాడెదను.

తే. అజశివాదిక మగునీసమస్తజగము
నెందుఁ బ్రభవించు వర్తించు నిందునట్టి

మహిమ కిమ్మైన నిత్యు సమస్తభూత
మయుఁ బరులకంటెఁ బరు మహామహునిఁ గొలుతు. 102

టీ. అజ = బ్రహ్మయు, శివ = శూలియు, ఆదిక మగు=మొదలుగాఁగల యట్టి, ఈసమస్తజగమున్ = జగమెల్లను, ఎందున్ = ఎచ్చటను, ప్రభవించున్ = పుట్టునో, వర్తించున్ = సంచరించునో, డిందున్ = లీనమగునో, అట్టిమహిమకున్ = ఆమహత్త్వమునకు, ఇమ్మైన=స్థానమైనట్టి. నిత్యున్=శాశ్వతుఁ డగువాని (అజశివాదులశాశ్వతులనుట), సమస్తభూతమయున్=సర్వభూతాత్మకుఁ డగువానిని, పరులకంటెన్=ప్రకృతిజీవులకంటెను, పరున్ = విలక్షణుఁడగువానిని, మహామహునిన్ = మహాతేజోరూపుఁడైన నిన్ను, కొలుతున్=సేవింతును.

సీ. పరపురుషునికంటెఁ బరుఁడు నాఁ జనువానిఁ
  బరమాత్ము ముక్తికై పరమయోగి
పరిషత్తుచే సదా భావింపఁబడువాని
  నెవ్వనియందుఁ బ్రాకృతము లైన
సత్త్వాదిగుణముల సందడి లే దట్టి
  విమలుని సర్వభూతములకంటె
నాద్యుఁడు శుద్ధుండు నగువాని విభుఁ గళా
  కాష్ఠానిమేషాది కాలసూత్ర
తే. మయిన శక్తి యింద్రియ వితతికి
గోచరము గాదె నిర్లేపుఁ డై చెలఁగుట
నతి విశుద్ధుఁడు దానయ్యు నౌపచార
వృత్తిఁ బరమేశుఁ డగు నిన్ను విష్ణుఁ దలఁతు. 103

టీ. పరపురుషునికంటెన్ = జీవునికంటెను, పరుఁడు నాన్=అన్యుఁడుగా, చనువానిన్ = చెల్లునట్టివానిని, 'ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః' అను గీతావాక్యప్రకార మనుట. పరమాత్మున్, ముక్తికై = మోక్షముకొఱకు, పరమయోగిపరిషత్తుచేన్ = మహాయోగిసమాజముచేత, సదా = ఎల్లప్పుడును, భావింపఁబడువానిన్ = ధ్యానింపఁబడువానిని, ఎవ్వనియందున్=ఏవానియందు, ప్రాకృతములైన = ప్రకృతిసంబంధులైన, సత్త్వాదిగుణముల = సత్త్వరజస్తమోగుణములయొక్క, సందడి = సపర్కము, లేదు = లేకుండునో, 'సత్త్వాదయో నసంతీశే యత్ర చ ప్రాకృతా గుణాః' యను సంహితావచనము చెప్పిన దనుట, అట్టి, విమలునిన్=నిర్మలుఁడగువాని, సర్వభూతములకంటెన్ =

ఆకాశాదిసకలభూతములకంటె, ఆద్యుఁడు = మొదలివాఁడును, శుద్ధుండునగువానిన్, విభున్ = వ్యాపకుఁడగువాని, కళాకాష్ఠానిమేషాది = కళలు కాష్ఠలు నిమిషములు మొదలగు, కాల = కాలమునకు, సూత్రమయిన = నడుపునదియైనట్టి, ఎవ్వానిశక్తి = ఎవనిసామర్థ్యము, ఇంద్రియవితతికిన్ = ఇంద్రియసమూహమునకు, గోచరముగాదో = కనఁబడదో, నిర్లేపుఁడై = అంటనివాఁడై, వెలుఁగుటన్ = ప్రకాశించుటచేత, తాన్ = తాను, అతివిశుద్ధుఁడైనను, ఔపచారవృత్తిన్ = ఉపచారవ్యాపారముచేత, పరమేశ్వరుఁడైనట్టి, విష్ణున్, నిన్నున్, తలఁతున్.

వ. అని పరస్వరూప సురసేవ్య భవ్య దివ్యావతారలీలలం బ్రస్తుతించినఁ గౌస్తుభాభరణుండు కరుణాతరంగితంబులగు నపాంగంబుల నమ్మునిం గనుంగొని కుశలప్రశ్నంబుఁ గావించి కంకణాలంకార క్రేంకారంబు లంకురింపఁ బదపంకజంబులకుఁ గుసుమాంజలులు సమర్పించు సకలసీమంతినీసీమంత ముక్తామణి యగు నాముక్తమాల్యదరూపు నెల ప్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన. 104

టీ. అని = ఈప్రకారము, పరస్వరూప = నిత్యముక్తసేవ్యమైన పరస్వరూపముయొక్కయు, సురసేవ్య = వేల్పులచే భజింపఁదగిన, భవ్య = మంగళకరములగు, దివ్యావతార = దివ్యావతారములయొక్క, లీలలన్ = విలాసములను, (లేక) 'లీలా విలాసక్రియయో' అని నిఘంటువు. ప్రస్తుతించినన్ = నుతింపఁగా, కౌస్తుభాభరణుండు = శ్రీరంగనాయకులు, కరుణాతరంగితంబులగు = కృపాతరంగయుక్తములగు, అపాంగంబులన్ = క్రీఁగంటిచూపులచేత, అమ్మునిన్ = ఆ పెరియాళ్వారులను, కనుంగొని = కటాక్షించి, కుశలప్రశ్నంబుఁ గావించి = క్షేమమా యని యడిగి, కంకణాలంకార = కంకణభూషణములయొక్క, క్రేంకారంబులు = నాదములు, అంకురింపన్ = మొలతేరఁగా, పదపంకజంబులకున్ = తమ తిరువడిత్తామరలకును, కుసుమాంజలులు = పుష్పాంజలులను, సమర్పించు = సమర్పించుచున్న, సకలసీమంతినీ = సర్వకాంతలయొక్క, సీమంత = పాపటలకు, ముక్తామణి యగు = ముత్తెమైన, ఆముక్తమాల్యద = చూడికుడుత్తనాంచారుయొక్క, రూపున్ = రూపమును, ఎల ప్రాయంబున్ = లేఁతవయస్సును, సాభిప్రాయంబుగాన్ = అభిప్రాయము గలిగినట్లుగాను, చూచి = వీక్షించి, తనలోనన్ = ఆత్మగతంబున.

సీ. దీనిచూపెదు రెక్కఁ దగానెకా సిరిపట్టి
కిని బోర బిరుదులెక్కంబు గలిగె
దీనికా నల్లాడఁ దగానెకా గర్వించి
యుర్విఁ జైత్రునకుఁ గాలూఁదఁ గలిగె

దీనిపాలిండ్లుబ్బఁ గా నెకా రతిచేతి
  కిన్నెరమ్రోఁతకు వన్నె గలిగె
దీనిమో మొప్పారఁ గా నెకా వాణి రా
  యంచలేమకుఁ గులాయంబు గలిగె
తే. దీని పెన్నెఱు లేపారఁ గా నెకా ప్ర
  పోషితమయూరికి విరాళిఁ బొందు గలిగె
దీనియడుగులు రంజిల్లఁ గా నెకా పి
  పాసఁ బడు తేఁటులకు మెట్టపంట గలిగె. 105

టీ. దీని = ఈయాముక్తమాల్యదయొక్క, చూపు = దృష్టి, ఎదు రెక్కఁగా నెకా = పైకివ్యాపింపఁగా నేకదా, సిరిపట్టికిని = మన్మథునికి, పోరన్ = యుద్ధమునందు, బిరుదు టెక్కెంబు = బిరుదైనధ్వజము, కలిగెను. (ఈకన్యక మీనలోచన యనియును, మన్మథుఁడు మీనకేతనుఁ డనియు ననుట.) దీని = ఈమె, కౌను = నడుము, అల్లాడఁగా నెకా = చలించుచుండగా నేకదా, గర్వించి = మదించి, ఉర్విన్ = భూమియందు, చైత్రునకున్ = వసంతమాసమునకు, కాలూఁదఁగలిగెన్ = పాదమునిలుపుకోఁగలిగెను. (మధ్యము లతవలె నుండెననియును లతాదులవలననే వసంతునికిఁ గీర్తి గలుగు ననుట.) దీని, పాలిండ్లు = చన్నులు, ఉబ్బఁగా నెకా = వృద్ధిఁబొందఁగా నేకదా, రతిచేతి = రతీదేవిహస్తమున నున్న, కిన్నెరమ్రోఁతకున్ = కిన్నెరనాదమునకు, వన్నె గలిగెన్ = ప్రశస్తిగలిగినది. (పాలిండ్లకుఁ గిన్నెరకాయలకు సామ్యమునకు 'పైపూఁతరుచిగాని ప్రతియె కిన్నెరకాయ, లరిది మేరువు తలయంపి నిడిన' అని వసుచరిత్రము.) దీని, మోము = ముఖము, ఒప్పారఁగా నెకా = ప్రకాశింపఁగా నేకదా, వాణి = సరస్వతియొక్క, రాయంచలేమకున్ = రాజహంసికకు (సరస్వతికి హంసిక వాహన మనుట), కులాయంబు గలిగెన్ = నివాస మొదవెను. 'కులాయో నీడ మస్త్రియామ్' అని నిఘంటువు. (హంసకుఁ బద్మము నివాస మనియుఁ నాయమ పద్మముఖి యని యనుట.) దీని పెన్నెఱులు = నిడుగుఱులు, ఏపారఁగా నెకా = బలిష్ఠములుగాఁగా నేగదా, ప్రపోషితమయూరికిన్ = పెంపుడు నెమిలికి, విరాళిఁబొందుగలిగెన్ = మోహసంగతి గలిగెను. (వెండ్రుకలు మేఘమువలె నుండెననియు మేఘమునకు నెమిలి సంతసించుననుట.) దీని అడుగులు = పాదములు, రంజిల్లఁగా నెకా = వికసిల్లఁగా నేకదా, పిపాసఁబడు = నీరువట్టుగల, తేఁటులకున్ = మధుకరములకు, మెట్టపంట గలిగెన్. (పాదములు మెట్టదామరవలె నుండె ననియుఁ తుమ్మెదల కత్తమ్ములు నెమ్మి యొదవించు ననుట.) ఈపద్యమందు విషయినిగరణాలంకారము.

తే. అనుచు నువ్విళులూరు మురారి తమక
మాఁప లేక తాత్మ దివ్యశుద్ధాంతసీమ
కన్నెలంతఁ దార్చి యొక్కమాయావధూటి
నట్లు గావించి వారున్నదనియ యుండ. 106

టీ. అనుచున్ = ఇట్లు తలంచుచు, ఉవ్విళులూరు = కోరికలుగోరు, మురారి = శ్రీరంగనాయకుఁడు, తమకము = మోహమును, ఆఁపలేక = నిలుప లేక, ఆత్మ = తన యొక్క, దివ్య=శ్రేష్ఠమైన, శుద్ధాంత = అంతఃపురముయొక్క, 'శుద్ధాంతశ్చావరోధశ్చ' అని నిఘంటువు. సీమకున్ = ప్రదేశమునకు, ఆ కన్నెలంతన్ = ఆచూడికుడుత్తనాంచారును తార్చి=ప్రవేశపెట్టి, ఒక్కమాయావధూటికిన్ = ఒకమాయ నెలఁతను, అట్లు = ఆరయా ముక్తమాల్యపపలె నే, గావించి = చేసి, వారు=ఆవిష్ణుచిత్తుఁడు మొదలగువారు, ఉన్న దనియ=ఆయమ యక్కడనే యున్న దనియే, ఉండన్ = ఉండఁగా.

వ. పూజకులచేఁ బాదతీర్థప్రసాదపరివేష్టనంబు లిప్పించి విడిది కనిపిన గుడివెడలి శాంబరీతనుసంభవం బాలకిం బెట్టి గృహంబునకుం జని పంజరంబు సడలించి యచ్చంచలాక్షిం గానక. 107

టీ. పూజకులచేతన్ = నంబులచేత, పాదతీర్థప్రసాద = శ్రీపాదతీర్థప్రసాదములును, పరివేష్టనంబులు = పరివట్టమును (ద్వంద్వాంతమందు బహువచనము.), ఇప్పించి = ఒసఁగించి, విడిదికిన్ = బసకు, అనిపినన్ = పంపఁగా, గుడివెడలి = కోవెలనుండిబయలు దేరి, శాంబరీతనుసంభవన్ = మాయాపుత్త్రికను, పాలకిన్ = పల్లకియందు, పెట్టి = ఉనిచికొని, గృహంబునకుం జని = తిరుమాళిగకుఁ బోయి, పంజరంబు సడలించి = పల్లకి గవిసెనఁదీసి, అచ్చంచలాక్షిన్ = ఆ చపలాక్షిని, కానక.

శా. * అబ్రహ్మణ్యము లోన వైచుకొనె నన్యాయంబున న్నత్సుతం
దా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూదియుం †ద్రోతురే
యీ బ్రక్కం ద్విజుఁ జూడ రయ్య సభవారీరంగ భర్తంచుదుగ
ఖాబ్రాశిం బడి‡బాష్పకంఠుఁడు సముద్యద్గోగపలాలుండునై. 108

టీ. అబ్రహ్మణ్యము = మొఱ్ఱో, 'అబ్రహ్మణ్యమవధ్యోక్తౌ' అని నిఘంటువు. (అబ్రహ్మణ్య మను పాఠమున నా రంగనాయకు లనుట. 'బ్రహ్మణ్యోదేవకీపుత్త్రః' యని యున్నది). ఈ రంగభర్త = ఈ శ్రీరంగనాథుఁడు, తాన్ = తాను, బ్రహ్మాదుల = బ్రహ్మ మొదలగువారి, మేర = మర్యాదను, నిల్పియున్ = ప్రతిష్ఠాపించియును, ప్రభుత్వంబూఁది

* అబ్రహ్మణ్యా. † ద్రోఁతురే. ‡ భాష్పలోచనుఁడు సమ్యగ్గోగపలాళుండు.

యున్ = దొరతనముఁ దాల్చియును, మత్సుతన్ = నాకూఁతును, అన్యాయంబునన్ = ధర్మేతరవృత్తిచేత, లోనవైచుకొనెన్ = లోపలవేసికొనెను, త్రోతురే = నను విసర్జింతురా? (ఇచ్చట దోఁతురే యని పాఠాంతర మట్లేని దోఁచుకొందురా యని యర్థము), సభవారు = సభ్యులు, ఈబ్రక్కన్ = ఈ పేదవాఁడైన, ద్విజున్ = బ్రాహ్మణుని, చూడరయ్యా=కనరయ్యా? అంచున్, దుఃఖ+అప్+రాశిన్ = దుఃఖసముద్రమందు, పడి, బాష్పకంఠుఁడు=డగ్గుత్తికగలవాఁడును, సముద్యత్ =పైకిలేచుచున్న, దోఃపలాలుండునై= కరపల్లవములు గలవాఁడునై 'పలాలః పల్లవస్సమా' అని నిఘంటువు.

శా. ఎంతేవేడుకయైనఁ బెండ్లగుట కీనే దేహము న్ప్రాణముల్
సంతానంబు నిశాంతము న్ధనము సస్యంబు ల్పశుశ్రేణు లే
కాంతస్వస్వజనార్చనంబునకె కాదా కూర్చుటే మీ కయో
వింతే యీ బుడు తెంత నన్గుఱుచఁ గావింపం దను న్మెత్తురే. 109

టీ. ఎంతేవేడుకయైనన్ = తనకు మిక్కిలి ప్రియమైనను, పెండ్లగుటకున్ = వివాహమగుటకు, ఈనే = ఈ చిన్నదాని నియ్యనా (ఇత్తు ననుట), దేహమున్, ప్రాణమున్, సంతానంబున్, నిశాంతమున్ = గృహమును, ధనము, సస్యంబుల్ = ధాన్యములును, పశుశ్రేణులు = పసరములు, ఏన్ = నేను, కూర్చుటే = సంపాదించుటే, ఏకాంత=ముఖ్యమగునట్లు, స్వ=తనయొక్క, స్వజన = తనభక్తులయొక్క, అర్చనంబునకె= పూజనమునకే, కాదా = అవు ననుట, మీకు, అయో = అయ్యో! వింతే = ఇది యాశ్చర్యమా? ఈ బుడుతెంత = ఈ చిన్నది యనఁగా నెంత, నన్గుఱుచఁగావింపన్ = నన్నుఁ దక్కువపఱుపఁగా, తనున్ = తన్ను, మెత్తురే=హర్షింతురా? (మెచ్చ రనుట).

తా. తన కంత వేడుక గలిగిన నేను నా కూఁతు నిచ్చి పెండ్లి చేయనా? దేహాది పశుపర్యంతము సమస్తద్రవ్యములు తనకొఱకుఁ దనభక్తులకొఱకే కదా సంపాదించుట? నా కూఁతు రనఁగా నెంత? న న్నమర్యాద చేసిన దనకు మెప్పువునా? యని విష్ణుచిత్తుఁడు చెప్పెను.

చ. శివుఁడు విరించి వాసవుఁడుఁ జెప్ప నశక్తులు గొల్చినట్టి వా
రవుట నిరంకుశుండ నని యక్కట పాడిఁ దొఱంగఁ జెల్లునే?
భువనములెల్ల నీ వయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా
గవతులు లేరె? నా కొఱకుఁగా వహియించుకొనంగఁ గేశవా!

టీ. శివుఁడు=శంభుఁడును, విరించి=బ్రహ్మయును, వాసవుఁడున్=దేవేంద్రుఁడును, కొల్చినట్టివారవుటన్ = సేవించినవారగుటచేతను (సేవకు లనుట), చెప్పనశక్తులు = మనవి సేయశక్తులుగారు, నిరంకుశుండ నని = అడ్డములేనివాఁడని, అక్కట = అయ్యో!

పాడిక్ = మర్యాదను, తొఱంగఁజెల్లునే = విడువవచ్చునా? భువనములెల్లక్ = లోకములన్నియు, నీవి = నీ సంబంధులైనవి, అయినక్ = ఆయెనేనియు (లోకము లన్నియు, నీవి గావున నిపక్షముగాఁ జెప్పనేనియు ననుట), పొంతక్=నీసమీపమందు, దయానిధి = అక్కటికంపుఁబ్రోవైన, అమ్మ = మాతల్లియైన లక్ష్మీదేవి, లేదె = సాక్షిగా లేదా (ఉన్న దనుట), 'ఇందిరా లోకమాతా' అని నిఘంటువు. 'మాతా చ కమలాదేవీ పితా దేవో జనార్దనః' అనునది ప్రమాణము. కేశవా = బ్రహ్మరుద్ర జననకారణ మగు శరీరముగల స్వామీ! నాకొఱకుఁ గాక్ = నాకొఱకై, వహించుకొనంగక్ = పైని వేసికొనిచెప్పుటకు, భాగవతులులేరె=శ్రీవైష్ణవులులేరా? (ఉన్నా రనుట). (లక్ష్మీదేవియు భాగవతులును పురుషకారపరు లని ప్రమాణము.)

ఉ. నెట్టన యల్ల లచ్చి యలనీళయు భూసతి యుండ నీకు నీ
నెట్టికసీలపై మనసు నిల్పుట కేమనవచ్చు? వెఱ్ఱి యౌ
నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్క వింతచూ
పెట్టిది? దిద్దు నెవ్వఁ డిల నేఱులవంకలు వారిడొంకలున్. 111

టీ. నెట్టన=సిద్ధముగా, అల్లలచ్చి = ఆలక్ష్మీదేవియు, అలనీళయు=ఆనీళాదేవియు, భూసతి = భూదేవియు, ఉండక్ = ఉండఁగా, నీకుక్, ఈ నెట్టికసీలపైక్=శుష్కోపవాసి వ్రతముగల యీ కన్యకమీఁద, కుతికయంటుసీలలయంతటిచిన్నది, మనసు నిల్పుటకుక్, ఏమనవచ్చుక్, పేదక్=బక్కవాఁడనగు, నన్నుక్, వెఱ్ఱి యౌనట్టుగక్= పిచ్చివాఁడగునట్లు, పరిహాసము సేఁతకుఁ దక్కక్ = గేలిసేయుటకే కాని, వింతచూపు= నూతనదృష్టి, ఎట్టిది=మీకేలాగుది, ఇలక్ = భూమియందు, ఏఱులవంకలు=నదులవక్రత్వములును, వారిడొంకలుక్ = ఉదకముల మార్గములును, ఎవ్వఁడు, దిద్దుక్ = చక్కఁదీర్చును (ఎవ్వఁడును దీర్పఁడనుట. నావెఱ్ఱితన మానదీవక్రత్వము మొదలగువాని వంటి దనుట), ప్రబలు లగువారి నడకలను దిద్దుట దుర్ఘట మని చెప్పవచ్చును.

వ. అని యిట్లు ధరణీసురుం డదవెట్ట భాగవతక్షోభంబునకు భువనభర్తయు భయంపడి తచ్ఛాందసంబునకు గేలిసేయు చున్నవాఁ డను భావం బతనికిఁ దోఁప మకరకుండలమండితంబు లగుగండదర్పణంబులం జిఱునవ్వొలర్ప ని ట్లనిగొ. 112

టీ. అని యిట్లు=ఈప్రకారముగా, ధరణీసురుండు=విష్ణుచిత్తుండు, అదవెట్టక్= మొఱపెట్టఁగా, భాగవతక్షోభంబునకుక్ = భగవద్భక్తుని దుఃఖమునకు, భువనభర్తయుక్=లోకరక్షకుం డగు శ్రీరంగనాథుండును, భయంపడి=జడిసి, తచ్ఛాందసంబునకుక్=ఆవిష్ణుచిత్తుని యుపయోగములేనిమాటలకు, గేలిసేయుచున్నవాఁ డను భావంబు=

పరిహాసముచేయుచున్నవాఁ డను తాత్పర్యము, అతనికిఁ దోఁపఁ = ఆవిష్టచిత్తునకుఁ దోఁచునట్టు, మకరకుండలమండితంబులగు = నక్రాకారకర్ణవేష్టములచేత నలంకృతములగు, గండదర్పణంబులఁ = చెక్కుటద్దములయందు, చిఱునవ్వొలర్పఁ = మందహాస మంకురించునట్లు, ఇట్లనియె.

చ. ముది మదిఁ దప్పితోయి మునిముఖ్య! భవత్తనయ న్గృహంబునఁ
బదిలము చేసివచ్చి మఱి బట్టబయల్వెడదూఱు దూఱెదా
సదన మిఁకొక్కమాటరసి చంచలలోచనఁ గాన కున్నఁ బో
రెదు మఱి కాని బుద్ధివిపరీతతఁ బొందక పోయి చూడుమా. 113

టీ. ఓయి మునిముఖ్య! ముదిమదిఁదప్పి = ముసలితనముచే మతిస్థిరముపోయి, భవత్తనయఁ=నీకూఁతును, గృహంబునఁ=ఇంటిలోన, పదిలముచేసి=భద్రముచేసి వచ్చి, మఱి=ఇంకను, బట్టబయల్=బహిరంగమందు,వెడదూఱెదు=వట్టినింద, దూఱు=నిందింతువా, ఆసదనము=ఆనీయింటను, ఇఁకొక్కమాట రసి=ఇంకొక్కసారి వెదకి, చంచలలోచనఁ= ఆచపలాక్షిని, కానకున్నఁ = చూడకుంటివా, మఱి=పిమ్మట, పోరెదు కాని=వాదింతువు గాని, బుద్ధిఁ=నీమదియందు, విపరీతతఁబొందక=మఱియొక్కరీతిగాక, పోయి = చని, చూడుమా=వీక్షింపుమీ.

తే. *అనిన నాతండ్రి యిట్లని యనియె నేమె
ఱుంగమే యార్తిఁ గడుపు చల్లంగఁ బలికి
కరుణచేసితి విజయివి గమ్మటంచు
బాష్పజల మాఁగి యింటికిఁ బరువువాఱె. 114

టీ. అనినఁ=ఇట్లనఁగా, ఆతండ్రి=ఆముని, ఇట్లని యనియెఁ=ఇట్లని వచించెను. ఏయార్తిఁ=ఏదుఃఖమును, ఏమెఱుంగము=మేమెఱుఁగము, కడుపుచల్లంగఁ=కడుపు చల్లఁబడునట్లు, పలికి=వచించి, కరుణచేసితి=దయచేసితివి, విజయివిగమ్ము=విజయవంతుఁడవు గమ్ము (ఇది మంగళాశాసనము.), అటంచుఁ, బాష్పజలము=కన్నీరు, ఆఁగి=నిల్పుకొని, ఇంటికిఁ=తన బసకు, పరువువాఱె=పరుగెత్తె.

ఆ. మ్రొక్కినట్టి తనయమూర్ధంబు మూర్కొని
ప్రమదబాష్ప మురల బ్రాహ్మణుండు
చేత వెన్ను నిమిరి నాతల్లి నినుఁ గంటిఁ
గా యటంచు నింటికడ వసింప. 115

* అనిన నోతండ్రి యాయెనే యాఘోనే య్యె, ఱుంగమే.

టీ. మ్రొక్కినట్టి = తనకుదండము సమర్పించునట్టి, తనయ = కూఁతుయొక్క, మూర్ధంబు=శిరమును, మూర్కొని=ఆఘ్రాణించి, ప్రమదబాష్పము = ఆనందబాష్పము, ఉరులన్=స్రవింపఁగా,బ్రాహ్మణుండు=విష్ణుచిత్తుఁడు, చేతన్=తన హస్తముచేత, వెన్ను=ఆయమవీపును, నిమిరి = తడవి, నాతల్లి, నిజన్, కంటేఁగా, అటంచున్, ఇంటికడన్=తనబసయొద్ద, వసింపన్=నివసించియుండఁగా.

తే. రంగపతి బ్రహ్మ రుద్రుల • బ్రాహ్మి గౌరిఁ
దనకు నక్కన్య నడిగింపఁ • బనుపుటయును
వారు సేనేశసహితులై • వచ్చుటయును
విష్ణుచిత్తుండు సంభ్రమాన్వితుఁడు నగుచు. 116

టీ. రంగపతి=రంగనాయకుఁడు, బ్రహ్మరుద్రులన్, బ్రాహ్మిన్ = సరస్వతిని, గౌరిన్, తనకున్=రంగనాయకులకు, అక్కన్యన్, అడిగింపన్, పనుపన్=పంపఁగా, వారు, సేనేశసహితులై=విష్వక్సేనునితోఁ గూడినవారై, వచ్చుటయును = రాఁగా, విష్ణుచిత్తుండు, సంభ్రమాన్వితుఁడు నగుచున్ = సంతోషముతోఁ గూడినవాఁడగుచు.

వ. విష్వక్సేనపూర్వకంబుఁగా వినయంబున వచ్చినవారికి నాతిథ్యంబులొసంగి యుచితాసనంబుల నాసీనులై యున్న వారియాగమన ప్రయోజనం బడిగి తెలిసి ప్రమదరసభరితాంతరంగుండై యిట్లనియె.

టీ. సులభము.

క. ధన్యుఁడ నైతిం దన కీ
కన్యక నీఁగాంచి భృగువు • గౌరవముఁ బయో
ధిన్యాయ్యము నొదవె నిటే
నన్యాయ్యంబే ? చమూపహార విధులారా. 118

టీ. తనకున్, ఈకన్యకను = ఈచిన్నపడుచును, ఈఁగాంచి = ఇయ్యఁగని, ధన్యుఁడ నైతిన్, భృగువుగౌరవమున్ = భృగుమహామునిగురుత్వమును, పయోధిన్యాయ్యమున్ = సముద్రన్యాయ్యమును, ఒదవెన్ .. ఉదయించెను. ('భృగోఃఖ్యాత్యాం సముత్పన్నా శ్రీఃపూర్వ ముదధేఃపున' యని శ్రీవిష్ణుపురాణవాక్యము ప్రమాణముగా 'భార్గవీ లోకజననీ క్షీరసాగరకన్యకా'యని యమరమునఁ గలదు గావునఁ దొల్లి లక్ష్మినొసంగిన భృగూదధులగౌరవము నాకుఁ గలిగె ననుట). ఇటేని = ఇట్లడిగిపుచ్చుకొనుటేని, అన్యాయ్యంబే = అన్యాయ్యముగాదా, చమూపహారవిధులారా = విష్వక్సేన శివ బ్రహ్మలారా ! యని సంబోధనము.

క. వినుఁ డీఁదగు సంబంధపు
టెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చు
ల్కని నరులు గాన మాపుర
మునకు న్విజయంబు సేయఁ బుత్త్రిక నిత్తున్. 119

టీ. వినుఁడు = ఆకర్ణింపుఁడు. ఈఁదగున్ = ఇయ్యఁదగును, చుల్కనినరులు = తేలికయగు జనులు, సంబంధపు టెనయికన్ = వియ్యపుఁబొందికను, కని=చూచి, మోచి తెచ్చి = మోసికొని తెచ్చి, ఇచ్చె ననరె=ఒసఁగె ననరా? కానన్ =కాఁబట్టి, మాపురమునకున్ = మా శ్రీవిల్లిపుత్తూరికి, విజయంబు సేయన్ = వేంచేసినను, పుత్త్రినిత్తున్ = కొమార్తె నొసఁగుదును.

తే. ప్రభుతఁ బరమేశ్వరుం డైనఁ బత్ప్రపన్న
జనమున కొసంగు మీకు నీచనవు శౌరి
తానె కట్టిన భూమికఁ దాల్చు మాకు
ఘనత యిది మమ్ముఁ జేయుట తనదుఘనత. 120

టీ. శౌరి = ఆ శ్రీపతి, ప్రభుతన్ = ప్రాభవముచేత, పరమేశ్వరుండైనన్ = సర్వాధికుఁడైనను, పత్ = పాదములయందు, ప్రపన్న = ప్రపత్తిచేసినట్టి, జనమునకున్ = జనులగు, మీకున్, ఈచనవు = ఈమచ్చికను, ఒసఁగున్ = ఇచ్చును. (మీరు చెప్పిన విను ననుట.) తానె కట్టిన=తానే కలుగఁజేసిన భూమికన్ = శ్వశుర వేషమును, తాల్చు =ధరించునట్టి, మాకున్, ఇది, ఘనత=గొప్పతనము, మమ్ముఁజేయుట = మమ్మిట్లు గొప్పపఱుచుట, తనదుఘనత = తన గౌరవము.

తే. అనినఁ జని విన్నవింప దయారసార్ద్ర
చిత్తుఁడై విశ్వభర్త పక్షిప్రధాన
కౌపవాహ్యంబు నెక్కి బ్రహ్మాదిసురలు
బలసి తమతత్తడుల నెక్కి కొలిచి రాఁగ 121

టీ. అనినన్ = ఇట్లనఁగా, చని = వారు మరలఁబోయి, విన్నవింపన్ = మనవి చేయఁగా దయారస = కృపారసముచేత, ఆర్ద్ర = తడుపఁబడిన, చిత్తుఁడై = చిత్తము గలవాఁడై, విశ్వభర్త = ఆరంగపతి, పక్షిప్రధానక = గరుత్మద్రూపమైన, ఔపవాహ్యంబున్ = లీలావాహనమును, ఎక్కి, బ్రహ్మాదిసురలు, బలసి = పరివేష్టించి, తమ తత్తడులన్ =తమవాహనములను, ఎక్కి, కొలిచి=సేవించి, రాఁగన్ = వచ్చుచుండఁగా.

క. నాసీరుఁ డగుచు సూత్రవ
తీసఖుఁ డుడువీథిఁ బోఁజు తీర్చిన ప్రజభూ

*షాసి శతకోటి శతకో
టీ సవితృప్రభలు దిశలఁ దెప్పర మలమన్. 122

టీ. సూత్రవతీసఖుండు=విష్వక్సేనుఁడు, నాసీరుఁ డగుచున్ = సేనమొగమగుచు 'సేనాముఖంతు నాసీర' యని యమరము. ఉడువీథిన్ = నక్షత్రవీథియందు, పొఁజు తీర్చిన = వ్యూహముఁబన్నినట్టి, ప్రజ = జనముయొక్క, భూషా = భూషణములయొక్కయు, అసి = ఖడ్గములయొక్కయు, శతకోటి = వజ్రాయుధముయొక్క, శతకోటి = నూఱుకోట్లసంఖ్యగల, సవితృ = సూర్యులయొక్క, ప్రభలు = వెలుంగులవంటి వెలుంగులు, దిశలన్ = దిక్కులయందు, దెప్పరము=అధికముగా, అలమన్ = వ్యాపింపఁగా.

వ. శ్రీవిల్లిపుత్తూరికిం జని విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి యయ్యాదిమవరుండు దివ్యాప్సరసలు హారిద్రాదికస్నానీయ మంగళద్రవ్యమండనం బొనర్పఁ బెండిలికొడుకై దివ్యవాదిత్రంబులు నారదాద దివ్యముని గానంబులు వెలయం గలధౌత ధవళ దివ్య ధారాధరంబులు గురియు సుధాధారల నభిషిక్తుండై ముక్తావళీ కౌస్తుభాముక్తకంబుకంధరుండును గేయూరకంకణాలంకృతుండును మకరకుండల మకుటాదిభూషావిభూషితుండును దివ్యాంగరాగ రూషితుండును బీతాంబరసంవీతుండును దులసీకల్పతరుప్రసవస్రగాశ్రితోరస్కుండు నై యుండు నంత నక్కడ నటకుమునుప గృహప్రవేశంబుసేసి సంభ్రమాయత్తుం డగు విష్ణుచిత్తుప్రయత్నంబున.

టీ. శ్రీవిల్లిపుత్తూరికింజని, విశ్వకర్మ, మణిమయంబుగాన్, కట్టిన, విడిదిపట్టున, విడిసి = ప్రవేశించి, అయ్యాదిమవరుండు = ఆమొదలిపెండ్లికొడుకైన శ్రీపతి, దివ్యాప్సరసలు = వేల్పుటచ్చరలు, హారిద్రాదిక = పసుపుమొదలగు, స్నానీయ = స్నానముకొఱకైన, మంగళద్రవ్య = శుభవస్తువులతోడి, మండనంబు = అలంకారము, ఒనర్పన్ = చేయఁగా, పెండిలికొడుకై, దివ్యవాదిత్రంబులు = దేవదుందుభులు, నారదాది దివ్యమునిగానంబులు, వెలయన్ = ప్రకటముగాఁగా, కలధౌత = వెండివలెనే, ధవళ = తెల్లనైన, దివ్యధారాధరంబులు = దేవతామేఘములు, కురియు = వర్షించుచున్న, సుధాధారలన్ = అమృతధారలచేత, అభిషిక్తుండై = అభిషేకింపఁబడినవాఁడై, ఆముక్తావళీ=ముత్తెపుసరాలతోడి, కౌస్తుభ = కౌస్తుభ రత్నముచేతను, ఆముక్త = విడువఁబడని, కంబుకంధరుండును = శంఖమువంటి కంఠముగలవాఁడును, కేయూర = భుజకీర్తుల

* షాసితశాలిచౌన్ ...... దెప్పరపఱుపన్.

చేతను, కంకణ = కడియములచేత, అలంకృతుఁడును = అలంకరింపఁబడినవాఁడును, మకర కుండల = మకరాకృతిగల పోఁగులు, ముకుట = కిరీటము, ఆది= మొదలుగాఁగల,భూషా= భూషణములచేత, విభూషితుండును=మిక్కిలి భూషింపఁబడినవాఁడును, దివ్యాంగరాగ= దివ్యచందనముచేత, రూషితుండును = అలందఁబడినవాఁడును, పీతాంబరసంవీతుండు = బంగరు పట్టుపుట్టంబుఁ గట్టుకొన్నవాఁడును, తులసీ=తిరుత్తుళాయియొక్కయు, కల్పతరు ప్రసవ = కల్పవృక్షపుష్పములయొక్కయు, 'స్యాదుత్పత్తౌ ఫలే పుష్పే ప్రసవో గర్భ మోచనే' అనినిఘంటువు. స్రక్=మాలికలచేత, ఆశ్రిత=పొందఁబడిన, ఉరస్కుండునై= వక్షముగలవాఁడై, ఉండునంతట్=ఉండునంతటు, అక్కడ = ఆయమ్మవారియొద్ద, అటకు మునుప = అంతకుమునుపే, గృహప్రవేశంబు సేసి=తమయిల్లు సేరి, సంభ్రమాయత్తుండగు= ప్రేమాధీనుఁడగుచున్న, విష్ణుచిత్తు= పెరియాళ్వారుయొక్క, ప్రయత్నంబున.

క. శర్వాణీ వాణీ ముఖ
గీర్వాణీకోటి జానకీరఘుకులరా
ట్పూర్వాచరిత వివాహా
ఖర్వ సుగీతములు పాడఁగా విభవమునన్. 124

టీ. శర్వాణీ=పార్వతియు, 'శర్వాణీ సర్వమంగళా' అనియమరము. వాణీ = సరస్వతియు, ముఖ = మొదలగు, గీర్వాణీ = దేవతాస్త్రీలయొక్క, కోటి=సమూహము, జానకీరఘుకులరాట్=సీతారాములయొక్క, పూర్వాచరిత = తొల్లిచేయఁబడిన, వివాహ= కల్యాణమందలి, అఖర్వ=అతిశయములయిన, సుగీతములు=పాటలు, పాడఁగాన్=గానము సేయఁగా, విభవమునన్=వైభవముతో.

తే. నెమ్మి నేకావళియు స్రగ్వేణియును జామ
రంబు లిరుగెడ నిడ హారిద్రాద్రవమునఁ
బెట్టిరి నలుంగు లక్కన్యఁ కే బెండ్లికూఁతుఁ
జేయు ఋషిపత్ను లర్థి నాశీర్యుతముగ.

టీ. నెమ్మిన్ = మైత్రిచేతను, ఏకావళియున్=మున్ను చెప్పఁబడినచెలికత్తియలైన యేకావళియును, స్రగ్వేణియును, ఇరుగెడన్ = ఉభయపార్శ్వములయందు (ఇది యేకవచనాంత ద్విగుసమాసము), చామరంబులు=వీఁచోఁపులు, ఇడన్=సమర్పింపఁగా, హారిద్రాద్రవమునన్=పసుపునీటిచేత, అర్థిన్=ఆసక్తిచేత, అక్కన్యన్=ఆయాముక్తమాల్యదాకన్యకను, పెండ్లికూఁతుఁజేయు, ఋషిపత్నులు = ఋషిభార్యలు, ఆశీర్యుతముగాన్= దీవనలతోడను, నలుంగులు పెట్టిరి=ఉద్వర్తనము లాచరించిరి.

తే. అట్లు వైవాహికపుదీక్ష నమరఁ గమ్మ
నూనెఁ దలయంటి నెఱులు గంధానఁ బులుమ
స్వర్ణమణికుంభహిమవారి జలక మాడి
నట్టి జగదీశ్వరికి వేల్పుఁబోటబలయోర్తు. 126

టీ. అట్లు=ఆప్రకారము, వైవాహికపుదీక్ష = వివాహసంబంధదీక్ష, అమరన్ = ఒప్పునట్లు, కమ్మనూనెన్ = సుగంధతైలముచేత, తలయంటి = శిరోభ్యంగముఁ జేసి, నెఱులు=ఆకురులు, గంధానన్=శ్రీచందనముచేత, పులుమన్=పులుమఁగా, స్వర్ణమణి= బంగరురతనాల వికారములగు, కుంభ=కలశములయందలి, హిమవారిన్=పన్నీటిచేత, జలక మాడినట్టి=మంగళస్నానమొనర్చినట్టి, జగదీశ్వరిన్=అయమ్మకు, వేల్పుటబలయోర్తు=ఒక్క దేవతాస్త్రీ (యని ముందటి కన్వయము.)

క. తడి యొత్తి సన్నవలిపం
బిడి మణిపీఠస్థయైన యింతి మెఱుఁగు పె
న్నిడుదకురు లార్చి ధూపం
బిడెఁ దుఱుము ఘటించె నొకమృగేక్షణ నెమ్మిన్. 127

టీ. తడియొత్తి=తడిఁ దుడిచి, సన్నవలిపంబిడి = సన్నచీరఁగట్టించి, మణిపీఠస్థయైన=రత్నపీఠమందుఁ గూరుచున్న, ఇంతి = ఆముక్తమాల్యదయొక్క, మెఱుఁగు = మెఱుఁగారుచున్న, పెన్నిడుదకురులు = మిక్కిలి వాలికలగుకురులు, ఆర్చి = తేమార్చి ధూపంబిడెన్ = ధూపమువేసెను. ఒక మృగేక్షణ=మచెలియొక్క కురంగలోచన, నెమ్మిన్=మైత్రిచేత, తుఱుము ఘటించెన్=కొప్పుఁబెట్టెను.

సీ. యావకద్రవమున నరుణాంఘ్రి నఖపఙ్క్తి
లభ్యక్తములు సేసె నతివ యోర్తు
నయకల వ్రేళ్లమట్టియలుఁ బిల్లాండ్లిడి
పాయవట్టముఁ బెట్టెఁ బడఁతి యోర్తు
నెఱికపట్టి పసిండికీనీటిప్రాఁత చెఱంగు
వెలిపట్టు రహిఁ గట్టె వెలఁది యోర్తు
కటిసీమఁ గనక మేఖలఁ జేర్చి తారహా
రములు గీలించెఁ గంఠమున నోర్తు

తే. కటకములు హస్తసరము లంగదము లంగు
ళీయకములును బాహువల్లికల వ్రేళ్ల

నిలిపి తాటంకనాసామణుల నమర్చి
చూనిపె సీమంతవీథిఁ జేర్చుక్క యొూర్తు. 129

టీ. అతివయోర్తు = మఱియొకదేవకన్యక, యావకద్రవమునన్ = లత్తుకనీటిచేత, అరుణ=మును పే యెఱ్ఱనైయున్న, నఖపఙ్క్తులు = గోళ్లచాళ్లు, అభ్యక్తములుసేసెన్ = తడిపెను. ఒకర్తు=మఱియొకయంగన, నయకల=నాణెముగల, వ్రేళ్లన్ = పాదాంగుళుల యందు, మట్టియలును, పిల్లాండ్లు, ఇడి, పడఁతియోర్తు=మఱియొకయామె, పాయ పట్టము=పాదభూషణ విశేషమును (పాగడము లనవచ్చును), పెట్టెన్=ఉనిచెను. నెఱిక పెట్టి=కుచ్చిళ్లుపట్టి, పసిండిసీటిప్రాఁతచెఱంగు = బంగారు సరిగచేతఁ జిత్రించియున్న చెఱఁగుగల, వెలిపట్టు = తెల్లపట్టుచీర, రహిన్ = పొలుపుగాను, వెలఁదియోర్తు = మఱి యొక్కకాంత, కట్టెను. ఓర్తు=మఱియొక్క పొలఁతుక, కటిసీమన్ = నడుముమీఁద, కనకమేఖలన్ = బంగారుగంటల యొడ్డాణమును, చేర్చి=అలంకరించి, కంఠమునన్, తారహారములు = ముత్తెపుఁబేరులు, కీలించెన్ = ఉనిచెను. ఓర్తు = మఱియొక్కతె, కటకములు = కంకణములు, హస్తసరములు = చేసరపణులు, అంగదములు = భుజ కీర్తులును, అంగుళీయకంబులు = ఉంగరములును, బాహువల్లికల వ్రేళ్లన్ = వరుసగా బాహుతలయందును, వ్రేళ్లయందును, నిలిపి. తాటంకనాసామణులన్ = కమ్మలు ముక్కరముత్తెమును, అమర్చి = పొసఁగించి, సీమంతవీథిన్ = పాపటత్రోవయందు, చేర్చుక్క = ముక్తాభూషణమును, చూనిపెన్=ఉనిచెను.

క. కలికి తెలిగన్నుఁగవఁ గ
జ్జలరేఖలు దీర్చి మేన సారంగమదం
బలఁది లలామక మిడి చెం
గలువలు క్రొవ్వేదకు వేఱొకర్తు ఘటించెన్. 129

టీ. కలికి = ఆపెండ్లికూఁతుయొక్క, తెలిగన్నుఁగనన్ = ధవళాక్షిద్వంద్వ మందు, కజ్జలరేఖలు = కాటుకరేఖలు, తీర్చి=దిద్ది, మేనన్=శరీరమందు, సారంగమ దంబు=కస్తూరి, అలఁది = పూసి, లలామకము = చేర్చుక్క (బొట్టుమీఁద శిరమున నుంచుకొనెడు భూషణమైనదాని, 'ప్రభ్రష్టకం శిఖాలంబి పురోన్యస్తం లలామకమ్.' అని యమరము.), ఇడి=ఉంచి, వేఱొకర్తు=మఱియొక నాతి, క్రొవ్వేదకున్ = క్రొమ్ముడికి, చెంగలువలు=ఎఱ్ఱగలువపువ్వులు, ఘటించెన్=కూర్చెను.

వ. ఇట్లలంకృత యైయుండ లగ్నం బాసన్నంబయ్యె నని విన్నవించుట యుఁ బన్నగశయనుండు మూర్ధాంధమండలంబులు పంథ్రెండును

దివియలై వెలుంగఁ దారకలగుంపు జగజంపుగా శతపత్త్రశత్త్రుం
డాతపత్త్రత యంగీకరింప సింధుపతి సౌగంధికదళోపహారసహితం
బుగా విపణిఁ గలయంపిఁ జిలికింపఁ బ్రకృతికాంత క్రంత సురకాం
తలం గూడుకొని సంతరింప హుతవహుం డగరుధూపంబు రేఁపఁ
బర్జన్యుం డుల్లడయిడఁ బ్రాచీనపాఠంబులు పాఠకౌఘంబు లయి
బిరుదప్రబంధంబులు పఠియింప విధినందన సనందనాదులు సంగీత
మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ విహంగపుంగవుండు
మత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప
నప్రాకృతవైభవంబునం జని పరమసంభ్రమంబున భాగవతవతంసంబు
భక్తికలితబహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత డిగ్గి
విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు
గడుగు నడుగుల జలంబులకుం బయిపయిం బడి గీర్వాణ సిద్ధసం
ఘంబు లహంపూర్వికఁ నుర్వినిర్వారిగా నూర్చికొని ప్రాశింపఁ బ్రవే
శించి తదీయ నిర్దిష్టం బగు జంబూనదపీఠంబున నుపవిష్టుండై యతం
డు వెండియు బంగారుభృంగారుకంబులఁ గనకభాజననిక్షిప్తంబు లగు
కుశేశయపేశలపదకిసలయంబులు గడిగి షోడశోపచారసహితంబును
సపరిష్కారియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యా
ళ్వారు దేవేరియుం దానును ధారవోసి యా కన్యకారత్నంబుఁ
బరిగ్రహించె ననంతరంబ. 130

టీ. ఇట్లు = ఈప్రకారము, అలంకృత యైయుండన్ = అలంకరింపఁబడినదై యుండఁగా, లగ్నంబు = వివాహముహూర్తము, ఆసన్నంబయ్యె నని = సమీపించె నని, విన్నవించుటయున్ = విన్నపము సేయఁగానే, పన్నగశయనుండు = శేషశాయియగు రంగనాథుఁడు, మార్తాండమండలంబులు పండ్రెండును = ద్వాదశాదిత్యమండలంబులు, దివియలై వెలుంగన్ = దివ్వటీలయి వెలుఁగఁగా, తారకలగుంపు = నక్షత్రసమూహము, జగజంపుగాన్ = కుచ్చులు కాఁగా (గొడుగుచుట్టు నుండునవి), శతపత్త్రశత్త్రుండు = కమలవైరియైనచంద్రుఁడు, ఆతపత్త్రత యంగీకరింపన్ = ఛత్రము కాఁగా, సింధుపతి = సముద్రుండు, సౌగంధికదళోపహారసహితంబుగాన్ = ఎఱ్ఱగలువ ఱేకుల కానుకతోఁగూడ, విపణిన్ = అంగడివీథియందు, కలయంపిన్ = కళ్లాపిని, చిలికింపన్ = చల్లింపఁగా, ప్రకృతికాంత = మాయయను నాతి, సురకాంతలం గూడుకొని = దేవతాస్త్రీలం గలిసికొని, క్రంత = సమీపప్రదేశము, సంతరింపన్ = సవరణకుఱుపఁగా, హుతవహుండు =

అగ్నిదేవుఁడు, అగరుధూపంబు, రేపక = ఎగయింపఁగా, పర్జన్యుండు = వర్షదేవుఁడు, ఉల్లడ యిడక = ఉల్లాభముఁబట్టఁగా, ప్రాచీనపాఠంబులు = ప్రాఁజదువులు (వేదములనుట), పాఠకౌఘంబులై = వందిమాగధసంఘములై, బిరుదప్రబంధంబులు = బిరుదుఁగైవారములు, పఠింపక = చదువఁగా, విధినందన = నారదుండు, సనందన = సనందనుండు, ఆదులు = మొదలగువారు, సంగీతమాంగల్యంబునక = సంగీతమంగళత్వముచేత, అంతరంగంబునకుక = మనస్సునకు, ఇంపొసంగక = మాధుర్యమొనర్పఁగా, విహంగపుంగవుండు = గరుత్మంతుఁడును, మత్తమాతంగంబై = మదపుటేనుఁగై, ఖచిత = కూర్పఁబడిన, మణి = రత్నములును, కల్యాణంబగు = బంగారుగలిగినట్టి, 'వసు చంద్రం చార్జునం చ కల్యాణం భూరి గైరిక' మ్మని నిఘంటువు. పల్యాణంబు = పల్లమును (చౌడోలనుట), అంగీకరింపక = వహింపఁగా, అప్రాకృత = లోకవిలక్షణమైన, వైభవంబునక = సంపదచేత, చని = వేంచేసి, పరమసంభ్రమంబునక = పరమానందముచేత, భాగవతవతంసంబు = భాగవతోత్తముఁడగు భట్టనాథుఁడు, భక్తి = భక్తితోడ, కలిత = కూడుకొన్న, బహుప్రణామపూర్వకంబుగాక =అనేకనమస్కారపూర్వకముగా, ఎదుర్కొనక = ఎదురుకోలునకురాఁగా, ఎక్కిరింత డిగ్గి=వాహనమును దిగి, విష్వక్సేనుకరం బవలంబించి = విష్వక్సేనుని కైదండ గ్రహించి, కక్ష్యాంతరంబులక = ద్వారాంతరాళములయందు, చంచలాక్షులు = సువాసినులు, కడుగు=ప్రక్షాళనము చేసెదు, అడుగుల = శ్రీపాదముల యొక్క, జలంబులకుక = తీర్థములకు, పయిపయింబడి = మీఁదమీఁదఁబడి, గీర్వాణ = వేల్పులయొక్క, సంఘంబులు = గుంపులు, అహంపూర్వికక = ఓహారి సాహారిచేత, ఉర్వి = భూమి, నిర్వారిగాక = నిర్జలమగునట్లుగా, ఊర్చికొని = దూఁటుకొని, ప్రాశింపక = పానముసేయఁగా, ప్రవేశించి = చొచ్చి, తదీయ = అభట్టనాథసంబంధుల చేత, నిర్దిష్టంబగు = నిర్ణయింపఁబడిన, జాంబూనదపీఠంబునక = బంగరుపీఁటయందు, ఉపవిష్టుండై = కూరుచున్నవాఁడై, అతండు, వెండియుఁక = మరల, బంగారుభృంగారుకంబులక = బంగరుగిండ్లచేత, కనకభాజన = పసిఁడిపళ్లెరంబునందు, నిక్షిప్తంబులగు = ఉనుపఁబడిన, కుశేశయ = తామరపూలవలెనే, పేశల=మృదువులైన, పదకిసలయంబులు= అడుగుఁజిగురులు, కడిగి = ప్రక్షాళనముఁజేసి, షోడశోపచారసహితంబును = ఆవాహనాసనపాద్యార్ఘ్యాచమనీయ స్నానవస్త్రయజ్ఞోపవీత గంధపుష్పధూపదీపనైవేద్యతాంబూలోత్తర నీరాజన మంత్రపుష్పాత్మకములగు షోడశోపచారములతోఁ గూడినట్టియు, సపరిష్క్రియంబునగు = అలంకారసహితమైనట్టి, మధుపర్కంబుక = గుడయుక్తదధిని, ఇనంగక = సమర్పింపఁగా, కొని = గ్రహియించి, అయ్యాళ్వారు = అభట్టనాథుఁడు, [illegible] = ధర్మపత్నియు, తానును, ధారవోయక = ధారాదత్తముసేయఁగా,

ఆ కన్యకారత్నంబున్ = ఆ కన్యారత్నమగు నాముక్తమాల్యదను, పరిగ్రహించెన్ = పాణిగ్రహణముసేసెను, అనంతరంబ = పదంపడి.

మ. కలధౌతద్రవ చిత్రము ల్మెఱయ ముక్తాస్యూత మహా మేచకాం
చలపుం బెందెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ బె
ద్దలు వంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జులహస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిట్టుము ట్టాడఁగన్.

టీ. కలధౌతద్రవ = బంగారునీటిచేతనైన, 'కలధౌతంరౌప్యహేమ్నో' అని నిఘంటువు. చిత్రముల్ = వింతపనులు, మెఱయన్ = ప్రకాశింపఁగా, ముక్తా = ముత్తెములతోడ, స్యూతమహా = కూర్పఁబడిన, మేచక = నల్లనగు, అంచలపు = అంచులుగల, పెందెఱ= పెద్దతెఱదుప్పటి, వారి=పట్టి, లగ్నము=ముహూర్తము, సమాసన్నంబుగాన్= మిగులదగ్గఱఁగా, వేల్పుఁబెద్దలు = బ్రహ్మాదిసురశ్రేష్ఠులు, వంపన్ = క్రిందికొన వంచియుండఁగా, గుడజీరకంబులు = జీలకఱ్ఱబెల్లములు, సముద్యత్ప్రేమన్=అగ్గలంపుఁ బ్రేమమిడిచేత, అర్థిన్ = ఆసక్తిచేత, కనుమించుల్ = నేత్రధావళ్యములు, చిట్టుముట్టాడఁగన్ = సందడింపఁగా, అన్యోన్య = ఒండొరులయొక్క, మంజుల = సుందరము లగు, హస్తంబులన్ = కరములయందు, ఉంచిరి = ఉనిచిరి.

చ. మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకిసలమేళనఁ జక్రి చెమర్ప రాలె మై
నఱిముఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగులందునుండి డా
ల్గిఱిగొన జాఱు ధారలబలె న్వడగండ్లబలె న్గనుంగొనన్. 132

టీ. మఱి=పిమ్మట, మానిని=ఆపెండ్లికూఁతురు, వనమాలిచూడమునన్ = స్వామి శిరమందు, ముత్తెపుఁబ్రాలువోయుచోన్ = ముత్తెములతలఁబ్రాలుపోయునప్పుడు, తదంగుళీకిసల - తత్ = ఆయమయొక్క, అంగుళీకిసల = చిగుళ్లవంటి వ్రేళ్లయొక్క, మేళనన్ = కూడుకొనుటచేత, చక్రి = స్వామి, చెమర్పన్ = చెమరింపఁగా, మైన్ = స్వామి శరీరమందు, అఱిముఱి = తఱుచైన, ఘర్మబిందువులున్ = చెమ్మటచినుకలును, రాలెను= క్రిందఁబడెను, అమ్మణులున్ = ఆ ముత్తెములును, మొగులందునుండి = మేఘములలోనుండి, డాల్గిఱిగొనన్ = కాంతి వ్యాపించుచుండఁగా, జాఱు = స్రవించుచున్న, ధారలబలెన్ = వర్షధారలవలెను, వడగండ్లబలెన్ = కరకములవలెను, కనుంగొనన్ = చూడఁగా, మెఱయున్ = ప్రకాశించును.

తా. స్వామి శరీరము నీలమేఘమువలె నున్నది. అడిచెమర్చి చెమట చినుకులు రాలఁగా నవి వానచినుకులవలెను దనఁబ్రాలముత్తెములు వడగండ్లవలె నున్నవి.

తే. ఇంతి దోయిట సేసఁబ్రా । లెత్తుచోట
గుబ్బపాలిండ్లక్రేవ గ్ర । క్కున మురారి
కన్ను వేయుటఁ గని లజ్జ । గదుర బాహు
లెత్తక కరాగ్రములన పై । కెగురఁజల్లె. 133

టీ. ఇంతి = ఆనాతి, దోయిటన్ = అంజలిచేత, సేసఁబ్రాలు = తలఁబ్రాలు, ఎత్తుచోటన్ = ఎత్తునప్పుడు, మురారి = రంగనాథుఁడు, గుబ్బపాలిండ్లక్రేవన్ = ఉబుటుగలకుచములదిక్కున, గ్రక్కునన్ = శీఘ్రముగా, కన్నువేయుటన్ = కన్నువేసిచూచుటను, కని = తాను జూచి, లజ్జగదురన్ = సిగ్గొలయఁగా, బాహులెత్తక = చేతులుపైకెత్తక, కరాగ్రములన = కొనచేతులనే, పైకిన్ = స్వామిపైకి, ఎగరఁజల్లెన్.

క. గళమునఁ గట్టెను హరి మం
గళసూత్రము పులక లతివ । గాత్రముఁ బొదువన్
నెలఁతయుఁ బతియును గరముల
నలవఱిచిరి కంకణంబు । లన్యోన్యంబున్. 134

టీ. హరి, అతివగాత్రమున్ = ఆయింతిమేనిని, పులకలు = రోమాంచములు, పొదువన్ = వ్యాపింపఁగా, గళమునన్ = కంఠమందు, మంగళసూత్రముఁ గట్టెను, నెలఁతయున్ పతియును, అన్యోన్యంబున్ = ఒండొరులకు, కంకణంబులు = ప్రతిసరములు (చెమటనీటిబిందువులు), కరములన్ = హస్తములయందు, అలవఱిచిరి = అమర్చిరి.

సీ. లలనచే నిష్ఠతో । లాజలు వేల్పించి
శార్ఙ్గి మెట్టించెను । సప్తపదులు
తెలియఁ గూడి యరుంధ । తీదర్శనముఁ జేసె
బ్రహ్మరుద్రాద గీ । ర్వాణకోటి
యర్పించు నుడుగర । లనుకంపఁ గైకొని
యనిచెఁ బ్రసాదభా । జనులఁ జేసి
* యాత్మపట్టణమున । కతివైభవంబున
నతివఁదోడ్కొని విజ । యంబుచేర్చి
తే. సహ్యకన్యాతటోద్యాన । చందనద్రు
కుంజముల నీలకుంతలఁ । గుస్తరించి

* నతివైభవంబున నాత్మపట్టణమున, కతివఁ దోడ్కొని విజయంబుసేసి.

కంతుసామ్రాజ్య మేలించి ॥ కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించు ॥ చున్నవాఁడు. 135

టీ. లలనచేన్ = అయింతిచేత, నిష్ఠతోన్, లాజలు వేల్పించి = లాజహోమముఁ జేయించి, శార్ఙ్గి = స్వామి, సప్తపదులు, మెట్టించెను = త్రొక్కించెను, తెఱవన్, కూడి, అరుంధతీదర్శనముఁజేసెన్, బ్రహ్మరుద్రాదిగీర్వాణకోటి, అర్పించు=సమర్పించునట్టి, ఉడుగరలు = బహుమానములను, అనుకంపన్ = కృపచేత, కైకొని, ప్రసాదభాజనులఁజేసి = అనుగ్రహపాత్రులనుజేసి, అనిచెన్ = పంపెను, ఆత్మపట్టణమునకున్ = శ్రీరంగమునకు, అతివైభవంబునన్ అతివన్ తోడ్కొని, విజయంబుచేసి=వేంచేసి, సహ్యకన్యా=కావేరీ నదియొక్క, తట = దరులయందలి, ఉద్యాన = శృంగారవనములందలి, చందనద్రు = శ్రీగంధవృక్షములయొక్క, కుంజములన్ = పొదరిండ్లయందు, నీలకుంతలన్ = ఆముక్త మాల్యదను, కుస్తరించి = లాలించి, కంతుసామ్రాజ్యము = రతిపతిసామ్రాజ్యమును, ఏలించి = కరిపాలింపఁజేసి, (సురతక్రీడకుఁ బ్రవేశింపఁజేసినాఁ డనుట.) చిత్తము, కరుణన్ = దయచేతను, ఒలయన్ = నిండఁగా, జగములన్ = లోకములను, పాలించుచున్నవాఁడు = ఏలుచున్నవాఁడు.



ఉ. స్కందసరస్తటీరమణ ॥ కందర చందన కుంద వాటికా
మందసమీరలోల వన ॥ మాలిక! నిర్మలదివ్యవిగ్రహ
స్పందివిభాధరీకృత న ॥ భస్స్ఫుటకాళిక! వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతి ॥ భేదన! పేశల వంశవాదనా! 136

టీ. స్కందసరః = స్వామిపుష్కరిణియొక్క, తటీ = దరియందలి, రమణ = మనోహరమగు, కందర = గుహలయందలియు, 'దరీతుకందరోవాస్త్రీ' అని యమరము. చందన = హరిచందనవృక్షముయొక్క, కుంద = మొల్లలయొక్క, వాటికా = శ్రేణుల యందలియు, మందసమీర = మందమారుతముచేత, లోల = కదలుచున్న, వనమాలిక = తులసీవనమాల గలిగినవాఁడా, నిర్మల = స్వచ్ఛమైన, విగ్రహ = శరీరముయొక్క, అస్పంది = చలింపని, విభా = కాంతిచేత, అధరీకృత=క్రిందుచేయఁబడిన. నభః = ఆకాశముయొక్క, స్ఫుట=వ్యక్తమైన, కాళిక = నలుపుగలవాఁడా, వల్లవాంగనా = గోపికల యొక్క, బృంద = గుంపుయొక్క, మనః = మనస్సులయందలి, అభిమాన = కొలువులను, ధృతి = ధైర్యములను, భేదన = భేదించెడువాఁడా, పేశల = మృదువైన, వంశ = పిల్లఁగ్రోవియొక్క, వాదనా = వాయించుటగలవాఁడా. (ఈ పద్యమునందు స్కందపదము మొదలుగాఁ గాళికపదమువఱకు నొక్కసమాసముగాను, పిదప వల్లవాంగనా శబ్దము మొదలుగాఁ దుదవఱకు నొక్కసమాసముగాను కొందఱు సెప్పుదురు.)

క. అరిధారాఖండితమరు
దరిసంఘ! విహంగవాహనా! యుదరమహాం
బురుహపుటభరిత మధుశం
బరభరజలమానుషాయమానద్రుహిణా! 137

టీ. అరి = చక్రముయొక్క, ధారా = అంచులచేత, ఖండిత = త్రుంపఁబడిన, మరుదరిసంఘ = రాక్షస సమూహముగలవాఁడా, విహంగవాహనా = గరుడవాహనా, ఉదర = నాభియందలి, మహాంబురుహ = పెందామరయొక్క, పుట = దొప్పయందు, భరిత = నిండింపఁబడిన, మధు = మకరందమనియెడు, శంబర = ఉదకముయొక్క, భర = అతిశయమందు, జలమానుషాయమాన = నీరుపాపవలె నున్న, ద్రుహిణా = బ్రహ్మగల వాఁడా.

స్రగ్విణి. వాలినిర్భేదనా! వారిజాతేక్షణా!
శైలకన్యాస్తుతా! శార్ఙ్గచంచద్భుజా!
ఫాలదృక్పద్మభూపాకభేదిస్ఫుర
న్మౌళిమాణిక్యరుఙ్మండితాంఘ్రిద్వయా! 133

టీ. వాలినిర్భేదనా = వాలినిసంహరించినవాఁడా, వారిజేక్షణా = తామరవంటి కన్నులుఁగలవాఁడా, శైలకన్యాస్తుతా = పార్వతీదేవిచే స్తుతింపఁబడువాఁడా, శార్ఙ్గచంచద్భుజా - చంచత్ = కదలుచున్న, శార్ఙ్గ = ధనుస్సును, భుజా = భుజమందుఁగల వాఁడా, ఫాల...ద్వయా-ఫాలదృక్=శివునియొక్కయు, పద్మభూ = బ్రహ్మయొక్కయు, పాకభేది = ఇంద్రునియొక్కయు, స్ఫురత్ = ఒప్పుచున్న, మౌళి = కిరీటములయందలి, మాణిక్య = రత్నములయొక్క, రుక్ = కాంతిచేత, మండిత = అలంకరింపఁబడిన, అంఘ్రిద్వయా = అడుగులు కలవాఁడా, అని సంబోధనము.

మ. ఇది సింహాచలదంభకేసరిపదాభీష్టార్చనా పుణ్యల
బ్ధ దురుట్టంకణపొట్టునూరివిజయస్తంభోపలోట్టంకితాం
క దృఢాష్టాక్షరకృష్ణరాయ ధరణీకాంతాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాఱవది హృద్యంబై మహిం బొల్పగున్.

టీ. ఇది, సింహాచల = సింహాచలమందలి, దంభకేసరి = నృసింహస్వామియొక్క, పదాభీష్టార్చనా = ఇష్టమైన పాదపూజలయొక్క, పుణ్య = పుణ్యముచేత, లబ్ధ=పొంద, బడిన, దురుట్టంకణ = ఉట్టంకింపశక్యముగాని, (ఎన్నరానిదనుట), పొట్టునూరి, విజయ

స్తంభ=స్తంభముయొక్క, ఉపల = శిలయందు, ఉట్టంకిత = చెక్కఁబడినట్టి, అంక = గుఱుతుచేత, దృఢ = దిట్టములైన, అష్టాక్షర = ఎనిమిది యక్కరములుగల, కృష్ణరాయ ధరణీకాంత = కృష్ణరాయధరణీకాంతుఁ డను, అస్మదాముక్తమాల్యదన్ = నాయాముక్త మాల్యదయందు, ఆశ్వాసవరంబు, ఆఱవదియున్, హృద్యంబై, మహిన్ = భూమి యందు, పొల్పగున్ = ప్రకాశించును.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీ ధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్ల వంశపయోరాశి రాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదా వ్యాఖ్యానంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఆముక్తమాల్యద, సవ్యాఖ్యానము

సమాప్తము.



# ప్రక్షిప్తభాగము

కొన్ని పుస్తకములలో దాసరి యడుగఁగా నతనితో బ్రహ్మరాక్షసుఁడు తన వృత్తాంతము చెప్పఁదొడంగునంతవఱకు నాఱవయాశ్వాసము సమాప్తముగాను, తక్కిన పద్యము లేడవ యాశ్వాసముగా నున్నది. అయినను, పూర్వవ్యాఖ్యాత లెవరు నా యాశ్వాసాంతపద్యముల కర్థము వ్రాయమిం జేసియు, అవి శబ్దదోషములును, యతి దోషములును, కలవియగుటం జేసియు, నీగ్రంథ మాఱాశ్వాసములే యని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది కనుక నారీతినే ముద్రింపఁబడియె. అయినను, ఆ పద్యముల నిటఁ బొందుపఱుచుచున్నారము.

(555-వ పుట చూడుఁడు).

మ. అజచౌర్యాపహృతాత్మతారసముదాయాభీరకాంతామణీ
వ్రజగోరాజిమనఃప్రమోదకర తద్వత్సాప్తరూపానురూ
పజని ప్రాభవ ప్రాభవోదరకనద్బాణాగ్నివృత్తి ప్రకో
పజలాసారసరోజబాంధవ శశిప్రాంచద్విశాలాంబకా !

ఉత్సాహ.—

నలముఖాది చక్రవర్తినాథనవసమర్పితా
త్యలఘుమకుట ముఖ్యహేద్యోపాయనాయనావిరా
జిల సురారిహరణ నిజవశీకృతాఖిలాండ ని
ర్మలగుణా ! యమేయరూపరంజితార్యపోషణా !

మ. ఇది నైరావనయామునామనిధవాహీనాభ్రచుంబిస్ఫుర
ద్విదితాభీల మణిగృహాళి దళనోద్వేలోగ్రహాస్తిప్రజో
ద్యగనీకాగ్రగకృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యగ నాశ్వాసవరేణ్యమాఱవది హృద్యంబైన పద్యంబులన్.

* (ఇచ్చటనుండి సప్తమాశ్వాసము ప్రారంభము.)

క. శ్రీమమమానురుభాంగక, సామజహారనక్రదళనచక్ర సదాళీ
క్షేమంకర చరణాంబుజ, హేమోజ్జ్వలవాస ! వేంకటాచలరమణా !

వ. అవధరింపు మహీపాలసుదింతి దుఃఖార్తుండై యిట్లనియె.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

ఆముక్తమాల్యదయందలి గద్యపద్యముల

# అకారాదిసూచిక